శ్రీ



శ్రీకృష్ణద్వైపాయనమహర్షిప్రణీతమగు
శ్రీమద్భాగవతమునకు సరియగు తెలుఁగుపురాణము

# తాండవకృష్ణభాగవతము

## దశమస్కంధము

[illegible] ప్రొఫెసర్లు ప్రధానాంధ్ర[illegible]
[illegible] తీర్థ

జనమంచి శేషాద్రిశర్మవిరచితము.






చెన్నపురి:
వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్‌సన్స్‌వారి
వావిళ్ల ముద్రాలయమున
ముద్రితము.
1936



శ్రీ ర స్తు.

# కృతిత్రయావిష్కరణమహోత్సవచరిత్రము.

ఉ. నిర్మలమై దురూహమయి నిత్యము నై భజియించువారికిన్
శర్మదమై యజాదిదివిజప్రవరేశ్వరసంఘసేవ్యమై
ధర్మమయాంగమై తనకుఁ దా నె సమానము నొచు వెల్గు స
త్కర్మము బ్రహ్మరూపము నికామము భక్తి సమాశ్రయించెదన్.

చ. తెలియఁగరాక యెల్లర నతిస్థిరశక్తిని వశ్యలొచు వ
ర్తిలఁగ నొనర్చుచున్ దనమతిం గననేరక బ్రహ్మ విష్ణు శం
భులు జగదీశ్వరీ యనుచు మ్రొక్కఁగ బ్రహ్మమునం దభేదతన్
వెలయుచు నుండు నాప్రకృతి వేదసుతన్ భజియింతు నెప్పుడున్.

మహాత్ములారా! పరశ్రేయస్సమానగుణమణిభూషితులారా! సూచకజనాశయ విముఖులారా! కర్మము దురూహమనియు నదియే భగవత్స్వరూపమనియు సృష్టిపాలనసంహారాదికార్యములు తదాధారములనియు మీ రెఱుంగనిది కాదు. ఆమహాప్రకృతి యనఁగా భగవదిచ్ఛాశక్తిరూపమును ధరించి లోకనిర్మాణాది కార్యములొనరించుచుఁ గర్మము బలవత్తరమని చాటుచుండును. స్వతంత్రించి యేకార్యమును జేయక కర్మము ననుసరించి సదసత్ఫలముల నొసంగుచుండుననియు మీ రెఱుంగుదురు. కావుననే పరాత్పరుఁడు కృష్ణావతారమునందు,

శ్లో. "కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః,
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణోగతిః."

అని వక్కాణించెను. అశ్లో శంకరాచార్యరూపము నవధరించి

శ్లో. "శివశ్శక్త్యాయుక్తో యది భవతి శక్తః ప్రభవితుం
నచే దేవం దేవో న ఖలు కుశల స్స్పందితు మపి,
అత స్త్వా మారాధ్యాం హరిహరవిరించాదిభి రపి
ప్రణంతుం స్తోతుం వా కథ మకృతపుణ్యః ప్రభవతి."

అనియుఁ దేటపఱచెను.

ఆప్రకృతియూహలు. ఆకర్మములగతులు మహాద్భుతములు. హరిహరబ్రహ్మలకే నెఱుంగరాని వనఁగాఁ దక్కినవారిమాట యిట నేటికి? ప్రకృతితలంపులకుఁ గర్మములకు భేదమిట్టిదని వివరింప శక్యముగానిపనియే యనవచ్చును. ఆకర్మము త్రిష్వ

లకు లోఁబడి దేవతలు తికమకపడుచుందు రనఁగా నిఁక మానవులఁ జెప్పనేల? పనియేయుండదు. కాని దేవానాంప్రియులు కొందఱు కార్యనిర్వహణశక్తి తమయందు నారోపించుకొందురు. పూనినపని నెఱవేఱనిచో దైవమును దూఱుదురు. ఫలించుచో నాత్మస్తుతిపరాయణత్వమును వెల్లడింతురు. ప్రాజ్ఞు లట్లుగాక "గహనా కర్మణోగతిః" అనుసూత్రమును నమ్మి యథాశక్తిన్యాయము ననుసరించి ప్రయత్నము చేసి సిద్ధ్యసిద్ధులయందు సమభావము గలిగియుందురు. కావున వారికి విచారము గలుగదు.

కర్మము నతిక్రమించి జ్ఞానమున ముక్తినొందవచ్చునని కొందఱందురు. కాని కర్మసిద్ధాంతతత్త్వ మిట్టిదని వారెఱుంగఁజాల రనవచ్చును. అది బ్రహ్మస్వరూపమగునపుడు దాని నాశ్రయింప కుండు టెట్లు? జ్ఞానప్రాప్తికి మార్గమేది? జ్ఞానమము కర్మాచరణమునకుఁ దోడుపడును గాని కర్మమును మించి ముక్తిని జేర్పఁజాలదు. జ్ఞానము నీయఁజాలదు. మంచిత్రోవ యనఁగాఁ గర్మమార్గమే. ఏకర్మము నాచరించక కొందఱు జ్ఞానులగుట కనుచున్నారముకదా యందురేమో. వారు జన్మాంతరమున యందు సత్కర్మములను ఫలాభిసంధిరహితములుగ నాచరించి తత్ఫలముగ నీజన్మమున ననుభవించువారే యని యెఱుంగందగు. కర్మమార్గము సర్వార్థసాధనము టయే యిందలిసారము.

ఈసిద్ధాంతము ననుసరించియే యీకృతిసమర్పణోత్సవము సాగినదని నా విశ్వాసము. దానినే యిందుఁ దెలుపుచున్నాఁడను. తాండవకృష్ణభాగవతమున దశమస్కంధము పూర్తినొందింప నున్న సమయముననే తటాలున బళ్లారిమండలమునఁ గల కణేకల్లుగ్రామమునుండి మ-రా-రా-శ్రీ అయ్యగారి బుస్సెట్టిగారు రంగు మంచి యిరువదియైదురజతముద్రికలు చేరెను. మఱికొలఁదిదినములకే పోకటూరి శ్రీరాజుగారియాంగ్లోన్నతపాఠశాలాధ్యక్షులు మ-రా-రా-శ్రీ అల్లాడి జగన్నాథ శాస్త్రులు బి, ఏ., ఎల్. టి., గారు పదిరూప్యములు పంపించిరి. మఱికొన్ని దినములకే నేనున్న యున్నతపాఠశాలయం దుపాధ్యాయులగు బ్రహ్మశ్రీ జంగా లక్ష్మీనరసింహా శాస్త్రిగారు భగవదర్పణము చేయఁదగుధనము (ముడుపు)నఁ గొంతభాగ మొసంగిన మీ తాండవకృష్ణభాగవతముద్రణమున కుపయోగింప నంగీకరింతురా యని ప్రస్తావించిరి. కర్మముగతి గహనమని నమ్మినవాఁడఁగాన దానిం దలంచుకొని భగవదాజ్ఞ యనుగ్రహమును సంస్మరించి యంగీకరింతునని విన్నవించితిని. వారు సువర్ణకంకణ చతుష్క మొసంగిరి. అంకితమొనర్చుకార్యమున కించుక నిశ్చయ మొనర్పవచ్చునని నమ్మితిని. ఎనుబదిమూఁడురూప్యములు మఱియు నాల్గుకలఁ లభించెను. సంతసముచే యిఁక ముద్రణమునకుఁ బూనఁ దలంపవచ్చునని విశ్వసించితి. 1934సం॥ 5 వ నెలలో విక్రమసింహపురము(నెల్లూరు)న కరిగితిని. మండలపరిపాలకసంఘసభ(డిస్ట్రిక్టుబోర్డు మీటింగు) సాగనుండెను. అధ్యక్షమహాశయులు శ్రీరాజా వెలుగోటి సర్వజ్ఞకుమారకృష్ణయాచేంద్రబహదూరువారిని, ఉపాధ్యక్షులు మ-రా-రా-శ్రీ పొణకా

మహాశయులు కష్టములకు లోఁబడవలసినవారైరి. అందఱుఁ గొందఱు చెన్నపట్ట మున నే యుండవలసినవారైరి. తక్కినవారు కడునిపుణులైరి. కాన నా రికార్యము నిర్వహింప నవకాశము కల్గకపోయెను.

"శ్రేయాంసి బహువిఘ్నాని" అన్న ప్రాక్తనసూక్తి యందలి సత్యము నేఁడు కాని క్రొత్తదికాదుగదా? దీనితత్త్వ మిదియని నాకుం దోఁచినదానిని వ్రాయు చున్నాను.

శ్లో. "మృగమీనసజ్జనానాం తృణజలసంతోషవిహితవృత్తీనాం,
లుబ్ధకధీవరపిశునా నిష్కారణవైరిణో జగతి. 1
ఏతే సత్పురుషాః పరార్థఘటకా స్స్వార్థం పరిత్యజ్య యే,
సామాన్యాస్తు పరార్థ ముద్యమభృత స్స్వార్థావిరోధేన యే,
తేఽమీ మానవరాక్షసాః పరహితం స్వార్థాయ నిఘ్నంతి యే,
యే నిఘ్నంతి నిరర్థకం పరహితం తే కే న జానీమహే." 2

అని భర్తృహరి నీతిశతకమునఁ దెల్పఁబడెను. దీనిసారము నెల్లపుడు గ్ర హించు నలవాటుగలవాఁడను. కర్మమే యొకరిమూలమునఁ గార్యములకు విఘ్నములు గలుగఁజేయును. అయ్యది వారి కష్టముగ నుండఁజేయునదియుఁ గర్మమే. కర్మము బలవత్తమము గావున నెవరిమూలముననో విఘ్న మావహిల్లఁజేయును. అది యెఱుఁగక నావంటిపామరలోకము వారిని దూఱును. స్వభావసిద్ధకర్మఫల మి యిది యని మాత్ర మాలోచించువా రరుదు.

ఈనియమము ననుసరించి యీయుత్సవకార్యమునకు నెన్నో విఘ్నములు సంభవించెను. పట్టుదలనూని పనిచేయ నడుముకట్టుకొన్న వారియుద్యమము సాగనీయక మిక్కిలి యు నుత్సాహవంతులు నిరుత్సాహులగుటయుఁ దటస్థించెను. ఆంధ్ర సారస్వతమహావృక్షచ్ఛా హాచ్ఛాయల విశ్రమింపఁగోరుచు నద్దాని పెనుఁగొమ్మల నవలంబించి యున్నట్టి శా ఖాశ్రయులనఁదగు కొందఱుదారమతు లిది యేటికని, యింతకంటె మంచిపను లున్నవి, వానిం జేయరాదా యని పురికొలుప సాధుమతులు కొందఱది సత్య ము బురస్కరించుకొన్న మాటలే యని నమ్మి తద్వాక్ప్రవాహములో నిరుత్సాహు లగుటయు నొకకర్మప్రోత్సాహమే యనక వదలవలసినదునా! ఇట్టు లీకార్యము తలక్రిందులగుచు నపుడపుడు తలసూపి యాశను గల్పించుచు నాలుగుమాసములు వెళ్లింపఁగల్గెను. 21-8-35 దినము రేయి యీక నీకార్యము సాగింప మానితిమను లేఖము నాగరకతమయ్యెను; కాని నిరుత్సాహము మాత్ర ముదయింపకపోయెను.

భావికర్తవ్య మెద్దియని యాలోచించుచు సర్వమంగళకరుణయు మహాప్ర ప్తింప నారంభించితిని. ప్రొద్దుటూరునం దార్యవైశ్యకులశ్రేష్ఠులు, సుగుణసంపత్ ఖనులు, నుదారచిత్తులు, యశఃకీర్తిధురంధరులు, పరహితాచరణైకనిరతులు నగు

హింతుమని తెలిపిరి. ప్రధానాంగముగా దానిం బరిగణించియున్న నాకుంగల్గిన యప్పటియానంద మపారమయ్యెను. భగవంతుఁడు సంతృప్తినొందుననియే విశ్వసించితిని.

తే 22-2-36 ది శనివారము సాయంకాలమున వేంకటగిరినుండి శ్రీ శ్రీ శ్రీ ప్రభుశిరోమణులు బొబ్బిలియందుండి రావలనుపడనికార్యములు పొసఁగినవను తంత్రీవార్త వచ్చెను. విషాదమును గల్గించెను. అంతకుం గొంతముందే రాజమహేంద్రవరమునుండి కవిసార్వభౌము లరుదెంచియుండిరి. కార్యాంతరములలముకొనఁగా నెంతటివారును రాఁజాలరుకదా యని యించుక విషాదమును దగ్గించుకొంటిని. కడపపురమున నున్నతన్యాయస్థానమున రెండవన్యాయాధీశ్వరులై (సబ్ జడ్జీ) పరమభాగవతోత్తములై గీర్వాణభాషాభిజ్ఞులై సంగీతశాస్త్ర పండితులై యపుడపుడు భగవత్కథాసారముల నెల్లరకుం దెల్పుచు భక్తి నుద్దీపింపఁజేయుచు ద్రావిడులైనను దెనుంగు మాటలాడ నేర్చియుండు బ్రహ్మశ్రీ మ-రా-రా-శ్రీ కే. ఎస్. గణపతిఅయ్యర్ బి. ఏ., బి. యల్., గారి సభ్యర్థింప శ్రీ శ్రీ ప్రభుశిరోమణులకార్యము నిర్వహింప నంగీకరించిరి. ఇంచుక యూఁఅడిల్లితిని. ఆరేయిపలుతావులనుండి పండితకవితల్లజు లరుదెంచిరి. కనేకల్లునుండి మ-రా-రా-శ్రీ అయ్యగారి బుస్సెట్టిగారును, వేంకటగిరినుండి మ-రా-రా-శ్రీ అల్లాడి జగన్నాథ శాస్త్రులు బి. ఏ., ఎల్. టి., గారు, నెల్లూరునుండి మ-రా-రా-శ్రీ కనుపర్తి వేంకట సుబ్బయ్యగారును దయచేసిరి. బ్రహ్మశ్రీ కోట నరసింహావుధానులుగారు బాష్ప శకటమూలమున భానువారము దశఘంటా తాడనసమయమున కరుదెంచిరి.

## కృ తి స మ ర్ప ణో త్స వ ము.

యువసం॥ ఫాల్గుణ శుక్ల ప్రతిపద్భానువారము సుదయమున మంగళ వాద్యపురస్సరముగాఁ బండితకవివర్యులు వేదనాదముతో గ్రంథత్రయమును గొని శ్రీరామకృష్ణసమాజభవనమును జేరిరి. దాని కధ్యక్షులు మ-రా-రా-శ్రీ కస్తూరి పట్టాభిరామచంద్రరావు, బి. ఏ., బి. యల్. గారు, వీరు న్యాయవాదులు. నాప్రార్థన నంగీకరించి భవనమును జక్కఁగా నలంకరింపఁజేసిరి. మహోత్సవ సూచకముగా ముందు పందిరివేయఁబడి కదళీస్తంభచిత్రపటపరిశోభితమై కన్నులపండువుగా నుండెను. సభాధ్యక్షమహాశయు లిరువురు పండితసత్కవిసంవేష్టితులై సభాభవనముం బ్రవేశించిరి. అందు వేంచేసియున్న మహాత్ములు పండితకవులు:—

బ్రహ్మశ్రీ పండిత అవధానము శంకరశాస్త్రులుగారు, వేంకటగిరి.

„ అల్లాడి జగన్నాథశాస్త్రులుగారు, అష్టావధానులు, బి.ఎ., ఎల్. టి., వేంకటగిరి.

„ ఆయుర్వేదవిశారద పులుగుండ్ల నరసింహశాస్త్రులుగారు, సంస్కృతకళాశాల, నెల్లూరు.

బ్రహ్మశ్రీ కావ్యతీర్థ రావాడ వేంకటరామశాస్త్రులుగారు,
మ్యునిసిపల్ హైస్కూలు తెలుఁగుపండితులు, బళ్లారి.

,, వేదాంతశిరోమణి విద్వాన్ కోడూరు వాసుదేవశాస్త్రులుగారు,
పాఠశాలపండితులు, కమలాపురము.

,, వేదాంతశిరోమణి తిమ్మావఝుల సీతారామశాస్త్రులుగారు, తిరుపతి.

,, విద్వాన్ రూపాకుల వేంకటరత్నశర్మగారు,
పాఠశాలపండితులు, రాయచోటి.

,, విద్వాన్ అభినవభట్టనారాయణ పాతాళభేది సుబ్రహ్మణ్యశాస్త్రులుగారు,
తిరుపతి హైస్కూలు పండితులు.

,, కావ్యతీర్థ విద్వాన్ మద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రులుగారు,
మ్యునిసిపల్ హైస్కూలు పండితుల, నంద్యాల.

,, పండిత నారు నాగనార్యుఁడుగారు, కోడూరు, కడపజిల్లా.

,, పండిత బాడాల అనంతరామశాస్త్రులుగారు,
దొరతనపు బాలికాపాఠశాలాంధ్రపండితులు, కడప.

,, పండిత సాహిత్యవిశారద కవితార్కికసింహ వరదాచార్యులుగారు,
కడప డి॥ కోర్టు.

,, విద్వాన్ మేడవరము సత్యనారాయణశాస్త్రులుగారు.
పోలేపల్లి, కందనూలు జిల్లా.

,, జ్యోతిషవిద్యాశేఖర పండిత తెలకపల్లి వేంకటసుబ్రహ్మణ్యసిద్ధాంతిగారు,
సరిపల్లి సంస్కృతపాఠశాలపండితులు, పశ్చిమగోదావరిజిల్లా.

,, కార్తాంతికశేఖర గొరిపెద్ది రామేశ్వరసిద్ధాంతిగారు,
గుడిపాడు, కడపజిల్లా.

,, జ్యోతిషవిద్వాన్ వట్టిపల్లి రామేశ్వరసిద్ధాంతిగారు,
సీతారామపురము, నెల్లూరుజిల్లా.

,, పండిత సాహిత్యశిరోమణి కోడూరు సుబ్బరామశాస్త్రులుగారు,
రంగనాయకస్వామిసంస్కృతపాఠశాలపండితులు, నెల్లూరు.

,, పండిత విద్వాన్ చోరగుడి సుబ్రహ్మణ్యముగారు, జిల్లాకోర్టు, కడప.

వీరు సభాభవనము నలంకరించిరి. కార్యాంతరప్రసక్తిని రాఁజాలనందులకు విచారముం దెలుపుచు, చిత్తూరునుండి మ-రా-రా-శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి, ఎమ్. ఏ., గారును, అనంతపురమునుండి కళాశాలపండితులు బ్రహ్మశ్రీ ప్రయాగ వేంకటరామశాస్త్రులుగారును, ఆదవానినుండి విద్వాన్ తొగర్చేటి భాస్కరశాస్త్రులుగారును, మదరాసునుండి పచ్చయప్ప కళాశాలపండితులు బ్రహ్మశ్రీ విద్వాన్

తూళా విశ్వనాథశాస్త్రులుగారును, విద్వాన్ వంగిపురము కృష్ణమాచార్యులు గారును, మదరాసునుండియే మ-రా-రా-శ్రీ వి. పిచ్చయ్య, బి. ఏ., గారును, విశాఖపట్టణముజిల్లా ఎలమంచిలినుండి మ-రా-రా-శ్రీ మారేపల్లి రామచంద్ర శాస్త్రులుగారును, బెంగుళూరునుండి కళాశాలపండితులు విద్వాన్ వెల్లలూరు వేంకటాద్రిశర్మగారును బత్త్రికల వ్రాసిరి.

సుముహూర్తమున సభ యారంభింపఁబడియె. శ్రీరామ శ్రీకృష్ణ శ్రీమీనాక్షీసోమసుందరవివాహచిత్రపటములకు సమాజపురోహితులు పూజ జరపిరి. ఘనపాఠి బ్రహ్మశ్రీ వంగిపురము గోపాలాచార్యులుగారు వేదమును బఠించిరి. వేదపురుషుఁడు మూర్తీభవించినట్లుండెను. పిదపఁగవితార్కికసింహ పండిత బ్రహ్మశ్రీ వరదాచార్యులు (డిస్ట్రిక్టుకోర్టులో నుద్యోగమున నుండువారు) మంగళశ్లోకముల ననురాగయుతములుగాఁ బాడిరి. భక్తిరస ముట్టిపడుచుండెను. తరువాత బ్రహ్మశ్రీ చిక్కేరు జయరామాచార్యులు, బి. ఏ., ఎల్. టి., హైస్కూలునం దుపాధ్యాయులు) భాగవతాద్యశ్లోకమును బఠించి హయగ్రీవచూర్ణికం జదివి శ్రోతల నానందపరవశులనుగాఁ జేసిరి. భక్తి యీరూపమున నరుదెంచెనా యనునూహ యెల్లరకుం గల్గెను.

కవిసార్వభౌములు లేచి కృత్యముం దెలిపి గ్రంథత్రయము సమర్పించు విధానము ననుసరింప హెచ్చరించిరి. అట్లే ప్రథమపద్యములం బఠించి తరువాత షష్ఠ్యంతములదనుకఁ బఠింప విద్వాన్ అభినవభట్టనారాయణబిరుదాంచితులు బ్రహ్మశ్రీ పాతాళభేది సుబ్రహ్మణ్యముగారి నభ్యర్థించిరి. వారు సరాగముగఁ బఠింప శక్తిగలవారు. నావేఁడికోలు నంగీకరించి యర్థము చెప్పనక్కఱలేక యుండఁ జదువసాగిరి. ఆయాభాగముల భాషాంతరీకరణ మెట్లులున్నదని విమర్శింపఁబడియె. పిదప నధ్యక్షు లుపన్యసింప నారంభించి తెలుఁగున నతిరమ్యముగ భాగవతతత్త్వము నుపన్యసించుచు భగవత్కృతులఁ దదనుగుణముగాఁ బాడుచు రెండుగంటలు సభ్యులనెల్ల భక్తిరసాంబుధి నిమగ్నులఁ గావించిరి. పదునొకండు గంటలు గడచెను. సభ నిలుపఁబడి మరల రెండున్నఱగంటల కారంభింపఁబడునని యధ్యక్షులచే నిర్ణయింపఁబడియె. అంతకుం గొంతముందే కడపనగరమునఁ గల యార్యవైశ్యశ్రేష్ఠులు కౌశేయద్వయము నొసంగిరి. అందు మ-రా-రా-శ్రీ మేడా ఈశ్వరయ్యశ్రేష్ఠిగారు రత్నాంగులీయక మొసంగిరి. అంత వేంకటగిరి రాజా వారిహైస్కూలు హెడ్ మాష్టరుగారు మ-రా-రా-శ్రీ అల్లాడి జగన్నాథశాస్త్రులు బి. ఏ, ఎల్. టి., గారు శ్రీశ్రీశ్రీ రాజా వెలుగోటి సర్వజ్ఞకుమారకృష్ణయాచేంద్ర బహదూరువారు రాజాలనందులకుంగల కారణములం దెల్పి శ్రీవారను గ్రహించిన నూటపదాఱు లధ్యక్షులమూలమున నొసంగిరి. అత్తఱి మ-రా-రా-శ్రీ అయ్యగారిబుస్సెట్టిగారు దశరూప్యములు, పత్తి రాఘవులుశ్రేష్ఠిగారు దశరూప్యములు,

నెల్లూరునుండివచ్చిన ఆయుర్వేదవిశారద బ్రహ్మశ్రీ పులుగుండ్ల నరసింహశాస్త్రులుగారు రూప్యదశకము, బ్రహ్మశ్రీ కోడూరు సుబ్బరామశాస్త్రులుగారు పంచరజత ముద్రికలు, మ-రా-రా-శ్రీ కనుపర్తి వేంకటసుబ్బయ్య బి. ఏ,. గారు దశరూప్యములు, కడపవాస్తవ్యులు హైస్కూలునందుపాధ్యాయులు మ-రా-రా-శ్రీ వి. చిదంబరరావుగారు పంచరజతముద్రికలు, బ్రహ్మశ్రీ పండిత బి. అనంతరామశాస్త్రులుగారు రూప్యపంచకము, బ్రహ్మశ్రీ మాడుగుల సుబ్బయ్యగారు పంచరూప్యములు, గం. వాడాల అన్నపూర్ణమ్మగారైదురూప్యములు, శ్రీమతి కృష్ణవేణమ్మగారు పంచరూప్యములు భగవదర్పణముసేయఁ జదివించి యధ్యక్షులమూలమున నిచ్చిరి. ప్రొద్దుటూరునుండి యరుదెంచిన యార్యవైశ్యశిరోమణులు మ-రా-రా-శ్రీ కొప్పరపు సుబ్బయ్యశ్రేష్ఠిగారు దీనాంధబధిరకుబ్జులకు సంతృప్తిగా నెందఱువచ్చిన నందఱకు నన్నదానము చేయుచుండి సభ కరుదెంచి సభముగియునదనున చాగలమఱ్ఱి యార్యవైశ్యవర్యులు తమమూలమునఁ బంపిరనితెల్పి రాంకవము (సాలువు) నొసంగిరి. సభ నిలుపఁబడి మాధ్యాహ్నికకృత్యములు సాగి విశ్రాంతిగైకొనినపిదప సుర్వారుకఫలభక్షణపూర్వకతిక్తకషాయాస్వాదనానంతరము మంగళవాద్యపురస్సరముగ సభాభవనప్రవేశము జరగెను. ఇంచుమించుగా మూఁడుగంటలయ్యెను. సభ్యులంతకుముందే దయచేసియుండిరి.

## సభా ప్రారంభము.

వేదపాఠపురస్సరముగా సభ యారంభింపఁబడియె. కావ్యపురాణతీర్థ విద్వాన్ జనమంచి. వేంకటసుబ్రహ్మణ్యశర్మ స్వాగతోపన్యాసము, అధ్యక్షులఁ బ్రార్థించుటయు, వారు స్వకీయపీఠముల నలంకరించుటయు సాగెను. శ్రీసర్వమంగళాపరిణయముంగూర్చి కవి సార్వభౌములు బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రులుగారు లేచి యొకగంటకాలము గంభీరోపన్యాసము గావించిరి. సభ్యులచ్చెరువందిరి. పిదప శ్రీరామావతారతత్త్వముంగూర్చి బ్రహ్మశ్రీ మ-రా-రా-శ్రీ కోట నరసింహము పంతులుగారు తమకుంగలవేదాంతశాస్త్రపాండిత్యము తేటపడఁ బాశ్చాత్యులయాశయములు నద్వైతమతసంబంధములే యని తేటపఱచుచు ననర్గళధారతో నుపన్యసించిరి. తెలుఁగున నిట్టుమాటలాడ నితరులకు శక్యమా యనిపించిరి. సాయంసమయమయ్యెను. విద్యుద్దీపము లాప్రదోషమును విస్మరింపఁజేసెను.

## పండితోపన్యాసములు.

మ-రా-రా-శ్రీ అల్లాడి జగన్నాథశాస్త్రులుగా రుపన్యసించుచుఁ దామొనరించిన పద్యరత్నపంచకసంభృతరాజతపేటిక నొసంగిరి. ఆయుర్వేదవిశారదులు బ్రహ్మశ్రీ పులుఁగుండ్ల నరసింహశాస్త్రులుగారు మితహితోపన్యాసముగావించి భాగవతార్థముం దెల్పిరి. డిస్ట్రిక్టుబోర్డు ఇంజనీయరుగారు మ-రా-రా-శ్రీ అక్కెనప్రగడ

లక్ష్మీనారాయణరావు, బి. ఏ., బి. ఇ., గారు లేచి శ్రీ రామా[illegible] జదివి చేసిన తమకృషిని వెల్లడించుచు దేవాలయోత్సవములు [illegible] ప్రధానములు కావనియు నవి తొలుత మహోపకారమొన[illegible] యోగము నభ్యసింపవలయు నను నీమొదలగువిషయము[illegible] నుపన్యసించిరి. వేదాంతశిరోమణి విద్వాన్ బ్రహ్మశ్రీ [illegible] రుపన్యసించి కవులపరిశ్రమములంగుఱించియు భగవ[illegible] శ్రీభాగవతమహత్త్వము నుద్దేశించియుఁ బ్రకృతాంధ్ర[illegible] జక్కనియుపన్యాస మొసంగి శ్రోతల నెంతయు నలరించిరి. [illegible] దలంచిన పండితకవులం బ్రార్థించుచు నధ్యక్షులు శ్రీ పాదకృష్ణమూర్తి[illegible] కాలముం దెలుపుచు నాశీఃపద్యములం జదువ నభ్యర్థించిరి. [illegible] జదివిరి. వానినెల్లఁ దదాజ్ఞంగొని యిందే పొందుపఱచు[illegible].

అభినవభట్టనారాయణబి[illegible]

విద్వాన్ పాతాళభేది సుబ్రహ్మణ్యముగారు, [illegible]

క. శేషాద్రిశర్మయన నర,వేషంబున నేఁడు వాణి ¦ వెలుఁగొం[illegible]
తోషంబున మనసీమను, భూషితఁగాఁ జేయ నిట్లు ¦ పొ[illegible]. 1

ఉ. మున్నటఁ బోతరాజు తనబుద్ధికిఁ దోఁచినయట్లు భక్తియే
సన్నుతరీతి నెల్లరకుఁ జాటఁగ ¦ భాగవతం బొనర్చె నేఁ
డెన్నఁగ వ్యాసమూలమున ¦ కీయెడఁ దాండవకృష్ణశాస్త్రి వి
ద్వన్నుతభంగిఁ దెల్గు నను ¦ భాగవతంబు రచించి [illegible]. 2

చ. పలుకఁగవచ్చుఁగాక మఱి ¦ వాఁడిటు నీఁడిటు [illegible]
దలుపులు వాకిళుల్ గలవె ¦ తార్కొని మూఁతలు [illegible]
దలఁచిన ఫాలనేత్రునకుఁ ¦ దాఁ దలపై నొకవంక లేదె యీ
పలుకుల కేమి లెండు గుణపాళియెగా వెలయించు [illegible]. 3

క. రామావతారతత్త్వము, ప్రేమంబున భక్తతతికి ¦ వెలయింగ[illegible]
నీమహనీయుం డిప్పుడు, శ్రీమిాఱఁగఁ జేసి యిచ్చె ¦ శ్రీరాముని[illegible]. 4

తే. సర్వమంగళాపరిణయచతురకావ్య, మూర్విఁ దెలుఁగున రచియించి ¦ [illegible]
ళాధినాథునకును బ్రేమ ¦ నమలభక్తి, నిచ్చె శేషాద్రిశర్మ [illegible].

క. వలికపురపుఁబలుకులు బలెఁ, దెలిము త్తైపుఁజాలు[illegible] ¦ [illegible]
జలువలుఁ దెలుపులుఁ జవులున్, వెలయించు న్నీ[illegible] ¦ [illegible]. 6

ఆ. ఎల్లరకును దక్కు నే యిట్టియద్భుత,శక్తి వాణికరుణ ¦ [illegible]
జెలఁగె నద్ది నేఁడు ¦ శేషాద్రిశర్మకు, లలితపాదయుగళి ¦ [illegible]. 7

మ. తరుణంబెల్లఁ బురాణవృత్తిని విలుప్తంబయ్యె నీనాఁడు సు
స్థిరభక్తిన్ భవదీయహస్తము తగన్ శ్రీరామకృష్ణావతా
రరహస్యంబులలో లేక భాగవతసారస్యంబులో వ్రాయ న
త్తఱి శృంగారరసప్రబంధ మెటు దిద్దంజాలె? విద్వత్కవీ. 4

శా. హాలాస్యేశపురాణకర్త లలితోపాఖ్యానసద్వక్త బ్ర
హ్మాలోకం బొనరించినట్టికవి బ్రహ్మాండోక్తిచాతుర్యుఁ డీ
లీలాకృష్ణకథాప్రణేతను దయాలేశప్రసారంబునన్
బాలింపన్ వలెఁ దెల్గుబాస కిటు సేవల్ సల్పఁగా నీశ్వరా. 5

కావ్యతీర్థ రావాడ వేంకటరామశాస్త్రులుగారు, బళ్లారి.

శా. శ్రీనగవైరిముఖ్యసురసేవితపాదుఁడు భక్తిభావసం
దానితచిద్గుహాంతరనితాంతనివాసకుతూహలాఢ్యపం
చాననమూర్తి నమ్రజనతార్తిహరుండగు సర్వమంగళా
జాని శుభంబు లిచ్చి కవిచంద్రమ! శేషనగాఖ్య! ప్రోచు నిన్. 1

క. పలువురు బిడ్డలపెండిలి, తలఁగక యొకమాటొనర్చు తండ్రివలె బళీ
లలితకృతిత్రయమణి సం,చలితసమర్పణమహోత్సవం బొనరింతే. 2

చ. అరయఁగ నాంధ్రమాతకు నహా! ప్రియపుత్త్రుఁడ వీవె యాదు వా
నరుదగుకావ్యపుష్పములనాయమపూజ లొనర్చి నెమ్మదిన్
దిరమగుప్రేమ నించితివి తీర్చితి తల్లిఋణంబు నెంతయున్
దొరఁకొనునయ్య! యిట్టి గుణధుర్యత యందఱకీధరిత్రిలోన్. 3

సీ. భారతి నీమరూపముఁ దాల్చి పేపేగ గ్రంథము లీరీతి వ్రాయునొక్కొ
అలవిరించియె కావ్యముల నల్ల యంత్రంబు నీహృదయంబున నిల్పెనొక్కొ
నీదుహస్తంబున నెలకొనియుండుటఁ గలమున కీశక్తిగలిగె నొక్కొ
రాయలసీమవారలభాగ్యసస్యముల్ పండి నీయాకృతిఁ బరఁగెనొక్కొ
తే. ఇట్లుగాకున్నఁ బరతంత్రప్రవృత్తియేడ, మానసంబున నిలుకడ మాటయేడ
సరసకృతులను జెక్కింటికలుపు టేడ, భవ్యగుణసాంద్ర శేషాద్రిపండితేంద్ర.

తే. బ్రహ్మమోమున నెందాఁక వాణి వెలయు
హరియురంబున నెందాఁక సిరి వసించు
హరునిసామేన నెందాఁక గిరిజ చెలఁగు
నంతదనుకను నీకృతు లవనిఁ గ్రాలు. 5

అవధానము శంకరశాస్త్రులుగారు, వేంకటగిరి హైస్కూలు తెలుఁగుపండితులు.

ఉ. శ్రీజనమంచి వంశఘనసింధుసుధాకర శేషగోత్ర! వి
భ్రాజదఖండపండితసభాజనరంజక సర్వభూమిభృ

ద్రాజవిశేషమాన్య కవిƒరాజవిరాజ యశేషశేముషీ
తేజ! యుమాధవుండు నిను ƒ దివ్యశుభంబు లొసంగి కావుతన్. 1

ఉ. పోతన మున్ను భక్తిపరిƒపూర్ణమనఃప్రమదాతిరేకస
చ్ఛేతనుఁడై ధరిత్రిని రƒచించెను భాగవతంబు సత్కవి
వ్రాతము మెచ్చ నీవిపుడు ƒ భాగవతంబు మఱొండు వ్రాయవే
యాతతపద్యపాదగతుƒలందు మనోజ్ఞత వెల్లడించుచున్. 2

సీ. అరవిరికెందమ్మి ƒ విరితావులను గుప్పి యుల్లాస మొదవించు ƒ నొక్కచోట
గంగాతరంగిణీƒకల్లోలసంరభ మొనర ననుకరించు ƒ నొక్కచోట
మంజులమకరందƒమాధుర్యధుర్యమై యొప్పారురసముల ƒ నొక్కచోట
లలితరసాలపల్లవమార్దవసురుచిరోక్తులఁ గడునొప్పు ƒ నొక్కచోట
తే. బళిర! నీసర్వమంగళాƒపరిణయంబు, సారసారస్వతప్రపంƒచంబులోన
సుస్థిరస్థానమున నెంతొ ƒ శోభ గాంచు, నమలగుణ! జనమంచి శేƒషాద్రిశర్మ.

ఉ. ఏతఱి భావసౌరభము ƒ లిమ్ముగ గమ్మన సొంపు నింపుకై
సేతలఁ బల్కుటింతి కయి ƒ సేసిన నిద్దపుముద్దుసొమ్మనన్
గైతకు వన్నెఁగూర్చుచుఁ బొ ƒ గడ్తకు మీఱెడురామతత్త్వమున్
ఖ్యాతి రచించి గ్రోలితివి ƒ గౌరిపదాబ్జమరంద మెంతయున్. 4

తే. పరమపావనగంగాస్రƒవంతిలోన
రేకువిప్పినకెందమ్మిƒ పోక నెసఁగి
దత్తమండలగర్భరƒత్నంబ వైతి
వినుత జనమంచి శేషాద్రి ƒ విబుధవర్య. 5

మ॥ రా॥ శ్రీ అల్లాడి జగన్నాథశాస్త్రులు, బి.ఏ., ఎల్.టి., గారు,

హెడ్ మాష్టరు, రాజావారిహైస్కూలు, వేంకటగిరి.

శా. శ్రీరామావనధర్మపాలనకళా ƒ దృగ్రూపతత్త్వంబు ర
క్షారమ్యాస్పదసద్గతిప్రదశివా ƒ కల్యాణవతత్త్వంబు శి
క్షారాజేశ్వరకల్పతాండవనిరీ ƒ క్షాభాగవత్వంబు సు
శ్రీరాజుల్దయచేయుచున్ గనుత శ్రీƒశేషాద్రి భూదేవునిన్. 1

ఉ. క్లిష్టముగాక వ్యర్థపద ƒ కీలితదీర్ఘసమాసఘోషలన్
దుష్టముగాక గ్రామ్యగుణ ƒ దూషితలౌకికనిష్ఠురోక్తులన్
దుష్టియుఁ బుష్టిఁ గూర్చెడు సƒతుల్యవిలాసవిశేషశైలులన్
సృష్టి యొనర్పఁజాలితివి ƒ శిష్టులు మెచ్చఁగ స్పష్టరీతులన్. 2

సీ. ఆంధ్రీకృతద్రుహిణాండపురాణార్జితాభినవవ్యాసశోభకుండు
గీర్వాణపాండిత్యకీర్తితస్మృతికావ్యతీర్థాదిబిరుదసందీప్తకుండు
జ్యోతిషానందసంశోధితసిద్ధాంతప్రత్యబ్దపంచాంగభాసకుండు
మంత్రతంత్రావళీమహితశాక్తాగమసంపూర్ణదీక్షాప్రశస్తికుండు
తే. నీదు సద్వర్తనంబును నీమనంబు, సాధుగతియును ప్రకరణసత్యమతియుఁ
జాలదే కీర్తిఁ గల్పింప శాశ్వతముగ, నమలగుణధర్మవినుత శేషాద్రిశర్మ.

చ. ప్రభువులవిత్త మాసఁగొని గ్రంథము వారికిఁ గల్మికియకే
యుభయత నూత్నరీతుల జనౌఘము పల్కులనుంతఁ బూని మీ
రభినవగ్రంథరాజి నభవార్పణచేసి చెలంగుటెంచ నా
హా! భువిని ఘోషచెందెను వినాశ్రయ యంచు వినాశ్రయోక్తియున్. 4

క. భూసురవర! శ్రీగురువర!, మీసారసచరణసీమ మేటిసపర్యల్
చేసెద భక్తిఁ బ్రియాంతే, వాసి జగన్నాథశాస్త్రి పద్యసుమములన్. 5

బ్రహ్మశ్రీ విద్వాన్: మేడవరము సత్యనారాయణ
శాస్త్రులుగారు, పోలేపల్లి, కర్నూలుజిల్లా.

మ. ఒకయుద్గ్రంథము వ్రాసి పేర్వడయువారున్నార లందందు స
న్నకసన్నంజిలుఁబోత్తముల్ గెలుకుఁడన్నం గొందఱున్నారలి
ట్లకలంకంబుగ దొడ్డగ్రంథము లసంఖ్యాతంబుగా వ్రాయ నిం
కొకరున్నారలో లేరో సందియము నా యుల్లంబునన్ దేశికా. 1

మ. ఎపుడుద్యోగము నిర్వహించెదరొ మీ రెప్పట్టునన్ గ్రంథముల్
విపులప్రజ్ఞనిరీక్షఁ జేయుదురొ పోపో యిట్టి యుద్గ్రంథముల్
నిపుణత్వంబున వ్రాయఁగల్గితిరొ మీ నేర్పేమి యూహించినన్
ద్రపయేలా మముబోంట్లగుండె పగులున్ దత్తత్కృతుల్ చూచినన్. 2

మ. అవధానంబు లొనర్చినారు బహుదేశావాసులౌ పండిత
ప్రవరుల్ మెచ్చఁగ గ్రంథరాజముల సంపాదించినా రింతక
వ్యవధానంబుగఁ గోటివిస్తృతుల వ్రాయంజాలియున్నార లు
త్సవ మేపార భవద్యశంబిల జగద్వ్యాప్తంబు వేయేటికిన్. 3

కవిశేఖర యల్. వేంకటరమణయ్యగారు, పులివెందల, కడపజిల్లా.

ఉ. శ్రీజనమంచి వంశశశిశేఖర కావ్యపురాణతీర్థ యో
భూజనవందితా! సుగుణభూషణ! నీతియశోవిశాల! యు
త్తేజముతోడ నొప్పు ఘనతేజుఁడు శౌరి యనంతమూర్తి మీ
కోజను సంతసం బొసఁగు సుధృతశక్తియు భక్తియుక్తులున్ 1

సీ. బ్రహ్మబ్రహ్మాండాదిక బహుపురాణంబుల భాసిల్లఁజేసిన భక్తుఁడీవె
రామాయణంబును రాణదలిర్పఁగా రచియించినట్టి యారసికుఁ డీవె
కలకత్తకుంభకోయి కావ్యతీర్థాదిక ఘనబిరుదము లొందుఘనుఁడ వీవె
సంస్కృతాంధ్రంబుల సాహిత్యమును నేర్చి సారంబుగన్నట్టిసరసుఁ డీవె
తే. కవులలోపల నుత్తమ కవివి నీవె, పండితులలోన నెంతయుఁ బ్రౌఢుఁ డీవె
సుగుణగణముల నుత్తమ సుగుణుఁ డీవె,శాంతగుణధామ శేషాద్రిశర్మనామ.

తే. తినిన నతిరసంబుల వేడ్కఁ దినఁగవలయు
వినినఁ గృష్ణభాగవతంబు వినఁగవలయు
ననెడిపద్ధతిన రచియించి యలరితౌర
గరిమఁ దాండవకృష్ణభాగవత మెలమి. 3

ఉ. దాని సుపాత్రతౌచితియు దానివిదగ్ధమైనవిలాసరేఖలుఁ
దాని పదార్థగుంభనము దానినవోజ్జ్వల శైలిపోషణల్
దానిరసానుపోషణము దానియకుంఠితనీతిసారముం
మానకమానసంబులకు మాటికి మాటికి మోదమబ్బెడిన్. 4

ఉ. తాండవకృష్ణభాగవత ధాటిని సొంపును జూడఁజూడఁగాఁ
దాండవమాడునందు సువితానవినూత్నరసోన్నతోన్నతుల్
మెండుగఁ జెప్పనేల నిఁక మేదిని గాంచెడి శాంతమూర్తి యా
తాండవకృష్ణుఁ డోముత సదా మిము గౌరవసంపదాళిచే. 5

కవిభూషణ నారు నాగనార్యుఁడుగారు, కోడూరు.

క. జనమంచ్యన్వయఘనవార్ధినిశాకర! విమలతేజ! దేవీకరుణా
జనితమృదుమధురకవితా, ప్రణిధానా! శేషశైలవరవిజ్ఞానా! 1

క. లలితానిరవధికకృపా, విలసితసంలబ్ధమధురవిశ్వజనీనో
జ్జ్వలలలితాలంకృతపరి, కలితసుకలితానుభూతికలితుఁడ వనఘా!. 2

ఉ. పోతనయోగి భాగవతముం భవదీయకృతిం విమర్శనా
తీతవచోవిశేషములఁ దెల్పఁగఁబోలదు మాక దెట్లనన్
పూతచరిత్రు లిర్వురును బూరితభక్తిసుధాస్రవంతి నిం
జేతములందుఁ దన్మయత జిల్లునఁ జల్లఁగఁ బాఱఁజేయుటన్. 3

తే. సంస్కృతనిగూఢభావముల్ సరసరీతి
తెలుఁగు దెలుఁగునఁ గడుతేట తెల్లముగను
బామరులకైనఁ దెలియంగఁ బలికె నెవఁడు
నీవగాక! నిజమ్ముగా భావపరిధి. 4

క. సమధికశతసుకృతులునుఁ, సుమధురమంజులరసైకశోభితకవితా
ప్రమితులరచించుశక్తిఁ, గ్రమమునఁ బరదేవి నూఱ్వఁగాఁ దలఁతు నెద౯.

బాలకవి ఎం. ఎస్. నంజుండకవిగారు, కడప.

సీ. కవిసార్వభౌము లీకడపపట్టణమందు విచ్చేసియుండుట వింతగాదె
పండితోత్తములెల్లఁ బ్రభుని గానకయుంట విసరించి నూడంగ వింతగాదె
నరసింహపంతులు న్యాయాధిపతు లిట్లు విచ్చేసియుండుట వింతగాదె
కవిజనానందమై కమలకల్హారమై వికసించుసభఁజూడ వింతగాదె
తే. వింత యన నేల శ్రీలక్ష్మీవిభునిపేరఁ
గృతుల మూఁడింటిఁ దా వ్రాసి కృతి యొసంగి
కావ్యస్మృతితీర్థ జనమంచి కవివరుండు (?)
నెగడె ననియన్న వింతగా నెగడకున్నె. 1

క. సతతముఁ గృతిపతి యగుశ్రీ, పతి యని ప్రార్థింతు గురుని పాదాబ్జములన్
హితమున శిష్యునికోర్కెల, క్షితిపతి మెచ్చంగ గురుఁడు చేకొనఁగఁ దగున్.

చ. సతతము గ్రంథరాజములసత్కవివర్యులు వ్రాయరే యన౯
జతనము లేక పెక్కులుగఁ జయ్యన వ్రాయుచుఁ జంద్రశేఖరు౯
కృతిపతిఁ జేసి యిజ్జగతిఁ గృష్ణునికై నడి శిష్యబృందము౯
హితమున నేలఁగొండిక మహీపతులందఱు మెచ్చునట్లుగాన్. 3

చ. ప్రభువును బండితోత్తములు పల్వురుఁ జేరి కృతిత్రయంబును౯
విభవముతోడ సల్ప నిటు వీలగునో మఱి కాదటంచు నే
ప్రభువును గాంచి పద్యములఁ బల్కఁగ నేఁడిచి వచ్చినాఁడ నా
ప్రభువరుఁ డేలరాఁడో యిది భాగ్యముగాదో యిఁకేమి సేయుదు౯. 4

క. మంగళమగు సత్సభలకు, మంగళమౌ మాతృభాష మఱునాజ్ఞలకున్
మంగళమగు సత్కవులకు, మంగళమౌ రామకృష్ణమంత్రివరునకున్. 5

శ్రీయుతులు ఏచూరి వేంకటరంగయ్యగారు, ఉపాధ్యాయులు, కడప.

శా. ఉన్నే శారద పక్షపాత మిదినీకో హాహా నిన్నింతగా
నెన్నో భంగుల నేల నేర్పుగల మహిమ్మారీతి నేమంబ్బి క
న్నన్నల్ చేతనె ప్రొద్దుబుచ్చి యిటునిన్ సాధింపఁ బ్రార్థింప వా
కన్నన్ వృద్ధులఁ జెట్టఁబట్టెదవు నీ కౌటిల్యముల్ చాలునే. 1

సీ. గంటంబుచే నిన్ను నంటుచుండినవారె కవిబ్రహ్మలన్ గీర్తిఁ గాంచి రిపుడు
ఒకచెంపఁ గనుపింప లుంచి నిన్ మెప్పించు వారలే కవిసార్వభౌములైరి
మేకతోఁకల నిన్ను మెలిఁబెట్టువారలే కవిరంజకుల్ గీర్తిఁ గాంచి రిపుడు
వంధమందికి నీదుకవలఫుఁజూపినవారె యవధానులనఁగీర్తి నందిరిపుడు

తే. నారికేళంబు ద్రాక్షయన్నామ మిడిన, వారలే విమర్శకులని వాసిఁగనిరి
పసిడిముక్కన నినుఁగూర్చుపండితునకు, శారదాబిడ్డ లేవె నీపేరుదక్క.

తే. వ్రాయనేరనిమాబోంట్లు 'వ్రాసినారు
పెడదగోళ్లచేఁద్రాడు లబ్బె' యటందు
రంతియేకాని తమకీర్తి కింతన్నైన
లోటుగల్గునె బహుళాంధ్రలోకమునను
సదయ గురువర్య శేషాద్రిశర్మసుకవి.

పిదప అధ్యక్షకమహాశయులు గ్రంథములనుగుఱించియుఁ, గవిత్వము భాషాంతరీకరణమునుగుఱించియు, భగవత్తత్త్వమునుగుఱించియు నుపన్యసించుచుండ, వారివాగమృతముం గ్రోలుటకై రాత్రి 9-30 గంటలయినను విసుఁగుజెందక తదేకధ్యానతత్పరులయి యుండిరి.

రాత్రి 9-30 గంటలకు శ్రీభగవానునిపూజాదికము మంగళముతో జయప్రదముగా సభ సంపూర్ణమయ్యె. ఎల్లరును దమతమభవనంబులకుఁ జనిరి.

## కృతజ్ఞత

ఈకృతిసమర్పణమహోత్సవకార్యంబునకు సర్వవిధములఁ దోడుపడిన మహానుభావులగు పండితప్రకాండులకును, శ్రీరామకృష్ణసమాజాధ్యక్షులును, పరోపకారతత్పరులును నగు మ-రా-రా-శ్రీ కస్తూరి పట్టాభిరామచంద్రరావు, బి ఏ., బి. ఎల్, గారికిని, మఱియుఁ దత్సమాజకార్యదర్శిప్రభృతులకును, నాకార్యముఁ దమకార్యముగా భావించి సభను జయప్రదముగా సాగింపఁజేసిన న్యాయవాది మహాశయులకును, సుదాతలగు పౌరప్రముఖులకును, ఈకార్యమునకు సకలవిధముల బాష్పశకటాదిదానాదులచేఁ దోడ్పడిన మ-రా-రా-శ్రీ అక్కెనప్రగడ లక్ష్మీనారాయణరావుపంతులు, బి. ఏ., బి. ఇ., డిస్ట్రిక్టుబోర్డు ఇంజనీయరుగారికిని, దూరదేశంబనక వ్యయప్రయాసంబుల లెక్కపెట్టక సభకు విజయంచేసిన సభ్యులకెల్లరకును బ్రీతిపూర్వకముగాఁ గృతజ్ఞతఁ దెలుపుచున్నాఁడను.

కడప.
25-2-1936 }

ఇట్లు, విధేయుఁడు
జనమంచి శేషాద్రిశర్మ.

# విషయసూచిక

విషయము.

విషయము. పుట.

ముప్పదియేడవఅధ్యాయము.



ముప్పదెనిమిదవఅధ్యాయము.



ముప్పదితొమ్మిదవఅధ్యాయము.



నలువదవఅధ్యాయము.



నలువదియొకఁడవఅధ్యాయము.



నలువదిరెండవఅధ్యాయము.



నలువదిమూఁడవఅధ్యాయము.



నలువదినాల్గవఅధ్యాయము.



నలువదేనవఅధ్యాయము.



నలువదాఱవఅధ్యాయము.



నలువదియేడవఅధ్యాయము.



నలువదియెనిమిదవఅధ్యాయము.



నలువదితొమ్మిదవఅధ్యాయము.

విషయము. | పుట.

## ఉత్తరభాగము.

### ఏఁబదియవఅధ్యాయము.



### ఏఁబదియొకటవఅధ్యాయము.



### ఏఁబదిరెండవఅధ్యాయము.



### ఏఁబదిమూఁడవఅధ్యాయము.



### ఏఁబదినాల్గవఅధ్యాయము.



### ఏఁబదిగైదవఅధ్యాయము.



### ఏఁబదియాఱవఅధ్యాయము.



### ఏఁబదియేడవఅధ్యాయము.



### ఏఁబదియెనిమిదవఅధ్యాయము.



### ఏఁబదితొమ్మిదవఅధ్యాయము.



### అఱువదియవఅధ్యాయము.

విషయము. పుట.

విషయము. | పుట.

డెబ్బదియాఱవఅధ్యాయము



డెబ్బదియేడవఅధ్యాయము.



డెబ్బదియెనిమిదవఅధ్యాయము.



డెబ్బదితొమ్మిదవఅధ్యాయము.



ఎనుబదియవఅధ్యాయము.



ఎనుబదియొకఁడవఅధ్యాయము.



ఎనుబదిరెండవఅధ్యాయము.



ఎనుబదిమూఁడవఅధ్యాయము.



ఎనుబదినాల్గవఅధ్యాయము.



ఎనుబదిగ్గైదవఅధ్యాయము.



ఎనుబదియాఱవఅధ్యాయము.



ఎనుబదియేడవఅధ్యాయము.



ఎనుబదియెనిమిదవఅధ్యాయము.



ఎనుబదితొమ్మిదవఅధ్యాయము.



తొంబదియవఅధ్యాయము.

# భూమిక.



శ్లో. నిగమకల్పతరోర్గళితం ఫలం, శుకముఖా దమృతద్రవసంయుతం
పిబత భాగవతం రస మాలయం, ముహు రహో రసికా భువి భావుకాః.

మ. లలితస్కంధము కృష్ణమూలము శుకాలాపాభిరామంబు మం
జులతాశోభితముఁ సువర్ణసుమనస్సుజ్ఞేయముఁ సుందరో
జ్జ్వలవృత్తంబు మహాఫలంబు విమలవ్యాసాలవాలంబు నై
వెలయుఁ భాగవతాఖ్యకల్పతరు వుర్విఁ సద్ద్విజశ్రేయమై.

## వ్యాసునివిషయము.

శ్రీమన్నారాయణావతారంబని ప్రసిద్ధిం గాంచిన వేదవ్యాసభగవానుఁడు మొన్నటి ద్వాపరంబున సత్యవతీపరాశరులకు సద్యోగర్భంబునం బుట్టి పుట్టినంతన తండ్రియాజ్ఞం గొని దండకమండలువులఁ ధరించి తపోవనంబునకు నరిగి బ్రహ్మర్షియై బ్రహ్మసాక్షాత్కారము గలిగించుకొని శ్వేతద్వీపంబున శ్రీమన్నారాయణ దర్శనంబు గావించి కృతకృత్యుండై శుకునివంటి పరతత్త్వజ్ఞునకుం దండ్రియై లోకోపకారార్థ మేకీభూతంబులైన వేదంబుల విభజించి తత్త్వావబోధకంబులగు బ్రహ్మసూత్రముల వినిర్మించి యంతంబోక యష్టాదశమహాపురాణంబులును, అష్టాదశోపపురాణంబులును రచియించి లోకంబుల నుద్ధరించె. మఱియు శ్రీమహాభారతము కురుపాండవదాయభాగముఁ బీజముగాఁ గొని గణపతి వ్రాయసకాఁడుగా హిమవత్పర్వతకందరంబునందుండి మూఁడుసంవత్సరములలో నఱువదిలక్షలగ్రంథముగా నిర్మించి తనశిష్యులగు పైలజైమినిసుమంతుప్రభృతులచే దేవపితృాది లోకంబులం దానిఁ బ్రచురించి మనభూలోకంబున వైశంపాయనునిచే నొకలక్ష గ్రంథము ప్రకాశింపం జేసె.

అందు దేవదానవాదిలోకవిషయంబులును, భూగోళఖగోళవిషయంబులును, మన్వాదిసృష్టిక్రమంబులును, శబ్దవేదాంతాదిశాస్త్రమర్యాదలును, వంశావతారపూర్వరాజచరిత్రంబులును, రాజధర్మ-మనుష్యధర్మాపద్ధర్మమోక్షధర్మప్రభృతి నానావిధధర్మంబులును, వృక్షశాస్త్ర - మనుష్యశాస్త్ర - భూగర్భశాస్త్రాదిప్రకృతి శాస్త్రంబులును, విద్యుచ్ఛక్తివిశేషంబులును, 'బాంబు సర్చిలైట్లు' శతఘ్నులు లోనగునద్భుతవిషయంబులును, వేయేల మనుష్యలోకమున కావశ్యకములై సర్వాధ్యాత్మికాధిభౌతికంబులైనవిషయంబులును క్రోడీకరించి వివరించె. శాంత్యానుశాసనాదిపర్వములలో సర్వవేదాంతచర్చలు గావించి లోకంబు సముద్ధ

*

రించి సర్వలోకవిశ్రాంతకీర్తివిశాలుండై కీర్తనీయుండయ్యె ననుట కొంతయు సందియంపడ నక్కఱలేదు.

అట్టి వ్యాసభట్టారకుఁ డొక్కనాఁడు సరస్వతీతీరంబున నేకాకియై కూర్చుండి తనలో "నేను వేదవేదార్థధర్మంబులెల్లం దేటపడ భారతాదిగ్రంథములు రచించితిఁగాని"

శ్లో. అసంపన్న మివాభాతి బ్రహ్మవర్చస్య సత్తమః,
కిం వా భాగవతాధర్మా న ప్రాయేన నిరూపితాః,
ప్రియాః పరమహంసానాం త ఏవ హ్యచ్యుతప్రియాః
తస్యైవం ఖిల మాత్మానం మన్యమానస్యఖిద్యతః.

పరమహంసప్రియంబులు నచ్యుతప్రియంబులు నగు భాగవతధర్మంబులు విపులీకరింప నైతినిగదా? యని విచారించుచున్న సమయంబున నారదమహర్షి యటకుం జనుదెంచి నీదు మనోరథం బెఱింగితి. ఆధ్యాత్మికాదితాపత్రయ మ్మడఁగింపఁజాలి శ్రీమహావిష్ణుమూర్తివిలసితంబగు భాగవతపురాణంబు రచియించి కృతార్థుఁడవగుమని బోధించిన నతఁడు భక్తిరసప్రధానభగవత్కథాకలికల్మషాపహంబు నైహికాముష్మికశ్రేయఃప్రదంబు నగునమ్మహాపురాణము రచించి జన్మంబు సార్థకంబుగావించుకొనియె. అది గీర్వాణభాషం బ్రతిపాదింపంబడుటం జేసి తద్భాషాప్రవీణులకుఁదక్కఁ దక్కినవారికి సుబోధంబుగామి ముముక్షువులగు నాంధ్రమహాజనులకెల్ల నందుబాటులో నుండునట్లు బమ్మెరపోతనామాత్యుండు మృదుమధురంబుగా నద్దాని నాంధ్రీకరించె.

అది యాంధ్రమహాగ్రంథములలో నగ్రస్థాన మలంకరించుచున్నదన్న నతిశయోక్తి కాఁజాలదు.

## పోతన విషయము.

*బమ్మెరపోతరాజు నిజామురాష్ట్రములో నోరుగల్లు (వరంగల్లు) అను నేక

* పోతనామాత్యుఁడు కడపమండలములోనున్న యొంటిమిట్ట యను గ్రామంబున నుండిన వాఁడని చెప్పుచు నందుల కేదియో (ఎన్నియో) కల్పనలు చేసియున్నారు. పోతన తన గ్రంథములో నేకశిలానగరమని వ్రాసికొనెంగాని యొంటిమిట్ట యని వ్రాసికొనలేదు. ఏకశిలానగర మెప్పటికి నొంటిమిట్టకాదు. శిల యన ఱాయిగాని మెట్టగాదు. ఏకశిలానగరము ప్రతాపరుద్రదేవుని ప్రధాన పట్టణమగు నోరుగల్లేగాని మఱియొకటికాదు. అతఁ డొకచో మోదరాగంబున నభ్రంగమశుభ్రసముత్తుంగభంగయగు గంగకుం జనియె నని వ్రాయఁబడియున్నది. ఒంటిమిట్టసమీపమున నట్టి గంగానది లేదు. పోతనచెప్పిన గంగానది గోదావరియె. గోదావరికి గంగ యని నామాంతరము గౌతమీమాహాత్మ్యమున వ్రాయంబడియున్నది. ఇదిగాక నైజామురాష్ట్రవాసులందఱును గోదావరిని గంగ యనియే వాడుదురు. పుణ్యదివసములయం దాయాప్రాంతములనుండి జను లాగోదావరిగంగకుం బోవునాచార మిప్పటికిని గలదు.

శిలానగరమునకు సమీపమందుండు నొకచిన్న గ్రామమున నుండినవాఁడు. నియోగి బ్రాహ్మణుఁడు, కౌండిన్యగోత్రుఁడు, ఆపస్తంబసూత్రుఁడు. కేతనమంత్రికి లక్కమాంబకుం బుత్రుఁడు. అన్న తిప్పన, కొడుకు మల్లన. పరమభక్తుం డగునాతం డొక్కరాకానిశాకాలంబున సోమోపరాగంబు రాకం దెలిసి తన గ్రామమున కుత్తరముగాఁ గొన్ని మైళ్ళదూరములోనున్న గోదావరినదికిం జని జలంబాడి తత్పులినతలంబున నాసీనుండై శ్రీరామమంత్రానుష్ఠానంబు గావించుచుండునంత శ్రీరామచంద్రుండు ప్రత్యక్షుండై మదంకితంబుగా భాగవతం బాంధ్రీకరింపుమని యానతిచ్చి తిరోహితుండయ్యెననియు, దానం జేసి సహజపాండిత్యము గలవాఁడయి యతఁడు భాగవతంబు శ్రీరామాంకితంబుగా రచించెననియుం జెప్పుదురు.

పోతన "పరమేశ్వరకరుణాకలితకవితావిచిత్రసహజపాండిత్య" అని గద్యములో వ్రాసికొనినను, వానికవిత్వమందలి వ్యాకరణాదిసందర్భములంబట్టియు వ్యాఖ్యానములలోఁగూడ నన్వయింపనివిశేషార్థములు తాను గ్రహించి వివరించుటం జేసియు, అతఁడు గురుకులక్లిష్టుఁడై యిష్టదేవతానుగ్రహంబున ననవద్యవిద్యావైశద్యంబున విరాజిల్లె ననియే మనమూహించుట సమంజసము. మఱియు నతనింగూర్చి యనేకాద్భుతకథలు మనవారు చెప్పుచుందురు. అవి యెట్టివియైన నతఁడుమాత్రము పరమభక్తుండనియు, రసవత్కవియనియుఁ జెప్పక తప్పదు.

అమ్మహాకవి శ్రీమద్భాగవతము పదిరెండుస్కంధములను రచించి దాని నొకపెట్టెలోఁ బెట్టి ప్రకటింప కుంచెననియు ననంతరకాలమున నందు గొంతగొంతభాగము శిథిలీభూతంబగుటం జేసి వెలిగందుల నారయాదు లాయాభాగములు పూరించిరనియుఁ దెలియవచ్చుచున్నది. ప్రతిస్కంధమందును బోతనపద్యముల నారయాదులపద్యము లక్కడక్కడఁ బడియున్నవనియే నాయభిప్రాయము. దశమస్కంధములోఁగూడఁ బెక్కులు పద్యములు నారయసింగనాదుల వున్నవని మన మూహించుట తప్పు కానేరదు.

అట్టి నారయాదులపద్యములందే దోషములు చూపట్టుచున్నవిగాని మహాకవియగు పోతనపద్యములలో లక్షణాదిదోషములు చూపట్టవు సర్వలక్షణసారసంగ్రహమందు గూచిమంచి తిమ్మకవి

సీ. ఘనుఁడు పోతనమంత్రి......గంగఁ

తే. రాజు మొదలగుకవివరుల్ ॥ తేజ మెసఁగఁ
జెప్పి రాగ్రంథములయందె ॥ తప్పు లోదవెఁ
గాని పోతకవీంద్రుని ॥ కవితయందు
లక్షణం బెందుఁ దప్పునా ॥ దక్షహరణ.

అని చెప్పినపద్యము నారచనమును సమర్థించుచున్నది. పోతనపద్యములలో నెటనే నట్టిదోషము చూపట్టిన నది సంస్కర్తదోషమే యని త్రికరణశుద్ధిగాఁ జెప్పఁగలను.

## తాండవకృష్ణభాగవతము.

అట్టి పోతనామాత్యునిభాగవత మద్వితీయమై యించుమించుగ నైదు వందలసంవత్సరములనుండి మనయాంధ్రసోదరులహస్తము లలంకరించి పూజింపఁ బడుచున్నది. పోతనభాగవతము ఖ్యాతిం గాంచుచుండ దానికై వేఱొకభాగవతము నెట్టి మహాకవివ్రాసినను ఖ్యాతిం గాంచు టరిదియే. కాని, సింగన, గంగన, యెఱ్ఱన, మల్లనాదులకవిత్వ మాకవిత్వములోఁ గలిసి వలసినట్లు నీరసముం దోపించుచుండుటంజేసియు, మూలానుసారముగా నొక్కచక్కనిభాగవతము మృదుమధురశైలితో నెవరేనొక్కమహాకవి సర్వసుబోధకముగా రచించు టొప్పునని నే నెన్నియోనాళ్ళనుండి తలంచుచుండువాఁడ.

ఇంతలో రామాయణాదిమహాకావ్యములు రచించి ఆంధ్రవాల్మీకిఖ్యాతి బిరుదవిభ్రాజమానులగు కావ్యస్మృతితీర్థ జనమంచి శేషాద్రిశర్మగారు భాగవతమాంధ్రీకరింపఁబూనినట్లు వినియుంటి. వినిన కొంతకాలమునకే దశమస్కంధము మొదట రచించి ముద్రించుటయును దానికిఁ గృతిసమర్పణమహోత్సవము జరుగుటయును, ఆయుత్సవమునకు నేను గడపపురంబునకుఁ బోవుటయును దటస్థించినది. ఆసందర్భమునఁ దిరుపతిపురవాస్తవ్యులును నాకు మిత్రులు నగు బ్రహ్మశ్రీ పాతాళభేది సుబ్రహ్మణ్యశాస్త్రిగారు మూలముతో సరిచేయుచు నీగ్రంథమును బోతనగ్రంథమును గొంతకొంత పఠించి సభ్యుల నానందవార్ధి నోలలాడించిరి. కాని యందు నాపేరు పఠికించుట తులసీవనములో గంజాయిమొక్కనాటిన ట్లయి నాకానందము కలిగింపలేదు

లేదని నేను శర్మగారినిఁ జెందనాడియు శ్రీగుండూరావు ప్రభృతులచేతను లంజేసి యెట్టెట్టులో సమాధానపడితిని. అప్పటికి దీనికిఁ బీఠిక వ్రాసి ముద్రింపఁబడకుండుటచే నేను దీని కవతారిక వ్రాసియిత్తునని చెప్ప నంతలో శర్మగారానందభరితాంతరంగులై నాకుఁ బుస్తక మిచ్చి పదిపదునైదుదినములలో సుపోద్ఘాతము వ్రాసిపంపుఁడని కోరిరి. నేను నాయసమర్థతను వితర్కించుకొనక మీసెలవుప్రకార మట్లె వ్రాసిపంపుదునని బాసయిచ్చితిని. కాని కడపనుండి వచ్చినది మొదలుకొని కూర్చుండుటకును లేచుటకును శక్తిలేనట్టు వ్యాధి నన్ను బాధించునదైనది. దానంజేసి వాగ్దానప్రకారము వ్రాయఁజాలనైతిని. ఇప్పటికి నట్టిస్థితియందేయున్నను గవిగారు నన్ను వేగిరించుటంజేసి యెంతో వ్రాయనెంచిన నాసంకల్పమునకు వికల్పముగావించుకొని యొక్కింతగానే వ్రాయఁబూనితి. ఇందలి నాయసమర్థతకుఁ బండితులు నన్ను మన్నింతురుగాక.

# శేషాద్రిశర్మగారిచరిత్రము

శ్రీ శేషాద్రిశర్మగారు బ్రహ్మాండాద్యనేకమహాగ్రంథము లొనరించినవారు. వారి నెఱుఁగనియాంధ్రుఁ డుండఁడని నేనెఱుఁగుదు. అయినను బీఠికలు వ్రాయు నప్పు డించుక కవి నెఱింగించుట యాచారముగానం జెప్పుచున్నాఁడ.

శర్మగారు నెల్లూరుమండలంబునఁ బినాకినీతీరంబునఁ బురాణప్రసిద్ధమైన కలువాయ యనుపురంబున జనించినవారు. తెలగాణ్యపు(తెలుఁగునాఁటి)వైదిక బ్రాహ్మణులు. వారిపూర్వు లెల్లజనులకు మంచివారుగా నుండుటచే జనమంచివారని పేరుపొందియున్నవారు. వేదశాస్త్రశ్రౌతము లెఱింగినవారు. కాశ్యపగోత్రులు. తండ్రి సుబ్రహ్మణ్యము. తల్లి కామాక్షీదేవి. శర్మగా రాఱవయేట నుపనీతులై విద్యాభ్యాసమునకై కడపపురంబునకువచ్చి పదునొకండవయేటఁ గావ్యములు చదువుచుఁ గొందఱు బైరాగులు దోడుపాటుచూపఁగా వారింగూడి కాలినడకతో నాలుగుసంవత్సరములకుఁ గాశీపురిం జేరి యటఁ గొన్నిసంవత్సరములు విద్యాభ్యాసమొనర్చి పిదప విజయనగరమందును, కసిమికోటయందును శ్రుతినేత్రము (జ్యోతిషము) యోగసాంఖ్యాదివేదాంతవిషయములును గ్రహించి స్వపురంబునకు వచ్చి పెండ్లిచేసికొని యొరుల నాశ్రయించి ధనార్జనముచేసి సంసృతిసాఁగింప నిచ్ఛలేనివారై కడపపురంబు నందలి యాంగ్లపాఠశాలం దెనుఁగుపండితులై కాలక్షేపముచేయుచు స్కాందపురాణాంతర్గతంబైన మధురచరిత్రముం దెలుపుహాలాస్యమాహాత్మ్యమును, బిమ్మట లలితోపాఖ్యానంబును, బ్రహ్మాండపురాణంబును, శ్రీమద్రామాయణంబును, శ్రీకృష్ణావతారతత్త్వంబును, బ్రహ్మపురాణంబును, సర్వమంగళాపరిణయంబును, విహంగవిజయంబును, విచిత్రపాదుకాపట్టాభిషేక, పాండవాజ్ఞాతవాస, రామవనవాసంబు లనునాటకంబులును, స్వప్నయాత్ర, నీతిసింధువు, నీతిరత్నాకరము లోనగువచనప్రబంధములును క్రమముగా వ్రాసి తాండవకృష్ణుఁడను తమమొదటిపేరుతో శ్రీమద్భాగవతమునంతయు నాంధ్రీకరింప నెంచి మునుమున్న యీయాదశమస్కంధము 610 రాయల్ పుటలుగలిగి 5200 వేల పద్యములతో విరాజిల్లునట్లు మహాగ్రంథముగ రచించినారు.

శర్మగారు శ్రీవిద్యోపాసకులు. వారికిని నాకును నావిషయమున నొక్కింత సతీర్థ్యత్వము కలదు. ఇది మాకుఁ గలసంబంధము. మాకు సమక్షమునఁ దాత మనుమలవరుసలు చెల్లుచుండును. పరోక్షమున మాకుఁగల యనుబంధ మపారమై యుండుననుట సత్యదూరముకాదు. ఆధునికకవులలో బహుగ్రంథములు నిర్మించిన యుత్తమకవులలో వీరగ్రస్థానము నలంకరింతురని చెప్పుటకు సంశయింప నక్కఱ లేదు. సనాతనధర్మతత్పరులగు శర్మగారు స్నానసంధ్యాద్యనుష్ఠానము లొనర్చు టెప్పుడో నియమాతిక్రమణముగాకుండఁ బ్రత్యహమును బాఠశాలకుం బోయి వచ్చుట యెప్పుడో యిన్నిగ్రంథములు వ్రాయుట కవకాశము గలిగించుకొనుట

యెప్పుడో యని విచారించినవారికి వీరిగ్రంథరచన విస్మయముతోఁపింపకమానదు. కావుననే వీరు పరదేవతోపాసనాసక్తచిత్తులు తత్కరుణాకటాక్షపాత్రులు నని సర్వమంగళాపరిణయపీఠికలో బ్రహ్మశ్రీ నాగపూడి కుప్పుస్వామయ్యగారు వ్రాసిన వాక్యము సమర్థించుచు వారియభిప్రాయముతో నే నేకీభవించుచున్నాను. వీరికిప్పటికి సుమా రేఁబదినాలుగుసంవత్సరముల వయస్సుండినను ముప్పదిసంవత్సరములవయస్సుగలవానివలె సద్యశ్శ్నతగ్రంథకల్పను లగుదురని చెప్పుటతిశయోక్తి కాదు. తొల్లి పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవికిఁ జేదోడువాఁదోడై సరస్వతియే వచ్చి గ్రంథములు వ్రాసెనని వినుచున్నారము. అట్లే వీరికిని పరదేవత సాహాయ్యము చేయుచున్నదేమో యనుతలంపు కలుగుచున్నది.

మఱియు నిక్కవిచంద్రు లింక నెన్నిమహాగ్రంథములు రచించి యెన్నికృతిసమర్పణోత్సవములు సలిపి మముబోంట్ల నట కాహ్వానించి యెంతశ్రమపెట్టనున్నారో తెలియదుగాని, మాకుఁ గడపపురంబునకు "సీజనుటిక్కట్టు" పుచ్చుకొనుటయే మంచిదని తోఁచుచున్నది. వీరిగ్రంథరచనాపాటవముంజూడ నేనింతవాఁడ నంతవాఁడ ననుగరువంబుగల వరులకుఁగాదు కాదు నాకుఁ గన్నుకుట్టినట్లుగానే యుండును. కాని నిజముచెప్పవలసివచ్చినప్పుడు ఇన్నేసివేలపద్యములుగల యిన్ని మహాగ్రంథములు వ్రాయుట సామాన్యకవికి సులభసాధ్యముకాదు గావున వీరిని శేషావతారమనియే చెప్పవచ్చును. శేషుఁ డొరులకు హానిచేయునేమో యని సంశయంపడ నక్కఱలేదు వీరు శేషాద్రులై కవీశ్వరుల శీర్షంబునం బెట్టుకొని భక్తాభీష్టప్రదులగుచు సర్వజనస్తోత్రపాత్రులగుచున్నారనుట స్వభావోక్తియే.

## ఆంధ్రీకరణకారణము.

వీరు భాగవతోత్తములు గావున భగవద్భక్తిని బ్రతిపాదించు నీభాగవతమును వ్యాసభగవానులు బహుగ్రంథములు రచించినపిమ్మట రచించినట్లు రచించుటకుఁ దొరంగిరిగాని, పోతనామాత్యునికన్న మిన్నగా రచించి లోకంబును మెప్పింపఁగల మనుగరువంబునం గాదని వీరిపీఠికలోని:—

ఉ. బమ్మెరపోతనార్యుఁ డొగిఁ భాగవతమ్మును దెన్గొనర్చె; మో
దమ్మలరార దానిఁ గవితల్లజు లెల్లరు సంతసంబు శీ
ర్షమ్ముల దాల్తు; రట్టి కృతిసత్తమముం దెనిగించు టేల గ
ర్వమ్మునఁ గాక యంచుఁ దెగిపల్కకుఁడీ బుధులార! మ్రొక్కెదన్.

ఉ. రాముచరిత్రమెల్లఁ గవిరాజులు మెచ్చఁగఁ దెన్గొనర్చె శ్రీ
ధాముఁడు ముక్తినాథుఁడు విధాతృముఖామరపూజితుండు నా
తామరసాక్షుదివ్యచరితంబును వ్రాసితి; వాంఛితం బిదే;
నామదిఁ గల్గె నంచుఁ గవినాయకు లెల్లరు నమ్మఁగాఁదగున్.

చ. పలువురు పండితో _త్తములు ॥ భాగవతార్థము లిట్టు లంచు ని
స్తుల మగుపాండితీమహిమ ॥ తోఁపఁగ వ్యాఖ్య లొనర్చి రం దొగిం
దెలిపినయర్థభేదములు ॥ తెస్గునఁ దేటపడంగఁ గూర్పఁగాఁ
దలఁచితి నిందుఁ గన్పడెడు॥తప్పుల దిద్ది కృతార్థుఁజేయుఁడీ.

ఈపద్యములవలనఁ దెలియుచునే యున్నది. ఇందలికడపటిపద్యమునఁ దెల్పినట్లు భాగవతార్థప్రభావము లిట్టివని పండితులు వ్రాసినవ్యాఖ్యానార్థభేదములను దెనుఁగువారికిఁ దేటతెల్లంబుగావించుటకే వీరిసంకల్పమని తెలియుచున్నది. ఇంతియకాని .పోతనకవీంద్రునితోఁ బోటీచేయుటకని పొరపాటునకైన నేవాచాలుఁడును బలుక సాహసింపఁడని నానమ్మకము.

మఱియు ననేకస్థలములయందుఁ బోతనాదులు మూలము నతిక్రమించిరని మన మెఱుంగుదుము. యథామూలార్థ మెఱింగించుటయు నిక్కవియాశయమే. ఇట్లు చెప్పుటచేతఁ గవితయందే బండారము నుండఁబోదని పాఠకమహాశయు లూహింపరాదు. వీరికవితాకన్య పోతనపైఁ బోటీచేయలేదేమోకాని, నారయాదులపైఁ బోటీచేసి మేటి యనిపించుకొనక మానదని ముమ్మాటికిం జెప్పుచున్నాను. బమ్మెరపోతనామాత్యుఁడు.

ఉ. బాలరసాలసాలనవ॥పల్లవకోమలకావ్యకన్యకం
గూళల కిచ్చి యప్పడుపు॥కూడుభుజించుటకంటె సత్కవుల్
హాలికు లైననేమి గహ॥నాంతరసీమలఁ గందమూలకౌ
ద్దాలికు లైననేమి నిజ॥దారసుతోదరపోషణార్థమై.

అని చెప్పుకొన్న వాఁడయినను భోగినీదండకమును (ఇది యొకవేశ్యం గూర్చి వ్రాయఁబడియున్న యసత్కావ్య మనంబడు గ్రంథము) సర్వజ్ఞసింగమహీపాలునకుఁ గృతియిచ్చినట్లును విందుముగాని మనశేషాద్రిశర్మగారు తాము వ్రాసినయేచిన్నగ్రంథమైన ధనాశంజేసి నరులకుఁ గృతియిచ్చినట్లు వినము. పరమేశ్వరభక్తి తత్పరుండగుశర్మగారీదశమస్కంధము:—

క. ఓంకారరూపునకు నిర,హంకారజనాంతికస్థితాత్మునకుం గృ
ష్ణాంకితవరనామునకుఁ, సంకటహారునకును సుప్రసన్నాస్యునకున్.

అని శ్రీకృష్ణాంకితముగావించి ధన్యులై తనజన్మము సార్థకముచేసికొనిరని చెప్పనొప్పు. వీరికిఁ గృష్ణుఁ డనిన, రాముఁ డనిన, విష్ణు వనిన, శివుఁ డనిన, శక్తి యనిన నొక్కటియేకాని భేదాభిప్రాయము లేదని వారియాశ్వాసాంతపద్యముల వలనను, నితరగ్రంథములవలనను దెలియవచ్చుచున్నది.

## గ్రంథశైలి

ఇఁక శైలింగూర్చి యించుక ప్రశంసించెద. శర్మగారికవిత్వము నాతికఠిన మృదుమధురమై శబ్దాలంకారశోభాయమానమై పండితపామరజనహృదయంగమంబై చదువరుల కానంద మాపాదించుచుండును. పదలాలిత్యంబును, ధారాశుద్ధియు, శయ్యాపాకవృత్త్యాదులును సముచితంబులు. ఓజఃప్రసాదమాధుర్యాది కావ్యగుణంబు లిందు మెండుగాఁ గానంబడుచుండు. వీరికవిత్వము ద్రాక్షాపాకము గాక నారికేళపాకముగాక రెండింటికి మధ్యమమనందగు కదళీపాక మనందగు. వీరికవిత్వమం దొకవంతు తెనుఁగుపదములును రెండువంతులు సంస్కృతపదములు నుండును. వీరు శృంగారాదిరసములకన్న భక్తిరసము చక్కఁగాఁ బ్రదర్శించి యున్నవారు. ఈదశమస్కంధమునందు శృంగారవీరాదిరసము లక్కడక్కడ మనోజ్ఞములుగ వర్ణింపఁబడియున్నవి.

### శృంగారరసము

చ. కలువలవాసనల్ మిగుల । గందపుఁబూఁతల చెల్వమింపు దో
ర్జలజముఁ గృష్ణుఁ డొక్క వ్రజ । సారసనేత్ర భుజంబుఁ జేర్పఁగా
నెలమిని మూరుకొంచుఁ దగ । నింతి శరీరము హృష్టరోమమై
వెలయఁగ ముద్దుపెట్టుకొనె । వెన్నుఁడు దన్ను బహూకరింపఁగన్.

### వీరరసము

చ. హరియును దోర్యుగంబున మ । హాసురు నాతని బట్టి పట్టె వే
ధరణిఁబడంగఁ ద్రోచి సుర । తల్లజు లభ్రమునుండి, చూడ నా
శరుని వధించె నెప్పగిదిఁ । జంపుదురో పశుపుర్జనంబు ల
క్కరణిని యంతద్వారమును । గప్పినదానిని జిమ్మి బాలురన్.

### కరుణరసము

ఉ. ఒక్కముహూర్తమాత్రమున । నుగ్రతరంబుగఁ జుట్టుముట్ట నిం
కెక్కడిజీవితం బనుచు । నెంచుచు గోధనగోపకార్భకుల్
దిక్కఱి భీతిఁజెంది బల । దేవయుతుం డగుకృష్ణుఁ జేరి నీ
వొక్కఁడవే మహార్తి గను చున్నమముం దయఁ గావఁజాలుదో. ౧.౭౮౧ ద.

### అద్భుతరసము

సీ. కనులు విప్పఁగలేని । కసుగందుగా నున్నయప్పుడే గుణబలం । బొప్ప మించు
నట్టి పూతన యంక । మందుండి చనుఁబాలు ప్రాణాళితో । శరీరంబు వయసుఁ
గాలుండు హరియించు । కరణిఁ బీల్చెనుగదా మూఁడుమాసంబుల । యీడునాఁడు
శకటంబుక్రిందను । శయనించి తానుండ పయిఁబడవచ్చిన । బండి నక్కె

తే. యేడ్చుచుం గాలఁదన్నంగ నిద్ధపాద
హాతికి నాబండి తలక్రిందు లగుచు గ్రిందఁ
బడుచుఁ గూలెను వత్సరప్రాయ మలరు
తఱిని గ్రిందను గూర్చుండ దనుజుఁ డొకఁడు.

## హాస్యరసము

శా. నీపత్త్మారుహ మిద్ది పూజ్యతమమై నిత్యంబు వైమానిక
స్త్రీ పూజ్యంబయి యొప్పు మీర లబలల్ చిత్తంబునం దించుకే
వ్యాపారాంతరముల్ తలంపక మహాభక్త్యుద్ధతిన్ వచ్చి మీ
మీపుట్టంబులు చేకొనుం డభిరుచిన్ మేలొందు మీ కెంతయున్.

## భయానకరసము

సీ. స్తనయిత్నుసంతతి దారుణధృతిమీఱ విద్యుత్ప్రతాననివితతి మెఱయఁ
దీవ్రమారుతవితతి ప్రేరితంబులై జలదంబు లొక్కట సలిలశర్క
రావళిఁ గురియంగ నామందఁ బీడించె స్తంభంబులనుబోలు సతతవర్ష
ధారలు గురియంగ ధాత్రియంతయు జలమయముగాఁ గన్పడెమఱియునతము
తే. సున్నతంబును గనరాకయుండె నొక్క,విధముగా వృష్టిధారలువెలయుచుంట
మిక్కుటంబుగ వాతంబుమించుచుంట,పశువు లెల్లను వడవడవడఁకఁదొడఁగె.

## భీభత్సరసము

చ. కనుఁగొని తేజమెల్లను వికావికలై చన నాతురంబుపై
కొనఁ బ్రమదంబు వీడి చనఁ గోరికయంతయు వమ్ముగాఁగ నా
నన మొగి నెండిపోవఁగ మనంబునఁ గుందుచు నున్నవైద్యునిం
తని వచియింపరాని బహుళార్తిని బ్రుంగినవానిఁ జూచుచున్.

## రౌద్రరసము

ఉ. వంచకమధ్యసంస్థనిజభాగముఁ గైకొనిపోవుసింగమ
ట్లెంచక రాజలోకము నహీనపరాక్రమ ముల్లసిల్లఁగాఁ
గాంచనచేలుఁ డాబలముఖప్రకటాహవశూరులెల్లఁ బొ
మ్మంచొగిఁ బ్రోత్సహింపఁగ నృపాత్మజుఁ గైకొనిపోయె మెల్లనన్.

## భక్తిరసము

సీ. హైరణ్యగర్భాదు లగుయోగులాధ్యాత్మికాధిభూతములకు నాధిదైవ
తమునకు సాక్షివై తగవానికెల్ల నంతర్యామివై నియంతవు నగు నినుఁ
గొలుతురు! కర్మయోగులు కొందఱింద్రాది బహుదేవతాస్వరూపమున నలరు
నిన్నె త్రయీవిద్యనియతిమైఁ బెక్కుయజ్ఞముల నారాధింత్రు సర్వరూపుఁ

* *

తే. డవుగ వెలయుదుగానఁ గరడంగి జ్ఞాను, లైనకొందఱు బహురూపమైన కర్మ
వితతి నీయందె యర్పించిరవిమలమైన, యుపశమముఁ గొని సత్త్వమూర్తిధరిణితిని.

## ర స ని రూ ప ణ ము

మఱియు నిం దుపమానోత్ప్రేక్షాద్యలంకారములు నిండియున్నవి. గ్రంథ విస్తరభయంబున వాని నుదాహరింప మాని రుక్మిణీకళ్యాణములోని కొన్నిపద్యములు చూపుచున్నాను. చిత్తగింపుఁడు.

చ. గలగల మ్రోగు నందియలకాంతుల నగ్రతలంబు గ్రమ్ముచుఁ
వెలికిని బాఱుచుండ నొకవింతగఁ బాదము లుర్విమోపుచుఁ
లలితమరాళరాజగతులన్ మఱపించుగతుల్ చెలంగ నా
లలనయు శ్యామనాఁదగి విలాసము మూర్తిధరించినట్లుగన్.

చ. కనఁబడి దేవమాయ యొకొ కానియొడన్ ధర నిట్టి రూప మె
వ్వనె యని గుంపుగూడి యశేషముల్ దిశలం దగువీరులెల్ల మో
హినియె యటన్న యూహ తము నెంతయు నేచఁగ జూచి చూచి స
మ్మనముల మోహమంది రభిమానము వీడి తదేకనిష్ఠులై.

మ. కులదైవంబును బ్రాక్తనాచరణభంగుల్ పూన్కిఁ బాటించు నా
చలముం బన్ని స్వకీయశోభలను గృష్ణస్వామి కర్పించుచున్
గలహంసైకగతుల్ చెలంగఁ జను నాకంజాక్షి వీక్షించి రం
జిలుతత్తాపముచేఁ ద్రపామిళితమై చెల్వారు వాలుంఛ్ఛపులన్.

మ. తమచిత్తంబులధైర్యము న్వదలి వింతం బూనియుండంగ భూ
రమణుల్ కేల ధరించియున్న గురుశస్త్రప్రాతముల్ జాఱి పె
గ మహిం బర్వఁగ దంతిఘోటకశతాంగశ్రేణిపై నుండి మో
హము ముంపన్ ధరణీస్థలిం బడిరి యంత్రాలి న్వడంబించుచున్.

మ. తరుణీరత్నము పద్మకోశనిభపాదద్వంద్వమున్ మెల్లనన్
ధరణిన్ సోఁకఁగఁ జేయుచున్ మనమునం దైత్యారి రాకన్ నిరం
తరమున్ గోరుచుఁ జూర్ణకుంతలవితానం బాస్యపద్మంబుపైఁ
బరఁగన్ డాపలిచేతిగోళ్ళ తుదలం బల్మారు పోఁద్రోయుచున్.

(తాండవకృష్ణభాగవతము.)

మ అలినీలాలకఁ బూర్ణచంద్రముఖి నేణాక్షిం బ్రవాళాధరిం
గలకంఠిన్ నవపల్లవాంఘ్రియుగళిం గంధేభకుంభస్తనిన్
బులినశ్రోణి నిభేంద్రయాన నరుణాంభోజాతహస్తన్ మహో
త్పలగంధిన్ మృగరాజమధ్యఁ గని విభ్రాంతాత్ములై రందఱున్.

వ. మఱియు నయ్యింతి దరహాసలజ్జావలోకనంబులం జిత్తంబు లేమఱి, ధైర్యంబు దిగనాడి, గాంభీర్యంబులు విడిచి, గౌరవంబులు మఱచి, చేష్టలు మాని, యెఱుకలుడిగి, యాయుధంబులు వైచి, గజతురగరథారోహణంబులు సేయనేఱక రాజులెల్ల నేలకువ్రాలి రాయేణలోచన తననామకరనఖంబుల నలకలు దలంగఁద్రోయుచు నుత్తరీయంబు చక్కనొత్తుచుఁ గడకంటిచూపులం గ్రమంబున రాజలోకంబు నాలోకించుచు. (పోతనభాగవతము)

ఇట్లు స్వభావోక్తులతోఁ దాండవకృష్ణభాగవతము విరాజిల్లుచున్నది. ఇంక మూలానుసరణములంగూర్చి

శ్లో. ఏకాయనోసౌ ద్విఫలస్త్రిమూలశ్చతూరసః పంచశిఖః షడాత్మా,
సప్తత్వగష్టవిటపో నవాక్షో దశచ్ఛదో ద్విఖగో హ్యాదివృక్షః. అ. ౨ శ్లో. ౨౮

దీనికి వివరణముగ నున్న భాగముఁ గనుఁడు శ్రీశర్మగారిరచనము—

సీ. ఈప్రపంచమె యాదిఁవృక్షమై యొప్పారువ్యష్టిసమష్టిదేహమగు నద్ది
ప్రకృతియే దానికిఁ । బాదగుసుఖదుఃఖములను పండ్లవి రెండుఁగలిగియుండు
సత్వరజస్తమఃసంజ్ఞికగుణములు మూఁడును దానికి । మూలములగు
ధర్మార్థకామముల్ । తగుమోక్ష మన నాల్గురసములౌ భూరుహఁరాజమునకు
తే. నింద్రియము లైదు శబ్దాదు । లెఱుఁగఁజాలు
విధము లగుతుత్తు దప్పియు । విపులశోక
మోహజరలును మృతి యనఁ । బొలుచు నాఱు
నూర్మ్మ లనెడుస్వభావంబు । లొప్పు మఱియు. ౨౬

సీ. త్వఙ్మాంసరుధిరమేఁదస్సులు మజ్జయు నస్థులు శుక్లంబు । ననెడు నేడు
ధాతువుల్ పైపొరల్ । భూతపంచకమనోబుద్ధ్యహంకారముల్ । పోల నెనిమి
దియు విటములు మఱిఁయు నవరంధ్రముల్ నవకోటరములు ప్రాఁణము నపాన
మును వ్యానముసమానఁమును దానమునుగృకరమునాగదేవదఁత్తములుకూర్మ
తే. మును ధనంజయమును నాఁగఁ । జనునివి పది
పత్రములు జీవుఁ డీశుండు । పక్షులగును
నీప్రపంచాఖ్యభూరి మఁహీరుహమున
కిట్టిదానికిఁ నీశుండ । వీవెకావె. ౨౭

గోపికావస్త్రాపహరణఘట్టము.

అత్రాగత్యాబలాః కామం స్వస్వం వాసః ప్రగృహ్యతాం,
సత్యం బ్రవాణినోనర్మ యద్యూయం వ్రతకర్శితాః. ౧౧

న మయోదితపూర్వంవా హ్యనృతం తదిమే విదుః,
ఏకైకశః ప్రతీచ్ఛథ్వం సహవా తనుమధ్యమాః. ౧౨

తస్య తత్క్ష్వేళితం దృష్ట్వా గోప్యః ప్రేమపరిప్లుతాః,
వ్రీడితాః ప్రేక్ష్య చాన్యోన్యం జాతహాసా న నిష్క్రముః. ౧౩

చ. అనృతము నే వచింప నని ♩ యందఱు వీరు లెఱుంగుడీ నిజం
గొనుఁడు సుమధ్యలార! యివి ♩ గోపసనంబు లొక్కొక్కరే జలం
బున నలుదెంచి కైకొనఁగఁ ♩ బోలును గుంపుగఁ గూడి యెందుఁ జే
కొనఁదగు దీన నెద్ది మదిఁ ♩ గోరుదురో యటు చేయఁగాఁ దగున్. 1363 ౧౧

చ. అని యిటు లాపరాత్పరుఁడు ♩ హర్షమునన్ బరిహాసవాక్యముల్
వనితలు చక్కఁగా వినఁగఁ ♩ బల్కిన గోపిక లట్లు ప్రేమ వా
హినిని మునింగి యొండొరుల ♩ నెంతయుఁ గాంచుచు లజ్జ సంపునన్
మనములనుండి ప్రీతి యొకమాడ్కిని నవ్వగ వెల్వడం గనన్. 1364 ౧౨

చ. జలములనుండి వెల్వడఁగఁ జాలకయుం జెసంగుచియుండి ౦౦
జలరుహనాభుఁ డిప్పగిది ♩ సంతస మొప్పఁగ మాటలాడ వా
పలుకులు స్వీయచిత్తములఁ ♩ బల్వడి లాఁగఁగఁ గంపదఘ్న
తలసలిలాంతరాళమునఁ ♩ దద్దయు మేనులు కంప మొందఁగన్. 1365 ౧౪

## శ్య మ ం త కో పా ఖ్యా న ము

క్షీణసత్త్వః స్విన్నగాత్రస్తమాహాతీవ విస్మితః ౨౬.
జానే త్వాం సర్వభూతానాం ప్రాణ ఓజస్సహోబలం,
విష్ణుం పురాణపురుషం ప్రభవిష్ణుమధీశ్వరం. ౨౭ స్కం. భాగ. అ. ౫౬.

............సత్త్వంబు క్షీణింపఁ గాయమెల్ల
స్వేదబిందుయుతంబయి చేష్టలుడుగ, విస్మయం బెంతో గనుచు సర్వభూతునిఁ జూచి.

చ. పలికె మహాత్మ! భూతములకుం గలశక్తికిఁ బ్రాణము నీవె, ప్రాణికిం
త్తులకుఁ బ్రవృత్తిసత్త్వమును ♩ దోరపువేగము ధారణాఖ్యమౌ
బలమును నీవె యం చెఱుఁగుదు వాఁడ సనాతనపూరుషుండవై
చెలఁగి యధీశ్వరుండవయి ♩ జిష్ణుఁడవై తగుదీవె సర్వవిభూ! 459

## సు భ ద్రా క ల్యా ణ ము

సోఽపశ్యత్తత్ర తాం తన్వీం యతిః కన్యాం మనోహరాం,
ప్రీత్యుత్ఫుల్లేక్షణాత్తస్యాం భావక్షుబ్ధం మనో దధే ౬

స్థాపితం చకమే వీక్ష్య నారీణాం హృదయంగమం,
హసంతీ వ్రీడితాపాంగా తన్న్యస్తహృదయేక్షణా. ౭

తాం పరం సమభిధ్యాయ న్నంతరం ప్రేప్సు రర్జునః,
న లేభే శం భ్రమచ్చిత్తః కామేనాతిబలీయసా. ౮

ఉ. వీరవతంసచిత్తముల వేడుక నిట్టటు లూఁగులాడఁగాఁ
జారుతరాంగసంగతిని జాణతనంబునఁ జేయుకన్యకా
కారమహార్ఘ్యరత్నము నొగాదిగఁ గాంచుచు నేత్రకంజముల్
భూరితరంపుఁ బ్రీతిమెయిఁ బొంకముగా వికసిల్ల నల్లనన్. ౫౪ 2037

ఉ. జవ్వనులందు మిన్నయగుత్ర్యాస్థలి నూతనసృష్టియా నిదే
యివ్వనితావతంస మొకఁడే లభియించినఁజాలదే సుఖం
బవ్వల వేఱొకండు గలదంచుఁ దలంపఁగనౌనె యంచు లో
జవ్వనిపై విరాళిఁగొని స్వాంతము నిల్పఁ గలంగుచున్ గడున్. ౬ 2038

ఉ. ముద్దులగుమ్మ యామె ననఁబోడుల మెత్తనిమానసంబులం
దద్దిర! సమ్మదామృతము వారితరంబుగ నిండఁజేయుచున్
ముద్దుఁడువోలె సున్నయల మోసపుసంయమిఁ గుంతిసూను న
ట్లొద్దికఁ గాంచి కన్గొనల నొప్పెడుసిగ్గున సుంత నవ్వుచున్. ౭ 2039

ఉ. ఆనవమోహనాంగుపయి నాత్మహృదతీసరోజయుగ్మమున్
బూనికమీఱ నిల్పి పతిబుద్ధిఁ జెలంగినదయ్యె నిట్టు లా
మానిని మోహనాంగుఁడును మాననికోర్కులనుండి రా పృథా
సూనుఁడు నన్ను మిన్నయయి శోభిలునట్టి సుభద్ర నెంతయున్. ౭౪ 2040

చ. మదినిదలంచుకొంచు నొకమాడ్కి మరల్పఁగ రాక యెప్పుడున్
గదురునితాంతకామమున గాఢతరం బగుతాప మొందుచున్
మదవతిసంగ్రహించి చనుమార్గ మదెయ్యదొ యంచు నెంచుచుం
టఁ దనకు రామముఖ్యులు కడంగి యొనర్చెడు నట్టిపూజలన్. ౮ 2041

## భ్ర మ ర గీ త లు

శ్లో. మధుప! కితవబంధో! మాస్పృశాంఘ్రిం సపత్న్యాః
కుచవిలులితమాలా కుంకుమశ్మశ్రుభిర్నః,
వహతు మధుపతిస్తన్మానినీనాం ప్రసాదం
యదుసదసి విడంబం యస్య దూతస్త్వమీదృక్. ౧౨ శ్లో. 47వఅధ్యాయము.

చ. ఓమధుపా! తలంపఁగితవోత్తమబంధువ వీవు మానప
త్నీమదిరేక్షణాకుచయుతిస్ఫుటపీడితపుష్పహారస
క్తామిత కుంకుమాంకితముఖులై తగుమీసల నస్మదంఘ్రులన్
గోముగ ముట్టకుండు మికఁ గోకుమా నతిపూర్వకంబుగన్. 2642

చ. విను మొకమాట యమ్మధుపవీరుఁడు శ్రీమధురాపురీస్థ మా
నినుల ప్రసాదమే సతము నెమ్మి వహించును గాక మాదయన్
గన ఫలమేమి యాతనికిఁ గల్గును యాదవులున్న యోలగం
బునఁ బరిహాసపాత్రమగుఁ బో హరి నెయ్యము మాట లేటికిన్. ౧౨ 2643

శ్లో. యదనుచరితలీలా కర్ణపీయూషవిప్రు
ట్సకృదదనవిధూతద్వంద్వధర్మావినష్టాః,
సపది గృహకుటుంబం దీనముత్సృజ్య దీనా
బహవ ఇవ విహంగా భిక్షుచర్యాం చరంతి. ౧౮ శ్లో. ౪౭ అధ్యా.

సీ. ఆమహాపూరుషు నమలచరిత్ర లీలామృతకర్ణామృతైకబిందు
మాత్రమే యొకసారి మమతం బ్రావినయంత ద్వంద్వధర్మంబులఁ బాసి లోక
సంసక్తి వదలి యాక్షణమ దీనం బగుగృహకుటుంబము నీడి రిత్తభోగ
ములఁ బాసి హంసపక్షులరీతి భిక్షుచర్య జరపుచుండుదు రనేకులు!
తే. హరిణవధువులు మృగయుని దగు నెలుంగు, మగనికంటె నయంబని మదిని నమ్మి
విశ్వసించి తదంబక వేదనలఁబ, డెడు తెఱంగున గుటిలాత్ము నుడులను విని. ౧౯

## రుక్మిణితో సర్వోక్తులాడుట

శ్లో. రాజపుత్రీప్సితాభూపై ర్లోకపాలవిభూతిభిః,
మహానుభావైః శ్రీమద్భి రూపౌదార్యబలోర్జితైః. ౧౦
తాన్ప్రాప్తానర్థినో హిత్వా చైద్యాదీన్ స్మరదుర్మదాన్,
దత్తా భ్రాత్రా స్వపిత్రా చ కస్మాన్నోవవృషే౽సమాన్. ౧౧

క. ఓరాజపుత్రి! మును నినుఁ, జారుతమం బైన రూపసంపదబలముల్
బౌరుషము దిగధిపాలక, సార్వైశ్వర్యంబు గలుగు జనపతులు తమిని. ౧౫. 685
అ. ౬౦

క. కోరిరిగద? వారలు సు, శ్రీరంజితులాఢ్యులందు శిశుపాలాదుల్
భూరమణేంద్రులుగద? య, వ్వారలు నినుఁ బెండ్లియాడు వాంఛలు వెలయన్.
౧౬. 686 అ. ౬౦

క స్మరమదము పొంగఁగా వ, చ్చిరిగాదే? మఱియు నీడు జ్యేష్ఠ ప్రముఖు
దరుఁ డగు రుక్మియుఁ దండ్రియు, ధరణీశుల కీయ మదిని దలఁచిరి గాదే.
౧౭ 687. అ. ౬౦

చ. సములగు వారిభూమిపతిసత్తముల న్విడనాడి వారితో
సములము గాని మమ్ముఁ దమి సంధిలఁగా వరియించితేలకో?
ప్రమదలయందు మేటివయి భాసిలు సుభ్రు! నిరంతరంబు భూ
రమణులకున్ భయంపడుచు రత్ననిధిన్ శరణంబు చేరఁడమ. ౧౮. 688

మఱియు నీగ్రంథమున ననేకవర్ణనములు మనోహరములు గాను, కొన్ని గీర్వాణభూయిష్ఠములు గాను, కొన్ని యాంధ్రభూయిష్ఠములు గాను బొడకట్టుచున్నవి. శ్రీకృష్ణుని శైశవక్రీడాభివర్ణనములయందును గొన్నియితరఘట్టములయందును దీనికిని బోతనభాగవతమునకును గొంతవ్యత్యాసము కొన్ని కొన్ని చోట్లఁ

గానిపించును. అది శర్మగారిలోపమని యెంచుటకు వలనుపడదు. వీరు మూలము ననుసరించినారు. పోతన మూలము ననుసరింపలేదు.

అ మూ ల క ము

ఆ. అలసితివి గదన్న యాఁకొంటివి గదన్న, మంచియన్న యేడ్పుమాను మన్న
చన్నుగుడుపుమన్న సంతసపడుమన్న, యనుచుఁ జన్ను గుడిపె నర్భకునకు.
(పోతనభాగవతము)

శ్లో. రుదంతం సుతమాదాయ యశోదా గ్రహశంకితా,
కృత్వా స్వస్త్యయనం విప్రైః సూక్తైః స్తనమపాయయత్. అ. ౭ శ్లో. ౧౧

ఉ. అంత యశోద చన్గుడువ నర్భకుఁ డేడ్చు టెఱింగి పుత్త్రు న
త్యంతముదంబునం గొనుచు నాతనికిన్ గ్రహ మేదొ సోఁకె న
చింతను గాంచి బ్రాహ్మణులఁ జెచ్చెఱఁ బిల్వఁగఁ బంచి పీడ యా
వంతయుఁ గల్గకుండునటు లర్భకుఁ గావుఁ డటంచు వేఁడినన్.
(తాండవకృష్ణభాగవతము.)

ఇట్లమూలకములఁ బోతనకృతియందుఁ బెక్కుతావులఁ గనుఁగొననగు.

ఇట్లీదశమస్కంధమంతయు నాంధ్రీకరింపఁబడినది. మఱియు ననేకవిషయము లీగ్రంథమునుండి వ్రాయవలసినవియున్నను నాకుంగలయనారోగ్యముంబట్టియు, శర్మగారు కచ్చులోఁ గంతులువేయించుటంజేసియు, దిఙ్మాత్రసూచకంబుగావించుచు స్థాలీపులీకన్యాయమున నిట్లు సంగ్రహించి విషయము సూచించినాఁడ. మహాకవియగు శేషాద్రిశర్మగారు పరమభాగవతోత్తములు గావున నీదశమస్కంధముతోఁ దృప్తినొందక భాగవతమంతయు నామూలాగ్రముగ మూలానుసరణముగా నాంధ్రీకరించి యాంధ్రసోదరులయాదరణమునకుఁ బాత్రులై లోకాతీతయశోవిశాలు రగుదురు గాకయనియు, వారి కాయురారోగ్యైశ్వర్యములు పరమేశ్వరుఁ డనుగ్రహించుఁగావుతమనియుఁ గోరుచు నిందలినాలోపములు మన్నింపుఁడని పండితప్రకాండులం బ్రార్థించుచు నింతతో విరమించుచున్నాఁడను.

రాజమహేంద్రవరము
25-3-36.

ఇట్లు,
శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.

శ్రీః.

# శ్రీమద్భాగవతాంధ్రీకరణప్రయత్నము



శ్లో. కారుణ్యకర్బురకటాక్షనిరీక్షణేన తారుణ్యసంవలితశైశవవైభవేన,
ఆపుష్ణతా భువనమద్భుతవిభ్రమేణ శ్రీకృష్ణచంద్ర శిశిరీకురు లోచనం మే.

పరమభాగవతోత్తములారా!

చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢం,
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరపి సుదుష్కరం. 34

అనునర్జునుని ప్రశ్నమునకు

అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలం,
అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే. 35
అసంశయాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః,
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తుముపాయతః. 36

అను శ్రీకృష్ణపరమేశ్వరు నుత్తరము గీతోపనిషత్తునందుఁ గనంబడుచున్నది. భగవద్వాక్య మేకాలమునందును వ్యర్థము కాదుకదా. ఈభగవదుక్తి ననుసరించి మానవులసంకల్పములు క్షణక్షణవిలక్షణములనియు మనశ్చాంచల్యమే యందులకుఁ గారణమనియు యోజింపవచ్చును. ఒకప్పుడు మనస్సు నిలుకడగా నుండుటకు వేఱొకతఱి నిలుకడగాంచమికిఁ గారణము ప్రాగ్జన్మకృతకర్మమే కారణమనవలయు. ఏదియుఁ గర్మసిద్ధాంతమునకు లొంగకతప్పదు. ఒకప్పు డాకర్మము మానవున కొక్కవిషయమున మితిమీఱినయుత్సాహమును గల్పించుచు, నాకార్యమే పరమపురుషార్థమని తోఁపఁజేయును. ఇతరు లద్దానిని నిస్సారమని యాక్షేపించినను ఆతఁ డద్దాని వదలక సాగించుచుండు. ఎల్లరు చేయుకార్యములిట్లే యని యెఱుంగవలయు. దీనింబట్టియే లోకమున ననేకవిధాభిప్రాయములు కలుగుటయు, నొకరికార్యము నింకొకరు మెచ్చుకొనక దూషించుచుండుటయు నాచారముగా సాగుచుండును. కర్మసిద్ధాంతతత్త్వ మెద్దియని యాలోచించువారలొకరికార్యముల నాక్షేపింపరని నావిశ్వాసము.

సత్కార్యము లనేకవిధములు. అందొక్కటి యొకనికి నుత్తమముగాఁ దోఁచును. వేఱొకని కది విరుద్ధముగాఁ దోఁచును. ఉత్తమమని యంగీకరించువారు నుందురు. కావుననే మహాత్ములు

***

యే నామ కేచిదిహ నః ప్రథయంత్యవజ్ఞాం
జానంతి తే కిమపి తాన్ప్రతి నైష యత్నః,
ఉత్పత్స్యతే హి మమ కోఽపి సమానధర్మా
కాలో హ్యయం నిరవధిర్విపులా చ పృథ్వీ.

అని వక్కాణించిరి. అనఁగా నితరు లంగీకరింపరని జంకి సత్కావ్యమును మాన రాదనియు శాస్త్రము శిష్టులు నంగీకరించినఁ జాలుననియు నిందలి సారము. నే నీ సిద్ధాంతమునే యాశ్రయించువాఁడనని విన్నవించుచున్నాఁడను.

శ్రీమద్రామాయణము నాంధ్రీకరించినపిదప శ్రీకృష్ణచరిత్రమును వ్రాయఁ దగు నను సంకల్ప ముదయించెను. బ్రహ్మపురాణముఁ దెనిఁగించినఁ జాలదా యని యడుగువా రుందురు. శ్రీమద్భాగవతమునఁ దశమస్కంధమునఁగల శ్రీకృష్ణ చరిత్రమున విశేషవిషయములు గలవని పెద్దలందురు. దానంజేసి దశమ స్కంధము నాంధ్రీకరింపఁబూనితి. అనంతపురమునందు పోతనముఖాదికళా శాలయం దాంధ్రపండితులగు బ్రహ్మశ్రీ ప్రయాగ వేంకటరామశాస్త్రులు గారు మిక్కిలి ప్రోత్సహించిరి. నాశక్తికొలఁది వ్యాఖ్యానముల నన్వయించు కొని వానిసారమును గ్రహించి తెనిఁగించితిని. అనేకార్థములుగా వ్యాఖ్యాతలు వ్రాసినతావులఁ బ్రకృతకథ కేది చక్కగా సంబంధించునని నాకుం దోఁచునో దానినే వ్రాసితిని. నాశక్తి కనురూపముగా మూలమును వదలక వ్రాసితినని నా విశ్వాసము. ఏపద్యమునఁగాని బాగుండిన నది వ్యాసమహర్షిదే యనియుఁ దక్కి-నది నాదే యనియుఁ బెద్దలు గ్రహింతురని వేఁడువాఁడను. భాగవతమును యథా మూలముగాఁ దెనిఁగించి పోతనమహాకవివిఖ్యాతి గణింప నెంచితినని కొంద ఱూహింపవచ్చును. అట్టి యభిప్రాయమే నాకు లేదనియు, నున్న నయ్యది యశక్య మని నేనెఱుంగుదుననియు సాధుమతులు విశ్వసింతురుగాక.

తెనిఁగించుతఱి మూలమున గూఢముగా నున్నయర్థమును విస్తరించి పాఠకులకుఁ దెలుపుట కవిలక్షణము. మక్కికిమక్కి యన్నట్లు, ముక్కస్య ముక్కార్థః అన్నట్లు తెలిఁగింపరాదు. తనకుఁ దెలిసినయంతయర్థమును లోకుల కెఱిఁగింప వలయు. రహస్యములు రహస్యములుగనే యుంచవలయు ననుట మంచిదిగాదు. మూలార్థ మెఱుంగఁజాలనివారలకే యాంధ్రీకరణ ముపయోగించును. కాని యది మూలమునకంటెఁ గఠినముగనున్న లోకుల కెట్లుపయోగించును? మూలమున నున్న కొన్నిపదములు తెనుఁగున వ్రాసిన శ్రుతి కటువుగా నుండును. [illegible]వా, రంభోరువు లోనగునవి. అట్టివిశేష్యములకుఁ బదులు మఱొకపద ముపయోగింప వచ్చు. దాన నా గ్రంథమునకుఁ గొఱంత రాఁబోదు.

ఉ. ఒక్కెడఁ జక్కనౌ పదము నొక్కటి యుంచిన ముచ్చటౌ మఱిం
కొక్కెడ నున్న దానసగ ముంచి రచించిన ముచ్చటౌ మఱిం

కోకొక్కెడ నున్నదాని నటు లుంచి రచించిన ముచ్చటౌనుగా
మక్కికి మక్కి యన్నటులు మార్చిన కావ్యము శ్రావ్య మెట్లగున్.

అని యిక్కాలమునను౦డుమహాశయులే తెల్పియున్నారు. అయ్యది న్యాయ్యమే యని యంగీకరించువారిలో నే నొక్కఁడను.

శ్రీకృష్ణచరిత్రముగల దశమస్కంధము వ్రాసినపిదప నేకాదశస్కంధము కూడఁ దెనిఁగించిన మేలనునాశయము కలిగె. పెక్కండ్రు నన్నిక్కార్యమునకుం బురికొలిపిరి. శిష్యకూటముం జేర్చుకొని తెలియనిధర్మముల నుపదేశించుచు మతాంతరద్వేషముఁ బుట్టించి వారిని గుమార్గమున నడువఁ జేయు కపటయోగులు శ్రీభక్తులు పాషండులు నగుమహనీయులదారి నాశ్రయింపక తెలిసినవియో తెలియనివియో సద్విషయములు మునికల్పితగాథలు తెనిఁగించుకార్యమునఁ బ్రవర్తించుట మేలని యూహించువాఁడను. సర్వమతములు మంచియుద్దేశముగలవనియే నాసంపూర్ణ విశ్వాసము. కాన మతాంతరధర్మములఁ దూషింపక యిక్కార్యమున దేహయాత్రగడపు టుత్తమమని తలంచి పెద్దలయాశయము నవలంబించి యాకార్యమునకుం బూనితిని. ఇంతకుముందే ప్రారంభించి పూర్తినొందించిన విచిత్రరామాయణము, కలివిలాసము పూర్తినొందింపనున్న హృదయానందము ముద్రించు ప్రయత్నము చేయకముందే ఏకాదశస్కంధ మారంభించితిని. భగవదనుగ్రహమునఁ బెద్దలయాశీర్వాదబలమున నెఱవేఱునేని ధన్యుఁడను. కర్మగతుల నరయ నర్హు లెవరు! 'గహనా కర్మణో గతిః' అని భగవంతుఁడే తెల్పినపు డద్దాని నెఱుంగఁ దివురుట వెఱ్ఱితనముగాక మఱేమగును? అట్టి భగవత్స్వరూపమగుకర్మము నాచే నిక్కార్యమును జేయించునయేని కృతకృత్యుఁడనే. మహాశయు లిక్కార్యము నామూలమునఁ గాఁదగునని యాశీర్వదింతురుగాక. "కిం వా ప్రార్థనయా పరోపకృతిషు స్వాభావిక స్తద్గుణః" అన్న పెద్దలసూక్తి యున్నదిగాన నేను విశేషించి వారిని ప్రార్థింపనక్కఱలేదు.

నేను శాక్తుఁడనని పెక్కండ్రందురు. ఏయుద్దేశమున వారట్లనిరో నేఁబలుకఁ జాలను. భగవంతుఁడు భక్తు లేరూపమునఁ దన్ను ధ్యానించిన నారూపముననే వారికిం దగినయట్లనుగ్రహించును.

"ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా"

అని మహాత్ములే తెలిపిరి. ప్రకృతి యనఁగా భగవద్భిన్నముకాదనియు భగవదిచ్ఛాశక్తి యనియుఁ బ్రకృతిపురుషుల వేఱుచేయ నెవ్వారికే సాధ్యము కాదనియుఁ జంద్రచంద్రికలకు నగ్నికి దాహకశక్తికి నుండుసంబంధమే ప్రకృతిపురుషులకుం గలదనియుఁ బెద్దలనుండి చిఱుతప్రాయమునందే గ్రహించితిని. కానఁ ద్రిపురసుందరి భక్తుఁడనని వ్రాసితిని. స్త్రీరూపము భగవంతునిది కాదనుపెద్దల కొక్క

నమస్కారము. ఆపక్షమున నాతనిమహత్త్వమే యెగిరిపోవును. సర్వము తానైన మహాత్మునకు భేదమేమి? ఒక్కొక్కరి కొక్కొక్కరూపమునం దిష్టము. దానినే భగవద్రూపముగా భావించి యుపాసించు టుత్తమముకాని యది భగవత్ప్రీతి కరముకాదు; ఇది యగుననుట మంచిదికాదు. ఒక్కరూపమునందే ఒక్కచిహ్నము నందే యతనికిం బ్రీతియుండునే నతఁడును మనవంటివాఁడే. ఇట్టివాదముచేయు వారే కపటనాటకసూత్రధారు లనఁబడుపాషండులని తలంచువారలలో నేను నొక్కఁడను.

శ్రీభాగవతమున దశమస్కంధము వ్రాసి శ్రీకృష్ణున కర్పించితిని. సర్వమంగళాపరిణయము శంకరున కర్పించితిని. శివకేశవులకు భేదమే పేదనువాఁడను. కావున నొక్కపేరుతోఁగాక పెక్కునామములతో నాపరమాత్మనే స్మరింతును. అన్నినామధేయము లామహాత్మునకుం గలవని నాసిద్ధాంతము. "ప్రణమేద్దండవ ద్భూమావాశ్వచండాలగోఖరమ్" అని భాగవతము నేకాదశస్కంధమునను,

విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని,
శుని చైవ శ్వపాకే చ పండితాస్సమదర్శినః.
సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః.

అని గీతాశాస్త్రమునందును గనఁబడుచున్నది. దీనిభావమేమి? భగవద్భిన్నము లేదని కదా. ఇట్టులుండ నేరూపమున నాపరాత్పరుని ధ్యానించిననేమి? త్రిపురసుందరీరూప మాపరమాత్మదనియే నాయాశయము. ఇట్టులుండ నేనెట్టిశాస్త్రుఁడనో సర్వజ్ఞులగుమహాశయులే యూహింతురుగాక. శంకరాంకితమైనను శ్రీకృష్ణాంకితమైనను బరమేశ్వరాంకితమనియే నే తలంతు. ఈభావముననే యీభాగవత భాగము శ్రీకృష్ణాంకిత మొనరించితిని.

## భాషాంతరీకరణము.

ఇఁక నాయాంధ్రీకరణ మెట్టిదో యించుక విన్నవింతును.

మూ. ఇత్యుక్తస్స ఖలః పాపో భోజానాం కులపాంసనః,
భగినీం హంతుమారబ్ధః ఖడ్గపాణిః కచేఽగ్రహీత్. 3౫
తం జుగుప్సితకర్మాణం నృశంసం నిరపత్రపం,
వసుదేవో మహాభాగ ఉవాచ పరిసాంత్వయన్. 3౬ అధ్యా. ౧

చ. అనుటయు నాలకించి ఖలుఁడై యఘరూపుఁడు భోజవంశపాం
సనుఁడును నైనకంసుఁడు నిశాతకృపాణముఁ జేతఁ బూని యి
ట్లొనరుచు టింతయేఁ బొసఁగునో యొక్క యటంచుఁ దలంప కాగ్రహం
బునఁ ద్వరఁ బాటె యాభగినిః పూజ్యమనోహరకేశబంధమున్. ౮౩

చ. కరమునఁబట్టె; నవ్విధముఁ గాంచి స్వజన్మమునన్ వియచ్చరో
త్కరములు సాధువాద్యములఁ గ్రమ్మ విభూతియుతుండుగా నగున్
ధరణి నటించుఁ దెల్పుటను దామరసాక్షుఁడు పుట్టఁజాలు భా
గ్యరతిని గాంచుటన్ శమము గల్గిన యావసుదేవుఁడల్లనన్. ౪౪

తే. ఏవఁగల్గించు కార్యంబు నిట్లు చేయఁ, దలఁచి యున్నట్టి క్రూరుని దన్ను నింద
చేయుదురు మానవులటన్న సిగ్గు లేని, యాతురుని సామమార్గ వాక్యములు పలికి.

మూ. శ్లాఘనీయగుణశ్శూరైర్భవాన్ భోజయశస్కరః,
స కథం భగినీం హన్యాత్స్త్రియముద్వాహకర్మణి. ౩౭

చ. మనమున బాధచేసెడు కుమార్గముఁ గ్రోధము మాప నెంచి మె
త్తనిపలుకుల్ చెలంగఁ దనతాలిమి యెంతయుఁ గార్యకారియై
కనఁబడఁబల్కె; భోజకుల కమ్ర యశస్కర, శూరవారమా
న్యనిఖిలసద్గుణాకర! వినందగు నాపలు కొక్కఁ డిత్తఱిన్. ౪౬

క. నీవు కులీనుండవు మఱి, భూవిభుఁడవు స్త్రీని జంపఁబోలునె యందున్
దేవకి నీతోఁబుట్టువు, పావనియు నవోఢయునగు భావింపు మెదన్. ౪౭

తే. ఆఁడుతోఁబుట్టువును జంపనర్హమగునె, యందు నిప్పుడె పెండ్లియై యాసులక్ష
ణములతోఁ గూడియున్న దిమమతఁ జూపఁ, దగిన దే కాని చంపఁగాఁ దగదుసుమ్ము

మూ. మృత్యుర్జన్మవతాం వీర దేహేన సహ జాయతే,
అద్యవాబ్దశతాంతే వా మృత్యుర్వై ప్రాణినాం ధ్రువః. ౩౮
దేహే పంచత్వమాపన్నే దేహీ కర్మానుగో వశః.

చ. మరణము భీతిదంబగుట మామకవిగ్రహరక్షణార్థమై
తరుణిని జంపకుండ నిట ధర్మము నెంచుట యెట్టు లందువో
నరవరపుత్రకా! వినుము నాపలు కొక్కటి దేహధారులై
పరఁగెడువార లెల్లరకు వర్ష్మముతోడనె మృత్యు వొప్పఁజూ. ౪౯

ఉ. ఇప్పుడొ నూఱువత్సరము లేగిన యప్పుడొ ప్రాణికోటికిన్
దప్పక కల్గుమృత్యు విది తథ్యము; దేహము పంచతంగనన్
జొప్పడియున్న కర్మగతిఁ జొక్కుచు దేహి స్వతంత్రహీనతన్
దెప్పున నూత్న దేహమునఁ దేజము నించుచుఁ బ్రాక్తనాంగమున్. ౫౦

మూ. ఏకదా క్రీడమానాస్తే రామాద్యా గోపదారకాః,
కృష్ణో మృదం భక్షితవానితి మాత్రే న్యవేదయన్. ౩౪

సా గృహీత్వా కరే పుత్త్రముపాలభ్య హితైషిణీ,
యశోదా భయసంభ్రాంత ప్రేక్షణాక్షమభాషత. 35

యశోదా.—

కస్మాన్మృదమదాంతాత్మన్ భవాన్ భక్షితవాన్ రహః,
వదంతి తావకా హ్యేతే కుమారాస్తేఽగ్రజోఽప్యయమ్. 36

శ్రీకృష్ణః—

నాహం భక్షితవానంబ సర్వే మిథ్యాభిశంసినః,
యది సత్యం గిరస్తర్హి సమక్షం పశ్య మే ముఖం. 37
యద్యేవం తర్హి వ్యాదేహీత్యుక్తస్స భగవాన్ హరిః,
వ్యాదత్తావ్యాహతైశ్వర్యః క్రీడామనుజబాలకః. 38
కిం స్వప్న ఏతదుత దేవమాయా కిం వా మదీయో బత బుద్ధిమోహః,
అథో అముష్యైవ మమార్భకస్య యః కశ్చనౌత్పత్తిక ఆత్మయోగః.
ద౧. అధ్యా. ౮.

చ. మనమున నెంచి వేచని కుమారుని జేత గ్రహించి సాధ్వసం
బునఁ గనుదోయి తొట్రిలఁగఁ బొల్పగుదృష్టులఁ ద్రిప్ప నక్షులుం
గనఁబడ నున్న యాకొడుకుఁ గాంచి చలాత్మక! యొంటిపాటునం
దినితి వదేల మృత్తనుచుఁ దెల్పిరి బాలకు లంచుఁ బల్కుచున్. ౫౩౪

క. వినిపించె నీదు నగ్రజుఁడును దీనిం జక్కనని కుడుక బెదరింపన్
విని యంబా! మన్నను నేఁ, దినలే దీబాలకులును ధీవిరహితులై. ౫౩౫

చ. అనృతములాడి రిద్ది నిజమైనను వీరిసమక్షమందు మో
మును బరికింపు మీవె యటఁ బొల్చున్ వాసన యెద్ది నీమనం
బునకె యెఱుంగనౌ; ననినఁ బూనిక నన్నులమిన్న యట్టులై
నను ముఖముం గనంబఱపు నాయన! చూచెద నీదుసత్యమున్. ౫౩౬

క. అనిహతపరమైశ్వర్యం,బునఁ దగి భగవంతుఁ డగుచుఁ బొలుచు హరియు నో
రును విప్పి చూపెఁ గ్రీడా,మనుజార్భకుఁ డొట నిట్టు మాపటముఖమున్.

చ. కనఁబడుచున్న దేమి యొకొ కారణ మీయది స్వప్న మౌనొ" మే
ల్కాని యిటులున్న దానఁగద కూడునె స్వప్న మటంచు నెన్నఁగాఁ
గనుకనె దైవమాయ యనఁగాఁ దగునద్దియె యేని యెల్లరన్
గనుఁగొనియుందు రిద్దియును గాదిది నాదగుబుద్ధిమోహమౌ. ౫౪౧

సీ. బుద్ధిమోహామయేని ॥ పూనికఁ బెక్కుపర్యాయముల్ గాంచిన ॥ నట్లె నాకుఁ
గనఁబడుచుండుట ॥ గాదది; యీబాలకునకు స్వభావమై ॥ మనసుచేత
నూహింపరానిదై ॥ యెప్పుడు నాత్మయోగం బగునంచు నిశ్చరణినెంచి;

మూ. వనం చ తత్కోమలగోభిరంజితం జగౌ కలం వామదృశాం మనోహరం.
౧ అధ్యా. ౨౯

చ. మనుజవరేణ్య యందుఁగలశమాధవుభావ మెఱుంగు టొప్పు నా
వనితలు సంతసించునటు ॥ వామనమూర్తి పరాత్పరుండు త
న్మనములఁ గామరాజ మను॥మానితబీజము నాటె వేణునా
దనియతి దేశికుండువలెఁ ॥ దాపము లంతము నొందునట్లుగన్. ౧౬౬౦

గూఢార్థముగా భావార్థదీపిక వ్రాసెను. దాని ననుసరించి వ్రాసితిని.

మహామతులారా! స్థాలీపులాకన్యాయము ననుసరించి నాపద్యములను మూలమును జూపితిని. ఈవిధముగనే తఱచుగా వ్రాసియుందునని తమ రూహింపఁగలరు. ఇందెన్నియో ప్రమాదములుండు. వానినెల్ల నాయందుఁగల వాత్సల్యమున నాకుం దెలిపి నాచేతనే సవరింపఁజేసి పుణ్యముగట్టుకొందురని వేఁడువాఁడ. తమవంటిసాధుసత్తముల నింతకంటె విశేషించి ప్రార్థింపనక్కఱ లేదు.

## కృతజ్ఞత.

ఈగ్రంథముద్రణమునకు నెంతో దోడుపడిన శ్రీరాజా వెలుగోటి సర్వజ్ఞకుమారకృష్ణయాచేంద్రబహదూరువారికిని, మ-రా-రా-శ్రీ పోణకా గోవిందరెడ్డిగారికిని, (డిస్ట్రిక్టుబోర్డు ఉపాధ్యక్షులు) నాపని తమపనిగా నామేలు తమమేలుగా భావించి నాకు సకలవిధములఁ దోడ్పడుచు భాషోద్ధారకులై దిగంతవిశ్రాంతకీర్తి విరాజమానులగు మ-రా-రా-శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారికిని, నేను గోరినంతనే బహుకార్యభారమగ్నులయ్యును బదులుమాటచెప్పక యుపోద్ఘాతమువ్రాసి సకాలమునఁ బంపిన కవిసార్వభౌములు శతాధికమహాగ్రంథకర్తలు నగు బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రులుగారికి నేతన్మూలమున నాకృతజ్ఞతం దెలుపుచున్నాను. అచ్చుకూర్పు మొదలిడినదాదిగా వానిని దిద్ది నాకెంతయో తోడ్పడి కృతిసమర్పణోత్సవకార్యమున సకలభారమును వహించి నాకెంతో యూఱటఁగల్పించిన చిరంజీవి కావ్యపురాణతీర్థ విద్వాన్ జనమంచి వేంకట సుబ్రహ్మణ్యశర్మకు (మైసూరులునం ధ్రాంధ్రపండితునకు) నాయాశీషములం

దెలుపుచున్నాఁడను. ధనదాతలగు మహాశయులపావననామధేయముల సుత్సవ చరిత్రమునఁ దెలిపియున్నాఁడను. అట్టి యుదారస్వభావులను, నాయీయుత్సవ మున కెంతో తోడ్పాటుచూపిన కడపనగరవాసులగుమహాత్ములకు నాకృతజ్ఞత నేతన్మూలమునం దెలుపుచున్నాఁడను. ఇంకఁ బెంచి వ్రాయ సమర్థుఁడనుగాని నేను నాయపరాధసహస్రముల మన్నింపుఁడని పండితాఖండలులఁ బ్రార్థించుచు నీవిష యమునుండి విరమించుచున్నాఁడను. నా యీలేఖినిని గ్రంథాంతరములఁ బ్రాయఁ ద్రిప్పుచున్నాఁడను.

నిందతు నందతు వా సన్నసూయురనసూయురత్ర కిం తేన
యత్స్నానసగమనార్హై వేదం మమ తు పాథేయమ్.

అని విన్నవించు సజ్జనపాదారవిందభజనానందసాంద్రుఁడు,

జనమంచి శేషాద్రిశర్మ.

శ్రీ. శ్రీ. శ్రీ.

శ్రీ ర స్తు.

శ్రీ పరమేశ్వరాయ నమః

# శ్రీతాండవకృష్ణభాగవతము

## పీ ఠి క.

---

### దే వ తా ది స్తు తి.



మన్మాన్యతమంబు జ్ఞానదము సచ్చిన్మోదరూపంబు ప
ద్మోమావాక్పతిసంతతార్చితము శ్రుత్యుక్తప్రభావంబు స
ర్వామర్త్యస్తుతిరాజవర్ణితము ధ్యానాధీన మోంకారస
ద్ధామావాసము నైన దివ్యమహమున్ ధ్యానింతు నిష్టాప్తికై. 1

శా. మాయంగూడి ప్రపంచసృష్ట్యవనముల్ మాయించుకార్యంబుఁ దాఁ
జేయం బూని యజాచ్యుతేశులను సంసిద్ధాహ్వాలం దాల్చి దు
ర్జ్ఞేయుండై సకలాధికుం డగుచు జేజే లెల్లఁ గీర్తింప నా
మ్నాయంబుల్ వినుతింపఁ బూజ్యతముఁడై నాథుండు నై నాశితా
పాయుండై తనయంతవెల్గు సగుణబ్రహ్మంబు సేవించెదన్. 2

మ. ఘనమై పొల్చువిరాట్టునాశయము నొక్కం బట్టిదే యంచు లో
కనికాయంబు విచిత్రరీతి వెలయంగాఁ జేసి లోకేశులన్
వనజాతాసనవిష్ణుశంకరులు నాఁ బ్రఖ్యాతిఁ గన్నట్టివా
రిని నిర్మించి యొసంగు శ్రీలలిత నిర్లిప్తం దలంతున్ మదిన్. 3

శా. ఎందుం జూచినఁ దాన యౌచు నెవరే నెట్టెట్టు లర్చించినన్
డెందంబందు విశేషశాస్త్రహితమౌ నేమంబునన్ ధ్యాన మా
నందస్ఫారసుధాసముద్రమున మగ్నం జేసినన్ వారి కిం
పొందం గోర్కుల నిచ్చుదేవిని జగద్వ్యాప్యమహేశ్వరిం గొల్చెదన్. 4

సీ. అద్భుతశక్తి మూలాధారచక్రైకగత యయి యా విధి గ్రంథిఁ జెంది
మణిపూరచక్రైకమధ్యమ్మునందుండి కమలనేత్రగ్రంథి ఖండనంబుఁ
గావించి యాజ్ఞాఖ్యకమ్రచక్రాంతరాళస్థయై వివిధవిలాసగతులఁ
దనరి రుద్రగ్రంథిదళనంబు గావించి మఱి సహస్రారకమలవసతిని

తే. గాంచి యమృతధారలఁ గురియించుచుఁ దగి
నవ్యవిద్యుల్లతాసమానప్రభ వెల

యంగ షట్చక్రములపైన । నధివసించి
యలరు శివకామసుందరిఁ । దలఁతు మదిని. 5

మ. పరమేశాజ్ఞను మౌళిఁ దాల్చి జగముల్ । పాలింపఁగా భార్గవీ
సరిదీశాత్మజసాయమై వెలయ నంచచ్ఛక్తి దుష్టాత్ములన్
గురుచక్రంబునఁ జెండి ధర్మమున కేక్షోభంబు లేకుండఁ గా
చు రమాకాంతుఁడు భక్తవత్సలుఁడు కాచుంగాక నన్నెప్పుడున్. 6

మ. వనజాతాక్షుని గార్యసిద్ధికి నదేభ్యంగిం బ్రవర్తింపఁ జే
యనగుం దద్విధిఁ ద్రిప్పుచున్ మునిసమారాధ్యాంఘ్రిపంకేజుఁడై
వనజాతాకృతి నొప్పుపీఠమున దేవవ్రాతముల్ గొల్వ నొ
ప్పునతార్తిప్రశమైకదక్షుఁ గొలుతున్ । భూతౌఘమాన్యన్ రమన్. 7

చ. గరళమహాగ్నికంఠమునఁ । గమ్రనిభూషణమై వెలుంగ భీ
కరఫణిహారకంకణనికాయము పత్సకరంబులందు సుం
దరముగఁ గన్పడం దనయనంతమహాద్భుతశక్తి యొంతయున్
నిరుపమమై చెలంగఁదగు । నిర్మలమూర్తి భజింతు శంకరున్. 8

చ. అనిశము సర్వమంగళయె । గ్గై పరమేశ్వరువామపార్శ్వమం
దనుపమలీల నుండి జగదంబ యనన్ నుతిఁ గాంచి దుష్టమ
ర్దనగురుకార్యసంగతి సతం బలరారుచు సత్కృపాబ్ధి నా
ఘనతవహించి లోకములఁ । గాచెడుకామకళాంబఁ గొల్చెదన్. 9

ఉ. నిత్యము శర్మదంబు బహునిర్మలమున్ సుకృతాకరంబు నా
సత్యపదంబు వాసమయి । సన్నుతి కెక్కఁగ వేదబృందముల్
ప్రత్యయ మొప్ప సృష్టి దగుభంగిని దెల్పఁగ మానిసంఘసం
స్తుత్యసరోజపీఠమున । శోభిలు నాపరమేష్ఠిఁ గొల్చెదన్. 10

సీ. హరివాక్కామహారాఖ్యబీజంబు లే పరదేవి మంత్రరూపమున వెలయుఁ
దోరంపునాదబిందుకళ లేయంబికా వీణారవంబులై । వినుతి కెక్క
భక్తవాంఛాళు లేపరమేశ్వరీకటాక్షాళిభవంబులై । యమరుచుండు
జగదోఘవృద్ధిసంక్షయము లేభగవతీ హృదయానుసరణత । నెసఁగుచుండు
తే. నట్టిశారద విధిరాజ్ఞి । యనుపమాన, శక్తిసంయుత ముని మనస్సద్మవసతి
వేదపరినుతమహిమాఢ్య । విమలధిషణ, సతము మన్మానసమున నెసంగుఁగాత.

చ. తొలుతనె పూజఁ గైకొనుచుఁ । దోరపువేడుక భక్తకోటి వాం
ఛల నొడఁగూర్చుచున్ దివిజసన్నుతిఁ గాంచుచు విఘ్నయంత్ర ము
జ్జ్వలతరశక్తిఁ జెండి మునివర్యులు తన్పొగడంగ శ్రీపరాం
బలలితదృష్టిపాత్రుఁ డయి । భాసిలు విఘ్నపతిం దలంచెదన్. 12

క. నిరతము శిష్యసమూహో, ద్ధరణమె సత్కృత్య మనుచుఁ దలఁచెడు కరుణా
శరధిని రాజ్ఞీవంశ్యుని, నరసింహబుధేంద్రు గురు మనంబునఁ గొల్తున్. 13

క. జ్యోతిర్విద్యావిద్వరు, నీతిజ్ఞుని సత్కృపాంబునిధి సచ్ఛిష్య
వ్రాతుని వేంకటరామసు,ధీతల్లజు దేశికున్ మదిన్ ధ్యానింతున్. 14

క. ముకుళితహస్తుఁడనై వా,ల్మికి వ్యాసుని గాళిదాసు మృదువాక్యఖ్యా
తికలితుఁ దండిని భవభూ,తికవీంద్రాదులను సంస్తుతింతున్ భక్తిన్. 15

క. తెలుఁగువిషయమునను త్రిమూ,ర్తులు నాఁదగి సకలసుగుణతోయనిధు లనన్
వెలసెడు భారతకవివ,ర్యుల నన్నయముఖులఁ గొల్తు సురుతరభక్తిన్. 16

ఉ. భూతలమందు నీతనికిఁ బోల్పఁగ నీతఁడె సాటి భక్తి నం
చేతటినేని చెప్పఁదగ కెల్లవిధంబులఁ దా నతుల్యుఁడై
చేత మదీశ్వరాంఘ్రిసరసీరుహయుగ్మమునందు నొప్పఁగాఁ
బ్రీతి నెసంగు పోతనకవిప్రవరున్ భజియింతు నెమ్మదిన్. 17

క. శ్రీనాథ సుకవిశేఖరు, మానితయశు సోమనాథు మంజులకవితా
శ్రీనిలయు నంది తిమ్మన, ధ్యానింతుం బెద్దనార్యుఁ దద్దయు భక్తిన్. 18

క. శ్రీరామరాజభూషణుఁ, గోరికఁ దలపోసి మఱియుఁ గుంభిని సుయశ
శ్శ్రీరమ్యులైనసత్కవి,ధీరులఁ బ్రాచీనులను నుతింతుం బ్రీతిన్. 19

సీ. తెనుఁగుబాస రవంతయును గొఱంతను గాంచకుండంగ భారతమురుపరిశ్ర
మములకు లోఁగి పారము గాంచి మఱియు శతాధికగ్రంథముల్ హరిశైలి
నిర్మించి యామ్నాయనికరము నేరిచి కవిసార్వభౌమవిఖ్యాతిఁ గాంచి
గండపెండేరంబు కాలికి సత్కవుల్ తగు దీవె యని తొడుగఁగఁ జెలంగి
తే. నిత్యసంతుష్టిఁదగి మహానృపసభాంత,రాళముల నెన్నియేని మర్యాద లొంది
పొలుచు శ్రీపాదవంశసంభూతుధీర,ముఖ్యుఁ దలఁతును శ్రీకృష్ణమూర్తిశాస్త్రి.

ఉ. బమ్మెర పోతనార్యుఁ డొగి భాగవతంబును దెన్గొనర్చె మో
దమ్మలరార దానిఁ గవితల్లజు లెల్లరు సంతతంబు శీ
ర్షమ్ములఁ దాల్తు రట్టికృతిసత్తమమున్ దెనిఁగించు టేల గ
ర్వమ్మునఁగాక యంచుఁ దెగివల్కకుఁడీ బుధులార మ్రొక్కెదన్. 21

ఉ. రాముచరిత్రమెల్లఁ గవిరాజులు మెచ్చఁగఁ దెన్గొనర్చి శ్రీ
ధాముఁడు ముక్తినాథుఁడు విధాతృముఖామరపూజితుండు నా
తామరసాక్షుదివ్యచరితంబును వ్రాసితి వాంఛితం బిదే
నామదిఁ గల్గె నంచుఁ గవినాయకు లెల్లరు నమ్మఁగాఁదగున్. 22

చ. హరిచరితంబుఁ దెల్పుటకు నందఱు నర్హులె సాంద్రభక్తి సం
భరితులు తెల్ప నయ్యది ప్రభావవిశిష్టముగాఁ జెలంగి యు

ర్వారఁ బరఁగుఁ మహాత్ములును ౹ వారక మెత్తురు నేనుదప్ప నిం
కొరుఁడు వచింపలేఁ డనున ౹ దొప్పునె మెత్తురె పండితోత్తముల. 23

ఉ. కావునఁ గృష్ణమూర్తిదగు ౹ కమ్రచరిత్రము విస్తృతంబుగాఁ
బావనపద్ధతిం దెలుపు ౹ భాగవతంబును దెన్గొనర్చు నా
భావమునుం బవిత్రమగుభంగి నొనర్పఁగఁ బూనినాఁడ నో
కోవిదులార! దీనిఁ గొని ౹ కూర్మిని వృద్ధి నొనర్పఁబూనుఁడీ. 24

చ. పలువురు పండితోత్తములు ౹ భాగవతార్థము లిట్టి వంచు ని
స్తులమగుపాండితీమహిమ ౹ తోఁపఁగ వ్యాఖ్య లొనర్చి వందొగిం
దెలిపినయర్థభేదములు ౹ తెన్గునఁ దేటపడంగఁ గూర్పఁగా
దలఁచితి నిందుఁ గన్పడెడుతప్పుల దిద్ది కృతార్థుఁ జేయుఁడీ. 25

చ. నెమకిన నన్నయాదికవిసీరజగర్భుల సత్కృతిం బ్రసం
ఘమునను దోషలేశములు ౹ కన్పడు నీకృతిఁ దోఁచుటబ్రమే
యమలమనీషులార! యిఁక ౹ నాదృతి నీకృతియందుఁ గల్గుదో
షములఁ దొలంచి కావుఁ డిది ౹ సజ్జన నైజము గాదె యెన్నఁగన్. 26

క. ఈసత్కృతి భక్తిమెయిన్, వాసవముఖపూజితాంఘ్రి ౹ వనజాసనతా
శ్రీసదనునకున్ గృష్ణున, కీసమ్మతిఁ గొంటఁ బెద్ద ౹ లిది తగుననుటన్. 27

మ. కలలోఁ దోఁచి తెలుంగుబాస నిపు డీగ్రంథంబు నాపేర నీ
యిలవిఖ్యాతి చెలంగఁ గూర్పుమని న ౹ న్నేదైవమో కోరలే
దలఘుస్వాంతుల వేఁడ వారలిడు సత్యాజ్ఞం దలందాల్చి శ్రీ
జలజాక్షుం గృతినాథుఁ జేసితి నిదె ౹ సత్యంబు ముమ్మాటికిన్. 28

చ. హరుఁడన విష్ణుపాదయుగళార్చకుఁ డౌనను దాసులందు శ్రీ
హరి యన శంభుపాదముల ౹ నన్వహముం దలఁదాల్చుదాసుఁడం
చరయక పల్కుచుండెడు మహాత్ములపంక్తిని జేరఁజాల నీ
యిరువురు నస్వతంత్రులె పరేశ్వరుఁ డొక్కఁడె శాశ్వతుం డగున్. 29

ఉ. ఆపరమాత్ము నిచ్ఛయె యహార్యతమాద్భుతశక్తిమీఱి నా
శాపతులం ద్రిమూర్తులను ౹ సర్వజగంబుల సృష్టిచేయఁగా
నోపికఁ గావఁ గాలమున ౹ నొక్కటఁ ద్రుంపఁగఁ జాలి వెల్గుగా
దే పరదేవి యన్నప్రథ ౹ నెత్తతిఁ దాల్చెడు నేర్పుమీఱఁగన్. 30

క. పరమాత్మునకుఁ దదిచ్ఛకు, నరయంగ నభేదమె యగు ౹ నట్లగుటన్ శ్రీ
వరుఁడున్ హరుఁడున్ బరమేశ్వరులని వాదింప నేల ౹ వాగ్వైఖరితోన్. 31

క. ఒకఁడె పరమాత్మ యనుచుం, బ్రకటించుంగాదె వేదశార ముపనిష
న్నికరము వానిం గాంచియు, నిఁకనున్ వాదింపఁబూన ౹ నేమనవచ్చున్. 32

తే. అట్టిభేదంబు విడనాడి । యంద ఱొక్క, తత్త్వమునుండి వెడలినసత్త్వములని
యెంచి సమబుద్ధి వానిఁ బాటించి యెల్ల, జీవులకునీశ్వరుం డొక్కఁడె దైవమె యని.

చ. మనమున నెంచి భక్తజనమానసకల్పితనామరూపుఁ డై
తనరెడు నాపరాత్పరునిఁ । దత్త్వవిదుల్ గొనియాడువానిఁ గృ
ష్ణనిహితనాము నీకృతికి । నాథునిగా నొనరించినాఁడ స
జ్జను లనుమోదముం దెలుప । శాశ్వతతత్కృపఁ గోరి భక్తిమై. 34

క. శ్రీరాధేశా! యీకృతి, సారసదళనేత్ర నీదుసత్పదములకుం
గోరికమై నర్పించితి, నేరితిం బ్రోతు వొక్కొ । యీదీను నిఁకన్. 35

క. అనుచున్ బ్రార్థించి నిరం,జనునిన్ దీనావనుని విశాలయశుని శ్రీ
శుని లలితాకృతి ధ్యానిం,చి నియతి నంకిత మొనర్తుఁ । జిత్తం బలరన్. 36

క. అమలాంగిని నిర్మలచి,త్తమునందగి నీదుసేవ । ధర్మ్యం బని చే
య మయికొను బాలికారత్నము దీనిం గొనుము సర్వనాథా దేవా. 37

వ. అని ప్రార్థించి మద్వంశచరితంబు వినిపించెద. 38

## కృతికర్తృవంశచరిత్రము.

సీ. ఆంధ్రదేశమునకు । యామ్యభాగంబున శ్రీశైల ముత్తరసీమగాఁగఁ
గాంచీపవిత్రనగరము దక్షిణభాగమున నుండఁగాఁ దెలుం । గనెడుపేరఁ
బరఁగుదేశం బొండు । భాసిల్లు నిదియె త్రైలింగాఖ్యదేశం బనంగ వెలయు
నందుఁ బినాకిని । యనుమహానది యొప్పు దానికిం జెంతనె । దక్షిణమునఁ

తే. దనరుఁ గలువాయ యనుపురతల్లజంబు
నాదు జన్మస్థలంబయి । నలువుమీఱు
దానికిం బశ్చిమాశను । దగును గడప
యనెడునగరంబు పంచయోజనములందు. 39

క. ఆమండలమున వేంకట, రామపురం బనెడు నొక్క । గ్రామము తగు సు
త్రామోత్తరదిక్సంధిని, ధీమన్నివహాఢ్య మగుచు । దివిజపురము నాన్. 40

సీ. కలువాయఁ బాసి యేకారణంబుననొ నా పూర్వు లాగ్రామంబుఁ బొందుఁ గోరి
వచ్చి వసించిరి । వాసార్హమై యది యగ్రహారం బౌట । నవని దివిజ
వంశపూర్ణంబయి । భాసిల్లు; జనమంచివారన మాయింటిపేరువారు
తనరుచుందురు, వేదతత్త్వ మెఱింగిన సూర్యనారాయణ । సోమయాజి

తే. యలరు నాప్రపితామహుఁ । డతనిపత్ని
యచ్చమాంబిక వారికి । నిచ్చమీఱ
సంతతియె లేకయుండి యీశ్వరకటాక్ష
మున జనించెఁ గుమారుండు । వినయధనుఁడు. 41

క. కృష్ణయజుర్వేదంబున, నిష్ణాతుం డగుచు ధర్మనియతిని స్వాంతం
బుష్ణకిరణపాదార్చన, విష్ణుధ్యానాభిరక్తి వెలయఁగ నలరెన్. 42

ఆ. వివిధనియమములను విలసిల్లి వేంకటే,శావధాని యనఁగ నాతఁ డొప్పెఁ
దత్కళత్ర మవని ధర్మమతిన్ సాధ్వి, యగుచు నెసఁగెఁ బేరమాంబ యనఁగ.

క. ఆయిర్వురకున్ ధిషణ,ప్రాయులు పుత్త్రకులు మువురు ప్రభవిల్లి రొగిన్
న్యాయవిదుత్తములై హిత,ధీయుతులై సాధుజనసుతిన్ మించి రిలన్. 44

క. అం దగ్రజుండు శంకర, సుందరపాదారవింద శుంభచ్చిత్తేం
దిందిరుఁడు వేదపఠనా,నందుఁడు శాంతాదిసద్గుణగణాఢ్యుఁ డనన్. 45

సీ. కాశ్యాదిసత్క్షేత్రగణదర్శనాదరుఁ
డగుచు సుబ్రహ్మణ్యుఁ డనెడు పేరఁ
బిలువంగఁబడును దత్త్రయసోదరుఁడు శేష
యాఖ్యుఁడు ధర్మశాస్త్రాళి నెఱిఁగి
యామ్నాయముఁ బఠించి యలరుఁ దత్సోదరుం
డగుసుబ్బయాహ్వయుం డాత్రయంబు
నందుఁ ద్వైతీయీకుఁ డగు శేషయార్యుండు
సంతానహీనుఁడౌ జ్ఞాతికీయఁ
తే. బడఁగఁ గలువాయ యందె నివాస ముండె
నతని కొక్కతనూభవుఁ డార్యభక్తుఁ
డుదయమందె; శేషాఖ్యసహోదరుండు
సుబ్బయార్యుఁడు వటువయి చొచ్చె దివిని. 46

క. నాతండ్రి సాధునియతిన్, ఖ్యాతిం గని భర్తృపాదకమలయుగళసే
వాతతశక్తిం గని తగు, నాతిం గామాక్షి యనెడు నయగుణనిలయన్. 47

తే. పెండ్లియాడె నాదంపతుల్ ప్రియముమీఱఁ
బుత్త్రికల నిర్వురను మఱిపుత్త్రులను ము
వురను గాంచిరి; తొలిపుత్త్రి నిరుపమసుగు
ణాభిమండితయయి శీల మమర వెలసి. 48

సీ. సుబ్బమాంబిక యను శుభనామమును గాంచె నన్నపూర్ణమ్మనా నామె యనుజ
యలరె నవ్వలివార లగుసుతు లిద్దఱు ననపడబ్బనయన్ను నవ్యభవ్య
సుందరరూపముల్ శోభిల్ల నుండంగ నమ్మహా రసు పేర నవసిఁ బరఁగు
వ్యాధి యొక్కఁడు సోఁకి వారలనిద్దఱి రేపట మాపట రూపడంగఁ
తే. జేసె; నప్పటికే నవమాసపరిమి
తమగు బాల్యంబు గలవాఁడ దల్లి సుంత

యూఱటంబొంద నావ్యాధి । నొందియును బ్ర
దికితి మాతులగృహమున । దేవునిదయ. 49

చ. తనయల నన్ను నీముగుర । దాఁ గని నాజనయిత్రి ప్రాణముల్
తనువున నిల్పఁజాలెనఁట । తప్పవుగా విధిచేష్టలంచు నె
మ్మనమునఁ దోఁప మే మచట । మాతులగేహమునందె యెంతయున్
వనటఁ గృశించుమాతయును । వాసముచేసితి మంట యెట్టులో. 50

చ. జనకుఁడు జ్ఞానియౌట విధిసమ్మతకార్యము తప్ప దింతయున్
దనయులు నిర్వురీసుతుఁడుఁ । దక్కిరి చాలు నటన్న యూఱటన్
గని యల యగ్రహారమునఁ । గాఁపురముండెను గొన్నివర్షముల్
జనకునియింటనుండి నిజసద్మముచేరెను దల్లి యంతటన్. 51

చ. కొలఁదిదినంబు లేగ ననుఁ । గూరిమిఁ బెంచెడు తల్లి నెమ్మదిం
గలిగెఁ దలంపు నన్ వటువు।గా నొనరింపఁగఁ దండ్రి యిప్పు డీ
తలఁపుఁ గొనంగ నేల? యని । దానికి సమ్మతిఁ జూపఁ డయ్యె నం
దుల కిసుమంత చింత మదిఁ । దోఁచెను దల్లి కదెట్లొ దుర్విధిన్. 52

చ. బ్రదుకుట దుర్లభంబగుట । బాలుని వేఱొకమాట పల్కకీ
యదనున విప్రతన్ వెలయ।నట్లొనరింపుఁడు నాఁగఁ దండ్రియున్
బదియుఁ బదాఱునాళ్లకె య।భంగగతిన్ జతనంబుచేసి మా
తదయినకోర్కెఁ దీర్చె మదిఁ । దల్లడపాటొదవంగ నెట్టులో. 53

ఉ. ఆఱవయేఁడు నాజనని।మాదిగ నప్పుడె సంగె నంట యే
యూఱటలేక నాజనకుఁ । డుండఁగఁ గార్తికికాఖ్యమాస మే
కాఱియఁ బెట్టఁబూని యొడి।కంబునవచ్చెను; నన్నుఁ బెంప నే
మాఱనితల్లి జ్యేష్ఠసుత।మాటను దాఁటక పంపె నానెలన్. 54

సీ. కార్తికంబు శుక్లం బనుపక్షంబు నందును బదియవ । దగుదినంబు
రానున్నతఱి జ్వరార్తయె యగు నామాత పిలువనంపఁగ నేను । బితనుగూడి
యింటికిఁ బోవఁగ । నించుకయేఁబల్కఁ జాలనిస్థితి నుండె । జనని నాఁడె
మత్కరతలమున।మస్తకం బిడి నాదు మోముఁ జూచుచుఁ బ్రాణ।ములను వదలె

తే. నంత నాతండ్రి తద్విర।హార్తుఁ డగుచుఁ, గాశికిం బోయె నన్నప్డు । కనికరమునఁ
జిన్నితోఁబుట్టు వయియున్న । యన్నపూర్ణ, చేరఁదీసి యాదృతిని బోషించె మిగుల.

క. నను సోదరికంటెను బ్రీతిని బ్రోచెను బావ యగుచు । దీర్ఘఖ్యాతిం
గనిమించెడు రామార్యుం, డనుకంపాంబుధి యనంగ । నర్హుం డతఁడౌ. 56

క. చిరకాలము శ్రీకాశీపురమున నివసించి యందుఁ । బొదలు బుధులయా
దరమునకుం బాత్రుండై, యరుదెంచెను నాదుజనకుఁ । డాత్మజులఁ గనన్. 57

చ. కొలఁది దినంబులుండి నను గోమునఁ బెంచెడుతండ్రి యున్నవి
ద్యలఁ జదివించువాంఛఁగొని యప్పుడ తోడ్కొని సాధుపండితా
వళుల నెసంగు నీకడప వైశమ చేరిచి తీర్థయాత్రపైఁ
జెలఁగెడు వేడ్కఁ బోయెఁ బురిఁ జేరిననేఁ జదువంగఁ బూనితిన్. 58

సీ. పదునొకండవయేటఁ బరదేశవాసంబు గలిగిన నాటలఁ గాల మీఁగ
కుండఁ బఠించుచునుండఁ గాశికిఁ బోవు వాంఛ గల్గెను దానఁ బయనమైతి
బైరాగులే తోడుపాటు చూపఁగఁ గాలి నడకచే వర్షములొనాల్గు త్రోవ
యందె చెల్లెను గాశియందును గొన్నివత్సరములు చదివి విజయనగరము
ఆ. నందుఁ గసిమికోటయందును శ్రుతినేత్రములను బఠించి సాధుజనులకృపను
బాత్రుఁడ నయి దైవభక్తిగల్గెడుమార్గములను దెలిసి యోగములఁ గ్రహించి.
క. జనులను యాచించి ధనార్జన మొనరుపఁ జాల కెట్లో సంస్కృతి సాగిం
పను నాంగ్లపాఠశాలను, దెనుంగుఁ బండితుఁడనై విధిఁ జిక్కఁగన్. 60

క. ఒనరించుచు హాలాస్యం, బనునామమునం జెలంగునట్టి మధుర దౌ
ఘనమహిమముఁ దెల్పుకృతిం, బొనరించితి స్కాందమునను బొల్పమీనంగన్.

క. లలితోపాఖ్యానంబును, లలితాంబా దివ్యకృప వెలఁగునటుల జో
ర్కులఁ దెన్గుచేసినాఁడను, బలుకుల నదె యొసఁగెఁ జేయుఁ బావనములుగన్.

సీ. బ్రహ్మాండ మనెడుపురాణంబుఁ దెనిఁగించి వేంకటాచలపతి విభునిఁ జేసి
రామాయణంబు సర్వంబు వ్యాఖ్యానార్థములతోడ వచనంబు కలయఁగూడఁ
దెనిఁగించి రామచంద్రునిఁ గృతీశునిఁ జేసి వివిధపురాణముల్ వెదకి వెదకి
శ్రీకృష్ణునవతారసిద్ధతత్త్వంబెల్ల వచనరూపంబున వ్రాసి కృష్ణు
తే. నధిపతిగఁ జేసినాఁడ నయ్యదియుఁ జెరఁ, దనరఁ గృష్ణావతారతత్త్వం బనంగ
నపుడె తెనిఁగింపఁబూనితి నమలకథల, నలరు బ్రహ్మపురాణమ్ము నాదిమ మని.
క. ఈనడుమ నే నొనర్చిన, నానావిధకృతులఁ జెర్కొనఁగనేల మరు
త్సూనువిజయాదికము లని, వానిం దలపోయఁదగును ధన్యమనీషుల్. 64
సీ. బ్రహ్మపురాణపర్వము పూర్తినొందించి దశరథరాజనందనుపవిత్ర
చరితమే మానవసంఘప్రవృత్తికిఁ దార్కాణమని యెంచి దానిసార
మెయ్యెయి నీతుల నెఱిఁగించునో యవ్విధము తేటపడుచుండనమునఁ జిత్ర
రామాయణ మను పేరం గ్రాలునట్లుగా వ్రాసి యస్మద్గురువరులయాజ్ఞ
తే. పూని ధరియించి శ్రీసర్వమంగళాపరిణయ మనుప్రబంధమ్ముఁ బ్రబలభక్తి
భరరసైకపూర్ణంబుగ వ్రాసి పిదప, భాగవత దశమస్కంధభాగ మిట్లు. 65
క. తెనిఁగించినాఁడ శ్రీరామునిచరితమునందుఁ దోఁచు ఘనతత్త్వము నా
మనమునఁ దోఁచినదాని వచనరూపమునన్ మనీషిసంతతి యలరన్. 66

తే. వ్రాయుచున్నాఁడ నందేడు భాగములుగాఁ, బ్రకరణములను పేర వేర్వేఱయి నవలి
దైనభాగము సాగు; రామావతార, తత్త్వ మను పేర గ్రంథమంతయుఁ జెలంగు.

తే. ఢిల్లికిని ఢిల్లియే సాటి పల్లికల్ల, పల్లెయే సాటి యనునుడి పరఁగియుండు
సత్కవుల గ్రంథముల కివ్వి సాటి యగునె, శక్తికొలఁదిని వ్రాసితి సాధులార!

క. ననుఁ దాండవకృష్ణుం డని, యును మఱి శేషాద్రి యనియు నొగిఁ బిల్చిరి ప్రీ
తిని జనకాదులు తొలి నా, నిని గ్రంథమె తెలుపుచుండు నియతి మెఱయఁగన్.

క. రెండవదౌ నామము భూ, మండలమున నెగడు నిట్లు మామకచరితం
బుండెడును; జెప్పితిని గృతి, శుం డగు శ్రీవాసుదేవు శుభసన్నిధినిన్. 70

వ. ఇట్టి నేను సమాహితాంతఃకరణుండ నై. 71

క. యోగిధ్యేయునకు మహా, యోగేశునకుఁ బ్రవిమలోజ్జ్వలతేజో
భాగగతలోకజాలున, కాగమవేద్యునకు నవిరతానందునకున్. 72

క. మునిచిత్తసద్మవసతికి, మునికల్పితదివ్యనామమూర్తికిఁ ద్రిదశేం
ద్రనిచయమకుటోజ్జ్వలరత్ననికరసంవ్యాప్తపాదతామరసునకున్. 73

క. ఉపనిషదోఘప్రతిపా, ద్యపరమభాగ్యునకు భక్తతల్లజవరచి
త్తపదస్థితవాసునకున్, స్వపగతఖేదునకు సత్కృపాంభోనిధికిన్. 74

క. భక్తకృతధ్యానైకా, సక్తునకున్ వేదరాశి సమధిగతప్ర
త్యక్తనునకు నిత్యునకున్, శక్తీశున కప్రమేయశాంతాంబుధికిన్. 75

క. వనజాక్షున వనజభవభవ, జనకునకున్ సత్కవికృతసాధుగ్రంథా
ళినిహితసమ్మానునకు లో, కనికరనాథునకు రాధికానాథునకున్. 76

క. ఓంకారరూపునకు నిర, హంకారజనాంతికస్థితాత్మునకుం గృ
ష్ణాంకితవరనామునకున్, సంకటహారునకును సుప్రసన్నాస్యునకున్. 77

తే. అంకితమ్ముగఁ దెనిఁగింప సమలభక్తి, నిపుడు పూనిన తాండవకృష్ణభాగ
వతపురాణరత్నమునను బదియవదగు, స్కంధమున నాదిభాగమే చక్కనినిన.



శ్రీరస్తు.

# శ్రీ తాండవకృష్ణభాగవతము

## దశమస్కంధము

### మొదటియధ్యాయము.



కథారంభము.

మద్యదుకులజలనిధి
సోమా సుగుణాభిరామ శుభపదసేవా
శ్రీమహితమానిత్యోజ్జల
జామోదనివేశ రాధికాకాన్తాధీశా. 1

క. మునిపతి యగుశుకయోగిని, గని రాజు వచించెఁ జంద్రసూర్యుల పా
వనవంశవిస్తృతిని దజ్జనితక్ష్మానాథచిత్రచరితం బెల్లన్. ౧ 2

క. వినిపించితి వోయోగీంద్రనికరవర! ధర్మశీలతఁ దగుయదుభూ
పుని యన్వవాయచరితంబును జక్కఁగఁ దెల్పినాఁడవు కదా మాకున్. ౧౪ 3

ఉ. ఆయదువంశమందు జగమంతయు నిండియుఁ బ్రాకృతంబుగా
కాయతతేజ మొప్పెడుమహాశుభవిగ్రహభాగ మూనియే
యీయవనిన్ జనించిన పరేశ్వరువీర్యచరిత్రముల్ ముదం
బేయెడఁ గల్గఁ జేయఁదగి యెంతయుఁ బొల్చెడు వానిఁ దెల్పుమా. ౨ 4

మ. యదువంశంబున భూతభావనుఁడు సమ్యగ్ధర్మరక్షార్థమై
యుదయంబుం గని విశ్వమూర్తియయి తా నొప్పారియుం గేశవుం
డదనుం దప్పక యెట్టికార్యముల నెట్టిరీతులం జేసె వా
ని దయం జెప్పుము విస్తరించి వినఁగా నే నెంతు యోగీశ్వరా. ౩ 5

*సీ. భూతలంబున జనుల్ విముక్తులును, ముముక్షువులు, విషయాభిలాషులు నసంగ
మూఁడు తెఱంగులఁ బొల్తురు గతతృష్ణులందఱు గీర్తింపంగ నలరి భూరి
భవసాగరౌషధప్రాయమై శ్రవణాభిరామమై యామోదకారి యగుచు
శోభిల్లు నుత్తమశ్లోకు గుణానువాదము దాని మనుజగణమున యందు

* "నివృత్తతర్షైః." అనుచోటఁగల వ్యాఖ్యానార్థమే యిట గ్రహింపఁబడినదని యెఱుంగవలయును.

☞ తెలుఁగంకెలు శ్లోకసంఖ్యను దెలుపును.

తే. నాత్మతత్త్వం బెఱుంగనియట్టిదైన, యాపశుఘ్నుఁడు తక్కఁగనన్యుఁ డెవఁడు
చాలు వింటని దమిఁ హాసెనేలయింక, ననెడువాఁడు గలండె యోమునివరేణ్య.

చ. అతిరథులై యమర్త్యవిజయంబున ఖ్యాతిగడించు భీష్మము
ఖ్యతిమిసమూహాయుక్తని దురత్యయమౌ కురుసైన్యవార్ధి న
ప్రతిమజనార్ధ[1]నోడుపవిలంఘితులై తగుమత్పితామహుల్
వితత[2]సమీకమందుఁ గడుఁ పెడుకమీఱఁగ గోష్పదాకృతిన్. ౫ 7

క. తరియించి రట్టిశ్రీహరి, పరమాద్భుతచరిత మల్లఁభంగుల వినఁగా
నరుదౌ మత్పూర్వుల న్నాహరి రక్షించుటయు కాక యాదృతి నన్నున్. ౫ ౮

మ. పరిరక్షించను ద్రౌణి పైవఁగఁ బరప్రధ్వంసనాసక్తిభీ
కరదుర్వార [3]పితామహాస్త్రపరిదగ్ధంబైన నాయంగముం
గురుపాండ్వాన్వయబీజమున్ జననిదౌ కుక్షిం దపింపంగ నా
హరిఁ బ్రార్థింప సుదర్శనోజ్జ్వలకరుం డై కాచెఁ గాదె మునీ. ౬ 9

సీ. తత్త్వవిద్వ్యుఁడవు తగుదువు పలుకంగఁ బ్రాణిసంతతుల లోపలను వెలని
యునుమరూపంబునఁ బొల్పుయుఁ గాలరూపంబుల నొప్పయు బహుళకర్మ
ములను సర్వంబుగ ముక్తని భవరూపమృత్యువు నొసఁగుచు నిచ్ఛ తనరఁ
గా విలాసార్థముగను నరరూపంబు ధరియించినట్టి శ్రీహరిపరాక్ర

తే. మముల నెఱిఁగింపు మవ్వాని విమలమైన, యట్టి[4]యాంతరదృష్టిని నాదరమున
వినఁగఁ దగియుండువిషయదృష్టిని వినంగ, నప్ఫలమె లభించెడు సంద్రుగాదె.

క. మౌనీ! సంకర్షణుఁడనఁ, గా నొప్పడు రాముని మును కాంతారత్నం
బై నెగడెడురోహిణికిన్, సూనుం డని పల్కితివు శుంభద్భణితిన్. ౭౫ 11

తే. అతఁడు దేవకిగర్భంబునందు నెట్లు, లుండె దేహాంతరము లేక యొప్పు నెట్టు
లద్ది; శ్రీహరి యేల పితృసదనంబు, వదలి వ్రజమునకుంబోయెఁ బలుకవయ్య.

క. భగవంతుం డగుశ్రీహరి,కిఁ గలదె సాధ్వస మదేటికిం బోయునో యం
దుఁ గలిసి నందు సజాతి,యగణము నెట్టుండె నేగృహంబున మౌనీ. ౮౫ 13

[5]సీ. సర్వమోచనకర్త సర్వజ్ఞుఁడు నగుశ్రీహరి సాత్వతులకెల్ల నధిపుఁ డగుచు
వ్రజమున నివసించి వర్తించె నెవ్విధిఁ? దల్లియన్నను గంసుఁ దగదు చంప
నట్టులయ్యు నదేల హతముసరించను? మథురాపురంబున మఱియు ద్వార
కాపురంబున జగత్కారణుఁడౌదేవుఁ డేమేమికార్యము లెట్లు చేసె;

1 ఉడుపము = నావ. 2 సమీకము = యుద్ధము. 3 "ద్రౌణ్యస్త్రవిప్లుష్టమ్" అని మూలము. "ద్రోణేరశ్వత్థామ్నః బ్రహ్మాస్త్రేణ దగ్ధమ్" అని వ్యాఖ్య. 4 "విషయదృష్టిం విహాయాంతర్దృష్ట్యా తద్వీర్యాణి శ్రోతవ్యాని" అని వ్యాఖ్య. 5 "ముకుందః సర్వమోచనకర్తా" అని భావార్థదీపిక.

తే. మనుజతనువాశ్రయించి వృష్ణినికరంబుఁ
గలిసి యెన్ని వత్సరములు ఽ గడపె; మథుర
యందు నెన్ని వర్షము లుండె ఽ నామె పోశ్వ
రునకు నెందఱు పత్నులుఽగను జెలఁగిరి. ౧౧ 14

చ. మునివర! కృష్ణచేష్టితము ఽ భూరితరంబుగ నింక నేటిగా
న్నను వచియింపఁగాఁ దగుదు ఽ నాకు, సమస్త మెఱుంగు ప్రోదిగా
తనరెడునీవు శ్రద్ధ మదిఁ ఽ దాల్చినవాఁడ నటంచుఁ బ్రీతిని
న్నని యతివిస్తృతంబుగ నిఁకన్ వచియింపుము జాగు సేయకన్. ౧౨ 15

ఉ. [1]ఆఁకలి దప్పియున్ మిగుల ఽ నాతురనట్టుగ నుండె నీవు వ
ట్లో కమలాక్షుగాథ వినఽనోపుము వందురు యేను డూర్వఁగా
రాక చెలంగునాఁకలి, విరామము లేనిదియు యించు దప్పయున్
దాఁకవు సుంత నీరమును ఽ ద్రావఁగ మానిన నన్ను నోములా. ౧౩ 16

ఉ. కారణ మేమియం చడుగఁగాఁ దలపోయుదు నేను సమున్నతాం
భోరుహవిచ్యుతం బగుచుఁ ఽ బొల్చుముకుంద నిరుక్తగాథనిన్
స్ఫారతరామృతంబుఁ దమి ఽ పర్వఁగఁ ద్రావుచు నుండినందు నే
నారసి తెల్పువాఁడ నిఁక ఽ నాహారచిత్రచరిత్ర మొప్పఁగన్. ౧౪ 17

క. వినిపింపు మనుచుఁ బ్రశ్నించెను మౌనివరేణ్యా! యంత ఽ తులసానిధియు
ట్టనియెను సూతుం డవ్వల, మునిపల్కువిధంబు వినుము ఽ మోదింపఁగన్. 18

సీ. అని చెప్పఁబూనె నిట్టు వసిష్ఠరుఁడు పరీక్షుత్తు ప్రశ్నించిన ఽ శ్రీహరివిష
య మగుసద్వాదంబు ఽ నాలకించి మహాత్ముఁ డౌనౌనె యోగి యుత్సాహదనము
ప్రశ్నము శ్లాఘించి ఽ పరమాత్మచరితంబుఁ గలశోలకల్మషఘ్నంబుఁ జెప్ప
గను బూనె [2]భాగవతనికరమున మేటి యగుట; రంజిల్లియుండు మీట

తే. వైన భక్తవరేణ్య! నీయంతరంగ, మమలమగుఁ గృతనిశ్చయుఁ ఽ బగును వాసు
దేవుగాథల వినఁగ నతిస్థిరమగు, నిష్ఠయును బ్రీతియును గల్గ ఽ నెగడె నార. ౧౫

మ. వినవయ్యా! యిఁక వాసుదేవునికథావృత్తాంతసంప్రశ్నముల్
వినువానిన్ వినిపించువాని మఱి యీవృత్తాంత మేమించు న
య్యనఘ ప్రశ్నించెడువాని నీముగుర నత్యంతంబు పూతాత్ములై
తనరంజేయును [3]దత్పదోదకముచందంబునన్ విడంబించుచున్. ౧౬ 20

చ. ధరణియు దృప్తభూమిపతి ఽ దంభమహాసురవీరు లెందఱో
చరయఁగరానిచందమున ఽ నంతటఁ బర్వుచు భూరిభారమున్

1 "నను క్షుత్తృడ్భ్యాం పీడితస్య తవ కథశ్రవణావకాశః" అనుదాని కిది తెలుఁగు. 2 భాగవతప్రధానః" అని మూలము. 3 "తత్పాదసలిలం యథా" అని మూలము.

బరఁగఁగఁ జేయ నోప్పుకోనుసపాటి ధృతిం గనలేక బ్రహ్మనే
శరణము వేఁడఁబోయెఁ దనచందము చెప్పెడునూహ యుబ్బఁగన్. ౧౬ 21

తే. గోపురూపంబు దాల్చి మిక్కుటపువ్యసన
మునను గన్నీరు గాఱ నాతనియెదుటను
గరుణముగ నేడ్చుచున్ ఖేద మురుతరముగఁ
గన్పడన్ నిల్చి పల్కె స్వకష్టవిధము. ౧౭ 22

చ. సరసిజసూతి యెంతయును స్వాంతమునం దలపోసి పాలసం
బరయఁగ విష్ణుమూర్తిదగు నాపరమేశ్వరుఁ గానఁబోయి వి
స్తరముగఁ దెల్పు టొప్పు నని శంకరు వేఁడ ధరిత్రి దేవతో
త్కరమునుగూడి యాకలశకంధిమనోహరతీరభూమికిన్. ౧౮ 23

[1]చ. చని యట నిల్చి శ్రీపతిని సర్వజగత్పతి దేవతాపతిన్
వనటఁ గృశించువారి వగవాంఛల నిచ్చుచు దుఃఖసంతతిం
గనకయె భక్తు లుల్లసిలఁగా నొనరించుచు నుండు కేశవున్
మనమున నిల్పి యాపురుషమండను బుణ్యమనోనివాసునిన్. ౧౯ 24

ఆ. పురుషసూక్తమునను బూనిక వినుతించి, ధ్యాననిష్ఠనుండి యబ్జినుండి
వినఁగఁబడినవాక్కు విబుధుల కెఱిఁగింపఁ, దలఁచి యిట్టు లనియె ధాత యెలమి.

మ. వినుఁ డో దేవతలార! శ్రీహరివచోవృత్తాంతమేఁ జెప్పఁగా
విని శీఘ్రంబుగ నట్ల చేయుఁడు మనోవీథిన్ రవంతేని యా
పని యేలంచుఁ దలంపరాదు ధరణీభారజ్వరం బింతకున్
మును పే యప్పరమేశ్వరుం డెఱిఁగెఁ దా [2]భూతాళిలో నుండుటన్. ౨౦ 26

క. మీమీయంశంబులచే, భూమిన్ యదువంశమందుఁ బుట్టుఁడు హరియున్
భూమిమహాభారము స్వీయామలకాలైకశక్తి నడఁగించుఁ దగన్. ౨౧ 27

ఆ. ఎంతదనుక నామహేశ్వరుఁ డిప్పుడు, జేయునంతదనుక క్షితిని మీర
లుండి సేవ చేయుఁ డురుపుణ్యుఁ డావసు, దేవునింట దేవదేవుఁ డజుఁడు. 28

క. పరమపురుషుఁ డిష్టార్థో,త్కరదుఁడు జనియింపఁగలఁడు గావున సురసుం
దరులెల్లఁ దత్ప్రియార్థము, ధరఁ బుట్టి చరింత్రు గాక తద్గతమతులై. ౨౩ 29

క. హరికళయై దేవుండై, స్వరాట్టువుగ నొప్పు శేషసంజ్ఞుఁడు ధరపై
హరి కగ్రజుఁడై పుట్టెడు, హరికిం బ్రియ మొప్పఁ జేయు నభిలాషమునన్. ౨౪

1 "తత్ర గత్వా జగన్నాథం దేవదేవం వృషాకపిమ్" అని మూ. "వర్షత్యభీష్టమితి వృషః. అకాద్దుఃఖాత్పాతీతి అకపిః." అని భావార్థదీపిక. దానియర్థమే యిటఁ దెలుపఁబడినది. 2 "పురైవ పుంసావధృతో ధరాజ్వరః." అని మూ. "పుంసా అంతర్యామినా" అని శ్రీధరాచార్యులు.

సీ. ఏజననయిత్రిచేఁ నెల్లలోకంబులు సమ్మోహితంబులై షడ్గుణాఖ్య
సంపత్తిచే దగి శక్తి నా నెగడెడు శ్రీవిష్ణుమాయయే శ్రుతిని స్వాంశ
మునఁ బుట్టఁగలదు శ్రీశునియాజ్ఞఁ గైకొని దేవకీగర్భంబుఁ దిగిచి మఱొక
తావును జేర్పంగఁ బావనమతియగు నాయశోదను మోహితాత్మఁ జేయు,

తే. నింక నెన్నివిధంబుల నెన్నొపనుల, నొసరుపంబూని యుండు నోజనపతీంద్ర
యనుచు దేవగణంబులకజుఁడు తెలిపి, వెతల మిగులంగఁ గుందెడుక్షితినిఁజూచి.

క. కరుణాశీతలజలశీ, కరములఁ బర్వంగఁజేయఁగడఁగుపలుకులన్
బరితాప మాఱఁ బల్కుచుఁ, బరమంబగు స్వపదమునకుఁ బరమేష్ఠి చనెన్. ౨౬

క. వినుము పరీక్షిత్తా శ్రీ, వనజాక్షుం డవతరించు భవ్యస్థలమున్
వినిపింతు శూరనామక, జనపతి యదువంశవిభుఁడు సత్త్వము పొంగన్. ౨౭

క. నివసించెన్ మథురానగ,రవరంబున నతఁడు మాథురములను నామం
బు వఱలఁదగుదేశంబుల, సవిధిగఁ బాలించుచుండ జనరంజకుఁడై. ౨౮ 34

తే. శూరసేనదేశంబుల సొబగుమీఱ
మున్ను పాలించుచున్ భూరిభోగములను
గుడుచుచుండెను; వనజనేత్రుఁడు పరాత్ప
రుఁడును నగుచక్రి యేపురిఁ బొడమి వెలసె. ౨౯ 35

క. ఆమథురానగరమె యదు, భూమండలపతులకెల్లఁ బూజ్యమహాశ్రీ
ధామ మగురాజధానిగ, నై మహితయశంబు గాంచె హరికృపచేతన్. ౩౦ 36

క. ఆనగరంబున శూరుని, సూనుఁడు వసుదేవుఁ డొకట శుభలగ్నమునన్
మానిని దేవకిఁ బెండిలి, యై నవవధు వెలయఁగూడి స్యందన మెక్కెన్. ౩౧ 37

క. అరుగం బూనెన్ దనదగు, పురి; కత్తఱి నుగ్రసేనపుత్త్రుఁడు కంసుం
డురుముదమును దనప్రియసో,దరికిం గల్గింపఁబూని దా సారథియై. ౩౨ 38

[1]సీ. పెండ్లికాలంబునఁ బ్రియబంధువే రథరశ్ములఁ బట్టనౌ రమ్యరతి
ననెడువంశాచారమును సార్థకముచేయ సౌవర్ణరశ్ముల సంగ్రహించి
రథమును దోల నారంభించె నాల్గువందలయరదంబులు తన్నుఁ గొలువ
[2]దేవకుం డత్తఱి దేవకీదేవికి నరణంబుగా మృదుహైమమాల

తే. కాంచితములుగఁ దగుమదహస్తివరము
లను జతుశ్శతసంఖ్యల ఘనతురంగ
మములఁ బదివేల మఱి శతాంగముల [3]మూఁడు
నాఱుశతముల సంప్రీతి నప్పు డొసఁగె. ౩౩ 39

1 "వివాహకాలే రథరశ్మిగ్రహణ మత్యంతబంధునా కార్యమితి దర్శనార్థమ్" అని వంశీధరి వ్యాఖ్య. 2 దేవకుఁ డనునది యుగ్రసేనునినామాంతరము. 3 "రథానాం చ త్రిషట్ఛతమ్" అని మూ.

1ఉ. అంటినఁ గందిపోవు నన నంగము లొప్పఁ జెలంగు నట్టివా
ల్గంటుల రత్నభూషణనికాయవిభూషితగాత్రలన్ గనన్
మింటఁ జరించు నచ్చరల మించినవారల రెండునూర్ల నా
కంటకసూదనుం డొసఁగె గాదిలికూఁతును గొల్పువారలన్. ౩౧౫ 40

క. తనయారత్నముపై నిం,తనరానితమిం జెలంగు ధాత్రీపతి భ
ర్తను గూడిపోవు నత్తఱిఁ, దనవిభవార్హముగ నిచ్చె ద్రవ్యచయంబున్. ౩౧౬

క. నూతనతరదంపతులకు, నాతతమంగళము గల్గుకొన ట్లొక్కట నా
భూతలపతియానతిఁ దూ,ర్యాతతనిస్స్వాన మొప్పె హారితరముగన్. ౩౧౭ 42

సీ. శంఖమృదంగనిస్స్వనములుదుందుభినాదముల్ జనులెల్ల మోద మంద
నా ప్రయాణంబున నసుదుగమించెను; గంసుఁ డంతటను బ్రగ్రహములగుమి
వదలి నేర్పున రథవర మతివేగముగాఁ బోవునట్లుగాఁ గడపుచుండ;
గంసా! యనుచుఁ బిల్చి గగనంబునుండి వాక్కొక్కటి వీతెంచె నువిదమిన్న

తే. యైన యీదేవకీదేవి యష్టమమగు
గర్భ మంతకమగు నీకుఁ గడుజడుండ
వై సహోదరి కూర్చున్న స్యందనమును
గడపుచున్నావు మీఁదటిక్రమ మెఱుఁగక. ౩౧౮ 43

చ. అనుటయు నాలకించి ఖలుఁ డై యఘరూపుఁడు భోజవంశపాం
సనుఁడును నైనకంసుఁడు నిశాతకృపాణముఁ జేతఁ బూని యి
ట్లొనరుచు టెంత యేఁ బొసఁగు నొక్కొ యటంచుఁ దలంప కాగ్రహం
బునఁ ద్వరఁ బాఱె యాభగిని పూజ్యమనోహరకేశబంధమున్. ౩౧౯ 44

2చ. కరమునఁ బట్టె; నవ్విధముఁ గాంచి స్వజన్మమునన్ వియచ్చరో
త్కరములు సాధువాద్యములఁ గ్రమ్మవిభూతియుతుండుగా నగున్
ధరణి నటంచుఁ దెల్పుటను దామరసాక్షుఁడు పుట్టఁజాలు భా
గ్యరతిని గాంచుటన్ శమము గల్గినయావసుదేవుఁ డల్లనన్. ౩౨౦ 45

తే. ఏవగల్గించుకార్యంబు నిట్లుచేయఁ, దలఁచియున్నట్టి క్రూరుని దన్ను నింద
చేయుదురు మానవులటన్న సిగ్గులేని, యాతురుని సామమార్గవాక్యములు పలికి.

చ. మనమున బాధ చేసెడు కుమార్గముఁ గ్రోధము మాప నెంచి మె
త్తనిపలుకుల్ చెలంగఁ దనతాలిమి యెంతయుఁ గార్యకారియై
కనఁబడఁ బల్కె; భోజకులకమ్రయశస్కర, శూరవారమా
న్యనిఖిలసద్గుణాకర! వినందగు నాపలుకొక్కఁ డిత్తఱిన్. ౩౨౨ 47

1 "దాసీనాం సుకుమారీణాం" అని మూ. 2 "వసుదేవో మహాభాగ ఉవాచ పరిసాంత్వయన్" అని మూ. "స్వజన్మని మాత్రేణ దైవతైరానకదుందుభిధ్వనికరణాద్భావిభగవదవతారేణ శక్యప్రతికారతా సంభవతీతి. అని వ్యాఖ్య.

క. నీవు కులీనుండవు మఱి, భూవిభుఁడవు స్త్రీని జంపఁ బోలునె? యందున్
దేవకి నీతోఁబుట్టువు, పావనియు నఘోఘయు నగు § భావింపు మెదన్. ౩౨ 48

తే. ఆఁడుతోఁబుట్టువును జంప ననర్హ మగునె, యందు నిప్పుడె పెండ్లియై యాసులక్ష
ణములతోఁగూడియున్న దిమమతఁ జూపఁ దగినదే కాని చంపఁగాఁ దగదు సుమ్ము.

చ. మరణము భీతిదంబగుట § మామకవిగ్రహరక్షణార్థ మీ
తరుణిని జంపకుండ నిట § ధర్మము నెంచుట యెట్టు లందువో
నరవరపుత్త్రకా! వినుము § నాపలుకొక్కటి దేహధారులై
పరఁగెడువారి కెల్లరకు § వర్షముతోడనె మృత్యు వొప్పుఁ జూ. ౩౨౪ 50

ఉ. ఇప్పుడొ నూఱువత్సరము § లేగినయప్పుడొ ప్రాణికోటికిం
దప్పక కల్గు మృత్యు విది § తథ్యము; దేహము పంచతం గనం
జొప్పడి యున్న కర్మగతిఁ § జొచ్చుచు దేహి స్వతంత్రహీనతన్
దెప్పున నూత్న దేహమునఁ § దేజము నించుచుఁ బ్రాక్తనాంగమున్. ౩౮౪ 51

క. వదలును వేగంబునఁ బో,వఁదలఁచు పురుషుండు ముందుఁ § బద మొక్కఁడు పె
ట్టి దనశరీరము సుస్థితి, నొదవంగాఁ జేసి వెనుక § నొప్పు పదంబున్. ౩౬ 52

క. కదలించి యరుగు నంతర, మొదవదు వానికిని భేద § మొప్పఁ గనుపడం
గద విషయద్వయమున క్రి,య్యాది గన్పడుఁ దృణజలూక § యందుం గంసా. 53

చ. తనువున ముందుభాగమును § దా మెలమెల్లన నెత్తి యొక్కచో
ననువుగ నుంచి వెన్కఁ దగు § నంగము నెత్తి స్థలాంతరంబు నొ
య్యన సుఖవృత్తిఁ జేరు నటు § లాత్మకృతం బగు కర్మసంగతిన్
గని నిజపూర్వదేహమును § గ్రన్నన వీడును దేహి భూవరా. ౪౦ 54

*సీ. తనువు త్యజించుట § గనఁబడ దెట్లొండు తనువుఁ దాల్చుట గనఁ § దగకయుండు
నన్న సంశయమును § హత మొనరింపఁగాఁ దలఁచి యిట్లను రాజ § దర్శనంబు
గనఁబడుఁ గన్నులకును మహేంద్రవిభూతి వినఁబడు నీ రెంట § వెలయునొక్క
సంస్కార మది మదిఁ § జక్కఁగా నాటును దానినే తలఁచుచుఁ § దదనుగుణము

తే. లైన రాజాదిరూపముల్ § గానఁబడఁగ, నదియె నేనని యూహించు § నట్టిపొంది
నట్లు తలపోయు నిద్రయం § దపగతస్మృతిని బురాతన దేహముఁ § గనఁగలేక.

క. జీవుఁడు దేహాంతరమును, భావించుచుఁ బొంది పూర్వ § పక్షము నవలన్
దా వదలునప్డు భయశో, కావిలచిత్తుండు గాక § యలరుం జుమ్మీ. ౪౧ 56

* "స్వప్నే యథాపశ్యతి దేహమీదృశమ్" అను శ్లోకమునఁ గలయర్థమే యిందు మూఁడు పద్యములలో విస్తరింపఁబడినది.

క. తనువును వేఱొకదానిం, గను వెట్లనఁ బూర్వజన్మకర్మము లెల్లం
దనుఁ బురికొలుపఁగ నూతన, తనువుం దత్కర్మఫలవితానము నొందన్. ౫౭ 57

సీ. తగినదానింబొందు; దానికిఁ గారణ మేమనఁ జెప్పెద నింక వినుము
సంకల్పము వికల్పసంజ్ఞికమగువికారములను లోనయి యమరు మనసు
పంచత్వసమయమం దంచితపంచగుణవిషయములయందు వివిధదేహ
రూపముగా మాయ ప్రాపింపఁజేయఁగా వానిఫలంబుల వరుసఁ బొందఁ

తే. ద్రోహింపుచేయునాకర్మ సునకుఁ జిక్కి
మన మచెట్టిదేహంబును గొనఁగఁ బరుగు
లిడుచు నెద్దానిఁ దా స్మరియించునో యటు
దేహియును దానిఁ జొచ్చుచు దేహము గను. ౫౮ 58

క. మనసే నే నని తలఁచుచు, మనసునె సాయముగఁ గొనుచు మఱి జన్మించున్
మనుజేంద్రతనయ జీవుని, జననవిధం బిదియె యనుచుఁజనుఁ దలపోయన్. ౫౯

చ. కలుగునుగాక దేహమది కర్మవశంబున దానిరక్షకై
మలినమున్నైన కార్యములు మానక చేయుట యుక్తమంచు ని
మ్ములఁ బలుకంగఁ బూనెదవొ భూపకుమారక! చంద్రముఖ్యులం
గలిగినతేజ మొక్కట నఖండజలాప్తమ్యర్ధ్మటాదులన్. 60

క. ప్రతిబింబించుచు ననిలుని, గతికం దగినట్లుగాఁగఁ గంపము నొందున్
మతిఁ దలఁప సత్య మెట్లగు?, క్షితిపాలా! యటులె దేహి చిత్రతనువులన్. ౬౧

సీ. తన యవిద్యాకల్పితముల నానావిధగుణయుక్తముల రాగగుణముచేత
నొంది యియ్యది నాది యిందు నేనుండుదు నసునభిమానంబునందుఁ జొచ్చు;
తలపోసి చూడ నాత్మకును దేహాదుల యధ్యాసమున జన్మ మగునటంచుఁ
జెప్పంగఁబడు మఱి చెలఁగు నన్యోన్యధర్మాధ్యాసమునను దేహాదిధర్మ

తే. ములగుకార్శ్యాదు లాత్మయం దొలసినట్లు
కల్పితములగుఁ దద్ధర్మగణ మనంగఁ
జనెడుప్రేమాస్పదత్వాదులును దనువుల
యందుఁ గల్పితములె యంచు నరయవలయు. ౬౩ 62

క. కనుకన్ మృత్యువుఁ దప్పింపను జేయుప్రయత్న మనువుపడదని యెఱుఁగం
జను; గంసా! యని సామంబును మానుచు భేద మనఁగఁబొలుచు పథమునన్.

క. ఇంచుక వినిపింపఁగ మది, నెంచి కుమారా! మదుక్తి నెన్ను మెవరికే
నించుక ద్రోహము చేయఁగ, నెంచుట సరిగాదు తత్త్వ మెఱుఁగు టదియె సూ.

క. తనమేలుకోఱకుఁ బరులకు, నొనరించెడుద్రోహ మదియె యొసఁగు నశుభమున్
గనుకన్ స్వాత్మహితంబును, గనఁ గోరెడువాఁడు చేయఁగలఁడె యహితమున్.

క. పరులకు హాని నొనర్చిన, బరులవలన హాని గల్గు బరులకు హానిన్
బరఁగం జేయనివానికి, ధరఁ గలదే పరభయంబు తలఁపుము మదిలోన్. ౬౬

చ. కనుఁగొనవయ్య దీని నిది గాదిలిచెల్లెలు ముద్దరాలు పు
త్త్రినివలెఁ జూడఁగాఁ దగును దీనయునై కనుపట్టు దీనుగా
జనులను వత్సలత్వమున సంతతముం గనుచుండుటీవు చం
పను దగునే వివాహవిధి భద్రములొందఁగ వర్తిలెడి కడా. ౬౭ 67

క. అని యివ్విధిని బరీక్షి, జ్జనపాలున కెఱుకపఱచి సరగున దరువా
తినిఖిలవృత్తాంతము దెల్పను బూని శుకాఖ్యయోగిపాలుఁడు దనిరోన్. ౬౮ 68

క. భూనాథతనయుఁ డివ్విధి, నానకదుందుభియు సామ మన్నన గోరం
బూని వచించినపల్కులు, మానసమును సుంతయేని మాన్పఁగలేమిన్. ౬౯ 69

ఉ. దారుణచిత్తుఁడై కఠినదానవకృత్యముఁ జేయఁబూని కో
పారుణితేక్షణుం డగుచు నాసరవాలము డింపఁడుండె; నా
క్రూరునిచిత్తవృత్తిఁ గని కొంకక నీడపు నధింప నున్నవాఁ
డీరస మూనె నం చెఱిఁగి యెవ్విధి నీని మనల్ప నొనర్తు. ౭౦ 70

క. అని యానకదుందుభి మన,మున నెంచుచుఁ బ్రేయసికిని బొడమినకష్ట
బును మాన్చునుపాయంబును, దనమది యోజించి యిట్లు తలఁచెం జొప్పన్.

మ. మతిమంతుం డగువాఁడు మృత్యుపుగతిన్ మాన్పంగఁ బూనంగరా
జతనం బొప్పఁగ నాత్మబుద్ధిబల మేరచందాన వ్యాపించు నా
జతనంబెల్ల ఫలింపకుండ మృతి యేరచం బూనినన్ దేషిం ని
ష్కృతి గావింపని తప్పునుండి తొలఁగున్ గృత్యంబుఁ గావించుటన్. ౭౨ 72

ఉ. కాంతకు మృత్యువై తగినకంసునకున్ సుతసంతతి నిత్తు వం
చెంతయు నమ్మఁ బల్కి మృతి కొంతయుఁ గుందు మటియుఁ గొంత త
ప్పింతును జావునుండి; మఱి ప్రేయసికిన్ సుతు లుద్భవింతు రే
నంతట నెట్లు గావలయు నట్లగు భార్యయు నిష్ట దక్కఁగా. ౭౩ 73

క. సుతు లుదయింపకమునుపే, మృతిరూపతఁగానఁబడెడు నితఁడు బ్రదికి యీ
క్షితినుండునే నొసంగుదు, సుతులన్ వాగ్దానరీతి సూనృత మగుఁ గా. ౭౪ 74

*సీ. తనయులుగల్గి యీతండును జానకయుండునే మత్సుతుఁ గుఱుబలుఁడయి
యీతనిఁ జంపిన నీకృతి సఫలమౌ నిట్లు విపర్యయ మేల విధిని
గారాదు? ప్రౌఢుఁడై క్రాలు నీకంసుని మద్బాలకుం డెట్లు గ్రుంగఁజేయు
ననుశంక యేటికి? వనితకు దీనికిఁ బుట్టెడి యష్టమపుత్త్రుఁ డితనిఁ

* "విపర్యయో వా కిం న స్యాద్గతిర్ధాతుర్దురత్యయా, ఉపస్థితో నివర్తేత నివృత్తః పునరాప తేత్." అనుమూలమునకుఁ గలవ్యాఖ్యానసార మిందుఁ గలదు.

తే. జంపు నసుధాత్రి చేష్టలు స్వాంతమందుఁ, దలఁప శక్యంబు లే కావు దాపరించి
యున్న మృత్యువు లంగనా యున్న మాట, వలన నయ్యెడి మరలు గలుగు నేని.

క. నాయనుజారోధం బత్తెఱఁ, నేయనువున లేకయుండు నివ్విధమున నే
యాయవనిం గలప్రాణసి, కాయుగతాపృష్ట మెన్నఁగాఁ బర మగునే. ౫౦ 76

చ. అనలుఁడు కాననప్రదహనావసరంబున జెంతనున్న చె
ట్ల నిలిచి దూరమందిలి కాలంకతతులఁ దహియించు నుగ్రలఁ గా
ల్చునపుడు దూరగేహము జొచ్చి పట్టించుచుఁ జెంతనున్న వా
నిని దహియింపకుండు మఱియు దలఁపంగ నదృష్టహేతువే. ౫౦½ 77

క. దీనికిఁ గారణ మగునని, గానంబడు నిట్టి ప్రాణిగణమున కెల్లన్
దో నడుగుట విడిపోవుట, గానంబడదు హేతువాక్యకర్మము తప్పన్. ౫౧ 78

క. జననమునకు మరణమునకుఁ, గనుఁగొనఁగాఁ గారణంబు కర్మమె యని తే
లును నదియు నదృష్టం బని, యనుచు జెప్పంబడును బెద్దలొప్పుడు రిట్లే. ౫౧ 79

క. కనుకనె నాడు ప్రతిజ్ఞలను, ఘనపాపము సేయఁబూనఁగాఁ జాల దటం
చును జక్క విమర్శించుచు, దనమదికిం బొసఁగు దాని దత్పరమతియై. ౫౧½

క. వానికి నెలకొనఁగించఁగా, బూని మహాపాపకార్యమును జేయంగాఁ
దా నెంచు పాపమతి బహుళ, మానపు వ్యసనముగాఁగ మాటలచేతన్, ౫౨ 81

క. ఆరాధించును; మఱి యా, శౌరి ప్రసన్నాననాంబుజన్ముం డగుచున్
భీరువుఁ జంపం దలఁచెడు, క్రూరుని లజ్జావిహీనుఁ గొంకనివానిన్. ౫౨½ 82

క. పరికంపించు మనస్సున, సురయాడుచునుండి కల్పితోత్సాహమునం
బరఁగెడునవ్వు గనంబడ, నరదేవకుమారుతోడ నయముగఁ బలికెన్. ౫౩ 83

క. ఈతరుణివలన నీకున్, భీతియు లేదింక సౌమ్య! వియదభిహితవా
క్యకేళి వను దద్విషయ, మ్మీతన్వికిఁ గల్గఁబోవు నెల్లతనయులన్. ౫౩½ 84

క. నీకప్పన వారిచేత, నీకీ వసుసాధ్వసము జనింప నిమిత్తం
బై కల్గఁబోవువారటు, గాకుండఁగఁ బుట్టినపుడె కడువడి నిత్తున్. ౫౪ 85

*వ. అన్యోన్యాపేక్షచే నెల్లరు నష్టములే యగుదురు గాన నీకు సంశయంబొదవక
యుండ నెల్లర నిత్తుం గైకొందువు గాక యని పలికిన. 86

మ. విని తద్వాక్యములం గల్గుసారము మదిన్ వీక్షించి యానోదరిం
దునుమం బూనినవృత్తి మాని వదలెం దోఁబుట్టువుం గంసుఁ డం
త నిజాభీష్టము నెగ్గఁ బ్రీతుఁడయి యాత్మప్రాణతుల్యన్ మన
స్విని నా దేవకిఁ గూడి శౌరి యతనిం బ్రీతాత్ముఁగాఁ జేయుచున్. ౫౫ 87

---

* "అన్యోన్యాపేక్షయా సర్వేఽప్యష్టమా భవేయురితి సర్వానపి తాన్ పుత్రాన్ సమర్పయిష్యే" అని వ్యాఖ్య. ఇదియే యిందుఁ గలదని యెఱుంగవలయు.

క. వినుతించుచు గృహమునకుం, జనియెన్; మఱికొన్ని నెలలు జరగన్ భగవం
తుని దనయునిగాఁ గనఁదగు, ననుపమభాగ్యాన్వితయయి [1]హరిదేవతయై.

క. అలరెడు దేవకి సుతుఁ గనఁ, గలకాలము ప్రాప్తమైనఁ గ్రమ్మఱఁ గనెన్
లలి నవలం బ్రతివత్సర, మలఘుగుణాకలిత సుతుల నతివ [illegible]. ౮౯

క. కనియెన్ వరుసఁగఁ బుత్త్రుల, నెనమండ్రు గురం గుమారు నిర్విఘ్నతఁ దోడ్తెం
గనినట్టి కీర్తిమంతుం, డనుతనయుని సన్మృతభీతి నాత్మ నడఁచుచున్. ౯౦ 90

క. ఆనకదుందుభి చేకొని, తా నతికష్టమునఁ గంసధరణీశునకున్
మానక యర్పించెను; దద్భూనాథుఁడు చంపు ననుచు బుద్ధి నెఱిఁగియున్. ౯౧

[2]సీ. ఓపరీక్షిన్నృపాలోత్తమ! మృత్యువునకు నెట్టు లిచ్చెఁ బుత్త్రుని ననెదు
వేమొ [3]సూనృతసంధులౌ మాన్యులకు దుస్సహం బగు కార్యమిక్కడ ననఁగలదె
[4]ప్రియపుత్త్రలాలనాపేక్ష యెవ్విధి మాని నందెనో భగవంతుఁడేయయనఁ గద
తత్త్వంబు వేఱొండు తలపోయ లేదని యెఱిఁగినవారికి నిష్టమైన
తే. దొకఁడు కల్గునె? తానె పుత్త్రుని గొనుచుఁ
జనినఁ జంపకయుండునో యని తలంచి
కొనిచనియెఁ గాని సత్యంబు గోఱి కటంచు
నెట్లు తలపంగఁ జను నందు నేమొ వినుము. ౯౨ 92

క. జననాథ! నీచనరులకు, నొనరింపఁగ రాని దెద్ది యుండును? ఖలు యీ
యను బూన దేవకియు నెట్లనుమోదముఁ జూపఁజాలె నందనవాలాయమా. ౯౩

క. మతియందు హరి ధరించెడు, నతులితగుణవంతులైన సయుక్తినుల కె
ట్టితఱిన్ దుస్త్యజ మెయ్యది, తుద నని తలపోయుమయ్య శ్రీహరిభక్తా. ౯౪

చ. తనయుని దెచ్చియున్న హరితత్త్వ మెఱింగిన శౌరిఁ గాంచి యా
తనిసమబుద్ధికిన్ మిగులఁ దథ్యపథంబునఁ గల్గునిష్ఠకున్
మనమునఁ దుష్టిగల్గి నృపకమండనుఁడై [illegible] న
వ్వున ముఖమొప్ప నిట్లనియెఁ బొమ్ము కుమారునిఁ గూడి యుంటికిన్. ౯౫ 95

ఉ. ఈతనినుండి సాధ్వస మొకింతయుఁ గల్గదు నాకు వీనికిన్
భ్రాతగఁ బుట్టు నష్టముఁ డరాతి గదా ననుఁ జంపు నంచు న
త్యాతతపుష్కరోక్తి వినఁగయ్యెను వానినె చంపువాఁడ ని
వీతనయున్ సహోదరికి నీఁదగుఁ నాపుడు శౌరి హృష్టుఁడై. ౯౬ 96

1 "దేవకీ సర్వదేవతా" అని మూ. "సర్వస్సర్వాత్మా భగవానేవ దేవతా యస్యాః" అని వ్యాఖ్య. 2 "మృత్యవే పుత్త్రం కథ మర్పితవాన్ నిత్యాపేక్షాయామపి" అనుదాని కిది తెలుఁగు. 3 "కిందుస్సహం ను సాధూనాం = సాధూనాం సత్యసంధానామ్" అని వ్యాఖ్య. 4 "పుత్త్రలాలన సుఖాపేక్షా కథం త్యక్తేత్యత ఆహ" అనుదాని కిది తెలుఁగు.

క. కొనిపోయెద నట్లేయని, తనయుం దోడ్కొనుచుఁ బోయెఁ దద్వాక్యమును నె
మ్మనమున నమ్మక మోదం,బును గాంచకయుండె దుష్టభూపతి యనుచున్. ౬౦౪

ఆ. అవిజితాత్ముఁ డనుచు నాత్మస్థిరత్వము, లేనివాఁడె యనుచు దాని నమ్మి
పోయి నొంద రాదు హతమతి యేవేళ, కేమి హానిచేయ నెంచునో యని. ౬౧

—౼ నారదుఁడు కంసున కుపదేశించుట. ౼—

క. పిలువనిపేరంటముగాఁ, గలహాసనుఁ డనెడుబిరుదుఁ గాంచినముని యి
మ్ములఁ గంసుని గన వచ్చెను, దెలుపుటకై హితము దివిజాధీరులపూన్కిన్. 99

క. ఏకాంతంబునఁ గంసమహీకాంతునితోడఁ బలికె నెఱుఁగవు కంసా
యేకరణి దేవయత్నము, నీకొఱకై సాగుచుండు నిత్యము పూన్కిన్. ౬౨ 100

సీ. వ్రజమునఁ దగియున్న రమ్యతరాంగులు నందాదిగోపకనాయకులును
వారలపత్నులు వసుదేవముఖ్యులు వృష్ణివీరులు కీర్తి వెలయునట్టి
దేవకి లోనగు తెఱవలు దేవాంశములఁ బుట్టినారని తెలియవలయు
నందశౌరులకులమందుఁ బుట్టినవార లమరాంశసంభూతు లగుట నిజము

తే. వీరిజ్ఞాతులు బాంధవవారములును, మఱియుఁ దన్మిత్రములు సురమహితభాగ
జనితులే సుమ్ము; కంస నిన్ననుసరించి, యున్నవారలు దైత్యులై యొప్పువారు.

*క. జ్ఞానములేమి నెఱుంగవు, భూనాయక! వీరలే విబుధు లని మీరల్
దానవులని భూభారముఁ, బోనడపఁగ దైత్యవారముం ద్రుంపంగన్. ౬౩౪ 102

చ. హరి యవతారమొందఁ దివిజావళి కోరుట దేవకీమనో
హరతనయత్వమొంద నతఁ డాదరణంబున నొప్పుకొంటయున్
సుర లొగి స్వాంశరూపముల క్షోణి జనించుటయుం దలంపలే
క రహితబుద్ధివైతి వని గట్టిగఁ జెప్పెను నారదుండటన్. ౬౮ 103

క. భగవంతుఁ డైననారదుఁ, డగణితమహిమాఢ్యుఁ డౌట నమరులపని నిం
పుగఁ దీర్పఁబూని తెల్పెను, దగునిది యని నమ్మి కంసధాత్రీపతియున్. ౬౮ 104

చ. మునిపతి నారదుండు చన మోమున విన్నదనంబు తోఁపఁగాఁ
దను వధియింప దేవకికి దానవవైరి కుమారుఁడై జనిం
చును యదువీరులే సురలు శౌరుల దైత్యులఁ జంపఁ బుట్టిరం
చును దలపోసి యత్తఱిని శౌరకుమారుని దేవకీసతిన్. ౬౯ 105

చ. కరుణ దొఱంగి శృంఖలనికాయములం దగిలించి మందిరాం
తరమున నుంచెఁ దత్సుతులు తప్పక తన్ను వధింతు రన్నతీ
వరమునఁ బుట్టినంతటనె వారిజనేత్రుఁడె యన్నశంక భీ

* "ఉభయోరపి భారత" అని మూలము. "భా జ్ఞానం తత్రారత భారతత్వాదేవైతజ్జ్ఞానం తవ
నాస్తీతి భావః." దీనిసారమే యిది.

కరకరవాల మూని హతఽకంఠులఁ జేయుచు నచ్చొ ప్రేల్మిడిన్. ౬౬ 106

తే. పరులప్రాణంబులను దమఽప్రాణములకుఁ, దృప్తిచేయుట రాజులఽకెల్ల నైజ
మట్టిలుబ్ధులు తఱచుగాఽనవనిపతులు, జనకులను భ్రాతృపుత్రులఁఽజంపుచుండ్రు.

సీ. పూర్వజన్మంబునఁఽబుండరీకాక్షునిచే హతుండయి బలోఽత్సాహములను
దగు కాలనేమియేఽతానని యీజన్మమున భోజకులమునఁఽబుట్టితినని
సురమౌనివాక్కులఁఽబరికించి యెఱిఁగి యాయదువులతో ద్వేషఽమాత్మనఁ బొంది
యంధకయదుభోజుఽలాదిగాఁగలవారి కధిపుఁడై తనతండ్రిఽయైనయట్టి

తే. యుగ్రసేనుని బంధించిఽయుగ్రతరబల, మలరఁగా శూరసేనాఖ్యఽములగుదేశ
ములను దానె యభీష్టరీఽతుల సుఖైక, పరత నేలుచునుండె భూఽపాలచంద్ర. ౬౭



రెండవ అధ్యాయము.

క. అని తెలిపి శుకమహాముని, జనపతికిన్ మఱియుఁ జెప్పెఁఽజండబలుండై
జనవిభుఁడగు కంసుఁడు దుర్జనపరివారాన్వితుఁడయిఽక్షమఁ బాలించెన్. ౧

వ. ఆదురాత్మునిఁ బ్రలంబుండును, బక, చాణూర, తృణావర్త, మహాశన, ముష్టి,
కారిష్టద్వివిదులును, గోధేనుకపూతనలును, మఱియుఁ బెక్కండ్రు దుష్ట
భూపాలకులును, బాణనరకాసురాది రాక్షసవీరులును సేవకులై మిత్రులై
సాయపడ నుండిరి. మాగధుం డగుజరాసంధునాశ్రయంబున మహాబలవంతుం
డై యాదవులఁ బడరానికష్టములపాలు చేయుచుండె. వారిచేఁ బీడితులై
యాదవు లందు నిలువఁజాలక కురు పాంచాల కేకయ శాల్వ విదర్భ నిషధ
విదేహ కోసలదేశంబులకుం బాఱి యందుఁ దలదాఁచుకొనిరి. కొంద ఱందుఁ
గంసు నాశ్రయించి కొలుచుచుండిరి. ౩౪ 110

క. దేవకిపుత్రకు లార్వురు, దేవమునీంద్రాజ్ఞచేతఁఽదీవ్రమనీషుం
డౌవసుధాధిపుచేఁ దెగ, శ్రీవైష్ణవతేజ మొప్పెఁఽజెలియకడుపునన్. ౮ 111

క. దాని ననంతాఖ్యముగా, మౌనులు వచియింత్రు సప్తఽమంబగు గర్భం
బౌ నది హర్షము శోకము, మానసమునఁ గల్గఁజేసెఽమానిని కంతన్. ౫ 112

*సీ. ఉత్పత్తిలయములఽనొగి భూతసముదయాగతిగతులను విద్యఽమఱి నవిద్య
యనునాఱువిషయంబుఽలను నెఱింగినయట్టి విశ్వాత్మకుం డగుఽవిష్ణుమూర్తి
తను నొక్కనినె నాథుఁఽడని నమ్మియున్నట్టి యదువంశభవులను సకలదుర్మతుఁ
డైన కంసునినుండిఽయనవరతము గల్గు భయము నాత్మ నెఱింగిఽపాయకుండఁ

ఆ. దన్ను నాశ్రయించిఽతనరెడుయోగమా,యను దలంచి యిట్టుఽలాజ్ఞచేసె
సకలశుభము లొసఁగిఽసాధువులం బ్రోచు, దేవి! వ్రజమునకునుఽబోవు మిపుడు.

* 'విశ్వాత్మ' అనుమూలమున కిది వివరణమని యెఱుంగునది.

ఉ. గోపులచేత సాధుతమ § గోపకసంతతిచేత నావ్రజం
బేవిధమందు లోపముల § నెన్నకయుండఁగఁ జెల్వుమీఱు నం
దే వసుదేవపత్నియయి § యెన్నికఁ గాంచినయట్టి రోహిణీ
దేవి వసించియుండు వసు§దేవుని తక్కినభార్య లందఱున్. ౬౪ 114

క. కంసుఁడు దుష్టుఁడు గావున, హింసించు నటంచు మదుల § నెంచి బ్రదుక మీ
మాంసను జేయుచు సువ్రత, సంసిద్ధిం గోరి వివర§సంతతులందున్. ౭ 115

క. గిరిబిలములయందు వసిం,చిరి; దేవకిజఠరమందు § శేషాహ్వాయమై
పరమ మగునాదుతేజము, తరుణీగర్భం బనంగఁ § దనరెడుఁ జుమ్మీ. ౭౪ 116

ఆ. దాని నట్టె తిగిచి § మానిని! రోహిణి, యుదరమందుఁ జక్క § నునుపు గర్భ
మట్టె తిగువ బ్రదుకు § నెట్టు లటంచు శం,కను గనంగఁబోకు § మను మదాజ్ఞ.

సీ. అవ్వల నవకాశ § మనునది లేకుండ నంశంబులను బ్రహ్మ§యాదిగాఁగ
*స్తంభపర్యంతము § చక్క వ్యాపించుచుఁ బరిపూర్ణ మైనరూ§పమున నేను
దేవకీపుత్రతఁ § దేజరిల్లుదు నీవు నందపత్ని యశోద§యందుఁ బుట్టఁ
గలవు; పుత్త్రాదులఁ § గాంక్షించుభక్తుల కీశ్వరివై వారి § కెల్ల కామ

తే. ముల నొసంగుచు ధూపబ§లులను మఱియుఁ
బెక్కు నుపహారముల వారు § ప్రీతి నిన్నుఁ
బూజచేయంగ నుందువు § భూమి నీకు
స్థానములు నామధేయముల్ § చాల నలరు. ౧౦ 118

క. జను లోగి సేవింతురు ని,న్ననూనభక్త్యుత్కటమున § నాయాచోట్లన్
వినుతింత్రు దుర్గ విజయయు, నని వైష్ణవి యనియుఁ గుముద§యనిమాధవి నాన్.

సీ. భద్రకాళిక యని § భక్తిఁ జండిక యని నారాయణి యనుచు § శారద యని
యంబిక మాయ క§న్యక కృష్ణ యనియును మఱియు నానావిధ§మహితనామ
ములఁ గొనియాడుదు § రిల నెప్డు సుందరీ మద్విక్రమమ్మున § మహిమ మున్నె
యందువో వినుము మా§యాదేవి గర్భసంకర్షణంబుననె సం§కర్షణుఁ డని

తే. పిలుతు రాతనిలోకంబు § ప్రీతినొందఁ
జేయుటను రాముఁ డనియును § క్షితిని బలము
గలుగువారలనున్ మించు§కారణమున
బలుఁ డటంచును బేరులఁ § బడయు నతఁడు. ౧౩ 120

చ. అని భగవంతుఁ డాజ్ఞయిడ § నట్టులె చేసెద నంచు విష్ణునా

---

* "అథాహ మంశభాగేన దేవక్యాః పుత్త్రతాం శుభే" అని మూలము. "అంశైశ్శక్తిభి ర్భజతేఽఖిలిష్వతి సర్వాన్ బ్రహ్మాదిస్తంభపర్యంతా నిత్యంశభాగస్తేన పరిపూర్ణేన రూపేణేత్యర్థః" అని శ్రీధరాచార్యులు.

చ. సరసిజగర్భుఁడుం బరమకశంభుఁడు నారదముఖ్యమౌనులుం
సురలును వారిసేవకులు § క్షోణియు వెంబడి రాఁగఁ గామముల్
గురియు మహాత్ము శూరసుతకోమలిగర్భమునం జెలంగు శ్రీ
హరిని మనోజ్ఞవాక్సముదయంబున నిట్లు నుతించి రావ్వరిన్. ౧౩౯ 139

బ్రహ్మాదిదేవతలు దేవకీగర్భస్థుఁడగు శ్రీకృష్ణుని వినుతించుట.

సీ. సత్యమై తన రెడు § సంకల్పములుగలవానిని సత్యమే § సర్వశ్రేష్ఠమైన
ప్రాప్తిసాధనముగ § భాసిల్లఁగాఁ జేయువానిని సృష్టికి § బ్రాక్సమయము
నందును బ్రళయంబు § నవ్వల స్థితిసమయంబునందును § భేద § మరఁగ లేక
*వర్తించువానిని § వారితేజఃపృథ్వు లనిల మాకాశంబు § లనెడు భూత
తే. పంచకమునకు హేతువై § పరఁగువాని, నట్టిపంచకమునయందు § నపారగతుఁ
డైన వానిని సత్యసత్యం బనంగ, నలరువానిని శాశ్వతుఁ § నైనవాని. ౧౪౦ 140

[1]క. సూనృతవాణి ఋతం బనఁ,గా నెగడును సత్యమె యనఁగ సమదృష్టిం
గానంబడునదియగు మఱి, [2]వానికిని బ్రవర్తకుఁ డగువాని మనమ్మున్. ౧౪౧

క. నిను భగవంతా! శరణం, బని వచ్చినవార మిటను; § [3]నఖిలజగత్పా
లనమున మత్తుల్యులు నను, వినుతింపఁగ నేల యనుచు § విష్ణూ! యనెదో. ౧౪౨

క. పరమేశా! యిట్లనకుము, పరికింపఁగ సర్వలోకపాలుఁడ వన నో
క్కరుఁడవె మే మెల్లను నిను, శరణం బని నమ్మియున్న జనులము సుమ్మీ. ౧౪౩

క. నీకుఁ వ్యతిరేకముగా, లోకమ్ములు లేవు నీవెలుఁగున మే మో
శ్రీకలితా! తగువారము, నీకంటెన్ శరణమొప్ప నేర్పునె యొచటన్. ౧౪౪ 144

సీ. ఈప్రపంచమె యాదివృక్షమై యొప్పాగు వ్యష్టిసమష్టిదేహా మగు నద్ది
ప్రకృతియే దానికిఁ § బాదగు సుఖదుఃఖము లనుపండ్లవి రెండు § గలిగియుండు
సత్త్వరజస్తమస్సంజ్ఞికగుణములు మూఁడును దానికి § మూలము లగు
ధర్మార్థకామముల్ § తగుమోక్ష మననాల్గు రసములౌ భూరుహరాజమునకు
తే. నింద్రియములైదు శబ్దాదు § లెఱుఁగఁజాలు
విధములగు తుత్తు దప్పియు § విపులశోక
మోహజరలును మృతి యనఁ § బొలుచు నాఱు
నూర్ము లనెడు స్వభావంబు § లొప్పు మఱియు. ౧౪౫ 145

* "సత్యస్య యోనిమ్=సచ్చ త్యచ్చ సత్యం భూతపంచకమ్." అని వ్యాఖ్య. 1 "సత్యం చ సమదర్శనం, ఋతం చ సూనృతా వాణీ కవిభిః పరికీర్తితా." అని శ్రీధరాచార్యులు. దీనిసారమే యిందుఁ గలదు. 2 "ఋతసత్యనేత్రమ్" అని మూ. "నేత్రం నయనసాధనం నేతారం ప్రవర్తక మితి యావత్" అని వ్యాఖ్య. 3 "నను భవంతోఽపి లోకేశ్వరాః మత్తుల్యా ఏవ కిమితి మాం శరణం ప్రపద్యంతే" అనుదాని కిది తెనుఁగు.

సీ. త్వఙ్మాంసరుధిరమేదస్సులు మజ్జయు
నస్థులు శుక్లంబు ♦ ననెడు నేడు
ధతువుల్ పైపొరల్ ♦ భూతపంచకమనో
బుద్ధ్యహంకారముల్ ♦ పోల నెనిమి
దియు విటపములు మఱియు నవరంధ్రముల్
నవకోటరములు ప్రాణము నపాన
మును వ్యానము సమానము నుదానమును గృక
రము నాగదేవదత్తములు కూర్మ



తే. మును ధనంజయము ననఁగఁ ♦ జను నివి పది
పత్త్రములు జీవుఁ డీశుండు ♦ పక్షు లగును
నీప్రపంచాఖ్య భూరిమహీరుహమున
కిట్టిదానికి నీశుండ ♦ వీవ కావె. ౨౭ 146

క. ఈరూపంబగు భవమయ, భూరుహతల్లజము కార్యభూతంబగు నీ
వారయ నావృతిమునకుఁ, గారణమును లయపదంబు ♦ గాఁ దగుదుగదా. ౨౮

ఆ. పాలకుఁడవు నీవె ♦ బ్రహ్మవిష్ణ్వీశులు, వానికారణములు ♦ గాన నేనె
యిట్టు లగుదు ననుచు ♦ నెంతువో సర్వేశ, నీదుమాయ వారి ♦ నిర్భరగతి.౨౯

సీ. కప్పియుండుట తెల్వఁ ♦ గనలేక నిన్నె నానాకారముల బ్రహ్మ ♦ యనఁగ విష్ణు
వనఁగ శంకరుఁ డనఁగను మఱి పెక్కునామములను గాంతురు ♦ మహితచిత్తు
లైన విద్వద్వ్యస్యులట్లుచూడక యన్నియును నీదురూపముల్ ♦ గనె దలంత్రు;
[1] దేవకీసుతుఁడఁ గాఁబోవు నన్నేటి కీచందాన వినుతింతు ♦ రందు వేని

తే. పరశివా! జ్ఞానరూప! యోగపరమపురుష, యాత్మరూపా చరం బనచర మనఁగ
నలరు లోకమునకు క్షేమమాచరింపఁ, దలఁచి సత్త్వోపపన్నగాత్రములఁ దాల్చి.

క. తనరుదు వారూపములు సు,జనులకు సుఖకరములు ఖలజనుల కభద్రం
బును గూర్చునవియు నగు వా,నిని దాల్తువు పరుల కెన్న ♦ నీవు సుతుఁడవే.

[2]చ. సరసిజనేత్ర! కొందఱిల ♦ సాధువు లుత్తమమౌనసమాధిఁ ద
త్పరత స్వకీయచిత్తములఁ ♦ దావకరూపమునందుఁ జొన్పి శం
కరము సమస్తసత్త్వనిధిగాఁ దగి యెంతయు శ్రేష్ఠమైన నీ
పరమపదంబుజద్వయము ♦ బాగుగఁ గాంచుచు వీతరాగులై. 151

క. పరమేశ్వర! నీవరపద, సరసిజపోతమ్ము నమ్మి ♦ సంసారాబ్ధిం
దరియింతురు గోవత్సము, చరణముపాటిదిగ నెంచి ♦ సంతోషమునన్. ౩౦ 152

---

1 "నను దేవకీపుత్త్రం మాం కథ మేవం వర్ణయసీతి చేత్తత్రాహుః." అనుదానిసారమే యిది.

2 "సమాధినావేశిత చేతసైకే" అని మూలము. దీనివివరణమే యీపద్యమునఁ గలదు.

జ్ఞను శిరసావహించి జతనంబును దీర్పఁగ భూమి కేగి య
ప్పని నొనరించెఁ జెప్పినటు; ప్రాఘతరంబగుశ_క్తి గర్భ మొ
య్యన గ్రహియించి దానిఁ గొని యల్లన రోహిణియందుఁ జేర్చెఁగా. ౧౪౫ 121

ఆ. యోగనిద్ర యిట్టు లొనరించు టెఱుఁగక, జాతిపోయె శౌరిసతిని గర్భ
మార! యనుచు నెల్లపౌరులు తమలోనఁ, జెప్పుకొనిరి దైవచేష్ట యిట్లు.

క. సకలము దానే యగు నా, ప్రకటమహాశక్తి భక్తపటలాభయదుం
డు కడుజవం బొప్పఁగ నా,నకదుందుభి సన్మనంబునం దాఁ బూన్కెన్. ౧౬

ఆ. అంశభాగమున మహాకీర్తిని బొసంగఁ
జేరెఁ; బరమపురుష భూరితేజ
మాత్మ నలర వెలిఁగె నర్కబింబముఁ బోలి
తన్మహత్త్వమున నతండు మఱియు. ౧౬ 124

క. భూతములు చెంతఁజేరఁగ, నేతఱినే సాధ్యుఁడనియేపునఁ గంసా
ద్యాతతరిపులు తిరస్కృతి, నేరినఁ జేయ శక్యమే కానుండన్. ౧౭ 125

సీ. జగములకెల్లను శాశ్వతానంద మీయంగఁజాలిన యచ్యుతాంశ మవల
శూరతనూజుండు శుభచిత్తుఁ డొగిఁజేర్ప దేవకీదేవి యాపావనాంశ
మాత్మఁ దాలిచి యది యాత్మభూతంబు సర్వాత్మకంబగుటఁ బ్రాగాశ చంద్రుఁ
నానందకరుఁ దాల్చునట్టులు మనసుచే ధరియించె; నంత నాతరుణిమిన్న

తే. సకలలోకనివాసుఁడౌ చక్రధరున
కుండు తావయి తా నొప్పియును దురాత్ముఁ
డైన భోజేంద్రుగృహమున నార్తిఁ గనుచు
శృంఖలాంకిత యైయుంటఁ జెలఁగదయ్యె. ౧౭౫ 126

*చ. కనఁబడకుండఁ గుండఁ బొదుగంబడు నగ్నిశిఖాప్రవృత్తి స
జ్జనులకు మేలు చేయఁదగుశారద జ్ఞానఖలాత్మఁ జేరి వె
ల్గనియటులే మఱుంగుపడి కాఱియ పొందుచు నుండెఁ గాని య
వ్వనజదళాక్షు తేజమున భాసిల దింతయు వేయు నేటికిన్. ౧౮ 127

శా. అంతం గంసుఁడు గర్భమందు హరి సర్వాధీశుఁ డుండంగ శు
ద్ధాంతంబెల్ల వెలుంగఁజేయుప్రభ చేతన్ మించి శుభ్రస్మితం
బెంతో వింతగ నొప్పఁ జూడఁబడు నాయిందీవరాక్షిన్ ఘన
స్వాంతం గన్గొని యిట్టు లెంచె మదినీచందంబు నూత్నంబయా. ౧౮౫ 128

చ. నను వధియింప శ్రీహరియు నాతుకమిన్న మనోహరంపుఁగు
క్షిని దగఁ జేరియుండు నిది సిద్ధము పూర్వము దీనితేజ మొ

* "భోజేంద్రగేహేఽగ్నిశిఖేవ రుద్ధా సరస్వతీజ్ఞానఖలే యథా సతీ" అని మూలము.

ప్పునె యిటు చూడలేదె పుర్వభోఁడిని జక్కఁగ నెన్నిసారులో
కనఁబడు నిప్డు నూతనముగా వెలిఁగెయ్యెడి దీనిఁ జూచినన్. ౨౦ 129

చ. హరియును దేవకార్యమును సార్థకమై చనఁజేయ నెంచి సో
దరియును గంసుఁ జొచ్చు నృపధర్మములై తగు సామముఖ్యముల్
గరుస ఘటింపకుండు; సుమనస్యులు పన్నినయర్థతంత్ర మీ
తరుణమునందు విక్రమము ధైర్యము వ్యర్థముచేయకుండఁగన్. ౨౦౪ 130

*ఉ. నేనొనరింపఁగాఁ దగు ననింద్యముపక్రమ మెద్ది? యిప్పు డీ
మానిని జంపు టే తగును మామకకార్యము సిద్ధినొందు నం
చేను దలంతునే నదియనిన్ నియ్యెడఁ గూడ దటంచుఁ దోఁచెడిం
జానకుఁ దోడఁబుట్టు నది చాలక గుర్విణి యిట్టి యీసతిన్. ౨౦౪ 131

చ. త్వరగఁ దడి చంపినన్ గలుగు దారుణపాపము సద్యశంబునున్
హరిఁ జిరకాలము భ్రమసి జేసెదునా యసురుఁ డ్రుంచు నిట్టిసో
దరి వధయించుదాఁ డసురవంశము దాల్పియుఁ జచ్చినట్టులే
పురుషుఁడు సుం బొనస్పుటఁ గుబుద్ధిని బూని చరించుచుండినన్. ౨౧౪ 132

తే. అట్టి యెడ బహుాభిమానిగ యగుట బ్రతికిఁ
యుండినన్ సాధుపద్య లోకహో యితండు
దుష్టకర్మరతుం డని తూలనాడు
దుగు మృతుండగునేఁ దిట్టుదురు కడంగి. ౨౨ 133

క. తనుమానులగు మనుష్యులు, చనుదురు ఘోరాంధతమము చక్కటికిన్ దా
నిని బొంది మరలు టబ్బుర, మనఁజను నింకేమిచేయ నగునో యెఱుఁగన్. ౨౨

ఆ. ఏమిచేయుటయును నిపుడు తోఁపదు నాకు, ననుచు గర్భవతిని ననుజఁ జంపు
ఘోరపాపకార్య మారసి చేసెదు, సాహసమును మాని శాంతి నొందె. ౨౨౪

క. మానిని జంప సమర్థుం, డైనను బాపంపుఁగార్య మని యెంచి మదిన్
మానిసి విహితుండగు హరి, మైనెప్పువిరోధమును స్వపౌరుషమున నే. ౨౩ 136

సీ. సాధింప నెంచుచుఁ జక్రిజన్మం బెప్పు డగునొ యప్పుడె చంపు నాతురమున
నెదురుచూచుచునుండె నదను; నాతఁడు మఱి కూర్చుండు నప్పుడు కూర్కునపుడు
నిలుచున్న తఱి భుక్తి నింగొను వేళను ధర నిండు నందును దిరుగుకాల
ముందుఁ బాసియుంబు లానెడుసమయము దాహృషీకేశుని హరిని గనుచుఁ

ఆ. విస్మయముగ జగముఁ దలఁచుచు నుండెను, నాదురంతచింత నంది యుంట!
జగమదెల్ల నతని కగపడె హరిమయ,ముగనె దృష్టి యొసఁగు బుద్ధిరీతి. ౨౮ 138

వ. ఆసమయంబున.

* "శక్తి యమిదానీ మేవ హన్యతామితి విచింత్యాహ" అనుదానిసారమే యిటఁ గలదు.

చ. సరసిజగర్భుఁడున్ బరమసంభుఁడు నారదముఖ్యమౌనులున్
సురలును వారిసేవకులు । శ్రోణియు వెంబడి రాఁగఁ గామముల్
గురియు మహాత్ము శూరసుతుకోమలిగర్భమునం జెలంగు శ్రీ
హరిని మనోజ్ఞవాక్యముదయంబున నిట్లు నుతించి రాదృతిన్. ౧౩౯ 139

బ్రహ్మాదిదేవతలు దేవకీగర్భస్థుఁడగు శ్రీకృష్ణుని వినుతించుట.

సీ. సత్యమై తన రెడు । సంకల్పములుగలవానిని సత్యమే । సర్వ్యమైన
ప్రాప్తిసాధనముగ । భాసిల్లఁగాఁజేయువానిని సృష్టికిఁ । బ్రాక్సమయము
నందును బ్రళయంబు । నవ్వల స్థితిసమయంబునందును భేద । మనఁగ లేక
*వర్తించువానిని । వారితేజఃపృథ్వు లనిల మాకాశంబు । ననెడు భూత

తే. పంచకమునకు హేతువై । పరఁగువాని, నట్టిపంచకమునయందు । నంతరగతుఁ
డైన వానిని సత్యసత్యం బనంగ, నలరువానిని శాశ్వతుఁ । డైనవాని. ౧౪౦ 140

[1]క. సూనృతవాణి ఋతం బనఁ,గా నెగడును సత్యమె యనఁగాఁ సమదృష్టిం
గానంబడునదియగు మఱి, [2]వానికిని బ్రవర్తకుఁ డగువాని మహాత్మున్. ౧౪౧

క. నిను భగవంతా! శరణం, బని వచ్చినవార మిటకు; । [3]నఖిలజగత్పా
లనమున మత్తుల్యులు నను, వినుతింపఁగ నేల యంచు । విష్ణూ! యనెదో. ౧౪౨

క. పరమేశా! యిట్లనకుము, పరికింపఁగ సర్వలోకపాలుఁడ వన నొ
క్కరుఁడవె మే మెల్లను నిను, శరణం బని నమ్మియున్న జనులము సుమ్మీ. ౧౪౩

క. నీకున్ వ్యతిరేకముగా, లోకమ్ములు లేవు నీవొలుంగున మే మో
శ్రీకలితా! తగువారము, నీకంటెన్ శరణ మొప్పనేర్చునె యొచటన్. ౧౪౪ 144

సీ. ఈప్రపంచమె యనాదివృక్షమై యొప్పారు వ్యష్టిసమష్టిదేహ మగు నద్ది
ప్రకృతియే దానికిఁ । బాదగు సుఖదుఃఖము లనుపండ్లవి రెండు । గలిగియుండు
సత్త్వరజస్తమస్సంజ్ఞికగుణములు మూఁడును దానికి । మూలము లగు
ధర్మార్థకామముల్ । తగుమోక్ష మననాల్గు రసములౌ భూరుహరాజమునకు

తే. నింద్రియములైదు శబ్దాదు । లెఱుఁగఁజాలు
విధములగు తుత్తు దప్పియు । విపులశోక
మోహజరలును మృతి యనఁ । బొలుచు నాఱు
నూర్ము లనెడు స్వభావంబు । లొప్పు మఱియు. ౧౪౫ 145

* "సత్యస్య యోనిమ్=సచ్చ త్యచ్చ సత్యం భూతపంచకమ్." అని వ్యాఖ్య. 1 "సత్యం చ సమదర్శనం, ఋతం చ సూనృతా వాణీ కవిభిః పరికీర్తితా." అని శ్రీధరాచార్యులు. దీనిసారమే యిందుఁ గలదు. 2 "ఋతసత్యనేత్రమ్" అని మూ. "నేత్రం నయనసాధనం నేతారం ప్రవర్తక మితి యావత్" అని వ్యాఖ్య. 3 "నను భవంతోఽపి లోకేశ్వరాః మత్తుల్యా ఏవ కిమితి మాం శరణం ప్రపద్యంతే" అనుదాని కిది తెనుఁగు.

సీ. త్వఙ్మాంసరుధిరమేఽదస్సులు మజ్జయు
నస్థులు శుక్లంబు ఽ ననెడు నేడు
ధ తువుల్ పైపొరల్ ఽ భూతపంచకమనో
బుద్ధ్యహంకారముల్ ఽ పోల నెనిమి
దియు విటపములు మఽఱియు నవరంధ్రముల్
నవకోటరములు ప్రాఽణము నపాన
మును వ్యానము సమానఽము నుదానమును గృక
రము నాగదేవదఽత్తములు కూర్మ



తే. మును ధనంజయము ననఁగఁ ఽ జను నివి పది
పత్త్రములు జీవుఁ డీశుండు ఽ పక్షు లగును
నీప్రపంచాఖ్య భూరిమఽహీరుహమున
కిట్టిదానికి నీశుండ ఽ వీవ కావె. ౨౯ 146

క. ఈరూపంబగు భవమయ, భూరుహతల్లజము కార్యఽభూతంబగు నీ
వారయ నావృక్షమునకుఁ, గారణమును లయపదంబు ఽ గాఁ దగుదుగదా. ౨౯

ఆ. పాలకుఁడవు నీవె ఽ బ్రహ్మవిష్ణీశ్వఽరులు, వానికారణములు ఽ గాన నేనె
యెట్టు లగుదు ననుచు ఽ నెంతువో సర్వేశ, నీదుమాయ వారి ఽ నిర్భరగతి.౨౯

సీ. కప్పియుండుట తెల్విఁ ఽ గనలేక నిన్నె నానాకారముల బ్రహ్మ ఽ యనఁగ విష్ణు
వనఁగ శంకరుఁ డనఁఽగను మఱిపెక్కునామములను గాంతురు ఽ మహితచిత్తు
లైన విద్వద్వర్యుఽలట్లుచూడక యన్నియును నీదురూపముల్ ఽ గనె దలంత్రు;
[1] దేవకీసుతుఁడఁ గాఁఽబోవు నన్నేటి కీచందాన వినుతింతు ఽ రందువేని

తే. పరశివా! జ్ఞానరూప! యోఽపరమపురుష, యాత్మరూపా చరం బనఽచర మనఁగ
నలరు లోకమునకు క్షేమఽమాచరింపఁ, దలఁచి సత్త్వోపపన్న గాఽత్రములఁ దాల్చి.

క. తనరుదు వారూపములు సు,జనులకు సుఖకరములు ఖలఽజనుల కభద్రం
బును గూర్చునవియు నగు వా,నిని దాల్తువు పరుల కెన్న ఽ నీవు సుతుఁడవే.

[2]చ. సరసిజనేత్ర! కొంద ఱిల ఽ సాధువు లుత్తమ మాసమాధిఁ ద
త్పరత స్వకీయచిత్తములఁ ఽ దావకరూపమునందుఁ జొన్పి శం
కరము సమస్తసత్త్వనిధిఽగాఁ దగి యెంతయు శ్రేష్ఠమైన నీ
పరమపదంబుజద్వయము ఽ బాగుగఁ గాంచుచు వీతరాగులై. 151

క. పరమేశ్వర! నీపరపద, సరసిజపోతమ్ము నమ్మి ఽ సంసారాబ్ధిం
దరియింతురు గోవత్సము, చరణముపాటిదిగ నెంచి ఽ సంతోషమునన్.౩౦ 152

---

1 "నను దేవకీపుత్త్రం మాం కథ మేవం వర్ణయథేతి చేత్తత్రాహుః." అనుదానిసారమే యిది.

2 "సమాధినావేశితచేతసైకే" అని మూలము. దీనివివరణమే యీపద్యమునఁ గలదు.

సీ. స్వప్రకాశుఁడవయి సత్త్వాశ్రయుఁడవగు నోపరాత్పర! భవదుత్తమపద
పోతము చెంతనే పాలయ భవాబ్ధిగోవత్సపదం బట్లు సాఁటఁ బోత
మక్కఱయే లేక యన్యుల కతిభీతికరము దుస్తరమునై పరఁగుభవస
ముద్రముఁ దరియించి భూతజాలప్రీతి వాఁడను దరియింపవలయు ననెడు
తే. తలఁపునన్ దన్మహానౌక నిలిపి యుంద, పరతటంబును బొందిరి భక్తజనుల
కెల్లర కనుగ్రహము వెదఁజల్లువాఁడ, వీవె కావె మహాత్మక యీశ్వర! హరి.

క. నను భజియింపఁగ నేటికిఁ, గనుదురుగాదే వివేకకలితులు మోక్షం
బని యందువేమొ వినుమా, వనజాక్షా! మేమె ముక్తిభాక్కుల మనుచున్.

క. తలపోయువారు మూఢులె, యిలపై నట్టిండ్రు భావ మీశుఁడవయి ని
ర్మలుఁడవు నగు నీయం ద్విమ్ముల నిల్పక భక్తపరతహావ సలసులై. ౩౧ 155

ఆ. అపరిశుద్ధబుద్ధులయి వాదములయందె, పటుతరమగు బుద్ధి పరఁగ జ్ఞాన
హీను లగుచుఁ బెక్కు మానుషజన్మంబు, లెత్తి వ్రతతపంబు లెన్నో చేసి.

క. ఘనయత్నంబున సాధించిన మోక్షసమీపగమయి చెలఁగు తపంబున్
జననశ్రుతాదికము నొందినవారయి భక్తి నెమ్మదిని బూనమిచేన్. ౩౨ 157

ఆ. అంతరాయములను నపకృతి నొందింపఁబడుదు; రో పరేశ! భార్గవీశ
తావకీనభక్తతతి ముక్తినుండి భ్రంశమును గనకయుండఁ జాలుఁ జుమ్ము. ౩౨

*ఉ. అంతియగాదు వారల మహావరణంబున నీవు కావ నా
వంతయు భీతిలేకయె మహాత్తరవిఘ్నము లాచరింప న
త్యంతము హేతువై తగినయట్టి చమూపతిమస్తకాళిపైఁ
వింతగ సంచరింతు రొగి విశ్వవిభూ! పలుమాట లేటికిన్. ౩౩ 159

సీ. [1]తనుధారులకును దత్తత్కర్మఫలములఁ గలిగించునదియు నిక్కముగ శుద్ధ
సత్త్వమయంబునాఁ జనుశరీరమ్మును ధరియించుచున్నావు నరులు నట్టి
తను వాశ్రయించి వేదక్రియాయోగతపస్సమాధు లనంగఁ బరఁగునట్టి
చతురాశ్రమార్హధర్మతతిచే నినుఁ బూజచేయంగ నేర్తురు కాయ మాశ్ర
ఆ. యింపకున్నఁ బూజయే చేయఁ జాలరు, దానఁ గర్మఫలము తగ ఫలింప
కుండు; ధాత! సత్త్వమొప్పురూపంబు గల్గమిని నష్ట మెట్టికరణి ననుదో. ౩౪

క. విను మజ్ఞానము దానన్, జనితంబగు నట్టిభేదసంజ్ఞికమును బో
వను జేసెడు నపరోక్షం, బనుజ్ఞానము కల్గు నెట్టు లార్తశరణ్యా. ౩౫ 161

* "త్వయాభిగుప్తా విచరంతి నిర్భయా వినాయకానీకపమూర్ధసు ప్రభో" అని మూలము. "వినాయకా విఘ్నహేతవః తేషామనీకాని స్తోమాస్తాని పాంతి యే తేషాం మూర్ధసు విచరంతి. విఘ్నాన్ జయంతీత్యర్థః" అని వ్యాఖ్య. 1 "సత్వం విశుద్ధం శ్రయతే భవాన్ స్థితౌ శరీరిణాం శ్రేయ ఉపాయనం వపుః" అని మూ. దీనివివరణమే యీపద్యమని యెఱుంగందగు.

తే. గుణములైన బుద్ధ్యాదులకును బ్రకాశ
మును బొసంగఁగఁ జేయునాఘనుఁడు సర్వ
సాక్షి పూర్ణుఁడవునగు నీ వక్షిగోచ
రుఁడ వగుట కల్ల జ్ఞానవేద్యుఁడవుగాన. ౩౮౪ 162

[1]సీ. అతనిసంబంధములైనబుద్ధ్యాదిక
గుణములు రాజిల్లు గుణగణముల
కాతఁడు సాక్షియై యలరు బుద్ధ్యాదుల
యధిరోహణమున బాహ్యగుణరూప
మగు ప్రపంచము వెల్గు నని యిట్టు లనుమితుఁ
డవుమాత్రమే యగుదువు మహాత్మ;
పరిశుద్ధసత్త్వరూపమును దాల్చిననిన్నుఁ
గడఁగి కొల్వఁగఁ దదాకారమైన

తే. యట్టి యంతఃకరణమందు హరితావ
కప్రసాదమువలన సాక్షాత్కరణము
కలుగఁ దగు; సర్వసాక్షివి కనుకఁ దత్త్వ
మగునె వాఙ్మనసులకు గమ్యంబు చూడ. ౩౯ 163

[2]చ. కనుకనె నామరూపములు గాఢతరం బగుభక్తి గల్గుస
జ్జనులు భజింప సంతతము శక్యములే యగుఁ గాని కర్మముల్
జననగుణాళిఁ బట్టి యిది సత్యమటంచు నిరూపణమ్ముచే
యను దెలియంగ శక్యమగు నంచు వచించుట తుచ్ఛమే యగున్. ౩౯౪ 164

క. ఐన నుపాసకు లాయా, మానితకర్మములందు మాయాతీతున్
జ్ఞానమయు నిన్ను సాక్షివి,గానే కనుఁగొంద్రుగాదె కమలదళాక్షా. ౩౬ 165

[3]చ. మనుజుఁ డెవండు నీవయిన మంగళరూపము నామముల్ మఱొ
క్కనివలనం దమిన్ వినుచుఁ గ్రమ్మవచస్సులఁ దానుఁ జెప్పుచున్
విన వచియింపలేనితఱి వేయివిధంబుల సంస్మరించుచున్
మననము చేయుచున్ విహితమార్గముచేఁ దగుసత్క్రియాతతిన్. ౩౬౪ 166

తే. దేవతారాధనాదికపావనక్రి,యలను నీమృదుపాదాబ్జములు మనంబు
నిలిపియుండునో యట్టివిరనిర్మలమతి, భవమయాంబుధి మున్గఁడు పంకజాక్ష.

---

1 "గుణప్రకాశైరనుమీయతే భవాన్ ప్రకాశతే యస్య చ యేన వా గుణః" అని మూలము. దీనివివరణమే యిందుఁ గలదు. 2 "న నామరూపే గుణజన్మకర్మభిర్నిరూపితవ్యే తవ తస్య సాక్షిణః" అని మూలము. 3 "శృణ్వన్ గృణన్ సంస్మరయంశ్చ చింతయన్నామాని రూపాణి చ మంగళాని" అని మూ.

క. పరమం బగుమోక్షముఁగను; హరి! శంకర! భాగ్యవశత । నఖిలేశ్వరుఁడై
పరఁగెడు నీపుట్టుక నీ, వరపదభూతయగు భూమిభామాక్షువ్యథల్. ౩౭ 168

క. తొలఁగినపనియే యిప్పుడు, తలఁతుము భూభార మింకఁ । దలఁగు ధ్రువముగా
సులలితభాగ్యం బౌరా, సలక్షణాంఘ్య్రంబుజములు । క్షమ నీ విడుటన్. ౩౮

క. తావకకరుణకుఁ బాత్రం,బౌ వసుధను స్వర్గమునుగ । నవలోకింపన్
శ్రీవిభు! వలఁతుల మైతిమి, సేవకులకు నింతకంటె । శ్రేయము గలదే. ౩౮ 170

సీ. సంసారభయమును । సడలింపఁగాఁ జేయు పరమేశ్వరా మహాప్రకృతిచేతఁ
ద్వచ్ఛరీరం బనఁబడుప్రపంచమునకుఁ గలిగెడుసృష్టిస్థితులవికార
ములు నట్లె లయవికృతులు జగదాశ్రయుండయి యంతరాత్మయైయలరునీకుఁ
గల్పింపఁబడుచుండుఁ । గనుఁగొన నిర్వికారుఁడ వగుసీయందు । రూఢిగాఁగఁ

తే. గానఁబడుట వినోదార్థ । మానుగాదె, కర్మమూలక మగుజని । గలుగనట్టి
నీకు జన్మముగల్గుట । ప్రాకట మగు, నావినోదము గాక వే । ఱరయఁ గలదె.

*మ. అని మే మెంతుము దివ్యరూపధర మత్స్యాశ్వాసనాకారతన్
జననంబందియుఁ గూర్మదంష్ట్రికులసంజాతంబు హర్యక్షు మ
ర్త్యనితాంతోజ్జ్వలరూపముం గనియు శ్రీరామాఖ్య జన్మించి హం
సనగాకంబవుగాఁ జెలంగి భృగువంశంబందు రాముండవై. ౩౯ 172

మ. సురముఖ్యాన్వయమందుఁ బుట్టి మును సంక్షోభించు మమ్మున్ మహా
కరుణం గాచి ప్రపంచశాంతి కలుగంగాఁ జేసినట్లే యిదే
తరుణంబందు వసుంధరాగురుభరధ్వాంతంబు వారించి ని
ర్భరతేజంబున సజ్జనావళిని గావం బూనుమా శ్రీవిభూ. ౪౦ 173

క. వందనము నీ కొనర్తుము, బృందారకవంద్య యనుచు । విబుధులును శతా
నందుఁడు శివుఁడు నుతించుచు, సుందరి దేవకిని గాంచి । చొక్కపుఁబ్రీతిన్. ౪౧

మ. జననీ! మాయభివృద్ధికై విమలతేజస్స్ఫురుఁడై పొల్చు శ్రీ
వనజాక్షుండు పరాత్పరుండు తన దౌర్భవ్యాంశమున్ నీదుకు
క్షిని నిల్పెన్ మృతినొందు యత్నమున సంసిద్ధుండుగాఁ గంసుఁ డుం
డ నికన్ దద్భయ మింతయేఁ గలుగకుండం గాచు దైవంబుసూ. ౪౨ 175

క. నీతనయుఁడు యదునృపతి, వ్రాతము రక్షింపఁగలఁడు । వగ వనునది నీ
చేతమునఁ గల్గ దిఁక నని, ప్రీతిన్ వినుతించి రమరబృందేశు లొగిన్. ౪౨ 176

క. సురవరు లీరీతిగ నా, పురుషోత్తమదివ్యరూపమును దోఁచినయ
క్కరణి నుతించిరి పిమ్మట, విరించిశంకరులఁ గూడి । వే చని రమరుల్. ౪౩ 177

* "మత్స్యాశ్వకచ్ఛపనృసింహవరాహ హంసరాజన్యవిప్రవిబుధేషు కృతావతారః" అని మూలము.

## మూఁడవ అధ్యాయము.

### శ్రీకృష్ణావతారఘట్టము.

క. అని వచియించి పరీక్షి, జ్జనపతితో శుకమహర్షి చంద్రుం డీరీ
తిని దెల్పె నవలికథనున్; జననము లేనట్టిదివిజసత్తముఁ డంతన్. 178

క. ధర నవతరించుసమయం, బరుదేరఁగ సకలసద్గుణాకరమై య
చ్చెరువుగ నొప్పెను బరమే,శ్వరుమహిమకుఁ దగినయట్లు సమయం బదియున్.

సీ. శశిదైవతం బనఁ జను రోహిణియు నుద
యించెను గ్రహములు మించునిఖిల
తారలు వెలయుచు సారరూపంబులఁ
దనరారుచుండె నత్తఱిని దిశలు
సుప్రసన్నములయి శోభిల్లె నంబర
మందు నక్షత్రమ్ము లమలకాంతి
వెలయుచుండెను భూమిఁ గలపురగ్రామఘో
షములు మంగళసుచిహ్నముల నలరె;

తే. నాపగలు నిర్మలాంబువు లమరఁ బాతె
హ్రదము లంబురుహశ్రీల నమరియుండె
వనసమూహమునం దరువరములఁగల
కుసుమగుచ్ఛంబులందు శకుంతవితతి. ౨౪ 180

[1]చ. మనమున కింపుఁ బెంపఁ దగు మంజురవంబులఁ జేయుచుండె భృం
గనికర మట్టి ఝుంకృతులఁ గర్ణసుఖంబును గూర్చుచుండెఁ బా
వనసుమగంధముం గొనుచు వాయువు ధూళియె లేక యెంతో చ
క్కనిసుఖ మిచ్చుస్పర్శమునఁ గమ్రగతుల్ దగ వీచె నత్తఱిన్. ౩౪ 181

క. ధరణీసురముఖ్యులచే, నిరంతరార్చితము లగుచు నెగడెడునగ్నుల్
తరుణమున నందుఁ జక్కఁగఁ, బరితోదీప్తంబు లగుచు జ్వలియించెఁ దగన్.

క. సురలయు సాధువులయు మదు, లరుదారఁ బ్రసన్నములయి యలరారెను, శ్రీ
హరి యుదయించెడునత్తఱి, సురదుందుభు లెల్ల మొరసె సురమార్గమునన్. ౫

సీ. గంధర్వకిన్నరుల్ కలనాదములఁ బాడి రెంతయుఁ దమిమీఱ నెల్లసిద్ధ
చారణుల్ స్తుతులను సల్పిరి [2]విద్యాధరులు నప్సరసలును జెలఁగి యాడి

---

1 "ద్విజాళికులసన్నాదస్తబకా వనరాజయః" అని మూలము. అర్ధరాత్రసమయమునఁ బక్షి భృంగనాదములుండుట భగవన్మహిమముచేతనే యని యూహింపవలయు. ముందు నిట్లేయని యెన్న వలయు. 2 "విద్యాధర్యశ్చ ననృతురప్సరోభిస్సమం తదా, ముముచుర్మునయో దేవాస్సుమనాంసి ముదాన్వితాః." అని మూలము.

రమరాళి మానిసోత్తములును హర్షము పొంగఁగాఁ గురిసిరి § పూలవృష్టి
యర్ధరాత్రమునప్పు § డంధకారము గ్రమ్మియుండ జనార్దనుఁ § డుదయమందు

తే. సమయమున భూరిజలధరసంఘ మట్టె, యల్లనల్లన నబ్ధిఘోషానుకారి
గాఁగ గర్జిల్లె భూతాళి § కడుఁ జెలంగె, నేమి చెప్పఁగవచ్చు మహీతలేశ. ౨౪

క. దేవస్వరూపిణిగఁ దగు, దేవకియం దెల్లలోకదివ్యవసతియౌ
శ్రీవిష్ణు వవతరించెను, బావనసంపూర్ణకళలఁ § బ్రాచి శశిగతిన్. ౮ 185

చ. జలరుహపత్త్రనేత్రు [1]దరచక్రగదాప్రముఖాయుధంబులన్
జెలఁగెడువాని నాలుగగు చేతులుగల్గినవానిఁ గంఠమం
దలరెడు కౌస్తుభంబున మహత్తరకాంతి నెసంగువాని ను
జ్జ్వలతరతేజ మొప్పఁ దగు బాలుని నద్భుతరూపశీలునిన్. ౮ 186

క. ఉరమున శ్రీవత్సాంకము, పరమంబయి యొప్ప మధ్యభాగము పీతాం
బరమునఁ దగ సాంద్రపయో, ధరసమతనుకాంతి యలరఁ § దనరెడు వానిన్. ౯

[2]సీ. నిర్మలతమపీత § నీలరక్తచ్ఛవిభాసుర వైదూర్య§పరమరత్న
ఖచితదివ్యకిరీటకమ్రకుండలకాంతి కొమరారు నుదుటి ముంగురుల నలము
కొనఁగ నమూల్యరత్ననిచయనిర్మితకాంచ్యంగదములు కంకణము లింక
నలరు ననేకభూషల మహారోచులు పరమాద్భుతముగఁ బర్వఁగఁ నెసంగు

తే. నట్టి శ్రీకృష్ణు వసుదేవుఁ § డప్పు డెంతొ
విస్మయోత్ఫుల్లనయనుఁడై § విశ్వనాథుఁ
దనయునిం గాంచి శ్రీహరిఁ § దలఁచి కనుల
కఱవుదీఱఁగ మఱియును § గాంచెఁ బ్రీతి. ౧౦౪ 188

క. శ్రీకృష్ణుఁ డవతరించిన, యాకారణమునఁ జెలంగునట్టి [3]గురుమహా
వ్యాకలితసంభ్రమంబున, నే కడువడి నీట మున్గి § యింపుపొదలఁగన్. ౧౧ 189

[4]క. భూసురుల కయుతగోవుల, నాసమయమునన్ స్పృశింప § ననువుపడమిచేఁ
జేసెన్ దానము మనసున, నే సమయం బొదవునపుడె § యిచ్చెదు నూహన్.

మ. తనుకాంతిం బురుటిల్లు చాల వెలుఁగం § డాఁ జేయుచున్నట్టి యా
తనయుం డుత్తమపూరుషుండు భగవత్తత్త్వంబు తా నౌ నటం
చనుమానింపక నిశ్చయించి మతిధైర్యం బూని కంసప్రభీ
తిని వే పాఱఁగఁదోలి హస్తముల భక్తిం జేర్చి నొక్కుండుగన్. ౧౨ 191

1 దరము=శంఖము. 2 "మహార్హవైదూర్యకిరీటకుండలత్విషా పరిష్వక్తసహస్రకుంతలం" అని మూలము. "మహార్హ్యమనర్ఘ్యం యద్వైదూర్యం నీలపీతరక్తచ్ఛవిరత్నం"అని భావార్థదీపికాప్రకాశము. 3 "గురుమహావ్యాకలితసంభ్రమమ్మునన్" మహామన నిట నుత్సవమనియర్థము. 4 "అస్పృశన్మనసా = మనసాదత్తవాక్," అని వ్యాఖ్య.

తే. తత్ప్రభావంబు నెఱిఁగి గాత్రమును వంచి
వినయమున నివ్విధంబుగా వినుతి చేసె
నాత్మ తద్రూపదర్శనాత్యంతనిశ్చ
లతను గాంచఁగ సమ్మోద మతిశయిల్ల. ౧౨ 192

### వసుదేవుఁడు శ్రీహరిని వినుతించుట.

సీ. ప్రకృతికార్యంబులఁ బరికించు పురుషుండ వనియును గేవలమైనయనుభ
వమగు నానందరూపమున నుండుదు వనియును సర్వబుద్ధివృత్తినికరమ్ముఁ
గనుఁగొను సాక్షివియును నగు పరమపూరుషునిగాఁ దెలియుదు రూఢి నేను;
బ్రకృతిపరుండవై పరఁగు నీవే యఘటనఘటనాశక్తి ననుగమించు
తే. చున్న నిజమాయచేత నీ యురుతరప్ర
పంచమును త్రిగుణాత్మక పరిణతమును
దొలుత సృజియించి దానియందును జొరఁబడ
కయె ప్రవిష్టునిరీతిని గనఁబడుదువు. ౧౩ 193

*క. కనుకనె దేవకిగర్భంబును జొరకయె చొచ్చినట్టిపోలిక దోఁపం
గను జేయుచున్నవాఁడవు, వనజాక్షా! శ్రుతులు దీనివర్ణించుఁజుమీ. ౧౪ 194

సీ. వేఱువేఱుగనుండి విపుల విశిష్టకార్యములఁ జేయఁగ సమర్థములు గాని
యీమహదాదులే యేడును స్వవికృతులైన షోడశకముతోన కూడి
యంత విశిష్టకార్యసమర్థములునయి బ్రహ్మాండములను గల్పనముచేయు
చున్నవియే కదా సన్నుతిఁ గనునవి బ్రహ్మాండములశక్తిఁ బ్రభవ మందు
తే. నట్లుగాఁ జేసి యవ్వానియందుఁ జక్క
వర్తనముచేయుచునె యందుఁ బ్రభవమంద
నట్లు కనుపట్టుచుండెడు నవ్వి యండ
ములు జనింపక పూర్వమే పొలయుచుంట. ౧౫ 195

క. జననము బ్రహ్మాండములందును వానికిఁ గల్గనేరదుకదా; యిటునీ
వును దేవేశా! నిర్జర, మనుజాది విశిష్ట వస్తుమండలమందున్. ౧౬ 196

క. చొరఁబడియున్నను బుద్ధిని, స్ఫురింపఁగాఁ దగుస్వభావములు గల్గియు న
చ్చెరువుగ నింద్రియములచేఁ, బరఁగన్ గ్రహియింపఁ దగినప్రాగ్వస్తుతతిన్.

వ. కలిసియున్నను గుణకార్యము లైనయాదేవాదిపదార్థవితతికిం గలవికారములచే
స్పృశింపఁబడకయే నీవుందువు మఱియును. 198

సీ. పతులుతమగూండ్ల వసియింపఁ జొచ్చువిధమునఁ బరిచ్ఛిన్నతం జెలంగు
వానికిని బ్రవేశమా నపరిచ్ఛిన్నతను వెలింగెడువాని కనఁగ బాహ్య

* "తదనుత్వంహ్యప్రవిష్టః ప్రవిష్టఇవభావ్యసే" అని మూ.

మంతర మను భేద ౹ మరయ లేకుండును సర్వము నీవయ్యె ౹ సర్వమునకు
నాత్మవు నీవయ్యె ౹ యంతట వ్యాపించి వస్తుస్వరూపత ౹ వఱలు నిన్ను

ఆ. నేకదేశవర్తియేయయి మఱి పరిచ్ఛిన్నమగుచు వ్యాప్య ౹ మెన్న నగుచు
వస్తు వనఁగ రాక ౹ వసుమతిఁ దగుపదార్థగణ మావరింపఁ ౹ దరమె దేవ. ౧౭

వ. ఆత్మదృశ్యగుణంబు లగు దేహాదులయందు నాత్మవ్యతిరేకముచేత దేహాదు లుండునని నిశ్చయించువాఁడు పండితుఁడు కాఁడు. వ్యతిరేకదర్శనమున మూర్ఖుఁడని చెప్పంబడు. తర్కింపఁగా దేహాదులెల్ల వాచారంభణమాత్రంబులే యగుటంజేసి వస్తువులుగావు కాన జగంబెల్ల బాధితంబగు. అట్టిజగత్తునందు వస్తుబుద్ధిగలయతండు పండితుం డెట్టులగు? అగుణుండవై, యనీహుఁడవై యవికారుఁడవు నగునీమూలముననే యీజగత్తునకు సృష్టిస్థితిలయములు కలుగుచుండునని పెద్దలుచెప్పుదురు. నీవీశ్వరుండవు. కావున నిర్వికారుఁడవు. అయ్యును వికారాశ్రయుఁడవుగాఁ గనఁబడుచుందువు. సర్వజ్ఞత్వాదిగుణములు గలబ్రహ్మస్వరూపుఁడవు. ఇట్టి నీయం దీవికారాశ్రయత్వము విరుద్ధముగానేరదు. నిర్వికారుఁడ నగునాకీసృష్ట్యాదికర్తృత్వ మెట్లుసంగతం బగునందు వేని భవదాశ్రయములగు గుణములకుంగల కర్తృత్వాదిధర్మంబులెల్ల భృత్యకార్యములు రాజునం దారోపింపఁబడునట్లు నీయం దుపచరింపఁబడుచుండు. అంతియకాని వేఱుగాదు.

సీ. పరిపాలనము సృష్టి ౹ మరణమొందించుట యనుమూఁడు కార్యము ౹ లనుబొనర్చు
వారు విష్ణుబ్రహ్మ ౹ వామదేవులుగాని నేను గాదని యందు ౹ వేని వినుము
నిజమాయచేతనే ౹ నిఖిలలోకావనకార్యంబుకొఱకుఁ బ్ర ౹ కాశమాన
మగు శుద్ధసత్త్వమ ౹ యంబగు శుక్లవర్ణమ్మును, సృష్టికా ౹ ర్యమునిమిత్త

తే. మయి రజోభావితంబగు ౹ నట్టిరక్త
వర్ణమును లయకార్యంబు ౹ వారక యొన
రింపఁగఁ దమోమయం బగు ౹ కృష్ణవర్ణ
మును గ్రహింతువు కరుణాబ్ధి ౹ వనజనయన. ౨౦ 201

క. వనజాక్షుఁ డనఁ బితామహుఁ, డన రుద్రుఁ డనంగ వారె ౹ గ్మురికదా మూఁ
డునువర్ణంబుల ముప్వురు, తనరారుదు రట్టివారి ౹ తనువులు నీవే. ౨౦ 202

మ. కరుణాబ్ధీ! యఖిలేశ్వరా! యిపుడు లో ౹ కం బిద్ది చీకాకునొం
ద రయం బొప్పఁగఁ గావ నాదయిన సద్మం బందు జన్మించి భూ
వరనామంబుల వీరరాక్షసులు దేవద్వేషులై పుట్టి పె
క్కుర వీరాగ్రణులన్ మహాహవముకై ౹ కూర్పంగ నేర్పొప్పఁగన్. ౨౧ 203

క. వారల నడపింపఁగ నా, వీరుల నెల్లరను నీవు ౹ వీరంబున నో
ధీరాగ్రగణ్య! చంపుదు, వారయఁగ దురాత్ముఁడగు ౹ నక్కంసపతిన్. ౨౧ 204

చ. సురపరిరక్షకా! సుగుణశోభితులై తగువారి సంగతిన్
సరిపడనట్టి భోజపతి సమ్మద మొప్పఁగ నీవు కారణాం
తరమునఁ బుట్టఁబోయెదవు తప్పక మద్గృహమందు నంచు నె
వ్వారో వచియింపఁగా విని భవద్వరసోదరులన్ వధించెఁగా. ౨౨ 205

క. నీ విచట నవతరించుట, సేవకు లిపు డేగి తెల్ప శీఘ్రంబున భీ
తావహశస్త్రము దాలిచి, యే వచ్చు నటంచుఁ బల్కు నెన్ని స్వబుద్ధిన్. ౨౨ 206

చ. పురుషవరేణ్యలక్షణసమూహమునం దగువాని నాత్మజున్
దరుణులమిన్న దేవకి ముదంబునఁ గన్గొని కంసభీతి నా
తురతను బొందియుండియు విధూతవిరోధిని సూనుఁ జూచుచున్
దరహసితంబు మోమునను దాండవ మాడ నుతించె నివ్విధిన్. ౨౩ 207

దేవకీదేవి భగవంతుని వినుతించుట.

చ. శ్రుతులు వచించు నిన్ను నొకరూప మటంచ దియేది యన్న సం
తతమును వ్యక్తమై తగక తా నొగిఁ గారణమాట నాద్యమున్
వితతయశంబుఁ గాంచి యతివృద్ధిని గాంచుట బ్రహ్మమంచు స
న్మతులు వచింపఁగా సలరి మానితమై మఱి పావనంబునై. ౨౩ 208

*సీ. అది ప్రధానంబె యా ననరాక జ్యోతిస్స్వరూపమై చేతనం బై పరఁగెడు
నన్న పేరుం గాంచి యట్టులె వైశేషికులు వచించెడు జ్ఞానగుణముగాక
నిర్గుణంబయి, తగి నియతి మీమాంసకు లనుజ్ఞానపరిణామి యనఁగరాక
నిర్వికారం బన నెగడుచు నుత్తరమీమాంసకశ్రేణి మెలఁగుపుష్క
తే. రాక్షముఖులకు సమ్మతం బైనయట్టి, శక్తివిక్షేపపరిణామి సంజ్ఞికంబు
గాక సత్తయె యగుననఁగాఁ దగి మఱి, యద్విసామాన్యమా యన నట్లుగాక.

సీ. నిర్విశేషం బను నిర్మలప్రఖ్యాతిఁ గని కారణత్వము గనుట సత్క్రి
యంబని చెప్పఁగా నర్హంబుగాక నిరీహమే యనిపల్కనే తగుచును
సన్నిధిమాత్రన సకలకారణమయి పరఁగెడు కార్యకల్ప మగునిట్టి
వస్తు వేయదియో యావస్తువే నీవు; కేవలకార్యకల్పత నలరక మఱి
తే. బుద్ధిముఖ్యకారణసంఘమునకుఁ దాఁ బ్ర, దీపకంబగు నధ్యాత్మదీప మనఁగఁ
బేరుఁగాంచిన ప్రోడవు నీరజాక్ష, నీకు భయమనఁ గలదె యోనిఖిలరూప.

క. వనజోద్భవు జీవతమే, యనఁబడు ద్విపరార్ధకాలమని యయ్యది దాఁ
టినమీఁదఁ జరాచరలోకనిచయము లయంబు గాంచఁగా నత్తఱిన్. ౨౫

క. అలరారు మహాభూతంబులు తగ నాభూతసూక్ష్మముగఁ బ్రఖ్యాతిం

* 'రూపం యత్తత్ప్రాహురవ్యక్తమాద్యం బ్రహ్మజ్యోతిర్నిర్గుణం నిర్వికారమ్.' అని మూలము. దీనివివరణమే యిందుఁ బద్యద్వయమునఁ గలదు.

జెలఁగు నహంకారంబున, విలయముగన నది ప్రధానవిషయమునందున్. ౨౮౪

సీ. కాలవేగమ్మునఁ గాంచఁగాఁ బ్రళయంబు నిది యిటు లీనమైయ్యెను మరలను
దీని నుద్బోధింపఁ గా నగు నిట్టులే యనుచు నన్నింటిని నరయుచు లయ
మను నదిలేని మహాత్ముఁడవౌ నీవె యొకఁడవె శేషించియుండుగాదె;
సర్వేశ్వరా! నిమేషం బాదిగా హాయనము కొసఁగా వివిధముగ నుండు
తే. విశ్వచేష్టకు హేతువై వెలయు కాల, మరయ నీలీలయగు నందు రార్యు లెల్ల;
క్షేమధామమ వగునీకుఁ జేతు లొగ్గి, శరణు చొచ్చెద నోహరిసర్వనాథ. ౨౯

చ. పురుషుఁడు మృత్యురూపతను బొల్చుఫణీంద్రున కిట్టి భీతుఁడై
వరుసఁగ లోకసంతతులఁ బర్వులు పాఱుచు నుండు నేని ని
ర్భరమగు మృత్యుసంకటము వాయు నుపాయములేక ప్రాగ్జనిం
బరఁగెడు పుణ్యకర్మపరిపాకవశంబుననే తసంతటన్. ౨౯౪ 214

మ. భవదంఘ్ర్యంబుజసేవ చేయఁదగు సౌభాగ్యంబు ప్రాప్తింప దు
ర్భవసర్పాగతభీతి మాని సుఖియై ప్రాణాళి దేహంబునం
దు విధిన్ నిల్చెడుదాఁక నుండు; మఱిమృత్యుస్ఫారసర్పంబు భ
క్తవరున్ వానిని జేరఁగా వెఱచు నాథన్యుండు ముక్తుం డగున్. ౨౭ 215

ఉ. క్షేమకరుండవై తనరు శ్రీపతి చూచుటకే భయంకరుం
డై మహినొప్పు కంసుని భయంబున నుండు మహార్తులన్ మమున్
నీమహితాంఘ్రిసేవకుల నెమ్మి చెలంగఁగఁ గావవయ్య భ
క్తామరవంద్యభృత్యనివహార్తిహరుండవు గాదె యెప్పుడున్. ౨౭౪ 216

ఉ. పౌరుషరూపమీయది యపారభవన్మహిమంబుఁ దెల్పెడిన్
నీరజనాభ! యోగు లెద నీదగురూపము ధ్యాననిష్ఠమైఁ
జేరిచి కాంచుచుందురు ప్రసిద్ధ మిదా శ్రుతులందు, మాంసదృ
క్పూరుషసంఘు మిద్ది గనఁ బోలదు గావున నట్టుచేయవే. ౨౦ 217

ఉ. ఓమధుసూదనా! యఘము లొప్పని చేసెడుకంసుఁ డిప్పు నీ
వీమెయి నాదుగర్భమున నే జనియించు టెఱుంగకుంటయే
క్షేమము గాన నవ్విధిని జేయు మధీరమనస్కనౌట నా
భూమిపునుండి సాధ్వసముఁ బొందుచునుండుదు నేను నెంతయున్. ౨౯ 218

క. ఓవిశ్వాత్మా! విష్ణూ!, కావున దరచక్రపద్మగదల చెలువునన్
బావనగతి రాజిల్లుచు, శ్రీవిలసితమై మునీంద్రసేవితమును నై. ౨౯౪ 219

క. నాలుగుభుజముల నెంతయుఁ, గ్రాలుచు మఱిలౌకికంబు గాక యసమతే
జోలలితంబగు రూపము, చాలించి శిశుత్వ మొంద సమ్మతిఁ గనుమా. ౩౦ 220

సీ. ప్రళయావసానంబు పట్టున నీప్రపంచమ్ము యథావకాశముగ స్వతను

వునయందు ధరియింతువుగద పరాత్పరా! యట్టినీ విత్తతి నస్మదీయ
గర్భమ్మునం బుట్టఁ గా నోచఁ గల్గితి నౌరౌర! నరలోకమందు నీదు
మహితవిలాస మిూమాడ్కిఁ జెలంగు నే నరులపోలిక లిట్టివరుస నుండు

ఆ. ననుచు ననుకరించు ననుటయే తప్ప నీ, కివ్వి యేల యనుచు నెసఁగుభక్తి
దేవకియు నుతింప దేవాదిదేవుఁ డిమ్మాడ్కి బదులు చెప్పె మనసుపొంగ. ౨౨౧

క. ఓసాధ్వీమణి పూర్వం, బౌ సర్గమునందుఁ బృశ్ని యనుపేరు దగం
గా సమధికవిఖ్యాతిన్, భాసిల్లితి వపుడు మనువు స్వాయంభువుఁడౌ. ౨౨౨ 222

క. ఆతని ప్రభుత్వకాలం, బాతతధర్మమున సాగ నపగతపాపుం
డై తనరెన్ వసుదేవుం, డీతడు సుతపుండనం బ్రజేశ్వరుఁ డయ్యెన్. ౨౨౩ 223

సీ. కమలాసనుఁడు మిమ్ముఁ గాంచి ప్రజాసర్గ మొనరింపుఁడీ యని పనిచె నంత
నింద్రియవ్యూహంబు స్వేచ్ఛఁగాఁ బోనీక స్వాధీనమందుండు న ట్లొనర్చి
నిరుపమ మిది యన నెటఁ దప స్సొనరించితిరి కాలగుణములై పరఁగుచున్న
వర్షాతపంబుల వాయుహిమంబుల ఘర్మాతిరేకంబుఁ గడు సహించి

తే. శ్వాసముల నట్టిబంధించి స్వాంతమలము, లనఁదగినయట్టి రాజసమును దమోవి
కారములడీలుపడఁజేసి భూరుహచ్యు,తమసుఫలపత్త్రములను వాతమునుదినుచు. ౨౨౪

ఉ. నన్ను మనస్సులన్ నిలిపి నావలనన్ బహుకాంక్షలొందఁగా
నెన్ని ప్రశాంతచిత్తముల నిద్ధవిధిన్ మదుదారపూజలన్
సన్నుతులన్ ననుం దనిపి చక్కనినిష్ఠఁ దపంబుచేయఁగాఁ
బున్నెముపండు నానియతి పూజ్యతరంబుగ సాగె నొక్కటన్. ౨౨౫ 225

క. ఇరువురు తపమొనరింపఁగ, సరిగాఁ బండ్రెండు వేలసంవత్సరముల్
సురమానంబునఁ జెల్లెను, బరమము దుష్కరము నాతపం బగు సాధ్వీ. ౨౨౬

చ. అనఘమనీషులార! నను నన్వహ మాత్మను బాదుకొల్పి చే
సిననియతిన్ గ్రహించితిని శ్రీకరమైనతపంబు భక్తి శ్ర
ద్ధ నెఱి మదాత్మతృప్తికిని దావల మయ్యె వరప్రదానద
క్షునికరమందు మిన్ననయి గ్రాలుదు నే నని పల్కి వెండియున్. ౨౨౭ 227

క. మిముఁగూర్చి పల్కితిని నిప్డు మనోరథ మెట్టిదానిఁ బొందఁ దలఁచి యి
ట్టిమహితతప మూనితి రో,తమిఁ గోరుఁ డొసంగువాఁడ ధన్యులు గానన్.

చ. అని వచియించునాడుపలు కాదృతిమిూఱఁగ నాలకించి మీ
రనఘులుగాన గ్రామ్యవిషయంబుల నింతయుఁ గోరనట్టిపు
ణ్యనిచయ మెంతొ చేసిన మహాత్ములు గానఁ దనూజుఁ గాంచనో
చిన యొకపుణ్యకర్మమును జేయనివారలుగాన నత్తఱిన్. ౨౨౯ 229

క. నామాయచేత మోహితు,లై ముక్తిని గోరమాని యాత్మభవుని నే

నామ్రొక్కి యుండువానినె, యోమానితచిత్తులార! యొగిఁ గోరంగన్. ౨౩౦

క. వర మిచ్చితి నట్లే యని, యరిగితి నాలోకమునకు నంతట మీర
త్తరుణమున మనోరథ మి,క్కరణిగ నీడేఱుటయును గాంచులుతీఱన్. ౨౩౧ 231

ఆ. విషయసుఖములను సువిస్తృతిమీఱంగ, ననుభవించితిరి; మహాత్ములార
యంత శీలమున మహౌదార్యమున సాధు,సద్గుణాళి నొండుసాటిలేక. ౨౩౨ 232

సీ. లోకంబులం దెల్లఁ బ్రాకటవిఖ్యాతి గలయట్టినేఁ బృశ్నిగర్భుఁ డనఁగ
మీకుఁ గుమారుండ నై కల్గితని మీరె యవలిజన్మంబున నదితి యనఁగఁ
గశ్యపుఁడన జనిఁ గాంచితి రట్టి రెండవజన్మమందు సాధువర మద్ధి
సార్థకంబుగ నేను నాత్మభవుండనై పే రుపేంద్రుం డనఁ గోరి మీకు

ఆ. వాంఛపొదలఁ బుట్టి వఱలితి; వామనా,కారకారణమున గారవమున
వామనాఖ్య నాకుఁ బ్రఖ్యాత మయ్యె మీ, మూఁడవదగు నిట్టిపుట్టువునను.

క. అదితియుఁ గశ్యపుఁడే యీ,యదనున నీనామ మూని యలరెడుమీకే
ముదమునఁ దనయుఁడనై యి,ట్లుదయించితిఁ బూర్వరూప మొప్పారంగన్

[1]క. సూనృత మీవాక్యంబని,యే నమ్మము పూర్వభవము స్మృతికిఁ దగులఁగా
నీనారూపముఁ జూపితిఁ,గాని మఱొక్కండు కోరికాదని మఱియున్. ౨౩౪ 234

క. ఈరూపంబునఁ బుట్టక, యేరూపమ్మునన్ పుట్ట నిల మర్త్యులరై
మీరుంట నాదుపుట్టుక, యీరీతి నటంచు మీకు నెఱుఁగఁ దరంబే. ౨౩౫ 235

ఆ. మర్త్యలింగమునను మామకజ్ఞానంబు,గలుగఁబోదు; మాకుఁ గలుగఁగలవా
యిట్టిజన్మము లని యెన్నఁబోకుఁ డటంచుఁ, బలుకఁబూనె హరియు లలితభణితి.

క. ననుమీరు పుత్త్రభావం,బుననో మఱి బ్రహ్మభావముననో పలుమా
ఱును స్నేహమూని చింతిం,చిన మత్పరమగతి కెలమిఁ జేరుదురుసుఁడీ. ౨౩౭ 237

[2]చ. అని వచియించి యాజనకు నవ్వు కనుంగొని కంసునుండి భీ
తిని గనుదేని నన్నుఁగొని తెప్పున గోకులమందుఁ జేర్చి నం
దునిసతియౌ యశోద యనుకతొయ్యలికిన్ జనియించినట్టి నా
యనుపమమాయఁ దెమ్ము, పనులన్నియుఁ జేకురు దాన మీ కొగిన్.

చ. అని యిటుపల్కి శ్రీహరియు నవ్వలఁ బల్కక యూరకుండి చ
క్కనిదగు స్వీయమాయఁ గొనికాలవశంబున సంశయించునా
జనకులు చూచుచుండఁగ నికామము ప్రాకృతుఁడే యనంగ నొ
ప్పిన శిశు వయ్యె నచ్చెరువుఁ బ్రీతియు వారికి హెచ్చునట్లుగన్. ౨౩౯ 239

1 'సత్యంమేవ్యాహృతంసతి' అని మూలము. 2 'యదికంసాద్బిభేషిత్వం తర్హి మాం గోకులం నయ, మన్మాయా మానయాశుత్వం యశోదా గర్భసంభవామ్.' అను నధిక పాఠమున కిది పద్యము.

వసుదేవుఁడు శ్రీకృష్ణుని వ్రేపల్లియకుం గొనిపోవుట.

చ. హరి యిటుపల్కి తా శిశుత నందఁగనే వసుదేవుఁ డాపరా
త్పరుఁ డెటు హెచ్చరించె నలపద్ధతిఁ బూని కుమారు నాతనిం
గరములు దోయిలించికొని గ్రక్కున నాపురుటింటినుండి యే
తరుణమునందు వెల్వడఁగ దాను దలంచెనొ యప్పుడే యటన్. ౨౬౪ 240

క. నందవ్రజమున నందుని, సుందరియని ఖ్యాతిఁగను యశోదకు జన్మిం
చెం దనయ యగుచుఁ ద్రిజగ,త్సుందరిహరియోగమాయ చోద్యముగాఁగన్.

*చ. జననమె లేనిమాయ యటఁ జక్రిమహాజ్ఞను బూని జన్మముం
గనియెను; విష్ణుమాయ దగుకమ్రతరాయతశక్తిఁ జేసి యొ
య్యన సకలేంద్రియంబులయు వ్యాపృతులెల్లను మాని గాఢని
ద్రను గని ద్వారపాలకులు ధాత్రిపయిన్ శయనించి రొక్కటన్. ౨౭౪ 242

ఉ. పౌరులు యోగమాయ దగుభావమురీతిఁ బ్రబోధ మింత చే
కూరమిఁ గూర్కుచుండి, రిటఁ గ్రూరనిశార్ధమునందుఁ బుత్త్రుఁ డౌ
శ్రీరమణున్ శిశుత్వమును జెందినవానిని గొంచుఁ బోవఁగా
శూరసుతుండు యత్నమునఁ జొన్పె మనంబును దైవ మెన్నుచున్. ౨౭౪ 243

సీ. ద్వారములందెల్లఁ దలుపుల నాయసకీలశృంఖలములు చాలదృఢము
గాఁ గూర్పఁబడియుండెఁ గంసు నానతి మెయి హరినెత్తుకొనిపోవు టతిభరంబు
గానుండె, వసుదేవుఁ డూని నిబ్బరమును దనయుని గైకొని తరలె నప్డు
ద్వారములన్నియుఁ దపసునిరశ్మిచే నంధకారము లట్టు లర్భకవరు
తే. నెత్తుకొని వసుదేవుఁ డశ్లేగువేళఁ, దామె తమయంత విడివడి యేమియడ్డు
చేయకుండెను, బర్జన్యుఁ డాయెడ మెల, మెల్ల నుఱుముచు వర్షించె మేలుగోరి.

క. ఒరులకుఁ గన్పడకుండఁగ, నురగేంద్రుఁడు వృష్టిఁ దడియకుండఁగ శిశువుం
బరిరక్షింపఁగ ద్వారము, పరిసరమున నెదిగి భూరిఫణములఁ గప్పెన్. ౨౮ 245

మ. ఉరగేంద్రుండు ఫణాళిచేత ఘనవృష్ట్యుద్రేకమున్ మాన్చి యా
పరమేశున్ శిశురూపునిం గొలిచిరాఁ బర్జన్యుఁ డప్డప్డు భీ
కరవృష్టిం గురియం బ్రవాహ మొగిఁ బొంగన్ లోఁతు చెప్పం గనం
దరమేగాక చెలంగ వెల్లువ నితాంతం బొప్పఁగాఁ బైపయిన్. ౨౮౪ 246

ఉ. తుంగతరంగముల్ పొలయఁ దోడనె ఫేనము లుప్పతిల్లి వా
నిం గననీకఁ గప్పుచును నిర్ఝరవేగమునం జనంగ భీ
తిం గనఁజేయు సుళ్లు నొకతేపకు వందలుగాఁ గనంబడం
బొంగెడు వేడ్కమై యమున భూతభయంకరలీలఁ బాఱుచున్. ౨౯౦ 247

* "యదా బహిర్గంతు మియేషతర్హ్యజాయా యోగమాయా" అని మూలము.

మ. మునుసీతాపతియైన రామునకుఁ బెన్మోదంబునన్ మార్గ మి
చ్చినసంద్రంబును బోలి త్రోవ యొసఁగెన్ శ్రీకృష్ణునిం గొంచు నె
మ్మన మెంతో యురియాడ నీనది నదేశమాడ్కిం దరింపంగ నా
నని యూహించెడు శూరపుత్రునకు నేయ్యంబొప్ప నొక్కమ్మడిన్. ౨౦ 248

*తే.యమునిసోదరియయ్యు నయ్యఖిలలోక
పతిమహాజ్ఞను దలఁదాల్చి పథ మొసంగె
భగవదాజ్ఞను దాఁటెడువారు గలరె
హరిహరబ్రహ్మలైన నెంతదైనఁ గాని. ౨౦ 249

ఉ. ఆనదిదాఁటి శూరసుతుఁ డప్పుడె నందునిమంచఁ జేరి శ్రీ
జానిమహాజ్ఞ నత్తఱిని సంభవ మందిన యోగమాయ దా
నానతి గోపసంతతి నిజాంగములే యెఱుఁగంగలేని య
ట్లే నిదురింపఁ గాంచి మది నెంతయుఁ బొంగి యశోదశయ్యపై. ౨౦౪ 250

చ. తనసుతు నెట్టులో యునిచి తత్తనయుం గొని కృష్ణునాజ్ఞ నో
య్యన మరలన్ స్వవాసమున కప్పుడెచేరి స్వదారశయ్యపై
నునిచి విధిం దలంచుచు నయోమయశృంఖలముల్ పదంబులన్
మునుపటియట్లె కన్పడఁగ ముం దిఁకసాగు నదేమొ యం చెదన్. ౨౧౪ 251

క. తలపోయుచుండె; నందుని, జలజాక్షి యశోద బిడ్డ జనియించుటయే
తెలిసికొనెఁ గాని నిద్దుర, పొలయుట మైమఱచి స్మృతియుఁ బొలయకయుంటన్.

క. తనకన్నబిడ్డ మగశిశు, వని యాఁడుది యనియు నెఱుఁగ కాయాసమునన్
దనుఁ దా నెఱుఁగని నిద్రం, గనియుండెను శౌరియుండెఁ గడు దీనుండై. ౨౩

---

నా ల్గ వ య ధ్యా య ము.

కంసుఁడు దేవకి ప్రసవించుట విని త్వరపడి వచ్చుట.

క. అని శుకయోగి పరీక్షి, జ్జనపాలున కిట్టులనియెఁ జక్రి యవలిగా
థను దెల్పెద వసుదేవుం, డనుగతశృంఖలపదుండు నై యుండంగన్. ౪ 254

క. తమయంతన నగరద్వారములన్నియు లోన వెలిని రాజాజ్ఞను నే
క్రమమున సంపిహితములై, యమరం దగు నట్టులుండె నత్తరుణమునన్. ౪

సీ. బాలికారోదనధ్వని విని కావలి వా రెల్ల రట్టి విభ్రాంతచిత్తు
లగుచు మేల్కాంచి వే యరిగి కంసునితోడ దేవకి ప్రసవించె దేవయనుచుఁ
దెలిపిన భోజధాత్రీపతి యెద్దాని వినఁగోరి యతిశయభీతిఁ గనుచు
నెదురుచూచుచు నుండె నది యప్డు వినఁబడ శయనంబునుండి యాసంతతిఁ బొలి

* "యమానుజా" అనుమూలమునఁ గలయర్థచమత్కృతిని ఛెంచి వ్రాయనయ్యె.

తే. యింప నద్దిరొ యద నని యెంచి లేచి, మృత్యువును జంపఁగోరుచు మిగులఁ దడఁబ
డుచును దలవెండ్రుకలు వీడఁ బడు నవి యట్టె, చక్క సవరింపఁ జాలని సంభ్రమమున.

క. పరుగిడి నీళ్లాడిన మందిరమును జేరెన్ మనంబు । తేఁకువదప్పన్
ద్వారపడి వచ్చిన యా సోదరుఁ గని దేవకియుఁ జాల దైన్యము గదురన్. ౩౪ 257

ఉ. [1]మన్నన చేయ నట్టిఁ దగుమానిసి కైనను విన్న యంత నే
యెన్నఁగరాని జాలి జనియింపఁగఁ జేసెడు నట్టి పల్కులన్
విన్నఁదనంబునం బలికె । విశ్రుతవంశమునన్ జనించి యా
పన్నులఁ గావఁ జాలుదువు । భ్రాతవు గోరుదు మేలు నా కెదన్. ౪ 258

చ. కనుఁగొను మేనగోడ లగుఁ గాని నినున్ వధియింప భూమిపై
జనిఁగను మేనయల్లుఁడె నిజమ్ముగ దీనికి మేలుగోర నిం
క నెవరు నీకు నీడు విను । కన్యను జంపఁగఁ బూన న్యాయమే
మనమున నెన్ను మిట్టిపని । మానుము న్యాయము గాదు సోదరా. ౪ 259

ఉ. ఇంతకుమున్నె నాకు జనియించిన సూనులఁ బావకాభులన్
జింతయె లేక చంపితివి । సీ! పురికొల్పెనొ దైవ మేది ని
న్నింతటి గొప్ప కార్య మిటులే యొనరింపు మటంచు నన్నరో
యింతి యిదోఁ గదా యొసఁగవే యొకదానిని నైన నిత్తఱిన్. ౫ 260

చ. కడపటిదాఁతు రిద్ది యిఁకఁ గల్గుదురే యనునాశ యించుకేఁ
బొడమదు నెమ్మదిన్ ముదిమిఁ । బూనుట నా కొగిఁ బుట్టినట్టి యా
కొడుకుల నెల్లఁ జంపితివి । కోరిన యట్లె యనుంగుఁజెల్లెలన్
బుడుతల చావునుం గనుచుఁ । బొక్కెడుదానను నేను సోదరా. ౫౪ 261

క. దురదృష్టవంతురాలను, జరమప్రజ యిద్ది నీవు । క్ష్మావిభుఁడవు సో
దరి నని చిన్నికుమారికఁ, గరుణ నొసంగం దగుదువు గా యని మఱియున్. ౬

క. వనరుచు నతిదీనముగాఁ, దనయను కౌఁగిటను జేర్చి । ధర్మముగా నె
మ్మన మొగిఁ గరుగఁగ వేఁడెడు, వనితామణి బిట్టదల్చి । వాఁ డకరుణుఁడై.

క. ఖలుఁ డౌట సహజ హస్తంబులనుండి జవంబు మీఱఁ । బుత్రికఁ గొనియెన్
బలిమిన్ దత్తరుణమున నె, యిలపై జన్మించి కన్నులే తెఱువక యే. ౭ 264

చ. కరములఁ దాఁకనేఁ దగక । కన్నుల పండువుఁగూర్చు బాల సో
దరసుత యంచునైన నిది । తప్పని యైనఁ దలంప కొక్క స్వా
ర్థరతిని మాత్రమే గనుచు । దానను సౌహృదముం ద్యజించి వే
[2]చరణము లట్టె పట్టుకొని । సాంద్రశిలాగ్రమునన్ మహోగ్రుఁడై. ౮ 265

---

1 "తమాహ భ్రాతరం దేవీ కృపణాకరుణం సతీ" అని మూ. 'కృపణాకరుణం' అనుపదముల యర్థమే యిందుఁ జక్కఁగాఁ జెప్పఁబడినదని యెఱుఁగందగు. 2 "అపోథయచ్ఛిలాపృష్ఠే" అని మూ.

1ఆ. ఎత్తివైచె; నిట్టు లేయంగ నబ్బాల, బండమీఁదఁ బడక వానిచేతి
నుండి యట్టె యెగసి వ్యోమమార్గంబునఁ, గానఁబడియెఁ గంసు మానమెడల

చ. సురపథమందు నిల్చి కడుశోభిలు నెన్మిదిబాహువుల్ భయం
కరగురుశస్త్రముల్ వెలయఁగన్పడ విష్ణుపుతో జనించియు
న్నరమణి యోగమాయ యట నైజశరీరము కన్పడంగ ని
ర్జరతరుపుష్పహారములు రాజిల నాభరణాళి యొప్పఁగన్. ౯ 267

సీ. దివ్యగంధపుఁబూఁత దేహము వెలయంగఁ గమ్రవస్త్రంబును గట్టి చాప
శరశూలచర్మాసిశంఖగదాచక్రముల ధరియించి నిస్తులకరాష్ట
కము మెఱయుచునుండ గంధర్వచారణసిద్ధులప్సరసలు చేతు లొగ్గి
కిన్నరు లురగులు కీర్తించి కానుకల్ కరములఁబూని యుత్కంఠమీఱ

తే. దన్నుఁబొగడంగ నలరుచు మిన్నుఁ గనుచు
నేమియును జేయఁ జాలకయే తనుంగ
నుఁగొను పాపాత్మునిం గంసుని గని యోరి
మందమతి! విను మిప్డు నామాటఁ గడఁక. ౧౧ 268

ఉ. ఏమిఫలంబు గల్గునని యెంచి నను న్వధియింపఁ బూనితో
నీమరణైకహేతు వని నింగి వచించినపూర్వవైరి యి
ప్డే మహి నొక్కచోట జనియించి వెలింగెడుఁజుమ్ము దీనువై
యేమియెఱుంగ నట్టిశిశుబృందము నూరకె చంపకుండుమా. ౧౨ 269

చ. అనియిటు కంసుఁగూర్చి విపులార్థయుతంబుగఁ బల్కి యంత నా
యనుపమభాగ్యశాలిని మహామతి శ్రీపతియోగమాయ భూ
మిని బహునామముల్ గలిగి మించినచోటులఁ బెక్కునామముల్
తనరఁగ నొప్పుచుండెను నితాంతమహత్త్వ మొగిం గనంబడన్. ౧౩ 270

ఉ. దేవి వచించి నట్టివయి తీక్ష్ణతరార్థము గల్గుపల్కు లా
భూవిభుఁ డాలకించి మది భూరితరంబగు విస్మయంబు వే
యావహిలంగఁ జెల్లెలిని నావసుదేవుని బంధముక్తులం
గా విధిమీఱఁజేసి యొడికంబునఁ బల్కెను బ్రశ్రితుండునై. ౧౪ 271

ఉ. [2]అక్కట! సోదరీ! ప్రియము లాడెదు బావరో! పాపబుద్ధినై
రక్కసుఁ డాత్మసంతతుల ప్రాణము తీయు విధంబు తోఁచఁగా
మక్కువ మీరు గాంచిన కుమారులఁ బల్వురఁ జంపినాఁడఁగా
యక్కటికంబు చూపక యహంకృతి నాత్మహితార్థినై యిసీ. ౧౫ 272

1 "సా తద్ధస్తాత్సముత్పత్య సద్యోదేవ్యం బరంగతా" అనిమూ. 2 "అహోభగిన్యహోభామమ యావాంబత పాప్మనా" అని మూ. 'భామస్తుభగనీభర్తా'. అని నిఘంటువు.

క. జ్ఞాతులని కాని మిత్ర, వ్రాతంబనికాని యెంచి ౹ వదలక న్యాయం
బీతఱెని సంత్యజించితిఁ, జేతము దుర్వృత్తి నూనెఁ ౹ జెప్పఁగ నేలా. ౧౪ 273

క. ఏలోకములను గాంతు? న,ధోలోకమె నాకుఁగల్గుఁ ౹ దోడ్తో జ్ఞాన
శ్రీలలితు విప్రుఁ జంపిన, కూళవలెఁ మృతుఁడనే యగుదును బ్రదికియున్.

చ. మునువచియించె నెన్మిదవపుత్త్రుఁడు నిన్ను వధించునంచు నీ
కును మృతిఁగూర్ప నిప్పు డొక ౹ క్షోణిని బుట్టినవాఁడు పుత్త్రుఁడం
చును వచియించె దైవ మిది ౹ చూడఁగ మర్త్యులెకాక దైవ మి
ట్లనృతము పల్కుచున్న దను ౹ టారయ సత్యమె యయ్యెఁజూడరే. ౧౫ 275

చ. అనృతములాడుదైవ మని ౹ యారయఁజాలక దానిమాటలే
మనమున నిల్వ నమ్మి యిదిమంచిదికా దనియెంచుజ్ఞానముం
గనని మహాఘసంతతులఁ ౹ గాదనిచేసినవాఁడఁ గాన నో
ప్పని సహజాతపుత్త్రకుల ౹ నందఱఁ జంపితి నేమిచెప్పుదున్. ౧౬ 276

చ. అతిశయబుద్ధిసంపదల ౹ నందినవారలు గాన మీర లా
సుతుల మదిన్ దలంచుకొని ౹ శోకము నొందకుఁ డాత్మకర్మసం
తతుల ఫలంబులం గుడిచి ౹ తా రొగి నేగి రటంచు నెంచులే
హిత మగు వారిఁగూర్చి తపియించిన నేమిఫలంబు గల్గెడున్. ౧౭ 277

సీ. దైవతంత్రంబునఁ ౹ దారు ప్రవర్తించు నఖిలజంతువు లట్టులౌట వార
లొక్కచోఁ దిరముగా ౹ నుండ నేరక స్వీయకర్మానుసారంబుగా జనిమృతు
లను గాంచుచుఁ జరింతు ౹ రనయమీరీతిగాఁ బార్థివంబులుగాఁగఁ ౹ బరఁగుచున్న
యట్టిఘటాదుల ౹ యాకారములఁ బోలి భూతసంతతిరూపములుగఁ దనరు

తే. దేహములు కర్మవశమునఁ ౹ దివిరి కూడుఁ
బాయు నట్టిఘటాదిరూపములు పోవ
నవని యెటులుండు నట్లుదేహములు గలుగఁ
జెడఁగ నాత్మయు భేదంబు ౹ చెందకుండు. ౧౯ 278

వ. ఈయర్థంబు నెఱుంగనివారలు భేదదర్శనంబునం జేసి దేహాత్మబుద్ధింబడయుదురు.
ఆకారణంబున దేహయోగవియోగనిమిత్తంబున సుఖదుఃఖరూపసంసారసంబంధ
మహాక్లేశంబు వారలకుం దప్పక కల్గు. ౨౦ 279

క. కావున నీదుకుమారులు, నావలననె మృతిని గాంచిరన్ వారలదౌ
చావునకు వగవకుండం,గా వలయు నదేల యన్నఁ ౹ గారణ మిదియా. ౨౧

క. ఓకల్యాణీ! నేనే, నీకొడుకులఁ జంపితి నని ౹ నీవెంచుట యె
ట్లో కర్మవశంబుననే, చేకూరినఫలముల వెసఁ జెందిరివారల్. ౨౧ 281

తే. ఆత్మకృతమగు కర్మఫలాళి వార

[1]ఆ. ఎత్తివైచె; నిట్టు లేయంగ నబ్బాల, బండమీఁదఁ బడక వానిచేతి
నుండి యట్టె యెగసి వ్యోమమార్గంబునఁ, గానఁబడియెఁ గంసు మాన మెడల.

చ. సురపథమందు నిల్చి కడుశోభిలు నెన్మిది బాహువుల్ భయం
కరగురుశస్త్రముల్ వెలయఁగ నప్డ విష్ణుపుతో జనించియు
న్నరమణి యోగమాయ యట నైజశరీరము కన్పడంగ ని
ర్జరతరుపుష్పహారములు రాజిల నాభరణాళి యొప్పగన్. ౯ 267

సీ. దివ్యగంధపుఁబూఁత దేహము వెలయంగఁ గమ్రవస్త్రంబును గట్టి చాప
శరశూలచర్మాసిశంఖగదాచక్రముల ధరియించి నిస్తులకరాష్ట
కము మెఱయుచునుండ గంధర్వచారణసిద్ధులప్సరసలు చేతు లొగ్గి
కిన్నరు లురగులు కీర్తించి కానుకల్ కరములఁబూని యుత్కంఠ మీఱ

తే. దన్నుఁ బొగడంగ నలరుచు మిన్నుఁ గనుచు
నేమియును జేయఁ జాలకయే తనుంగ
నుఁగొను పాపాత్మునిం గంసుని గని యోరి
మందమతి! విను మిప్డు నామాటఁ గడఁక. ౧౧ 268

ఉ. ఏమిఫలంబు గల్గునని యెంచి ననున్ వధియింపఁ బూనితో
నీమరణైకహేతు వని నింగి వచించినపూర్వవైరి యి
ప్డే మహి నొక్కచోట జనియించి వెలింగెడుఁ జుమ్ము దీనునై
యేమియెఱుంగ నట్టిశిశుబృందము నూరకె చంపకుండుమా. ౧౨ 269

చ. అనియిటు కంసుఁగూర్చి విపులార్థయుతంబుగఁ బల్కి యంత నా
యనుపమభాగ్యశాలిని మహామతి శ్రీపతియోగమాయ భూ
మిని బహునామముల్ గలిగి మించినచోటులఁ బెక్కునామముల్
తనరఁగ నొప్పుచుండెను నితాంతమహత్త్వ మొగిం గనంబడన్. ౧౩ 270

ఉ. దేవి వచించి నట్టివయి తీక్ష్ణతరార్థము గల్గుపల్కు లా
భూవిభుఁ డాలకించి మది భూరితరంబగు విస్మయంబు వే
యావహిలంగఁ జెల్లెలిని నావసుదేవుని బంధముక్తులం
గా విధిమీఱఁ జేసి యొడికంబునఁ బల్కెను బ్రశ్రితుండునై. ౧౪ 271

ఉ. [2]అక్కట! సోదరీ! ప్రియము లాడెదు బావరో! పాపబుద్ధినై
రక్కసుఁ డాత్మసంతతుల ప్రాణము తీయు విధంబు తోఁపఁగా
మక్కువ మీరు గాంచిన కుమారులఁ బల్వురఁ జంపినాఁడఁగా
యక్కటికంబు చూపక యహంకృతి నాత్మహితార్థినై యిసీ. ౧౫ 272

---

1 "సా తద్ధస్తాత్సముత్పత్య సద్యోదేవ్యం బరంగతా" అనిమూ. 2 "అహో భగిన్యహో భామమ
మావాంబత పాప్మనా" అని మూ. 'భామస్తుభగనీభర్తా'. అని నిఘంటువు.

క. జ్ఞాతులని కాని మిత్ర, వ్రాతంబనికాని యెంచి ॱ వదలక న్యాయం
బీతఱెని సంత్యజించితిఁ, జెతము దుర్వృత్తి నూనెఁ ॱ జెప్పఁగ నేలా. ౧౫ 273

క. ఏలోకములనుగాంతు? న,ధోలోకమె నాకుఁగల్గుఁ ॱ దోడ్తో జ్ఞాన
శ్రీలలితు విప్రుఁ జంపిన, కూళవలెన్ మృతుఁడనే యగుదును బ్రదికియున్.

చ. మునువచియించె నెన్మిదవపుత్త్రుఁడు నిన్ను వధించునంచు నీ
కును మృతిఁగూర్ప నిప్పు డొక ॱ క్షోణిని బుట్టినవాఁడు పుత్త్రుఁడం
చును వచియించె దైవ మిది ॱ చూడఁగ మర్త్యులెకాక దైవ మి
ట్లనృతము పల్కుచున్న దను ॱ టారయ సత్యమె యయ్యెఁజూడరే. ౧౬ 275

చ. అనృతములాడుదైవ మని ॱ యారయఁజాలక దానిమాటలే
మనమున నిల్వ నమ్మి యిదిమంచిదికా దనియెంచుజ్ఞానముం
గనని మహాఘసంతతులఁ ॱ గాదనిచేసినవాఁడఁ గాన నొ
ప్పని సహజాతపుత్త్రకుల ॱ నందఱఁ జంపితి నేమిచెప్పుదున్. ౧౭ 276

చ. అతిశయబుద్ధిసంపదల ॱ నందినవారలు గాన మీర లా
సుతుల మదిన్ దలంచుకొని ॱ శోకము నొందకుఁ డాత్మకర్మసం
తతుల ఫలంబులం గుడిచి ॱ తా రొగి నేగి రటంచు నెంచు లే
హిత మగు వారిఁగూర్చి తపియించిన నేమిఫలంబు గల్గెడున్. ౧౮ 277

సీ. దైవతంత్రంబునఁ ॱ దారు ప్రవర్తించు నఖిలజంతువు లట్టులౌట వార
లొక్కచోఁ దిరముగా ॱ నుండనేరక స్వీయకర్మానుసారంబుగా జనిమృతు
లను గాంచుచుఁ జరింతు ॱ రనయమీరీతిగాఁ బార్థివంబులుగాఁగఁ ॱ బరఁగుచున్న
యట్టిఘటాదుల ॱ యాకారములఁ బోలి భూతసంతతిరూపములుగఁ దనరు

తే. దేహములు కర్మవశమునఁ ॱ దివిరి కూడుఁ
బాయు నట్టిఘటాదిరూపములు పోవ
నవని యెటులుండు నట్లుదేహములు గలుగఁ
జెడఁగ నాత్మయు భేదంబు ॱ చెందకుండు. ౧౯ 278

వ. ఈయర్థంబు నెఱుంగనివారలు భేదదర్శనంబునం జేసి దేహాత్మబుద్ధింబడయుదురు. ఆకారణంబున దేహయోగవియోగనిమిత్తంబున సుఖదుఃఖరూపసంసారసంబంధ మహాక్లేశంబు వారలకుం దప్పక కల్గు. ౨౦ 279

క. కావున నీదుకుమారులు, నావలననె మృతిని గాంచిరన్ వారలదా
చావునకు వగవకుండం,గా వలయు నదేల యన్నఁ ॱ గారణ మిదియా. ౨౧

క. ఓకల్యాణీ! నేనే, నీకొడుకులఁ జంపితి నని ॱ నీవెంచుట యె
ట్లో కర్మవశంబుననే, చేకూరినఫలముల వెసఁ జెందిరివారల్. ౨౨ 281

తే. ఆత్మకృతమగు కర్మఫలాళి వార

లనుభవించిరి గావున నట్టివారిఁ
గూర్చి చింతింపఁగాఁ బూనకుము వధింపఁ
జావఁ గర్మమె మూలమతా సాధ్వినిజము. ౨౧ 282

ఆ. చంపినాఁడ నంచుఁ జచ్చితినే నంచు, నాత్మదర్శనంబు నట్టి మఱచి
తనువునందు నాత్మయను నభిమానంబు,గలుగునంతదాఁక గలుగుఁ జక్క. ౨౪

తే. బాధ్యబాధకభావంబు పరఁగుచుండు, భేదబుద్ధియెంతటిదాఁక వృద్ధినొందు
నద్దిపోయినఁ జింత లే కలరు దేహి, యెఱుఁగుమా యిద్ది నిజ మనినెఱి సుబుద్ధి.

క. దౌరాత్మ్యము నాయది యగు, మీరలు సాధువులు బంధుమిత్రులయెడఁ జే
కూరిన వాత్సల్యంబునఁ, బేరుం గాంచితిరి గాన పే మఱునఁ దగున్. ౨౪

చ. అని బతిమాలుచున్ సహజ నామెపతిన్ వసుదేవుఁ జేరి యొ
య్యన ముఖ మశ్రుబిందువుల నత్తఱి నిండఁగఁ దత్పదాంతికం
బునశిరమొప్ప మ్రొక్కి క్షమఁ బూనుఁడు నన్నిఁక నాదరింపుఁడీ
[1]తనయులతప్పులన్ మఱచితండ్రులపోలిక నింకమీఁదటన్. ౨౬ 289

క. అని ప్రార్థించుచుఁ గన్యక, దనకుం జెప్పనది సుంత తప్ప దటంచున్
దనమదిని నమ్మి మాటల, వినయమునన్ సౌహృదంబు వెలయించు చొగిన్. ౨౫

క. వారలయం దేదోషము, చేరదటం చాత్మనెన్ని చెచ్చెఱఁ గాంం
గారోచితశృంఖలముల, భూరమణుఁడు తొలఁగఁజేసెఁ బొత్తు గనుటకై. ౨౮

చ. తనప్రియసోదరుండు మదిఁ దాలిమినొంది స్వకీయకృత్య మొ
ప్పనిదనియే యెఱింగి తనుఁ బల్మఱు వేఁడుట శాంతరోష య
య్యెను వసుదేవుపత్ని; హిత మెన్నుచు శూరసుతుండు శాంతిఁ గై
కొని క్రమమాని నవ్వుచును గొంకక పల్కె నయజ్ఞుఁ డొటచేన్. ౨౯ 289

సీ. ఓమహాభాగ నీ వూహించినదియెల్ల సత్యంబయగును, నజ్ఞాన మట్టె
దేహుల కుదయించి దీపించు దాన నాత్మపరభేదమ్ములు మానక తగు
నంతియెకాని సత్యం బిందు నెయ్యది యనితలపోయ నెయ్యదియుఁ దోఁప;
దాయహంబుద్ధిచే నను గుసఖుం డీతఁ డితఁడు శత్రు వటంచు నెనఁగుభేద

ఆ. ముదయమందు దాన నురుశోకహర్షలో
భమదమోహములును భయముద్వేష
ము పొదలంగ భూతములు భూతములచేతఁ
జావఁజేసి తానె సాక్షి యగుచు. ౨౯ 290

క. ఒండొరులకుఁ బ్రేరకుఁడై,యుండెడు పరమేశు నెఱుఁగనోపరు కర్మం
బుండఁగ నేనే చంపితిఁ,జుండీ యని పల్కునొకఁడు శూరుఁడుపోలెన్. ౨౭ 291

---

1 ఇది మూలమున లేనిదని యెఱుంగవలయు.

క. ననుఁ జంపె నల్లమనుజుం,డని యొక్కఁడు పల్కుఁగాని ఽ యప్పరమేశుం
డు నిజోచితకర్మములకు, ననుగుణముగ ఫలము లిచ్చు ఽ నని యెఱుఁగఁడుగా.

క. ఈనియమంబుననే నా,సూనులఁ బొలియించితి వను ఽ చొప్పునఁ దప్పున్
మానక నీయందుంచం,గా నెంచు టనర్థమె యగుఁ ఽ గా యని పలికెన్. ౨౭

క. ఈవిధి వినిర్మలము లౌ, భావంబులు వెలయసాధు ఽ భాషణముల నా
దేవకియును వసుదేవుఁడు, పావనమతులౌటఁ బల్కఁ ఽ బార్థివుఁ డంతన్. ౨౭౪

తే. వారిచే సెలవంది తాఁ ఽ జేరెమంది
రమ్మెటో యాత్మపావశేషమ్ము గడపి
కంసుఁ డారేపకడ మంత్రి ఽ గణము పిలువఁ
బంచి యాయోగమాయ వచించినట్లు. ౨౮౪ 295

చ. తెలిపెను; దైత్యులై కుటిల ఽ ధీయుతులై తగు మంత్రు లవ్విధిం
బలికినరాజుఁ గన్గొని సుపర్వులపైఁ దగునీసు పెంపునం
గలిగిన యజ్ఞకర్మ జరపఁ ఽ గాఁ దగుకార్యము దీర్ఘదృష్టి ని
మ్ములఁ బరికించుయోగ్యతను ఽ బూననివారలు గాన రాజుతోన్. ౩౦ 296

క. సురలకు నపకృతిఁ జేయఁగ, దొరకెఁగదా కాల మనుచుఁ ఽ దోడనె ధాత్రీ
వర యోగమాయ పల్కిన, కరణిని దగునేఁ బురాలి ఽ గ్రామములందున్. ౩౦౪

క. పల్లియలయందు విడువక, గొల్లలమందలను జక్కఁ ఽ గ్రుమ్మరుచు మదిన్
వెల్లివిరియు నీర్ష్యల న,ల్లల్లన మ్రందించువార ఽ మర్భకవితతిన్. ౩౦౪ 298

క. పదిదినము లింక సాగక, కొదువఁగ నున్నట్టిచిట్టి ఽ కూనల మఱియుం
బదిదినములు చనినశిశుస,ముదయమునుం బట్టి యట్టె ఽ పొరిపుత్తు మిలన్. ౩౧

మ. మన మీలాటియవార్యకార్యముల భీ ఽ మప్రక్రియం జేయ నా
యనిమేషుల్ రణభీరువుల్ భవదుద ఽ గ్రాశ్చర్యకృచ్చాపసం
గ నితాంతోజ్జ్వల శింజినీరవము ని ఽ క్కంబొప్పఁగాఁ బర్వ నె
మ్మనముల్ భీతిల నాపఁగాఁ గలరె యో ఽ ద్ధానాథ యోజింపుమా. ౩౨ 300

ఉ. ఇంతకుమున్నె నీ వగుమ ఽ హేషువు లంగములందుఁ దూఱ నొ
క్కింతయు నిల్వలేక యిఁక ఽ నీయెడనుండినఁ జావుతప్ప దే
కాంతమునందు నుండఁదగు ఽ నంచుఁ దలంచి పలాయనంబె యి
ట్లెంతయు నర్థమంచు వడి ఽ నేగిరి కాదె యదెన్నిసారులో. ౩౨౪ 301

ఉ. కొందఱు కేలుమోడ్చి రొక ఽ కొందఱు దీనత నస్త్రశస్త్రముల్
క్రిందను బెట్టి కచ్ఛములు ఽ కేశకలాపము లట్టె వీడ నీ
ముందట నిల్వలే మభయ ఽ మమ్ముం గృపసేయు మటంచుఁ బల్కుచుం
జిందఱవందరై చనిరి ఽ చెప్పెడిదే మిఁక వారిశౌర్యముల్. ౩౮ 302.

సీ. అస్త్రశస్త్రంబుల నవలఁ బెట్టినవారి విరథుల భీతిసంవృతుల నన్య
విషయసంసక్తుల విచ్యుతచాపులై యుద్ధ మొనర్పంగనోప నట్టి
వారిని జేవలే కూరక నిలుచున్నవారిని భూనాథవర్తనంబు
ధర్మంబు నెఱిఁగిన దయగలవాఁడవు గావున నే యట్టి దేవతలను
తే. జంపవైతివి; మఱియును సాధ్వసంబు
కలుగనట్టిప్రదేశంబు కడల శౌర్య
మును గనంబడఁ జేయుచుఁ బోరు లేని
సమయమున బీరములు పల్కఁ జాలుచుంద్రు. 303

క. సురలట్టివారు మన కెక్కరణిం బ్రతిసేయఁగలరు? కమలాక్షాదుల్
నిరుపమవిక్రములుగదా, పరికింపరె వార లంచుఁ బలుకుదువేమో. 304

చ. జగతి నదెందుఁ గన్పడెడు జాడయె లేక యదెందొ యెవ్వరై
నఁ గనఁగరాని తావున ననారత ముండు హరిం దలంప నే
ల? గలఁడె చూడనైన నచలావిభుసత్తమ! నిన్ను విక్రమం
బుగలిగి దేవతావరులఁ బూనికఁ జెందెడు విక్రమాఢ్యునిన్. 302

క. [1]పురుషప్రవృత్తిశూన్యతఁ, బరఁగు నిలావృతము భూరివన మొందు హిమో
త్కరమునఁ దగు గిరికడ నట, నిరంతరం బుండుగాదె నీలగళుండున్. 306

చ. సురపతి యల్పవీర్యుఁ డగుఁ జుమ్ము విరించియు నెప్పుడుం దపో
నిరతిఁ జెలంగు [2]నిట్టిరగు నీలగళాదులు నేమి చేయ నే
ర్తురో యెఱుఁగంగఁ జాల మమరుల్ మన కెన్న సపత్నిపుత్త్రులై
పరులయి యున్నవారుగద పౌరుషహీనులు వారలం చాఁగిన్. 307

తే. మన ముపేక్షింపరాదు క్ష్మామండలేంద్ర!
వారి మొదలంటఁ బెకలించి వసుధఁ బేరు
లేకయుండఁగఁ జేయుట కే కడంగి
నిన్ననుసరించుమముఁ బంపు నేఁడు పూన్కి. 305

చ. పురుషులు స్వీయదేహములఁ బుట్టినరోగ ముపేక్ష చేయఁగాఁ
బెరుఁగుచు రూఢమూలమయి వేయివిధంబుల బాధచేయ న
త్తరుణమునం జికిత్సకు నితాంతము శక్యము గాకయుండు ట
బ్బురమొకొ యింద్రియంబులను బూనికఁ దొల్తనె లొంగఁజేయనా.

చ. తొలుత నుపేక్ష చేయ నవి తోఁచినయట్లు చరింపఁబూన న
వ్వలఁ బనిపూని లోఁబఱుపవచ్చునొకో యెటువంటివారికే

1 "రజోజుషే కింహారిణా శంభునా వా వసౌకసా" అనిమూ. "పురుషప్రవృత్తిరహితమిలావృతవనమోకోయస్య తేన శంభునా వా" అని శ్రీధరాచార్యులు. 2 ఇట్టిరు=ఇట్టిఁడు అనుదానికి బహువచనము.

ఖలుఁ డగువైరి యల్పుఁడని § కావరమూని యుపేక్షచేయ దో
ర్బలమునఁ బొల్చునత్తఱిని § వచ్చునొకో కదలింప భూవరా. ౩౮ 310
*చ. కనుకనె శత్రుశేషము జగంబున నిల్పఁగరాదుగా సనా
తనము శ్రుతీరితంబునగు § ధర్మ మదెందుఁ జెలంగు నందె ని
ల్చును మహనీయమూర్తియయి § శోభిలు విష్ణు వతండె మూలమై
తనరును దేవతావళికిఁ § దప్పదు సుమ్మిది; కంసభూవరా. ౩౮½ 311

సీ. శ్రుతులు గోవులును విప్రులు తపస్సును దక్షిణలతోడఁ దగుయజ్ఞ§ములునుధర్మ
ము వసించుతావులు; § భూపాల! బ్రహ్మవాదులు సత్తపోనిరతులును యజ్ఞ
కర్మపరాయణుల్ § గాఁదగు విప్రోత్తముల వధింతుము హవి§స్సులను బిదుకు
గోవులఁ బనిపూని § కొంకక మ్రందింతు; మవనీసురులు గోవు § లఖిలవేద
తే. ములు తపస్సత్యదమశమ§ములును శ్రద్ధ
దయ తితిక్షయు యజ్ఞముల్ § తనువు లగును
హరికి నాతండె దేవతా§ధ్యక్షుఁ డసుర
వైరియు నగును, హృద్గుహా§వాసుఁ డతఁడు. ౪౧½ 312

చ. హరునకుఁ బద్మజన్మునకు § నయ్యమరాళికి మూల మన్న నా
హరియె యగున్; దదంతకర § మైనయుపాయ మిదే యగున్ మహీ
శ్వర! ఋషులన్ వధింపఁ దగుఁ § జక్రధరుండు మహర్షి దేహుఁడై
పరఁగును గానఁ జచ్చు ముని§పంక్తి వధించినయంతమాత్రనే. ౪౨. 313

క. హరిమూలముగా వర్తిలు, సురలెల్లరుఁ దెగుదు రిదియ§చొప్పని సచివో
త్కరము వచియింప దుర్మతి, సురరిపువగు నుగ్రసేన§సూనుం డంతన్. ౪౨½ 314

తే. కాలపాశసంబద్ధుండు § గాన దుష్ట,
మంత్రు లాడినమాటల § మదిఁ దలంచి
మఱియు యోజించి యంతట § క్ష్మాసురైక
హింసయే తన కెన్నఁగ § హిత మటంచు. ౪౩ 315

సీ. తలపోసి క్రూరుఁడై § దారుణోపద్రవమును జేయ సమ్మోద§మును గనంగఁ
దగువారి సంగరో§త్సవమున కుద్యుక్తు లగువారిఁ గామరూ§పాభిరాము
లగు వారి దైత్యుల § నఖిలసాధువులను, సమయింపుఁడీ దిశా§సమితిఁ దిరిగి
యనుచు నాజ్ఞాపించి § యభ్యంతరగృహంబుఁ జేరెను; దర్వాత § వార లెల్ల
ఆ. రాజసప్రకృతులు § నోజఁ దమోమలి, నమతులునయి చెలఁగు§నమరరిపులు
గాన సన్నికృష్ట§కాలమృత్యువు లౌట, సాధువులకుఁ బీడ § సల్పఁబూని. ౪౪. 316
క. చరియించి రెల్లదెసలను, ధరణిన్ సాధువు లనంగఁ § దగువారికి నె

1 "రిపుర్మహాన్ బద్ధబలో న చాల్యతే" అనుమూలమునఁగలనీతియే యిట వ్రాయఁబడినది.

క్కరణిని నపకృతిఁ గూర్చెడు, పురుషుల కాయువును సిరియుఁ ఽ బోవునచిరమే.

తే. యశముఁ బుణ్యంబుఁ బుణ్యలోకాళియు మఱి
ధర్మము మనోరథంబులు ఽ దలఁగు శ్రేయ
ములును వారినిబొందక ఽ తొలఁగిపోవుఁ
గాన సాధువులకుఁ జేయఁగా దపకృతి. ౪౬ 318



ఐ ద వ య ధ్యా య ము.

నందుఁడు శ్రీకృష్ణునకు జాతకర్మాదులు చేయుంట.

క. అనిపలికి శుకుఁడు మఱియున్, వినిపించెను గృష్ణజన్మ ఽ వృత్తాంతము రా
జున కిట్లని; నందుం డట, ఘనతమచిత్తుఁడయి వెలఁగుఁ ఽ గావున నొకటన్. ౪

మ. తనకుం బుత్త్రుఁడు కల్గె నన్న శుభవార్తల్ వీనులన్ సోఁకినం
తనె యింతంతనరాని సంతసమునన్ దా నప్డు సంస్నాతుఁడై
ఘనభూషాంబరధారియై శుచియునై ఽ కమ్రోత్సవం బొప్పఁ జే
యునితాంతత్వరఁ బూని వేదవిదులై ఽ యొప్పారుసద్విప్రులన్. ౧ 320

క. జ్యోతిశ్శాస్త్ర మెఱింగిన, యాతతచిత్తులను బిల్వ ఽ నంపి విధిహితం
బై తగినస్వస్తివాచని, కాతతకృత్యంబు సాగుసట్లుగఁ జేసెన్. ౧౪ 321

క. తనయునకు జాతకర్మం, బను కార్య మొనర్చి పితృసురార్చన లొప్పం
గను జేసి లక్షయుగ్మం,బును ధేనువులన్ గలాపములఁ దగువానిన్. ౨౪ 322

క. ధరణీసురులకు నొసఁగెన్, బరమానందమున మఱియు ఽ స్వర్ణమణి వరాం
బరసంవృతములఁ దిలభూ, ధరముల నేడింటి నప్డు ఽ దానము చేసెన్. ౩ 323

సీ. [1]శాస్త్రోక్తకాలంబు ఽ జరగుట భూమ్యంబు, ముఖవస్తువులు శుద్ధములగుస్నా న
మున శౌచమున దేహమును; జాతకర్మాదిసంస్కారములచేత ఽ సంతతియును
దపముచే నింద్రియతతియును, గ్రతువుల ధరణీసురాదులు ఽ దానములను
ద్రవ్యముల్ సంతుష్టి ఽ తనరుట మానస మాత్మవిద్యను నాత్మ ఽ యమలతఁగను

తే. గనుక నానందగోపకుఁడును విధిగను, స్నానశౌచాదులను జేసి తాను శుద్ధుఁ
డయ్యె; విప్రులు సమ్మతి ఽ నాశిషముల, స్వస్తివాచనికంబులసలిపి రపుడు. ౪ 324

క. [2]పౌరాణికులౌ సూతులు, స్ఫారకులాచారములఁ బ్రశంసించు మహా
ధీరులు మాగధులు సభా, స్తారుల కింపొదవ బల్కఁ దగు వందిజనుల్. ౪౪

* "కాలేనస్నానశౌచాభ్యాం సంస్కారైస్తపసేజ్యయా, శుద్ధ్యంతిదానైస్సంతుష్ట్యా ద్రవ్యాణ్యాత్మాఽత్మ విద్యయా" అనిమూ. దీనివ్యాఖ్యానమునఁ గలయర్థమేయిందుఁ గలదు. 2 "సూతమాగధ వందినః" అని మూలము. "సూతాఃపౌరాణికాః ప్రోక్తామాగధావంశశంసకాః వందినస్త్వమలప్రజ్ఞాః ప్రస్తావసదృశోక్తయః" అనువ్యాఖ్యాశ్లోకార్థమేయిటఁగలదు.

తే. గాయనులు మంగళోక్తులు ౹ గలుగఁ బాడి, రప్పు భేరులుదుందుభు ౹ లట్టె మ్రోఁగె
మాటిమాటికి నెల్లరు ౹ మానసముల, నింపుగలిగియె యుండి రాకృష్ణజనని. ౫

క. నందవ్రజమున గోపకు, లందముగా ద్వారముల గృహాంగణములనుఁ
మందిరసౌధాంతరముల, నుం దగ నూడ్చించి యంత ౹ నూత్నవిధములన్. ౫౪

క. పరిమళజలములఁ జల్లిం,చిరి నూత్నవిభూతులఁ గయిచేసి పతాకో
త్కరములఁ జిత్రధ్వజముల, నరుదుగ నెత్తించి రప్పు ౹ డతిమోదమునన్. ౬

సీ. సుమదామముల విచిత్రములగునంబరములఁ గట్టి రయ్యాయిస్థలములందుఁ
బల్లవతోరణపటలి నలంకరించిరి ధేనువుల వత్సతరముల వృష
భములనుం దైలలేపనహరిద్రాలేపనముల విచిత్రధాతుమహితవివి
ధవిభూషణముల నెంతయు నొప్పఁగాఁజేసి బర్హిబర్హంబుల ౹ భవ్యవస్త్ర

ఆ. హేమమాలికలను ౹ నెంతయు శృంగార, మందఁజేసి రవ్వి ౹ యఖిలజనుల
దృష్టులకు ముదంబు ౹ దీపింపఁగాఁ జేసె, నంత గోపవర్యు ౹ లాదరమున. ౭ 329

చ. త్వరపడి మూల్య మింత యని ౹ బాగుగఁ జెప్పఁదరంబుగాని యం
బరములఁ గట్టి చిత్రతరవర్ణములం దగుకంచుకంబులన్
శిరములఁ జుట్టువస్త్రముల ౹ శ్రేష్ఠతమాభరణంబులన్ మనో
హరముగఁ బెజరిల్లుచును ౹ హస్తములందును గానుకల్ దొప్పఁగన్. ౭౪ 330

క. చనుదెంచిరి నందాధిపు, తనయునిజన్మోత్సవము ముదంబునఁ జూడం
గను గోర్కి సందడింపఁగ, ననంతరము గోపికలు మహానందమునన్. ౮ 331

మ. తమరాజ్ఞీమణికిన్ యశోదకుఁ గులోద్ధారుండు పుత్త్రుండు త
త్సమయం బందు జనించె నన్న శుభవృత్తాంతంబు నాలించి చి
త్తముల న్నిల్వక పొంగివచ్చు నతిమోదంబే తమున్ హెచ్చరిం
ప మహార్హాంబరధారణంబునఁ గలాపస్ఫూర్తిఁ జెల్వారుచున్. ౮౪ 332

మ. తనువల్లుల్ తగ నంజనంబునను నేత్రంబుల్ మనోజ్ఞంబుగాఁ
గనుపట్టంగఁ బరిమళోన్మిళితమౌ ౹ గంధంపుఁబూఁతల్ గనుం
గొన నెంతో రుచిరంబుగాఁ దగఁగ భృంగుల్ గ్రమ్ముపూదండ లొ
య్యనఁ గంఠంబులవ్రేల మెచ్చఁదగు నొయ్యారంబునం జూడ నై. ౯ 333

తే. అపుడె పూచినపూవుల ౹ యందు మెలఁగు, కమ్రకింజల్కములఁ దిలకముగ దిద్ది
వదనపంకజ మెంతయు ౹ వాసిమీఱఁ, గానఁబడ సత్వరంబుగ ౹ గమన మలర.

క. అనుపమపృథులశ్రోణులు, తనరం గుచమండలమ్ము ౹ త్వరగఁ జనుటచే
తను సుంత కదలుచుండం, గనుపాయనచారుపాణికమలము లొప్పన్. ౧౦ 335

క. చనుదెంచిరి నందునిగృహ,మునకున్; మఱి గోపవరులపూఁబోఁడులు చ
క్కని రత్నకుండలము లిం,పునుగూర్చుచుఁ గర్ణయుగళిఁబొలుపారంగన్. ౧౦౪

చ. గళముల రత్నరమ్యపదకంబులు శోభిల మంజులాంబరం
బుల ధరియించి హస్తముల భూరిమణీవలయంబు లెంతొ రా
జిలఁ జనుగట్టులందు సురుచిం దగుసన్మణిహారముల్ తగం
బలుపడి నేగుచుంట సిగ భాసిలు హారము లట్టె రాలఁగన్. ౧౧ 337

తే. త్రోవ నంతటఁ బరిమళపావనసుమ, వర్షముం గురియించుచు వచ్చి నందు
మందిరంబును జేరి యమ్మగువలెల్ల, బాలకునిఁ జూచి సంతోషభార మొలయ.

క. చిరకాల మ్మో బాలక!, పరిరక్షింపు మము నెల్ల బాగుగ నని యా
దరమున నాశిషముల నిడి, పరికించిరి బాలు నేత్రపర్వముగాఁగన్. ౧౨ 339

తే. పసపుగలిగిన నూనె [1]నపఘనమందు, నలఁది జలకంబు లాడించి యభవు నతని
నాయురభివృద్ధి నొనఁగూర్చు నట్టిపాట, లెలమిఁ బాడుచుముద్దాడి రింతులెల్ల.

చ. జనియన లేక విశ్వముల సంతతికిం బ్రభువై యనంతుఁడై
వనరుహనేత్రుఁడై కలశవారిధిలోఁ దగుకృష్ణుఁ డప్డు నం
దుని దగుమందయందును దనూజుఁ డనం దగి యుండువేళ విం
తనదగనట్టి మోదము మనంబులఁ బొంగ విచిత్రవాద్యముల్. ౧౩ 341

తే. మ్రోఁగఁజేసిరి; గోపకుల్ మోద మొలయఁ
బెరుఁగుపాలును జలములు విచ్చలవిడి
గాఁ బరస్పరముం బెల్లు గా సుసృష్టి
వలెఁ దగన్ వెన్నపూఁతలఁ జెలఁగి రంత. ౧౪ 342

చ. అనుపమమానసంబు దగునట్టి మహీపతి నందుఁ డట్లు నం
దనుఁ డుదయింప సంతసము నన్వడి వారల కెల్ల గోధనం
బును వసనంబు లాభరణముల్ తనివార నొసంగె సూతవం
దినిచయ మాగధాళికిని దృప్తిగ నిచ్చెను ద్రవ్యరాసులన్. ౧౫ 343

[2]తే. విద్యలే జీవనంబుగా వెలయునట్టి, యితరజనులకు నెవ్వ రేమేని గోరు
వారొ యవ్వారి కుచితమౌభంగి లోభ,మింతయే లేకొసంగెను దృప్తిగలుగ.

క. అతిశయభాగ్యస్ఫూర్తిన్, క్షితి మించెడు రోహిణియును శ్రీవిష్ణుని స
మ్మతిఁ బూజింపను దనప్రియ,సుతు నభ్యుదయమ్ముఁ గోరుచున్ వ్రజ మందున్.

క. నందుం డభినందింపఁగ, సుందరతరవస్త్రహారశోభిత యగుచున్
నందనుఁ గాంచుచు నత్యా,నందము గనుచుండె నంత నందునిమందన్. ౧౬

చ. హరి వసియించియుండుట ప్రియంబుగ నెల్లరు సంస్తుతింప ని
ర్జరు లొగి విస్మయంబున నొసంగెడుదృష్టులఁ గాంచుచుండ శ్రీ

1 అపఘనము=దేహము. 2 'యథోచితమపూజయత్' అని మూ. 'యథోచితంవిద్యాగౌరవ మనతిక్రమ్యేత్యర్థః' అని వంశీధరుఁడు.

తరుణియు స్వేచ్ఛమీఱఁగ సాతంబు విహారముసల్పుచిహ్నముల్
పరమసమృద్ధియున్ వెలసెఁ ʃ బర్వపు దుష్టవికారచిహ్నముల్. ౧౮ 347

నందుఁడు మథురానగరంబునకరిగి వసుదేవుం గాంచుట.

ఉ. గోపవరుండు నందుఁడును ʃ గోకులరక్షకు నర్హులైన యా
గోపకులం దగం బనిచి ʃ గోవులఁ గావఁగ నిర్ణయించి యా
భూపతి కియ్యఁగాఁదగిన ʃ భూరికరంబును వార్షికోచితం
బోపికమీఱఁ గైకొని నిజోచితకింకరసంఘయుక్తుఁడై. ౧౯ 348
క. చనియెను మథురానగరం,బున కచ్చటఁ గంసభూపముఖ్యుం గని తె
చ్చినయట్టి కరం బిచ్చెను, జనపతి సెలవంది యొక్కచక్కిన్ విడిసెన్. ౧౯౪ 349
చ. తనచెలికాఁడు నందుఁడు సుతప్రమదంబున నొప్పువాఁడు వ
చ్చెను గర మిచ్చి యొక్కయెడ ʃ స్వీయజనంబులఁగూడి యున్నవాఁ
డని విని తన్నివాసమున ʃ కప్పుడె పోయెను; శూరునాత్మజుం
గనుఁగొని నందుఁ డంగమునఁ ʃ గ్రమ్మఱఁ బ్రాణము లొందుకైవడిన్. ౨౦౪ 350
క. పరమప్రియుఁ డగునాతనిఁ, బరికించి జవంబ లేచి ʃ బాహుద్వయ మా
దరణమునఁ జాఁపి కౌఁగిట, నురుతరమోదమునఁ జేర్చి ʃ యొగిఁ బూజించెన్.
క. మనసునకు హాయిఁగూర్పం,గను దగుపీఠమును జూపఁ ʃ గాఁ గూర్చుండెన్
దనుని ట్లాదృతిఁ బూజిం,చిన నందుని గాంచి పలికెఁ ʃ జెలిమివెలయఁగన్. ౨౧౪
క. ఆరోగ్యముగా నుందువె, శ్రీరమ్యా! యనుచుఁ బ్రీతి ʃ క్షేమప్రశ్నం
బీరీతిఁ జేసి సహజకు,మార ప్రీతిమెయిఁ బల్కె ʃ మానస మలరన్. ౨౨ 353
శా. ఓయన్నా! చిరకాల మప్రజుఁడవై ʃ యూహింప సంతాన మిం
కేయేదైవకృపం గనం దగునో యేయేసద్వ్రతశ్రేణులం
జేయంగాఁ దగునో యటంచు మదిలోఁ ʃ జింతించి యయ్యాశనే
మాయం జేసెదువృద్ధతం దగుచు నామ్మాటన్ మదిం దేకయే. ౨౩౪ 354
క. చిరకాలము గడపితి వే, పరమాత్మునికృపనో నీకుఁ ʃ బట్టి గలిగె ని
త్తరుణమున నిన్నుఁబోలిన, పురుషుఁడు వేఱొకఁడు గలఁడె ʃ భూమి వెదకినన్.
సీ. భవచక్రమునయందు ʃ వర్తించుపురుషుఁడు మరలఁ దాఁ బుట్టినమాడ్కి దైవ
వశముననే దుర్లభం బగుప్రియదర్శనముఁ బొందజాలితివి మదిఁ దలఁప
దిదియె మహాదృష్టమెట్టు లన్నను వినఁదగుఁ బ్రవాహము వేగముగఁ జనంగ
నం దెట్టులోపడి ʃ యరుగుతృణాదులు భూరితరంగసముదయమునను
తే. బహువిధంబుల నిట్టట్టు ʃ పఱచుచుండి, పీడిపోవును మరలను ʃ గూడు టరిది
యట్లె సంసారమునయందు ʃ నాత్మచిత్ర, కర్మవాసనలను గతిఁ ʃ గాంచు సఖులు.
క. మరలంగూడుచు నొకచోఁ, జిరకాలమొ సుంతసేపొ ʃ చెలిమివెలయఁగాఁ

బరివర్తించుట యచ్చెరు,వరయంగా నందగోపయని మఱియుననుఁ. ౨౫ 357

మ. వినవయ్యా! సుహృదుల్ నినుం గలిసి యేపేళఁ మెలంగఁ మహా
వనమం దెందు వసించితో యదిమహావార్యస్థితంబై ప్రతా
ననులం బెంపువహించి భూరితృణమై నానాపశువ్రాతయో
గ్యనివాసంబయి రోగశూన్యమగుచుం గన్పట్టుఁగాదే సఖా. ౨౬ 358

శా. అన్నా! నాకొమరుం డొకండు నిను నయ్యంగాఁగ మన్నించి నీ
వు న్నీభార్యయశోదయుఁ ముదమునం బోల్చారి లాలించుచుం
డ న్నీమందను దల్లితో సుఖగ నున్నాఁడేకదా? లోకమం
దెన్నఁ నెయ్యురతోడ బంధువులతో నేపూరుషుం డిచ్చమై. ౨౭ 359

తే. *ధర్మమర్థకామంబులు తగుఁ ద్రివర్గ, సంజ్ఞికములయి వానిని సాధురీతి
ననుభవింపంగవలయుఁ దా నట్లుచేయు, వానికే యవి విహితంబులగొనుజుమ్ము.

క. పురుషుం డెవఁ డట్లొనరుప, కరహిం దా ననుభవింపఁ గా సుహృదాదుల్
పరితప్తులగుదు రతనికిఁ, బురుషార్థత్రయము వ్యర్థముగ నగు ననఘా. ౨౮ 361

చ. అనవిని నందుఁ డిట్టులను నక్కట! దేవకియందు నీవు కాం
చినబహుసూనులం గదిసి చెచ్చెఱఁ జంపెను గూళ కంసుఁ డం
త నొకకుమారి గల్గ నది తత్క్షణమే దివి కేగె దీనికై
మన మొనరించుకార్య మణుమాత్రము గల్గదు సుమ్ము మిత్రమా. ౨౯ 362

[1]సీ. మనుజుఁ డదృష్టమందును మెలంగుచు సద్ది కలిగించునట్టి సుఖము దుఃఖ
మును నియతంబులై యొనయవు గావున నయ్యదృష్టవశంగతాత్ముఁ డగుచు
నుండును; వానికి నొగి సుఖదుఃఖముల్ కలుగుటయు నదృష్టఫలననె సుము
దీని నెవ్వఁ డెఱుంగు మానవుఁ డాతండు మోహ మొందక సుఖము మఱియును

తే. దుఃఖమును దనమనమునఁ దుల్యములుగఁ
గనుచు నుండును నీవు నాతనయుల మదిఁ
దలఁచుకొని చింత నొందకు దైవవశము
సకలము నగును భవము నిస్సారముగద. ౩౦ 363

క. అన వసుదేవుఁడు నందుని, మనమునఁ గలయర్థ మెఱిఁగి మాన్యతమా! రా
జున కీఁదగు వార్షికకర,ము నిచ్చితివి కంటి విట మమ్ముఁ మేము నినుఁ. ౩౦౪

క. కనుఁగొంటి మిచ్చటఁ బహు,దినములు నీ వుండరాదు తెప్పునఁ బోనాఁ
గనఁబడు నుత్పాతము లను,దినమును గోకులమునం దదియు నగుఁ గావఁ.

* 'పుంస స్త్రీవర్గో విహితస్సుహృదో హ్యనుభావితః, న తేషు క్లిశ్యమానేషు త్రివర్గోఽర్థాయ కల్పతే.' అనిమూలము. దీనియర్థమే రెండుపద్యములయందుఁ గలదు. 1 'నూనం హ్యదృష్టనిష్ఠోయ మదృష్టపరమో జనః, అదృష్టమాత్మన స్తత్త్వం యో వేద న స ముహ్యతి' అను మూలార్థమే యిటఁ దెలుపఁబడినది.

చ. అని పురికొల్ప నందముఖు । లావసుదేవుని వీడుకొంచు నొ
య్యన వృషభాళిఁ బూన్చిన మహాశకటంబుల నెక్కి గోకులం
బునకును బోయి రందుఁ గనఁ బోలును దుశ్శకునాళి యన్న యా
తనిపలుకుల్ తలంచుచు నితాంతము హెచ్చరికన్ జవంబునన్. ౩౨ 366

---

## ఆఱవ అధ్యాయము.

### శ్రీకృష్ణుఁడు పూతనకు ముక్తి ననుగ్రహించుట.

క. అని మఱియున్ జనపతికిన్, వినిపించెన్ శుకమహర్షి । విష్ణుచరితం
బును; ద్రోవఁ జనెడుతఱి నం,దున కుత్పాతములు కొన్ని । తోఁచెన్ దానన్. ౪

క. నందుం డపు డిఁక ముందా, మంద మహోత్పాతము లెటు । మాన కొదవునో
ముం దేమిసాగునో యను,సందియమున కెదను జోటు । చాలఁ గలుగఁగన్. ౧

తే. శౌరిపల్కినపల్కులు । సత్యము లె య
గు నని యూహించుచున్ హరిఁ గోరి శరణ
మగుమ యని మందకుం బోయె । నంత నచటఁ
గంసుఁ డంపిన యొక్కరక్కసియు వడిగ. ౧౪ 369

చ. జనపతియాజ్ఞఁ జొప్పున నిశంకటవృత్తిని బాలురన్ వధిం
పను బనిపూని చూచుటకె । బాగుగఁ దోఁపని ఘోరరూపముం
గనునది గానవేగమున । గ్రామములందుఁ బురంబులందు గో
పనికర ముండుమందలను । బాలకు లుండిన వారిఁ జంపుచున్. ౨ 370

చ. *తిరుగుచునుండె; సాత్వతపతిప్రియకార్యములన్ గుణాళి నా
శరతతినాశనంబులను । సంతతమున్ వినుటల్ నుతించుటల్
పురుషులు స్వీయకర్మములఁ । బూనియుఁ జేయక యుండువారొ యా
ధరణిని యిట్టిరక్కసులు । తారు చెలంగుదు రెంతొ పూనికన్. ౩ 371

ఆ. అవ్వికల్గుచోట । యాతుధానీకదం,బములు నిల్వనోప । వమలమూర్తి
వాసుదేవుఁ డెందు వసియించు నందుండ, గలదె దీనశంక । గలుగు నెట్లు? ౩ 372

మ. ఒకనాఁ డంబరమార్గగామినిగ నోహో యంచు మెచ్చన్ జనుల్
సకలేశుండు వసించు మందదఱి కంసచద్వాంఛమై వచ్చి మా
య కడుం బూని స్వకీయరూపము నదెశ్త్రైనం గనన్ రానియ
ట్లోకటన్ మార్చి కనంగ మోద మిడు నట్లొప్పారురూపంబునన్. ౩౪ 373

---

* 'నయత్ర శ్రవణాదీని రక్షోఘ్నాని స్వకర్మసు, కుర్వంతి సాత్వతాం భర్తుర్యాతుధాన్యశ్చ తత్ర హి' అని మూలము.

ఉ. కామమురీతినే తిరుగఁగా దగుశక్తిఁ జెలంగుచుంట నా
భామిని పూతనాహ్వయ యభంగురవాంఛను జొచ్చె మంద; నా
వామయుఁ గేశపాశమున బాగుగ మల్లెవిరుల్ చెలంగఁగా
శ్యామమనోహరాంబరముఁ గట్టి నితంబపుసొంపు మీఱఁగన్. ౮ 374

సీ. వక్షోజమండలభారంబునన్ మధ్యమం బగుభాగంబు డంబుమాని
సన్నగిలంగఁ జంచలకర్ణభూషణప్రభలఁ గుంతలములు భాసిలంగ
దాన మోమున విచిత్రస్ఫారశోభయుఁ గనఁబడుచుండ సొగసున కునికి
పట్టగు చిఱునవ్వు పరుగులెత్తుచునుండ వెలయునేత్రసరోజములతుదలను
ఆ. బొలుచు వీక్షణములు లలితములుగఁ బర్వ
వ్రజమునందు మెలఁగు వామనయన
లమనములను బేశలముగ హరించె నా
పూవుఁబోడిఁ గాంచి పొలఁతు లెల్ల. ౯ 375

క. సరసిజ మొయ్యారంబుగఁ, గరమున ధరియించి యిట్టి కమ్రాకృతితో
నరుదెంచెఁ బతిని జూడం,గ రమాదేవి యనునూహఁ గని రత్తఱినిన్. ౬ 376

క. పూతన బాలగ్రహ మా,భూతలపతి కంసునాజ్ఞఁ బూని యచట సం
ప్రీతిని శిశువుల వెదకుచు, నేతీరుననో కనంగ నేతెంచె హరిన్. ౬ 377

ఉ. నందునిగేహమందుఁ గుజనవ్రజముం బొలియించువాని ని
చ్చం దనభూరితేజమును శక్తిమెయిం గనరాకయుండఁ జే
యం దగునంచు నెంచి యటులద్భుతరీతి నడంచి శయ్యపై
నం దనువొప్పఁ జేర్చి జతనంబున నొప్పెడులోకనాథునిన్. ౬ 378

తే. భస్మసంఛాదితం బగువహ్నిపోల్కి
నమరుచుండెడు హరిమూర్తి నచటఁ జూచెఁ
బూతనయు నామె బాలకవ్యూహమునకు
మారికాగ్రహ మనియెంచి మాధవుండు. ౭ 379

ఉ. తానె చరాచరాత్మత నితాంతము వెల్గుచునుండు నెప్పుడుం
గానఁ దదీయవర్తనముఁ గాంచె మదిన్; సకలప్రభుం డనం
గా నెఱిఁ గీర్తిఁగాంచుచు జగంబులు గల్గఁగఁ గావఁ ద్రుంపఁగా
దానె సమర్థుఁడయ్యు నది దాపునకున్ వడి వచ్చు నంతలోన్. ౭ 380

*ఉ. [బాలునిరీతిఁ గన్పడుచుఁ బల్కక యూరకయుండె; స్వీయమా
యాలసమానశక్తి మనుజాకృతిఁ బూనియు నొక్కటన్ జగ

* అధికపాఠశ్లోకమునకు "మహేశ్వరత్వేపి చ" అనుదాని కిది తెలుఁగు. తెలుఁగుప్రతిలో నీశ్లోక మధికపాఠముగా గణింపఁబడలేదు. కాని శ్రీధరాచార్యవ్యాఖ్యమాత్ర మిందును గానరాదు.

జ్వాలవిచేష్టితంబుల నిజప్రకృతిం గనువాఁడు నైనయా
బాలకుఁ డానిశాచరిని బట్టి వధింపఁగ నెంచె నాత్మలోన్. ౮ 381

ఉ. పూతన యాత్మజీవితముఁ బుచ్చుకొనం దలపోయుచున్న యా
శ్రీతరుణీపతిం గనుచుఁ జేరఁగఁ బోయెను గాని సుంతయే
నీతఁ డెసంగునిట్టిః డనియెంచగ నేరక] నిద్రపోవుభీ
మాతతభోగిరజ్జు వని యంకమునం దిడుకొన్నరీతిఁగన్. ౮ 382

తే. ఆయనంతుని నిడుకొనె నంకసీమఁ
దీక్ష్ణచిత్తయు మిగులఁ గృత్రిమవిచేష్టి
తయు నయినయానిశాచరి తద్ద మెత్త
[1]నయిన చర్మంపుఁగటారులోని యసివిధమున. ౮౪ 383

[2]సీ. బయటమార్దవము లోపలఁ గ్రూరభావంబు గలిగియుజనయిత్రిపలె మెలఁగుచు
నుత్తమకాంత నా నొప్పుదానిఁ గేహమధ్యస్థలంబున మమతఁ గాంచి
దానితేజమునకుఁ దనువుల మఱచుట నాయశోదయు మఱియుం దెమెలఁగు
నారోహిణియు నించు కంతయుఁ బల్కక కనుచుండి; రంత రక్కసియు నందుఁ

ఆ. గూరుచుండి బాలకుని నెత్తుకొని ప్రాణహారముగఁదగువిషము నంతరమున
నమరుపఁబడి వెలయు నట్టిస్తనంబును, గ్రూరచిత్తగానఁ గుడుపఁ దొడఁగె.౮౪

చ. హరియును మేలుకాంచినటు లప్పుడుచూడఁగ నొప్పి గట్టిగాఁ
గరములఁ దత్కుచంబులను గాఁజెయఁబెట్టెడునట్లు తాఁకుచున్
గురుతరరోషయుక్తుఁడయి క్రూరనిశాచరిప్రాణపంక్తితో
నురవడిఁ బాలు ద్రాగె [3]నిదె యొప్పును దీనికి శాంతి యన్నటుల్. ౧౦ 385

సీ. కుహనాకుమారుఁ డాగోపాలకృష్ణుండు పాలు ద్రాగుచు నట్టి ప్రాణములకు
నాధారములుగాఁగ నమరియుండినమర్మముల నెల్లఁ బీడింపఁ గలఁగి యదియు
నిఁకఁ జాలుఁజాలు నీదేటిపాల్ త్రాగుట యనుచు భాషించుచు నబ్బ! చన్ను
విడువుమా! యని మొత్తుకొవెట్టుచు నేత్రముల్ తిరుగుడుపడుచుండఁజరణములభు

తే. జములఁ బలుమఱు విదలించుకొచు మనమందుఁ
గలుగుపరితాపమునఁ జెమ్మటలు శరీర
మందు నిండఁగఁ గూయుచు నపని ప్రాలె
దానిపెడబొబ్బలం గల్గు ధ్వనికి నపుడు. ౧౧ 386

1 'కోశపరిచ్ఛదాసివత్' అని మూలము. 2 'అంతస్తైక్ష్ణ్యబహిర్మార్దవేచ దృష్టాంతః కోశపరిచ్ఛదాసివత్ మృదుచిత్రచర్మమయః కోశః పరిచ్ఛద ఆవరణం యస్యాసేః. అని వ్యాఖ్య. ఈ యర్థమే యిందుఁ జేర్పఁబడినది. 3 'రోషసమన్వితో౽పిబత్' అని మూలము. దీని సారమే యిందుఁగలదు.

చ. ధరణియు భూరిభూధరవితానముతోడ వడంకె మిన్ను [1]ని
బ్బరముగఁ గంపమొందె గ్రహపంక్తియు వే కదలెన్ రసాతలం
బురవడి మాఱుమ్రోసె దెస లాయ్యన మాఱుధ్వనించె నప్డు [2]ని
ష్ఠురపవిపాతశంకఁ గొని క్షోణిపయిం బడి రొక్కటన్ జనుల్. ౧౨ 387

ఉ. క్రూరనిశాటి యివ్విధిని గోపకుమారమనోజ్ఞదోర్యుగ
స్ఫారనిపీడితస్ఫుటవిశాలస్తనమండలయౌచు స్వీయమౌ
ఘోరశరీర మొప్ప వగఁగుందుచు నోరటువిప్పి పాదముల్
భూరిభుజంబు లెంతొ భయమునుం గలిగింపఁగఁ జాఁచి నీల్గినన్. ౧౨౪ 388

తే. కేశపాశము జాఱంగ క్షితిని వజ్ర
నిహతుఁడౌ వృత్రదానవ నేత యట్లు
గోష్ఠమునఁ గూలె; దానిదౌ ఘోరతనువు
ధరణిఁబడు నప్పు డద్దాని తాఁకునకును. ౧౩ 389

ఆ. ఆఱుకోసులలోపల నమరియున్న
భూరుహములెల్లఁ బొడియయి పుడమి వ్రాలె
రాజచంద్రమ! యది విచిత్రముగఁ దోఁచెఁ
జెప్పఁ దరమౌనె యద్దానిచేష్ట లపుడు. ౧౮ 390

క. హలదండ మంతపొడవుగ, గలగుండువడంగఁ జేయఁగల దంష్ట్రలొగిన్
గలిగిననోరును గిరిగుహవలెఁ గన్పడు నాసికయును వనితకుఁ దోఁచెన్. ౧౮౪

సీ. గండోపలంబులకరణి స్తనంబులు విరిసిన యొట్టనివెండ్రుకలును
నంధకారావృత మగునూతులంబోలు లోఁతులై యున్నట్టి లోచనములు
నిసుకతిప్పలవలె నెసఁగు నితంబముల్ భీతిని గల్గించె నాతతముగ
బద్ధసేతుసమాన బాహూరుపాదముల్ శూన్యజలంబయి చూడఁబడెడు

తే. మడువువడువున నుదరంబుఁ గడుభయంబు
గదురఁ జేయుచు నుండె; రక్కసికళేబ
రమును నద్దానిఁ గని గోపరమణు లెల్ల
గోపకులు భీతిచెందిరి గుండె లవియ. ౧౬౪ 392

క. అంతకుమున్నే పూతన, యెంతయుఁ గావించునాయహీనధ్వని క
త్యంతము వీనులు వ్రీలఁగఁ, జింతాపరతం దపింప శీర్షహృదయముల్. ౧౭

క. ఏమియుఁ దోఁపక యుండిన, యామానిసు లెల్ల మిగులనార్తిఁ గనిరి; ర
క్షోమానిని వక్షంబున, నేమాత్రము భీతిలేని హృదయ మ్మలరన్. ౧౭౪ 394

---

1 నిబ్బరముగ = అధికముగా. 2 నిష్ఠురపవిపాతశంక = కఠినమగు పిడుగుపడినదో యను

క. కరచరణము లాడించుచు, హరి యెంతయు నేర్పుమీఱ నాడుకొనఁగ గో
పరమణు లప్పుడు కనుఁగొని, త్వరపడి చేరంగఁ బోయి బాలకు నతనిన్. ౧౭౪

క. మనసులఁ గలిగినసంభ్రమ,మున నాయన! రార! యనుచు ముద్దిడుకొనుచున్
జనిరి తొలఁగంగఁ గైకొని, జనయిత్రులు వారితోడ సంభ్రమ మొదవన్.

తే. *పాడురక్కసిఁ దాఁకుట గూడనిపని
యనుచు గోవాలమును ద్రిప్పి యంత మఱియుఁ
దగినవని తోఁచినన్ని యుక్తములచేత
రక్ష లొగిని జేయించిరి రమణు లంత. ౧౯ 397

చ. మనముల శోక ముప్పతిల మాధవుఁ గాంచుచు నేమితోఁపమిన్
వనితలఁగూడి గోరజము బాలకుదేహమునిండఁ జల్లి చ
క్కని దగుధేనుమూత్రమును గాయమునం జిలికించి యంత నిం
కను మదిఁ దృప్తిలేమి శిశుకమ్రతరావయవంబులం దొగిన్. ౧౯౪ 398

వ. భగవన్నామద్వాదశకం బుచ్చరించుచుఁ దిలకస్థానంబులు ద్వాదశసంఖ్యాకంబు లగుట గోమయంబున రక్ష గావించిరి. లలాటంబుఁ గేశవుండును, నాభి నారాయణుండును, హృదయంబు మాధవుండును, గంఠాధోభాగంబు గోవిందుండును, దక్షకుక్షి విష్ణుమూర్తియు, దక్షిణభుజంబు మధుసూదనుండును, గంఠంబుఁ ద్రివిక్రముండును, వామకుక్షి వామనుండును, వామభుజంబు శ్రీధరుండును, గళము హృషీకేశుండును, గటిప్రదేశంబును బద్మనాభుండును, గకుద్భాగంబు దామోదరుండును, గాపాడుదురను నది ద్వాదశావయవరక్ష యనంబడు. మఱియును. ౨౦ 399

సీ. కొంతయూఱటతోఁప గోపిక లత్తఱి నాచమన మొనర్చి యంతకంటె
దక్షమౌ నట్టిసంరక్షను గావింప సమకట్టి శుద్ధలై సాధుబీజ
వర్ణంబులను జక్కఁ బల్కుచు మునుముందుఁ దమశరీరములహస్తములవాని
న్యాస మొనర్చుచు నవల శ్రీకృష్ణుని యంగములందును హస్తయుగము

తే. నందు నీవిధి బీజవిన్యాస మిట్లు
గా నొనర్చిరి; పుత్త్ర! నీ కమ్రచరణ
ముల నజుం; డణిముఁడున్ జానువులను, యజ్ఞుఁ
డూరువులఁ గటితటము నచ్యుతుఁడు ప్రోచు. ౨౧౪ 400

వ. జఠరము హయగ్రీవుండును, హృదయంబుఁ గేశవుండు, నురము నీశుండును, గంఠంబు నినుండును, భుజముల విష్ణువును, ముఖము నురుక్రముండును, శిరంబు నీశ్వరుండును బ్రోతురు. అగ్రభాగంబుఁ జక్రధరుండు, వెనుకభాగంబుఁ

* 'రక్షాంవిదధిరేసమ్యగ్గోపుచ్ఛభ్రమణాదిభిః' అని మూ. దీనియర్థమంతయుం నిందుఁగలదు.

గదాధరుండును, ధనుర్దండంబుధరియించిన మధువైరియుఁ గృపాణపాణియగు నజనుండు, పార్శ్వంబులను శంఖముం బూనినయురుగాయుండు, కోణమ్ములను మీఁదు పేంద్రుండును, గ్రిందను దార్క్ష్యుండును, సర్వస్థలంబుల హలధరుండును గాపాడువారు. ఇంద్రియంబుల హృషీకేశుండును, ప్రాణంబుల నారాయణుండును, జిత్తంబును శ్వేతద్వీపపతియు, మనంబును యోగేశ్వరుండును, బుద్ధిని బృశ్నిగర్భుండును, బుద్ధినాత్మను భగవంతుఁడును బాలింతురు. నీవు క్రీడించునపుడు గోవిందుండును, శయనించునపుడు మాధవుండును, నడచునపుడు వైకుంఠుండును, గూరుచున్నయపుడు శ్రీపతియు, భుజించుసమయంబున సకలగ్రహాభీతికరుండగు యజ్ఞభోజనుండును గాపాడుచుందురు. ఢాకినీ యాతుధాన కూశ్మాండపాపగ్రహభూతప్రేతపిశాచయక్షరక్షోవినాయకకోటరా రేవతీజ్యేష్ఠాపూతనామాతృకాదులును, దేహప్రాణేంద్రియములకు ద్రోహ మొదవించు నున్మాదాపస్మారములును, స్వప్నదృష్టమహోత్పాతబాలవృద్ధగ్రహము లింకనుగల పీడాకరగ్రహములెల్ల నీవిష్ణునామసంకీర్తనంబునకు వెఱచి నశింతురని ప్రణయబంధంబున గోపికలు రక్షగావించిరి తదనంతరంబ. ౨౯౪ 401

క. జననియశోదయుఁ బ్రీతిం, దనయునకున్ స్తన్య మిచ్చి ♦ తగుశయ్యపయిం
గనుమూయఁ బవ్వళింపం, గను జేసెను; మథురనుండి ♦ కడు జవమొప్పన్. ౩౦

క. గోపకులఁ గూడి నంద, క్ష్మాపతి యరుదెంచి తనదు ♦ మందను ఘోర
వ్యాపారహృదయ పూతన, యాపగిదిం జచ్చియుండు ♦ టరసి మనమునన్. ౩౦౪

తే. దానిదీర్ఘశరీరంబు ♦ గానఁబడఁగఁ, బరమవిస్మితుఁ డయ్యె; గో♦పకులు నందుఁ
డొక్కరొకరిని గని యిట్టు♦లుద్యమమునఁ, జెప్పుకొన సాగి రియ్యది♦చిత్రమౌర!

క. ఆనకదుందుభి పల్కిన, దే నిశ్చిత మయ్యె భీతి ♦ యెంతయుఁ గల్గం
గా నిట్టిమహోత్పాతము, లీనెలవునఁ గల్గెఁగాదె ♦ యెటుఁగె నతఁ డెదన్. ౩౧౪

క. కనుకన్ మును మునివరుఁడై, జనియించియె యుండు నిట్టి♦చందమ్మున, యో
గిన్నృపుండై వచ్చెనొకో, మనుష్యమాత్రుండుగాఁడు ♦ మాట లిఁకేలా. ౩౨

క. పలుకంగలఁడే యివ్విధి, జులకనఁగాఁ గేవల మను♦జుండే యైనన్
పలికినయటు లుత్పాత, మ్ములు తోఁచె నటంచుఁ జిత్ర♦ముగఁ జెప్పుకొనన్. ౩౨

ఆ. వ్రజనివాసు లంత ♦ వచ్చి పూతనకళే,బరము నవయవాళిఁ ♦ బరశుహతుల
భాగములుగఁ జేసి ♦ వేగమ కొనిపోయి, దవ్వుఁ జేర్చి కాష్ఠ♦తతులఁ బేర్చి. ౩౨౪

చ. జ్వలనుని జేర్చి యాతుణమ♦భస్మముగా నొనరించి రప్పు ని
ర్మలతమకృష్ణదేహయుతి ♦ రక్కసిదేహము ముక్తపాపమై
సులలితమై చెలంగె మఱి♦శుభ్రతరాగురుసౌరభంబుగాఁ
జెలఁగెను ధూమ మద్దియె వి♦చిత్రముగాఁ గనుపట్టె నయ్యెడన్. ౩౮ 409

చ. ధరఁగలబాలకప్రతతి దారుణరీతి వధించి వారి నె
త్తురుఁ దమిఁగ్రోలు క్రూరమతిఁ దోఁచినపూతన యాతుధాని శ్రీ
హరిఁ బొలియించు వాంఛమెయి నచ్చటఁ జేరియు స్తన్య మిచ్చియున్
బరమగతిం గనం గలిగెఁ బల్కఁ లిఁకేటికి రాజపుంగవా! ౩౫ 410

ఉ. చెప్పఁగనేల యింక నల శ్రీహరికిం బరమాత్మకున్ మదిం
జొప్పడుశ్రద్ధ భక్తియును శోభిలఁగా ననురాగ మాత్మయం
దుప్పతిలంగఁ దల్లు లటులోపినయంత ప్రియంబుఁ గూర్చువా
రప్పుడె సద్గతింబడయు టబ్బుర మొక్కొ మహీశశేఖరా! ౩౬ 411

సీ. భక్తియే లేకయు వందన మొనరింపకయు వైరమే యూని కఠినచిత్త
యగును బూతన యని యాత్మ నెఱింగియు విమలభక్తుల హృదయముల నిల్చి
సకలలోకాధీశ సంతతవంద్యంబు లయితగు దివ్యపాదారవింద
యుగళంబు చేత నేయుగ్రరాక్షసి మేను స్పృశియించి విహరించి శ్రీశుఁ డెలమి

ఆ. జన్నుఁగుడిచె దాన స్వర్గ మనంబొల్చు, హరిపదంబు నొందె యాతుధాని
యయ్యుఁ దల్లివోలె హరికిని భక్తిమై, స్తన్య మిచ్చినట్టి జనను లెల్ల. ౩౭

క. ధేనువులును వైకుంఠముఁ, గానంజను వారలనుచు గానము చేయం
గానేల యింక? ముక్తి, స్థానాదికముల నొసంగజాలిన హరియున్. ౩౮ 413

క. దేవకికిం దనయుఁడుగా, భూవలయంబునఁ జెలంగు బుధనుతుఁడు తనున్
భావించి ప్రీతిఁ జనుపాల్, ద్రావించిన వారి కేమి తా నిచ్చెడినో. ౩౯ 414

క. జననాథ! పల్కవలెనే, జననులు తనపైని బ్రీతి సంధిల్లంగా
దనయుం డనుతలఁపున నే, స్తనపయసుం గుడిపి రట్టి సాధ్వుల కెపుడున్. 415

తే. జ్ఞానహీనతఁ బ్రాపించు సంసృతిభవ, బాధ యించుకయైనఁ దోఁపదు నిజంబు
భూపశేఖర! మథురకుఁ బోయివచ్చుచున్న నందాదిగోపకులుద్యమమున. ౪౦

తే. పూతనాశవధూమ సంభూతసౌర
భమును మూర్కొని యిదియేమి వచ్చె నెచట
నుండి?యని యితరేతర మొక్కరీతిఁ
బ్రశ్న చేయుచుఁ బోయిరి వ్రజముఁ జేర. ౪౧ 417

ఉ. అందలిగోపవర్యులు మహాముద మొప్పఁగ యాతుధానియున్
సుందరవేష మూని యిలుచొచ్చుట యాదిగఁగల్గు వార్తలె
ల్లం దగఁ జెప్పఁగా విని కలంగుచుఁ బూతన యంత మొందుటల్
కుం డొకయింక లేత పసికూన చెలంగుటయుం దలంచుచున్. ౪౨ 418

తే. విస్మయం బట్టె గదురంగ వింటి మొక్క
క్రొత్తవృత్తాంత మని రెల్ల గోపవరులు

పరపురంబుననుండి య | ట్లరుగుదెంచి
యున్న నందుఁడు సంతోష | ముప్పతిల్ల. ౪౨½ 419
క. తనయుని గ్రహించి మూర్ధం,బును మూర్కొని నిరుపమాన | మోదంబున నొ
ప్పెను; శిశురూపంబున హరి, యొనరించినయద్భుతముగ | నొప్పెడుదీనిన్. ౪౩½
తే. పూతనామోక్ష మనుదానిఁ | బూన్కి నెవఁడు
వినునొ హరికృప యిట్టిదై | వెలయు ననుచు
నెఱుఁగునో వానిచిత్త మాశయీశునందు
నిలిచియుండును సతతంబు | నిశ్చలముగ. ౪౪ 421

ఏడవ అధ్యాయము.

శకటాసురసంహారము.

వ. అనవిని యుత్తరాసుతుఁడు | వ్యాసమునీంద్రునిపుత్త్రుఁ గాంచి యి
ట్లనియెను యోగివర్య! సకలాధిపుఁడై భగవంతుఁడైనయా
వనరుహనేత్రుఁ డాయమరవంద్యుఁ డదేయవతారమెత్తి యే
పనుల నొనర్చె నవ్వి శ్రుతిపర్వము లెన్న మనోహరంబులౌ. ౧ 422
ఉ. వానిని విన్నయంతటనె | పాఱెడుఁదృష్ణయు నెమ్మనంబునం
గానఁగ నైనయయ్యరుచి | క్రమ్మఱ రాఁ దలపోయ వంచు నా
మానస మెంచుచున్నయది | మానివరేణ్య! మనంబు శుద్ధమే
యౌను బరేశునందు దృఢ | మై తగుభక్తియు నెప్డు కల్గెడున్. ౧½ 423
మ. హరిభక్తప్రకరంబుతో దృఢసఖిత్వావాప్తియుం గల్గుశ్రీ
హరి మాహాత్మ్యముఁ దెల్పుగాథ లఘుతూలాగ్నులే మనోజ్ఞంబులై
పరఁగుం గావున వానిఁ దెల్పఁ దమి పై | పైఁ బొంగునేఁ దెల్పుమా;
పరమేశుం డొగి మాయఁబూని ధర నెబ్భంగిం బ్రవర్తించెనో. ౨ 424
క. నరవేష మూని యేయే, చరితంబుల నద్భుతముల | జాలిక ననువై
పరఁగెడువానిన్ దా నను, సరించి కన్పడఁగఁ జేసె | శైశవమందే. ౨½ 425
తే. అట్టివాని విశేషించి | యాదరమున
నింకనుం దెల్పఁదగువాని | నెల్ల జెపుమ;
వినఁగ వేడుకయయ్యె నా | కనిన విజయ
పౌత్రునింగాంచి శుకయోగి | పలికె నిట్లు. ౩ 426
సీ. వినవయ్య! భూపాల! | వనజాతునకు శయ్యపయిఁ బొరలాడెడు | వయసు రాఁగ
జననియశోద యుత్సాహపూరిత హృదయాంబుజయ్యై వేడ్క | నాచరింపఁ
దలఁచి యద్దానికై | వెలయుస్నానము విధిహితముగాఁ జేయంగ | నెన్నినాఁడె
హరిజన్మనక్షత్ర | మరుదేరుటయు నంత గోపికాసంతతిఁ | గూడిభద్ర

తే. వాద్యసుఖగీతములు పర్వ ♦ వసుమతీసు
రోత్తములు స్వస్తిదమ్ములై ♦ యొప్పుమంత్ర
ములు పఠింపఁగఁ దలయంటి. ♦ లలితజలము
లను గుమారునకుఁ స్నాన ♦ మాచరించి. ౨ 427

క. ఆనందునిపత్నియు నవ,నీనిర్జరవరులకెల్ల ♦ నెమ్మి వసనముల్
మానితసుమహారమ్ములు, ధేనువులును భోజనమ్ముఁ ♦ దృప్తిగ నిడుచున్.౨౫428

క. వారలు పూజితులగుచుఁ గు,మారునకుఁ శుభముగల్గు ♦ మంత్రంబులఁ బెం
పారఁగ దీవించినతఱి, నారమ్యకుమారు మోము ♦ నంబుజముందున్. ౩౦ 429

తే. ఆవులింతలు లోనగు ♦ నట్టిచిహ్న,ములుఁ గనంబడఁగా నేత్ర♦ములను నిద్ర
నొంద వేగిరపడఁ గాంచి ♦ యందమైన, డోలికను జేర్చి నిద్రింప♦జోలపాడె.

క. ఆపాటకు సుఖముం గని, యాపాపఁడు నిద్రవోయి♦నట్లుండె; సుతుం
డాపగిది నిద్రపోవఁగ, నాపడఁతుకమిన్న తన్న♦హముచూడంగన్. ౩౫ 431

క. చనుదెంచియున్న ప్రియబం,ధునికరమును మందనున్న♦తోయమువారిన్
గనికరమునఁ దదుచితవిధ, మునఁ దృప్తులఁజేయుచుండె♦బొంగెడు వేడ్కన్.౩౫

క. ఆనందడిలో నాఁకలి,తో సరగునఁ బాలుగ్రోలఁ ♦ దోడ్తో నేడ్చెన్
వాసవుననుజాతుం డది, యాసాధ్వి వినంగ నోప♦దయ్యెన్; హరియున్. ౬ 433

సీ. ఆఁకొన్నచందాన ♦ నల్లనల్లన నీల్గి స్తన్యముఁగోరి పాదముల మీఁది
కట్టె విదిల్చె; న♦య్యదనున నంబరముననుండి యాకుమారుని వధింపఁ
గఠినరాక్షసుఁడు శ♦కటరూపమున వచ్చి యాతొట్లపయి వ్రాలె ♦ నతనిక్రింది
భాగంబునం దొట్ల♦లోఁ గడునేడ్చుచందముగనంబడ శయ్య ♦ నమరియున్న

తే. శిశువు నూత్నప్రవాళంపు♦జెలువు మార్ద
వమును గనియున్న దివ్యపా♦దములఁ దన్న
దాన నాశకటంబు వి♦ధ్వస్త మగుచుఁ
దిరుగుచుం బడె నాచెంత ♦ ధరణిమీఁద. ౬౫ 434

క. ఇరుసును జక్రము లాకులు, తిరుగుడుపడె దానినొగలుఁ ♦ దెఱఁగేది తదం
తరమున రసవద్వస్తూ,త్కరనిబిడము లైనపాత్ర♦గణములు వెలుచన్.౭ 435

ఆ. ధరణి నిండె నవ్వి ♦ తనరుఁ గాంస్యాదిమ,యంబులగుచు నంత ♦ నాయశోద
మొదలుగాఁ జెలంగు♦ముగుదమిన్నలు తదు,త్సవముఁ జూచువారు♦తత్తఱమున.

క. బోరగిలంబడె శిశు వని, చారుతరంబైనమహాము♦ సాగింపఁ గనం
గోరి చనుదెంచి యున్నవ,రారోహలు దానిఁగాంచి ♦ రాతుర లగుచున్.౭౫437

క. కని రద్దానిన్ నందా,దినిఖిలగోపకులు నెట్లొ♦దియుఁ దనయంతన్
జనలేక తల్లక్రిందులు, గనుబడె నిలమీఁద నేమి♦కారణ మొకో. ౮ 438

క. అని యూహించుచు విస్మయ,మున నద్భుతమునను మిగులఁ బొదలుచు సత్యం
బును గనఁజాలక తమలో, ననేకభంగులను బల్కుకొనట్లు మెలఁగుచున్. ౮౪ 439

క. శకటంబు పుట్టు మూఁగిరి, వికలాంగం బగుచు నదియుఁ బృథ్విని బడు శే
లొకొ యని సంశయ మందుచు, నిఁక గతి యేమనుచుఁ జాలనెన్ను చునుండన్.

తే. అచట నాడుచునుండిన యర్భకు లొగి, గోపవర్యుల వారల కువలయాత్ము
లను గనుంగొని పల్కి రిట్లని యితండె, పాలకేడ్చుచు దీనిని గాలఁ దన్నె.

చ. చరణహతిఁ గలంగి యిది చయ్యన నియ్యెడ నివ్విధిం బడెఁ
వరమతులారసత్య మని బాలకులాడిన వారిమాటలా
దరమున నాలకించి యిటు తప్పక సాగియెయుండు నంచు న
మ్మరు జను లప్రమేయమహిమంబుఁ దదీయ మెఱుంగ కుండుటన్. ౧౦ 442

ఉ. అంత యశోద చన్గుడువ నర్భకుఁ డేడ్చు టెఱింగి పుత్త్రు న
త్యంత ముదంబునం గొనుచు నాతనికిఁ గ్రహ మేదొ సోఁకె నఁ
చింతను గాంచి బ్రాహ్మణులఁ జెచ్చెఱఁ బిల్వఁగఁబంచి పీడయా
వంతయుఁ గల్గకుండునటు లర్భకుఁ గావుఁ డటంచు వేఁడినన్. ౧౦౪ 443

ఉ. దానవపీడ గల్గనివిధంబున నొప్పెడు స్వస్తిసూక్తసం
తానములం బఠించి సుతతల్లజుఁ గావఁగ రక్షఁగట్టె నా
మానిని సంశయం బుడిగి మాపతికిం జనుప్రా లొసంగె, నా
సూనుని కింకనుఁ గ్రహముసోఁకునఁ గల్గెడుపీడ మాన్పఁగన్. ౧౧ 444

సీ. గోపాలకులు గుంపుగూడి దిక్కులయందు బలివస్తువుల నిడి ప్రాగ్విధమున
రక్షగావింపఁగా బ్రాహ్మణు లత్తఱి గ్రహయజ్ఞ మొనరించి క్రమ్రదధిని
సలిలాక్షతకుశాది సద్వస్తువుల నగ్ని నర్చించి;రంత నయ్యాత్మజునకు
*నందుఁ డసూయను బొందక యనృతంబు లాడక యతొంతినందక మఱి

తే. దంభ మనునది లేక సుంతయును హింస, చేయఁబూనక గర్వంబుచెంద కలరి
సత్యశీలంబులం దగుసాధువిప్ర,వరుల యాశిషములు ఫలవంతము లగు. ౧౩

క. అని తలఁచి రక్షచేయిం,పను బూని ద్విజప్రవరుల భక్తిని బిలిపిం
చెను వారు ఋగ్యజుస్సామ నియతమంత్రములచేత మంత్రించి విధిన్. ౧౩౪

క. లలితౌషధులను జేర్చిన, జలములు పావనములౌట సత్యం బగుటం
దలపోసి వానిచే మం,గళములు తగ స్నానవిధిని గావించి రొగిన్. ౧౮

తే. స్వస్తివాచన మావిప్రసమితి చేయఁ
దా సమాహితుఁ డై మఱి దహనుఁ దృప్తుఁ

* 'యేఽసూయానృతదంభేర్ష్యా హింసామానవివర్జితాః, న తేషాం సత్యశీలానా మాశిషో విఫలాః కృతాః' అని మూలము.

జేయ విప్రుల నియమించి ॥ చెలఁగి వార
లట్లు గావింపఁ బ్రీతి మృష్టాన్న మిడియె. ౧౮౪ 448

క. సురుచిరమాల్యంబుల నం,బరముల నలరించి దివ్యభర్మాభరణో
త్కరముల వెలిఁగెడు గోవులఁ, బరమాదృతి నొసఁగె బాలభద్రాప్తికి నై. ౧౮౫

*క. ధరణీసురులర్చితులై, పరమాశిషములనొసంగి ॥ పట్టికిఁ గీడె
క్కరణిని రాదనిరి మహీ, వరవర్యా! మంత్రవిదులు ॥ బ్రాహ్మణులగుటన్. ౧౮౬

తే. వా రొసంగెడు నట్టిదీవన లోకప్పు, డైన నిష్ఫలములుగాక ॥ సార్థకంబు
లగును ధ్రువ మిద్ది వినవయ్య యవలిదైన, హరిచరిత్రము పావన ॥ మద్భుతంబు.

**తృణావర్తుని శ్రీకృష్ణుఁడు సంహరించుట.**

ఉ. ఆవల నొక్కనాఁడు సుతు ॥ నంకమునం గదియించి యాయశో
దావనితామతల్లి ప్రమదంబున నాటలఁ దేల్చుచుండఁగాఁ
బావనమూర్తి శ్రీహరియుఁ ॥ బర్వతకూటముభంగి భారమై
మోవఁగ నోప నట్లయిన ॥ ముగ్ధయు దుర్భరుఁ డంచు నెంచుచున్. ౧౮౭ 452

చ. ధరణిని డించి యాబరువు ॥ తద్దయుఁ బీడను గల్గఁజేయ నే
మిర! యని విస్మయంపడుచు ॥ మిక్కిలి యాపద యేదొ యంచు నా
తురపడుచుఁ బరాత్పరుని ॥ దోరపుభక్తిని లోఁ దలంచుచుఁ
దిరుగుచునుండె నెప్పటివిధిఁ గృహకృత్యనిబద్ధచిత్త యై. ౧౮౮ 453

క. కలఁడు తృణావర్తుం డన, నిలఁ బేరొందిన దురాత్ముఁ ॥ డెంతయుఁ గూర్చుఁ
ఖలుఁ డగుకంసునకుఁ వాఁ, డలఘుబలాఢ్యుండు దనుజుఁ ॥ డగు నోరాజా!

క. పుడమివిభుఁడు పురికొల్పఁగ, వడివడిఁ దిరుగాడుగాలివడువున రూపం
బడరఁగఁ జనుదెంచెను నా, బుడుతనిఁ గొనిపోవ వేడ్క ॥ పొలయుచునుండన్.

చ. దనుజుఁ డతండు గోకులముఁ ॥ దా నపు డంతట నావరించి మే
దినిరజ మెల్ల రేపి యటఁ ॥ ద్రిమ్మరువారల కన్నులింతయేఁ
గనఁబడకుండఁ జేయుచు నిశాముభయంకరశబ్దయుక్తిచే
తను దిశలఁ విదిక్కులను ॥ దద్దయు మ్రోఁగఁగఁ జేయుచుఁ వడిన్. ౧౯౧ 456

క. చనుదెంచి కూరుచుండిన, వనజాక్షుని బాలకునిగ ॥ భావించుచుఁ జే
కొనిపోయె నభ్రవీథికి, దనుజప్రేరితరజోవితానము సోఁకన్. ౧౯౨ 457

ఆ. అంధకార మప్పు ॥ డావరించెను గోకు,లమున నొకముహూర్తసమయ మంత
నాయశోద యెందునర్భకు నునిచెనో, యచటఁ జూడఁ దోఁపఁడయ్యె సుతుఁడు.

సీ. అందలివారెల్ల ॥ నాతృణావర్తుండు గురియించుచున్నట్టి ॥ ధరణిధూళి

---

* 'విప్రామంత్రవిదోయుక్తా స్త్యైర్యాః ప్రోక్తాస్తథాశిషః, తానిష్ఫలా భవిష్యంతి న కదాచి దపి స్ఫుటమ్' అని మూలము.

వర్షము పెల్లునఁ ఽ బరునిఁ దన్నుం గానఁజాలక భ్రమసిరి ఽ చాలసేపు
గాఁ దలపోసి రాక్షణకాలమును వార్త; లంత యశోద భఽయావహావప
మానచక్రప్రహిఁ ఽ తానంతపాంసువర్షమ్మున సుతుని మాఽర్గమ్ము గానఁ

ఆ. జాల కార్తిమున్ని ఽ జనని గావున సుతుఁ, దలఁచుకొనుచు జాలి ఽ గలుగునట్లు
పొరలిపొరలి దూడఽపోయిన ధేనువు, భంగి నేడ్చెఁ జూచుఽవారు పొగుల.

క. ధరణిరజోవర్షమహా, త్తరవేగము సుంత తగ్గఁ ఽ దనతనయమణిన్
స్మరియించుచు వాపోయెడు, తరుణీదీనస్వనంబు ఽ తమశ్రుతులఁ జొరన్. ౨౪

క. గోపవధూటులు నశ్రుజలాపూర్ణముఖాబ్జ లగుచు ఽ నాత్మలు దుఃఖ
వ్యాపృతి నుద్విగ్నములై, చూపట్టఁగ నందగోపఽసుతుఁ డగపడమిన్. ౨౫ 461

క. నిలుపంగ రానివగచేఁ, బలవించిరి చక్రవాతఽవపువు గలుగునా
ఖలుఁడు తృణావర్తుండును, ఖలహరుఁడౌ కృష్ణుఁ గొనుచుఁఽగడు వేగమునన్.

క. చనియె నభోవీథికి నా, తనయుఁడు కడుభార మగుడుఁ ఽ దాఁ గొనిపోవం
గను జాలక గతివేగము, తనంతనే తగ్గనుండెఁ ఽ దాపము గనుచున్. ౨౬ 463

చ. వరుసగ భారమెక్కుడయి ఽ వానిజవంబు నడంచె నంత నా
శరుఁడును భూరిభార మనఁఽజాలిన బిడ్డని గాంచి గొప్పప్ర
స్తర మగుఁ గాని బిడ్డఁడె నిఽతాంతము నన్నును మించె బర్వుచేఁ
దరమె చనంగ నంచు మదిఁ ఽ దత్తఱమందుచు నుండె నంతలోన్. ౨౭ 464

క. ఆయద్భుతబాలకుఁ డపు, డాయసురుని గళము నట్టె ఽ హస్తయుగళిచే
బాయక పట్టుకొనంగా, నేయనువున విడుచు ననుచు ఽ నెంచి బలము చేన్. ౨౮

తే. తాను విడిపించుకొనలేక ఽ తల్లడిలుచుఁ
జేష్టలెల్లను మాని యఽక్షిద్వయంబు
వెలికి రాఁ *గంఠమును దాఁటుఽవెరవెఱుఁగని
శబ్ద మొప్పఁగఁ బ్రాణపంఽచకము పోవ. ౨౯ 466

క. బాలకుతోడ వ్రజమునఁ, గూలెన్; వ్యోమముననుండి ఽ క్షోణి నొకట నా
భీలశిలాతలమునఁ బడి, కూళ మహాదైత్యుఁ డంగఽకూటం బెల్లన్. ౩౦ 467

క. తిలలవలె శకలములుగాఁ, బెలుచన రాలంగఁ జూడ ఽ భీతికరుం డై
యలనాఁడు రుద్రశరమునఁ, దిలలంతలుగాఁగఁబడిన ఽ త్రిపురములవలెన్. ౩౧

క. కనఁబడఁగాఁ బలవించుచు, వనితలు గుంపులుగఁగూడి ఽ వానివిధంబుం
గనుఁగొని తద్వక్షస్స్థల,మున వ్రేలుచునున్న కృష్ణఽమూర్తిం బెలుచన్. ౩౨

క. అచ్చెరువునఁ గాంచుచు వే, ముచ్చటలాడుచును గొంచుఁ ఽ బోయి జననికే
యిచ్చిరి విస్మితలై శిశు, విచ్చట నుండంగ నింకఽనేమో యనుచున్. ౩౨ 470

* 'అవ్యక్తరావోఽన్యపతత్' అని మూ, 'వచనావృత్తివర్జితః' అని వ్యాఖ్య.

తే. గుసగుసలు పోవుచుండి ర ట్లసుర మింటి
వంకఁగొనిపోయి చంపంగ వాంఛఁబూన
మృత్యు ముఖముననుండి యీ మేటిశిశువు
[1]ముక్తి గని స్వస్తిమంతుఁడై పొదలె నహహా. ౩౦ 471

చ. అని వచియించుచున్ వ్రజమునందు వసించెడి గోపగోపికా
జనములు నందముఖ్యులును సంతసమున్ మరలం గనంగ దే
వునిదయ నోచినార మని బుద్ధుల నెంచిరి; గొల్లలెల్ల నె
మ్మనముల నద్భుతం బొలయ మాయురె! యియ్యది చూడఁ జిత్రమా. ౩౦౪

సీ. బాలకుఁ డీతఁ డీపాడురక్కసుచేతఁ గొనిపోవఁబడియు నేకుందుఁగనక
తప్పించుకొనఁజాలె నెప్పటివిధమున మనకుఁ దక్కెను దీని కెన యనఁదగు
నద్భుతం బుండునే యనిరి; కొందఱు కూళ ఖలుఁడు స్వీయాఘంబువలనఁ జంపఁ
బడును సాధువు సమత్వమున భీతింబాయు నిది సాజమేకదా యిందుఁ జిత్ర
తే. మేమి కలదని పల్కిరి ధీమహితులు;
మఱియుఁ గొందఱు పూర్వజన్మమున నేమి
తపముచేసితిమో కృపాధాము హరిని
నెట్లు పూజించితిమొ సాధుహృదయులమయి. ౩౧౪ 473

క. మును పెట్టి తడాకాదుల, ననువుగఁ గట్టించితిమొ మహాయజ్ఞములం
బొనరించినామొ దానం,బు నెట్టిదానిన్ బ్రమోదమునఁ జేసితిమో. ౩౧౪ 474

క. భూతముల కెట్టివాని క,దే తెఱఁగున మేలుచేయ నెంచితిమో యీ
రీతిగ నీతఁడు మృత్యువు,చేతం గొంపోవఁబడియుఁ జిక్కెన్ మనకున్. ౩౨ 475

క. మనదగు నదృష్టవశమున, జననీజనకులకు బంధుజాలంబునకున్
గనుపండువు చేయుచు మర,లను వచ్చె నటంచుఁ దోఁచులాగున ననుచున్. ౩౨

తే. మోదమందుచు నుండి రిట్లు పల్కి నద్భు
తములు నాగోష్ఠవనమున నమరుచుంటఁ
గాంచి నందుఁడు వసుదేవుఁ డెంచిపల్కి
నట్టిమాటల మన్నించె నపుడు మరల. ౩౩ 477

## శ్రీకృష్ణుఁ డావులింప నాతనినోర యశోద విశ్వంబుఁ జూచుట.

క. తేజస్విని నందుని సతి, భ్రాజిష్ణువుగాఁ జెలంగు బాలకు నొక నాఁ
డోజోవృద్ధిని జేయం,గాఁ జాలెడు స్తన్య మొసఁగు కాంక్షల్ పొదలన్. ౩౩౪

[2]తే. ఎత్తుకొని యంకమును జేర్చి యెంతొ ప్రీతిఁ

---

1 'తం స్వస్తిమంతం పురుషాదనీతం' అని మూ. 2 'ప్రస్నుతం పాయయామాస స్తనం స్నేహపరిప్లుతా' అని మూ.

దనకుఁ దానే స్రవించుపా లనువుమీఱఁ
గుడుపుచుండెను స్నేహంబు కొంకుమాని
తన్ను ముంపఁగ నంత నా తనయుఁ డెలమి. ౩౮ 479

సీ. పయసుఁ గ్రోలియు వింత పర్వెడునవ్వుచే
మోము ప్రకాశింపఁ బొదలుచుండ
ముద్దులమూటయౌ మోము నల్లల్లన
నుపలాలనము చేయుచుండ నాతఁ
డావులించెను; దన్ముఖాంభోజమున వ్యోమ
ధరణులు తారకోత్కరము దిశలు
సూర్యుఁడు చంద్రుఁడు శుచివాయువులు సము
ద్రములు ద్వీపములు పర్వతములు నదు
తే. లఖిలవనములు స్థావర మనఁగ జంగ
మం బనంగను దగుభూతమండలంబు
గలుగు విశ్వంబును హఠాత్తుగా యశోద
గనియె నంతట దేహము కంప మొందె. ౩౯ 480

క. బాలహరిణాక్షి! కన్నుల, నోలిన్ ముకుళింపఁజేసి యురువిస్మయ మా
వేళ మదిదోఁపఁ జిత్రం, బేలీలగనుండు నట్టు లే యుండె నృపా. ౪౦ 481

## ఎనిమిదవయధ్యాయము.

### గర్గముని రామకృష్ణులకు నామకరణము చేయుట.

క. మరలం దెల్పెను శుకముని, హరిచరితము పాండుపౌత్రుఁ డైన పరీక్షి
ద్ధరణీశ్వరునకు వినుమా, పురోహితుండౌను గర్గముని వ్రజమునకున్. 482

క. నిరుపమతపోధనుం డై, పరఁగు నతం డొక్కనాఁడు పనిపూని వ్రజం
బరుదుగఁ జూడన్ వచ్చెను, బరమేశుం డందునుంట వసుదేవుమతిన్. ౧ 483

చ. కనుఁగొని గర్గురాకఁ దమకంబున నందుఁడు లేచిపోయి తో
డ్కొని చనుదెంచి పీఠమునఁ గూరిమిమీఱఁగఁ గూరుచుండఁజే
సెను మఱి వందనంబులను జేయుచుఁ బూజ లొనర్చి మార్దవం
బునఁ దగుపల్కులం బలికెఁ బొంపుగ నంజలిపట్టి యీవిధిన్. ౨ 484

*సీ. సూనృతవాక్కులు సురుచిరగతిమీఱ బయలువెడలుచుండె వదనసీమ
నుండి యోభూమీసురోత్తమా! సంపూర్ణుఁడవు నీవు నీకు మేము వితతమగు
భక్తిఁ జేయందగు పని యెద్ది? మీబోంట్లు భగవత్స్వరూపులు పరమదీన
మానసులై తగుమావంటి యల్పగృహస్థులకును శ్రేయంబు గలుగఁ

---

* 'సూపవిష్టం కృతాతిథ్యం గిరా సూనృతయా మునిమ్.' అని మూ.

తే. జేయఁగోరియె యాశ్రమసీమల విడి, యరుగుదెంతురుగాని స్వార్థాభిలాష
ముననె కాదనియెఱుఁగనో జనుల కెల్ల, మునివరేణ్య! మహాజ్ఞానధనుఁడ వీవు. ౧

క. వినుమా యతీంద్రియంబనఁ, జను నెయ్యది జ్ఞానధనము సాధింపఁగ వ
చ్చునొ దేన నట్టిశాస్త్రం,బును జ్యోతిర్నామకమును మును చేసితివా. ౨ 486

క. దాననె తొలిజనిఁ జేసిన,దాని శుభాశుభఫలప్రదానక్షమముఁ
బూని యెఱుఁగంగఁ దగుదురు, మానవు లింకెవరు నీకు మహి సరిగలరో. ౩

ఆ. బ్రహ్మవిదులలోనఁ బరఁగుదు మేటివై, కాన నామకరణకర్మ మర్భ
కులకు నిర్వ్యరకును గోరి చేయ వలంతి, వౌట వేఁడువాఁడ నార్యవర్య! ౪

*క. గురుఁడనె నే నందువొకో, పరికింపఁగ జన్మముననె బ్రాహ్మణుఁ డగుఁ జూ
గురుఁడు మనుష్యుల కెల్లను, గరుణామతిఁ జేయవయ్య కార్యము దీనిన్. ౫

చ. అనుటయు గర్గుఁ డిట్లనియె యాదవసంతతికిం బురోహితుం
డనఁబడు గర్గమౌని యనుఖ్యాతి జగంబున నిండియుండు నిం
కను వ్రజముం గనుంగొనఁగ గర్గుఁడు వోయె నటంచుఁ దెల్లమౌఁ
గనుక భవత్కుమారునకుఁ గార్యము దీనిని నే నొనర్చినన్. ౬ 490

తే. పాపమతియగు కంసుఁ డీపాపని నల
దేవకీపుత్త్రుఁడే యని భావమందు
నెంచు; యదుపుత్త్రునిగ నాతఁ డెంచుఁగాక
యెట్లు వసుదేవసుతుఁ డని యెంచు ననెదొ. ౭ 491

క. అందును దేవకికే యెటు, నందనుఁ డసి తలఁచు ననుచు నన్నడుగుదు వో
నందా! వసుదేవుఁడు నీ,కుం దగుమిత్త్రుం డటంచు క్షోణిఁ బ్రథితమౌ. ౮

సీ. దేవమాయయు మును దేవకీదేవి యష్టమగర్భ మతివ యేచందమునను
గా నోపదు సుతుండె కావలయు నటంచుఁ బలికెను దేవకీపట్టి నిన్నుఁ [తండు
జంపువాఁ డొకచోట జనియించియున్నవాఁ డనుచు ఘోషించెఁ; గావున న
వసుదేవుఁడే యాత్మభవుని మిత్త్రునియింట దాఁచినవాఁ డని తలఁచి మదిని

ఆ. బెరుఁగుచున్న శంక వెస వచ్చి నీసుతుఁ, జంపునేని కీడు సరగ మమ్ము
నొందుఁజు మ్మటంచు నూహించి పలికిన, నందుఁ డతనికిఁ గల సందియంబు. ౯

చ. తనమది నెంచి యిట్లనియెఁ దాపసివర్య! యశేని మంవయం
దును గలయస్మదీయులకుఁ దోఁపకయుండ ద్విజాతికర్తృమై
తనరెడు సంస్కృతిన్ విధియుతంబుగఁ జేయుము స్వస్తివాచనం
బనునది ముందుగాఁ గలుగునట్లు రహస్యముగా జవంబునన్. ౧౦ 494

* 'బాలయో రనయోర్నృణాం జన్మనా బ్రాహ్మణో గురుః' అని మూ. 'నన్వేతద్గురుణా కరణీయమితి చేత్' అనుదాని కిది తెలుఁగు.

క. అని ప్రార్థించిన గర్గుఁడు, తనమది నున్నట్టి దడియె తలఁపు గనుకఁ ద
త్తనయులకు నామకరణం, బనుసంస్కారమును దా రహస్యముగాఁగన. ౧౦౪
క. తనజతనం బొరులకుఁ దెలి,యనియట్లుగఁ జేసె; మఱియు నమ్మునివరుఁడి
ట్లనిపల్కె నంద విను మీ, తనయుఁడు రోహిణికిఁ బుత్త్రతల్లజుఁ డగుచున్. ౧౧
చ. సురుచిరమౌ గుణావళిని సూరిజనాళి రమింపఁజేయుటన్
ధరణిని రాముఁ డంచును నితాంతబలంబున నొప్పియుంట భీ
కరుఁడుగ వైరిసంతతికిఁ గానఁగ నౌట బలుం డటంచు నె
ల్లరు పిలువంగ ఖ్యాతిని జెలంగు ని డింతియె కాదు గోపకా! ౧౧౪ 497
తే. యదుకులము వారినెల్ల నైక్యమును బొందఁ,జేయుచుంట సంకర్షణప్రసిద్ధనామ
మబ్బు నితనికి;దీని నే యఖిలజనులు,పలువ నాంతు రనిపల్కె శ్రీల మఱియు. ౧౨
క. అనఘా! యీరెండవశిశు, వనూనవర్ణముల మూఁడు నలుప యుగములన్
విను మీయుగమునఁ గృష్ణతఁ,గనుటం గృష్ణాహ్వయంబుఁ గాంచుం జుమ్మీ. ౧౨౪
క. యుగభేదంబుల శుక్లం,బుగ రక్తము పీతవర్ణముగ నొప్పు సితం
డగణితమహిముఁడు కృష్ణం,బగు వర్ణముగల్గి కృష్ణుఁ డనఁబడుఁ జుమ్మీ. ౧౩
క. మును పితఁడు వసుదేవుని, తనయుఁడుగాఁ బుట్టె నొకటఁ దద్వృత్తసయుం డ
య్యె నిపుడు గావున శ్రీమం,తుని నితని జగతిఁ బండితులు కడుభక్తిన్. ౧౩౪
ఆ. వాసుదేవుఁ డనుచు వర్ణింతు రోనంద! నీతనూజుఁ డనఁగ నెగడు నితని
కరసి చూడ బహువిధామలరూపనా,మములు గలిగియుండు మహితములయి.
సీ. అవ్వియును గుణకర్మానురూపంబులై తన రారు మాపంటిమునులు వాని
నెఱుఁగఁ జాలుదురు మఱి తెవ్వరే నెఱుఁగరు మాబోంట్లుగూడ నామములరూప
ముల వానిఁ జక్కఁగఁ దెలియఁజాలరు తక్కువారలు తెలియంగ నేరుతురొకొ
యీబాలుఁ డెంతయే నిచ్చు శ్రేయము మీకు గోపగోకులములకును ముదంబు
తే. గలుగఁజేయును వీని దౌకారణమున, దుర్గమములై కనంబడుదుఃఖతతుల
వలని బాధలఁ గనక నిస్తులముదంబు, గాంచఁ గల్గుదు రని పల్కెగర్గమునియు.
క. మును పాకపరి ప్రజనాథా, మనుజేంద్రవిహీన మగుచు మహి యుప్పఁగ సా
ధునికరముల దస్యువు లే,చినకిన్కను బాధగల్గఁ జేయుచు నుండన్. ౧౬౪
క. వారలు నీయీపుత్త్రుని,జేరి సహాయంబుఁగోరి చెచ్చెఱ దస్యు
స్ఫారబలంబును నొంచిరి, గూరిమి నీసుతుఁడు వృద్ధిఁ గూర్చె మునులకున్. ౧౭
ఉ. జ్ఞానధనంబుచేఁ దనరు సాధుమనుష్యులు నీకు నిత్తఱిన్
సూనుఁడుగాఁ జెలంగు స్మరసుందరు నీతనియందుఁ బ్రీతిచే
మానసముల్ చెలంగ బహుమానము మీఱఁగ నుందు రేని సుం
తైనను గ్రూరబుద్ధు లభియాతులు కూర్పఁగలేరు బాధలన్. ౧౭౪ 506

తే. విష్ణుభక్తుల నసుర లేవిధిని బాధ, నొందఁ జేయంగఁ జాలకయుండువారొ
యట్టులే వీరి బాధింప నసువు లేమిఁ, దేరిచూడఁగఁజాల రిద్దియు నిజంబు. ౧౮

*చ. కనుకనె యీకుమారుఁడు జగంబున మించెడు శ్రీసమాయుతిన్
ఘనతరకీర్తిచేతను నఖండమహత్త్వముచే గుణాళిచే
తను భగవత్సమానుఁ డగుఁ దత్పరతన్ సుసమాహితుండవై
తనయుని వీని బెంపు మనితద్దయు గూఢతరార్థ మొప్పఁగన్. ౧౯ 508

క. మునిపతి గర్గుఁడు పచియిం
చి నిజాశ్రమమునకుఁ బోవఁ జెందిన వేడ్కం
దనుఁ గృతకృత్యునిగాఁ దలఁ
చెను నందుఁడు తలఁచె సుతుని శ్రీహరి యనుచున్. ౨౦ 509

## శ్రీ రామకృష్ణుల బాలక్రీడలు.

తే. కొలఁది కాలంబు గడువంగ గోకులమున
రామకృష్ణులు జానువుల్ భూమి మోపి
హస్తముల నూఁది యిటునటు నల్లనల్లఁ
గదలసాగిరి చూడంగ ముదముపొదల. ౨౧ 510

సీ. సహజన్ము లిర్వురు చక్కనికటిపాద భూషణకింకిణీ భూరినినద
ములు మనోహరముగఁ జెలఁగుచు నుండంగ వ్రజకర్దమశ్రేణి భాగములను
వరుసగ నడుగులు వడివడిఁ బెట్టుచు భూషణనాదసమ్మోదచిత్తు
లగుచుఁ దమ్ముంజూడ నరుగుదెంచినవారిఁ గని వెంబడిని బోవు కరణిఁగొన్ని
తే. యడుగు లిడి మోహమును జెందినట్లు వెఱచి
నట్లు ముఖచిహ్నములు తోఁప నపుడె మరలి
తల్లు లుండుచోటున కేగి దాపున నిలు
వంగ నమ్ముద్దుకొమరులఁ బాఱఁ జూచి. ౨౨ 511

ఉ. అన్నులమిన్నలన్ ప్రథితి నందినరోహిణియున్ యశోదయున్
మన్ననయున్ దయారసము మానసవీథిని నిల్వ గుబ్బఁగా
సన్నుతులౌ కుమారకుల చక్కటికిన్ వడిఁ బోయి స్నేహసం
పన్నతఁ జేఁపియున్న కుచభారమునన్ దమకేలుదోయినిన్. ౨౪ 512

ఆ. వడిగఁ జాఁపి భూమిభాగమునం బడి, పొరలునెడఁ దనువులఁ బెరసియున్న
యవనిధూళి యనెడు నంగరాగమ్మున, నందము లగు వారియంగములను. ౨౪

క. మనమున కింపును గూర్పంగ నెత్తికొని కౌఁగిలించి గారాబమునన్

* 'తస్మాన్నందాత్మజోఽయం తే నారాయణసమో గుణైః, శ్రియా కీర్త్యానుభావేన గోపాయస్వ సమాహితః' అని మూలము.

జనుపాలు గుడువ నిచ్చుచు, నునుదంతపుఁగాంతులఁ దగు నూత్నస్మితముల్. ౨౩

క. కనఁజేయు వారిమోములఁ, గనుఁగొని సమ్మోద మెంతొ కాంచిరి మఱియున్
వనితలకు నేత్రపర్వం, బునుగూర్చెడు బాలవృత్తములు నాసక్తిన్. ౨౩ 515

చ. కనఁబడఁజేయు నీడ్గోలయఁ గా వ్రజమధ్యమమందు వత్సముల్
చనువుగ సంచరింపఁ గని చాలవడిం జని వానితోఁకలం
గొన నవి యిందు నందుఁ జనుకోరిక నీడ్వఁగ వెంట బోవుచుం
డను బరికించి గోపికలు డగ్గరఁజేరి కుమారలీలలన్. ౨౪ 516

క. పరికించుచు నవ్వుచు మం
దిరకృత్యము లెల్లమాని దిన మంతయు నా
యిరువురఁ గాంచుచుఁ బ్రమదము
నిరంతరము గాంచుచుండ్రు నృపతుహీనాంశూ! ౨౪ 517

*సీ. తిరుగ నేర్చినకాలు తిట్టనేర్చిననోరు నూరక యుండఁగా నోప దనెడు
నానుడిచొప్పున సూను లిద్దఱు నతిచంచలాత్ములు కేళీసక్తులగుట
సతతంబు దిరుగుట మతినెంచి వారల ధేనువుల్ మొదలగు తీవ్రశృంగి
గణములవలనను గత్తులవలనను బావకువలనను భయదదంష్ట్ర

తే. లొప్పుశునకాదులవలన నుగ్రపక్షి, సమితివలనను గంటకసమితివలన
ముప్పుకలుగక యుండెడుచొప్పునఁ గన, నింటిపను లొనరింపఁ గాసింతయేని. ౨౫

క. జనునుల కిర్వురకు నదే, యనువున సరిపడకయుండె నా రెండును జే
యను గాల మొకఁడె కావున, మనస్సుల నవస్థ నొందె సూనసనాథా! ౨౫

క. కొలఁదిదినంబులు చనఁగా, బలదేవుఁడు కృష్ణమూర్తి వ్రజమున మోకా
ళుల దోఁగాడుచుఁ జరణంబుల మెల్లన నిడుచుఁ బోవఁ బూనిరి కడఁకన్. ౨౬

ఉ. అత్తఱిఁ గృష్ణమూర్తి సహాయస్కులుగాఁ దగుగోపబాలకుల్
చిత్తము లెంతొ మోదమును జెందఁగఁ దోడయిరా సరాముఁ డై
యుత్తమకాంత లెల్లఁ దమి నొప్పఁగఁ గాంచఁగ నాటలాడె లో
కోత్తముఁ డయ్యు బాలకుని యొప్పున లోకము మోసపుచ్చఁగన్. ౨౭ 521

## గోపికలు కృష్ణునిదుండగముల యశోదకుం దెల్పుట.

చ. వరుసగఁ జిన్నికృష్ణుఁ డట బాలకసంఘముఁగూడి యాడుచున్
దిరుగుచు ధూర్తకృత్యములు ధీరతఁ జేయఁగఁ గాంచి గోపసుం
దరులు యశోదచెంతకుఁ జనన్ మది నెంచియుఁ గూడియందఱుం
ద్వరపడిపోయి చెప్పి రిటు భామిని! మా పలు కాలకింపుమా. ౨౮ 522

* ఇందుఁ దొలిపాదము సంబంధము ననుసరించి చేర్పఁబడినది.

[1]క. పాలను బిడుకం దగనపు, డేలొకొ నీకొడుకుఁ దానె । యేతెంచి మనో
వ్యాలోలత దూడలమెడఁ, ద్రాళులు వదలించి తోలుఁ । దగునే యమ్మా! ౨౯
క. వలదని మా మగవారలు, పలికిన బిగ్గఱఁగ నవ్వుఁ । బాలుపెరుఁగు ని
మ్ములఁ దియ్యగ నుండఁగ నొక, పలుకైనను నడుగకుండ । భక్షించుఁజుమీ. ౨౯½
శా. చోరత్వంబున కెన్నిపన్నుగడ నీశిక్షోణిం దగుఁ వాని నీ
మారాకారుఁడు పన్ని క్షీరముఖసమ్మానార్హవస్తువ్రజం
బేరీతిఁ గ్రహియించునో యెఱుఁగ మట్లే తాను భక్షించు నో
భీరూ! యంతియెగాక కోఁతులకునుం । బెట్టుఁ జలంబొప్పఁగన్. ౨౯½ 525
[2]సీ. అం దొకమర్కటం । బారగించిన మఱియును బెట్టుఁ దినలేక । చనునె యేని
నవనీత మున్నభాండము దాని నూరకె పగులఁగొట్టును; వెన్న । పాలుపెరుఁగు
కాన్పింపకున్న మాకాంతులపయిఁ గోప మూని బాలకులెల్ల । నుయ్యేలలను
బడి నిదురింపఁగా । వడి గిల్లి యేడ్పించి పరుగిడుఁ; జేతికి । దొరకనియటు
[3]తే. లెత్తుగాఁ గుండలనుబెట్ట । నెట్లొ పీఠ
కము లులూఖలములు లోనుగఁ దగువానిఁ
జక్క నమరుచుకొని త్రాగ । నొక్కయుపమ
చేసి రంధ్రమువేసి భక్షించుఁ జుమ్ము. ౨౯½ 526
[4]చ. వినవా యశోద! నీసుతుఁడు । వ్రేఁతలు స్వీయగృహోచితక్రియా
వినియతచిత్తలై పయసు । వెన్నయు లోనగువానిఁ జీఁకటిం
టను బదిలంబు చేయఁగఁ గడంగి మహాతిమిరంబు మాయఁ జే
యను దగునట్టి రత్నమయహారము లంగమునందు భాసిలన్. ౩౦ 527
[5]క. అవియే దీపములై తగ, నువిదరో! యాయింటఁ జొచ్చి । యొప్పుగ సద్వ
స్తువులం గొనిపోవును దొం,గవు నీ వన ముచ్చు నీవెగావె యనుంజూ! ౩౦
క. నేనె గృహస్వామిని నని, తా నెంతొ ప్రగల్భతఁ నితాంతము తగు న
ట్లోనెలఁతా! పలుకును నీ, సూనుం డిట్టిండ్రు గలరె । సూనులు జగతిన్. ౩౦½
[6]క. దేవతలం బూజించెడు, మా వేశ్మములందుఁ జొచ్చి । మఱి మూత్రాదుల్
వే విడుచుఁ దా నమలినము, లౌ వేశ్మము లిట్లుచేయు । నమ్మా! పనులన్. ౩౦½
క. చోరత్వమునకుఁ దగునటు, లారంభము లెన్నొ చేసి । యమ్మరో! యిచటం

---

1 'వత్సాన్ ముంచన్ క్వచిదసమయే క్రోశసంజాతహాసః' అని మూ. 2 'స్వగృహకుపితో యాత్యుపక్రోశ్యతోకాన్.' అని మూ. 3 'హస్తగ్రాహ్యే రచయతి విధిం పీఠకోలూఖలాద్యైశ్ఛిద్రం హ్యంతర్నిహితవయుం నశ్శిక్యభాండేషు తద్విత్' అని మూ. 4 'ధ్వాంతాగారే ధృతమణిగణం స్వాంగమర్థప్రదీపం' అని మూ. 5 'శేశేచోశేత్యాక్షిప్తస్సన్ను శతిజల్పతిత్వమేవచోరోఽహం గృహస్వామీతి.' వ్యాఖ్య. 6 'కురుతే మేహనాదీని వాస్తౌ' అని మూలము.

జేరి యదేమియు నెఱుఁగని, దారిం గనఁబఱచుచుంట తథ్యం బయ్యెన్. ౩౦౫
క. కనవమ్మ! సుప్రతీకం, బనుదిగ్గజ మట్లు నిమ్నతమా భావంబున్
గనియున్నవాఁ డటంచును, వనితలు గుంపులుగఁ గూడి వచ్చి తెలిపినన్. ౩౧
సీ. గోపిక లివ్విధిఁ గోపంబునన్ వచ్చి తనదుదుందుడుకుకృత్యములు తెలుప
నత్తఱి శ్రీకృష్ణుఁ డవ్వాని వినుచును భయపడినట్లుగ నయనములను
గనఁబఱచుచు మఱి వినయ ముట్టిపడంగ శ్రీనికేతన మని చెప్పఁ జాలు
వదనము వెలయంగ వర్తిల్లఁ దనుఁగాంచి గోపిక లందఱు కొంకుమాని
తే. తెలుపుచుండిరి వారిమాటల కలుగక
యాయశోదయుఁ దనదునాస్యమున నవ్వు
నాట్యమాడుచునుండఁ దనయుని సుంత
భీతిఁ గనఁజేయఁబూన దా ప్రీతి యెంతొ? ౩౧ 533
సీ. *[ఒకనాఁడు శ్రీకృష్ణుఁ డొక్కొక్కయింటిలోఁ బెక్కురూపమ్ముల నొక్కసారి
తాఁ బ్రవేశించె నాతరుణులొక్కొక్కరు హరిఁ బట్టుకొని పోయి యాయశోద
కును జూపి దుశ్చేష్టలను దెల్పుద మటంచుఁ దోడ్కొనిపోయి రాతోయజాక్షు
లొక్కసారే పోవ నక్కడఁ దనతల్లి కడనుండెఁ గృష్ణుఁ డాకాంతలకడ
తే. నున్నకృష్ణులు కనఁబడకుండి రపుడు, వారు సిగ్గొంది యిదియేమి వరుసయో యని
యెందులకొ వచ్చినట్లు వచించి తిరిగి, యిండ్లకుంబోయి రాహరి యెలమి నలరె.]

శ్రీకృష్ణుఁడు యశోదకు విశ్వరూపమును జూపుట.

క. ఒకనాఁ డామందను గో,పకుమారులు కృష్ణమూర్తి బలరాముఁడు వే
డుక నాడుచుండఁగా గో, పకుమారులు కృష్ణుచర్యఁ బరికించి వడిన్. ౩౧౫ 535
క. పరుగిడి యశోదకడకున్, హరి మృద్భక్షణము చేసె నమ్మా! యని తె
ల్పిరి; కృష్ణుహితమె కోరెదు, తరుణీమణి యట్టిపనిని దా వారింపన్. ౩౨ 536
చ. మనమున నెంచి వే చని కుమారునిఁ జేత గ్రహించి సాధ్వసం
బునఁ గనుఁబోయి తొట్రిలఁగఁ బొల్పుగుదృష్టులఁ ద్రిప్పనక్షులుం
గనఁబడ నున్నయాకొడుకుఁ గాంచి చలాత్మక! యొంటిపాటునన్
దినితి వదేల మృత్తనుచుఁ దెల్పిరి బాలకు లంచుఁ బల్కుచున్. ౩౩౫ 537
క. వినిపించె నీదునగ్రజుఁ, డును దీనిం జక్కనని కడున్ బెదరింపన్
విని యంబా! మన్నును నేఁ, దినలే దీబాలకులును ధీవిరహితులై. ౩౮ 538

*ఈశ్లోకము తెలుఁగులిపిలోనున్న భాగవతమునఁ గలదు. శ్రీధరాచార్యవ్యాఖ్య లేదు. ముని భావప్రకాశిక యనువ్యాఖ్య యున్నది. నాగరలిపిలో నిది లేదు.

శ్లో. "గోప్యః కదాచన పృథక్పృథగూహ్య కృష్ణమేత్యైక కదైవగదితుం ప్రసృతాస్తదాగః, దృష్ట్వా తదంత్యథత మేవ నిజానదృష్ట్వా సర్వాశ్చ తానివవృతుః స్వగృహాన్ సలజ్జాః." ౩౩-శ్లో.

చ. అనృతము లాడి రద్ది నిజమైనను వీరిసమక్షమందు మో
ఘును బరికింపు మీవె యటఁ ఽ బొల్చునొవాసన యెద్ది నీమనం
బునకె యెఱుంగ నొ; ననినఁ ఽ బూనిక నన్నులమిన్న యట్టులై
నను ముఖముం గనంబఱపు ఽ నాయన! చూచెద నీదు సత్యమున్. ౩౫౪ 539

క. అనిహతపరమైశ్వర్యం,బునఁ దగి భగవంతుఁడగుచుఁ ఽ బొలుచుహరియు నో
రును విప్పిచూపెఁ గ్రీడా, మనుజార్భకుఁ డౌట నిట్లుమాపతి ముఖమున్.

మ. పరికింపం దగునంచుఁ జూపె; నపు డాపద్మాక్షి యందొప్పు స్థా
వరముఁ జంగమముఁ బ్రపంచమును నభ్రంబుఁ దిశాస్తోమముఁ
ధరణీధ్రంబులు ద్వీపసంతతి సముద్రవ్యూహముల్ గల్గునీ
ధరణీమండలముఁ గనుంగొనియెఁ జిత్రస్ఫారతం దోఁగుచున్. ౩౨ 541

సీ. ప్రవహనామకమునఁబరఁగువాయువు వైద్యుతాగ్నియు శీతాంశుఁడఖిలతార
కలు గల్గి యెంతయుఁ ఽ గనఁదగు నట్టిజ్యోతిశ్చక్రమును జలాదిత్యతేజ
ములను వాయువు నభమును దేవతల నింద్రియముల మనస్సు నత్యంతతామ
సములఁ దన్మాత్రల ఽ సత్త్వాదిగుణముల నెఱుఁగంగఁజాలె నాయింతి యందు

తే. జీవులను వారిఁబుట్టింపఁ ఽ జేయ హేతు, వైన కాలంబుఁ బరిణామ ఽ మనెడుదాని
హేతువైన స్వభావంబు ఽ నింక జన్మ, కారణం బగుకర్మముగాఁ జెలంగి. ౩౭౪.

ఆ. ఆశయంబు ననెడు ఽ నట్టి లింగంబుల, బహువిధావయవ నివహవిభేద
ములను గాంచి చిత్రముగ నున్న యాజగ,త్తును గుమారకునిదనను వ్రజమును

క. తనపుత్త్రకువదనంబునఁ, గనుపట్టుటఁ గాంచి యితని ఽ కాయంబున నే
యనువున నున్నవాఁకో యని, యనుమానము నొంది యితనియాస్యమునందున్.

చ. కనఁబడుచున్న దేమియొకొ ఽ కారణ మియ్యది స్వప్నమానొ? మే
ల్కొని యిటులున్న దానఁగద ఽ కూడునె స్వప్న మటంచు నెన్నఁగాఁ
గనుకనె దైవమాయ యనఁ ఽ గాఁ దగు నద్దియొ యేని యెల్లరుం
గనుఁగొనియుండు రద్దియును ఽ గా దిది నాదగు బుద్ధిమోహమా. ౩౯౪ 545

సీ. బుద్ధిమోహమయేని ఽ పూనికఁ బెక్కుపర్యాయముల్ గాంచిన ఽ నల్లెనాకుఁ
గనఁబడుచుండుట ఽ గా దది; యీబాలకునకు స్వభావమై ఽ మనసుచేత
నూహింపరానిదై ఽ యొప్పెడునాత్మయోగం బగునంచు నిక్కరణినెంచి;
చేతోమనస్సులచేఁ గర్మవాక్కులఁచేత వితర్కింప ఽ నేతఱిఁ దగ

తే. కలరు నీవిశ్వమే పరమాత్మ దైన
యాయధిష్ఠానతను నే మహాత్ము సాధ
నత్వమున దేనిమూలంబు ఽ నగు జనించు
నాదురూహామహాపద ఽ మాశ్రయింతు. ౪౧ 546

క. అన్నిటి కాధారంబై, యున్నపరాత్పరున కెలమి నొగి మ్రొక్కుదు నం
చెన్నుచు మఱియును భక్త్యు, త్పన్నజ్ఞానమున నిట్లు తలఁచెన్ సతియున్. ౫౪౭ 547

ఉ. ఈతఁడు నాకు భర్తయగు నీతఁడు నాకుఁ గుమారుఁడౌను నీ
ప్రేఁతలు గోపగోధనము వింతగ నాయవి గోకులేశుఁడై
ఖ్యాతినిగాంచు నందుని సమస్తమహాత్తరవస్తురాజికే
నే తగఁ గావఁగాఁ దగిన యీశ్వరి నన్న కుబుద్ధి యీజనిన్. ౫౪౮ 548

క. ఎవ్వానిమాయవలనన్, నివ్వటిలెన్ నాకు నట్టి నిఖలేశుఁడె ది
క్కె విధిఁ జూచిన నని మది, నివ్విధమునఁ దనదుతత్త్వ మెఱిఁగిన తల్లిన్. ౫౪౯

ఉ. కాంచి జగద్విభుండు హరి క్రమ్మఱ నందునిసుందరాంగిపై
నంచితరీతిఁ బుత్త్రుఁడను నట్టిప్రమోదము నొందఁజేయఁగా
నెంచియె వైష్ణవం బన నహీనమహత్త్వపు గల్గుమాయఁ గు
ప్పించెను దాన నాసుదతి ప్రీతిపరీవృతచిత్తపద్మ యై. ౫౫౦ 550

చ. స్మృతి యెటులో చనంగఁ దనచిన్నికుమారకు నంకపాళి స
మ్మతిఁ గొని చేర్చి స్నేహము క్రమంబున వృద్ధినిబొంద దాన నా
వృత మగుచున్న స్వాంతమున వింతఁగఁ దోఁచెను బూర్వరీతి నో
క్షితిపతిచంద్రమా! శ్రుతులచేఁ బురుహూతముఖస్వరూపతన్. ౫౫౧ 551

సీ. ఉపనిషత్తులచేత నురుతరంబగుబ్రహ్మ మనియు సాంఖ్యులచేత ఘనతముఁడగు
పురుషుం డటంచును బరమాత్మ యని యోగితతిచేత సాత్త్వికవితతిచేత
భగవంతుఁ డనియు సంభావింపఁబడు మహత్త్వముగల్గు శ్రీకృష్ణుఁ బరమపురుషుఁ
దనయాత్మజునిగాఁగఁ దలపోసె; నన విని యభిమన్యుపుత్త్రుఁ డిట్లనియె బ్రాహ్మ

తే. ణోత్తమా! యిట్టిదైన మహోదయ మగు
శ్రేయమును బొంద నందుండు చేసె నెట్టి
యుత్తమం బగుకృత్యంబు నువిదమిన్న
యయి మహాదృష్టమునఁ దగు నయ్యశోద. ౫౫౨ 552

క. చనుపా లొసఁగుచు హరినిం, దనయా యని ప్రీతిఁ బిల్వఁ దగుసత్పుణ్యం
బును దేనిఁ జేసె నాకృష్ణుని బాల్యవిచేష్టితములు శుభరూపంబుల్. ౫౫౩

క. కలికల్మషహరములు నై, వెలసెడు నవ్వాని సత్కవిప్రవరులు ని
ర్మలరీతిఁ బాడుచుందురు, తలమే వానిన్ వచింప ధాతకు నైనన్. ౫౫౪ 554

తే. అట్టి శ్రీహరిచేష్టల నఖిలకష్టములను గని కన్నతల్లితండ్రులు గనంగ
నేరకుండి రదేటికి వీరు గాంచఁ, జాలి రదియేల తెలుపుమా సన్మునీంద్ర! ౫౫౫

## నందయశోదలపూర్వజన్మవృత్తాంతము.

మ. అని ప్రశ్నించిన భూమిపాలుఁ గని యాహా ప్రశ్న మిట్లుండునే
యని యాత్మం దలపోసి రాజ! వినుమా యావార్తలం దెల్పెదన్
మును ద్రోణాఖ్యవసూత్తముండు ధర నాఁ బొల్పారు సత్పత్నితో
మన ముప్పొంగఁ జరించుచుండ విధి సమ్మానంబునన్ వానితోన్. ౪౮ 556

క. గోరక్షణము నొనర్పఁగ, ధారణి జన్మింపు మీవు దారయుతిని జే
కూరును ధాత్రికి నభిమత, మీరీతిగ నీవు పుట్టి యింక ననుటయున్. ౪౮ 557

*క. పరమేష్ఠి కనియె ద్రోణుఁడు, సరసిజభవ మనుజలోకసంభవ మగుడున్
బరముండు మహాదేవుఁడు, హరి విశ్వేశ్వరుఁడు మాకు ననుకూలుఁడుగాన్.

క. ఆతని సురుచిరపాదా,బ్జాతంబులయందు మాకు భక్తి గుదుర నీ
వే తగ ననుగ్రహింపుము, శ్రీతరుణీనాథుకరుణఁ జెందినమాత్రన్. ౪౯ 559

క. భవసాగరమును దాఁటుదు, మవితథముగ ననిన బ్రహ్మ యట్లయగుఁ బో
మ్ము వసుధఁ బుట్టంగా ననె, సువిమల విజ్ఞానవిత్తశోభితుఁ డతఁడే. ౪౯ 560

క. అతులయశంబునఁ బొల్చుచు, క్షితి గోకులమందు భవము చెందెను నందుం
డతఁడే సుమ్ము యశోదయు, నతనికి దారయగు ధరఁగ నరయుము రాజా! ౫౦

సీ. ఆకారణంబున నాదంపతులకును భగవంతుఁ డైనశ్రీపంకజాక్షు
నందుఁ బుత్త్రుం డగునాకృపావార్ధియం దతిశయప్రేమరూపాభిరామ
మైనభక్తియు గోపికానికరంబందు గోపకులందును గూర్మియుఁ దగఁ
యుండెను; బ్రభులలో నుత్తమోత్తముఁడగు శ్రీకృష్ణుఁ డా బ్రహ్మ చెప్పినట్టి

తే. పలుకు సత్యంబుచేయ గోకులమునందు
రామునింగూడి పుత్త్రుఁ డై రహి జనించి
యందె నివసించుచున్ దనయద్భుతావ
హములయిన కేళులన్ బ్రీతి నందఁ జేయు. ౫౨ 562



## తొమ్మిదవ యధ్యాయము.

### ఉలూఖలబంధనము.

క. అనిపలికి యోగివర్యుం, డనూనహరిచిత్రచరిత మవ్వలిదానిన్
వినిపించె నిట్టులని యొ,క్కనాఁడు శ్రీకృష్ణజనని కడు ముదమలరన్. ౪ 563

క. తన యింటిదాసికల నే, పనులం దెవ్వరిని నునుపక భావ్యమె యట్లే
యునిచెను దధిమంథనమును,పనిఁ దానే చేయఁబూని పంతం బలరన్. ౧ 564

చ. హరి పగుబాలలీలల మహామతు లేర్చి రచించినట్టిసుం

* 'జాతయోర్నౌ మహాదేవే భువి విశ్వేశ్వరే హరౌ' అని మూ.

దరతరగేయపంక్తులను । దాను దలంచుచుఁ బాడుచున్ మనో
హరగళనాద మొప్ప దధి । నల్లనఁ ద్రచ్చుచు నుండె; నప్పు డా
తరుణియు భ్రూవిలాసములఁ । దద్దయు నొప్పుచునుండెఁ జూడఁగన్. ౧౪ 56

సీ. పృథుకటితటముపై । నెసఁగుదుకూలవస్త్రము దానిపైని సూత్రంబు జక్క
బిగియించి పుత్రుపైఁ । దగుస్నేహమునఁ జేఁపియున్నవక్షోరుహాయుగ్మమించు
కంత కంపింపఁగా । నరుదగుకరకంకణములును గర్ణకుండలయుగంబు
గవ్వపుఁద్రాడు నాకర్షించుచుండుటఁ దళతళలాడుచుఁ । గలనినాద

తే. ముల నొనర్చుచుఁ గదలంగ । మోముదమ్మి
యలసటఁ జెమర్పఁ గొప్పునం । దలరులలిత
మాలతీకుసుమంబులు । రాలుచుండ
దధిని మథియించుచుండె । నత్తరుణమందు. ౩ 566

ఉ. ఆసమయంబునన్ బెటఁగు । నల్లనఁ జిల్కుచునుండు తల్లినిన్
డాసి పయస్సుగ్రోలఁగఁ గడంగి యశోదకుఁ బ్రీతిఁబుట్టఁగాఁ
జేసెడునూహఁ గవ్వమును । జేత గ్రహించుచు నడ్డగించె ని
ట్లాసుతుఁ డడ్డగించినది । *హర్షము గల్గఁగఁజేసె నామెకున్. ౩౪ 567

ఉ. మోమున సుస్మితం బొలయ । ముగ్ధయుస్నేహపరిస్నుతస్తనం
బామెయి రచ్చచేయు సుతు । నంకమునన్ గదియించి 'నాయనా!
నోములపంట వీవగు దనుంగుఁగుమారక! యంచు నెంతయున్.
గోమునఁ బల్కుచున్ గనుచుఁ । గుడ్పెను; ద్రాగుచునుండెఁ గృష్ణుఁడున్. ౮౪

క. ఆలోఁ బ్రొయ్యిపయిన్ గల, పాలు తటాలునను బొంగఁ । బరికించి యశో
దాలలనామణి తృప్తిగఁ, బాలుం ద్రావనినుమారు । వడి డించి చనెన్. ౫ 569

ఉ. దానికిఁ గోప మూని హరి తద్దయు నెఱ్ఱని దైనయోష్ఠమున్
దానయి కంపమొంద నునుదంతము లొయ్యన దానిమీఁదఁ బై
పై నటియింపఁగా నయనపద్మయుగంబు మృషాశ్రుబిందుసం
తానముచేత నూతనవిధంబునఁ గన్పడఁ జూచి యంతటన్. ౫౪ 570

చ. ఉపలము సన్నెకల్లుకడ । నొప్పుగ నుండఁగఁ దెచ్చి దానిచే
నపుడు మథించుచున్ జనని । యం దిడిపోయినయట్టి భాండమ
ట్టె పగులఁగొట్టి యీసుగొని । యేత్తైఱ లోపలి యింటఁ జొచ్చి యే
మిపలుక కందుఁ గన్పెడెడు । మేలగువెన్నను మెక్కె నొక్కఁడే. ౬ 571

తే. ఆయశోదయు క్షీరంబు । లట్టెగట్టి, పడఁగఁ గాఁగినవెనుక దింపదగుపద్ధ
తిని నెఱుంగునుగాన దింపెను;జవమునఁ,దనయు కడకేగు దెంచియాతావునందు.

---

* 'దధిమంథానంస్య షేధత్రీ )తిమావహాన్' అని మూ.

చ. చిలుకుచునున్న యాకడవ ˆ చిందఱవందఱ లై కనంబడన్
గలయఁగఁ గాంచి *స్వాత్మజుని ˆ కార్య మిదౌ ననియెంచి నవ్వి నా
స్థలమున నాతఁ డుండమిని ˆ జయ్యన లోపలి కేగి చూడ నం
దులనొకచోట నొంటరిగఁ ˆ దోరపు వేడుక సందడింపఁగన్. ౭ 573

తే. త్రిప్పివైచినఱోటిపైఁ ˆ దెంపుమీఱ, నెక్కి నిలుచుండి యుట్టిపై ˆ నక్కజముగ
నునిచియుండిన నవనీతమును యథేష్టముగను దాఁ దినిశిష్టాంశమును గ్రహించి.

క. వానరమునకుం బెట్టుచుఁ, దా నొనరించెడు నకార్యతత్త్వ మెఱిఁగి తన్
గానఁగ నెవరే వత్తురొ, యీనిమిషంబందు ననుచు ˆ నెంచుచు శంకన్. ౮ 575

క. తనచూపులు చంచలతం, గనుచుండఁగ నున్నసుతుని ˆ గన్గొని మెలమె
ల్లన సెలగోలం గైకొని, చని వానిపిఱుంద నిల్చె ˆ శాస్త్రి యొనరుపన్. ౮ 576

చ. తనదుపిఱుందఁ గోలఁగొని ˆ తన్నుఁ గనుంగొను చున్నతల్లినిం
గనుఁగొని భీతిచెందినటు ˆ గన్పడుచున్ వెస నయ్యులూఖలం
బును విడి పాఱిపోవుటయు ˆ బోటులమేటియనంగ నొప్పునం
దునిసతి సూనుఁ బట్టుకొనఁ ˆ దోడనె పర్విడె ముగ్ధ గావునన్. ౮౪ 577

క. ఏకాగ్రభావమునను ద, దాకారతఁ గాంచి యున్నదగుయోగిజన
ప్రాకటచిత్తమునకుఁ జొరఁ, గాక చెలంగెడుమహాత్ముఁ ˆ గంజాక్షు హరిన్. ౯

ఆ. అనుసరింపఁబోయె ˆ నాయశోదయు; నంతఁ, గృష్ణు ననుసరింప ˆ నేగుచుండి
గమనవేగమును నికామచలత్పృథు, శ్రోణిభరము తగ్గుఁజొప్పుఁ గూర్ప. ౯౪

క. కలదనియును లేదనియును, బలుకంగాఁ దగిననడుము ˆ భాసిల్లఁగఁ జే
శలవేణి గతిజవమున వి, కలమగుటయు నందువెలయు ˆ క్రమ్రకుసుమముల్. ౧౦

క. తనయడుగుల వెంబడిఁ గ్రిం, దను రాలుచు ననుసరింపఁ ˆ దనసూనుని చెం
తను జేరి యొందుఁ బోయెద, వనుచుం బట్టుకొనె నిట్టు ˆ లంబ యొయిదినన్. ౧౦

ఉ. తా నటఁ దప్పుచేసి కనుదమ్ములఁ జెల్వగు నట్టికాటుకన్
జే నలుదట్లఁ గ్రమ్ముకొనఁ ˆ జేయఁగ నుల్ముచు సాధ్వసంబునన్
మానస మార్తినొందె ననుమాడ్కిని దృష్టులు కల్కఁబాఱ నా
మానిని యెట్లువచ్చి యనుమానమునం దనుఁ బట్టి కొట్టునో. ౧౦౪ 582

చ. అనుచును జూపు లెల్లదిశలందును బర్విడఁజేయుచున్ దనుం
గనుఁగొని యేడ్చుచున్న యలగాదిలిపుత్త్రుని బట్టుకొంచు భీ
తిని గలుగంగఁజేయుటకుఁ ˆ దీవ్రవచస్సులఁ బల్కుచున్ దనూ
జుని సెలగోలఁ గొట్టదగుచొప్పును స్నేహముపొంగ మానుచున్. ౧౧ 583

* "భగ్నంవిలోక్య స్వసుతస్యకర్మ తజ్జహాసతంచాపి న తత్రపశ్యతీ" అని మూ.

[1]చ. కొడు కతిభీతి నొందె సెలగోలను గాంచినయంత నంచు నా
పడఁతి బిఱాన దండమును । బాఱఁగవైచి ప్రియాత్మజన్మునం
దడరెడు వత్సలత్వమున । నాతని డిట్టిమహత్త్వ మంచు నే
యెడల నదెవ్వరేఁ దలఁప । నే దగనట్టి దటం చెఱుంగకే. ౧౧౪ 584

ఆ. మూఢురాలు గాన । మూర్ఖుఁడౌ వీనిని, ద్రాటఁ గట్టివేయఁ । దగు నటంచుఁ
దలఁచెఁ; బాండుతనయ।తనయతనూజ! యె, వ్వనికి వెలియు లోను।గనఁగ లేదొ.

సీ. మొదలును దుదయు నకనఁ దనకుఁ గానక
జగదాదియై తానె । జగమునకును
దుదియునై వెలియు లోను దగంగఁ దానయై
యెవఁడుండు? జగమెల్ల । నెవఁడు తానె
యైయుండు నెవ్వఁ డాయవ్యక్తరూపుని
నయ్యధోక్షజుఁ దనయాత్మజునిగ
భావించి కృష్ణుండు । ప్రాకృతబాలుండె
యగు నంచుఁ దలపోసి । యందునున్న

తే. త్రాడు గైకొని ఱోటిచెంతకును దోడు
కొనుచుఁ జని యందు బంధించెఁ । దనకుమారుఁ
డాగసం బొనరించె న । ట్లౌట బంధ
నమె యగుంబాచితం బని । నాతి మిన్న. ౧౮ 586

క. తలపోసి కొడుకు నడుమున, కలత్రాటిని జుట్టఁ బూన । నదియును రెండం
గుళములు తక్కువ కాఁగా, వెలఁదియు వేఱొక్కరశ్మి।వెసఁ గొనివచ్చెన్. ౧౮౪

క. అదియును రెండంగుళములు, కొదువపడన్ మరల నొకటిఁగొని వచ్చి జవం
బొదవఁగ దానిం గూర్పఁగ, నదియును రెండంగుళంబు । లల్పం బగుడున్. ౧౯౪

తే. మఱియు నొకదారమును దెచ్చి । మూన కదుక
నదియు నట్టైన వేఱొక్కఁ । డతివ తెచ్చె
నిట్లు గృహమునఁ గల్గిన । యెల్లత్రాళ్లు
లట్టులే యైన నర్భకుఁ । గట్టలేక. ౧౬౪ 589

[2]చ. తనపని గాంచి గోపికలు । తద్దయు నవ్వుచునుండఁ దానునుం
బనివడి నవ్వి విస్మయము । పర్వఁగ నూరకయుండె; నివ్విధిన్
జననియు స్విన్నగాత్రయయి । స్రస్తశిరోరుహబంధనప్రసూ
ననికరయౌచు శ్రాంతయయి।నం గృప వర్ధిలుచుండ నంతటన్. ౧౭ 590

1 "ఇయేష కిలతంబద్ధుం దామ్నా౽ తద్వీర్యకోవిదా" అని మూ. 2 "గోపీనాం సుస్మయంతీనాం స్మయంతీ విస్మితాభవత్" అని మూ.

తే. తానె స్వీయబంధంబునఁ దగులుకొనియె
దాననే త్రాడుసరిపడఁ దన్వి గట్టఁ
జాలె, నీశ్వరమైనట్టి జగము తనకు
వశముకాఁగ స్వతంత్రుఁడై వఱలు హరియు. ౧౮½ 591

క. తనభృత్యుల కెల్లను దా, ననయము లోఁబడు నటన్న యార్యజనోక్తిం
గనఁబఱచెను బ్రత్యక్షమ్మునఁ ద్రాటికి లోఁబడుటను భూపవతంసా! ౧౯ 592

*మ. తనయుండైన విరించియేని తనలోఁ దానౌ మహాదేవుఁడేఁ
దనయంగంబున నున్నయట్టిరమయేఁ దాదృక్ప్రసాదంబు నొం
దను సత్పాత్రత గాంచరైరి; వ్రజనాథస్త్రీవతంసంబు ము
క్తి నొసంగందగు చక్రినుండి యపుడేదేనిం దమింబొందెనో. ౨౦ 593

తే. ఆత్మవిజ్ఞానసంపన్ను లగుచు భక్తు, లైన జ్ఞానులకున్ సుఖ మాపరేశుఁ
డాదరంబున నిచ్చెడు నట్లొరులకు, గోపికాసుతుఁ డొసఁగఁడు కోర్కు లెపుడు.

క. కనుకనె భక్తిధనంబునఁ, దనుఁ బూజించెడు సుధీవతంసములకు మే
లొనఁగూర్చు సులభమార్గం,బునఁ దనుఁ బొందంగఁ జేయు భూజానిమణీ! ౨౧

క. సుతునిన్ ఱోటికి బంధిం,చితిఁ గదయని యయ్యశోద శీఘ్రముగ గృహో
చితకార్యముల నొనర్పఁగ, మతినిడి యందుండె లోకమాన్యుం డంతన్. ౨౧½

ఆ. తాను లోకజాల తత్త్వజ్ఞుఁడును బ్రభుం,డునుగఁ జెలఁగుచుండ మనసునందుఁ
దలఁచె గుహ్యకు లగుధనదాత్మజులు మద్ది, చెట్లుగాఁగ నందుఁ జేరియుంట.

క. ఒకఁ డగు నలకూబరుఁ డిం, కొకఁడు మణిగ్రీవుఁ డగు మహోన్నతమద మూ
ని కడంగి నారదుఁడు ము,న్నిఁక నర్జునములుగ నుండనే యగు ననుచున్. ౨౨½

క. శాపం బిచ్చినకతమున, శ్రీపాలకులయ్యు ఖ్యాతిఁ జెందియు నటు దు
ర్వ్యాపారకలితులై ముని, శాపంబున నుంటఁ జూచెఁ జక్రధరుండున్. ౨౩

---

పదియవ యధ్యాయము.

నలకూబరమణిగ్రీవులశాపమోక్షణము.

చ. అని శుకయోగిపల్కు విని యర్జునపౌత్రుఁడు యోగివర్య! యా
ధనదతనూజు లేమిటికి దారుణశాపము నొందిరెట్టి యే
వను గలిగించుకర్మ మిది బా గనుచుం బొనరింప దేవతా
ముని యగునారదుండు క్రుధఁ బూనెను? నాకు నెఱుంగఁ జెప్పుమా. ౧ 600

మ. అని ప్రశ్నింపఁగ యోగిచంద్రుఁ డను నాయతుల్ కుబేరాత్మజుల్

---

* "నేమం విరించో నభవో న శ్రీరప్యంగసంభవా, ప్రసాదం లేభిరే గోపీ యత్తత్ప్రాపవిముక్తిదాత్" అని మూ. "విరించః పుత్రోపి. భవస్స్వాత్మాపి" అని శ్రీధరాచార్యులు.

మును శంభుం గొలువంగఁ గోర్కితగ శంభుం డల్లె కావింపుఁడీ
యనఁగా శంకరువెంటనుండి యదియత్యంతంబు గర్వంబుగా
ర్వ నటన్ నిల్వక వెండికొండదరి నారమ్యంపుఁబూఁదోఁటయున్. ౧౭ 601

*క. అమరతరంగిణికి సమీపమునన్ దృశ్యంబుగాఁగ భాసిల నట మ
ద్యము వారుణి యనుదానిని, బ్రమదంబునఁ ద్రావి మత్తు పైకొనుచుండన్.

క. కనులెఱ్ఱవాఱి తిరుగఁగ, వనజాక్షులుకూడఁ బాటఁబాడుచు నుండన్
వన మది పుష్పోత్కరములఁ, గనుపండువు చేయఁ దిరుగఁగాఁ జొచ్చి రొగిన్. 3

చ. సరసిజషండమండితము సౌరధునీవర మౌట వాని యం
తరమునఁ జొచ్చి కామినులు త మ్మొగిఁ గూడియుండఁగా మనో
హరగతిచేఁ గరేణునివహంబులఁ గూడిన యేన్గులట్లు కా
వరమునఁ గేళిసల్పిరి ప్రవాహము నూత్నముదంబుఁ గూర్పఁగన్. ౪ 604

మ. కురువంశోత్తమ! దైవయోగమున నాకూళల్ వియన్నిమ్నగాం
తరమం దాగతిఁ గేళిసల్పుతఱి నుద్దామప్రభావాఢ్యుఁ డా
సురమానీంద్రుఁడు నారదుండు చనుచుం జూచెన్ దగన్ వారలన్
బరికించెన్ సురఁ ద్రావి మత్తులగుటన్ భవ్యప్రభావంబునన్. ౫ 605

చ. మునివరు నారదున్ గనుచు ముద్దియ లప్డు వివస్త్రలౌట ల
జ్జను గని యమ్మునీశ్వరుఁడు శాపము పెట్టు నటన్న భీతి వే
చని వలువల్ ధరింప సహజన్ములు వారు వివస్త్రులౌచు నుం
డినఁ గని వీరు వారుణిని నెమ్మిని గ్రోలి తదున్మదంబునన్. ౬ 606

క. కనుగానక శ్రీమద మొ, య్యన దానికిఁ దోడుగాఁగ నంధులె యయి రే
యని లోనెంచుచు వారల, ననుగ్రహింపంగఁ బూని యది సాగింపన్. ౬౭

తే. శాప మిచ్చెద నం చెంచి యాపగిదిని
నొక్కగీతము పాడె నాయుత్తమముని
శాప మయ్యది వారల స్వాంతమందు
నలముకొన్న గర్వంబునే యణఁచుఁజుమ్ము. ౮ 608

సీ. విషయంబులఁ గడు సేవించు పూరుషునకు బుద్ధివిభ్రంశముఁ బూనిచేయఁ
గను రజోగుణమునకంటె వేఱొక్కటి కలదె; రజోగుణం బలముకొనిన
శ్రీమదం బుదయించు శ్రీగర్వమునఁ గన్నుగానకుండుటయు సమ్మాననీయ
కులజన్మగర్వంబు లలనారతియు ద్యూతపానముల్ మొదలైనపాడువాఁడు

తే. కలుసు దోడనె వానికిఁ గలిగియుండు
రాజసులు నశ్వరమగు గాత్రమున కెపుడు

* "వారుణీం మదిరాం పీత్వా" అని మూలము.

జరయు మరణము లేదని స్వాంతమందుఁ
దలఁచుచుం గృపమాని మూఢులయి చెలఁగి. ౮½ 609

క. అవశేంద్రియులై స్వేచ్ఛఁ బ,శువులఁ [1]హింసింత్రు మఱియు క్షోణిస్థలిఁ గీ
ర్తివఱలు నరదేవుం డని, యవనీదేవుం డటంచు నాఖ్యఁదనరఁగన్. ౯ 610

తే. మఱియు స్వర్దేవుఁ డనియు నామముల దేవ
శబ్దపూర్వకములఁ బిల్వఁ జనుశరీర
మిదియుఁ గడపటఁ గ్రిములుగఁ బొదలుఁ గాల్ప
భస్మమగు విష్ఠ యగుశ్వాది భక్షితమయి. ౯½ 611

క. కనఁగా నిట్టిశరీరం,బునకుం గా భూతజాలమునకుఁ ద్రోహం
బును జేయుటచే నరకమె, యనివార్యం బగుచుఁ గలుగు నట్టినిరయమున్. ౧౦

క. కలిగించు తనువుకోసం, బిల భూతద్రోహ మెన్న కే చేసెదు చం
చలచిత్తునకుఁ స్వార్థము, కలుగం గలదే రవంతగాని తలంపన్. ౧౦½ 613

[2]మ. తనువన్నఁ మృతినొందకున్నఁ బితకో తన్గన్న యాతల్లికో
తన కన్నంబిడు దాతకో మఱియు మాతంగన్న యాతాతకో
ధనమెంతో యిడి కొన్న యాతనికొ యీధాత్రిఁ బలాఢ్యుండుగాఁ
గననౌ వానికొ స్వత్వమౌ మృతిగనంగా నగ్నికో కుక్కకో. ౧౧ 614

క. కావున బ్రదికినఁ జచ్చిన, నీవపు వెవ్వరికొ స్వత్వమే యగుఁ దనకే
యౌవెరవు లేదదెప్పుడు, భావమ్మున దీనివిధము పరికించినచోన్. ౧౧ 615

సీ. అవ్యక్తమునఁ బుట్టి యందే లయించుచు నున్న యీదేహము సన్నుతమగు
[3]నాత్మగాఁగఁ దలంచి యరయక పశువులఁ జంపువారలు మూర్ఖజనులు గాక
మఱి యెవ్వ రగుదురు మహితసంపన్మదమున నంధుఁడైన దుర్జనున కెన్నఁ
గన్నులు సుంతయుఁ గానరాకుండును దారిద్ర్య మనునదె తగినయంజ

తే. నమ్ము దానికి నగు బీదనరుఁడు తనకు, సాటిగాఁ దక్కుప్రాణులఁ జక్కఁ జూచుఁ
గాన వానికి నపకృతిఁ గల్గఁజేయ, నూహసేయక యూరకే యుండు నతఁడు.

చ. చరణమునందు ముల్లు దిగఁ జాలఁ దపించినవాఁడు స్వాంతమం
దొరులకు ముల్లుగ్రుచ్చుకొన నొక్కట మోమున మ్లానతాదులం
బరిగణనంబుచేసి యెటువంటి మహత్తరపీడ గల్గెనో
యరసి య దట్లుగల్గఁ దగ దంచును స్వానుభవంబుచేఁ గనున్. ౧౮ 617

1 "హన్యంతే పశవో యత్ర నిర్దయై రజితాత్మభిః, దేవసంజ్ఞితమప్యంతే" అని మూ. "నర దేవ భూదేవసంజ్ఞితమపి." అని శ్రీధరాచార్యులు. 2 "దేహః కిమన్నదాతుస్స్వం నిషేక్తుర్మాతురేవచ, మాతుః పితుర్వాబలినః క్రేతురగ్నేశ్శునోఽపి వా" అని మూ. 3 "కోవిద్వానాత్మసాత్కృత్వా హంతి జంతూ, నృతేఽసతః" అని మూ.

తే. తానుగంటకపీడ యొకొత్తతె నదెట్టి
దనియెఱుంగనివాఁ డితరులనకుఁ గలుగు
దాని బాధ నెఱుంగఁగఁ ॥ దగఁడు కాదె;
యట్లె పేదఱికపుదుఃఖ ॥ మెఱుఁగు నతఁడు. ౬౧౮ 618

క. ధనహీనుఁ డహంభావం, బనఁజను స్తంభమును బాసి ॥ యన్వయవిద్యా
దినిఖిలమదముల నొందక, తనయత్నము లేక శ్రమము ॥ తనకుం గలుగన్. ౬౧౯

చ. తనువును వంచి కష్టపడుఁ ॥ దథ్యమ యయ్యది యుత్తమం బనం
జనుతప మౌను వాని; కదె ॥ చక్కఁగ ముక్తికిసాధనంబుగాఁ
గనుదగు; నన్న కాంక్షియయి ॥ కాయ మదే లభియింపకుంటఁ జి
క్కినఁ గడుసోలుచుండఁగ నరించుచుఁ డెంచఁడు హింసచేయఁగన్. ౬౨౦ 620

[1]ఆ. వానియింద్రియములు ॥ వరుసఁగ నుచితమౌ
వర్తనమున నుండుఁ ॥ బరుల కార్తిఁ
గూర్ప నవియు నుంత ॥ కోరవు సమదర్శ
నులగు సాధువర్య ॥ లెలమిమీఱ. ౬౨౧ 621

క. ఆనిస్వజనులతోడనె, మానసమ్మునఁ బొత్తుచేయ ॥ మన్నింతురు; వాఁ
డానినతృష్ణయు సద్యుతి,తో నిలువఁగలేక పోవఁ ॥ దోడనె శుచియౌ. ౬౨౨

క. ఆరయ సజ్జనులకునున్, భూరిధనేశ్వరులె ప్రియులు ॥ పో నిర్ధనులే
కారు హితులంచు నడుగం, గా రాదది యెట్టులన్న ॥ క్ష్మాస్థలమందున్. ౬౨౩ 623

క. పరమేశుఁడౌ ముకుందుని, చరణంబుల సేవఁగోరి ॥ సర్వజనుల సు
స్థిరసమదృష్టిని జూచుచుఁ, బరహితమును గోరుసాధు॥వర్యులు సతమున్. ౬౨౪

[2]క. ధనముల మదిఁగోర రసజ్జనులకె యవి యాశ్రయములు ॥ సర్వానర్థా
ళిని గల్గఁజేయునవి యగుఁ, గనుకన్ దుష్టములు దుష్టకాంక్షితములు నౌ. ౬౨౫

తే. అవి యుపేక్షింపఁదగినవే ॥ యగును గాన, వానితోడ సాధువులకుఁ ॥ బని యదేమి
కలదు ధనములనే కోరు ॥ ఖలులమాట, యిచటఁ జేర్కొనఁగా నాకు ॥ నేమిఫల

మ. అనుచుం గీతముపాడి వారుణియనన్ ॥ హాలాహ్వందు నమ్మద్యముం [ము? ౬౨౬
దనువెల్లం జెడఁ ద్రావి మత్తులయి యుద్దామశ్రీమదాంధ్యంబునన్
గనులం గానక సంయతేంద్రియులుగాఁ ॥ గాఁ జాల కిందీవరా
క్షిని కాయంబున కట్టె లోనగుచు స్వక్షేమంబుఁ బోఁదోలుచున్. ౬౨౭ 627

క. జలకేళిమగ్ను లగువీరల యజ్ఞానజమదంబు ॥ రయమున నేసుం
దొలఁగించెద; వీరిద్వరు, పులస్త్యపౌత్రునకు నెన్నఁ ॥ బుత్త్రులు నయ్యున్. ౬౨౮

1 "దరిద్రస్యైవయుజ్యంతే సాధవస్సమదర్శినః" అని మూ. 2 "సద్భిఃక్షేపోఽర్హితం తర్హం తతఆరాద్విశుద్ధ్యతి" అని మూలము.

తే. దిక్పతికుమారుల మని మోదించి తమను, గప్పఁగాఁ గన్ను గానక కాంతలెల్లఁ
దమ్ముఁగూడ వివస్త్రలై తగియు దాని, నెఱుఁగకున్నారు దుర్మదు లిప్పటికిని.

క. కనుక నే స్థావరజన్మము, గనుటకుఁ దగియున్నవారు కడఁగి మరల ని
ట్లనుపమముదమున నంధతఁ, గనకుందురు వృక్షజన్మకలితులె యైనన్. ౨౦ 630

క. అని శాపంబిడి నారదుఁ, డనుకంపన్ మఱియుఁ బలికె నవనిన్ భూరు
డ్జని గనియు మత్ప్రసాదం,బునఁ బూర్వస్మృతియుఁ గల్గుఁ బో మఱి వీరల్. ౨౧

ఆ. నాయనుగ్రహమునఁ బాయక దివ్యవ,త్సరశతంబు దాఁటఁ జక్రధారి
యైనవాసుదేవు నమలసాన్నిధ్యంబుఁ, బడయువారు స్వర్గవాసము మఱి. ౨౨

క. పరమేశునందు భక్తియు, స్థిరముగ వీరలకు మరలఁ జేకురు నని ని
ర్జరమౌని పలికి చనియెను, వర నారాయణమునీంద్రవాసముఁ గానన్. ౨౩

తే. చనియె నంతఁ గుబేరుని తనయు లర్జు
నతరువులుగ జనించిరి నారదముని
వరుఁడు భాగవతులయందుఁ బరముఁడౌట
నతనివాక్కు ఫలింపఁ జేయంగ నెంచి. ౨౪ 634

క. హరియు నులూఖలమును నా, తరువుల దగ్గఱకుఁ జేరఁ దలఁచి యుపగత
త్వరుఁడై పోయె నదెట్లో, పరికించను వాని నందు పట్టి యచటునన్. ౨౫

క. సురముని నా కెన్నఁగఁ బ్రియ,తరుఁ డీధనదాత్మభవులు తరువులుగాఁ బు
ట్టిరి వీనిఁ గూల్చి గీతం,బరుదుగఁ బాడినమునీంద్రు నాశయ మొప్పన్. ౨౬

చ. అని మదినెంచి నారదమహామునిగీతము సార్థకంబుచే
యను దలపోసి మద్దులకు నంతరమందుఁ జొరంగఁ బోయె; నం
త నచటఁ గృష్ణమూర్తి చొరఁ దద్యుగళంబున కడ్డమౌచు న
త్తరుణమునం దులూఖలము తాఁ బడియెన్ హరియాశయంబునన్. ౨౭ 637

సీ. బాలకృష్ణుం డంత అోలడ్డముగఁబడ బలిమిమై లాగంగ నిలను నలము
కొనియున్నయాచెట్లు మునిశాపము చనంగఁగూఁకటి వేళ్లతోఁ గూడఁ బెకలి
పరమపూరుషునిదౌ నిరుపమవిక్రమమున స్కంధములు శాఖలును బ్రవాళ
ములును గంపింపఁగ భూరిరవంబొప్పఁ బడియెఁ దటాలున వసుధమీఁద

తే. వానినుండియె హుతవహుం డూని నైజ
రూపమున వచ్చెనో యన రూపములను
దేజరిలు సిద్ధపురుషులు తీక్ష్ణములగు
తనుమరీచుల దిక్తతి తగ వెలుంగ. ౨౮ 638

క. చను దెంచి రాజసం బనఁ, జనుతొల్లిటి మదమువదలి సకలజగన్నా
థుని గృష్ణుని గని కేల్మో,డ్పును వందనమాచరించి పొగడిరి భక్తిన్. ౨౯ 639

## నలకూబరమణిగ్రీవులు శ్రీకృష్ణుని వినుతించుట.

సీ. కృష్ణకృష్ణా! నీవు కేవలగోపాలకుఁడవుగా నూహింపఁ బడనిమహిమ
మున నొప్పుయోగివి ఘనజగత్కారణభూతుఁడ వాద్యుఁడవు నగు పరమ
పురుషుఁడ వగుదువు పోల నాలోచింప స్థూలరూపంబును సూక్ష్మరూప
మునగు నీవిశ్వము తనరునీరూప మంచును బ్రహ్మవేత్తలు మనములందుఁ
తే. దెలియుదురు; నీ వొకండవె యిలఁ జెలంగు
భూతరాసుల వగుదేహములకుఁ బ్రాణ
ములకు మఱియు నహంకారమునకు నింద్రి
యముల కీశ్వరుఁడవు సర్వ మగుదు వీవు. ౨౯ 640

క. వ్యయ మనలేకయె వ్యాపక,మయి సర్వనియామకంబు నగు కాలం బీ
వె యగుదువు మహత్తత్త్వము,నయి యొప్పుదు నీవె పంకజాయతనేత్రా! ౩౦

*సీ. సత్త్వగుణంబు రజస్తమోగుణములు తానయి సూక్ష్మమై తనరు ప్రకృతి
వన నీవె యగుదువు వనజాయతాక్ష సర్వక్షేత్రవికృతుల వఱుఁజేయు
నధ్యక్షపురుషుండ వగుదువు ద్రష్టవు గనుక నీవదృశ్యతను జెలంగు
బుద్ధ్యాదులకు వానిభూరివికారంబు లగునింద్రియాదుల కట్టిప్రకృతి
తే. గుణములకును గ్రాహ్యుం డనఁగూడ నట్టి
మహిమమున నొప్పువాఁడవు మాన్యచరిత!
జగమునుత్పత్తికంటె మున్నుగఁ దనంత
సిద్ధుఁ డవగుచుఁ దగు నిన్నుబద్ధు మహితు. ౩౨ 642

క. ఒరుఁ డెవ్వఁడు గుణసంవృతుఁ, డరయంగా నేర్చు బ్రహ్మ మనుచును సాధూ
త్కారమును గావఁగఁ బుట్టిన, పరమేశుఁడ వనుచు వదలపాతకు లెల్లన్. ౩౪

క. వినుతింతు రట్టిమహిమం,బునఁ దగి వసుదేవపుత్త్రభూతుఁడ వగుచున్
దనయంత గల్గుగుణముల, ననూనమహిమంబు తెలియనట్టులు గాఁగన్. ౩౪

తే. కప్పుకొనియున్న నీకును గరయుగంబు
మోడ్చి వందన మొనరింతుము పరమాత్మ!
దేహరహితుండవయ్యును దేహగణము
నందుఁ దగుల కతుల్యము లగుచు మిగుల. ౩౩ 645

వ. అధికంబులగుచు నున్ననాయాయివిక్రమంబుల బహువిధశరీరంబులయందు వ్యాపించుటంజేసి నీయవతారవిశేషంబు లిట్టివగు నని పరికింప నెఱుంగఁ దగి యుండు కావున నో భగవంతా! జగజ్జాలంబున కుత్పత్తికై వల్యంబులం గావింప

---

* "త్వంమహాన్ ప్రకృతిస్సూక్ష్మా రజస్సత్త్వతమోమయీ, త్వమేవపురుషోఽధ్యక్షః స్సర్వక్షేత్రవికారవిత్" అని మూ.

సర్వకామప్రదాత వగునీ విపుడాత్మాంశంబున నిట్లు లిచ్చట నవతరించితివి పరమ
కల్యాణా! అట్టినీకు నమస్కారము విశ్వమంగళా! నీకు నతులు వాసుదేవు
నకు శాంతునకు యదుపతికి నీకుఁ జేమోడ్పులు. ౩౬ 646

క. అనుపమ మగునానందం,బునఁ బూర్ణుఁడ వైననందపుత్త్రవరా! నీ
యనుచరునకుఁ గింకరులము, కనుకన్ సెలవిమ్ము సతము కరుణ నునుపుమా.

క. నారదమునివర్యునిదౌ, భూరికృపన్ దివ్యరూపమునఁ బొల్చునిమున్
గోరికలు దీఱఁ గాంచితి, మోరమ్యాకార! కృష్ణ యురుగుణనిలయా! ౩౭

సీ. నీరమ్యగుణముల నెమ్మిఁ గీర్తింపఁగ వాణియు నీకథల్ వరుస వినఁగ
శ్రవణమ్ములును బరిచర్య చేయంగను హస్తంబులును ద్వదీయాంఘ్రికమల
యుగళసంస్మరణంబు నొనరింపఁగ మనస్సు సర్వలోకనివాస చక్రి! నీకు
మ్రొక్కంగ మస్తకంబును భవదాత్మలౌ సాధువులం జూడఁ జక్షువులును

తే. స్థిరముగనె నిల్చునట్లుగఁ జేయసమ్మతింపుమాయని యిట్లు నుతించి వార
లంజలింబట్ట భగవంతుఁ డవ్యయుండు, గోకులేశ్వరుఁ డాలించి గుహ్యకులను.

క. తాను నులూఖలబద్ధుం, డైనట్లుండియును హాస మాస్యమునందున్
గానంబడ నిట్లనియెను, మౌనీంద్రుఁడు నారదుండు మత్తుల మిమ్మున్. ౩౯

క. శ్రీనిరతమదముచేఁ గనుఁ, గానక యుండంగ భూరి కరుణాస్వాంతుం
డై నెగడుట భ్రంశముగనఁ, గా నొనరించె నని మున్నె కనుఁగొంటి మదిన్. ౩౯౫

ఆ. అది యనుగ్రహంబె యగుమీకు నెప్పుడు, నాదుపదములను మనంబు నిల్పి
సర్వజంతువులను సమదృష్టిఁ గనుచుండు, వారె సాధువులుగ వర్ణితు లిల. ౪౦౫

క. వారలు ననుఁగని నంతనె, పూరుషులకు నేత్రబంధము రవి పొడువఁగా
నేరీతిఁ బాయు నటుసం,సారమహాబంధములును జనుఁ జూర్ణములై. ౪౧

క. నలకూబర నన్నే ప్రియ,ములుగాఁ దగువానికంటెఁ ముఖ్యతమునిగాఁ
దలఁచుచు మీమీగేహం,బుల కరుగుఁడు నాదుభక్తి పొడమును మీకున్.

క. అది భవబంధన సంతతి, మొదలంట నశింపఁజేయుఁ బొం డని పలుకన్ [యున్.
సదయాత్మకుఁడగు హరినుడి, ముదమున విని చుట్టుఁదిరిగి మ్రొక్కుచు మఱి

క. నతు లొనరిచి యోలికి ర,శ్మితతిన్ బంధింపఁబడిన శ్రీహరిదౌ స
మ్మతిఁగొని యుత్తరదిశకున్, జతనంబునఁ బోయి రెదల సంభ్రమ మలరన్. ౪౩



## పదునొకండవయధ్యాయము.

### ఉలూఖలబంధమోక్షము.

క. అని తెలిపి యోగి మఱియును, జనపతికిం దెల్పె నిట్లు చక్రిచరిత మం
తను నందాదులు తరుయుఁగ, మనూననిస్వాన మొప్ప నవనిం బడఁగాన్. ౫

క. పిడు గిలఁ బడియెనొకో యని, పడిపడిఁ జనుదెంచి యందు § భయదాకృతులం
బడియున్న జంటమద్దుల, నడుమ నులూఖలముఁ ద్రాటసడమునఁ గట్టన్. ౧౫
క. దానిఁ లాగుచు నుండిన, సూనుని గని యవ్వి గూల § సూనుండే యా
నౌ నెన్నఁ గారణం బని, మానసముల నరయలేక § మైకొను భ్రాంతిన్. ౨ 659
క. ఇది యెవ్వనిపనిరైయె యుం,డఁదగుఁ? మద్దు లిటుగూలి § నాశం బయ్యెఁ
గద దీనికారణం బె, య్యదియో యుత్పాత మనుచు § నెంచఁగఁ బోలున్. ౩
క. అని యూహించుచు సాధ్వస,మును గాంచిరి; వానిచెంతఁ § బూనిక నుద్దుల్
గొనియాడు బాలకులు అో,లనినడ్డముగా నమర్చిలీలయుపోలెన్. ౩౫ 661
క. మన యీకృష్ణుఁడె యీద్వం,గను మ్రాకులు పడియె వింతగా దివ్యు లనం
జనుపురుషు లిద్ద అవ్వా,నినుండి వెల్వడిరి మేము § నిల్చి యిచటనే. ౪ 662
క. కనుఁగొంటి మనిరి తద్వా,క్యను బొసఁగని దగుట నమ్మఁగూడ దనుచుఁ గై
కొన రొక్కకొంద అీకృ,ష్ణునికార్య మిదౌనె యనుచుఁ § జోద్యంపడుచున్. ౪౫
ఉ. సందియ మందసాగి రల § సభ్యులలో నొకకొంద అంతటన్
నందుఁడు అోలికెట్లో జతనంబునఁ ద్రాటను బద్ధుఁడైన యా
నందనుఁ గాంచి దానిని ఘనం బగుపూనిక లాగె నంచునా
త్మం దలపోసి మోమున స్మితం బొలయన్ వడి విప్ప దామమున్. ౫౫ 664
ఉ. గోపిక లెల్లఁ దన్నుఁ బురికొల్పుచుఁ జేతులు తట్ట నాడునా
పాపఁ డదొక్కచోటఁ దమిఁ § బాడును వేఱొకచోట ముగ్ధుఁడై
యోపికఁ దారు యంత్రమన § నొయ్యనఁ బై కెగురున్ వ్రజాంగనా
జ్ఞాపరిపాలనాదృతి వశంగతుఁ డైనటు లుండు నొక్కచోన. ౬ 665
సీ. ఒకచోటఁ దన్ను నేమో తెమ్ము బాలకా! యనుచు నాజ్ఞాపింప § నర్భకుండు
కొలుచు పాత్రములఁ బీఁటలఁ బాదుకాళిని నసమర్థుఁ డట్లు తా § నగపడుచును
దెచ్చు నెట్లో; తనముచ్చటలను జూడఁ బ్రియమొందు తనవారలయెదుట హరి
నిలుచుండి చేతుల § నింగికిఁ జూఁపుచు నాడును; భగవంతుఁ § డైన కృష్ణుఁ
తే. డాత్మతత్త్వమెఱింగిన § యట్టివారి, కెల్లఁ దనభృత్యవశ్యత § నెఱుకపఱచు
చును సనాతనుఁ డిట్టిచొప్పున స్వకీయ, చేష్టితంబుల నామందఁ § జిత్రరీతి. ౦౫
క. కనఁబఱచుచు వారల నెమ్మనములు హర్షింపఁజేయు మార్గంబుల నుం
డెను; వేఱొకదినమునఁ బం,డ్లను గొను మిదె తెచ్చి యిచ్చుటం బెట్టితిఁజూ. ౭
క. ఓయమ్మా! పండ్లో కొను, మోయమ్మా! బాలకులకు § నొప్పు నివి యనం
గా యాదృచ్ఛికముగ విని, మాయాబాలకుఁడు త్వరగ మందిరమునకున్. ౭౫
క. చని తనదోసిట ధాన్యం,బును గొని పోవంగ నమ్ము పూఁబోడియు నా
వనజాక్షుఁడు దెచ్చినదా, నిని గొని దోసిలని బండ్లనింపెం దమితోన్. ౧౦ 667

క. తా సర్వఫలప్రదుఁ డన, వాసిం గాంచియును గొనియెఁ ఽ బండ్లను ధాన్యం
బాసరసిజాక్షి కుండను, బోసెఁ హరిచేసె రత్నఽముల నిండంగన్. ౧౧ 670

తే. ఇట్టు లాహారిరాములు ఽ హితము గోప, గోపికల కొనరించుచుఁ ఽ గుతుక మలర
యమునయొడ్డున కేగి విఽహారతత్పరత్వమున నుండి రెలమి నర్భకులుగొలువ.

సీ. అంత రోహిణి యమళాఽర్జునభంజనుఁ గృష్ణునిఁ జీరి ర ఽ మ్మిందుఁ దనయ!
యని పిల్చి తనపుత్త్రుఁ ఽ డగురాముని౦ బిల్చె బాలకులనుగూడి ఽ కేళిసల్పు
చుండ నోనాయనా! ఽ యుర్వి కెంధూళిచే ధూసరితంబయి ఽ తోఁచెఁ దనువు
నభ్యంగ మొనరింప ఽ నరుగుదెమ్మా యింక నీదుజన్మర్క్షము ఽ నేఁడు గాన

తే. శుచితఁ గని ధేనువులను భూఽసురుల కిమ్ము
చూడుచూడుము నీతోడఁఽగూడియాడు
బాలకులు తమతల్లులు ఽ ధూళిపోవ
స్నాన మొనరించి కైసేయ ఽ సంతసముల. ౧౩ 672

చ. అలరుచునున్న వారు గను ఽ మట్టులె నీవును స్నానకృత్య మి
మ్ముల నొనరించి యిష్టమగుఽభోజన మొప్పుగఁ జేసి హారపం
క్తులఁ గయిసేసికొంచు నినుఁ ఽ గూడిన మిత్త్రులరీతి స్వేచ్ఛఁ గే
ళులఁ జరియింపవయ్య! యని ఽ లోలవిలోచన యెంతపిల్చినన్. ౧౪ 673

చ. హరియును రాముఁడుం జరపుఽనాటలవేడుకఁ దల్లి పిల్వ స
త్వరముగ రాక యోయనుచుఁ ఽ బల్కకయుండ యశోదఁ బంచె నీ
వరిగియదేఁ గుమారకుల ఽ నాటలనుండి మరల్చి తెమ్మటం
చురుతరపుత్త్రవత్సలత ఽ నొక్కటఁ బంపె నదెంత ప్రీతియో. ౧౫ 674

మ. తన యీడొప్పెడు బాలకవ్రజముతోఁ ఽ దాత్పర్య మేపార నిం
తనరానట్టి ప్రియంబుతో బలునితో ఽ నాటాడుచున్నట్టి కృ
ష్ణుని స్నేహాస్నుతవత్సజద్వయము సంఽశోభిల్లఁగాఁ బోయి నా
యన! శ్రీకృష్ణ! సరోజనేత్ర! త్వర రమ్మా పుత్త్ర నా చెంతకున్. ౧౬ 675

తే. స్తన్య మిచ్చెద రమ్ము పాల్దాగి పొమ్ము
చాలు నాటలు తుత్తుచే ఽ శ్రాంతి నొంది
తివి కుమారక! బలరామ ఽ తీవరముగ
సహజుతో రమ్ము యదువంశఽసాగరాబ్జ! ౧౭ 676

క. సరసిజసఖుఁ డుదయింపఁగఁ, బరమాన్నము తింటి వంతె ఽ పలుభంగుల ని
క్కరణిం గేళులఁ దేలితి, పరికింపఁగ మోము వాడఁబాఱెం గనుకన్. ౧౮ 677

క. అన్నము దిని పోవన్నా!, నిన్నుం దమిఁగూడి భుక్తిఁ సల్పఁగ సం
పన్నుఁడు దాశార్హుఁడు స, త్సన్నుత యదువంశవార్ధిచంద్రుం డిపుడున్. ౧౯

క. నీకొఱకు వేచియున్నాఁ, డోకృష్ణా! రమ్ము మాకు ॥ నురుమోద మగుం
గాక త్వరం జనుదెంచిన, నీకరణిన్ బాలకులును ॥ నిజగృహములకున్. ౧౯
క. అరుగుదురుగాక యని సతి, పరికించి కుమారకులను ॥ బాలుర కెల్లన్
ద్వరఁ జన నానతియిడె ని,క్కరణిని బ్రహ్మాదిదేవగణశేఖరునిన్. ౧౯౼ 680
చ. తనయునిగాఁ దలంచి హరితత్త్వ మెఱుంగక స్నేహబద్ధబు
ద్ధిని విడనాడలేక బలదేవునిఁగూడిన యచ్యుతుం గరం
బున గ్రహియించి తోడుకొని ॥ పోయి గృహంబున కప్డుచేయఁగా
ననువగుమంగళంబుల మహామతి సమ్మతిఁ జేసె వేడుకన్. ౨౦౼ 681
ఉ. అంతట గోపవృద్ధు లగునట్టివ్రజేశ్వరముఖ్యు లొక్కనాఁ
డెంతయు నూహలొప్పఁగ నహీనవనంబున నందఁజేరి యం
దెంతయుఁ బూతనాదికృతకృష్ణ వధోద్యమరూపకృత్యముల్
వింతగ దారె యట్లనుభవించిన వారలు గాన నేర్పునన్. ౨౧ 682

—౦ నందాదిగోపకులు బృందావనమున కరుగుట. ౦—

*ఆ. ఓలగంబుగూడి ॥ యొప్పుగోకులమున, కగువిధంబు నెంచఁ ॥ దగు నటంచు
మంతనంబుచేయ నంత జ్ఞానవయస్సు, లందు వారిలోన నధికుఁ డొకఁడు. ౨౧౼
క. ఉపనందాఖ్యుఁడు కాలజ,నపదమహాతత్త్వమును మనంబున నూహిం
చి పరమశోభనముల్ గ,ల్గుపద్ధతిం జూపఁజాలఁ ॥ గోవిదుఁ డగుటన్. ౨౨ 684
క. హరికిన్ హలికిన్ బ్రియమున్, సరిపూర్వఁగ నెంచిపల్కె ॥ సరగున మనమీ
పురవరమును బాయుటయే, పరికింపఁగ మేలు గల్గు ॥ పద్ధతిచుండీ. ౨౨౼ 685
క. గోకులమునకున్ హితమౌఁ, గాక యటం చెంతుమేని ॥ గ్రక్కునఁ జనుటే
శ్రీకరమగు నిట నుత్పా,తాకరహేతువులు పెక్కు ॥ లగపడెఁ గాదే. ౨౩ 686
తే. అవ్వియెల్లను బాలుర ॥ కంతకరము, లగును; బాలఘ్నియైన యాయసురవనిత
వలన శ్రీహరికరుణచే ॥ బాలుఁ డితఁడు, చెడక విడివడియె నదెట్లొ చెప్ప నేల.
క. హరికరుణనె శకటము పైఁ, దిరుగంబడకుండఁ దప్పెఁ ॥ దీవ్రతరంబై
పరఁగుసుడిగాలివలెఁ దగు, సురరిపుఁ డీబాలు మాయ ॥ సొరిదిఁ గనఁబడన్. ౨౪
క. పతగకులస్థానంబుగ, క్షితిఁ జేరొందిననభంబు ॥ చెంతకుఁ గొనిపో
యి తగన్ వదలిన శిలపైఁ, బడితుండయ్యును సురేశపటలము ప్రోవన్. ౨౪౼
క. ఏకీడు నొంద కుండెను, మీకెల్లం దెలియుఁగాదె ॥ మేటితరువు లిం
దీకరణిఁ గూల నడుమనె, యీకొమరుండే మతెవ్వఁ ॥ డే బాలుండున్. ౨౪౼
క. ఉండియు మరణమునొందక, యుండుట నచ్యుతుఁడు కాచె ॥ నురుకృప నని చె
ప్పండె యొనండైనను నిటెఁ, జండోత్పాతములు దగి వ్రజమ్మున్ దీనిన్. ౨౬ 691

* "తత్రోపనందనామా గోపో జ్ఞానవయోధికః" అని మూ.

క. పాడొనరింపకమునుపే, యేడకునే నను చరాళి । యేతేరఁగ నే
కీడుం బొందని పిల్లల, తోడం బోవుదము హరియుఁ । దోడగు మనకున్. ౨౭

ఉ. పావనభూరుహంబులును । భవ్యతృణప్రతతుల్ తగంగ బృం
దావననామకం బగువనం బొకఁ డుండుఁ దదంతరంబునం
దే వనముల్ నవీనము లవెన్నియొ గన్పడుచుండు నద్దియుఁ
గోవులకున్ హితం బగును । గోపులు గోపిక లుండ నర్హమౌ. ౨౮ 693

*సీ. పుణ్యమహీధ్రముల్ । పొదలుచుండెడు నందుఁ గాంతారనవకంబు । కర్ణికార
మట్లు కదంబాహ్వ । యమ్మును గమల కేసర కాంచనారముల్ । సాధుకుంజ
రాశనకేతకాఖ్యములు కాలస్కంధమును గపిత్థము నను । వనము లొప్పు
గోవర్ధనాద్రియుఁ । గొమరారు శిఖరుల మిన్నయై జలములు । సన్నుతంబు

తే. లగుచు నందుండుఁ గొలఁకుల । నచ్చటు మన
కెల్లవిధముల నివసింప । నుల్లమలరఁ
జేయుచుండును గాన నా । చిత్రవనము
నందు వసియింప నేఁడె పో । నర్హమగును. ౨౯ 694

క. త్వరపడుఁ డిపుడే శకటో,త్కరములఁ బూన్పుఁడు ముహూర్త । కాలమ్మైనన్
జరపం దగ దూరక యెల్లరకున్ మీకిష్టమేని । లలి గోధనముల్. ౩౦ 695

క. మునుముందుగ బృందావన,మునకుం జనుఁగాక యనుచు । బుద్ధివిభవ మొ
ప్పను బల్కెడు నుపనందుని, పనుపు శుభం బనుచు మూఁకు । పల్కక వారల్. ౩౪

క. ఇదిమంచి దిద్దియే మం,చిది యంచొగి నేకచిత్తు । సిద్ధిని వారె
ల్లఁ దమపరిచ్ఛదముల నున్, బదిలంబుగ శకటవితతి । పయి నిడి యంతన్. ౩౧

క. అరిగిరి గోపులు వృద్ధులఁ, దరుణుల బాలకుల శకట । తతియం దెక్కిం
చిరి సర్వపరికరంబుల, శరాసనంబుల ధరించి । సత్త్వముపొదలన్. ౩౧ 696

క. ధేనుధనంబుల ముందుగఁ, బో ననుమతియిచ్చి శృంగ । ముల నూఁదుచు నిం
పౌ నిఖిలవాద్యఘోషము,లే నింగిని బర్వుచుండ । హితులు బలసిరాన్. ౩౨

క. తమతమపురోహితులతోఁ, బ్రమదంబునఁ జనిరి గోపభామినులు మనో
జ్ఞముగాఁ గుచములపై నూ,త్నముగాఁ గుంకుమముఁ బూయఁ । దద్దఱిచు లొ
[ప్పన్. ౩౫

చ. అరదము లెక్కి మేటివగు । హాటకనిర్మితరత్నయుగ్మనో
హారపదకంబులున్ గళములందు వెలుంగఁగఁ గాంతులీనునం

*వ్యాఖ్యానమునఁ గలవిషయ మిందురరీకృతమని యెఱుంగవలయు. "నవకాననమ్" అని మూ. 'పుణ్యాతృణకాననమ్.' అని మూలము. 'అద్రిశబ్దోఽత్ర ద్రుమవాచకః' అని భావార్థదీపికాప్రకాశికా వ్యాఖ్య.

బరములఁ గట్టి ప్రీతిమెయి భవ్యగళస్వన మొప్పుచుండ శ్రీ
హరి వగు కేళిగీతముల నాదృతిఁ బాడుచుఁ బోయిర త్తఱిన్. ౩౩ 701

ఉ. వారలవెంట రోహిణియు వారిజనేత్ర యశోదయున్ ముదం
బారఁగ నొక్కస్యందనమునందు బలుండును గృష్ణమూర్తియుం
జేరువనుండ వారివగు చిన్నతనంపువిహారచిత్రముల్
గూరిచినట్టి గీతముల గోపికలెల్లరుఁ బాడుచుండఁగన్. ౩౪ 702

చ. శ్రుతిహితమాటఁ జక్క వినుచుం దమి నేగిరి; సర్వకాలమున్
వితతసుఖావహం బగుచు విశ్రుతకీర్తిఁ జెలంగునవ్వనం
బతులము నై కనంబడియె నందుఁ బ్రవేశముచేసి గోపకుల్
సతులను బిడ్డలన్ ముదముసంధిలఁగా విడియించి రొక్కచోన్. ౩౫ 703

ఆ. శకటవితతి నర్ధచంద్రాకృతిగఁ జుట్టు, నిలిపి యంతరమున నిలిచి రంత
వితతభూరుహముల బృందావనమును గో,వర్ధనాఖ్యశైలవరము మఱియు. ౩౫

మ. యమునాశైవలినీవరాంతరలస ద్ధారిప్రవాహావహ
ప్రమదారత్నవిహారయోగ్య పులినవ్రాతంబులం జూడఁ జి
త్తములం బ్రీతియొసంగుచుండ బలభద్రశ్రీహరుల్ వేడ్క నం
దమలక్రీడల సల్పనెంచి రిటు లత్యంతప్రమోదాత్ములై. ౩౬ 705

*క. గోపకులను నెల్లన్ సుఖ,మాపాదించుచు స్వకీయహరివినోద
వ్యాపారంబులఁగలభా,మాపద్ధతులన్ స్వకీయజనహితు లగుచున్. ౩౭ 706

తే. వత్సపాలకులై తగువయసు రాఁగ, వ్రజమునను దాపురన్ గోపబాలకులను
గలిసి బహువిధఖేలనంబులకు వలయు, పరికరమ్ములనున్ సిద్ధపఱచుకొనుచు. ౩౮

సీ. వత్సములను మేపఁ బాటుపడుచునుండి రొకచోట వేణువు లూఁదుచు మఱి
యొకచోట బిల్వామలకముఖఫలముల నొండొరులపయి మహోద్యమమున
వైచుకొనుచు వేడ్క వఱలిరి మఱియొక్కతఱిఁ బదకింకిణీధ్వనులు పర్వ
నర్తించుచుం బ్రీతి వర్తిల్లి రొకపుడు కంబళాదుల నిండఁగప్పుకొనుచుఁ

తే. గపటవృషవేషములఁ దాల్పఁగాఁగఁ బంచి
బాలు రవ్విధి బూనంగ లీలఁ దారుఁ
దద్విధంబున నలరుచుఁ దతనినాద
ముల నొనర్చుచుఁ బోడుతు రిమ్ములఁ బగతుర. ౩౯ 708

క. కలహంసమయూరాదుల, యెలుఁగులవలె భవ్యరీతి నెలుఁగు లిడుచు వా
రలు ప్రాకృతబాలురవలెఁ, జెలఁగుచు విహరించి రందుఁ జిత్రవిధములన్. ౪౦

* "కలవాక్యైస్స్వకాలేన వత్సపాలౌ బభూవతుః" అని మూ.

## వత్సాసురవధ.

చ. హరి యొకనాఁడు సోదర§వయస్యులఁగూడి కళిందకన్యకా
పరిసరమందు వత్సముల § భావిమహాత్తరకృత్య మెంచి యా
దరమున మేపుచుండె నొక§దైత్యుఁడు వచ్చెను దజ్జిఘాంసుఁ డై
హరియును వత్సయూథమున§యందుఁ జరించుచు వత్సరూపుఁడై. ౪౦౫ 710

మ. తను రాముల్ వధియింప నెంచుకుమతిన్ § దైత్యాధముంగాంచి రా
మునకున్ వానిని జూపుచున్ దనుజుదు§ర్బుద్ధుల్ రవంతేనెఱుం
గని పోల్కిం గనఁజేయుచున్ జనియెఁ ద§త్క్రవ్యాదునిం జంపఁగన్
మన మెంతేఁ గుతుకంబుఁ బూన దివిజుల్ § మన్నించునే ర్పొప్పఁగన్. ౪౦౬

మ. మెలమెల్లం జని వత్సలం గనుచు నా§మిత్రాబ్జనేత్రుండు శ
త్రులయం బాత్మహితైకకృత్య మనుచుం § దోడ్తోన నాదైత్యునం
ఘ్రుల వెన్కందగువానిఁ బూనిక సలాం§గూలంబుగాఁ బట్టి యి
మ్ముల బల్ సారులు త్రిప్పివైచె నొకటన్ § భూజాతముం దాఁకఁగన్. ౪౦౭

తే. అందుఁ గల్గుకపిత్థవృ§క్షాగ్రమందు, దగిలి రక్కసుఁ డసువులఁ § దత్క్షణంబ
వదలి తనపెనుకాయంబు § భవ్యఫలము,లను బడఁగఁజేయఁ గూలె భూ§మిని ద [టుకున. ౪౦౮

ఉ. దానవుపాటుచూచి హరి§దర్పము చక్కనెఱింగి విస్మయం
బూనఁగ మేలుమే లనుచు § నొయ్యన బాలురు సంస్తుతించి ర
ల్లే నిఖిలామరుల్ దివిని § దృష్టిని గల్పకపుష్పవృష్టిచే
దానవహంతఁ గొల్చిరి ని§తాంతము దుందుభినాదముల్ తగెన్. ౪౦౯ 714

చ. హరియును రాముఁడున్ దమరె § యారయ లోకగణైకపాలురై
పరఁగియు వత్సపాలురయి § పర్వులుపెట్టుచుఁ జల్దియన్నముల్
గరములఁ బట్టుకొంచుఁ దిరు§గందగియుండిరి భూరికాననాం
తరముల గోపబాలకులు § తత్సహవాసమునన్ జరించుచున్. ౪౧౦ 715

సీ. తమతమగోవత్స§తతులను మేపుచు నొకనాఁడు వత్సంబు§లకు జలంబు
పెట్టను దమరును § బ్రీతి శీతగ్రాసమును దిన యమున దా§పునకుఁ బోయి
రారామకృష్ణుల § యనుమతి నచట వత్సములు నీరును ద్రావఁ § దమరుజలము
ద్రావిరి బాలు రా§స్థలమందు వజ్రసంహతిభిన్నమై కూలి§నట్టి శైల

తే. శృంగమట్టులు పడియున్న § చిత్రభూత
మును గనుంగొని రాభూత § మనఁగ నొక్క
యసురుఁడే బకరూపంబు § నంది యతఁడు
హరిని దనతీక్ష్ణతుండము § నట్టె తెఱచి. ౪౧౧ 716

చ. త్వరపడిమ్రింగె దర్పమున బాలురు రాముఁడు దన్మహాబకా
శరుఁ డటు కృష్ణు మ్రింగఁగని చయ్యనఁ బ్రాణముపోవ నింద్రియో
త్కర మెటులుండు నక్కరణి గా గతచేతసులైరి; శ్రీపరా
త్పరుని జగద్గురూత్తముని తండ్రిని గోపకుమారవేషునిన్. ౮౯ 717

ఆ. వడిగమ్రింగి యంత వాఁడు మ్రింగుడుపడ
కగ్నివోలెఁ గాల్చు చపుడు తాలు
మూలమునఁ జెలంగఁ బోరి వెలికిం గ్రక్కి
యక్షతుండె యగుట యరయలేక. ౮౯౪ 718

క. వడి మించురోషమున నప్పుడు కొంగయు వాడియైన ముక్కున మఱియుం
బొడిచి వధింపఁగఁ బూనినఁ, గడు దుష్టబకంబు నచటఁ గని కృష్ణుండున్. ౯౦

చ. కరములరెంటఁ బైఁబడెడు కాంక్షను వచ్చెడునాబకంబు వ లిం
కరణముచే నదల్చి సఖకాండము చూచుచునుండఁ గంసభూ
వరసఖు చంచుయుగ్మమును బట్టి తటాలున వీరణాఖ్యచే
ధరఁదగుగడ్డిఁ బోలెఁ బ్రమదంబునఁ జీల్చె సురల్ తమిం గనన్. ౯౧ 720

ఆ. సజ్జనులకుఁ దానె సద్గతి యగుకృష్ణుఁ, డివ్విధమున బకుని నేపడంచె
బకుని జంపినట్టి సకలేశ్వరునిపయి, దివిజవర్యు లెల్లఁ దృప్తిమెఱయ. ౯౧౪

క. నందనవనమందుం దగు, సుందరతరమల్లికాది సుమబృందము నా
నందమునఁ జల్లి యానక, దుందుభిశంఖారవములతోడఁ బొగడుచున్. ౯౨

క. తమసంప్రీతిని దెలిపిరి, సుమనసు లిటు సన్నుతించు చో ప్పెఱఁగి బలుం
డు మొదలగు గోపబాలకు, లమితంబగు విస్మయమున నాత్మలు పొదలన్. ౯౨

చ. బకవదనంబునుండి యెడఁబాటును గాంచి సుఖంబుగాఁ దన
ర్చు కమలనేత్రుఁ గృష్ణు రుచిశోభితు స్వస్థలవాసుఁ గాంచి ప్రా
ణకలితమైన యింద్రియగణం బటుపొల్చుచుఁ గౌఁగిలింతలన్
బ్రకటముదంబునుం దెలిపి వత్సల నొక్కట గుంపుగూర్చుచున్. ౯౨౪ 724

క. వడివడి మందకుఁ జనియట, నడచిన వృత్తాంత మంత నందాదులకుం
దడ వొనరింపకయె యెఱుకపడఁ జేసిరి గోపగోపభామిను లెల్లన్. ౯౩ 725

చ. జరగినవార్తలన్ విని యశోసంగెడు నద్భుతచేష్టలన్ మదిం
బరఁగుప్రమోదముం దెలిపి వారిజనేత్రుని మృత్యువక్త్రముం
జొరఁబడి ముక్తినొంది తితిశోభిలువానిగఁ గాంచి నేత్రతా
మరసములన్ సుధారసము మాటికిమాటికిఁ ద్రావునట్లుగన్. ౯౮ 726

తే. పక్ష్ములు వాల్ప కట్టులె పంతమలరఁ
గాంచు చుండిరి; నందాదు లెంచి దాని

యేమియబ్బుర మిదియొక్కొ! యీకుమార
కునకు బహుమృత్యుహేతువుల్ ఘోరభంగి. ౭౨౪ 727

క. కనఁబడి రట్టులైనను బాలున కించుకబాధయే కలుగకుండెను వా
రిని బొందె ననిష్టంబులు, మనమునఁ దలఁపఁగ సుజనులమాట నిజంబౌ. ౭౨౮

క. తొలిజని నెవరికి భయముం, గలిగింతురొ వారివలనఁ గలుగుభయంబుల్
తలపోయ నిది యథార్థమె, ఖలులయి ఘోరాకృతులను గన్పడి వైరుల్. ౭౨౯

క. బాలుని గీడ్పఱుపంగాఁ, జాలక పోయిరి వధింప సమకట్టి శుచి
జ్వాలలఁ బడు మిడుతలవలెఁ, గూలిరి తమయంతఁ దమరె కుమతులుగానన్. ౭౩౦

క. ఔరౌర! బ్రహ్మ మెఱిఁగిన, వారలు వచియించునట్టి వాక్కు లదెపుడే
నారయ నమృతము లగునే, ధీరాగ్ర్యుఁడు గర్గమౌని తెలిపె నదెట్టుల్. ౭౩౧

క. ఈతఁడు నారాయణసముఁ, డై తనరు నటన్న యట్టు లనుభవసిద్ధం
బై తగియె ననుచుఁ దనయులఁ, బ్రీతిం దలపోసి వారి వింతచరితముల్. ౭౩౨

క. పలుమాఱు చెప్పుకొనుచుఁగ, విలసిల్లుచు భవకృతమగు వేదన నింతేఁ
దెలియక మనసులు వారలఁ, గలిసి విహారమునఁ దేలఁ గా నుండి రొగిన్. ౭౩౩

ఉ. సోదరు లిట్లు ప్రాకృతులచొప్పున సద్మము లెన్నికట్టుచుఁగ
బ్రోదిగ సేతుబంధములఁ బూనిక నిర్మితిఁజేయుచుఁగ మనో
హ్లాదముగాఁగ మర్కటములట్టులు గంతులు పెట్టుచుఁగ విహా
రాదుల బాలచేష్టలను నందును బుచ్చిరి కాల మొయ్యనన్. ౭౩౪ 734

---

పంద్రెండవయధ్యాయము.

**శ్రీకృష్ణుఁ డఘాసురుఁ బొలియించుట.**

మ. వినవయ్యా! నరపౌత్ర! యవ్వలిదియౌ వృత్తాంత మంతఁగ ముదం
బునఁ గృష్ణుం డొకనాఁడు కాననమునఁగ భుక్తిం గొనం జెల్లు నీ
దినమం దంచుఁదలంచి బాలరవి యోదీనార్తిసంహారకా!
వనజాక్షా! యిఁక లెమ్మటంచు రుచులఁగ బల్మాఱు తఁగ లేపఁగన్. ౧ 735

తే. మేలుకాంచి వయస్యుల మేలుకొలిపి
వత్సపాలకులఁగ లేపి వత్సవితతి
ముందు నడువంగ సంతోషమును జెలంగఁ
జేయు శృంగరవంబును జేయుచు హరి. ౧ 736

సీ. పయనంబు సాగించె బాలకు లందఱు హరిమీఁదఁగల స్నేహ మంతకంత
కధికంబె యగుచుండ నన్నము గలయట్లు వేత్రముల్ శృంగముల్ వేణువులు
దమకరంబులకు నితాంతభూషణములై కనుపట్టుచుండ లెక్కకుమిగిలిన [ను

స్వీయవత్సంబులు శ్రీహరివత్సంబులనుగూడి పోవంగఁ జనుచునందు

తే. నందు బాలకలీలల నగపడుచుచుఁ
జక్క విహరించుచుండ వత్సములుయూథ
ములును మేయుచునుండె వారలును గాచ
కంకణంబులు కరములఁ గ్రాలుచుండ. 3 737

క. గురివెందల హారంబులు, వరరత్నవిభూషలును సువర్ణపదకముల్
సురుచిరముగఁ దనువులఁ దగ, నరుదుగ నొప్పియు మహావనాంతరసీమన్. 34

క. ఫలములఁ జిగురులఁ గుసుమంబులఁ బూగుత్తులను ధాతువుల భూషణముల్
గలయంగఁ జేసికొని తనువుల నిండధరించి రందుఁ బొంగెడుకాంతున్. 8

సీ. గోపబాలకులందు గుమిగూడి యితరేతరాన్నపాత్రము లాది యైనవాని
దొంగిలించుచును దాఁతురు కానరాకుండ, దాని నెఱింగినఁ దటుకున నవి
దూరంబుగాఁ బడనేరుపునం జిమ్మి వైతురు దవ్వున వార లుండి
పరుగెత్తి రాఁ గాంచి త్వరపడియవ్వానిఁ దమరె చేకొందు పంకతమున నిట్టు

తే. లాడుకొనుచుండ శ్రీహరి యడవిసొంపు
గనఁగ దూరమునకుఁబోవఁ గడఁగి కృష్ణు
నేను ముందుగఁ దాఁకెద నేను నే న
టంచుఁ బరుగిడి స్పృశియింత్రు మించువేడ్క. ౬ 740

క. హరిఁ దాఁకి నవ్వుచుందురు
పరితోషం బెక్కుఁ దైనబాలకులు మనో
హరముగ వేణువు లూఁదుదు
రురుతరశృంగములఁ గొంద ఱూఁదుదు రందున్. ౬౪ 741

క. భ్రమరంబులు ఝంకృతినాదము లొనరించునెటు లట్లు తమరుఁ బాడఁగ
గమకింత్రు కొంద ఱుద్రేకమునం బికములవిధంబు గాఁ గూఁత లిడన్. 2

క. మనమునఁ దలంచి పికరవ, మనురీతిం గూయుదు రొగి నంబరముకడం
జను పక్షుల నీడలతోఁ, జనఁదగు నని పంతమూని సత్వరమల్లే. 2౪ 743

క. పరుగిడుదురు హంసలవలె, సురుచిరగమనముల నెంతొసొంపుగఁ జనుచుం
దురు కొందఱు కొంగలతోఁ, సరిగాఁ గూర్చుండుదురు పాసంగెడుశక్తిన్. 2౪

క. నెమిళులపోలిక గా నృత్యము సల్పుదు రొక్కకొంద ఱటఁగల్గు మహీ
జములందు నున్న కపివాలములం బట్టుకొని యూఁగిలం బడుదు రొగిన్. ౭

క. వానరములు చెట్లెక్కినఁ, దోనం దమ రెక్కుచుండుదురు చపలతచేఁ
బూని యవి వెక్కిరించిన,చో నెంతయు వెక్కిరించుచుఁ మోదమునన్. ౭౪

క. ఒకకొమ్మనుండియే వే, ఱొకకొమ్మకుఁ గపులుదాఁటి యుద్ధతిఁ దమరుం
బ్రకటగతిఁ లంఘించుచు, వికటంబుగఁ గొంద ఱుంద్రు వేడ్కకు సరిగన్.

సీ. కప్పలతోఁబాటు గంతులువైచుచు యమునాజలంబులయందు మునిఁగి
యందుఁ దోఁచుచు నున్న యన్యోన్యసంహాసప్రతిచ్ఛాయల నైజచపల
తను గాంచి నవ్వుచు ధ్వనులకుఁ బ్రతినిస్వనములువినంబడఁగ మఱిశాప
మిచ్చుచుఁ బ్రాజ్ఞనికృతపుణ్యులయి తగునాగోపబాలకు లపుడు బ్రహ్మ

* ఆ. సుఖము ననుభవించుచును భక్తిగొనుసాధు, తతికిఁ బరమదైవతంబు మాయ
కు వశులైన జనులకును నరబాలుఁడు, నైన హరినిగూడి యాడి రపుడు. ౧౧

చ. పరిగణనాతిదూరభవ పంక్తికృతాయత కృచ్ఛ్రసద్వ్రతో
త్కరమున నాత్మనిగ్రహముఁ గాంచినయోగుల కేమహాత్ము పా
దరజ మలభ్యమే యగునొ తాదృశకృష్ణుఁడు తానె వారి కా
దరమునఁ దోఁచుచుండె నఁట; తద్వ్రజవాసు లదే యదృష్టమా. ౧౨ 749

తే. దాని నెవ్విధి వర్ణింపఁదరము గాదు;
గోపబాలకు లవ్విధిఁ గోర్కె నచట
విహరణముసల్ప నోర్వక విషమబుద్ధి
గలుగు నఘనామదైత్యుఁ డకాండనమున. ౧౩ 750

క. అనుదినముం డెఁడు నమృతం,బును ద్రావియు నఘుని గాంచి భూరిభయంబుం
గనుదురు మృత్యుకరుం డని, మనములఁ దాదృశపరాక్రమము దగియుండన్.

క. తనచావు గోరు నటు దే,వనికరముం జేయు దైత్యవర్యుఁడె యఘుఁడా
జనపతికంసుఁడు పంపఁగఁ, జనుదెంచి యటఁ వసించు శౌర్యస్ఫూర్తిన్. ౧౫

చ. దనుజుఁడు వాఁడు పూతనకుఁ దమ్ముఁ డగుఁ బకదానవుండు నీ
తనికిని జ్యేష్ఠసోదరుఁడె దారుణచిత్తుఁడు గాన నయ్యఘుం
డనయము మోదమానసుల నాటలమించెడు గోపబాలురన్
వనరుహనేత్రుఁ గృష్ణు బలభద్రుని గాంచి మహాత్తరక్రుధన్. ౧౪ 753

క. ఈయిర్వురు ప్రియసోదరు,లే యగుదురు వీరిలోన నీతండే యా
నాయన్నను జంపినరిపు, వీయదనున వీనిఁబట్టి యెల్లసఖులతోన్. ౧౪ 754

ఆ. అన్నతోడఁగూడ యముని యంతికమున, కనుపువాఁడ వీరి నంతమొందు
నట్లుచేసి యస్మదన్వయులకుఁ దిలో,దకము లిత్తు వారు తనివినొంద. ౧౫

క. ఒనరుతునే నిట్లువ్రజం,బునఁగల గోపకులు మృతిని బొందినయట్లే
యనవచ్చుఁ బ్రాణములు పో, యినగాత్రము లుండనోపునే యెందైనన్. ౧౫

* "ఇత్థం సతాం బ్రహ్మసుఖానుభూత్యా దాస్యంగతానాం పరదైవతేన, మాయాశ్రితానాం నరదారకేణ" అని మూలము.

ఆ. చింతయేల యింక ॥ క్షితి దేహధారుల, కసువు లనఁగ బిడ్డ॥లగుదు; రనుచు
నిశ్చయించుకొనుచు॥నిర్భాగ్యుఁ డాతండు, యోజనంబు నిడివి॥యొప్పుచుండ.

[1]క. గురుతరపర్వతసమపీ, వరతయుఁ గనఁబడఁగఁ జాల॥భయదం బగుభూ
ధరభుజగాకృతిఁ గైకొని, ధరకందరవక్త్ర మొప్పు॥ దానవుఁ డుండెన్. ౧౩౪ 758

తే. దానియాకృతి యత్యద్భుత॥ముగఁ గ్రాలె
నంత వారల మ్రింగెడు॥ నాసఁ బూని
వక్త్రమును విప్పి త్రోవను॥ బండుకొనియె
యుండె నాఖలు నధరోష్ఠ॥ ముర్విఁ బొదలె. ౧౪ 759

క. ఘనములఁ దాఁకుచు నూర్ధ్వం
బునఁదగు నోష్ఠంబు తాలు॥మూలంబులు పొ
ల్చెను గుహ లనఁ గోఱలు చ
క్కని శృంగము లట్లుపొడవు॥ గాఁ గనఁబడియెన్. ౧౫౪ 760

క. ధ్వాంతం బాదానవు నా, స్వాంతరమున నిండియుండె॥ న త్తతిఁ బొడవై
యెంతయు సాగిన పథ మన, వింతగఁ దజ్జిహ్వ చూడ॥ వెడఁగై యుండెన్.

క. పరుషానిల మట్టూర్పులు, పరితస్సంవ్యాప్తములయి॥ భయదంబులుగాఁ
బరఁగుచు నుండెఁ దృష్టులు, నరణ్యముం గాల్చునగ్ని॥యటు బెడిదము లై. ౧౭

క. వెలయుచునుండెను న త్తతిఁ, జెలువం గని బాలురెల్ల॥ జిత్రముగా ని
ట్టులు బృందావనలక్ష్మియె, చెలఁగెడు నని భ్రాంతిపడి వి॥శృంఖలవృత్తిన్. ౧౭౪

క. వదనంబు దెఱచుకొని సిరి, ముదితయె యి ట్లున్న దనుచుఁ॥ బొంగుచు వర్ణిం
పఁ దలంచి రజగరముతోఁ, నిదిపోల్పం దగునటంచు॥ నెంతయు వేడ్కన్. ౧౮

సీ. ఒకరితోడ మఱొక్క ॥ రోమిత్రులార! యిదే మనముందఱ ॥ నెంతొ చిత్ర
ముగ నున్న యది స త్త్వ॥మగుననితోఁ చెడుఁ గద యద్ది మనల మ్రిం॥గంగఁ బూని
వదన మెంతయు విప్పి ॥ భయదాజగరవదన మనితోఁ చెదునట్టు ॥ లమరియున్న
యదిగాదె చెప్పుఁడీ ॥ యట్లుకాక మఱేమొ కనుఁగొనుఁడీ ॥ సూర్యకాంతులకును

[2]తే. నరుణముగ నొప్పునమ్మేఘ॥ మల్లస త్త్వ
మునకుఁ బై పెదవిగ నొప్పెఁ॥ గనుఁడు నిక్క
మగును రవికరసంవ్యాప్తి॥ నరుణమైన
తట మిదెల్లను గ్రింది పె॥దవిగ నయ్యె. ౨౦ 765

క. చెలులార! భూధరో త్తమ, బిలములు కుడియెడమలందు॥ బృహుతాలువులం
దలి భాగములుగ శృంగం, బులు దీర్ఘములై నదంత॥ములుగా నయ్యెన్. ౨౦౪

1 "అజగరం బృహద్వపుః" అని మూలము. 2 "సత్యమర్క కరారక్తము త్తరాహానుపద్మనం"
అని మూలము.

చ. కనుఁగొనుఁ డీవిశాలమగువక్త్రపథ మీయది దీనినాల్కతో
ననుఁ బ్రతిసేయఁగాఁ దగదె నాఁ గన నయ్యెడు; భూరిభూధరం
బునఁగల తుంగశృంగముల వూగమునంతరమందు నెంతయుం
గనఁబడు ధ్వాంతమెల్ల నిదె క్రాలెడు దీనిముఖాంతరంబునన్. ౨౨ 767

సీ. దావానలోష్ణమై దారుణంబగుమారుతము దీని యూర్పుచందమున నున్న
దరయుఁడు దావానలాంతరపరిదగ్ధజంతుదుర్గంధ మీసత్త్వతనువు
నంతరమున నున్నయట్టి మాంసంపుదుర్గంధమువలె నొప్పుఁ గనుఁడు మీర
లని పల్కుచుండి రాయజగరమును గొండచిలువఁ బోలినదిగఁ జెప్పుచుండి

తే. రంతఁ గొందఱు మనల నీయది ముఖంబు
లోపలికిఁ జొన్పి మ్రింగు నొక్కో పటుగతి
మ్రింగునేని బకాసుర రీతి దీనిఁ
బట్టి బకవైరి చంపక వదలునొక్కొ. ౨౩ 768

చ. అని వచియించుచున్ క్షణమునందె వధింపక పోవనిచ్చునే
మనచెలికాఁ డటంచు రుచిమానితతద్వదనాంబుజాతమున్
గనుఁగొనుచున్ గరంబులను గట్టిగఁ దట్టుచు నవ్వుచున్ ద్వరం
జని రిటు గోపబాలకులు సత్త్వము దానిని గొండచిల్వఁగన్. ౨౪ 769

మ. పరికింపంగనులేక తోఁచినటులే పల్కంగ నాలించి శ్రీ
హరి యయ్యో! నిజమున్ గనుంగొనఁగలే కద్దాని వేఱొండుగా
సరిగానట్టితలంపుఁ బూని రనుచున్ స్వాంతంబునం దెంచి యె
ల్లర హృత్స్థానములందు నుండఁదగు లీలా లోలుఁడౌఁ గావునన్. ౨౫ 770

చ. అమరరిపుండు వీఁ డజగరాకృతిఁ గైకొని యున్నవాఁ డటం
చు మఱియు నిశ్చయించి తనజోడగుబాలుర వత్సరాజి స
ర్పముఖమునం జొరంబడనిభంగి నొనర్పఁగ నెంచె; నంత స
త్య మెఱుఁగనట్టి బాలకులు దానిముఖంబును జొచ్చి రొక్కటన్. ౨౬ 771

తే. వారితోఁ జొచ్చె దూడలు వాఁడు వారి
వాని మ్రింగక తనయన్నవైరి చొచ్చు
నెప్పు డని యెంచుచున్ స్మరియించుచుండె
నన్నుఁ జంపినవిధ మెల్ల నట్టులౌట. ౨౭ 772

క. హరిరాక కెదురుచూచుచుఁ, జొరఁబడియున్నట్టివారిఁ జొచ్చెడువత్సో
త్కరమును మ్రింగక యుండెను; బరమకృపాళుండు సాధుభయహరణుండున్.

సీ. దీనావనంబున దీక్షఁబూనినప్రోడ సకలాభయప్రదుఁ డకలుషాత్ము
లకుఁ బ్రాపుగాన గోపకు లన్యశరణంబు లేనివారని తెల్విలేక తనదు

[1]కరసహాయంబులేకయ దాని నెంచక దీనులై యెంతయుఁ § దీవ్రమృత్యు
జఠరాగ్ని కెరయయి § చావ నున్నారనియుఁ దలంచి విస్మయం§బొప్పఁ గరుణ
తే. త్వరఁగ వీరిని గాపాడఁ § దగు నటంచుఁ, బురికొలుప వీనికిఁ మేలు§పొందరాని
సాధుబాలకులకుఁ గీడు § జరగరాని, యేకకాలంబునం జేయ § నెట్టులగునొ. ౨౭

[2]చ. అనిమదిఁ జింతచేయుచు నిఁదా నిటఁ గార్య మటంచు సర్వముం
గనుఁగొనఁ జాలుశక్తిగల § కంజదళాక్షుఁడు కృష్ణుఁ డప్డు చొ
చ్చెను భుజగేంద్రతుండమును § జెచ్చెఱ మేఘగణావృతిం బెనం
గునిఖిలనిర్జరుల్ హరికిఁ § గూడినకష్టము గాంచి యార్తులై. ౨౮ 775

క. అయ్యో! యయ్యో! యనుచుం, గుయ్యిడఁ గాఁ జొచ్చిరఘునకుం గూప్పుజనుల్
నెయ్యురు దానికి హర్షం, బయ్యెడఁ గాంచిరి క్షణంబునం దవి సాగెన్. ౨౯

[3]చ. విని భగవంతుఁ డాదివిజ§బృందమహార్తరవంబు లవ్యయుం
డని తను నెన్నలేక సుర § లార్తినిబొంది రటంచు నెంచి వ
త్సనిచయముల్ దనుల్ దమి రజంబుగఁ జేయఁగఁ గోరుచున్నయా
దనుజుని కంఠమం దమరఁ § దద్దయుఁ బెంచెను స్వీయగాత్రమున్. 30 777

సీ. అత్యంతవిస్తృతి § నంగముగల యఘదనుజుని గళమును § వనరుహాక్షుఁ
డడ్డగింపఁగ వాయు § వట్టిటు వ్యాపింపనున్నంత నిటునటు § లుగ్రరీతిఁ
బొరలుచుఁ గన్నులు § త్వరఁబైకి నుబ్బంగ సంకటపడుచుండె § శ్వాసనుఁ డట్టి
తనువుననిండి పై§జనరాని మూర్ధము భేదించుకొని పైకి § వెడలసాగె
తే. నట్టిత్రోవనె ప్రాణంబు § లవలఁ బోయె, నజగరముతోఁ బరేతులై§నట్టి గోప
బాలకుల వత్సములను గృపాప్రపూర్ణ,దృష్టి బ్రదికించి వారితో § నెలమివెడలె.

మ. అతిచిత్రాయతతేజ మొండు పృథులాం§గాహీంద్ర భోగంబునుం
డి తగన్ వెల్వడి దిక్తతిన్ స్వరుచిచే § నిండించుచున్ నింగి న
చ్యుతుఁ డాదేహమునుండి వెల్వడుట యొ§ప్డో యంచు నీక్షించుచున్
జతనం బొప్పఁజరించుచుండి హరి యా§చందంబునన్ వెల్వడన్. 3౨ 779

చ. సుర లిది యేమటంచుఁ దనుఁ § జూచుచునుండఁగఁ జొచ్చె నంత శ్రీ
హరితనువున్; దివౌకసు లఘాసురుఁ జంపి స్వకార్య మట్టు లా
దరమునఁ జేసి పొల్పుహరిఁ § దద్దయుఁ బ్రీతిని బూలవానచేఁ
గరము బహూకరించి రటు § కమ్రతరం బగునాట నచ్చరల్. 33 780

క. గీతములన్ గంధర్వ,వ్రాతము వాదిత్రకులును § వాద్యధ్వనులన్
భూతలదివిజులు స్తుతులన్, బ్రీతిన్ జయనాదములను§భృత్యగణంబుల్. 3౪

1 "అనన్యనాథాన్ స్వకరాదవచ్యుతాన్" అని మూ. 2 'తదాఘనచ్ఛదా దేవాః' అని మూ. 'మేఘాంతరితాః' అనివ్యాఖ్య. 3 "తచ్ఛ్రుత్వా భగవాన్ కృష్ణస్త్వవ్యయస్సార్భవత్సకమ్" అని మూ.

క. హరి నెంతయుఁ బూజించిరి, పరమేష్ఠియు నద్భుతముగఁ ¦ బర్వెడు స్తుతులన్
వరగీతములం బటువా, ద్యరవములన్ విజయశబ్దసంతతులన్ మిగులన్. ౩౮౪

క. తనస్థానమునకుఁ జెంతనె, విని మంగళ మొసఁగుశబ్దవితతి యలర వెం
టనెలేచి యచ్చటికి వ, చ్చెను లోకేశ్వరుని గృష్ణుఁ ¦ జిత్రాకృతినిన్. ౩౫ 783

చ. కనుఁగొని తన్మహత్త్వ మధికంబగు భక్తి నెఱింగి విస్మయం
బును గనియెన్; ధరారమణపుంగవ! జవ్వనమందు నద్భుతం
బును గనఁజేయఁగాఁ దగుచు ¦ భూరితరంబయి శుష్కమైన యా
ఘనఫణిచర్మ మచ్చటను ¦ గోపుర ముండెడుయాదవాళికిన్. ౩౬ 784

క. చిరకాలము క్రీడార్థము, గురుతరబిల మగుచునుండె ¦ క్షోణీనాథా!
పరికింపఁ జిత్ర మనఁదగి, నిరుపమ మగువార్త గలదు ¦ నెమ్మిన్ వినుమా. ౩౬

*సీ. ఐదవసంవత్స ¦ రాంత్యభాగంబున హరియొనరించిన ¦ యద్భుతావ [మీఱ
హ మగునాకార్యము ¦ నహిమోక్షణము బాలమోక్షణ మ్మనుదానిముదము
బాలకుల్ కృష్ణుని ¦ పౌగండదశయందు జన నాదిగ గణింప ¦ షష్ఠవర్ష
మందుఁ గనుంగొని ¦ యావ్రజంబునఁ గలపెద్దల కెల్లను ¦ బ్రీతిమీఱ

ఆ. ననువదించి; రిద్ది ¦ యాశ్చర్యమే కాదు, కనఁ బరావరులగు ¦ కంజజన్ముఁ
డాదియైనవారి ¦ కందఱకును బరుం, డగుచు స్రష్టయగుచు ¦ నలరుచుండి. ౩౨౪

క. తనలీలచేత మాయా, మనుజార్భకుఁడైన యట్టిమాధవు నంగం
బును దాఁకినంత నఘుఁడను, దనుజుఁడు విగతాఘుఁడగుచుఁదాంతియుతుండై.

ఆ. దుర్జనులకు నెట్టిత్రోవను బొందరా, కున్నయాత్మసామ్య ¦ మొందె; నిదియె
యతివిచిత్రమైన ¦ దనదగువృత్తాంత, మిద్ది కృష్ణునందు ¦ హెచ్చుగాదు. ౩౮

క. దనుజుఁడు మనోమయంబగు, తనప్రతికృతి నొక్కమాఱుతా నదియెట్లో [౩౮౪
చొని పె బలాత్కారంబున, మనమున నందులకె దేవమాన్యుఁడు హరియున్.

క. సురవైరి పీఁడటంచెదఁ, బరికింపక కరుణఁబూని ¦ భాగవతగతిన్
గరుణించెఁ బరీక్షిత్తూ!, నిరంతరసుఖానుభూతి ¦ నెమ్మిం గనుచున్. ౩౮౪ 790

క. నిరతిశయమహత్త్వంబున, నిరస్తమాయుండునైన ¦ నిర్మలమూర్తిం
బరమేశ్వరునే నెమ్మది, స్థిరముగ నిల్పిన తపస్విశేఖరు లెల్లన్. ౩౯ 791

క. నిత్యంబయి సుఖదం బగు, నత్యుత్తమగతిని గాంతు ¦ రనఁ జిత్రంబే?
సత్యముగ దానినొంద న,నిత్యంబగుభవము నొందనేర్తురె మనుజుల్. ౩౯

క. జననాథ! యొక్కకాలం,బున సాగిన కృష్ణకృత్యము మఱొకసమయం
బున సాగినట్లు బాలుర, మనములకుం దోఁపఁజేసె ¦ మాధవుఁడు బలే! ౩౯793

* "కౌమారం పంచమాబ్దాంతం పౌగండం దశమావధి, కైశోరమాపంచదశాద్యౌవనంతు తతః
పరం" అనివ్యాఖ్య.

క. అని తెలిపి శౌనకాదిక, మునులకు సూతుండు తెలుపఁబూనె నవల సా
గినకృష్ణచరిత్రము ని, ట్లని శుకయోగీంద్రుఁ డిట్టు । లక్కథఁ దెలుపన్. ౭౯

చ. విని నరపౌత్రుఁ డద్భుతము । వెన్నునిసచ్చరితం బటంచు నె
మ్మనమున నెంచి స్వేశ్వరుని । మానితచిత్రచరిత్ర మింకనున్
వినఁదగు నన్న వాంఛ మెయి । వేయివిధంబులఁ జిత్త మెంతయుం
దనుఁ బురికొల్ప వ్యాసముని । తల్లజపుత్త్రుని గాంచి యిట్లనున్. ౮౦ 795

క. మునివర! జ్ఞానధనా! యిఁక, వినవలతు నదొక్క కాలవృత్త మపుడె సా
గినయట్లుండున్ వేఱొకఁ, డనఁదగుకాలమున సాగునట్లెట్లగునో. ౮౧ 796

క. హరికౌమారకదశలో, జరగినచరితంబు బాలసముదాయం బా
హరిపౌగండావస్థను, జరగినయటు తలఁప నెట్లు । శక్యంబగునో? ౮౨ 797

చ. గురువర! యోగిచంద్రమ! ముకుందుని సచ్చరితంబు నింక నా
దరమునఁ జెప్పుమా విన ముదంబు జనించెడు నిద్దిచూడ శ్రీ
హరిదగుమాయయే యగు మఱన్యము కాదని తోఁచెఁ ద్వన్ముఖాం
బురుహగళన్ముకుంద పరిపూతకథామృతమున్ ముదంబునన్. ౮౩ 798

*తే. తనివిదీఱ నాస్వాదింపఁ । దగినవార, మగుటచే క్షత్రబంధులమయ్యు లోక
మందు మిక్కిలిధన్యుల । మైతిమిగద, కాన మరల వచింపుమా । కరుణఁబూని.

మ. అనుచుం బ్రశ్న మొనర్ప యోగివరుఁడౌ । వ్యాసాత్మజుం డిట్లు శ్రీ
వనజాతేక్షణసంస్మృతిన్ జెలఁగుసద్భక్తిన్ నిజాంగంబు లీ
శునియందే వెలయంగ మానమున సంశోభిల్లుచిత్తంబు పెం
పున నంతర్గతదృష్టినుండి యెటులో । పూర్వస్మృతిం గాంచుచున్. ౮౫ 800

క. తనదృష్టి బహిర్గతముగ, నొనరిచి తత్ప్రశ్నమున మహోత్సవ మలరన్
జనపతిఁ గని యిట్లనియెన్, వనజాక్షుని దివ్యచరిత । వర్ణించుతమిన్. ౮౬ 801

---

## ప దు మూఁ డ వ య ధ్యా య ము.

### శ్రీకృష్ణుండు వనంబున బాలురంగూడి చల్దు లారగించుట.

క. వినవయ్యా! భగవద్భ, క్తనికరమున నుత్తముఁడవు । ధన్యుండవు చ
క్కనిప్రశ్నము చేసితి వో, యనఘా! హరికథలు వినియు । నందనితృప్తిన్.

క. పలుమాఱులు వానిని గ్రొ, త్తలుచేయుదు; సాధుజనులు । తమవాక్శ్రవణం
బులకున్ మానసమునకున్, జలజేక్షణుకథయె ముక్తిసాధన మనుచున్. ౨ 803

క. తలఁచుచునున్ సారగ్రా, హులుగాఁ దగి యుంద్రు । వారి కొగి హరి సద్గా
థలు క్రొత్తవియై తోఁచుట, ఫలముకదా భక్తికిన్ స్వభావం బదియే. ౩ 804

* "వయం ధన్యతమా లోకే గురోఽపి క్షత్రబంధవః" అనిమూలము.

క. వనితాలంపటులకుఁ గామిని వార్తలు క్రొత్తవౌచు మించెడుమోహం
బును గల్గఁజేయుగతి సజ్జనులకు హరికథలు ముద మెసంగుట యరుదే. ౨ 805

ఆ. స్నేహవంతుఁడైన శిష్యునకు నదెంత, గుహ్యమైనఁ బ్రీతి గురువు లర్థ
మును వచింత్రు సుమ్ము జననాథ! కావున, గోప్యమగు నిదైనఁ గోరి చెపుదు.

చ. అవహితమైన చిత్తమున నస్మదుదీరితకృష్ణచర్యలన్
శ్రవణసుఖంబుగా వినుము సారసనేత్రుఁడు మృత్యువక్త్రరీ
తి వఱలు నయ్యఘాసురుని తీవ్రముఖంబుననుండి వత్సపా
లవితతి లేఁగలన్ సుఖ మిగులాస్థలిఁ గాంచమరల్చి యంతటన్. ౩౪ 807

క. వారలఁ దోడ్కొని చనియొక, వారిరుహాకరము గాంచి వారివిముక్తం
బై రమణమించు పులినముఁ, గోరికమైఁ జేర్చి పల్కెఁ గోమలభణితిన్. ౮ 808

సీ. ప్రియమిత్రులార! యెంతయు రమ్యమగు సరఃపులినతలంబును గలయఁ గనుఁడు
స్వవిలాసయోగ్యైకసంపత్తి యలరార మృదులాచ్ఛతరముగ మించు నిసుక
కనఁబడుచుండ వికచ్చినతమ్మిపూవుల కమ్మనితావుల నెమ్మనమ్ము
లట్టి యాకృష్టమ్ము లైనఁ బైపయిమూఁగు షట్పదంబులు పక్షిసముదయమ్ము

తే. లొనరఁ జేయురవంబులకొక్కరీతిఁ, బ్రతిరవంబులు గలుగ నవ్వానివలనఁ [లము.
దటగతమహీరుహమ్ములు నితాంత మొప్పె,నౌర! కనఁ దగియున్న దీయవనిత

క. చాలఁగ మించెను భుక్తికి, వేళయు నాఁకొన్న మనకు వేగ భుజింపన్
మేలగు, లేఁగలు నీరముఁ, గ్రోలి సమీపమునఁ దృణముఁగొని యల్లల్లన్. ౬

క. చరియించుఁగాక యని శ్రీ, హరి చెప్పిన నాలకించి యట్లే యని బా
లురు లేఁగలు జల మానఁగ, సురుచిరశాద్వలము గల్గుక్షోణిఁ గదుపులన్. ౬౪

ఆ. మేయఁ దోలి యందె మెలఁగు నట్లొనరించి, పులినతలమునందుఁ బుండరీక
నేత్రుఁ జుట్టుఁజేరి నిజశిక్యముల విప్పి, యారగించి రెలమి హరిని గూడి. ౭

సీ. ఆవనంబున గోపకార్భకుల్ హరిచుట్టు వలయాకృతులుగాఁగ వరుసఁ గూరు
చుండి శ్రీకృష్ణుని నుద్యమంబునఁ జూడ నాసక్తిమైఁ దమయాననమ్ము
లాదిక్కునందుండ నంభోజకర్ణిక జుట్టువ్యాపించినయట్టి ఱేకు
లట్టులు చూడంగ నానంద మొనఁగూడ నుండిరి; బాలకు లొక్కకొంద

తే. ఱెలమిఁ బుష్పదళంబుల నింకఁ గొంద
ఱల్లిపల్లవములఁ బండుటాకులందు
మఱియుఁ జిగురులయందును మమత నుట్ల
యందు భూరుహచర్మములందు బూన్కి. ౮౪ 813

క. పలువిధములుగాఁ దోఁచెడు, శిలలందును నన్నమును బ్రసిద్ధము లౌ కూ
రలులోనగువానిని నిడి, యెలమిన్ భుజియించి రపుడు కృష్ణునితోడన్. ౯ 814

క. తమతమయాహారవిశే,షములను నితరేతరంబు • సమధికమోదం
బమరం జూపుచు స్వాదు,త్వము నెన్నుచు నవ్వి నవ్వఁ • దమ రొనరుచుచున్.

క. హరిఁగూడి బాలురు భుజిం,చిరి; యజ్ఞములందు భక్తిఁ • చే నిడుహవ్యో
త్కరమును గుడిచెడు పరమే,శ్వరుఁ డాకృష్ణుండు మనుజ • బాలకుఁ డగుచున్.

సీ. బాలకక్రీడలఁ • దేలుచుఁ గటివస్త్రమున వేణువునుజొన్పి • యనువు మీఱ
నెడమచంకను జక్క • శృంగవేత్రములొప్ప వామహస్తంబున • వర్ణనీయ
మండంబు దీయని • మంచిదధ్యన్నంబు కబళంబుగాఁజేసి • కరము ప్రీతి
నమరించుకొని దాని • కనువగునూరుగాయలు వ్రేళ్లసందున • వెలయఁబ్రియవ

తే. యస్యు లందఱుఁ దనచుట్టు • లతిముదమున
నిలువఁగా వారినడుమఁ దా • నిలిచి పొలిచి
నర్మవాక్కుల వారిని • నవ్వఁజేయు
చును సురలుచూడఁ జలిదిని • దినియె నపుడు. ౧౧ 817

ఉ. భారతవంశమౌక్తికమ! • బాలకు లత్తఱి నచ్యుతాత్ములై
శ్రీరమణీమనోహరునిఁ • జేరి భుజించుచునుండ వత్సముల్
సారతృణాభిలాషములఁ • జయ్యన నొయ్యన నవ్వనంబులో
దూరముపోయె నయ్యెడలఁ • దోఁచెడు పచ్చికమీఁది మచ్చికన్. ౧౨ 818

తే. చాల దూరముపోయె వత్సమ్ములంచు
భయముచేతఁ గలంగు నా • వత్సపాల
కులను గని భీతిఁ బాపంగఁ • దలఁచి యిట్లు
పలికె సఖులార! భుజియింపుఁ • డులికిపడక. ౧౨౪ 819

క. ఇదెపోయి వత్సములఁ దె,చ్చెద వేగ మరల్చి యిటకుఁ • జింతల నింకన్
వదలి సుఖంబుగఁ గుడువుం, డిదెపోయెద నంచుబల్కి • యేచినప్రాన్కిన్. ౧౩

క. కరమున నన్నకబళముల్, ధరియించియె క్రేపులను వె • దకి కొనితేరన్
బరమేశ్వరుండు విపినాం,తరమునకుం బోయి యద్రి • దరులం బొదలన్. ౧౩౪

క. ధరణీధరబిలముల యం,తరముల లేఁగలను హరియు • దా వెదకుచు స
త్వరముగఁ జనియెన్ దనమదిఁ, బరికించియు నెఱుఁగనట్టి • వడువు గనఁబడన్.

బ్రహ్మ తనమాయచే వత్సబాలురను దాఁచుట.

తే. హరియు లేఁగల వెదకంగ • నరుగుటయును,
బాలు రందుండుటయుఁ గాంచి • బ్రహ్మ యదియె
యంతరంబుగఁ దలఁచి తా • నింతకుమును
పయ్యఘాసురు వదనగ • హ్వరమునుండి. ౧౮౪ 823

క. లీలామాత్రంబుగ నా, బాలకులన్ వత్సములను • భగవంతుఁడు తాఁ

దోలుకొని వచ్చు టెఱ్ఱఁగియు, నోలిం గపటార్భకుఁడుగనున్న రమేశున్. ౧౪

చ. కనుఁగొని యింకనుర్ హరి యఖండమనోజ్ఞమహత్త్వముం గనుం
గొన మదిఁ గోరి యభ్రతలగోచరుఁడై కనినంతకంటెఁ జ
క్కనియది యెట్టిశక్తియొకొ ఽ కన్గొనువాఁడను విస్మయంబు నే
గనితిని మున్నె యిప్పుడును ఽ గాంచెద దాని నటన్న పూన్కితోన్. ౧౫ 825

ఆ. వత్సములను గోపబాలకులను దాఁచె, నితరు లెఱుఁగకుండ ఽ నెందొ తా న
దృశ్యుఁడయ్యె; హరియు ఽ నెల్లెడలర్ వత్స, ములను వెదకి యడవిఁగలయఁదిరిగి.

చ. పులినతలంబుఁజేరి సఖిపూగము గానక వారిపోకడల్
దలఁచుచు నింకనుం దిరిగెఁ ఽ దద్వనమందలిచోటులర్ ద్వరం
గలయఁగఁ జూచె నెచ్చటను ఽ గానఁగరామిని విశ్వవేత్తయా
జలరుహనాభుఁ డద్ది విధిచర్య యటంచు నెఱింగె నాత్మలోన్. ౧౬ 827

చ. కమలదళాక్షుఁ డావులకు ఽ గాదిలిమిత్రుల మాతృరాజికిర్
బ్రమదముఁగూర్ప లోఁదలఁచి ఽ బ్రహ్మకు స్వాయతశక్తిఁ జూప నా
సమయమునందె లేఁగలుగఁ ఽ జక్కనిబాలురగాఁగ నాత్మ మా
య మెఱయఁ జేసె రెండుగ నహో యని బ్రహ్మయు విస్మయంపడన్. ౧౭ 828

సీ. విశ్వదృశుండయి ఽ వెలయుశ్రీకృష్ణుండు తా నజుండయ్యు నత్తరుణమందు
సర్వస్వరూపతఁ ఽ జనుఁగాన వత్సములకు గోపబాలకులకును గల్గు
నాయాయికుఱుచదేహములునాయాప్రమాణములఁజెలంగుహస్తములు కాళ్లు
మొదలగు నవయవములు బాలకులు పట్టుకొనెడు దండమ్ములుకొమ్ములు మఱి

తే. వేణుదళములు నుట్లును ఽ వితతములగు
నాభరణములు వస్త్రమ్ము ఽ లల్లె శీల
సుగుణములు నామరూపముల్ ఽ చొక్కపువయ
సులు విహారంబులాదిగాఁగలుగు నవియు. ౧౮ 829

క. ఇంచుకయేని కొఱంతం, గాంచకయుండంగఁ దాను ఽ గల్పించి జనుల్
కాంచినఁ బొరపడనటు గా,వించెర్ సర్వమును బూర్వ ఽ విధముగ నొప్పర్.

శా. సర్వంవిష్ణుమయం జగత్తను సుధీసంమోదవాక్యార్థమే
పర్వెం జుమ్మిటు మూర్తి దాల్చి జగతిం ఽ బ్రత్యక్షమై యంచు శ్రు
త్యుర్వీతత్త్వమెఱింగినట్టి జనులే ఽ యూహింపఁగాఁజాలి యా
సర్వేశుండు చెలంగెఁ బద్మజుఁడు లజ్జం బొందున ట్లింతయున్. ౧౯ 831

సీ. సర్వాత్మయయి తగుచక్రి యంతటఁ బ్రయోజకకర్తయైన కృష్ణస్వరూపుఁ
డై తనరారుచు ఽ నల్లె ప్రయోజ్యకర్తలగు గోపకుమారకుల తనువుల
ధరియించియున్నట్టి ఽ తన్నె కార్యంబులఁ గడఁగి పంచుచుఁ గర్మ ఽ కారకతను

వులగు క్రేవులరూపకములఁ దాల్చియున్న ట్టితనదె గొబ్బునఁ దోలుకొనుచునాత్మ

తే. విహరణంబులనుగ్ర బెక్కు-విధములుగను
గనఁబఱచుచుంట యద్భుతం బనఁగఁ బరఁగె;
నట్లు చని మందఁజేరె నయ్యాదిమూర్తి
యందు వేర్వేఱ లేఁగల నర్హరీతి. ౨౦ 832

క. కొనిపోయి వానిగృహముల, ననువుగఁ జొప్పించి తానె యవ్వానిని గా
చినవాఁడు నగుచు వారల,కు నివాసములైన యిండ్లకుం జని తానే. ౨౦ 833

క. ఏమాత్రం బనుమానం, బే మనసునఁ గల్గకుండ నెప్పటియట్లే
యామాధవుండు లేఁగల,తో మందిరమునకుఁ జేరెఁ దోరపుకీర్తి.౨౦ 834

వ. అంత నమ్మందనున్న మందయానలు వేణునినాదంబులు చెవులువండువులుచేయ సత్వరంబ లేచి యడవులనుండి తమతమబుడుతలు వడి నరుదెంచి రనుసంభ్రమంబునఁ గుమారరూపంబులనున్న యమ్మాయామానవకుమారుఁ దమకుమారుంగా భావించుచు నాపరబ్రహ్మమునే సుకుమారకరద్వయంబును సారించి యొత్తికొని నిర్భరాలింగనంబున సుఖించుచు గాఢస్నేహంబునలో నిముడక నిబ్బరంపుగుబ్బలు చేపఁ బ్రవాహంబువలెఁ గాఱ నమృతమువడవున స్వాదువులై యాసవంబుచందంబున మత్తుగొలుపునవిగాు వెలయునాక్షీరంబులఁ గుడిపి యుపలాలించిరి. రాజేంద్రా! యిట్లు శ్రీకృష్ణుండు తానే యందఱకుం గుమారుండై తత్తద్వర్తనంబుల నిరుపమానప్రమోదంబుగల్పించుచుఁ గ్రేపులమేపుచు సందెప్రొద్దున నింటి కరుదెంచుచు నుండనాతల్లు లుల్లాసంబునఁ దమతమ తనయులకు నలుంగుపెట్టి జలకమ్ము లాడించి పరిమళచందనపంకంబుఁ బూసి యలంకరించి రక్షాతిలకంబు పెట్టి యెంతయు నుపలాలింప నలరుచుండె ధేనువులు తమయంబారవంబులఁ గ్రేపులంబిల్చి దాపునకుఁ బరుగెత్తివచ్చిన లేఁగలు తమ తమవత్సంబు లనియే తలంచి వానియొడలంతయు నాఁకుచు నమృతమయపయస్సులంజేపి గ్రోలనిచ్చె గోవులకు వత్సరూపుఁడై గోపికలకుం గుమారరూపుఁడై యున్న యావెన్నునిపయి నుపలాలించుటమొదలగుమాతృకృత్యంబులు యథాపూర్వంబులుగ నుండె విశేషించి స్నేహమొక్కటియే భేదముగానుండె మఱియు శ్రీకృష్ణునకు వీరు నాతల్లులని వీరికి నేఁగుమారుఁడ ననుసీమాయానటనము విశేషించియుండె నంత. ౨౪ 835

ఉ. మందవసించు గోపకులు మాధవు నాత్మసుతాళికంటె నె
న్నం దమిమించఁ జూతురు దినంబును బుత్త్రులు కృష్ణమూర్తులౌ
టం దగ వారియందును గడంగెఁ ప్రమోదము నిత్యవృద్ధినై
పొందుగ నొక్కవత్సరముఁ బుచ్చఁగ నొప్పి రతథ్యవేత్తలై. ౨౬ 836

మ. వనమందుఁ౯ మఱిమందయందు నొకఁడౌ § వర్షంబు శ్రీకృష్ణుఁ డా
త్మను వత్సంబుల వత్సపాలకులఁగాఁ § దానే వినిర్మించి క్రొం
చు నిదే హేతువుగాఁగఁ గేళిసలిపె౯ § శుంభ౯ మహామాయచే
తనె రైదాఱుదినంబులే కొఱఁతఁ గాఁ § దద్వర్షము౯ నిండినన్. ౨౭ 837

మ. ఒకనాఁ డాహరి రాముఁగూడి కుతుకం § బుత్సాహముం బొంగఁ గా
నకు వత్సంబుల మేపఁగాఁ జనియె నంత౯ బర్వతోత్తుంగశృం
గకఠోరస్థలమందు నొప్పు మృదువౌ § ఘాసం బొగి౯ మేయుగో
నికరం బత్తఱి మందచెంతఁ దృణము౯ § నెమ్మిం దినం గోరుచున్. ౨౮౪ 838

క. చరియించు వత్సములనుం, బరికించెను వానిఁజూడ § వాత్సల్యము ని
ర్భరమౌటను దేహములను, స్మరియింపక గోపకులును § జక్క నిలిపినన్. ౨౯

క. నిలువక పరుగిడు వేగం,బులఁ బదములు నాల్గు రెండు§వోలెఁ గనఁబడ౯
జెలఁగుచు మెడలను మూఁపుర,ముల వంచికడంగి వాల§ముల మోరలనున్. ౨౯౪

ఆ. పయికినెత్తి మఱియుఁ § బటుహుంకృతులు దగఁ
బొదుగునుండి స్నేహ§మున స్రవించి
పాలు కాఱుచుండఁ § బథమెంత దుర్గమ
మైన లెక్కగొనక § యరుగుదెంచె. ౩౦ 841

సీ. గోవర్ధనాచల§కూటమునుండియె దిగివచ్చి వత్సముల్ § తిరుగుచుండఁ
గనుఁగొని మరల లేఁ§గల నీనియున్నను బూర్వవత్సములందుఁ § బొలుచుస్నేహ
మున వానియంగంబు§లను జక్కనాకుచుఁ బాలఁ ద్రావించె గో§పకులు వానిఁ
బోవకుండఁగ నాపఁ§బూనియుఁ దమశ్రమ మప్డు వ్యర్థంబౌట § నధికలజ్జ

తే. యట్టికోపంబు నీరెండు § మిట్టిపడఁగ, నడువఁ దగనట్టిమార్గము§న౯ శ్రమంబు
నందుచు౯ వచ్చి క్రేపుల§యంతికమున, నున్న తమసుతులం జూచి § రొక్కమొ

క. త్రపయును గ్రుధయును గష్టము, నపరిమితముగాఁ జెలంగ§నా బాలుర న [గిని.
ట్టిపనికిఁ గొట్టఁగ వచ్చియు, నపుడే వారలను జూడ § నతిమోదంబున్. ౩౨౪

క. మనమున జనించి యిముడక, తనయంతన తానె పొంగఁ § దనయుల నాలిం
గనముల మూర్ధాఘ్రాణము,లను వర్ధిలఁజేసి రో యిళ§లానాథమణీ! ౩౩ 844

క. ఈరీతి గోపకులు గో,వారంబు నపత్యములను § వత్సంబులఁ బెం
పారెడుముదమునఁ గనుచును,జేరి పరీరంభణంబు § చేసి కడంకన్. ౩౩౪ 845

తే. ఎట్టకేలకు వారి నక్కఁ§దెట్టొ వదలి, వారినే స్మరియించుచు § బాష్పవారి
కన్నులను గ్రమ్మి ప్రవహింపఁ§గా వెడలిరి, వ్రజమునం గల్గు గోపాల§వారము

క. గోపికలకు గోవులకును, జూపట్టిన ప్రేమభరము § సొరిదిఁ బెరుగుట౯ [నకు. ౩౮
వే పరికించుచు రాముం, డీపగిదిం బాలువిడిచి § యిట్లున్నతఱిన్. ౩౮౪ 847

సీ. ఇంతటిప్రీతి యిట్లీబాలకులపయిఁ బ్రతినిమేషము వృద్ధిఁ బరఁగుచున్న
దిద్ది యేమని హేతు విందుల కేదని యూహించి తెలియక యుల్లమందుఁ
దలపోసె నిట్లు మందను దగువారికి నాకును వసుదేవనందనుపయిఁ
బ్రీతియుండుట నైజమే తలపోయఁగ నఖిలాత్మకుండౌట నర్హమె యది
తే. యట్లె గోపతనూజులయందుఁ బ్రేమ
మతిశయం బగుచున్నదే యద్భుతంబె
యగు నిదియు దీని కేహేతువగునొ? మాయ
యిద్దియెచ్చటిదో నాకు నెఱుఁగరాదు. ౩౭ 848
క. సుర లొనరించిన మాయయొ, నరమాయయొ లేక యసురనాథకృతం బై
పరఁగెడిమాయయొ యివి గా, వరయఁగ నానాథుఁడైన హరిమాయ యగున్.
క. అదిగాకయున్నచో నిట్లిది నాకును మోహ మొలయ నెటుచేయు? నదే
యదిగాదు హరి యొనర్చిన, యదియే యగు ననుచు నెంచి యారాముండున్.
క. తనతోడిబాలకుల వత్సనికరమును జ్ఞానదృష్టిసంధించి కనుం
గొని యందఱు వైకుంఠుం, డనియే యెఱిఁగెఁ సమర్థుఁడౌట నతండున్. ౩౮
సీ. హరిదిక్కు మొగమయి యఖిలేశ్వరా! వత్సము లివి మహేంద్రాంశములని బాల
కులు వీరు దేవాంశములని నేనెఱుఁగుదు నింతకుఁబూర్వమే యిప్పు డన్న
నివి మునులేయని దివిజులువీరని తోఁపకయున్నారు తోయజాక్ష!
యీరెండువిధముల నెఱుఁగునట్లుండియు నీవొక్కరుండవే యిన్ని యనుచుఁ
తే. గనుఁగొనుచు నున్నవాఁడ నిక్కముగ నన్ని
యునగు నీవిట్లు వేర్వేఱ నుండు టెట్లొ
పలుకుమా యన్నవిని యప్డు ప్రభువు సంగ్ర
హముగఁదెలిపిన నారాముఁ డాత్మ నెఱిఁగె. ౩౯ 852
*[చ. సరసిజసూతి స్వీయమగు సత్యపదంబున కేగ నచ్చటన్
హరియుఁ జతుర్ముఖుం డగుచు నాత్మపదంబున నుండె నాతనిన్
సరసిజసంభవుండె యని స్వాంతమునందుఁ దలంచి ద్వార్థ్సులుం
జొరఁబడ నీకత్రోయఁ ద్రపఁ జొప్పడ వే మరలెన్ వ్యథాత్ముఁ డై.] 853
చ. శతధృతి వత్సబాలకుల శక్తిచెలంగఁగ దాఁచిపోయి వే
గ తిరిగిరా స్వమానమునఁ గాల మదయ్యెఁ దృటిప్రమాణ మ
ద్భుతముగ మర్త్యమానమునఁ బోల గణింపఁగ వర్షమయ్యె న
చ్యుతుఁడు వయస్యులం గలిసి సొంపుగఁ గ్రీడయొనర్చు చుండెఁ దాన్. ౪౦

* "బ్రహ్మాపియాతస్స్వస్థానం తత్రస్థేనహి శౌరిణా, మోహితై ర్ద్వారపాలైశ్చ పరిభూతోన్యవర్తత" అనునధిక పాఠమున కిది తెలుఁగు. ఈశ్లోకము ఆంధ్రాక్షరముద్రితభాగవతమునఁ గానరాదు.

చ. అది గని మానసంబున మహాద్భుత మియ్యది గోకులంబునం
దిదివఱ కెంద ఱర్భకులొ । యెన్నియొ వత్సము లంద ఱన్ని యీ
యదనున నాదుమాయ యనునట్టి మహాశయనంబునందు నం
బొదలెదు నింతదాఁక నొకపోలిక లేవఁగ లేదెఱుంగుదున్. ౮౧ 855

శా. వీ రెవ్వారలొ యెందు నుందురొ యిటన్ । వీరుండ నేహేతువో
ప్రారంభంబున నేను మాయగొని యె । ట్లచ్చోట నుండంగ నే
వారిం జేసితినో యిటన్ దగుదు రవ్వా రెందఱో యందఱే
చేరెం గ్రేపులు నన్నియే మఱియు నీ । శ్రీకృష్ణుతో నాడుచున్. ౮౨ 856

తే. వత్సరంబయ్యె నే దాఁచి । వారు వీరు
గారు క్రేపులునుం గాపు । వారె వీర
లగుదురో కారొ యనుచును । ధ్యాననిష్ఠఁ
దలఁచి పరమేష్ఠి గాని సత్యమిది యనుచు. ౮౩ 857

క. తెలియంగఁ జాలఁడయ్యెన్, బలుభంగుల వివిధలోకవారము మోహిం
ప లలింజేయు విమోహుని, జలజేక్షణు విష్ణుమూర్తి । శతధృతి యిట్టుల్. ౮౪

క. మాయామోహితుఁ జేయం, గా యావచ్ఛక్తిఁ జూపి । కడకు హరిమహా
మాయామోహితుఁ డయ్యెన్, జేయం జాలండు హరి వశీకృతుఁ గాఁగన్. ౮౫

సీ. అంధకారపు రాత్రియందు నీహారంపుఁ
దమసును బగటియందు మిణుగుఱుపు
రువు ప్రకాశముఁ దమోరుచుల నవ్వానియం
దును గ్రమంబున నడంగునటు లొరుల
మాయలు శ్రీవిష్ణుమాయలోన నడంగుఁ
గాని స్వకృత్యంబు । గానఁబఱుపఁ
జాలవు చతురాస్యుఁ । డోలిఁ జూచుచునుండ
వత్సంబు లన్నియు । బాలకులును

ఆ. దక్షిణంబ నీరదశ్యామతనువులు, గ్రాలుచుండ నాల్గుకరము లొప్పఁ
గాంతులీను పీతకౌశేయవస్త్రంబు, లమర మకుటవరము । లలరుచుండ. ౮౬

క. కరముల సుదర్శనంబులు, దరగదలును బద్మములు నితాంతము వెలుఁగన్
నిరుపమమణికుండలముల, ధరియించి యనర్ఘహార । తతు లెదలఁ దగన్. ౮౭

క. వనమాలికలొగి మెఱయం, గను శ్రీవత్సప్రభాభి । కలితాంగదముల్
కనఁబడ శంఖపువట్రువ, తనమునఁ దగురత్నవలయతతి మెఱయంగన్. ౮౮

సీ. పదముల నూపురపంక్తియుఁ గటకముల్ రాజిల్లఁ గటిసూత్రరమ్యరత్న
ఖచితాంగుళీయకగణము ప్రకాశింప మఱియు ననేక రమ్యతమభూష
ణములు రాజిల్ల మన్మథునీసడించెడు నట్టిరూపంబు లయ్యెదనునందు
నమర నాపాదోత్తమాంగము సకలావయవముల భూరిజన్మార్జితసుకృ
ఆ. తాభిరాములైన యట్టిభక్తులు సమ, ర్పించినట్టివియును నంచితములు
నవ్యములును నైనశుభవ్యోత్తమతులసీ, దళములఁ దగుహారతతులు పర్వ. ౮౬౨
క. కనఁబడిరి వారిమోములు, ననూనచంద్రిక హసించునట్టి స్మితము లొ
ప్పెను వానిఁ జూడ భక్తుల, మనోరథంబులను గూర్చ మది నెంచి తగన్. ౮౬౩
ఆ. సత్త్వగుణము దాల్చి సర్వంబుఁ బాలింప, నెంచినట్లు మఱియు నెట్టిదైన
యాకటాక్షదృష్టు లలరించి భక్తుల, కాంక్షలను సృజించుకరణి తోఁచు. ౮౬౪
సీ. ఈరీతిఁ జిఱునవ్వు లేపారఁ గ్రీఁగంటిచూపులు చెలువార శోభిలుచును
గనఁబడి రత్తఱి వనజాసనుం డైనతాను మొదలుగాఁగ స్తంభముదను
కఁగల చరాచరములుగఁ దగుభూతాళి మూర్తిమంతంబయి నర్తనముల
గానములను మఱి గల్గునానావిధపరికరంబులతోడ నురుముదమున
తే. వారి సేవించుచుండె నొబ్బంగి నణిమ
మొదలుగాఁ గల్గునైశ్వర్యములు నెనిమిది
మాయలో నగుశక్తులు మఱి మహత్తు
మొదలుగాఁగల్గు నాతత్త్వములు గణింప. ౮౬౬ 866
క. ఇరువదినాలు గటంచుం, బరఁగెడు నవ్వియును వారిఁ బరివేష్టించెఁ
గర మరుదుగాఁగ మఱి య, త్తరుణంబున నద్భుతమనఁ దగియుండంగన్.
సీ. క్షోభకం బనఁదగి శోభిల్లు కాలంబు పరిణామహేతువై పరిగణింపఁ
బడెడుస్వభావంబు వాసనోద్బోధక మైనసంస్కారంబు నట్లె కర్మ
హేతువౌ కామంబు నెన్నఁ దత్తత్తనుప్రాప్తికిం గారణమైనకర్మ [మహిత
మును గుణంబులు సత్త్వసుఖములు వేర్వేఱు స్వమహత్త్వ మాపరేశ్వరుని
తే. మహిమమునఁ గుందునొంద విగ్రహము లొప్పఁ
దాల్చి వారిఁ గొల్చుచునుండెఁ దగినరీతి;
వారు మఱియు సత్యజ్ఞానవంతములయి
యతిశయానందములగు దేహములఁ దాల్చి. ౮౬౮ 868
క. ఉపనిషదత్తు లనందగి, యపరిమితభవార్ణవమ్మునందు మునుఁగ కు
న్నపరమపావనులకు నే, ని పరీక్షింపంగరాని నిర్మలమహిమన్. ౮౬౯ 869
. అలరుచునుండి రదెవ్వని, యలఘుతరోత్తేజమునఁ జరాచర మెల్లన్
వెలుఁగుచునుండునో తాదృశ, జలజేక్షణరూపు లగుచు సంతోషమునన్.

ఆ. పరఁగుచున్న యట్టి బాలకులను గాంచె, వత్సములును వత్సవారపాల
కులను బ్రహ్మమయులు జలజాసనుఁడు చూచి, యింత యనఁగరాని సంతసమున.

క. తనదృష్టిని మరలించుచుఁ, దనయింద్రియదశకము మది తద్దయుఁ జేష్టల్
గనకుండఁగ నలుమోములఁ, గనఁబడు పురదేవత యనఁగా నట నిల్చెన్. ౫౬

వ. ఇవ్విధంబునఁ దర్కమునకు గోచరంబుగాక యసాధారణం బై మహిమమునం
బరిపూర్ణంబై స్వప్రకాశంబై నిరతిశయసుఖాత్మకంబై ప్రకృత్యతీతంబై ప్రత్య
క్షాదిప్రమాణంబుల గోచరంబుగాక, తద్భిన్నం బొక్కండు లేదని యుపనిష
ద్వాక్యంబులం దెలియంబడుచు ననంతంబునగు శ్రీకృష్ణపరబ్రహ్మంబు నెడ సర
స్వతీనాథుండు మోహమొంది తత్స్వరూపలేశానభిజ్ఞుండై యేమియుం దోఁపక
యప్పరమార్థమును జూడనైన నశక్తుం డై కలంతపడుచుండ నవ్విధంబెఱింగి
పరమేశ్వరుం డగువాసుదేవుం డాత్మమాయాతిరస్కరిణిం దొలఁగించె; హరి
యమ్మాయాతిరస్కరణిం దొలఁగించినంతన విరించి మృతుండు బ్రదికిలేచినచందం
బునఁ దెలిసికొని యింద్రియంబులెల్ల బాహ్యార్థవిషయంబులం బరికింప సమర్థంబు
లగుటయు నల్లనల్లనఁ గన్నులు తెఱచి తన్ను నీజగంబును జక్కఁ గనుంగొనియె
తత్క్షణంబ దశదిశలఁ గలయంజూచుచుఁ బెక్కండ్రు జను లుపజీవింప నాధార
భూతంబులుగా నలరుపలుదెఱంగుల వృక్షంబుల నిండి యెల్లయెడలఁ బ్రియం
బావహింపఁజేయం జాలినబృందావనము నెదుటనుండఁ గాంచె మఱియు. ౫౯

చ. పరమేశుండు వసించియుంట గతలోభక్రోధముఖ్యంబు భీ
కరమయ్యెన్ సుఖదంబుగా నలరె నాకాంతార మాకాననాం
తరమందున్ నృమృగాదు లెల్లపుడు నిత్యంబైన వైరంబుతోఁ
దిరుగం జాలినవయ్యు దాని విడి తృప్తిం గల్గి మిత్రంబులై. ౬౦ 874

క. ఇతరేతరంబు గూడియొ, జతనంబున నుండెఁ దొంటిచందంబున వ
త్సతతిన్ గోపకుమారక, వితతిన్ వెదకుచును గోపవేషము వెలయన్. ౬౧

క. తనకరమున దధ్యన్నము, కనఁబడుచుండంగ పాటిగన కద్వయమై
యనుపమ మనంతమును నిం, తనియెఱుఁగన్ రానిదియును నై యచ్చోటన్. ౬౨

క. తిరుగుచు మాయానటనా, దరమునఁ దగుకృష్ణరూప తద్బ్రహ్మము నా
పరమేష్ఠి కాంచె నేత్రో,త్కర మానందాశ్రుబిందుకలితము కాఁగన్. ౬౩

క. కనినంతనె తనవాహన,మునుండి సత్వరమ డిగ్గి భూమిపయిని గాం
చనదండమట్లు గాత్రం,బును దగులఁగ వైచి నాల్గుముకుటాగ్రములున్. ౬౪

చ. హరిపదపంకజాతముల నల్లనఁ దాఁక నమస్కరించి పైఁ
బరఁగు ముదశ్రుబిందుసమవాయము చే నభిషేకకార్యమున్
జరపె; రమాధినాథుపదసారసయుగ్మము మీఁద నెంతొ యా
దరమున శీర్షపంక్తినిడి తత్పరుఁడై మఱి లేచునంతలో. ౬౫ 879

క. మరలంబడు మఱిలేచును, ద్వరపడి పడు మరలమరలఁ । దన్మహిమంబుల్
స్మరియించును స్మరియించుచు, మరలం దత్పదయుగమున । మస్తకములిడున్. ౬౩

క. మెలమెల్ల లేచి నయనం,బులఁ జక్కఁగఁ దుడుచుకొని ప్రభున్ శ్రీకృష్ణున్
దులసీదామవిభూషణు, జలజాక్షుని నట్టెచూచి । సాధువినీతిన్. ౬౪ 881

తే. కంధరము వంచి చేమోడ్చు । కదలుకొనఁగఁ
దనువుకంపింప భక్తి గద్గదికఁ దగిన
పలుకులొప్పఁగ స్తుతియించెఁ । బరమనిష్ఠ
శారదాప్రాణనాథుఁడు । శౌరిఁ గనుచు. ౬౫ 882



## పదునాల్గవయధ్యాయము.

### బ్రహ్మ శ్రీకృష్ణుని స్తుతించుట.

చ. వినుతికిఁ బాత్రభూతుఁడగు । విష్ణువ వీవె పరాత్పరా! లస
ద్ఘనసమదేహ మెంతయును । గ్రాలఁ దటిత్సమవస్త్రధారణం
బనుపమరీతి నొప్ప రుచి । రామలకుండలముల్ కలాపయు
క్తిని గురిజల్ ముఖంబునకుఁ । గేవలనూత్నరుచిన్ దనర్పఁగన్. 883

ఉ. కాననపుష్పహారములు । కంఠతలంబున నొప్పుచుండఁగా
నూనినప్రీతి హస్తమున । నోదనముల్ దధిఁజేర్చి ముద్దగాఁ
బూనికఁ జేసి పట్టుకొని । బుజ్జటకొమ్మును బెత్తముల్ మృదు
స్వానము చేయువేణువును । జక్కని భూషణరాజియై తగన్. ౧ 884

క. మృదుపదసరసిజయుగ్మం,బు దగన్ గోపాలరాజపుత్త్రుండవు గాఁ
బొదలెడు పరమేశ్వరునకు, సదయునకున్ నీకు నతులు । సల్పుదు భక్తిన్. ౧

సీ. దేవదేవా! కృపాధీనుఁడవౌట నాయందలికృపచేత । నాత్మయందుఁ [లియఁ
బొదలు నిచ్ఛాయోగమున గ్రహియించిన యీరూపముమహత్త్వ । మేను దె
జాలను బరిశుద్ధసత్త్వాత్మకమయి యాత్మసుఖానుభవరూపమహిమ వెలయు
నట్టి నీరూపమాహాత్మ్యంబు చిత్తనిగ్రహము గల్గినమహా । మహిములకును

ఆ. దెలియఁ దరముగామి । పలుకంగవలయునే, యేను బ్రహ్మనయ్యు । నించుకేని
యంతరింద్రియ మగునట్టి మనస్సుచేఁ, దెలిసికొనఁగఁ జాల । కలసినాఁడ. ౨

క. జ్ఞానానందమయం బగు, నీనిర్మలరూప మిట్టి । నియతిఁ గనుటం
బూనినశ్రద్ధ నెఱుంగం, గా నెటుశక్యంబొ యెఱుఁగఁ । గాఁ జాల విభూ! ౨

క. జ్ఞానసమార్జన మపు డిం,తే నాయాసంబు నొందకే తమతమవా
స్థానములందె వసించుచు, మౌనిపసంకీర్తితము ప్రమదదానము నై. ౫ 888
తనరారు భవచ్చరితం,బును గాయికవాచికములఁ । బొలుచుప్రయత్నం

బున మానసికవ్యాపృతి, దనివారఁగఁ బూజచేయఁ దగువారలకున్. ౨౪ 889

క. జితుఁడవె యగుదువు దేవా! మతిఁ దలఁపఁ ద్రిలోకములను మఱి యెవ్వరికే
జితుఁడవుగా వెట్లును నిను, గతిగాఁ దలఁచిననె లొంగఁగలవు మహాత్మా! ౩

చ. అనుపమతేజ మూని తగునట్టి హరీ! స్థిరమైనశ్రేయ మీ
యను దగియున్న నీపయి నిరంతర మొప్పెడు భక్తియందు నె
మ్మనమును నిల్పకే మనుజమండల మొక్కట జ్ఞానలబ్ధికై
యనుదినమున్ బ్రయత్నపడు నారయ నయ్యది నిష్ఫలంబెయా. ౩౪ 891

ఆ. ఆప్రయత్న మెల్ల నపగతబీజమౌ, ధాన్య మెంతపట్టుదలను దంచి
నను బ్రయాస మొకఁడె కను నట్లె భక్తిని, వదలి రిత్తశ్రమము వడుదు రెపుడు.

క. కనుకన్ భక్తిని దుచ్ఛము,గను దలఁపక జ్ఞానలాభకార్యంబున దా
నిని దోడుగాఁగఁ గైకొన, ననువుపడున్ జ్ఞాన మిదియె యమలపథంబౌ. ౪

మ. మును లోకంబున నిందు యోగమహిమంబుం గల్గుమౌనీంద్రు లో
య్యన యోగంబుల జ్ఞానముం గనియు నీయంఘ్రిద్వయంబందుఁ దా
రొనరం జేసినయెల్లకర్మముల బాగొప్పంగ నర్పించి దా
ననె లబ్ధంబగు త్వత్కథాశ్రుతియు దానంగల్గు సద్భక్తిచేన్. ౪౪ 894

ఆ. విశ్వరూపకమయి వెలయునీయాత్మను, జక్క నెఱిఁగి సులభసరణి సుఖము
గాఁగఁ బరమగతిని గడుజవంబునఁ గాంచి, యున్నవారు నిర్జరోత్తమేశ. ౫

సీ. శ్రీమనోహర! యపరిచ్ఛిన్నరూప! నిర్గుణుఁడవై తగిన నీరుఁగల మహిమ
మది చూడ నిర్విషయంబు నీరూపంబు వికృతిశూన్యముగాఁగ వెలయుఁ గానఁ
బ్రత్యాహృతేంద్రియపటలంబు గలవారికిని గోచరంబుగాఁ దనుట నిజమె
యగుఁజుమ్ము మఱియు నాత్మాకారమైన యంతఃకరణం బెట్టి తరుణమందు
నమరు సాక్షాత్కార మద్దాన నాత్మప్రకాశాత్మకంబుగాఁగ నెఱుఁగఁదగుఁ
గనుక సామాన్యులకు నెఱుంగఁ దగకుండు నత్యంతనిపుణులై నట్టివారు
భూపరాగంబుల వ్యోమంబునం గలమంచుకణంబుల మఱియు దివిని
గననగు నక్షత్రగణముఖములయిన కిరణవత్పరమాణుపరికరముల

తే. నైన బహుకాలమునకు మహాప్రయత్న,మునను లెక్కింపఁగల్గుదురనిన ననఁగ
వచ్చుఁగాని యీవిశ్వంబుఁ బాలనంబు, చేయఁ గల్యాణసుగుణరాజిని జెలంగి.

క. అవతార మొంది యిట్టులు, ప్రవరతనూధారివగుచుఁ భాసిల్లెడు నీ
దువిమలగుణము లవిన్నియ, యవునని సాధారణముగ నైనగణింపన్. ౬ 897

క. అలవియె కాదని వేఱుగఁ, బలుకఁగవలెనే తలంప భవదమలగుణం
బుల లెక్కింపంగల మని, తలపోయక శక్యమె యనితలఁచి వినీతిన్. ౭ 898

క. ఆవిలమతి వేఱొండే, భావింపఁగ మాని నీదుభవ్యకరుణయే

యేవేళఁ గల్గునో యని, యావేళకుఁ గాచియుండి ౹ యతిశయభక్తిన్. ౨౪ 899
తే. వాఙ్మనఃకాయములఁ జేయు౹వ్యాపృతులును, నిన్నె పూజించుచుఁ బ్రాగ్జ౹నికృత
ఫలము నొందునాసక్తిని ౹ బాఱఁదోలి, సంభవించినదానిని ౹ సంతసమున. [కర్మ
క. హరిదయ యని పొందుచు నీ, ధరణిఁ జీవించునతఁడు ౹ తా ముక్తిపదం
బు రహిం బొందఁగ నర్హుఁడు, పరమేశా! యగును వేఱు౹పథమున నగునే? ౮
సీ. జగదీశ! నాదుదౌర్జన్యంబుఁ జూడు మా౹యూసంతులకు మాయి౹వై చెలఁగుచుఁ
బరమాత్మవై మఱి ౹ పరిమాణరహితమై నట్టివై భవమున ౹ నలరుచుండు
టను ననంతుం డనఁ౹గను ఖ్యాతినొందుచు నరుదుగ నున్నసీ౹యందు నాదు
తుచ్ఛమాయను బన్ని౹తోఁచునట్లుగ వైభవముజూపఁ బూనిన౹వాఁడ; నీదు
ఆ. సన్నిధానమందు ౹ శక్తిగల్గినయట్లు, లిట్లుచేయఁబూన ౹ నెంతవాఁడ
నగ్నివెడలుజ్వాల ౹ లగ్నిముందట నెంత? నే నకించనుండ ౹ నీదు దఱిని. ౯ 902
క. నేను రజోగుణజన్ముఁడఁ, గాన జగత్కర్త ననెడు ౹ గర్వాంధ్యమునన్
గాననికన్నుల వేఱుగ, నేనొక్కప్రభుండ ననెడు౹నిట్టి తలియమిన్. ౯౪ 903
ఆ. దురభిమాన మూని ౹ తోఁచినయటు కార్యములు నొనర్చు నన్నుఁ౹గలుషహారణ
నీదు సేవకునిగ ౹ నెఱనెంచి కరుణార్ద్ర, దృష్టిఁ గాంచి సైపు ౹ మీశ! యిపుడు.
క. నాతప్పులఁ దలపోయకు, మోతండ్రీ! యనుచు వేఁడి ౹ యుప్పొంగెడు న
య్యాతతభక్తివశంబున, నీతీఱున మఱియుఁ బలికె ౹ నింపుగులుకఁగన్. ౧౦
సీ. బ్రహ్మాండరూపవి౹గ్రహముగల్గిన నీవు నీశ్వరుండవె యందు౹వేమొ దేవఁ
ప్రకృతియును మహత్తు ౹ పరఁగు నహంకార మాకాశవాయువహ్ని౹ఘాశనజల
భూములు నసునివ్వి ౹ పొరిఁబొరి నావరణములుగాఁగల్గు నంౕడ మనుఘటము
నం దేడుజేనల౹యంత దేహముగల నేనేడ? యిట్టిగ౹ణింపరాని
తే. యండముల వేని రోమకూ౹పాళియందుఁ
దిరుగుచుండు గవాక్షసు౹షిరములందుఁ
దిరుగుపరమాణువులువోలెఁ ౹ బరిమితియును
నదియె లేకుండు నీదుమ౹హాత్వ మేడ? ౧౧ 906
చ. ఉదరమునందు నున్నశిశు ౹ వొక్కతఱిం దనకాలఁ దన్నన
య్యది యొకతప్పుగా జనని ౹ యాత్మఁ దలంచునె? యున్న దంచులే
నిది యనులోకవార్తలకు ౹ నెన్నఁగ గోచరమాచు స్థూల మీ
యది యని సూక్ష్మ మిద్దియను౹నట్టి జగద్వ్యవహారపాత్రమై. ౧౪ 907
తే. కార్యకారణములను లో౹కప్రవృత్తి, చేత నెన్నంగఁబడు వస్తు౹జాత మెదియు
నీదుకుక్షికి లోపల ౹ నెగడుఁ గాని, వెలుపల నదొక్కటైనను౹ గలదె దేవ. ౧౩
క. కనుకన్ నీకుక్షిస్థుఁడ, నని. నాయీయాగసంబు ౹ నతిశయకరుణన్
గని సైరింపు మధోక్షజ, వనజాక్షా! ప్రళయమగు న౹వసరంబందున్. ౧౩ 909

క. వనధిజలంబులు జగముల, నెనసినపూనికఁ జెలంగి యేమాత్రం బై
తను నిల్కడ లేకుండఁగ, నొనరిచి యొండొంటితోడ నొగిఁ గూడంగన్. ౧౨౪

తే. ఆమహాజలమందు నారాయణుని యుదరపు నాభినాళంబున ధాత పుట్టె
ననెడు వ్యవహారమది మిథ్యయగునె? సత్య, మగును నీవలననె జన్మమందినాఁడ.

క. నారాయణసూనుఁడవే, యారయ నీవాదు వేమి యగు నాకనుచుం
శ్రీరమణా! ప్రశ్నింతువొ, నారాయణుఁ డనఁగ నీ వనఁగ నొక్కటియే. ౧౩

సీ. సకలదేహప్రవర్తకుఁడవు కావున నారాయణుం డనునామ మయ్యె
నారమునకు నయనమ్ము నీవలననే కలుగుటంజేసి యాఖ్య యదియయ్యె
నఖిలలోకములకు సాక్షివి గావున నట్టినామము నీకు నయ్యె; నరుని
వలనఁ బుట్టిన యిరువదినాల్గుతత్త్వముల్ జలములు నారసంజ్ఞఁ దగు నవ్వి

ఆ. యయనములుగ నగుట నయ్యె నారాయణా
హ్వాయ మటంచుఁ గొంద ఱందు రద్ది
నీదుమూర్తిదైన భేదంబున సమన్వ
యించు నఖిలజగదధీశ! విష్ణు. ౧౩౫ 913

క. కన నపరిచ్ఛిన్నం బై, తనరారెడు నీదుదివ్యతనువునకు జలా
దినియతము పరిచ్ఛేదం, బును నగునీకల్పనంబు పోలఁ దలంపన్. ౧౩౫ 914

క. నీమాయాయోగంబున, నే మహిఁ జెల్లెడిని సత్యమే యది దేవా!
భూమానందుఁడవు జగ, త్స్వామివి నీవొట సర్వతనువులు నీవొ. ౧౪ 915

సీ. జగదాశ్రయం బనఁజాలు భవద్వపు వదిసత్యమగునేని యాదినాఁకుఁ
గనఁబడకుండఁగఁ గారణంబే మొకో కమలనాళైకమార్గమున నేను
జలముల శోధించి యలనీదురూపంబుఁ గానక మగిడి స్వస్థానమునకు
నరుదెంచి తపము మహత్తరనియమంబునను జేసి తపుడె నాకును గనఁబడెఁ

ఆ. గనుక నీదుదేహమునకు దేశవిశేష,మున విభాగము తగు ననుట కల్ల;
మాయఁ దగులకుండ మమ్ముఁ బ్రోచెడుదేవ, యీశరీరమున నెయెసఁగఁ దలఁచి.

క. అవతార మొందితివి దేవవరా! యీతరుణమందె బయట స్ఫుటముగా
నవగతమగు నీజగముల్, భవదుదరములోన నున్నభంగి జననికిన్. ౧౬౪ 917

క. కనఁబఱచుచు మాయావిల,సనముం బ్రకటించితివి విశాలమహత్వం
బునఁ దగు నారాయణుఁడవు, గనుఁ గీర్తింపంగఁబడెడు ఘనుఁడవు నీవే. ౧౬

క. మనయిరువురతో వెలుపలఁ, గనఁబడుచున్నట్టి యీజగంబెల్లను గు
క్షిని గనఁబడుచున్న దిదే, మనవచ్చును? నీదుమాయయగు నిది యెల్లన్. ౧౭

తే. ఒకయశోదకె కాదు నా కొగిని గానఁ
బఱచియున్నాఁడ వెట్లనఁ బ్రథమమందు

నొక్కరుఁడవుగఁ దోఁచితి ॥ వక్కజముగ
వత్సముల బాలురను నేను ॥ బాలిశతను. ౧౭ 920

క. ధరణీధరగహ్వరములఁ, బరికింపఁగ రాకయుండ ॥ బంధురకీర్తీ
బరమేశ! దాఁచితిని ద, త్తరుణంబున బాలవత్సతతును లలరఁగన్. ౧౭౪ 921

సీ. పెక్కండ్రుగాఁ దోఁచి ॥ యెక్కుడుశక్తిచే నగపడితివి మఱి ॥ యంతెకాక
బాలురందఱు చతుర్బాహువులం దగునట్టు లొప్పితివి నే ॥ నఖిలలోక
ములు నుపాసించితి ॥ నెలమి నోదేవేశ! యీవిధ మెల్లను ॥ భావమందు
దలపోసిచూడ నద్వైతపరబ్రహ్మ మగుచు నీవే యనునట్టి నిశ్చ

తే. యంబుగలుగకయుండు నే ॥ యంబుజాక్ష!, నీస్వరూప మిట్టిదియని ॥ నెఱి నెఱుంగఁ
దగనివారికిఁ బ్రకృతిసంస్థతఁ గనఁబడు, నట్టు లొనరిచి యొకవిలాసార్థ మీవు.

క. అమరఁగ నాత్మస్వాతంత్ర్యమునన్ నీమాయ స్రష్ట ॥ మగునట్లుగఁ జూ
పి మఱియు సృష్టికి నే నని, కమలాక్షా! పాలన మను ॥ కార్యంబునకున్. ౧౯ 923

*క. హరి వగునీవని లోకో,త్కరమును లయ మందఁజేయఁ ॥ గాఁ ద్ర్యంబకుఁ డౌ
హరుఁ డనియు మూర్తిభేదము,ల రహిం దోఁపంగఁజేయు ॥ లక్షణమిదియా.౧౯౪

చ. సురమునిమర్త్యులందుఁ గడు ॥ శోభిలురూపము లెత్తి నిర్జరే
శ్వరుఁడుగ భార్గవుండుగను ॥ జానకిభర్తగ నొప్పుచున్ బరే
శ్వర! పశుపక్షిజీవనభ ॥ వంబుల జన్మము లొందు టెల్ల భీ
కరులగు దుష్టులం బొలియఁ ॥ గా సుజనుల్ సుఖవృత్తి నుండఁగా. ౨౦ 925

చ. ఇతరులు చేయఁ జాలరని ॥ యెంచిగొ యప్పనిఁ జేయఁబూని త
చ్యుత! యని స్పష్టమౌ; మహిమ ॥ నొప్పెడు నోభగవంత! యోపరా
త్మ! తను విదంచు నేరికిని ॥ దథ్య మెఱుంగఁ దరంబుగాని య
ప్రతిమసురూప! యోగతతి ॥ పాలక! నీయవతారలీలలన్. ౨౦౪ 926

చ. మనుజుఁ డెవండు లోకముల ॥ మాధవుఁ డిచ్చట నిట్టి కార్యముల్
ఘనరిచె నంచుఁగాని యిటు ॥ పూని యొనర్చె నటంచుఁగాని యి
ట్లనువుగఁ జేసె యత్నముల ॥ నంచును గాని మఱెన్ని కార్యముల్
ఘనత నొనర్చెఁ జూడుఁ డని ॥ కాని యెఱుంగునొ యేనెఱుంగఁజూ. ౨౧ 927

క. తలపోయ నీదుమాయా, విలసన మాత్మేచ్ఛరీతి ॥ వెలయుట దేవా
కలకాలము క్రీడింతువు, జలజాయతనేత్ర మాని ॥ జనసుతిపాత్రా. ౨౧ 928

సీ. అట్లుగావున నసత్యస్వరూపంబయి స్వప్నతుల్యంబయి ॥ సంతతము ని
రస్తమైనట్టి యాప్రతిభాసము తగంగ బహుళదుఃఖాకృతిఁ ॥ బరఁగు నీజ

* "సృష్టావివాహం జగతో విధాన ఇవత్వమేషాంత ఇవత్రినేత్రః" అని మూలము. "జగత స్సృష్టౌ అహమివబ్రహ్మేవ. విధానే పాలనే త్వమివ అంతే ప్రళయే త్రినేత్ర ఇవ" అని వ్యాఖ్య.

గం బెల్ల నిత్యసుఖమయబోధాత్ముఁ డనంతుఁ డనంగ సంతతము కీర్తిఁ [ను
గనెడు నీయందె విఖ్యాతమాయాయోగమునఁ బుట్టుకను లయంబును గనుచు

తే. సత్యమైనట్లు చేతనశాలియైన, పగిదిఁ దోఁచుచునున్నది పలుకులేల?
నీ వొకండవె సత్యమై నెగడి యాత్మ, శబ్దవాచ్యుండవై సుయశమునఁ దనరి.

క. మును పెప్పటినుండియు యుం,డును గావునఁ బురుషుఁ డనఁ గడుం జెలఁగుచు నూ
తనునివలెఁ బ్రాంతయయ్యును, గనఁబడుచుఁ బురాణనామకలన నెసఁగుచున్.

సీ. జ్ఞానసంకోచము మాని స్వయంజ్యోతి యనఁబరఁగుచు మఱియును ననంతుఁ
డనఁగ భాసిల్లి యీయఖిలంబునకుఁ గారణంబౌట నాద్యుఁ డనంగ నొప్పి
శాశ్వతుఁ డగుటచేఁ జక్కని నిత్యశబ్దముగల్గి నాశస్వభావ మెడలి
యక్షరుం డనుఖ్యాతి నందుచు విపరిణామరహితుఁ డవగుచు మహిమ మొందు

తే. కారణమున నజస్రసుఖప్రసిద్ధ, నామ మలర నిరంజననామధేయ [డవు నయి.
మొప్పఁగాఁ బూర్ణుఁ డవగుచు నొప్పి యద్వ,యుండ వగుచు నుపాధిముక్తుం

వ. అమృతుండనియుఁ బ్రఖ్యాతినొంది యున్న నిన్నుఁ బ్రత్యగాత్మస్వరూపమున
గురు వనెడుసూర్యునివలన లభించిన జ్ఞాననేత్రంబునఁ దెలిసికొనువారు సంసార
రూపానృతసాగరంబును దరింపఁ జాలుదురు ఆత్మస్వరూపు నాత్మస్వరూపునిగా
నెఱుంగనివారల కాయజ్ఞానము సాంద్రంబుగాఁ జీఁకటివలె నుండుఁగావున
నీజగంబు రజ్జుసర్పభ్రమంబు చందంబునం దోఁచు జ్ఞాననేత్రవిరాజితుం డారజ్జు
సర్పభ్రమంబు నొందక దాని నిరసించి సత్యస్వరూపం బిట్టిదని యెఱుంగం జాలి
యుండు మఱియు. ౨౫ 932

క. భవబంధమోక్షము లనం, గవఱలు నీరెండు నరయఁ గా సత్యతరుఁ
సువిమలవిజ్ఞానత కో, యవనీశా! వేఱుగామి నాత్మ నెఱుఁగుమా. ౨౫ 933

సీ. నిత్యప్రకాశుఁడై నెగడుభాస్కరునకుఁ దేజంబు గల్పింపఁ దేజ మార్పఁ
గలుగు నహోరాత్రములు వేఱుదృష్టిచేఁ గనఁబడినను వస్తుగతిని నరయ
నట్టివి కాని యట్లరయ నఖండానుభవరూపుఁడవు నిత్యపావనుఁడవు
నైన నీయందు నొయ్యఖిలేశ! వాస్తవంబులు గావు కనుక నే భూరిభయద

తే. మైన సంసారబంధము దానివలన, ముక్తియును జక్కఁ బరికింపఁ బొలుచు లోక
దృష్టి గమ్యంబులే కానియితరము లెటు, కావు జ్ఞానస్వరూప యగమ్యమహిమ.

వ. ఆత్మయందు దేహాదిభావనయు దేహాదులయం దాత్మాధ్యాసమును గల్పించుకొని
పరమాత్మ యెందో వెలుపలనుండునని వెదకుచుందురు. కట్టా! యిట్టి యజ్ఞులగు
మానవుల యజ్ఞానము నేమని యూహింపవలయు. ఈయన్వేషణంబుం దలంప
నంతర్నష్టపదార్థమును బహిర్భాగమున వెదకుచందంబున నున్నదికదా. చిజ్జ
డాత్మకంబైన దేహమునందే జడపదార్థముం బరిహరించి పెద్దలు చిదాత్మకుఁడ
వగు నిన్నుఁ దలంతురు. వాస్తవముగా రజ్జు వొక్కచోఁబడియుండ దానిం

గాంచి యజ్ఞుఁడు సర్పమనితలంచి భయంపడి యయ్యదిభుజగముకాదు రజ్జువని నిశ్చయించుకొను నంతదనుక దానిని రజ్జువుగా నెఱుంగంజాలని యట్లు నజ్ఞానాధ్యస్తంబగు జడాత్మభావంబును దొలఁగింపక యాత్మజ్ఞానంబును వాఁడు పొందఁ జాలఁడు. ౨౮ 935

క. పరమార్థరూప మది యిఁకఁ, గర్ణిక జ్ఞానైకసాధ్యఽకం బయినను శ్రీ
పరమేశ! నీదుపావన, చరణసరోజాత సుప్రఽసాదలవమునున్. ౨౮౪ 936

చ. అనుపమయోగదివ్యఫల ఽ మందనియాతఁ డదెంతకాల మిం
తనివచియింపరాని విధి ఽ యాత్మను దాఁ దలపోసియైన శ్రు
త్యనుమితమై యపారమయి ఽ యత్యమలంబును దావకంబునై
కనఁబడు తత్త్వముం దెలియఁ ఽ గాఁ గలఁడే పరమేశ! శ్రీహరీ! ౨౯ 937

క. కావున! శ్రీగోపాలా!, యీవపువున నేని పశువు ఽ లింక నవేవో
యావర్షములందే భవ, మేవిధి నాకైన నందుఽనే సమలమతిన్. ౨౯౪ 938

*ఆ. నీదుభక్తవితతి ఽ నే నొక్కరుండనై, భవదుదారచరణ ఽ పల్లవంబుఁ
గొలువఁ గల్గునట్టి ఽ యలఘుమహాభాగ్య, మొందఁ గోరువాఁడ ఽ నోమహాత్మ!.

సీ. పరమేశ్వరా! క్రతూఽత్కరము లెవ్వనిఁదృప్తిఁజేయఁజాలకయుండుఽనో యనంగుఁ
డవగు నా నీవె వఽత్సవితతిరూపము నంది గోవులకును ఽ నర్భకతను
దనరి గోపికలకు ఽ స్తన్యామృతముఁ గ్రోలి ప్రమదంబుఁ గల్గించి ఽ పరఁగితి వటు
గావున గోగోపిఽకలు తలపోయఁగ నతిధన్య లతిధన్య ఽ లౌర! భువిని

తే. నందగోపునిదౌ మందఽయందు నున్న, వారిభాగ్యం బదెట్టిదో ఽ భాగ్య మనఁగ
నద్దియే యౌర! వర్ణింప ఽ నలవిగాదు, పూర్ణతముఁడు సనాతనఽపురుషుఁ డజుఁడు.

క. పరమానందాత్మకుఁడును, బరిపూర్ణబ్రహ్మము నగు ఽ పద్మాక్షుఁడు తా
సురుచిర మిత్త్రుం డయ్యెను, బరికింపఁగ దాని మించుఽభాగ్యము కలదే. ౩౨ 941

క. వారల భాగ్యమహత్త్వం, బారయ శక్యంబుగామి ఽ నద్దానివిధం
బేరీతివర్ణ్యమగు నో, సారసపత్త్రాక్ష! జ్ఞానఽజడునకు నాకున్. ౩౨ 942

క. వినవయ్య! యహంకారం,బునకు నధిష్ఠాత యగుచుఁ ఽ బొలుచుశివుండుం
మనసునకుఁ బుద్ధిచిత్తా,దినిఖిల తనుభాగములకు ఽ దేవత లగుచున్. ౩౨౪ 943

తే. పొలుచు చంద్రాదులైన మేఽము తలపోయఁ
గను బదునొకండ్రుగ గణింపఁ ఽ గాఁ జతుర్ద
శతఁ దగినదేవతలము నీ ఽ చరణసరసి
[1]జాత మధ్వమృతాసవ ఽ మాతతముగ. ౩౩ 944

* "భవజ్జనానాం భూత్వాని షే వేతవపాదపల్లవమ్"అని మూలము. 1 "అంఘ్ర్యుదజమధ్వమృతాసవం తే" అని మూలము. "అంఘ్రీ ఏవఉదజే వారిజే తయోర్మధుమకరందః తదేవామృతంస్వాదుఆసవం మార్ద్వీకమ్" అని వ్యాఖ్య.

క. వనజాక్షా! యొకయింద్రియ,మును బాత్రముగా గ్రహించి భూరితరప్రీ
తిని బ్రత్యేకము పలుమఱు, మనసారఁగఁ గ్రోలుదుము క్రమంబున నహహా! ౩౩

క. ఘనతరభాగ్యం బిదియే, యనవచ్చును నిట్టి లోకకు టగు నింద్రియపా
లనమున నొప్పెడు మత్ప్రభృ,తినిర్జరులు సంతతంబు దేవాధీశా! ౩౩ 946

ఆ. భవదనూనకీర్తి పరిమళసౌందర్య,ముఖములను మనఃప్రమోద మొప్ప
చిత్త మూని సుంత సేవించినను గృతా,ర్థులముగా సతంబు తలఁతుము కద.

క. సతతము సర్వేంద్రియముల, వితతప్రమదం బడెంతొ వెలయ భవచ్ఛ్రీ
హితపదసరసిజసేవా, కృతి నమరెడు వారిమహిమ మెన్నఁ దరంబే. ౩౩ 948

తే. ఇంతయని దానివర్ణింప నేరికేని, తరమె? యాభాగ్య మెట్లు చేకురు నటన్న
నీజగంబున నందును నీవనమున, గోకులం బనుపావనక్షోణియందు. ౩౩౪

మ. శ్రుతిసంఘాతము లింతదాఁక మిగులన్ శోధించి యెవ్వాని స
త్కృతిపాత్రంబును బాదరేణువు రవంతేఁ గాన లేకుండు నా
శ్రితచింతామణి నా ముకుందు నిను నే చింతించి సర్వస్వ మీ
వె తగన్ సంతత మంచు నమ్మి జతనం బేదే భవత్ప్రీతికై. ౩౮ 950

క. ఒనరించుగోపకుల యం,దునొకని యమలాంఘ్రిరజము తోరపుభక్తిం
గనఁజేయుదాని బొందెడు, మనుజభవం బేదియేని మహిఁ బొందినచోన్. ౩౮

తే. గోపకులభాగ్యమహిమంబు కొలఁతపడక
కల్గు భాగ్యాతిశయ మనఁగా నదె యగు
మనమునం గృత్రిమముఁబూని నిను వధింపఁ
గోరి సజ్జనవేషముఁ గోర్కెఁ దాల్చి. ౩౮ 952

క. చనుదెంచిన రక్కసి పూ,తనయే బకముఖ్యులైన తనవారలతో
నినుఁ బొందె సాధువేషం,బునకే యంతటిఫలంబుఁ బొందెంగాదే. ౩౮౪ 953

చ. ధనములు గేహముల్ సుతవిశాలసుహృత్తనువుల్ ప్రియంబులై
తనరెడుప్రాణముల్ మఱి యుదారతరాశయముల్ విశేష మే
మని గణియింపఁగాఁ దగున వన్నియుఁ ద్వచ్చరణార్పితంబులై
చనునటు చేసి యుండు గుణశాలురు గోకులవాసు లద్దిరా! ౩౮౪ 954

ఉ. ఎంతటిపుణ్యవంతులొ మఱెట్టిఫలంబును బొంద నర్హులో
స్వాంతమునం దలంపఁగను జాలను సర్వఫలప్రదుండవై
యింతనరాని శక్తిదగు నీవె సమక్షమునందు నుందు వి
ట్లింతటి పుణ్యమిచ్చితి విఁకేమి యొసంగఁగ నుందువో హరీ! ౩౯ 955

క. అది యిట్టిదనుచుఁ జెప్పం,గఁ దరము గాకున్నయది జగత్ప్రియబంధూ!
యెదిదాఁక జనులు నీయం,దొదవనిభక్తి గలయట్టులుందురొ తలఁపన్. ౩౯

ఆ. అంతదనుక వారల వగురాగాదులు, స్తేనతుల్యము లగు ధిష్ణ్యములును
గమలపత్త్రనేత్ర! కారాగృహంబులౌ, మోహ మంఘ్రినిగళము నగుఁ జుమ్ము. ౩౬
క. నీసంబంధము గల్గిన, నోసారసనయన! యవ్వియుఁ మాయ మగుఁ
నీసంశ్రయమున నబ్బని, యేసమధికఫలము గలదొ యెఱుఁగంజాలన్. ౩౭
తే. నీప్రసాదంబు నొందిన నృవితతికిని, గలుగఁజేయ నానందని కాయ మెలమి
నిష్ప్రపంచుండవయ్యును నీవు మాయఁ, బూని లోకవిడంబనముగఁ జరింతు.
క. పరమేశ్వర! నీతత్త్వం, బరయఁగ దుర్జ్ఞేయమె యగు నైన నెఱుంగం
దరమగు మే మెఱిఁగితి మని, యురుమతులౌ కొంద ఱనుదు రూహాతనరఁగన్.
క. తెలియుదురుగాక వారలు, తెలిసికొనంజాల నేను దెలిపెద సత్యం
బలఘుమహత్త్వము నీయది, ఖలహరణా! నామదికిని గాయంబునకున్. ౩౮
క. వాక్కునకు గోచరింప ద, దెక్కరణి నటంచు నాదు హృదయ మెఱుఁగుఁ జు
మిక్కైవడి నన నేటికి, మ్రొక్కెద నాకేమి యెఱుఁగఁ బోల దటంచున్. ౩౯
సీ. శ్రీహరీ! పరమేశ సేవకాభీష్టద సర్వదర్శనుఁడవు సర్వసాక్షి
వట్లుగావున సర్వ మరయంగఁజాలుదు వీజగంబుల కెల్ల నీశ్వరుఁడవు
జగ మెల్ల నీయందె సత్యముగా నర్పితం బయ్యె నాకు నితాంతకరుణ
ననుమతి నొసఁగుమా యవ్యయా! శ్రీకృష్ణ! వృష్ణికులాంభోజవితతిభాను
[1]తే. క్ష్మామర ద్విజ పశుకంధి చంద్రతుల్య! ఘోరపాషండ నిబిడాంధకారహరణ!
దానవాంశజ! కంసాది తతినుదయము, నణె హరించుచు రవితుల్యతను వెలయుదు.
క. వనజాతమిత్త్రుఁ డాదిగఁ, గనఁబడు దేవతలు మ్రొక్కఁ గాఁ దగు దీవే
వనజాక్షా! యాకల్పం, బును మ్రొక్కుదు నీకు సర్వభూతాధిపతీ! ౪౦ 964
చ. అని వినుతించి శ్రీవిలసదంఘ్రిసరోజము లాత్మమస్తకా
ళిని స్పృశియింప లోకముల లీల సృజించువిధాత వందనం
బొనరిచి త్రిఃప్రదక్షిణము లోపికమై నొనరించి సత్యనా
మ నిజనివాసముఁ దివిజమానినికాయముఁ జేరె నెట్టులో. ౪౧ 965
చ. హరియును స్వాత్మజన్మునకు నట్టులనుజ్ఞ నొసంగి పూర్వమే
ధరణితలంబునందు సఖతల్లజయుక్తిని దా వసించెనో
స్థిరవిభవంబుగా దనరు ద్వీపవతీపులినంబు దాని స
త్వరమునఁ జేర్చె వత్సముల బాలకులన్ దనమాయ యేర్పడన్. ౪౨ 966
ఉ. ఆపులినంబునందుఁ గల యాత్మసఖుల్ సుఖరీతిఁ బూర్వమే
యేపగిదిన్ వసించిరొ య దేవిధ మొప్పఁగ నుండి రంతలో

1 "క్ష్మానిర్జర ద్విజపశూదధి వృద్ధికారిన్" అని మూలము. "తేషాంవృద్ధికారిత్వేనహే చంద్రోపమ" అని వ్యాఖ్య.

నాపరమేశుమాయ నొకఁయబ్దము చెల్లియు వారిదృష్టికిన్
దోఁపకయే క్షణార్థముగఁ ǂ దోఁచెఁ బరీక్షిదిలేశచంద్రమా! ౪౩ 967

ఉ. ఏవిభుమాయచేత జగ ǂ మెల్లను మోహితమౌచు స్వాత్మ నే
కావలె నంచుఁ బల్కుఁ ని ǂ కాముము విస్మృతిఁ గాంచుచుండు నా
పావను మాయచే మనసు ǂ బల్విడి మోహితమై తగంగ నే
యేవరుసన్ స్మృతిం గను న ǂ దెవ్వరిచిత్తము సుంత యెన్నుమా! ౪౪ 968

చ. ఇది యొకవింతయే శిశువు ǂ లించుక త్రుత్తును దృష్ణలేక యు
న్నది పరమేశుమాయ తరǂమౌనె యెఱుంగఁగ; నిట్లు వార ల
య్యదనున నాత్మమిత్రతము ǂ నాహరిఁ గాంచి క్షణంబులోననే
వెదకియె వచ్చినాఁడ విట ǂ విందున నీ వరుదెంచునంతకున్. ౪౫ 969

తే. ఒక్కఁడైన మాలోపల ǂ నొక్కకబళ, మైనఁ దినలేదు భక్షింప ǂ నరుగుదెమ్ము
సత్వరంబ భక్షింత మీఁǂచలిదియన్న, మనిరి తమచంద మెఱుఁగనిǂయజ్ఞు లగుట.

క. అంత హృషీకేశుండును, సంతసమున నవ్వుచున్ స్వǂసఖబృందముతో
వింతగ నన్నము దిని యా,[1]చెంతందగు పాముతోలు ǂ చెలికాండ్ర కొసగెన్. ౪౫

క. కనఁబఱచుచుఁ బల్లెకు నా, వనమ్మునుండియె మరల్చె ǂ వారిని నపుడా
వనజాక్షుఁడు తనమస్తక,మున బర్హప్రసవహారǂము ధరించి తమిన్. ౪౬ 972

సీ. నవధాతుచిత్ర మండనచిత్రితాంగుఁడై [2]మహితవేణురవంపుǂమహిమఁ బత్ర
కల్పిత కోమల ǂ కలనాదమున శృంగమృదుతమధ్వనిఁ గృప ǂ మించుతనదు
మనమున కుత్సవం ǂ బొనరింపఁగాఁ దోడిబాలకుల్ తనదగుǂభవ్యకీర్తి
చరిత మింపులుగుల్కు ǂ చందానఁ బాడంగ వ్రజసుందరీమణీǂరాజినయన

ఆ. ములకు నుత్సవంబు ǂ గలిగించు సుందరా,కార మొప్ప వత్సǂకలితుఁ డగుచు
మందఁజేరె నపుడు ǂ బృందారకేశ్వర, వందితాంఘ్రిపాద ǂ వనజుఁ డెలమి. ౪౭

చ. వనముననుండి బాలకులు ǂ వచ్చి యశోదకు సంతసంబు గూ
ర్చు నితఁడు నేఁడు కాఱడవిఁ ǂ జొచ్చి మహత్తరమైనసర్పమున్
దనదగుశక్తిఁ జంపి మముఁ ǂ దన్ముఖగహ్వర సీమనుండి కా
చె ననుచు నెల్లవారు వినఁ ǂ జెప్పిరి గోవ్రజమందుఁ జక్కఁగన్. ౪౮ 974

చ. అని శుకయోగి పల్కవిని ǂ యర్జునపౌత్త్రుఁడు బ్రాహ్మణోత్తమా!
వినవినఁ జిత్ర మయ్యెడిని ǂ వే వివరింపుము స్వాత్మజాళిపై
ననువుగ నింతదాఁకఁ బొలుǂపారని ప్రీతిఁ బరాత్మజన్ముపై
జననము నొంద మందఁగల ǂ సర్వమనుష్యుల కేమి హేతువో. ౪౯ 975

1 "దర్శయంశ్చర్మాజగరమ్" అని మూలము. 2 "ప్రోద్దామవేణుదళశృంగరవోత్సవాఢ్యః" అని మూలము.

చ. క్షితిపతి యిట్లు ప్రశ్నమును § జేయఁగ నాశుకయోగి దాని కీ
గతి బదు లొప్పఁజెప్పె నృప§కాంత! జగంబునఁ గల్గు భూతసం
తతికిని నాత్మ వల్లభత § తద్దయునుండును దానివంక న
ర్థతనయముఖ్య వస్తుసము§దాయముపైఁ దగుప్రీతి యబ్బెడున్. ౫౦ 976

*సీ. కావున రాజేంద్ర! § కాయధారుల కెల్ల స్వస్వాత్మక మనఁ§జాలు నట్టి
దగు నహంకారాస్ప§దాంగంబుపై నెంత ప్రీతియుండునొ § యంత ప్రీతి పుత్త్ర
ధనగృహాదులయందుఁ § దగియెయుండదు మమతాస్పదంబులు గాన§నట్టులగుట
నీయర్థమే తల§పోయ దేహాత్మవాదులకు సమానమై § వెలయుచుండు

ఆ. భూమిపాలవర్య! § భూతజాలమునకు, స్వతను వెట్లు ప్రియమొ§యితరములగు
తదనుబంధి వస్తు§తతులు ప్రియంబులు, గాకయుండుట కిదె § కారణంబు. ౫౧

క. తను వాగి జీర్ణించుచు నుం,డిన జీవితమందు నాశ § నెలకొని యభివృ
ద్ధిని గాంచుచుంటఁ దలపో,సినచో నీయర్థ మెల్ల § సిద్ధంబె యగున్. ౫౨ 978

వ. దేహ మహంకారాస్పదంబుగాక మమతావిషయంబే యయినచో నాత్మ యెట్టు
లట్లు ప్రియంబు గాదని యెఱుంగందగు. కాఁబట్టి పట్టుదలం బరీక్షించిన దేహ
ధారులకెల్ల నాత్మప్రియతమంబు చరాచరంబైన యీజగజ్జాల మెల్లఁ దదర్థం
బని తలంపుము. ౫౩ 979

తే. అట్టియాత్మల కెల్లను § నాత్మ కృష్ణుఁ
డగును వేఱొక్కరుఁడు గాఁడు § హరి యతండు
విశ్వహితము నాపాదింప § వితతనైజ
మాయ గైకొనియే దేహి§మాడ్కిఁ దోఁచు. ౫౪ 980

క. స్థావరజంగమరూపం, బౌ విశ్వం బెల్ల నరయ § హరిరూపంబే
యై వఱలు ననుచుఁ దత్త్వం, బీవిధమున నెఱుఁగువారి § కేవస్తువులున్. ౫౫

క. భగవన్మయములు గానివి,యు గలవటం చెపుడు దోఁప§కుండును వారే
జగమెఱుఁగు వా రటన్నఁ, జగదీశుండై వెలుంగు§చక్రి సతంబున్. ౫౬ 982

సీ. సర్వభూతములకు § సత్యంబు పరమార్థ మగుఁగారణంబుల § కఖిలములకుఁ [ మె
గారణంబును నగుఁ § గనుక శ్రీహరిభిన్న మెయ్యది యుండునో § యెఱుఁగఁ దర
దాని నిరూపింపఁ § దగినవాఁ డెవ్వఁడే నుండునే పావనం § బురుతరంబు
నగు యశంబున నొప్పు§నట్టి మురారి సత్పదపల్లవము సాధు§భక్తులకు స

ఆ. మాశ్రయంబు నగుట § నద్దాని నౌకగాఁ, దలఁచి యాశ్రయించు § ధన్యమతుల
కరయ నీభవాబ్ధి § యగును గోవత్సపా,దప్రమాణ మిద్ది § తథ్యము సుమి. ౫౭

* "దేహాత్మవాదినాం పుంసా మపిరాజన్య సత్తమ, యథాదేహః ప్రియతమ స్తథానహ్యను యేచతం" అని మూలము.

క. పరమపదం బనవారికి, నరయఁగ స్వస్థానమె యగు నాపద్ధేతూ
త్కరములు వారికిఁ గలుగవు, ధరణీపతిచంద్ర! యెఱుఁగఁ దగు విషయ మిదే.

క. హరి కౌమారమునందు న్నొ,నరిచినఁ బౌగండమందు నర్ణవితతంబౌ
చరితము దానిం జెప్పుట, తరమగు నె ట్లన్న ప్రశ్న తతి కిత్తఱినిన్.౫౮ 985

క. వివరించి బదులు చెప్పితిఁ, బ్రవిమలచిత్తులయి పొల్చు బాలురు తనతో
డ వనికి రా నట శ్రీహరి, యవతారఫలంబుగూర్చు న ట్లాడుటయున్. ౫౯

సీ. అఘదనుజునిముట్టి హత మొనరించుట, పులినతలంబునఁ జలుదులార
గించుట తనదగు కేవలచిద్విలాసము సుంతచూపుట కమలగర్భుఁ
డతిభక్తి నుతియించుటను నీమహాపుణ్యకథలను విన్నఁ జక్కఁగఁ బఠించి
నను సకలార్థంబులను గాంచుమనుజుండు, క్ష్మాపాలచంద్ర! యిక్కరణి బాల్య

తే. మచట నారామకృష్ణు లాయర్భకతతిఁ, గలిసి కనుమూసిగంతల లలితసేతు
బంధనమ్ముల మర్కటప్లవనముఖము,లైన కృత్యంబులను దాఁటి రద్భుతగతి.



పదునైదవయధ్యాయము.

శ్రీకృష్ణుఁడు రామాదులతో వనమున విహరించుట.

క. వినుము పరీక్షిద్ద్విజా!, వనజాక్షుని యవలిచరితఁ బౌగండవయ
స్సున రాముఁడు కృష్ణుండును, మనసుల గోపార్భకులు ప్రమద మొందుగతిన్.౪

క. చరియించుచు గోగణముల, నరణ్యముల మేపుచుః మహాపావనప
త్సరసిజముల బృందావనధరణిం బావనతఁ గాంచఁ దమిఁ జేసిరొగిన్. ౧ 989

ఉ. అత్తఱి మాధవుండు తనయగ్రజుతో స్వయశంబుఁ దెల్పున
త్యుత్తమగేయజాలము మహోత్సుకతః సఖులెల్లఁ బాడఁగా
నెత్తఱి నెవ్వరుః వినని యింపు జనింపఁగఁజేయు వేణువుం
జిత్తము పల్లవింప ముఖసీమను జేరిచి యూఁదుచుః ద్వరన్. ౧౫ 990

ఉ. మందలు ముందుచేరఁ దనమానస మయ్యెడ వారితోడఁ గే
ళిం దులతూఁగఁ గోరఁ బటులీలల కాస్పదమై పవిత్రమై
సుందరభవ్యపుష్పగణశోభితమై తగు కాననంబు నొం
దెం దమి నందు భృంగతతి దివ్యమరందము గ్రోలి యేపునన్. ౨ 991

క. మృదుమధుర ఝుంకృతులచేఁ, బొదలుచు నుండంగ మృగసమూహము పక్షుల్
రొద లొదవఁ జేయుచుండఁగ, విదితాత్మల మానసంబువిధమున మిగులన్.౨౪

క. విమలమ్ములైన జలంబులఁ, గమలాకరములు చెలంగఁ గమ్మనితావుల్
రమణం గూర్చుచునుండఁ బవమానుఁ డత్తావు లొప్ప వ్యాపింపంగన్. 3 993

క. మనమున కెంతో మోదం,బును గూర్చెడు నయ్యరణ్యకమును శ్రీకృష్ణుం
డును గాంచి యందు విహరిం,పను వాంఛం బూనెఁ గృత్యకపటల మెఱుఁగుటన్.

చ. వనమున నందునందుఁ గడుశోభాసిలు నెట్టనిపల్లవంబులం
దనరుచుఁ బూవుగుత్తులయుఁ ౹ దద్దయుఁ బండినపండ్లయుర్ భరం
బున విటపోత్తమాంగములు ౹ భూమికి వంగి సహోదరద్వయం
బు నడుగులర్ స్పృశించువిధకముం గనఁజేయుచు నుండె నెంతయున్. ౪ 995

క. మనమునకు మోద మొసఁగెడు, వనస్పతుల వానిఁ గాంచి ౹ బలభద్రునితో
వనజాక్షుఁ డాదిపూరుషుఁ, డనె నిట్లని నవ్వు మోముకనందు నటింపన్. ౪ 996

మ. కనుమా యగ్రజ! యీవనస్పతులు చొక్కం బైనభక్తిర్ సురా
ర్చనముం గాంచెడు నీపదాంబుజముఁ బూకజాసాధనంబో ప్రసూ
ననికాయంబు ఫలాళిఁ గైకొని తమోకనాశార్థమై శాఖలర్
వినయం బొప్పఁగ మ్రొక్కుచున్నవి బలే ౹ విశ్వాస మేపాటిదో?. ౪౫ 997

చ. తరుజననంబు పాపసముకదాయముచేతనె కల్గుచుంట దు
స్తర మగునయ్యఘుం బడఁపఁజాలు భవత్పదపంకజద్వయం
బురుతరభక్తిఁ గొల్చి యది ౹ యూడఁగఁ జేసికొనంగఁ గోరి యీ
తరువు లిటుల్ ప్రానర్చెడి నికతాంతము శ్రద్ధ మనంబులం దగన్. ౫ 998

సీ. ఆదిపూరుష! దేవ! ౹ యఖిలజగత్పావన మగునీయశము సంతతము పట్టు
దలల నీయళిగణకములు గాన మొగిఁ జేయుచును భజించెడిఁ దలంకప నివి లోక
సాధారణము లగుకషట్పదములు గావు వనమున నియ్యెడ ౹ మనుజవేష
మున నిగూఢంబుగాఁ ౹ దనరు దైవము నిన్ను భజియింపఁగా ముఖ్యకభక్తులైన

తే. మునులు షట్పదవేషముల్ ౹ పూని యాత్మ
దైవతము నిన్ను సేవింపఁ ౹ దలఁచి యిట్లు
గూఢముగ నున్నవారు నికక్కువము పూజ్య
నెమిళు లివి యాడుచున్నవి ౹ నిన్నుఁగాంచి. ౬ 999

క. హరిణాంగన లిచ్చోఁ ని,ర్భరమోదము నొంది గోపకవనితామణు ల
ట్లురుతరకటాక్షదృష్టులఁ, బరఁగం జేయుచుఁ బ్రియంబు ౹ వాటించుఁ జుమీ. ౫౪

చ. పికములు సూక్తిజాలములఁ ౹ బ్రీతిని గల్గఁగఁజేసెదుర్ మహా
త్మక! వనమందు నుండియును ౹ ధన్యములే యివి యెల్ల నెంతొ వే
డుక నిలుసేరువారలఁ గడుంగడుఁ బ్రీతిని నాదరించుటే
సకలవిధంబులం గనిన ౹ సాధునిసర్గము గాదె యోవిభూ!. ౬ 1001

క. ఈపుడమియు నియ్యెడలం, వ్యాపృతతృణవీరుధములు ౹ భవదమలాంఘ్రి
వ్యాపారంబున ధన్యము,లై పరమపవిత్రములయి ౹ యలరెం గంటే. ౬౪ 1002

సీ. భవదీయనఖరసంస్పర్శమునం జేసి తరులతాదులు పవిత్రంబు లయ్యెఁ
గరుణావలోకనకలితంబు లగుట నేఁ డిందున్న నిమ్నగ లిందుఁ గల్గు
నద్రులు పతగమ్ము లఖిలమృగంబులు ధన్యంబులయ్యె; శ్రీతరుణి కోరు
భవదురువక్షంబు వదలని తమిచేతఁ గనుచుంట గోపికల్ కడుఁ గృతార్థ
ఆ. లయి రటంచుఁ బలికి యంతట శ్రీకృష్ణుఁ, డతిముదంబు వెలయ నమలసంప
దలఁ జెలంగుచున్న ధన్యబృందావన,మందు ననుచరాళి యాశ్రయింప. ౮౫

క. గిరితటములఁ గాళిందీ, సరిత్తటంబులను ధేనుసమితియు మేయన్
దిరుగుచుఁ గ్రీడించెను దన, చరితముఁ బాడుచును దోడ సఖులును దిరుగన్.

చ. సుమమకరందపానముల సొక్కి మధువ్రతముల్ చెలంగి యిం
పు మదికిఁగూర్ప ఝుంకృతులఁ బూన్కి నొనర్పఁగ రాముఁడున్ సఖుల్
మమతనుఁగూడియుండఁ గుసుమంబుల దండలుదాల్చి తన్నినా
దముగతిఁ బాడుచుండు నొకధాత్రిని రాజమరాళముల్ తమిన్. ౧౦ 1005

ఉ. గుంపుగఁగూడి హాయిగను గూజితముల్ పొనరింపఁ దానునున్
సొంపుగ వానిచందమునఁ జొక్కుచుఁ జేయును గూజితంబు న
ట్టింపుగఁ గేకులొక్కయెడ నృత్యముచేయఁగఁ దానునట్లె నృ
త్యంపుఁదెఱంగు కానఁబడునట్లు కరంబులఁ ద్రిప్పు నవ్వఁగన్. ౧౧ 1006

[1]ఉ. ఒక్కయెడం దృణాశఁగొని యొండొకదవ్వున నున్నచోటికిం
గ్రక్కునఁ బోయియున్న పశుకాండము గోవులు గోపబాలకుల్
మక్కువ నొందు నట్టిఘనమంద్రరవంబునఁ బేరుపెట్టి యా
ప్రక్కకు రమ్మటంచుఁ బలుభంగులఁ బిల్చును నందసూనుఁడున్. ౧౨ 1007

తే. క్రౌంచపిట్టలు చక్రచకోరకములు
మఱి భరద్వాజములు బర్హిమండలములు
కూయుచుండఁగ నట్టులే కూయు నొకట
వ్యాఘ్రములును మృగేంద్రముల్ వడిగ నడర. ౧౨౫ 1008

[2]చ. కదుపులు వానిఁగాంచి వడిఁగాఁ బరువెత్తఁగ దాను గూడ న
య్యదనున భీతినొందినటు లాపశుబృందముతోడఁ బర్విడున్
ముదమున నాటలాడి శ్రమముం గని గోపకునంకసీమపై
నఁ దలనుజేర్చి దిండుగఁ గొనంబడ నయ్యది యున్న యన్నకున్. ౧౩౫ 1009

ఆ. అడుగులొత్తి తానె యాదృతి నుపచార,ముల నొనర్చి శ్రమముపోవఁజేయు
నిట్లు హరియొనర్ప నెలమి గోపకుమారు, లాడుచున్నఁ బాటపాడుచున్న. ౧౪

1 "క్వచిదాహ్వయతి ప్రీత్యా గోగోపాలమనోజ్ఞయా" అని మూలము. 2 "అనుకరోతి స్మ సత్వానాం భీతవద్వ్యాఘ్రసింహయోః" అని మూలము.

క. ఎగురుచునున్నఁ బరస్పరముగఁ బెనఁగుచునున్నఁ గృష్ణమూర్తియు హాలియుఁ
సొగసుగఁ గరములఁ బెనచుచు, నగుచు సెబాసంచు నెమ్మనంబు లలరఁగన్. ౧౫

సీ. అగ్గించుచుందు రట్టాకాన శ్రీకృష్ణుఁ డొక్కచోటను బాహుయుద్ధకేళి
విహరించి శ్రమమొంది విటపిమూలంబునఁ జిగురుటాకులనైన సెజ్జయందు
బాలకాంకమ్ముపబర్హాణంబుగ శయనింపఁగా నమ్మహానీయమూర్తి
కొక్క కొందఱు మహోద్యోగంబునం బాదసంవాహనము చేయసకలపాప

తే. హారముగా మఱికొందఱు హారికిసల
యాదినిర్మితసురుచిర వ్యజనములను
విసరుదురు మఱికొంద ఱా వేల్పుతేని
కమ్మహాత్మునకుఁ స్నేహ మతిశయిల్ల. ౧౭ 1012

క. అనురూపగీతముల నెమ్మన మెంతయు హాయినొందమాడ్కి మృదుతర
ధ్వనిఁ బాడుదు రీవడువునఁ, దనదుస్వరూపంబు నెఱుఁగఁ దగ కుండంగన్.

క. తనమాయచేత గూఢముగను జేయుచు గోపబాలకత్వముఁ జరితా
ళిని గనఁబఱచుచు సాగర, *తనయాలాలితమనోజ్ఞతర పదయుగుఁడై. ౧౮ 1014

క. ప్రాకృతులలోనఁ దా నొక, ప్రాకృతుడుంబోలెఁ గేళిఁ బాటించుచు స్వే
చ్ఛాకలితలీల నీశత, నే కనఁబడఁ జేయుచుండెఁ గృష్ణుం డొకటన్. ౧౯ 1015

## భేనుకాసురుని రాముఁడు వధించుట.

క. ఈరీతిఁ విహరించుచు, సారసపత్రాక్షుఁ డుండె సాంద్రాటవిలో
శ్రీరాముఁగూడి బాలక, వారము కొలువంగ స్వేచ్ఛ వర్ధిలుచుండన్. ౧౯

క. కలఁ డొక్కఁడు శ్రీదాముం, డలఘుగుణాకరుఁడు నాఁగఖ్యాతిం దగి మి
త్రులలోన మిత్రుఁడై పెంపలరఁగ హరిరాములకు విహారములందున్. ౧౯

తే. తోడుగా నుండె సుబలుండు స్తోకకృష్ణుఁ
డాదియైన గోపాలుర ననుఁగుసఖులఁ
గూడి యొకతఱి నాతండు కోరి కృష్ణు
కడకు నేతెంచి యిటుపల్కెఁ గమ్రభణితి. ౨౦ 1018

క. రామా! రామా! శ్రీకృష్ణా! మర్దితదుష్టదైత్య! యస్మద్వాక్యం
బేమఱక వినుఁడు కలదొక, భీమాటవి దవ్వుగాని పృథ్వి నదితగున్. ౨౦ 1019

ఉ. తాళమహీరుహంబు లటఁ దద్దయు నొప్పెసలారుచుండు నం
దోలి బృహత్ఫలప్రకర ముర్విపయిం బడియుండుఁ గొన్ని యీ
వేళనొ రేపొ పండి పడ వేచియె యున్నటు లుండుఁగాని యా
జోలికిఁ బోవ రెవ్వరనఁ జోద్యమగుఁ వినుఁడీ వచించెదన్. ౨౧ 1020

* "గోపాత్మజత్వం చరితై ర్విడంబయన్ రేమేరమాలాలిత పాదపల్లవః" అని మూలము.

క. సురవైరి ధేనుకుండను, దురాత్ముఁ డొక్కండు వనిని దోఁచి ఫలసము
త్కరముం దినుచుండున దె,వ్వరికే నవి చిక్కకుండు వానిభయమునన్. ౨౨

చ. అతఁ డతివీర్యవంతుఁ డసురాగ్రణి యోబలభద్ర! కృష్ణ! యా
దితిజుఁడు గార్దభాకృతిని దేజరిలున్ మఱి వానిఁబోలి త
ద్ధితమును గోరుచుట్టము లహీనబలాఢ్యులు కూడియుంద్రు మ
ర్త్యతతిని జంపువాఁ డగుటఁ దద్వనభూమికిఁ బోవ రెవ్వరున్. ౨౩ 1022

చ. మరణము భీతిదంబగుట మానవమాంతయె యందునుండుటన్
నరు లెవరేని భీతిని జనం దలపోయరు; కాన నవ్వనం
బరుదుగ నిర్జనం బగుచు నయ్యసురవ్రజజుష్టమౌచు భీ
కరముగఁ దోఁచెడున్ బశునికాయము పక్షులు కూడ లేవటన్. ౨౪ 1023

చ. కనుకనె మంచివాసనలు క్రమ్ముకొనం బడియుండు పండ్ల నే
మనుజులుగాని తిన్నదియె మాకు వినంబడ దింతదాక నో
యనఘమనీషులార! యిసుమంత కనుంగొనుఁ డాఫలాళి చ
క్కని వగువాసనల్ కలయఁ గ్రమ్మెడు నల్లడలన్ నితాంతమున్. ౨౫ 1024

క. మనకుంగూడఁ బరీమళ, మనూనహర్షంబు నించె నావాసన మూ
ర్కొనుఁడీ! యని కృష్ణుని గని, వనజాయతనేత్ర! యట్టి వాసనచేతన్. ౨౬

చ. ఫలముల వానినిం దినఁగ భావము లాశపడెన్ మహాత్మ యా
ఫలముల మా కొసంగు బలభద్ర! ఫలంబుల పైకి మామనం
బులు పరువెత్తుచున్నయవి పోవుదమే యట కిప్డె మీకు నీ
పలుకులు సమ్మతంబు లగు భాగ్యముగల్గిన నంచుఁ బల్కనన్. ౨౭ 1026

మ. చెలికాఁ డిట్లువచింపఁగా విని సుహృచ్చిత్తేష్టముం దీర్పఁగాఁ
దలఁపుల్ గల్గిన యాసహోదరులు స్వాంతంబుల్ ప్రమోదాబ్ధిలో
పల మున్గన్ గడు నవ్వుచుం బ్రభుత నొప్పం గాంచువారాట వా
రలు తోఁ రాఁగ మహావనంబునకుఁ జేరం బాఱి రొక్కెత్తునన్. ౨౮ 1027

మ. బలుఁ డాతాళవనంబు చేరఁగ మహాబాహుండు గానన్ భుజం
బుల నాతాళమహీరుహంబులఁ గడుం బూన్కిన్ వడిం బట్టి త
త్ఫలముల్ రాలఁగ నూఁచె మత్తగజనాథప్రాభవం బొప్పఁగా
ఫలసంఘుంబులు భూమిపైఁ బడెడుశబ్దం బుత్కటంబై తగన్. ౨౯ 1028

శా. ఆనాదంబు శ్రుతిద్వయిం జొరఁగ దైత్యస్వామి సక్ష్మాధరం
బౌ నీభూతల మెంతయున్ వడఁకున ట్లాచప్పుడుంబట్టి యా
కానం జేరఁగవచ్చె; స్వీయబలముం గన్పింపఁగా రామునిం
గానంగాఁ జని వెన్క నున్నపదయుగ్మం బట్టి జాడించుచున్. ౩౦ 1029

శా. రామోరస్స్థలమెల్లఁ దత్పదహతుల్ § గ్రమ్మంగఁగా శబ్దముల్
భీమం బౌగతిఁజేసి చుట్టుతిరిగెం § బృథ్వంగ మొప్పంగ; న
క్షే మిన్నం దెదుకోప మూని మఱి యెం§తేఁబూన్కి పూర్కొంచు ను
ద్దామప్రక్రమతం బరాఙ్ముఖుఁడునై § దర్పంబు పొంగన్ వడిన్. ౩౦ 1030

చ. వెనుకటి కాళ్ల నాహలిని § వింతగఁ దన్నె బలుండు క్రోధియై
దనుజుని ప్రత్యగంఘ్రులను § దర్పము పొంగఁగ నొక్కచేతిచే
త నొడిసిపట్టి గిఱ్ఱు మను§ధ్వానము గల్గఁగఁ ద్రిప్పిత్రిప్పి ఱే
ప్వన నొకతాళభూజశిఖఁ § బొందుగతిన్ విసరెన్ జవంబునన్. ౩౧ 1031

చ. కరమునఁ బట్టిత్రిప్పుటనె § గార్దభరూపుఁడు ధేనుకుం డసూ
త్కరములు పాఱిపోవ మృతిఁ§గాంచెను వృక్షశిరంబు గొప్పదై
యరుదుగనుంట రాక్షసుని § యంగము తాఁకున నట్టె కూలుచుం
బరిసరవృక్షమందుఁ బడి § బల్విడి దానిని గూల్చి కూలెఁ దాన్. ౩౨ 1032

చ. అదియును జేరువందగిన § యట్టిద్రుమంబును గూలఁ జేయుచున్
గదిసెను భూమి నయ్యదియుఁ § గ్రన్నన వేఱొకతాళభూజమున్
జదియఁగఁజేసి తాఁ బడియె § క్ష్మాస్థలి; నీగతి రాముఁ డెంతొ లీ
లదనరఁ జేతఁజిమ్మిన పలాలభుగంగము తాఁకినంతనే. ౩౩ 1033

క. తాళద్రుమములు పెల్లుగ, నోలిం గంపించె వాయు § వుద్ధతి వీవం
గూలెడు తరువులగతి నిం,కేలా పలుకంగఁ జిత్ర § మిది యగు ననుచున్. ౩౪

తే. [1]తంతువులయందుఁ బటము చం§దమున విశ్వ
మెల్లఁ దనలోన నిముడంగ § నుల్లసిల్లు
నయ్యనంతుఁడు భగవంతుఁ § డైనరాము
నం దిదేమాత్రమే వింత § యనఁగఁ దగదు. ౩౫ 1035

ఉ. ధేనుకు పాటుచూచి బల§దేవుని గృష్ణుని దీవ్రకోపులై
దానవుచుట్టముల్ గదిసి § దర్పము పొంగఁగ గార్దభాకృతిం
బూనినవారు కావునసె § పూన్కి నెదిర్చిరి రామకృష్ణు లా
దానవగార్దభంబుల ని§తాంతము లీల చెలంగునట్లుగన్. ౩౬ 1036

చ. వెనుకటికాళ్లఁ బట్టుకొని § వీచుచుఁ దాళమహీరుహాళిపై
నను బడమోఁది చంపిరి వనస్థలి రాలినతాటిపండ్లచే
దనుజశవాంగసంహతిని § [2]దాళకుటాగ్రములన్ వికీర్ణమై

1 "నైతచ్చిత్రం భగవతిహ్యనంతే జగదీశ్వరే, ఓతం ప్రోతమిదం యస్మిం స్తంతుష్వంగ యథాపటః" అని మూలము. రాముఁడు కృష్ణున కంగమనుమాట దీనిచే నపాస్తమని యెఱుంగవలయు.
2 తాళకుటాగ్రములన్=తాటిచెట్లకొసలను.

ఘనములు చిత్రవర్ణములు ఽ గ్రమ్మ నభం బెటు లట్లు గన్పడెన్. ౩౭ 1037

ఉ. రాముఁడు కృష్ణుఁ డివ్విధి నరాతులఁ జంపిన యమ్మహాకృతిన్
వ్యోమమునందు నిల్చి కని ఽ యొప్పుగ వారలపైని నింద్రము
ఖ్యామరవర్యు లప్డు గురియంగను జేసిరి మ్రోఁగె దుందుభి
స్తోమము సన్నుతుల్ చెలఁగెఁ ఽ దోరపుభీతి తొలంగె నవ్వనిన్. ౩౮½ 1038

క. అదిమొద లావనమందునఁ
గుదిరినరాక్షసుఁడు తెగుటకున్ మదులందున్
ముదమొదవ మానవులు వన
ము దగం జొరఁబడఁగ ఫలసమూహముఁ దినఁగన్. ౩౯½ 1039

క. ఆరంభించిరి పశువులు, చారుతరం బౌతృణంబు ఽ సాధ్వస మింతేఁ
జేరనిమదితో మేసెను, శ్రీరమణుఁడు గోపబాలసేవితుఁ డగుచున్. ౪౦ 1040

క. తనకీర్తి విన్నమాత్రం,బున నే తనపేరు స్మరణమున కొక్కటఁ దె
చ్చినయంతనె సుకృతంబును, జనింపఁగాఁ జేయునట్టి ఽ సన్మతియగుటన్. ౪౦½

క. ఖరకరుఁ డస్తంగతుఁడౌ, తరుణంబున సాగ్రజుఁడయి ఽ తా వ్రజమునకున్
బరమాదృతిఁ జనె వనిఁగల, విరులన్ ధరియించి రుచిర ఽ విపులేక్షణుఁడై. ౪౧

క. అరిగెడు ధేనూత్కరముల, చరణరజము కుంతలగతచంచద్బర్హా
భరణంబునఁ గ్రమ్మఁగ సురు,చిరమందస్మితము లొలయఁ ఽ జేరెన్ మందన్. ౪౧½

తే. వేణునాదంబు మధురమై ఽ వెలయుచుండఁ
జేయుచున్ వెంటవచ్చు సమాయికులగు
బాలకులు స్వీయయశమును ఽ బాడుచుండ
గోపికలు తన్నుఁ జూచెడుకోర్కి రాఁగ. ౪౨ 1044

క. హరి మందఁ బ్రవేశించెను, ద్వారపడి వ్రజసుందరీవతంసములు సురే
*శ్వరుఁ డగుముకుందువదనాం,బురుహమరందమును నేత్రపుష్పలిడలిచేన్. ౪౨½

క. తనివాఱఁగఁ గ్రోలుచు నా,తనిఁ బగలంతయును బాసి ఽ తా రుండినదా
నిన గల్గినపరితాపం,బును బాసిరి మఱియు గొల్లపూబోఁడు లొగిన్. ౪౩½

సీ. మంజుల మందాక్షమండిత హాసవినయములు చెలఁగ నెన్నఁ దగుచున్న
సదపాంగవీక్షణసమితిఁ బైఁ బరఁగింప నట్టిసత్కార మొయ్యన గ్రహించి
శ్రీకృష్ణుఁ డమ్మందఁ ఽ జేరెను బుత్త్రవత్సలత నొప్పారెడు ఽ ధన్యచిత్త
లగు యశోదాదేవి ఽ యారోహిణియు నట్లు వచ్చినయాత్మసంభవుల కెట్టి

తే. సమయమున నేవిధంబునఁ ఽ జక్క వారు
కోరుదురొ యట్టులన్నియుఁ ఽ గూర్చి యాశి

* నేత్రపుష్పలిడలిచేన్ = కన్నులను తుమ్మెదలగుంపుచేత.

షముల నిచ్చిరి మఱియు నాసహజు లంగ
మర్దనంబుల నభ్యంగమజ్జనముల. ౪౪ 1047

క. వనమునకుం జని మఱివచ్చినమార్గాయాస మెడలఁజేయం దగువే
నిని నయ్యుపచారంబుల, నొనరుప బడలికలు వాయ నొప్పిరి మిగులన్. ౪౪౫

చ. సురుచిరవస్త్రధారణము సొంపగుగంధపుఁబూత లెంతొ సుం
దరముగ హారధారణముఁ దద్దయు మేనుల కింపుఁ బెంప న
చ్చెరువుగ నుండి తల్లులొగిఁ జేర్చినస్వాదుతరాన్నభుక్తి నా
దరపరిలాలనంబులను దా రొగిఁ దృప్తిని గాంచి యంతటన్. ౪౪౬ 1049

క. వరశయ్యల శయనించి నిదురించి రిక్కరణి మందఁ దోయజనేత్రుం
డరుదుగ భగవచ్చర్యలఁ, జరియించుచు నుండెఁ దెలియశక్యమె వానిన్. ౪౪౭

క. ఈరీతిఁ బృందావన, భూరిపవిత్రస్థలముల భూతేశ్వరుఁ డా
సారసనయనుఁడు తిరుగుచు, శ్రీరాముని బాసి యొకట స్నిగ్ధయుతుండై. ౪౪౮

క. యమునానదికిం బోయె న, హిమాంశుతీవ్రప్రభావ మెంతయు సంతా
పముగల్గఁజేయ నోర్వక, యమునాసలిలంబుఁ ద్రావి రట గోగోపుల్. ౪౪౯

క. జల మది విషదూషితమై, మలినంబుగ నుండె నైన మానవితృష్ణా
గలవిలపాటొందుచు గోపులు గోవులు త్రావి విషము గొలయుటచేతన్.

క. దైవవశంబున వారల, భావంబులు తత్తఱపడి వర్తించె నటం
గావున విగతప్రాణులు, నై వరుసఁగఁబడిరి తజ్జలాంతమునందున్. ౪౫౧

సీ. యోగేశ్వరేశ్వరుం డాగతిఁ బడియున్న వారలఁ గని తన్నె స్వాంతములను
నమ్మియున్నా రని నెమ్మది నూహించి యమృతంబుఁ గురియించు నట్టిచూడ్కి
వారిపై నెఱపుచు బ్రదుకు నట్లొనరించెమునుపటివలె స్మృతి గొలయ వారు
సలిలంబు దరినుండి సరగున లేచి యొక్కరిని వేఱొక్కరు గనుచు మిగుల

తే. నచ్చెరువు నొంది విషయుక్తమగు జలంబుఁ
ద్రావి మృతినొంది మరలను జీవనములఁ
బడయు టరయంగ గోవిందు భవ్యకరుణ
గురియు వీక్షణముల ననుకొనిరి రాజ!. ౪౫౨ 1055

---

క. నదినుండి వెడల నడిచెం, గద యంచువచింపఁగ విని ॥ క్ష్మాకాంతుం డా
నదియం దగాధజలములఁ, గుదిరిక నివసించునట్టి ॥ క్రూరభుజగమున్. ౧౫

క. హరి యెట్లు నిగ్రహించెను, సరీసృపం బద్ధిభూమిఁ ॥ జరియించు నద
య్యు రహిఁ జలముల యడుగున, స్థిరవాసము చేసికొనుట ॥ చిత్రంబె యగున్.

ఆ. పెక్కుయుగము లందుఁ బ్రీతిమై నివసింప, నేల? విప్రవర్య! ॥ యెఱుఁగఁ బలుకు
మతిమహత్త్వ మలరఁ నతిశయస్వేచ్ఛచే, సంచరించుఁ గాదె ॥ శౌరియెపుడు. ౨౫

క. లీలార్థము భూమిని గో,పాలుఁడు గా నవతరించి ॥ భగవంతుని వా
లీలలఁ గనఁబఱచెడు నా, శ్రీలలితు నుదారచరితఁ ॥ జెప్పుము నాకున్. ౩

క. అమృతముతో నుద్దిగఁ దగు, నమలాత్మచరిత్రము విని ॥ యది చాలు నటం
చు మనుజుఁ డెవ్వఁడు పల్కును, సమాహితాత్మా! వచింపు ॥ చక్రిచరితమున్.

చ. అని యడుగన్ మహామునిగణార్చితుఁ డాశుకయోగి యుత్తరం
బు నిటు వచించె; రాజ! విను ॥ భూరితరప్రదమాకళిందజా
ధునిఁ గల దందుఁ గాళియుఁడు ॥ తోరపువేడ్కఁ వసించుఁ దద్విషా
గ్ని నిబరిపచ్యమానమయి ॥ నీరము గ్రాఁగుచునుండు నిచ్చలున్. ౪ 1062

ఉ. దానికిఁ జక్కఁగాఁ బయిని ॥ దారినిబోవు పతత్త్రులెల్ల వై
శ్వానరు వేఁడిమిన్ బడలి ॥ చయ్యన నందుఁబడున్ విషాంబువుల్
పూని తటంబు నూర్ముల సమూహామునన్ స్పృశియింప బిందుసం
తానము వాయుసంగతినిఁ ॥ దాఁకినమాత్రన తీరవృక్షముల్. ౪౫ 1063

తే. మృగములును వెంటనేపడి ॥ మృతిని గాంచుఁ
జండవేగంబుగల విషశక్తి నున్న
కాళియునిచేతఁ గాళింది ॥ కలుషితమయి
యుంటఁ గనుఁగొని శ్రీకృష్ణుఁ ॥ డూహచెలఁగ. ౫౫ 1064

చ. ఖలులను సంహరించుటకె ॥ క్ష్మాస్థలిపై నవతారమొంది తాఁ
జెలఁగును గాన నాయమున ॥ శీఘ్రము పావనమూర్తిఁ జేయఁగాఁ
దలఁచి తదీయతీరగ కదంబమహాద్రుమ మెక్కి నద్ది యా
జలరుహనాభు దివ్యపదసారససంగతి నొందఁ జాలుటన్. ౬ 1065

చ. జలవిషవాయువుల్ తగులఁ ॥ జయ్యన శుష్కతనొంద కెంతో యు
జ్జ్వలతరశాఖలం దగుచు ॥ వర్ధిలుచుండెను నద్దియొక్కఁడే
స్థలమునసుండు నుంటఁగని ॥ తద్ధరణీజము నెక్కి గట్టిగా
మొలవలువన్ బిగించి భుజముల్ దనచేతుల నప్పళించుచున్. ౬ 1066

చ. గరళయుతాంబువుల్ గలుగుకాళియుఁ డుండుమడుంగులోన న
త్తరువుననుండి పేఁ దుమికెఁ ॥ దద్దరిద మాపురుషోత్తముండు స

త్వరముగ దూఁకుసందడిని దద్దయు క్షోభమునొందె దానభీ
కరభుజగంబులుం గలఁగి గ్రక్కున ఫూత్కృతు లొప్ప క్ష్వేళముల్. ౬౪ 106

క. ఉమిసెను దానం దజ్జల, సముదయ ముప్పొంగి విషసమాయితకల్లో
లములన్ బరితప్తస్థలముల, గమనజవం బొప్పుచుండఁ గా భయదముగాన్. ౬

సీ. శతధనుర్మితదూరజగతి వ్యాపించె నయ్యది యనంతబలుండునైన చక్రి
విషయంబునం జూడ వింతయే యట్టు లమ్మడువున నుద్రిక్తమదగజంబు
విక్రమంబునఁ బొల్చువిష్ణుండు భుజదండఘాతంబునన్ నీరు కలఁకఁబాఱ
గాఁ జేయ నత్తఱి గాఢధ్వనుల్ రేఁగ నవ్వార్త లాలించి యహివరుండు

ఆ. కాళియుండు తనయగారంబునకుఁ డిరస్కార మద్ది యనుచు నోరువంగఁ
జాల కాత్మసైన్యసముదయమును గూడి, యరుగుదెంచె వేగ యరినడంప. ౬

క. చనుదెంచి వీక్షణంబుల, కును బండువుసేయుచున్న కోమలగాత్రం
బున నీలనీరదము సీ, యనఁ జేయుచునున్న వాని నఖిలేశ్వరునిన్. ౬౭ 1070

సీ. శ్రీవత్సలక్షణచిహ్నితోరస్థ్సలు హరిపీతాంబరధారి శౌరి
స్మితసుందరాస్యు నప్రతిభయుఁ గోమలకమలసోదరచరణములు పంక
జోపమనాభియు నొప్పగ నరుణంబు లగుచుఁ గన్పట్ట నిచ్ఛానుసార
మెలమిఁ గ్రీడించు నయ్యిందీవరాక్షుని శ్రీకృష్ణుఁ గనుఁగొని చేరఁబాఱి

తే. పృథులరోషంబుమీఱ నింతేని తలఁప, కతని మర్మంబులందు దంష్ట్రాభిఘాత
ములు కనంబడఁజేసి ప్రభూతతనువు, చేత హరిదేహమునుగప్పె భీతిదముగ.

చ. ఉరగము తన్నుఁ జుట్టుకొన నోపికగల్గియు శౌరి సుంత య
త్తరుణమునందు నంగము గదల్పక యుండెను దాని గాంచి యా
హరిచెలికాండ్రు మిక్కిలియు నార్తిని మున్గిరి స్వీయచిత్తముల్
హరిపయిఁ జేర్చి యంగసుహృదర్థ కళత్రసమస్తవాంఛలన్. ౬౯ 1072

క. వనజాక్షునకే యర్పిం, చినవారలు గాన నప్పు చింతయు శోకం
బును భీతియు నొక్కుమ్మడి, కనఁబడఁగా మూఢబుద్ధికలితులు నగుచున్. ౭౦

క. ధరణిన్ హా! యని పడిపో, యిరి గోవులు వత్సతరులు వృషభంబులు దు
ర్భరదుఃఖంబున నార్చుచు, హరినే కన్గొనుచు నేడ్చునట్లుగ నుండెన్. ౭౧ 1074

చ. చరణములం గదల్పక యసంగతకార్య మి దంచు నెంచుచున్
హరిఁ గనుచుండె నట్టియెడ నావ్రజసీమను దుర్నిమిత్తముల్
ధరణిని నింగినిం గలిగె దారుణకంపమహాగ్నిపాతముల్
పురుషులకెల్ల సవ్యభుజముల్ నయనంబులు కంపముం గనెన్. ౭౨ 1075

ఆ. దుర్నిమిత్తము లవి తోడనె భయమొప్ప, జూడఁ దెలిపె నట్టిసాధ్వసావ
హమ్ము లగుచుఁదోఁచు నట్టియుత్పాతముల్, కనఁబడంగ వానికిని దలంకి. ౭౩

క. నందపురోగము లివి యే, చందమునం గలిగెఁ దనదుసఖులు గొలువ గో
విందుఁడు రాముని విడి చనె, బృందావనభాగమునకు వింటి మి దిపుడే. ౧౩

క. అని తలపోయుచు నుత్పాతనికరమునఁ గృష్ణునకు నితాంతము కీడొం
దె నటంచుఁ దలఁచి యాతని, ఘనమహిమము దెలియఁ జాలకయె పెనుభీతిన్.

క. తమప్రాణంబులు మనసులు, కమలాక్షునియందె నిల్పి కలకాలం బీ
క్షమను సుఖింపం గోరుట, యమునాహ్రదవార్త వగ భయము శోకంబున్.

క. కలిగింపం గలవిలపడి, యెలనాగలు బాలకులును వృద్ధులు మొదలా
జలజాక్షునిపైఁ బ్రీతియె, కలిగిన వారెల్ల నప్డె కడు జవమలరన్. ౧౪ 1080

తే. వత్సములయందుఁ బశువు లేబ్బంగిఁ బ్రీతి, నిడుదు రట్టులె భావమ్ము లడరమంద
నుండి వెడలిరి దీనులై యొక్కమాటె, కృష్ణుఁ జూచెడుకాంక్ష లేయొసఁగుచుండ.

సీ. మధువంశజులయందు మహిమ మెప్పారుచు భగవంతుఁడౌ బలభద్రుఁ డట్లు
భయసంభ్రమంబులఁ బర్విడువారలఁ గని నవ్వి యనుజుని యనుపమాన
సుప్రభావ మెఱుంగు సుభగుండు గావున నేమియు బదులాడ కేమికార్య
మొసరంపఁదగు ననియును దెల్పకయె యుండె నందాదు లత్తరుణమునఁ దమకుఁ

తే. చిన్నికృష్ణునిపైఁ బ్రీతి చెలఁగుచుంట, నలుదెసలయందు దృష్టులు కలయఁబర్వఁ
బంకజధ్వజచిహ్నాభిశోభితములు, హరిపదంబులు గాన నయ్యడుగులసడి. ౧౬

క. దారిం బరికించుచు నవ్వారల్లఁ గళిందకన్యకాంకకు నెట్టో
చేరిరి; విశ్వేశ్వరుఁ డగు, సారసనేత్రుని పదాంబుజముల నరయుచున్. ౧౭

చ. సరసిరుహాంబు వజ్రము ధ్వజంబు యవాంకుశముల్ మనోజ్ఞమౌ
హరిపదయుగ్మమందుఁ దగునట్టి సుచిహ్నము లౌట గోపులే
సరణిని బోయి నాయెడలఁ జక్కఁగఁ జూచుచు గోపబాలకో
త్కరచరణాంతరంబులను దత్పదచిహ్నము లెల్లఁ గాంచుచున్. ౧౮ 1084

క. త్వరపడి పోయిరి యమునా, తరంగిణీతీరమునకుఁ దత్పరమతులై;
యరిగి హ్రదమధ్యమున భీకర కాళీయాహినాథకాయం బెల్లన్. ౧౯ 1085

చ. తనమృదుకాయముం బెనచి దారుణభంగిని గప్పడంగ దా
నిన గతచేష్టుఁ డైనగతి నిశ్చలుఁ డైనవిధంబునం గనుం
గొనఁ దగుచిన్నికృష్ణుని నిగూఢమహామహిమాభిరామునిం
గనుఁగొనుచున్ హ్రదంబు దరి కాతురులై స్మృతిదప్పి బాలకుల్. ౨౦ 1086

చ. పలుకఁగ నైననేర కొకభావముఁ దెల్పఁగ నైనఁ జాలక
య్యిలఁ బడియుండ దూరమున నెంతయు నార్తిని గాంచి; రట్లు గో
వులు నలుదట్ల నార్చుచును బొక్కుచు నుండఁగఁ గాంచి యెంతయున్
మలినములైన చిత్తముల మ్రాన్పడి రావ్రజవాసు లత్తఱిన్. ౨౧ 1087

సీ. అనవరతం బనంతునియందు గోపికామానసంబులు దృఢానూనరాగ
వంతంబులుగ నుండువార లా శ్రీకృష్ణు సౌహృదస్మితకటాక్షవచనముల
న త్తఱిఁ దలఁచుచు । నాహరి ప్రియతముఁ డై సర్పవేష్టితుఁ । డౌటఁ గాంచి
భరియింపరాని నొవ్వగలఁ దపించుచుఁ బ్రియతముం డప్పుడు । పృథుపృథాక
ఆ. వేష్టితాంగుఁ డగుట । విశ్వత్రయం బెల్ల, శూన్యమైనయట్లు । చూడఁబడఁగ
బలుకనేరకుండి । రొలసినవగపెంపు,నను యశోద ముద్దుతనయుఁ గాంచి. ౨౮

ఉ. ఇంతనరానిదుఃఖమున । నేడ్చుచు నాహ్రదమందు దూఁకఁగా
స్వాంతమునం దలంచి యటు । సత్వరమే యొనరింపనుండ నా
యింతులు నా మోఁ బట్టుకొని । యీక్షణముల్ కలఁగంగ నశ్రువుల్
సంతత ముబ్బిపాఱ సతిచందమునన్ విలపించు చెంతయున్. ౨౦౪ 1089

ఉ. మందవసించువారల కమందతరప్రియముం దలంచు నా
నందకుమారుఁ డీవఱ కొనర్చిన చిత్రచరిత్రగాథ లిం
పొందఁగఁ జెప్పుకొంచుఁ గమలోదరు సుందరవక్త్రచంద్రుపై
నం దగుదృష్టు లొప్ప మరణంబును గాంచినయట్టు లుండఁగన్. ౨౧ 1090

క. నందాదులు శ్రీకృష్ణుని, యందే ప్రాణాళి నిల్పినట్టిం డ్రగుటన్
సందేహింపక మడువుఁ జొ,రం దలఁచి ప్రయత్నపడఁగ । రాముం డంతన్. ౨౧౪

తే. తాను భగవంతుఁడౌట యత్నమును దాని
మాన్చెఁ గృష్ణప్రభావమ్ము । మానసమున
నెఱిఁగినట్టి దృఢప్రజ్ఞుఁ । డే యగుటను
గృష్ణుఁ డంతట మందలో । నెల్లవారు. ౨౨ 1092

మ. తననుం దిక్కని నమ్మియుంట మదిలో । దా నెంచి సత్స్త్రీసుమా
రనికాయంబుగ నాత్మహేతువునఁ బారం బెన్న లేనట్టిచిం
తను బ్రాపించుటయుం దలంచి క్షణమాత్రం బట్లు మర్త్యోచితం
బనఁగాఁ జెల్లు నశక్తతం గని స్వమాహాత్మ్యంబు వర్ధిల్లగన్. ౨౩ 1093

వ. ఉరగవరేణ్యబంధనము । లొక్కవడిం దొలఁగించుకొంచు శ్రీ
హరి యటు లేచె; నంతఁ బరమాత్మశరీరము వృద్ధిఁబొంది ని
ర్భరపరితాపదం బగుట । వ్యాళము కృష్ణుని వీడి కోపవి
స్ఫురణమునన్ స్వకీయఫణపుంజముఁ జక్కఁగ నెత్తి నిల్పుచున్. ౨౩౪ 1094

సీ. వేఁడినిట్టూర్పుగములను । వెడలునట్లు, చేయుచును నాసికారంధ్రసీమలవల
న విషభీకరవహ్నికణంబు లురులఁ, గనుఁగొనఁగ సాధ్యమే కానికరణి నొప్పి.
మలమలకాఁగెడు నల మం,గలమట్టులె యెఱ్ఱగాఁగఁ । గనులుండఁగ ని
ప్పులు నోర వెడలఁజేయుచు, జలజాక్షుని గనుచునుండె । సత్త్వము దూలన్.

సీ. రెండుగాఁ జీలిన ✽ ట్లుండునాల్కలు సాఁచి దవుడలు నాకుచు ✽ దారుణగతి
నున్న నేత్రంబులనుండి విషాగ్నులఁ గ్రక్కుచు నున్నయా ✽ కాలభుజగ
వరునితో నాటాడు ✽ గరుడునిరీతిని హరి వానిచుట్టును ✽ దిరుగుచుండె
హరివైపుఁ గాంచుచుఁ ✽ నయ్యురగంబుండెఁ గాటు వేయఁగ నంతఁ ✽ గంజనయనుఁ

తే. డట్లుతిరుగుటచే బల ✽ మడఁగ భుజగ
వరుఁడు కడుఁ గుంది ఫణములఁ ✽ బయికి నిక్కఁ
జేయ శ్రీకృష్ణుఁ డాఫణిఁ ✽ జిక్కఁబట్టి
వంచి పృథుఫణముల నెక్కె ✽ వఱలుశక్తి. ౨౫౪ 1097

ఉ. అన్నిటికంటె నాది యని ✽ యందఱుచెప్పఁగ లోఘకారణం
బన్న నుతిం జెలంగి యలరారు సనాతనపూరుషోత్తముం
డున్నతభోగిభోగముల ✽ నొప్పుమణిప్రకరణంబు సోఁకఁగా
మున్నె మృదుప్రకాశతను ✽ బొల్చెడు నప్పదపంకజాతముల్. ౨౬ 1098

క. అతితామ్రవర్ణతం దగ,నతజనరక్షకుఁడు గావు ✽ నన్ హరి నృత్యం
బతులితముగ నొనరించెను, దితిజాంతకుఁ డహిఫణాతతిపయి నటింపన్. ౨౬

మ. కని గంధర్వులు సిద్ధచారణులు నుత్కంఠల్ కడుంగ్రాల దే
వనికాయంబులు దేవకాంతలు మదిన్ ✽ వర్ధిల్లు ప్రీతిన్ మృదం
గనినాదంబులు నానకధ్వనులు నిక్కం బొప్పఁగాఁ దెల్పున
వ్వినుతుల్ దక్కినవాద్యనాదములు పేర్త్వేలన్ మనోజ్ఞంబులై. ౨౬౪ 1100

క. తనరారఁగఁ బణవధ్వను, లనుపమగతి నొప్ప సుమమయం బగువర్షం
బును గురియించుచు సేవిం,పను వచ్చిరి నర్తనంపుఁ ✽ బ్రోథిమ కనఁగన్. ౨౭ 1101

చ. హరిఖలసంఘుదండధరుఁ ✽ డౌట ఫణాగ్రములందు నృత్తము
త్తరుణమునం దొనర్పఁగ శతప్రియశీర్షములందు భోగియే
శిరమును వంపకుండు ఘనచిత్రపదాహతి నారమేశుఁ డా
శిరము నడంగఁ జేయునటు ✽ చేయు బెదింగినకాళియాహియున్. ౨౭౪ 1102

మ. బలమెల్లన్ నశియింప భోగతతు లుద్భ్రాంతంబులై చేడ్పడన్
గులసర్పంబులు చుట్టునిల్చియె కనుంగొంచున్ వగం జెంద ము
ఖ్కుల నోరన్ వడి సుష్ఠురక్తములపొంగుల్ కన్పడన్ నైజచే
ష్టలు మాయం గడుఁ గ్లేశమందె ✽ నిలువన్ శక్యంబె యప్పట్టునన్. ౨౮ 1103

మ. మరలం గాళియుఁ డెట్టులో చెలఁగి దుర్మానంబునం గన్నులన్
గరళం బుప్పతిలంగ మించురుషచే ✽ గాఢంబుగా నూర్పులన్
వరుసం బుచ్చుచు శీర్షపంక్తి నెదియే ✽ వంపంగ నుంకింప కీ
శ్వరునిం గాంచునొ తచ్ఛిరంబుఁ బదసంచారంబునన్ వ్రాల్చుచున్. ౨౮౪ 1104

సీ. గంధర్వముఖ్యులు ౯ కడు మెచ్చి సుమవృష్టి గురియింప నదియును ౯ గోరి చేయ
పూజగాఁ గస్పడఁ ౯ బూర్వపూరుషుఁ డగుహరి యొప్ప నాతని౯యద్భుతావ
హమగు తాండవమున ౯ నాయహిపతిఫణావితతి భుగ్నంబయి ౯ విఱిగినట్టి
యాతపత్రమువలె ౯ నగపడ గాత్రంబు భగ్నమై తగ భూరి౯పదనగహ్వ

ఆ. రములనుండి గొప్ప ౯ రక్తధారలు గాఱ, నప్పు డతనిఁ జరము ౯ నచరము నగు
విశ్వమునకు నెల్ల౯విభుని బురాణపూ,రుషునిగాఁగ నెఱిఁగె ౯ రుష తొలంగ. ౩౦

క. తనమది నారాయణుఁగాఁ, గనె తలఁచి మహాత్మ! నీవె ౯ గా దిక్కని యా
తనిశరణు చొచ్చె గర్భం,బున జగమంతయు వసింపఁ ౯ బొలిచెడుహరియుఁ౯. ౩౦

చ. తనఫణరాశి నిల్చి పదతల్లజపాతమునఁ౯ హృదంతరం
బునఁగల గర్వ మార్పఁ గడుఁ ౯ బొక్కుచు భోగగణాతపత్ర మొ
య్యన వగ వంచి యున్నభుజ౯గాధిపునిం బతిఁ గాంచి పత్నులా
ర్తిని గని [1]వస్త్రముల్ సడల ౯ దివ్యకలాపము లట్టె వీడఁగన్. ౩౦౪ 1107

క. కొప్పులుజాఱఁగ నీశ్వరు, ముప్పును దొలఁగించు నాది౯పూరుషుఁ గనఁగా
నప్పుడతు లేగుదెంచిరి, తప్పిది యని మమ్ముఁ గావఁ ౯ దగు నని వేఁడన్. ౩౦

[2]చ. మనములు తెల్విదప్ప వెత ౯ మై౯కొన బాలుర ముందుఁ బోవు న
ట్టొనరిచి చెంతకేగి తమ౯యొప్పగు మేనులు భూమిసోఁక భూ
తనికరనాథుఁ డై తనరు ౯ తామరసాక్షున కట్టె మ్రొక్కి రా
వనితలు సాధుశీలముల ౯ భాసిలువారలు గాన నత్తఱిన్. ౩౦౪ 1109

క. గురుపాపము లొనరించిన, సురగేశుని నాత్మనాథు ౯ నొగిఁ దచ్ఛమలో
త్కరముననుండి విముక్తిఁ౯, హరికృపఁ గనఁజేయఁ గోరి ౯ యంజలు లొప్పన్.

[3]క. శరణప్రదుఁడగు పరమే,శ్వరు శరణు తగంగఁ జొచ్చి ౯ భక్తిభరముచే
సురగేంద్రపత్ను లిట్లని, పరినుతి గావింపఁ బూని ౯ పల్కిరి దేవా! ౩౨ 1111

కాళియభార్యలు శ్రీకృష్ణుని వినుతించుట.

క. కృతకల్బిషుఁ డగు మాపతి, కితనికి నీవిచ్చినట్టి ౯ యీదండనమే
హిత మగు న్యాయమునకు నీ, క్షితి నీయవతారము ఖల౯శిక్షణమునకే. ౩౨౪

వ. అరితతియందు నాత్మజుల౯యందును నేకవిధంపుఁజూపు శ్రీ
వర! తమ కుండుగాని యొక౯భంగిని వేఱుగ నుండఁబోదు దె
వ్వరిపయిఁ బక్షపాతమును ౯ బట్టి రుషం గొని దండనం బదే
వరుసను జేయఁబూనవు స్వ౯భావము నీ కిది దానవాంతకా! ౩౩ 1113

1 "శ్లథద్వసనభూషణకేశబంధాః" అని మూలము. 2 "కాయం నిధాయ భువిభూతపతిం ప్రణేముః" అని మూలము. 3 "శరణదం శరణం ప్రపన్నాః" అని మూలము.

ఉ. నీ వొనరించుశిక్షణము నేరుపునం దలపోయ మంచికే
దేవ! యగున్; దలంతువు మదిన్ మునుముందుగ నిక్కె; యట్టులే
కావున నిట్టిదండనమఖండదయాఫలమే యగుం గదా
పావననామ! మా వయిన పాపము లెల్లఁ దొలంగ నిత్తఱిన్. ౩౩½ 1114

చ. ధరణి నసాధువుల్ తగినదండన మొందినచో మహాఘముల్
త్వరగ నశించు నెట్టిదగు దారుణపాప మొనర్చెనో యితం
డురగశరీరముం గనియె నుగ్రతరాఘము దానిఁ జెందు నీ
యురుతరదండనం బరయ నొప్పె ననుగ్రహమౌచు నద్దిరా! ౩౪ 1115

చ. తెలిసెను నీదుకోపము మదిం బరికింప ననుగ్రహంబె యా
నిల నని నేఁటికిన్; మును పదెట్టిభవంబున గర్వహీనుఁడై
జలరుహనేత్ర! నీవు గడుసంతసమందఁగఁ జాలునట్టిదై
యలరు తపం బదెట్టిగతి నాదృతిఁ జేసెనొ యెఱుంగ నా? ౩౪½ 1116

తే. ఇపుడు దుర్మానియై యున్న యితని పూర్వ
తప మదెట్టిదొ సర్వభూతదయ గాంచి
ధర్మ మెద్దానిఁ జేసెనో తలఁప సర్వ
జీవనుఁడ వీవు సంతుష్టిఁ జెందితిగదె. ౩౫ 1117

మ. పరమాత్మా! భవదంఘ్రిసారసరజస్స్పర్శంబు వాంఛించి శ్రీ
తరుణీరత్నము సర్వకామముల నాత్మం గోరకే మానుచున్
స్థిరమౌపూన్కి వ్రతంబుఁబూని తపముం జేసెం గదా; భక్తిమైఁ
జిరకాలం బిటుఁ దత్పదాబ్జరజముం జెందెం గదా! యీతఁడున్. ౩౬ 1118

ఉ. ఈతఁ డొనర్చినట్టి తప మిట్టి దటంచు వచింప శక్తులే
ధాతృముఖామరుల్ సురవితానసమర్చితపాదపద్మ! య
బ్జాతవిలోచనా! జగతిఁ ద్వత్పదపద్మరజంబు నొందు వి
ఖ్యాతతపోవిరాజితులు గాంచఁగఁ గోరరు స్వర్గలోకమున్. ౩౬½ 1119

సీ. సార్వభౌమపదంబుఁ జక్కని పారమేష్ఠ్యంబుఁ బాతాళరాజత్వ మల్లి
యోగసిద్ధులఁ గోర రో దేవ! పెక్కుల ముక్తిపదంబును బొందఁ గోర
రివ్వానికంటె సమీహితమగు నీదుపాదసేవయె భూరి పరమసుఖద
మీపన్నగము భవ మెన్నఁ దమస్సాంద్ర మగుటఁ గ్రోధావిష్టుఁడయ్యెఁ జుమ్ము;

తే. జన్మమున నిట్టివాఁడయ్యు జగతి నెవరి
కైనఁ బొందఁగ నలవిగా నట్టినీదు
పాదపంకేరుహరజంబుఁ బడయఁ గలిగె
నింతకంటెను బుణ్యం బదెన్నఁ గలదె? ౩౭½ 1120

క. వనజాక్షా! భవచక్రంబునఁ దిరిగెడువార లాత్మఁ । బూనికఁ గోరం
గను నీదుకరుణగల్గినఁ, గనఁజాలుదు రట్టిది యిటఁ । గల్గెన్ ఫణికిన్. ౩౮ 1121

వ. అచింత్యైశ్వర్యాదిగుణంబులు గలిగి, సకలదేహాంతర్వర్తియై, యిట్టిదనివచింపఁ దరంబుగాని మహిమంబు చెలఁగుచుండ, నాకాశాదిమహాభూతంబుల కాశ్రయుండవై, ప్రాక్కాలంబునందు నుండఁగల్గి, సర్వకారణుండవై, కారణాతీతుండవై యలరుపరమేశ్వరుండ వగునీకు నమస్కారంబులు. ౩౯ 1122

సీసమాలిక:—

జ్ఞప్తికి మఱియుఁ జిచ్ఛక్తికి నిధివయి బ్రహ్మవై యింతని । పలుకరాని
శక్తులు గలిగి యేసరణిఁ దలంచిన గుణరహితుండ వగుచు నవే వి
కారములును లేక । క్రాలుచుఁ బ్రకృతిప్రవర్తకుండవునయి । వఱలు నీకు
వందనంబులు; సర్వ।బృందారకేశ్వర! కాలరూపుఁడ వయి । కాలశక్తి
కాశ్రయుండ వగుచు । నలరి సృష్ట్యాదిక సమయంబులన్ సాక్షి।శబ్ద మొంది
విశ్వరూపుఁడవయి । విశ్వంబునకు సుపద్రష్టవుగాఁదగి । దాని కరయ
గర్తవై మఱిసర్వ।కారకరూపుఁడ వయి యొప్పునీ కివె । యంజలు; లొగి
నాకాశముఖ్య మహాభూతపంచక మల్లె శబ్దముఖంబు । లైనయట్టి
తన్మాత్రలైదును । దగు జ్ఞానకర్మేంద్రియములను దశకంబు । నల్లె ప్రాణ
పంచకము మనస్సు । నంచితబుద్ధిచిత్తములు నీయవి నీదు । తనువు లగును
మఱియును త్రిగుణాభి।మానముచే స్వాంశభూతాత్మ రాశ్యను।భూతి యొవని
చేఁ గల్గు నట్టి య।చింత్యశక్తివి నీవు కావుననే నమ।స్కారము లివె;
తోయజాక్షా! యనం।తుఁడవయి కనఁబడకుంట సూక్ష్మం బన । నొప్పిమఱియు
నొక్కయుపాధిచే । నొనరుపఁబడు వికారములు లేకుండఁగ । రాజిలుటను
గూటస్థుఁడ వగుచుఁ । గొమరారి సర్వజ్ఞతను జెలంగుచుఁ గల।డనియుఁ గొంద
ఱును లేఁడనుచుఁ గొంద।ఱునుసర్వవేత్తయతఁ డనుచునల్పజ్ఞుండొ।యనుచుబద్ధుఁ
డనుచు ముక్తుండు । ననుచు నొక్కం డని కాదనేకుం డని । కడఁగి యిట్లు
నానావిధంబులఁ । బూని వాదింపఁగ వానినెల్లను మాయఁ । బూని యనుస
రించుచుందువు; మఱి।యెంచంగ నభిధాన మనఁగను నభిధేయ । మనఁగ నొప్పు
శక్తిభేదమునను । సకలంబుగాఁ దోఁచుచుందువు; దేవసం।ఘోత్తమేశ!
యట్టి నీకివె మ్రొక్కు । లఖిలేశ్వరా!; ప్రమాణాప్రమాణంబెయ।నం దగుదువు
తత్ప్రమాణాపేక్ష । తలపోయఁగా లేనిజ్ఞానవంతుఁడవు; ని।శ్శ్వాసరూప
వేదాత్మకుఁడవయి । వెలయుచుందువు; ప్రవృత్తుండవు మఱి నివృ।త్తుండ వగుదు
వుపనిషద్గోపిత । నొప్పుదు; వో దేవ! వందనంబులు నీకు । వరుసఁగూర్తు
ఘమరేశవందితా! । యాదినారాయణా! వసుదేవసుతుఁడవై । వఱలి కృష్ణ

రామరూపంబుల ౹ రాజిల్లి ప్రద్యుమ్నుఁ డని యనిరుద్ధుండు ౹ ననియు సాత్వ
తుల కెల్లఁ బతివయి ౹ చెలఁగు నీకును నమోవాకముల్ సుగుణప్రవరుఁడ వీవు
పాసకులకు నెల్ల ౹ ఫలవిచిత్రతకయి యాత్మ నాచ్ఛాదింతు ౹ వట్లె చిత్త
మాదియౌ వానివై ౹ యమరెడు చేతనాధ్యవసాయముఖవృత్తి౹తతిని మించి
యుపలక్ష్యుఁడవగుచు ౹ నొప్పుచుందువు గుణద్రష్టవై చూడంగఁ ౹ దగకయుందు
వట్టి నీకు నొనర్తు ౹ మభివాదనంబులు; తర్కింప నించుకేఁ ౹ దగనిమహిమ
మమరంగ, సర్వకార్యముల యుత్పత్తిప్రకాశహేతూపలక్ష్య మనఁ దగుదు
వో హృషీకేశ! నీ ౹ వొప్పుదు వెల్లెడ నరయ నాత్మారాముఁ ౹ డనఁగ మౌన
శీలియనంగ నిట్లోలిఁ బ్రకాశించు నట్టినీ కివె మ్రొక్కు ౹ లమరపూజ్య;
స్థూలసూక్ష్మంపుగతుల నెఱింగిన ప్రోడ వరయ సర్వమునకు ౹ నధివిభుఁడవు
విశ్వ మెవ్వనియందు ౹ వెలయకుండునొ యట్లు తనరుదు విశ్వుండ ౹ వనఁగ నొప్పి

ఆ. యలరుచుందు వట్లె ౹ యఖిలవిశ్వాధ్యాస,మునకుఁ దదపవాదమునకు సాక్షి
వగుదు వాద్వయమ్ము ౹ నైన విద్యావిద్య,లకును హేతు వగుదు ౹ సకలమూర్తి.

వ. భగవంతా! యట్టినీకు నమస్కారంబులు. దేవదేవా! నీ వనీహుండవయ్యు
ననాదికాలశక్తిం గైకొని దృష్టిమాత్రమ్మునఁ దత్తత్స్వభావములం బ్రోత్స
హించుచు గుణత్రయంబున నీవిశ్వమునకు జన్మస్థితిసంహారంబులం గల్పించుచు
సార్థకవిహారుండవై క్రీడింతువు. జగత్త్రయంబునంగల శాంతాశాంతమూఢశరీ
రంబు లెల్ల భవత్క్రీడోపకరణంబులై యున్న నిత్తఱి సాధుజనంబులను, ధర్మం
బును రక్షింప నూహచేయు నీకు శాంతశరీరంబులు ప్రియంబులై యుండు. ౫౦

క. వనజాక్షా! మాపతి యీ, ఘనభుజగాకృతిని నీకుఁ ౹ గావించిన త
ప్పును దీని నిప్పుడొకపరి,యనుకంప సహింపఁ దగుదు ౹ వాత్మజుఁ డగుటన్. ౫౧

క. తనయులు చేసిన యపకృతి, జనకులు మన్నించుచుంట ౹ సాజమకాదే
ఘనశాంతమూర్తి వగుటకె, దనమది నెఱుఁగండు నీదు ౹ తత్త్వ మితండున్.

ఆ. మూఢుఁడౌట నీదుమూర్తి నెఱుంగఁడు, కానఁ దప్పు సైపఁ ౹ గా దగుదువు;
ప్రాణములను వదల ౹ ఫణివరుఁ డున్నాఁడు, కావఁ దగుదు విడ్డు ౹ కంజనయన!

*చ. జననము చే స్వతంత్రత యసంభవమౌఁ గద స్త్రీల కెన్నఁగా
వనితలమాట సాధుసమవాయము సత్కృపఁ జూపఁగాఁ దగుకా
వనరుహనేత్ర! మా కనఁగఁ ౹ బ్రాణములన్న నధీశ్వరుండె కా
వునఁ బతిభిక్షఁ బెట్టు మిటఁ ౹ బోలును నీ కిది ధర్మపద్ధతిన్. ౫౨ 1128

[1]చ. తరుణు లటంచు మీకుఁ బతిదానము చేయుట న్యాయ్యమంచు ని

*"స్త్రీణాంనస్సాధుశోచ్యానాం" అని మూలము. "సాధుభిశ్శోచ్యానాంజాత్యైవాస్వాతంత్ర్యాత్ పరమదైన్యంధ్వనితం" అని వ్యాఖ్య. 1 ఇది వ్యాఖ్యాభిప్రాయమే యగునని యెఱుంగందగు.

త్తరణమునందు నీభుజగ । తల్లజముం బ్రదికింతు నేని యీ
ధరఁ గలవారికెల్ల మృతి । తప్పక కల్గఁగఁ జేసి నట్టులౌఁ
గరము దురాత్ముఁడౌఁట నని । కంజవిలోచన! యెన్నుకుండుమా. ౧౨ 1129

క. దనుజాంతక! మీయాజ్ఞం,గొని యీతఁడు బ్రదుకుటకును । క్షోణి నదే భీ
తిని నెవ్వరు మావలనం, గనకుండుటకును నదెట్టి । కార్యము గలదో. ౧౨౪ [కద

తే. ఆజ్ఞ చేయుము దాని మే।మాచరింతు, మంబుజాక్ష! దాసికలమె । యగుదుము
యేమిపంచినఁ జేయంగ । నెన్ను వార,మనుచు నానాగపత్ను లా। ర్తిని బలుకుచు,

చ. తను వినుతింపఁగా నలరి । తామరసాక్షుఁడు పాదఘట్టనం
బున ఫణరాజి భగ్నతను।బొందఁగ మూర్ఛిలి యున్న కాళియుం
మనమునఁ గల్గుసత్కరుణ । మంచిప్రవృత్తికిఁ దేఁ దలంచి మా
నె నడఁగఁద్రొక్క; నంత దన।నిర్భరసత్త్వము దూలిపోవుటన్. ౧౮ 1132

చ. హరికృప మెల్లఁగాఁ దనువు।నందు నసూత్కర మట్టి చేరఁ గా
వర మెటొ పాఱిపోవఁగను । భంగమునొందిన యింద్రియంబు లె
వ్వరుసనొ నిల్వ నూర్పుగమి । భారముగా వెడలించుచుం మహా
తురతఁ గరంబులం మొగిచి । తోయజనాభునిఁ గాంచి యిట్లనున్. ౧౧ 1133

౼ కాళియుఁడు హరిని వినుతించుట. ౼

క. పరమేశా! భవమాదిగఁ, బరహింసాకరము మాస్వ।భావము మఱి భీ
కరతామసులము క్రోధం,బరయఁగఁ జిరకాల ముండు । నదియగుఁ జూమ్మీ. ౧౧౪

ఆ. ప్రాణివితతికిం స్వ।భావము దుస్త్యజ, మద్ది దుష్ప్రశాచ । మట్లు తగిలి
విడువకుండు; సృష్టి । వెలయించు నప్పుడు, వానివాని కర్మ।వశముచేత. ౧౬

*సీ. తిర్యక్సమూహంబు । తీవ్రస్వభావంబు బహువిధంబుల సృష్టి । పరఁగఁ జేసి
నాఁడవు; కావున । నానావిధస్వభావముల నయ్యువియు బ।లముల శక్తు
లను బొల్చుచుండును । జననంబు స్థానంబు నాశయమును బీజ।మాకృతియును
బలు తెఱంగుల నుండు । జలజాక్ష! షడ్గుణైశ్వర్యసంపన్న! శా।శ్వత! మహాత్మ!

తే. యట్టి తిర్యగ్గణంబుల।యందు మేము, సర్పజాతుల మగుదుము । జన్మముననె
మన్యు వధికంబుగా నుండు । మాకు నీదు,మాయచే మోహితులమయి।మహిఁ [దగుదుము. ౧౭౪

చ. కనుకనె నీదుమాయ నెటు।గాఢతరంబగు జ్ఞానయుక్తిచే
తను విడువంగ నేర్తుము? వి।ధాతవు విశ్వసమూహభర్తవై
తనరుదు వెల్లకార్యముల । తత్త్వ మెఱుంగుదు వీవు నీదుమా
యను విడువంగ నీకృపయె । యౌఁ గద హేతువు మాట లేటికిన్. ౧౮౪ 1137

క. తలపోయ ననుగ్రహ మో, జలజాక్షా! నిగ్రహంబొ । సర్పంబుల దా

* "నానాస్వభావవీర్యౌజో యోనిబీజాశయాకృతిః" అని మూలము.

కులమునఁ బుట్టినమాకెది, తలఁచెదవో యుక్తమనుచు దానిఁ దయచేన్.

క. ఆనతి యిమ్మని వేఁడఁగ, సూనాంబకుతండ్రి మాయ శోభిలఁ గార్యం
బూని యొనరింపఁగా క్షితి, మానుషజనిఁ గాంచియున్న మాధవుఁ డంతన్. ౮౯

క. కాళియుఁ గనుఁగొని యిట్లను, వైళమ సంభ్రమున కేగవలయు నిలువఁగా
నేల యిట నాలసింపకు, పోలు నిదే యనుచుఁ దోఁచె బుద్ధి ఫణివరా! ౯౦

క. జ్ఞాతులతో నిజబంధు, వ్రాతముతో నిపుడె తరలి వార్ధికిఁ బొమ్మా
చేతస్సమ్మదముగ గో, వ్రాతము మానవులు ద్వీపవతినిఁ దీనిన్. ౯౦ 1141

తే. అనుభవింతురుగాక యిచ్ఛానుసార;, మేను నీ కిడినట్టి యీయానతి నిరు
సంధ్య లందెవ్వఁడు తగంగ సంస్మరించు, నతఁడు మీనుండి సాధ్వసమందకుండు.

క. నాకు విహారస్థానం, బై కడుఁ బావనమునైన హ్రదమున నిందుఁ
వేకువ మునింగి భక్తిని, నాకులకుఁ బితరులకు మానంబు లలరఁగన్. ౯౧

క. మనులకుఁ దర్పణ మొనరించునో యాతఁడు, నుపవసించి సొరిది నను మనం
బున స్మరియించునో యాతఁడు, ఘనపాపవిముక్తి నపుడె కాంచుం జుమ్మీ. ౯౨

చ. రమణక నామకంబయి విరాజిలి యుత్తమమైనయట్టి ద్వీ
పము విడనాడి యెవ్వని యపారభయంబున నీ హ్రదంబు సే
వ్య మనుచుఁ జొచ్చినాఁడవో ఖగాధిపుఁ డాగరుడుండు మత్పదా
బ్జముల సులక్షణంబుగల సర్పము నిన్ను గ్రసింప కుండెడున్. ౯౩ 1145

క. అని యద్భుతకర్ముండగు, వనజాక్షుఁడు కృష్ణుఁ డెన్ని పలుకఁగ విని శ్రీ
శుని గాళియుండు పూజించెను దత్పత్నులునుఁ గృష్ణు శ్రీప్రదు నజునిన్.

*తే. ఆదరంబున నూత్నదివ్యాంబరముల
మాల్యముల శ్రేష్ఠతమరత్నమయ కలాప
ములను శ్రీచందనంపుఁ జర్చలను భూరి
తరమగుచు నొప్పునుత్పలదామమునను. ౯౪ 1147

క. గరుడధ్వజు విశ్వేశ్వరుఁ, బరమాత్ముని బూజచేసి భక్తిఁ గొలిచి ర
క్తరుణమునఁ గాళియుండును, హరిని బ్రసన్నాత్ముఁ జేసి యాదృతి దనరన్.

చ. అనుమతినొంది మిత్రతనయావళి భార్యలు తోడరాఁగ న
వ్వననిధి మధ్యభాగమున భాసిలు ద్వీపవరంబుఁ జేరె; ప్రో
దినియును నాఁటఁగోలె ముని దేవవరార్చితపాదపద్ముఁ డై
తనరి మనుష్యదేహమును దాల్చి విహారము సల్పుకృష్ణుఁడున్. ౯౫ 1149

---

* "దివ్యాంబరస్రజ్మణిభిః పరార్ధ్యైరపిభూషణైః, దివ్యగంధానులేపైశ్చ మహత్యోత్పల
మాలయా" అని మూలము.

ఆ. మది ననుగ్రహింప ౯ నదియది స్వాదూద,కములు వెలయుచుండ ౯ గరళబాధ
వదలి పోవ ధేను౯వారమునకు మాన,వులకు గమ్యమగుచు ౯ నలరెమిగుల.



## పదునేడవయధ్యాయము.

### యమునాహ్రదచరిత్రము.

చ. అని శుకయోగి తెల్ప విని ౯ యర్జునపౌత్త్రుడు కాళియాహి చ
క్కనిఫణివాసమా రమణ౯కం బనుద్వీపము నేల వీడెఁ? దా
ర్క్ష్యున కతఁడొక్కఁడే తనకు ౯ నుగ్రభయం బొనఁగూడునట్టి త
ప్పును బొనరించెదేని? ఫణి౯పూగమునిర్భయవృత్తి నుండఁగన్. ౧ 1151

క. అనిప్రశ్నింపఁగ శుకముని, యనియె౯ మును సర్పభక్తినలరెడు మనుజుల్
జననాథునకుఁ గరంబులు, కొనిపోవువిధంబు తోఁప ౯ గోరికమీఱన్. ౧౪

సీ. సర్పభయ మ్మదే౯చందంబునం గల్గకుండుట్కై తగు౯పిండివంట
లాదియౌ వస్తువు ౯ లమవస నమవసఁ గొనిపోయి ఛాయనే ౯ జనులకొసఁగ
నావిర్భవించి సు౯మాదులు లేనట్టి యలవనస్పతిమూల౯ములను బెట్టు
నట్టులేర్పడి యుండె ౯ నాచార మొక్కండుఁ ప్రతిపర్వమందు స౯ర్పంబు లెల్ల;
తే. దమకు జనులిడి నట్టియం౯శమును బ్రీతిఁ
దమ్ము రక్షించుకొఱకు ని౯తాంతమహిమ
మున నెసంగెడు నాగరు౯డునకు భక్తి
నిడుచునుందురు వానిని ౯ విడుచు నతఁడు. ౩ 1153

క. గరుడుని భీతియె కలుగమి, నురగులు సౌఖ్యముగ నుండు ౯ న"గి సర్పము లి
క్కరణిని గరుడున కీయఁగ, గరళము పెంపున మదించి౯కాళియఫణియున్. ౩౪

సీ. వీర్యమదంబున ౯ వెలయుచు వైనతేయుని దృణంబుగ నెంచి ౯ తనదుభాగ
మాతని కీయక ౯ యనుభవించెను దానె భగవత్ప్రియుండయి ౯ యగణితమగు
మహిమమునం దగి ౯ మాననీయచరిత్రుఁ డౌసుపర్ణుఁడు కాళి౯యాహిఁజంప
వాంఛించి యధికజ౯వంబునఁ బఱతెంచెఁ బైఁబడ నరుదెంచు ౯ వైనతేయుఁ
ఆ. గాంచి కాళియుండు ౯ గరళంబె యాయుధ,ముగ నెసంగువాఁడె౯యగుటనాలు
కలు భయంకరముగ౯క్రాలంగ నయనంబు, లుగ్రములుగ నుబ్బి౯యొప్పుచుండ.

క. తనమస్తకపంక్తిని బై, కొనరంగను లేపియునిచి ౯ యురుతరవేగం
బున గరుడుపైకి నడతెం,చెను; జక్రికి వాహనమయి ౯ సిద్ధబలుం డై. ౬ 1156

చ. కరము భయంకరం బగుచుఁ ౯ గ్రాలుపరాక్రమ మొప్ప నొప్పు నా
గరుడుఁడు తీవ్రకోపమున ౯ గాఢజవంబునఁ గాళియాహిపై.

నురుతరశౌర్య మొప్పునటు లొక్క మెయిం బడి చిమ్మిచిమ్మిక
ర్బురరుచి వెల్లువామదళముం బయికెత్తియె తాఁచె నెంతయున్. ౬ 1157

మ. వినతాపుత్త్రుని పక్షతాడనమునన్ వే విహ్వలత్వంబునుం
గని యందుండఁగ నోడి యెవ్విధినొ యీ కాళిందియందున్న నీ
రనిధింబోలిన మడ్గుఁ జేరె నరపౌత్త్రా! యాహ్రదం బెన్నఁ దా
ర్క్ష్యున కెబ్భంగిఁ జొరంగరాకయె చెలంగున్ నిమ్నవార్యున్నతిన్. ౭ 1158

చ. ఇతరులుకూడ నందుఁ జొర నెంచరు లోఁతుగ వారియుంట నో
క్షితిపవరేణ్య! యందు నొకచేప చరించుచు నుండె నద్ది య
చ్యుతునకు వాహనంబగుచు నొప్పుఖగేంద్రున కెల్లకాల మా
దృతి గ్రహియించుభక్ష్యమగు నేచినప్రీతి సుపర్ణుఁ డొక్కటన్. ౮ 1159

క. దానిం దినఁ గోరిచనన్, మౌనిపుఁ డట సౌభరియను మహితాత్ముఁడు తా
నూనినవియతిఁ దపంబును, బూనిక నొనరించుచుండె భూతకరుణచేన్. ౯ 1160

క. వలదని గరుడుని గనుచుం, బలికెను దార్క్ష్యుండు మౌనిపలుకు గొనక మి
క్కిలియాఁకలిఁ గొనియుండుట, బలవంతమమీఁనఁ జిక్కఁబట్టి కొని చనెన్. ౯

క. మీనపతి నిట్లుకొని చనఁ, గా నెంతయుఁ బొగిలి దైన్య కలితములగు నా
మీనములఁ గాంచి సౌభరి, యానెలవునసుండు వానియార్తి యడంగన్. ౧౦

చ. కరుణచెలంగఁ బల్కెను ఖగక్షితిపాలుఁడు తార్క్ష్యుఁ డిందు సం
చరణముచేయు మీనముల సత్త్వముపొంగఁగఁ జొచ్చి యిప్పుడె
క్కరణిని గొంచుఁబోయె నటు క్రమ్మఱఁ బట్టిగ్రసించునేని స
త్వరమ గతాసుఁడయ్యెడును బల్కెది సత్య మటంచుఁ గ్రోధి యై. ౧౧ 1163

చ. మునిపతి శాపమిచ్చె; ఫణిముఖ్యుఁడు కాళియుఁడే యెఱుంగు నీ
మునివరుశాప మన్యఫణిపూగము నించుకయే నెఱుంగ దా
వనరుహనేత్త్రువాహనము వంకజనించిన భీతినేగి చొ
చ్చెను హ్రద; మందెయుండె నొకచేటును గానక స్వేచ్ఛమీఱఁగన్. ౧౪

క. హరి దానిని వెడలించెను, ధరణీశ్వర! యిట్లు దుష్టదారుణభుజగే
శ్వరు సాగ నంపి కృష్ణుఁడు, త్వరపడి యమ్మడుగుఁ బాసి వచ్చెన్ వెలికిన్. ౧౨

చ. మనసున కింపుఁబెంచు సుమమాలికలన్ ధరియించి హారిచం
దనఘనచర్చలం దనువు తద్దయు నొప్ప మనోహరాంబరం
బును ధరియించి దివ్యమణిపుంజ విభాసురభూషణంబులన్
గనకకలాపరాజి దగఁ గాంచనచేలుఁడు రాఁగ గోపకుల్. ౧౩ 1166

క. మరలం బడసినప్రాణో,త్కరమున నింద్రియము లట్లు కడు వేగమ లే
చిరి భూమినుండి మనసులు, పరమానందమునఁ బొదలఁ బ్రమదము పొంగన్.

క. హరిఁ గౌఁగిలించుకొని; ర,త్తరుణమునందున యశోద § తమి రోహిణియున్
ద్వరపడి నందుఁడు గోపో,త్కరములు గోపికలు కృష్ణుఁ § గ్రమ్మఱఁ గనుచున్.

తే. తమమనోరథములు పండ § ధన్యతఁ గని,నట్టు లలరిరి; బలదేవుఁ § డనుజుఁ గృష్ణు.
గౌఁగిటం జేర్చుకొని హరి § కార్య మెల్లఁ, దెలిసియుండుట సుస్మిత § మొలయఁ [గాంచె.

చ. తరువులు గోవులున్ వృషభ§తల్లజముల్ మఱి వత్సముల్ మహో
త్తరముద మొందె విప్రసము§దాయములున్ సకళత్రులౌచు స
ద్గురువులు నందుఁజేరి యిదె § ఘోరతరాహిఁ జిక్కి నీసుతుం
డరుదుగ వెల్వడం గలిగె § నారయ నీయదియే యదృష్టమా. ౧౭ 1170

క. ఈయాపద విధివశమునఁ, బాయంగాఁ గలిగెఁ గాన § బ్రాహ్మణులకు నీ
వే యే దానము లీఁగల,వో యవ్వానిని నొసంగు § టొప్పున్ రాజా! ౧౮ 1171

తే. పుణ్యవశమున శ్రీకృష్ణమూర్తి యిట్టి, యాపదం బాయఁగాఁ గల్గె § నట్లుగాన
దానముల నిమ్మనంగ నం§దవ్ర జేశుఁ, డల్లె స్వర్ణంబు గోవుల § నలరి యొసఁగె.

*చ. అనితరభాగ్యశాలిని మహాసతి యప్డు యశోద నష్టస
త్తనయుని లబ్ధిచే నతిముదంబును గాంచినదౌటఁ గృష్ణు నొ
య్యన బిగిగౌఁగిలించుకొని § యంకమునం దిడుకొంచు నశ్రుబిం
దునికర మత్తఱిన్ విడిచెఁ § దోఁపమిఁ బల్కఁగ నుంతయేనియున్. ౧౯ 1173

చ. ఖరకరుఁ డస్తమించె; నెటుగాని చనంగను లేమి నవ్విభా
వరి యమునాతటంబు నొక§భాగమునన్ శ్రమకర్శితాత్ములై
జరపఁ దలంచి రెల్లరును § స్వాంతము లాఁకలిదప్పులన్ నిరం
తరపరితాప మందఁగ ని§తాంతము గోవులు నట్లె తూలఁగన్. ౨౦ 1174

క. హరియును రాముఁడు నట్లే, పరితాపముఁ గనుచు స్వీయ§బంధుజనులతో
సరిగ వసించిరి రాఁగల, పరితాపము దీర్పఁగోరి § భద్రదు లగుటన్. ౨౦ 1175

శ్రీకృష్ణుఁడు కార్చిచ్చునుండి గోవులం గాపాడుట.

సీ. అర్ధరాత్రంబున§యందు గ్రీష్మర్తువు గావున నందున్న § కాననమున
దావాగ్ని యుదయించి § తటుకున వ్యాపించి నలుఁగడలం బ్రాఁకె§నందముఖులు
నిదురించుచుండ న§య్యదనున దహియింపఁ బూనె గోవులచుట్టు § పూన్కిఁ గ్రమ్మి;
దావానలం బిట్లు § తమ్మొగినిం గ్రమ్మి కాల్చుచుండుట కాంచి § కలఁతనొంది

తే. గోపకులు సంభ్రమంబునఁ § దాపశాంతిఁ, జేయు వెర వెన్ని తోఁపమి§శ్రీహరిఁ దన
మాయచే మానుషాకృతి § మహిమ వెలయఁ, దాల్చి నట్టిదైవము వేఁడఁ§దగు

క. మనములఁ దలంచి శరణం,బును వేఁడిరి కృష్ణ! కృష్ణ! § భూతావాసా! [నటంచు.
ఘనవిక్రమ! శ్రీరామా!, కనుమా యిదె భయదమైన § కార్చిచ్చు వడిన్. ౨౧

* "నష్టలబ్ధప్రజాసతీ" అని మూలము.

క. మీవారమైన మమ్మున్, బోవిడువక మ్రింగ నిదిగో । పూనెం జూడం
గా విలయకాలమందలి, పావకువలె దుస్తరముగఁ । బరఁగెం జుమ్మీ. ౨౩ 1178
క. నీవే ప్రభువవు కృష్ణా!, నీవారము మేము ప్రీతి । నిన్నే గనుచున్
వావిరిఁ గాలముఁ ద్రోతుము, గావున నీబారినుండి । కావుము త్వరగన్. ౨౪
క. అకుతోభయములు నీపాదకమలముల్ వాని విడువఁ । దలఁప మదెపుడున్
సకలశుభప్రదుఁడవు నీ, వికఁ గాలము పుచ్చుకుండ । నే కావఁదగున్. ౨౫ 1180
క. అని వాపోవఁగ లోకావనదక్షుఁడు కృష్ణమూర్తి । బంధుజనులదౌ
వనటం దలంచి తానే, యనంతుఁడై భూరిశక్తి । నలరుట నపుడే. ౨౬ 1181
ఆ. తన్ను నమ్మియున్న । తద్వ్రజవాసులఁ, గావ నెంచి శక్తిఁ । గాఁచిచ్చు
నెలమిఁ దీవ్ర మనుచు । నెంచక దిగమ్రింగె, దాన వారు భీతి । మానునట్లు. ౨౭

―――⟶⟵―――

## పదునెనిమిదవ యధ్యాయము.

### శ్రీహరి గ్రీష్మర్తువునందు విహరించుట.

క. హరిదివ్యచరిత్రము నీ, కరణిన్ వినిపించి మౌని । కాంతుఁడు మఱియున్
నరపతికిఁ దెల్పె నవ్వలి, హరిచరితము వేడ్కమీఱ । నట్లుగఁ బిదపన్. 1183
క. ఆరాత్రి యిట్లు కడున ము,రారాతియు సమ్మదాత్మ । లౌ జ్ఞాతులు స్వీ
యారమ్యకీర్తిఁ బాడుచుఁ, దోరాఁగన్ గోవ్రజంబు । తోఁ దగు వ్రజమున్. ౧
తే. తాఁ బ్రవేశించె; నీవిధిఁ । దద్వ్రజమున
గోవ్రజమ్మును బాలించు । కుతుక మొక్క
వ్యాజముగఁ గల్గుమాయచే । హరిగతులఁ
దిరిగి రామకృష్ణు ల । చ్చేరువు గాఁగ. ౨ 1185
సీ. వాసంతికక్రీడ । లీసరణిన్ సాగ నరుదెంచె గ్రీష్మర్తు । వల్లనల్ల
నను బ్రాణులకు నెల్ల । ననుమోదదం బది యంతగా గాకుండు । నట్టులైన
బృందావనసుగుణ । బృందముచే గ్రీష్మ మయ్యు వసంతంబు । నట్టు లద్ది
[1]కనఁబడె; నావ్రజం । బున రామునింగూడి కేశవుండు వసించి । కేళిసల్పు
తే. చుండెఁ గావున నద్దియు । నుండె నట్లు, [2]మందువేసవి సెలయేళ్లు । నిండిపాఱఁ
గలుగునిర్ఘోషముల ఝిల్లి । కలకఠోర, నిస్వనము వినఁబడకుండె । నెలవున నట.
క. సెలయేళ్ల నీటితుంపురు, లలముకొనన్ స్నిగ్ధములగు । నవనీరుహామం
డలముల మండితమై వన, మలరారెం జూడఁజూడ । నందంబగుచున్. ౪ 1187
చ. అనిలుఁడు ప్రోదిసీసలిల । జాకర నిర్ఝర తుంగభంగరా
జిని బొరలాడి తామరలు । చెంగలువల్ మఱి యుత్పలంబులున్

---

1 "యత్రాస్తేభగవాన్ సాక్షాద్రామేణ సహ కేశవః" అని మూలము. 2 యత్ర నిర్ఝరనిర్హ్రాద
నివృత్తస్వనఝిల్లికమ్" అని మూలము.

గనులకు విందుచేయ నటఁగల్గిన పుష్పాడులెల్ల సంగ్రహిం
చి నెఱి సువాసనల్ పొలయఁ జిత్రగతుల్ దగ సంచరింపఁగన్. ౪౪ 1188

చ. వనమున నందు శాద్వలము బాగుగ నొప్పి సుఖంబు గూర్పఁగా
జనులకు మందువేసవి నొసంగెడు తాపముగాని సూర్యుపం
కను జనియించు వేఁడిమియొ గాని రవంతయు సోఁకదయ్యె; వ్రా
దిను లపు డెండవేఁడిమికిఁ దెప్పున నింకక నిమ్నవారితోన్. ౫ 1189

క. ప్రవహించుచుండెఁ గావున, నవిరతము మహోర్మివితతు లంతట వ్యాపిం
ప వసుమతీభాగంబులు, ప్రవిమలపులినములు తడిసి రమ్యతమములై. ౫౪ 1190

చ. వెలయుచునుండ నత్తఱిని వేయిమయూఖము లొప్పు భానుకాం
తులు విషముల్ బలెన్ గవిసి తోరపుశక్తిని సారసంగ్రహం
బలయక చేయఁ జాలు నవియయ్యును భూమిరసంబుగాని శా
ద్వలములనొప్పు రమ్యతరభాగముగాని రవంతయేనియున్. ౬ 1191

క. హరియింపఁ జాలకుండెను, దరువరములు కుసుమితములుఁ దద్దయు సిరులం
బరఁగుచు నుండెను బక్షులు, విరావముల హారిరీతి వెలయించుటచేన్. ౬౪

చ. వినవిన నెంతయున్ మిగుల వేడుక నించుచునుండె నవ్వనం
బున మృగజాతు లార్వ నది మోదమునించుచునుండెఁ జిత్రరీ
తి నళులు బర్హిసంఘములు తృప్తి తగన్ శ్రుతిపేయగాన మొ
య్యన వినఁ జేయుచుండెను బకావళి కూజితముల్ వినంబడెన్. ౭ 1193

క. సారసములు ప్రీతిమనో,హారినినాదముల నెప్పు డానందము న
వ్వారిగఁ గల్గం జేయుచుఁ, గోరిక లలరార నుండె గోవిందుఁ డటన్. ౭ 1194

క. బలభద్రుఁడు తనతో ని,మ్ముల వనమున విహరణంబుఁ బూని సలుప వే
డ్కలు మించ నిరతిశయభూ,తుల మించినవాఁడు గానఁ దొలి గ్రీష్మమునన్. ౭౪

చ. వని విహరింపఁబూని మృదుభద్ర నినాదమనోహరంబుగాఁ
దనరెడు వేణువూఁదుచు నితాంతము దేహ మెఱుంగకుండగో
పనికరగోధనంబులు కృపం దముఁగాచు నటన్న నమ్మకం
బున వెనువెంట రాఁగ వనము దమిఁ జొచ్చెను గార్యసిద్ధికై. ౮ 1196

చ. లలిత నవీనపల్లవములన్ సుమగుచ్ఛమయూరబర్హకం
బుల సుమమాలికావితతిఁ బొల్పగుధాతువులన్ విచిత్రభూ
షల నొనరించి తాల్చుచు నొసంగెడు వేడుక రామకృష్ణము
ఖ్యులు వ్రజబాలు రాడుచు మహోద్యమ మొప్పఁగఁ బోరు సల్పుచున్. ౯

క. పాడుచు స్వేచ్ఛానుగతిన్, గూడుచు విహరించి రంత కోరికఁ గృష్ణుం
డాడుచు నుండఁగఁ గొందఱు, పాడన్ మొదలిడిరి ముదముపైపైఁ బొంగన్.

సీ. వేణువు లూఁదుచు విమలభావంబులఁ గొంద ఱుండిరి; మఱికొంద ఱపుడు
కరతాళముల బిట్టుగా వైచుచును గొమ్ము లూనివాయించుచు నుండి; రంతఁ
మఱియును గొందఱు మంచిది మంచిది బాగున్న దని స్తుతివచనములను
బలుకుచునుండిరి; సులలితగోపాలజననమ్మునం దమరిని నితరులు
తే. తెలిసికొనకుండ నమృతాంధసులు ప్రయత్న
ముననె కప్పుకొనుచును రాముని గృష్ణు
గోపకు లనంగఁ బరఁగుచుఁ గోరి నటుని
నటుల యట్లు నుతించిరి నైజభక్తి. ౧౧ 1199
చ. ఇరువురు సోదరుల్ విహరణేచ్ఛలు పొంగఁగఁ గూఁకటుల్ మనో
హరతఁ జెలంగ మండలముగనట్లు చరించుచు సైకతమ్ముపైఁ
ద్వరపడి దాఁటుచుఁ గదియ వచ్చినవారిని హెచ్చరించుచుఁ
గరముల నప్పళించుచుఁ దగం దము జేరఁగఁబట్టి లాగుచున్. ౧౨ 1200
తే. మల్లయుద్ధ మొనర్చుచు నెల్లగోప
బాలురంగూడి క్రీడించి రోలి నంత;
బాలకులు నృత్యములు సేయఁ బాటపాడి
వాద్యముల మ్రోయఁ జేయుచుఁ బలువిధముల. ౧౩ 1201
క. వినుతించుచు బళిబళి నర్తన మిది బాగున్న దనుచు స్తవవచనంబుల్
మనమలరఁ బల్కుచుండిరి, జనవర! యాసోదరులు ప్రశంసార్హముగన్. ౧౪
సీ. వారొక్కచోట బిల్వఫలంబుల మఱిగుగ్గులుఫలంబులను నామలకఫలము
లను బిడికిళ్లలోన నిముడఁగాఁ జేసికొనియాటలాడిరి మనల నొకరి
నొకరు తాఁకఁగనొప్పదిఁక నని పందెముల్ పలుకుచు ముందు గాఁబరువు వాఱు
వానిఁ దాఁకఁగ యత్నమూని యాడిరి మఱి డాఁగురుమూఁతలాడంబు మీఱ
తే. నాడుచుండిరి మఱియు నగ్ర్యౌ తెఱంగు, లైన బహువిధకేళుల నలర మదుల
వేడ్కపడుచుండి రొక్కెడవివిధమృగప, తత్రిచేష్టలు గావింపదలఁపుఁగొనిరి.
క. తలఁపుల కనువగు రీతుల, సలుపుచు నుండిరి మఱొక్క సమయంబునఁ గ
ప్పలవలె దుముకుచు బహువిధ, ముల మేలములాడుచుండిపుచ్చిరి తఱినిన్. ౧౫
క. ఒకపరి నుయ్యెల లూఁగుచు, నొకపరి రాజార్హవేషమూని చెలఁగుచుఁ
బకపక నవ్వుచు నుండిరి, సకలవిదుల్ సోదరు లొగి సరివారలతోఁ. ౧౬
*ఆ. లోకమునఁ బ్రసిద్ధి నేకరణిం జెంది, యున్నవైన యాట లొప్పుమీఱ
నెన్నికలవా వాని నన్నింటి నాదరిం,చుచును గేళిసల్పి రచటవారు. ౧౭
చ. వనములయందు ప్రొడినులఁ బర్వతసీమల వానియందునం

* "ఏవంతౌ లోకసిద్ధాభిః క్రీడాభిశ్చేరతుర్వనే" అని మూలము.

గనఁబడుకోనలందు లతికల్ పెనఁగందగు కుంజపుంజముం
దును విపినంబులందును మనోజ్ఞసరస్సులయందు గోవులన్
దనివి చనంగ మేపుచును ❀ దారు చరించిరి బాలయుక్తులై. ౧౬౪ 1207

## —బలరాముఁడు ప్రలంబాసురుం బొలియించుట.—

క. ఈరీతిన్ విహరింపఁగ, వారలలో రాముఁ గృష్ణు ❀ వధియింపంగాఁ
గోరి ప్రలంబుం డనునొక, క్రూరాసురుఁ డందుఁజేరె ❀ గోపాకృతితోన్. ౧౭
క. సర్వ మెఱింగినవాఁడై, సర్వమునకు సాక్షియనఁగఁ ❀ జాలినవాఁడై
యుర్విఁ జరించు ముకుందుఁ డ,ఖర్వంబగు గర్వమొప్పఁ ❀ గాఁ దముఁ జంపన్.
క. చను దెంచిన యారక్కసుఁ, గని యాతనితోడిపొత్తుఁ ❀ గాదన కెట్లీ
తనిఁ జంపఁదగునో యని మన,మున నెంచుచు నొప్పుకొనియె ❀ బుద్ధిబలమునన్.

ఉ. అంత మురాంతకుండు విబుధాంతకుఁ గ్రూరుని వానిఁ జంపఁగా
స్వాంతమునం దలంచి యొకచక్కని యాటను నిశ్చయించి లో
నెంతయుఁ బొంగుచున్ సఖుల ❀ నెల్లను జీరి వయస్యులార! క్రీ
డింతమె శక్తికిం దగుకడిందిమగంటిమి యొప్పునట్లుగన్. ౧౯ 1211
క. ఒకరొకరుగాక రెండుగ, నిఁక జతలుగఁ గూడి స్వేచ్ఛ ❀ నిటవిహరింపన్
సకలవిధములం గన హా,యి కలుగు ననిపల్కె; రామకృష్ణు లధిపులై. ౧౯౪
క. చరియింపఁగ బాలకు లొ,క్కరిజతగాఁ గొందఱుండఁ ❀ గను గొందఱు నొ
క్కరిజతగాఁ జేరిరి వా, రిరువురె తమవారిఁ గావ ❀ నెంచుపరివృఢుల్. ౨౦
క. అం దోడినవారలు గెలు,పొందిన వారలను మోయ ❀ నొప్పుకొనుట నే
సందియ మొందక మోయుదు, రందు విజయ మొందువారి ❀ నగ్ర్యోగతులన్.
క. మోయుచు నోడినతఱిని, మోయించుచు గెల్చినపుడు ❀ మోదంబున ని
ట్లాయాటను సాగించుచు, నే యావుల మేపుచున్ జనయేచ్ఛలఁ గొనుచున్. ౨౧౪
క. చనిచని యటభాండీరక, మను వటభూరుహముకడకు ❀ నరిగిరి కృష్ణుం
డును బోయె వారిముందుగ, మొనగాఁ డనుఖ్యాతి నొందిబుద్ధిఁ దలఁచుచున్.
క. ఆవటభూరుహ నికటము, పావనముగ నొప్పు నందుఁ ❀ బ్రాగ్విధమున నే
గోవల్లభుండు క్రీడా, వ్యావృతి సాగించె దనుజు ❀ నట వధియింపన్. ౨౨౪
సీ. ఆయాటలోఁ గృష్ణుఁ ❀ డపజయ మొందంగఁ దత్పక్షమున నున్న దనుజముఖులు
జయమందినట్టి కృష్ణజ్యేష్ఠముఖ్యుల వహియించి నడచి రవ్వరుస యందు
హరి భగవంతుఁడై ❀ యలరియుఁ గారణాంతరమున శ్రీదాముఁదాను మోచె
భద్రసేనుఁడు బలభద్రుని సహచరువృషభుని వహియించె ❀ వేడ్కమీఱ
తే. నట్టె బలదేవు నాప్రలంబాసురుండు, మోచికొని పోయె; దానవపుంగవుండు
కృష్ణు నవిషహ్యుగా మదినెన్నికొనుచుఁ,దనపయిం గూరుచున్న రాముని గడంగి,

క. ఎందాఁక మోచి డింపఁ, గం దగు నని నియమముండెఁ గావున నచ్చో
టం డింపక కడువేగమ, యెందో డింపంగ నెంచియే కొనిపోయెన్. ౨౨ 1219

మ. బలదేవుండు మహాచలంబుపగిదిన్ భారంబుగా నుంట న
ప్పలలాహారుఁడు మోయఁజాలక గతప్రాగ్గర్వవేగుండు నై
చల మొప్పం దనతొంటిరూపము లసచ్చామీకరాంచత్సుభూ
షల నొప్పారెడుదానిఁ దాల్చె నదియే సాజంబు తజ్జాతికిన్. ౨౩ 1220

ఆ. దాని నెక్కియున్నతఱి బలరాముని, మోచికొనుచుఁ బోవ నేచి విద్యు
దోఘపరివృతమయి యొప్పు శశిందాల్చు, నీలనీరద మన నెగడె నతఁడు.

సీ. ఆసమయంబున నాపృథుకాయ మత్యున్నతంబయి యొప్పుచుంట గగన
మును స్పృశించుచు, జవమ్మునఁ బొవుటను హుతవహుని కణమ్ములవలెనయనము
లగపడుచుండ భయంకరదంష్ట్రలు వెలయుచు భ్రుకుటులఁ గలిసియుండ [గ
మండుచున్నట్టు లెయ్యుండు వెంద్రుకలొప్పఁ గటకముల్ ముకుట మంగదము లెసఁ

తే. వానికాంతులు చిత్రముగా నెసంగఁ, గానఁబడ రాముఁ డించుక గనియె భీతి;
నంతలో స్వబలాధిక మాత్మఁ దోఁప, భయము తొలఁగంగ నాబలభద్రుఁడపుడు.

క. తనతోడివారికిం ద, వ్వున నుంచఁగఁ దన్నుఁ దెచ్చెఁ బూనిక నితఁ డం
చును దలఁచి వాని రక్కసు, గ నెఱింగి మహాగ్రహంబు గడలుకొనంగన్.

క. అమరేశుఁడు కులిశనిపా, తమునన్ భూధరమునట్లు తనదృఢముష్టిన్
బొమముడి యడరఁగ నత్తఱి, నమరిచి బిట్టుగను బొడిచె నాతనిశిరమున్.

చ. బలు దృఢముష్టిఘాతమున వానిశిరం బొగి వ్రయ్య లయ్యెఁ; ధా
రలుగనె నోరనుండి రుధిరంబు బయల్పడఁగా నపస్మృతిన్
గలఁగుచు హాయటంచు వడి గాఢరవంబులు పర్వఁ బ్రాణముల్
వెలువడ నింద్రునాయుధముచే ట్రునఁ గూలెడు పర్వతంబునాన్. ౨౮ 1225

క. ధరణిని ద్రెళ్లెఁ బ్రలంబా, సురుఁ డిటు బలశాలియగుచు శోభిలు బలుచే
దురమున నిహతుం డగుటం, బరికించి సువిస్మితులయి బాలకు లెల్లన్. ౨౯

ఆ. సాధుసాధు వాక్య సమితిచేఁ బొగడిరి, మఱియు నాశిషముల నెఱి నొసంగి
మరలబ్రదికి నట్లు మదుల నెన్నుచుఁ బ్రేమ, విహ్వలాత్ము లగుచు విమతహరుని.

క. వినుతికి నర్హుని రాముని, దనివాఱఁగఁ గౌఁగిలించి తగినవిధమునన్
వినుతించిరి; పాపాత్ముఁడు, దనుజుండు ప్రలంబుఁ డిటుగతప్రాణుండై. ౩౧ 1228

క. ధరఁబడుటఁ గాంచి నిర్జర, వరు లప్పుడు హాయిచెంది వరసుమవృష్టిన్
గురియించి రాముఁ బొగడిరి, సురకార్యము చేసి తీవె శూరుఁడ వనుచున్.

## ప ం చో ష్మి ద వ య ధ్యా య ము.

### హరి దావాగ్నిం ద్రావి గోగోపకులఁగాచుట.

క. అని తెలిపి మరల శుకముని, జనపతి కవ్వలి రమేశు సద్వృత్తముఁ దె
ల్పనుబూనె రాజచంద్రా!, వనజాక్షుఁడు రామ గోప బాలక యుతుఁడై. 1230

చ. వనమున కేగె నంత నొక వంకను గోవులు మేయుచుండఁ జ
క్కనివనకేళులన్ జరపఁ గా మదులందుఁ దలంచి బాలకుల్
వనరుహనాభుఁగూడి బలభద్రుఁడు తోడుగనుండఁ గ్రీడలన్
మనములఁ గూర్చియుండి రొకమాఱును గోవుల రక్ష నెంచకే. ౪ 1231

ఉ. ధేనువు లందు మేయుచును దీరగు మేపును గోరి లోభతన్
మానసముల్ గలంగ వనమార్గములం జరియించుచున్ దృణం
బే నెల వందుఁ జిక్కునో సమృద్ధిగ నంచొకగహ్వరంబు ని
చ్ఛానుగతప్రవృత్తిఁ జనె నద్ది యెఱుంగరు బాలు రాటలన్. ౧ 1232

సీ. అజమహిషీగణం బావులునున్ వనముననుండి వేఱొక వనమునకును
బోవుచుఁ బెరిఁగిన భూరితృణంబునఁ దగియున్న వనముఁ జొచ్చెఁ గడువడిని;
నదియె ముంజారణ్య మను పేరఁ బరఁగెడు నటఁజొచ్చి పరితాప మధికమగుట
నార్చుచు నుండెఁ; గృష్ణాదులు క్రీడయం దాసక్తిఁ గొనియుంట నావు లరుగు
తే. టరయఁజాలక వానిసంచరణ మెఱుఁగఁ
బడమిఁ దురపిల్లి యనుతాప మడర వెదకు
చును దదీయగతిం గనుచొప్పు తెలియ
కవ్విపోయిన జాడల నరయఁ బూని. ౩ 1233

చ. అరుగుచుఁ దత్ఖురాగ్రహతి నట్టినలంగిన పచ్చికల్ మహా
తురమునఁ బండ్లచేఁ గొఱుకఁ దోడనె త్రెళ్లినపచ్చికల్ పడిం
జరణము లూఁది పోవఁ గనఁజాలెడుగుర్తులు త్రోవఁ జూప స
త్వరముగ నాత్మజీవనమె తద్గతమాటను బోయి రర్భకుల్. ౮ 1234

ఉ. చింత మనంబులం బొడమి చేష్టుడఁజేయఁగఁ బోయి పోయి యా
వంతయు వానిసన్న తమయాత్మలకుం బొడకట్టకున్న నిం
తింతనరాని ఖేదమునా నే చరియించుచునుండి రట్టి యా
చెంతనె ముంజకాననముఁ జేరి మహార్తిని గూయుగోవులన్. ౮౪ 1235

క. తెలిసికొనం జాలక త్రోవలు కన్పడకుంట నలసి వర్థిలుడప్పిన్
బలువిధముల నార్తింగని, దలఁచిరి తన్మార్గమందె తద్గోధనమున్. ౫ 1236

క. పరికింపనెంచి చక్కఁగఁ, దిరుగుచునే యుండి; రంత దీవ్యన్నీల
స్ఫురదభ్రచ్ఛవి యలరఁగ, హరి పాడవగువృక్ష మెక్కి యార్తి యడంగన్. ౫౪

క. తనరూపము గోవులకుం, గనఁబఱచుచు వేఱువేఱ గాఁ దగువేళ్లన్
దనివారగఁ బిల్చెను; దద్ఘనగంభీరస్వనంబు క్రమ్రతమముగన్. ౬ 1238

చ. వినఁబడినంతనే యది త్రివిక్రము కంఠనినాద మంచు నె
మ్మనములఁ దోఁప గోవులు సమస్తవిధంబుల హర్ష మొంది చ
క్కని ప్రతినాద మిచ్చె; నది కాంచిన గోపకులెల్ల సంతసం
బునుగని; రంత దైవగతి భూతభయంకర దావవహ్నియున్. ౬౪ 1239

ఉ. కాననవాస సంతతిని గాల్పఁగ నల్గడలన్ జనించి పెం
పూనినవాయు వొక్కమొగి భూతభయంకరలీలఁ జిమ్మఁగాఁ
దానె చరాచరావళిని దగ్ధము చేయుచు నిప్పుకల్ దెసల్
గానఁగ రాకయుండు నటు క్రమ్మఁగఁ బైపయి మంట లొప్పఁగన్. ౭ 1240

ఉ. ఒక్కముహూర్తమాత్రమున నుగ్రతరంబుగఁ జుట్టుముట్ట నిం
కెక్కడి జీవితం బనుచు నెంచుచు గోధనగోపకార్భకుల్
దిక్కఱి భీతిఁజెంది బలదేవయుతుం డగుకృష్ణుఁ జేరి నీ
వొక్కఁడవే మహార్తిఁ గనుచున్న మముల్ దయఁగావఁ జాలుదౌ. ౭౪ 1241

క. అని వేఁడుచు మృత్యుభయం,బున జను లాహరిని వేఁడుపోలికఁ గృష్ణా
వనజాక్షా! వీర్యోత్కట, ఘనవిక్రమ రామ మమ్ముఁ గార్చిచ్చు వడిన్. ౮౪

క. చుట్టుకొని కాల్చుచున్నది, యిట్టిట్టు తొలంగ నేర; మీయెడ మిమ్మే
దిట్టలు రక్షింపఁగ నని, పట్టుదలన్ వేఁడిరి మిటు బంధుల మమ్మున్. ౯ 1243

క. పరిరక్షించుట న్యాయం, బరయఁగ నీవార మగుచు నార్తిం గను టె
క్కరణిం దగునే ధర్మో,త్కరమున మీ రెఱుఁగనిదియుఁ గలదే యెందున్. ౯౪

క. నీవే శరణం బనుచున్, నీవే నాథుండ వనుచు నీసాయంబే
కేవెఱపులేక యుండం, గా వసుధం జేయు మనుచుఁ గడు నమ్మి యిటన్. ౧౦

క. చరియించువార మచ్యుత!, పరిరక్షింపంగఁ దగినభారము నీదౌ
శిరమున నున్నది కావుము, పరమేశ్వర యనుచుఁ బల్కు బంధుల మొఱలన్.

చ. హరి సకలార్థముల్ తెలియునట్టి మహాత్ముఁడుగాన మీర లీ
తరుణమునందు భీతిలక దైవము నమ్మి నిమీలితాక్షులై
త్వరపడకుండుఁ డంచు దయవర్ధిలఁగాఁ బలుకంగ వార లా
హరిపను పాచరించిరి భయం బిసుమంతయు లేక యంతటన్. ౧౧ 1247

మ. వనజాక్షుండును యోగశక్తిమెఱయన్ వర్థిల్లి యొక్కొత్తుగా
జనులన్ భూతములన్ గ్రసించుటకుగా సంకల్పముం జేసి మిం
చినదావాగ్నిని నోట మ్రింగి జనులన్ జేడ్పాటుమై నున్నవా
రిని గోసంఘము గాచి కష్టములఁ దీర్చెన్ సాహసం బొప్పఁగన్. ౧౨ 1248

ఉ. అంతియగాక పర్వతగుహాంతరసీమలనుండి గోగణం
బెంతయు వేడ్క వేఱొక మహీతలమందు వసింపఁ జేర్చె బ
ల్వింతగఁ గన్నులం దెఱువ వేడ్కల నాడినచోట నుండె నో
క్కింతయు భీతిలేక సఖబృందము కృష్ణుఁడు తోడనుండఁగన్. ౧౨౫ 1249

సీ. భాండీర మనువనభాగమ్ముఁ జేరినబాలకుల్ విస్మితస్వాంతు లగుచు [ఆఁగి
యోగమాయాశక్తి యొప్పు నాశ్చర్యదంబయి హరియందు నం చాత్మ నె
హరిమాయకుం జిక్క యమితబలంబు శ్రీహరికిఁ గల్గుట నెన్ని యగ్నిబాధఁ
దొలఁగించి క్షేమము గలిగించినట్టి యాశ్రీకృష్ణుఁడే ధర సిద్ధదైవ
తే. మని తలంచిరి; సాయాహ్నమందు శౌరి, రామునింగూడి ధేనువారంబుతోడ
వేణునాదంబు మిక్కిలి వింతగూర్ప, గోపకులు తన్ను నుతియింపగోష్ఠ మొందె.

క. మందవసించెడు గోపీ,బృందమునకు హరియు లేనివేళ క్షణం బై
నం దగయుగశతములు గా,నం దగనటు తోఁచుచుంట నైజం బగుటన్. ౧౩౫

క. హరిఁ బొడఁగాంచిన యంతనె, పరమానందంబు పొదలె బాలకు లంతన్
హరియును రాముఁడు వైశ్వా,నరుబాధం గుందకుండ నైజమహిమ చేన్. ౧౪౫

క. తముఁ గాపాడిన యద్భుత, తమకృత్యము దుష్టబుద్ధిఁ దగినప్రలంబా
ఖ్యు మృతియు గోపికలకుఁ జి,త్రముగాఁ గన్పడఁగఁ దెల్పఁ దరుణులు వృద్ధుల్.

క. విని యాయద్భుతచరితం,బును విస్మితు లగుచు రామమూర్తిగఁ గృష్ణుం
డునుగా దేవత లెవ్వరో, జనించి నటు లెంచి నావ్రజంబున మిగులన్. ౧౬

---

ఇ రు వ ద వ య ధ్యా య ము.

వర్షర్తువర్ణనము.

చ. అనుపమభానుదీప్తుల మహాత్తరతాప మొసంగు గ్రీష్మమం
దు నిఖిలజంతుజాలములు తోరపునార్తిని బొందియుండె; నం
త నిఖిలతాపముల్ చన నితాంతము నుద్భవకారణంబుగాఁ
దనరెడు వృష్టికాల మది ధాత్రిని దోఁచెను మెల్లమెల్లఁగన్. ౫ 1255

మ. పరివేషంబులు మింటఁదోఁచెను; దిశల్ భాసిల్లె; విద్యుల్లతో
త్కరముల్ తోఁపగ, నంబరస్థలి నితాంతస్ఫారమేఘధ్వనుల్
వరుసన్ శ్రోత్రభయంకరంబుగఁ బయిం బై విస్తరిల్లెన్ మహా
త్తరనీలాభ్రము లట్టె గర్జితయుతిన్ దన్ గ్రమ్ముటన్ వ్యోమమున్. ౧ 1256

క. పలుభంగుల శంపాలతి,కలు వ్యాపించుటను భానుకమలారిముఖా
మలతేజస్సులు సుంతయు, వెలుఁగక యుండంగ నుండె వింతగ నపుడున్. ౧౫

[1]తే. అట్టితటి నభ్రము గుణత్రయమునఁ గప్పఁబడినజీవాఖ్యమైనట్టి బ్రహ్మమువలెఁ
గానఁ బడియెను; మాసాష్టకమున భూమి, యందుఁగలజలమయవసు వట్టిపూని.
క. తనకిరణంబులఁ జక్కఁగను జీలిచి తగినయట్టి కాలమురా దా
నిని బర్జన్యాకృతిఁ దగు, వనజాప్తుఁడు విడువఁబూనె వాంఛ యలరఁగన్. ౩
క. ఘనతరవిద్యుద్యుత గురు, ఘనములు తీవ్రానిలమునఁ గంపితములు నై
యనుకంపాన్వితు లితరులు, వనటంగుందంగఁ గాంచి వారికొఱకుగాన్. ౩౪
క. తమజీవనమును వదలియె, మమతఁ సాయంబు చేయుమాడ్కి సకలతా
పముల నడంపఁగఁ జాలిన, యమృతము గురిసెం దమంత యాదృతి మీఱన్.
[2]చ. ఖరకరుగ్రీష్మతాపమున గాసిలి వారిదసిక్తదేహ యై
ధరణియు సస్యముఖ్యములఁ దద్దయుఁ బుష్టిని గాంచెఁ; గామ్యమై
పరఁగు తపంబుచేసి తనభాసురదేహము దానఁ జిక్కఁ ద
ద్వరఫల మొప్పువేళఁ గడుభాసిలి పుష్టిగనుండు చాడ్పునన్. ౫ 1262
చ. [3]తొలుతటిరాత్రికాలమునఁ దోరపుఁజీఁకటు లొక్కరీతిఁగా
నలముట జ్యోతిరింగణము లత్తఱి వెల్గెను; ఖేటతారకా
వళులప్రకాశ మట్లడఁగెఁ బాపుల పద్ధతులే కలిఁ గడుఁ
వెలయుచు సాధువేదవిధిబృందము లొప్పకయుండుచాడ్పునన్. ౬ 1263
సీ. పర్జన్యనినదంబుఁ బాటించి మండూకములు పల్కసాగుటఁ దలఁప బ్రాహ్మ
ణులు నిత్యకర్మంబు లలయక యొనరించి యవ్వల నాచార్యుఁ డాత్మకంఠ
నినదంబు నిగుడింప విని యంతదనుక నూరకయుండి యవ్వలఁ బ్రకటవేద
పాఠమునకుఁ బూనుపద్ధతి తోఁచెడుఁ దటములనొరయు నుదకములఁదగు
ఆ. క్షుద్రనదులు వృష్టిశోభ నివర్తింపఁ, దగ్గుచుండె స్వేచ్ఛఁ దనరుపురుషుఁ
డర్థదేహములను వ్యర్థముగ వ్యయింపఁ, గృశత నందురీతి నెంచిచూడ. ౭
సీ. నీలవర్ణంబులౌ బాలతృణంబులఁ బచ్చనై యింద్రగోపమ్ము లనెడు
పురుఁగుల నెఱ్ఱనై పోల ఛత్రాకారముగఁ దోఁచుచుండెడు పుట్టగొడుగు
లవగు నీడలనొప్పి యవని యత్తఱి మహీపాలసేనాళి సంపదనుబోలి
యలరారుచుండె వృక్షములకు వర్ధిల్లుచుఁ జెడుచు నుండినపైర్లసిరులఁ దనరు
తే. పంటపొలము లదృష్టంపుఁ బరిణతి నెఱుఁ
గక యహంకృతి దగు సేద్యగాండ్ర కెలమిఁ

1 "అస్పష్టజ్యోతి రాచ్ఛన్నం బ్రహ్మేవసగుణం బభౌ" అని మూలము. "సగుణంగుణైరా చ్ఛన్నం జీవాఖ్యం, విద్యుద్గర్జితాంబుదానాం సత్త్వరజస్తమోభిరుపమా." అని శ్రీధరాచార్యులు. 2 "యథైవకామ్యతపస స్తను స్సంప్రాప్యతత్ఫలమ్" అని మూలము. 3 "నిశాముఖేషు ఖద్యోతాస్త మసాభాంతిన గ్రహాః." అని మూలము.

చింతఁ గల్గించుచుండె నిశ్చింతముగను
జాలుదురె మదయుక్తు లేవేళ నుండ. ౧౦ 1265

మ. జలమందుం స్థలమందు నుండఁదగు నాజంతూత్కరం బప్డు నూ
త్నలసద్వారిని గ్రోలి శ్రీహరిని హృత్పద్మంబునం గొల్చువా
రలటుల్ సుందరరూపముల్ గలుగుటం। రాణించెఁ జూడంగ ని
మ్ముల యోగంబు సమంచితం బగుఫలంబుం గూర్పకే పోవుచోన్. ౧౧ 1266

క. పరిపక్వము గాదనియే, యరయం దగు నట్టి యోగి। యంతస్సు నిరం
తరకామవాసనాయుతిఁ, బరఁగునయే విషయయుతిని। బహుభంగులుగన్. ౧౨

క. కలవిలపా టొందెడుగతి, జలరాశియు వాయుదేవసంగతి భంగం
బులు చెలఁరేఁగఁ దరంగిణి, జలపూరముగూడ మిగులసంక్షోభించెన్. ౧౩ 1268

సీ. ఆదిదైవం బగునాయధోక్షజునందు మనసు నిల్పినయట్టి। మానివర్యు
లాధ్యాత్మికం బనాధిభౌతికమన నాధిదైవికమన। నాఖ్యలొంది
యున్నట్టి వ్యసనంబు। లొక్కమొగిం దమ్ము నెంతబాధించిన। నించుకైనఁ
గలఁత నొందనియట్లు। క్ష్మాధరంబులు వర్షధారలు సతతంబు। తమ్ము ముంప

ఆ. వెతల నొందకుండె। ద్విజులు వేదంబులఁ, జదువకుంట నవ్వి। సమయహతము
లైనయట్లు త్రోవ। లత్తఱి నడువమి, గడ్డిగప్పియుండు। కారణమున. ౧౪ 1269

[1]క. సందేహాస్పదములుగా, నందందుం దోఁచుచుండె। నమలసుగుణయు
క్తిం దగుపూరుషవర్యుల,యం దసతీబృందమైత్రి। యతిచంచలమై. ౧౫ 1270

క. కనఁబడులాగున లోకం,బునకుం జలదానరూపమున బంధువులై
తనరెడు మేఘములందును, ఘనశంపాలతలు స్థిరతఁ గాంచకయుండెన్. ౧౬ 1271

సీ. ఆరయఁగా గుణవ్యతికరాత్మకమగు నట్టిప్రపంచమునందు నగుణుఁ
డౌపురుషుం డెట్టు। లట్టు గర్జాశబ్దగుణకమా నంబరాంగణమునందు
గుణరహితంబయి। కొమరారు నింద్రచాపము వెల్గుచుండెఁ గాంతముగనప్పు
డాత్మప్రకాశత। నలరు నహమ్మతి నావృతుండగు జీవు। నట్లు తనదు

తే. వెన్నెలంగూడి యెంతయు। వెల్గుమేఘ, మావరింపఁగ శశధరుఁ। డాత్మతేజ
మలరకుండఁగ నుండె గేహములఁ గుందు, చున్న నిర్విణ్ణు లెల్లనచ్యుతజనయుతి.

క. అలరారునట్లు మేఘం,బుల రాకకు సన్మయూరములు ప్రమదమ్ముం
గలిగి చెలరేఁగి నర్తన,ములు చేయుచునుండె నాత్మ। బొంగెడుకాంక్షన్.

[2]చ. తొలుతఁ గుటుంబయాత్రఁ దమితో నొనరించుచుఁ గామసేవనం
బులఁ బలుతాప మంది శ్రమముం దొలఁగించుకొనంగ శ్రీశుప

---

1 "స్థైర్యంచక్రుః కామిన్యః పురుషేషు గుణిష్వివ" అని మూలము.

2 "యథాకామానుసేవయా" అని మూలము. దీని విస్తృతార్థమే యిందుఁగలదు.

జ్జలజయుగంబు గాచు నని స్వాంతములం దలపోసి సిద్ధులన్
జెలఁగెడు మౌనివర్యులటు చెందినగ్రీష్మపుఁదాప మెంతయున్. ౧౯ 1274

క. తముఁ జిక్కఁబోవఁ జేసిన, నమృతము వర్షర్తువున మహార్తి తొలఁగ వృ
క్షము లాఁగిఁ ద్రావుచు బహురూపము లొప్పఁగ వరుసమీఱభాసిల్లెఁ గడున్.

*సీ. ఘోరరూపంబులసారంబులైన కృత్యముల నొప్పిన సదనములయందుఁ
నత్యాశగల గ్రామ్యు లైనజనుల్ నివసించుచందమ్మునఁ జిక్కనైన
పంకంబు కంటకపటలంబు గల్గినతటములుగల సరస్తతులయందు
సారసంబులు నివాసముచేసెఁ; గలికాలమందుఁ బాషండుల యసదుదార

ఆ. వాదములను దివ్యవేదమార్గంబులు, చెడెడుభంగి మిగులసేతుబంధ
ములు ప్రవాహవేగమునఁ దెగిపోవుచు, నుండెవృష్టిగురియుచుండనపుడు.

చ. పురికొలుపం బురోహితులు భూపతు లర్థులకోర్కు లర్హ్వమా
తరుణమునందుఁ దీర్చెడువిధంబున వాయుసమీరితంబులై
వరుసగ భూతజాలములు వర్థిలున ట్లమృతం బొసంగె వా
ర్ధరములు దానఁ బ్రాణితతి తద్దయు హాయిని బొందుచుండుఁ జూ. ౨౨

వర్షాకాలమున హరి విహరించుట.

క. ఈరీతిన్ జంబూఖర్జూరాదిక పక్వఫలవిశోభిత వనముం
జేరె విహరింపఁ బాలకు, లారాముఁడు తోడరాఁగ హరియుం బ్రీతిన్. ౨౩

సీ. ఊధోభరంబున నురవడి నడువఁగాఁ జాలకుండియును, గోపాలకృష్ణుఁ
డాదృతిఁ బిలువఁగా నవి పాలుచేఁపుచు నూధోభరంబులు నొప్పుచుండ
వడివడిఁ బరువెత్తి వచ్చెను హరిచెంత; కవ్వనమం దున్నయట్టి జనుల [నీయ
ముదమునఁ బొదలంగసదయుఁ డౌహరి చూచెఁ దేనియల్ గురియుచుమాన

తే. ములగుపుష్పంబులం దగిలలితములగు, వనములను సెలయేళ్లను వానిధ్వనుల
భూరిగుహలను గనియె విహారమందుఁ, దగులుచిత్తంబు గలహరి తద్ఋతువున.

క. బోరన వర్షము గురియఁగ, సారసనేత్రుండు శౌరి క్ష్మారుహమూలం
బో రమ్యగుహయొ గృహముగ, నారసి కందాదులఁ దిని యట విహరించెన్.

చ. జలములదాపునం దనరు చారుశిలాతలమందు నర్హ్వాతం
జెలఁగెడు బాలురన్ బలునిఁ జెందినవేడుకఁ గూడి యే దధిం
గలిపిన యన్నముం దినియెఁ; గమ్రతమం బగుశాద్వలంబుపైఁ
బొలుపుగఁ గూరుచుండి శిశుపూగము రాముఁడుఁ గూరుచుండఁగన్. ౨౬

సీ. అచ్చట నయనంబు లల్లనముకుళించి పచ్చికమేయుచు బలిసియున్న

* "సరస్వశాంతరోధస్సు న్యూషురంగాపి సారసాః" అని మూలము. "అశాంతాని ఘోరాణి" అని వ్యాఖ్య.

యట్టివృషంబుల నవ్వానిచెంతను దగువత్సతరములఁ దమపాదుఁగుల
భారంబునకు శ్రమంపడు ధేనువుల మఱి యెల్లప్రాణులకు నకహీనమోద
మొదవించుచునుమాయనయొప్పఁగ స్వేచ్ఛఁగాఁ బెరిఁగిచెలంగెడు వృష్టికాల
తే. లక్ష్మిఁ గనుఁగొని తనదు నుల్లమున మిగుల
గారవించెను శ్రీకృష్ణుఁ డౌర యనుచు;
నిట్లు శ్రీరామకృష్ణు లింపెసఁగ వ్రజము
నందు వర్షర్తుసౌఖ్యము నందుచుండ. ౨౯ 1282

శరదృతువున శ్రీహరి విహరించుట.

క. అరుదెంచె శరత్కాలం, బరుదుగ నత్తఱిని నంబరాంగణమున వా
ర్ధరములు మెల్లన సడలుట, పరమములై స్వచ్ఛములయి పరఁగె జలములున్.
చ. సురపథ మప్డు స్వచ్ఛమయి శోభిలుచుండెను దాఁకినంతనే
పరమసుఖంబు నీయఁదగి పర్వెను వాయువు వృష్టివేళ నే
వరుసను వృద్ధిలేక తగువారిరుహంబులు నప్డు మెల్లఁగా
శిరముల నెత్తసాగెఁ దమిఁ జెందఁగఁ జేయుశరత్తు గావునన్. ౩౦౪ 1284
క. సరసిజవృద్ధిం గాంచిన, నురుయోగము భ్రష్టమైన నుల్లంబులు సు
స్థిరతన్ మానఁగ మరలన్, వరుసన్ యోగైకసేవ స్వాంతములు కడున్. ౩౦
సీ. స్వచ్ఛంబులై యుండునట్లు సరస్సులయందలి జలము లయ్యదనునందు
సుప్రసన్నములయి శోభిల్లె; శ్రీకృష్ణభక్తియాశ్రమములు వరుసనాలు
గనిచెప్పఁబడు నందునాదియౌ బ్రహ్మచర్యమున సద్గురుసేవనమునఁ గల్గు
కష్టంబు మఱియును గార్హస్థ్యమునఁగల సంసారసాంకర్యసంశ్రమంబు [గామ
తే. వనమునందుండఁ దగుతఱి ఘనతరమల, ధారణక్లేశమును యతిత్వమునఁ
వాసనాదిమలంబును వరుస నపహ,రించులాగున నాకాల మంచితముగ. ౩౧౪
క. సురపథమునకున్ మేఘా,వరణంబును భూతములకుఁ బాటిల్లెడు సం
కరతను నీటిమలంబును, ధరకుం గలపంకమును నితాంతము చెందెన్. ౩౨ 1287
చ. హరిని మదిం దలంచు సుకృతాత్ములు లోకకళత్రవిత్తముల్
నిరతము సౌఖ్యదంబులయి నిచ్చలు నుండఁగఁ గోరకే యఘో
త్కరమును బాసి శాంతులయి క్రాలుతెఱంగున సర్వవిత్తమై
పరఁగుజలంబునున్ వదలి పావనతేజము నొందె మేఘముల్. ౩౩ 1288
చ. గురువులు జ్ఞానసింధువులు కోరిక శిష్యులువేఁడ వారలం
బరిపరిఁ జక్కఁగా నరసి పక్వమనీషులె యైనయట్లు తోఁ
ప రమణ జ్ఞానరూపముగ భాసిలు నయ్యమృతంబు నిచ్చి య
క్కరణి నపక్వచిత్తులకుఁ గమ్రతరామృత మీనిరీతిగన్. ౩౩౪ 1289

చ. ధరములు మంగళోదకము ౹ తద్దయు నొక్కెడఁ బాఱఁజేయుచున్
దొరుఁగక యుండె నొక్కయెడఁ; ౹ దోరపుమూఢత నొంది భూరిసం
సరణమునందుఁ బ్రీతిగనఁ ౹ జాలెడుమానవు లాయువంతయున్
వరుసగఁ దగ్గిపోవుటను ౹ స్వాంతములందుఁ దలంప నట్లుగన్. ౩౪ 1290

తే. అల్పజలములఁ దిరుగుమీనాదికములు, జలము వరుస నశించుటఁ ౹ దెలియఁజాల
కల్లె తిరుగుచునుండె విహారమందుఁ, గలుగు వేడుక పెంపున ౹ లలితగతుల. ౩౫

సీ. అవిజితేంద్రియుఁ డగునట్టి కుటుంబియుఁ గృపణుఁడై తనలేమి ౹ నపరిమితము
గాఁదగు క్లేశంబుఁ ౹ గనెడు తెఱంగున నల్పజలంబు సమాశ్రయించి
యున్నమీనాది జంతూత్కరం బత్తఱి నర్కతాపంబును ౹ నాత్మ నెఱిఁగె;
నాత్మభిన్నంబు లౌనట్టి దేహేంద్రియాదుల నహంతామమతలను జ్ఞాను
తే. లల్లనల్లన వదలెడు ౹ నట్లు నేల, లాత్మపంకంబు *వీరుత్తు ౹ లపరిపక్వ
తను గ్రమంబున వదలె నత్తఱుణమందు, నర్కరశ్ములు సోఁకుట ౹ నవనినాథ. ౩౬

తే. ఆత్మ యుపరతిఁ గాంచఁగ ౹ నపుడు మౌని, విగతవేద పరిశ్రముఁడగుఁ జెలంగు
నట్లు శరదాగమంబున ౹ నంబురాశి, నిశ్చలజలంబుగా విధ్వనిగఁ జెలంగె. ౩౭

సీ. ఇంద్రియంబులవెంట ౹ నే విచ్యుతింగాంచు జ్ఞానము నవ్వాని ౹ సాంద్రయోగ
నియతి నిరోధించి ౹ నిశ్చలంబుగఁ జేసికొను యోగులట్లు కృషిని బ్రదికెడు
వారు కేదారాళి ౹ వలనఁ బాఱకయుండ జలముల బంధించి ౹ చక్కవాని
సంగ్రహించిరి; వ్రజసారసనేత్రల సంతాపమును జక్రి ౹ చందమునను
తే. దనువునందలి యభిమానజనితకష్టములను బోధమువలె నప్డు ౹ జలజమిత్ర
కరజనితతాపమును భూతగణము లొంద,కుండ హరియించెఁ దుహినకరుండు [మిగుల. ౩౯

క. వేదము శబ్దబ్రహ్మము, నాఁదగు; నద్దానఁ గల్గు ౹ న్యాయార్థము శా
స్త్రాదుల పరిశీలనమున, నే దగ సత్త్వయుతిఁ జిత్త ౹ మెంతో యమలమై. ౪౦

క. కనఁబడు లాగున నిర్గత, ఘనమై నిర్మలతఁ దారకాగణ మొప్పన్
దనరారుచుండె నెంతయుఁ, గనువారల మనములెల్లఁ ౹ గడు ముదమందన్. ౪౧

క. ధరయందు వృష్ణిసంతతి, పరివృతుఁడై యదువిభుండు ౹ భాసిల్లుగతిన్
బరిపూర్ణమండలుఁడు శశ,ధరుఁ డంబరమందు వెలిఁగెఁ ౹ దారాన్వితుఁడై. ౪౨

చ. జను లొగి వేఁడి చల్వయును ౹ సామ్యముగాఁ దగియుండఁ బుష్పరా
జిని దగు మేలివాసనలఁ ౹ జేకొని హాయిగ వీచుచున్న యా
వనపవమానసంగతిని ౹ వర్ష్మము లొప్పఁగ నెండతాపముం
గన రలగోపభామినులు ౹ కాంచనచేలహృతాత్మలై కడున్. ౪౩ 1298

క. పరితాపంబును వదలక, నిరంతరము కృష్ణునందె ౹ నెమ్మి వెలయ నుం

* "అపంచవీరుధః" అని మూలము. 'అపక్వతామ్' అని వ్యాఖ్య.

డిరి; శరదాగమనంబునఁ, దరుణులు గోవులును మృగపతత్త్రినికరముల్. ౪౩౧
క. తమనాథు లనుగమింపఁగఁ, దమి గర్భముదాల్చి యొప్పె ♦ దైవము భక్తిన్
దమ మది నిల్పుచుఁ గొల్చిన, సమయంబున ఫలము లొసఁగుచందం బమరన్.
*చ. ధరణిపమౌళికిన్ జనులు ♦ దస్యులు తప్ప ముదంబుగూర్చున
క్కరణిని భాస్కరుం డుదయ♦కాలమునం బొడసూపఁ బ్రీతితో
సరసిజముల్ ప్రమోదమునఁ ♦ జక్కఁ బ్రఫుల్లతఁ గాంచెఁ గల్వల
క్కరణిని ఫుల్లతంగనక ♦ గాసిని జెందెను దస్కరుల్ బలెన్. ౪౪౧ 1301
క. ధరణిఁ బురగ్రామంబుల, ధరణీసురు లొప్పఁజేయఁ ♦ దగె నాగ్రయణం
బరయ నది నూత్నధాన్యోత్కరముం బావనము చేయఁ♦గాఁ దగియుండున్.
ఆ. ఇంద్రియార్థములయి ♦ యింద్రసంప్రీతిదంబులగు నుత్సవములు ♦ పొలుపుమీఱ
విష్ణుకళలు రామ♦కృష్ణులు గావున, వారిచేతమిగుల ♦ వఱలుచుండె. ౪౬ [తె
క. పరిపక్వసస్యయుతయై, ధరణియుఁ జూపట్టెఁ; దీవ్ర♦తప మూని మహా
త్తరనియమంబు ఫలింపఁగ, ధరవీడి మునుల్ స్వకర్మ♦తతికిఁ దగుగతిన్. ౪౭౧
తే. కాలమరుదేర దేవాది♦కాయములను, బొందుచందంబునన్ వర్ష♦మునకు నిలిచి
వణిజులును మౌనులును రాజ♦వరులు బ్రహ్మచారులును దచ్ఛరత్తున♦సత్వరముగ.
తే. పయనమై పోయి తమతమ♦పనులు గాఁగఁ
దగినవ్యాపారమును స్వేచ్ఛఁ ♦ దగఁ జరించు
టయును విజయంబు విద్యఁ బ♦డయుటయు నను
వాని బడసిరి సంతృప్తి ♦ వర్ధిలంగ. ౪౯ 1306



ఇ రు వ ది యొ క ట వ య ధ్యా య ము.

హరి వేణుగానమును గోపికలాకర్ణించుట.

చ. అని శుకయోగి తెల్పి మను♦జాధిపమౌళికి నింకనున్ సరో
జనయను గాథలం దెలుపు♦సంతస మూనుచుఁ బల్కె నిట్టు లో
జనవర! యాశరత్తునను ♦ జక్కఁగఁ దేటనీళ్లు గన్పడన్
వనరుహవాసనామిళిత♦వాయువు లల్లన వీచె హాయిగన్. ౧ 1307
చ. హరి యపు డాదృతిన్ వనము♦నందు సుఖంబుగ గోపబాలకో
త్కరములఁగూడి యుండె; నటఁ ♦ గమ్రతరంబగు పూవుఁదేనియల్
వరుసఁగఁ గ్రోలి క్రొవ్వి తమి ♦ బంభరబృందము ఝుంకృతుల్ మహా
త్తరముగ దిగ్వితానములఁ ♦ దద్దయు నిండఁగఁ జేసె నత్తఱిన్. ౨ 1308
చ. ఫలముల మెక్కి మెక్కి మృదు♦భవ్యరవంబులఁ గూసెఁ బక్షు లా

* "రాజ్ఞాంతు నిర్భయా లోకా యథాదస్యూన్వినానృప." అని మూలము.

కొలఁకులు ప్రోదినుల్ గిరులు § కూయుచు నున్నటులుండె వాని మ్రోఁ
తలకుఁ బ్రతిస్వనంబుగను; § దత్సమయంబునఁ గృష్ణమూర్తియున్
బలయుతుఁడై వ్రజార్భకులు § బల్విడి వెంటను రాఁగ నవ్వనిన్. ౨ 1309

క. ధేనువులన్ మేపుచు మురళీనాదము నింపుగుల్క § లీల నొనర్చెన్
మానసమోద మ్మది ము,న్నే నాఁడును దెలియనట్టు § లే కల్పింపన్. ౨ 1310

ఉ. ఘందవసించు గోపికలు § మాధవువేణునినాద మిద్దె యా
నందము నింపె నంచు విని § నాదవరం బదియే పరోక్షమం
దుం దగియుంట నెచ్చెలుల§తో నొకకొందఱు వేడ్కమై సుతిం
పం దమి నాలకించిరి సె§బా సని మెచ్చుచు మీననేత్రలున్. 3 1311

ఉ. ఆమురళీనినాదమును § హారితరం బని చెప్పునప్డు చే
తోముద మిచ్చునచ్యుతుని § దోయజనేత్రుని సంస్మరించి మా
యామనుజుం డతండు మును § పద్భుతచేష్టలఁ జూపెఁగాన ను
ద్దామతదీయచర్యల ని§తాంతము వారికిఁ దెల్పుచుండఁగన్. 3౫ 1312

క. స్మరణోద్దీపనమున నా, సరసీరుహనేత్రల వగు§స్వాంతంబులు సు
స్థిరతం దప్పును గావునఁ; బరినుతి చేయంగలేక § వారుండ్రు విభూ.! ౪ 1313

సీ. అవతంసముగను బ§ర్హ్మాంబును ధరియించి కొండగోఁగుసుమంబు § కోరి కర్ణ
ములయందు నిడుకొని § సులలితహాటక కపిశవస్త్రంబును § గట్టి వైజ
యంతియన్ మాలిక § నాదృతి ధరియించి మురళికో§త్తమరంధ్ర§ములను హారి
తమ మగు నధరామృ§తమునఁ బూరించుచు నాత్మపాదాబ్జవి§న్యాసమునఁ ద
తే. దీయభాగంబు నతిరమ§ణీయముగ నొ,నర్చుచున్ గోపబాలురు § నైజకీర్తి [చ్చె.
గీతములు పాడుచున్ వెంట § నాతతముగ, నలరి రాఁగ బృందావన§మపుడు చొ

క. వనజాక్షుఁడు నటవరవపు,వును బూని సురల్ నుతింపఁ § బొలుపుగ మురళీ
నినద మొనర్పఁగ నయ్యది, యనుపమమై భూతవితతి§యాత్మ లలరఁగన్. ౫

క. చెలరేఁగెఁ దన్నినాదం, బలరుచు వ్రజవాసిగోపి§కాంగన లొగి ని
మ్ముల నాలకించి యీవిధి, బలికిరి యొండొరులతోడ § వర్ణనరీతిన్. ౬ 1316

క. నిరుపమశుభకరమూర్తిని, హరినిన్ వర్ణించునప్పు § డాత్మల నీశున్
స్మరమోహనరూపుని గని, పరిరంభణ మాచరించు§పద్ధతిఁ గనుచున్. ౬ 1317

ఉ. కన్నులు గల్గినందులకుఁ § గాఁ ఫల మొక్కఁడు వేఱుకల్గునే
కన్నియలార! యీడుసరి § గాఁ దగు బాలురఁ గూడి వేడ్క నీ
చిన్నికుమారు లీపసుల§చేరువఁ గానకుఁ బోవువేళలన్
గన్నదె భాగ్యమన్న నిఁకఁ§గల్గదు వేఱొకఁ డిట్టిదుర్విలోన్. ౬౫ 1318

మ. మురళీనాదము చేయుచున్ లలితమై § మోహంబు గల్గించుచున్

బరమంబై తగి సత్కటాక్షములనుం ఽ బైఁ జల్లుచుఁ మించు సుం
దరరాట్సూనుల నెమ్మొగంబులను మోదంబొప్ప సంతృప్తిగాఁ
బరికింపందగు నంతకంటెఁ గలదే ఽ భాగ్యంబు వేఱొం డిలన్. ౭ 1319

సీ. సహకారభూరుహ ఽ చారుపల్లవ బర్హిబర్హముల్ పుష్పస్తబక సరోరు
హోత్పలమాలిక ఽ లొప్పుగా ధరియించి వానియంతరమున ఽ మాననీయ
నీలపీతచ్ఛాయ ఽ నెగడువస్త్రంబులు కనఁబడుచుఁ వింత ఽ గాఁ జెలంగు
వేషంబు గలుగుట ఽ వివరింప నాట్యరంగంబున నటులట్లు ఽ గామనోజ్ఞ

తే. మురళి వాయించుచుఁ సాటిఁ ఽ బోల్పలేక, బాలకులయంతరంబున ఽ లీల నీకు
మారకులు చూడఁ జూడ సమ్మదము నొసఁగు, చున్నవారలు కంటిరేకన్నులార.

మ. అనివర్ణింపఁగఁ గొంద అబ్జముఖు లఽయ్యారే! యిదే వేణు విం
తని సిద్ధాంతముచేయరాని దగుభాగ్యం బేమి గావించెనో
వనసంభూత మిదౌను; స్థావరమనఁ ఽ వంశంబె; యిద్దానిదౌఁ
గనుఁడీ యిట్టి దదెంతభాగ్యము నిటఁ ఽ గావించెనో ప్రాగ్జనిఁ. ౮ 1321

ఆ. చెంతనుండి తన్ను ఽ సేవించుగోపిక,లకును సులభముగ దొరకని యధర
సుధను దోలుత స్వేచ్ఛ ఽ సొంపుగఁ గ్రోలెడు, నిట్టివేణువునకునెంతొ ప్రీతి. ౮౪

చ. జలము లొసంగి పెంచినవి ఽ శైవలినుల్ గద యవ్వి దీనికై
యలరుచుఁ బూచినట్టి కమలావళి దంభమునఁ గనుంగొనం
బులకితగాత్ర లయ్యెడిని ఽ బూజ్యతదన్వయజాతభూరుహం
బులు మకరందదంభమునఁ ఽ బూతముదశ్రువులఁ వెలార్చెడిన్. ౮౪ 1322

క. తమవంశంబునఁ బుట్టిన, కమలాక్షుని భక్తుఁ బ్రీతిఁ ఽ గని కులవృద్ధుల్
ప్రమదమునఁ దేలి బాష్పోదములఁ దగురీతి యిచటఁ ఽ దార్కాణమగున్. ౯

చ. కనుఁగొనుమా సఖి! వికచకంజదళాక్షుఁడు వేణు వూఁదఁగా
విని వనబర్హిణంబు లొగి ఽ విష్ణుని నీలఘనంబుగా మనం
బున భ్రమియించి బర్హముల ఽ మోదము పొంగఁగ విప్పి నర్తనం
బును సలుపంగ నెత్తములఁ ఽ బొల్చెడు సత్త్వము లట్టె నిల్చుచున్. ౯౪ 1325

చ. తమ పనులెల్లమాని కనఁ ఽ దామరసాక్షుని పాదపద్మయు
గ్మము నిడుభాగ్యముఁ గలిగి ఽ తన్మస్థలి నెందును నాత్మతుల్యభా
గ్యము కలదంచుఁ జెప్పుటకుఁ ఽ గాకయె యీవనరాజ మెంతొ యు
త్తమ మగుకీర్తినిం గనియె ఽ ధన్యమె యీవనమో సఖీమణీ.! ౧౦ 1326

చ. అరుదగువేషమూని వనమందు విహారము చేయుచుఁ మనో
హరమురళీనినాదమున ఽ నందఅఁ దన్పెడునందనందనుం
బరమకృపాబ్ధిఁ గాంచియును ఽ భవ్యనినాదము నాలకించియుఁ

హరిణులు కృష్ణసారముల నాదృతి మీఱఁగఁగూడి యింపునన్. ౧౦౪ 1327

క. పరమప్రణయవిలోకన, భరముల౯ బూజించెదుర౯ స్వభావజనితభ
క్తిరతి జగన్నాథుని శ్రీపరమేశ్వరుఁ జిత్రమేమొ పరికింపు సఖీ. ౧౧ 1328

క. జననము తిర్యగ్జాతిని, గని మూఢమతిత్వమూని కడు ధన్యము ల
య్యెను జెప్పనేటికే సఖి!, మనపతులో జన్మమునను మానవు లయ్యున్. ౧౧

ఆ. అల్పబుద్ధులొట నాపరమేశ్వరుఁ, గనెడుకోర్కిఁ జూపుగముల హరిణు
లట్లు లోకనాథు నందు వ్యాపింపఁగఁ, జేయ నోర్తురొకొ చెలి పలుకుమ.

సీ. గోపిక యొక్కర్తు కూర్మి వచించె నోసఖి! యట్టె చూడుమా సారసాక్షు
లకు వేడ్కనించు సల్లలితరూపము శీలముగల శ్రీకృష్ణునిఁ దగఁ గనుంగొ
నియు మనోహరముగ నెగడు తద్వేణునినద మాలకించియు నదెవిమాన
ములఁ బోవు త్రిదశులపూవుఁబోఁడులు తమప్రాణనాథుల యంకభాగములను
తే. నున్నవారయ్యు స్మరతాప మోర్వలేక
ధైర్యసారము నశియింప దమకబరుల
నుండి సుమములు రాలంగ నొగిఁ బరవశ
తను గనిరి నీవు వెడలంగ మనము లడల. ౧౨ 1331

క. కనుమా యల్లదె గోవులు, వనజాక్షుని దివ్యవదనవారిజగతవే
ణునినాదామృతమును జక్కనికర్ణపుటంబు లెత్తి కడుఁ దమిఁ గ్రోలున్. ౧౨౪

క. క్రేపులొగిం దద్గీతం, బాపగిదిగ నాలకించి యాయమృతరసం
బేపారు కర్ణపుటముల, నాపగిదిం గ్రోలుచు౯ మహాశ్చర్యముగన్. ౧౨౪ 1333

క. జననుల స్తన్యముఁ గ్రోలం,గను జాఁపిన మోర లట్లె కదలింపక యుం
చినజాడఁ జూడుమా నెమ్మనములఁ దగు ప్రీతి యెంతమాత్రమొ చెలియా!

క. ఆనందంబున శ్రీహరి, మానితరూపంబు దృష్టిమార్గంబున నే
మానసమున నిడి కౌఁగిట, నే నియతిం గదియఁజేసి యేమఱి తనువుల్. ౧౩

క. నిలుచున్న వశ్రుకణములు, జలజలరాలంగఁ జూడు సఖి వేఱొకచో
టులఁ జూచితె యచ్చెరువుం, గలిగించెడు వార్తవినుము కదలనిపూన్కిన్. ౧౩

మ. వినవమ్మా! వనమందు నిందుఁ బులుఁగుల్ వీక్షింపఁగా మానులే
యని తోఁచు౯ గడువింత వార్తయిదె యొల్లన్స్౯ మనోజ్ఞంబులై
కననౌ పల్లవముల్ గలట్టితరుశాఖల్ చక్కఁగా నెక్కి య
వ్వనజాతాక్షుఁ డొనర్చుహారిమురళీస్వానంబు నాలించుచున్. ౧౩౪ 1337

చ. ఇదియగు నిట్టిదంచు వచియింపఁగరాని సుఖంబు గాంచి స
మ్ముదమెొదవంగ నేపలుకుఁ బూని వచింపఁగమాని కృష్ణమూ
ర్తిదగు మనోజ్ఞరూపమును దృష్టిగఁ గాంచుచు మీలితాక్షముల్

గదురఁగ నొప్పుఁ జూడు మదె ౹ గాఢతపంబున మౌనివర్యులున్. ౧౮ 1338

చ. శ్రుతిహితకర్మజాలముల ౹ శుద్ధమతుల్ తగఁజేసి తత్ఫల
ప్రతతిని గోర మాని శ్రుతిపాదపశాఖలయందునుండి స
న్మతి హరియందె దృష్టిదగుమాడ్కి నొనర్చుచు శర్మమొంది త
ద్ధితతమగీతముల్ వినుదు ౹ రీవిహగంబులు నట్టె యుండెడున్. ౧౮ 1339

సీ. చేతనంబులుగల ౹ భూతంబుల వగువార్తల నట్టులుంత మీతటిను లెల్ల
నీముకుందునిగీత ౹ మెంతయు నాసక్తి నాలకించుచుఁ దమయంత సుడుల
తిరుగుడులను దమతీవ్రవేగంబును సడలించి పొడమిన ౹ స్మరునియురవ
డిని దెల్పుచుఁ మహోర్మినికరకరములఁ బంకరుహంబులఁ ౹ బారితోషి

తే. కములుగాఁ బట్టుకొని హరిక్రమప్రపాద
జలజయుగళంబు గనరాక ౹ యలరురీతిఁ
దాల్చుచున్నవి చూడుమా ౹ తలిరుఁబోడి!
యింతకును మించఁగలవొకొ ౹ వింత యెందు? ౧౯ 1340

మ. మురళీస్వానము విస్తరించుచును రాముంగూడి గోపాలకో
త్కరముల్ వెంటను జేరి కొల్వఁ బశుసంతానంబులన్ మేపుచున్
వరకాళిందితటంబునందు రవితాపంబుం గడుం గాంచు శ్రీ
హరి కాయెండయె సోఁకకుండ జలదం ౹ బత్యంతముం బ్రీతితోన్. ౧౫ 1341

తే. విరులసరిపోలు శిశిరశీకరసువృష్టిఁ, గురియుచున్ దనయాకృతి ౹ గొడుగుఁగాఁగ
నలవరించుచు సేవించు ౹ నంబుజాక్షి, చూడుమా దీనిమించిన ౹ చోద్య మున్నె?

*మ. కృతకృత్యల్ గద యీపుళిందవనితల్ ౹ కీర్తింపఁగా వచ్చుఁగా
యతివా! వీరిని శ్రీనితంబిని యురోజాలంకృతం బై తమిన్
రతివేళన్ హరిపాదపద్మయుతిఁ దద్రాగోన్నతిం గాంచి య
చ్యుతుఁ డీభవ్యవనాంతరంబున విహారోత్సాహముం బొందఁగన్. ౧౬ 1343

చ. హరి చరణారవిందముల ౹ నల్లన నీతృణరాజి నుంచఁగా
సురుచిరరీతి నం దలరుచున్ దగనవ్వరకుంకుమంబు నా
దరమునఁ గాంచి ప్రీతిఁగొని ౹ ధన్యతఁ గందు మటంచు మోమునం
దురుకుచమండలంబున మహోద్యమ మొప్పఁగఁ బూసికొం చొగిన్. ౧౭ 1344

తే. ఆధిబాధితలేగాక ౹ యలరుచున్న, వార లివ్వారిఁ గాంచిన ౹ సారసాక్షి
యెంతొ సంతోష మయ్యెడు ౹ నేమునట్టి, భాగ్యమునకర్హలముగాము ౹ పలుకులేల.

సీ. రామకృష్ణుల రుచిరామలపాదసంస్పర్శనంబున సంతసంబు నొంది
వారలకున్ గోపబాలకులకు గోవులకును బానీయముల్ ౹ ప్రకటరుచిర

* "పుణ్యాఃపుళింద్య ఉరుగాయపదాబ్జరాగ శ్రీకుంకుమేన" అని మూలము.

తృణకందమూలముల్ ♦ దివ్యఫలంబులు తగురీతి నమరించి ♦ ధాత్రిధరము
లం దుత్తమంబగునట్టి యీగిరి హరిదాసవర్యం బనఁ ♦ దనరుచున్న

తే. దతివ! కంటివె; గోవులయంఘ్రిబంధ, రజ్జువులు మెడత్రాళ్లు శిరమ్ములందు
మూఁపులందును గనఁబడ ♦ గోపబాల,యుతిని సహజులువీరు ధేనుతతిఁగూడి.

చ. మనమున కింపుఁబెంచు కలమంజులశబ్దము లొప్పు వేణుని
స్వనములఁ బర్వఁజేయుచును ♦ భాసురలీలఁ జరింప నాస్వనం
బును విని జంగమంబులును ♦ బొందుగ స్థావరముల్ స్థిరత్వముం
గనెఁ బులకాంచితత్వమును ♦ గ్రన్నన నోచెలులార! చూడుఁడీ! ౧౯ 1347

తే. జంగమస్థావరంబులు ♦ సరఁగఁ దాఱు
మాఱుగా మాఱెఁ; జిత్ర మిమ్మాడ్కి నెందుఁ
గంటిమే యెవ్వరేఁ జెప్ప ♦ వింటిమే య
టంచు బహుభంగులఁ వినుతించుచుఁ దమి. ౧౯ 1348

చ. వనితలు రామకృష్ణు లటుభవ్యతరంబుగఁ గేళిసల్పఁ గా
మనములఁ గల్గుప్రేమమున ♦ మంజులరీతిఁ బరస్పరంబు చ
క్కనిగతి సన్నుతించుచు నికామము ప్రీతిని దన్మయత్వముం
గనిరి మహానుభావులను ♦ గాంచిన నెంచిన సత్ఫలంబ యౌ. ౨౦ 1349



## ఇరువదిరెండవయధ్యాయము.

### గోపికావస్త్రాపహరణము.

క. నరనాథున కిట్లని ముని,వరుఁ డుపదేశించి మఱియుఁ ♦ బలికెఁ బరీక్షి
ద్ధరణీశ! వినుము వనమున, హరి యటువిహరింపఁ బూనుతన త్తరుణమునన్.

క. హేమంతం బరుదెంచెను, గామితముల నొసఁగ నందుఁ ♦ గమ్రతరంబై
యౌ మార్గశీర్షమాసం,బామాసమె విష్ణుపూజ ♦ కర్హ్మతమంబౌ. ౪ 1351

సీ. ఆమాసమున వ్రజమందు నెసంగెడు ప్రాయంపుగోపికల్ ♦ పరమనియతిఁ
గాత్యాయనీదేవిఁ ♦ గడుభక్తిఁ బూజించు వ్రతముఁ బూనిరి;దానవాంఛలెల్ల
సమకూరునని హవిష్యంబె భుజించుచు నుండిరి; తద్వ్రతి ♦ మొక్కమాస
మాచరింపం దగు ♦ నందు వారలు సూర్యుఁ డుదయింప నుండఁగా ♦ నురుతరమగు

తే. భక్తిఁ గాళిందికిం బోయి ♦ పావనజల,ములను స్నానంబుచేసి యమునసమీప
మందు నిసుకనుగూర్చి కాత్యాయనీస్వ,రూపమును బొందుపఱచి తద్ధూపమం

క. పరదేవి నావహించుచుఁ, బరిమళగంధప్రసూన ♦ వరహారములన్ [దు.
నిరుపమధూపంబుల శ్రీ,కరదీపంబులను బూజఁ ♦ గావించి తమిన్. ౫ 1353

సీ. పావనతమములౌ ఽ భక్ష్యభోజ్యాదిక నైవేద్యములను బంఽడ్లను జిగుళ్ల
దండులంబులను గాఽత్యాయని ముందట నునిచి పూజించి భఽక్త్యుత్కటమునఁ
గరములు జోడించి ఽ కాత్యాయనీ ! మహాఽమాయికా బ్రహ్మాండఽమండలాధి
నాయికా దేవి మఽహాయోగినీ నందగోపకుమారు నాఽకుఁ బతిచేయు

ఆ. మంబ ! నీకు వందఽనాళి యొనర్తు నం, చెలుకపలుచు నర్థఽమే పొసంగు
నట్టి మంత్రజపము ఽ నత్తఱిఁ జేయుచు, వేలువేలఁ బూజ ఽ విధిగఁ జేసి. ౩౪

క. మనమునఁదగు వాంఛను శ్రీ, వనజాక్షునిఁగోరి భక్తిఽభావంబుల నా
తనినే తలఁచు చజస్రము, మనసులు హరియందె నిల్వ ఽ మాసంబెల్లన్. ౮౪

క. వ్రతనిరతిఁ బుచ్చుచున్ నం,దతనూజుఁడు పతిగ మాకుఁ ఽ దగుఁగా కనుచున్
మతి నెంచి భద్రకాళి ని,యతిఁ బూజించిరి వ్రతాంతఽమందున్ వారల్. ౫

[1]సీ. ఒకనాఁడు నాల్గుఘఽటికలరాత్రియె యుండ నన్యోన్యనామధేఽయములఁ బ్రీతిఁ
బిలుచుచు నతిశయఽప్రీతిమై నన్యోన్యకరము లూతఁగఁగొని ఽ క్రమ్రగతులఁ
గాళింది కేగుచుఁ ఽ గాంచనచేలుని చరితాళిఁ బాడుచు ఽ స్నాన మొనరు
పఁగఁ బోయి; రంత నాఽపడఁతులు నదిగట్టునందె పుట్టంబుల ఽ నంతకుమును

తే. పునిచి నట్టులె యుంచి యా ఽ యుదకములను
స్నానమొనరించుచున్ గృష్ణఽచరితములను
బాడుచుండిరి; తద్వార్తఁ ఽ బరమపురుషుఁ
డఖిలయోగీశ్వరేశ్వరుం ఽ డాత్మ నెఱిఁగి. ౭౪ 1357

[2]క. వనితలు పూనినసువ్రత,మును సఫలముగా నొనర్పఁ ఽ బూని వయస్యా
ళినిగూడి యచ్చటికిఁ బో,యెను వారిఁ బరీక్షచేయ ఽ నెంచియె యెలమిన్. ౮

తే. కర్మసంసిద్ధికొఱకు నాఽకంజనయనుఁ, డానదీతీరముననున్న ఽ యంబరముల [ను.
నెల్లరం దీసికొన నీపఽవృక్ష మెక్కఁ, డందు నుండుట నెక్క నాఽయర్భకులు

క. కారణ మెఱుఁగకయే యా, వారిజదళనేత్రుఁగూడి ఽ వరుసగ నీప
క్ష్మారుహము నెక్కి నవ్వఁగఁ, గోరికఁ బరిహాసవాక్యఽకోవిదుఁ డగుటన్. ౯ 1360

శా. నీపక్ష్మారుహ మిద్ది పూజ్యతమమై ఽ నిత్యంబు వైమానిక
శ్రీపూజ్యంబయి యొప్పు; మీర లబలల్ ఽ చిత్తంబులం దింపు కే
వ్యాపారాంతరముల్ తలంపక మహాఽభక్త్యుద్ధతిన్ వచ్చి మీ
మీపుట్టంబులు చేకొనుం డభిరుచిన్ ఽ మేలొప్పు మీ కెంతయున్. ౯౪ 1361

---

1 "ఉషస్యుత్థాయగోత్రైస్స్వైః" అని మూలము. "ఉషసిఘటికాచతుష్కావశిష్టకాలే" అని వ్యాఖ్య. 2 "భగవాంస్తదభిప్రేత్య కృష్ణో యోగేశ్వరేశ్వరః, వయస్యైరావృతస్తత్రగతస్తత్కర్మసిద్ధయే" అని మూలము.

[1]ఉ. నాపలు కిద్ది సత్య మనినమ్ముఁడు నర్మముగాదు సద్వ్రతం
బీపగిదిం బొనర్చి కృశియించినమీకడ మేలమాడఁగా
నోపుదునే యదించుకయు నొప్పనె యింతకుము న్నసత్యమే
నేపగిదిన్ వచించినది యించుకయైనను లేదు నమ్ముఁడీ! ౧౦ 1362

చ. అనృతము నే వచింప నని యందఱు పీర లెఱుంగుడు ర్గనుం
గొనుఁడు సుమధ్యలార! యివిగో వసనంబు లొకొక్కరే జవం
బున నరుదెంచి కైకొనఁగఁబోలును గుంపుగఁ గూడి యైనఁ జే
కొనఁదగు దీన నెద్ది మదిఁ గోరుదురో యటుచేయఁగాఁ దగున్. ౧౧ 1363

చ. అనియిటు లాపరాత్పరుఁడు హర్షమునన్ బరిహాసవాక్కులన్
వనితలు చక్కఁగావినఁగఁ బల్కిన గోపిక లట్టి ప్రేమవా
హినిని మునింగి యొండొరుల నెంతయుఁ గాంచుచు లజ్జ పెంపునన్
మనములనుండి ప్రీతి యొకమాడ్కిని నవ్వగ వెల్వడం గడున్. ౧౨ 1364

చ. జలములనుండి వెల్వడఁగఁజాలక యందె వసించియుండి; రా
జలరుహనాభుఁ డిప్పగిది సంతసమొప్పఁగ మాటలాడ నా
పలుకులు స్వీయచిత్తములఁ బల్విడి లాగఁగఁ గంఠదఘ్న శీ
తల సలిలాంతరాళమునఁ దద్దయు మేనులు కంప మొందఁగన్. ౧౩ 1365

క. చలిబాధ యోర్వఁ జాలమి, జలజాక్షునితోడ నిట్టుచానలు వేడ్కం
బలికిరి; కృష్ణా! [2]యనయం, బెలమిం జేయకుము పాడియే యిది నీకున్. ౧౪

క. మానందరాజునకుఁ బ్రియ, సూనుఁడ వని వ్రజమునకును సొంపులఁగూర్పం
గా నిల్చినశ్రీహరి వని, యే ని న్నెఱిఁగితిమి చెప్పనేటికి మఱియున్. ౧౫

క. వడవడవడఁకెడు మాకుం, దడయక వస్త్రమ్ము లిమ్ము దయగలస్వామీ!
పడఁతులము గామె మమ్మిటు, లడలించుట పాడియగునె యాత్మ నెఱుఁగవే.

చ. వనితలమంచు నీర్వెడలుభంగియె పాడియుఁ గా దటంచుఁ జ
ల్లనిజలపూరమందు నొకలాగున మున్గి తపించుచున్నయా
వనరుహనేత్రలన్ వగల వారక తప్తలఁజేయరా దటం
చును దలపోసి వస్త్రముల చొప్పఁదలంచి యొసంగుమా త్వరన్. ౧౭ 1369

తే. శ్యామసుందర! ధర్మంబు లరసి యెఱుఁగఁ
జాలుదీ వొక్కఁడవె నీవచనము భంగిఁ
జేయువారముసుమ్ము దాసికలమౌట
వస్త్రముల నిమ్ము న్యాయమ్ముఁ బరఁగ నిమ్ము. ౧౮ 1370

1 "సత్యం బ్రువాణినో నర్మ యద్వ్యాయం ప్రతకర్శితాః, నమయోదితపూర్వం వా అనృతం తదిమే విదుః" అని మూలము. 2 "మా ఽనయం భోః" అని మూలము. 'అనయం అన్యాయ్యమ్' అని వ్యాఖ్య.

చ. మనమునఁ జక్కనెంచి గుణమండన! మీరు పురంధ్రులంచు ని
ప్పనిసరిగా దటంచుఁ దగుభంగిఁ దలంచి మదీయవస్త్రముల్
వనజదళాక్షి! యిమ్ము పలువాక్కుల వేఁడఁగనేల? యీయపే
జనపతితో వచింతు మిది సత్యము సత్యము సత్యమం చనన్. ౧౩౭౧ 1371

చ. విని భగవంతుఁ డిట్లనియె వీతమనఃపరితాపలోటఁ బా
వనతరసుస్మితం బలర వర్తిలు సారసనేత్రలార! మీ
రనయము నాదుదాసికలె యైనమదుక్తిని జేయఁగాఁ దగుం
జన దిఁక జాగుసేయఁగ నసంశయవృత్తిని రండు రం డి టన్. ౧౩౭౨ 1372

క. మీవసనంబులఁ గైకొనుఁ, డీవృక్షమునందు నున్నవివె వస్త్రంబుల్
నావిని యల్లపురంధ్రులు, శ్రీవిభు నానతిగ్రహించి శీతకృతార్తిన్. ౧౩౭౩ 1373

చ. తనులతికల్ వడంకఁగ నితాంతము స్త్రీలకు నైజమైనచొ
ప్పున మరియాదఁ గావఁగనుబోలిన యాస్థల మొక్కచే జవం
బొనరఁగ మూసికొంచు నది నొక్కట వెల్వడివచ్చి రంత నా
వనజదళాక్షుఁ డీశ్వరుఁడు వారలు స్వాజ్ఞను బైకి వచ్చుటల్. ౧౩౭౪ 1374

[1]సీ. మదినెంచి వారినెమ్మదులు శుద్ధములయి సద్భావమునఁ దగి సాధుసమ్మ
తములయి యుంటకుఁ దాను సంతోషించి వారిజవ్వనమును వారిభక్తిఁ
జక్క నాలోచించి నిక్కపుభక్తికిఁ గడుమెచ్చుకొనుచు వృక్షమ్మును దిగి
వచ్చి భుజంబున వలువలు గన్పడునట్లుచేయుచుఁ బ్రీతియలర సుస్మి

తే. తము చెలంగఁగ నిటుపల్కె నమలభక్తి
మఱిపరీక్షింపఁ గాఁ గోరి మహితచిత్త
లార! వినుఁ డొక్కమాటను మీరు సువ్ర
తమును బూనినవారుగద యటులయ్యు. ౧౩౭౫ 1375

చ. వలువలఁ దీరమందు నిడి వారిని స్నానముచేయుచుంటయుం
దలఁచిన దేవికే మిగులఁ దప్పొనరించినయట్టు లయ్యెని
మ్ములనఘ మబ్బె దానినొకమూలకుఁ ద్రోయ శిరస్సులందు నం
జలు లిడి మ్రొక్కి వస్త్రములఁ జయ్యనఁ గైకొనుఁ డంచుఁ వేడ్కతోన్. ౧౩౭౬

[2]చ. హరివచియింపఁగా వనిత లాహరివాక్కులు ధర్మయుక్తిచేఁ
బరఁగు టెఱింగి నందసుతుఁ బావనచిత్తునిగాఁగ నమ్ముచుం
గరమున నొక్కటఁ దమసుకార్యము పండ నమస్కరించి రా
కరము యథాప్రకారముగఁ గాపుగ నుంచిరి మానరక్షకై. 1377

1 "భగవా నాహతాన్వీక్ష్య శుద్ధభావ ప్రసాదితః" అని మూలము. 2 దీనికి మూలములు నాగర ప్రతిలో లేవు.

చ. వనజదళాక్షుఁ డవ్విధిని వారలు మ్రొక్కఁగఁ గాంచి ధర్మయు
క్తిని దగునట్లు పల్కె నిది కేవలశాస్త్రవిహీన మాటఁ జ
క్కనిఫల మీయఁజాల దొకకైనతి నెవ్వఁడు సల్పి యచ్యుతున్
వనరుహనాభుఁ దృప్తిగను భంగి నొనర్పఁగఁ బూను వానికిన్. 1378

తే. కరము ఛేదించుటయె పాపహారముగాఁగఁ
దగిన పాచితమని గొప్పధర్మవిదులు
పలుకుదురు మీరు రెండుచేతుల నిజేశ్వ
రునకు మ్రొక్కుఁడు శాస్త్రోక్త మనఁగఁ దగును. 1379

క. అది నాకుఁ బ్రియతరం బ,య్యది చక్కఁగఁ జేయవలయు నంహఃప్రశమం
బొదవఁగఁ జెయంగోరిన, నిది యిట్లే చేయవలయు హితమగు మీకున్. 1380

తే. ద్వివిధపాపములను జేసితి రిపు డిట్లు, వానిఁ దొలఁగించుకొన మీకు వాంఛయేని
పాణియుగ్మంబు నెత్తి సద్భక్తి వంద,నము లొనర్పుఁ డటంచు శ్రీనాథుఁ డనిన.

సీ. వస్త్రహీనంబుగ వారి మునుంగుట వ్రతభంగమని యెంచి వనజనాభు
పలుకు హితంబని భావించి వ్రజసుందరులు కార్య మద్దాని సలలితవిధి
సార్థకంబుగఁ జేయ నాత్మలందుఁ దలంచి సకలకర్మములకుఁ జక్కనిఫల
భూతుఁడై యఘములఁ బోకార్చు శ్రీహరికిని మ్రొక్కె రక్తిఁ జేఁ గేలుదోయి

తే. మోడ్చి; యీవిధి గోపికల్ మ్రొక్కుటయును, సర్వకార్యసమర్థుఁ డౌచక్రి దేవ
కీతనూజుండు వారిభక్తికిని జాల, సంతసం బంది స్నేహంబు సాంద్రమగుట.

క. మనమునఁ దలంచి తృప్తిం, గని వారల వస్త్రములను గడువడి నొసఁగన్
వనజాక్షుఁ డిట్లువస్త్రం,బును మాని మునుంగ మీకుఁ బోలునె యనుచున్.

క. సరసీరుహనేత్రల గో,పరమణులన్ దోఁచినట్టి పద్ధతి వంచిం
చె రయంబున నిచ్చుటికే, యరుదెంచి పరిగ్రహింపుఁ డంబరచయమున్. ౨౧౪

క. అనుచున్ సిగ్గు తొలఁగ నొ,య్యన నేర్పులు గానఁబడఁగ నదలించెను; నే
ననునది సత్యము నర్మం, బనితలఁపకుఁ డనుచును బరిహాసముచేసెన్. ౨౨ 1385

సీ. చేతులుజోడించి చేరిమ్రొక్కుండని బొమ్మలంబోలె నేర్పువలయంగ
నాడించె వలువల నపహరించినయట్లు గనఁబఱచెను, బ్రీతిఁ గంజనేత్రుఁ
డి ట్లెన్నివిధముల నెంత పరీక్షించినను గోపికలు నందనందనుపయి
నించుకైన నసూయ హృదయంబులన్ గన రాపరమేశుని యసదృశతమ

తే. సారసంభాషణంబున శర్మమొంది, యుంట నంతట వార లత్యుత్తమాంబ
రముల ధరియించి లజ్జాభరమునఁ గృష్ణు, నందుఁ జిత్తములను జేర్చి యవశలగు

*చ. కనుతుదలందు లజ్జయు నికామము నాట్యము సల్పుచుండఁ గృ [చు.

* "తాసాం విజ్ఞాయ భగవాన్ స్వపాదస్పర్శకామ్యయా, ధృతవ్రతానాం సంకల్పమాహ దామోదరోఽబలాః, సంకల్పోవిదితస్సాధ్వ్యో భవతీనాంమదర్చనం" అని మూలము.

చ. కనుఁగొనుఁ డీమహీజము లఖండతరామలభాగ్యవంతముల్
వినయము కన్పడన్ బరుల వృద్ధికె జీవితముల్ వ్యయించుచున్
వనటనుగూర్చు నాతపము వాయువు వృష్టిని మంచు నోర్చుకొం
చనువుగ నిత్తఱిన్ మనల నవ్వియు నేఁచునొ యంచు నెంచుచున్. ౩౨ 1398

ఆ. మనకు వానిబాధ గనఁబడకుండంగ, నాపుచున్నయవి ప్రయత్న మొప్ప
ధన్యతమము లివి కదా? యెల్లప్రాణులఁ, బ్రదుకునట్లు సాయపడెడుఁ గాదె.

క. ఈతరువుల పుట్టుకయే, భూతలమున సార్థకంబు పొం దర్థిజన
వ్రాతము వీనిం జేరిన, నేతఱినే నరులకడకు నేగినరీతిన్. ౩౪ 1400

సీ. *ఫలములొందకపోవు పద్ధతియే లేదు విముఖులై పోవ నవ్వి యొనరింప
వెవ్వారి నిందున్న వృక్షముల్ తమపత్త్రపుష్పఫలంబులఁ బొలుచుచ్ఛాయ
లనుమూలములను వల్కలములఁ గట్టియలనుగంధములను బంకనుమఱియును
భస్మాస్థులను బల్లవంబుల నంకురములను గోరెడువారి భూరివాంఛి

తే. తముల నీడేర్చుచున్నవి ధరణినితర
గాత్రధారులయెడఁ బ్రాణకాంచనముల
మనసుచే వాక్కుచే మేలు కనఁగఁ జేయు
చుంటయే జన్మసాఫల్య మొగి నరులకు. ౩౫ 1401

క. ఇదె యిహమునఁ బుట్టువునకు, నొదవెడుసాఫల్య మనఁగ నొనరింపక యి
ట్లదయత నుండిన నవ్వారిది జన్మమె యగునొకో పరీక్షింపుఁడొగిన్. ౩౫ 1402

మ. అని వర్ణించుచుఁ గృష్ణుఁ డంతట బ్రవాళాళిన్ బ్రసూనవ్రజం
బునఁ బండ్లన్ స్తబకంబులన్ దళములన్ బొల్పారుశాఖోత్కరం
బు నితాంతంబును వంగియుండఁ గడునొప్పుల్ గుల్కు వృక్షంబులె
ల్లను వ్యాపించిన త్రోవ వానినడుమన్ లక్ష్మీశతం బొల్పుచున్. ౩౬ 1403

క. అరిగెను; గాళిందికి నా, తరంగిణిన్ శీతమధురతమపావనపు
ష్కరముల గోవులు త్రావఁగఁ, బరితృప్తిం దాను గోపబాలకు లెలమిన్. ౩౭

క. జలపానం బొనరిచి గోవుల మేపుచు నవ్వనమున భూరితరముదం
బులఁ దిరుగుచు నుండఁగ నాఁకలి మిక్కిలి పీడసేయఁగా బాలురొగిన్. ౩౮

తే. రామకృష్ణులఁ బిల్చి విరామ మనఁగ, లేనిచందంబునం దమ్ము మాన కేఁచు
నాఁకలిని మాన్పుఁడీ యనియడుగ నెంచి, పలికి రిట్లని యత్యార్తిఁ బల్లటిలుచు.



* "ఏతావజ్జన్మసాఫల్యం దేహినామిహ దేహిషు, ప్రాణైరర్థైర్ధియా వాచా శ్రేయ ఏవాచరే త్సదా" అని మూలము.

ఇ రు వ ది మూఁ డ వ య ధ్యా య ము.

—శ్రీహరి బాలకులయజ్ఞశాలకు నన్నమడుగఁబంపుట.—

క. ఓరామా! గురువీర్యా, శ్రీరమణా! కృష్ణ! దుష్టశిక్షక! మమునీ
భూరితరక్షుత్తు మహా, ఘోరంబుగ బాధ చేయుఁ గొంకదుసుండీ.౪ 1407

క. అదిశాంతించు నుపాయం, బెదియో యోజింపుఁ డనుచు నెంతయుఁ బ్రార్థిం
ప దయన్ దేవకిపుత్త్రుఁడు, మదిలో భావ్యర్థ మెంచి మ్మాసురసతులన్. ౧ 1408

క. తనయందు భక్తిభావం,బునుంచి వర్తించుచుంట మోదమ్మున వా
రిని గృతకృత్యలగాఁ జే,యను దలఁచి సకాలమనుచు నరసి సఖులతోన్. ౨

క. పలికెన్ బాలకులారా!, యిలాసురుల్ బ్రహ్మవేత్త లీచెంతనె ని
స్తులదేవలోకసౌఖ్యం, బులఁ బొందం గోరి సత్త్రమును నొకదానిన్. ౨౪ 1410

ఆ. ఆచరింపఁబూని రాంగిరసం బన, సత్త్రయాగమద్ది షమఁ బ్రసిద్ధిఁ
గాంచె నచటి కేగుఁ డంచితగతి మీర, లస్మదాజ్ఞ వచ్చినట్లు పలికి. ౩ 1411

క. గోపాలకులారా! యట, నాపేరు మదగ్రజన్మునామముఁ జెపుఁడా
మాపేరు పలికి యన్నము, వే పెట్టుఁడటంచు మీరు వేడ్కఁ దెలుపుఁడీ. ౮

చ. అని భగవంతుఁ డాజ్ఞనిడ నందఱు నప్పుడె పోయి కేలుమో
డ్పున ధరణీసురర్షులకు మ్రొక్కుచు దండమురీతి భూమిపైఁ
దనువులు చేర్చి యన్నమును దా రడుగం దమిగాంచి వేడ్కనీ
ట్లనిరి; మహాత్ములార! వినుఁ డాదృతి మాపలు కింత యిత్తఱిన్. ౫౪ 1413

సీ. శ్రీకృష్ణునానతిఁ జేకొని రామానుమతిఁ గొని వా రంప జతనమొప్ప
వచ్చితి మిచటికి భద్రంబు మీకగుఁగాక! తదాజ్ఞలఁగడఁగి చేయు
వారిగా మము నెన్నుఁడీ! రమ్యభూమికి దవ్వుగా కున్నట్టిధరణియందె
రామకృష్ణులును గోస్తోమంబు మేపుచు క్షుద్బాధితులయి మీకుం దెలుపఁగ

తే. మమ్ముఁబంపిరి యన్నము మిమ్ముఁ గోరి
రదియె వారలయభిలాష మనఁగ భూమి
దివిజవరులార! ధర్మంబు తెలిఁగెఱుంగు
వారియం దుత్తములు గాఁగ వఱలు మీరు. ౬౪ 1414

క. వారలపై శ్రద్ధయుఁ జే,కూరునయే మీకు వారిక్షుద్బాధ యడం
గా రయమున నన్నంబిడి, కోరికఁ జెల్లింపుఁ డనుచుగోపార్భకులున్. ౭ 1415

సీ. దీక్షఁబూనిన మాకు నేక్షణంబున నైన నగ్నిపూజయొ వ్రతమందువలన
మాయన్న మ దభోజ్యమే యగు నందురో దీక్షను బశువువధించుదనుక
సౌత్రామణి యనెడు సత్కర్మమందును దీక్షితాన్నంబును దినఁగరాదు
గాని యవ్వలఁ దినఁగాఁ బాపమబ్బదు; నావిని యందున్న భూమిబుధులు

తే. క్షుద్రఫలమును గోరియే ♦ శుభదములను, నాశనాయాసబహుళంబు♦లైనకర్మ
ములనొనర్చుచు నజ్ఞులై ♦ వెలయుచుంట, భగవదభ్యర్థనముగాఁ ♦ గొనఁగఁ దలఁపక.

క. తమరే పెద్దల మనుకొని, మమతఁ దిగనాడ లేని ♦ మందులు గానఁ
గమలాక్షుఁ డన్న మడుగుట, విముక్తికిఁ సాధన మను♦వెర వెఱుఁగమిచేన్.

క. వినసట్టు లుండి రకటా, జననాయక! దేశమట్టి ♦ సమయము చరు వ
ల్లి నిఖిలవస్తువ్రాతం,బును మంత్రము తంత్రవిసర♦మును ఋత్విజులున్. ౯ɥ

చ. అనలము దేవతాతతియు ♦ నయ్యజమానుఁడు నధ్వరంబు న
ట్లనుపమధర్మసంతతియు ♦ యన్మయముల్ గను బొల్చుచుండునో
వనరుహనేత్రు నచ్యుతుని ♦ బ్రహ్మ మధోక్షజు నట్టి శ్రీహరిఁ
మనుజమనీషచే నపుడు ♦ మానవమాత్రుని గాఁ దలంచుచున్. ౧౦ɥ 1419

తే. దుష్టమగు ప్రజ్ఞచేఁ దగి♦దుష్టమాన, వాత్మలను బొందియున్న వా♦రొట దైవ
మనుగ నెంచకపోయిరి ♦ మనుజనాథ!, కలదు లేదన్న మనియును ♦ బటుకరైరి.

క. కనిపెట్టియుండి గోపకు, లనుమానముమాని పెట్ట ♦ రను నూహ నిరా
శనుగూడి మరలి యచటికిఁ, జని తెల్పిరి సోదరులకు ♦ క్ష్మాసురవృత్తిన్. ౧౨

చ. పలుకుల వానినిఁ వినుచుఁ ♦ బక్కున నవ్వి పరాత్పరుండు లో
కులదగువృత్తినిం దలఁచి ♦ కొంకక కార్యముఁ బూనువాఁడు లోఁ
గలఁగక యోర్పుఁబూని తన♦కార్యము దీర్చుకొనందగుం గదా
యలుగక బాలురార! యొక♦యర్థముఁ దెల్పెద నాలకింపుఁడీ. ౧౩ 1422

సీ. అవమానమొందని ♦ యాచకుం డెవఁడేని జగమున నుండునే ♦ చక్కఁ దలఁపఁ
గావున మరల నక్కడ కేగి మీరలు బ్రాహ్మణులఁ గనక ♦ వారిసతుల
కడకేగి బలదేవ♦కాంచనాంబరు లిట వచ్చి యున్నారను♦వార్తఁ దెలుపుఁ
డాసతీమణులును ♦ స్వాత్మల నాపయి నునిచి దేహంబుల ♦ నొక్కరీతి

తే. నందునుందురు; తద్బుద్ధు ♦ లచటలేవు
గాన యాచింపుఁ డన్నముఁ ♦ గాంక్ష మాన
మీకు నొసఁగుదు; రింకేల ♦ మించులజ్జ
నొంది యున్నారొ? పోఁ దగు ♦ నురుజవమున. ౧౪ 1413

క. అని హెచ్చరింప వారలు, చని పత్నీశాలయందుఁ ♦ జక్కని భూషా
ళిని దాల్చి కూరుచుండిన, వనితారత్నములఁ గాంచి ♦ భక్తి వినీతిన్. ౧౪ɥ

క. కరములు మోడ్చి నమస్తతి, జరపి యథావిధిగ విప్ర♦సతులార! నమ
స్కారణము లివె కైకొనుఁడీ,యరయుఁడు మాభాషణంబు♦లాదృతిమీఱన్. ౧౫ɥ

చ. హరి యిట కింతదూరమున ♦ యందు వసించియె పంపె మమ్ము మీ
పరిసరమందు నొక్కవిధిఁ ♦ బల్కఁగ మందనువీడి మమ్ము నో

దరవరుఁగూడి దూరతరధాత్రికి వచ్చెను; గృష్ణుఁ డావులన్
సురుచిరఘాసముం దినెడుచోప్పునఁ దోలుచు నొయ్యనొయ్యనన్. ౧౬౪ 1426

క. ఆఁకలి గొనియెను మాకును, శ్రీకృష్ణున కట్టె హలికిఁ జెచ్చెఱ నన్నం
బాఁకలిమానఁగ నిడుదురు, గాక యటం చనిన వారికఁ బ్రోక్తి యొగిన్. ౧౭

## విప్రపత్నులు హరి కన్నుముగొనిపోవుట.

చ. శ్రుతిపుటపేయమై తనరఁ జొక్కపుఁజిత్తము లామహాత్మపై
సతతము నిల్చియుండుటను జక్రిని జూడఁగఁ గాంక్షనొందుచున్
హితకరతచ్చరిత్రముల నెప్పుడు వీనుల విందుగాఁగ స
మ్మతముగ నాలకించుచును మాధవు నే తలపోయుచున్ దమిన్. ౧౭౪ 1428

క. సమయముఁ బుచ్చెడు భక్తిర,తమనీషలుగాన నందతనయుఁడు తమయా
శ్రమపరిసరమును జేరుట, ప్రమదంబున నాలకించి రభసం బలరన్ ౧౮ 1429

సీ. స్వాదుతమంబయి భక్ష్యభోజ్యము లనియును లేహ్యచోష్యంబులనియుఁగీర్తి
గాంచిన యాహారక్రమవస్తువులను భాజనంబులయందుఁ బరమభక్తి
నునిచి వానిని గొని యువిదలందఱు నదు లంబురాశిని గన నరుగునట్లు
షడ్గుణైశ్వర్యసత్సంపత్తిగల్గి యత్యుత్తమశ్లోకాఖ్యనొంది భక్త

తే. తత్పరుం డగుశ్రీకృష్ణదైవతమును, గనఁగఁబోయిరి; చిరకాలమునకు నీశ
దర్శనం బబ్బె ననెడు సంతసము పొంగ, బరిమితిని మించి మదిభక్తిపరిఢవిల్ల.

మ. చిరకాలంబుగఁ దచ్చరిత్రముల సంసిద్ధాత్మలన్ వించు శ్రీ
హరినే నెమ్మదిఁ గాంచుచున్న గుణగణ్యాల్ గాన వారట్లు పో
యిరి భర్తృప్రియబంధుభ్రాతృసుతులెంతే నిల్పినన్ నిల్వ కా
తురతన్ శైవలినీతటంబునకు శ్రీదున్ ముక్తిదుం జూడఁగన్. ౨౦ 1431

క. రుచిరాశోక మహీరుహ, నిచయాంచ న్నవకిసలయనివహాంచిత సా
ధుచరిత్ర భూషిత వనం, బచటన్ వెలయంగ నందు నాదృతిమీఱన్. ౨౦౪

క. బలదేవుఁడు గోపాలకు, లెలమిం దనుఁగొల్వ నొప్పు నీశుని గని రిం
తులు; శ్యామవర్ణ దేహుని, సులలిత హేమాంబరైక శోభితమధ్యున్. ౨౧

సీ. వనమాల ధరియించి బర్హామండితుఁడయి ధాతుప్రవాళముల్ తనువునందు
భూషణంబులుగాఁగఁ బొలయ నటాకృతి వేషంబు తనరంగఁ బ్రియవయస్యు
నంకంబుపయి నొక్కహస్తంబు నునిచి యితరకరంబున ఫుల్లసరసిజంబుఁ
ద్రిప్పుచుఁ జెవిని నిందీవరంబొప్పఁగ గండస్థలంబులఁ గమ్రతరము

తే. లైనముంగురు లొలయంగ నాననార, విందమున సుస్మితం బొగిఁ జిందులాడ
నలరు సర్వజనప్రియు నబ్జనయను, హరిని గాంచిరి పూఁబోఁడు లాదరమున.

క. మునుపే హరియుత్కర్షము,లను బెక్కు తెఱంగులఁ జెవులకు విందుగ నే

వినియున్నవారు గావున, మనములు హరిచరణయుగళి।మగ్నము లగుటన్. ౨౨౫

చ. హరిఁ గనినంతనే స్వనయ।నాంతరమార్గమునుండి లోనికిం
బరఁగెడునట్లు చేసి యట । వాంఛయుఁదీఱఁగ నేకభావతన్
గర మనురక్తిఁ గాంచి చిర।కాలపుఁదాపము వేగపాయుచున్
బరమముదంబు గాంచి రదె । భక్తిఫలంబగు రాజచంద్రమా! ౨౩ 1436

ఆ. అల సుషుప్తిసాక్షి । యగు ప్రాజ్ఞుఁగని యహం,కారవృత్తు లెటువి।కారములను
వదలు నట్లె గాంచి । వారిజనేత్రునిఁ, దన్మయత్వ మొంది । తనరి రపుడు. ౨౩

తే. ఎల్లయాశలుమాని స।ర్వేశుసర్వ
దర్శనుని నమ్ముకుందుని । దనరువేడ్కఁ
గనఁగఁబోయిరి కావునఁ । గాంతలతమి
పెల్లిదం బాత్మనెఱేఁగి తత్।త్రియముగోరి. ౨౩౫ 1438

చ. స్మితము ముఖాంబుజాతమునఁ । జిందులుద్రొక్కఁగ నిట్లు పల్కె స
న్మతులు సదృష్టముంగలుగు । మానినులౌటను స్వాగతంబు రం
డు; తమిని గూరుచుండుఁడు; వి।నూతనకార్య మొకండు గల్గునే
ని తగ నొనర్చువాఁడ, నను । నెమ్మిని జూడఁగ వచ్చినారుగా. ౨౮౫ 1439

క. ఇది మీవంటికృతాత్మల,కుఁ దగున్; స్వార్థము నెఱుంగు । కుశలులు తమకం
టెఁ దలంపఁ బ్రియుండని చె,ప్పఁదగిన నాయందుఁ దమస్వ।భావము లొప్పన్.

ఆ. తగ ఫలాభిసంధి । విగతముగా నిరం, తరముగను జెలంగఁ । దగినభక్తి
నెఱపుదురు నితాంత।నిశ్చితమతులార! వినుఁడు మఱియొకమాట । వీను లలర. ౨౬

క. మనసును బుద్ధిప్రాణము, లనూనభాగ్యంబు నాత్మ।యు ట్లంగనయున్
దనయులు యత్సంపర్కం,బున మిక్కిలి ప్రియములగునొ । బుద్ధిం దలఁపన్. ౨౬౫

తే. అట్టి నాకంటె నెవ్వఁడొ । నవనిఁ బ్రియుఁడు?
కావుననె మీరు కృతకృత్య।లై వఱలితి
రిటకువచ్చిన పనియయ్యె; । నెలమి నన్నుఁ
గనుట నిఁక మీర లేగుఁడు । క్రతుధరణికి. ౨౭ 1443

సీ. మీపతుల్ యోగ్యులు । మేదినీదివిజులు గార్హస్థ్యధర్మంబుఁ । గడఁగిచక్క
నడపుచుందురు; తోడ।నడుచుచు మీరుండ నిపుడు పూనిన సత్ర। మెల్లభంగి
నిర్విఘ్నముగ సాగ । నెమ్మది నెంచిన వారు; గావునఁ దోడు । మీరుసూప
వలయు; నా విని విప్ర।భార్యలు పల్కిరి సర్వలోకేశ! యీ।చందమునను

తే. బరుషములఁ బల్కకుము; నాదు । భర్తఁ డెపుడు
చెడఁడు మరలను బుట్టఁ డీ । తీఱి నటన్న

యుష్మదాజ్ఞకు సత్యంబు నూఁతగాఁగఁ
జేయుమా చిత్తగింపుమా మా యవస్థ. ౨౮ 1444

చ. వనరుహనేత్ర! మేము ప్రియబంధుజనంబుల వీడి సేవచే
యను మదిఁగోరి రాలినమహార్హ మలభ్యము సత్తపఃఫలం
బునయి చెలంగు నాతులసిపూసలదండను గేశపాశమం
దును ధరియింప నీదుపదతోయజమూలము నాశ్రయింపఁగన్. ౨౮ 1445

క. అరుదెంచితి మిత్తఱి నో, యరిషడ్వర్గాంతకా! మహాత్మక! మేముం
ద్వరపడి విడిచియె వచ్చితి, మురుతరభవదీయపాదయుగములఁ గొలువన్. ౨౯

చ. కనుకనె మమ్ము మాపతులు గాదిలితండ్రులు భ్రాతృబాంధవుల్
తనయసుహృన్నికాయములు తప్పొనరించితి మంచుఁ గైకొనక్
మనమున నూహచేయ రనుమాన మిఁకేటికిఁ? దక్కినట్టి బం
ధునికరముల్ మముం గొనఁగఁ దోడనె పూనుదురే తలంపుమా? ౨౯ 1447

క. భవదీయచరణ కమలముల వైచితిమి మామకతనులతలఁ గృష్ణా!
జవమునఁ గావుము వేఱొక, సువిమలపద్ధతియె లేదు శోధింపంగన్. ౩౦

క. మాయభిమతమన్నను నీవే యని ప్రార్థింపఁగ విని కృష్ణుఁడు సతులా
రా! యేల సంశయము? మిమ్మీయెడ మీపతులు తండ్రు లెల్లసహృదయుల్.

క. తనయులు బంధువులును లోకనిచయ మమృతాంధసులును గరుణం జూడం
గను దలఁతు రప్రియంబును, గనఁజాలరు నాదునాజ్ఞఁ గైకొనియుంటన్. ౩౧

క. అనుమోదింతురు మిము నం, చనుమానము మానియుండుఁ డంగనలారా!
మనమునఁ జక్కఁగ నెంచిన, మనుజులయంగాంగసంగమము సుంతైనన్. ౩౧

సీ. అనురాగమును బ్రీతిని నెలకొల్పంగఁ జాలదు కల్గింప క్షణమెయుండు
నవి కాన నాయందుఁ బ్రవిమలమానసములనుంచుఁడీ; దానఁ గలుగునాత్మ
శర్మము మఱియును శాశ్వతంబగు ముక్తి నొడఁగూర్చు నాసేవయును గనుకనె
యచిరకాలమ్మునయందె ననుంబొందఁ గలరు; విశ్లేషంబువలని ఫలముఁ

తే. దెలిపెద వినుండు నావగు దివ్యకథల
వినుట ననుఁగాంచుటయు ధ్యానమును మదీయ
నామసంకీర్తనమ్ము ననంగఁ దగిన;
విధియె నాయందు భావంబు నెసఁగఁజేయు. ౩౨ 1452

క. కావున నాపై మిక్కిలి, భావంబుల నుంచి పొందు వస్త్యంబులకున్
వేవేగ మీకు బాధలు, గావించెడువార లందుఁ గలుగరు సుండీ! ౩౨ 1453

చ. అని వనమాలి యాజ్ఞనిడ నామునిపత్నులు యజ్ఞవాటముం
గనఁ జని రీశ్వరాజ్ఞఁ గడఁకన్ ధరియించి శిరంబులందు నం

గనలను గాంచి తత్పతులు ౹ గాదిలిచుట్టము లించుకే నసూ
యను గన, రిద్ది తప్పనుచు ౹ నాత్మఁదలంపరు, కృష్ణునాజ్ఞచేన్. ౩౨౪ 1454

ఉ. అంతియకాక ప్రీతిమెయి ౹ నాసతులం దగఁగూడి సత్రమ
త్యంతవిధిన్ ముగించి పర౹మాత్మకుఁ దృప్తియొనర్చి; రప్పుడ
క్కాంతలయందు నొక్కతుక ౹ గాఢతరం బగుభక్తిఁ బొంపుచోఁ
గాంతు నిరోధముం గనిస౹కారణముం దను నేఁచ నార్తయై. ౩౩౪ 1455

క. మును విన్నచరితములనే, మననముచేయుచును గృష్ణు౹మానసపద్మం
బున ధ్యానించుచుఁ జేయం,గను జాలమి నేమి వగపు ౹ గదిరినమదితోన్. ౩౮

తే. వదలెఁ గర్మానుబంధమా ౹ వపువు నట్టి, హరినిదర్శింపఁగాఁ జాల౹నైతి ననెడు
చింతతో నంత గోవిందుఁ౹జేరె సాధ్వి, భక్తిభావంబు శ్రేష్ఠమా౹ఫల మిదుఁగద.

క. లోకేశుఁడు గోవిందుం, డాకాంతలు తెచ్చినట్టి ౹ యన్నము పూతం
బై కమనీయంబై తగి, యేకరణిన్ లోపలేశ౹హీనముఁ గుడిచెన్. ౩౮౪ 1458

ఆ. అదిచతుర్విధముగ ౹ నలరారుగోపకు,లకును బెట్టి తృప్తు౹లనుగఁ జేసి
తాను దృప్తిమీఱఁ ౹ దమి భుజించెను భక్తి,సహితమాట మిగుల౹సరస మగుట.

క. లీలామానుషవిగ్రహుఁ, డై లలి మానవులగణము ౹ నాదృతిమీఱం
గా లక్ష్యంబుగఁ గొనినటు, లోలిన్ వర్తించుచున్ మ౹హోద్యమములచేన్.

క. నరలోకవిడంబన మీ, కరణిం గైకొనె నటంచుఁ ౹ గనఁబఱచుచు శ్రీ
వరుఁడట రూపంబున వా,క్చరితంబుల ధేనుగోప౹సాధ్వీమణులన్. ౩౬ 1461

క. అనురంజింపం జేయుచు, వనమున విహరించె; నంత ౹ బాడబు లటుపూ
నినసత్రయాగమును విధి, నొనరిచి మానవశరీర ౹ మూనిన హరిసిన్. ౩౬౪

సీ. బలదేవునిన్ జ్ఞాన౹పాటవంబున నప్డు స్మరియించి యాజగ౹ద్వరుల యాచ్ఞ
నాదరింపక గొప్ప౹యపరాధ మొనరించితిమి గదాయనుచు న౹తిప్రతప్త
మనసులై వార ల౹మానుషరూపులు మనుజులయాచార౹మును దలంచి
యాచింప విన మైతి ౹ మంతియగాక యలౌకికం బగుభక్తి ౹ లలనలకును

తే. సర్వరక్షకుపై నుంటఁ౹జానలవలెఁ, దమరు భక్తులు కాకుంటఁ ౹ దలఁచి తలఁచి
యెంతొసంతాప మందుచు౹నిఁకఁదలంప, నేమిగతియంచుఁ గుందుచు౹నెలమిమాని.

క. జననీజనకులు శుచివృ,త్తిని బొల్చినవార లౌట ౹ దీపించెడిపా
వనతం గల్గినజన్మం, బనఁబడు శౌక్లంబనంగ ౹ నది మన కమరెన్. ౩౭ 1464

సీ. ఉపనయనంబన ౹ నొప్పుసంస్కారముచేత సావిత్రవి౹ఖ్యాతజన్మ
మలవడియెను మన ౹ కదిగాక దేవదీక్షారూపముననె దై౹క్ష్యం బనంగఁ
దగినజన్మము గల్గె౹నుగద యీమూఁడును గలిగినఫల మేమి౹గలిగె? నవ్వి
యేటికి? బ్రహ్మచ౹ర్యేష్టవ్రతం బది నిష్ఫలంబె కద? ౹ నిర్మలతర

తే. విద్యయుడ వ్యర్థమే, బహువేదితయును, గాల్పనే? కులమేటికిఁ? గర్మములును
విఫలములె దక్షతయు నేల? విష్ణుమూర్తి, విముఖులమె యైతి మింకేల వెఱ్ఱితపము.

క. హరిమాయ యెట్టియోగీ, శ్వరులైనను వారిమోహవశులఁ జేయున్
బరికింప సత్యమిది యహా, నొరులకుఁ జెప్పంగ నేర్చియును ద్విజులము నై. ౩౯౫

క. మన క్షేమార్గము క్షేమం, బనుగూర్చునొ యనుచు నెన్నఁబూనుటలో నిం
తనరాని మోహ మొందితి;, మనుతాపం బేల జరగినట్టి పనికి నై. ౪౦ 1467

క. నారీమణులకుఁ గూడన్, వారిజపత్త్రాక్షునందు భక్తి యవధిలే
కీరితిఁ గల్గె జగదా, ధారుండని యెఱిఁగి రిదియె తలఁపఁ దగినదా. ౪౦౫ 1468

*ఆ. ఆదురంతభావ మనునదియే గృహ, ములను మృత్యుపాశములను జెండి
వైచె విప్రులార! యాచమత్కృతిగనుఁ, డింతకంటెఁ జిత్ర మేమికలదు?.

చ. అతివలు వీరలొట మనయట్లు ద్విజాతితనొందఁ జేయుసం
స్కృతియును లేదు; సద్గురువునింట నివాసము చేయునట్టి ప
ద్ధతియును లేదు; సత్తపముఁ దారొగి సల్పువిధుల్ తలంప లే;
వతులితమైన బ్రహ్మవిషయంబగు చర్చయు లేదు చూడఁగన్. ౪౧౫ 1470

క. తను బాహ్యాభ్యంతరశో, ధన మొనరించుటయు లేదు; తగు కాలములం
దును సంధ్యోపాసనముఖ, వినియతకర్మములు లేవు విధిహితములుగన్. ౪౨

క. ఇవియెల్లను లేకుండియుఁ, బవిత్రసచ్చరితుఁ డగుచు భవ్యతమయశ
శ్ఛవిదీపితుఁ డై యోగీం, ద్రవరుం డై తనరుచక్రధరునిపయిఁ గడున్. ౪౨౫

క. అనుపమభక్తి చెలంగఁగఁ, దనరారిరి సంస్కరణవిధానంబునఁ బా
వనులమయియుండియున్ భ, క్తిని బాసితి; మింతకంటె దీనతగలదే? ౪౩ 1473

మ. భవనాసక్తిఁ బ్రమాదముం బొరసి స్వస్వక్షేమకృత్కార్యమం
దవధానం బనలేక మూఢులముగా నైనట్టియస్మద్ద్విజా
తివరశ్రేణికి సాధుసద్గతియనన్ దీపించు శ్రీకృష్ణుఁ డీ
యవనిం బుట్టి సమస్తధర్మముల నెయ్యంబొప్పఁ బాలించుచున్. ౪౩౫ 1474

క. కరుణానీరధి గావున, నిరుపమగోపాలవాక్యనికరమ్మున సం
స్మరణము గల్గం జేసెను, బరికింపఁగఁ జిత్రమిట్టి పాటిది కలదే? ౪౪ 1475

సీ. పరతారణం బె స్వఫలమంచుఁ దలఁపఁడ యేని కైవల్యాదిమాననీయ
పదముల కెన్నంగఁ బ్రభువయి సంపూర్ణకాముఁడై తగినట్టి కాంచనాంబ
రునకు లోకాధినాథునకు ననీశుల మగుమనతోఁ గల్గఁదగిన కార్య
మేమిగల్గును? మది నెన్నఁగా భగవంతునకు నియ్యది విడంబనం బె యగును;

తే. శ్రీనితంబిని యెల్లరఁ జేరమాని, యెవనిపదపద్మసంస్పర్శ మెదను గోరి

* "దురంతభావంయో౽విధ్యన్మృత్యుపాశాన్ గృహాభిధాన్" అని మూలము.

సహజచాంచల్యదోష వి॥సరముమాని, సేవచేయునో యట్టిఁడౌ॥ శ్రీపతికిని.

క. పరులను యాచించుట యన, నరులను మోహింపఁజేయు॥ నైజమె యనఁగాఁ
బరమార్థ మగును; భూసుర, వరులారా! దేశకాల॥ వస్తువు లెల్లన్. ౪౬ 1477

ఆ. మంత్రతంత్రములును॥ మఱియు ఋత్విజులును
హుతవహుండు దేవ॥వితతిధర్మ
యాగములును దగిన॥యజమానుఁడును యన్న
యములగా యట్టి దేవ॥తాధిపతియు. ౪౭ 1478

సీ. అట్టియోగీశ్వరు॥ లందుత్తముఁడు నగు శ్రీమహావిష్ణువే॥ క్షితిని యదుకు
లమున జనించె నం॥చుమును వింటిమి కాని తెలియకపోతి మి॥ త్తెఱఁగు నకట!
యెంతమూఢులమొ యా॥పంతయు నవ్విషయము స్మరింపఁగఁజాల॥ మైన నొక్క
తెఱఁగును దలఁప, మ॥దినిహర్ష ముదయించు భక్తిచేఁ బరమేశుఁ॥బరముఁ గొలచి

ఆ. యతనికరుణ వడయు॥నట్టి యంగనలెల్ల, మనకుఁ బత్నులైరి॥ ఘనముదంబు
నొందవలదె? యెవరి॥యుపతరభక్తిచే, నచలభక్తి మనకు॥ నిచటఁ గుదిరె. ౪౮

క. ప్రతిహతములేని మేధా,న్వితునకు భగవంతునకును॥ విష్ణువునకు నీ
శతఁడగు మాన్యునకు నమ, స్కృతు లివె యజ్ఞానదోష॥ మెల్ల నశింపన్. ౪౯

తే. ఎవనిమాయావిమోహంబ॥ దెల్లచిత్త,ములఁ గలంచెనొ యద్దాన॥భూరికర్మ
మార్గములను భ్రమించుచు॥మార్పులేక,యున్న వారము కరుణింపు॥మో మహాత్మ!

క. తనమాయ మోహమందం,గను జేయఁగ నాత్మలెల్లఁ॥ గలఁతంగన నా
తనిసుప్రభావ మెఱుఁగం, గనుజాలని తప్పు మాది॥ కల దిచ్చోటన్. ౫౦

క. పరముం డాద్యుఁడు సర్వే,శ్వరుఁ డాకృష్ణుండు తప్పుఁ॥ బాటింపక మ
మ్మురుకరుణఁ గాచుఁగాక, త్తరుణంబున ననుచు విప్ర॥తల్లజు లెల్లన్. ౫౧ 1483

ఆ. తలఁచుకొనుచు హరిని॥ దర్శింపఁ గోరుచు, నుండి రంతె కాని॥ యుగ్రకంస
భయము నొందియుంట॥ స్వస్థానమును వీడి, కదలఁజాలరైరి॥ కాలగతిని. ౫౨



ఇరువదినాల్గవయధ్యాయము.

శ్రీకృష్ణుఁ డింద్రయాగమువలదని గోవర్ధనపర్వతోత్సవమును జేయించుట.

చ. [అని వచియించి యోగివరుఁ॥ డౌ శుకుఁ డాజననాయకోత్తముం
గని తరువాత శ్రీహరి ని॥కామ మనోహర సచ్చరిత్రముల్
విను మది చాలసంతసము॥ వింతయుఁ గన్పడఁజేయు] నవ్వలన్
ఘనజదళాక్షుఁ డందు బల॥భద్రునిఁగూడి వసించె వేడ్కతోన్. ౧ 1485

చ. ఒకపరి యింద్రుఁగూర్చి ప్రియమొప్పఁగ యాగముచేయఁ బూని గో
పకు లాగిఁ దత్ప్రయత్నముల బాగుగఁజేయుచునుండఁ గాంచె; నా
త్మకు సకలంబు గానఁబడుఁ దానె సమస్తమునందునుండు య
త్నకలితు లైనగోపకుల *తత్కృతు యత్న మెఱుంగఁజాలఁడే. ౧ 1486

క. ఐనం దా భగవంతుఁడె, యైన నదే మెఱుఁగనట్టు లత్యంతము మా
యానియతి మించి వినయముఁ, బూనుచు వృద్ధులగు నందముఖ్యులవలనన్. ౨

క. ఆవింత యత్నములనే, తా వినఁగా నెంచి తనదు తండ్రిం గని యో
దేవా! యేమీ సంభ్రమ, మీవేళం గలిగె మీకు నెఱుఁగఁబడదుసూ. ౨౪

చ. తలఁపఁ బ్రయోజనంబు రహితంబుగ నున్నప్రయత్న మేదియేఁ
గలుగదు; యజ్ఞ మేదయినఁ గావలె నంచుఁ దలంతు దానికే
ఫలమొ?, యదెవ్వరింగుఱిచి భవ్యముగా నొనరింపనౌనొ? యి
మ్ముల నెవఁ డేమికార్యమును బూని ఫలింపఁగఁ జేయువాఁ డొకో. ౩ 1489

క. ఏసాధనముల దాని నెట్లొ సాధించుట ? వచింపు మోజనకా? నేఁ
డీసాధ్యవిషయమును వినఁ, గా సమధికకామ మలరెఁగా నామదిలోన్. ౩౪

సీ. సర్వమ్ము స్వాత్మగా సతతంబుగాంచెడు సాధువులకు నొక్కచందమునను
గోప్యముగా నుంచుకొనఁదగు పనియుండ; దెట్లనఁగా సర్వమెన్న నాత్మ
గాఁ దలంచుమనీషగలవారు గావున స్వపరదృష్టియె లేక సతతముందు;
రట్టివారికి శత్రువన మిత్రుఁడన నుదాసీనుం డనంబడు మానవుండు

తే. లేకయుండును; వారి కిఁక కేకరణిని, దాఁపఁదగు కార్యముండును?దండ్రి! భేద
దర్శనుల కుదాసీనుండు దస్యురీతి, విడువఁదగుఁ గాని సుహృదుఁ డేవిధిగ న [గును?

క. తనసాటివాఁడు సుహృదుం,డని చెప్పంబడును గాన నతనికిఁ జెప్పం
గను రానిదేది యుండుఁ? గు,జనులును సుహృదులకుఁ జెప్పఁజను నేదేనిన్. ౫

చ. జనులొగి సాధుమానసుల సంగతిఁ బల్మఱుఁ ప్రశ్నచేసి చ
క్కని వగుకర్మజాలములఁ గ్రక్కునఁ జేయుదు; రజ్ఞు లీవిధిం
గనుఁగొనలేక స్వేచ్ఛగను గర్మకదంబము చేయువారు సు
మ్ము; నిజ మిదౌను విజ్ఞులకుఁ బోలఁగఁ గర్మము సిద్ధినొందెడున్. ౬ 1493

ఆ. మఱి యవిజ్ఞులకును మంచికర్మములైన, ఫలము నీయకుండఁగలవు జనక!
చింత చేయఁగా విశేష మీయదె కర్మ,ములను జేయుటందుఁ దలఁపు మీవు.

మ. జనకా! మీ రిటుచేయఁబూనిన క్రియాసంయోగ మెచ్చోటనై
నను శాస్త్రంబులఁ జక్క నారసి సుహృన్నాథుల్ సరే చేయనౌ

* "తదభిజ్ఞోపి భగవాన్ సర్వాత్మా సర్వదర్శనః" అని మూలము.

నని పల్కం బొనరింపఁ బూనినదొ? లోకాచారమే ముఖ్య మం
చును గ్రుడ్డెద్దొగిఁ జేనుచొచ్చె నను నాచొప్పొప్పఁగా నిత్తఱిన్. ౭ 1495

క. ఒనరింపఁ బూనినదొ? నా, కును దెల్పుము వినఁగ నేఁడు కోరికపుట్టెన్
జనకా! యని ప్రశ్నింపఁగ, విని నందుం డిట్లు దానివిధ మెఱిఁగించెన్. ౭ 1496

సీ. పర్జన్యుఁ డనఁబడు భగవంతుఁ డింద్రుఁ డీతంత్రంబునకు నధిదైవతమగు;
నాయింద్రునకు నెన్న నాత్మమూర్తులు మేఘములె యని చెప్పంగఁబోలుఁజుమ్ము;
ఘనములయ్యవి తదాజ్ఞను నొదలలఁ దాల్చి ప్రాణికోటికి నెల్లఁ బ్రణయదమయి
జీవనంబునునయిచెలఁగునయ్యమృతంబుఁ గురియుచుండెడుఁ; గానఁగూర్మితనయ

తే. యట్టిమేఘుంబులకు విభుఁ డగుచు నుజ్జ
గమ్ములను నీశ్వరుం డగుఘను మహేంద్రు
నాతఁ డిచ్చినజలముల నైన ద్రవ్య
ములను గ్రతువులఁ బూజింపఁ దలఁచితి మిటు. ౯ 1497

క. ఇతరులు మానవులును బద్ధతి దీనినె పూని చేయఁదలఁతురు కృష్ణా!
క్షితి ధర్మమర్థకామము, లతిశయముగ సిద్ధిఁ బొందు నట్లుగ నింద్రున్. ౯

క. క్రతువుల యజించి సస్య,ప్రతతిఁ శిష్టంబుఁ గొనుచు బ్రదుకుకొఱకు ను
న్నతిమీఱ వాడుకొందురు, క్రతు కన్నది కలుగుఁగాదె వర్షముచేతన్. ౯౪

క. వినుము త్రివర్గంబులఁ గ,ల్గను జేసెడు పురుషులందుఁ గడుఫలములనుం
గనఁజేసెడువాఁ డింద్రుఁడె, తనయా! యాయింద్రుకంటె ధన్యుఁడుగలఁడే.

తే. పరఁగ వృద్ధపరంపరా ప్రాప్తమైన
యింద్రు నారాధనం బనఁ బెసఁగు నిట్టి
ధర్మమును గామలోభ సాధ్వసములవల
ననొ మహాద్వేషముననొ యే మనుజుఁడేని. ౧౦౪ 1501

క. పరికింపకయే వదలునొ,నరుఁ డాతఁడు సాధుశోభనముఁ గాంచఁగ లేఁ
డరయఁగ నని నందుండు ని,తరులును బృందావనైకధాములు పల్కన్. ౧౧

చ. విని పరమేశ్వరుండు హరి వృత్రవిరోధికిఁ గోప మాత్మఁ గ
ల్గను దగఁ జేయఁబూని వ్రజకాంతుని నందునిఁగాంచి పల్కె ని
ట్లని; జగమందుఁ గర్మమున నన్నియుఁ బుట్టుచుఁ గర్మయుక్తిచే
తనె లయమందు నవ్వియని తత్త్వవిదుల్ పలుకంగ నొప్పఁగా? ౧౨ 1503

*సీ. ఇహపరములయందు నెసఁగెడు సుఖదుఃఖభయములు క్షేమము స్వస్వకర్మ
ములచేతనే కల్గి వెలసెడు; నితరులకర్మములకు ఫలకాండ మిచ్చు
నీశ్వరుం డొక్కరుఁ డెసఁగునే నాతండు కర్మకర్తకె ఫలకల్పనంబు

* "కర్మణా జాయతే జంతుః కర్మణైవ ప్రలీయతే" అని మూలము.

చేయున దేమేని । చేయక యున్నట్టివానికి నీయంగఁ । బ్రభువుకాక
తే. కర్మకర్తనె భజియింపఁ । గాఁ దలంచుఁ, గాదె ప్రాక్కర్మవాసనా । కలనఁ గలుగు
వాని దప్పింపఁ జాలని । వాని నింద్రుఁ, గర్మముల ననువర్తింపఁ । గల్గువారు. ౧౪
క. క్రతువులమూలంబునఁ బూజితునిగఁ జేయంగ నేల? । క్షితిఁ బ్రాణులు క
ర్మతతిన్ వర్తించుచు ఫలతతి నొసఁగెడు నీశుఁ గొల్వఁ । దగు నందువొకో? ౧౫
క. సురపతి యీశ్వరుఁ డగునే?, పురుషులు స్వీయస్వభావ । ములకనుగుణమై
పరఁగెడు కర్మప్రతతికి, నురవగు సుఖదుఃఖములను । నొందుచునుండన్. ౧౬
క. తనశక్తి వాని ననుభవ మునకుం దేనిక యడ్డ । ముగ నిల్వఁగఁ జా
లని యాయనీశుఁ డగు నింద్రునితోఁ బనియేమి గలదొ? । తోఁపదు మదికిన్. ౧౭
సీ. కర్మవాసనలకుఁ । గడులొంగి దేహియుఁ దత్స్వభావంబునే । తానుబూని
యనుసరించును, దేవ । తాసురమానుషసహితమై యున్న యీ । జగము కర్మ
వాసనలందె తా । వసియించు; నటుగాని వస్తు వొక్కటిలేదు । వాస్తవ మిది;
కర్మముననె దేహి । కాయంబుల ననేకవిధములఁ దగువాని । వేడ్కఁ గనుచు
ఆ. వాని వదలుచుండు; । వైరి యుదాసీనుఁ, డన్న మిత్త్రుఁ డీశుఁ । డాత్మ గురువు
తలఁపఁ గర్మమె యగుఁ । దనకర్మ మొనరించు, వాఁడు పూజచేయ । వలయు దాని.
*చ. తన కెదివృత్తి నిచ్చు నదె । దైవతమౌఁ గద? జీవనంబు ని
చ్చు నదియె యొకాట దైవతము । చొప్పున దానిని బూజసేయనౌ
నని వచియింత్రు పెద్దలు; మహాత్మక! యెవ్వఁడు వృత్తి నొక్కదా
నిని దగ నాశ్రయించి ఘన । నిర్వృతిఁ బొందుచు వేఱువృత్తినిన్. ౧౮ 1509
క. అనిశము భజించుచుండునొ, తనపతి విడనాడి జారుఁ । దమిఁ బొందు నసా
ధ్వినిబోలి వాఁడు క్షేమంబును గాంచఁడు జీవనదముఁ । బూజింపమిచేన్. ౧౯
చ. శ్రుతులఁ బఠించి యన్యులకుఁ । జొప్పడఁ జెప్పుచు బ్రాహ్మణుండు తా
బ్రతుకఁగ నొప్పు; రాజు ధరఁ । బాలనచేయుచు జీవనంబు నొ
క్కటిఱఁగునన్ గణింపఁ దగుఁ; । గమ్రతరం బగు వార్తచేతనే
బ్రతుకఁగ నర్హమౌ; మఱియుఁ । బాదజుఁ డీద్విజుల సేవచేతనే. ౨౦ 1511
ఆ. వర్తనంబు చేయ । వలయు; వాణిజ్యగోరక్షణములు కృషియు । రహిఁ గుసీద
మనఁగ వార్త నాలు । గగు భేదముల నొప్పు, నందు మనము జనక । యరసిచూడ.
సీ. అనిశము గోరక్ష । నవని జీవించెడువార; మీవృత్తులు । వరుస సహజ
ములుగ నున్నవి గాని । యలయింద్రు భక్తిచేఁ గొలుచుటచేతనే । గలుగ లేదు;
సత్త్వగుణంబు రజస్సు తమస్సని త్రిగుణంబు లీయవి । తగ జగంబుఁ
బుట్టఁ గారణము లవున్ దండ్రి! యవ్వియే దానిలయమునకుఁ । దగును జుమ్ము

* "అంజసాయేనవర్తేత తదేవాస్యహి దైవతమ్" అని మూలము.

ఆ. రజసుచేత నదులు ౹ ప్రమదలు నన్యోన్య,సంగతిం జెలంగ ౹ జగముగల్గు
నంతె కాక దాన ౹ నావిర్భవించిన, జలదపంక్తులు పురి౹కొలుపఁబడుచు. ౨౨

చ. జలధులయందు ప్రోదినుల ౹ సంతతియందును బర్వతప్రజం
బుల మఱి యెన్నియేని స్థల౹ముఖ్యములందును వృష్టిగల్గు ని
మ్ములఁ బ్రజలెల్ల మేఘముల౹మూలముగా బ్రదుకంగఁ జాలువా;
రిల సురరాజకృత్య మన ౹ నేదియొ తెల్పుమ యిందుఁ జక్కఁగన్. ౨౩ 1514

క. అతఁ డొనరించెడు నయ్యుప,కృతి యింతయుఁ గానరా ద౹దేవిధముననే;
మతిఁ దలఁపు నివాసంబులు, క్షితిఁ బురములు గ్రామములును౹సేవ్యవిషయముల్.

ఆ. గేహములును గావు ౹ కీర్తింపఁబడుదుము, వననివాసుల మని ౹ పర్వతైక
వసతుల మని సతము౹భవ్యాత్మకా! వన,వాసులమగు మనకుఁ ౹ బశువితతికి. ౨౪

క. మనలనె యాశ్రయులనుగా, ననిశముభావించునట్టి ౹ యవనీదివిజే
శనికాయమునకుఁ బర్వత,మునకున్ సంతుష్టి గలుగు౹పొంటె మఖంబుల్. ౨౫

క. ఆరంభింపందగు; సం,భారంబులు దేవతాధి౹పాలకునకుఁ గాఁ
గూరిచినట్టివి గలవుక,దా రాజా! వానితో౹విధానముమీఱన్. ౨౬ 1518

క. క్రతువును దీని నొనర్పుఁడు, జతనం బలరారఁ; బాయ౹సము సూపము స
ట్లితరములగు వంటకముల, నతితరముగ సిద్ధపఱుపుఁ ౹ డధ్వరమునకై. ౨౭

సీ. గోధుమపిష్టము ౹ గూర్చిన పెక్కువిధములైనభక్ష్యముల్ ౹ తగునపూప
ములు చక్కిలమ్ములు ౹ మొదలగువానిని బచనము చేయంగ౹బనుపుఁ; డెందు
లకుఁగాఁగఁ బల్లియ౹లను గల్గుపయసుల నుపయోగపఱుపుఁడీ; ౹ యుర్విసురుల
బ్రహ్మవాదులఁ బిల్వ౹బంచి యగ్నులఁ జక్క వేల్చునట్లుగఁ జేసి ౹ వితతభక్తి

తే. ధేనుదక్షిణ లొసఁగుఁడు; ౹ దివ్య మోద,నమ్ము బహువిధసిద్ధమ్ము ౹ న్యాయ్యరీతి
వారికిం బెట్టుఁ; డింకను ౹ వాయసీర, లనుచు యోజింపకయె ప్రీతి౹నందఱకును.

*క. శునకములకు శ్వపచులకుం, దనివారఁగ నన్నమిడఁగఁ౹దగుఁ; బతితుల కిం
కనుగల్గు వారలకు నో,దనముం బెట్టింపుఁ డింపు౹దళుకొత్తంగన్. ౨౮ 1521

క. ధేనువులకుఁ దృప్తిగఁ దృణ, దానము చేయింపుఁ; డట్లె ౹ ధాత్రీధ్రము నాఁ
గా నిర్మలయశముం గని, ధేనువులం బెంచునట్టి ౹ దీనికి బలినిన్. ౨౯ 1522

క. ఒసఁగుఁడు మీరందఱు మా,నసములు తృప్త్యుత్సవము గ౹నం దగునట్లే
వెసఁ గుడిచి యమూల్యములగు, వసనంబులఁ గట్టి సాధు౹వరభూషణముల్.

క. తనువుల ధరించి గంధం,బున దేహము లలరుచుండ ౹ భూసురులకు ధే
నునికరములకును గోవ,ర్ధనగిరి కగ్నులకునుం బ్ర౹దక్షిణము విధిన్. ౩౦ 1524

క. ఒసరింపుఁ డిద్ది గోవ, ర్ధనగిరికిన్ గోవులకును ౹ ధరణీసురవ

* "అన్యేభ్యశ్చాశ్వ చాండాల పతితేభ్యో యథార్హతః" అని మూలము.

చేయున దేమేని ॥ చేయక యున్నట్టివానికి నీయంగఁ ॥ బ్రభువు కాక
తే. కర్మకర్తనె భజియింపఁగాఁ దలంచుఁ, గాదె ప్రాక్కర్మవాసనా ॥ కలనఁ గలుగు
వాని దప్పింపఁ జాలని ॥ వాని నింద్రుఁ, గర్మముల ననువర్తింపఁ ॥ గల్గువారు. ౧౪
క. క్రతువులమూలంబునఁ బూజితునిగఁ జేయంగ నేల? ॥ క్షితిఁ బ్రాణులు క
ర్మతతిన్ వర్తించుచు ఫల,తతి నొసఁగెడు నీశుఁ గొల్వఁగఁదగు నందువా? కో! ౧౫
క. సురపతి యీశ్వరుఁ డగునే?, పురుషులు స్వీయస్వభావముల కనుగుణమై
పరఁగెడు కర్మప్రతతికి, నురవగు సుఖదుఃఖములను ॥ నొందుచునుండన్. ౧౬
క. తనశక్తి వాని ననుభవ,మునకుం దేనిక యద్దమునగ నిల్వఁగఁ జా
లని యాయనీశుఁ డగునింద్రునితోఁ బనియేమి గలదొ? ॥ తో ॥ పదు మఱికన్. ౧౭
సీ. కర్మవాసనలకుఁ ॥ గడులొంగి దేహియుఁ దత్స్వభావంబునే ॥ తానుబూని య
ననుసరించును, దేవతాసురమానుషసహితమై యున్న యీ ॥ జగము కర్మ
వాసనలందె తా ॥ వసియించు; నటుగాని వస్తు వొక్కటిలేదు ॥ వాస్తవ మిది;
కర్మమునను దేహి ॥ కాయంబుల ననేకవిధములఁదగు వాని ॥ వేడ్కఁ గనుచు
ఆ. వాని వదలుచుండు; ॥ వైరి యుదాసీనుఁడన్గ మిత్రుఁ డీశుఁ ॥ డాత్మ గురువు
తలఁపఁ గర్మమెయగుఁ ॥ దనకర్మ మొనరించు, వాఁడు పూజ చేయ ॥ వలయు దాని.
*చ. తన కెదివృత్తి నిచ్చు నదె ॥ దైవతమౌఁ గద? జీవనంబు ని
చ్చు నదియొకొంట దైవతము ॥ చొప్పున దానిని బూజసేయనౌ
నని వచియింత్రు పెద్దలు; మహాత్మక! యెవ్వఁడు వృత్తి నొక్కదా
నిని దగనాశ్రయించి ఘననిర్వృతిఁ బొందుచు వేఱువృత్తినిన్. ౧౮ 1509
క. అనిశము భజించుచుండునొ, తనపతి విడనాడి జారుఁ ॥ దమిఁ బొందు నసా
ధ్వినిబోలి వాఁడు క్షేమం,బును గాంచఁడు జీవనదముఁ ॥ బూజింపమిచేన్. ౧౯
చ. శ్రుతులఁ బఠించి యన్యులకుఁ ॥ జొప్పడఁజెప్పుచు బ్రాహ్మణుండు తా
బ్రతుకఁగ నొప్పు; రాజుధరఁ ॥ బాలనచేయుచు జీవనంబు నొ
క్కతెఱఁగునన్ గణింపఁ దగుఁ; ॥ గ్రమ్మతరం బగు వార్తచేతనే
బ్రతుకఁగ నర్హమౌ; మఱియుఁ ॥ బాదజుఁ డీద్విజుల సేవచేతనే. ౨౦ 1511
ఆ. వర్తనంబు చేయ ॥ వలయు; వాణిజ్యగో,రక్షణములు కృషియు ॥ రహిఁ గుసీద
మనఁగ వార్త నాలు ॥ గగు భేదముల నొప్పు,నందు మనము జనక ॥ యరసిచూడ.
సీ. అనిశము గోరక్ష ॥ నవని జీవించెడువార; మీవృత్తులు ॥ వరుస సహజ
ములుగ నున్నవి గాని ॥ యలయింద్రు భక్తిచేఁ గొలుచుటచేతనే ॥ గలుగలేదు;
సత్త్వగుణంబు రజస్సు తమస్సని త్రిగుణంబు లీయవి ॥ తగ జగంబుఁ
బుట్టఁ గారణము లౌవున్ దండ్రి! యవ్వియే దానిలయమునకుఁ ॥ దగును జుమ్ము

* "అంజసాయేనవర్తేత తదేవాస్యహి దైవతమ్" అని మూలము.

ఆ. రజసుచేత నగులు ప్రమదలు నన్యోన్య,సంగతిం జెలంగ జగముగల్లు
నంతె కాక దాన నావిర్భవించిన, జలదపంక్తులు పురికొలుపఁబడుచు. ౨౨

చ. జలధులయందు ప్రాదినుల సంతతియందును బర్వతవ్రజం
బుల మఱి యెన్నియేని స్థలముఖ్యములందును వృష్టిగల్గు ని
మ్ములఁ బ్రజలెల్ల మేఘములమూలముగా బ్రదుకంగఁ జాలువా;
రిల సురరాజకృత్య మన నేదియొ తెల్పుమ యిందుఁ జక్కఁగన్. ౨౩ 1514

క. అతఁ డొనరించెడు నయ్యుప,కృతి యింతయుఁ గానరా దదేవిధమున నే;
మతిఁ దలఁపు నివాసంబులు, క్షితిఁ బురములు గ్రామములును సేవ్యవిషయముల్.

ఆ. గేహములును గావు కీర్తింపఁబడుదుము, వననివాసుల మని పర్వతైక
వసతుల మని సతము భవ్యాత్మకా! వన,వాసులమగు మనకుఁ బశువితతికి. ౨౪

క. మనలనె యాశ్రయులనుగా, ననిశము భావించునట్టి యవనీదివిజే
శనికాయమునకుఁ బర్వత,మునకున్ సంతుష్టి గలుగు పొంటె మఖంబున్. ౨౪½

క. ఆరంభింపందగు; సం,భారంబులు దేవతాధిపాలకునకుఁ గాఁ
గూరిచినట్టివి గలవుక,దా రాజా! వానితో విధానముమీఱన్. ౨౫ 1518

క. క్రతువును దీని నొనర్పఁడు, జతనం బలరారఁ; బాయసము సూపము న
ట్లితరములగు వంటకముల, నతితరముగ సిద్ధపఱుపుఁ డధ్వరమునకై. ౨౫½

సీ. గోధుమపిష్టము గూర్చిన పక్కవిధములై నభక్ష్యముల్ తగునపూప
ములు చక్కిలమ్ములు మొదలగువానిని బచనము చేయంగఁబనుపుఁ; డందు
లకు గాఁగఁ బల్లియలను గల్గుపయసుల నుపయోగపఱుపుఁడీ; యుర్వీసురుల
బ్రహ్మవాదులఁ బిల్వఁబంచి యగ్నులఁ జక్క వేల్చునట్లుగఁ జేసి వితతభక్తి

తే. ధేనుదక్షిణ లొసఁగుఁడు; దివ్య మోద, సమ్ము బహువిధసిద్ధమ్ము న్యాయ్యరీతి
వారికిం బెట్టుఁ; డింకను వాసుపీర, లనుచు యోజింపకయె ప్రీతి నందఱకును.

*క. శునకములకు శ్వపచులకుం, దనివారఁగ నన్నమిడఁగఁదగుఁ; బతితుల కిం
కనుగల్గు వారలకు నో,దనముం బెట్టింపుఁ డింపు దళుకొత్తంగన్. ౨౬½ 1521

క. ధేనువులకుఁ దృప్తిగఁ దృణ, దానము చేయింపు; డట్లె ధాత్రీధ్రము నాఁ
గా నిర్మలయశముం గని, ధేనువులం బెంచునట్టి దీనికి బలినిన్. ౨౬½ 1522

క. ఒసఁగుఁడు మీరందఱు మా,నసములు తృప్త్యుత్సవము గొనం దగునట్లే
వెసఁ గుడిచి యమూల్యములగు, వసనంబులఁ గట్టి సాధువరభూషణముల్.

క. తనువుల ధరించి గందం,బున దేహము లలరుచుండ భూసురులకు ధే
నునికరములకును గోవ,ర్ధనగిరి కగ్నులకునుం బ్రదక్షిణము విధిన్. ౨౭ 1524

క. ఒనరింపుఁ డిద్ది గోవ, ర్ధనగిరికిన్ గోవులకును ధరణీసురవ

---

* “అన్యేభ్యశ్చాశ్వ చాండాల పతితేభ్యో యథార్హతః” అని మూలము.

ర్యనికరమునకుఁ వహ్నులకును నాకుం బ్రియతరం బగుం దలపోయన్. ౨౯

క. మతమిది నాదగు; మీసమ్మతి గాంచునయేని దీని । మానక చేయం
జతనము చేయింపుఁడు; సత్కృతు వనఁగా నిదియె సుమ్ము । క్ష్మాస్థలియందున్.

క. కాలాత్ముఁడు భగవంతుఁడు, బాలుఁడునై నట్టి హరి సుపర్వేంద్రమదం
బేలీల నడఁగు నట్టులె, యాలోచించియె వచింప । నావాక్యంబున్. ౩౦ 1527

క. వినిపింప నందముఖ్యులు, విని దానిన్ సాధువనుచు । వేడ్కఁ దలఁచియ
ట్లొనరుప నెంచిరి; మధుసూదనుఁ డేరీతిగ నొనర్పఁ దగునం చనెనో. ౩౧ 1528

తే. అట్లుచేయంగఁ దలఁచి నందాదు లింద్ర
యాగమును జేయ నార్జించినట్టి వస్తు
వులనె గిరియజ్ఞ మొనరింపఁ । బూని రంతఁ
గుధరవరమును విప్రులఁ । గూర్చి విధిగ. ౩౨ 1529

సీ. స్వస్త్యయనంబును । జదివించి కార్యంబు లెల్లనొనర్చి పెయ్యెడఁ బలని
బర్వతమున కిచ్చి । వరతృణంబుల గోవులను దృప్తిపఱచి యాలనుబురస్క-
రించుకొనియె తద్గిరికిఁ బ్రదక్షిణ మొనరించిరి; నందాదు । లంచితగతి
నెద్దుబండ్లను నెక్కి । యెంతో ప్రమోదంబున నరుగ గోపికలు మహార్హభూష

తే. ణములఁ దనువులు గ్రాలంగ । నమలకృష్ణ
వీర్యగీతాళిఁ బాడుచు । ద్విజులయాశి
షములఁ బడయుచు భూధ్రపార్శ్వమున కెలమి
వలగొనుచు భక్తిభావంబుఁ । దెలుప రపుడు. ౩౩ 1530

చ. హరియు నచేతనంబయిన । యద్రియి దెట్టు బలిన్ గ్రహించు నె
క్కరణి నభీష్టముల్ మనకుఁ । గాదన కిచ్చు నటన్న శంక యు
త్తరుణమునందు గోపకవతంసులకుం గలుగంగనీక మే
నురుతరమై చెలంగునటు । లొక్కటఁ బెంచి విచిత్రరీతిగన్. ౩౪ 1531

క. గిరిశృంగముపైఁ జెలఁగుచు, ధరణీధరమైతి ననుచుఁ । దాఁ బల్కుచు నా
దరమున వారిడుబలులన్, ద్వరగా భక్షించె నేర్పు । బయలుపడంగన్. ౩౫

వ. మఱియు గోపకులనడుమ నొక్కరుఁడుగా రూపమును ధరించి యోరీ! గోపాల
కులారా! యీచిత్రంబుఁ బరికింపుఁడు. ఈగోవర్ధనాచలంబు మనయిచ్చినబలులఁ
బరిగ్రహింపఁ దగు శరీరమునుదాల్చి మనల ననుగ్రహించినది. ఈధరాధరంబు
కామరూపియగు. దీని నెవ్వరు పరిహసింతురో వారల నీయద్రి వధించు. కాన
మనకు మనగోప్రతతికి మేలుగలుగ నీపర్వతమునకు నమస్కరింత మని పలుకుచు
గోపాలకవర్యులంగూడి బృహత్కాయంబునఁ బర్వతరూపంబుననున్న తనకే
నమస్కరించెను. వారు నట్లే నమస్కరించిరి. వాసుదేవప్రేరితులై భూధరంబును

గోవులను ధరామరులను గుఱించినయామమహాధ్వరంబును యథావిధి నొనరించి నందాదు లాశ్రీకృష్ణుంగూడి వ్రజపురంబునకుంబోయిరి. ౩౮ 1533



## ఇరువదైదవయధ్యాయము.

ఇంద్రుఁడు వృష్టిగురియింప శ్రీకృష్ణుఁడు గోకులమును గాపాడుట.

క. అని వివరమ్ముగఁ దెల్పుచు, జనపతివర్యునకు యోగిసత్తముఁ డవలా
వనజాక్షుని చరితంబును, వినిపింపఁ దలంచి పల్కె విస్తృతభక్తిన్. 1534

చ. సురపతి తన్నుఁగూర్చి విధిశోభితమార్గము నూనిచేయు న
ధ్వర మిటు లాపఁగాఁబడఁగ దారుణకోపము నొంది కృష్ణుఁడే
శరణమటంచు నమ్మి గతసాధ్వసు లై యటునందముఖ్యు ల
క్కరణి నొనర్చిరే యనుచుఁ గ్రక్కున నీశ్వరమానియాటచేన్. ౧ 1535

చ. మనసు కలంగుచుండఁగ సమస్తజగంబుల నంతమొందఁగా
నొనరుచు చుండువానిని మహోగ్రత రాకృతి నొప్పుచున్న యా
ఘనములఁ బ్రోత్సహించుచు నికామరుడావిల మానసంబుతో
ననియెను వింటిరే, యడవియందు వసించెడు గోపకుల్ బళీ! ౨ 1536

సీ. శ్రీమదంబున నెంత క్షితిని గర్వించిరి, సంవర్తకములార! సాంద్రవిత్త
గర్వమాహాత్మ్య మిక్కరణి నొప్పుంగాదె? మర్త్యుఁడౌ కృష్ణుని మాటనమ్మి
యతనియాశ్రయమున నమరేశ్వరుని నన్ను నవమానపఱచి రేమనఁగ వచ్చు
నామమాత్రంబున నౌకలనందగి కర్మమయంబు లై కార్యసాధ
తే. నములుగాకయె మఱి యదృఢములునైన
యధ్వరాభాసములను జేయంగఁ బూని
తగిన యధ్యాత్మవిద్య వదలి భవార్ణ
వముఁ దరింపఁగఁ బూనుచందముగ వీరు. ౪ 1537

*క. నను విడిచి శాస్త్రయోనిత, ననువుగఁ దగనట్లు మాటలాడుచు సుంతై
నను నభిమానము లేకయె, తనశిశుత బయల్పడంగఁ దగఁ గనఁబడుచున్. ౪౻

క. ఇతరుఁడు వంద్యుఁడు లేఁడను, మతి నూని యనమ్రుఁడగుచు మహి నవినీతుం
డితఁడని చెప్పంబడఁదగి, యితరుఁడు తనకంటె జ్ఞానియే లేఁడనుచున్. ౪౻ 1539

క. తానే సర్వజ్ఞుం డనఁ,గా నెగడుచు నజ్ఞుఁడితఁడె గద యనుపేరుం
దా నొంది బ్రహ్మవిద్భవు, మానార్హుఁడ ననెడునట్టిమహితార్థంబున్. ౫ 1540

క. తనమది నెంచుచు జను లొగిఁ, దనుఁ బండితమానియని సతంబు తలఁపఁగాఁ

* "వాచాలం బాలిశం స్తబ్ధ మజ్ఞం పండితమానినం, కృష్ణం మర్త్యముపాశ్రిత్య గోపామేచక్రురప్రియమ్" అని మూలము. ఇందలినిందాస్తుతిపద్యమునఁ జేర్పఁబడినదని యెఱుంగునది.

జనుచున్ మర్త్యుఁడు తాన,య్యను బ్రహ్మము నేనె యనెడు సోహం గనుచున్

క. చరియించుకృష్ణునిం దమ, శరణంబుగ నమ్మి గోపసత్తము లిటు ని
ర్జరవరు నన్నుఁ దృణంబుగఁ, బరికించుచు నప్రియముగ వర్తించి రహా! ౫

చ. ధనమద మెట్టి పొంగ నొరుఁ దమ్ము నెఱుంగఁగ లేక కృష్ణుచే
తను దనువుల్ వివృద్ధిగనఁ దమ్మె యెఱుంగనుజాల నట్టియా
యనుపమదుర్మదాంధుల ధనాగతగర్వ మడంగఁజేసి గో
ధనము లయంబు గాంచెడువిధంబు నొనర్పుఁడు మీర లేపునన్. ౬ 1543

మ. చనుఁడో మేఘములార! నేను నిపుడే స్తంబేరమేంద్రంబు నాఁ
జను నైరావత మెక్కి వీర్యమున మించంజాలి వేగంబునం
జను శక్తిం దగు నమ్మరుద్గణము లస్మత్పార్శ్వమం దొప్ప నం
దుని దక్కుంగలవారిఁ జంపుటకు పోత్తుర్ మందకున్ వెన్కనే. ౭ 1544

చ. అనియిటు లాజ్ఞ చేయ జలదావళి బంధనరాజి విప్పఁగాఁ
జని యట నందగోకులము శక్తికినొప్పినరీతి సంతతం
బును దగుధారలన్ జెలఁగి భూరిభయంకరభంగి నార్చుచున్
బెనురుష నూని యెంతయును బీడను గాంచఁగఁజేసె నొక్కటన్. ౮ 1545

సీ. స్తనయిత్నుసంతతి దారుణధ్వనిమీఱ విద్యుత్ప్రతానసీవితతు లెఱయఁ
దీవ్రమారుతవితతి ప్రేరితంబులై జలదంబు లొక్కట సలిలశర్క
రావళిఁ గురియించు నామందఁ బీడించె; స్తంభంబులనుబోలు సతతవర్ష
ధారలు గురియంగ ధాత్రియంతయు జలమయముగాఁ గన్పడెను మఱియు నతిము
తే. నున్నతంబును గనరాకయుండె నొక్క, విధముగా వృష్టిధారలు వెలయుచుంట
మిక్కుటంబుగ వాతంబు మించుచుంట, బశువులెల్లను వడవడ వడఁకసాగె.

క. చలిబలిమిని నామందను, గలగోపకులుం దదీయకాంతలు శిశువుల్
పలుభంగుల నార్తింగని, జలజాక్షుని వేడిరివె శరణం బనుచున్. ౧౦ 1547

క. నిరతము జలధారలు తమ్మురవడిఁ బీడింపఁగఁ దనయులశీర్షములన్
గరము శరీరంబులచే,త రహిం గప్పుకొని భీతిఁ దత్తఱపడుచున్. ౧౧ 1548

క. జలజాక్షుపాదమూలం,బుల నాశ్రయములుగ నమ్మిపోయి మహాత్మా!
కలుషఘ్నా! శ్రీకృష్ణా!, జలజాసనపూజితాంఘ్రిసరసిజ! దేవా! ౧౨ 1549

క. జగముల కధినాథుండవు, భగవంతుఁడ వీవ కావె పరమేశ్వర! లో
కగణంబుల కెన్నఁగ నీ,వెగదా దిక్కనఁగఁ జూడు మిత్తఱి ప్రజమున్. 1550

క. దీనికి దిక్కన నీవే, గానన్ నీకంటె నెవఁడు కాపాడునొ యీ
దీనిన్ గుపితుండై యిపు, డానిర్జరవిభుఁడు మమ్ము నార్తులఁ జేసెన్. ౧౩ 1551

తే. భక్తవత్సల! యాతనబాధనుండి, కావఁ దగుదువు నీవని కడువడి నతి

దీనులై దిక్కులేక ప్రార్థించి; రిట్లు, తనను వేఁడెడువారలఁ ఽ గని హరియును.

క. శిలలను వృష్టిగఁ గురియఁగ, జలదములకు నాజ్ఞచేసి ఽ శతమఖుఁడే గో
కులమును బాధించెడు నం,దలివారలు దిక్కులేక ఽ యార్తులు నగుచున్.

చ. తనుశరణంబు గోరిరని ఽ తప్పక యీయది యింద్రుఁ డాగ్రహం
బున నొనరించె నంచనియు ఽ బుద్ధిఁ దలంచెను; వర్ష మిట్టు లు
ర్విని గురియంగఁ గాల మిది ఽ వేయివిధంబున నెంచఁ గాదుగా
యనిలుఁడు తీవ్రరూపమున ఽ నార్తిని బెట్టెడు మంద నద్దిరే! ౧౪ 1554

క. కరకామయవర్షం బిటు, కురియంగా హేతు వేమి? ఽ కోరి తనకు న
ధ్వరమును జేయం బూనఁగఁ, ద్వర నద్ది విఘాత మగుటఁ ఽ దలఁచి యతండే.

క. నాకారణమున నయ్యది, చేకూరె నటంచు నెంచి ఽ శీఘ్రమ మమ్ముం
బోకార్ప నెంచి వర్షం, బీకరణిం గురియఁ జేసె ఽ నేమగు దీనన్? ౧౫ 1556

క. దీనికిఁ దగు ప్రతివిధి ని,ప్డే నాయాత్మప్రభావ ఽ మే పారఁగ నా
నా నన సాధించెద మఱి, యీనిర్జరపతియుఁ డా దిగీశుఁడ ననుచున్. ౧౬

*సీ. మూఢత్వమున గర్వమును బొంది శ్రీమదమునఁ బెంపునొందె నీతనికి నిట్టి
వారలకుం గల్గు ఽ వసుమదతమమును నిప్డు హరించెద ఽ నిద్ధశక్తి;
మద్భక్తులకు నీశమానిత్వ మెప్పుడు కాన నయ్యీశ్వరమానము లెల్ల
సాధువు లెప్డు కాఁజాలరు; సురలు మద్భక్తులౌటను గరుణంబు వారి

తే. కిట్టిదుండదు కలుగునయేని కర్మ
వశమునన్ దానికిన్ మానభంగ మొకఁడె
శాంతి కావించు నదియు శిక్ష యెటులౌను?
గర్వశాంతియె యగు నుపకార మెపుడు. ౧౭ 1558

చ. నను మదినమ్మి సాయపడ ఽ నన్నె సతంబును గోరుచున్ విభుం
డని నను సత్యశుద్ధిగ నిరంతర మెంచుచు నున్న గోకులం
బును దగ నాప్రభావమునఁ ఽ బూనికఁ గాచెద నిద్ది యేనుబూ
నిన వ్రతమానుగాదె యని ఽ నిశ్చయ మొప్పఁగఁ జేసి యంతటన్. ౧౮ 1559

### గోవర్ధనాద్రిని శ్రీకృష్ణుఁ డుద్ధరించుట.

చ. హరి పరమేశ్వరుండగుట ఽ నాత్మవినిశ్చితమెల్ల గోపకో
త్కరమున కప్పుడే తెలిపి ఽ కాంచనచేలుఁడు లీలచే ధరా
ధరమును బుట్టగొడ్గు నెడఁ ఽ దత్తఱమందక బాలకుం డదే
కరణిఁ బెకల్చి తాల్చు నటు ఽ కమ్రకరాంగుళిఁ దాల్చె నేర్పునన్. ౧౯ 1560

మ. హరియంతన్ జనకాదులంగని మహాహర్షంబు పొంగన్ వచిం

* "లోకేశమానినాంమౌఢ్యాద్ధరిష్యే శ్రీమదంతమః" అని మూలము.

చె రయంబొప్పఁగ శైలగర్తమున నేఁచింతల్ మదింజొన్ప కి
త్తరుణం బందున గోధనాన్వితముగా । ధైర్యంబుమైఁ జొచ్చి యా
దర మొప్పన్ వసియింపుఁ డందు సుఖమొంది దం గల్గుఁజుండీ తగన్. ౨౦ 1561

క. అని తల్లికిఁ దండ్రికి గో,పనికాయంబునకుఁ దెల్పి । పరమేశ్వరుఁ డి
ట్లనిపల్కె వారలకు నె,మ్మనములఁగలసందియంబు । మాన్పెడుకోర్కిన్. ౨౦

*ఉ. బాలకుఁ డీతఁడౌనుగద । పర్వతమో పెనురూపునం దగుం
జాలునె దీనిఁ బట్టుకొన । సత్త్వము సుంతకదా యటంచు శం
కాలతఁ జిత్తసీమలఁ దగం బ్రభవిల్లఁగఁ జేయఁబోకుఁ డీ
శైలము కేలనుండి దిగజాఱునె యెన్నటికైన నెంచినన్. ౨౦౪ 1563

ఉ. భీతిని మానుఁ డింకఁ బెనువృష్టియు గాలియు మిమ్ము నేచఁగా
నేతఱినైనఁ జాలునొకో । యెన్నివిధంబులనైన మి మ్మొగిం
గాతును నిర్భయంబుగ నిఁకన్ బశువారముగూడి యుండుఁ డీ
భూతలమందు ఛత్త్రమునుబోలి గిరీంద్ర మి దొప్పి యుండెడున్. ౨౧ 1564

చ. వనజదళాక్షుఁ డిట్లభయభాషలు పల్కఁగ నూఱడిల్లి గో
పనికర మాత్మగోధనము । బాలురు సేవకులుం బురోహితుల్
మనముల శంకమాని శతమన్యుభయంబును బాసి బండ్లతో
జని యలగర్తభాగము విశాలముగాఁ దగఁ జొచ్చి రత్తఱిన్. ౨౨ 1565

ఉ. ఆఁకలిదప్పి యన్నయది । యాత్మకుఁ దోఁపకయుండఁగా సుఖం
బేకరణిం గనంగ మదినించుక కోరక చిత్ర మిద్ది యాఁ
గా కని తన్ను గోపకని । కాయము నందముఖుల్ కనుంగొనన్
శ్రీకలితుండు కృష్ణుఁడు విజృంభితశక్తిని గేల నగ్గిరిన్. ౨౨౪ 1566

క. దినసప్తక మొకయడుగై, నను బ్రక్కన నున్నఁగా మౌనంబున నింతై
నను దలఁపకయే ధరియించి నిలిచె; దేవేంద్రుఁ డట్టిచిత్రము గనుచున్. ౨౩

సీ. హరియోగమాహాత్మ్య । మత్తఱి వీక్షించి యతివిస్మితుండయి । యాత్మభూరి
సంకల్ప మట్లు భ్రష్టంబగు టారసి గర్వముం బాసి మేఘముల నడ్డి
మరలించె; నంత వ్యోమమున మేఘంబులు కనఁబడవయ్యె భాస్కరుఁడుతోఁచె
వానయు నతిశయవాయువు నుడిగెను; దద్విషయం బుంచి ధరణిధరముఁ

ఆ. దాల్చియున్న శ్రీనిధానము శ్రీకృష్ణుఁ, డందు నున్న గోపబృందముఁ గని
పలికె; గోపులార! । లలనల బాలుర, గోధనమును వెంటఁ । గొనుచు నింక. ౨౫

* "నత్రాస ఇహ వః కార్యో మద్హస్తాద్రినిపాతనే, వాతవర్షభయే నాలం తత్త్రాణం విహితం హి వః" అని మూలము.

క. చిత్తంబుల హత్తిన భయ, మిత్తఱి దిగవిడిచి వెడలుఁ డిటనుండి మహో
దాత్తమగు వాన యుడిగె మ,రుత్తును దనయంతఁ దీవ్రరూపము మానెన్.

క. శైవలినులయం దుదకము, భావింపఁగ స్వల్పముగనె పర్వెడు నాఁగా
గోవల్లభు మాటలు విని, గోవారముతోడ బాలకులతోఁ గూడన్. ౨౬

క. ధనముల గృహోపకరణము,లను శకటంబులను నించి లలనలతో వృ
ద్ధనికరములతో మెల్లనఁ, జని రావిపరంబునుండి సంతస మొప్పన్. ౨౭

క. హరి భగవంతుం డాభూ,ధరమును భూతంబులెల్లఁ దమిఁగనఁ బ్రభుతం
బరఁగం జేయుచు నెప్పటి, కరణి విలాసమున నిల్పెఁ గని గోపకులున్. ౨౮ 1572

సీ. భగవంతుని మహాప్రభావముల్ తలఁచుచుఁ బరిరంభణాదుల వత్సలత్వ
మగపడఁ గావించి యందఱు నొకచోటఁ జేరియెంతయు సుఖసిద్ధిఁ గనిరి;
గోపికల్ స్నేహంబుగూడిన చిత్తంబు లొప్పఁగా దధ్యక్షతోదకముల
నర్చించుచున్ వృద్ధినందునట్లుగ నాశిషము లిచ్చి; రంతఁ బ్రేమమున నందుఁ
తే. డల యశోదయు రోహిణి యలఘుబలుఁడు
హలియుఁ గౌఁగిటఁజేర్చి స్నేహాతిశయత
మదులు కలఁగంగ దీవించిరి; దివమందు
సిద్ధగంధర్వచారణుల్ చెలఁగి సురలు. ౩౦౪ 1573

క. సంతోషంబున సాధ్యులు, వింత యిదౌ ననుచు స్తుతులు వివిధవిధుల న
త్యంతము గావించిరి మఱి, పంతంబున విపులవానఁ బరఁగించి రటన్. ౩౧

వ. శంఖదుందుభిప్రముఖవాద్యధ్వనులు మ్రోయించిరి. తుంబురుప్రముఖగంధర్వపతులు హరిం బాడిరి. గోవర్ధనాచలంబు నుద్ధరించి గోధనంబు గోపగణంబులం గాపాడి శ్రీకృష్ణుండు తనయం దనురక్తులగు గోపకులు నలుఁగడలఁ గొలిచి రాఁగా బలదేవుం గూడి వ్రజంబున కరిగె. ఇట్టి యమానుషకృత్యంబుల నొనరించిన శ్రీహరిచరితంబులఁ బాటలుగా బాడుచు గోపాంగనామణు లమ్ముకుందుని హృదయారవిందంబుల నిడుకొని స్మరించుచు మందకుం జనిరి. ౩౩ 1575



## ఇరువదియాఱవయధ్యాయము.

### గోపాలకులు శ్రీకృష్ణుని మహిమముల కచ్చెరువందుట.

క. అరుదుగ శ్రీకృష్ణునిదౌ, చరితంబును దెలియఁజెప్పి జనపతికి మునీ
శ్వరుఁడు శుకయోగి యవ్వలి, చరితం బిటు చెప్పఁబూనెఁ జంచద్భక్తిన్.

చ. సరసిజనేత్రుఁ డిక్కరణి క్ష్మాధర మెత్తుట లోనుగా మహో
త్తరసురకృత్యముల్ గనుచుఁ దన్మహిమం బిల నప్రమేయమై
పరమపవిత్రమై తనరుపద్ధతి సుంత యెఱుంగఁ జాలక
చ్చెరువడి నందుసన్నిధికిఁ జేరి వచించిరి గోపనాయకా! ౧ 1577

చ. హరి కన బాలకుండు కద । యాతఁ డొనర్చెడుగ్రకృత్యముల్ మనో
హరములు చాలనద్భుతము । లౌ; నతఁ డివ్విధి గోకులంబునన్
ధరణి జనించుటొప్పదు గదా యెటు గ్రామ్యుల యింటఁబుట్టెనో?
పరమవిచిత్ర మిద్ది; మన । బాలుని యీ డిపు డెన్ని చూచినన్. ౨ 1578

ఆ. సప్తవత్సరములె । సామజ మంబుజం, బెత్తు కరణిఁ బర్వతేంద్ర మెుక్క
కరముచేత నెత్తి । కడులీలగాఁ దాల్పెఁ, గలిగె నిట్టివింత । గలదె యెందు? ౩

సీ. కనులు విప్పఁగలేని । కసుగందుగానున్న యప్పుడే గురుబలం । బొప్పమించు
నట్టిపూతన యంక । మందుండి చనుపాలు ప్రాణాళితో శరీరంపువయసుఁ
గాలుండు హరియించు । కరణిఁ బీల్చెనుగదా; మూఁడుమాసంబుల । యీడునందె
శకటంబుక్రిందను । శయనించి తానుండి పయిఁబడవచ్చిన । బండినట్టి

తే. యేడ్చుచుం గాలఁ దన్నంగ । నిద్ధపాద
హతికి నాబండి తలక్రిందు । లగుచుఁ గ్రిందఁ
బడుచుఁ గూలెను; వత్సర । ప్రాయ మలరు
తఱిని గ్రిందను గూర్చుండ । దనుజుఁ డొకఁడు. ౪ 1580

క. త్వరపడుచుఁ దృణావర్తుఁడు, హరినిఁ గ్రహియించి యెగసె । నంబరమున కా
సురవైరి గళగ్రహమునఁ, బరిమార్చెం; గ్రిందఁబడియె । వాఁడు మృతుండై. ౫

మ. నవనీతంబును దొంగిలించె నని యానాఁ డాగ్రహం బొప్ప మా
తవరాత్మప్రభవుం గఠోరవిధిమైఁ । బా ఱోలఁ గట్టంగ నొ
క్కవడిన్ దానిని నీడ్చుకొంచుఁ జని యుత్కంఠన్ మనోజ్ఞార్జునా
ఖ్యవరక్ష్మారుహయుగ్మ మధ్యమున వేడ్కంజేర్చి బల్ పూనికన్. ౬ 1582

క. కరముల బలిమిని లాగుచు, ధరఁ గూల్చెన్ వృక్షములను; । దనకుం బ్రియసో
దరుఁడగు రామునితో వని, కరిగి వయస్యాళి గొల్వ । హరి యందొకచోన్.

క. ధేనువులను వత్సములను, దా నొగి మేపుచును నందుఁ । దన్నుం జంపం
గా నేగుదెంచిన బకుని, దానవవరుఁ గరయుగమున । దర్పముపొంగన్. ౭

ఆ. మోము వ్రయ్యలగుచు । భూమిని గూలంగ, విసరివైచి చంపె; । వింతమీఱ
వత్సపంక్తియందు । వత్సరూపంబునఁ,జొచ్చి తన్నుఁ జంపు । నిచ్చ తనర. ౮

క. తిరుగుచు యత్నంబునఁ దనుఁ, బరికించెడు వత్సదనుజుఁ । బరిమార్చి కళే
బరమును దానిని వైచియె, ధరణిపయిన్ వెలఁగపండ్లఁ । దాఁ బడఁజేసెన్. ౯

క. బలదేవసహితుఁడై దో,ర్బలమున గర్దభసురారి । బంధుయుతముగాఁ
బొలియించి పరిణతఫలం,బుల రాజిలుతాళవనము । భోగ్యముఁజేసెన్. ౧౦

చ. బలమున నిస్సమానుఁడయి । భాసిలు నాబలదేవుచేత లో
కులకు మహోగ్రుఁడై వెలయు । క్రూరుఁ బ్రలంబుని మ్రగ్గఁజేసి యు

జ్జ్వలవనవహ్నినుండి వ్రజవాసుల గోవుల నుద్ధరించె; ని
స్తులభుజగేంద్రు దుర్విషమదుర్భయదాకృతిఁ గాళియున్ వడిన్. ౧౧

సీ. నిరుపమశక్తిచే నిర్జించి నిర్మదు నొనరించి హ్రదమున నుండనీక
పరగత్తగాఁజేసి పావనయమునను నిర్విషోదకయయి నెగడఁజేసె;
నీవ్రజంబుననున్న యెల్లరకున్ మాకు ననురాగ మీకృష్ణునందు వదలఁ
దరముగాకున్న దెక్కరణి నో? వ్రజనాథ! భవదాత్మజునకు మాపైని బ్రీతి

తే. జననమాదిగఁ గల్గె నీ సరణియెట్లొ?
యేడువత్సరముల బాలుఁ డేడ? శైల
వరము ధరియించు టది యేడ? వ్రజమహేంద్ర!
యిన్ని కారణములఁ జక్క నెన్ని చూడ. ౧౩౫ 1589

క. భవదాత్మజన్ము నం దొక్కవింత యనుమాన మొదవెఁ గా దన నెట్లో?
నవనింగల సాధారణు,లవంటివాఁ డితఁడు కాఁ గలండె తలఁపుమా! ౧౬ 1590

చ. అన విని నందుఁ డిట్లను మహామతులార! పురోహితుండు స
న్మునియును నైన గర్గుఁ డొకపాలిక నీసుతుఁగూర్చి పల్కె దా
నిని వినుఁ డంత మీమదుల నిల్చినశంక తొలంగు; నద్దియే
మనినఁ గుమారుఁ డీతఁడు మహాత్ముఁడు గానఁ గృతాదులం దొగిన్. ౧౭ 1591

సీ. తనువులు వేర్వేఱ ధరియించు నయ్యావి సితరక్తపీతవర్ణతనువులనఁ
బ్రఖ్యాతిఁగాంచు నిప్పట్టునఁ గృష్ణతఁ గనియున్న వాఁ డనియును మును పితఁ
డల వసుదేవున కాత్మజుండయి యొకచోట జన్మించె నంచును, గనుకనె
నిట్టిశ్రీమంతుని నెల్లపెద్దలు వాసుదేవుఁ డంచు వచింత్రు గావున భవ

ఆ. దాత్మజునకుఁ బెక్కు లాహ్వయంబులు గుణ
కర్మములను ననువుగాఁ జెలంగు
ననియు, నవ్వి యెఱుఁగుదును నేనె తక్కిన
జనులు తెలియఁజాల రనియుఁ దెల్పె. ౧౮ 1592

క. గోపకులకు గోవులకున్, నీపట్టి యితం డొసంగు నెఱి సంతోషం
బేపారుశ్రేయమును నిక, నాపదలం దాఁటువార లందఱు మీరల్. ౧౮౯

తే. మును పరాజకమైన దస్యునికరంబు
సాధువులఁబట్టి బాధింపఁ జక్రి యితఁడె
సాయ మొనరించి రక్షింప సబలు లగుచు
వారి గెల్చిరి చువ్వె యో వ్రజమహేంద్ర! ౨౦ 1594

తే. ఏమహాభాగు లితనిపై నెలమిఁ గాంతు
రామనుష్యుల విష్ణుపక్షానుసారు

లను మహాసురులుం బోలె ౯ వనట నొందఁ
జేయఁజాలదు శత్రురాజి యెట్టులైన. ౨౧ 1595

సీ. వ్రజనాథ! యీకుమారవరుండు గుణకీర్తులను బ్రభావంబున ౯ లక్ష్మివరయ
నారాయణసముండు ౯ శ్రీరమ్యుఁడనియును గావున నితనివౌ ౯ కర్మములకు
విస్మయంపడరాదు ౯ వింతగనే తోఁచుఁ గర్మంబు లనుచును ౯ గర్గమౌని
తెలియఁగాఁజెప్పి స్వధిష్ణ్యంబునకుఁ బోయె నంతనుండియు నాత్మయందు నాత్రి

తే. తులకుఁ గష్టంబు నించుకేఁగలుగ నీని, కృష్ణు నారాయణాంశంబయే యటంచుఁ
దలఁచుచున్నాఁడ; నని గర్గపలుకులను వచించు నందునిమాటలఁ ౯ జేరివినుచు.

చ. హరి వగుసత్ప్రభావముల ౯ నన్ని తెఱంగుల నాలకించియున్
గర మనురాగమొప్పనటు కాంచియు నుండుట విస్మయం బదే
కరణిని గాంచ కాత్మల నికామముదంబును గాంచి నందునిన్
బరమదయాకరున్ హరిని ౯ భద్రవచస్సుల సంస్తుతించుచున్. ౨౨ 1597

చ. తనదుమఖంబు సాగమికి ౯ దారుణకోపమునేగ నుగ్రుఁడై
యనిమిషనాయకుండు వ్రజమందు మహాత్తరవృష్టిఁ బర్వున
ట్లొనరుప నశ్మసంతతులు ౯ నుగ్రతరాశనులున్ మహానిలం
బును బెనువృష్టియున్ గదుర ౯ భూరిభయంబును గాంచి మందలోన్. ౨౪

క. బాలకులును ధేనువులున్, స్త్రీలు మహార్తిని మునుంగ ౯ జిష్ణుకృతికి న్నై
లోలోన నవ్వుకొనుచున్, బాలుండుగ నుండి కరుణ ౯ వర్ధిలుచుండన్. ౨౫

క. గిరి నుచ్ఛిలీంధ్ర మర్భకుఁ, డరుదుగ నెత్తునటు లొక్కహస్తాగ్రమునన్
ధరియించి గోకులంబును, బరిరక్షించుచు నమర్త్యపతి గర్వంబున్. ౨౬ 1600

తే. మిగులకుండ నడంచియె ౯ మించినట్టి, గోత్రతీశ్వరుఁ డాహరి ౯ గోపబాల
కావృతుఁడుసుప్రసన్నాత్ముఁడౌను గాక, మాకుసతతంబువరదుఁడౌగాక! మిగుల.



## ఇరువదియేడవయధ్యాయము.

ఇంద్రుఁడు కామధేనువు శ్రీకృష్ణునకు నభిషేకముచేయుట.

సీ. గోవర్ధనాహ్వయకుధరవరం బెత్తి గురువృష్టినుండి గోకులముఁ గాచి
హరియొప్పునట్టి యర్యాదనున గోలోకముననుండి యరుగుదెంచిన మహోత్త
మాకృతిఁ దగినట్టి ౯ యాకామధేనువుఁగూడి యింద్రుఁడు కృష్ణుఁ ౯ జూడవచ్చి
యేకాంతమున నున్న యిందీవరాక్షునిఁ జేరంగఁబోయి తాఁ ౯ జేసినట్టి

తే. తప్పునకు లజ్జితుండయి ౯ తపనుదీప్తివలె మెఱయుచున్న మకుటంబు ౯ వాసుదేవు
చరణసరసిజములు సోఁక ౯ సాగిలఁబడి, మ్రొక్కె; నీరీతి శతమన్యుఁ ౯ డుక్కు దక్కి

క. గురుతేజుఁడైన యాశ్రీ,హరి యనుభావంబు మున్నెయంతయు విని యి[క్కొ...]

_త్తరుణమునఁ గనియు నుండుటఁ, బరమేశ్వరుఁ డనితలంచి పంతము సడలన్. ౨౪

తే. మూఁడులోకంబులకుఁ దాఁ బ్రభుండ ననెడు
గర్వ మెచటికిఁ బోవంగఁ గరయుగంబు
మోడ్చి యిట్లని పలికె నోభూతనాథ
తావకంబగు రూపంబు పావనంబు. ౩ 1604

క. పరిశుద్ధసత్త్వమయమై, నిరుపమ మేకంబు నగుచు నిర్మలమై ధ్వ
స్తరజస్తమమై సర్వము, నరయంగాఁ జాలి వెలయు ననుపమ మగుచున్. ౩౪

సీ. పరఁగ నజ్ఞానానుబంధమై సత్త్వాదికగుణకార్యప్రవాహగతి నొప్పు
సంసారమును, దీనిసరణి శరీరసంగ్రహణకారణభూతకర్మసముద
యానుబంధమును నీకరయఁగాఁ గలుగవు; భవమె లేదన్నఁ దద్భవకృతంబు
లైన లోభాదులు హరిహయపూజితా! కలుగవు నీ కని పలుకనేల?

తే. యట్టులైనను నీవు ధర్మాభిరక్షణార్థమును దుష్టజనశిక్షణార్థమును ధ
రింతు దండంబు నోభగవంత! లోకములకుఁ దండ్రివి గురుఁడవు జలజనయన!

క. నీవె నియంతవు గర్వం, బేవిధిఁ బూనినను వారినెల్లర నడఁపం
గా వారిజాక్ష! దండము, నీ వూనుదు నిన్ను మీఱ నెటు శక్యమగున్. ౪

క. కాలము నెఱింగియే దుశ్శీలుర నిర్జింప నట్టి చేకొందువుగా
లీలావతారముల; జగ, మేలుదు మనుగర్వ మూను నెల్లర మమ్మున్. ౪౪

క. పరికించి దండమున భీకరుఁడవుగాఁ గానఁబడుచు గర్వ మడఁతు వో
సరసిజనయనా! నీదగు, చరిత మ్మద్భుతము నీదుసంకల్పంబున్. ౫ 1609

సీ. మాదృశుల్ జగదీశమాను లజ్ఞులు నిన్ను నర్హ్యకాలమున భయంకరమగు
దండంబు నీవాగి ధరియించియుండుట గనుఁగొని జగదీశతను గలిగిన
మదమును వేవేగ మాని గర్వమువీడి యార్యమార్గం బగునట్టి భక్తిఁ
గాంతురు నీదు సంకల్పమే దుష్టదండన మగుఁజుము; స్వర్గమున కధిపతి

తే. ననుమద మ్మానరింప మహాపరాధ
మొనరిచితి నీప్రభావంబు గనఁగ నైతి
మూఢమతినైతి నీ నన్ను మురహర! దయ
వెలయ మన్నింపు దుర్బుద్ధి గలుగకుండ. ౭ 1610

క. పరమేశ! నిగ్రహింపఁగ, నరుడుగఁ గృపఁజూపి కావ నర్హుఁడ వీవే
మరలం గుబుద్ధి యిట్టిది, పరఁగకయుండంగఁ గావు పద్మదళాక్షా! ౭ 1611

వ. అధోక్షజా! భూమికి భారమును గల్పించుచుఁ దమయంత దానికిభారమై యుండు చమూపతుల దండించుటకు నీపాదారవిందసేవకు లభివృద్ధిఁ గాంచునట్లొనరించుటకు నీవవతరించితివి. షడ్గుణైశ్వర్యసంపన్నుఁడవై సర్వాంతర్యామివై

యపరిచ్ఛిన్నుఁడవై సర్వజగన్నివాసుఁడవై సాత్వతు లనఁబడుయాదవులకుఁ
బ్రభుఁడవై యవతరించినశ్రీకృష్ణునకు నీకు నమస్కారములు. ౧౦ 1612

తే. భక్తులెట్లు వాంఛింతురో ⸗ వారి కనుగు
ణమగు దేహంబు ధరియించి ⸗ విమలమైన
జ్ఞానమే యాకృతిగఁ దాల్చి ⸗ సర్వమునకు
నాత్మయయి సర్వకారణం ⸗ బగుచు నొప్పి. ౧౧ 1613

తే. సర్వభూతాత్ముఁడవగుచుఁ ⸗ జక్రధరుఁడ,వైన నీకు వందనములు;⸗మాననీయ
చరిత! భగవంత! నాదు యజ్ఞంబు విహత,మగుట కోర్వక తీవ్రకోపాకులమతి

ఉ. నీవు వసించుగోకులము ⸗ నేఁడె వినాశముచేయఁగోరి మే
ఘావళి వాయువుం బిలిచి ⸗ యద్భుతవృష్టిని నోరగాలినిన్
జేవ గనంగఁ జేయఁదగుఁ ⸗ జెచ్చెఱ నంచును బ్రోత్సహించితిన్
దేవవిభుత్వగర్వమున ⸗ దివ్యభవన్మహిమం బెఱుంగమిన్. ౧౨ 1615

క. ఐనను దేవా! నాయ,జ్ఞానకృతాగసము నెల్ల ⸗ సైఁచి గరువమున్
బోనడఁచి యనుగ్రహమున్, గానఁ బడం జేసితివి విగర్వుఁడ నైతన్. ౧౨౫

క. నాయుద్యమ మిసుమంతయు, నీయెడ ఫలియింపదయ్యె ⸗ నీశ్వరు నాత్మం
దైె యలరు నిన్ను గురునిన్, మాయాతీతుని భజింతు ⸗ మది దృఢభక్తిన్. ౧౩

క. అని తెలిపి శుకుం డిట్లను, జనవర! శతమన్యుఁ డిట్లు ⸗ సంకీర్తనముం
బొనరింపఁగ భగవంతుఁడు, వనజాక్షుఁడు ఘనగభీర⸗వాక్కు లలరఁగన్. ౧౪

క. ఆననమున స్మిత మొప్పఁగ, నీనియతి వచించె; నిర్జ⸗రేశ్వర! యింద్ర
శ్రీనిరవధికాహంకృతి, నూని మదించితివి గాన ⸗ నొగి మత్కరుణన్. ౧౪౫

చ. అనవరతంబు నిన్నును గృ⸗తార్థుని జేయఁగఁగోరి సన్నెదన్
మననముచేయు నూహతగు⸗మాడ్కిని గల్గఁగఁజేయ నధ్వరం
బునకు మహాంతరాయమును ⸗ బూని యొనర్చితి; లోకమందునన్
జనుఁ డురుసంపదంధుఁడయి ⸗ చక్కనిశ్రీ తగియుంట మత్తుఁడై. ౧౫౫ 1620

తే. దుర్జనుల నొంప దండంబు⸗తోఁ జెలంగు
పాణి గలనన్నుఁ గనకుండు ⸗ భావమందు
నెవ్వని ననుగ్రహింపంగ ⸗ నెంతు నతని
సంపదలనుండి తొలఁగింతు ⸗ సత్య మిద్ది. ౧౬ 1621

చ చనుమిఁక నింద్ర! భద్రమగుఁ ⸗ జక్కఁగ నాకగుశాసనంబు మీ
రొనరుచుచుండుఁ డెల్లరు మ⸗హోత్తరవృత్తిని బూని యెవ్వ రే
పనినొనరింప నిల్చితిరొ ⸗ పాయక నాయధికారమందె ని
ల్వనుదగు గర్వమున్ వదలి ⸗ భవ్యసుఖంబులు గల్గుచుండెడున్. ౧౭ 1622

సీ. అనిపల్కుచుండంగ నంత మనస్వినియగు కామధేను వాత్యంతభక్తిఁ
దనసంతతింగూడి వనజాక్షునకు గోపతనుధారియగు నీశ్వరునకు మ్రొక్కి
వినుతించె నిట్లని విశ్వేశ! శ్రీకృష్ణ! శ్రీకృష్ణ! యోగీంద్రసేవితాంఘ్రి
పంకరుహ! విశ్వభావనా! లోకాధిపతివైన నీదగుప్రాపు గాంచి

తే. యొసఁగుట సనాథులమైతిమి మీవె పరమ
దైవతంబవు జగదీశ! నీవె మాకు
నింద్రుఁడవు గమ్ము; గోత్రిదివేశ! భూమి
సురులకును సాధువులకును శుభము లొదవ. ౨౦ 1623

క. ధరణీభర మడఁపఁగ నవతరించితి విశ్వరూప! ధాత్రనుమతిఁ
శిరసావహించి మేమీ,తరుణంబున మమ్ముఁగాచు దైవము నిన్నున్. ౨౧ 1624

ఆ. ఇంద్రునిగఁ దలంచి యెలమిమీఱఁగ నభి,షేకమహము విభవసిద్ధి కనుగు
ణముగ జరపుదు మని నారాయణుని గృష్ణు,వేఁడి ధేనువితతిఁగూడి యపుడు.

క. తనపయసుల నభిషేకిం,చెను దేవగణాధిపుండు సిరి వెలయఁగఁ గృ
ష్ణుని దేవమాతృకలచే, ననుమతుఁడై దేవమునివరాన్వితుఁ డగుచున్. ౨౨

సీ. ఐరావతగజేంద్రమాత్మకరంబున ధరియించి తెచ్చిన పరమపావ
నాకాశగంగామహాంభస్సులం దమి నభిషేకమొనరించి యాముహూర్త
ముననె గోవిందాఖ్య నొసరించె [దివిజులకే నింద్రుఁడను గద యాపు గోవు
లకు నింద్రుఁడవె గామైతోవిక లోకమున నిన్ను మనుజులుగోవిందుఁడనుచుఁ బాడు

తే. దురు హరీ! యంచుఁ బల్కె;] నుత్తరుణమందు
నరుగుదెంచిన తుంబురుఁ డమరమౌని
నారదుఁడు తక్కఁగల మునినాయకులును
సిద్ధచారణగంధర్వ లిద్ధమతులు. ౨౩ 1627

తే. మఱియు విద్యాధరులు లోకపులము నడఁచు
హరియశస్సును బాడిరి సురవనితలు
ముదము దళుకొత్త నాడి రింపొదవ దేవ
ముఖ్యులెన్నొ విధంబులఁ బొగడి మఱియు. ౨౪ 1628

క. అతివిస్మయకరపుష్ప, ప్రతతిఁ వర్షంబుగాఁగఁ బరమేశ్వరుపై
నతిముదమునఁ గురియించిరి, వితతసుఖం బొందియుండె విశ్వత్రయమున్.

క. వసుమతి ధేనుప్రతతి ప,యసు చేతం దడిపె; నంత ప్రోదిను లెన్నో
రసములతోఁ బాఱెను, వృ,క్షసమితి గురియించెఁ గుసుమకమ్రరసంబున్. ౨౬

సీ. శాలిప్రముఖ సర్వసస్యములు దున్నకయే ఫలించెను గొండ లెల్ల లోన
నుండిన మణుల బొగొప్పఁగఁ బ్రకటముగాఁ దాల్చి పొల్చె నికామరుచుల;

శ్రీకృష్ణుఁ డట్లభిషిక్తుఁడై తగఁ గ్రూరసత్త్వముల్ వైరంబు ॥ జాఱవిడిచి
యుండెను; శతమఖుఁ ॥ డొగి గోవులకు గోకులమునకు నాథుఁడై ॥ యమరవంద్యుఁ

తే. డైన గోవిందు నభిషిక్తుఁగా నొనర్చి
తదనుమతుఁ డయి దివిజసముదయపరివృ
తుఁడయి శ్రీహరిమహిమముఁ ॥ గడుఁ బొగడుచు
విస్మితుండయి చేరెను ॥ విబుధపురము. ౨౭ 1631

ఇరువదియొనిమిదవయధ్యాయము.

శ్రీహరి వరుణలోకమున నున్న నందుని గొనివచ్చుట.

చ. అని హరిచిత్రగాథల మహామునియౌ శుకయోగి తెల్పి యిం
కను వచియింపఁబూని యను ॥ క్ష్మావర! యవ్వలిగాథఁ దెల్పెదన్
విను మట గోకులంబునఁ బ్రవృద్ధమహత్త్వముమీఱఁ గృష్ణుఁ డొ
ప్ప నొకట నందుఁ డెంతయును ॥ భక్తిచెలంగ వ్రతంబుచేయఁగన్. 1632

తే. మదిఁ దలంచి యేకాదశి ॥ మహితనిష్ఠ
నుపవసించి జనార్దను ॥ నుద్యమమునఁ
బూజచేసి కలామాత్రముగనె యుండు
ద్వాదశిని గాంచి యయ్యది ॥ దాఁటకుండ. ౪ 1633

క. పారణచేయక యున్నన్, సారవ్రతలోప మనెడుశాస్త్ర మెఱుఁగుటన్
జేరెన్ స్నానముచేయం, గోరియె కాళిందికిఁ దవ్వరఁ ॥ గూరినమదితోన్. ౧

క. అరుణోదయమునకున్ మును, పరయఁగ స్నానంబుచేయుపద్ధతి లే దా
సురి యనఁబడు నావేళయుఁ,బరికింపఁ డతండు నంత ॥ వ్రతనిష్ఠ మెయిన్. ౧౪

చ. జలములఁ జొచ్చి మున్గుటయు ॥ శాస్త్రముమీఱి యతండు నానిశన్
సలిలములందుఁ జొచ్చె నని ॥ చయ్యన నొక్కసురారి యప్పతిం
గొలుచు నతండు నందుఁ గొని ॥ గొబ్బునఁ బోయెను బాశిచెంతకున్
జలముల మున్గినట్టి యలచక్రిపితం గనఁజాల కార్తులై. ౨ 1636

సీ. గోపాలకులు రామ శ్రీపతీ! శ్రీకృష్ణ! యనుచు నాక్రోశించి ॥ రంతహరియుఁ
దనతండ్రి వరుణాహ్వతునిగనాత్మ నెఱింగి వార లాక్రోశించుభంగి వినుచు
ధర్మైకపరులకుఁ ॥ దా నభయప్రదుం డగుఁగాన విభుఁడయి ॥ యలరుఁగాన
వరుణనికడ కేగెఁ; ॥ బశ్చిమదిక్పతి వరుణుఁడు తనయింటి ॥ కరుగుదెంచి

తే. నట్టి కృష్ణు హృషీకేశు ॥ నాదరమునఁ, బూజలం దన్పి దర్శనముగ్ మహోత్స
వముగ భావించి యీరీతిఁ ॥ బలికె; దేవ, సర్వలోకప్రభూ! సుదర్శనము వలన.

క. తనుధారణఫల మబ్బెను, గనఁగల్గితిఁ గాదె సర్వకాంక్షితముల నో
వనజాక్ష! భవత్పదసేవను జేసెడువారు ముక్తివసతులు సుమ్మీ! ౫౭ 1638

క. నిరతిశయైశ్వర్యంబునఁ, బరఁగుచుఁ బరమాత్మ వగుచు బ్రహ్మా మనంగాఁ
బరమేశుఁ డనఁగ నొప్పెదు, హరి! నీకుఁ బ్రణామ మేను నర్పింతుఁ దమిన్.

తే. లోకసృష్టిని గల్పించి ప్రాకటగతి, వెలయుమాయ నీయందును గలుగకుండు
నట్టిపరమాత్మునకు నీకు నంజలి యిదె, భృత్యుఁ డితఁడు రహితవివేకుఁ డగుట.

క. నాకడనుండియు నీతం, డేకార్యము చేయఁదగునొ యెఱుఁగఁడు; మూఢుం
డై కడఁగి నీదుజనకునిఁ, గైకొని యిటఁ జేర్చెఁ దప్పు క్షమియింపఁదగున్. ౭

క. [సకలమును జూచువాఁడవు, సకలేశుఁడ వీవు నన్ను సమధికకరుణం
బ్రకటించుదృష్టిఁ గావుము, సకలము నీదర్శనమునఁ జక్కఁ ఫలించున్.] 1642

క. జనకునెడ వత్సలత నీ, కనుపమమై యుండుఁగాన నబ్జాక్ష! భవ
జ్జనకుని గొని పొమ్మనుచున్, వినయంబున వేఁడె సర్వవిశ్వేశ్వరుఁడున్. ౮

చ. వరుణుఁడు తన్ను నీపగిదిఁ బ్రార్థనచేసి ప్రసన్నుఁ జేయఁగా
మరలి సమస్తబంధువులు మానసమోదమునొందఁ దండ్రితోఁ
బురమును జేరె; నందుఁడును బూర్వ మొకప్పుడు చూడనట్టి యా
వరుణుని భూరిభాగ్యమును బాగుగఁ గాంచియు నాస్థలంబునన్. ౯ 1644

క. తనసుతుఁ డగుశ్రీకృష్ణునిఁ, గని వారలుభక్తిఁ జూపి గావించిన సే
వను లోఁదలఁచియు విస్మయ,మునుగాంచి వచించె బంధుపూగంబునకున్. ౧౦

సీ. ఔత్సుక్యబుద్ధులై యాకృష్ణు నీశ్వరుఁ గాఁ దలంచుచు లోకగణవిభుఁడగు
నామహాత్ముఁడు తమ కాత్మీయమైనట్టి బ్రహ్మగతిని బ్రీతివర్ధిలంగఁ
గల్పించునొక్కొ? యొక్కరణినైన నటంచుఁ దలఁచుచుండఁగ సర్వదర్శనుండు
కావున వారిసంకల్ప మాత్మ నెఱింగి తన్మనోరథములు తగ ఫలింపఁ

తే. జేయఁగాఁ గృప దళ్కొత్త నీయనువునఁ
దలఁచె నప్పు; డవిద్య చేఁ గలుగుఁగామ
మదియు కారణముగఁ గర్మ మలవడు నిల
నదియు సుఖదుఃఖకారణమ్మయి చెలంగు. ౧౧ 1646

క. నానావిధజన్మము లొద్దొనఁ గలుగు నవియు నుచ్చతల్ నీచతనుం
గానంజను సురతిర్యఙ్మానుషదేహములుగల్గు మహి నొప్పారున్. ౧౩ 1647

తే. వానిగతులను దిరుగుచుఁ బ్రాణి యాత్మ
గతిని దెలియంగలేకుండు సత; మటంచుఁ
దలఁచి వారల సంకల్పములు ఫలింపఁ
జేయఁగా నెంచి కరుణాసింధువగుట. ౧౩ 1648

క. తనలోకముఁ గనఁబఱచెను, దనునమ్మిన గోపకులకుఁ దనరూపం బై
యనుపమమై తగు నయ్యది, ఘనశక్తిం జెలఁగువాఁడు గావునఁ గడిమిన్. ౧౪

క. ఆవరణ సంతతియంబునఁ, బావనతమమౌ సమాధి పటునిష్ఠఁ దప
శ్శ్రీవృద్ధిగన్న మునివరు, లేవిధమున దేనిఁ గాంతు రెలమి పొదలఁగన్. ౧౮

క. దేనన్ బాధింపంబడఁ, గానేరక యజడ మగుచుఁ గ్రాలి యనంతం
బై నిరతిశయం బగుతన, మానితతేజమున నిస్సమానం బగుచున్. ౧౯ 1651

తే. మఱి సనాతన మగుచుఁ దమఃపరంబు
నగుచు నయ్యాది వెలయు నాయ్యమలతనువుఁ
గనఁబఱచె; నిట్లు బ్రహ్మాత్మకమగు హ్రదము
నందు హరిచేఁ బ్రవేశితు లగుచు వారు. ౨౦ 1652

సీ. బ్రహ్మహ్రదంబునఁ బరిమగ్నులై హరి తమ్ముద్ధరింప నిరస్తంద్రు లగుచు
బ్రహ్మలోకమ్మును వైకుంఠనామముఁ గని; రందె యక్రూరుఁడును మునుహరి
కరుణచే మునిఁగి యక్కరణి బ్రహ్మపదంబుఁ గనియె; నాహ్రదమె యాల్లనదియం
నలరుహ్రదంబగు; నవ్విధి బ్రహ్మలోకమును నందాదులు గాంచిమించి [దు

తే. పరమమైన యానందంబు పర్వ మిగుల, నిర్వృతిఁగాంచి శ్రీకృష్ణు నిఖిలలోక
పతిని గోపాలతాపినీప్రముఖవినుతు, విస్మయంబుల వినుతించి వెలసి రెలమి.



ఇ రు వ ది తొ మ్మి ద వ య ధ్యా య ము.

రాసక్రీడామహిమము.

క. అరుదెంచె శరత్సమయము, సురుచిరమల్లికలు పూచి శోభిల్లె విభా
వరు లత్తరుణమున మనో,హరముగఁ బొలుపారుచుండె నప్పుడు హరియున్. ౧

*చ. మును పల గోపికాతతికిఁ బూన్కి నొసంగినమాట చెల్లున
ట్లనువుగఁ జేయనెంచి నిశలందు సరోజము లొప్పఁబూచి య
వ్వనముననుంట దానిదగు భాగ్యము సార్థకమౌ తెఱంగునన్
వనితల స్వీయపాదయుగభక్తియుతాత్మలఁ గూడి వేడుకన్. ౨ [గతిఁ

తే. తనను సేవింపఁ జేయంగఁ దగినయట్టి, మాయఁ జక్కఁగ గ్రహియించి మానిత
క్రీడలం దేలుమనసు ధరించెఁ దనదు, షడ్గుణైశ్వర్యసంపత్తి చక్కఁ దెలియ.

సీ. భగవంతుఁ డిట్టు లప్పట్టున విహరింపఁ దలఁచు కాలంబునఁ దల్ప్రియార్థ
ముడురాజు పూర్వదిగ్యువతీముఖంబున నతిసుఖకరము లై నట్టికరము
లనుదయరాగంబు లలిఁబూయుచున్ జిరకాలంబు గనఁబడకయె మఱొక్క
తావుననుండి యత్తఱి వచ్చినప్రియుండు ప్రేయసినెమ్మోముఁ బ్రీతిమెఱయఁ

* "భగవానపితారాత్రీశ్శరదోత్ఫుల్లమల్లికాః, వీక్ష్యరంతుంమనశ్చక్రే యోగమాయాముపాశ్రితః" అని మూలము. దీనివ్యాఖ్యానసారమే యిందుఁగలదు.

తే. గుంకుమపుఁబూఁతచే సొంపుఁ గూర్పఁ జేయు
నట్టు లోషధులకు మనుష్యవ్రజమున
కమరినట్టి తాపగ్లాని నపనయించు
చు నుదితుండయి చెలఁగెను సొంపుమించ. ౨ 1657

క. సురుచిర నవకుంకుమమున, నరుణంబయి తనరునారమానన మక్లే
యరుణమ్మఖండమండల, పరిశోభితము నగుశీతభానుని గనుచున్. ౨½ 1658

క. వన మది తత్కోమలకాంతినికర పరిరంజితమయి దీపింపఁగ వా
మనయనలకెల్ల మంజుల, మనుపమ మతిమధురము నగునటు హరిపాడెన్. ౩

చ. *మనుజవరేణ్య! యిందుఁగల మాధవుభావ మెఱుంగు టొప్పు నా
వనితలు సంతసించునటు వామనమూర్తి పరాత్పరుండు త
న్మనములఁ గామరాజమను మానితబీజము నాఁటె వేణునా
దనియతి దేశికుండువలెఁ దాపము లంతమునొందు నట్లుగన్. ౩ 1660

మ. కలగీతం బది శ్రోత్రరంధ్రముల మార్గంబుల్ వడిం జొచ్చి ని
స్తులచిత్తంబున నెల్లెడం బొదలఁ దోడ్తో నాపరంధాము ను
జ్జ్వలరూపంబును గాంచు కామ మది సంవర్ధిల్లఁగా గోపికా
జలజాతేక్షణ లచ్యుతాహృతమనస్కల్ గాన నాత్రంబునన్. ౩½ 1661

మ. హరినిం జూడఁగఁగోరి తా రరుగు నాయత్నంబు సుంతైన నొ
క్కరికిం దోఁపకయుండఁ బొంచు మనఃకాంతుం దమిం గాంచుత
త్పరతల్ బర్విడి కుండలంబులు నటింపన్ గృష్ణునావాసముం
దరియం జొచ్చిరి కృష్ణదర్శనజమోదం బొందఁగాఁ గోరుచున్. ౪ 1662

సీ. కలగీతముల్ విని జలజాక్షు లొకకొంద ఱత్తఱిఁ బిదుకుపయస్సు లట్టె
వదలిపోయిరి; కొంద ఱడిసఱకే పిండినట్టిపాలను బ్రొయ్యియందుఁ బెట్టి
యవి గ్రాఁగునంతకు నటనుండఁజాలక పరుగిడి; రెందఱో భామిను లటు
గోధూమకణములఁ గోర్కి నన్నము వండుచును దాని దింపక చనిరి; యట్లె

తే. మఱియు నొకకొంద ఱంగనల్ మగలు భుక్తి
కొఱకుఁ గూర్చుండ వారికిఁ గొదువపడక
యుండ వడ్డింపకయె పోయి; రురుజవమున
గానసంశ్రవణంబునఁ గార్యవిరతి. ౫ 1663

క. పాలను ద్రావెడు వేళల, బాలకులను వదలి యట్టె పర్విడి రెలమిన్
లీలామానుషుఁ జూడఁగ, నాలస్యము చేయనేల యను నూహలచేన్. ౫½

---

* ఈపద్యము భావార్థదీపికావ్యాఖ్యానానుసారముఁ వ్రాయఁబడినది. "వనంచతత్కోమలగోభి రంజితం జగౌ కలం వామదృశాం మనోహరం" అని మూలము.

క. పరిచర్య చేయుచుఁ దమ,వరులను దిగనాడి చనిరి ః వనితలు; మఱియున్
దరుణులు తినునన్నము విడి, పరుగిడి రాకృష్ణగానఃపరవశ లగుచున్. ౬ 1665

క. మైపూఁత పూయుకొందఱు, గోపిక లాపనిని మాని ః కోరికమీఱన్
శ్రీపతిఁ గనఁ బోయిరి; మఱి, యాపడఁతులు కొంద ఱట్టె ః యాతుర లగుచున్.

చ. జలకము లాడుచుండి తమఃస్వాంతము లాహరిఁగానఁ గోర ని
మ్ముల నదిమాని పోయిరి; ప్రఃభూతముదంబునఁ గొంద ఱంగనా
తిలకము లంజనం బిడుచు ః దృష్టులఁ జక్క నలంకరించుటల్
తలఁపక యట్టెపోయిరి; నిఃతంబిను లింకను గొంద ఱాదృతిన్. ౭ 1667

క. ధరియించు నంబరంబుల, నరయక వ్యత్యస్తరీతి ః నటఁదాల్చియు నా
భరణములఁ దాఱుమాఱుగ, ధరించియుం బోయి రచ్యుఃతప్రభుఁ గనఁగన్. ౭

చ. పతులును దండ్రులున్ సహజఃబంధుజనంబులు పోవరా దటం
చతిశయమైన శ్రద్ధఁ గొని ః యత్తఱి నెంతఁగ నిల్పినన్ మనో
గతుల సరోజనేత్రుఁ డటుఃగాఢతరం బగుశక్తి లాగ మో
హితలయి యాపడంతులు మఃఱేమియుఁ బల్కక నిల్వ కేగినన్. ౮ 1669

ఉ. సుందరు లింకఁ గొంద ఱలఃసూనశరాసనుతండ్రిఁ జూడఁ బో
వం దగ దంచు లోనఁదగుఃవస్త్వములన్ నిలుపంగ డెందముల్
కుందు గనంగ నుండియు ముఃకుందుని భావన చేయువారె కా
నం దమకప్పు డడ్డపడుఃనాథుల మీఱఁగ రామి భక్తిమై. ౧౪ 1670

ఉ. కన్నులు మూసికొంచు హరిఁ ః గాంచనచేలుని గృష్ణమూర్తి నా
పన్నశరణ్యు ధ్యానమున ః భావన చేయుచు నట్లెయుండి; రా
కన్నియ లాపరాత్పరునిఁ ః గానమిఁ గల్గినదుస్సహవ్యథన్
గ్రన్ననఁ బాపజాలము విఃశావికలై చన వార లాదృతిన్. ౯౪ 1671

క. ధ్యానప్రాప్తాచ్యుత గురు, మానితరూపంబు నెంతొ ః మమత వెలయఁగా
మానసపీఠిన్ నిల్పుచు, శ్రీనిలయంబొట దానిఁ ః జెందినపూన్కిన్. ౧౦ 1672

ఆ. కౌఁగిలించుకొనుచు ః గాఢతరానంద, మనుభవించి దాన ః నఖిలపుణ్య
ములును క్షీణతఁ గన ః వెలఁదులు ప్రారబ్ధ, పుణ్యపాపబంధఃములు నశింప. ౧౦౪

సీ. *పాపనాశకు విష్ణుఁ ః బరమాత్మునుంగూడి దాన నేగుణమయం ః బైన దేహ
మును బాసి రప్పుడే; ః యని శుకయోగీంద్రుఁ డనువదించిన విని ః యవనివిభుఁడు
యోగీశ్వరా! పురుషోత్తము గోపిక లాశ్చర్యకరసుగుఃణాభిరాముఁ
గాంతునిగా. మదిఁ ః గామించిరే కాని బ్రహ్మమేయనికాదు ః వార లిట్లు
ఆ. గుణమయమగు బుద్ధిఁగూడినందున నెట్లు, లాగుణప్రవాహ ః మంతరించె

* "తమేవ పరమాత్మానం జారబుద్ధ్యాపిసంగతాః" "జారః పాపపతిః" అని త్రికాండశేషము.

సంశయంబుఁ బాపఁగఁజను నాకు నని వేఁడ, మౌనివర్యుఁ డనియె మానవేంద్ర!

క. ఈనీప్రశ్నమునకు ము, న్నేను వచించితిని గాదె యెట్లనఁ జైద్యుం
డానళినాక్షుని రిపుఁగాఁ, దా నెంచియె సిద్ధిఁ గనెఁ గద యనఁగ వినవే. ౧౦ 1675

క. పగఁగొన్నవారె ముక్తికిఁ, దగియుండఁగ హరికి నెన్నఁదగురీతిఁ బ్రియం
బుగఁ గొల్చువారు ముక్తికిఁ, దగరే? యూహింపు మింత ధన్యుఁడవగుటన్.

క. మనసునకున్ మఱి వాక్కునకు నగోచరుఁ డవ్యయుండు గుణరహితుండున్
వినుతగుణాత్మకుఁడును నగు, వనజాక్షుఁడు లోకమందు వ్యక్తుఁ డగుటయున్.

క. నరులకు నిశ్శ్రేయసములఁ, గరమరుదుగఁ గల్గఁజేయఁ గాక మహేశా
ర్యరతిం గాదుకదా యవతరించు టున్నంగ భక్తతతికోసరమే. ౧౩ 1678

క. [1]కనుకం గామమొ క్రోధమొ, యనవరతపు భక్తియో భయంబో స్నేహం
బనునదియో యైక్యంబో, వనజాక్షునియందు నెఱపువారలు ధన్యుల్. ౧౪

తే. మఱియుఁ దన్మయులగుదురు మాటలేల?
షడ్గుణైశ్వర్యయుక్తుఁ డై జన్మరహితుఁ
డగుచు యోగీశ్వరేశ్వరుం డయి చెలంగు
కృష్ణువిషయంబునం దిది యేమి వింత? ౧౫ 1680

క. స్థావరజంగమములకున్, శ్రీవిష్ణుని ముక్తినొసఁగుఁ జెప్పఁగ నేలా?
యావాసుదేవునం దిది, యేవరుసం జెల్లు ననుచు నింకన్ వినుమా! ౧౬ 1681

ఉ. మాటలయందు నేర్పుగల మానిసులందు జగంబునందుఁ దా
మేటియు గానఁ దన్నుఁగన మించిన వేడుక వచ్చియున్న యా
బోటులఁ గాంచుచున్ మధురముగ్ధవచస్సుల మోహమొందఁగా
గాటపుశక్తిఁ జేయుచును గాంచనచేలుఁడు పల్కె నివ్విధిన్. ౧౭ 1682

ఉ. మంచి యదృష్టమొప్పఁ దగు మానిసులార! సుభాగతంబె? కా
వించు ప్రియంబు గల్గునొకొ! విందుము చేయుదు మల్లగోకులం
బంచితవాసమై యలర హాయిగనుందురె యెల్లవార; లే
మెంచుచు వచ్చినార లిట నేము నసింపఁగఁ జెప్పుఁ డింపుగన్? ౧౮ 1683

చ. [2]ఇది యిపు ఘోరరూపయగు నిందు మహత్తరఘోరజంతువుల్
పొదలెడుఁ గాంతలార! యిఁకఁబోందు వ్రజంబున; కీస్థలంబునం
దువిదలు నిల్వరాదు; కన సుగ్రముగాఁ దగువేళ గావునం
బదపడి మూఁడఁగాఁ దగును భావములం గలకార్యజాలముల్. ౧౯ 1684

1 "కామంక్రోధంభయంస్నేహ మైక్యంసౌహృదమేవచ, నిత్యం హరౌవిదధతో యాంతితన్మయతాంహితే" అని మూలము. 2 "రజన్యేషాఘోరరూపా ఘోరసత్వనిషేవితా, ప్రతియాతవ్రజం నేహ స్థేయం స్త్రీభిస్సుమధ్యమాః" అనిమూలము.

చ. జనములుఁ దండ్రులున్ సుతులు సాధుమతుల్ పతు లన్నదమ్ము లో
వనరుహనేత్రలార! యిట వచ్చిన మీగతి గానలేక చిం
తను బరికించుచుందురు గదా? తగుబంధుల కెప్పుడే భయం
బును గలిగింపకుండుఁ డది పోలని కార్యముగాదె చూడఁగన్. ౨౦ 1685

మ. అనిపల్కన్ విని వార లించుక సరోజాక్షోక్తు లాలింప కో
యన్నఁ బ్రేమాగ్రహమూని నల్లడల లీలాక్షుంబులం బర్వఁజే
య నిటంపాధిపవందుఁ డెంచి యను నోయబ్జాక్షులారా! వనం
బును దర్శించితిరే కదా కుసుమితంబున్ జక్కఁగా నిత్తఱిన్. ౨౦౪ 1686

సీ. కుసుమదంభంబున నెసఁగు వేడుక మిమ్ముఁ బరిహసించెదుఁజుఁడీ వన మనఁగ
వారలు తమదృష్టి వారంబు మరలించి యాకసంబున నిల్ప హరియు వారి
కిట్లని పల్కె; రాకేశుండు వనమందుఁ దనకిరణంబులఁ దమి చెలంగ
వ్యాపింపఁగాఁజేసి యీపాటికార్యము మీరొనర్చితిరని మించుబోఁడు

తే. లార! పరిహాస మొనరించుఁ గోరి; యనఁగ
వారు యమునను దృష్టులఁ బర్వఁజేయఁ
గని మఱియుఁ బల్కె యమునయుఁ గమ్రపవన
చలితతీరావనీరుట్కె సలయ వితతి. ౨౧ 1687

క. పరిహాస మొప్పఁ జేసెదుఁ, దరుణీమణులార! యనుచుఁ దామరసాక్షుం
డరయఁగ వారిమనంబులఁ, బరిహాసముగా వచించి పలికెన్ మఱియున్. ౨౧

క. సతులార! వనము గంటిరి, జతనముమీఱంగఁ బొందు సదనంబులకున్
బతులకు శుశ్రూషల సన్మతిఁ జేయుఁడు శాస్త్రవిహితమర్యాద యిదో. ౨౧౪

క. బాలకు లేడ్చుచు నుందురు, పాలీయం దగును వత్సపటల మఱచుఁగా
నాలను బిదుకుం డయ్యవి, పాలెంతయుఁ దృష్టిఁ ద్రావి పర్విడుఁజుండీ! ౨౨

చ. అనుటయు గోపికల్ మిగుల నాతురతం గనుదృష్టు లొప్పఁగాఁ
దనుఁ గనుఁగొంచి యి ట్లనియెఁ దామరసాయతనేత్రలార! మీ
మనములు నాపయిం గలుగు మక్కువచేతనె యంత్రితంబులై
తనరునయేని ప్రీతిమెయి దానికి నన్గనవచ్చు టొప్పుఁగా. ౨౨౪ 1691

చ. ననుఁ గనవచ్చు టెంతయును న్యాయమె యేలన సర్వమందు నేఁ
గనఁబడుచుందు నాపయిని గాఢముదంబును బొందుజంతువుల్
కనుకనె; మీకు నాయెడలఁ గల్గినప్రీతియు యుక్తమే యగున్
గనఁబడ దానిఁజేసితిరి క్రమ్మఱి పొం డిఁక గోష్ఠసీమకున్. ౨౩ 1692

మ. పరమేశుం డిటుపల్కె శాస్త్రహితముం బాటించుచుం బల్కె నీ
ధరణిన్ నిష్కపటంబుగా సుదతు లాత్మస్వామికిన్ బ్రీతిమైఁ

బరిచర్యల్ సలుపం దగున్ విహితమై । భాసిల్లు సద్ధర్మ మి
క్కరణిం బోల్చు నటంచు శాస్త్రములు వక్కాణించెడుం గంటిరే? ౨౩౧

తే. పరమకల్యాణులార! తోడ్బంధువులకుఁ
బ్రియము గూర్చుట మేలగు । బిడ్డలను గ
నికర మొప్పఁ గాపాడుట । నీతి మఱియు
ధర్మసూక్ష్మములను వినఁ । దగును మీకు ౨౪   1694

సీ. [1]కలహించు టాదిగాఁ । గల్గినదుర్గుణములు గలవాఁడైన । లలితరూప
విరహితుఁడైన నిర్వీర్యుఁడైనను వృద్ధుఁడైనను గార్య మెయ్యది యకార్య
మగు నిదంచు నెఱుంగనట్టివాఁడైనను భగ్నాంగుఁడైన నల్పతనుఁడైన
నిస్స్వుఁడైనను స్వర్గనిత్యసుఖంబులఁ బడయఁగోరినయట్టి । పడఁతి పతిని

తే. విడువఁగా రాదు; పతితుఁడైన । పుడమియందు
నిందఁబొందెడు భర్తను । నీతిదూరుఁ
డగుట విడనంగఁ జనుఁగాని । యట్లుగాని
పతిని విడువంగ రాద దేయతివకైన. ౨౫   1695

క. కులకాంతకు మగఁడున్నను, విలయం బందినను జారు । వేడుకఁ గని యి
మ్ములవానిఁగూడి యున్నఁగ, నిలసుఖకర మెన్నఁగాదు । హీనంబె యగున్. ౨౫౧

తే. యశముగల్గదు దాన నత్యంతదుఃఖ
మొదవు నాలియకాక యత్యుగ్రభయద
మగును సర్వస్థలముల నింద గలుగంగఁ
జేయుఁ గావునఁ గూడదు దేయొడలను. ౨౬   1697

క. వనజాక్షా! సర్వము నీ,వని నమ్మినవారమాట । నమలభవత్పా
దనళినయుగముం గొల్చుచు, వనమున నిందుండ మనుచుఁ । బలుకుదు రేమో?

మ. [2]నను దూరంబుననుండియే వినుచు నానారీతులన్ బ్రీతిఁ గీ
ర్తనముల్ చేయుచు వేళలందుఁ గనుచున్ । ధ్యానించుచున్ మానవుల్
గనఁగాఁ జాలుదు రెట్టిభావ మది నిక్కం బెన్న మత్సన్నిధిం
దనివారన్ నివసింపఁ గల్గదుసుఁడీ । తన్వంగులారా! యిఁకన్. ౨౮   1699

క. చనుఁడీ మీమీగృహముల,కని గోవిందుండు పలుకఁ । గా నప్రియవా
ర్తను దాని వినుచు గోపిక,లనూనసంకల్ప మట్లు । వ్యర్థంబైనన్. ౨౮౧   1700

1 "దుశ్శీలోదుర్భగోవృద్ధో జడోరోగ్యధనోపివా, పతిస్త్రీభిర్నహాతవ్యో లోకేప్సుభిరపాతకీ" అని మూలము. 2 "శ్రవణాద్దర్శనాద్ధ్యానా న్మయి భావోనుకీర్తనాత్, నతథాసన్నికర్షేణ ప్రతియాత తతోగృహాన్" అని మూలము.

ఆ. కడు విషణ్ణ లగుచుఁ । గడవంగ రానిచిం,తలను గుంది; రిట్టు । లలఘుదుఃఖ
భారమగ్న లగుచు౹వరుస శీర్షంబుల,వంచి మిన్ను విఱిగి౹పడినయట్లు. ౨౦1701

క. క్రమముగ నిట్టూర్పులయు,ష్ణము సోఁకున బింబఫలము । చందంబున నే
కమలిన బింబాధరములు, తమదుస్థ్సితిఁ దెలుప మోము౹దమ్ములు వాడన్.౨౦౪

క. చరణాంగుళులఁ వదలక, ధర వ్రాయుచు నంజనాక్త౹తతనయనాశ్రు
త్కరపాతము కుచకుంకుమ, మురుగతిఁ దుడువంగ దుఃఖ । ముత్కటమగుటన్.

క. పలుకఁగ నేమియుఁదోఁపమి, నిలుచుండిరి; వారిమదుల । నిర్మలమగుచుఁ
జెలఁగెడు ననురాగము శ్రీ,జలజాక్షునియందె కానఁ । జక్కని స్వామిన్. ౨౮

సీ. శ్రీకృష్ణునే నమ్మి । చిత్తంబులంగల సర్వకామమ్ములఁ । జక్రికొఱకె
వదలియుండెడునట్టి౹వారొటఁ దమకున్న ప్రియవస్తువులయందుఁ౹బ్రియతముఁడని
హరినె నమ్మినవార౹లొటఁ బ్రియేతరువలె నట్లుచక్కఁగాఁ । బలికినట్టి
సారసనేత్రుని । సర్వలోకేశ్వరుఁ గని యేడ్చి కన్నీటఁ । గ్రమ్మఁబడిన
తే. నయనముల నెట్లొ తుడిచికొ౹నంగఁజాలి
కోప మొలయుటచేత డ౹గ్గుత్తికఁదగు
పలుకులం బల్కి రిట్లని; । జలజనేత్ర !
సర్వలోకవిభుండవు । చక్రివీవ. ౩౦ 1705

క. క్రూరాత్ములు పలికెడు న,ట్లీరితిం బల్కఁజనునె । యెల్లవిషయముల్
సారవిహీనములని విడి, చేరితి మిటు త్వత్పదసర౹సిజమూలంబున్. ౩౦౪ 1706

మ. కనుకఁ భక్తిభరంబుచేఁ దమిని ని౹క్కం బేము సేవింపఁగాఁ
జనుదేరం గని మమ్ముఁ బొమ్మనుట యే౹చందంబొ? స్వాతంత్ర్యముం
గను దట్లొటను గావఁగా జనుఁగదే । కంజాక్ష ! మోక్షార్థులా
జనులఁ భక్తుల నాదిపూరుషుఁడు వి౹శ్వస్వామి లోఁగొన్నటుల్. ౩౧ 1707

క. మముఁ గావంగాఁజను నో, యమలాత్మా! దేవదేవ । యాదిపురుష! ధ
ర్మముల నెఱింగిన ప్రోడవు,గ మాకుఁ దెల్పితివి మెచ్చఁ౹గా నచ్చునిసుఁ. ౩౧

మ. పతులఁ సూనుల బంధురాజి నయ మొ౹ప్పఁ మన్ననం దన్పుచుఁ
జతనంబొప్పఁగ వారి గొల్చుటయె చం౹చద్ధర్మమౌ నంగనా
తతి కంచుఁ వరధర్మవేత్తవగుచుఁ । దై వారునీవే వచిం
చితికాదే యుపదేశకాలముననే । చెల్లుంగదా నీయెడఁ. ౩౧౪ 1709

క. ఉపదేశార్హుఁడవయి మఱి, యపరిమితస్వాత్మశక్తి । వయి యీశుఁడ వై
కృపకుఁ నిధివగు నీయం,దె పరాత్మా! తగియెయుండు । నెంతయుఁ జూడన్.

సీ. తనుధారులకునెల్ల । దామోదరా! నీవె యత్యంతబంధువ । వగుచు నాత్మ
వయి ప్రియుండవునయి । యలరునీ వుండఁగ నొరులను సేవించు । నుద్యమ మది

యేటికి? నిట్లు మే । మే కాదు శాస్త్రనిష్ణాతలుకూడ నీ । శ్వరుఁడ వగుచు
నిత్యప్రియుండు నా । నెగడి యాత్మవునగు నీయందె భావంబు । పాయకుండ

ఆ. నుసుతు రాత్రిదులయి । యొప్పుపుత్రాదుల, యందు నుసుప రంత । మందు వార
లాత్మకుసు మహార్తి । నమితముగా నొసం, గుదురుగాస వారిఁ । గూర్మిఁ గనరు.

క. అరవిందాక్షా! పరమేశ్వర! మాయం దెల్ల సుప్ర । సన్నుఁడ వగుమీ
చిరకాలమునుండియు నీ, పరిసరమున నుండఁ గోర్కి । పరఁగుటకతనన్. ౩౩

క. మామదుల నంకురించిన, ప్రేమాకృతి గన్న యాశ । భేదింపకుమా
కోమలలతవంటి దదాఁ, గా మన్నన దానిఁ బెంపఁ । గాఁ జను నీకున్. ౩౩ 1713

క. ఇందాఁకఁ గృహభోగము, లందే దగియున్న యట్టి । యాత్మల నీవే
క్రందుగ సుఖముగ దొంగిలి, యిండుంటివి పొమ్మటన్న । నెట్లది పొసఁగున్.

*క. గృహకృత్యంబుల మరగిన, వి హస్తములు రెండు నీదు । విపులతరమ్మా
మహిమంబున లోఁగొంటివి, విహగేశ్వరగమన! యవ్వి । వెడలు నదట్లో. ౩౪

చ. వనజదళాక్ష! నీదుపద । వారిజమూలమునుండి పాదముల్
చనఁగఁ జలింపకుండెడు వ్ర । జంబునకుం జన నేర్తు మెట్లు? పో
యిన నటఁ జేయుకార్య మది । యేదొ యెఱుంగఁగరాదు వేగపాం
డనినఁ జనంగ నోపుదుమె । యం దొనరింపఁగ నున్న దేమియో? ౩౮ 1716

సీ. తోఁడుపాటుం జూపి । తొందఱ లేవియుఁ గలుగకుండఁగఁ జేయు । జలరుహాక్ష!
మందస్మితాలోక । మహిమమ్మునన్ వేణుకలనినాదమ్మునఁ । గలిగి రేఁగు
సంతాపవహ్నితవపహ్ని । వింతయహో నీయధరామృతపూరంబు । చే మరలను
దలసూపకుండ నిమ్ముల నార్పుమా; యట్లు । చేయక గృహములఁ । జేరఁ డనుచు

తే. నానతిచ్చినఁ ద్వద్వియోగానలమునఁ
దనువు లివి దగ్ధములుగాఁగ । ధ్యానయోగ
మునను నీపాదసరసిజ । మూల మొందు
వార; మంతము నొందియుఁ । జేరఁగలము. ౩౯ 1717

క. తనువులు దృఢయోగానల, మున దగ్ధములగుచు యోగి । మూర్ధన్యులు ని
న్నును జేరునట్లు చేరుదు, మనుమానము లేదు కృష్ణ । యాత్మ నెఱుఁగుమా.

చ. వనజదళాయతాక్ష! వనవాసులకెల్లఁ బ్రియుండవైన నీ
ఘనతమపాదమూలము ని । కామమహోత్సవ మిచ్చుఁగా జగ
జ్జననికి లక్ష్మి కొక్కపుడె । సర్వముహూర్తములన్ లభింప దా
వనితయు దానికే చెలఁగి । హారక సంతస మందుచుండుఁగా. ౩౯౪ 1719

క. ఆపాదతలము మేమో, యోపిక నొకపరి స్పృశించి । యుగ్రాటవి ని

* "చిత్తం సుఖేన భవతాపహృతం గృహేషు" అని మూలము.

న్నే పరమాదృతిఁ గాంచుచు, నీపరమకృపార్ద్రదృష్టి నెమ్మిఁ బొలయుటన్. ౩౬

క. సంతోషితచిత్తంబుల, నెంతయు ధన్యుల మటంచు నెసఁగుదుము విభూ!
యంతటనుండియు నితరుల, పొంత క్షణంబైన నిల్వఁ బూనముసుమ్మీ. ౩౬

*క. ఇతరులు తుచ్ఛు లటంచున్, మతులం దోఁచెడిని; లోకమాన్యు లనెడువి
స్తృతకీర్తిఁగన్న యజముఖు, లతిముదమున నేపరాంబికాదృతికొఱకై. ౩౬౪

చ. అనవరతప్రయాసముల నందుదురో యలమంగళాంబయే
యనుపమ తావకీనహృదయాంబుజవాసముఁ గాంచఁ గల్గియున్
వినయధురీణులై వెలయు భృత్యులు గొల్వఁగ నొప్పునీదు ప
ద్వనజరజంబునుం దులసిఁ బాయకకూడియె పొందఁ గోరెడున్. ౩౭ 1723

క. మంగళదేవతవలె మే,ముం గమ్రపదాంబుజరజమ్ముం దమిమైఁ బొం
దం గోరువారమైతిమి, మంగళకర! తీవ్రదుఃఖమండలహరణా! ౩౭ 1724

సీ. త్వదుపాసనాశల వసతుల విడనాడి నిన్ను సేవింపఁగ నెమ్మిఁగనుచుఁ
బాదమూలంబుల పట్టుఁ జేరితి మట్టులౌటఁ బ్రసన్నుండ వగుము దేవ!
త్వన్మనోజ్ఞస్మిత తతనిరీక్షణతీవ్రకామతప్తాత్మలఁ గాంతల మముఁ
బురుషభూషణ! దాస్యముం గరుణించియె కాపాడుమా; భోగ్యకంబులయిన

తే. సద్మముల వీడి నాదుదాస్యంబునేల, కోరితిరొ యందు వేమొకో కుండలముల
మండితములగు కమనీయగండభాగ,ములును సుధఁజిమ్ము బింబోష్ఠమును దగం

చ. దరహసితావలోకనయుతంబయి కోమలకుంతలంబులన్ [X. ౩౮౪
నిరుపమమై ముదంబొసఁగు నీనునుమోమును సంశ్రితాళికా
తురతను బాపి యెల్లపుడు తోఁచుచు వే యభయంబొసంగు నీ
వరభుజదండమున్ సిరికి వాంఛ నొసంగఁగఁజాలువక్షమున్. ౩౯ 1726

చ. కనుఁగొని నీప్రభావము జగంబుల నిస్సమ మంచు నమ్మి నీ
కు నయితి మెంతయుం బొదలుకోరిక దాసుల; మోమహాత్మ! జా
రనిరతి నింద్యమౌ ననుచు రమ్యతరోక్తులఁ బల్కుటీవు చ
క్కనిదగు భావమే య దగుఁ గాని మఱొక్కటి యాలకింపవే. ౨౯ 1727

చ. కలపదయుక్తమూర్ఛనలఁ గమ్రతరంబగు వేణుగాన మి
మ్ములవిని ముజ్జగంబులఁ బ్రమోదము నించుచు సాటిలేకయే
యలరెడు నీదురూపము మహాదృతిఁ గాంచియు నీజగత్త్రయిం
గలజలజాక్షి యెవ్వతుకగాని భవచ్చరణాబ్జసేవకై. ౩౯౪ 1728

తే. భ్రాంతినొందుచు నార్యధర్మ మనఁనొప్పు

* "స్థాతుం త్వయాభి రమితా బత పారయామః" అని మూలము. 'తుచ్ఛాన్నైవరోచంత ఇత్యర్థః' అని వ్యాఖ్య.

నిజసదాచారమున నిల్వ నేర్చుఁ? గృష్ణ
వనిత లననేల? వరగానకమును సురూప
మును వినియుఁ జూచియుఁ గోవికలును ద్విజములు. ౭౦　　1729

క. తరువులు మృగములు పులకాంకురముల వహియించుఁగాదె కువలయనయనా
పురుషోత్తముఁ డావిష్ణువు, సురలోకముఁ గాచుపొంకె శుభరూపమునన్.

క. అవతార మొందురీతిని, బ్రవిమలకృప వ్రజమునందు వసియించు మముం
వివిధార్తులఁ దొలఁగించుచు, సవిధిగఁ గాపాడ నీవు జన్మించితి సూ! ౭౨ 1731

క. ఋత మీయది యార్తజనప్రతతికి బంధుపవు నీవు పాదంబులనే
సతతముఁ గొల్చెదు దాసీ, తతికం గలయార్తిఁ బాపఁదలఁచి మనమునన్. ౭౩

క. కలవిలపా టొందించు సకలపుంఛలఁ గూడిహితము గనలేని యుర
స్థ్సలముల శిరముల నీకర, జలజాతం బునుపు మార్తి చయ్యనఁ బాయున్.

క. గురు వుపదేశించెడున, త్తరుణాంబున శిష్యుదా హృదయమునఁ దలపైఁ
గర మునిచి కాచుగతి నీ,కరసరసిజ మునుపవయ్య కమలానాథా! ౭౫　1734

క. అని భక్తిపారవశ్యం,బున గోపిక లాడినట్టి పూజ్యహితోక్తుల్
విని యోగీశుల కీశుఁడు, జనులసదాత్మల వసించుసత్తముఁ డజుఁడున్. ౭౬

క. వనజాక్షుఁడు నగుకృష్ణుఁడు, మనమున యోజించి నవ్వి మాటల భావం
బును నెంచి యార్తిఁబాపం,గను బ్రీతహృదబ్జలనుగఁ గ్రన్ననఁ జేసెన్. ౭౭

సీ. మందహాసంబులఁ గుందకుట్మలదంత కాంతులసమ్మోహాకరవిచేష్టి
తములఁ గానించుచు దామోదరుఁడు తనవదనాంబుజముఁ గాంచివరుస వికస
నము నొందసమోముల నమరునాగోపిక లత్తఱిఁ దనుఁగూడియలరఁ దార
కలఁగూడి తగుసుధాకరునిచందంబున వెలయు చుండెను; గోపకలలన లెల్లఁ

ఆ. దన్నుఁగూర్చి పాడఁదాసుఁ బాడుచు యూథపతి స్వకీయకరిణివితతి నడుమ
నలరునట్లు సుందరుల యంతరంబున, నలరె నఱుత వైజయంతి గ్రాల. ౭౮

చ. వనమున నెంతో వింత చెలువంబును గూర్చుచునుండి యంత నా
య్యన యమునానదిం గనఁగ నందఱఁగూడియె పోయి యయ్యెడం
గనకపుఁగాంతి వాలుకయుఁ గన్పడఁగాఁ బులినంబు రమ్యమై
కనఁబడ నందునుండెఁ దరఁగల్ మది కింపును గూర్చుచుండఁగన్. ౭౯　1738

ఆ. అలలయందుఁ గదలు కలువపూవులవాసనలు తగంగ వీచులలితపవనుఁ
డంతరంగమునకు హాయిని గూర్పంగ, నందు వారిఁగూడి యాహరియును.

సీ. కరములు వారిమూఁపురములపైఁ బర్వఁ జేయుచుఁ గౌఁగిటఁజేర్చునట్టి
చందంబు గనఁబడ సరసహస్తంబుల ముంగురుల్ దువ్వుచుఁ బొంగిపోరలు
నుత్సాహమునమీఱి యూరువుల్ నీవులు వక్షోజములు సుఖవార్ధిఁదేలు

నట్లు స్పృశించుచు । హాసముల్ తగఁబల్కుచును నఖక్షతములు । గనఁబడంగఁ
ఆ. జేయుచును విలాససిద్ధిఁ గూర్చుచుఁ గటాక్షముల నింపుగల్గు । కరణిఁ జేయు
చును మనోహరమ్ము । గను నవ్వుచున్ ప్రేమ, మతిశయమ్ముగా వి । హారలీల. ౪౬

క. వారిజనయనలతోఁ దమి, వారిజనేత్రుండు తేలె; । వారలు దానన్
ధారణిఁ దమరే వనితా,వారంబున ధన్యల మను । భావము గనుచున్. ౪౭

క. హరి మహితాత్ముఁడు తమ్ముం, బరమాదృతిఁ గూడియుండఁ । బట్టఁదగనిదౌ
గరువము నొందిరి; సౌందర్యరమామానంబు దాన । నమరు గరువమున్. ౪౮

చ. తనమది నెంచి వారి కవి । తప్పక వే తొలఁగింపఁబూని యా
వనజదళాక్షుఁ డచ్చటనె । వారలకుం గనరాకయుండె నా
వనితలచిత్తవృత్తి యెటు । వంటిదొ యప్డు పరీక్ష చేయఁగా
ననువగు నంచు నెంచుటనె । యట్టు లదృశ్యతనొందె నో విభూ! ౪౯ 1743



ము ప్ప ది య వ య ధ్యా య ము.

శ్రీకృష్ణుని గోపికలు వెదకుట.

క. భగవంతుం డంతర్హితుఁ, డగుటయు గోపికలు కృష్ణు । నటఁ గానక పెక్
వగ నంది యూథనాయకు,ని గనని కరిణులనుబోలి । నెమ్మి తొలంగన్. ౧ 1744

తే. పరితపించిరి; భార్గవీ । పతి మనోజ్ఞ
గతులు ననురాగభరితసు । స్మితము విభ్ర
మేక్షితంబులు మనమున । కింపుఁగూర్చు
భాషణము లెన్నొ యాటలు । పాటలు మఱి. ౨ 1745

క. పలుదెఱఁగులగు విలాసం,బును మనములఁ ద్రిప్పికొలుపఁ । బూబోఁడులు మి
క్కిలి తన్మయత్వముం గని, జలజాక్షుని చేష్టితముల । స్మరియించి తగన్. ౩

తే. అనుకరించుచు విహరించి । రంత హరిని
బ్రియమునం గాంచఁగోరు నా । వెలఁదిమిన్న
లప్పుడు తన్మయతం గని । హరిగతిస్మి
తేక్షణాలాపముఖముల । నెన్నికొనుచు. ౪ 1747

సీ. అనుసరింపం బూని । రత్తఱి వారికి నాహరిమూర్తి హృ । దంతరములఁ
బ్రతిరూఢమైయుంట । నతనిచేష్టితములఁ దమ రొనర్చుచు నేనె । తలిరుబోఁడి
కృష్ణుఁడ నని నేనె । కృష్ణుఁడ నని తెల్పుకొనసాగి; రంత నా । వనితలెల్ల
గుంపుగా నొక్కటఁ । గూడి శ్రీకృష్ణుని చరితముల్ పాడుచు । సాంద్రముదము

తే. నను వనమునుండి వేఱొక । వనమునకును
జనుచు నున్మత్తులనుబోలి । సంచరించు

క. మునుపు వరాహాకృతి గను, వనజాక్షాశ్లేషసమయ÷భవమో తెలియం
గనురాదు నీవె చెప్పుము, ఘనుఁడగు మాకృష్ణుజాడఁ ÷ గడు వడిమీఱన్.

క. హరిణీ! మృదులావయవా, త్కరమున నీనేత్రములకు ÷ గాఢానందం
బరుదుగఁ గల్గించెడు శ్రీ, హరి దయితాయుతిని నిచటి÷కరుదెంచెనొకో! ౧౦

చ. తరుణిని గౌఁగిలించుతఱిఁ ÷ దత్కుచకుంకుమపంకముల్ మనో
హరవరకుందమాలికల ÷ నంటఁగ నొప్పుపరీమళంబు ని
త్తరుణామునందు నెల్లెడలఁ ÷ దార్కొనుచున్నది గాన గోకులే
శ్వరుఁ డోకవామనేత్రయును ÷ వచ్చియె యుందురు వారిఁ జూపుమా. ౧౧

సీ. ఫలభారమున వంగి ÷ భాసిల్లుతరులార! రామానుజన్ముండు ÷ వామకరము
దయితాంసమున నుంచి ÷ దక్షిణహస్తంబునందుఁ బ్రఫుల్లార÷విందమూని
తులసిపూవులపయి ÷ నొలసిన మదభరాంధములగు మధుకర÷సముదయములు
తనవెంట నడువంగఁ ÷ దగుభక్తి నొనరించుమీప్రణామంబుల ÷ మేటవయిన

తే. ప్రణయదృష్టుల మన్నించి ÷ పరిఢవిల్లె
నే యెఱింగింపఁ దగు; నన ÷ హెచ్చుప్రీతి
నొక్కకొందఱు చెలులార! ÷ యిక్కడఁ గనుఁ
గొనరె యతిచిత్ర మిది చూడఁ÷గను వినంగ. ౧౨ 1760

చ. లత లివె యాత్మనాథుఁడు వి÷లాసనిధానమునైన యీవన
స్పతివగుబాహుశాఖలను ÷ జక్కఁగఁ గౌఁగిటఁ జేర్చునట్లు స
మ్మతిని బెనంగియుండియును ÷ మాధవుసాధునఖాళిసంగతిం
ధృతపులకాంకురంబులయి ÷ యే కన నయ్యెడి నిక్క మద్దిరా! ౧౩ 1761

క. పీనిం బ్రశ్నించిన నా, సూనాస్త్రునితంద్రియుండు ÷ చొప్ప తెలియ నం
చూనినశ్రద్ధను దరుణులు, మానస మున్మత్తతఁగను÷మాడ్కిఁ బలుకుచున్.

క. హరి నన్వేషించుచుఁ ద, త్పరతం గని విహ్వలలయి ÷ తన్మయలగుచున్
సరసిజనయనుని తత్తద్వరలీలల ననుకరించి ÷ వనిఁ దిరిగి రొగిన్. ౧౪ 1763

సీ. ఒకతుక పూతనా÷యొప్పున మెలఁగ నొక్కతె మాధవునిరీతి ÷ గాఁ గడంగి
చనుపాలు త్రాగెను ÷ జాన యొక్కతె శిశువట్లుగా నేడ్చుఁచు÷నంగనమఱి [నొక్క
యొక్కతె శకటాసు÷రోగ్రకాయముఁ బూనఁ గాలఁదన్నె; నదొక్క÷కాంతపూ
నాతృణావర్తుని÷యాకృతి నటియించి బాలుఁడౌ కృష్ణుని÷వలెఁ జెలంగు

తే. నంగనామణి యొకతుక ÷ నపహరించి
యెటకొ కొనిపోయె; మఱియొక్క ÷ యింతిమిన్న
చారుమంజీరమృదులని÷స్స్వనము లొప్పఁ
గరములను జానువులఁ గృష్ణు÷గతిఁ జరించె. ౧౫ 1764

చ. ఇరువురు కన్యకామణులు ॥ కృష్ణుఁ దదగ్రజుఁబోలియుండ సుం
దరు లొకకొంద ఱత్తఱిని ॥ దాల్చిరి గోపకదేహముల్; తదం
తరమున వత్సదానవువిధంబున నున్న నొకర్తుకన్ వ్వరన్
హరివలెనున్న వేఱొకతె ॥ యూఁపుచు గూలఁగఁ ద్రోచె నేర్పునన్. ౧౪ 1765

తే. కృష్ణువలెనున్న యొక్కతె ॥ యింతిమిన్న
యొర్తు బకుఁ డనుదనుజుని ॥ యొప్పుగులుక
దానిఁబట్టి వధించువిధంబు గానఁ
బడఁగఁ జేసెను హరిచందము ॥ భక్తిఁ జెలియ. ౧౫ 1766

క. తరుణియొకర్తుక కృష్ణుని, కరణిన్ దూరగతగోనికాయముఁ బల్చెన్
హరివలె నొకతుక చక్కఁగ, మురళిన్ వాయింపఁ దక్కుఁగోపాలతతుక లెల్లన్.

క. గోపులనలరించుచు, నీవేణురవంబు వినఁగ ॥ హితమతి ననుచున్
వారే నుతియించిరి తను, భావము లాకృష్ణునందె ॥ వసియించుటచేన్. ౧౭

చ. ఒకతుక తానె కృష్ణుఁడని ॥ యుల్లమునందుఁ దలంచుకొంచు వే
ఱొకతుక యూఁపురంబునయి ॥ నొయ్యన బాహువువైచి ముందుఁబో
వు కడఁక నృత్యుఁ బదాబ్జముల ॥ భూతలమెచ్చఁగఁ బుట్టుచున్ గనుం
డు కమలనేత్రలార! నను ॥ సుంతనకృష్ణుని గా నెఱుంగుఁడీ! ౧౮ 1769

చ. లలితమతీయసాధుగతుకలం బరికింపుఁ డటంచుఁ బల్కె; గో
పలలన యొర్తు కృష్ణుఁడను ॥ బర్వెడువానకు గాలికిన్ భయం
బొలయక యుండఁజేసితి మహీధ్రము నొప్పఁగ నింక మీరు భీ
తిలక చెలంగుఁడీ! యనియె ॥ ధీగతి తన్మయతం జెలంగఁగన్. ౧౯ 1770

క. అనిమఱియొక్కతె తను, దన చేలాంచలము *హరిపదంబున వెలయం
గను బట్టుకొనియె; వేఱొక, వనితామణి కాళియాహివపు వలరంగన్. ౨౦

సీ. నిలుచుండ వేఱొకనెలఁత కృష్ణుండయి దానిశీర్షమునఁ బదంబుఁ బెట్టి
యోదుష్టసర్పమా ॥ యోసురగతి నిటనుండి తరలిపొమ్మా నేను ॥ దండధరుఁడ
నై దుష్టులం జెండ ॥ నవతరించితి ననె; మఱియొక్కగోపిక ॥ మహిమ మెప్ప
గోపకులార! మిక్కుటమైన దావాగ్ని నిపుడు గ్రసింపవచ్చెదు ॥ మీరు కనులు

తే. మూసికొనియుండుఁడీ యగ్ని ॥ గాసిపెట్ట
కుండ క్షేమంబు గల్గఁ జేసెదను నటంచుఁ
బలికె; వేఱొకపద్మాక్షి ॥ పంకజాక్షు
నాకృతిం దన్నుఁ దలపోయు ॥ నంగనఁ గని. ౨౧ 1772

ఉ. చోరునిరీతి వెన్నఁ దినుచోఁ దధిభాండము ప్రక్కలించితే

* హరిపదము = ఆకాశము.

యోరి యటంచుఁ బుష్పముల § నొప్పుగఁ గూర్చినదండఁ గట్టుచున్
జోరునిభంగి తోట నిదె § చూడుము కట్టెద నంచుఁ బల్కి నా
సారసనేత్ర భీతి గను § చాడ్పున మోమును మూసికొం వోగిన్. ౨౨ 1773

క. కనఁబఱచె నాఁటికృష్ణువ, దనచిహ్నము; నిట్లు గోపతరుణులు బృందా
వనమునఁ గలలతలను భూ,జనికాయము వాసుదేవు § జాడ నడుగుచున్. ౨౩

చ. అరుగుచునుండ నావనము § నం దొకభాగమునందు రాధికే
శ్వరుని మనోజ్ఞపాదముల § జాడలు కన్పడియెన్; ముదంబునం
దరుణులు నిల్చి యందు నివి § తప్పక నందునిముద్దుపట్టి వా
చరణములే సరోజము ధ్వ § జంబు యవాంకుశవజ్రముల్ తగన్. ౨౪ 1775

క. కనఁబడియెడు చిహ్నంబులు, గను బాదములిడినచోటఁ § గనుఁగొనుఁడీ; యం
చును జెప్పుకొనుచు నబలలు, చనఁజొచ్చిరి పదము లిడిన § జాడనె త్వరగన్.

చ. అరయుచు వాసుదేవుఁ డెటు § లావని నేగెనొ యంచుఁ బోవుచో
ధర నొకచోటఁ గృష్ణుని పదంబులతో నొకగోపసుందరీ
చరణము లట్టె కానఁబడ § సాంద్రతరార్తిని బొంది వారలి
క్కరణిని బల్కఁజొచ్చి రిదె; § కన్గొనుఁడీ సఖులార! వేగమే. ౨౬ 1777

సీ. నందనందను పావనమగుమూఁపురముపై బాహులతం జేర్చి § పడఁతియోర్తు
మదకరితోడ సమ్మదమునఁ బోయెడుకరిణివలెన్ బోవఁ § గల్గినయది
యమ్మచ్చెకంటివో § నడుగు లీయవె దానిసౌభాగ్య మెం తనఁ § జనునొ; పూర్వ
జని భగవంతుఁ డీశ్వరుఁడు శ్రీహరి దీనిచేతఁ బూజితుఁడయ్యె § సిద్ధమిద్ది

తే. కనుకనే దానిఁ బ్రీతిమైఁ § గలిసి చనియె
మనల దిగనాడి యేకాంత § మార్గమందు
దాని మనసును మెప్పింపఁ § దలఁచి యౌర!
చెప్పఁ దరమౌనె యాయింతి § యొప్పు మనకు. ౨౭ 1778

*క. చెలులార! కృష్ణుపాదక,మలరేణుకణంబు లెంత § మహనీయములో?
జలజాసనుఁ డీశుఁడు సిరి, తలలన్ ధరియింత్రు పాపతతి తొలఁగుటకై. ౨౮

క. వారింబోలుచు మన మీ, సారసదళనేత్రు పాద § జలరుహరేణు
స్ఫారకణంబులఁ దాల్చిన, నారీతిం గృష్ణుఁబడయ § నను వగుఁగాదే. 1780

మ. వనజాక్షుం గొనిపోయినట్టి దగునా § వామాక్షి పాదాంకముల్
మనచిత్తంబుల క్షోభముం గనఁగ ని § మ్మాడ్కిం బొనర్చెంగదే
మనసొమ్మై తగునచ్యుతాధరసుధన్ § మర్యాదపోఁ దట్టి తా
నె నితాంతంబు రహస్స్థలంబునను సం § తృప్తిం దమిం ద్రావెడిన్. ౩౦ 1781

---

* "యా బ్రహ్మేశరమాదేవీ దధు ర్మూర్ధ్న్యఘనుత్తయే" అని మూలము.

ఉ. ఏలొకొ యీతృణాంకురము । లెంతయు దట్టముగాఁ జెలంగు ని
చ్చో లలితాంగిపాదములచొప్పు కనంబడకున్న దద్దిరా!
శ్రీలలితుండు ప్రేయసిని । సిద్ధము కోమలపాద యంచుఁ గ
ప్పొలికి నోర్వఁజాల దని । యంసమునన్ దమిఁ జేర్చియే చనెన్. ౩౦ 1782

చ. కనుకనె కృష్ణమూర్తి పదకంజములే యిటఁ గానరావ్వెడున్;
[వనరుహనేత్ర నెత్తుకొని । వారిజనాభుఁడు పోవుచో భరం
బునఁ దనయంఘ్రు లుర్వి దిగఁ । బూనిక నేగినచిహ్నముల్ కనం
గనఁ గనుపట్టుచున్నయవి । కంటిరె గోపికలార! వేడుకన్. ౩౧ 1783

ఉ. కాముకుఁడౌటఁ బ్రేయసిని । గంజదళాక్షుఁ డలంకరింపఁగా
నీమహిఁ బుష్పముల్ చిదుమ । నెట్టులొ డింపియె యుండ నోపు] నో
భామినులార! కావుననె । పాదములందలి యగ్రభాగముల్
భూమిని నొక్కియున్న విధముల్ గనుపట్టెడుఁ జూడుఁ డిందలున్. ౩౨ 1784

క. హరి తాఁ గోసినప్రసవో,త్కరముం బ్రియురాలి మస్తకంబున ముడువన్
బరమాదరణంబున నీ, ధరణిం గూర్చుండియుండుఁ । దథ్యం బిదియా. ౩౩ 1785

సీ. అని పెక్కుభంగుల । హరిచర్యలన్ జెప్పుకొనుచు దైన్యంబున । వనమునందుఁ
దిరుగుచుండిరి స్వబుద్ధిస్ఫూర్తి మాయంగ; నాత్మసంతుష్టుఁడై । యాత్మయందె
విహరించువాఁడయి । వెలఁదిమిన్నల విభ్రమములకు నవశుఁడై । యమరియుండ
నేర్చినవాఁడయ్యు । నీరజనేత్రుండు కామాతురుల వగు । కష్టవితతు

ఆ. లిట్టులుండు ననుచు । నెల్లరకుం దెల్పఁ, దలఁచి కాముకులకుఁ । దరుణు లెట్టి
దుర్జనతను జూపి । తొందఱ కల్గింతు,రనియు నెఱుకచేయ । నాత్మఁ దలఁచి. ౩౪

క. ఏగోపికఁ గొనిపోయెనొ, యాగోపికతోడ వనవిహారము సల్పెన్;
భోగాసక్తిన్ హరి తను, బాగొప్పగఁ గూడె ననుచుఁ । బటుగర్వమునన్. ౩౫

క. తలపోసి యానితంబిని, జలజాక్షులయందు నెల్ల । సర్వవిధములన్
దలపోయ మిన్ననని ని,స్తులమదముం గాంచి కడకతో హరితోడన్. ౩౬

ఆ. కొంతదూర మరిగి । యింతంతయనరాని, మదము తన్నుగ్రమ్మ । మంజువాణి
యింకనొక్క యడుగు । నిడఁజాల నీమటి, నరుగఁ దలఁచి యున్న । యచటికి నను.

క. కొనిపొమ్మా యన మధుసూ,దనుఁ డాయుగ్మలిని గాంచి । తరుణీ! నామూఁ
పునఁ గూరుచుండు మన న,వ్వనితయు నటుచేయఁ బూను । వాంఛం గొనఁగన్.

క. తనమహిమ మ్మగపడఁగా, వనజాక్షుఁ డదృశ్యుఁడయ్యె । వనితయుఁ దాపం
బునఁ బొగులుచు నోరమణా, ఘనబాహూ! ప్రాణనాథ! । కంజాక్ష! హరీ. ౩౮

క. లోకంబున మాకధికులు, నీకంటెం గలరె యొందు । నీ వున్నావో
శ్రీకృష్ణా! కృపణను గద, నాకు న్నీదాసికిన్ మనం బలరంగన్. ౩౯ 1792

క. నీసన్నిధిఁ గృపసేయుమ, యోసరసిజనేత్ర! యనుచు నొగిఁ బలవించెన్
గాసిలె దానన్; దక్కిన, యాసారసనేత్ర లెల్ల హరిని వెదకుచున్. ౩౯౪ 1793

తే. ప్రియుని విశ్లేషమునఁగల్గు భీతియు వగ
పెల్లునుం దన్ను నేచంగఁ దల్లడిల్లు
నన్ను మిన్నను గాంచి; రా యతివ కృష్ణు
వలనఁ గలిగిన మన్ననఁ దెలియఁ బలికి. ౪౦ 1794

క. తనదగు దౌర్జన్యంబున, వనజాక్షుని మూలముననె వచ్చి యనూనా
ర్తిని గలుగఁజేయు నవమతి, వినిపించిన వారు మిగుల విస్మయ మడరన్. ౪౧

సీ. ఆతన్వియుం దోడ నరుగుదేరఁగ నవ్వనమునందు శ్రీకృష్ణు మమతమీఱ
వెన్నెలగాయంగ వెదకి రవ్వల గహనాంతరంబునను సాంద్రాంధకార
మావరింపఁగ నింక నరసినఁ గన్పడఁ డనియంత మరలి; ర ట్లంధకార
మొలసియున్నను బురహపోత్తమునందె చిత్తములు పర్వఁగ నొందుతలంపులుడిగి

తే. యతని సల్లాపములె పల్కు చతని చేష్ట
లే నటించుచుఁ దద్గుణ బృందములనె
పాడుచున్ దన్మయతనొంది పడఁటు లప్పు
తలఁప రాత్మగృహాళి సుంతయును మదుల. ౪౩ 1796

చ. వనముననుండి వచ్చి యలవారిజనేత్రలు మున్ను ప్రీతి నా
వనరుహనేత్రుతోఁ గలిసి భవ్యగతుల్ దగనున్న యానదీ
ఘనపులినంబుఁ జేరి యటఁ గాంచనచేలుని నాత్మలందుఁ జ
క్కనియనురాగ ముప్పతిలఁ గాఁ దలపోయుచుఁ జూడఁగోరుచున్. ౪౪ 1797

తే. ఎపుడు చను దెంచునో హరి నెపుడు ప్రీతి
వర్ధిలం జూతుమో యెప్డు వనరుహాక్షుఁ
గూడి యుం దుందుమో యనుకోర్కి వార
లందె యుండిరి మనసు లాహరినిజేర. ౪౪ 1798



ముప్పదియొకటవయధ్యాయము.

గోపికాగీతలు.

క. చెలికాఁడ నీవుపుట్టుట, వలనన్ గోకులము మిగుల వర్ధిల్లెడు శ్రీ
లలనయు నిం దనవరతము, విలసిల్లు ముదంబుమీఱ వేడుకలలరన్. ౧ 1799

చ. కరుణకు నీవె స్థానముగఁ గ్రాలుదు వట్లగుటన్ ద్వదీయప
త్సరసిజయుగ్మమందుఁ దమి స్వాంతములెల్లను జేర్చి నిన్ను నే

నిరతినినమ్మి ప్రాణముల నిల్పుచు నెట్టులొ కాంచుకోర్కెఁ జేఁ
దిరుగుచునున్న మాకు నిఁకఁ దెప్పున దర్శన మిమ్ము శ్రీహరీ! ౧ 1800

సీ. నీయందుఁ జక్కనినెమ్మి గల్గినవారి కరయ దిక్కగుదు వోవరద! మేము
నీవు కోరకయున్న నీయందుఁగలభక్తి దాసికల మగుచు దర్శనార్థ
మిందుఁ జరించు నీసుందరులను శరత్కాలనిర్మలతర కమలసాంద్ర
సరసులఁ జక్కఁగా జన్మించి యలరుతామరల యంతర్భాగసురుచిరరుచిఁ

తే. *దెగడు నీచూడ్కుల నిటు వధించుచున్న
వాఁడవే యిద్ది చూడఁగ వధము కాదొ
శస్త్రవధమె వధంబనఁ జను ననెదవొ
యిప్పుడు నీచూడ్కియే వధియింపఁ జాలు. ౨ 1801

చ. పురుషవరేణ్య! కాళియుని భూరివిషానలతప్తవారిచే
మరణము గల్గకుండ మము మాధవ! కాచితి; సర్పమానఘో
శరవరునుండి, ఘోరతరసర్వజనాంతకవృష్టినుండి భీ
కరపవనంబునుండి పవిగాఢధనంజయునుండి కాచితొ. ౨౪ 1802

క. పంచత్వముఁ గల్గింపఁగ, నెంచిన వృషభాఖ్యునుండి కృష్ణా! క్రుధచే
మించిన వ్యోముని నుండియు, నించుకయు విపత్తు గల్గనీకయె మమ్ముఁ. ౨౪

తే. మఱియు నెన్నియొ విధముల మరణము లొగిఁ
గల్గనుండఁగ వానిని గరుణఁ దొలఁగఁ
ద్రోచి కాపాడితివి పెక్కురూపములను
గలిగె నాపదలన్నియుఁ దలఁగెఁ గాదె. ౩ 1804

మ. చెలికాఁడా! విను గోపికామణియసం జెన్నొందుచుఁ నందుని
స్తుతభాగ్యంబగు నాయశోదనుసు బుత్త్రుం డంచు నిన్నే మొగిం
దలఁపంజాలము; సర్వభూతముల యంతస్సాక్షివై పొల్చుని
శ్చలతత్త్వం బవు, మాయఁగైకొనియె యీ చందంబునం బుట్టితొ. ౮ 1805

చ. సరసిజసూతి వేఁడఁగనె సర్వజగత్పరిరక్షణార్థ మి
ద్ధర యదువంశమందు నవతారముఁ గాంచితి; వట్టినీవు దు
స్తరభవభీతి నీచరణసారసయుగ్మము నాశ్రయింపఁగా
నిరతము గోరువారలకు నీకరపద్మమె నెమ్మిమీఱఁగఁ. ౮౪ 1806

క. అనిశ మ్మభయప్రదమగు, మనమునఁగల వాంఛితముల మానక యిచ్చుఁ
వనజాలయాకరాంబుజ,మును గైకొని మించు; దాని మురహర! దయచేన్.

---

*"వరదనిఘ్నుతొ నేహాకింవధః" అని మూలము. "శస్త్రైరెవవధో వధః. కింవృథావధో వధో నభవతి ంతు భవత్యేవ" అని వ్యాఖ్య.

ఆ. వృష్ణివంశధుర్య వేగ మాశిరముల, యందు నునుపవయ్య యాశ్రితప్ర
జజనబాధ లడఁపఁజాలు వాఁడవునీవు, వీరశేఖరుఁడవు సారసాక్ష. ౨ 1808

క. తను నాశ్రయింపఁబూనిన, జనుల మదం బెల్ల నడఁపఁ జాలు స్మితముచే
తను బొల్చువాఁడవు హరీ!, గనుకనె నీసేవచేయఁ గా నెంచు మమున్. ౩

క. చెలికాఁడ! కైకొనంగదె, తొలుదొలుత మంజుపదసరోయరుహాము ని
స్తులకృపఁ గనఁబఱుపుము; భక్తులపాపము లడఁచు నీదుకోమలపదముల్. ౪

చ. కనుఁగొన గోగణంబు వెనుకం జనుచుం సిరి కాటపట్టనం
జని మదశాలి కాళియుని చారుశిరస్తతిపైఁ జెలంగి దే
వనికరసేవితం బగుచు భాసిలు నీపదపంకజంబు నో
య్యన దయ నస్మదీయహృదయస్థలులం నిలుపంగదే విభూ! ౫ 1811

క. తొలఁగింపు మనోవాంఛల, జలజాక్షా! బుధజనులకుఁ జారుతరము మం
జుల వాగ్యుతమునునయి సొంపులుగుల్కెడు నీదువాక్యపుంజము వినఁగన్. ౬

చ. మనములఁ జాలనాశఁగొని మాధవ! వచ్చితి మేము నీదునా
జ్ఞను జవదాఁటకుండఁ గడుశ్రద్ధను జేసెడువారమాటఁ జ
క్కనియధరామృతం బొసఁగి కావుము వీరవరేణ్యా! వాక్సుధం
గొని బ్రదుకంగఁ జాలుదుము గోపకులోద్ధరణా! మహాప్రభూ! ౭ 1813

సీ. తాపత్రయంబునఁ దప్తులౌ వారికిఁ ద్వత్కథామృతము జీవనము సుమ్ము
సుధకంటె నయ్యదిశుభతమంబై యొప్పు బ్రహ్మవేత్తలచేత నర్చితంబుఁ
బాపహారంబు శ్రవణమంగళంబును శాంతిదంబును నయిసంశ్రయార్హ
మునయి చెలంగు నిహపోలిక నొప్పెడు నీకథామృతమును నెమ్మి నెవ్వ

తే. రర్థయుక్తిఁ గీర్తింతురో యట్టివారు
పూర్వజన్మంబునం భక్తిపూర్వకముగ
దానముల నెన్నిటినో చేసి మాననీయు
లగుచుఁ బుణ్యాత్మకులునయి యలరువారు. ౮ 1814

చ. *తనియఁడు నాకథామృతముఁ ద్రావి యిఁకేల మదీయదర్శనం
బనకుము మామనఃప్రియుఁడవై తెలియం దగనట్టివర్తనం
బునఁ దగువాఁడవౌదుకద పుష్కరలోచన! ప్రేమవీక్షణం
బును మది ధ్యానయోగమును బూన శుభంబగునీవిహారమున్. ౯ 1815

క. చిత్తంబున నిల్చెడు నట్లుత్తమగతి నొనరఁజేయుచుండెడు నన్నెల్
పొత్తును గూర్చెడు నర్మము, లిత్తఱి మామదుల నెల్ల నేఁచెడుఁగృష్ణా! ౧౦

*"తర్హి మత్కథాశ్రవణేనైవ సర్వం భవతీతి కిమద్దర్శనేనేతి చేన్న" అనుదానిభావమే యిందుఁ గలదు.

మ. కమనీయాకృతిమీఱ నాథ! పశుసంఘాతంబువెంటన్ మనో
జ్ఞముగా నీవలమందనుండి చనుచో సంఫుల్లపద్మంబునం
దము నిందించెడు నీపదంబు లల కేదారంబులం బొల్చుస
స్యముఖంబుల్ తృణసంచయాంకురములున్ జాలన్ స్పృశింపం గటా! ౧౦౪
ఉ. ఎంతగ నొచ్చునో యనుచు నేము మనంబుల వంతనొంది యా
వంతయు హాయిలేక నిను నారయుచుందుము సుమ్ము; నీవు ని
శ్చింతముగన్ వనిం దిరిగి చిత్రమయూఖుఁడు క్రుంకుచుండఁగాఁ
గుంతలముల్ వినీలరుచిఁ గోరి కనందగి చెల్వుమీఱఁగన్. ౧౧
ఉ. ఆనన మట్టి ధేనువులయంఘ్రిరజంబున బ్రుంగి పుష్పాడుల్
జానుగఁ గ్రమ్మ భృంగములసంగతి నొప్పుసరోరుహంబు నాఁ
గానఁబడంగ మా మదు లఖండముదంబును బొందునట్టు లిం
పైనగతుల్ చెలంగునటు లల్లన వత్తువు నల్లనయ్యరో. ౧౧౪ 1819
క. పలుమాఱు మోముఁ జూపుచుఁ, గొలుపుదు వామోద మట్టి గోపాల! మహా
ధులఁదోల సమర్థుఁడ వో,జలజాయతపత్త్రనేత్ర స్వాంతప్రియదా! ౧౨ 1820
చ. కొలిచిన శర్మదం బగుచుఁ గ్రూరమహాపదలందు నెంతయుం
దలఁపఁగ నర్హమై క్షితికిఁ దద్దయు భూషణమై చెలంగుచున్
జలరుహసూతి పూజలను జక్కఁగఁ జేయఁగనొప్పి మ్రొక్కున
య్యలకు నభీష్టరాజి నిద నర్హముదై తగునీపదాబ్జమున్. ౧౩ 1821
తే. మాయురస్థ్సలు లందుంచి మామకహృద
యార్తిఁ దొలఁగింపుమా; వీర! యమలనాద
ముఖరవేణువుచేఁ జక్క ముద్దిడఁ బడి
నట్టిదగు నీయధరసుధ యలరుఁ గాదె. ౧౩౪ 1822
సీ. చక్రవర్తిత్వాదిజనితసుఖంబులయం దున్నప్రీతిని నట్టె మఱచు
నట్లొరించుచు నతిశయశోకనాశనచణంబయి తగి ఘనతరమగు
నాసక్తిఁ బుట్టించునదియయి తనరు నీయధరామృతంబు మా కాదరమున
నొసఁగుమా; పగలు నీవొప్పుగ వనమున కరుగునప్పుడు వ్రజమందు నున్న
తే. వారు నినుఁజూడఁజాలమి వనటఁ గుంది
క్షణము యుగమట్లు గడపుచుఁ గ్రమ్మఱ నది
యెట్టులో యస్తమయ మప్పు డీవు మరలి
రాఁ గుటిలకుంతలంబయి రమ్యమగుచు. ౧౪౪ 1823
క. సిరులన్ వెలయుచుఁ దగుసుం,దరతావకముఖము వారు తమిఁ గనుఁగొను న
త్తరుణమునఁ బక్ష్మములు నం,తరాయముం గూర్ప దానఁ దహతవాపడుచున్.

క. ఇది యేమని చింతింతురు, కొదువపడకయుండఁ జూడఁగోరిన నడ్డం
బొదవించు పక్ష్ములని,ట్టిదయతఁ బుట్టించిన విధి యతిజడుఁ డగుఁగా. ౧౪

క. చ్యుతిలేనివాఁడ వనియే, పతులం బుత్త్రులను వారిబంధువులను భ్రా
తృతతులఁ ! దక్కిన వారల, నతిక్రమించియె యొసంగునట్టి ప్రియమునన్. ౧౫

చ. మనమున కెంతొ హాయి తగుమాడ్కిఁ జెలంగెడు నీదుగానముల్
విని యతిమోహమందుటను వేగమ నీగతి యెంచి ధూర్తుఁడా!
కనుఁగొనవచ్చినార మిది కాదుకదా పగ లిట్టిరాత్రి నే
జనుఁడయినన్ నితంబినులఁ జాలును బొం డనువాఁడు గల్గునే. ౧౬ 1827

సీ. ఏకాంతమునను నీవిట్టొనర్చినయల సంకేతమును మఱి స్వాంతరోగ
మును బెంచువాంఛను గనఁజేయు నీచూడ్కులను నవ్వుమోమును లక్ష్మికాట
పట్టయితగు నురోభాగంబు గాంచిన మా కెంతయోస్పృహ చేకుఱె మది
మోహ మొందెడు; నీదుపుట్టుక వ్రజవాసిజనుల కెల్లను దుఃఖజాల మడఁప

ఆ. జాలుఁ జుమ్ము మఱియు సర్వప్రపంచమం
గళద మగును; గనుకఁ దలఁపులందు
నిన్నె గోరుమాకు నెఱి స్వజనహృదయ
వ్యాధిఁ బాపుమందు హరి! యొసఁగుము. ౧౭ 1828

క. ఆమందేదో యెఱుఁగుదు, వో మానితరూప! నీవె యూహించినచో;
గోమలతర యుష్మత్పద, తామరసము లాశ్రితాళి తాపహరంబుల్. ౧౮ 1829

చ. నిరుపమరూప! యోవికచనీరజనేత్ర! దయాసముద్రుఁడా!
గురుకఠినాస్మదీయకుచకుంభములన్ స్పృశియింప నొచ్చు నీ
చరణసరోజయుగ్మ మని చాల భయంబున మెల్లమెల్ల సుం
దరగతిఁదాల్తు మాయడుఁగుఁదమ్ములతో వని నీవు త్రమ్మరన్. ౧౯ 1830

తే. కఠినసూక్ష్మపాషాణసంగతి నవెంత, నొచ్చునోయని మామదుల్ వెచ్చనూర్చు
చుండు నీవెకదా మాకునున్న జీవితంబు పేక్కేల మాటలు దైత్యదమన!

---

ముప్పదిరెండవయధ్యాయము.

## శ్రీకృష్ణుఁడు గోపికలకు దర్శనమిచ్చుట.

క. ఈపగిది నవ్వనంబున, గోపిక లాకృష్ణుపైని గూర్మిఁ దదీయ
వ్యాపారంబులఁ బాడుచు, వాపోవుచుఁ జూచుకోర్కి వర్ధిలంగన్. ౫ 1832

క. పలవించి రప్పు డాకాం,తలకంఠరవంబు చారుతరమై చెలఁగన్;
జలజాక్షుండును వారల, యలజడిమాన్పంగ సుస్మితాస్యాంబుజుఁ డై. ౧ 1833

క. పీతాంబరంబుఁ దాలిచి, చేతోభవమన్మథుఁ డని చెప్పందగు న
ట్లే తనువొప్పఁగ సుమమా, లాతతి ధరియించి కడువిలాసముమీఱన్. ౧౫

క. కనుపట్టె వారి మ్రోలను; గనకాంబరధారి ప్రీతిఁ గల్గించుచు వ
చ్చినఁ గాంచి గోపికామణు,లనూన ముత్ఫుల్లనేత్రలయి యత్తఱినిన్. ౨౪ 1835

క. పోయినప్రాణంబులు రా, నే యనువునఁ దనువు లలరు నే ద్రైఱ నట్లే
యాయంగన లొక్కుమ్మడి, నాయధిపుని మ్రోల నిల్చి రాశ్చర్యముగన్. ౨౫

చ. కనఁబడ కెట్లొ పోయి తము గాసిలఁ జేసిన యామనోహరుం
డనయము తారు గోరు హరి యల్లన వచ్చి కనంబడంగ నా
వనితలలోన నొక్కతుక వాంఛలు తీరఁగఁ జిన్నికృష్ణు దో
ర్వనజము దోసిటం గొనియెఁ బంతము మీఱఁగ నెంతొ వేడుకన్. ౨౬ 1837

చ. లలనయొకర్తు వేగమె విలాసము మీఱఁగఁ జందనంపుఁజ
ర్చలఁ దగు కృష్ణబాహువును జక్కఁగ మూఁపురమందుఁ జేర్చికొం
చలరె; మఱొక్కతన్వి వనమందు హరిప్రియయైన బృంద యి
మ్ములఁ బ్రతికుంజమందిడిన పూజ్యతరంబగు తమ్మలం బొగిన్. ౨౭ 1838

చ. హరి గ్రహియింప దానిఁ గొనె నంజలిఁ బట్టి; మఱొక్క లేమ యుర్
విరహమహార్తిఁ గుందుటను వేగమె శ్రీహరిపాదపంకజం
బురుతర తాపమార్ప ననునూహ చెలంగ సురోజపీఠమం
దు రమణు లెల్లడుం గనఁగఁ దోరపుభక్తిని దాల్చె నత్తఱిన్. ౨౮ 1839

సీ. కుటిలకుంతల యొకర్తు కుటిలభ్రుకుటియయి ప్రేమభరంబున నేమితోఁప
కట్టె విహ్వలయయి యౌర! యిట్లొనరుపఁ దగునె యంచు వచింపఁ దలఁచినట్టు
లధరంబు గఱచి యాహరిఁ గొట్టఁగాఁ బూను చందంబునం గటాక్షముల నట్టె
నిగిడించె; మఱియొక్క నెలఁతమిన్నయు భక్తు లాహరిపాదాబ్జ మాశ్రయించి

తే. కనుచుఁ దృప్తిని బొందనికరణిఁ దన్ము
ఖాంబుజము ఱెప్పపాటు లేనట్టి దృష్టు
లను గడుం ద్రావియుర్ మరలను మహాశఁ
ద్రావుచుండెను గాంచ దింతయును దృప్తి. ౨౯ 1840

ఉ. మానిని యొకర్తు దృగ్వివరమార్గమునన్ బరమేశుఁ గృష్ణునిన్
మానససీమఁ జొన్పి పరమప్రమదంబునఁ గౌఁగిలించికొం
చూనిన శ్రద్ధఁ బైఁ జనక యుండఁగఁ గన్నులు మూసి యోగిచం
దాన ముదంబు మగ్నయయి తాఁ బులకల్ మెయినిండఁగాఁ దగెన్. ౩౦ 1841

వ. ఇట్లు లాగోపిక లా శ్రీకృష్ణునిం గాంచినంతనే పరమోత్సవ నిర్వృతలై మహా
నందంబు పైఁబొలయ విశ్వతైజసదశ నున్న జీవులు సుషుప్తిసాక్షియగు ప్రాజ్ఞునిం
గాంచు చందంబునను, బరమేశ్వరుం గాంచిన ముముక్షువుల కరణిని, బ్రహ్మజ్ఞునిం
గాంచిన సంసారులభంగిని వియోగవ్యథం బాసి యుండి రంత. ౩౧ 1842

క. వినుమవలివార్త వత్సా!, వనజాక్షుప్రీతిపాత్ర! ఽ భగవంతుం డా
వనితలు విగతవ్యథలై, తనుఁ గూడియె కూరుచుండఁ ఽ దదో్యగమునన్. ౯౫

తే. పరమపురుషుండు సత్త్వాదిఽనిరుపమాన
శక్తులంగూడి యుండెడు ఽ చందమునను
బూర్వమునకంటె మిక్కిలి ఽ పొలుపుఁ గాంచె;
నంత వారలఁదోడ్కొని ఽ యచ్యుతుండు. ౧౦ 1844

క. కాళిందీపులినమునకు, శ్రీలీలాస్పదుఁడు పోయెఁ ఽ జెచ్చెఱ నచటం
జాలుగఁ బూచిన మొల్లలు, క్రాలెడుమందారములు నిఽకామము తనరెన్. ౧౦౫

క. ఆపూవులతావులతో, నేపారఁగ వీచుపవను ఽ నెంతయుఁ బ్రీతి
వ్యాపారంబుల భృంగము, లాపోవనితృప్తి వ్రాలి ఽ యమలధ్వనులన్. ౧౧

తే. ఒక్కమొగిఁ జేయుచుండె నటఽ్లొప్పుచున్న
యాశరత్కాలమందు శీఽతాంశువిమల
చంద్రికలు నిండఁ జీఁకట్లు ఽ సమసి పోవఁ
బరమమంగళనిలయమై ఽ పరఁగె నదియు. ౧౧౫ 1847

క. స్రోతస్విని తన యలలను, చేతుల నెంతయును బ్రోఁగుఽచేసిన సూక్ష్మం
బై తగు సైకత మచ్చోఁ, బ్రీతింగూర్చుచును మిగుల ఽ వెలయుచునుండెన్. ౧౨

చ. పులినతలంబునందు నటఁ ఽ బూవిలుకానియనుంగుఁదూపులై
యలరెడు నానితంబినులు ఽ హర్షసముద్రునిఁ గృష్ణుఁ గాంచి యి
మ్ముల హృదయవ్యథల్ తొలఁగిఽపోవఁగ నప్పరమాత్ముఁ జూచి ము
జ్జలనిధిఁదేలు వేదములఽచందమునిూఱ నవాప్తకాములై. ౧౨౫ 1849

క. సంతోషాంబుధిఁ దేలిరి;, వింతగ నాత్మలకుఁ జూడఁ ఽ బ్రియబంధులెయౌ
కాంతున కాశ్రీకృష్ణున, కెంతయు సంతృప్తిమిూఱ ఽ నింతులు త్వరగన్. ౧౩

క. స్వోరోజకుంకుమాంకిత, చారుత రామూల్యమృదువఽసనముల తుదలన్
గోరిక నాసనమును జే,కూరిచి ధన్యతములైరి; ఽ గోపాలకుఁడున్. ౧౩ 1851

సీ. యోగేశ్వరుల మానఽసోత్ఫుల్లపుండరీకాంతరమునఁ గల్పిఽతాసనుఁడయి
యలరారు నీశ్వరుం ఽ డాభగవంతుఁడు వనితాప్రకల్పి తాఽసనవరమున
బలసి గోపికలెల్ల ఽ వరుసఁ గూర్చుండి తన్నర్చింప లోకత్రఽయమునఁ గల్గు
లావణ్యమునకు నెల్లను దానె వసతిగా తనరారునాకారఽమున వెలింగె;

తే. వాంఛ లుల్లసిలన్ జేయుఽవాసుదేవు
నచ్చటం గాంచి మందస్మిఽతాంకురములఁ
గులుకు లీలేక్షణములఁ జెఽన్నలరుబొమల
తోడ నాహరిఁ బూజించి ఽ కూడియుండి. ౧౪౫ 1852

క. సురుచిరకోమలహారిపద, సరసిజముల స్వాంకములను ॥ జక్కఁగ నిడికొం
చు రమణ మెల్లఁగఁ బిసుఁగుచుఁ, దరుణులు తొలుత నుతించి ॥ తాపముపోల [యన్.

ఆ. సుంత కోపమూని ॥ సొగసుగఁ బల్కిరి;
కోమలాంగ! ధరణిఁ ॥ గొందఱు తముఁ
గొలుచువారిఁ దమరు॥గొలుతురు; కొందఱు
కొలువకున్న వారిఁ ॥ గొలుతురుసుమ. ౧౩౪ 1854

[1]క. వినుమా యింకం గొందఱు, జనులు తముం గొల్చునట్టి॥జనులం గొల్వం
గనురాని జనుల నుభయుల, ననువొందఁగఁ గొల్వ రిందు ॥ నంతర మెదియో?

క. తెలుపుము మాకుం జక్కఁగ, జలజాక్షా! యేదిసాధు॥సరణియొ యని యి
మ్ముల స్వాభిప్రాయంబుం, దెలుపఁగ నాలించి పలికె ॥ దేవవిభుండున్. ౧౬

క. చెలులార! యొకరినొక్కరు, కొలిచిన మఱి కొల్చువారు॥కొంకక స్వార్థం
బులఁ గోరువారలే యని, తలఁపం జనుఁ గాని వేఱు॥తలఁపం జనునే? ౧౬౪

క. తమునొక్కరు సేవించిన, తమ రవ్వారలను గొల్వఁ ॥ దలఁచుట సుమన
స్త్వము గాదు దానఁ గనధర్మము లేదు స్వకార్యమున నిరతియె కనఁబడున్.

క. పరులకు నుపకృతి యొనరిచి, పరమంబగు ధర్మమార్గ॥పాలనము నొన
ర్చురతియు నటఁ గనరా; దెవ్వరు స్వార్థముమాని పరులఁ ॥ బాలించుతమిన్.

క. కరుణ గలవారలగుచుఁ బితరు లాత్మభవులనుబోలెఁ ॥ దమ్ముఁ గొలుచునా
తురతఁ గననట్టివారలఁ, బరమాదృతిఁ గొలుతు రట్టి॥వారల కెల్లన్. ౧౭౪ 1860

సీ. నిరపవాదంబయి ॥ నెగడెడుధర్మము సౌహృదమును గల్గుఁ ॥ జానలార!
సర్వభూతములందుఁ ॥ జక్కనిభావంబు గలుగును; గొందఱు ॥ లలిని దమ్ముఁ
గొలిచినను వారిఁ॥గొలువరు వారిఁకఁ గొలువనివారలఁ ॥ గొలుతురెట్లు?
వీరెల్ల నాలుగు॥విధముల విభజింపఁబడుదురు; జ్ఞానైక॥పరత నొప్ప

తే. నలరునట్టి యాత్మారాము॥లనియు భోగ,మందునిచ్ఛయె లేకుండ॥నలరుపూర్ణ
కాములనియుఁ గృతఘ్నులుఁ ॥ గఠినమతులు, ననియు వారికిఁ బేరు లో॥యతి [వలార.

[2]మ. చెలులారా! యిఁక నాదుమాట వినుఁడీ ॥ చేఁ జిక్కి యర్థంబుసం
చలనంబై చన దానిపైఁ గలతమి॥స్వాంతంబు వేఱొక్కఁడుం
దలఁపంగానకయుండఁ దత్తఱిలుచున్ ॥ దైన్యంబుచూపట్టు వ
ర్తిలునిస్స్వం డన నన్నుఁగొల్చు జనులన్ ॥ దీపాఱుప్రేమంబునన్. ౧౯౪ 1862

క. నేనును గొలువ నదే లనఁ, గా నన్నే యంతరంబు ॥ గన్పడనితమిన్

1 "భజతోను భజంత్యేక ఏకఏతద్విపర్యయం, నోభయాంశ్చ భజంత్యన్య ఏతన్నో బ్రూహి సాధుభోః" అని మూలము. 2 "నాహంతుసఖ్యో భజతోఽపిజంతూన్ భజామ్యమీషామనువృత్తివృత్తయే, యథాధనోలబ్ధధనే వినష్టే తచ్చింతయాన్యన్నిభృతోనవేద" అని మూలము.

ధ్యానంబుచేయఁదగు నని,యే నేఁ గన్పడకయుండు ॱ నిది తప్పెటులో? ౨౧

క. కాదుకృతఘ్నత యిదియని,యే దలఁపన్ వలయు మీరలి త్తఱిఁ జెలులా
రా! బారుణావనమున నిట, నాదారిం దెలియ నెమ్మనములఁ దలఁచుచున్.

క. ఇది యుక్తమె యగు; మఱి యీ, యదియునయుక్తంబె యరయనగు; నని సుంతై
నఁ దలంపక లోకము ని,య్యది ధర్మమధర్మమనుచు ॱ నరయమి శ్రుతులన్. ౨౦౪

తే. మీరుపాటింప నందున ॱ మేటిబంధు, జనుల దిగనాడినందున ॱ ననుభజించు
నిష్ఠగలదని యెంచితి ॱ నేను దాని, నరయఁ గనఁబడకుండితి ॱ నని తలఁపుఁడు.

క. కొలుచుచునుంటిని మిమ్మని, తలపోయుఁడు ప్రీతిఁ గన్న ॱ తరుణులు గాన్
గలఁదు ప్రియం బెద మీయం,దలఘుతరం బంచు నరసి ॱ యపరాధముగన్.

క. మనముల నెన్నకుఁడీ యి,ట్లనుదితకపటప్రమోద ॱ మంది ననుం గొ
ల్చినమీకు మిక్కుటం బనఁ, జను నుపకారంబుచేయఁ ॱ జాలితినేనిన్. ౨౧౪

తే. సురలుజీవించునందాఁక ॱ సొరిదిఁ జేయ, శక్యమేకాదు; విడునంగఁ ॱ జాలనట్టి
సద్మశృంఖలముల వీడి ॱ సాధుభక్తి, నన్నుఁ గొలువంగ వచ్చితి ॱ రిన్ని ॱ నిటు.

తే. ఇట్టి మీయుపకృతికి నో ॱ యింతులార, మీసుశీలతయే యెన్న ॱ మేటిప్రత్యు
పకృతియగు గేహశృంఖలా ॱ ప్రతతి వదలి,పోవు మీకని పలికె శ్రీ ॱ భూధవుండు.



## ము ప్ప ది మూఁ డ వ య ధ్యా య ము.

### రాసక్రీడ.

క. వనజాక్షుఁడు భగవంతుఁడు, మనములకున్ సొంపుగూర్చు ॱ మాటలు పలుకన్
వినియుఁ దదంగస్పర్శం,బును గనియున్ విరహతాపమును బాసి రొగిన్. ౧

*[సీ. నానాజగంబుల ॱ నర్తకుండునుబోలె నాడించుగోవిందుఁ ॱ డాతరుణము
నందు రాసక్రీడ ॱ నలరారఁగా నెంచెఁ బ్రకృతియే నర్తకి ॱ పరమపురుషుఁ
డగు; సూత్రధారుఁ డీ ॱ యర్థము దెలుపంగ నభినయించెడునది ॱ యగును రాస
మన నందు నర్తకీ ॱ హర్షంబు చెలువొందుఁ బరమేశ్వరుఁడు భక్త ॱ పాలకుండు

ఆ. సాక్షిమాత్రుఁ డగుచు ॱ నక్షిగోచరుఁడయి, వారిగూడియుండు ॱ వరుస యిదియె
రాస మనెడుపేర ॱ రంజిల్లు క్రీడకు, నీశు శక్తిగనుటె ॱ యిందుఫలము.] 1872

క. తరువాతన్ గోపాలుఁడు, హరియు ననువ్రతలు నగుచు ॱ నధికప్రీతిం
బరఁగుచు వర్తించెడు నా, తరుణీరత్నములఁగూడి ॱ తత్పులినములన్. ౧౪

క. వరుసఁ బరస్పరవరకర, సరసిజములఁ బెనఁచికొనుచుఁ ॱ జానలు కొల్వన్
నిరుపమరాసక్రీడా, పరతన్ మోదింపఁ దొడఁగె ॱ భక్తులఁ దేల్పన్. ౨ 1874

* సకలవ్యాఖ్యానాభిప్రాయసార మిందుఁగలదు.

మ. వరుసన్ వారల మండలాకృతిగఁ జెల్వంబొప్పఁగా నిల్పి యి
ర్వుర మధ్యంబునఁ దా నొకండుగ లసద్భ్రాజంబునన్ నిల్చి యా
సరసీరుణ్ణయనాద్వయాంసముల హస్తద్వంద్వమున్ మోపి సుం
దరరాసోత్సవ సంప్రవృత్తి నడపెన్ । దామోదరుం డత్తఱిన్. ౩ 1875

*సీ. యోగేశ్వరుండయి । యొప్పునాశ్రీకృష్ణుఁ డత్యంతశక్తిఁ దానలరుచుంట
నాకామినీమణు । లత్తఱిఁ దమయొద్ద నిలుచుండి తమ్మె యిట్టులను గౌఁగి
లించుకొనియె యుండు । నంచు నొక్కొక్కతె తలపోయునట్లుగఁ । దా నెసంగె;
నామహోత్సవదర్శనాసక్తమతులయి నిర్జరుల్ తమతమ । నీరజేక్ష

తే. ణలను గూడియె వ్యోమయానముల నెక్కి
యంబరంబున నెల్లెడ । నావరించి
యుండి; రంతట దుందుభు । లొక్కసారి
మొరసె సుమవృష్టి యెల్లెడఁ । గురిసె నంత. ౪ 1876

క. పెనువేడుక గంధర్వులు, వనితాయుతులగుచుఁ గృష్ణుశుభవ్యయశంబున్
మనముల నెసంగుభక్తిని, వినుతించిరి గేయములను । విస్తృతి గనఁగన్. ౫

చ. అనుపమ రాసమండలములనందుఁ జెలంగెడు సత్తనంబునన్
వనితలు తత్ప్రియుండయిన । వారిజనేత్రుఁడునుఁ బ్రీతిమీఱఁ దా
ల్చిన వరకంకణంబులును । జిత్రమనోహరనూపురాదులం
గనఁదగు కింకిణుల్ తుములశక్రమనినాదము లొప్పఁగాఁ దగెన్. ౬ 1878

మ. భగవంతుం డగుదేవకీసుతుఁడు తత్పద్మాక్షులంగూడి హై
మగరత్నంబుల యంతరంబున రుచుల్ । మైకొన్న నీలాఖ్యమై
సొగసుంగుల్కెడు రత్నమట్లు మిగులన్ । శోభిల్లె నాకాంతలున్
దగ భాసిల్లిరి తత్ప్రభాయుతి నితాంతస్ఫారతేజంబులన్. ౭ 1879

సీ. ఆరాసవిహారణమందుఁ గృష్ణునిగూడి మానినీమణులెల్ల । మండలాకృ
తిని గృష్ణుచందంబునను బదన్యాసముల్ గనఁబడఁ జేయుచుఁ । గ్రమహస్తచు
ములను ద్రిప్పుచు స్మితంబుల నందములుగాఁగ భ్రూవిలాసముల నింపులఁగులుకు
నడుములు గదల స్తనంబులు పైఁటలోఁ జలియించుచుండ వస్త్రములతుదలు

ఆ. చెదరుచుండ గండసీమలఁ గుండల, కాంతు లొలయ వదనకంజములను
స్వేదబిందురాజి చెలఁగఁ గొమ్ముడులను, సడలకుండఁ గట్టి । సరభసమున. ౮

క. మొలనూళ్లు వదలకుండఁగ, విలాసమొప్పన్ బిగించి । వెన్నునిచరితం
బులఁ బాడుచు జలధరమం,డలమున విద్యుల్లతాళినాఁ జిత్రముగన్. ౯ 1881

* "యంమన్యేరన్నభస్తావద్విమానశతసంకులం, దివౌకసాం సదారాణా మౌత్సుక్యాపహృతాత్మనాం" అని మూలము.

క. లీలామానుషవిగ్రహుఁ, డై లలిఁ జెలువారు కృష్ణునంతరమున వా
రోలి వెలింగిరి; తరుణీ, జాలము లటు మోదమున నొసంగుచు మిగులన్. ౬

క. నానావిధ రాగంబుల, చే నెంతయు గళములు విలసిల్లఁగ నాట్యం
బూని యొనరించుచున్ హరి, మానితతనుసంగతిన్ బ్రమద మొప్పారన్. ౭

క. ఎలుఁగెత్తి పాడి; రాపా, టలగంధుల నాదమే కడంగి జగమ్మున్
విలసిల్లి యావరించెను, గలకంఠి యొకర్తు కృష్ణకలనాదముతోన్. ౮ 1884

క. తనగళనాదము తోడయి, కనఁబడఁగాఁ బాడఁదొడఁగి కంజాక్షుఁడు మే
లని పలుమఱు పొగడఁగ నా, తనిస్వరములతోడఁ గలియఁదలఁపనిరీతిన్. ౯

తే. షడ్జమాదిగఁ గల్గిన స్వరవిభేద
ములను ధ్రువతాళసంయోగమునను జక్కఁ
బాడె నాపాట కెంతయుఁ బ్రమద మొదవ
గారవించె శ్రీకృష్ణుఁ డౌరౌర! యనుచు. ౧౦ 1886

చ. సురుచిరగాత్రి యొక్కొతుక సొంపుగ రాసవిహారమగ్నయై
కరము పరిశ్రమంబుగని కంకణముల్ చలియింపఁ గొమ్ముడిన్
బెరసినమల్లికాకుసుమబృందము వీడఁగ బార్శ్వమందు ను
న్నరమణు మూఁపురంబుపయి నైజకరం బమరించి నిల్చెఁ దాన్. ౧౧ 1887

చ. కలువలవాసనల్ మిగుల గందపుఁబూఁతలఁ జెల్వమించు దో
ర్జలజముఁ గృష్ణుఁ డొక్కవ్రజసారసనేత్ర భుజంబుఁ జేర్పఁగా
నెలమిని మూరుకొంచు నలయింతి శరీరము హృష్టరోమమై
వెలయఁగ ముద్దుపెట్టుకొనె వెన్నుఁడు తన్ను బహూకరింపఁగన్ ౧౨ 1888

చ. అతివయొకర్తు నర్తనమునందుఁ జలించెడుకుండలంబులన్
బ్రతి యరయంగలేని ఛవిపర్వఁగ గండయుగంబు వింతయా
కృతి గనఁ గృష్ణుగండమున నెంతయు నేర్పునఁ జేర్చె దాన స
మ్మతి విడియం బొసంగి బహుమానముఁ జూపెను నందబాలుఁడున్. ౧౩ 1889

ఆ. రమణియొకర్తు నూపురములు కాంచీదామ
కింకిణులు ధ్వనింపఁ బొంకముగను
నాడి పాడి యలసి యటనున్న శుభహారి
హస్తపంకజ మెద నదుముకొనియె. ౧౪ 1890

సీ. తక్కినగోపికల్ మిక్కిలిప్రీతుఁడై సిరి కొక్కతికె మనోహరుఁడు నగుచు
నచ్యుతుండయితగు నాహరిఁ గాంతునిగఁ బడసి తత్కమ్రకరసరోభ
వాలింగితగ్రీవలయి కృష్ణుచరితముల్ పాడుచు నర్తనపరత మిగుల
విహరించి; రత్తఱి వెలఁదిమిన్నలు కర్ణములయందుఁ జెలువంబు గులుకనునిచి

కొనిన యుత్పలములు – కుటిలాలకవిలాస మమరుకపోలముల్ – చెమటబిందు
వులును మోములకు నుజ్జ్వలతరశ్రీలఁగూర్పంగఁ గంకణనూపురములు సూక్ష్మ
కింకిణీజాలమ్ముఁ – బొంకముగా ధ్వనుల్ గలిగించుచుఁ – వాద్యములయి చెలఁగ
ఝంకారములు సేయ – షట్పదములు గాయకులుగాఁగ రాసగోష్ఠులను గేశ

తే. పాశములనుండి మృదులపుష్పస్రజములు
జాఱుచుండంగ భగవంతు – సాఁగసాత్తుఁ
గలిసి నృత్యంబు చేసి రక్కరణి శ్రీని
కేతనుఁడు భగవంతుఁ డాకృష్ణుఁ డపుడు. ౧౬ 1891

చ. వనితలఁ గౌఁగిలింతలను – బాహులతాగ్రహణంబులన్ మనో
జ్ఞనయనవీక్షణంబులను – సాధువిలాసములన్ బ్రమోదసం
జనకములైన హాసములఁ – జక్కఁగఁ దేల్చుచు నర్మరుం డొగిం
దనప్రతిబింబముం గనుచుఁ – దా విహరించుగతిం జెలంగుచున్. ౧౭ 1892

తే. కరముహర్షించె స్వీయాత్మికలగు టరసి, భామినులు కృష్ణునంగ సంస్పర్శములను
బరవశములయి యింద్రియోత్కరము లొప్పఁ, బ్రమదవారినిధిం దేలికరమల [గతుల.

చ. పరవశలౌట మాల్యములు – భాసురరత్నకలాపముల్ మనో
హరతరనృత్యహేతువున – నల్లన జాఱుచునున్నఁ జక్కఁజే
యురతిని బూనరైరి కురు – లొయ్యన వీడఁగ నీవిబంధముల్
గురుకుచపట్టికల్ మృదుదుకూలములున్ సడలంగ నత్తఱిన్. ౧౮ 1894

క. వానిం జక్కంబఱుపం, బూనరు వారించుకేని – బుద్ధులు హరియం
దే నిల్చియుండుటన్ మఱి, శ్రీనిలయునిలీలలఁ గని – చెందినవేడ్కన్. ౧౮

*క. సురవర్త్మమునఁ జెలంగు ఖచరకాంతలు మోహపరవశతఁ గాంచిరి ని
ర్భరవాంఛ లార్తిఁ గూర్పఁగ, సరసిజరిపుఁ డితరఖేటసంయుక్తుండై. ౨౦ 1896

తే. విస్మితుండయ్యె; నత్తఱి – విష్ణుమూర్తి, గోపికలసంఖ్య యెంతొ స్వరూపమంత
సంఖ్య నమరంగఁజేసి స్వశక్తి వెలయఁ, గడు విలాసమువిూఱ నొక్కమగు నట్లు.

తే. వారితోడ నాత్మారాముఁ – డై రమేశుఁ,డై యచింత్యవిభూతియు – నై తనరియు
విహరణముసల్పె; నత్తఱి – వెలఁదు లెల్ల, రతివిహారమ్మునం బరిశ్రాంత లగుట.

క. కనుఁగొని శ్రీకృష్ణుం డా, వనితల నెమ్మోములను స్వభావముగఁ గృపా
వనరాశిగాన సుఖమునె, గనఁజేసెడు నాత్మహస్తకంజమునఁ దగన్. ౨౧ 1899

క. శ్రమజనిత ఘర్మకణములు, తమంతనే మాప్పనొందఁ – దగువిధముననే
నిమురుచుఁ దనహృదయమునం, దమరినప్రేమమును జూపె – నాగోపికలున్.

సీ. పరమేశ్వరుని చారుకరరుహస్పర్శనముల వెల్లివిరియు ప్రమోద మొప్పఁ

* "కామార్థి తాశ్శశాంకశ్చ సగణోవిస్మితోఽభవత్" అని మూలము.

గనకకుండలరోచు లనుపమానాలకద్యుతిసంపదలు పర్వ సుతికిఁదగిన
గండభాగముల ప్రకాశంబునన్ సుధాయితహాససంయుత దృగ్వితతిని
హరికిఁ బ్రమోదంబు నలవరించుచుఁ దదుద్గీతములం బాడి కాంతరుణుల
తే. యంగసంగమ సమ్మిర్దితాకృతియయి, వారివక్షోజకుంకుమ సారరంజి
తమయియొప్పెడుపుష్పహారమును దగిలి,గండుతుమ్మెదపిండుఝంకారములను.
[1]క. వరుసఁజెలంగఁగఁ జేయుచు, నరిగెను గంధర్వనాథు లట్టులు పరమే
శ్వరుఁడును క్రీడాయాసముఁ, దరుణులతోఁ బాపుకొనఁగఁ దలఁచి జవమునన్.
[2]క. కరిణీసంఘముతోఁ జను, కరివరువలె జనులవాడుకలఁ గైకొనకే
యరిగెను జలములఁ దమిని వి,హారణము సలుపంగఁ దానె యఖిలం బయ్యున్.

జలక్రీడలు.

వ. సుందరమందగమనంబున గజేంద్రలీలల ననుకరించుచు నమ్ముపువునం బ్రవేశించి యమ్మత్తకాశినులు మోదమానమానసలై యున్మత్తకరేణుకలచందంబునఁ బకపక నవ్వుచుఁ బరిహాసము లొనరించుచుఁ బ్రేమోత్కంఠితలై తనపయిన్ జలంబులం జల్లిన వెల్లివిరియుమోదంబున వారిపయిఁ దాను సలిలంబులం జల్లుచు, నంబరంబున విమానరాజంబులందుండి విబుధరాజులు పుష్పవృష్టిం గురియించి వినుతింపం బ్రమోదించుచు, నంతఁ జెంతనున్నయుపవనంబునం గలపూవులయు హ్రదంబునంగల కలువపూవులయుఁ బరిమళంబులు తమయందుఁ బర్వ గంధవహనామంబు సార్థకంబుగా నల్లనల్లన వీచు సమీరకిశోరంబులు తమపైఁ బొలయ నానందించుచు, నాపూవుంబోఁడులును దేంట్లును బిండుగాఁ జేరిరాఁగ గంధగజేంద్రంబు కరేణువిసరంబుతోఁ జరించుచందంబున నాశ్రీకృష్ణుం డందుఁ జరించుచుండె నంత. ౨౦౩ 1904

క. సూనృతసంకల్పుం డగు, శ్రీనిలయుఁడు స్వానురక్తిఁ జెందిన స్త్రీసం
తానము తన్నుం గొల్వం,గా నెలమిఁ దదీయసాధుకాలజ సుఖముల్. ౨౦౪
[3]ఆ. కావ్యవర్ణితములుగాఁ దగురసములు, గలిగి వెలయు తన్నిశలను వారిఁ
గలిసి తిరిగియును విగతరతిరసుఁడయి, నిర్జితేంద్రియుఁడయి నెగడుచుండె.
క. అని శుకయోగి వచించిన, వినిన పరీక్షిత్తు మిగులవేడుకఁ బ్రశ్నిం
చెను యోగివర్య! ధర్మం,బును నిల్ప నధర్మము నిలఁ బూన్కి నడంపన్. ౨౦౫
క. తనయంశముతో మేదిని, జనియించినవాఁడుగాదె జగదీశుం డ

1 "గంధర్వపాళిభిరనుద్రుతఆవిశద్వాః" అని మూలము. "గంధర్వపాః గంధర్వపతయఇవ" అని వ్యాఖ్య. 2 "ఇభరాడివభిన్నసేతుః" అని మూలము. "స్వయంచాతిక్రాంతలోక వేదమర్యాదః" అని వ్యాఖ్య. 3 "ఆత్మన్యవరుద్ధసౌరతః" అని మూలము. "ఆత్మన్యేవావరుద్ధస్సౌరతశ్చరమధాతుర్యస్య సః యస్యేతి కామజయోక్తిః" అని వ్యాఖ్య.

వ్వనజాతుఁడు ధర్మంబున,కును దగుమర్యాద లెవియొ కోరిక వానిన్. ౨౩

క. తానె యనుష్ఠించుచు నొగి, మానవులకుఁ దెల్పుచును సమస్తనిధములన్
వానిని గాపాడుచు న,జ్ఞానులఁ దూలించుచుండఁ జనుఁగాదె మునీ! ౨౪

క. ధరణీవిబుధేంద్రా! యిపు, డరయఁగ ధర్మమునడంప ననువయి తగునా
చరణముగాదే యిదియుం, బరదారలనున్ స్పృశింపఁ బొల్పడు టెల్లన్. ౨౫

ఆ. దాని నాచరించెఁ దగునని యడియెట్లు, మంచి దనఁగఁ దగును మౌనివర్య!
యాప్తకాముఁడయ్యు నతినిందితమగు కా,ర్యము నొనర్చె నేమియాశయంబొ.

తే. సువ్రతా!మాకుఁ గల్గినసొప్పుఁ దెలియ,నట్టియీసంశయంబు,నిశ్శయ్యదనునఁబొడ
వడఁగఁజేయుము నా విని యమ్మహాత్ముఁ,డతని సందేహమును బాప నాత్మనెంచి.

చ. వినుమని యిట్లుపల్కెఁ బృథివీవర! యీశ్వరులైనవారి యం
దనయము సాహసంబు గనఁనయ్యెడు ధర్మవిధిప్రకాండమున్
మనములఁ దోఁచినట్టు లనుమానము లేక యొనర్చుచుండుటల్
గనఁబడు నట్టులయ్యును; నికామము తేజముగల్గి యుండుటన్. ౨౯ 1913

క. అనలుం డెల్లపదార్థము,లను భక్షించియును నుజ్జ్వలంబగు తేజం
బునఁ గొఱత గాంచనట్టులె, ఘను లద్దానిన యఘుంబుఁ గాంచరు సుమ్మీ! ౩౦

సీ. ఈశ్వరుల్ చేసిరే యేమొనర్చిన నేమి యంచు ననీశ్వరుఁ డైసతంబు
శాస్త్రవశ్యుఁడు నగుజనుఁ డొకప్పుడునైన నట్టికార్యములు నాత్మయందు
నైనఁ జేయఁగరాదు మౌనక చేసినఁ జెడిపోవుఁజుము మునుక్షీరవార్ధి
హాలాహలము పుట్ట నద్దాని నీశుండు భక్షించెనని లాతివాఁడు తినిన

తే. వెంటనె నశించుఁగాదె; యోవిమలచరిత!
యట్టులైన సదాచార మనఁగ నెట్టి
దట్టిదానికిఁ బ్రామాణ్య మెట్టుగల్గు
ననుచు శంకింతువేమొకో వినుము శ్రద్ధ. ౩౧ 1915

క. జనవర! యీశ్వరు లగుచుం, దనరుచునే కర్మవశ్యతం గనని ఘనుల్
మనములఁ దలంచి చెప్పు వ,చనములు సత్యంబులె యగు సతత మ్మవనిన్. ౩౨

ఆ. వారివాక్యలకును వారియాచారమే
యది ప్రసంగింపఁబడు; నదె ప్రమాణ;
మట్టిదానిఁ గొనఁగ నగుఁ గాని యన్నియా
చారములను గొనఁగఁ జన దెవరికి. ౩౩ 1917

క. మతిమంతుఁడయిన నీశవి,హితవాగనుకూల మగుచు నెసఁగెడునెదియా
హితచరితమునె గొనందగు, హితమగు నద్దానిచేత నెంతయు రాజా! ౩౪

క. ఏయది వారల వాక్యన, కే యవిరుద్ధంబుగాక యే చేయఁగ నా

నాయాచారముఁ గొనఁ దగ,దోయవనీనాథ! యెట్టి యుద్యమమందున్. ౩౩

సీ. *అధికతేజోవంతు లైన నిరహంకారు లగువారు విధిఁజేయు నట్టికృతిని
నొక్కయర్థముగల్గ దొప్పనిరీతిగా నాచరింప నవర్థ మావహిల్ల
రమరమానవతిర్య గాదిభూతాళికిఁ దా నియామకుఁడయి తనరుచున్న
జగదీశ్వరునకుఁ గుశలకర్మమున సుఖ మకుశలకర్మమునందు దుఃఖ

ఆ. మొదవు నను చుఁజెప్పు టొప్పునే; యేదేవు
పాదకమలరజము భక్తిఁ గొలిచి
నిత్యతృప్తు లగుచు నెగడి మునుల్ మోహ
మొగిని బాసి స్వేచ్ఛఁ దగుచునుంద్రు. ౩౪ 1920

క. ఘనయోగమహిమమునఁ గర్మనిచయబంధములఁ బాసి మహితసుఖంబుం
గనుదురుగాదే; మానవ,తను వాత్మవిలాసముననె తాల్చిన హరికిన్. ౩౫

ఆ. కర్మబంధ మెట్లు గలుగు? నవాప్తకా
ముఁడగు హరికిఁ బరుల మోహనాంగు
లను గ్రహింపఁ జనునె యనుచుఁ బ్రశ్నించితి
వట్టిగోపికలకు నరసి చూడ. ౩౬ 1922

క. వారలపతులకు మఱియుఁ, ధారుణిఁ జూపట్టుభూతతతులకు నెల్లన్
వారిజనేత్రుఁడు లోపల, నారూఢిగనుండి తా నియామకుఁ డగుచున్. ౩౭

క. అల రెడు సర్వాధ్యక్షుం, డిల లీలార్థంబు దేహమెత్తెను గానం
గలుగదు మోహము తగుక్రీ,డలఁ దేలెడు నుచిత మది కడంకం గనినన్. ౩౮

ఆ. హరి యవాప్తకాముఁ డంటివి; క్రీడాది
కమ్ము లతని కేల నిమ్మహి నని
యడఁగఁ దలఁతు వేమొ యఖిలభూతానుగ్ర
హార్థమయియె మానవాకృతిఁ గని. ౩౯ 1925

క. తదుచితములైన క్రీడలఁ, బొదలుచుఁ దా నుండు వానిఁ బొందుగ విని స
మ్మదమున భక్తిని గాంతురు, సదమలమతు లట్టులౌటఁ జన దఘు మనఁగన్.

సీ. వ్రజమున నుండెడువారెల్ల నమ్మహాపురుషుని మాయాభిభూతు లగుచు
గోపాలకులు తమకువలయనేత్రలు కృష్ణుపజ్జను నేగి యొఱిమినుండు
టెఱుఁగక తమకడనే యుండినట్టులు భావించి రందున వారిజాతు
నం దపరాధంబు నావహింపఁగఁ జేయరైరి; బ్రాహ్మముహూర్త మంతరాఁగ

* "కిముతాఖిలసత్త్వానాం తిర్యఙ్మర్త్యదివౌకసాం, ఈశితుశ్చేశితవ్యానాం కుశలాకుశలాన్వయః" అని మూలము. దీనిసారమే యిందుఁగలదు.

తే. వారి ననుమోదితలఁజేసి ꠸ వాసుదేవుఁ
డరుగుఁ డని యాజ్ఞచేయ నాయమలరూపు
నందె యత్యధికప్రీతి ꠸ యావహిల్లు
వారు గాన ననిచ్చు చేరఁగూరియుంట. ౩౭౪ 1927

క. చని రాత్మగేహముల కా, వనజాక్షునియాజ్ఞ నెట్లొ ꠸ వ్రజనారీర
త్ననిచయముఁగూడి శ్రీహరి, యొనరించిన రాసకేళి ꠸ నొప్పెడుశ్రద్ధన్. ౩౯

క. పురుషుం డెవ్వఁడు వినునో, యొరులకు వినిపించునో మహోద్యమమున న
క్కరణిని వర్ణించునొ యా, పురుషుఁడు వరభక్తిగలిగి ꠸ పొలుచుం జుమ్మీ! ౩౯౪

ఆ. నిర్జితేంద్రియుఁడయి ꠸ నిర్గతహృదయరో
గాఙ్జతం జెలంగి ꠸ హరిపలె సక
లసుఖములను బొంది ꠸ లలిఁ గామములఁ బాయు
భూమిపాలజలధి ꠸ పూర్ణచంద్ర! ౪౦ 1930



ముప్పదినాల్గవయధ్యాయము.

సుదర్శనగంధర్వశాపమోక్షము.

ఉ. *అంతట నొక్కనాఁడు తుహినాద్రిసుతాధవు యాత్ర కేగఁగా
నెంతయుఁ గౌతుకంబొలయ ꠸ నెద్దులఁబూన్చిన బండ్లనెక్కి యా
చెంతను జూడఁగాఁ బడి ప్రసిద్ధమునై తగునంబికావనం
బంతటఁ జొచ్చి రావ్రజముననందు వసించెడు గోపకుల్ త్వరన్. ౧ 1931

క. వనమున నందు సరస్వతి, యనఁబడునది యొప్పు మున్గి ꠸ యందుఁ బశుపతిన్
ఘనులోకవిభుని నంబిక, ననుపమగంధాదికముల ꠸ నర్చించి విధిన్. ౧౪ 1932

క. పరమంబగు భక్తిని నీ,శ్వరు ప్రీతిం గోరి యది పొసంగఁగ ధేనూ
త్కరము హిరణ్య మమూల్యాం,బరముల దేనియల విప్రవర్యుల కెలమిన్. ౨౪

తే. ఆదరంబున మధురతరాన్నము నిడి
నందుఁ డాదిగఁ దగుగోపనాయకు లట
వ్రతమునన్ నియతిం దగ ꠸ భక్తి నాఁటి
రేయి నీరానియే యుండిరి నదిచెంత. ౪ 1934

చ. వనమున నంబికాఖ్యమున ꠸ వర్తిలు నొక్కభుజంగవర్య మం
దు నిదురఁ బోవు నందవిభుఁ ꠸ దోయజనేత్రు నితంద్రి నాఁకటన్
మనముకలంగ వచ్చి యనుమానము లేకయె పట్టుకొంచు మ్రిం
గను జతనంబు పూనె; సహి ꠸ క్రన్నన నాఁకట మ్రింగుచుండఁగన్. ౫ 1935

* "అనోభి రనడుద్యుక్తైః ప్రయయుం స్తేంబికావనమ్" అని మూలము.

ఉ. చిత్తము తత్తఱిల్ల వగ ǂ చేతఁ గుమారక ! కృష్ణ ! కృష్ణ ! న
న్నిత్తఱిఁ బెద్దత్రాఁచు గ్రసియించెడుఁజుమ్ము ప్రపన్ను నన్ను నీ
యుత్తలపాటు నొందనటు ǂ లొయ్యనఁ జేయు మటంచుఁ గోపకుల్
తత్తఱమందఁ గూయిడె సుదా ǂ త్తగళస్వన మొప్పునట్లుగన్. ౬ 193

చ. త్వరపడి లేచి యావ్రజని ǂ వాసులు సర్పము మ్రింగుచుండ నా
తురపడు నందుఁ గాంచి వగ ǂ తోఁ గొఱవుల్ ధరియించి భూరిభీ
కరభుజగంబుఁ గొట్టి రిటు ǂ గాఢతరాహత మయ్యు నాగమా
తరుణమునందు నించుకయుఁ ǂ దత్తఱమందక మ్రింగు చుండఁగన్. ౭ 1937

చ. జనకునియార్తి దా నెఱిఁగి ǂ చయ్యన వచ్చి మురాంతకుండు దే
వనికరపూజ్యమానమయి ǂ భాసిలు కోమలపాదపంకజం
బున స్పృశియించె; నత్తఱిని ǂ భూరిభుజంగమ మప్పరేశుపా
వనపదపంకజాత మటు ǂ వర్ష మునుఁ స్పృశియింప వేగమే. ౮ 1938

చ. తనదగు పూర్వదుష్కృతని ǂ తాంతఫలం బగుసర్పరూప మె
య్యన విడనాడి దేవని ǂ కరార్చితమౌ తనపూర్వరూపముం
గనియె; హిరణ్యమాలికలఁ ǂ గ్రాలుచుఁ దేజము రూపమొంది న
ట్లనుపమమై కనంబడెడు ǂ నాకృతితోఁ దగి భక్తిమీఱఁగన్. ౯ 1939

క. తనఘనచరణాబ్జంబుల,కును వందన మాచరించి ǂ కోరికఁ దనమో
లను నిల్చియున్న పూరుషుఁ, గని యప్పురుషోత్తముండు ǂ కరుణం బలికెన్.

ఉ. ఎవ్వఁడవీవు? తేజమున ǂ నిట్లు వెలింగెదు; సాధుదర్శనా!
యెవ్విధి నిట్టికుత్సితమ ǂ యే యగురూపము గల్గె నిన్ను ము
న్నెవ్వఁడో యిట్టినీచగతి ǂ నివ్వని బొందఁగఁ జేసె జెప్పుమా
యవ్విధమెల్లఁ దేటపడ ǂ నంచు ముకుందుఁడు ప్రశ్న చేయఁగన్. ౧౧ 1941

మ. విని యాసర్పతనుండు పల్కె వినుమా ǂ విద్యాధరుండన్ సుద
ర్శననామంబునఁ బిల్వఁగాఁబడుదు నే ǂ ద్రవ్యంబుఁ జక్కందనం
బును గల్గన్ రహిమించువాఁడ నగుదున్ ǂ భూతేశ! నే నొక్కనాఁ
డనుమోదంబున వ్యోమయానమున; నొ ǂ య్యారంబుగాఁ బోవుచున్. ౧౨ 1942

చ. మనము దిశాళిఁ గాంచ నస ǂ మానముదంబును బొందియుండుటం
జనుచు సురూపసంపదకు ǂ సంతస మందుచు గర్వ మూనుచున్
వనమునఁ గుత్సితాకృతు ల ǂ వారితయోగయతాత్ములున్ దపో
ధనులు మహాంగిరఃకులవ ǂ తంసులునైన మునీంద్రులన్ విభూ! ౧౨ 1943

క. పరికించి బుద్ధిలేమిని, బరిహాసము చేసినాఁడఁ ǂ బాప మ్మదియే
సరసిజనేత్రా! వారలు, బురికొలిపెన్ దాన వారు ǂ భూరిక్రుధచేన్. ౧౩

క. ఉరగాకృతి దీనిని గని, ధర నుండు మటంచుఁ బల్కి తన్మౌనులు నా
యురుతరపాపఫలంబును, బరిపూర్తిం గాంచఁజేయఁ బాల్పడిరి హరీ! ౧౩

క. ఆకరుణాత్ములు నన్నపు, డీకరణి శపించు టరయ నెలమి న్నను నీ
శ్రీకలితపాదపద్మము, లీకాంతారమునఁ జూడనే చేసిరిగా. ౧౩½ 1946

క. ఇదివారి యనుగ్రహమే, సదయా! యక్కారణమున సకలేశ్వరతన్
బొదలెడు లోకగురున్ నిను, ముదమారఁగఁ గంటి దేవమునివరవినుతా! ౧౪

క. చరణమ్మున స్పృశియించితి, వురుకరుణన్ దాన నాయఘోత్కర మెల్లన్
బరుగెత్తె నెచ్చటికొ భీ,కరశాపము వాసె నింతకంటె ధరణిలోన్. ౧౪ 1948

క. కలదె శుభంబన సంసృతి, జలనిధికిన్ వెఱచి నీదుశరణముఁ గను వా
రలభీతి మాన్పు నిన్నో, జలజాక్షా! వేఁడువాఁడఁ జనఁగ ననుజ్ఞన్. ౧౪½ 1949

తే. విగతశాపుఁడనైతి నీవిమలకరుణ!, నో మహాయోగిభూషణ! యో మహాత్మ!
యో మహాపురుషా! సజ్జనామయహర!, సర్వలోకేశ్వరా! మహేశ్వర! సురేశ!

క. నిను శరణు వేఁడితిని నేఁ, జనువాఁడన్ సెలవొసంగఁజను నచ్యుత! ని
న్నును గంటి బ్రహ్మశాపం,బును బాయఁగఁ గంటిని ముదమును బొడఁగంటిన్.

చ. అరయఁగ నిద్ది చిత్ర మగు నయ్య? పరాత్పర! నీదునామ మా
దరమున నుచ్చరించెడు సతతం బోగిఁ దన్నును శ్రోతలన్ ద్వరం
బరమపవిత్రతం గనెడుభంగి నొసర్చు నటన్న నింక నీ
చరణము సోఁక నల్పతరశాపవిముక్తిని గాంచు టబ్రమే. ౧౬ 1952

క. అని వేఁడి సుదర్శనుఁ డా, వనజాక్షు ననుజ్ఞ నొంది వలగొని ప్రణతిం
బొనరించి దేవలోకం,బునకుం జనె నందగోపభూపతి యంతన్. ౧౬½ 1953

క. ఆపద్విముక్తిఁ గాంచెను, గోపవరుల్ పరమపురుషకుంజరుఁ డగునా
శ్రీపతి యాత్మవిభూతిన్, బ్రాపించిన మేలు గాంచి బహుభంగులుగన్ ౧౭

ఆ. విస్మయంబు నొంది వే నియమంబు స,మాప్తి నొందఁజేసి మానసీయ
హరిచరిత్రముల మహాదృతిఁ బాడుచు, మందఁ జేరఁజనిరి మరలి యంత. ౧౯

## శంఖచూడుని హరి వధించుట.

క. అతిచిత్రవిక్రములు శ్రీ, పతియును బలదేవుఁ డొకతఱిన్ వనసీమన్
జతనమ్మున విహరించిరి, శతపత్త్రేక్షణల నడుమ సంతస మలరన్. ౨౦ 1956

సీ. సాధ్వలంకృతులయి చందనచర్చలఁ దగి పుష్పహారముల్ సొగసు మిగుల
వింతకాంతిని గూర్ప విమలాంబరంబుల ధరియించి సహజ ముదమున వెలఁగు
పడఁతులు తమవగు పౌరుషమ్ములఁ బాడ వింతసంతోషంబు వెలయ విహర
ణము సల్పి; రత్తఱిఁ జంద్రుండు నక్షత్రము లుదయింపఁ జారుమల్లి

తే. కాపరిమళమత్తభృంగములు ముసరఁ, గలువపూవుల తావుల వెలసి పిల్ల
వాయువులు వీచుచుండంగ భవ్యరీతి,నలరు రాత్రిముఖంబు వారలుపొగడుచు.

క. స్వరమండలమూర్ఛిత మొక,పరిగాఁ గల్పింపఁగా నిబద్ధముగామిన్
ధర నెవరికే నశక్యం, బరయఁగ నట్టైన నాసహజు లద్దానిన్. ౨౨ 1958

క. ఒకపర్యాయమె శాస్త్రో,క్తికలితముగ సుందరముగ దివ్యులు మెచ్చన్
సకలప్రాణులకుం జి,త్తకర్ణసంతోషదముగఁ దత్పరమతులై. ౨౩ 1959

తే. ఒనరఁ గల్పించుచుం బాడి రువిదమిన్న, లామనోహరగీతము లాలకించి [డు
మూర్ఛ మునుఁగుచుఁగట్టినపుట్టములును, జాఱుచున్నను దెలియంగఁజాల కపు

క. కురులగుమినుండి పుష్పము, లురులుచు నుండిన నెఱుంగకుండిరి తనువుల్
పరమేశు లిట్లు స్వేచ్ఛగఁ, దిరుగుచు మత్తిల్లినట్లు దీపించుతమిన్. ౨౪ 1961

క. వనమున విహరింపం గని, ధనదానుచరుండు మిగుల దర్పోద్ధతుఁ డం
చును గీర్తిగన్న కుమతియుఁ, జనుదెంచెను శంఖచూడసంజ్ఞుఁ డచటికిన్. ౨౫

క. హరిబలదేవులు తమకుం, బరిపాలకులుగ నెసంగు వనితామణు లా
తురతం బొందుచుఁ గూయిడ, నిరువురు సోదరులు కనుచునే యుండంగన్. ౨౬

క. కొనిపోయె నుత్తరపు దిక్కునకున్ బలవంతముగను గోపాలవరుల్
వనితలు కృష్ణా! రామా!, యని బెబ్బులిబారిఁబడిన యావులపోల్కిన్. ౨౬

క. తముఁ బిల్చుచు వగచుచుఁ బో,వ మదుల్ కరుణాబ్ధిమున్గఁ బరువెత్తిరి; సా
లమహీరుహావరములు హ,స్తములం గనుపట్ట సాధ్వసము పోవంగన్. ౨౭

క. ఇఁక భయపడకుం డనివా,రికి నభయమొసంగుచున్ ధరిత్రియు నదరన్
సకపటుని గుహ్యకాధము, నొకపర్వున నెదిగిరి జవమొప్పం జనఁగన్. ౨౮

చ. బలమునఁ బొల్చి సోదరులు పర్వనఁ గాలుఁడు మృత్యువున్ బలెన్
దలఁపడరాఁగఁ జూచి మదిఁ దద్దయు సాధ్వస మావరింప నా
జలరుహనేత్రలన్ వదలి చక్రిని రామునిఁ గావుఁ డింక న
న్నెలమిని మాన్యులార! యనునిట్టి యుపాయ మెఱుంగఁ జాలకే. ౨౯ 1967

చ. బ్రతుకునుగోరియే పరుగువాఱెను; వానిశిరోమణిన్ గొనన్
మతిఁ దలపోసి శ్రీహరి యమానుషరూపుఁడు వాఁడుపోవు న
ట్లతిజవమొప్పఁ బర్విడె మహాత్ముఁడు రాముఁడు స్త్రీజనంబుగా
చుతమిని నిల్చె నందె; కడుసూరత నవ్విభుఁ డాదురాత్మకున్. ౩౦ 1968

మ. అవిదూరంబునఁ దారసిల్లి నిలుమా యం చుగ్రతం బల్కిము
ష్టివిఘాతంబున శంఖచూడుని మహాశీర్షంబు భంజించి స
చ్ఛవిరాజన్మణి సంగ్రహించె; నిటు యక్షుస్వామిభృత్యున్ గతా
సువుఁగావించి తదీయభాస్వరమహాచూడామణిన్ గ్రక్కునన్. ౩౧ 1969

క. కైకొని బలదేవునకున్, శ్రీకాంతుఁ డొసంగెఁ బ్రీతిచే నిటు లియ్యన్
వే కాంచుచు నాపడఁతులు, శ్రీకృష్ణుని సద్గుణంబుఁ జెలఁగుచుఁ బొగడన్. ౩౨

## ముప్పదియైదవయధ్యాయము.

### శ్రీహరి పగలడవులకరుగ గోపికలు చింతించుట.

శా. కాంతారంబున మేయ గోవు లరుగం గా వానివెంటన్ బవల్
కాంతుండై హరి పోవఁ జిత్తములు నిక్కం బాహరిం గూడిపోఁ
జింతల్ గ్రమ్మఁగఁ గృష్ణలీలల సదా చింతించుచుం బాడుచున్
బంతంబొప్పఁ బగళ్లఁ బుచ్చుచు నిటుల్ గోపాంగనల్ కూడుచున్. ౧ 1971

క. పలుకంగఁ జొచ్చి రార్తిని, గలఁగుచు నొండొరులతోడఁ గాంతామణు లో
జలజాక్షులార! హరిదాఁ, పలిమూఁపురముపయి వింతపర్వెడురీతిన్. ౧౫ 1972

సీ. సవ్యకపోలంబుఁ జక్కంగ మూఁది భ్రూలతికనాడించుచు నతిమనోజ్ఞ
ములగు నంగుళుల మురళిరంధ్రమార్గంబులం దిడి దానిస్వీయాదరమున
నునిచి భూతావళి మనములు సొగియంగ నమ్ముకుందుం డూఁదు నవసరముల;
వ్యోమయానము లెక్కి పోవు నాదివిజాంగనలు సిద్ధులంగూడి వెలయుచుండి

తే. యును మురళిగానమాలించి మనములందు,విస్మయమునొంది మన్మథవీరబాణ
నిహతి విభ్రాంతచిత్తలై నిర్భరమగు, సిగ్గు గదురుట నీవులు చెదరజేయున్న.

క. వలువలు జాఱిన మిగులం, గలంకనొందిరి; మనోజ్ఞకాయుని గృష్ణున్
జలజాక్షువదలి యుండం,గలమే కన్నులఫలంబుగద హరిఁ గనుటల్. ౩ 1974

క. ఓయంగనలారా! వినుఁ, డీయద్భుత మొకఁడు కృష్ణుఁ డీనందసుతుం
డాయడవిఁ దారహారం, బేయనువున నుండునట్టులే నిర్మలమై. ౩౫ 1975

క. తనరారుహాసమున నుర,మున మెఱపుందీఁగవోలెఁ బొల్చెడు సిరితోఁ
గనులకుఁబండువు చేయుచుఁ, దనుపీడిమహార్తిఁగుందు తరుణుల మనలన్. ౪

క. అరయక యార్తిం గూర్చుచు, మురళిన్ వాయించుతరుణమున వ్రజమందుం
బరఁగెడు గోవృషభంబు లి,తరమృగములు చిత్తములను దద్ధ్వని లాగన్. ౪౫

ఆ. దూరముననె నిల్చి తోఁపనియట్లుండి, మున్నె కొఱికి నములుచున్న గఱికి
పఱక లల్లియుండఁ బండ్లఁ గదల్పక, చెవులనల్లి నిక్కఁజేసి వేడ్క. ౫ 1978

క. నిదురించినయట్టులు సొం,పొదవఁగ లిఖియించినట్టియురుచిత్రము నా
గదలక మెదలక నిలిచెడు, నదె చూడుఁడు దీనికంటె నద్భుత మున్నే?. ౫

చ. చెలియ! మయూరబర్హములె చెల్వము గుల్కెడుపూలగుత్తులై
వెలయఁగ ధాతువారమె పవిత్రపలాశములై చెలంగ ను
జ్జ్వలతరమల్లవేష మన భాసిలి యబ్బలదేవుఁగూడి గో
ల్లలు తను వెంబడింపఁగ విలాసముమీఱ ముకుందుఁ డెచ్చటన్. ౬ 1980

క. తానుండి యాలఁ బిల్చునొ, మానితవేణుస్వనం బమానుష మగుచున్
జానుగ నొప్పఁగ నపుడా, స్వానము నాలించి వేగ శైవలిను లాగిన్. ౬౫

తే. ధర నచేతనములుగాఁగఁ ౯ దనరియుండి
యును బలాగ్రజుపదకంజ ౯ యుగమునుండి
పవనుఁ డల్లనఁ గొని తెచ్చు౯పావనరజ
మును జెలీ! మన మెవ్విధ౯మునసుకృతము. ౭ 1982

క. ఒనరింపని కారణమున, ఘనభంగభుజాళిఁ జూపి ౯ కదలుచుఁ బ్రేమం
బునఁ బ్రవహించుగతుల్ చెడఁ, గనుపట్టెడునట్టి నిలిచి ౯ కనుఁగొనరాదే? ౭

క. వనితారత్నములారా!, యనుచరులగు గోపవర్యు ౯ లమరులు తనదా
ఘనవిక్రమము నుతించుచుఁ, దనివిసనకయుండ నంద౯తనయుం డెలమిన్. ౭౫

సీ. ఆదిపూరుషువలె ౯ నాకమలాదేవి తన్నెడఁబాయక ౯ వన్నెగులుకు
చుండఁగా వనసీమ ౯ నొయ్యారమునఁ జరియించుచు భూరిభూ౯భృత్తటములఁ
గ్రుమ్మరుచున్నట్టి ౯ గోవుల మురళిచేఁ బిలువంగ భక్తజ౯నులు స్వకీయ [సర్వు
హృదయాంతరములందు ౯ నెసఁగుధ్యానంబున ధరియించుచుఁ బూజఁ ౯ దమి నొ

తే. గల్పితములగు పూలతోఁ ౯ గమ్రఫలని
కాయములతోడ గురునమ౯స్కారయుతిని
వినతులయి పులకితములౌ ౯ తనువు లలర
హర్షబాష్పముల వదలు ౯ నవ్విధమున. ౮౫ 1985

చ. వనమునఁగల్గు తీఁగలును ౯ వాని సమాదృతిఁగూడి యున్నపా
వనతరువుల్ స్వకీయమగు ౯ భవ్యహృదంతరసీమలందు నా
వనరుహనేత్రుఁ డున్నగతి ౯ వారక తెల్పుచునున్నయట్లు పు
ష్పనికరసత్ఫలాళిఁ దగి ౯ భారమునం దమకొమ్మ లెంతయున్. ౯ 1986

తే. క్రిందికిన్ వ్రాల నతిశయ ౯ ప్రీతిచేత
మొగ్గ లనువ్యాజమునఁ జాలఁ ౯ బులక లొలయఁ
బుష్పరసధారలన్ దదు౯పుచుఁ జెలంగు
భూమినదె కంటిరే? చిత్ర౯ము గద యిద్ది. ౯ 1987

చ. సరసిజనేత్రలార! రుచి౯సాంద్రము నవ్వనమాలఁదాల్చి త
త్పరిమళసంయుతిం దులసి ౯ భాసిలఁ దన్మకరందపానని
ర్భరమదమత్తతన్ భ్రమర౯వారము ఝంకృతు లొప్పఁ బాడ సా
దరమున దానినిన్ వినుచుఁ ౯ దా మురవైరి యొసంగు పేడుకన్. ౧౦ 1988

చ. మనమున దాని మెచ్చుచు న౯మానుషరూపము గల్గువారిలోఁ
దనదగురూపమే తొలుతఁ ౯ దప్పక లెక్కగొనంగ నై తగన్
ఘనమురళిన్ మనోహరము ౯ గా వదనంబునఁ జేర్చి పాడఁ బూ
నినతఱి సారసంబులు వి౯నిర్మలచిత్తములైన హంసలున్. ౧౦౫ 1989

చ. కొలఁకులనుండి యింపులను గూర్చెడు నామృదుగీత మట్లె యా
త్మల నవలీల మ్రుచ్చిలఁగ దత్పరతం జనుదెంచి సంయతం
బులుగ స్వచిత్తముల్ వెలయఁ బూనికఁ గన్నులు మూసి యట్టులే
నిలిచి యశోదనందనుని నీరజనేత్రుని గొల్చియుండెడున్. ౧౧ 1990

సీ. బలయుతుండయి హరి వ్రజయువతీతిలకంబులారా! భూరి కాననములఁ
దిరుగుచు వనసుమవిరచితహారముల్ ధరియించి కర్ణావతంసములను
వెలయుచు గిరిసానువులఁ జేరి సమ్మద మలరఁగా వేణుధ్వనుల జగంబు
లకు సంతసమ్ము గల్గఁగఁ జేయుచుండంగ నంబరంబునఁ బోవునట్టి మేఘు

ఆ. మల్ల స్వనము వినుచు నమ్మహాత్ముని మీఱి
చనఁగనోడి నిలిచి తనదుతనువు
నాతపత్రమువలె సతనికి నమరించి
యనుగుణముగ సుఖముచును ముదమున. ౧౨ 1991

చ. తనురుచి నాశ్రితాపహృతిఁ దద్దయు నుద్దిగ నొప్పు వాసుదే
వునిపయిఁ బుష్పవర్షమును బొంకముగాఁ గురియించెడుం గదే;
వినుము యశోద! నీసుతుఁడు వింతగ గోపకయుక్తిఁ గ్రీడలం
దనిసెడు నేర్పు కాఁడగుఁగదా? యల కృష్ణుఁడు సంతసంబునన్. ౧౩ 1992

తే. అధరబింబంబునన్ వేణువట్టి చేర్చి
తానె కల్పించినట్టి యుత్తమములైన
స్వరవిశేషంబులం బెక్కుచందములుగఁ
బూని వాయించు నవసరంబునను వేడ్క. ౧౪ 1993

చ. హరిహయశంకరుల్ విధియు నాదిగఁగల్గు సురేంద్రు లాధ్వనిన్
గరము వినంగఁ గంతపులు క్రక్కునవాల్చి మనంబులన్ గడున్
స్థిరతను గాంచఁజేసి విని ధీరులు నయ్యుఁ దదీయభేదముల్
వరుసఁ గనంగలేక తడఁబాటును బొందుదు రేమిచిత్రమో? ౧౫ 1994

క. ధేనువుల ఖురక్షోభం, బూనక యుండంగ గోకులోర్వికి ధ్వజమున్
మానితవజ్రాంకుశబిస, సూనాదిక చిహ్నములను శోభిలి మఱియున్. ౧౬

క. అనుపమములు నగు నిజపద, వనజదళంబులను గూర్చి బాధ యుడుపుచున్
వన గజరాజ సమగమన,మున వేణువు నూఁదుచున్ విమోహనలీలన్. ౧౭

క. పరికింప మనోభవగురు, పరితాప మొసంగు నడకఁ బరమంబు మనో
హరమునగు వీక్షణంబుల, నరుదుగఁ గన్పడఁగ భూరుహము లటు మనమున్.

ఆ. కదలకుండ మోహ మొదవుటఁ గ్రొమ్ముడి, వీడుటయును నీవిగూడ సడలు
టయును దెలియఁజాల మయితిమికద చెలులార! యిది విచిత్ర మారయంగ.

సీ. గుఱుతుపడంగను గోవుల లెక్కింపఁగూర్చిన సన్మణికూటభాసు [ల
ర మగుహారముఁదాల్చి మమత నాయాచోట్ల వానిలెక్కించుచుఁ బరిమళము
నలుఁగడలం జల్లుతులసిహారముఁ దాల్చి యనుఁగుమిత్త్రుని దగునంసముపయి
బాపఁలుపుఁ గదియించి పద్మాయతాక్షుండు వేణుగానమ్మును వేడ్కఁజేయు
తే. నవసరమ్మునఁ గృష్ణసారవనితలగు, హరిణు లావేణునాద మోయ్యాన స్వచిత్త
ములను మ్రుచ్చిల గృహములఁ గలుగునాశ,లను వదలి గోపికలరీతి నధికభక్తి.
క. సుగుణగణసాగరుం డై, తగు శ్రీహరి వెంటనంటి తత్పరమతిఁ జ
క్కఁగ నిల్చియుండి నవి స్వీ,యగతుల్ విడనాడి యిద్ది యద్భుతముకదా? ౧౯
క. అనఘాత్మికా! యశోదా!, వినవమ్మా కుందకుసుమవిసరమ్మున విం
తనుగూర్చు హారమును దా,ల్చిన వేషము చూడ నతివిచిత్త్రము తోఁపన్.
క. తనమిత్త్రులకుఁ బ్రహర్షం,బును గూర్చుచు నందరాజపుత్త్రుఁడు గోగో
పనికాయము సేవింప య,మునచెంత విహారమోదమున నుండుతఱిన్. ౨౦
క. మలయజ సంస్పర్శంబున, వెలసెడు నమ్మందపవనవీరుఁడు హాయిం
గలిగించుచు వీచెడు; సి,ద్ధులు గంధర్వాదులెల్లఁ దోరపుభక్తిన్. ౨౦౪ 2003
క. పరిమళ సుమవర్షంబుల, గురునుతులన్ వాద్యములను గోమలగీతో
త్కరముల వలగొని సేవిం,తురుగాదె? తదాత్మలగుచుఁ దోయజనాభున్. ౨౧
సీ. గోవర్ధనమునెత్తి గోపాలకులకు గోవులకును హితమును గలుగఁజేసి
వచ్చెడుశ్రీకృష్ణు వర్త్మమునందు బ్రహ్మాదివృద్ధులు స్వకీయాంఘ్రికమల
ములకు నమస్కారములను జేయుచునుండ సాయంతనంబున సకలగోధ
నమునొక్కటిగఁ జేర్చి విమలవేణుధ్వని నొనరించుచును దనయనుచరు లొగి
తే. గీర్తిఁ బాడుచునుండంగఁ గేవలప్ర,మదమునం గనుమాదృక్కమలములకును
సంతసము గల్గఁజేయఁగఁజాలి ధేను,ఖురరజోవృతహారుఁడై త్వరను గనుచు.
క. మాకుం గలవాంఛితముల, వేకూర్పఁగఁ గోరి నందుభీరువుతనయుం
డౌ కృష్ణశీతకిరణుఁడు, గోకులమున కేగుదెంచు గోపతిపొగడన్. ౨౩ 2006
తే. కనకకుండలకాంతులు గ్రమ్మియున్న
యట్టిచారుకపోలంబు లలరఁ బక్వ
బదరఫలపాండిమముగన్న వదన మొప్ప
సుంత మదయోగవిహ్వాలాక్షులు చెలంగ. ౨౩౪ 2007
క. నెచ్చెలులకు మానము దగ,నిచ్చుచు వనమాలి పూర్ణమ్మగలక్ష్మిగతిఁ
హెచ్చుగఁ బ్రసన్నదర్శన,మిచ్చుచు వ్రజవాసితాప మెల్ల నడఁచుచున్. ౨౮
క. ద్విరదాధిపవిహరణ మటు, సురుచిరగమనం బదెంతో సొంపుగులుక సుం
దరమూర్తి బలుఁడు ముచ్చట, నరుదెంచు దినోత్థతాప మడఁగించుతఱిన్.

క. సాయంసమయంబున మా, కేయెడఁ గలుగంగరాని ¶ యెలమిఁ గలుగునం
చాయంగనలెల్లను హరి, యాయాక్రీడలను భక్తి ¶ యధికంబగుటన్. ౨౫

ఆ. ఇష్టమున్నయట్టు ¶ లే పాడుచును మనో, జీవితములనెల్ల ¶ శ్రీవరుపయిఁ [ద్రు.
జొనిపి తన్మయముగఁ ¶ గనఁబడ సకలంబుఁ, బగలు క్రీడలొగిని ¶ సలుపుచుం

---

## ముప్పదియారవయధ్యాయము.

### వృషభాసురసంహారము.

క. అరుదెంచె నొక్కనాఁడా, హరియుండెడుమంద కొక్క ¶ యసురుఁడు కడుభీ
కరకాయుఁడు వృషభాకృతి, ధరియించియె మాఁపురం బు ¶ దాత్తముకాఁగన్.

చ. ఖరఖురఘట్టనంబులను ¶ గ్రక్కదలన్ ధరఁ జేయుచున్ గడున్
బిరుసుగ అంకెవైచుచును ¶ బృథ్విని జీల్చుచుఁ గాళ్లతాపునన్
నిరుపమవాల మెక్కగతి ¶ నిక్కఁగఁజేయుచు వాఁడులై మహా
త్తరములు నైనశృంగముల ¶ తాఁపులనభ్రము లూడఁ జిమ్ముచున్. ౨ 2013

*తే. అప్పుడప్పుడు సుంత రసంత మూత్ర
మును బురీషంబు వదలుచు ¶ భూరిభీతి
కలుగునట్టులు ఱెప్పలు ¶ గదలకుండఁ
గాంచుచున్ మంద కేతెంచెఁ ¶ గడురయమున. ౩౪ 2014

చ. దనుజునిఅంకె శ్రోత్రములసోఁపునఁ జేరిన నాలగర్భముల్
వనితలగర్భముల్ సమయ ¶ భంగముగాఁగను స్రావపాతముల్
గను; మఱి వానిమూఁపురముఁ ¶ గాంచి మహీధరశృంగశంకచే
ఘనములు వ్రాలుచుండు నిటు ¶ గన్పడు నాదనుజాధముండు రాన్. ౪ 2015

క. వానివిషాణాగ్రంబుల, గానం బడుతీక్ష్ణతఁగని ¶ కడు భీతిల్లం
బూనిరి గోపులు గోపిక, లాననములు పైకినెత్తి ¶ యకటా! యనుచున్. ౪౫

క. గోవులు భీతిలి మందను, వే వదలి తమంతపాఱె; ¶ విహ్వాలమతులై
శ్రీవాసుదేవ! కృష్ణా!, గోవిందా! నీవె దిక్కు ¶ గుదు మాకెల్లన్. ౫ 2017

క. అని యాహరి చెంతకు నా, వనితలు పూరుషులు పోవ ¶ భగవంతుం డా
ర్తినిబొందు గోకులమ్ముం, గని పాఱకుఁ డనుచు వారి ¶ కలఁత యుడుపుచున్. ౬

మ. సురవైరిం గని యోరిమూర్ఖ! కుమతీ ¶ స్తోమోత్తమా! భీతిచేఁ
బరుగుల్ వాఱెడు వారితోడఁదగునే ¶ పంతంబు దుష్టాత్ములై

* "కించిత్కించిచ్ఛకృన్ముంచన్" అని మూలము.

ధరఁ బీడించెడు క్రూరభావములచేతం బొల్చు నీవంటియా
శరులం దాఁకి బలంబు దర్పమును నాశంబొందఁగాఁ జేయుదున్. ౮౪ 2016

*క. అనిపిలుచుచు వానికిఁ గ్రుధ, జనియింపఁగ మిగులఁ జేయఁజాలు తలముల౯
ఘనభుజము లప్పళించుచు, నని నేయఁగ మిత్రదనుజు ఽ నంసమునందున్. ౮

క. వ్యాళాంగమువలె నిడుపుగఁ, గ్రాలెడు తనహస్తమునిచి ఽ కడఁగి నిలిచె; గో
పాలుఁడు తనకుం గ్రోధం, బాలాగునఁ బుట్టఁజేయ ఽ నత్యుద్ధతుఁ డై. ౮౪

చ. ఖురముల వైనరాపిడుల ఽ క్షోణి నగల్చుచు మింటనున్నయా
గురుతరమేఘమాలికలు ఽ క్రూరతవాలము నిక్కి తోల స
త్వరముగఁ బాఱి పోవ హరిఁ ఽ దార్కొనఁ బోయెను రాక్షసుండు భీ
కరతరశృంగకోటులు తఽగ౯ ముని డీకొనునట్లు నిల్పుచున్. ౯ 2022

ఉ. కన్నులు రక్తపూరములు ఽ గ్రమ్మఁగ ఱెప్పలు వ్రాలకుండ నా
పన్నశరణ్యుఁ డౌహరిని ఽ భద్రుడు నెన్నక లోచనాగ్రదృ
ష్టి న్నెఱిఁ గృష్ణుపైఁ బఱపి ఽ జిష్ణువిముక్తమహాశనిక్రియ౯
గ్రన్నన మార్కొనె౯; గపటఽకల్పితమానవరూపుఁ డత్తఱిన్. ౧౦ 2023

క. వానివిషాణంబులఁ గైఁ, బూనికమైఁ బట్టుకొని విఽభుత్వము తగఁగా
నేనుఁగు మఱియొక ద్విపమును, దా నెట్టెడుభంగితోఁ ఽ దర్పం బడఁగన్. ౧౦౪

క. పదునెనిమిదియడుగులు ముద, మొదవఁగ వెన్కకును ద్రోసె ఽ నుర్విఁబడఁగఁ గ్రూ
రదనుజుఁడు పిఱిందికిఁ ద, న్నదయత హరిత్రోయనప్పు ఽ డతివేగమునన్. ౧౧

సీ. మరలలేచి క్రుధ౯ సమస్తాంగములు చెమర్పంగ నిట్టూర్పులు ఽ పర్వవాఱ
నొడలు తెలియకయే ఽ యుద్ధతిఁ జనుదెంచె; భగవంతుఁ డావృషభంబు మరలఁ
జనుదేర శృంగముల్ సరగునఁ జేఁబూని కాలఁద్రొక్కుచు నేలఁ ఽ గూలఁ ద్రోసి
యార్ద్రవస్త్రముఁ బిండునట్లుగఁ బీడించి శృంగమూడఁగఁ దీసి ఽ యొసఁగు వేడ్క

తే. దాన నడఁచెను వాఁడును ఽ ధరణిఁ గూలె
రక్తధారలు వెడల మూత్రము పురీష
మట్టె వెడలంగ హస్తము ఽ లంఘ్రులు త్వరఁ
దన్నుకొనుచును దిరిగెడు ఽ కన్నులొప్ప. ౧౩౪ 2026

క. మరణావస్థల నొందుచు, నరిగె౯ జమునింటి కట్టు ఽ లసురుఁడు చావ౯
సురులు హరి౯ వినుతించిరి, విరుల౯ గురియించుచు౯ బ్రఽవిమలమనసులన్.

తే. వృషభతనుధారియా దానవేంద్రుఁ జంపి
స్వజనసంస్తూయమానుఁ డై ఽ భ్రాతఁగూడి

* "తిలశద్ధేన కోపయ౯, సఖ్యురంసే భుజాభోగం" అని మూలము.

గోపికానయనోత్సవుం డై పరాత్ప
రుఁడు ప్రవేశించె మందను గడు ముదమున. ౧౫ 2028

క. వృషాసురుఁ డిటు హరిచే, శిక్షింపం బడఁగ నతివిచిత్రక్రియుఁ డై
యీక్షితి వెలసెడు నప్పద్మాక్షుని చరితంబు నెల్ల నాత్మఁ దలఁచుచున్. ౧౫౪

క. దేవర్షి యైన నారదుఁ, డావిధమున్ క్రూరమతికి నాకంసునకున్
దా వినిపించెడు కోరిక, మై వసుధకు నేగుదెంచి యాభూమిపతిన్. ౧౬

చ. కనుఁగొని యిట్లు పల్కెఁ; నలకన్య యశోదకుఁ బుట్టె దేవకీ
తనయుఁడు కృష్ణుఁడౌ బలుఁడు ధారణి నాయక రోహిణీసుతుం
డని తలపోయుమా!, మది భయంబుతగన్ వసుదేవుఁ డాత్మమి
త్రున కలనందభూపతికి రోహిణి సూనుని గృష్ణు నిచ్చెఁజూ. ౧౭ 2031

ఉ. ఇల్లడఁగా నిడెన్ సుతుల నిర్వుర, వారలచేత నే మహీ
వల్లభ! నీవుపంపిన ప్రభావసమగ్రులు సేవకుల్ ధరన్
ద్రెళ్లఁగఁ జేయఁగాఁ బడిరి ధీరులు వారిపు డేపుమీఱి వ్రే
పల్లియ నున్నవా రనెడుపల్కులు నారదునోట వెల్వడన్. ౧౭౪ 2032

మ. విని యాభోజవిభుండు స్వేంద్రియము లుద్వృత్తిన్ గలంగన్ రుషన్
గొనియెన్ దద్వసుదేవుఁ జంపుటకుఁగాఁ గ్రూరాసి; దేవర్షి యా
తని వారించెను భావికాలగతిచేతం బ్రేరితుండై; మృతిం
దనకుం గూర్తురు వాసుదేవులను దాత్పర్యంబునం గంసుఁడున్. ౧౮౪ 2033

తే. దేవకీవసుదేవుల దృఢములైన, లోహపాశంబు లిడి చెఱలోన నునిచె;
నారదుఁడు చనినంత భూనాయకుండు, కేశిదానవుఁ గని బలకేశవులను. ౧౯౪

క. గోకులమునఁ దగువారిని, బోకార్పుమ యపుడె నీవుపోయి యనుచు ను
ద్రేకించిన కోపంబున, నాకంసుఁడు పనిచి యంత నాతురుఁడగుచున్. ౨౦ 2035

సీ. చాణూర ముష్టిక శలతోశలాదిక ప్రభృతుల మంత్రుల బరమమాన
వంతుల మఱియు మావంతులఁ బిలిపించి పలికె నిట్లనుచు వాక్ప్రౌఢిమమున;
వీరులై తగినచాణూరముష్టికులార! వినుఁడు నావచియించు విధము; మీర
లానకదుందుభి యాత్మజుల్ రామకృష్ణులు నందుమందను జెలఁగుచున్న

ఆ. వారలంట; మఱియు వారలిద్దఱు నాకు, మృత్యువనుచు దైవ మేర్పఱిచెను
వార లిప్పురంబుఁ జేరరా మల్లయుద్ధంపులీలమై వధింపవలయు. ౨౩ 2036

క. మల్లాహవరంగంబున, నెల్లెడలన్ స్తంభవితతి నెత్తుగఁ దగి సం
పల్లలితములగు మంచము, లుల్లసిలం జేయుఁ డందు నొప్పెడు స్వేచ్ఛన్.2037

క. పౌరులును జానపదులును, జేరి కనుంగొనఁగ వచ్చుఁ జిత్తములందుం

గోరిన గతి మల్లాహవ, మేరిత్రిఁ సాగునో యది § యిదియేయనుచున్. ౨౮ 2038

*క. [మతిమంతుఁడ వోమావటి, హిత ముపదేశింతు నీకు § నెప్పుడు నత్యు
ద్ధతిఁ దుండముకొస గండ, ద్వితయంబున మదజలంబు § వెల్లివిరియఁగన్. ౧ 2039

తే. కువలయాపీడ మనుపేర § కుంభిణి వెలయు, దాని రంగస్థలంబున § ద్వారమందు
ముద్గరముతొండమునునుండ§భూరిభయము, కలుగునట్లుగ నిలుపుమా§కరివరమది

క. వసుదేవకుమారులు రాఁగ సత్త్వ ముప్పొంగుచుండఁ § గాఁ జంపఁ దగున్
వెసనని శాసించెను మఱియు సంశయమునొందు వాని§యుల్ల మెఱుఁగుటన్. ౩

ఆ. వానిసంశయంబు § వదలింపఁదలఁచి యందున్నవార లెల్ల § నోగి వినఁగఁ
బలికె దుర్మతియగు § పార్థివవర్యుండు, వినుఁడు సభ్యులార! § వింతవార్త. ౩౪

క. వినఁదగు నయ్యది పదిలము, గను మదినిల్పంగఁ దగును § గా దనక మనం
బునఁ జర్చింపందగు నాకును బంధువులందు మిగులఁ§గోపము గల్గన్. ౮ 2043

క. చెలిమిని బోఁదోలంగాఁ, గలకారణ మెఱుకపఱతుఁ § గంజేక్షణ శ్రీ
విలసితయు నోచు భాగ్యంబులనొప్పు మదీయజనని § పూజ్యచరితయా. ౫౪ 2044

సీ. ఒకనాఁడు హర్మ్యంబు§నకుఁ జెలువంబుగా నమరించియున్న యు§ద్యానమందుఁ
దిరుగుచుండెను మంద§మరుదర్భకులు వీచుచుండంగ నాతోఁట§నొప్పుచున్న
యట్టియశోకపూ§గావనీజంబులు వకుళపున్నాగముల్ § సకలభాగ్య [చుండెఁ
ములనొప్పియుండెఁ దేఁ§టులు గుంపులుగఁ గూడి నలుదెసలఁ దమిఁ§జెలఁగు

తే. కోకిలంబులు చక్కఁగఁ§గూయుచుండె, వనమయూరాళి పింఛముల్§వఱల నాఁడు
చుండెఁ గపులును స్వేచ్ఛల§నొప్పుచుండెఁ, జూడఁజూడంగ వనమది§సొంపుగాంచె.

క. అదియు వసంతర్తువుగాఁ, ముద మొదవఁగఁ జేయుచుండె § భూరుహములు ప
చ్ఛదనంబునఁ దగి చూడం, గఁదగియె యుండెను నితాంత§కాంతు జననియున్.

చ. పతియె పరాత్పరుం డనుచు § భావమునందుఁ దలంచుచుండు సు
వ్రత యగుఁగాన నార్తవము § వాయఁగ స్నానముచేసి మేను ర
త్నతతుల నొప్పుభూషణయు§తంబయి భాసిలనుండి నాథునిన్
మతిని దలంచెఁ గోర్కిదగ § మానని యిట్టితలంపు నొందఁగన్. ౮౪ 2047

క. వని నందొక గంధర్వుఁడు, జనులకుఁ గన్పడకయుండు § చాడ్పున ద్రమిడుం
డనువాఁడు తిరుగుచుండెను, వనితామణి నాడుతల్లి § వాంఛం గొనుటల్. ౯

క. తనమది నెఱింగె నాతఁడు, జనులహృదంతరములందుఁ § జక్కఁదలఁచు వా
ని నెఱుంగఁజాలుఁ గావున, వనితాశయ మెఱిఁగి కామ§బాధితుఁ డగుచున్.

---

* "౨౫-వ శ్లోకమునుండి యధికపాఠమునకుఁ దెనుఁగని యెఱుంగఁదగు. నాగరపుస్తకమున నీశ్లోకములు లేవు.

క. నాతండ్రి యుగ్రసేనుని, దౌ తనువుం దాల్చి సుస్మితాలాపములన్
ప్రీతిని గూర్చెడుచూడ్కులు, నాతిరున నుండఁ జేరె నంతికమునకున్. ౧౦

తే. వీఁడు గంధర్వుఁడే పతివేషధారి, యనుచు నెఱుఁగక పతిగనె యాత్మ నెంచి
వానిగూడియె విహరించెవనమునందుఁ, గామముప్పొంగఁ దెలియని కారణమున.

క. అవ్వల నాజననియు వాఁ, డెవ్వఁడొ యని నిశ్చయించి యింతని యనఁగాఁ
నెవ్వనికిం దోఁపని యా, నెవ్వగ పాలయ్యెఁ గలఁగె నేత్రము లపుడే. ౧౧

చ. మనసు గలంగ నిట్లనియె మందమతీ! శఠ! నీ వెవండవో
పని యిది యార్యగర్హితము పాపఫలప్రదముం బొనర్చి దు
ర్జనుఁడవె యైతివం చడిగెఁ జాల భుజాబలశాలి యాతఁ డి
ట్లనియెను మంచిమాటల మహోద్ధృతి నూఱడిలంగఁ జేయుచున్. ౧౨ 2053

సీ. అబలామణి! నాదు నన్వయ మడిగితో? గంధర్వకుల మగుఁ గాన దేవ
తాసమానుల మనఁదగుదుము; కీర్తింప మును దేవతాధీశు ననుచరులము
మీవంటిమనుజకామినులకు మేమన్న సులభులమే గాము సుదతి! యేల
యందువో మానవు లాధిజరావినాశాదుల కర్హులే యగుదు; రమరు

ఆ. లట్లుకారు; కాన నంతర మధికమౌ, ననిన దాని కాగ్రహంబు పూని
నవయవములు గలఁగ ననియె నాతనితోడ, నిట్టి దుష్టకార్య మీవొనర్చి.

క. ఊరకయుండక మఱియును, నేఱుపుమీఱంగ నన్ను నెమ్మి గనంగా
నోరి! చేయం జూచెద, వౌరా! నీతలఁపు నెట్టిదగునో యెఱుఁగఁజా! ౧౫

క. సుకృతంబునకుం బాపము,నకు సాక్షులుగాఁగ జీవనము భూమ్యగ్నుల్
ప్రకటానిల మభ్రంబును, వికర్తనాబ్జారిదిశలు వెలయుచు నుండున్. ౧౬ 2056

క. కాలము ధర్మము సంధ్యలు, నాలిలం గాంచుచుండు నన్నిఁట వీనిన్
దూలించి దురాత్ముఁడవై, బాలిశ! నన్నిట్లు తీవ్రపాపాన్వితగన్. ౧౭ 2057

క. ఒనరించితి; హస్తి మదంబున నేమియుఁ దెలియకుండ భూరివనమునం
గనుపట్టుపంకజాకర, మును గలఁచినరీతిఁ బాపమునఁ గలప్రీతిన్. ౧౮ 2058

క. మలిన మన నెఱుఁగ కుండిన, కులకాంతను నన్ను మదిని గోరికమీఱన్
మలినాత్మగఁ జేసితివే, పలుగాకీ! త్రిదశవర్యపటలాధముఁడా! ౧౯ 2059

తే. ఇట్టి యపకారమును జేసి యెట్లు మరల
నూఱడించెద; వని పల్కు చున్న సాధ్విఁ
గాంచి ద్రమిడుండు భీతిల్లి కనలి శాప
మిచ్చునో యని శంకించి యిట్టులనియె. ౨౦ 2060

క. సారసనేత్రా! మానవ, నారీమణులందు దేవనాథుల కగువ్యా

పారం బిడి క్రమమే యగు, నారయ విబుధాంబుజాతు౹లందు నరులకున్. ౨౦

క. రతి లభియించినఁ గ్రమమే, గతి నౌ? నది న్యాయహితము౹ గాకుండుఁ జుమీ!
శతపత్త్రరుచిరగంధీ!, సుతుఁ డుద్భవమందు ముందు౹ సూనృత మిదియా. ౨౧

క. నావీర్యము వ్యర్థముగా, దేవిధమున నెంచిచూడ౹ నింతీ! బుద్ధి
ప్రావీణ్యముగల్గి మహా, శ్రీవిలసితుఁ డగుచు సుతుఁడు౹ చెలఁగుం జుమ్మా.౨౧౫

తే. మఱి మహోత్సాహయుక్తుఁడౌ; ౹ మాట నాది
యెత్తఱిని వ్యర్థమే కాదు ౹ బిత్తఱి యన;
యశముగన్నట్టి నాయమ్మ ౹ యతిశయక్రు
ధను వహించెను వ్రతభంగ౹మునకు నాత్మ. ౨౨ 2064

క. పాతివ్రత్యము దుర్లభ;, మేతఱి నే నట్టిది యిట ౹ నిట్లుయ్యో నటం
చాతతతాపము గ్రమ్ముట, నీతి సదాచరణము విడి ౹ నీవు కుమతివై.౨౨౫ 2065

క. పెద్దలుపోయెడు పథమును, దద్దయు దిగనాడి యిట్లు ౹ తప్పొనరిచి నా
యొద్దఁ బ్రగల్భము లాడెద, విద్దురితము చేతఁ గలుగు౹నేదో తెలియుమా! ౨౩

చ. తనయుఁడు వాఁడు సద్గుణము ౹ తన్నెడఁబాయఁగఁ గ్రూరచిత్తుఁడై
పనులను వేనిఁజేయఁ గడుఁ౹బాపమువచ్చునో వానిఁ జేయుచున్
మునిసురభూసురోత్తమసు౹మూహసమాదృతి గాంచలేక దు
ర్జనుఁ డగునంచుఁ బల్కుచు రు౹షం దగియుండఁగఁ గాంచి యాతఁడున్. ౨౪

తే. ఈపురంధ్రి శపించు నం౹చెన్ని పలికె;
వాఁడు నీబంధుజనులకు ౹ వైరియగును
గామినీ ! యంచు పలికి వేగ మె కనుంగొ
నఁగఁ దరముగాక చనియె; జ౹నని యు నంత. ౨౫ 2068

చ. కనఁబడకుండ వాఁడరుగఁ ౹ గా యశమొందిన దౌట వార్తదా
ని నొరుల కించుకేఁ దెలియ౹నేరనిరీతిని దాఁచి యింటికిం
జనియెను; గర్భభారమున ౹ శ్రాంతి వహించిన నాదుతల్లి నన్
గనియెను యుక్తకాలమున ౹ గాథను దీనిని నాకు నాదృతిన్. ౨౬ 2069

క. నారదముని భగవంతుఁడు, చేరంగాఁ బిల్చి చక్కఁ ౹ జెప్పెన్; నాఁడే
యారంభముగా బంధుల, వైరులఁగాఁ దలఁచుచుండు౹వాఁడం జుండీ. ౨౭ 2070

క. ఎవరెవరు బంధుసంతతి,ని విరోధిగ నన్ను సతము౹నెఱిఁ దలఁతురో వా
రిని ద్వేషింతును వారును, నను ద్వేషించుటయు మీమ౹నసులే యెఱుఁగున్.

సీ. ఉగ్రసేనుఁడు దురు౹ద్యోగి; దేవకుఁడు దురాశయుం డగు; ధూర్తుఁ౹డగును జుండి
వసుదేవుఁ; డిట్టింద్రు ౹ వారిబంధువు లగుదురు; గాన వీరలఁ ౹ దొడరిచంప

దోషమబ్బదు నే సుతుఁడను గంధర్వున కుగ్రసేనునితనయుఁడను గాను
కనుక నే వసుదేవతనయుల నిర్వుర వధియింపుఁ డని పల్కి । వాఁడఁ గఠిన

తే. తరముగా; బలవంతమా । కరివరమున
బాలురను జంపఁజేసియే । పరమునందు
యమునకుం బూజఁ గావింతు; । నవల వారి
జనకుఁ డాదిగఁగలవారు । సమయఁగలరు. ౩౧ 2072

క. అరితనయులఁ జంపించెదు, తరుణంబున నుగ్రసేనధాత్రీపతి య
క్కరణిఁ వసుదేవుండును, బరికింతురుగాక! నందపార్థివుఁ డట్లే. ౩౧ 2073

తే. దేవకుండును యాదవుల్ । తీవ్రశక్తు
లైన గోపాలకులు వారి । ననుసరించి
యుండు వారలు శోకాశ్రు । లురుల నున్న
నయనములఁ గాంత్రుగాక! యాతనయుల మృతి. ౩౨ 2074

క. మనదేశములందుం గల, జనులను దత్తైర్వైరభూరిసంగరమును జూ
డను బిలిపింపుఁడు వేగమ, యనిపల్కెను మఱియుఁ గంసుఁ । డాహాస్తిపకున్.]

*క. పరికించి మహామాత్రా!, కరిపరమును ద్వారసీమఁ । గదియించి వెసన్
బోరిపుచ్చఁ జేయుమా యా, యిరువుర వసుదేవసుతుల । నెల్లరుఁజూడన్. ౨౪

క. రాఁగలచతుర్దశి ధను,ర్యాగము శాస్త్రోక్తరీతి । నారంభింపం
గాఁ గడు శుభములు గల్గును, సాగింపుఁడు దాని నట్లె । సాధువు లలరన్. ౨౫

క. వరదుండగు రుద్రునకున్, నిరుపమునకు వివిధభూత । నికరేశునకుం
బరితృప్తిగ మేధ్యపశూ,త్కరమును విశసింపుఁ డనుచుఁ । గట్టడఁ జేసెన్. ౨౬

తే. అర్థతంత్రజ్ఞుఁడైన భోజావనీశుఁ
డంత యదుపుంగవుండయి । యమలచిత్తుఁ
డైన యక్రూరునిం బిల్చి । యతనికరముఁ
దనకరంబునఁ గదియించి । తగ వచించె. ౨౭ 2079

క. దానపతీ! యక్రూరా!, మానస మాదృతి దగంగ । మైత్రి నెఱపఁగాఁ
బూనుము కార్యం బొక్కఁడు, నీనుండియె కాఁదగినది । నేఁడు కలిగెఁజూ!

ఆ. వృష్ణికులజులైన । వీరులయందును, భోజనృపులయందుఁ । బోలఁ దలఁప
నిన్ను మించు నట్టినెయ్యుఁడు వేఱొకఁ,డుండఁ బోఁడు నమ్ము । మోమహాత్మ!

చ. తలఁపఁగ గొప్పకార్య మది । తాఁ దనయంతన కల్గె; నాకు ని
మ్ముల సఫలంబు చేయఁదగు । ప్రోడవు నీవని తోఁచెఁ గావునన్

* ఇచ్చట నుండి గ్రంథభాగమని యెఱుంగందగు.

జలరుహనాభు విష్ణు బలశాసనుఁ డెంతయు నాశ్రయించి స
త్ఫలమును బొందినట్లుగ నె భారతరంబగు కార్యసిద్ధికై. ౨౮ 2082

క. నిను నాశ్రయించినాఁడను, బని యది యేమందు వేమొ వసుదేవసుతుల్
కనఁబడుదురు నందవ్రజమున వారలఁ దోడితేరఁ బొమ్మచ్చటికిన్. ౨౮౪

చ. అరదము దీని నెక్కి చని యానకదుందుభిపుత్రయుగ్మ మీ
యరదము నెక్కఁజేసి ప్రియమారఁగఁ దోడ్కొని రమ్ము; పొమ్ము స
త్వరముగ; విష్ణుసంశ్రయులు దానవవైరులు నైన దేవతల్
ధరణిని బుట్టి వేఁడిరఁట దానవవైరి జనించె నట్టులే. ౩౦౪ 2084

క. ఇరువురు వారలు మృత్యువు, లరయఁగ నాకగుదు రనుచు నార్యా! మునుచే
సిరి నిశ్చయం బటంచుక్, సురముని తెల్పంగ వింటి సురలపలుకులన్. ౩౧

క. పరికింప నెంచినాఁడను, త్వరగాఁ జని నందగోపతతితో నాయి
ర్వురఁ దోడితెమ్ము కాన్కల, ధరణీశున కిడఁగఁ దగువిధంబున వారల్. ౩౧

క. కొనివత్తురు; వారలతోఁడను దేవకికొడుకు లిచ్చటం జేరం గా
లునిబోలుకుంజరముచే,తను జంపింతును నితాంతదర్పం బలరన్. ౩౧౪ 2087

క. ఒకవేళ దానిఁ దప్పిం,చుకొనిరిపో యశనులట్లు శోభిల్లుచు నె
ట్టికడల నపజయ మొందని, ప్రకటపరాక్రములు మల్లరాజు లలరుటన్. ౩౨

క. వారలచేఁ జంపించెద, వారిర్వురు మృతినిబొంద వసుదేవాదుల్
ఘోరార్తిం గాంతురు; మఱి, వారిం దద్బంధువులను బట్టి వధింతున్. ౩౨౪

తే. భోజులను వృష్ణిదాశార్హముఖుల మఱియు
వృద్ధుఁడయ్యును రాజ్యంబు నేలఁగోరు
చున్నయట్టి నాజనకు నాయుగ్రసేను
నతనిసహజన్ము దేవకు నితరరిపుల. ౩౩౪ 2090

క. పరిమార్చెద నోసఖుఁడా!, తరువాతక్ గంటకరహిత యగుం జుమ్మీ!
ధరణి యిది జరాసంధుఁడు, గురువగు; ద్వివిదుండు సఖుఁ డగుగుక్ మిగులంగన్.

సీ. నరకుఁడు బాణశంబరులు నాయం దెప్పస్నేహంబు నెంతోయుంచిన మహాను
భావులు నగుదురు; వారలఁగూడి నే నమరులయెడఁ గడునాదరంబు
గలిగిన రాజుల ఖండించి యీభూమి ననుభవించెద మోదమలరుచుండ;
నీవిధమెల్ల నీవెఱిఁగి బాలకులగు రామకృష్ణులఁ గొనిరమ్ము; మిమ్ముఁ

తే. జంపుదు రటంచుఁ జెప్పక చాపయాగ
మును గనుంగొన యదుపురమునఁ జెలంగు
సంపదలఁ జూడఁ దగునని చక్కఁ దెలిపి
తోడితెమ్మని పల్కె నక్రూరుఁ డపుడు. ౩౨ 2092

చ. మనుజవరేణ్య! స్వీయమృతిమార్జన మొప్పఁగఁ జేయుపాంటెని
చ్చును దలపోయు టీయది ప్రశస్తమనం దగియున్న దైననున్
జను లొనరించుయత్నములఁ జక్క ఫలింపఁగఁజేయు దైవమే
యనఁదగు సిధ్యసిద్ధుల నహంకృతిమాని సమత్వ మొందుచున్. ౩౭ 2093

చ. జతనము చేయఁగావలయు ధాత్రిస్థలిపై మనుజుండు నెమ్మదిన్
జతపడుకోర్కి యెవ్విధిని సాగక దైవముచేత నిష్ఫలం
బతిశయకష్టదంబు నగునట్లుగఁ జేయఁబడంగ మాన కా
వితమునఁ బెంచుచుండు నిది వింతగదా తలపోసి చూచినన్. ౩౮ 2094

క. తనయత్నము ఫలియించిన, మనమున హర్షించు వేళ మార్గంబైనం
గని శోకించును; నే నో, జనవర! నీశాసనంబుఁ జక్క నొనరుతున్. ౩౯ 2095

చ. అని పలుకంగఁ గంసుఁ డతిహర్షము నొందుచు నాతనిన్ జనం
గను సెలవిచ్చి తక్కఁగలకార్యధురంధరు లైనమంత్రులం
జనుఁడని పంపి యంతిపురి చక్కటి కేగెను రాజశాసనం
బును గొని వారలెల్లరును బోయిరి స్వస్వనిశాంతముల్ గనన్. ౪౦ 2096



ముప్పదియేడవయధ్యాయము.

శ్రీహరి కేశిదానవు వధించుట.

ఉ. కంసమహీధవుండు మురఘుస్మరుఁ జంపఁగఁ బంపియున్న యా
మాంసలకాయుఁ డాయసుర మత్తుఁడు కేశి యనంగ ఖ్యాతుఁడై
హింస యొనర్చుకార్యమున నెంతయు నాదృతి పూని ఘోటకో
త్తంస మనంగఁ బొల్చి ఖురదారుణఘట్టన ముర్వి నేఁచఁగన్. ౧ 2097

చ. మెడపయిఁ బొల్చువెండ్రుకలు మింటఁ జరించెడు మేఘపంక్తులన్
బడలువడంగఁజేయ నటఁ బర్వెడునట్టి విమానసంతతిన్
విడివడఁజేయ నొక్కమొగి వేగమ నిక్కఁగ భూరిహేషలన్
బుడమి గలట్టిప్రాణుల సమూహము భీతిలి పాఱఁజేయుచున్. ౨ 2098

*[చ. కనులు విశాలముల్, మొగము గన్పడునృతబిలంబునాఁ గనుం
గొన వికటంబుగా, గళము గొప్పది నీలమహాంబుదంబు నాఁ
దనువు చెలంగు నాశయము దారుణమైతగుఁ గంసవాంఛితం
బును నెఱవేర్చు పూన్కియును బోలఁగఁ గల్గినకేశి యేగఁ దాన్.] 2099

చ. గురుతరహేషలన్ బెలుచ గోకులమెల్లను భీతిలంగ ని
ర్భరగతిఁ జేయుచున్ మఱియు వాలజలోమవిచాలనంబులన్

* అధికపాఠశ్లోకమున కిది తెలుఁగు.

బరిచలతాంబుదంబుగ న॥భంబు గనంబడఁజేయుచున్ మహా
మురదనుజాంతకున్ సమర॥భూమికిఁ బిల్వఁగ నట్టి రోయుచున్. ౨ 2100

చ. తనదుపరాక్రమంబు విదితంబుగఁ జేయఁ దలంచి యున్న కే
శిని భగవంతుఁడైన సరసీరుహనేత్రుఁడు కాంచి గోకులం
బునఁ దగువారికెల్లరకుఁ ॥ బోటుమగం డనఁ దానెయాటఁ బి
ల్చెను మృగరాజనాదమునఁ ॥ జివ్వకు రమ్మని సంతసంబునన్. ౨ 2101

మ. దనుజేంద్రుండును సింహనాదము నితాంతస్ఫూర్తి గావించి త
న్ననిలో మార్కొన వచ్చువానిని మహాహర్షోద్ధతిం బొల్చువా
నిని గృష్ణుం గని యాస్యగహ్వరముచే ॥ నింగిన్ వడిన్ మ్రింగ నెం
చినజాడల్ గనుపింప రోషమున వచ్చెన్ మార్కొనం గోరుచున్. ౨౹ 2102

చ. ఇతరులకించుకేఁ జెనకనేనియు మీఱఁగనేని శక్య మే
వితమునఁ గాకయే పొలుచు ॥ వీరుఁడు చండజవంబుమీఱ ను
ద్ధతి నరవిందలోచనుని ॥ దాఁచెను వెన్కటికాళ్లచే; నతం
డతులితశక్తి దానిఁ దను ॥ వంటకయుండఁగఁ జేసికొం చొగిన్. ౩ 2103

మ. కరయుగ్మంబునఁ బాదయుగ్మమును జిక్కంబట్టి వే దిర్దిరం
దిరుగం జేసి సుపర్ణుఁ డుగ్రఫణి నేతీ రొప్పఁగాఁ ద్రిప్పు న
క్కరణిం ద్రిప్పి యవజ్ఞయుం గనఁబడంగా నూఱువిండ్లంతయం
తరముం గల్గిన భూమిభాగమున గాత్రంబుం బడన్ జిమ్ముచున్. ౪ 2104

క. చెలికాండ్రతోడ వేడుక, నిలుచుండెను వాఁడు సోలి ॥ నిముసంబునకే
తెలివొంది లేచి రోషము, జ్వలనాకృతిమీఱ వివృతవదనుం డగుచున్. ౪౹

క. హరిపైకి నడరె; నవ్వుచుఁ, బురుషోత్తముఁ డాత్మసవ్యభుజమును జొనిపెన్
సురవైరివక్త్రమున నె, వ్వరుసన్ భుజగంబు బిలము ॥ వడిఁ జొచ్చునటుల్. ౫

సీ. ఆరీతి హరిసవ్యమైన బాహువుఁ జొన్ప దానిస్పర్శంబున ॥ దనుజుదంత
ములు తప్తలోహంపుముద్ద సోఁకిన నెట్లు రాలునో యారీతి రాలె; మఱియు
నామహాత్మునిదగు ॥ హస్త మాతనువునఁ బెరుగసాగెను జలోదర మనఁబడు
నామయ ముపశాంతి ॥ నందఁజేయకయున్న నభివృద్ధినొందు నెట్లట్లు, దాన

తే. శ్వాస మెడలంగరామిచేఁ ॥ జరణములను
దన్నుకొనుచుఁ జెమర్ప గాత్రంబు, కన్ను
లట్టె గిరగిరఁ దిరుగంగ ॥ నసువులు మల
మపుడె వెడలంగఁ బడియుండె ॥ నవనిమీఁద. ౬ 2107

క. తనవెనుబుజ మాదనుజుని, తనువునఁ బెరుగంగ దానిఁ ॥ దద్దయుఁ బండం
గను బగులు దోసపండుగ,తిని దగుతత్తనువునుండి ॥ తీసికొనెఁ ద్వరన్. ౬౹

క. దనుజు ననాయాసంబునఁ, దునిమితి ననునచ్చెరువును ౹ దోఁపని చిత్తం
బున నున్న కృష్ణుపయి దేవనికరములు కల్పకుసుమ౹వర్షముఁ దమితోన్. ౮ 2109

క. కురియించుచు మిగుల నుతించిరి; భగవద్భక్తవితతి ౹ శ్రేష్ఠుం డగుచున్
సురముని యనఁదగు నారదుఁ, డరుదెంచె నుదారకర్ముఁ ౹ డగు కృష్ణుఁ గనన్. ౯

—నారదమహర్షి శ్రీకృష్ణుకడకు వచ్చుట.—

క. ఏకాంతంబున వ్రజమున, శ్రీకృష్ణుం గాంచి యిట్లు ౹ చెప్పెం గృష్ణా!
శ్రీకాంత! యప్రమేయా,త్మా! కృష్ణా! యోగనాథ! ౹ తామరసాక్షా!. ౧౦ 2111

సీ. వాసుదేవాఖిలా౹వాస! సాత్వతవర్య! ప్రభువరేణ్యా! దారు౹పటలమందు
నంతరంబున నగ్ని ౹ యణఁగియుండెడురీతి సర్వభూతములలోఁ ౹ బర్వియుండు
వతిగూఢముగ నుండు ౹ వంతియకాక బుద్ధికి నతీతుండవై ౹ సకలమునకు
సాక్షివై విమలిన౹స్వాంతులకుం గననగుచుఁ బరిచ్ఛిన్న౹మైన మనసు

తే. గల్గువారల కెవ్విధిఁ ౹ గానఁబడక,యును దెలియ శక్యమేగాక ౹ యుందు వీవు
సర్వమున కీశ్వరుండవు ౹ సకలవిదుఁడ, వో౹మహాపురుషా! దేవ౹తోత్తమతమ!

ఉ. తామరసాక్ష! నీవును స్వ౹తంత్రుఁడవై మఱి నీదునిచ్ఛచే
నామెయి నాత్మమాయఁ గొని ౹ యాదిగుణంబులఁ బుట్టఁజేసి యే
మేమి తలంతువో యది ఫ౹లించుతలంపుగలట్టి నీవె యు
ద్దామగుణత్రయంబుననె ౹ ధాత్రి సృజింతువు ప్రోతు ద్రుంతుసూ! ౧౨ 2113

*క. ఆనీవు రాజరూపులు, గా నిల జనియించినట్టి ౹ కఱకుదితిజులన్
దానవులను బ్రమథుల రక్షో౹నాథులఁ ద్రుంప సాధు౹కూటము గావన్. ౧౩

క. ఇల నవతరించినాఁడవు, జలజాక్షా! మా యదృష్ట౹సరణిని గురుహే
షల సురల బెగడఁజేసెడు, ఖలహయరూపుని దురాత్ము ౹ ఖండించితిగా. ౧౪

క. అవలీలఁ గేశిదనుజుని, జవమారఁగఁ జంపితీవు ౹ చక్రధరా! నీ
ని విపులహేషల వినుచున్, దివమును విడిపోవుచుంద్రు ౹ త్రిదశులు భీతిన్.

క. రే పొక్కదినము గడువఁగ, నో౹పరమేశా! దురాత్ము ౹ లుద్ధతు లగుచుం
జూపట్టు మల్లు లందఱు, బ్రాపింతురు స్వర్గపదము ౹ రణవినిహతులై. ౧౬ 2117

సీ. చాణూరు ముష్టికు ౹ సమయింతు వీవె యమ్మఱునాఁడు శక్కి౹నమల్లురను వ
ధింతువు సమదహా౹స్తిని బొలియింతువు కంసుని రూపఱఁ ౹ గా నోనరుతు
వీకార్యముల నెల్ల ౹ నేఁజూడఁ గలవాఁడఁ గంసుని సరిపోలు ౹ ఖలులఁ బంచ
జన ముర యవనుల ౹ ఘనబలు నరకుని వధియింతు వీవె య౹వార్యశక్తిఁ

తే. జూడఁగలవాఁడ నేను జిష్ణుని మదంబు
నడఁచి స్వర్గంబు నందున్న౹యట్టి పారి

* “సత్వంభూధరభూతానాం దైత్యప్రమథరక్షసాం” అని మూలము.

జాతమును దెచ్చి కృష్ణ! యీ§భూతలమున
నిలుపుదువు పండు వగునా క§నులకు నెంతో. ౧౮ 2118

క. విను వీర్యశుల్కలక్షణ, మనఁదగు సుద్వాహసన్మ§హము వీరులకుం
దనయ లగురుక్మిణీప్రముఖ నిఖిల కన్యకల నీవు § గ్రహియింప నగున్. ౧౯

క. లోకేశ! ద్వారకాపురి, భూకాంతుం డైనన్నృగుని § ముక్తునిగా నీ
వే కరుణం బొనరింతువు, గాక మహా§శాపము విడఁ § గల్గి సుఖపడన్. ౧౭ 2120

చ. వనజదళాయతాక్ష! తమిఁ § బత్ని నిగూఢి స్యమంతకంబు నా
జనుమతిఁ గాంచు రత్నమును § శ క్తి దలిర్పఁగఁ దెత్తు; వల్లె వి
ప్రుని మృతపుత్రులన్ మరలఁ § బూన్కి సజీవులుగా నొనర్చి యా
తని కిడి సంతసంబును ని§తాంతము గూర్తువు చిత్రరీతిఁగన్. ౧౮ 2121

క. నీ పేరుగొన్న పౌండ్రక, భూపతిఁ బొరిగొందు వంత§బోవక శ్రీకా
శీపురిఁ గాల్తువు; భయద, వ్యాపారుని దంతవక్త్రు § వధియింతు హరీ! ౧౯ 2122

తే. రాజసూయాధ్వరము ధర్మ§రా జొనర్ప, నందు శిశుపాలుఁ బొరిపుత్తు§వవల ద్వార
కాపురంబున వసియించి § కవులవినుతి, కర్మములగు పరాక్రమ§వ్యాపృతులను.

క. ఒనరింతువొ యెవ్వానిని, గనుచుండుదుఁ బిదప నీవు § కాలాకృతి మే
దిని బరువు నశింపఁగఁ జేయను బార్థునిసారథివయి § యరులబలములన్. ౨౦౫

క. లెక్కకుమించిన వారలఁ, జక్కాడఁగఁ జూచువాఁడఁ § జక్రధరా! నీ
వొక్కఁడవె యెల్లతావుల, నిక్కము గనఁబడుదు వాత్మ§నిశ్చలశక్తిన్. ౨౧

సీ. ఆత్మీయమగు పరమా§నందనిష్ఠచే నఖిలకామంబుల§యందు బూర్ణుఁ
డవయి చిచ్ఛక్తిదో § సువిమలమాహాత్మ్యమున నాత్మమాయదై § తనదుకార్య
రూపగుణప్రవాహ§హోపరతిం గాంచి సత్యసంకల్పుఁడు § జ్ఞానమూర్తి
యని పండితో త్తము § లనువదింపఁగ నొప్పు నిను నాశ్రయించెద § వనజనాభ

ఆ. యాత్మమాయ చేత § నభికల్పితము లగు, వివిధకల్పములను § వెలసి వాని
నాశ్రయించి లీల § యదుకులంబున మర్త్య, తనువుఁ దాల్చి తెలియఁ § దగనిశక్తి.

క. యదు వృష్ణి సాత్వతులలో, మొదటన్ లెక్కింపఁ బడుచు § భూరిమహిమ మొ
ప్పఁ దగుచు స్వాశ్రయుఁడవునై, పొదలెదునీ కంజలులను § బొనరింతుఁ దమిన్.

తే. పరమభాగవతులలోనఁ § బ్రథమగణ్యుఁ
డైన నారదమౌని య§య్యదుపతి హరిఁ
గాంచి వందన మిడి హరిఁ § గనుటవలని
సంతసము నొంది సెలవంది § చనియె స్వేచ్ఛ. ౨౮ 2128

క. భగవంతుఁడు గోవిందుఁడు, జగడంబునఁ గేశిదనుజుఁ § జంపి ముదమునన్
దగియెడు గోపకులం గలి, సి గోవులన్ గాచుచున్ ప్ర§సిద్ధియుఁ దగఁగన్. ౨౯

## శ్రీకృష్ణుఁడు వ్యోమాసురుం బొలియించుట.

క. నందవ్రజమునకు మహా,నందము గలిగించుచుండె నారదముని పో
వం దగ నొకనాఁ డాహరి,యుం దనయాశ్రితులఁగూడి యురువనములలోన్.

క. గోవుల మేపుచుఁ జనిచని, యావిధమునఁ గొండచఱులయం దవి తుత్తుల్
పోవఁగ మేయఁగ గోపకు, లావసుధాధరము సానువందుఁ దిరుగుచున్. ౨౬

సీ. కొందఱు గొఱ్ఱెలై కొందఱు దొంగలై యమరి కావలివార లగుచుఁ గొంద
ఱుండ దొంగయు గొఱ్ఱె నొరులెఱుంగక యుండఁ గొనిపోయి పర్వతగుహను దాఁ
యుండఁ గావలివాఁడు నుపమమై వెదకి యాచోరునికడనున్న సారహీన[గి
జంతువు విడిపించు పంతముగల "నిలాయనకేళి"ఁ దేలుచు నచటనుండి
తే. రించుకయు భీతిలేకయె యిట్టులాడు
చుండ మయపుత్త్రుఁడై నట్టి వ్యోమనామ
కాసురుఁడు పెక్కుమాయలయందు నేర్పు
గలుగు వాఁ డొక్క గోపకు కాయ మూని. ౨౭ 2132

క. తానొక చోరుండయి యజ,మై నటియించెడు కుమారు నవలీలఁ గుభృ
త్సానుగతగుహలఁ జేర్పం,గా నెంచి జవంబుమీఱఁగాఁ గొనిపోయెన్. ౨౮

క. ఈలీల నొకొక్కనిగా, బాలుర నెత్తుకొనిపోయి వారిన్ గుహయం
దోలి నిడి భూరిమాయా,శీలుఁడు శిలచేత ద్వార సీమం గప్పెన్. ౨౯

ఆ. వానిచేతఁ బడనివారు చతుఃపంచ,సంఖ్య మించకుండ సానువందు
నుండి; రతనికృత్య మూహించి సజ్జన, శరణదుఁడయి చెలఁగు హరియుఁ గరుణ.

క. గోపకులను గైకొనుచున్, వే పోయెడు వ్యోమదనుజు వృకమును మృగరా
జే పగిదిఁ బట్టుకొనునో, యాపద్ధతిఁ బట్టుకొనియె నాత్మబలమునన్. ౩౦ 2136

మ. బలవంతుండగు వ్యోమదానవుఁడు రూపం బద్ది పోనాడి ని
స్తులశైలంబును బోలుస్వీయతనువుం దోడ్తో గ్రహించెన్ గడుం
బల మెల్లం గనఁజేసి సంగ్రహణసంప్రాప్తప్రభూతార్తులం
దొలఁగింపన్ జతనంబుచేసియు నశక్తుం డయ్యె నట్లాటచేన్. ౩౧ 2137

చ. హరియును దోర్యుగంబున మహాసురు నాతని బిట్టుపట్టి వే
ధరణిఁ బడంగఁ ద్రోచి సురతల్లజు లభ్రమునుండి చూడనా
శరుని వధించె నెప్పగిదిఁ జంపుదురో పశువున్ జనంబు ల
క్కరణిని; యంత ద్వారమును గప్పిన ఱాతిని జిమ్మి బాలురన్. ౩౨ 2138

క. ఆకష్టమునుండి విడన్, శ్రీకృష్ణుఁ డొనర్చి వెడలఁ జేయుచు సురలున్
గోకులవాసులు పొగడఁగఁ, గైకొని గోకులముఁ జేరెఁ గనకాంబరుఁడున్.

## ముప్పదెనిమిదవయధ్యాయము.

### అక్రూరుఁడు గోకులముఁ జేరుట.

క. ఆరేయి మహామతి య, క్రూరుఁడు మథురాపురిని ముకుందుని చింతన్
గూరినమదిఁ బుచ్చి జవం, బారఁగ నరుణోదయమున । స్యందనవరమున్. ౧ 2140

క. ఆరోహించి వ్రజంబును, జేరంజనె; భూరిభాగ్యసిద్ధిం గనున
క్రూరుం డాతఁడు చనుచో, వారిజపత్రాక్షునందు । భక్తి యసమమై. ౧౪

క. తనమదిఁ గుదురఁగ నిల్వం, గ నిట్టు లూహించె; నౌర! । గాఢసుకృత మే
జని నొనరించితినో చేయ నోచితనో యెట్టి తపము । ననుపమరీతిన్. ౨౪ 2142

ఉ. దాన మదెట్టిపాత్రునకు । దైవతమర్మ మతి నిచ్చినాఁడనో
కానఁగఁ బోవువాఁడ హరిఁ । గంజదళాక్షుని వాసుదేవు శ్రీ
జాని నిదెట్టిపుణ్యమొకో । స్వాంతమునన్ విషయప్రసక్తియే
కానఁగ నయ్యెడిం దలఁపఁ । గా హరిదర్శన మబ్బు టబ్రమే! ౩ 2143

తే. చరణభవునకు శ్రుతుల యుచ్చారణంబు
నెట్టు లట్టుల ననుఁబోలు । నట్టివాని
కరయఁగా నుత్తమశ్లోకుఁ । డైనకృష్ణు
దర్శనము దుర్లభం బని । తలఁచువాఁడ. ౪ 2144

సీ. ఇట్లు నిస్పృహుఁడనై । యెన్నుచుండఁగ రాదు; నదిని బ్రవాహంపు । నడకననుస
రించి పోయెడుతృణ । సంచయం బొక్కొక్కతఱి దరిఁజేరు చందమున నధముఁ
డనయిన నాకుఁ గృ । ష్ణుని గాంచు భాగ్యంబు గలిగినను గా । లగతినిబట్టి
యాదృచ్ఛికంబుగ । నరుదగుపుణ్యసంగతిఁ గల్గవచ్చు; యో । గితతి కెన్న
తే. ధ్యేయ మగునందనందను । దివ్యపాద, పంకజద్వయమునకు ని । శ్శంక మ్రొక్కు
వాఁడఁ గావున నాయశు । భంబు లెల్ల, నేఁడు నశియించె నిద్దియా । నిశ్చయంబు.

క. జననము నాయది సఫలం, బనఁ దగు హరిపాదపంక । జాంతికమునకున్
ననుఁ బంపిన యాకంసుం, డొనరించె ననుగ్రహంబు । నుతతర మదియా. ౬౪

క. హరిపద నఖర మరీచుల, నిరతిని నెఱనమ్మి తొల్లి । నిర్మలమతులౌ
పరమమునులు తరియించిరి, దురత్యయం బైనభవ । తోయధి లీలన్. ౭ 2147

క. ఆవిష్ణు వవతరించెను, భావింపఁగఁ గృష్ణుఁడుగను । బరమేశ్వరుఁ డై
తా వఱలు నామహాత్ముని, పావనపదపంకజములఁ । బరికింపంగన్. ౭ 2148

చ. అరుగుచునున్నవాఁడఁ గద । యబ్జభవేశ్వరముఖ్యదేవతో
త్కరములు లక్ష్మియున్ మునివ । రోత్తంసులు భక్తులు పూజచేయఁగాఁ
బరమము నొంచుఁ గూడఁజను । బాలురతోడ వనంబునందు నా
దరమున నాలమేపఁజను । తత్పదపద్మముఁ జూచు టొప్పదే? ౭౪ 2149

సీ. గొల్లపూఁబోడుల యుల్లంబులం దగుకుంకుమపంకంబు నంకితముగఁ
దనరి మహైశ్వర్యమునఁ దగి సౌభాగ్యఖనియయి ముక్తినీయను సమర్థ
మగుచుఁ గృపాకరంబయి ప్రేమమాత్రసులభ్యమై యలరారు లలితకృష్ణ
చరణాంబుజంబులఁ బరమపానములఁ గనఁ బోయెదను; మృగగణము లివిగో

తే. నన్ను వలగొనిపోవుచు నాకు మేలు, గలుగుజాడను దెల్పెడుఁ గనుకఁ జారు
తరకపోలనాసికమయి తనరి సుస్మి,తావలోకన యుతనయనాబ్జ మగుచు. ౮౪

క. సురుచిర కుటిలాలకములఁ, బరమాద్భుత మగుచు నున్న పరమేశ్వరు సుం
దరవక్త్రచంద్రబింబముఁ, బరికింపఁగఁగలను బూర్వభవ భాగ్యమునన్. ౯

మ. క్షితిభారంబును మాయ జేయఁగ మదిం జింతించి యాత్మేచ్ఛచే
ధృతమర్త్యాంగము చేత వెల్గుచు సుకాంతిస్థానమై యొప్పన
చ్యుతు సందర్శన మీదినంబుననె నా కొప్పారునే నీక్షణ
ద్వితయస్ఫారఫలంబు కల్గినటు చింతింపం దగుం జక్కఁగన్. ౧౦ 2152

వ. కార్యంబునకుఁ గారణంబునకుఁ దా నీక్షణకర్తయయ్యు నహంకారవిరహితుండై
నిత్యంబగు స్వరూపసాక్షాత్కారంబున నజ్ఞానంబును, దత్కార్యంబగు భేదం
బును, దన్మూలంబగు విభ్రాంతి నెడఁబాసియు నీక్షితయగు తనయీక్షణంబున
స్వకీయమహామాయాసంయోగంబునం బ్రాణేంద్రియంబులతోడఁ దనయందే
రచియింపఁబడిన జీవులతోడ బృందావనభూరుహంబులందును, గోపికాసుందర
మందిరంబులందును విలాసంబున నాయాయికార్యము లొనరించుచు, నను
రక్తునివలెఁ దోఁపఁజేయుచు నెవ్వఁ డుండునో, సకలకల్మషహారంబులై నిరుప
మానమంగళకరంబులై యలరు నేపరమేశ్వరుని గుణకర్మజన్మములం గూడిన
వాక్కులు సర్వప్రపంచమ్ములకు జీవనంబును బరమశోభనంబును బరిశుద్ధత్వం
బును గల్గించునో, యట్టివాక్కులం బడయని నిర్భాగ్యుల సకలాలంకారములు
శవకృతాలంకారము లగునో, యట్టిపురుషోత్తముండు స్వనిర్మితధర్మసేతువుం
బాలించుమానవులకు సకలసుఖములం గల్గింప యదుకులంబున నవతరించి సర్వ
గీర్వాణగీయమానంబు నశేషమంగళంబు నగు నాత్మకీర్తిని నందవ్రజంబునం
బ్రకటించుచున్నవాఁడు. ౧౩ 2153

మ. తలపోయంగఁ బ్రభాతకాలము లివే తథ్యంబు; మేలౌ నటం
చు లలిన్ దెల్పెడుఁ గాన సాధుమతులన్ శోభిల్లు భక్తవ్రజం
బులకున్ సద్గతియున్ గురుండు త్రిజగత్పూజ్యాభిరామాంగుఁ డు
జ్జ్వలతేజుండును భూరిశక్తియును నై భాసిల్లు శ్రీకృష్ణునిన్. ౧౩౪ 2154

క. కనుఁగొనఁ జాలుదు నేఁడా, వనజాక్షుని నేత్రములకుఁ బర్వముగాఁగన్
గనఁబడువానిన్ లక్ష్మికి, మనఃప్రమోదంబుఁగూర్చు మాన్యుని గృష్ణున్. ౧౮

క. ఈక్షణములకున్ శ్రీహరి, సాక్షాత్పరమేశ్వరుండు ॥ సాక్షియునగు నా
త్ర్యక్షుని మిత్రుఁడు కన్పడ, నాక్షణమె రథంబు డిగ్గి ॥ యతిశయభక్తిన్. ౧౪

క. రాముఁ డనఁ గృష్ణుఁ డనఁగా, నీమహిరూపద్వయమున ॥ నెసఁగెడు ననుచున్
నామానసమున నెన్నుచు, వేమాఱు నమస్కరింతు ॥ వేడుక పొంగన్. ౧౪౫

ఆ. యోగివరులుగూడ ॥ సురుతరధ్యానార్థ, మెవరిరూపములను ॥ హృదయములను
నిలుపుదురో తదంఘ్రి॥నీరజములకు నే,మ్రొక్కువాఁడ జన్మ॥ము సఫలముగ.

క. వనముల వారలవెంబడి,గను దిరిగెడు గోపకులకు ॥ గాఢప్రమదం
బున వందన మొనరింతును, వనజేక్షణుఁ డాత్మపాద॥వనజంబులపై. ౧౫ 2159

సీ. ప్రాలియుండిన నన్నుఁ ॥ బరికించి కాలరూపాహికి భీతిల్లి॥ స్వాంఘ్రియుగము
నాశ్రయించిన వారి ॥ కభయం బొసంగెడు తనకరసరసిజ॥మును మదీయ
శిరము పయిం బ్రీతిఁ ॥ జేర్పకయుండునా ? యామహాత్ముని మృదు॥హస్తపద్మ
మును సమర్పించి వి॥బుధరాజు పొందఁడే యింద్రత్వమునుబలి ॥ యొసఁగుభక్తి

ఆ. మూఁడుపాదములకుఁ ॥ జోడగుభూమిని
నొసఁగుతఱిని నర్ఘ్య ॥ మొసఁగి త్రిజగ
దింద్రతను గనండె ॥ యెవ్వ రెవ్వరు దాని
నాశ్రయింతురో కృ॥తార్థులౌర! ౧౬ 2160

క. హరికరసరసిజ మదియే, యరుదుగ రక్తోత్పలముల ॥ నలరెడుతావుల్
పరితోవ్యాప్తములై తగ, సురుచిరవిహారణములందుఁ ॥ జొక్కు నబలలన్.

క. తనదగు సంస్పర్శంబునఁ, దనివొందఁగఁ జేయుఁగాదె ॥ తత్పాణిసరో
జనితమును నాదు శీర్షం,బున నుసుపక యుండునే ప్ర॥భూతకరుణచేన్. ౧౭

సీ. తాను క్షేత్రజ్ఞుఁడై ॥ మాననీయంబగు నీక్షణంబున విశ్వ ॥ మెల్లనందుఁ[మహి
జెలఁగు భూతముల లో॥పలను బాహ్యంబునఁ దగువృత్తుల నెఱుంగు ॥ నగణిత
మమున నొప్పారెడు ॥ మాధవుం డచ్యుతుం డలకంసుపంపున ॥ నరుగుదెంచి
నట్టి భృత్యుండని ॥ యరిపక్షమున నుండువాఁడని యూహింపఁ॥బోఁ డటంచుఁ

ఆ. దలఁచువాఁడఁ; గంసుఁ ॥ గొలుచుచున్నను లోనఁ
దన్నె యెన్నువాఁడ ॥ నన్నవిధము
సర్వవేత్తగాన ॥ సర్వసాక్షియుఁ గాన
నరయు ననుచు నెంతు ॥ నాత్మలోన. ౧౮ 2163

చ. తనదగు పాదకంజముల ॥ దాపున సాగిలిమ్రొక్కి లేచి స
ద్వినయముమీఱఁ గైమొగిచి ॥ వేడ్క భజించెడునన్ను సుస్మితం
బునఁ గరుణం జెలంగుచును ॥ బొంకముగాఁదగు వీక్షణంబులన్
గనఁగలఁ దంత నావగు న॥ఘంబులు శంకలు పోవ నెమ్మదిన్. ౧౯౫ 2164

చ. పరమముదంబు నొందఁగలవాఁడ; సుహృత్తముఁ డెన్న జ్ఞాతియున్
నిరతిని దన్నుఁదప్ప నొరు నిర్జరవర్యు నెఱుంగ నట్టిఁడుౘ
గరుణకుఁ బాత్రభూతుఁడును గాఁదగు నన్నును దీర్ఘబాహువుల్
త్వరగనె సాఁచి కౌఁగిటను వారక చేర్పఁగలండు సత్కృపన్. ౧౯ 2165

ఉ. అంతట నాదు దేహము మహోత్తరపాతక పంక ముక్తమై
యెంతయుఁ బావనంబె యగు నెల్ల మదాయతకర్మబంధముల్
వింతగ వీడిపోవు; మఱి వెన్నుఁడు కౌఁగిటఁ జేర్చి భక్తిమైఁ
జెంతను గై మొగిడ్చి తనుఁ జిత్తమునం దలపోయున న్మొగిన్. ౨౦ 2166

క. కని యక్రూరా! యార్యా; యని పిల్వంగలఁడు ప్రీతి; నపుడుగదా మా
జననములు సఫలములగును, మనుజుం డెవ్వాఁడు కృష్ణుమన్ననఁ గనఁడో. ౨౧

ఆ. అట్టివాని జన్మ మక్కటా! కాల్పనే, వ్యర్థ మగును గాదె యిద్ది యరయ;
సర్వసమత నొప్పు చక్రికి దయితుండు, గాని, సుహృదుఁ డొకఁడు గాని లేఁడు.

తే. అప్రియుండును ద్వేష్యుండు నరయ లేఁడు
లేఁడు పేక్షింపఁదగినట్టివాఁడు జగతి
విషమచిత్తము లేని యా విష్ణుమూర్తి
యమరతరు వాశ్రితులకె ప్రియం బిడుగతి. ౨౨ 2169

క. తనభక్తులనే భజియించు, చును గాంక్షితముల నొసంగు శుభదుండును గృ
ష్ణున కగ్రజుండు యదుకుల, మునఁ బూజ్యుఁడు నైన హరియు ముదమారంగన్.

సీ. వందన మొనరించి వరుసఁ జేతులు మోడ్చి యున్న నన్నుఁ బావలు యుగము
కౌఁగిటం జేర్చి నాకై దోయినిం బట్టుకొని గేహమునకుఁ బోవు నటనర్ఘ్య [సాఁచి
పాద్యాదిసత్క్రియా పటలిఁ గావించి యవ్వల బంధువులలోన వైరియైన
కంసుం డొనర్చెడు కార్యంబులను జెప్పుమని ప్రశ్న మొనరుచు ననుచు మార్గ

తే. మందు నక్రూరుఁ డీరీతి నాపరేశు
నెంతయుఁ దలంచుచుౘ రథ మెక్కిపోయి
గోకులంబును జేరెను; గ్రుంకె భానుఁ
డపరసాగరమునయందు నయ్యదనున. ౨౪ 2171

మ. చని యక్రూరుఁడు గోష్ఠమందు సకలాశానాయకోత్తుంగ పా
వన మాణిక్య కిరీటసంఘటిత భాస్వత్స్వీయపాదాబ్జ పాం
సుని కాయుండగు కృష్ణమూర్తి పదముల్ శుభ్రాంకుశాబ్జాదిశో
భనచిహ్నాంబుల భూమికిం దొడవులై భాసిల్లఁగాఁ గన్గొనెన్. ౨౫ 2172

మ. పరమాహ్లాదముగ ల్గె వానిఁ గనఁగాఁ బర్వెౘ మహాసంభ్రమం
బరుదౌ ప్రేమభరంబుచేఁ దగిఱె రోమాంచంబు గాత్రంబునౘ

ద్వర నానందభవాశ్రుబిందువులు నేత్రద్వంద్వముం గప్పె నం
త రథంబుఁ దిగి యారఁ; యీయవియె కృష్ణస్వామిపాదాంకముల్. ౨౪

క. చరణాంబుజరేణువు లివె, పరమశుభం బీయఁజాలు ॥ బ్రహ్మాదులకేఁ
బరిసేవ్యము లని యందుం, బొరలాడెఁ భక్తిరసము ॥ పొంగ నతండున్. ౨౫

సీ. కంసుపంపునఁ బురిఁ ॥ గదలిన యాక్షణంబుననుండి యాశ్వఫల్కునితనూజుఁ
డక్రూరుఁడు భయంబు ॥ నల్లిదంభమును శోకంబును విడనాడి ॥ కమలనయను
స్మరణంబునను గథాశ్రవణంబునను బదచిహ్నదర్శనమునఁ ॥ జిత్తమెల్ల
దన్మయముగ నుండఁ ॥ దాఁ జేయఁగాఁజాలె ననుటయే దేహ మెత్తిన జనులకు

తే. బరమపురుషార్థ మనఁ గళేబరఫల మన
ననెడున్యాయంబుఁ దెల్పంగ ॥ నడుగుఁదమ్ము
లందుఁ బొరలాడె; నీరీతి ॥ నతఁడు పొరలి
పొరలి మెల్లఁగ లేచి రాముండు హరియు. ౨౬ 2176

క. ఉన్నారు గోష్ఠముననే, యన్నట్టి వ్రజౌకసుల సుమాదృతివాక్యం
బెన్నుచు రథమెక్కి చనెం, గన్నులకుఁ ఫలము గూర్పఁగాఁ గోరి త్వరన్.

చ. చనిచని యావులఁ బిదుకు ॥ చక్కనితావున రామకృష్ణులఁ
గనియెను; నీలపీతరుచిఁ ॥ గ్రాలెడుచేలములఁ ధరించి చ
క్కనిశరదబ్జనేత్రములఁ ॥ గన్పడుచుఁ గడుఁ బొంపురంబు న
ల్లనిదియునైన దేహములు ॥ లక్షణయుక్తములై చెలంగఁగన్. ౨౮ 2177

ఆ. శ్రీవిలాసములకు ॥ భావింప వసతులై, నిడుదలగుచు బలిసి ॥ నెఱి దగంగ
నలరుకరము లొప్పనందములౌ మోము, లమర నాకుమారు ॥ లందుఁ బొదల.

ఉ. సుందరకాయు లందుఁదగ ॥ సుందరమూర్తులె యాచుఁ జూడఁగా
నందముగుల్కు నిమ్నగతు ॥ లారయఁగాఁ గలభంబులం బలెఁ
బొందుగ నొప్ప నంకుశము ॥ పూజ్యతరధ్వజవజ్రపద్మముల్
క్రిందుగఁ బాదచిహ్నములుగాఁ గనుపట్టుచు నావ్రజావనిన్. ౨౯ 2179

క. అలరించుచుండఁగా వా, రలు గొప్పమనస్సు లొప్ప ॥ రాజత్కరుణా
కలిత స్మిత వీక్షణములఁ, జెలఁగుచుఁ గనినంత నిష్టసిద్ధు లొసఁగుచున్. ౩౦

సీ. మనమున కెంతో హాయిని గల్గఁజేయుచు నత్యుదారములయి ॥ యలరుక్రీడ
లం దగి చక్క జలకములాడి మనోజ్ఞ వస్త్రముల్ ధరియించి ॥ వరుసఁ బుష్ప
హారముల్ వనమాల ॥ లరుదుగఁ గన్పడ ధరియించి రుచిరగంధము లలంది
కొని యుండి, రవ్వారుఘనలక్షణాంచితకాయులై యాద్యులై యీయఖిలము

*తే. నకును గారణభూతులై ॥ సకలజగము

* "ప్రధానపురుషా వాద్యౌజగద్ధేతూ జగత్పతీ" అనిభాగవతము,

లకు నధీశులునై జగ ¶ న్నికర మేఁచు
దుష్టరాక్షసరాజులఁ ¶ ద్రుంపఁగను ని
జాంశముల మానవాకృతు ¶ లమరియుండ ౩౧౫ 2181

క. బలుఁ డనఁ గేశవుఁడన నీ,యిల బిల్వఁగఁబడుచు స్వీయ ¶ హితతేజస్స్వా
ర్థుల దిక్కులఁ గలతిమిరం,బులఁ బోఁగొట్టుచును లీలఁ ¶ బొల్చుచు మఱియున్.

క. *కనకాంతరముగఁ దగు నిం,ద్రనీలభూధ్రంబుపోల్కిఁ ¶ దగునంజనయు
క్తిని మించు రజతపర్వత, మనఁ గృష్ణుఁడు బలుఁడు పొల్చి ¶ రాసమయమునన్.

మ. కని యక్రూరుఁడు కృష్ణరాముల జగ ¶ త్కల్యాణసంధానులన్
మన ముప్పొంగ రథంబు డిగ్గి పలుచున్ ¶ మైత్రిన్ స్వకీయాంగముల్
తనియంగాఁ బులకల్ చెలంగఁ బదుదా ¶ త్తప్రీతికృత్పాదముల్
గనుచున్ సాగిలిమ్రొక్కె సార్థకముగాఁ ¶ గన్ జన్మముం జేయఁగన్. ౩౮ 2184

క. వనజేక్షణ సందర్శన, జనితామోదమున బాష్ప ¶ సలిలమ్ము లొగిన్
గనులం గ్రమ్మఁగఁ దనుఁ గ్ర,మ్మిన యుత్కంఠాభరమున ¶ మించిన త్వరచేన్.

క. తనపేరుచెప్ప వందన, మొనరుచు చున్వాఁడ ననుచు ¶ నొయ్యనఁ బల్కం
గను జాలకుండె సంతస, మనునది యట్టిదియొ గాదె ¶ యారసిచూడన్. ౩౯ 2186

సీ. భగవంతుఁడైన యా ¶ పద్మాక్షుఁ డావిధ మెఱిఁగి మ్రొక్కినవారి ¶ యెడ నపార
వాత్సల్యమున నొప్పు ¶ వాఁడౌటఁ జక్రలాంఛితహస్తమునఁ బ్రీతిఁ ¶ జేరఁదీసి
కొని కౌఁగిటం జేర్చె ¶ ఘనకృపసంకర్షణుఁడు మ్రొక్కియున్న యా ¶ తఁడు సపర్య
కర్హుఁ డన్నతలంపు ¶ నంది కౌఁగిటఁజేర్చి తనపాణిపంకజం ¶ బున దదీయ

తే. హస్తమును బట్టుకొనితోడ ¶ ననుజుఁడు చను
దేర గృహమునకుం బోయెఁ ¶ జారువాక్కు
లలర స్వాగత మడిగి నిర్మలతరాస
న మిడి పదములు గడిగి వినయముతనర. ౪౦ 2187

చ. అతిథికి నర్హమై తగిన ¶ యమ్మధుపర్క మొసంగి ధేను వా
దృతిమెయి నిచ్చి మార్గమున ¶ నెంతయు నొచ్చినయాశ్వఫల్కస
త్సుతుని పదంబులం బిసికి ¶ శోభనమై మఱి పావనంబునై
హితమయి షడ్రసంబులను ¶ నెన్నఁగనై తగు నన్న మంతటన్. ౪౧ 2188

క. మనమునఁ బొడమెడు శ్రద్ధన్, దనివొందఁగఁ బెట్టి యతఁడు ¶ తమి భుజియింపన్
ఘనధర్మవిదుఁడు హలధరుఁ, డనూనమోదమ్ముమీఱ ¶ నతనికిఁ బిదపన్. ౪౨

చ. పరిమళముల్ ముఖంబునను ¶ బర్వఁగఁ జేయఁగఁ జాలుపచ్చక
ప్పురమును గంధమాల్యములఁ ¶ బూజ్యవిధిం దగున ట్లొసంగి ని

* "యథామరకతశ్శైలౌరౌప్యశ్చకనకాచితౌ" అని మూలము.

ర్ఝరముద మొందఁజేసె; నిటు ॥ రాముఁడు పూజలఁ దన్వఁగా మనో
హారగతి నొప్పునయ్యతిథి ॥ నప్పుడు కన్గొని నందుఁ డిట్లనున్. ౮౦ 2190

మ. అనుకంపారహితాత్ముఁడై కఠినుఁడౌ ॥ నాకంసుఁ డో మాన్య! మే
దిని జీవించిరె యున్న వాఁడుకద? యాదృప్తుఁడు పాలింప నా
తని చెంతన్ బశుఘాతుకుండు పశుసంతానంబు గావరిగ నా
తవిసంరక్షను గన్న గొఱ్ఱియలచందం బొప్ప మీ రుండుటన్. ౮౧ 2191

తే. ఎట్లు జీవించియున్నారొ ॥ యే నెఱుంగఁ; దనదు బ్రదుకునకై సహో ॥ దరిమహార్తి
నేద్వ నాలింపకే పాప ॥ మిది యనకయె, యామె గన్నట్టి శిశువుల ॥ హతము చేసె.

తే. అట్టిపాపాత్ముప్రాపున ॥ నధివసించు, జనుల బ్రదుకునకే చాల ॥ సంశయంబు
గలుగు నన నీక వారికుశలము నేవిధమునఁ బ్రశ్నింపఁ గలము? ॥ పూతహితచరిత.

చ. అనియిటు సత్యపూతములు ॥ నై మధురంబులునైన వాక్కులన్
వినయముమీఱఁగా నడిగి ॥ వింతగ సత్కృతి చేసి నందుఁ డా
తనిమదిఁ దృప్తిచేసె; నిటు ॥ దానపతీంద్రుఁడు పూజ లంది నె
మ్మనమున హాయిఁజెందె గత ॥ మార్గనితాంత పరిశ్రముండునై. ౮౩ 2194



## ముప్పదితొమ్మిదవయధ్యాయము.

### అక్రూరునితో రామకృష్ణులు సంభాషించుట.

చ. [అని శుకయోగి పల్కి మనుజాధిపవర్యున కవ్వలన్ వ్రజం
బునఁ గొనసాగి నట్టిహరి ॥ పూతచరిత్రము నిట్లు తెల్పె;] న
వ్వనజదళాక్షుఁడున్ హరియుఁ ॥ బావనరీతిని సత్కరింప నం
దనృపుఁడు గారవింపఁగ మ ॥ నంబున సంతస మబ్బి పొంగఁగన్. ౧ 2195

తే. చారుపర్యంకమందు న ॥ క్రూరుఁ డెలమిఁ, సుఖముగా నుపవిష్టుఁడై ॥ సురుచిరముగఁ
దనమదిం ద్రోవఁ గోరిన ॥ తలఁపు లెల్ల, నపుడు వడసెను వారిచే ॥ నాదరమున.

క. శ్రీనిలయుఁడు భగవంతుఁడు, తా నెంతొ ప్రసన్నుఁడైనఁ ॥ దానన్ బడయన్
రాని దొక యర్థ ముండునె, యైనన్ వాంఛింప రేది ॥ యైనను భక్తుల్. ౩ 2197

సీ. భగవంతుఁడైన దేవకిపట్టి శ్రీకృష్ణుఁ డంతట రాత్రి భు ॥ క్త్యంతమందు
నక్రూరు చెంతకు ॥ నరుదెంచి తమవారి విషయంబునం జాల ॥ విషమబుద్ధి
యైన కంసుం డెట్లు ॥ తాను మెలంగునో వాఁడేమి చేయంగ ॥ వాంఛఁ గొనిన
వాఁడొ యావిధ మెల్లఁ ॥ బ్రశ్నింపఁగా నెంచి పలికె నిట్లని తాత! ॥ పావనమతి

తే. వైన నీయాగమనము మే ॥ లైన యదియె
స్వాగతంబే? శుభంబు మీ ॥ కౌను గాక

సుహృదులకు జ్ఞాతులకు మఱి చుట్టములకు
సుఖము నారోగ్యమును జాలఁ జొప్పడుఁగద. 2198

చ. కులమున కెల్ల రోగమయి కొంకక పాపములం బొనర్చుచుం
దలఁపఁగ మేనమామయయి దారుణకర్మరతుండునై మహీ
స్థలి పయిఁ గంసుఁ డున్నతని దా నెసలారఁగ నస్మదీయులై
తలఁపఁగరాని బాముల సతంబును బొందెడువారి కచ్చటన్. 2199

తే. కుశలమేయని మే మడుగుటయు నేల?, కంసు ప్రజలకుఁగూడ నిక్కముగ క్షేమ
ముండునే? యక్కటా! మదినూహ చేయ, నిరపరాధులు జనకులు నిశ్చయముగ.

ఉ. వారికి మానిమిత్తమున వంత పొసంగెఁగదా? మనోహరా
కారులు పుత్త్రకుల్ మడియఁగాఁ బలుదుఃఖము లొంద మేమెగా
కారణ? మంతెకాక కలకాలము బంధన మయ్యె వారిక
క్రూర! మృదుస్వభావ! మదిఁ గోరదు మాత్మహితాళిఁ జూడఁగన్.

మ. చిరకాలంబుగ మిమ్ముఁ బోలు హితులం జేరంగ రాఁగోరు వాం
ఛ రహిం నేఁటికి భాగ్యవైభవమునం సాగం మిముం జూడ న
య్యె రయంబొప్పఁగఁ దెల్పఁగాఁదగును మీ రేతేర నే హేతువో
పరమాహ్లాదము నొందువాఁడ నను నొప్పల్కుల్ చెవుల్ సోఁకఁగన్. 2202

సీ. భగవంతుఁడే యిట్లు ప్రశ్నించెనే యంచు నక్రూరుఁ డెంతయు నాత్మ నలరి
కంసునకుం యదుగణముపైఁ గలిగిన వైరానుబంధము వాఁడు తెగువ
వసుదేవుని వధింపఁ బాల్పడుటయు నారదముని కంసునితోడ దనుజమర్ద
నుఁడు వసుదేవసూనుండుగాఁ బుట్టినవాఁడని తెల్పుట నాఁడె తన్ను

ఆ. నెట్టి కార్యమునకు నీచోటికిని దూత,గను బనిపినదియును గడఁగి యొక్క
మాటయే వదలక మధువంశజుఁడు గానఁ, దెలియఁ జెప్పె సత్య మలరునట్లు.

మ. పరవీరఘ్నులు రామకృష్ణులు మహీపాలాజ్ఞ నక్రూరుఁ డా
దర మొప్పం దనుఁ బంపుటల్ పలుకఁగాఁ దా రెంతయుం నవ్వి భూ
వరునాజ్ఞం దెలియంగఁ జెప్పిరి మదిం వర్ధిల్లువాంఛం వ్రజే
శ్వరుఁడా నందున; కాత్మజుల్ తెలుపు భావం బాతఁ డూహించుచున్.

క. గోపకులం జేరి జనం, బేపాఱఁగ గోరసముల నెల్లం గూర్పం
డాపగిది రాజయోగ్యము,లై పరఁగెడు కానుకలను ననువగురీతిన్.

క. సమకూర్పుఁడు పోఁదగు నర,దములం బన్నింపుఁ డెల్లి తరల మథురకుం
మమతం బని గోరసముల, క్షమేశునకు మెచ్చుపుట్టఁగా నిడ వలయున్.

క. సాగెడు నప్పురిని ధను,ర్యాగము చూడంగ వలయు నందులకై వే
వేగమ జనపదవాసులు, పోఁగల్గి రటంచు వింటిఁ బోఁదగు మనకున్.

చ. అనియిటు నందగోపతియు § నట్టియుదంతము నెల్లతావులన్
వినఁబడునట్లు సాటుమని § వేగమ యానతి యిచ్చె; నట్టులే
యొనరిచె సూతుఁ; డవ్విధము § నొక్కవిధంబున నాలకించి నం
దుని వ్రజమందుఁ గల్గు నలతోయరుహానన లెల్ల నార్తలై. ౧౨౪ 2208

మ. చనుదెంచెన్ మథురాపురంబునకుఁ గృష్ణస్వామినిన్ రామునిన్
గొనిపోవన్ మధువంశజుండయిన యక్రూరుండు ప్రేపల్లెఁ జే
రెను; వారంగొని పోవుఁ బ్రీతియలరన్ § రేపే ప్రయాణంబు సా
గును; సత్యంబుగ నంచు వార్త తెలియన్ § గోప్యల్ తమున్ మార్చఁగన్.

క. చింతిలసాగిరి; కొందఱు, కాంతలు తద్వార్తహృదయ § కమలము నేచన్
వంతన్ మోములు మిక్కిలి, వింతగ నిట్టూర్పు లోలయ § వెలవెలఁబాఱన్.

సీ. కుందు వొందిరి; మఱికొందఱు గోపికల్ కట్టినపుట్టముల్ § కదలఁబాఱఁ
గరకంకణమ్ములు § క్రమముగా జాఱంగఁ గ్రొమ్ముడుల్ వీడంగఁ § గుందిరి మఱి
కొందఱు వ్రజవాసికువలయనేత్రలు హరినె ధ్యానించుచు § నాదరమునఁ[చు
దమ రొనర్పందగు § తక్కువ్యాపారముల్ మాని ముక్తులమాడ్కిఁ § గానఁబడు

తే. లోకమును దీని నెఱుఁగంగలేక యుండి;, రట్టె కొందఱు శ్రీకృష్ణుఁడతివిచిత్ర
రాగమున సుస్మితంబున § రమ్యరీతి, బలికిన మనోహరోక్తులఁ § దలఁచుకొనుచు.

క. మనముల మోహమునొందిరి;, వనజాయతనేత్ర లెల్ల § వారిజనయనుం
డొనరించిన మృదుచేష్టల, ననూన సుస్మిత మనోజ్ఞమగు దృగ్వీతతిన్. ౧౬

క. సులలితమా తద్గమనముఁ, గలిగెడు దుఃఖముల నెల్లఁ § గడుఁ గృపచేతం
దొలఁగించు కార్యముల దుష్టులఁ జంపన సాధుగేయ § శుభచరితములన్. ౧౭

చ. మనముల నెల్లవేళలను § మానక పట్టుదలం దలంచుచున్
వనజదళాయతాక్షు నెడఁబాటున కించుక యోర్వఁజాల కా
ర్తిని గనుచున్ భయంబునను § దీవ్రగతిన్ వెలిఁబాఱు నశ్రురా
జిని గను లెట్టివాఱఁ దమచిత్తము లచ్యుతునందె చేర్చుచున్. ౧౭౪ 2214

చ. గుములుగఁ గూడి యందఱును § గుందుచుఁ దద్గతభావ లౌటఁబ
ద్మముఖులు పల్కి రిట్టులని; § తద్దయు నార్తిఁగలంగి; యోవిధా
త! మదిని నీకుఁగల్గదుకదా? దయ సుంతయు నేరిపైన నె
య్యమున హితంబునన్ జనుల § నాదిని నెట్టులొ గూర్తు వంతటన్. ౧౦౪ 2215

సీ. వారు కృతార్థులై § సారమోదంబును గాంచక పూర్వమే § చంచలమతి
నెడఁబాయఁ జేయుదువే; యనుకంప నా నిది యగునే; బాలుఁ § డెట్టు లట్లు
నీచేష్టితంబులు § నిష్ఫలంబులుగదా? § బాలిశుండని నిన్నుఁ § బలుకఁ దగదె?
నీలకుంతలములఁ § జాల నావృతమయి; చారుకపోలనాసలు చెలంగ

తే. శోకములఁ దూలఁగాఁ జేయుచున్ వెలుంగు
సుస్మితము నాట్య మాడంగ సుందరమయి
యలరుశ్రీకృష్ణు వదనశీతాంశుబింబ
మును గనంజేసి తృప్తిఁగఁ గనకముండె. ౨౦ 2216

చ. కనఁబడకుండఁ జేసితివిగా యిటు చేసిన నీదు చేత చ
క్కనిదని పల్కఁగాఁ దగునె కా దిది సాధువటంచు నమ్ముమా;
పనియిది కంసుదూతదగు భామినులార! మదీయ మెట్టులో
ననియెద వేమొ పద్మభవ యస్మ దుదాహృతి నాలకింపుమా! ౨౦ 2217

ఆ. నీదుసకలసృష్టినిపుణత కేకాశ్రయమగు కృష్ణమూర్తి యాననంబు
గాంచియున్న యిట్టికన్నుల నక్రూర, నామధారి వగుచు నేమ మెడలి. ౨౦౪

క. హరియింపఁ బూనితివి నీ, వరయం గ్రూరుండ వనఁగ నర్హుండవె యో
సరసిజభవ! శ్రీహరియనఁ, గరుణామయచిత్తుఁడౌను గాని తలంపన్. ౨౧

సీ. క్షణకాలముననె భంగమ్మగు సౌహృద మలరువాఁడౌట నవ్యముల మెచ్చు
కొనుచు నిండ్లనుమఱి కూర్మిబందుగులను దనయులఁ బతులను దగఁ ద్యజించి
తనదు చెయ్వులకె యెంతయుఁ బ్రీతిఁబరవశల మగుచుఁ దనదు దాస్యమునకో
వచ్చిన మమ్మెల్ల మచ్చికఁ జూడఁడు నూతనప్రియులవౌ చేత లిట్టు [రి

తే. లుండుఁగద? కాన వారింత యోపినంత
దనుకఁ బయనంబు కాకుండ; వనితలార!
మధురయందుఁ గలట్టి యమ్మానినులకు
నేఁటి రాతిరి సుఖముగా దాఁటుఁ జుండి! ౨౨౪ 2220

క. వారలవగు వాంఛితములు, సారద్విజు లొసఁగునాశిషమ్ముల వలనన్
భూరిఫల మనుభవింపన్, ధారణిఁ దగియుండును మనతలఁపు లనృతముల్.

చ. కనుకనె శ్రీనికేతనుఁడు కంజదళాక్షుఁడు స్వీయపూర్వరం
బును దమిఁ జొచ్చు నట్టితఱి ముద్దులు గుల్కెడు నెమ్మొగంబునన్
గనుఁగొనుచున్ స్మితంబలరఁగాఁ దగుచూడ్కులఁ గ్రమ్ముసద్రసం
బును దనివారఁ గ్రోలుదురు పో యలకాంతల భాగ్య మేమనన్! ౨౩ 2222

మ. చెలులారా! మథురాపురిం గనుఁగొనన్ శ్రీకృష్ణుఁ డిట్లేగుచోఁ
దలిదండ్రుల్ తగుబంధువుల్ మరలి రాఁ దన్నెంతఁగా వేఁడినన్
జలచిత్తుండుగ నుండ కుండినను భాస్వన్నాగరీమంజుభా
షల మాధుర్యము స్వీయహృద్వికచకంజంబున్ గడున్ లాగఁగన్. ౨౩౪ 2223

చ. పరవశుఁడై త్రపామిళితభవ్యతమస్మిత విభ్రమంబులం
దిరుగుస్వభావముం గలిగి దిట్టతనం చెటులో చనంగ న

త్తరుణుల కట్టై చిక్కు; మఱి ǂ తన్నె తలంచెడు నస్మదాదులన్
స్మరణముచేయ నోపఁ డిది ǂ సత్యము గ్రామ్యుల మాట నిస్సిరో. ౨౪ 2224

సీ. సర్వమంగళగుణాస్పదుఁడు శ్రీరమణుండు నగు దేవకీసూను ǂ ననుపమానుఁ
గనుఁగొన నోచిన ǂ కడు ధన్యులకు భోజులకు మఱి దాశార్హ ǂ లకును వృష్ణు
లకు సాత్వతులకు న్నంǂధకులకు మార్గంబునను ǂ జూడఁగల్గిన ǂ మనుజులకును
నయనోత్సవంబీ దిǂనమునఁ గాఁగలదు పో; సత్య మీయది; తన్నె ǂ సతము నమ్మి

తే. ప్రాణములకంటెఁ బ్రియునిగా ǂ స్వాంతములను
దలఁచు మనల నూరార్పక ǂ యెలమిఁగూర్చు
నందనందనుఁ గడు దవ్వుǂనకును దోడు
కొని చనన్ వచ్చినట్టి యీǂక్రూరచిత్తు. ౨౫ 2225

క. కారుణ్యవిహీనుని న,క్రూరుండని పిల్వఁ జనదు ǂ క్రూరుం డనియే
ధారణిఁ బిల్వం జనుఁగద, పేరెట్టులు పెట్టినారొ? ǂ పెద్దలు తొలుతన్. ౨౬

మ. వనజాతాయతనేత్రలార! కఠినǂస్వాంతుండు శ్రీకృష్ణుఁ డీ
మనలం జూడక యీశతాంగమున సǂమ్మానంబుమీఱంగ నె
క్కినవాఁడే; మనవృద్ధగోపకులు లెǂక్కింపంగ మూర్ఖాగ్రణుల్
కనుకం బోవలదంచుఁ; బల్కరుసుఁడీ ǂ కాలప్రభావంబునన్. ౨౭ 2227

ఉ. దారికిఁ దోడు క్రొవ్వుగలǂవా రగుటన్ మనగొల్లలెల్ల వే
సారక స్యందనాళిఁ గొని ǂ చక్రిని రమ్మని తొందఱించుచు
న్నారు తలంప దైవము మǂనంబున నీమనకున్ శ్రమంబె ని
ష్కారణమే పొసంగఁగఁ దǂగం దలపోసె నిఁకేమి చేయనొ? ౨౮ 2228

చ. పలుకుల నేమికార్యమగుఁ ǂ బట్టుదలన్ మన మెల్లఁగూడి పో
వలదని కృష్ణు నిల్పుదము ǂ వారిజనేత్రు క్షణార్థమైన ని
మ్ముల విడఁజాల కార్తిఁగొని ǂ పొక్కెడునీమనలన్ గులంపువృ
ద్ధులు మఱిబంధువుల్ గలిసి ǂ ధూర్తత నేరుతు రేమిచేయఁగన్. ౨౯ 2229

తే. దైవ మీరీతి దీనచిǂత్త లగునట్లు, మనల నొనరించె నెవ్వరైǂన నిఁక నేమి
చేయఁగలవారొ? బంధులǂచేఁత లేమి, మనల వారింపఁగల వేటిǂమాట లింక?

క. గోపికలారా! మనమా, గోపాలవరేణ్యు రాసǂగోష్ఠిఁ గలిసియే
తీపారునెయ్యమున లీ,లాపాంగ విలోకనముల ǂ హారితరములన్. ౩౧ 2231

సీ. మందహాసంబుల ǂ మంతనంబునఁ బల్కు సరససమాలాప ǂ సముదయములఁ
బరిరంభణంబులఁ ǂ బంకజాక్షుఁడు తృప్తిఁ గలిగింప నా రాత్రి ǂ క్షణముభంగిఁ
గడపితి; మాకృష్ణుఁ ǂ డెడఁబాసి పోవంగ నంతంబులేని యాǂహరివియోగ
శోకాంధకార మేǂచొప్పునఁ దరియింపఁగలమొ? యూహించినఁ ǂ గానఁబడదు;

తే. హరి యితం డగ్రజుం డగు॥హరినిగూడి
గోపకుల బాలుకులు తన్నుఁ॥గూడి రాఁగ
ఖరకరుం డస్తమించు న॥కాలమందు
గోఖురరజంబు తనదు ముం॥గురులఁగప్ప. ౨౯౪ 2232

క. సుమహారంబులు దాలన్, సమభివ్యాప్తములు కాఁగ ॥ సంతస మొప్పం
గ మురళి నూఁదుచుఁ జెలున,వ్వమరెడు శ్రీఁగంటిచూపు ॥ భవ్యతమంబై. ౩౦

క. మనచిత్తముల హరించుచుఁ, జనుదెంచును గాదె? యట్టి॥జలజాక్షుఁడు వీ
డిన నెట్లు బ్రదుకఁ గలమో, యని యీవిధి మాటలాడు ॥ చాసమయమునన్.

చ. హరివిరహంబు దుస్సహము॥నై కనుపట్టఁగ గొల్లచేడియల్
విరహితలజ్జలై మదులు ॥ వెన్నునియందె చెలంగుచుంట సు
స్వరముల మాధవా! విమత॥చక్రహరా! పరమేశ్వరా! మనో
హర! సురవంద్య యంచు విపు॥లార్తిని రోదన మట్టె చేయుచున్. ౩౧ 2235

క. దామోదర! గోవిందా!, శ్రీమహితా! యంచుఁ దమిని ॥ శ్రీకృష్ణుని స్వీ
యామలమనముల నిడుకొని, యామానిను లట్లుపొగుల ॥ నర్కుఁడుతోఁచెన్.

చ. ఖరకరుఁ డిట్లుతూర్పున న॥ఖండరుచుల్ దగునట్లు కన్పడన్
ద్వరపడి కాల్యకృత్యసము॥దాయము చక్కఁగఁ దీర్చి రాముఁడున్
హరియు రథంబు నెక్కఁ దన॥యాదృతి గన్పడఁ గంసుదూత వే
యరదముఁ దోలె; నందముఖు ॥ లాతనివెంటనె పోవుపూన్కిమై. ౩౨ 2237

సీ. గోరససంభృత ॥ కుంభంబులం దక్కు కానికలం గొని ॥ కదలి శకట
ముల నెక్కి యక్రూరుఁ ॥ డలరామకృష్ణులు చనిన త్రోవనె వేగ ॥ చనిరి; గోపి
కలు తమప్రాణాళి॥కంటె నుత్కృష్టుఁడై పయనంబుచేయు న॥పంకజాక్షు
ననుసరించిరొ పోయి ॥ యాతండు ప్రీతిమైఁ ద్వరవత్తు మటనుండి ॥ తరుణులార!

ఆ. యనుచు నూఱడింప ॥ నమ్మాటకయి కొంత,సేపు నిలువఁబడిరి ॥ శ్రీశుఁ డట్టు
లూఱడించె నెయ్య ॥ మొప్పార నక్రూరు,మూలమునఁ దదార్తి ॥ పోవునట్లు.

ఉ. వారలు స్వీయచిత్తములు ॥ వారిజనేత్రునివెంటఁ బోవ నా
శ్రీరమణుండు నగ్రజునిఁ ॥ జేరిచనంగఁ దదీయకేతనం
బారసి చూచుచున్ బిదప ॥ స్యందనధూళిని గాంచుచున్ గడున్
దూరముపోవ నవ్వియును ॥ దోఁపమి నిల్చిరి బొమ్మ లట్లుగన్. ౩౬ 2239

తే. మరలి యరుదెంచునేమొ యి॥మ్మాధవుఁ డని
వేచియుండియు నాయాశ ॥ విలయమంద
నిరవులకుఁ బోయి ప్రియుఁడగు ॥ సరసిజాక్షు
చరితములఁ బాడుచున్ నిరం॥తరము భక్తి. ౩౭ 2240

క. దినములుపుచ్చిరి శోకము, మనములఁ జేరంగనీక; ౯ మాధవుఁడుర్ జ్యే
ష్ఠుని నక్రూరుని గూడియొ, ననిలజవంబొప్పఁ బోవు౯నరదమునందున్. 3౨4

క. ఉప్పొంగెడు వేడుక మది, నొప్పఁగఁ గూర్చుండి పోయి ౯ యురుపాపములం
గుప్పగఁ గూల్పంజాలిన, యప్పావనమూర్తియైన ౯ యమునం జేరెన్. 3ర 2242

ఉ. అంతట రాముఁగూడి దనుజాంతకుఁ డాయరదంబు డిగ్గి య
త్యంతముదంబునన్ మధురమై విమలంబయి యింద్రనీలమ
ట్లింతయుఁ దళ్కుచూపెడు తదిద్యపయస్సున నాచమించుచున్
స్వాంతము తృప్తినొందునటు ౯ వారిని ద్రావె మహాత్త్వ మేర్పడన్. 3ర4

మ. తరుషండంబుల పొంతఁ జేరి రథముం ౯ దా నెక్కె రాముండు సో
దరునింగూడి రథంబు నెక్కె; రిపుసంతానంబువంకన్ భయం
బు రమానాథునకుం బొసంగు ననుచున్ ౯ భూమీశ్వరాప్తుండు స
త్వర మూహించి రథంబుపై నిలునఁగాఁ ౯ బ్రార్థించి తత్సమ్మతిన్. 3౯4 2244

సీ. మాధ్యాహ్నికక్రియా ౯ మండలమున్ దీర్ప యమున యంతరమున ౯ నమరుహ్రద
నకుఁ బోయి యందు, స్నానంబు శాస్త్రోక్తమా పద్ధతి నొనరించు పట్టుదలను[ము
బూని మునింగి యమ్మానితజలముల వేదసారం బన ౯ వెలయుసట్టి
సావిత్రిభక్తిమై శాశ్వతంబగుదాని జపియించుచుండి తజ్జలములందు

తే. రామకృష్ణులు జతగూడి ౯ రంజిలంగఁ
గాంచె నక్రూరుఁ; డంతట ౯ నెంచె మదిని
నౌర! యానకదుందుభి ౯ యాత్మజన్ము
లిరువురును స్యందనం బెక్కియెసఁగుచుండి. ర౧4 2245

చ. జలముల నిప్పుడొప్పెదరు ౯ స్యందనమున్ దిగివచ్చి రేమొ? యం
దుల నిపుడుండ రేమొ? యని ౯ తోరపు వేడుక మున్గి లేచి మున్
వలె నరసెన్ రథంబు బలభద్రుఁడు కృష్ణుఁడు పూర్వరీతి నం
దలరుచు నుండఁ గాంచి సలిలాంతరమందును గంటి వీరలన్. ర౨4 2246

చ. అరదముపై నెసంగెద రయారె జలంబుల నేను గాంచుటల్
సరియనరాదొ? సూనృతమొ? ౯ సత్యమెరైన మఱొక్కమాఱు పు
ష్కరముల మున్గి చూచెదను ౯ జక్కఁగ నంచుఁ దలంచి మున్గె; స
త్వరముగ నాజలంబులను ౯ దద్దయు వెల్గుచు నెంతొ వింతగన్. ర3 2247

చ. శిరములవంచి చారణులు ౯ సిద్ధులు నయ్యసురేంద్రులున్ మనో
హరవరగాననైపుణిని ౯ నందిన దేవతలున్ నుతింపఁగాఁ
నురగుల కీశ్వరుం డనఁగ ౯ నొప్పి సహస్రఫణారుచుల్ దిగం
తరముల వెల్గజేయఁగ ఫణాతతియందుఁ గిరీటముల్ తగన్. రర 2248

ఉ. సారసనాళ మట్లు తగుˆఛాయ కనందగియుండ నీలమౌ
చారుతరాంబరంబు తనుˆసంగతి నొప్పఁగ శృంగరాజి నొ
ప్పారెడు వెండికొండవలె ˆ నారయఁగాఁ దగునయ్యనంతు శృం
గారశరీర మాతనికిఁ ˆ గానఁబడెన్ మది కద్భుతంబుగన్. ౪౫ 2249

ఉ. ఆమహనీయమూర్తి మృదుˆలాంకమునందు వినీలనీరద
శ్యాముఁడు నాల్గుబాహుల నెసంగెడునీశుఁడు కాంచనాంబర
శ్రీమహితుండు ఫుల్లసరˆసీరుహపత్త్రవిశాలనేత్రుఁ డు
ద్దామరుచిన్ వెలుంగుపరˆతత్త్వము శాంతుఁడు నప్రమేయుఁడున్. ౪౬ 2250

సీ. సుప్రసన్న మనోజ్ఞˆశుభవక్త్రుఁడై స్మితవిలసితనయనుఁడై ˆ లలితములగు
కనుబొమల్ సురుచిర ˆ మనుపమము నగునాసయుఁ జారుకర్ణముల్ ˆ సాధుగండ
భాగమ్ము లరుణప్రˆభారాజితంబగు నధరంబు గలుగంగ ˆ నమలదివ్య [యుఁ
మూర్తియౌ పురుషుండు ˆ పొలుపారుచుండె; నాజానుపీవరసుభుˆజములు మఱి
దుంగాంసములు సిరి ˆ తొలకాడునతివిశాˆలోరస్స్థలంబు శృంˆగారమునకు
నాకరంబయి శంఖ ˆ మట్లు చెల్వారెడు కంఠము నిమ్నంబుˆగాఁ దనర్చు
నాభియు నశ్వత్థˆనామకభూరుహ పల్లవ మట్లుగాఁ ˆ బరఁగుచున్న
నిమ్నరేఖలుగల్గు ˆ నెఱి యుదరము బృహత్కటితటంబును శ్రోˆణి ˆ క్రమకరిక
రాభోరువులు జంఘు ˆ లశ్లైజానువులు నుత్తుంగగుల్ఫములు నెఱ్ఱంగ నలరు
నట్టినఖంబులు ˆ నమరియుండఁగ వానికాంతులచే నెంతొ ˆ క్రాలి మఱియు
నంగుష్ఠములు; వ్రేళు ˆ లనెడిదళంబుల నలరునంఘ్ర్యంబుజˆములు వెలుంగ
నింతింతయనరాని ˆ వింతగ నతఁడొప్పె; మఱియును సుమహార్ఘˆమణికదంబ

ఆ. ఖచితమకుటకటకˆగణము లంగదములు, సులలితమయిన కటిˆసూత్ర మట్లె
బ్రహ్మసూత్ర హారˆరాజిత నూపుర, కుండలములు మెఱయ ˆ నుండె నతఁడు.

చ. కరముల శంఖచక్రములుఁ ˆ గంజమునున్ గదయున్ వెలుంగఁగా
నురమునఁ గౌస్తుభం బనఁగˆనొప్పెడు రత్నము దివ్యరోచు ల
చ్చెరువుగఁ బర్వఁజేయుచును ˆ జెల్వమరంగఁ దుఱంగలింపఁ గం
ధర వనమాల యొప్పఁగ నిˆతాంతము శ్రీహరి యొప్పె నొప్పుగన్. ౫౧ 2252

క. ఉరమున శ్రీవత్సాంకము, నిరుపమశోభల వెలుంగ ˆ నిశ్చలభక్తిం
బరిచర్యఁ జేయు పార్షద,వరులగు నందాదు లొలయఁ ˆ బంకజభవుఁడున్. ౫౨

చ. సనకసనందనాది మునిˆసత్తములున్ హరపాకశాసనా
ది నిఖిలదేవతావరులు ˆ తృప్తిగఁ గొల్వ మరీచిముఖ్యులై
తనరు నవద్విజోత్తములు ˆ తత్పరతన్ బహుభంగులన్ దనున్
వినుతియొనర్ప శ్రీహరియు ˆ వింతగఁ దోఁచుచునుండె నత్తఱిన్. ౫౩ 2254

తే. మఱియుఁ బ్రహ్లాదనారదుల్ । మౌనివరులు
పరమభాగవతులు నౌటఁ। వాసుదేవు
నతని వసువులఁగూడి య।త్యంతవిమల
వాక్కులఁ వేలువేలుగు । భావములను. ౫౭ 2255

క. వినుతించుచుండ వానిని, వినుచుఁ ముద మొందుచుండె; । విశ్వేశ్వరు నా
తని శ్రీదేవియుఁ బుష్టియు, నను త్తమజ్ఞానశక్తి।యనఁ బడునదియున్. ౫౮

సీ. కాంతికీర్తులు । తుష్టిస్త్యాదేవి యూర్జయు విద్యయు మఱియు నవిద్యశక్తి
మాయయు ననుశక్తి।మండల మెప్పుడు తనను సేవింపఁ దక్కి।నసురలును
భక్తి నమ్రులునయి । వరసూక్తముల నెన్న నొప్పారుచున్న యా।యుజ్జ్వలాంగు
భగవంతుఁ గనుఁగొని । పరమముదంబొంది యక్రూరుఁ డంగంబు।హర్షపులకి

ఆ. తమగుచుండ బాష్పతతి సంభృతాక్షుఁడై, గద్గదికను వాక్కు।కదలుచుండ
ధైర్యమూని భూమిఁ । దలసోఁక మ్రొక్కి యం,జలిఘటించి వినుతి । సలిపెనిట్లు.

---

## నలువదవయధ్యాయము.

### శ్రీహరి నక్రూరుఁడు పొగడుట.

ఆ. అఖిలహేతువులకు । నరయంగ హేతువై
యాదిపురుషుఁడవయి । యవ్యయుండ
వగుచు నలరుచున్న । యట్టినారాయణుఁ
డవగు నీకు మ్రొక్కు । లంబుజాక్ష. ౧ 2258

క. నీనాభిపంకజంబున, సూనుండై యుద్భవిల్లె । సురసంఘేశుం
డై నెగడుబ్రహ్మ తద్భవ, మీనిఖిలం బట్టినీకు । నివె వందనముల్. ౨ 2259

సీ. క్ష్మాసలిలాగ్నులు । గంధవహాంబరములు నహంకార మహత్తులు మహాత్మ
ప్రకృతియుఁ బురుషుండు । సకలేంద్రియమ్ములు మన సింద్రియార్థంబు।లును త్రిద
ననునివియే జగ।త్తునకు హేతువు లనిపలుకుదు రవియెల్లఁ।దలఁపనీకు [శులు
నంగభూతము లగు।టంగదా? యవి నీదు తత్త్వమెఱుంగ నెం।తయును జాల

ఆ. వరయ జీవుఁ డాత్మ।యయ్యు మాయాగుణ
బంధకారణమునఁ । బరము నిన్నుఁ
దెలియఁ జాలకుండుఁ । దొలిపలుకులె నిన్నుఁ
దెలుపఁ జాల వనుచుఁ । దెల్లమయ్యె. ౩ 2260

క. పరమేష్ఠియుఁ దనదేహము, సరిపడుటకుఁ దగినయట్టి । సత్త్వగుణం బా
కరణి రజస్తమములు ననఁ, బరఁగెడు నివ్వానికిఁ గడుఁ । బరవశుఁ డగుటన్. ౪

తే. అట్టిగుణముల మించియున్నట్టి నీస్వ
రూపము నెఱుంగఁ జాలఁ డో తాపసేంద్ర!
వందితాంఘ్రిసరోరుహా! వాసుదేవ!
నిన్నెఱుంగఁ దరంబె మునివరులకును. ౩ 2262

చ. తెలియఁగ రా దదెవ్వరికిఁ దెల్లముగా నటులైన నెట్టిజీ
వులకును సారహీన మనఁబోలు భవంబు నివృత్తి యెట్టులొఁ
బలుకు లవేల? యేదయిన భవ్యపథంబున నాశ్రయించినన్
దొలఁగు భవప్రవృత్తి యని తోఁచెడు నో వసుదేవనందనా! ౩ 2263

సీ. హైరణ్యగర్భాదు లగుయోగు లాధ్యాత్మి కాధిభూతములకు నాధిదైవ
తమునకుసాక్షివై తగి వానికెల్ల నంతర్యామివై నియంతవు నగు నినుఁ
గొలుతురు; కర్మయోగులు కొంద ఱింద్రాదిబహుదేవతాస్వరూపమున నలరు
నిన్నెఁ ద్రయీవిద్య నియతిమైఁ బెక్కుయజ్ఞముల నారాధింత్రు సర్వరూపుఁ

తే. డవుగ వెలయుదు గానఁ గడంగి జ్ఞాను
లైనకొందఱు బహురూప మైన కర్మ
వితతి నీయందె యర్పించి విమలమైన
యుపశమముఁ గొని సత్సమాధిపరణతిని. ౫౪ 2264

క. జ్ఞానాధ్వరమున నిన్నే, ధ్యానింతురు జ్ఞానరూపతం దగుదు వటం
చూనిన శ్రద్ధన్; గొందఱు, మానవులున్ నియతిమీఱు మానస మలరన్. ౬

తే. శైవవైష్ణవనామ దీక్షలను బొంది
త్వదుపదిష్టము పంచరాత్రముఖమైన
విధిని బహుభేదముల బహువిధములైన
మూర్తులం గొన్న యద్వైతమూర్తి నిన్ను. ౭ 2266

క. తలపోసి యుపాసింతురు, జలజాక్షా! కొందఱు నిను శైవాదిమతం
బుల నాచారవిభేదం,బుల శివరూపిగను విధిని బూజింతు రజా! ౮ 2267

తే. సర్వదేవమయా! ప్రభూ! సర్వజనులు, నితరదేవతలం గొల్వ మతిగలజను
లెల్ల భిన్నమతుల్ గల్గి యెల్లరూప,ములనుదాల్చిన నిన్నె కా కొలుతు రీశ!

చ. కనుకనె యెల్లమార్గములు కాంచనచేలధరా! తలంప నీ
గనుఁగొనఁ బోవుచున్నయవి కా దన నెట్లగుఁ? బర్వతంబునన్
జననముగాంచి మేఘమునఁ జక్కఁగ వర్ధిలి జీవనంబు నిం
డనెగడు ప్రాదినుల్ వివిధనైజగతుల్ దగఁ బాఱుచుండియున్. ౧౦ 2269

క. కడకున్ సంద్రముఁ జేరెడు, వడువున నర్చనము లెల్లబహువిధములుగాఁ
బుడమిఁ గనంబడుచుండియు, గడపట నవి చెందు నిన్నె కంజదళాక్షా! ౧౦

క. కమలాక్షా! సత్త్వరజ, స్తమములు ననుమూఁడు ప్రకృతిధర్మగుణములై
యమరుఁ బ్రహ్మాదికభూ,తములుఁ స్థావరముదనుకఁ దగు నవి యెల్లన్.

*క ప్రకృతిగుణంబుల యందే, ప్రకటముగాఁ గూర్పఁగఁబడి వర్తిల్లెడు నా
ప్రకృతియు నీయందే తగు, సకలేశా! సర్వసృష్టిసాక్షివి నీవే! ౧౧ 2272

సీ. ప్రకృతికి నాకు సంబంధము కలదంటె; బ్రహ్మాదులకు నాకుఁ బరఁగుభేద
మే మందువేమొ ప్రకృతియందు నవిషక్తదృష్టివై నీకంటె నెదియు వేఱు
గానట్టు సర్వాత్మకత నొప్పువాఁడవై సర్వబుద్ధులకు నోసారసాక్ష!
సాక్షివై యుపమానమీక్షింపఁగా లేక మహిమమునఁ వెల్గుమాధవుఁడవు

తే. భవ మిదెల్ల నవిద్యచేఁ బరఁగుచుండు, దేవతలు మానవులు మఱితిర్యగాదు
లైనదేహాభిమానులయందు నొప్పు, నీగుణప్రవాహము సకలేశ! కృష్ణ! ౧౨

క. దానిం దగులక యెప్పెడు, జ్ఞానమయుండ వగు నీకు సతతంబు నతుల్
శ్రీనిలయా! యిడుదుఁ వై,శ్వానరుఁడగు ముఖము భూమిచరణంబు లగున్.

క. వనజాప్తుఁడు నేత్రములై, తసరు నభం బౌను నాభి తగుదిశలు శ్రుతుల్
కనకాంబర! శిరము దివం, బనఁజను బాహువులు దేవతాధిపులుసుమీ! ౧౨౪

క. సరిదధిపులు కుక్షి యగుఁ, మరుత్తు ప్రాణములు బలము మాధవ నీకౌఁ;
దరువులు నోషధులు నగుఁ, బరమేశా! రోమపంక్తి పరికింపంగన్. ౧౩

క. జలధరములు కేశములగు, నిలాధరము లస్థినఖము లెన్నఁగ నగు ఱె
ప్పలకదలిక లగు రేలుఁ బ,వలు నీకుఁ మగగుఱి యగుబ్రహ్మతలంపన్. ౧౩౪

ఆ. వృష్టివీర్య మగునువిమలాత్మ! యవ్యయా
త్మతఁ జెలంగి యెల్లతావులందు
వెలసి చిత్తవృత్తిఁ దెలియఁగాఁ దగియుండి
పురుషుఁ డనఁగ వినుతిఁబొసఁగి మిగుల. ౧౮౪ 2278

క. అలరెడు నచ్యుత! నీలో,పల బహువిధజీవవితతిఁ బరఁగెడు లోకం
బులు తత్త్వాలకులును జల,ములలోనఁ సూక్ష్మములయిపొలిచెడు ప్రాణుల్.

ఆ. అండములు చెలంగునట్టు లుదంబర, ఫలమునందు మశకములునుబోలె
నొకరి వార్త నొక్క రూహింపఁజాలక, యుండునటు చరించుచుండు జుమ్ము.

చ. వనజదళాక్ష! నీవు బహుభంగులుగాఁ దగురూపముల్ ధరిం
పను దలపోయుదో యది యభంగవిలాసమె యౌను; వాని స
జ్జనులు విశోకులై ముదముసంధిల ధ్యానము చేయువార లిం
కను భవదీయమౌ యశముగానము చేయుదు రెంతొ శ్రద్ధతోన్. ౧౬ 2281

ఉ. కారణమత్స్యరూపమును గైకొని యాప్రళయంబునం దకూ

* "సత్త్వంరజస్తమ ఇతి భవతః ప్రకృతేర్గుణాః" అనిమూలము.

పారమునఁ భ్రమించుచును । భక్తులఁ గాచెడునీకు నే నమ
స్కారము లాచరింతు, మధుకైటభదానవమృత్యురూపతన్
శ్రీరమణా! యొసంగి హయశీర్షుఁ డనందగు నీకు మ్రొక్కెదన్. ౧౪ 2282

క. మందరగిరి ధరియింపం, గం దగు కూర్మాకృతిని నికామముదమునన్
బొందుగఁ దాల్చిన నీకున్, వందితమునినాయకునకు వందనము లివే. ౧౫ 2233

క. ధరణిం బైకెత్తుటయె వి, హరణముగా నాదిసూకరాకృతి నెలమిన్
ధరియించిన నీకు నమ, స్కరణము లొనరింతు భక్తిఁ । గంజదళాక్షా! ౧౬

ఆ. సాధువృత్తి నెసఁగుజనుల భయంబుఁ బో, కార్పఁ జిత్రసింహగళము తనర
వెలయునట్టి నీకు । నెలమి నమస్కార, ముల నొనర్తు నభవ! । జలజనయన!

క. చరణక్రమమున సజ్జన, వరులకుఁ బ్రమదంబుఁగూర్ప । వామనమూర్తిన్
ధరియించి ముజ్జగంబుల, వరుసం గొల్చిన మహానుభావునకు నతుల్. ౧౮ 2236

చ. పొగరున విఱ్ఱవీఁగు నృపపూగమహాటవినిన్ గుఠారధా
రఁ గడఁగి మూలయుక్తిని బరాక్రమ మొప్పెడునట్లు కూల్చుచున్
భృగుకులనాథుఁడై విభుత । వింతగ నొప్పిన రామమూర్తికిన్
సుగుణమణిప్రకాశునకు । జోత లొనర్తును భక్తిమీఱఁగన్. ౧౯ 2287

క. రావణునకు మృత్యువుగాఁ, బావనులకు రక్షకుఁడుగ । భాసిల్లెడు నా
శ్రీవిభునకు రఘువర్యున, కే వినతు లొనర్తుఁ బ్రీతి । యెంతయుఁ బొంగన్. ౨౦

సీ. వాసుదేవుండనఁ । బరఁగి సంకర్షణప్రద్యుమ్ననామముల్ । భాసిలంగ
ననిరుద్ధుఁడను నామ । మనుపమమై యొప్ప సాత్వతపతియనుసంజ్ఞ నలరు
నీకు నమస్కార । మోకమలాక్ష! బుద్ధాకృతి ధరియించి । యమలతముఁడ
వయి దైత్యులకు దానవాళికి విభ్రాంతి గలిగించు నీకు మ్రొక్కులను గూర్తు

ఆ. మ్లేచ్ఛతుల్యు లగుచు । మేదినిబాడ మెడు, క్షత్రియుల హరింపఁ । గల్కిరూప
మును ధరించు నీకు । మ్రొక్కుడు; భగవంత!, సర్వశక్తివీవు । సకల మగుదు.

క. నీమాయచే జగంబిది, యే మోహిత మగుచు, నేను । నిది నాయది యం
చీమాడ్కి దురభిమానము, చే మిగులం గుంది యించుకే నెఱుఁగకయే. ౨౨

ఆ. కర్మమార్గములను । గలకాలము భ్రమించు
చున్న; దేను సుతుల । నుదవసితము
దారబంధుమిత్ర । ధనగాత్రముఖముల
స్వప్నతుల్యములను । సత్యము లని. ౨౩ 2291

క. తలపోసి మూఢమతినై, కలకాలం బందె దివ్యకాంచనచేలా!
ఖలహారణ! మహాప్రభువా, చలించుచున్నాఁడ నెట్లు । చక్కఁబడుదునో? ౨౪

వ. అనిత్యంబులగు దేహప్రముఖంబుల విషయంబున నాత్మబుద్ధిం జేసి విపర్యయ

చిత్తుండనై శీతోష్ణసుఖదుఃఖాదిద్వంద్వంబుల విహరించుచు సాంద్రతమ స్రావ హించుటం జేసి యాత్మప్రియుండవగు నిన్నుఁ దెలియఁజాలకుండుదు. సలిలంబుల నుద్భవిల్లు తృణాదులచేఁ గప్పఁబడినజలంబులఁ బరికించి కనుఁగొనఁ జాలక యెండమావులు జలంబులవలెం దోఁచిన వానికై పరుగెత్తుమూఢుం డగుజలాభి లాషి తెఱంగున మాయాచ్ఛన్నుండవగు నిన్నుఁ జక్కఁగ విచారించి తెలియం జాలక పరాఙ్ముఖుండనై ఘోరసంసారంబునందె ప్రవర్తించుచున్నవాఁడ. మఱియు నోమహానుభావా! కామకర్మములచే నడఁగఁద్రొక్కఁబడి విషయ సంసక్తంబులగు నింద్రియంబులన నిటు నాకర్షింపఁబడిన మనస్సు విషయవాసనా సమన్వితమితి నగుట నేను నిరోధింపశక్తుండను గాకయున్నవాఁడ. అసమర్థుండ నగు నట్టినే నిత్తరుణంబున నసజ్జనులకుఁ బొందశక్యంబె కాని నీపాదమూల ముల నాశ్రయించితి. ఈశ్వరా! ఇయ్యదియు నీయనుగ్రహంబె కాని వేఱొండు కాదని తలంచుచున్నాఁడ. పద్మనాభా! పురుషునకు సంసారవిముక్తి కలుగుకాల మొనఁగూడినతఱి సాధుసేవామూలమున నీపాదారవిందములపయి బుద్ధి ప్రవ ర్తిల్లు జ్ఞానస్వరూపుఁడై, సర్వజ్ఞానకారణాత్ముఁడై, పురుషులకు సుఖదుఃఖములను గలిగించుకాలాదులకు నియామకుండై, సర్వపరిపూర్ణుండై యనంతశక్తివిలసి తుండై, చిత్తాధిష్ఠాతయగువాసుదేవుండై, యహంకారాధిష్ఠాతయగు సంకర్ష ణాత్ముఁడై, బుద్ధ్యధిష్ఠాతయగుప్రద్యుమ్నరూపుఁడై, మనోధిష్ఠాతయగునిరుద్ధ రూపుఁడై వెలయుపరమేశ్వరునకు నీకు నమస్కారము. శరణాగతుండనగు నన్ను రక్షింపుమని సంస్తుతించుటయు. ౩౦ 2293

---

నలువదియొకఁడవయధ్యాయము.

రామకృష్ణునక్రూరుఁడు మధురంజేరుట.

క. అని యక్రూరుఁడు వినుతిం,చిన భగవంతుండు నృహరి ॥ శ్రీకృష్ణుఁడు ప్రీ
తిని జలములఁ గనఁబఱచిన, తనరూపము మఱుగుపఱచెఁ ॥ దత్క్షణమాత్రన్. ౧

ఆ. నర్తకుండు తనదునాట్యముఁ జూపిన, కరణి హరియుఁ దనయ ॥ఖండరూప
మట్లె యుజ్జగింప ॥ నక్రూరుఁ డారూప, మగపడమి నెఱింగి ॥ యాత్రపడుచు.

చ. జలములనుండి వెల్వడుచు ॥ శాస్త్రవిధానము దప్పకుండ ని
మ్ముల నపుడే యొనర్పఁగను ॥ బోలిన కర్మము లాచరించి యా
ఖలదమనుం డొనర్చిన య ॥ ఖండమహత్త్వముఁ జూపుకార్యముం
దలఁచుచు విస్మితుం డగుచుఁ ॥ దద్ద్రథ మెక్కొను సంశయించుచున్. ౨ 2296

తే. హరి హృషీకేశుఁ డక్రూరు ॥ నంతఁ గాంచి
పలికె ధరయందొ నభమందొ ॥ సలిలమందొ
యద్భుతంబగు విషయంబు ॥ నరసినట్టి
చంద మగపడుచున్న దోసాధువర్య! ౩ 2297

మ. అని ప్రశ్నింప శ్వఫల్కసూనుఁ డను దేవా! భూమి నభ్రంబునన్
వనమందుం గనఁజాలు చిత్రములు విశ్వవ్యాప్తరూపంబునన్
సనకాదుల్ తెలియంగఁజాలని మహాశ్చర్యప్రదానూనశ
క్తిని రాజిల్లెడు నీశరీరమున వర్తిల్లుం గదా? చూడఁగన్. ౪

*ఉ. ఆ నినుఁజూచు నాకు నొకయద్భుతమేమి కనంబడున్ విభూ!
గానఁగరాదు క్రొత్తదిగఁ గన్పడునయ్యది యేది బ్రహ్మమా
నే నినుఁజూచుచుండ ధరణిన్ దివి నీటను జిత్ర మెద్దియేఁ
గానఁగనౌ నదెట్టు? నినుఁ గాదని యెద్దియు లేదుచూడఁగన్. ౫

అని గాందినీతనూజుఁడు, వనజాక్షున కెఱుకపఱచి వారి నిరువురన్
వనజాప్తుఁ డస్తమింపంగ నున్నతఱి స్యందనంబుఁ గడు రయ మొప్ప

తే. తోలుకొనిపోయి పశ్చిమతోయరాశి
వనజబాంధవుఁడుం గ్రుంకఁ బాఱునపుడు
మథురఁ జేర్చెను; ద్రోవ గ్రామజను లెల్ల
నచ్చటచ్చట గుమిఁగూడి యాదరమున. ౬

క. ఆవసుదేవకుమారుల, శ్రీవల్లభులం బ్రియంబు చెలఁగఁ గనుచు న
ల్లే వర్తిల్లిరి చూపుల, వేవేగ మరల్చుకొనెడు విధముఁ దలఁపకే. ౭

చ. అంతకుముందె నందముఖు లౌ వ్రజవాసులు పోయి పత్తనో
పాంతవనంబుఁ జేరి హరియాతని జ్యేష్ఠుఁ డదెప్పు వత్తురో
స్వాంతము లుల్లసిల్లఁ బురవర్య మదెప్పుడు చొత్తుమో యటం
చెంతయుఁ గోర్కెఁ జూచుచు నదేజతనంబున నుండి రంతలోన్. ౮

చ హరి జగదీశ్వరుండు తమయాగమనంబునె కోరు నందభూ
వరముఖులం దమిన్ గలిసి భక్తుని బ్రశ్రితు గాందినీసుతున్
గరముఁ గరంబుచేఁ గొనుచుఁ గమ్రతరస్మిత మొప్పనట్టు లి
క్కరణి వచించె; స్యందనముఁ గైకొని ముందుఁ బురంబుఁ జేరుమా!

చ. భవనముఁ జేరు మేమిచట వాసముచేసి దినంబుఁ బుచ్చి వేఁ
కువఁ బయనంబుచేసి కనఁగొనెద మమ్మథురాపురంబు; నాఁ
గ వినుచు గాందినీసుతుఁడు కంజవిలోచన! యిందు మీద్వయం
బువదలి యొంటిగాఁ బురికిఁ బోవఁగనొల్లను నమ్ము మీనుడిన్. ౧౦

చ. విను మొకమాట భక్తజనబృందమునం గడుఁ బ్రీతిగల్గు వాఁ
డనఁగ బ్రసిద్ధినొంది సకలాధిపతిత్వము నూని యొప్పు నీ

*"యత్రాద్భుతాని సర్వాణి భూమౌ వియతి వా జలే, తంత్వానుపశ్యతో బ్రహ్మ
దృష్టమివాద్భుతం" అని మూలము.

వనయము భక్తి నీదుచరణాబ్జములంగల నన్ను వీడఁగాఁ
జనునె; యధోక్షజా! బలుని సంగతి నాగృహమందు నిల్వఁగన్. ౧౧ 2306

ఆ. అరుగుదెమ్ము మిత్రులెల్ల గోపాలకు, లోసుహృత్తమా! మహోద్యమమున
నరుగుదెంచువారు త్వర మమ్మును సనాథు,లనొనరింపు నన్నుఁబనుపవలదు.

సీ. గృహమేధులమగు మాగృహములఁ బాదరజంబున నతిపావనంబులుగను
జేయుమా; పదసరసీరుహరజమును గడిగిన జలములకణములఁ గడు
నిలయాంగణంబున వెలయు దేవతలును బితరులు నగ్నులు వితతతృప్తి
నొందుదు; రాయంఘ్రియుగళంబు గడిగి యాబలిచక్రవర్తి నిస్తులయశంబు

ఆ. గాంచి గొప్పదనముఁగనె నసమానమౌ
భాగ్యమును సతంబుఁ బడయఁగలిగె
నెలమి మిగులుచుండ నేకాంతభక్తుల
గతిని గాంచెఁ దుదిని గమలనాభ! ౧౪ 2308

క. తావక చరణక్షాళన! పావనసలిలంబులే ప్రపంచత్రయముఁ
గావించుఁ బవిత్రము గం,గావాహిని యగుచుఁ గృష్ణకంజదళాక్షా! ౧౪

క. జలముల నవ్వానినె శ్రీ, గళుఁ డౌదలఁ దాల్చె మఱి సగరుపుత్త్రులు నా
సలిలములచేత స్వర్గ, స్థలవాసము గనిరిగాదె సర్వసురేశా!. ౧౫ 2310

సీ. సర్వజగన్నాథ సాత్వతనాథ పుణ్యశ్లోక మునినాయకార్చితపద
సారస! పుణ్యసంశ్రవణ కీర్తన విభూ నారాయణా నీకునతు లొనర్తు;
ననిపల్కు నక్రూరుఁ గని కృష్ణుఁ డిట్లను యాదవద్రోహి యై నట్టికంసు
వధియించి యామీఁదబలదేవయుతుఁడనై సుహృదులకుం బ్రీతిసొరిదిఁగూర్చి

తే. మీగృహంబున కరుదెంతు మిత్రవర్య!
యిపుడు మము వీడిపొమ్మని కృష్ణుఁ డనిన
నతఁడు మా టేమిపలుకక యాత్మతృప్తిఁ
గనక మధురాపురము చొచ్చి జనపతికిని. ౧౭ 2311

క. తనకార్యమెల్లఁ జక్కఁగ, మనమున కెక్కంగఁదెల్పి మహిపునునుజ్ఞం
గొని నిజగృహమునకుం బో,యె నిటఁ భగవంతుఁడైన కృష్ణుం డెలమిన్.౧౮

క. ఖరకరుఁ డపరాహ్ణము నే, వసుసనొ మీఱంగఁజేసి వాడికిరణముల్
హరికిం బ్రీతిగఁ జల్ల నొ, నరింప సాయంతనం బనంగఁ జనుతఱిన్. ౧౯ 2313

చ. హలధరుఁగూడి గోపకగణాన్వితుఁ డై మధురాపురంబు ని
మ్ములఁ గనుకోర్కి మైఁ జనియెఁ బూజ్యతరస్ఫటికాశ్మనిర్మితం
బులగుచు నున్నతంబులయి పొల్చెడు గోపురముల్ నికేతనం
బులఁదగు ద్వారముల్ గలిగి పూర్వర మయ్యది పొల్చు నెంతయున్. ౨౦

ఉ. ఉన్నతిమించి హేమమున । నొప్పుచు నున్న కవాటతోరణా
ళి న్నెఱిఁ జూడనై తగ నిలింపులు మెచ్చఁగ మించియుండె; నా
పన్నశరణ్యుఁ డట్టిపురి । బాగుగఁ గాంచె గభీరమై జలం
బెన్న సమృద్ధమై వెలయు నెంతయు నప్పరిఖల్ కనంబడన్. ౨౦ 2315

సీ. తామ్రలోహమున నిత్తడిచేత నిర్మింప నమరు ధాన్యాదికోష్ఠములు పెక్కు
వెలయఁగా నారామములు దవ్వులందగు నుపవనంబులు చూడ నొప్పియుండ
సౌవర్ణమయచతుష్పథములు హర్మ్యగతారామముల్ శిల్పకార కాండ
ములు చేరి కూర్చుండఁగల రంచుఁ గట్టినరచ్చపట్టులు నితరగృహవరము

తే. లొక్కవిధమున నందంబు । నొగినిగూర్పఁ
గాంచఁ దగియుండె నప్పురి । కమ్రవజ్ర
ములును వైదూర్యవిద్రుమములును నీల
మౌక్తికంబులు పచ్చలు । మహితరీతి. ౨౧ 2316

క. ఇతరములగు చారుమణి, ప్రతతులు దాపంగఁబడిన । రమ్యవలభు లు
న్నత వేదికలు గవాక్ష,యతవివరము లట్టె భిత్తు । లరుదుగ నుండన్. ౨౧

క. కలరవములును మయూరము, లలరుచుఁ గూర్చుండి మంజులాలాపములన్
గలిగించుచుండె విను వా,రలకున్ సతతంబు వింతఁ బ్రమదము మిగులన్. ౨౧౪

తే. రథ్యలం దాపణములందు । రమ్యచత్వ
రముల నితరము లైనమార్గంబులందు
సలిలములు చల్ల నయ్యవిచాల సొంపు
గాఁ గనంబడుచుండె నిక్కముగ మఱియు. ౨౨ 2319

క. నవ్యాంకుర మాల్యంబులు, భవ్యాక్షతతండులములు । పరమశుభదముల్
సేవ్యములగు పేలాలును, దివ్యన్మార్గములఁ జల్లఁ । దేజరిలెఁ గడున్. ౨౨ 2320

తే. మఱియు దధిచందనములతోఁ । మంగళార్థ
ముగను జల్లఁగఁ బుష్పదీపగణ మట్టె
పల్లవంబులతోఁగూడి । యుల్లసిల్లు
పూర్ణకుంభంబు లొకరీతిఁ । బొలుచుచుండ. ౨౨౪ 2321

క. ఫలగుచ్ఛంబులు వ్రేలఁగ, విలసిలు రంభాక్రముకసువృక్షములు పతా
కలు ద్వాదశాంగుళంబుల, కొలఁతకుఁ దగియున్నయట్టి । గుడ్డలు తగఁగన్. ౨౩

క. ప్రతిసద్మద్వారంబులఁ, బ్రతిచేయఁగరాని రీతి । భాసిల్లఁగ భూ
పతికిం దొడవై యాపుర, మతిలోకముగాఁ గనంగనయ్యెన్ మిగులన్. ౨౩

క. ఆనకదుందుభి సూనులు, శ్రీనిలయులు మిత్రకోటి । చేరికొలుచుచున్
రా నరపతిమార్గంబున,నే నిత్యోత్సవము లొప్పు । నెసఁగెడు మథురన్. ౨౩౪

క. అపుడు ప్రవేశించిరి పౌరపురంధ్రులు కృష్ణమూర్తి । రాముని గనువే
డ్క ఏడమఁ ద్వరపడి ప్రాసాదపటల మెక్కిరి మనోముదము ఫలియింపన్.

మ. హరిఁ జూడన్ ద్వరమాణచిత్తలగు నాయబ్జాక్షులం గొంద అం
బరభూషావళి వ్యత్యయంబుగనె నవ్వం జూపఱుల్ తాల్చి యె
క్కిరి హర్మ్యంబుల; నొక్కకొంద అబలల్ । కృష్ణున్ హాలిం జూచునా
దర మెంతో త్వరపెట్టఁగా జతలుగాఁ । దాల్పంగ నొభూషలన్. ౨౮౪ 2326

ఆ. కటకకుండలాదికముల నొక్కొకదానిఁ
దొడిగి యొక్కదానిఁ । దొడుగ మఱచి
హర్మ్య మెక్కి రందు । నంగనల్ కొందఱు
నొక్కచెవికె కమ్మఁ । జక్కఁ బెట్టి. ౨౫ 2327

సీ. చూడఁ బోయిరి కృష్ణు । సుదతులు మఱికొంద ఱొక్కపదంబున నొక్కనూపు
రము దాల్చి పోయిరి । రమణులు కొందఱు నొక్కనేత్రమున కెచక్కనైనఁ
గాటుకఁ బెట్టి వేగమునఁ బోయిరి; కొంద ఱబ్జాతనేత్ర లయ్యవసరమున [ను
భుజియించుచుండి యప్పుడె దానినిన్ మాని పరుగిడి రొకకొందఱు రమణులు

తే. మంగళస్నాన మొనరింప । మంచినూనె
నంటుకొని స్నానమొనరించు । వ్యవధిలేక
యట్టె పరువెత్తి రొకకొంద । అబ్జముఖులు
నిదురపోవుచు ధ్వని శ్రుతులఁ దవులఁ గనె. ౨౫౪ 2328

చ. త్వరపడి లేచి యవ్విధినె । వస్త్రము నెక్కరి కొంద అంగనల్
మురువుగఁ జిన్నిబిడ్డలను । మూరొకనుచుం దమి స్తన్య మిచ్చుచున్
మురహరుఁ గాంచువేడ్కమెయిఁ । బోయిరి వారిని డించి యిట్టు లా
పురమున నున్న సాధ్వులు ప్రభూత ముదంబున వచ్చుచుండఁగన్. ౨౬ 2329

మ. అరవిందాక్షుఁడు ప్రౌఢలీలలను స్మేరాపాంగ దృష్ట్యున్నతిన్
సరసీరుడ్రిపుతుల్యవక్త్రలమృదుస్వాంతంబులన్ లీలమై
హరియించెన్ మదనాగరాజగతి నొయ్యం బోవుచున్ భార్గవీ
స్థిరవాసం బగునాత్మదేహమున నిచ్చెన్ నేత్రసంతోషమున్. ౨౭ 2330

చ. తరుణులు వారు పల్మఱును । దామరసాక్షుని విన్నవారె కా
న రయమునన్ మనస్సు లొగి । నారదవందితుఁడై చెలంగు శ్రీ
హరిపయిఁ బర్వ నిశ్చలత । నచ్చట నిల్చిరి శ్రీశుఁ గాంచుచున్
మురరిపు దృక్కోణతంబులను । బొల్చుసుధారస మబ్బసోకఁగన్. ౨౮౪ 2331

చ. మనసులు ముత్పరీవాహపరిమగ్నములై తగ విప్పియున్న స్వీ
యనయనసత్పథంబున మహాత్ము మనోగతు సంప్రమోదమూ

ర్తిని బిగి గౌఁగిలించి స్వశరీరములం బులకల్ చెలంగ న
వ్వనరుహనాభుఁ జూడమికి వర్తిలునట్టి మనోవ్యథల్ చనన్. ౨౭ 2332

క. పరమానందము గని రపు, డరిషడ్వర్గమ్ము గెల్చి హరిని గొలుచు నో
ధరణీశ! పరీక్షిత్తూ!, తరుణీమణు లంత వనజదళనేత్రు హరిన్. ౨౭ 2333

క. అరుదుగ నొప్పెడు హర్మ్యశిఖరములపై నిల్చి నైజగాఢప్రీతి
స్ఫురణన్ వికసిల్లిన ముఖ, సరసిజములు వెలయ రాముఁ జక్రాయుధునిన్.

క. సురుచిర సుమవర్షంబులఁ, గురియించుచుఁ బూజసల్పి కోర్కిం గనుచుం
డిరి; సాధుభూసురులు శ్రీ, హరిపై బలదేవుపైఁ బ్రహర్షము పరఁగన్. ౨౯

ఆ. అక్షతలను దధిని నభిరామజలపూర్ణ, కలశములను హారములను గాని
కలను జందనమునఁ గడఁగి పూజించిరి, పరమదైవత మనుభావ మలర. ౩౦

క. పురకాంత లంత నాసోదరులన్ నరలోకమునకుఁ దగునుత్సవమున్
బరమంబును గలిగించెడు, నిరుపమతేజులను వీరినిం బ్రతిదినమున్. ౩౦౫ 2337

చ. కనుఁగొనుచుండు గోపికలు గాఢతపం బదియెట్టి దొర! ము
న్నొనరిచినారొ? యంచుఁ బ్రియమొప్ప నుతించుచుఁ బల్కి; రంతటన్
వనరుహనేత్రుఁ డమ్మధుర భ్రాతృయుతిం జనుచుండునంత నొ
క్కని రజకున్ గనుంగొనియెఁ గమ్రతరాంబరవాహకుం దగన్. ౩౧ 2338

శ్రీకృష్ణుండు రజకునవధించి వస్త్రముల గ్రహించుట.

క. అరుదెంచుచుండె వాఁ డంబరములకున్ బెక్కువిధుల వర్ణంబుల సుం
దరముగ వేయం జాలును, హరి వానిం గాంచి యిట్టులనియెఁ జతురతన్.

*చ. ఇరువుర మేము గట్టుకొన నెంతయు నర్హములై చెలంగు నం
బరములఁ జక్కఁగా నుదికి భానుమరీచులు సోఁకఁజేసి య
చ్చెరువుగ వర్ణముల్ గలుగఁజేసినవాని నొసంగుమా మహా
త్తరమగు శ్రేయ మబ్బు నిదితప్పదు నీవిపు డిచ్చితేనియున్. ౩౨ 2340

క. అనుమానింపకు మోయీ, యని యన్నిటఁ బూర్ణుఁ డగుచు నఖిలజగముల్
జనియింపఁజేయు దైవము, వనజాక్షుం డిట్లుతన్నుఁ బ్రార్థించుటయున్. ౩౨౫

చ. జనపతిభృత్యుఁడై మదము చాలఁగఁ గప్పుట నించుకంతయున్
గనుఁగొనఁ జాలనట్టి మదిగల్గిన యారజకుండు పట్టఁ జా
లని రుషఁబూని నిందను గలంగెడు చిత్తము గల్గునట్లు చే
యను దగుమాటలం బలికె నాత్మవిశుద్ధియు లేకపోవుటన్. ౩౪ 2342

మ. ధరణీధ్రంబులఁ గానలం దిరుగుటన్ దా రేమిపల్కంగ నె

* "దృష్ట్వా యాచత వాసాంసి ధౌతాన్యత్యుత్తమానిచ, దేహ్యావయో స్సముచితా న్యంగ వాసాంసి చార్హతోః, భవిష్యతి పరం శ్రేయో దాతు స్తే నాత్ర సంశయః" అని మూలము.

క్కరణిన్ వర్తిల నించుకేని యెఱుఁగంగాలేని మూర్ఖుల్ గదా
పరికింపంగను మీరు కావుననె యిబ్బంగిన్ మహార్హాంబు లం
బరముల్ గోరఁగరా దటంచు నెదలన్ భావింప కత్యుద్ధతిన్. ౩౪ 2343

చ. పలికెద రేల? మీరుకడు భాసిలునిట్టిమహార్హవస్త్రపం
క్తులనెసతంబుగట్టుదురె కోరఁగవచ్చునె? రాజరాజయో
గ్యలలితవస్తువారముల నక్కట! బాలిశులార! వేగమే
తొలఁగిచనుండు చాలు నిఁకధూర్తత మానుఁడు పొండుపొం డిఁకన్. ౩౫ 2344

చ. బ్రతుకఁగఁ గోరినన్ దగని వాంఛల నీగతిఁ గోరరాదు త్వ
పతిభటు లట్టి మిమ్ముచెఱఁబట్టియుఁ గొట్టియు నున్నవిత్త ముం
ద్ధతిఁగొని పాఱఁదోలుదురు; దర్పముమాని తొలంగుఁ; డంచు నీ
గతి రజకుం డవాచ్యములుగాఁ దగుపల్కుల నొవ్వ నాడినన్. ౩౬ 2345

చ అలిగి యశోదపుత్త్రుఁడు కరాగ్రముచే రజకోత్తమాంగమున్
దులువలు పల్కు పల్కులను దోఁచినయట్టులు పల్కకుండఁగా
నిలను శరీరమున్ వదలియే పడునట్లుగఁ గూల్చె; వానినిం
గొలిచెడు వార లట్టిమడుఁగుల్ గలమూటలఁ బాఱవైచుచున్. ౩౭ 2346

క. *పలుత్రోవలఁ బడిపోయిరి, జలజాక్షుఁడు వలయు నవ్వాసనములఁ గొనియెన్;
బలదేవుఁడు హరియును మేల్, వలువల నిష్టంబురీతిఁ బరికించి తమిన్. ౩౮

క. ధరియించి రంత శిష్టాం,బరముల గోపకుల కిచ్చి వారలు ప్రీతిన్
ధరియింప మిగిలినట్టివి, ధరణిన్ బడియుండవైచి తరలిరి స్వేచ్ఛన్. ౩౯ 2348

శ్రీహరి తంతువాయునిమాలాకారుని సంభావించుట.

ఉ. వారలు పోవుమార్గమున [1]వాయకుఁ డొక్కఁడు వచ్చుచుండి యా
సారసనేత్రులం గని యొసంగెడుప్రీతివిచిత్రవస్త్రముల్
నేరుపుమీఱ నెట్టి విధినిం గయిచేసిన మేలొ యవ్విధం
బారసి వాని నిచ్చి తగినట్టులు వేషము లొప్పఁ జేయుచున్. ౪౦ 2349

చ. వరుస నలంకరించె బలభద్రుఁడు కృష్ణుఁడు పెక్కుభంగులం
బరఁగెడు వేషముల్ తనర బాగుగ భూషితులౌచుఁ [2]బర్వ మం
దురుమహ మొప్ప భూషల మహోత్తమరీతి నలంకరింపఁగాఁ
గరిశిశువుల్ సితాసితసుగాత్రములం దగిపొల్చు నట్లుగన్. ౪౧ 2350

* "దుద్రువుస్సర్వతో మార్గం వాసాంసిజగృహేఽచ్యుతః, వసిత్వాత్మప్రియే వస్త్రే కృష్ణస్సంకర్షణ స్తథా" అని మూలము. 1. "తతస్తు వాయకః ప్రీతః" అని మూలము. "వాయక స్తంతువాయవిశేషః" అనివ్యాఖ్య. 2. "బాలగజౌ పర్వణీవ సితాసితౌ" అని మూలము.

క. విలసిల్లిరి; భగవంతుఁడు, జలజాక్షుం డంత సుప్రసన్నుండయి యి
మ్ములఁ దనసారూప్యం బీ, యిలఁ బరమంబయిన సిరియు § నిద్ధబలంబుల్. ౪౧౫

తే. అతిశయైశ్వర్యమున్ స్మృతి § యలరునట్లు
లింద్రియంబుల పాటవ § మెసఁగునట్లు
కరుణమీఱఁగ నొసఁగెను § వరము లంత
వారలిర్వుర కవలి గంభీరగతుల. ౪౨ 2352

సీ. చనుచు మాలాకారు § సదనంబుఁ జేరిరి వాఁడు సుదాముఁడన్ § వఱలు పేర
రామకృష్ణులు రాఁగ § రయమున లేచి శీర్షము భూమిసోఁకంగ § సాగిలఁబడి
వందన మొనరించి § భద్రాసనము లిచ్చి కూరుచుండఁగఁ జేసి § కోరిపాద్య
మిచ్చి యర్ఘ్యాదుల § నెల్ల నొసంగి సత్సుమహారములఁ బ్రీతి § శోభిలంగ

తే. జేసి గంధంబుఁ బూసి య§చ్చెరువు గాఁగఁ
దమ్ములం బిచ్చి మఱియును § దగినయట్టి
యాతిథేయంబులను § వారి నలరఁజేసి
తదనుచరుల సమర్చించె § దగినవిధిని. ౪౪ 2353

ఉ. అంత నతండు పల్కె నిటు § లా పరమేశ్వరమూర్తులైన మీ
రెంతొ యనుగ్రహంబు తగ § నిప్పుడు నాగృహసీమఁ జేరుటన్
సంతస మయ్యె; నాదయిన § జన్మము సార్థకమయ్యె; మత్కులం
బెంతొ పవిత్రమయ్యెను బి § తృవ్రజమున్ సురలున్ మహర్షులున్. ౪౪౫ 2354

చ. అరుదుగఁ దృష్టి నొంది నను § నాదృతిఁ గావఁగఁ బూనువారు మీ
రిరువురు లోకకారణులె § యిప్డు జగంబుల క్షేమవృద్ధులన్
స్థిరముగ నిల్పఁ గోరికలఁ § జెందియె యీ నరరూపముల్ తగన్
ధర నవతార మొందితిరి § తత్త్వము మీ రెఱుఁగంగ నేర్తునే. ౪౬ 2355

సీ. సర్వభూతములకు § సములును సుహృదులు నయి జగదాత్మకు § లైన మీరు
సేవించువారి సంభావించుచుందురు; విషమదృష్టియు లేక § వెలయుచుంద్రు;
భృత్యుఁడ నగు నేను § నేపని మీ కొనరింపఁగాఁ దగుదు నా § రీతి నెన్ని [ఘన
యాజ్ఞ చేయుఁడు లోక § మందు మీకు నియోజ్యుఁడగు టొక్కటియె తలఁ § పఁగ బురు

తే. కును మహానుగ్రహం బని § వినయ మలర
విన్నవించి సుదాముఁడు § విమలమైన
ప్రీతిగల చిత్త మొప్పఁగ § శ్రీహరి హల
ధరుఁడు నుత్తమమాల్యముల్ § ధార్యము లని. ౪౭ 2356

క. మనములఁ గోరుదురని వా, సనలన్ వెదఁజల్లు సుప్రశస్తకుసుమరా
జిని గూర్చినహారములను, వనజాక్షద్వయమునకును § భక్తి నొసంగెన్. ౪౮

చ. హరి బలదేవు లంత ముద౹మందుచు మిత్రులఁగూడి వాయకుం
డరుదగుభక్తిచే నిడిన౹యట్టి యలంకృతులన్ గ్రహించి యా
దరణముమీఱ వారు వర౹దానసమర్థులు గాన భక్తిత
త్పరుఁడయి మ్రొక్కి యున్న యల౹దాసుని గోరు వరంబులం జనన్. ౫౦ 2358

చ: అతఁ డఖిలాత్మకుండయిన ౹ యాపరమేశ్వరునందు నిశ్చలం
బతులమునైన భక్తి పర౹మాత్ముని భక్తులతోడిమైత్రి భూ
తతతిపయిన్ నితాంతదయ ౹ తప్పకయుండ నొసంగు మంచు స
మ్మతి నడుగంగ శ్రీహరియు ౹ మానసమందుఁ జెలంగుసత్కృపన్. ౫౧ 2359

చ. వరముల వానినిచ్చి మఱి ౹ వంశవివృద్ధిని గల్గఁజేయు పెన్
సిరుల నొసంగి యాయువును ౹ జేకురఁ గాంతియశంబు లొప్పఁగా
వరములఁ దానె యిచ్చి బల౹భద్రునిగూడి యనుంగుగోపకుల్
పరిచరులున్ భజింప నృప౹పద్ధతిఁబోయెఁ బురంబుఁజూడఁగన్. ౫౨ 2360



## న లు వ ది రెం డ వ య ధ్యా య ము.

### శ్రీకృష్ణుఁడు కుబ్జ ననుగ్రహించుట.

చ. అరుగుచు రాజమార్గమున ౹ నబ్ధిసుతాపతి యంతఁగాంచె సుం
దరి మయిపూఁత లొప్పఁగ గ౹నంబడు పాత్రములన్ ధరించి ని
ర్భరమగుయౌవనం బలర ౹ భవ్యతరంబుగ మోము గన్పడన్
ధరణిపుసౌధమున్ గుఱిచి ౹ తాఁ జనుకుబ్జఁ ద్రివక్రగాత్రినిన్. ౧ 2361

చ. కనుఁగొని యెల్లవారికి సు౹ఖప్రదుఁడౌ పరమేశ్వరుండు మో
మునఁ దగునవ్వు కన్పడఁగఁ ౹ బోలఁగ నిట్లనియెన్ వరోరు! చ
క్కనిగతి నొప్పు నోసుదతి! ౹ క్రన్ననఁ బోయెద వీమహానులే
పనములఁ గొంచు నెవ్వతవు? ౹ భవ్యము లీయవి తెల్పు మేరివో? ౧౪ 2362

ఉ. ఉన్నదియున్నయట్లు హిత ౹ మొప్పఁగఁ జెప్పు వినంగఁ గోరుమా
కన్నులమిన్నరో! రుచిర ౹ మైతగు నీమెయిపూఁత లిమ్ము మా
యన్నకు నాకు; శ్రేయ మగు; ౹ నందున నీకును సత్వరంబుగా
నన్ను వచించె నయ్యదియు ౹ నాదృతి సుందరరూప! నే నిటన్. ౨ 2363

సీ. దాసినై యుండుదు౹ధాత్రీశ్వరుఁడు కంసునకు మెచ్చుఁగూర్చు దా౹ననుఁ; ద్రివక్ర
యని పిల్వఁబడుదు; రా౹జునకు నర్మంబులౌ కలపంబులను గూర్పఁ ౹ గాఁదగుపని
నాది; యకార్యము౹నన్ రాజు మెప్పును గాంచితి; నాకూర్చు ౹ కలపములనె
కంసభూపతి మది౹గరము మెచ్చును, మీరు తప్ప నిం కెవ్వరు౹త్తమములైన

తే. యిట్టి యనులేపనముల ధరింప నర్హు,లనుచుఁ దద్రూపసౌష్ఠవమునను సౌకు
మార్యమున రసికత్వసామ్యక్తి, తముల,బలుకులం జారువీక్షణములను మిగుల.

క. మతి ముదమున జొక్కఁగ నా,యతివయు నాయిర్వురకు మహాద్భుతి సాంద్రం
బతులితమునై మహీశా,ర్హతమమునై తనరునట్టి యనులేపనమున్. ౪ 2365

క. వలసినయట్టులుగా వా,రల కిచ్చెను; శ్రీహరియును రాముండును స్వీ
యలలితనీలసితదో,తులకు విరుద్ధంబులగుచుఁ దోఁచు రుచులచేఁ. ౪౫ 2366

క. తనరారు నంగరాగం,బును మేనుల నిండునట్లు పూసికొనుచు నిం
తనరాని కాంతులఁ మిం,చినదేహము లొప్పఁగ విలసిల్లిరి పిదపన్. ౫ 2367

చ. హరియును సర్వముం దెలియునట్టి పరాత్పరుఁడౌట నాత్మలోఁ
గరుణ చెలంగ మోమురుచి గ్రాలఁగ నొప్పియుఁ గుబ్జయాచుఁ గం
ధర నురమందునుం గటిని దద్దయు వక్రత గానిపింప ను
న్న రమణిఁ గాంచి వంకరతనంబును బాపఁగ నెంచి యంతటన్. ౫౫ 2368

చ. తనదగు దర్శనంబున నితాంతము గల్గుఫలంబుఁ జూపఁగాఁ
మనసున నెంచె; నత్తఱిని మాధవుఁ డాసతి పద్ద్వయాగ్రముఁ
దనచరణద్వయాగ్రమును దాఁకఁగఁ జేయుచు జాఱకుండ నొ
య్యన బిగిమీఱఁ ద్రొక్కి తనదౌ ఘనశక్తి చెలంగుచుండఁగన్. ౬౫ 2369

సీ. అంగుష్ఠయుగ్మంబు నద్దాని గడ్డముక్రింద నుండెడునట్టిరీతిఁ జేసి
తర్జనీమధ్యమాద్వయము గండస్థలములయందు నమరంగ నిలిపి మెలపు
నను దేహమును మీఁదికిని జాఁగ నెత్తంగ; నాత్రివక్రయు నట్టియదనునందె
కౌటిల్యమును బాసి కడుఁ జక్కనై పొల్చి బలితంపుగబ్బిగుబ్బలును బిఱుఁదు

ఆ. లొప్పి యుండఁ జూడ నొప్పగుదేహంబు, వెలయ హరిస్పృశింప లలనలందు
మిన్నయగుచుఁ జాల సన్నుతింపం దగి,యుండెఁ గృష్ణుకరుణ నొందె మిగుల.

క. లావణ్యంబున నిర్భర, యౌవనమున మఱియుఁ గలుగునట్టి గుణములఁ
భావింపఁగ నెంతయు సం,భావింపఁగఁ దగి స్మితంబుపర్వుచు నుండన్. ౭౫ 2371

చ. చనఁగఁ దలంచుచున్న వికసత్సరసీరుహనేత్రుఁ గాంచి యా
తనిదగు నుత్తరీయపుఁ దుదఁ గ్రహియించి విలాసమొప్ప నొ
య్యనఁ దనప్రక్క కీడ్చుచు హృదంతరజాతమహాశయంబు పెం
పున నిటు వేఁడె; నోపురుషపుంగవ! వీర! చనంగఁ జెల్లునే? ౯ 2372

చ. నిను విడనాడి పోవుటకు నే నెటులెంచినఁ జాలకున్న దా
నను మనయింటి కేగుదము నాదుమనంబు గలంగె నీదుద
ర్శనమున నిట్టినన్నుఁ గృపఁ రంజిలఁ జేయుము నాఁగ శ్రీనికే
తనుఁడు త్రివక్ర నాఁ దగినతన్వియు రాముఁడు చూచుచుండఁగన్. ౧౦౫

క. ఈరీతిఁ దన్ను వేఁడిన, శ్రీరాముఁడు దక్కుసఖులు । చెంతనె యుండం
గా రంజిలు తన్ముఖసర,సీరుహములఁ గాంచి పలికె । స్మిత మలరారన్. ౧౧ 2374

క. ఓసుభ్రూ! యేకార్యము,నే సాధింపంగ నిచటి । కేతెంచితినో
యాసమధిక కార్యమ్మును, వే సాధించిమఱి వత్తు । వేశ్మమ్మునకున్. ౧౧౪ 2375

*చ. మనసునఁ గల్గుక్లేశముల । మాన్పుఁగదా భవదీయసద్గృహం
బనియె యెఱుంగుదుర్ మఱి గృహంబనలేక యిటం జరించు నీ
జనులకు మాకుఁ బంధులకు । సాధుమతీ! పెనుఁబ్రాపు నీవెకా?
యని మధురోక్తులం బలికి । యంబుజలోచన వీడి యంతటన్. ౧౨ 2376

ఆ. పణ్యవీథిఁ జనుచుఁ । బంకజనాభుండు, వణిజు లిచ్చునట్టి । బహువిధంబు
లైన కానికలను । మానితతాంబూల, గంధకుసుమ మాలికలను గొనుచు. ౧౩

చ. హరియును జ్యేష్ఠునిం గలిసి । యట్లె ప్రయాణము చేయుచుండ నా
పురుషవరేణ్యుఁ గాంచుటకుఁ । బూన్కి మనోభవుఁ డేపుమీఱఁగాఁ
ద్వరపడుఁ డంచుఁ జిత్తములఁ । దత్తఱమందఁగఁ జేయుచుండ నం
బరములుఁ గ్రొమ్ముడుల్ వలయపంక్తియు జాఱఁగ నంగనామణుల్. ౧౮ 2378

చ. తమరిని దా రెఱుంగకయె । తత్పరతన్ లిఖియించియున్న చి
త్రము లటు నిల్చి యచ్యుతుని । రాముని గాంచుచు నుండి; రంతటం
గమలదళేక్షణుండు పురిఁ । గల్గు మహాజను లడ్డమైన నెం
దమరు ధనుర్మఖంబనుచు । నడ్గుచు నచ్చటికేగి నెమ్మదిన్. ౧౮౪ 2379

చ. ధనువు నమర్చియున్న గృహతల్లజముం గని యందుఁ జొచ్చి యిం
ద్రునిధను వట్లు చిత్రముగఁ । దోఁచుచుఁ బెక్కురు కాచుచుండఁ బూ
జనముల నొందుచున్ బ్రభలఁ । జారుతరంబయి వృద్ధిగాంచు నా
ధనువును గాంచి శ్రీహరియు । దాపున కేగుచునుండ రక్షకుల్. ౧౫౪ 2380

క. వలదని వారింపంగా, బలవంతముగా గ్రహించి । వరచాపము ని
మ్ముల వామహస్తమున నే, విలాసముగఁ బట్టి యెత్తి । వితతగుణంబున్. ౧౬

తే. కోటి కెక్కించి యెల్లరు । కుతుక మొప్పఁ
గనుచునుండంగ క్షణకాలమున మదేభ
మిక్షుదండంబువలె నారి । యేపుమీఱ
తివిచి నడిమికి విఱిచెఁ బెగ్గోరవము పొదల. ౧౭ 2382

క. అదివిఱిగెడు సమయంబున, నుదయించిన నిస్వనంబు । నొగి వ్యోమము భూ

---

* "ఏష్యామి తే గృహాన్ సుభ్రూః పుంసామాధిక్యదర్శనం, సాధితార్థో ఽగృహాణాం నః పాంథానాం త్వం పరాయణమ్" అని మూలము. "అధిక్యదర్శనం మనఃపీడాశమనం. అగృహాణాం అకృత దారాణాం పాంథానాం ప్రవాసినాం" అని వ్యాఖ్య.

మిదిశల నిండెను గంసుం, డదివిని భీతిల్లె గుండె లదరుచునుండన్. ౧౮ 2383

చ. అనుచరయుక్తులై యపు డహంకృతిమీఱఁగఁ జాపరక్షకుల్
మనములఁ గోపమూని పరిమార్చుతలంపులఁ బట్టఁబూని యా
వనరుహనేత్రుఁ జుట్టుకొని పట్టుఁడు కొట్టుఁ డటంచు నాతురం
బును గని రంత వార లెదఁబూను దురాశయ మెన్ని సోదరుల్. ౧౯ 2384

క. కోదండపుఁ దునుకలఁ గొని, యాదుష్టులఁ గ్రోధమూని యమగృహమునకుం
బోదగినవారిఁ జేసిరి, భూదయిత ప్రహితసైన్యములఁ దున్మి వెసన్. ౨౦

తే. ఆధనుశ్శాల వెడలి ప్రహర్ష మలర, నగరసౌభాగ్యమును గనుచుఁ గర మిచ్చఁ
దనరఁ దిరుగుచునుండి; రత్తతిని బౌరు, లాసహోదరు లొనరించినట్టి పనుల. ౨౧

చ. కనుఁగొని వారికింగల యఖండపరాక్రమముం సుతేజముం
వినుతిని గాంచుధీరతను విశ్వమనోహరరూపసంపదం
మనముల నెంచి పల్విధుల మాయురె! వీరలు దేవతోత్తముల్
జననము గాంచి రిక్షితి నెసంగెడువేడుక నంచు నెంచుచున్. ౨౨ 2387

క. విడువని యుత్సాహమునం, గడఁగి కనుంగొనిరి; వారు కమ్రగతులం
బడఁదిరుగుచు నుండంగాఁ, బడమర దెస నస్తమించె భాస్కరుఁ డంతన్. ౨౩

మ. వనజాక్షుండు హలాయుధుండు శకటవ్రాతంబు లున్నట్టి భూ
మిని జేరంజని రెల్లగోపకులు మేల్మేలంచు సేవించి రాఁ
గను; వ్రేపల్లియ వీడివచ్చుతఱి నాకంజాక్షునిం బాయఁజా
లని చింతం దురపిల్లు గోపిక లదేలా గెంచిరో యొక్కటన్. ౨౪ 2389

సీ. ఈదినంబునఁ గృష్ణు వీక్షింపఁగల్గిన మథురానివాసుల మహితభాగ్య
ములు ఫలించినవను మొదలగు పల్కులు సత్యంబులయ్యె నాసమయమందు;
శ్రీదేవి బ్రహ్మాదులౌ దేవవరులను వదలి తఁ గొలిచిన వర్ణ్యరూపుఁ
డగు కృష్ణమూర్తి దేహనంగసౌందర్యంబు గనినట్టి మథురానగరనివాసు

తే. లకుఁ దలంపఁగ గోపికాలాపము లొగి
సత్యములె యయ్యె ననుట నిస్సంశయంబు;
రామకృష్ణులు తమసుహృద్వ్రాతయుతిని
బదములం గడిగికొని యంతఁ బాయసమును. ౨౫ 2390

క. తనివి చనునట్లు దిని మఱి, దినమునఁ గంసుండు జేయఁ దివురుపనుల నె
మ్మనముల నెఱింగి యారా, త్రిని బుచ్చిరి సుఖసుషుప్తిఁ దృప్తిం గనుచున్. ౨౬

చ. అవనివిభుండు కంసుఁ డట నద్భుతకార్ముకభంగ మెల్ల యో
ధవరులచావు సోదరవధంబునకై తనయంపినట్టి సే

తే. బంచె; నాయధికారులు నంచితముగ
రంగమునకుఁ గావించి రర్చనలు మిగులఁ
దూర్యములు భేరులుం గడుఁ దుములముగను
ధ్వనియొనర్చెడుగతిఁ జేసిరి నృపునాజ్ఞ. ౩౨ 2399

క. మంచస్థానంబుల ధ్వజ,సంచయములఁ బుష్పదామసముదయముల న
భ్యంచితతోరణముల నల,రించి రదెంతో విచిత్రరీతిఁగ శిల్పుల్. ౩౩ 2400

చ. ధరణిసురుల్ మహీశులు మొదల్గల పౌరులు స్వోచితంబులౌ
నిరుపమమంచభాగముల నిత్యసుఖాకృతులన్ వసించి రా
సరణినె వచ్చి వేడ్కఁగను జానపదుల్ వసియించి రట్లె భూ
వరులును స్వార్హమంచముల వర్తిలి రెంతయుఁ బొంగువేడుకన్. ౩౪ 2401

ఉ. కంసుఁడు మండలేశ్వరనికాయము పార్శ్వములందు వర్తిలన్
హింసనె కోరుమంత్రితతి యెంతయు వేడుకఁ గొల్చిరాఁగ ను
త్తంసనృపాసనంబుపయిఁ దద్దయుఁ గుందెడుచిత్త మొప్పఁగా
స్రంసనమౌనొకో యనెడుసంశయముల్ మదిఁ దోఁచుచుండఁగన్ ౩౫ 2402

ఆ. కూరుచుండె; నంత భూరివాద్యధ్వనుల్, మల్లతాళరవము లెల్ల దెసల
నెసఁగె మల్లవీరు లింపారభూషితు,లగుచు గురువు లెలమి నరుగుదేర. ౩౬

సీ. మదమునఁ గన్నులు మూర్పడ నారంగమునుజొచ్చి రందును ముష్టికుండు
చాణూరుఁడును గూట శలతోశలులు ముఖ్యులవ్వారభూరివాద్య ధ్వనుల
గరము హర్షించి రంగమునందుఁ బొల్చిరి భోజనృపుండు తమ్ముఁ బిలిపింప [కుఁ
నందాది గోపకుల్ డెందముల్ హర్షింపఁ దమతమకానికల్ ధరణిపతికి

తే. నుచితరీతి సమర్పించి యొక్కమంచ
ముపయిఁ గూర్చుండి రెల్లెడ నపరిమితము
లైన వాద్యధ్వనుల్ దిక్కులందు మాఱు
మ్రోఁగుచుండంగ రంగంబుఁ బొలిచె మిగుల. ౩౭ 2404



నలువదిమూఁడవయధ్యాయము.

శ్రీకృష్ణుఁడు కువలయాపీడమనుగజమును వధించుట.

శా. నీరేజాక్షుఁడు సీరపాణియును వే నిద్రాదశన్ మాని యా
భేరీనిస్వనముల్ శ్రుతుల్ చొరఁగ గంభీరంబులౌ మల్లహా
స్తారావంబుల వించుఁ గాలమున శౌచాదిక్రియల్ తీర్చి యా
యారంగస్థల చిత్రముల్ గనుఁగొనన్ హర్షంబునం దేలుచున్. ౧ 2405

చ. అరిగిరి రంగమండపమునంతికసీమకు; మావటీఁ డొగిన్

బురికొలుపంగ గర్వమునఁ ౹ బొంగుచుఁ దన్నలయింపఁ గోరు కుం
జరవరముల్ గనుంగొనియెఁ ౹ జక్రియు ద్వారమునందుఁ గంసుఁ డా
ద్విరదముఁ బెంచెఁ గృష్ణుని వధించు నటంచుఁ దలంచు చాత్మలోన్. ౧౫ 2406

తే. కువలయాపీడ మను పేరఁ ౹ గుంజర మది
ఖ్యాతిఁ గాంచెను; శౌరియుఁ ౹ గదనమునకుఁ
దగినచందాన వస్త్రంబు ౹ బిగియునట్లు
నడుమ సవరించి కుటిలకుంతలముల నొగి. ౨౫ 2407

సీ. గట్టిగా నెగఁగట్టి ౹ ఘననాదగంభీర నిస్వనంబున వానినిం గనుఁగొని
పల్కె నిట్లని; హస్తిపక హస్తిపక ! త్రోవ నిమ్ము తొలంగుమా ౹ యెడగలుగఁగ
నాలసింపకు; మట్టు ౹ లాలసించితివేని కుంజరమ్మును నిన్నుఁగూడ జముని
ప్రోలికిం బంపుదు ౹ వాలాయముగ నని యదలింపఁ గ్రుద్ధఁబూని ౹ హస్తిపకుఁడు

*తే. దంతిఁ గినియంగఁజేసి యుద్ధతిని బూని
యున్న కాలాంతకయముని ౹ నుపమ చేయఁ
దగిన యావారణేంద్రమ్మును గవియునటు
చేసె శ్రీకృష్ణుపైకి; హస్తియును ద్వరను. ౫ 2408

చ. కరమును జాఁపి వే యడరి ౹ కంజదళాక్షుని సంగ్రహించె నా
హరియును ముష్టిఘాతమున ౹ నాగజతుండము నొంచి యెట్టులో
కరముననుండి వీడ్వడుచుఁ ౹ గాళ్లసందున దాఁగి యుండె; నా
ద్విరదవరంబు క్రుద్ధమయి ౹ వీరునిఁగానక నాల్గుదిక్కులన్. ౬ 2409

క. పరికించుచు మూర్కొనియె, పరునైన నెఱుంగఁజాలుపద్ధతి కలదా
ట రయంబునఁ దనఘనపుష్కరమున శోధించె బట్టఁ ౹ గాంతు పొదలఁగన్.

మ. వనజాక్షుండును బల్మిమీఱ నుపమం ౹ బాదాంతరస్థాన మొ
క్కనిమేషంబునఁ బాసి వెన్కకుఁ జనెన్; ౹ గంధద్విపేంద్రంబుతోఁ
కనుభీమంబుగ నున్నదానిని భుజంగంబుల్ సుపర్ణుండు గై
కొనుచందంబునఁ గైగ్రహించి బలిమిం ౹ గుందించి యుద్వృత్తిమై. ౮౫ 2411

చ. ఇరువదియేను చాపములనే పరుసల్ బడవైవ నెంతద
వ్వరయఁగ నానొ యంతటను ౹ వారణముం దగునట్లు లీలమై
హరి వడినీడ్చె నర్భకుఁడు ౹ నాడుకొనన్ మదిఁ గోర్కెయొప్ప నే
కరణిని దూడ వాలమును ౹ గైకొని యిట్టటు త్రిప్పు నట్లుగన్. ౯౫ 2412

ఆ. దానితోఁకఁ జేతఁబూనిక గ్రహియించి, సవ్యదక్షిణముల ౹ సామజంబు

---

* "చోదయామాస కృష్ణాయ కాలాంతకయమోపమమ్" అని మూలము. "అంతకో మృత్యుః కాల స్తన్నిమిత్తం యమ స్తన్నియంతా తైరుపమా యస్య" అని వ్యాఖ్య.

తిరుగ వ్యత్యయముగఁ దిరుగుచుఁ దానును, ద్రిప్పి త్రిప్పి దానియొప్పు మాన్చె.

క. కుడియెడములు గాఁ ద్రిప్పుచు, వడిఁ దిరుగుచు నద్ది తన్నుఁ బట్టఁ దివురఁగా
జడియక కూడఁ దిరుగుచు న,తఁడు దానికి నెదురుపోయి తారసిలి తగన్. ౯౫

క. కరతలమున నడఁచిన నది, గురుతరరోషంబుమీఱఁ గొబ్బున రాఁగాఁ
బరువులిడి నేర్పునన్ ద,త్కరి యిలఁబడునట్లు చేసెఁ గడుశక్తిమెయిన్. ౧౦

చ. కరివర మద్ది తుండమునఁ గాఢతరంబుగఁ దాఁచఁగా వడిన్
మురదనుజారి నేర్పుమెయి భూమికి వ్రాలెను దెబ్బ తప్పఁగా
హరిదగు పాటుఁగాంచి యది యట్టిపయింబడ రాఁగ లేచి వే
పరుగిడఁ గోపవేగమునఁ బర్విడి దంతయుగంబు నాటఁగన్. ౧౧ 2416

క. వనజాక్షుఁ గ్రుమ్మఁబోయిన, మును పే హరిచనుట నద్ది భూమిని గ్రుమ్మం
గనునోచె; నివ్విధంబునఁ, దనవిక్రమ మెల్లఁ బ్రతిహతంబయి చనుటన్. ౧౧౫

ఉ. వారణరాజ మయ్యది యవార్యరుషావిలమానసంబునై
శ్రీరమణున్ గ్రహింపఁగను జేరఁగ హస్తిపకుండు సంజ్ఞచేఁ
గోరికఁ బ్రోత్సహించుటయుఁ గ్రోధము మిక్కిలి తన్ను నేచఁగాఁ
జేరిచి కృష్ణుమార్కొనియె; భీతజనార్తిహరుండు చక్రియున్. ౧౨ 2418

మ. తనపై కివ్విధి రాఁగఁగాంచి ద్విపహస్తంబున్ స్వహస్తంబుచేఁ
తను జక్కన్ గ్రహియించి భూమిఁబడి యత్యంతార్తి నొందంగఁ జే
సెను దామోదరుఁ డంతఁ గాల నదిమెన్ సింహక్రమం బొప్ప నే
పున దంతంబుఁ బెకల్చి దాననె ద్విపంబున్ హస్తిపవ్రాతమున్. ౧౪ 2419

క. పొరిపుచ్చె; నంతఁ జచ్చిన, కరినిన్ దిగవిడిచి వేడ్కఁ గడలుకొనఁగ భీ
కరదంతముఁ జేఁ దాలిచి, త్వరంగా రంగమును జేరెఁ బౌరుష మలరన్. ౧౪౫

సీ. మూఁపురంబున దంతమును దాల్చి యాగజమదరక్తబిందువుల్ సమహితగాత్ర
మందుఁ జిహ్నములుగ నగపడుచుండంగ వదనాంబురుహమందు వఱలుచున్న
స్వేదబిందువు లొక్కవిధమునఁ గన్పడ భాసిల్లుచుండె నాపరమపురుషుఁ;
డంత నాసోదరు లనుచరులౌ గోపకులు కొంద ఱట్టిత మ్మెలమిఁ గొలిచి

తే. రాఁగ గజదంతరూప విరాజమాన
శత్రుభయదాయుధములు హస్తములఁ గ్రాల
మల్లరంగంబుఁ జొచ్చి రమందగతులఁ
జూచువారెల్ల ముదమంది చొక్కియుండ. ౧౬ 2421

సీ. తనుఁజూచు మల్లురకు నశనిప్రాయుఁడై నరుల కెల్లను నరనాథుఁ డగుచుఁ
దరుణులకున్ మూర్తిఁ దాల్చినమదనుఁడై గోపకులకు నెల్లఁ గూర్మిచుట్ట
మయి దుర్జనులగు నయ్యవనీశులకు శాసకుండయి తనజనకులకు శిశువు
గ నగుచు భోజవిభునకు మృత్యువునయి యజ్ఞానులకు నపర్యాప్తుఁ డగుచు

తే. యోగులకుఁ బరతత్త్వమై । యొప్పి వృష్ణి
కులమునకుఁ బరదేవమై । యలరుకృష్ణుఁ
డన్నతోఁగూడ రంగంబు । నందుఁ జొచ్చి
కానఁ బడుచుండె రసికాగ్ర ।గణ్యుఁడగుచు. ౧౭ 2422

క. కరివరము హతంబగుటయు, నిరువురు సోదరులు జగతి । నెవ్వరికే సం
గరమున జయింపరామియుఁ, బరికించి యెఱింగి భోజపతి తా మదిలోన్. ౧౮

క. అతిసాధ్వస మందెను దన, మృతికిన్ హేతువులు వార । లిర్వురె యనుచున్
మతినెఱుఁగుట; నంతట ను, న్నతభుజులై చిత్రభూషణము లలరారన్. ౧౮

చ. సురుచిరవేషముల్ వెలయ । సొంపగుమాల్యము లొప్పుచుండ నం
బరము లమూల్యతం దనర । భవ్యగతుల్ దగ రామకృష్ణు లా
తరుణమునందుఁ జిత్రముగఁ । దారు గనంబడి రెంతొ వేడ్కన్ శ్రీ
కరవరవేషధారులయి । క్రాలెడురీతిని రంగమం దొగిన్. ౧౯ 2425

క. తమతనుకాంతులఁ బ్రేక్షకుల మనస్సుల లోఁగొనుచు విలాసమువిూఱన్
దమయంతవారు లేకయె, యమరిరి సోదరులు దుష్టు । లతిభయ మందన్. ౧౯

చ జనపదవాసులున్ నగరస త్తమవాసులు మంచరాజి నొ
య్యన వసియించియుండి మహితాత్ములఁ బూరుషవర్యులన్ జగ
ద్వినుతుల వారిఁగాంచుచుఁ బ్రవృద్ధముదంబున విస్తృతంబులై
నయనముల్ స్ఫుటాబ్జము లనం దగు మోములు చెల్వుమీఱఁగన్. ౨౦

క. వారల వదనాంభోరుహ, సారమరందంబుఁ గ్రోలి । సంతృప్తియె చే
కూరకయుండిరి; మఱియున్, వారాసోదరులఁ గన్గ వలఁ ద్రావుగతిన్. ౨౦

తే. నాలుకలచేతఁ దమిమీఱ । నాకుచున్న
యట్లు మహార్కొన్నగతిని జిహ్వలఁ గరములఁ
గౌఁగిటం జేర్చుకొనుసట్లు । గాఁ గనఁబడి;
రింకనుం బ్రేక్షకులు తమి । యెసఁగుచుండ. ౨౧ 2429

చ. ఇరువురువారు సొంపుదగ । నేనుఁగుదంతము లూనఁగా మనో
హరములుగాఁ గనంబడెదు । నాకృతులం దగియుంట విక్రమ
స్ఫురణముమీఱ నుంట నొక । పోలిక నవ్వులు పల్కులెంతొ య
చ్చెరువునుగూర్చుచుండ సురుచిం దగియుంటఁ దలంచి చొక్కుచున్. ౨౧

ఆ. దిట్టతనము స్మృతికిఁ । దెచ్చుకొన్నట్టులు, మునుపుగన్నయట్టి । ఘనధనుర్వి
భంగ ముఖములైన । పటుకార్యములకును, శ్మాధరోద్ధరణ ముఖంబులకును.

క. అనురూపంబుగ నుండిన, యనఘులఁ నవ్వారిఁ గాంచి । యందఱు తమలో
నన పల్కఁజొచ్చి రివ్విధ,మునః నారాయణుని యంశమున వీర లిలన్. ౨౪

సీ. వసుదేవునింట నవతరించి రంతియ కానివేఱొక్కరు ♦ కారు నిజము
కృష్ణుఁ డీతఁడె దేవకీగర్భమునఁ బుట్టి కొనిపోవఁబడియెను ♦ గోకులమున
కింతదాఁకను నందునింట గూఢంబుగఁ బెరుఁగుచుండెను బరాత్పరుఁడు నయ్యు;
నితనిచేఁ బూతన ♦ యెట్లొ లీలఁగఁ జంపఁబడియెఁ దృణావర్తుఁ ♦ డడరియే మొ

ఆ. చేయఁబూన నితఁడె ♦ మాయించె నాతని, జతగనున్న మద్దు ♦ లతివిచిత్ర [ఱల్లి.
తనుఁడు ధేనుకుఁడను ♦ దనుజుఁడుఁ గేశియుఁ, గుహ్యకుండు మఱియుఁ ♦ గొంద

క. తనువుల వదలిరి శ్రీకృష్ణుని వంకనె; యీతఁడే మునుపు గోపులగో
పనికరము దావపావకు,ని నుండియే కాచె దుష్టునిం గాలియునిన్. ౨౪ 2434

క. మృదుపదములఁ ద్రొక్కుచుఁ ద,న్మదమడఁచెఁద్రిలోకనాథుమానముఁ దూలిం
చెఁ దగన్ గోవర్ధన మే,డుదినము లొకచేతనే కడున్ శక్తిమెయిన్. ౨౫

క. అలరెడునట్లుగఁ దాలిచి, కలవిలపాటొందు ధేనుగణముల వృష్ట్యు
ల్కాలచేత గాలిచేతన్, విలయము గనకుండఁ గాచె ♦ విశ్రుతరీతిన్. ౨౬ 2436

చ. అనయము సంప్రమోదయుతమా చిఱునవ్వున బెళ్కుచూపులన్
దనరెడు కృష్ణునెమ్మొగము ♦ దా రొగి గోపికలెల్లఁ జూచుచున్
ఘనబహుతాపజాలములఁ ♦ గందకయుండఁగ దాఁటి యశ్రమం
బున నిబిడప్రమోదమును ♦ బొందుచునుందురు పుణ్యవృద్ధిచేన్. ౨౭ 2437

తే. ఈమహాత్ముఁడు రక్షింప ♦ నెంతొ గొప్ప
దగుచు యదువంశ ముర్విని ♦ యశము సిరిని
గొప్పఁదనమును బొందుచు ♦ నొప్పు ననుచుఁ
బలుకుదురు పెద్దలందఱు ♦ తలఁచి తలఁచి. ౨౮ 2438

చ. ఇతఁడు రమేశునగ్రజుఁ డహీనపరాక్రమశాలి పంకజా
యతనయనుండు రాముఁ ♦ డితఁ డాదనుజేంద్రుఁ బ్రలంబు వత్సరున్
హత మొనరించె దోర్బలమహాభయదుండగు నాబకుండు నీ
వితతబలాఢ్యుచేఁ బడియె ♦ వీరలు రాక్షసు లింక నెందఱో. ౩౦ 2439

శ్రీకృష్ణబలరాములు చాణూరముష్టికాదులం జంపుట.

చ. అని యిటు లందుఁగూడిన మహాజను లెల్లను జెప్పుకొంచు నుం
డ నపుడు తూర్యభీకరనినాదము లెల్లెడఁ బెల్లురేఁగె; నం
త నృపునియాజ్ఞ వచ్చి తమదర్పముచూపఁగ రంగమందు ని
ల్చిన యలమల్లవీరులు హాళిన్ హరిఁ జూచుచు నుండి రెంతయున్. ౩౦ 2440

ఉ. వారలయందు మేటియయి ♦ బాహుబలంబునఁ బొల్చుచున్న చా
ణూరుఁడు కృష్ణరాములను ♦ నూత్నముదం బలరారఁ బిల్చి గం

భీరరవంబునం బలికె వీరులసమ్మతిఁ గాంచినా రటం
చారసి పల్కుచుందురు మహాజను లేమును వింటి మొక్కటన్. ౩౧ 2441

సీ. ఓనందపుత్త్రకా! యోరామ! మీరిర్వు రతులనియుద్ధంబునందు నేర్పు
గలవారలని మహీకాంతుఁడు కంసుండు కనఁగోరి మిమ్ము నిక్కడికిఁ బిల్వఁ
బంచెను; మనసుచే వాక్కాయకర్మంబులను రాజునకు హితమును దలంచి
యొనరించుప్రజలు మేలొందుచునుందురు విపరీతమైన ప్రవృత్తిఁ గాంచు
తే. వారు కీడొందుచుందు రీభంగి యెల్ల,వారలకుఁ దెల్లమైయుండవచ్చు; మేము
మల్లయుద్ధంబు నేర్చినమాట యెట్లు,తెలియు రాజున కని మీరు పలుకరాదు.

చ. వనముల దూడలం దిరుగుభంగి నొనర్చుచు నాఁటినుండి యా
లను మఱిమేపుదాఁకను జెలంగువయస్సున గండుమీఱి చ
క్కనిముద మొప్ప నిత్యమును గాఢతరంబగు మల్లయుద్ధముం
బొనరుచుచున్ విహారమును బూన్కి నొనర్తురు గాదె మీ రొగిన్. ౩౪

ఉ. కావున మల్లయుద్ధమునఁ గల్గును బాండితి మీకు; నిత్తఱిన్
భూవిభుమౌళి చిత్తము ప్రమోదమునొందఁగ మీరు మేము ని
చ్చో విహరింత మెల్లరును జాతురుగా మనబాహుయుద్ధ మీ
క్ష్మావరుఁ డిచ్చమెచ్చఁగఁ బ్రసన్నము లౌఁగద యెల్లభూతముల్. ౩౫ 2444
తే. సర్వభూతమయుండని క్ష్మావిభునిని, బలుకుచుందురు గద సజ్జను లనియిట్లు
పలుకు చాణూరుమాటల కలరి కృష్ణుఁ,డొప్పఁ బలికెను దేశకాలోచితముగ.

చ. తనకును మల్లయుద్ధము నితాంతమునొఁ బ్రియమంచు నెంచు చా
తనివచనంబు మెచ్చుచు సదస్యులు మెచ్చెడునట్టు లిట్లనున్
వనచరులంచుఁ బిల్వఁబడువారము మేమును భోజభూమిపా
లుని దగుపాలనంబునకు లోఁబడి యుండెడువారమే కదా? ౩౬ 2446
క. మిముఁబోలువార మగుదుమె, క్షమాధిపుని ప్రజలమగుట సంతోషము ని
త్యము గల్గఁజేయు టొప్పును, బ్రమదము రాజునకుఁ గల్గుభంగిగ మేమున్.
తే. సంచరించుటయే విధి చక్కఁదలఁప,నదియె మిగుల ననుగ్రహ మనుచు నెంతు
మద్ది యట్లుండ నిమ్ము మాయాశయమ్ము, తెలుపఁదగియుండు ధర్మవిశోధిజ్ఞులకును.
శా. మేమో బాలుర మట్టులౌట సుజనుల్ మేల్మేలనన్ మమ్ము నే
యేమాడ్కిన్ సరిపోలువార లెవరో యే మెంచి యవ్వారితో
భూమీశప్రియ మంచు మల్లసమరంబుం జేసి క్రీడింతు మి
ట్లే మర్యాద చెలంగు హెచ్చయినవారే కల్గినన్ వారితోన్. ౩౭ 2449
చ. సమరముచేయఁబూన మిది చక్కనిధర్మము గావునన్ యథా
ర్హముగ నియుద్ధమున్ జరప నౌ మఱి మల్లసభాధికారివ

ర్గమున కధర్మ మెవ్విధిని గల్గకయుండెడుఁగాక! యంచు శా
స్త్రమునకు సమ్మతంబయిన చక్కని కృష్ణుఁడు పల్కుచుండఁగన్. ౩౬ 2450

మ. విని చాణూరుఁడు కృష్ణుభావము మనోవృత్తిన్ క్షణం బెంచి యి
ట్లనియెన్ బాలుఁడ వీవు కావు శిశుశబ్దార్థంబు నీయందుఁ జె
ల్లు నదెట్టుల్ మఱి యీబలుండు నినుఁబోలున్ శక్తి నట్లౌట మీ
రనఁ బ్రాయంబున విట్టివీఁగుదు రనన్ న్యాయంబుగాదే హరీ! ౩౭ 2451

ఉ. అంతియకాదు దోర్బలసమగ్రులయందును మీరుచూడ మేల్
బంతులరౌదు రందునను వారణపర్యసహస్రసత్త్వుఁడు
ర్దాంతగజేంద్ర మొక్కటి మురంబునఁ జంపెతి వీవు కాన నో
క్కింత కొఱంతలేని బలమే గలవాఁడ; వితండు నట్టులే. ౩౮ 2452

క. బలవంతులతోడన్ మీరలు పోరుట న్యాయమగును రణమున నిందున్
గలుగ దధర్మము సుంతయుఁ, బలుకులు వేయేల నీవుబవరము నాతోన్. ౩౯

క. ఒనరింపు నీసహోదరుఁ, డును ముష్టికుతోడుతం గడుం బోరును దీ
నను మల్లసభ్యులకు నే, యనుమానము ధర్మభీతి యమరదు సుమ్మీ! ౪౦

---

## నలువదినాల్గవ యధ్యాయము.

మ. అని చాణూరుఁడు పల్క సర్వవిదుఁడై యాత్మేచ్ఛయే సత్ఫలం
బును గల్పింపఁగ నొప్పు శ్రీహరి మనంబుం బొంగఁగాఁ బల్క మ
ల్లునితోడన్ సమరంబుఁ జేయఁగడఁగెన్ లోలాత్ముఁడౌ ముష్టికున్
జనితోత్సాహుఁడు రాముఁడున్ దలఁపడెన్ సత్త్వంబు పైఁబొంగఁగన్. ౧

చ. కరములతోఁ గరంబులను గాఢతరక్రుధఁ బాదముల్ భయం
కరగతి మీఱఁ బాదములఁ గ్రక్కున నొంపఁ బెనంగఁజేసి యొ
క్కరినొకరడ్డై నొంప జతగాఁ దలపోయుచు బల్మిఁబట్టి యీ
డ్చిరి జయమందు కోరికలు చెచ్చెఱఁ బుట్టఁగ నెల్లరుం గనన్. ౨ 2456

సీ. చెలఁగెడు పూన్కి మోచేతులతోడ మోచేతులఁ బీడింపఁజేసి యల్గి
మోకాళ్ల చేతను మోకాళ్లఁ గదియించి తలచేతఁదలలను యత్నమున వక్ష [ము
మును దాఁకఁగాఁజేసి యనుపమక్రుధఁ గొట్టుకొనిరి; చేతులఁ బట్టుకొని వలయ
గాఁ ద్రిప్పుచున్ మఱి కడఁకమైఁ బట్టి దూరమునఁ బడంగ దోర్బలము మెఱయఁ

తే. జిమ్ముచున్ బాహువుల నట్టి చెర్చి యడఁచు
చును జవంబునఁ బైకెత్తి క్షోణిఁబడఁగ
వైచుచున్ దాఁకుచున్ మఱి యేచి తలఁప
డఁగ వెనుకకును బోవుచు డాఁగి యుండి. ౪ 2457

క. త్వరపడి తలఁపడుచుఁ బర, స్వరమును బీడించుచుండి పంతంబు తగన్
జరణంబుల మోకాళ్లను, గరముల బిగఁబట్టి యొకటిగాఁ గూర్చియటన్. ౪౫

ఆ. పడినయట్టి వానిఁ బైకినెత్తుచు రెండు, చేతు లాడిసిపట్టి చెలఁగుపూన్కిఁ
బయికి నీడ్చుచున్ జవంబున మెడ మొద,లైన వానిబట్టి నట్టులైన. ౪౬ 2459

క. తాలఁగం జిమ్ముచు శత్రువు, నలయఁగఁ జేయుచును జేతు లంఘ్రు లొకటిగాఁ
గలయంగఁ బట్టుకొనుచుఁ గ,దలకుండఁగ నదుముచున్ నితాంతబలమునన్.

క. విజయేచ్ఛలు పైకొన నెల్లజనులు గనుచుండఁ దనువులన్ నొప్పింపం
గ జతనము చేయుచుండిరి, గజరాజగతుల్ చెలంగు కాంతామణులున్. ౪౮

తే. గుంపులుగఁ గూడి యాబాలికులపయిఁ గల
భూరికృపచేత నిటుపల్కఁ బూని రప్పు;
డాండొరులతోడ బలులతో నొగి నబలులు
సలుపు యుద్ధంబు గాన నసంగత మని. ౬ 2462

మ. అకటా! బాలురతోడ దోర్బలులు జన్యం బిట్లు చేయంగ వే
డుకఁ జూడన్ నృపుఁ డేగుదేర వలదిట్టుల్ చేయఁగా రాదటం
చకలంకస్థిరధర్మముం దెలిపి యీయత్నంబు మాన్పింపఁ బూ
నక స్వీయంబగు కర్జమున్ గనక యున్నారే తగం జూచుచున్. ౭ 2463

క. ఈరాజసభ్యులకు నిది, యారయ ధర్మంబె? నృపునియట్లుగఁ జూడం
దారును సమ్మతిఁ గని రిదె; యారయ శైలేంద్రసన్నిభాంగులు నగుచున్. ౭

చ. కులిశములట్టు లంగములకూటమి యొప్పఁగ భీకరంబుగాఁ
జెలఁగెడు మల్లు లెక్కడ? ప్రసిద్ధినిగాంచిన కోమలాంగముల్
గలిగి యలబ్ధయావనులు గాఁ దగియున్నకిశోరు లేడ? స
భ్యులయిన వీరికిన్ గలుగుఁ బో గురుధర్మవిపర్యయం బిటన్. ౮౫ 2465

క. ఋతమిద్ది; యధర్మంబే, క్షితినిం దలచూపునో యటఁ జేరినిలువ రా
దతిశయదోషం బబ్బును, మతిమంతుఁడు సభ్యదోష మండలవిదుఁ డై. ౯

ఆ. పోవరాదు సభకు బుద్ధి వారలదోష,ముల స్మరింపఁదగును తెలియనట్టి
మనుజుఁ డట్టిసభకుఁ జని యేమియుం బల్క,కుండిననఘమబ్బు నురుతరముగ.

క. విపరీతంబుగఁ బల్కిన, నపుడే కిల్బిషము లంటు నంగనలారా!
రిపువగు మల్లుని చట్టును, నపగతభయుఁడౌచుఁ గృష్ణుఁ డతివేగమునన్. ౧౦

క. తిరిగెడు తఱి సుందరముఖ, సరసిజ మదె స్వేదబిందు సంవ్యాప్తంబై
సరసిజకోశము జలశీ,కరయుతమై యొప్పురీతిఁ గనఁబడెడుఁజుఁడీ! ౧౧ 2469

క. కనుఁడీ! యాతామ్రవిలో, చనముల్ కనుపట్టఁ దనదుశత్రువుఁడయి పా
ల్చిన ముష్టికు విషయంబునఁ, గినుక వహింపంగ సురలు కీర్తింపంగన్. ౧౫

తే. హాససంరభశోభితం బగుచు మోము
కనఁబడఁగ రాముఁ డున్నాఁడు గాంచుఁ డతని;
శంకరుఁడు లక్ష్మిపూజించు చరణసరసి
జములుగల పురుషోత్తముఁ గమలనాభు. ౧౨ 2471

మ. కనుఁడీ కృష్ణుని మానవాకృతి తనుం గప్పంగ మాహాత్మ్య మిం
తని యెవ్వార లెఱుంగకుండఁగ నరణ్యాం బందుఁ జిత్రంబుగాఁ
గననా పూవులనొప్పు హారములు వక్షంబందుఁ జెల్వార వే
ణునినాదం బొనరించుచుం దమిని ధేనువ్రాతముం మేపుచున్. ౧౨ 2472

మ. బలరాముండును వెంటనుండ విహరింపం నోచియున్నట్టి ప్రేఁ
తల బృందావనభూములే కడుఁ బవిత్రంబుల్; మురారాతినే
యలయింపంగను జూచురంగ మిది యత్యంతాపవిత్రంబె యా
లలనారత్నములైన గోపికలు శ్రీలంగూర్చుచుం వేడుకన్. ౧౩ 2473

శా. లావణ్యైకనిధానమై సమత యేలాగైనను లేక హా
చ్ఛే వీక్షింపఁగ లేక నైజముగనే యింపారున ట్లొప్పుచుం
శ్రీవాసంబయి సద్యశోనిలయమై చింతింప దుష్టాళికే
యేవేళం బడయంగరానిదయి యెంతేఁ బుణ్యమూలంబు నై. ౧౪ 2474

క. ప్రతిసమయంబున నూత్నా, ప్రతిమరుచుల్ తనరుచుండ భాసిల్లెడు శ్రీ
పతిరూపము నేత్రంబుల, జతనము మీఱంగఁ గ్రోలఁ జాలుదురుగదా? ౧౫

క. తొలిమేన నెట్టిపుణ్యం,బులఁ జేసినవారొ తెలియఁబోలునె మనకుం;
జలజాక్షులార! వ్రజమునఁ, గలనారీమణుల పుణ్యకర్మము లహహా! ౧౬ 2476

సీ. హరియందుఁ జిత్తంబు లాదృతిగాంచుట సంతోషమున స్వవశములుగాక
సర్వవిషయము లాచక్రిపై నర్పించి యతనినే యెల్లెడ నరయుచుఁ దమిఁ
బాష్పబిందువులు గ్రీవలకు నడ్డముపడ నీసరోజాక్షుని నీమహాత్ము
బయసుపిండెడు నప్డు పడ్లుదం చెడుతఱిఁ బెరుఁగుచిల్కొడునట్టి తరుణమందు

తే. సదనమార్జనఢోలికాచలనములను, బుడుత లేడ్వంగ వారల బుజ్జగించు
నపుడు తరుజలసేచనమందు మఱియుఁ, గలుగుపనులందుఁ గీర్తింపఁ గలరుగాదె.

క. కనుఁడ ధన్యలె గోపిక, లనవలయుం; బెందలకడ నావ్రజమునను
డి నళినదళనయనుఁడు ధేనునికరముం దోలుకొనుచు నూత్నమహామునన్.

చ. చనియెడువేళ మాపున వ్రజంబున నల్లన నాలఁదోలుకొం
చనువుగ వేణువూఁదుచు నొయారము మీఱుచునుండఁ జొచ్చువే
ళను మురళీనినాదము విలాసముగా విని యందుఁగల్గు నా
వనితలు వేగ యిల్వెడలి వచ్చి మనోహర సుస్మితాస్యమున్. ౧౯ 2479

చ. కరుణనుగూడియే వెలయుఁ గ్రవిలోచనయుగ్మముల్ మహో
దరమున నేత్రపర్వముగఁ జద్దయుఁ గాంతురు పూర్వజన్మమం
దురుతర పుణ్యకర్మముల నొప్పుగఁ జేసినవారలౌట; నం
చు రమణు లిట్లు చెప్పుకొనుచున్ హరిఁ జూచుచునుండు నంతలోన్. ౧౭

క. భగవంతుఁడు యోగీశ్వరుఁ, డగధరుఁ డాకృష్ణమూర్తి యత్తరుణమునన్
బగవానిఁ గంసునిం జంపఁగ నాత్మన్ నిశ్చయించెఁ బంతం బలరన్. ౧౮ 2481

చ. తనయులఁ గూర్చి యాసభ నితాంతభయంబును గన్నయట్టి యా
వనితలు పల్కుచున్న యలవాక్యములన్నియు నాలకించుచుం
దనయులదో బలం బెఱుఁగఁ దా రిసుమంతయుఁ జాల కట్టియా
ర్తిని గని రప్డు నందవసుదేవులు లోకముతోడిపాటిగన్. ౧౯ 2482

సీ. చాణూరుఁడును హరి సకలభేదంబుల మల్లయుద్ధములచొ సత్కృతుల నొ
కరి నొక్కరు జయించుకాంక్షలఁ బోరాడుచుండి రావిధమున భండనంబు
బలదేవముష్టికుల్ బవరంబు చేసిరి; వజ్రపాతమువలె భయదములగు
నచ్యుతుగాత్రప్రహారంబులను దనయంగములెల్ల నలంగుటయును
తే. సత్త్వమంతయుఁ దూలంగఁ జాలడస్సి, నట్టులయ్యును డేఁగయ ట్లతఁడు పైకి
నురవడిం జెంగలించి స్వకరయుగంబు, ముష్టిగను బట్టి క్రోధంబు పొంగుచుండ.

క. హరిదగు వక్షము నొంచెను, గరిరాజను పుష్పహారఘాతంబున నె
క్కరణిఁ జలింపదో యావిధి, మురరిపుఁ డద్దానఁ గుందుపొందక యుండెన్.

చ. వనజదళాక్షుఁ డంతటను వానికరంబులు రెండుఁ గట్టిగాఁ
దనకయిదోయిఁ బట్టుకొని దారుణభంగిని బెక్కుమాఱు లిం
తనఁ దగనట్టి వేగమున నాతనిఁ ద్రిప్పి ధరంబడంగ మో
దెను గతజీవితుం డగుచు దివ్యకళాపము లెల్లవీడఁగన్. ౨౨ 2485

ఉ. హారములున్ శిరోజములు నట్టులె వీడఁగ నార్తిఁ గుంది చా
ణూరుఁడు శక్రకేతనమునుం బురుడించుచు గ్రిందఁ గూలె నా
తీరున ముష్టికుండు బలదేవుని ముష్టిహతాంగుఁ జేయఁగా
సారబలుండు రాముఁడు విశాలతలంబున వాని బిట్టుగన్ ౨౩ 2486

క. వెనుకోపంబునఁ జఱచెను, ఘనతలహతి నర్దితుఁడయి కడువడి వదనం
బుననుండి నల్ల వెడలంగను బ్రాణము లట్టె వెడలఁగా విపన్నుండై. ౨౪ 2487

క. అనిలసమాహత భూరుహమును బోలుచు నేలఁగూలె ముష్టికుచావుం
గని కూటమల్లుఁ డాగ్రహమునఁ దలపడ రాఁగ శూరముఖ్యుఁడు హలియున్.

క. దానినొక లెక్కచేయక, యే నియతిన్ వామముష్టి నేచినపూన్కిన్
దా నెంతో లీలఁ బొడువంగా నాతఁడు నేలఁగూలె గతజీవితుఁడై. ౨౬ 2489

క. హరి మార్కొని శలుఁ డాతని, చరణాహతి శీర్షమట్టి శకలములైనన్
ధరఁ గూలె నట్లె తోశలుఁ, డురవడి మార్కొనఁగ వానినుద్ధతు హరియున్.
తే. రెండుగాఁజీల్చి వేగ పఱరేతరాజు, నింటికింబంపె వారిర్వు రిట్లు గూలి
రివ్విధంబునఁ జాణూరుఁడెన్నఁదగిన, ముష్టికుఁడు శలకూటులుభూమిఁబడఁగ.
తే తోశలుండును జావంగ ధూర్తులైన
యట్టితక్కిన మల్లులు నసువులపయిఁ
గలుగు నాశలఁ బాఱిరి ? కడుభయమున
నంత నారామకృష్ణు లత్యాదరమున. ౨౮ 2492
క. తమయీడుగల్గు గోపకులమిత్రులఁ గూడి యాస్థలంబుననే వా
ద్యములెల్ల మొరయుచుండఁగ,సుమహితమణినూపురములుసొంపుగ మొరయన్
తే. నర్తనంబుల స్వేచ్ఛ నొనర్చుచు నట
విహరణము సల్పి; రిట్లు శ్రీవిభుఁడు రాముఁ
డొనరఁ జేసినయహాకృత్యమునకుఁ గంసుఁ
డొక్కరుఁడు తక్క నక్కడనుండు జనులు. ౩౦ 2494
క. ధరణీదివిజప్రముఖులు, నిరుపమ సాధుత్వయుక్తి నెగడెడువారల్
సరిసరి యీకృత్యం బని, యరుదుగ వినుతించి రెంతొ హర్షముపొంగన్.
ఉ. అత్తఱిఁ గంసభూపతి మహత్తరదోర్బలులైన మల్లు ల
ట్లుత్తలపాటునొంది మృతినొందుట తక్కిన మల్లు లార్తిచేఁ
జిత్తము లెల్లభీతిఁ గనఁ జెచ్చెఱఁ బాఱుట చూచి లోపలం
దత్తఱపాటు నొంప గతధర్ముఁడు కావున నాగ్రహంబునన్. ౩౧ 2496
తే. వాద్యముల నిల్పఁ బంచి సేవకులతోడ
నిట్లు వచియించె; మిగుల దుర్వృత్తులైన
వీరి వసుదేవతనయుల వెడలఁ గొట్టుఁ
డిప్పురమునుండి వేవేగ హితమగు నిది. ౩౨ 2497
క. గోపకుల ధనములెల్లను, వాపోయిన నదలకుండ వరుసం గొనుఁ డీ
పాపమతియైన నందుని, గోపపతిం గట్టుఁ డిది యోగుం గార్య మిఁకన్. ౩౨ 2498
చ. కుమతియు దుర్జనోత్తముఁ డగుంగద యీవసుదేవుఁ డాతనిన్
యమపురి కన్పుఁడీ మఱియు నాత్మజుపక్షముమాని శత్రుప
క్షమున మహాద్యుతిం గని యొసంగెడు మత్పిత నుగ్రసేను వే
గ మృతిఁ గనంగఁ జేయుఁడు తగన్ వధియింపుఁడు వానిభృత్యులన్. ౩౩ 2499

శ్రీకృష్ణుఁడు కంసునిఁ బొలియించుట.

చ. బిరుసుల నిట్లు పల్కుపృథివీపతిఁ గంసుని గాంచి కోపవి
స్ఫురణత నవ్యయుం డగుచుఁ బొల్చెడు శ్రీహరి లాఘవంబునన్

ధరణిపుఁ డుండు నెత్తయినతద్వరమంచముపైకి దాఁటి యె
క్కె రమణ; నిట్లు స్వీయమృతికిం దగఁ గారణమైన కృష్ణునిన్. ౩౪ 2500

మ. తనపై కేడ్తెవచ్చువానిఁ గని యాస్థానంబు వే వీడి లే
చి నితాంతోద్ధతుఁడౌటఁ జర్మము నసిం జేకొంచు యుద్ధంబుచే
యను సిద్ధంబుగ నుండె; ని ట్లతఁడు సవ్యం బట్టులే దక్షిణం
బనుమార్గంబుల డేఁగ యట్టులు విహాయస్స్థానమం దొప్పుగన్. ౩౫ 2501

*చ. తిరుగుచునుండ దుర్విషహతేజము నొప్పఁగ నుగ్రమూర్తియై
పరఁగుటఁ గృష్ణుఁ డాతని సుపర్ణుఁడు పన్నగమున్ గ్రహించు న
క్కరణిని బల్మిఁ బట్టుకొనెఁ గంసుశిరోజము లట్టె పట్టుకొం
చురుమకుటంబు క్రిందఁబడ నొక్కటఁ దన్ని పరాక్రమంబునన్. ౩౬ 2502

సీ. ఉన్నతమంచంబునుండి రంగముక్రిందికిని బడునట్లు త్రోసెను మఱియును
విశ్వాశ్రయుండయి వెలసి స్వతంత్రుఁడౌ నబ్జనాభుఁడు వానియవయవములు
నలఁగు నట్లుగవడిఁ జెలఁగుచు బైఁబడె; మూఁడులోకములకుఁగూడఁ దా నొ
కండె నివాసభూతుండయి యొప్పెడు హరి తనపైఁబడ నతనిక్రింద

తే. నున్న కంసుఁడు స్వాతంత్ర్యమూని కృష్ణుఁ
డట్టె నొక్కంగ నొక నిమేషాంతరమున
బ్రాణములఁ బాసె; విరహిత ప్రాణుఁడైన
కంసునిన్ లోకులెల్లరు గాంచుచుండ. ౩౭ 2503

చ. హరి కరినీడ్చునట్లుగ మహాత్ముఁడు కృష్ణుఁడు తచ్ఛవంబు స
త్వరముగ భూమి నీడ్చె నటఁ దద్దయు నక్కట యక్కటా! యటం
చురునినదంబు లెల్లెడల నొక్కటఁ బర్వఁగఁజేసి రెల్ల రా
తరుణమునందుఁ గంసుఁడు సతంబు స్వబుద్ధిని భీతినొందుచున్. ౩౮ 2504

చ. జలములఁ గ్రోలునప్పుడు వచస్సులఁబల్కెడు వేళఁ గూర్కు వే
ళలఁ దిరుగాడుచుండుతఱిన్ మఱి యూర్పులఁబుచ్చు నప్పుడున్
జలరుహనేత్రు నీశ్వరునిఁ జక్రధరాయతపాణి నాతనిన్
దలఁచుచు ముందు నున్నటులఁ దాఁ గనుచుండెడు వాఁడు కావునన్. 2505

క. దురవాపమైన యాశ్రీ, హరిరూపముఁ దానుబొందె; నాకంసుసహో
దరు లావార్తను విని సత్వరులై న్యగ్రోధకుఁ డనఁ దగు వీరుండున్. ౩౯

తే. కంకుఁ డింకను గలవారు కడఁగి యష్ట
సంఖ్యు లుగ్రక్రుధన్ సహజన్ము నట్లు

* "సమగ్రహీ ద్దుర్విషహోగ్రతేజాః" అని మూలము.

చంపినందులకుఁ బదులొ ॥ సలుపఁ బూని
హరిని మార్కొన నరుదెంచి ॥ రపుడు హలియు. ౪౦ 2507

చ తన యనుజన్ము మార్కొనిన ॥ దస్యులఁ గాంచి తదుద్ధతిం దగం
గని పరిఘంబుఁబూని పశు॥కాండము సింహమువోలెఁ జంపె; మ్రో
సెను దివిదుందుభుల్ హరికి ॥ జెందినవారలె గానఁ బద్మజుం
డనఘుఁడు శంకరుండుఁ ద్రిద॥శాధిపముఖ్యులు ప్రీతిమీఱఁగన్. ౪౧ 2508

క. కురియించిరి సుమవృష్టిని, హరిబలులం బొగడి; రంత ॥ నమరాంగన లా
దరమున నాడిరి; తదనం,తరమునఁ గంసావనీశ॥దారలు త్వరఁగన్. ౪౨ 2509

సీ. కంససహోదర ॥ కాంతలు మఱియును గలస్త్రీలు సుహృదులు ॥ గలనఁబడుట
విని దుఃఖ మేఁచంగ ॥ వే పయనంబయి కన్నీరు ప్రవహింపఁ ॥ గా శిరముల
మోదుకొనుచు వచ్చి ॥ ముందట వీరశయ్యల శయనించిన॥యట్టి మగల
గౌఁగిలించుకొనుచుఁ ॥ గడుశోకమున విలాపంబుచేయుచును శో॥బ్దంబురాఁమి

తే. నెట్లొ యెలుఁగెత్తి హానాథ! ॥ యిద్దియేమి
యో ప్రియా! ధర్మవిద్వర ॥ యోయనాథ
వత్సలా! ధర్మవిద్వరా! ॥ వరగుణాఢ్య!
నీవు హతుఁడవుకాఁగ మే ॥ మీవిధమున. ౪౪ 2510

క. తనయులతో గృహములతో,డను హతులమె యైతిమే యి॥ర్టఁ బురుషవరా!
నినుఁ బ్రాణేశుని బాయుట,గన నీపత్తనము శుభని॥కాయ మ్మెడలన్. ౪౫

క. మావలెనే యుత్సవములు, పోవఁ సుంతయును జూడఁ॥బోలని యట్లే
యీవిధి నున్నది; నాథా!, నీవో కోపమున భూత॥నికరంబులకున్. ౪౬ 2512

తే. నిరపరాధములని యెన్న ॥ నేర కెంతొ
ద్రోహ మొనరించితివి గాన ॥ ద్రోహ మదియె
యిట్టి దశనొందఁగాఁ జేసె ॥ నిపుడు భూత
ములకు ద్రోహంబుచేయ నె ॥ ట్లలరు సుఖము. ౪౭ 2513

చ. మురరిపు వీఁడే సకల॥భూతములఁ సృజియింపఁ బెంప సం
హరణముచేయ హేతువగు ॥ నట్టిమహాత్ముని కెగ్గుచేయ నె
క్కరణి సుఖంబుగల్గు నిది ॥ కాదన నెట్లగు? నంచు నిట్లు భూ
వరుని పురంధ్రు లేడ్వ విని ॥ వారిజలోచనుఁ డంతఁ గూర్మిమై. ౪౮ 2514

క. లోకములకు శ్రేయస్సులఁ, జేకూర్చెడు వాఁడుగాన ॥ క్షితిపతిమహిళా
నీకము నాశ్వాసించుచు, నాకంసాదులకు మఱియు ॥ హతులకు నెల్లన్. ౪౯

క. పరలోకక్రియలఁ దగం, దరుణము తప్పక యొనర్పఁ ॥ దా నాజ్ఞయిడెఁ;
దరువాతఁ దల్లిదండ్రుల, నురుబంధవిముక్తులనుగ ॥ నొగి నొనరించెన్. ౫౦

చ. ఇరువుర పాదపంకజము । లెంతయుభక్తి చెలంగుచుండ సో
దరులు స్వకీయశీర్షములు । తాఁకఁగ మ్రొక్కిరి; తల్లిదండ్రు లా
దరమున మ్రొక్కియున్న సుత। తల్లజులన్ గని లోకపాలు రి
ర్వు రనుచుఁ దా రెఱుంగుటను । బుద్ధులఁ గల్గినసంశయంబులన్. ౫౧ 2517

క. తొలఁగించుకొనుచుఁ గంసుని,వలనిభయము మాని ప్రీతి। వర్ధిల్లంగాఁ
జెలఁగుచుఁ గౌఁగిటఁ జేర్చిరి, తలమే సుతకౌతుకంబు। తగు నిట్లనఁగన్? ౫౧



న లు వ దే న వ య ధ్యా య ము.

శ్రీహరి దేవకీవసుదేవుల నూఱడించుట.

సీ. పురుషోత్తముం డంత । బుద్ధి నూహించె నాతలిదండ్రు లిప్పుడే।తత్త్వ మెఱిఁగి
రియ్యది ప్రస్తుత।కృత్యవిడంబనమున కనర్హ మటంచుఁ। దనమనమున
నూహించి యెల్లర । నొక్కక్షణంబున మోహింపఁజేయు వి।భూతిగల్లు
నాత్మమాయను వారి।యందుఁ బ్రయోగించె; సాత్వతర్షభుఁడైన । చక్రి యన్న

తే. తోడఁ దలిదండ్రులం బ్రీతిఁ । జూడఁ బోయి
వినయమునఁ దలవాల్చి 'యో । జనని, యోజ
నక' యటంచును బిల్చి మ।నంబు కరఁగు
నట్టిమాటల నిట్లనె । నార్య! జనక!. ౧ 2519

చ. ఇరువురుమీరు మాకొఱకు । నెంతయు నుత్సకతన్ సతంబు ని
ర్భరముగఁ గాంచుచుండినను । భారతరంబగు కష్టరాజి కా
తురపడకే మముం గని సు।తుల్ పచరించెడు చేష్టలెల్ల నా
దరమునఁ గాంచ నెంచియును । దారుణకర్మ విపర్యయంబునన్. ౨ 2520

తే. బాల్య పౌగండ కౌమార । భవ్యకేళు
లను గనంగ నొకప్పు డే।లాగునైన
వలనుపడకుండె; దౌర్భాగ్య । మొలయుట భవ
దంతికంబున మే మున్న। యదియె లేదు. ౩ 2521

చ. జనకునిగేహమందున నొసంగెడు వేడుకఁ దల్లిదండ్రు లో
తనయ యటంచు లాలనము । తద్దయు సల్పఁగనుండు భాగ్య మీ
తనయులకున్ లభింపదు గదా! సకలార్థసుసాధనంబుగాఁ
దనరిన యీకళేబరముఁ । దా రిలఁ గాంతురు పెంతు రాదృతిన్. ౪ 2522

తే. అట్టి తలిదండ్రులఋణం బ।దెట్టులేని, దీర్చుకొనుటకు మర్త్యుండు । తెంపుచేసి
నను శతాబ్దములుగలట్టి।తనదు నాయువునను శక్తుండుగాఁ డనఁ।జను నిజంబు.

[1]క. వారల తనయులలో నెవఁ, డారయఁగ సమర్థుఁడయ్యు । సంగధనములన్
వారికి వృత్తిని జక్కఁగఁ, గూరుపఁడో యట్టిఁడైన । కుత్సితమతియున్. ౪౫

క. మృతిగని లోకాంతరమున, కతిజవమునఁ బోవ నందు । యమునిభటులు కు
త్సితుఁడని యాతని మాంసం, బతఁడే తినఁ జేయుదురు యథార్థం బిడియరా. ౬

[2]చ. జననిని వృద్ధుఁ దండ్రినిని । సాధ్విగనొప్పెడు ధర్మపత్నినిన్
దనయుని బాలునిన్ గురుని । ధారణిదేవునిఁ దన్ను నాశ్రయిం
చినమనుజున్ సమర్థుఁడయి । చేరఁగఁదీసి భరింపకుండునో
మనుజుఁ డతండు శాస్త్రహిత । మార్గమునం దలపోసి చూడఁగన్. ౭ 2526

క. జీవన్మృతుఁ డను పేరన్, భావింపం దగును; గంసపార్థివు చేతన్
వే విధములఁ బీడితులయి, యీవరుసన్ మీర లుండ । నే మిరువురమున్. ౭౫

క. మిము రక్షింపం జాలియు, మిము శుశ్రూషలను గొల్వ । మించినశక్తిన్
క్షమనొప్పి సల్ప కటు వ్యర్థముగనె యీదినములను జరపితి మ దెట్లో? ౮

క. జననీ! జనకా! పరవశ, మనఁబడు దుస్థితిని గనుట । నార్తుల మిమ్మున్
గొని శుశ్రూషల నెంతయుఁ, దనుపని దుర్మతుల మైన । తనయుల మమ్మున్. ౮౫

తే. కంసుచేఁ గష్టమొందిన । కారణమున
నూరకుండితి మని మీర । లూహచేసి
తప్పు దీని క్షమింపఁగఁ । దగుదు రనుచు
మాయచే మర్త్యరూపంబు । మహి ధరించి. ౯ 2530

సీ. విశ్వమే యాత్మగా । వెలయు నా శ్రీహరి పలికినపలుకుల । కలరి మోహి
తాత్ములై కొమరుల । నావారినిద్దఱఁ గౌఁగిటం జేర్చి యంకమునఁ గూరు
చుండఁగా నొనరించి । యురుతరమోదంబు నందిరి; మఱియు నాయర్భకులను
నానందవారిధారాభిషిక్తులఁ జేసి స్నేహపాశమ్ములచే నిబద్ధు

తే. లగుచు బాష్పములు గళము । లడ్డగింప
నించుకయుఁ బల్కనేరకయే కుమారు
లను గనుచు నుండి; రిట్టులు । వనజనయనుఁ
డగుచు భగవంతుఁడైన శ్రీ।హరియుఁ బ్రీతి. ౧౦౫ 2531

చ. జనకుల నూఱడించి తన । స్వాంతమునన్ జనయిత్రి తండ్రియై
వనటఁగృశించు వానిఁ దన । వంకనె చూచెడు నుగ్రసేనునిన్

1 "యస్తయోరాత్మజఃకల్పఆత్మనాచధనేన చ, వృత్తింనదద్యాత్తంప్రేత్యస్వమాంసంఖాదయంతిహి" అనిమూలము. "లోకాంతరేయమదూతాః" అనివ్యాఖ్య. 2 "మాతరంపితరంవృద్ధంభార్యాంసాధ్వీంసుతంశిశుం, గురుంవిప్రంప్రపన్నంచకల్పోఽబిభ్రచ్ఛ్వసన్మృతః" అని మూలము. "శ్వసన్ అపిమృతతుల్యఏవేతి" అని వ్యాఖ్య.

జనపతిగా యదూద్వహుల § సంతతికిం దగఁజేసి; యంత ని
ట్లనియె మహాప్రభూ! ప్రజల § మైతిమి నీకిఁక మమ్ము నెల్లరన్. ౧౨౹ 2532

క. జనపతిధర్మంబున నే, పనిసేయఁగఁ దగునొ యట్టిపద్ధతిచే నా
జ్ఞను జేయుము పూర్వంబున, జననాథుండౌ యయాతి § శాపం బిడుటన్. ౧౩

క. నృపయోగ్యాసన మీయదు, నృపులకు నెక్కంగ రాదు § భృత్యుఁడ నయినే
నెపుడుం గొల్చుచు నుండఁగ, సుపర్వులు వినమ్రులై యగుచుఁ బలు లెల్లన్.

క. నీకర్పింతురు నా నిఁక, భూకాంతులమాట మరలఁ § బూని పలుక నే
లా! కరము దయామతినై, శ్రీకలితుఁడ వగుచు న్యాయ§సిద్ధిం గనుచున్. ౧౪

సీ. పాలింపు మనిపల్కి § పద్మదళాక్షుండు కంసుని భయమునఁ § గాందిశీకు
లైన దిక్కుల దెందొ § యతిగూఢముగనున్న జ్ఞాతులు సంబంధు§లై తనర్చు
యదువృష్ణిమధువుల § నంధకదాశార్హకుకురప్రముఖులైన § సకలబంధు
వులఁ బిలిపించి యి§మ్ముల నూఱడించి మన్ననలఁ దన్పుచుఁ బర§జనపదముల

తే. నిలుచుటఁ గృశించియున్న వా§రలను ధనము
నను మహాతృప్తులం జేసి § నైజగృహము
లందు నివసింపఁ జేసె; నా§యదుకులులును
రామకృష్ణుల బాహుసం§రక్షితులయి. ౧౬౹ 2536

క. తమతమ కోర్కులు పండుట, గమలాక్షహలాయుధు లొగిఁ § గాపాడుటఁ దా
పము లేవిలేక సిద్ధార్థములయి సంకల్పములు వి§రాజిల్లంగన్. ౧౭ 2537

క. నివసించిరి సంతృప్తిగ, సవిలాసదయాస్మితైక § సదనంబయి చ
క్కవఱలి ప్రమదాస్పదమై, యవిరత లావణ్యనిధియు § నౌ హరిమోమున్.

క. ప్రతిదినముం గనుఁగొంచుఁ, వితతప్రీతాత్ము లగుచు § వేశ్మములం దా
తతవిహారణముల నిచ్చలు, ప్రతిలేక చెలంగి; రిట్లు § ప్రవయసులు తమిన్. ౧౮

చ. అనుదిన మామకుందుని ము§ఖాంబురుహామృత మీక్షణంబులం
దనివి చనంగఁ గ్రోలుచు ని§తాంతబలాయతతేజముల్ తగన్
గనుచు వయోవిరాజితులు § గాఁ గనుపట్టిరి; రామకృష్ణు లం
త నొకదినంబునందుఁ దమ§తండ్రిని నందుని గాంచి ప్రీతితోన్. ౧౯౹ 2540

తే. కౌఁగిటంజేర్చుకొని యిట్లు § కమ్రభణితిఁ
బలికి; రోతండ్రి! మీదు§మిక్కిలి ముదంబు
వెలయఁగాఁ బెంచితిరి మమ్ము § విమలవాక్కు
లలర లాలించితిరి పెక్కు§పలుకు లేల? ౨౦౹ 2541

మ. తలిదండ్రుల్ తమబిడ్డలందు మిగులం § దాత్పర్య మేపారఁగా
నెలమిం గాంచుట సాజమ్మా మఱియు నూ§హింపంగ దేహంబునం

గల మోదంబునకంటెఁ బుత్త్రులపయిం గన్పట్టు మోదంబె మి
క్కిలి యంచుం బలుకందగున్; సుజనులుం గీర్తింతు రీమార్గమున్. ౨౧ 2542

*సీ. దేవకియున్ వసుదేవుండు మీతల్లిదండ్రులౌదురు గాని తలఁప మేము
గాముకదా యందురేమొ? బంధువు లన్నవస్త్రము లిచ్చి సర్వవిధములను
బోషింప నాపదల్ పూన రక్షింపంగఁ జాలక విడిచిన సమయమందు
శిశువులం బ్రీతితోఁ జేరంగఁదీసి చక్కం దమబిడ్డల కరణిఁ బెంచి

తే. పెద్దవారిని జేసిన పృథుయశస్కు
లే జనకు లౌదు; రోతండ్రి! యింకమీరు
వ్రజమునకుఁ బోండు; మే మీ పురంబునందుఁ
గల సుహృదులకుఁ బ్రీతిని గలుగఁజేసి. ౨౨ 2543

క. ఆవల మాపైని సుహృ,ద్భావంబున విహ్వలులగు బంధువుల మిమున్
వే వత్తుము చూడంగా, నేవిధమున వనటఁ గనక యేగుం డనుచున్. ౨౩

చ. మురదనుజాంతకుండును బ్రమోదము మీఱఁగఁ బల్కి నందభూ
వరునిని దక్కగోపసమవాయము నూఱడిలంగఁజేసి యా
భరణము లంబరంబులును బాత్త్రములున్ ధనమున్ సమృద్ధిగా
వరుసనొసంగి మన్ననల భాషలఁ దృప్తులఁజేసె; నంతటన్. ౨౪ 2545

ఉ. నందుఁడు రామకృష్ణుల మనంబు ప్రమోదమునందు మున్గుచుం
డం దగఁ గౌఁగిలించి నయనంబుల నశ్రుకణంబు లొక్కటం
గ్రందుగ ముంప గోపకనికాయము వెంబడిరాఁగఁ బోయె నా
మందకుఁ బుత్త్రయుగ్మము నమానుషరూప మటంచు నెంచుచున్. ౨౫ 2546

### ఉపనీతులై రామకృష్ణులు విద్యనభ్యసించుట.

ఉ. శూరతనూజుఁ డంతఁ దనసూనులకున్ విధిఁ దప్పకుండునా
చారమురీతి గర్గమునిసద్విజసంఘముచే ద్విజాతిసం
స్కారము సాగుపద్ధతిని జక్కఁగఁ దీర్చె; మహోత్సవంబునన్
ధారణిదేవవర్యుల నితాంతవిభూషిత పావనాంగులన్. ౨౬ 2547

సీ. పూజించి తప్తకర్బుర మాలికలచేతఁ బొలుచుచు సాధువిభూషణములఁ
గై చేయఁబడి మణిక్షౌమవస్త్రంబుల నలరుచు నున్నగోవులను వత్స
సహితంబులుగ భక్తిసహితంబుగా దక్షిణగ నొసంగెను; స్వతనయుల జన్మ
నక్షత్రమునను మనస్సున సంకల్పమును జేసి యున్న ధేనునికరంబు [న్న

తే. గంసుఁ డన్యాయమైన మార్గమున నపహ,రించుకొనిపోయి తనయింటనుంచియు

* "సపితా సాచజననీ యౌ పుష్ణీతాం స్వపుత్త్రవత్, శిశూన్ బంధుభిరుత్సృష్టా నకల్పైఃపోష రక్షణై" అని మూలము.

వానినెల్ల స్మరించి తేఁబంచి యప్డు, తా మహామతి గావున దాన మిచ్చె.

క. ఉపనీతులగుచు సోదరు, లపుడు ద్విజత్వంబు నొంది యాదవులకుఁ దా
నె పురోహితుఁడగు గర్గుని, యుపదేశమురీతి సువ్రతోత్తము లగుటన్. ౨౮

ఆ. బ్రహ్మచర్య మనెడు వ్రతమును జక్కఁగా, నాచరించుచుండి; రంత వారు
సకలవిద్యలకును సమధికాధారులై, యెల్లలోకముల కధీశు లగుచు. ౨౯

క. సకలజ్ఞులయ్యు సోదరు, లకలంకం బగుచుఁ దానె యలవడునదియై
ప్రకటమునగు జ్ఞానము మర్త్యకాయహితచేష్టితములఁ దగినవిధమునన్. ౩౦

క. కనఁబడకయుండఁ జేయుచు, ననంతరము గురుకులంబునందు వసింపం
గను గోరి యవంతీపురమున నుండియు నట్టితరుణమున శ్రీకాశిన్. ౩౧ 2552

ఆ. అధివసించియున్నయట్టి సాందీపని, యనెడు గురువుకడకు నరిగి; రంత
నతని నాశ్రయించి యమలశిష్టాచార, సమ్మతముగ భక్తిసాంద్రు లగుచు.

చ. మనసుల నిగ్రహించి యొకమాడ్కిని నిందనుబొందనట్టి వృ
త్తిని జగమందు నింపగను దేవుసిభంగి మహాదృతిఁ గురుఁ
గనుచును గొల్చుచుండి; రల త్మాసురమాళియు శుద్ధభావముఁ
గనఁబడ వారు గొల్చుటకు గాఢతరప్రమదంబు నొందుచున్. ౩౨ 2554

ఆ. శ్రుతుల నుపనిషద్వితతిని వేదాంగములను మహాదరమ్మున నుపదేశ
మొసఁగె మఱియు మంత్రవిసరప్రముఖరహస్యములతో నధర్వమనఁగఁబరఁగి

సీ. భూవరులకుఁ గాఁగఁ బుట్టిన యాధనుర్వేదంబు మన్వాదివిమలధర్మ
శాస్త్రంబులను మఱి సమధికమీమాంస యనెడుశాస్త్రంబును న్యాయముఖము
లను దర్కవిద్యను మనుజేశులకుఁదగి సంధివిగ్రహముఖషడ్విభేద
ములఁ దగునీతి నిమ్ములఁదెల్పె; సర్వవిద్యాప్రవర్తకులగునట్టి బ్రహ్మ

తే. చారు లిర్వురు గురు వొక్కసారి చెప్పి, నంతనే చక్క గ్రహియించిరల్లగురువు
దేని నుపదేశమిచ్చునో దానినెల్ల, క్షణములోన గ్రహింపంగఁ జాలి రపుడు.

*వ. అఱువదినాలుగు దినంబుల కఱువదినాలుగు విద్యలను గ్రహించిరి. మఱియు గీతంబు, వాద్యంబు, నృత్తంబు, నాట్యం, బాలేఖ్యంబు, విశేషకచ్ఛేద్యంబు, తండులకుసుమబలివికారంబులు, పుష్పాస్తరణంబు, దశనవసనాంగరాగంబులు, మణిభూమికాకర్మంబు, శయనరచనం, బుదకవాద్యోదకఘాతంబు, చిత్రయోగం బులు, మాల్యగ్రథనవికల్పంబులు, శేఖరాపీడయోజనంబు, నేపథ్యయోగంబులు, కర్ణపత్రభంగంబులు, సుగంధయుక్తియు,భూషణయోజనంబు, నైంద్రజాలంబు ను, గౌచుమారయోగంబులును, హస్తలాఘవంబును, జిత్రశాకాపూపభక్ష్య

* "సకృన్నిగదమాత్రేణ తౌ సంజగృహతుర్నృప, అహోరాత్రైశ్చతుష్షష్ట్యాసంయత్తౌ తావతీః కలాః" అని మూలము. వ్యాఖ్యననుసరించి వచనమువ్రాయఁబడినది.

వికారక్రియలు, పానకరసరాగాసవయోజనంబును, సూచీదాయకర్మంబును, సూత్రక్రీడయు,వీణాడమరుకవాద్యంబులును, బ్రహేళికయుఁ,బ్రతిమాలయు, దుర్వంచకయోగంబులును, బుస్తకవాచనంబును, నాటకాఖ్యాయికాదర్శనంబు, కావ్యసమస్యాపూరణంబును,బట్టికావేత్రబాణవికల్పంబులును, దక్రకర్మంబులు, తక్షణంబు, వాస్తువిద్యయు, స్వర్ణరూప్యరత్నపరీక్షయు, ధాతువాదము, మణిరాగజ్ఞానంబు, నాకరజ్ఞానంబును,వృక్షాయుర్వేదయోగంబులు, మేషకుక్కుటలావకయుద్ధవిధియు, శుకశారికాప్రలాపనంబును, నుత్సాదనంబును, గేశమార్జనకౌశలంబు, నక్షరముష్టికాకథనంబు, మ్లేచ్ఛితకుతర్కవికల్పంబులు, దేశభాషాజ్ఞానంబును, బుష్పశకటికానిమిత్తజ్ఞానంబు, యంత్రమాతృకాధారణంబును, మాతృకాసంవాచ్యంబు, మానసీకావ్యక్రియయు, నభిధానకోశంబు, ఛందోజ్ఞానంబు, క్రియావికల్పంబులు, ఛలితకయోగంబులు, వస్త్రగోపనంబులు, ద్యూతవిశేషంబు, నాకర్షక్రీడయు, బాలక్రీడనకంబులు, వైనాయికీనంబులు, వైజయికీనంబులు, వైతాళికీనవిద్యాజ్ఞానంబు నను చతుష్షష్టికళల నభ్యసించి రంత. ౩౫౪

రామకృష్ణులు మృతులగుగురుపుత్త్రులం దెచ్చుట.

మ. తరువాతన్ గురువర్యుఁ గాంచి మిగులం దాత్పర్య మొప్పారభూ
సురవర్యా! గురుదక్షిణన్ విధియు నోచొప్పం బ్రశాసించు నా
కరణిన్ మీకొసఁగం దలంచితిమి కాంక్షం దెల్పుమా మాపయిం
గరుణాదృష్టిగలట్టి మాన్యుఁడ వనంగా బ్రాహ్మణుం డాతఁడున్. ౩౬ 2558

తే. రామకృష్ణులదగు విచిత్రమహిమంబు
మానవులయందు నెందు నేఁ గానఁబడని
మితివిలాసంబుఁ బరికించి మాన్యతములు
వీర లవతారపురుషులం చారసి మది. ౩౬౪ 2559

*క. తనసాధ్వి నడిగి యాయమ, మనసుం గనిపెట్టి ప్రాక్సమయమున నెపుడో
వనధిని బ్రభాసతీర్థం,బునఁ బడి మృతుఁడైన తనదుపుత్త్రుని శిశువున్. ౩౭

క. కొనితెచ్చి దక్షిణగ నిమ్మని కోరెను; గోర్కి దానిన్ నప్పుడె తీర్పం
గను దలఁచి యట్లె యొసఁగుదు,మని పనివిని సత్వరమ మహారథవర్యుల్. ౩౭౪

చ. అనుపమవిక్రమాఢ్యులయి యద్భుతతేజులునైన సోదరుల్
చనిచని యాప్రభాస మనుసాధుసరస్సును గాంచి యబ్ధివే
లను వసియించి రెట్టికృతులం బొనరింపఁగఁ బోలునంచు నె
మ్మనముల నెంచుచున్ క్షణము మాన్యతముల్ చనుదెంచి రం చెదన్. ౩౮

చ. తలఁచి మహాబ్ధి పూజకయి తాఁ దగువస్తువు లప్డు గొంచు వే
వెలువడి శాస్త్రయుక్తమగు వృత్తమునం దమిఁ బూజచేసె; నా

* "సమ్మంత్ర్య పత్న్యా సమహార్ణవే మృతం బాలం ప్రభాసే వరయాంబభూవ" అనిమూలము

జలరుహనేత్రుఁ డాదృతిని § సాగర! తావకతుంగభంగరా
సుల గ్రహియింపఁగాఁ బడిన § సూనుఁడు బాలుఁడు నీజలంబులన్. ౩౮౪ 2563

క. కలఁ డాతఁడు గురుపుత్త్రుం, డలఘుగతిన్ దెచ్చియిమ్ము § యాతని నన నా
జలరాశి పలికె; దేవా!, ఖలహరణా! విప్రతనయు § గ్రహియింపను జూ! ౩౯

సీ. పంచజనుండు నాఁ§బరఁగు దైత్యుఁడు హరియించె నాయసురేంద్రుఁ§డెట్టులేని
నాకసాధ్యుఁడు జలాం§తరమునఁ దిరుగుచు శంఖరూపము దాల్చి § సాధుబాధ
కుఁడయి యుండును; వాఁడె § గురుపుత్త్రుని హరించె వానిసాధింపఁగా§లేను నేను;
ననుటయు సర్వలో§కాధీశ్వరుఁడు కృష్ణుఁ డప్పుడే సలిలంబు§లందుఁ జొచ్చి

తే. వాని వధియించి యుదరంబు§లోన గురుకు
మారుఁ గనలేక; శ్రీహరి § భూరిదనుజు
నంగమునఁ బుట్టినట్టి మహార్హశంఖ
మును దమిం బాంచజన్యంబుఁ § గొనియెఁ బిదప. ౪౧౪ 2565

మ. బలదేవుండును వెంటరా నరదముం § బ్రాపించి యామ్యాశ కి
మ్ములఁ బోయెన్ యముప్రీతికిం దగినదై § పొల్పారు నప్పత్తనం
బు లలిం జూచెడు కాంక్ష! సంయమని నాఁ § బూర్వార్య మెంతో జగం
బుల విఖ్యాతిని గాంచియుండు నదియుం § బుణ్యాత్మలభ్యంబుగన్. ౪౨ 2566

చ. ఇరువురు సోదరుల్ దరము § లేద్దెల నొత్తఁగఁ దన్మహాస్వనం
బరుదగఁ గర్ణరంధ్రముల§యందుఁ జొరన్ వడి లేచి దుర్జనో
త్కరముల శిక్షచేయు గురు§ధర్మయుతుండు యముండు భక్తిచే
నరిగి సపర్యచేసె మహి§మాఢ్యుల కెంతయు నాదరంబునన్ ౪౩ 2567

మ. వినయం బొప్పఁగఁ బల్కె నుత్తమవిధిన్ § విశ్వంబునంగల్గు భూ
తనికాయాశయవాసుఁ గృష్ణుఁ గని యో§దైవంబ లీలార్థమై
మనుజాకారము గాంచి నట్టిపరమా§త్మా! విష్ణువా! నే నొన
ర్పను యోగ్యంబగు కార్యమేది గలదో § పాలింపు మాజ్ఞన్ దయన్. ౪౪

చ. ఇరువురు మీరు వచ్చుటయె § యెంతయు నాదగుభాగ్యమే కదా!
త్వరఁగ ననుజ్ఞ యిమ్మనినఁ § దామరసాక్షుఁడు పల్కె నీభటో
త్కర మొగి స్వీయకర్మసము§దాయనిబంధనుఁ డైనయట్టి మా
గురుసుతుఁ దెచ్చి నిచ్చుటికి § గొబ్బున నాతనిఁ జేరఁ బంపుమా. ౪౪౪ 2569

తే. ఓమహారాజ! నాయాజ్ఞ § నూని వానిఁ
దెచ్చి యిమ్మట్టి పనిచేతఁ § బొచ్చె మేమి
కలుగఁగాఁబోదు నీకని § పలుక యముఁడు
కృష్ణు నానతి శిరమున § నిడికొని వడి. ౪౬౪ 2570

ఉ. బాలుని దెచ్చి యీయ యదుపాలురు వారలు వానిఁ గొంచు నా
బాలునికోసమే మనము పల్లటిలంగను వేచి యున్నస
చ్ఛీలుని దేశికుం గనఁగఁ జేరి తదీయగృహంబుఁ బుత్త్రునీ
వేళఁ గొనం గదే యనుచు వేడ్క నొసంగి యొసంగుభక్తిచేన్. ౪౬ 2571

ఉ. ఇంకను గోరఁగాఁ దగిన దేదియొ యాజ్ఞయొసంగుఁ డన్న నే
శంకయులేక యిట్టులను సాధువులై తగువత్సలార! యే
యంకిలిలేక నాకుఁ దగినట్లుగ దక్షిణ నిచ్చినారుగా
యింకఁ గొఱంతయుండఁదగు నీప్సిత ముండునె సుంతయేనియున్? ౪౭

క. మిముఁబోలు శిష్యులకు నే, నమరితిఁగద గురువుగాఁగ నట్టియెడల నే
మి మిగులు వాంఛితములు? వీ,ర్యము పొంగఁగ నుండు మీర లరుగుఁడు పురి[కిన్.

తే. పరమపావనమగుకీర్తి పరఁగుచుండుఁ
గాత! ఛందస్సులును మీకు నీతఱిఁ బర
మందు సఫలంబులౌఁగాక యనుచు మిగుల
ననుమతించిన గురునాజ్ఞ నంది వారు. ౪౯ 2574

చ. అనిలజవంబు మించెడు శతాంగము నెక్కి తదీయరావ మా
ఘనవినదంబుమీఱఁగ నికామముదంబున స్వీయమౌ పురం
బున కరుదెంచి; రంతఁ గడుఁబొంగుచుఁ బౌరులు రామకేశవుల్
దినములు పెక్కు కన్పడమిఁ దృప్తిగఁ గాంచిరి మించి రెంతయున్. ౫౦

ఆ. ధనముపోయి మరలఁ గనఁబడినట్టి మా,నవులపోల్కి తమమనంబులందుఁ
గలుగు సంతసంబు వెలయఁగా వారెంతొ, తృప్తిఁగనిరి సహజు లిర్వురఁగని.



## నలువదాఱవయధ్యాయము.

### ఉద్ధవుని శ్రీకృష్ణుఁడు వ్రేపల్లియకుం బనుచుట.

చ. హరి యొకనాఁడు వృష్ణికులజాగ్రణియై తగి మంత్రశక్తిచే
ధరణిఁ బ్రసిద్ధిఁగాంచి సఖతల్లజుఁడై సురరాజదేశికుఁ
గురువుగఁ గొల్చి విద్యలను గోవిదుఁడై మతిమంతులందు ను
ర్వరను వరిష్ఠుఁడై యలరు వానిని భక్తుని నుద్ధవుం ద్వరన్. ౧ 2577

సీ. ఏకాంతభక్తుఁ డంచెఱిఁగి పిల్వఁగఁబంచి తాను బ్రపన్నుల దైన్యార్తి
తతిని బోఁదోలఁగఁ దగుస్వభావము గలవాఁడౌట నొకచోట భవ్యకరము
నుద్ధవుకరమున నొక్కటఁ గీలించి పలికె నిట్లని; సౌమ్య! పరమపావ
నాత్మకా! యుద్ధవా! యరుగుము వ్రజమున కందున్నట్టి నాయనుఁగుఁదల్లి

తే. దండ్రులకుఁ బ్రీతిఁ గల్గింపు తరుణులందుఁ

గలరు మద్విరహంబునఁ గాసి చెందు
వారు; వారికి నాపల్కు వాక్కుల విని
పించి యాధిని దొలఁగింపు మంచితముగ. ౩ 2578

ఉ. నన్నె మనంబులన్ నిలిపి నాకొఱకే పతిపుత్త్రముఖ్యులం
గ్రన్నన సంత్యజించి యసుకాండము నేనె యటంచుఁ జక్కఁగా
* నెన్నుచుఁ బ్రీతిపాత్త్రుఁడన నేనె యటంచును నిశ్చయించి నా
మన్ననకే జగత్సహజమానితధర్మములం ద్యజించుచున్. ౪ 2579

తే. వారలున్నారు సుమి; యట్టివారి నేను
గరుణ భరియింతు; సన్మిత్త్రగణమునందుఁ
బ్రియతముఁడనైన నేను వారికి నదెంత
దవ్వునందున్న గోకులతరుణు లెల్ల. ౫ 2580

చ. మనసులు పల్లవింప బహుమానము మీఱఁగ నన్నె సంతతం
బును స్మరియించుచున్ విరహముల్ భరియింపఁగరామి నెవ్వగం
గని పరిమోహితాత్మలయి కమ్రకళేబరధర్మముల్ తమం
తన పొగియంగ నుందు రిది ధర్మమెకా సుమనోజనాళికిన్! ౬ 2581

చ. మరల జవంబ వత్తునని మానినులన్ ముద మొందఁ జేసి య
ప్పురమును వీడివచ్చునెడఁ బొంకముగా వచియించి నట్టి యా
దరవచనాళి నమ్మి సతతంబు మదాత్మికలాట నెట్లొ ని
ర్భరబహుకృచ్ఛ్రసంతతుల పాలయి తాల్తురు ప్రాణముల్ సఖా! ౭ 2582

క. మితిలేని వగల నెట్లో, బ్రతుకుదు; రని యిట్లు ప్రభువు పల్కిన నాశ్రీ
పతిసందేశముఁ గైకొని, శతాంగ మపుడెక్కి మంద చక్కటి కరిగెన్. ౮

చ. అరుణగభస్తిమాలి యపరాంబుధిఁ గ్రుంకెడువేళ నెంతయున్
సిరులకుఁ దావలం బగుచుఁ జెల్వగు నందునిమందఁ జేరె న
త్తరుణమునందె ధేనుసముదాయముపల్లియఁ జేరుచుండెఁ; ద
త్ఖరఖురరేణువుల్ రథముఁ గప్పుటఁ దోఁపకయుండె నద్దియున్. ౯ 2584

సీ. కామవికారంబుఁ గాంచిన గోవులకయి మత్తవృషభముల్ కడఁగి పెనఁగు
లాడుచుండిన ధ్వనుల్ గూడ వినంబడుచుండెను; బొదుగుల యురుభరమున
దవ్వున నున్నవత్సముల వెంటం బాఱు ధేనువుల్ సొంపు నెంతేని గూర్చు
చుండె; నట్టిటు గంతు లొప్పవైచుచునున్న తెల్లనిక్రేపులతీ రదెంతొ

ఆ. వింతగూర్చుచుండె; పీడకుండఁగఁ గట్టి, యున్నదూడ లెంతొ యొప్పుఁగలుగఁ
జేయుచుండె; మఱియు నాయెడఁ బాలను, బిదుకు వేళగాన వేగిరపడి. ౧౦

* "యేత్యక్త లోకధర్మాశ్చమదర్థేతాన్ బిభర్మ్యహమ్" అని మూలము.

క. విడువుఁడు దూడల నిప్పుడె, విడువకుఁ డవ్వాని నిటకు ♦ వే తోడ్కొని యి
ప్పుడె రావల దను బెడిదపు, నుడులను గోకులము తనరె ♦ నూత్నమహములన్.
క. బాలకుల వేణుగానము, చే లలితంబై ముదంబుఁ ♦ జేకూర్చుచు నా
లీలామర్త్యులనై తగు, కేళుల శుభమిచ్చువానిఁ ♦ గీర్తించు జనుల్. ౧౦౪
క. సొగసగుభూషణముల నిం,పుగ సింగారించుకొన్న ♦ పూఁబోఁడులు గో
పగణంబు నిండియుండఁగఁ, దగియుండెను జూడ సిరికిఁ ♦ దావల మగుచున్. ౧౧
సీ. అగ్ని భాస్కరులయు ♦ నతిథిగోవిప్రావళులయును బితృదేవతలయు నర్చ
నల సుందరములగు ♦ లలితగోపాలక మందిరంబులు దీపమాలికలును
ధూపముల్ మాల్యతతుల్ చూడఁ జూడంగ నెంతయు మదికిని ♦ సంతసంబుఁ
గలుగఁ జేయుచునుండె; ♦ నలుదిక్కులం బూచియున్న యారామముల్ సన్ను
ఆ. దగియె యుండె నందు సొగసగుపక్షులు, భ్రమరములు నొనర్చు భవ్యరవము[తింప
లలముకొనుచునుండె ♦ నాస్థలముం గన, నుద్ధవుని హృదబ్జ మొప్పెఁదృప్తి.౧౨౪
క. కారండవములు హంసలు, చేరఁగ నలరారెడుసరసీరుహములచేఁ
జారుతరంబై గోకుల, మారౌర! యనంగ నుండె ♦ నత్తరుణమునన్. ౧౩ 2590
చ. హరికి ననుంగుమిత్రమగు ♦ నట్టి మహామతి యుద్ధవుం డదే
తరుణమునందు వచ్చుట ముదంబు మెయిన్ విని నందగోపుఁ డా
దరమున వాసుదేవునిగఁ ♦ దాను దలంచుచుఁ గౌఁగిలించి వే
సురుచిరపూజలం దనిపి ♦ చొక్కఁగఁజేసెను న్యాయరీతిగన్. ౧౪ 2591
మ. పరమాన్నంబు భుజింపఁజేసి పిదపన్ ♦ భవ్యాసనాసీనుఁ డై
యరదం బెంతయు వేగరాఁ బోలయు గాత్రాయాస మల్లల్లనన్
జరగన్ శర్మము మేనఁ బాదుకొనఁ గృష్ణస్వామిమిత్రుండు ని
ర్భరమోదంబున నుండ నందుఁడును దాత్పర్యంబు సంధిల్లఁగన్. ౧౫ 2592
సీ. చరణమ్ము లొత్తుచుఁ ♦ బరిచర్య లింకనుగల్గువానిం జేసి ♦ కరముమోద
మలర నిట్లనిపల్కె ♦ నార్య! మహాభాగ! కుశలియే శౌరుని ♦ కూర్మిపట్టి
యైనట్టివసుదేవుఁ ♦ డనుఁగుమిత్రము నాకు నగు; నాతఁ డిత్తఱి ♦ నఖిలబంధ
ముక్తుఁడై సుహృదులు ♦ మొనసి కొల్వఁగఁ గష్టసంతతుల్ వాయంగ ♦ శర్మమ [లర
తే. నాత్మజాదులఁగూడియె ♦ యచటనున్న
వాఁడుకద! దుష్టుఁడౌ కంసవసుమతీశుఁ
డాత్మదోషంబునన్ హతుఁ ♦ డయ్యెఁగాదె?
సానుచరుఁడయి యదియె భాగ్యం బనంగ. ౧౬౪ 2593
చ. అనవరతంబు ధర్మమున ♦ యందె ప్రవృత్తి చెలంగ సాధుతం
దనరెడు యాదవాళికి సదా యపకారమె చేయ రోయు నా

జనపతి మృత్యువుం గనుట చాల నదృష్ట మనంగ నొప్పదే;
యనఘ! మదాత్మజుండు హరి యమ్మథురాపురినుండి నెమ్మదిన్. ౧౫ 2594

క. జననిని సుహృదుల సఖులను, దనునమ్మిన వ్రజము గోపతల్లజులన్ ధే
నునికరమును బృందావనమును గోవర్ధన మహీధ్రమును దలఁచునొకో! ౧౬

మ. తనవారిన్ మము నొక్కసారి యయినం దాఁ జూడ గోవిందుఁ డా
యనుఁగుల్ బిడ్డఁడు వచ్చునా యిటకు? నెయ్యైనన్ మనోజ్ఞస్మితం
బున నొప్పారుచుఁ జారునాసిక దగం బొల్పారు నెమ్మోముఁజ
క్క నిరీక్షింతుముగాదె; యుద్ధవ! లసత్కంజాక్షుఁ డాకృష్ణుఁడున్. ౧౯ 2596

సీ. మహితుఁడౌ టను దావదహనునుండియు వాతవర్షంబునుండియు భయదుఁడౌ వృ
షాసురునుండియు నహివర్యుఁడౌ కాళియునినుండియున్ దీర్పనను పుపడని
యట్టివై కనఁబడు నపమృత్యువులనుండి మమ్ముఁగాపాడె; నామాధవుని వి
చేష్టితంబులఁ గృష్ణు స్మితవిలాసాపాంగవీక్షణమ్ముల సర్వసాక్షియైన
తే. హరి మనోహర సుకుమార హసితములను
భాషితంబులఁ దలఁచిన పట్టులందుఁ
దక్కపను లెవ్వియును దోఁప వొక్కహరియె
యెదుటఁ గనఁబడుచుండు నింకేమిపలుక? ౨౧ 2597

చ. హరిచరణాంబుజాంకితములై కడు సొంపుగఁ గానవచ్చు నా
సరిదవనీధరోపవన చారుతరస్థలరాజి నింకనుం
దిరిగిన యాస్థలంబులను దృప్తిగఁ జూచునెడం దదాత్మతం
బొరయు మనంబు మాకునదె హో కృతకృత్యత యన్న యుద్ధవా! ౨౨ 2598

క. మునిపతి గర్గాచార్యుం, డనుమానము నాకు వీడునట్లు పలికిన
ట్లవునుగ రాముఁడు కృష్ణుం, డనూనసురకార్య నిర్వహణమునఁ గడఁకన్. ౨౩

క. ధర నవతారము నొందిన, సురోత్తములె యంచు నెంచుచుం గాలంబున్
జరపుదు; నుద్ధవ! యాసోదరులే సామాన్యులనుచుఁ దలఁపం జనునే? ౨౩

క. కరివరసహస్ర బలుఁడై, ధర నసమానుం డనంగఁ దగుకంసుని ని
ర్భరశక్తి నలరు మల్లులఁ, గరిపతిని విలాసమొప్పఁ గా క్షణమాత్రన్. ౨౪ 2601

తే. పశుగణంబుల సింగంబు పౌరుషమునఁ
జంపునట్లు వధించె; విశాలసార
మగుచుఁ దాళత్రయమితముగఁ గనఁబడుచు
నున్న యాఘోరచాపంబు నొకక్షణమున. ౨౫ 2602

సీ. ఇభరాజ మేలీల నిక్షుచాపముఁ ద్రుంచు నట్లుభజించె; మహాద్రి నొక్క
కరమున నద్భుతక్రమ మొప్పఁగా నేడుదినములు ధరియించె; ధేనుకప్ర

లంబ బకారిష్టులన్ దృణావర్తుని మఱియుఁగల్గిన యాయమర్త్యరిపుల
సురదానవులఁజెండు శూరుల శ్రీకృష్ణుఁ డంతమొందించె విహారమట్లు;

తే. లనుచుఁ దలపోసి తలపోసి యాత్మ కృష్ణు
నందుఁదగిలియె యుండుట యతిశయప్ర
మదము పొలయుట పరవశతఁ దగి యశ్రు
ధారలం బల్కకుండె నుత్తరుణమందు. ౨౭ 2603

చ. తనయువిచేష్టితంబుల ముదంబున భర్త నుతించుచుండఁగా
వినుచు యశోద స్నేహమున వింతగఁ జన్నులఁ బాలుచేపఁగా
గనుఁగవ బాష్పముల్ వదలఁగా మది నేమియుఁ దోఁపకుండె; నా
జనకులు లోకనాథుఁడగు చక్రిపయింగల ప్రేమభారతన్. ౨౮ 2604

క. వెత నొందుటగని యుద్ధవుఁ, డతిశయమోదంబు పొంగ నపు డిట్లనియెన్
క్షితి దేహధారులం దే,వితమునఁ గన మీరు శ్లాఘ్యవృత్తులు సుండీ! ౨౯

తే. అఖిలగురుఁడగు నట్టినారాయణుపయి,నింత యనురాగయుతమతు లెసఁగనుంట
యబ్బురంబుగదా! మది యచ్చెరువడె,మానదా! యంచు నందుని మఱియుఁబలికె.

సీ. ఈరామకేశవు లిర్వురు జగముల కెల్లనిశ్చయముగ నెన్నిచూడఁ
గా నిమిత్తం బుపాదానంబు నగుదురు; పురుషప్రధానులన్ భూరికీర్తి
నందియుందురు; మఱి యాత్మసృష్టంబులౌ భూతవారమునందు నాతతగతిఁ
జొచ్చి నానాభేదశోభితులగు జీవులకు నియామకులయి సకలవిషయ

ఆ. ముల ననాదు లగుచుఁ దలపోయఁగా సర్వ, కారణాత్ము లగుచుఁ గ్రాలుచుంద్రు;
ప్రాణపంచకంబు పాయు నప్పుడు వీరి, పయిని భావనమతి భక్తియలర. ౩౧

క. ఒకనిముసమైన సుంతయు, వికలత గనకుండ నిల్పి వెరవు గలిగినన్
సకల స్వకర్మవాసన, లొకటన్ విడిపోవ మర్త్యుఁ డురుపుణ్యుఁడు నై. ౩౨

క. పరిశుద్ధసత్త్వమూర్తిత, త్వరగా నలవడఁగఁ దాను బ్రహ్మమయుండై
పరమగతిం బ్రాపించును, దరమే తత్పుణ్య మెన్న ధాతకునైనన్. ౩౩ 2609

క. సకలాత్మహేతు వగుచున్, సకలమునకుఁ గారణ మనఁ జాలి మనుజమూ
ర్తికలితుఁడై తనరారెడు, సకలేశ్వరునందు మీరు సద్భావంబున్. ౩౪ 2610

* "ఏతౌ హి విశ్వస్య చ బీజయోనీ రామో ముకుందః పురుషః ప్రధానం" అని మూలము. "అంశాంశినోరభిన్నత్వాద్యేన రామేణ సహైకరూపో యో ముకుంద స్తావేతౌ రామకృష్ణాభిధతయా పృథక్త్వ యా దృశ్యమానావేవ చ విశ్వస్య. చకారాదవతారాదీనామపి బీజయోనీ ధ్యావపి నిమిత్తోపాదాన రూపౌ. విశ్వస్య తత్తద్రూపతయా నామ్నాపి పురుషః ప్రధానమితి విఖ్యాతావిమావేవ. తదేతద్ద్వయ రామకృష్ణ రూపేణ పురాణావనాదిసిద్ధౌ సంతౌ భూతేషు జీవేష్వన్వీయ తత్తదుపాధావంతర్యామిరూపేణానుప్రవిశ్య విలక్షణస్య జ్ఞానచాద్వమజ్ఞానరూపస్య బ్రహ్మణోప్యశాతే" అని వంశీధరి.

క. ఉనిచితిరిగా మహాత్మా! కనుక నీకన్ మీకుఁ జేయఁగాఁదగు పని మే
దిని గలదె యేదియైనన్, వనజాక్షుం డచ్యుతుండు వ్రజమును గనఁగన్. ౩౩

మ. అరుదెంచుం ద్వరఁగాఁ బరాత్పరుఁడు తా నన్నర్థిం గనం గోరి యే
ధర వర్తిల్లెడు తల్లిదండ్రులకు మోదం బెంతయుం గూర్చు దు
ష్టరతన్ సాత్వతవైరిఁ గంసుని మహాశౌర్యాఢ్యు రంగస్థలిన్
బొరిపుచ్చెంగద యప్పు డేమనియె నాపోల్కిం బొనర్చుం జుఁడీ! ౩౪ 2612

ఉ. ఇంచుకయేని యానుడుల నేమఱఁ డంచుఁ దలంపుఁడీ మదిన్;
సంచితభాగ్యయుక్తులరు స్వాంతమునం దిసుమంతయేని మీ
రుంచఁగరాదు చింతను; మహోద్ధతసూదను శ్రీహరిన్ ద్వగం
గాంచఁగలారు కృష్ణుని యఖండమహత్త్వము చెప్ప శక్యమే? ౩౫ 2613

శా. భూతవ్రాతహృదంతరంబుల సమిత్పాగంబునం దగ్ని య
ట్లే తా నుండు మథించినంత ననలుం డేరీతి దారూత్థితుం
డై తన్నుం గనఁజేయు భక్తులకు నా యబ్జాక్షుఁడున్ హృద్గతుం
డౌ తన్నుం గనఁజేయు నట్టులె యటం చాత్మం దలంపందగున్. ౩౬ 2614

శా. ఐనం బ్రీతికిఁ బాత్రులైన వసుదేవాదుల్ తనుం జేరఁగాఁ
దా నెప్పొల్కిని వారలన్ విడిచి యాధన్యుండు రానోపు నం
చో నందా! తలపోయుదో; హరికి లేదొక్కింతయే రాగమున్
నే నంచొప్పు మమత్వ మట్లగుటచే స్నిగ్ధుండు లేఁ డొక్కఁడున్. ౩౭ 2615

సీ. అప్రియుండును నుత్తమాధమసములును బరకీయుఁ డాత్మీయుఁ డరసిచూడఁ
దల్లిదండ్రులు కళత్రములు పుత్త్రాదులు జన్మదేహములు నేచందమునను
లేకుండుఁ గర్మము లేకుండు; మఱిసదసన్మిశ్రయోనుల సంభవించు
సాధురక్షణమును జక్క నొనర్పంగఁ; గ్రీడార్థముగ నాహరియును సత్త్వ

ఆ. రజసులు తమమనెడు ప్రకృతిగుణంబుల, నిర్గుణుండు నయ్యు నెఱి ధరించి
సర్గపాలనముల సంహారణంబును, జేయుచుండు నవ్వి చెంద వతని. ౩౮

వ. ఆమహాత్ముండు గుణాతీతుం డని యెఱుంగవలయు. వానితోఁ దానుఁ గ్రీడించు
చున్నవానికి లోఁబడియుండు వాఁడు కాడు. దృష్టిభ్రమించునపుడు భూమి
యెల్లఁ దిరుగుచున్నయట్లు తోఁచుచందంబునఁ జిత్తము కార్యజాలముల
నొనర్చుచుండ దానియం దాత్మాధ్యాసమునం జేసి యాత్మయందుఁ గర్తృత్వ
మారోపింపఁబడును. భగవంతుఁ డగు నాశ్రీహరి మీయిర్వురకు మాత్రమే
సూనునివలెఁ బ్రీతిభాజనంబు గాఁడు. అందఱకు నాత్మజునివలె నుండు.
ఎల్లరకు నాహరి తల్లియుఁ దండ్రియు నీశ్వరుండు నగునని యెఱుంగం
దగు. చూచినదియు విన్నదియు భూతము భవిష్యద్వర్తమానంబులు స్థావర

జంగమములును, మహత్తు, నల్పంబును నగు నేవస్తువైన విష్ణుమయంబై
యగుంగాని తద్భిన్నంబుగాదు. ఆయీశ్వరుండే పరమార్థభూతుం డగు. ౪౩

క. సరసిజనేత్రుని యనుచర, వరుఁడగు నుద్ధవుఁడు గోప | వర్యుఁడు నందుం
డురుతరమోదంబు తగం, బరస్పరము స్వేచ్ఛమీఱ | భాషింపంగన్. ౪౪ 2618

క. ఆమాటలసందడిని ద్రి,యామయుఁ గడచెను బ్రభాత | మగుటయుఁ ద్వర గో
పీమణులు లేచి దీప,స్తోమము వెలుఁగంగఁ జేయు | చును బూన్కి మెయిన్.

సీ. దేహళీప్రముఖ మం|దిరభాగముల నెల్ల గంధాదికములఁ జ|క్కఁగ నలంక
రించి యవ్వల దధి | నంచితగతిఁ జిల్క మొదలిడి; రాగొల్ల|ముద్దియలును
దీపకాంతులచేఁ గ|లాపరత్నంబులు తళతళ మనుచు నెం|తయు వెలుంగఁ
గవ్వపుఁద్రాళ్లసు | గడువడి లాగుటఁ గరకంకణంబులు | కమ్రహార

ఆ. ములు నితంబములును | లలిత వక్షోజముల్, రత్నహారములును | రవళిమించు
నటు చలించుచుండ | హారికుండలకాంతు, లమల గండములను | నావరింప.

చ. సురుచిరకుంకుమంబునను | జొక్కపుమోములు రక్తవర్ణతం
బరఁగుచు నీటుగుల్కఁ గను|పండువు సేయుచునుండి; వేడ్కన
త్తరుణమునందు ఫుల్లసిత|తామరసాక్షుని సాధులీలలన్
బరవశచిత్తముల్ తనరఁ | బాడఁగ నాధ్వని ముట్టె నభ్రమున్. ౪౫ 2621

చ. అనుపమకంఠనాద మది | యాదధిమంథనచారునిస్వనం
బునఁ బరిమిశ్రితం బగుచుఁ | బొల్పుగ దిక్కుల నావరించి యం
దునుగల యాయమంగళముఁ | దోడనె వాపుచు నంబరంబు నొం
దెను; భగవంతుఁడైన ఖర|దీధితి తూర్పునఁ దోఁచె నంతటన్. ౪౬ 2622

ఉ. మందవసించు సుందరులు | మన్ననతోఁ జగ ద్వారసీమయం
దందముగా సువర్ణమయ|మై తగుస్యందన మొక్కఁ డుండఁగాఁ
బొందుగఁ గాంచి దానిదగు|పాంకము వేడ్క జనింపఁజేయ నీ
స్యందన మేరిదో యనుచు | సందియ మంతటఁ దానె తోఁచుటన్. ౪౭ 2623

మ. కమలాక్షుండగు కృష్ణు భోజనృపు కాం|క్షల్ తీర్పఁగా వచ్చి కా
ర్యము పండించు నుపాయముం దెలియువాఁ|డై యుంటిఁ దోడ్కొంచుఁ బో
యె మహాభాగుఁడు కంసమిత్రుఁ డపుఁ డెం|తే ప్రీతి నక్రూరుఁడీ
సమయంబందున వచ్చినాఁడొ మరలన్ | సాధింప నేకార్యమున్. ౪౮ 2624

* సీ. కంసునిఁజంపించెఁ | గ్రమ్మఱ రానేల? యధిపతి మృతుఁడైన | నతనికింకఁ [బులఁ
బరలోకకార్యాళి | వరుసఁ జేయఁగ నెంచి మనలఁదోడ్కొనిపోయి | మనతను
గలమాంసఖండముల్ | కడఁగి పిండములుగనొనరించి రక్తంబుఁ | గొని తిలోద

* "కింసాధయిష్య త్యస్మాభి ర్భర్తుః ప్రేతస్య నిష్కృతిం" అని మూలము.

కముల నీయ మతేమి కార్యమో యొనరింప వచ్చినాఁడో యని వామనేత్ర

తే. లొండొరులతోడఁ బలుకుచు నుండ నుద్ధ
వుఁడును గాల్యకృత్యంబుల నడపి యల్ల
గొల్ల చేడియ లొక్కట నుల్లములను
వగను బలుకుచునుండంగ వచ్చె నటకు. ౫౯ 2625

---

నలువదియేడవయధ్యాయము.

గోపిక లుద్ధవునింగాంచి తమలో మాటలాడుకొనుట.

మ. అరుదేరం గని గొల్ల చేడియలు నవాంభోజపత్రాక్షు సుం
దరపీతాంబరు జానువుల్ తగులు దోర్దండంబు లొప్పారఁ బు
ష్కరమాలాధరుఁడై ముఖాంబుజము తేజస్ఫారమై చెల్వుగు
ల్క రమానాథుని సేవకుం డగుచు నిక్కం బట్టులే యొప్పుచున్. ౧ 2626

చ. అనుపమరత్ననిర్మితము లై తగు కుండలముల్ ధరించి యిం
పును గనఁజేయు దర్శనము భూరితరంబయి యొప్పునున్న య
వ్వనజదళాక్షుసేవకుని బాగుగఁ గాంచి మహోత్సవంబునుం
గని తెలినవ్వు లాస్యములఁ గ్రందుగఁ జిందులు త్రొక్కుచుండఁగన్. ౨ 2627

తే ఉత్తమశ్లోకుఁడై యొప్పుచున్న కృష్ణు, పాదపంకజయుగళంబు శ్రీదముఁ దమి
నాశ్రయించిన యుద్ధవు నాదరమునఁ, గని వచించిరి యన్యోన్య మనెడుగతిని.

మ. అరరే! సుందరవేషుఁడై కనఁబడున్ హార్యచ్యుతప్రీతికృ
ద్వరవేషప్రియ భూషణంబులను దాభాసిల్లుచున్నాఁడు సుం
దరులారా! యితఁ డెవ్వఁడో యిచటి కేస్థానీయవర్యంబు నుం
డి రహిన్ వచ్చినవాఁడొ యెవ్వ రనుపన్ నేఁ డిచ్చటం జేరెనో. ౩౪ 2629

సీ. అనుచు నొండొరులతో నాదృతిఁ బలుకుచు నాయుద్ధవునిచుట్టు నాయువిదలు
నిలిచిరి; మందాక్షలలితహాసేక్షణ ప్రియభాషణంబుల నయముమీఱ
సత్కరించిరి; రహస్యమున నాసనవరమందుఁ గూర్చుండినయతనిఁ గృష్ణ
పరమాత్మదూతగా భావించి ప్రణమిల్లి వినయంబునం బల్కి; రనఘ! నీవు

తే. యదుపతిప్రియభృత్యుడ వం చెఱుఁగుదు
మిటకు హరి పంపఁగాఁ దమి నేగుదెంచి
తి వనియెఱుఁగుదు, మాహరి తెలియఁగోరి
తల్లిదండ్రుల కుశలంబుఁ దగినరీతి. ౫ 2630

క. జనకులకుఁ బ్రియముచేయం,గను గోరియె నిన్నుఁబంపెఁ గాని వ్రజమునన్
మనసున స్మరింపఁగాఁ దగు, పని వేఱొకఁ డతని కున్నపద్ధతి మాకున్. ౫౪ 2631

చ. మనసులఁ దోఁపకున్న యది మానధనా! యది యేటి కందువో
వినుము నికైన బంధుజనబృందముపట్టుల స్నేహబంధ మొ
య్యన విడనాడ శక్యమగు నట్టిది కాదుకదా; తలంపఁ ద
క్కిన జనులందు నెయ్య మనఁ గేవల మర్థకృతంబె యాఁజుమీ! ౪ 2632

క. ఇదికారణముగ నుద్ధవ!, యది యాకార్యంబుతీఱ నవ్వలఁ గన్న
ట్టదు పురుషులు కార్యార్థము, ముదితలపై నునుచు ప్రీతిపోలిక మఱియున్.

క. సురుచిర సుమనస్సులపై, ద్విరేఫములు నిల్పుప్రీతి తెఱఁగున నుండుర్
బరికింప నద్ది గావున, వరమతు లద్దానిఁ గొనరు వాస్తవ మనుచున్. ౬ 2634

మ. ధనహీనుర్ వెలయాండ్రు, పాలనమునర్ దక్షుండుకానట్టి భూ
పుని మర్త్యుల్ చదువెల్ల నేర్చి వెనుకర్ బూజ్యాత్ము నాచార్య శి
ష్యనికాయంబులు, చక్క దక్షిణలనీయర్ లేనియాజ్యుర్ జవం
బున ఋత్విక్కులు, నిష్ఫలావనిరుహంబుర్ బక్షిసంఘంబులున్. ౭ 2635

చ. అతిథులు భోజనాంతమున నన్నము పెట్టిన వారియిండ్ల, నా
వితమున దగ్ధకాననము వే మృగపంక్తులు, తృప్తి నొందకే
రతమును గోరుచుండెడు పరప్రమదర్ సుఖకేళిఁ దేలి యా
దృతి వడి జారుఁడుర్ వదలు నెన్న జగంబున నున్నదే కదా?. ౮ 2636

చ. హరిప్రియదూత యుద్ధవుఁ డహంకృతిదూరుఁడు మందఁజేర నా
తరుణులు సర్వకాలమును దత్పరమేశ్వరునందె హృత్కళే
బరముల వాక్కులర్ బరఁగుభంగి నొనర్చినవారలౌట నా
దరమునఁ గృష్ణునే స్మృతిపథంబున నిల్పినవార లౌటచేన్. ౯ 2637

ఆ. ఇతరలౌకికముల నెల్లను వదలి కై,శోరబాల్యదశల శౌరసాతుఁ
డొనరిచిన మనోహరోరుకృత్యంబులఁ, దలఁచి తలఁచి పాడు చెలమిమిగుల.

క. త్రపల విడనాడి మమతఁ బ్ర,లపించుచుర్ నిల్చి రేవిలాసము లేకే;
నృపతిదగు మంద నందొక, చపలేక్షణ తనమనమునఁ జక్రిఁ దలఁచుచున్. ౧౦

భ్రమరగీతలు.

క. హరిసంగమమును గోరుచుఁ, దరుణంబున నందు షట్పదంబు కనఁబడర్
బరికించి మనోహరుఁడగు, హరిపంపిన దూతగాఁగ నాత్మఁ దలఁచుచున్. ౧౧

క. ఆనెపమున నాయుద్ధవు, మానసమున కాత్మనున్న మంజులభావం
బే నెఱిఁ దగులం దగు నని, తా నెన్నుచు నిట్టులనియెఁ దత్పరత తగన్. ౧౨

ఉ. ఓమధుపా! తలంపఁగితవోత్తమబంధువ వీవు మాసప
త్నీమది రేక్షణాకుచయుతిస్ఫుటపీడితపుష్పహారస
క్తామితకుంకుమాంకితము లై తగు మీసల నస్మదంఘ్రులర్

గోముగ ముట్టకుండు మిఁకఁ ౹ గోరకుమా నతిపూర్వకంబుగన్. ౧౧౫ 2642

చ. విను మొకమాట యమ్మధుప ౹ వీరుఁడు శ్రీమథురాపురీస్థ మా
నినుల ప్రసాదమే సతము ౹ నెమ్మి వహించును గాక మాదయన్
గన ఫలమేమి యాతనికిఁ ౹ గల్గును యాదవులున్న యోలగం
బునఁ బరిహాసపాత్ర మగుఁ ౹ బో హరినెయ్యము మాటలేటికిన్. ౧౨ 2643

చ. అతనికి దూత వీవె తగుఁదయ్య; యొనర్చె నదేటికీడు మీ
కతఁ డిటు లేవగింపఁ గత ౹ మారయఁ గన్పడ దందువేమొ? లో
కతతుల మోహనంబు గనఁగా నొనరించు రసాకరాధరా
మృత మొకసారి గ్రోలఁ దమికిచ్చి త్యజించె నతండు మమ్మొగిన్. ౧౨౫ 2644

ఉ. తేనియఁబీల్చి పుష్పవితతిన్ విడనాడెడు నిన్నుఁబోలె దు
ర్మానుఁడు వాఁడు; నీ వతనిమాడ్కిఁ జెలంగెద; విట్టిమీయెడన్
గానఁబడున్ సమానత; యిఁకం దెలిసెన్ దగుకారణం బయో!
వానిఁ గృపావిహీనుఁడని ౹ భావనచేయఁగ నేర కాదృతిన్. ౧౩ 2645

చ. హరిచరణారవిందముల ౹ నారమ యెవ్విధిఁ గొల్చుచున్నదో
సరసము లట్లుతోఁచు హరిచక్కనిమాటలు బూటకంబులై
పరఁగు నటంచు నెన్న కవి ౹ స్వాంతము వొంగిల బేలుపోయి ప
త్సరసిరుహమ్ములం గొలువఁ ౹ జాలినదే సిరియెంత వెఱ్ఱిదో. ౧౩ 2646

ఉ. మేమన లక్ష్మిపోలె గతమేధల మెట్లును గాము గాననే
యామెయిఁ జేరియుండ మని ౹ యాత్మఁ దలంపుము; షట్పదోత్తమా!
ధామవిహీనతన్ వని సుతంబు చరించెడు నస్మదగ్రమం
దేమి తలంచి పాడెదవొ ౹ యివ్విధి నాయదునాథుచర్యలన్. ౧౩౫ 2647

క. పలుసారు లనుభవించితి, మల కృష్ణునిచేష్ట లవ్వి ౹ యగుఁ బ్రాచీనం
బులు మాకు వానినేటికి, సలీలగాఁ బాడెదవొకొ ౹ చాలుం జాలున్. ౧౪

క. దీన స్త్రీకేమియు ఫల, మీనెలవునఁ గల్గఁబోదు ౹ కృష్ణుని మది కిం
తేని ప్రియంబును గూర్చెదు, మానినులకడన్ దదీయమంజులచర్యల్. ౧౪

మ. హరికిం గూర్చుసరోజనేత్రలు తదీయానూనకల్యాణ సా
గరసంశ్లేషవిఖండితాత్మకుచసంక్రాంతార్తలై యుంట నా
దర మొప్పారఁగ నీవు కోరినదియుం ౹ దా రేయ నంగీకరిం
తురుపో ఝంకృతు లీయెడన్ వలదు ధూర్తుండే నిసుం బంపుటన్. ౧౪

చ. అనకుఁడు మీరలిట్టు తగవా మదిఁగల్గెడు వాంఛఁదీర్ప న
న్ననిపె నతండె యందువొకొ ౹ యారయఁగా సురలోకమందు మే
దినిని రసాతలంబునను ౹ స్త్రీమణు లెందఱు మించియుందు రా

వనితలలోన శ్రీవిభుని ఽ వ్యాజమనోహర సుస్మితంబునున్. ౧౪½  2651

మ. లలితభ్రూలతికావిచాలనములన్ ఽ లక్షించి యేనారిరై
న లలిన్ లోఁబడకుండునే రమయు విన్నాణంపునవ్వుల్ మహో
జ్జ్వలతద్భ్రూలతికావిజృంభములనే ఽ వాంఛించి తద్దివ్యప
ద్మలినద్వంద్వరజంబుఁ గొల్చెడి నిఁకేనెన్నన్ మే మనన్ లెక్కయే. ౧౫  2652

సీ. మే మన నవ్విధి ఽ గా మోసపోయెడువారముగా మదేఽభంగినైన
దీనులవిషయమంఽదూనినకృప గలవా రుత్తమశ్లోకఽభూరికీర్తి
బడయ నర్హులెయని ఽ పలుకుమా మధుకర! తలపయి నిడినపాఽదమును దీయు
మింకను దీయకఽయే యున్నకత మేమి? యమ్ముకుందునినుండి ఽ యభ్యసించి

తే. నట్టిదయి తగునీదు దౌఽత్యంపుముద్దు
పలుకు లిఁకఁ జాలుఁ బ్రార్థించుఽభంగియందు
జాణ వనవచ్చు నీవు మాఽసముఖమందుఁ
బలుకఁ దలఁచిన దెలుఁగుదుఁ ఽ బలుకులేల?. ౧౫½  2653

చ. హరివలె నమ్మరాదు నిను ఽ నైన మధువ్రత! శ్రీశుఁ డేమిత
ప్పరసి యొనర్చె నందువా? తఽదర్థమె సంతతిఁ బ్రాణనాథునిన్
నిరుపమపుణ్యలోకముల ఽ నిచ్చలు పోవిడి నమ్మియున్నయీ
తరుణుల మమ్మొగిన్ విడిచెఁ ఽ ద ప్పిఁక నెయ్యదియుండుఁ జెప్పుమా?. ౧౬

క. కరుణాహీనుఁడు కావున, సరియని యీసంధియేల? ఽ చంచలచిత్తుం  [లనన్.
డరయఁగ సంధికి యోగ్యుఁడె?, హరియుం గ్రూరుండె యనుట ఽ న్యాయ మెటు

చ. వనచరనాథుఁడై యలరుఽవాలిని మోసముచేత లుబ్ధకుం
డనఁదగి చంపె వ్యాధులు మఽహాటవి మాంసమునందు నాశచే
తనె మృగపంక్తిఁ జెందుదురు ఽ ధర్మమువారిది పూనియే వధిం
చినయటు కానరాదు కృప ఽ చిత్తమునం బొడసూపమిం గదా?. ౧౬½  2656

చ. తరుణికి లొంగిపోయి యొకఽతన్వి మదిం దనుఁగోరి వచ్చినన్
బురుషవరేణ్యుఁడై తగియుఁ, బొలదిదంచుఁ దలంప కెంతయున్
ద్వరపడియే విరూపయగుఽభంగి నొనర్చెను, వాయసంబురీ
తి రమణ నిచ్చినట్టి బలిఁ ఽ దృప్తిగఁగైకొని యాబలిం ద్వరన్. ౧౬½  2657

క. అనుకంపారహితుం డై, పెనుఁద్రాళ్లం గట్టివైచెఁ ఽ బృథ్వీపయిం గృ
ష్ణుని సఖ్య మింకఁ జాలును, వనజాక్షు నదేల యెపుడుఁ ఽ బాడెద రనుదో?. ౧౭

క. ఆతని దివ్యకథార్థము, లేతీరునఁగాని వదల ఽ నించుకయే మా
చేతసులు చాలకున్నవి, మాతీరున నిలను బెక్కుఽమానవు లెలమిన్. ౧౭  2659

సీ. ఆమహాపూరుషు ఽ నమలచరిత్రలీలాహ్వాయ కర్ణామృఽతైకబిందు

మాత్రమే యొకసారి ¦ మమతఁ ద్రావినయంత ద్వంద్వధర్మంబులఁ ¦ బాసి లోక
సంసక్తి వదలి యాగతుణమ దీనంబగు గృహకుటుంబము వీడి ¦ యెల్లభోగ
ములఁ బాసి హంసపక్షులరీతి భిక్షుచర్య జరపుచుందురు; ¦ భ్రమరవర్య!

తే. హరిణవధువులు మృగయుని ¦ దగు నెలుంగు
మగని కంఠరవం బని ¦ మదిఁ దలంచి
విశ్వసించి తదంబక ¦ వేదనలఁ బ
డెడు తెఱంగునఁ గుటిలాత్ము ¦ నుడులను విని. ౧౭ 2660

చ. ఋతములె యంచు నమ్మి యొకరీతిని గృష్ణుని దివ్యమా నఖ
ప్రతతుల స్పర్శనంబున వి ¦ భంగ మనోభవ తీవ్రరోగ మా
యతగతిఁ గ్రమ్మఁ దత్ప్రమద ¦ మారయఁ జాలితి మింకఁజాలుఁ ద
ద్ధితచరితల్ మఱొక్కటిగ ¦ నెంచి వచింపుము దూత యింపుగన్. ౧౮ 2661

చ. [అనివచియించి యాభ్రమర ¦ మల్లన వేఱొకచోటి కేగి నె
మ్మనమునఁ దోఁచుచుంచలత ¦ మానిని యున్నెడ కట్టెరాఁగ దా
నిని గనియిట్లు పల్కెఁ] బ్రియుఁనిం దమి నొందఁగఁ జేయుమిత్రమా!
వనరుహనేత్రుఁ డంప మఱి ¦ వచ్చితె? మాన్యుఁడ వౌదు పీయెడన్. ౧౯ 2662

ఉ. ఏమి మనంబునం బడయ ¦ నిత్తఱిఁ గోరుదొ వేఁడుకొమ్ము; దూ
తా! మము నిందెయుండఁగ నిశాంతము జంటను వీడరాని యా
తామరసాక్షుసన్నిధికిఁ ¦ దప్పక యెవ్విధిఁ గొంచుఁబోయెదో
ధీమహితా! త్వదీప్సితము ¦ తీరుట యెట్లొ? యెఱుంగ నిత్తఱిన్. ౧౯౪ 2663

ఉ. ఇందిర యాహరిం గలిసియే తదుదారహృదంతరంబునం
బొందుగ నుండుఁగాదె యొకప్రొద్దును వీడదుగాదె దాని; నిం
దిందిరవర్య! సౌమ్యుఁడవు ¦ తెల్పుమ యమ్మథురాపురోత్తమం
బందు ముకుందుఁ డాగురుగృహంబున నుండియె వచ్చి యిత్తఱిన్. ౨౦ 2664

చ. అలరుచునున్నవాఁడె? యల యార్యసుతుం డిటనున్న తల్లిదం
డ్రులను గృహంబులన్ మఱియును బ్రియబంధుల గోపకవ్రజం
బులను దలంచునే? తనదు పూజ్యపదాంబుజసేవ చేయు మ
మ్ముల నొకయప్పుడేని తలపోయునె? మాచరితల్ స్మరించునే?. ౨౦౪ 2665

క. రుచిరాగురు వాసనలం, బ్రచురంబగు తనదుహస్తపద్మము మాశీ
ర్షచయమున నెప్పు డిడునో, వచియింపు మటంచుఁ దనదు ¦ భావము తెలుపన్.

మ. విని యాయుద్ధవుఁ డందు గోపికలు శ్రీవిష్ణుం గనంగోరి నె
మ్మనముల్ తత్తఱమంద నుండు టెద సంభావించి కృష్ణుండు తె
ల్పినసందేశములన్ వచించుచును దాపంబెల్లఁ బాయంగ ని

ట్లనె; నౌరా! తలఁపోయ మీరె యిల ధన్యల్ లోకపూజ్యల్ కదా!. ౨౨౪

చ. కనుకనె వాసుదేవుని నఖండమహామహిమంబు దలంచుచున్
మనముల నెల్లవేళల రమాపతియందు సమర్పణంబు చే
య నిటుసమర్థ లైతిరి; మహావ్రతహోమతపస్సులన్ జపం
బున శ్రుతిపాఠదానములఁ బూనిక నింద్రియనిగ్రహంబునన్. ౨౩౪ 2668

క. పలువిధములైన శ్రేయంబులఁ గల్గఁగఁజేయు మార్గముల సద్భక్తిన్
జలజాయతాక్షునందున్, నిలుపఁగ సాధించు టరిది నిశ్చయ మిదియా. ౨౮

చ. మునులకుఁగూడ శక్య మనఁబోలక మిక్కిలి యుత్తమం బటం
చును దలఁపంగనై కరము స్తుత్యమునై తగుభక్తి సద్యశం
బున వెలుఁగొందుచుం బురుషపుంగవుఁ డౌభగవంతునందుఁ బ్రా
గ్జనిసుకృతంబునన్ నిలుపఁ జాలితి రెంతటి ధన్యలో కదా!. ౨౯ 2670

చ. పతులను బుత్త్రులన్ స్వతనుబాంధవులన్ భవనంబులన్ దృణ
ప్రతికృతులంచు నెంచుచు జవంబున వీడియె కృష్ణుఁ డంచున
చ్యుతుఁడని పిల్వఁగాఁ బడుచు నొప్పిన యప్పురుషోత్తమున్ వరిం
చితిరి కదా కృతార్థతను జెందితి రిద్దె యదృష్ట మంచనన్. ౨౬ 2671

సీ. ధన్యాత్మలగు వనితారత్నములు మీర లాయధోక్షజునందు నమలమైన
యేకాంతభక్తి మునీంద్రవాంఛితమును బచరించితిరి యిదె పరిగణింపఁ
గా మహానుగ్రహ; మీమెయి నాకని తలపోయువాఁడ నిమ్ములఁ గృతార్థుఁ
డనుజుఁడీ! మీకు నింపును గూర్చుప్రియతమసందేశముల వినుఁ; డిందు నేను

తే. భర్తయగు భగవంతుని భవ్యతమ ర,హస్యములఁ గొనివచ్చితి నమ్మలార!
భద్రవతులార! యానుడుల్ పరమపురుషుఁ,డిట్లు పలుకంగఁదగు ననియెవచించె.

క. సతులార! చరాచర వ,స్తుతతిని భూతంబులైదు తొలఁగక యెపుడే
గతి నుండు నట్టులే నను,గతుఁడను గానుండువాఁడఁ గలకాలంబున్. ౨౮౪

క. మనసునకున్ బుద్ధికిఁ ద,క్కినయింద్రియములకు నేన కేవల మూహిం
చిన నాశ్రయుండ నగుచుం,దును సర్వాత్మకుఁడనె యగుదును సత్యముగన్.

చ. కనుకనె నావియోగ మొకకాలమునందును గల్గకుండు మీ
కని తలపోయఁగాఁజను; మహావ్రతలార! మఱొక్కఁ డాలకిం
పను జను; నన్ను నేనె యొకభంగిని స్వేచ్ఛనె యాత్మమాయదై
కనుఁగొన శక్య మెప్పుగిదిఁ గాని మహత్త్వము నాశ్రయించియే. ౨౯౪ 2675

సీ. భూతేంద్రియ గుణసంఘాతరూపమ్మున సృజియింతుఁ బాలింతుఁ జెలఁగి దాని
నుపసంహరింతు; మఱొక్కఁడు చెప్పెద; భూతాదిరూపత్వమున జెలంగు
నాత్మకుఁ దద్దోష మంటకుండునె యని సంశయింపఁగరాదు చానలార!

యాత్మ విశుద్ధుండు గుణానన్వయుఁడు మఱి వ్యతిరిక్తుఁడయ్యు మాయాకృతంబు

తే. లగుచు స్వప్నాదికములను । నాహ్వాయములఁ
దగుమనోవృత్తులను విశ్వతై జసములఁ
బ్రాజ్ఞరూపంబునను దోఁచు । *స్వప్న మెట్లు
మేలుకొను వానికింగల్గఁ । జాలు నట్లె. ౩౧ 2676

వ. మిథ్యాభూతంబులగుచు బాధితంబులగు నింద్రియార్థవిషయములఁ జింతించుచుఁ బురుషు నింద్రియములకుం గూర్చుచుండు మనస్సును దొలుదొలుత నిరోధింప వలయును. సముద్రంబున మహానదులు సమాప్తి నొందుచందమున నిట్టి మనో నిరోధమను మహాకార్యమునందే సాంఖ్యయోగములు సన్న్యాసము తపస్సత్య దమములను సమామ్నాయంబు పర్యవసన్నంబగు. ౩౩ 2677

చ. [ఒరులనుబోలె జ్ఞానమునె । యొప్పుగఁదెల్పెదు మాటలన్ మనో
హర! తమి నొందఁ జేయఁగఁ బ్రయత్న మొనర్చెదు సర్వలోకసుం
దర సుగుణాలవాలుని నితాంతదయాకరు నిన్నుఁ బాసి యె
క్కరణి మెలంగువార మని క్రమ్మఱ సందియమొందువారొకో!.] ౩౩ 2678

మ. ననుఁ బ్రీతింగను సచ్చరిత్ర లగునో నారీవతంసంబులా
ర! ననుం జూడఁగఁ గోరు మీకనులు దూరంబందు నున్నట్టి నన్
గనఁగాఁ జాలక చింతనొందువిధమున్ । గావించు టేలన్న మీ
మనసుల్ ధ్యానసమాధి నన్ గదిసి సంభావించు నంచెంచియే. ౩౪ 2679

ఉ. అంతియగాని యింకొకమహత్తరహేతువుచేతఁ గాదదే
చింతను బూనకుండుఁ; డిఁకఁ । జెప్పెద వేఱొక కారణంబు సీ
మంతినులార! స్వప్రియతమంబగు వస్తువుచెంత నుండకే
యెంతయు దవ్వునం బొలయ । నింతులచిత్తము చొచ్చియుండెడున్. ౩౫ 2680

క. ఆరీతిఁ బ్రియతముఁడు తమ, చేరువనుండంగ నంత । స్నేహాయుతముగా;
దారయ మీమనసే వ్యాపారమ్మునఁ దగుల కొక్కపద్ధతి నాపై. ౩౬ 2681

చ. అనిశము చొచ్చియుండు నని । యాత్మ నెఱుంగుడు; సంస్మరించుచున్
ననుఁ ద్వరమీరు చేరుదురు । నాఁటినిశాసమయంబునందు నా
వనమున రాసకేళిఁ దమభర్తలు పోవలదంచు నడ్డ నే
వనితలు రా నశక్తలయి । వస్త్యములందు వసించియుండియే. ౩౭ 2682

శా. నాతో రాసవిహారమున్ సలుపుచందం బెట్టులో యం చొగిం
జేతస్సుల్ తపియింప నావయినయాచేష్టల్ మహాశ్రద్ధతోఁ

* "యేనేంద్రియార్థాన్ ధ్యాయేత మృషా స్వప్నవదుత్థితః" అని మూలము. దీనిసారమే యిందును దరువాతి వచనమందును గలదు.

ప్రీతిఁ ధ్యానము చేయుచుఁ గడఁకమై • వే నన్నె ప్రాపించి రా
రీతుల్ మీకు నిదర్శనంబులగు నారీరత్నముల్ గావునన్. ౩౭ 2683

తే. మీరు కల్యాణవతులౌట • మేలె కల్లు
నంచు భగవంతుఁడే పల్కె • ననుచు నుద్ధ
వుఁడు వచించిన ప్రియతము • నుడుల వినుచు
వ్రజయువతు లెల్ల నవ్వానివలన నపుడు. ౩౮ 2684

క. హరిచేష్టలెల్లఁ దోఁపఁగ, స్మరియించుచుఁ బట్టరాని • సంతోషమునన్
హరిపరిచరు నుద్ధవు నాదరమునఁ గనిపల్కి రిట్లు • త్వరతము నేచన్. ౩౯

చ. వనజదళాక్షమిత్ర! యదువంశజులై తగువారి కేవిధం
బున నహితుండు పాపగణముల్ సతతం బొనరించు కంసుఁడన్
జనపతి భాగ్యయోగమునఁ • జంపఁబడెం గద కృష్ణుచేత; నా
ప్తనికరసంయుతిన్ హరియు • దైవవశంబున భద్రముల్ తగన్. ౪౦ 2686

తే. కుశలియేకద యిప్పుడు; • కువలయాక్షుఁ
డమ్మథురఁ గల పద్మాక్షు • లాదరంబుఁ
ద్రపయుఁ గలిసిన యట్టిస్మితంబు వెలయఁ
గాఁ గటాక్షేక్షణములఁ జక్కఁ దనుఁ జూడ. ౪౧ 2687

క. వానికి లోఁబడియే మా, పైనం జూపంగఁ దగిన • భవ్యప్రియ మా
చానలపైఁ బఱపుచు నిం, పూనినమదిఁ గుశలి యగుచు • నున్నాఁడు కదా?. ౪౨

తే. రతివిశేషజ్ఞుఁడైన పరాత్పరుండు, వరయువతులకుఁ బ్రియుఁడౌటఁ • బురపురంధ్రు
లాడుపలుకులకున్ విభ్రమాళి కెలమి, దగులువడకుండ నెబ్భంగిఁ • దప్ప దరయ.

చ. పురవనితల్ తనుం గలిసి • పొంకముగాఁ దగుమాటలాడు నం
తరమున నే ప్రసంగమునఁ • దత్పరుఁడయ్యును బల్లెలందు ను
న్న రమణులన్ మముం వనజనాభుఁ డొకించుకయే స్మరించునా?
హరిచరణైకదాస! సుగుణాధిక! యుద్ధవ! తెల్పుమా దయన్. ౪౪ 2690

చ. కలువలు మొల్లలున్ వెలయఁ • గాఁ దుహినాంశుఁడు సుందరాకృతిన్
జెలఁగుచునుండ నింతయని • చెప్పఁగరాని ముదంబుఁ గూర్చుచున్
విలసిలు బృందవన్ వనిని • వేడుకమై మముఁగూడి కాళ్లగ
జ్జెల మృదునాదముల్ చెవులఁ • జేరి ప్రసన్నత నొందఁ జేయఁగన్. ౪౫ 2691

మ. తనయింపౌకథలన్ దమిం బొగడుమా • దైవారుపల్కుల్ ప్రియం
బున నాలించుచు రాసగోష్ఠులను మమ్మున్ రంజిలంజేసె; నా
వనజాక్షుం డలరాత్రులం దలఁచునే • వర్ణించునే యెప్పుడై
నను గృష్ణైకపరాయణా! తెలుపుమా • నాథప్రియాలాపముల్. ౪౩ 2296

చ. తనను గుఱించియే సతము దారుణశోకమునం దపించు మ
మ్మును వనజాక్షుఁ డంబుదసమూహముచేత శచీప్రియుం డొగిన్
వనములఁ బోలె స్వాంగములఁ బావనరీతుల సంస్పృశించి జీ
వనముల నిల్పి ప్రోవఁ గృప వచ్చునె యిచ్చటి కుద్ధవా! త్వరన్. ౪౪ 2693

చ. సరసిజనేత్రుఁ డొక్కపుడు చక్కనిదౌ గతి చిక్కకుంట నీ
పరిసరమందు నుండెఁగద ప్రాప్తమహత్తరరాజ్యుఁడై రిపూ
త్కరము నడంచి భవ్యనృపకన్యలఁ బెండిలియై తమిన్ సుహృ
ద్వరులనుగూడి యుండు నిఁక వచ్చునె యిచ్చటి కేకతంబునన్. ౪౫ 2694

సీ. మహితాత్ముఁడై లోకమండలజననియౌ భార్గవీదేవికి భర్తయగుచు
నాప్తకాముండయి యలరుచుఁ బూర్ణుఁడై యుండు శ్రీకృష్ణున కొప్పుదప్పి
వనములయందె సంవాసంబుచేయు మావలనను దక్కినవారిజాయ
తాక్షులవలనఁ గార్యం బేదియుండును? బరికింప లేదని పలుకవలయుఁ

*తే. బింగళ యనెడు పుంశ్చలి ప్రియతమమగు
సౌఖ్యమని చెప్పఁబడు నిరాశత్వ మనియె
దాని నెఱిఁగియుఁ గృష్ణుని పైని గోర్కి
దుస్త్యజంబగునే మొనర్తు మిఁక నిందు. ౪౬ 2695

ఉ. తా నెదఁ గోరకుండిన ముదంబున లక్ష్మి తదీయవక్షమున్
బూని యొకప్పుడే విడువబూనదు మిక్కిలి యుత్తమంబుగాఁ
గానఁగనైన కీర్తిగల కంజదళాక్షుని సాధువార్త నే
మానవుఁడేఁ ద్యజించునొకో మాన్యచరిత్ర! యిదీ వెలుంగవే!. ౪౭ 2696

చ. అతిశయతేజ మొప్పు వనజాక్షుసఖా! బలభద్రుఁ గూడియే
యతఁడొగి నీనదీవనమహాచలభాగములన్ మనోజ్ఞగో
ప్రతతులఁగూడి వేణువరభవ్యరవంబులఁ గొల్చినాఁడు సు
మ్మతులితతత్స్థలంబులు వ్రజాధిపసూనుని జూడఁ దెల్పెడున్. ౪౮ 2697

సీ. శ్రీనికేతనములౌ శ్రీకృష్ణుపాదాంబుజాంకముల్ పలుమాఱు లాస్థలముల
మఱువకుండఁగఁ జేయుచుఁ మఱియుఁ దచ్చేష్టల మఱువంగ నేర్తు మేమాడ్కి మేము
తన్మనోహరగతుల్ తద్విలాసస్మితాపాంగవీక్షణములు భవ్యతమత
దీయభాషణములు మాయంతరాత్మల దొంగిలెఁ గాన నాతోయజాక్షు

ఆ. మఱవఁదగు నదెట్లు మాకు నుద్ధవ! నీవె, పలుకవయ్య; నాథ! భక్తజనస
మార్తిహరణ! పంకజాలయాధిప! కృష్ణ!, గోకులేశ! శ్రీశ! కోరి నీవు. ౪౯

క. గోకుల మెల్ల నిపుడు దుఃఖాకూపారమున మునిఁగి కడు దీనతఁ జి

* "పరం సౌఖ్యం హి నైరాశ్యం స్వైరిణ్యాహ పింగళా" అని మూలము.

కాకుపడుచున్న దీయెడ, గోకులము సముద్ధరింపు కువలయనేత్రా! ౪౨ 2699

మ. అని ప్రార్థించుచుఁ బ్రీతి నించెడు తదీయాలాపముల్ చల్లఁగా
విని గోవింద వియోగవేదన లోఁగి పీడంగ సర్వాత్ముఁగా
వనజాతాక్షు నెఱింగి యుద్ధవుని సంభావించి; రాతండు గొ
న్ని నెలల్ మంద వసించి గోపికలవా తీవ్రార్తి మాయించుచున్. ౪౩ 2700

క. హరి లీలాచరితంబులఁ, బరమాదృతిఁ బాడుచున్ నివాసార్థ మిదా
హరి కిర వని గంజిలునె, క్కరణి నటుల్ చేయుచుండె గారవ మలరన్. ౪౪

ఆ. ఎన్ని దినము లుండెఁ గృష్ణకథాలాప,ములను బలుకు చందు నెలమి నుద్ధ
వుఁడు క్షణంబు లట్లు పోయె నాదినములు, నందుమందఁ దగు జనముల కెల్ల.

మ. హరిదాసుం డగునుద్ధవుండు వ్రజమం దాగోపికల్ తన్ను నా
దరణంబొప్పఁగఁ గొల్చుచుండ నదులన్ ధాత్రీధరేంద్రంబులన్
వరసానుస్థలులన్ మహావనములన్ వాంఛల్ తగం జూచుచున్
హరికృత్యంబుల సంస్మరించుచు మహాహర్షంబు నొందెన్ మదిన్. ౪౬ 2703

మ. వనజాక్షుండు మనంబులం బొలయుటన్ వైక్లబ్యముం గన్నయం
గన లార్తింబడు లెల్లఁగాంచి మిగులం గా హృష్టుఁడై భక్తి వం
దనముల్ వారికిఁ జేయుచుం దలఁచె నాత్మన్; సంతతం బిట్టులీ
వనితారత్నము లెల్ల భూతములలో వర్తిల్లు గోవిందుపై. ౪౭ 2704

సీ. దృఢతమభక్తి యీతీరున నుండంగ వర్తించుచున్న యీభంగిచూడ
సార్థక మన వీరిదగు జన్మమేకద సంసారవిషయకసాధ్వసంబు
గలిగి మోక్షాసక్తి వెలయుమహర్షులు భక్తులౌ మాబోంట్లు పరమభక్తి
నెద్దానిఁ గోరుదు మద్ది వీరలయందు నెలకొనియుండెడు జలజనాభు

ఆ. *భవ్యకథలయందుఁ బరమానురాగంబు, గలుగు నరున కాత్మఁ దలఁప శౌక్ల
యాజ్ఞికంబు లనఁగ నల్లె సావిత్రం బ,నంగ విప్రుల త్రిజననము లేల?. ౪౮

క. అవి మూఁడు కలుగకుండిన, నవనిఁ గొఱంతేమి కల్గు? నడవులలో నె
ప్డు వరుసఁ దిరుగుచు నొక్కెడ, నవిచంచలమైన చిత్త మమరకయుండన్. ౪౯

క. కనుపట్టు పడఁతు లెక్కడ?, తనవైభవ మసదృశముగఁ దగి పరమాత్ముం
డనఁబరఁగు కృష్ణమూర్తి ప,యినిస్థిరమగు భక్తిగల్గు టెక్కడ? నౌరా! ౫౦

చ. తెలియని మర్త్యుఁడే నొక విధిం దనుఁ గొల్చిన యంతమాత్రనే
జలరుహనాభుఁ డీశ్వరుఁడు సాధుసుధాభజనంబు రోగముల్
వెలువడఁజేసి హాయిఁ గడువింతఁగఁ గూర్చెడునట్లు శ్రేయముల్

---

* "కిం బ్రహ్మజన్మభి రనంతకథారసస్య" అని మూలము. "బ్రహ్మజన్మభిర్విప్రసంబంధిభి శ్శౌక్లసావిత్రయాజ్ఞికై స్త్రిభి ర్జన్మభిః కిం కోఽతిశయః" అని వ్యాఖ్య.

గలుగఁగఁ జేయుఁ దానె కలఁకాలము సర్వవిదుండు గావునన్. ౯౯ 2708

సీ. రాసోత్సవంబున ఽ రాజీవనేత్రుండు బాహుదండంబుల ఽ వ్రజవనితల
గళములయం దిడి ఽ కౌఁగిలించుకొనుచు వారి కెంతయుఁబ్రీతి ఽ వర్ధిలంగ
విహరించినట్టి యావిపులప్రసాద మేకాంతరతిం దగు ఽ కమలకేని
కమలగంధచ్ఛాయ ఽ లమరనిర్జరసుందరుల కేని నుంతయుఁ ఽ గలుగదయ్యెఁ;

ఆ. దక్కినట్టి వారి ఽ లెక్కింపఁగా నేల?, యీవ్రజాంగనలు త్యజింపరాని
స్వజనవితతి విడిచి ఽ జాతిధర్మంబుల, వదలి శ్రుతివిమృగ్యు ఽ వాసుదేవు. ౮౦౪

క. అనవరతము సేవించుచు, ననుపమతత్పదవిఁ గాంచి ఽ రౌరౌరా! యీ
వనితాంఘ్రికమల ధూళిని, గనుబృందావనమునందుఁ ఽ గలతరువులలోన్. ౮౦౪

క. వీరుత్తతి గుల్మౌషధి, వారములో నొకటిగాఁగఁ ఽ బ్రభవిల్లుదు నా
యారీతినైనఁ దత్పద, సారసరేణువులఁ బొందఁ ఽ జాలుదుఁ గాదే. ౮౧ 2711

మ. సిరిపూజింప నవాప్తకాము లగుచుం ఽ జెల్వారు బ్రహ్మాదియో
గరతుల్ స్వాత్మల ధ్యానయోగవిధిచేఁ ఽ గాంక్షించి యర్చింప నొ
ప్పు రమాధీశుని పాదపంకజయుగంబుల్ రాసగోష్ఠిన్ మనో
హరహృత్పంకజమందు నిల్పుకొని యాత్మానంద ముప్పొంగఁగన్. ౮౧౪ 2712

ఆ. సతము కౌఁగిలించి ఽ సంతాపములఁ బాసి, యున్నవార లిచటి ఽ యన్నుమిన్న
లెవరుచేయు నాపరేశుకథాగీత, మఖిలమును బవిత్ర ఽ మట్లుచేయు. ౮౨౪

క. అలగోపికల పదాంబుజ,ములరేణువితానములకు ఽ మ్రొక్కెదు మోదం
బొలయఁగ; నని తలపోయుచు, జలజాక్షుని సేవకుండు ఽ శ్రద్ధాన్వితుఁ డై. ౮౩

సీ. హరిని దత్పాదాంబుజాసక్తిగల గొల్లసుందరీమణులను ఽ డెందమందు
ధ్యానించుచున్ వారిదయకుఁ బాత్రుండయి తదనుజ్ఞ వేఁడి వారిదగు సమ్మ
తిని బొంది యవల నందునియశోదను గోపకులను వీడ్కొని పోవఁదలఁచియరద
మెక్కెను; హరికడ ఽ కేగెడు నుద్ధవు నందాదులగు గోపనాయకు లొగి

ఆ. గానికలను బెక్కుగతులగు ధగువానిఁ, గరములందుఁ బూని ఽ కదియ వచ్చి
యశ్రుసలిలపూరితాక్షులై యనురాగ,భరమునఁ బలికి రిట్లు హరిఁ దలంచి.

క. హరిమిత్ర! మామనస్సులఁ, బరఁగెడు వ్యాపారము లొగిఁ ఽ బద్మాక్షుని ప
త్సరసిజములఁ దగిలియె యే, తరుణంబున నుండుఁగాక! ఽ తత్కృపఁ గనుచున్.

క. మాపలుకులు సతతంబును, శ్రీపతినామముల భక్తిచేఁ గీర్తింపన్
జూపఁదగు శ్రద్ధ గలవిగ, నేపారునుగాక! మేను ఽ లేప్రొద్దు తమిన్. ౮౮ 2717

క. నతులొనరించుట లోనగు, కృతులందే యుండుఁగాక! ఽ యెపుడును గర్మ
ప్రతతి కనుబంధముగ సంసృతిఁ దిరుగుచునుండు మా కదేజనినైనన్. ౮౮౪

తే. ఈశ్వరానుగ్రహంబున ఽ నెలమి మంగ,ళాచరణములచేత దానాదికములఁ

బుణ్య మార్జించితిమయేని పూజ్యకృష్ణ,మూ_ర్తియం దెరతింగాంచి పాదలుఁగాక!

చ. అనియిటు గోపకుల్ పలుకు చాహరిభ_క్తుని నుద్ధవుఁ మనం
బునఁ గలప్రీతిచే మిగులఁ బూనిక సత్కృతినందఁజేసి; రం
త నతఁడు కృష్ణపాలనము తత్సమయంబునఁ గాంచి పూజ్యమై
చనుమధురాపురంబునకుఁ జయ్యనఁ బోయె హరిం గనుంగొనన్. ౬౮ 2720

చ. హరిఁ గనిమ్రొక్కి ప్రీతిమెయి నావ్రజమందు వసించువారి ని
ర్భరతరభ_క్తిఁ దెల్పి బలరామునకుఁ బరమేశ్వరుండు శ్రీ
వరుఁడు పరాత్పరుండునయి భాసిలు కృష్ణున కిచ్చెఁ గాన్క లా
దరమున నందముఖ్యులు నితాంత మొసంగిన దాని న_త్తఱిన్. ౬౯ 2721



నలువదియెనిమిదవయధ్యాయము.

శ్రీకృష్ణుఁడు కుబ్జాగృహమున కరుగుట.

క. భగవంతుఁడు శ్రీకృష్ణుఁడు, జగములయందుండునట్టి సకలవిధప్రా
ణిగణమున కాత్మయై తా,నుగ నగుచుఁ సర్వదర్శనుఁడునయి యుంటన్. ౧

మ. మును తా నిచ్చిన వాక్యముం దలఁచి యాపూఁబోఁడి సైరంద్రి తఁ
గనఁగాఁగోరి యదే లభింపమి మనఃకంజంబు వాడంగ నిం
తనరానట్టి వెతం బడంగఁ బ్రియ మొక్కింత ఫలింపంగఁ జే
యనె యూహించి చనెం దదీయమగు గేహంబుఁ వడిం జేరఁగన్. ౧ 2723

సీ. నిరుపమ గేహోపకరణముల్ వెలయ విహారైకపరిక రాఢ్యమయి యొప్పి
తారహారములు పతాకావితానముల్ శయనాసనంబులుఁ జాలఁ గ్రాలఁ
బరిమళధూపముల్ వరదీపములు పూలహారముల్ గంధముల్ హారితరము
లయి కనుపట్టంగ నభిరామమై కుబ్జమందిరం బలరుచుండెం దగంగ;

తే. హరియు నుద్ధవసహితుఁడై యరిగె నంతఁ
గృష్ణుఁ డాత్మగృహంబున కేగుదెంచు
టరసి యాకుబ్జ త్వరపడి యట్టె లేచి
చెలులు రా నెదురేగి వేడ్క లుబుకంగ. ౨ 2724

మ. చ్యుతియే లేక చెలంగు శ్రీహరిని విష్ణుం బ్రీతిఁ దోడ్తెచ్చి స
ద్ధిత దివ్యాసనముఖ్యగౌరవము లెంతే భ_క్తిఁ గావించెఁ ద
ద్ధితునాయుద్ధవుఁ గొల్చె సత్కృతుల భక్తిష్టంబు లుప్పొంగఁగా
నతఁ డాయాసనముఁ స్పృశించి కయి నత్యానందమగ్నాత్ముఁడై. ३५ 2725

చ. ధరణిని గూరుచుండె హరిదాపున నచ్యుతుఁడుఁ మహార్హమై
నిరుపమమై యమూల్యమయి నిర్మలమై తగు పాన్పునొద్దకుఁ

బరమముదంబునం జనియె ♦ వ_ర్తనముల్ తగు నెవ్వి లోకమం
దరసిన వానిఁబూనఁ దగుసనంచుఁ దలంచుచు నీశుఁ డొటచేన్. ౪ 2726

సీ. ఆమహాశయ్యపై ♦ నధివసించెను; గుబ్జ మజ్జన మొనరించి ♦ మంచిగంద
మును బూసికొని యంత ♦ మూల్యమునిర్ణయింపఁగ రాని వస్త్రముల్ ♦దగినరీతి
ధరియించి భూషణో♦త్తమములఁ దాల్చి పూదండలఁ బూని గం♦దంపుఁబరిమ
ళములు గుబుల్కొన ♦ లలితతాంబూలచర్వణ మొప్పఁగా నాసవము సుధాస

ఆ. మమును గ్రోలి సర్వ♦మార్గమ్ములం దన
తను వలంకృతమయి ♦ తగఁ ద్రపయును
బయలుపడఁగ స్మితము ♦ పరమమోదముఁ గూర్ప
జెళుకుఁజూపు లట్టె ♦ వెలికిఁ బర్వ. ౫ 2727

క. అరుదెంచె మాధవునిదొ, పరిసరమున కాసరోజప్రత్రాక్షియు నా
పరమేశనూత్నసంగమ, పరిగత మందాక్ష యగుచుఁ ♦ బ్రక్కన నిలిచెన్. ౫౪

మ. పరమేశుండును దివ్యకంకణములన్ ♦ భాసిల్లు తద్ధస్తపం
కరుహంబుం దమిఁ గైగ్రహించి యురుశం♦కన్ మాన్పఁగా శయ్యసుం
దరలీలం గదియంగఁ జేసె; మఱియా♦తన్వంగి మైపూఁత నా
హరికిం బ్రీతి యొసంగె నాసుకృత మిం♦తైనన్ మహానందుఁ డై. ౬ 2729

చ. సతతము పూర్ణుఁడై తగుటఁ ♦ జక్రధరుం డలసుందరాంగి వాం
ఛితము ఫలింపఁజేసె; నల♦చేడియమిన్నయు నాయనంతు ప
చ్ఛతదళయుగ్మ మాదృతిని ♦ జాలఁగ మూర్కొనుచున్ నితాంత మా
రతిపతితాపముల్ వదల ♦ రమ్యతరాత్మహృదంతరంబునన్. ౬౪ 2730

సీ. వక్షోజయుగమందు ♦ నక్షియుగ్మమునందు నిడుకొనె నద్దానఁ ♦ బడఁతికున్న
సకలార్తులును బాసె; ♦ స్తనయుగాంతరమున నలరుహృత్పద్మంబు ♦ నందు విష్ణు
నానందమయమూర్తి ♦ నాలోకకాంతుని దృఢభక్తి నిలిపి యెం♦తేనిబూని క
నాలింగన మొనర్చి ♦ యతిదీర్ఘకాలంబునుండి వృద్ధిని గాంచు♦చుండి నట్టి

తే. యఖిల కామతాపంబుల ♦ నపుడె పాసె;
నెట్టితపములచేఁ బొంద ♦ నేవిధమున
దొరకనట్టి యీశ్వరుని మహానిరతచిత్తు
నమలుఁ గైవల్యనాథు మహాత్ము విష్ణు. ౭౪ 2731

క. ఇసుమంత యంగరాగం, బొసఁగిన యాపుణ్యలేశ♦మూని కనియుఁ బూ
ర్వసుకృత మంతగ నుండమి, బిసరుహాలోచనయు భాగ్య♦విభవ రహితయై. ౮

తే. ఇట్లు యాచించె నక్కటా! ♦ యిందిరేశ!
ప్రియతమా! నాదుచెంత సం♦ప్రీతి మెఱయఁ

గొన్ని దినములు వసియించి ♦ యెన్నటికిని
మఱవకుండుసుఖం బిమ్ము ♦ మాధవ! హరి! ౮౪ 2733

క. నీపాత్తు వదలఁజాల న,దేపద్ధతినైన నంబుజేక్షణ! యని యి
ట్లాపడఁతి తుచ్ఛసుఖమునె, శ్రీపతి యాచించె; నేమి చెప్పఁగ వచ్చున్. ౯

ఉ. మానదుఁడైన శ్రీహరియు ♦ మానస మెంతయు సంతసింప నా
చాన బహూకరించుచు నొసంగెను గోరినయవ్వరంబు నా
మానిని సంతసించె; రుచిమండనుఁడై యలరారు దేవకీ
సూనుఁడు స్వీయధామమును ♦ జొచ్చెను వెంబడి యుద్ధవుండురాన్. ౧౦ 2735

సీ. శమదమాదికములొ ♦ సన్మార్గములచేతఁ దప్ప వేఱొకటి సుంతయు నదెట్టు
లారాధనములచే ♦ నభిముఖుగాఁజేయ శక్యమే గానట్టి ♦ చక్రధరుని
సర్వేశ్వరేశ్వరు ♦ సంపూర్ణు శ్రీవిష్ణు నారామ యెట్టులో ♦ యాశ్రయించి
సుప్రసన్నుఁడుగాఁగ ♦ శుభతమవరమును యాచింపమాని శబ్దాదివిషయ

తే. సుఖమునే గోరె నెంత యశుభమనీష
యో యదెంత యభాగ్యయో ♦ యూహ చేయఁ
దగునె? యీరీతిఁ గుబ్జ ముదంబు నొందఁ
జేసి సర్వోత్తముఁడగుచుఁ ♦ జెలఁగు హరియు. ౧౧౪ 2736

క. కరినగరమునకుఁ గార్యా,తురతంగొని దూతనొకనిఁ ♦ దోడనె పనుపఁ
వరమతి నెంచి బలోద్ధవు, లరుదేరం బయనమయ్యె ♦ నక్రూరుఁ గనన్. ౧౨

తే. మఱియు నక్రూరునకును సమ్మదముఁ గూర్చు
తలపుఁ గొని యాతఁ డుండు, సద్మమున కేగె
నతఁడు తనమేలు గోరి యయ్యదునునందు
వచ్చు నమ్మువ్వురఁ బురుషవర్యులఁ గని. ౧౨౪ 2738

చ. త్వరపడిలేచి వారిఁ గొని వచ్చుతలంపునఁ బోయి యెంతొహ
ర్షరతిని గౌఁగిలించుకొని ♦ సంతసముం గనఁజేసి మ్రొక్కి సో
దరులును దత్సఖుండు విధి తప్పక మ్రొక్కిన నాదరించి యె
వ్వరుసను బూజచేయఁ దగుపద్ధతి దాని నతిక్రమింపకే. ౧౩౪ 2739

సీ. ఆసనంబులయందు ♦ నధివసింపఁగఁజేసి యాతిథేయంబుల ♦ నలవరింపఁ
బాదముల్ గడిగి తత్పావనసలిలంబు శిరసున ధరియించి ♦ నిరుపమార్ఘ్య
ముఖపూజనంబులఁ ♦ బొందుగ నొనరించి దివ్యాంబరము లిచ్చి ♦ భవ్యపుష్ప
మాలికాభరణముల్ ♦ చాల సమర్పించి తల భూమిస్పృశియింప ♦ నలరి మ్రొక్కి

తే. రామకృష్ణుల పాదసారసిజములను
దనతొడలయందు నిడుకొని ♦ వినయ మొప్ప

నొత్తుచుం దలవాంచి యి ౹ ట్లుత్తమపురు
షులకు విన్నప మొనరించె ౹ లలితభణితి. ౧౬ 2740

క. జనులదగు భాగ్యవశమున, దుసుమం బడె౯ బాపమతియు ౹ దుష్టుండునగు కం
సనృపతి యనుచరయుతుండై, జననం బిది తీవ్రకృచ్ఛ్ర౹సంతతివలనన్. ౧౬౫

ఆ. ఉద్ధరింపఁబడియె ౹ నొకభంగి మీచేత
మీవలననె యిద్ది ౹ మిగులవృద్ధిఁ
గాంచెఁ గారణంబు ౹ కార్యంబు ననుప్రధా
నపురుషులను ఖ్యాతి ౹ నెపుడుగాంచి. ౧౭౫ 2742

క. జగములకుఁ గారణములై, జగన్మయులుగాఁ దనర్చి ౹ సతము వెలయు వా
రుగదా మీరలు; మిము విడిచి గణింపఁ బరాపరములు ౹ క్షితి గలుగునొకో.

ఆ. ఆత్మసృష్టమగుచు ౹ నలరునీవిశ్వంబు, నాత్మశక్తియుక్తి ౹ నమరఁ జొచ్చి
బహువిధముల శక్తికిఁ ౹ బ్రత్యక్షగోచర, మేవిధమున నగునొ ౹ యెన్న నల్లె.

క. కనఁబడుచుందురు మీరే, యనఘా! బ్రహ్మంబ! యీచరాచరభూతా
ళిని వర్తించి మహాము,ఖ్యనిఖిల భూతములు బహువిధాకృతు లమరన్. ౧౯౫

క. నానాప్రకారములుగాఁ, గానం బడురీతి నాత్మ౹కారణములుగా
నైనట్టి భౌతికములం,దే నీవాత్మవయి యుండి ౹ స్వేచ్ఛానుగతిన్. ౨౦

తే. ఆత్మతంత్రుండవై బహు౹శాకృతులను
వెలయుచుందువు; పరమేశ! ౹ జలజనయన!
యాత్మగుణములె యైయొప్పు౹నట్టి రజసు
స్తత్వతమసులఁ దగిలి వి౹శ్వంబు నీవె. ౨౦౫ 2747

క. కలిగించుచుఁ బాలించుచు, విలయము గనఁజేయుచుండు ౹ విష్ణూ! యిట్లే
వెలసియుఁ దద్గుణకర్మం,బులకుఁ లోఁబడక స్వేచ్ఛఁ ౹ బొలుతువు సుమ్మీ! ౨౧

సీ. జ్ఞానాత్మకుఁడవుగాఁ ౹ జనునిన్ను బంధకారణమౌ నవిద్య చేరంగ రాదు
కాయాద్యుపాధియో౹గము మిథ్యగావున జననముఁ దన్మూల ౹ మనఁబడియెడు
భేదమునాత్మకు ౹ వెలయవు కావున బంధమోక్షంబులు ౹ పారమార్థి
కము లదేవిధమునఁ౹గావు; నిన్నెఱుఁగఁ జాలనియట్టి యవివేక౹మున నె యాత్మ

ఆ. కవియుఁ గలుగుననుట ౹ యనఁదగుఁ బ్రాచీన, వేదమార్గమునకు ౹ విధిరహితదు
రాచరణము గల్గు౹నట్టి పాషండుల, వలన బాధ దొడరు ౹ భంగిరైన. ౨౧

క. లోకహితార్థము నీవే, ప్రాకటసత్త్వాఖ్య గుణముఁ ౹ బాటించుచు నే
యేకరణి వేదమార్గం, బీకుంభిని నిల్చు నట్టు ౹ లెంచుచు నీపె. ౨౨౫ 2750

క. ఇల నవతరించు నట్లుగఁ, బలికితి మును; రాజులనెడు ౹ వ్యాజంబున వం
దలకొలఁది నాసురప్రకృ,తులుగా ధరఁబుట్టి మిగుల ౹ దుష్టాత్మకులై. ౨౩౫

క. చక్కనిధర్మము నేఁచెడు, నిక్కలపువారిసంఖ్య ✶ యెంతయధికమై
మిక్కిలి బలమున నొప్పినఁ, జక్కడి మహీభరంబు ✶ సమయంజేయన్. ౨౮

క. యదువంశము సత్కీర్తిని, బొదలంగాఁ జేయుటకును ✶ బూజ్యనిజాంశం
బిదె యనఁదగు రామునితో, నుదయించితివి వసుదేవు ✶ నుదవసితమునన్.

సీ. సురపితృభూతముల్ ✶ క్షోణీశు లెల్ల నెవ్వనిమూర్తు లగుదురో ✶ భవ్యపాద
పద్మముల్ గడిగిన ✶ పావనజలముల నెవ్వాఁడు లోకాళి ✶ నెల్లఁ బావ
నముగఁ జేయునో జగన్నాథుఁడు లోకైకగురుఁ డధోక్షజుఁడునై ✶ పరఁగునీవె
యోపరమేశ్వరా! ✶ యీపట్టునం బ్రవేశించితి వట్లౌటఁ ✶ జేసి మాగృ
తే. హములు మిక్కిలి భాగ్యవంతములె యయ్యెఁ
దనను సేవించుభక్త సంతతుల కెల్ల
కామములె కాక దన్ను నిక్కముగ నిచ్చు
వత్సలత భూషణంబుగ ✶ వఱలువాఁడు. ౨౯౪   2754

క. ఋతవచనుఁడు సుహృదుండును, గృతజ్ఞుఁడునుగా సతంబు ✶ నెసఁగెడు నిన్నుం
శతపత్త్రేక్షణ! వదలుచు, క్షితిఁ బండితుఁ డింక నెవనిఁ ✶ జేరి హితమతిన్. ౨౬

క. శరణమని వేఁడు దీనో, ద్ధరణా! వృద్ధిక్షయములు ✶ తలఁపఁగలేన
ట్టి రమానాథుని నిన్నే, శరణంబని యాశ్రయించు ✶ జ్ఞానబలమునన్. ౨౬

చ. అరిజనమర్దనా! దివిషదగ్రణి! సంతతికేనియోగమం
దురుతరనిష్ఠగల్గి మహిమోజ్జ్వలులై తగువారికే నదె
క్కరణిని గాంచరాకయె యఖండవిభూతి నెసంగునీవె యా
దరమున మాయదృష్టమున ✶ దర్శన మిచ్చితి మీగృహంబునన్. ౨౬౪   2757

ఆ. దార తనయ మిత్రధనదేహ గేహాది, మోహపాశరూపమునఁ జెలంగు
నీదుమాయ నిపుడె ✶ మాదెసఁ గనకుండఁ, దొలఁగఁ జేయవయ్య ✶ ధూర్తహరణ.

క. అనిభక్తుం డక్రూరుఁడు, వినుతించిన నవధరించి ✶ విశ్వేశ్వరుఁ డా
వనజాక్షుఁడు మాటలచే,తనె మోహం బందఁజేయఁ ✶ దలఁచినరీతిన్. ౨౭౪

క. స్మితమాస్యమున నటింప వి,హితవాక్కుల నిట్లుపలికె; ✶ నీవె గురుఁడవై
పితృసోదరుఁడవు సత ముప,కృతి చేసెడుబంధువు నయి ✶ యెసఁగుదు గానన్.

క. ఆపదలఁ దొలఁగఁ జేయుచుఁ, బ్రాపై పోషింపఁ దగినవారము మే మో
భూపాలక! దయనీయుల,మై పిల్లల మగుదు మెట్టు ✶ లరసిన నీకున్. ౨౯ 2761

క. మీవంటి పూజ్యతము లగు, దేవాధిపభక్తు లెల్ల ✶ తెఱఁగులఁ జూడం
సేవింపఁదగినవార ల,దేవేళల శ్రేయ మొంద ✶ నెంచుజనులచేన్. ౨౯౪   2762

క. సురలెల్ల స్వార్థపరులే, నిరతం బగుచుండ్రు సాధునికరము లటుగా
క రహిం బరులకు నుపకృతిఁ, బొరిఁబొరి నొనరించుచుంటఁ ✶ బూజ్యతమములౌ,

*క. జలమయములు తీర్థంబు లు, పలమృత్స్నామయులు సురలుఁ ॥ బావనతను,వే
కలిగింపలేరు సాధులు, గలిగింతురు చూచినంతఁ ॥ గరుణఁ దానిన్. ౩౦ 2764

క. నీ వెన్న మాసుహృదులన్, భావింపఁగ శ్రేష్ఠుఁడవయి ॥ భాసిల్లుట ని
ష్ఠే వారణావతమునకుఁ, బోవందగుఁ బాండురాజ॥పుత్త్రులఁ గనఁగన్. ౩౫

క. వారల కుశలముఁ జక్కఁగ, నారయఁదగు మేలుదాన॥నగు మాకని య
క్రూరా! తలఁపుము; తండ్రియుఁ, ధారణి విడిపోవఁ జిన్న॥తనమున వారల్.

క. ధృతరాష్ట్రుఁడు పిలిపింపఁగ, వెతలంబడు తల్లిఁగూడి ॥ ద్విరదపురికి నె
వ్వితమునన్ వచ్చి యట దుఃఖితులయి యున్నారు తమ్ముఁ ॥ గృత్రిము లేఁచన్.

క. అనివిందు మాంబికేయుఁడు, తన దుష్పుత్త్రకులమాటఁ ॥ దప్పక వినుచున్
గను లెఱుఁగనివాఁడౌటన్, దనయులవలె భ్రాతృపుత్త్ర॥తతులం గనమిన్. ౩౮

ఆ. ఆదరించువార ॥ లండొక్కఁడును లేమి, వగలఁ బొగులుచున్న॥వార లనుచు
వినితి మట్లుగాన ॥ వేగ నీవరిగి యీ, విధము నిజమొ కాదొ ॥ వేయిగతుల.

క. పరిశీలించి మహామతి, యరుదెమ్మా సుహృదయులకు ॥ నగునో సుఖ మే
కరణిఁ బ్రయత్నముచేసినఁ, ద్వరపడి యటుచేయుదు మని ॥ వనమాలియిటుల్.

తే. పలికి యక్రూరునిం బంపి ॥ భ్రాతఁ గూడి,యుద్ధవుఁడు వెంటరాఁగ సరోర్వోన్నతగుణ
గణవరిష్ఠుఁడు గావునఁ॥గార్య మెన్ని,యరుగుదెంచెను దనదు మం॥దిరమునకును.

---

నలువదితొమ్మిదవయధ్యాయము.

అక్రూరుఁడు హస్తినగరమునకుం బోవుట.

క. కురువంశవర! యశోంకిత!, కరిపురమున కేగి యతఁడు ॥ కౌరవనాథున్
సరిదాత్మజునిం గుంతి విదురు బాహ్లికు సోమదత్తు ॥ ద్రోణుని గృపునిన్. ౫

క. ఇనసూను సుయోధను ద్రౌణిని బాండునృపాలతనయ ॥ నిచయమ్మును ద
క్కిన సుహృదులఁ గనిమర్యాదను మీఱనియట్లు బంధు॥ధర్మ మెఱుఁగుటన్.

సీ. కుశలముల్ ప్రశ్నించి ॥ కోరి వారలు కుశలములఁబ్రశ్నింప సు॥త్తమవచస్సు
లలరఁగా బదులిడి ॥ యాగాందినీపుత్త్రుఁ డట దుష్టవృత్తుల ॥ నరయుపొంకుఁ
దాను వారింగూడి ॥ తగినట్లు తిరుగుచు నల్పసారుండు దుష్టాత్మజన్ముఁ [యు
డగుచు దుష్టుల యిష్ట ॥ మనుసరించుచునున్న యాంబికేయుని వృత్త ॥ మాత్మ నర

తే. చును నెలల్ కొన్ని యటనుండి ॥ సొరిదిఁ బాండు
తనయులకుఁ గల్గుతేజః ప్ర॥తాపబలము

---

* అక్రూరవాక్యము. "నహ్యమ్మయానితీర్థాని నదేవా మృచ్ఛిలామయాః, తేపునంత్యురు కాలేన దర్శనాదేవసాధవః" అని మూలము.

లను మహాస్త్రబలంబుల § ననుపమాన
సద్గుణములను బరికించి § చక్కనిగతి. ౪ 2774

క. వారలపైఁ బ్రజలకుఁ గల, సారతరప్రీతిఁ గాంచెఁ § జక్రికిఁ దెలుపన్
గోరి యతం డఁట మఱియును, భూరమణునిపుత్త్రకులు కుబుద్ధులు గానన్. ౫

చ. గరళము పెట్టి పాండవులఁ § గాలునివీటికిఁ బుచ్చనెంచి న్యా
యరహితకార్యముల్ మఱియు § నారసి చేసిన వానినెల్లఁ ద
త్పురమునఁ గుంతియున్ విమలబుద్ధియుఁ గార్యవిదుండు శాస్త్రవి
ద్వరుఁడు హితుండు నై సతము వర్ధిలు నవ్విదురుండు చెప్పఁగన్. ౬ 2776

చ. వినియె నెఱింగెఁ; గుంతియును § వీటికి నావసుదేవపుత్త్రకుం
డనుపఁగ వచ్చియున్న తనయన్నను గానఁగఁబోయి నెమ్మదిన్
దనజనకాన్వయంబు చరితల్ స్మరియించుచు నశ్రుబిందులే
శనికర నేత్రయై పలికె; § సౌమ్య! ననున్ జనకుల్ సహోదరుల్. ౭ 2777

క. అనుజాత లక్కలున్ ద, త్తనయులుఁ గులకాంత లల్లె § దయగలసఖులున్
నను నాబిడ్డలఁ దలఁతురె, యనఘా! మాయన్నపుత్త్రుఁ § డై రక్షకుఁ డై. ౮

చ. శరణముచొచ్చు భక్తులకుఁ § జక్కఁగఁ జోటునొసంగు ప్రోడయై
నిరుపమ సద్గుణంబుల ననింద్యవిభూతిని బెంపుమీఱు నా
హరియు సరోజనేత్త్రుఁడగు § నట్టిహలాయుధుఁడున్ స్మరింతురే
కరుణను మేనయత్త యనఁగాఁ దగు నాదుకుమారులం దగన్. ౯ 2779

సీ. వృకసంఘములలోన § నెట్లొ చిక్కినజింకవలె సపత్నులలోన § భవ్యరీతిఁ
జిక్కి సంతతము సుఖించించు నన్నును దండ్రిలేనట్టి నాతనయపంచ
కమ్మును మధురవాక్యమ్ముల శ్రీహరి యూఱడించునె యని § యొప్పుమీఱఁ
బ్రశ్నించి యంతట § భగవంతునింగూర్చి ప్రార్థించె నిట్లు; విశ్వాత్మ! విశ్వ

తే. భావనా! కృష్ణ! కృష్ణ! సర్వజగదధిప
యోమహాయోగినాయక! § యోమహాత్మ!
బాలకులతోడ నెన్నిదో § వగలఁబొగిలి
నిన్ను శరణముచొచ్చిన § నన్ను నబల. ౧౦ 2780

క. పరిరక్షింపుము మృత్యువు, కరణిన్ భవసాగరంబు § కనఁబడుచుండున్
నరు లద్దానికి వెఱతురు, పరమేశుఁడ వీవె యట్టివారిని గావన్. ౧౧ 2781

క. అపవర్గ మీయఁదగు నీ, దుపదాంబురుహాంబుకంబెఁ § దోఁపదు వేఱొ
క్కపరమశరణము దేవే, శపతీ! తలఁచితి మదాత్మ సత్యముగాఁగన్. ౧౨ 2782

సీ. ధర్మాత్మకుండయి § తలపోయఁగ నపరిచ్ఛిన్నుఁడై యలరారిజీవసఖుఁడు
నయి మఱి యణిమాదికైశ్వర్యయుక్తుఁడై జ్ఞానాత్మకుఁడునయి § సర్వవేత్త

యగుచు నొప్పుదు వంచు నమరులు కొనియాడు శ్రీకృష్ణు నిన్ను నాశ్రితవర
నాశ్రయించితి దేవతాధిపా! మ్రొక్కుదు ననికుంతి తమవారి నఖిలలోక[దుని

తే. పతిని శ్రీకృష్ణుని స్మరించి పట్టరాని
వగను మీప్రపితామహి వసుమతీశ
చంద్రమా! యట్టిపలవించె శాంతిలేమి;
విదురుఁ డక్రూరుఁడును జాల వెతలఁగాంచి. ౧౮ 2783

క. సురుచిరయశులొటఁ బృథా, తరుణీదుఃఖమ్ము సుఖముఁ దమరు సమముగాఁ
బరికించి యనుభవించుచు, నురుతద్దుఃఖమును బాప నూహించి తగన్. ౧౮౪

ద. తనయులు దేవతాంశములు బొలిచి పుట్టినవారు నీకుఁ జిం
తను గననేల యూఱడుము తల్లిరొ! యంచని; రంత గాందినీ
తనయుఁడు కృష్ణుచెంతకును దాఁ బయనంబయి దుష్టపుత్త్రకుల్
మనసుఁగలంపఁ దమ్మునికుమారులఁ గృత్రిమబుద్ధిఁ జూచుచున్. ౧౯౪ 2785

క. తానేమి చేయకుండిన, మానవపతికడకుఁబోయి మరల సుహృత్సం
తానము విన బంధుహితం,బై నెగడి సుహృన్మతంబునగు పద్ధతినిన్. ౧౬ 2786

క. పలికె సభామధ్యస్థితు, నిలాధిపుం గాంచి; కురునరేంద్రులు గడియిం
ప లలిం జెలంగు కీర్తిని, వెలయించెదు ప్రోడ నీవు విశ్వం బందున్. ౧౬౪

క. కనుకఁ విచిత్రవీర్యుని, తనయా! యనుజుండు పాండుధరణీపతి స్వ
ర్గనివాసమునకుఁ జనఁగా, జనపతిపీఠంబు నెక్కఁజాలితి విపుడే. ౧౭ 2788

సీ. ధర్మమార్గంబున ధారణిఁ బ్రోచుచు శీలము వెలయంగఁజేసి ప్రజల
కనురాగ ముదయించునట్టు లొనర్చుచు స్వజనులయెడ సమత్వంబు గలిగి
వర్తించుచుందువే భవ్యకీర్తిశ్రేయములఁ బొందఁజాలు; దట్టులుగఁ గాక
తక్కిన నపకీర్తిఁ దప్పక పొందుచు నరకమొందఁగలావు నరపతీంద్ర;

తే. కావునం బాండుపుత్త్రుల నేవిధమున
నీకుమారులఁ గందు వట్లె కడంగి
కాంతువే న్యాయసమ్మతిఁ గాంతు వెపుడు
ధరణిపాలక! జగమందు నరసి కనిన. ౧౯ 2789

క. ఎవరికి నెవ్వరితోడ న,నవరత సంవాసమొప్పు నాఁ దగుసుడి యె
ట్టివిధమునను జెల్లదుసూ, స్వవర్ష్మమును గూడి తనకెసావాస మిలన్. ౧౯౪

క. కలుగదు పో యింకఁ దనపుత్త్రులతోడఁ గళత్రముఖులతో నదియెట్లేఁ
గలుగునని చెప్పఁదగునే, యిలాధిపా! జంతు వొకఁడె యిటఁ బుట్టుఁజుమీ!

*క. తానొక్కఁడె మృతినొందును, గాని మఱొక్కరునిగూడి కాంచఁడు మృతినిం

* "ఏకః ప్రసూయతే జంతు రేకఏవ ప్రలీయతే, ఏకోఽనుభుంక్తే సుకృత మేక ఏవచ దుష్కృతమ్." అని మూలము.

గానఁడు పుణ్యము పాపము, తా నొక్కఁడె చేయు ఫలముఁ ఽదానె గనియెడున్

క. ఇతరుం డీవిషయంబుల, జతగూడఁడు; కౌరవేంద్ర! ఽ చక్కనధర్మా
ర్జితమగు ద్రవ్యము పుత్త్రులు, సతులను బహురూపనామ ఽ సంతతిమిషచేన్.

క. పలువురు హరింత్రు మత్స్యం,బులకున్ జీవనములైన ఽ పుష్కరములఁ బె
క్కులు తక్కినమత్స్యంబులు, చెలఁగుచు హరియించుగతిని ఽ సిద్ధం బిదియా.

సీ. ధర్మమార్గంబును ఽ దప్పి విత్తంబును దా నుపార్జించి యఽద్దానిచేతఁ
దనవారలను భ్రమంఽబునఁ గష్టపడి ప్రోచి నట్టిపుత్త్రులు భార్య ఽ లర్థములును
బ్రాణముల్; భోగమ్ము ఽ వదలినయానీచు నయ్యవిద్వాంసుని ఽ నంతమందు
వదలిపెట్టును జుమీ;ఽవరుస విత్తముఁగూర్పఁ బాపమ్మొనర్చి ద్రఽవ్యంబుదానిఁ

తే. గొనుచుఁ బుత్త్రాదులున్ దన్నుఁ ఽ గొనక వదలఁ
గా సహాయం బొకండు లేఽకయె రవంత
యేని పరమార్థ మిదియని ఽ యెఱుఁగలేక
కోర్కె యొద్దిఫలింపమిఁ ఽ గుంది నొంది. ౨౩౪　　　　2795

క. తనధర్మమందు విముఖతఁ, గని తిరిగెడు మూఢజనుఁడు ఽ కడు ఘోరంబై
కనఁబడు నంధంతమసున, ననిశము పడియుండుఁ గాన ఽ నవనీనాథా! ౨౪

క. తలపోయఁగ లోకం బిది,కలతోడన్ మాయతోడఁ ఽ గడువర్థిలు కో
ర్కెలతోడఁ దుల్యమని యి,మ్ముల నెంచుచు నింద్రియములఽబాగ రడఁచుచొగిన్.

క. తననుం దానే నియమం,బున నుండంజేసికొని సఽముండుగ వర్తిం
పను నేర్చి శాంతిఁగనఁదగుఁ, గనుకన్ నీవట్లు చేయఁఽగాఁ దగు రాజా! ౨౫

చ. అనుటయుఁ గాందినీసుతుని ఽ యప్పలుకుల్ విని యాంబికేయుఁ డి
ట్లనియెను సౌమ్య! దానపతి! ఽ యాయమృతంబును బొందినట్టి మ
ర్త్యునివలె మంగళంబు నిడి ఽ యొప్పిదమైతగు నీదువాక్సుధన్
గొనకొని యెన్నివారములు ఽ గ్రోలినఁ దృప్తియుఁ దీఱకుండెడున్. ౨౬　2799

సీ. పుత్త్రానురాగంబుఁ ఽ బొందుట విషమమై చంచలత్వమ్మును ఽ జాలఁగనిన
నామనంబున సౌమ్య! ఽ నీమాటలివ్వి సుదామనామకమహీఽధరమునందుఁ
బుట్టిన విద్యుత్తు ఽ భూరితరస్ఫటికశిలామయంబుగఁ ఽ గ్రాలునందె
మించి ప్రకాశించి ఽ యంచితగతి నడంగినయట్లు నిల్వక ఽ చనియెడు; శ్రుతి

తే. భారహరణార్థ మాయదుఽవంశమందు
నవతరించిన యీశ్వరు ఽ నాజ్ఞ నెవ్వఁ
డెట్లు తప్పింపఁగాఁజాలు ఽ నెన్నిచూడ
శక్యములుగాని త్రోవలఁ ఽ జనును మాయ. ౨౭　　　　2800

క. అల మాయాయోగంబున, లలితవిలాసమున జగముఽలన్ బుట్టింపం

గలిగి యటఁ జొచ్చి కర్మం,బులఫలముల వేఱువేఱఁ బోల నొసఁగుచున్. ౨౮౪

క. మనమున నూహింపఁ దరం,బునుగాని విహారమునఁ బ్రభూతవిభూతిం
గొని భవచక్రముఁ ద్రిప్పెడు, ఘనునకుఁ బరమేశ్వరునకుఁ గైమోడ్తుఁ దమిన్.

క. అని పలికెడు ధృతరాష్ట్రుని, మనమునఁగల భావ మెఱిఁగి మాధవుకడకుం
జననెంచి మిత్రవర్యుల, యనుమతి నక్రూరుఁడొంది యపుడె పయనమై. ౩౦

క. అరుదెంచె నంతమథురా,పురమున కట రాముఁ గృష్ణుఁ బొడఁగాంచి మహీ
వరుఁ డప్పాండుకుమారులఁ, బరికించెడురీతిఁ దెలిపి పలికెఁ మఱియున్. ౩౦

క. నను నేటికిఁ బంపితివో, వనజాక్షా! యందుఁ గన్నవర్తనముల నె
ల్లను జెప్పితి నని గాందిని, తనయుం డెఱిఁగించె నుంత దాఁపక భక్తిన్. ౩౧

క. శ్రుత్యంతప్రతిపాదిత, నిత్యమహైశ్వర్య! మానినియతార్చిత! జ
న్మాత్యయరహితా! మాయా, కృత్యనురక్తా! పరేశ! కేశవ! నృహరీ!

ఉ. స్థావరజంగమాత్మక విశాలసరోజభవాండసర్వతః
ప్రావృతదివ్యతేజ! చతురాననపంకజనేత్ర! శూలభృ
త్పావకసూర్యశీతరుచిపాకరిపుప్రముఖస్వరూప! లో
కావనదక్ష! భక్తహృదయాంబుజవాస! నిరంజనా! విభూ!

మాలిని. నిరుపమగుణజాలా! నిర్మలానందశీలా!
వరమునితతిలోలా! భర్మభారమ్యచేలా!
కరతలధృతశైలా! కాలజీమూతనీలా!
హరిముఖసురపాలా! హరిగోపాలబాలా!

గద్యము. ఇది శ్రీమత్త్రిపురసుందరీకరుణావాప్తగీర్వాణాంధ్రకవితాప్రాభవ, కాశ్వపాన్వయప్రభవ, శ్రీజనమంచివంశాంబురాశికుముదినీమిత్ర, సుబ్రహ్మణ్యమనీషిపుత్త్ర, తాండవకృష్ణాపరాభిధేయ, శేషాద్రినామధేయవినిర్మితం బైన శ్రీతాండవకృష్ణభాగవతంబునందుఁ బూర్వభాగము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ



శ్రీ ర స్తు.

# శ్రీ తాండవకృష్ణభాగవతము

## దశమస్కంధము

### ఉత్తరభాగము

ఏఁబదియవ యధ్యాయము.



శ్రీనారదముఖ్యామర
మౌనీంద్రసమర్చితా! సమస్తశ్రుతి సం
తానసుత! దివ్యమహిమా!
శ్రీనిలయా! దివ్యరూప! । శ్రీరాధేశా!

**జరాసంధుఁడు మథురాపురము నరికట్టుట.**

వ. మహాప్రభూ! తరువాతివృత్తాంతం బవధరింపుము. పరీక్షిన్నరేంద్రునకు ననంతరకథాకథనపరాయణుం డై శుకయోగీంద్రుం డి ట్లనియె.

చ. భరతకులర్షభా! వినుము । భార్యలు కంసున కస్తి ప్రాప్తి నాఁ
బరఁగెడువార లిర్వురును । వర్తిలుచుండి రనూనసంపదన్;
హరి తమనాథునిం దునుమ । నత్యధికంబగు దుఃఖ మేఁచఁగా
నరిగిరి తండ్రియింటికి మహాపదఁ దెల్పఁగఁ జింతఁ గూర్పఁగన్. ౧ 1

క. వగ పంతకంత కుబ్బఁగ, మగధావనిపాలుఁ డై సమస్తవిధములం
దగిన జరాసంధున కిమ్ముగఁ దమకున్ విధవత యెటు । పొసఁగెనో దానిన్. ౨

క. వదలకయుండ వచించిరి, మదపౌరుషములఁ జెలంగు మాగధుఁ డట్లా
సుదతులవలనఁ దదప్రియము దగన్ విని శోకరోషములు పెనఁగొనఁగన్ ౨౪

చ. క్షితిపయి యాదవాన్వయము । క్షీణత నొందఁగఁజేయఁజాలు ను
న్నతమగుపూన్కిఁ బూనె; జననాయక! యవ్వల మాగధావనీ
పతి పరవీరులన్ గెలుచుపంతము దీర్పఁగ వీరవారముల్
జతనముమీఱ రాఁ జనియెఁ । జక్రినివాసము ముట్టడింపఁగన్. ౩౪ 4

క. ఇరువదిమూఁ డక్షౌహిణు,లురుజవ మలరంగ రాఁగ । నుర్వీపతి శ్రీ
హరివాసమైన మథురా,పురవరమున్ ముట్టడించెఁ । బూనిక మెఱయన్. ౪ 5

క. నలుదెసల నొక్కరీతిగఁ, జెలియలికట్టం ద్యజించి । చెచ్చెఱ భూమీ
వలయము ముంపఁగఁ బొరలిన, జలనిధివలె నడ్డగించె । సేనలతోడన్. ౪౫ 6

చ. తననగరంబు నక్కరణి । దర్పముచే నరికట్టినట్టి దు
ర్జను నభియాతిఁ దానెఱిఁగి । సర్వవిదుండగు చక్రి స్వీయులౌ
జనులు భయాతిరేకమున । స్వాంతము లార్తి దగంగనుంట నె
మ్మనమున నెంచి భూభరము।మానుచు కారణమూని తా భరన్. ౫౫ 7

క. అవతారమందుటయు నొక్క విధిం దలపోసి దేశ।కాలానుగుణం
బవితథము నైనగతిఁ దన, యవతారఫలంబుఁ గూర్ప । నాత్మం దలఁచెన్. ౬ 8

ఉ. తా నొనరింపఁగాఁ దగిన । తత్సమయోచితకార్య మేదియం
చానళినాయతాక్షుఁ డెద । నప్డు తలంచుచు నిశ్చయించె; ని
ట్లీనృపసేనలం దొలుత।నే పొలియించెద వీని కట్టలో
నై నరనాయకుల్ తమమ।హాబలముల్ గొనివచ్చి రిత్తఱిన్. ౭ 9

క. ధరణికి భారముగాఁదగు, గురుసేనల వీనినెల్లఁ । గూల్తును; రథకుం
జరహయభటసంకుల మీ, పరసైన్యము జనులకెల్ల । భయదంబు నగున్. ౭౫

క. ఇరువదిమూఁ డక్షౌహిణు, లరయఁగ నీసేనలున్న । వట్లౌటను నేఁ
బరిమార్తు వీని మాగధుఁ, దరుణంబున; నిందుఁ జంపఁ।దగ; దితండున్. ౮ 11

మ. మరలన్ సేనలఁ గూర్చుకొంచు మథురన్ । మర్దింప నేతెంచు ని
క్కరణిన్ వారలఁ జంపవచ్చు నిదియే।కార్యంబు; భూభారముల్
హరియింపన్ జనియించినాఁడఁగద యా।కార్యస్తోమముం గాఁచుటల్
దురితాత్మప్రజముల్ వధించుటయుఁ దోడ్తో ధర్మరక్షావిధుల్. ౯౫ 12

మ. కొనసాగించుట యట్లధర్మమును నీ।క్షోణిన్ సమూలంబుగాఁ
గను విధ్వంసముచేయుటల్ తలఁపఁగాఁ । గార్యమ్ములౌ నాకు; నీ
తను వీకార్యములం బొనర్పఁగనె సం।ధార్యంబు గానయ్యె; నిం
కను గల్గంగల కార్యజాలముల దీ।క్షం దీర్పనౌ నిమ్ములన్. ౧౦ 13

చ. అని యిటు లెంచుచుండ నపు । డంబరమధ్యమునుండి సూర్యకాం
తి నడఁచు తేజమొప్పఁగను । దివ్యరథంబులు రెండు యుద్ధసా
ధననికురుంబముల్ వెలయఁ । దక్షణమే వరసూతయుక్తి వ
చ్చెను; రథయుగ్మమందు నటఁ । జిత్రపురాతనశస్త్రముఖ్యముల్. ౧౧ 14

క. నిరుపమములు దివ్యములును, బరభంజనచణములు నయి।భాసిల్లఁగ శ్రీ
హరి వానిన్ సంకర్షణుఁ, బరికింపు మటంచుఁజూపి । పలికె నయమునన్. ౧౨

చ. కనుఁగొను మార్య! నీవె, కడ।గండ్లను బాపుచుఁ బ్రాపుగాఁ దగన్;
మనియెడు యాదవావళిని । మైకొనియెన్ వ్యసనంబు లో ప్రభూ!

యనుపమయుష్మదీయరథ । మల్లదె వచ్చె నభంబునుండి దీ
నిని గనుమా ప్రియంబులయి । నీవుధరించెడు నాయుధావళుల్. ౧౩ 16

క. పరికింపు మవిగొ యీరథ, వరముల్ శీఘ్రంబ యెక్కి । వాహినులను సం
గరమునఁ బొలియించి విపత్పరంపరం గుందుస్వజనపటలము దయతోన్. ౧౪

క. కరుణమెయి నుద్ధరింపుము, పరోపకారులకు నెల్ల।భద్ర మొసఁగుమా
పరమేశ! యేతదర్థమె, నరలోకమునన్ జనించినారము గాదే. ౧౫ 18

క. ఇరువది మూఁడక్షౌహిణు,లురుభారము భూమి విడుచు । నొప్పెడు వీనిం
బరిమార్చి పృథ్వివెతలన్, గరుణమెయిం దీర్పవయ్య । కడుఁ బూనికతోన్. ౧౬

చ. అనియిటు లన్నకుం దెలిపి । యాతఁడు సమ్మతిఁజూపఁ జక్కఁగా
మనములఁ గార్యభారమును । మాన్పఁగ నెంచుచుఁ గత్తళంబులం
గొని ధరియించి యల్పముగఁ । గూడినసేనలఁగూడి యప్డు స్యం
దనములనెక్కి యాయుధగణంబులఁ దాలిచి పూన్కిఁ దీర్పఁగన్. ౧౭ 20

తరళవృత్తము.—

పురమువెల్వడి; యంత వేడుకఁ । బూరుషోత్తముఁ డుల్లస
ద్దరము నొత్తెను దారుకుండు రథంబుఁ దోలఁగ రోహిణీ
వరుఁడు శంఖము నొత్తె దానను । వైరిసేనలగుండియల్
కరము వేపథు నొందె నయ్యది । గాంచి మాగధుఁ డుద్ధతిన్. ౧౮ 21

*సీ. వచ్చెడువారలఁ । బరికించి హరితోడ నివ్విధిఁ బూన్కి వచించెఁ బూరు
షాధమా! సందర్శనానర్హరూపుఁడా! నీవ మందుఁడ వౌదు । నీవ బంధు
హనన మొనర్చినయట్టిప్రోడవు గాన నీతోడనిప్పు డసీక మేను
జేయఁగా నొల్లను । జిన్నవాఁడవె కాక యొక్కరుండవు నోటయుద్ధ మొనరు

తే. పంగ సిగ్గయ్యెడిని వోలఁగంగఁ దగును
నీకు దూరంబుగాఁగ జని యిది యిట్టి
దగును; రామా! రణంబు చేయఁగను శ్రద్ధ
గలిగినం బోరుమా ధైర్యకలితుఁడ వయి. ౧౯ 22

చ. పరుగిడరాదు పోరునెడ । భారతరాస్మదిషువ్రజంబు ని
ర్భరగతి నీశరీరమును । బైపయిఁ జీల్పఁగ దానివీడి స్వః
పురమున కేగుమా; శరసమూహమునన్ నను నొంపఁ జాలుదే

* "హేకృష్ణ పురుషాధమ, గుప్తేనహి త్వయా మందనయోత్స్యే యాహి బంధుహన్" అని మూలము. "పురుషాఅధమాయస్య" అనిసమాసము. గుప్తేన. సర్వాంతరత్వాద్దర్శనాసక్తేన. హేఅమంద. బధ్నాతీతిబంధుః అవిద్యా. తాంహంతీతి. అవిద్యానిరాసనేతి." వ్యాఖ్య. ఈయర్థసార మీపద్యమునఁ గలదు.

మరణముఁ గూర్పుమా యిచట § మాటలు పెక్కులేక నేల యం చనన్. ౧౯ 23

చ. వనరుహనేత్రుఁ డిట్లనియెఁ § బౌరుషముం గడుఁజూపుచుండు శూ
రనికర మంతెకాని సమరంబున బింకములాడఁబూన రో
జనవర ! యాతురుండవయి § చావఁదలంచుచునున్న నీదును
క్తినిచయ మేము గైకొనము § ధీరులమాటలె మాకు గ్రాహ్యముల్. ౨౦ 24

ఉ. అంతట నాజరాతనయుఁ § డాగ్రహమే తనుఁ బొందఁజేయ దు
ర్దాంతబలంబుతోడ ధ్వజరాజి మహారథవాహనాశ్వముల్
దంతి గణంబు సారథులు § తన్నొగిఁ గొల్వఁగ గొప్పసేనతో
నెంతయు వేగ సోదరుల § నిర్వురఁ జుట్టుకొనెం జలంబునన్. ౨౧ 25

చ. అనిలుఁడు మబ్బుతోడఁ గమలాప్తుని రేణుతతిన్ ధనంజయున్
గనుఁగొనరానిచందమునఁ § గప్పెడురీతిగఁ దోఁచె నద్ది; నం
దునితనయుండు రాముఁడును § దోరపువేడుక నెక్కియున్న స్యం
దనములు వారియావృతినిదర్శనయోగ్యము లయ్యె నత్తఱిన్. ౨౧౪ 26

క. గరుడధ్వజంబుగల యా, హరిరథమును దాళకేతనాంచితమగు రా
మురథంబును గనఁజాలక, దురమును గనువేడ్క నగరతోయజనేత్రల్. ౨౨

ఆ. హర్మ్యములను గోపురాట్టాలకంబుల, నెక్కి యుంట శోక § మేఁచ నపుడె
సొమ్మసిలిరి; హరియు § సిమ్మాడ్కిఁ బరసైన్య, జలదపంక్తి మిగుల § సంతసమున.

క. తనసైన్యము శరమయవృష్టిని ముంచుచుఁ బీడనొందఁ § జేయఁగఁ గని యా
ర్తిని బాపనెంచి విబుధులు, దనుజులునుం బూజచేయఁ § దగుశార్ఙ్గంబున్. ౨౨౪

క. త్వరపడి గ్రహించి మిగులన్, మెరయించె; నిషంగవర్యమున నుండి శరో
త్కరమును గైకొని యుత్తమ, శరాసనమ్మునను గూర్చి § శౌర్యము పొంగన్.

క. ఆకర్ణాంతము జ్యాలతి,కాకర్షణ మాచరించి § యట్టె శితశరా
స్తోకమహాగ్నులఁ బరపెన్, జీకాకుపడంగ శత్రుసేనలు వెలుచన్. ౨౩౪ 31

ఆ. ధనువలాతచక్ర § మన గుండ్రముగఁ గానఁ
బడుచునుండ దంతివరము లశ్వ
ములును స్యందనములు § బలములు తెగిపడఁ
జేయుచుండె సురలు § చేరి చూడ. ౨౮ 32

సీ. కుంభస్థలంబులు § క్షోణిపైఁ దెగిపడఁ గరులు; శరచ్ఛిన్నకంధరమ్ము
లగుచు హయంబులు § హరవాహనధ్వజరథికసారథులొచు § రథవరములు
విచ్ఛిన్నదోఃకంఠ § వితతులై కాల్బలములును మ్రందెను; హరి § యలఘుబాణ
ములు వైవ నీరీతి § నిలఁబడియున్నట్టి కరిఘోటకపదాతి § గణతనువుల

తే. నుండి వెలువడుచున్నట్టి ఽ యుగ్రరక్త
పూరములు శైవలినులను ఽ బోలిపాఱె;
బాహువులు సర్పములుగాఁగ ఽ వైరివీర
శీర్షములు కచ్ఛపములుగఁ ఽ జెలఁగుచుండ. ౨౬ 33

క. హతకరిగణములు ద్వీప,ప్రతతులుగా నిహతవాజిఽరాజియు గ్రాహా
కృతిగాఁ గరములు మీనవి,తతులుగ శైవలము లట్లు ఽ తగఁ గేశంబుల్.౨౬౪

క. ధనువులు తరంగములుగా, ఘనశస్త్రాస్త్రాదికములు ఽ కడువడి నీటం
జనుచున్న గుల్మములుగాఁ,గను; జర్మములెల్ల సుళ్లుఽగా భయదములై. ౨౭ 35

చ. వరమణిభూషణోత్కరమె ఽ వాలుకలై యుపలోత్కరంబులై
పరువడిఁ బాఱుచుండఁ గనుఽపట్టెను భీరుభయంకరమ్ముగా
నిరుపమవిక్రమాఢ్యులకు ఽ నిర్భరహర్షకరంబుగా; మహా
త్తర రణరంగ మయ్యెడ నిఽతాంతము ఘోరము మంజులంబునై. ౨౭౪ 36

క. ఇరుదెగలకుఁ గనుపట్టె; న,పరిమేయమహాప్రతాపఽభాసురుఁ డగుచున్
హరి సోదరుండు రాముఁడు, పరులన్ ముసలాయుధమున ఽ బల్విడిఁ ద్రుంచెన్.

సీ. జలరాశిభంగి ఘూఽర్ణిలుచు జరాసంధపాలితంబగుచు దుఽష్పార మగుచు
దుర్గమంబును బరఽవర్గభైరవము నౌ సైన్య మయ్యది కేళిఽచందముననె
విక్రమించుచు మహాఽవీరులౌ వసుదేవతనయులచేఁ బ్రపంఽచనిచయపరి
పాలకవరులచే ఽ నోలిఁ బరిక్షీణముగఁ జేయఁబడియె; నిఽప్పోల్కిఁ గృష్ణుఁ

తే. డరులఁ ద్రుంచుట చిత్ర మెఽవ్వరుసగాదు
స్వీయలీలలు కనఁబడఁ ఽ జేయఁబూని
త్రిజగములకును సృష్టియు ఽ స్థితియు నంత
మును దగంగూర్చుచున్ సర్వఽము గనుఁగొనుచు. ౨౮౪ 38

క. అనుపమ సకలగుణంబుల,కును దానే దావలమయి ఽ కోర్కు లొసఁగుచుం
దనయంత దానెయై తగు, వనజాక్షుఁడు శత్రువీరఽవార మడఁచుటల్. ౩౦ 39

క. పరికింపఁ జిత్ర మెటులౌ, నరరూపముఁ దాల్చి దానిఽనైజము నెల్లన్
బరులకుఁ గనఁబఱచుట శ్రీ,హరికృత్యము వర్ణ్య మయ్యె ఽ నవనీనాథా!. ౩౦ 40

చ. తనబలముల్ క్షణంబున హఽతంబులుగాఁగ మహాగ్రహంబునన్
వనరుహనేత్రు సోదరు నఽవార్యపరాక్రముఁ దాఁకి యంతలో
నన విరథుండునై తనయఽనంతబలం బటు వ్యర్థమైన నే
మనుటకుఁ దోఁపకున్న జరఽయాత్మజునిం గని విక్రమంబునన్. ౩౦౪ 41

చ. హలధరుఁ డత్యుదగ్రమగు ఽ నట్టిప్రయత్నముచేత సింహముం
గలహమునన్ జయింప నొకఽగంతున సింహముపైఁ బడంగ ని

మ్ములఁ జనురీతిగా స్వరథశ్రేణుల్ వడి డిగ్గి బలంబు పొంగఁగాఁ
జలమునఁ బట్టె; నాబలుని § సాహసముం గని యమ్ముకుందుఁడున్. 3० 42

*ఉ. వైరివిదారణక్షముని § వారుణపాశముల౯ దగిల్చి యెం
తేనయ మెప్పుఁగా మనుజు § లేర్పెఱఁ గట్టెడు రశ్మిసంతతి౯
గోరికఁ గట్టి చంప మదిఁ గోరెడు నన్న తలంపెఱింగి యా
దారుణకార్య మాఁపుటకుఁ § దాఁ దలపోసెను నేర్పుమీఱఁగన్. 3०౪ 43

తే. భావికార్యము లీతనివలనఁ గలుగఁ
గలవు; పలుమాఱు లీతండు § బలములఁ గొని
వచ్చు వాని వధింప భూభార మడఁగుఁ
గొంతయేఁ గాన వధియింపఁ గూడ దితని. 3౨ 44

చ. అనితలపోసి చంపఁ దగదంచు హలాయుధుకృత్యమాపి యా
తని విడిపించె; మాగధుఁడు § త న్నిటులోకపతుల్ విముక్తుఁ జే
య నలముకొన్న లజ్జ నభియాతిభయంకరుఁ డయ్యు వీరులుం
దనుఁ గొనియాడ నొప్పియును § దత్కృతికిం బ్రతిచేయు గోరికన్. 3౨౪ 45

చ. వనమున కేగి నిష్ఠ మెయి § వాంఛలు తీర్పఁగఁ జాలు సత్తపం
బును విధిఁజేయ నెంచి యటు § పోవఁగఁ ద్రోవకు నడ్డమై జరా
తనయుని మిత్రులైన నృపతల్లజు లాపుచు దైవతంత్ర మొ
య్యనఁ దముఁ బ్రోత్సహింప నిటు § లత్తఱిఁ బల్కిరి నేర్పుమీఱఁగన్. 33 46

సీ. అత్యంతచిత్ర శబ్దార్థముల్ గల్గిన వాక్యమ్ము లవ్వి యివ్వాడువునఁ దగ
నార్య! యల్పులవంక § నధికునకుం బరాభవముగల్గుటయు దైవబల మెన్న
నధిక మంచని తోఁచు § నరయఁగా నిజకర్మబంధముచేత నెవ్వారికేఁ బ
రాభవ మొనఁగూడు రాదు మాన్పఁగ దాని దైవతంత్రము దాఁటఁ దరముగాదు

తే. నీ వెఱుంగవె యిదని యనేకలోకి
కోక్తులను బల్కి వారించి § రొక్క మొగిని;
యదువులనెఱుంగుఁ గావున § నదియు నతని
కప్పటికి న్యాయమేయని § యాత్మఁ దోఁచె. 3౮ 47

క. ఆవల బార్హద్రథుఁ డన, భూవినుతిం గన్న మగధభూపాలుం డ
ట్లావాసుదేవుఁ డూరక, పోవిడిచిన దుర్మనుఁడయి § పోయె నగరికిన్. 3౯ 48

క. బలములు హతములు కాఁగాఁ, జలహానియె చొచ్చెఁ దనదుజనపదమును; శ్రీ
జలజాక్షుం డక్షతనిజ, బలుఁడై రిపుబలమహార్ణవము దాఁటి తగన్. 3౯౪ 49

* "వధ్యమానం హతారాతిం పాశైర్వారుణమానుషైః" అని మూలము. "వారుణైర్నాగాది భూపైః మానుషైః రజ్జ్వాదిభిః" అని వంశీధరి.

చ. సురవరు లద్దిరా! యని ప్రసూనములం గురియింప, మెచ్చుచుం
బురజనులెల్ల మోదమునఁ బొంగెడునాత్మలఁ దన్నెదుర్కొనన్
గరముల నెత్తి మాగధనికాయము వందిగణంబు సూతులున్
నిరుపమగేయసంతతి వినిర్మలమౌ విజయంబుఁ బాడఁగన్. ౩౭ 50

చ. హలధరుఁగూడి మిత్రగణ మాదృతి వెంబడిరాఁగఁ బత్తనం
బెలమిని జొచ్చె; శ్రీహరి యభీష్టదుఁ డివ్విధిరాఁగ శంఖభే
రులును మృదంగదుందుభులు రూఢికి నెక్కిన తక్కుతూర్యముల్
బలువిడి మ్రోఁగె వేణుముఖవాద్యరవంబులు చక్కఁగాఁ దగెన్. ౩౭౪ 51

చ. మనమున వానిమెచ్చుచును మార్గములం గయిచేసి భూరికే
తనముల నెత్తి సంతసము తమ్ముమఱింతగఁ బ్రోత్సహింపఁగా
జనులొగి నిల్చియుండ శ్రుతిసంతతినాదము నిర్భరంబుగాఁ
దనరఁగఁ గౌతుకాతిశయతన్ మణితోరణపంక్తి గట్టెఁగన్. ౩౯. 52

సీ. మానినీమణు లొగి మాల్యదధ్యక్షతాంకురములఁ జల్లుచుఁ గూర్మి నెఱపు
కనుఁదమ్ములొప్పంగఁగరము స్నేహంబుగఁదనుఁజూచుచుండఁజొచ్చెను;రణంబు
నందు నార్జించిన యర్థంబు వీరులభూషణంబులు యదుభూపవరున
కాయుగ్రసేనున కర్పించె దా నెల్లజగములకుం బ్రభుసత్తముఁడయి

తే. యొప్పియుండియు నాచారమూని, యంత
నాజరాసంధుఁ డపజయ మాత్మ నేఁచ
మరల నక్షౌహిణుల మున్నుమాడ్కిఁ గూడి
వచ్చి రణమొనరించి యవ్వరుస నోడి. ౪౦ 53

క. మరలం జని మఱియు బలోత్కరములఁగొని వచ్చి యుద్ధధరణికి బలియి
చ్చి రయమ్మునఁ జని యివ్విధి, జరకొమరుఁడు పదియు నేఁడుసారులు పూన్కిన్.

క. అనిచేసి కృష్ణపాలితు, లనఘులు నగుయదునృపాలు రత్యుద్ధతి స్వీ
యనిఖిలసేనలఁ గూల్పఁగఁ, జనుచుండెఁ బురంబుచేర సంతస మాఱన్. ౪౨

క. హరితేజము తోడుపడన్, బరాక్రమముమీఱ వృష్ణివరులు పరబలో
త్కరముల నడంచి రంతట, జరాసుతుం డీర్ష్యపూని స్వబలనిహతికై. ౪౨౫

క. మనమునఁ గుందుచు హరిబలు, లని మొనఁ దన్నున్ జయించియట్టెవిడువఁగాఁ
జని పదునెనిమిదవ తడవ, నని చేసి యదెట్టులైన యాదవవరులన్. ౪౩ 57

క. అపజయ మొందించి యదె, ట్లొ పరమయశ మొంది వెలయనూహించి సువీ
రపటలమును జేకూరిచె, విపరీతఫలంబు గోరి విషయవశుం డై. ౪౩౫ 58

మ. అనిసేయంగఁ బ్రయాణతత్పరతమై నామాగధుండుండు నం
త నిలింపర్షి యనంగ ఖ్యాతిగనుచున్ నానాప్రకారంబులన్

జనులఁ ముక్తులఁజేయు నారదుడు కృష్ణస్వామి మూలంబునం
దనువుం బాయఁగ నున్నయయ్యవనభూనాథుఁ రణోత్సాహునిన్. ॥ 59

చ. కనుఁగొని వీరవర్య! యదుకాంతులు విక్రమధుర్యలంచు మే
దిని బొగడొందువారు జగతింగల శూరులలోన మేటి వీ
వనియె యెఱుంగుదుఁ గదనమందు మహాద్భుతవిక్రమంబు చూ
పనుసమయం బిదోఁగద, విపక్షుల గెల్వకయుండఁ జెల్లునే?. ॥ 60

చ. యదువులగెల్చినం గలుగు నాయతకీర్తియశంబులంచు నా
రదముని ప్రోత్సహింపఁగ ధరం దనయంతటివారు వృష్ణులే
గద యనువార్త వీనుల నికామము బ్రద్దలుచేయ నోర్వలే
క దను రణాంగణంబున నొకం డెదిరింపఁగలాఁడు కల్గినన్. ॥ 61

ఉ. ఊరకయుండవచ్చునె? మహోద్యమ మొప్పఁగ వానిఁగిట్టి దు
ర్వారపరాక్రమం బలర వారిజమిత్రునిసూతి గేహముఁ
జేరఁగఁబంపు టొప్పు నని చిత్తమునం దలపోసి లోకమం
దేరుఁ దనంతవార లను టేర్పడ నోర్వనివాఁడు గావునన్. ॥ 62

తే. మూఁడుకోటుల మ్లేచ్ఛులఁ గూడి వచ్చి
మథుర నొక్కట నరికట్టె; మాధవుండు
హాలధరుంగూడి చింతించె నప్పని కెటు
బదులుచేయంగ నగునని పలువిధముల. ॥ 63

చ. కటకట! వృష్ణివీరులకు గాఢతరంబగు దుఃఖ మిట్టు లొ
క్కట నిరువంకలం గలిగెఁ గాని యిదెంత యనంగరాదు సూ;
పటుతరశక్తి మ్లేచ్ఛనరపాలకుఁ డీయవనుండు పత్తనం
బిటు కడుముట్టడించె జనులెల్ల మహార్తిని గుందుచుండఁగన్. ॥ 64

చ. అతిబలశాలి వీఁడు, మగధావనిపాలుఁడు నేఁడొ రేపొ యు
ద్ధతిమెయి రాఁగలండు నియతంబుగ నమ్మఁగునాఁడొ వచ్చు నీ
క్షితిపతితోడ సంగరముచేయుచు నుండఁగ మాగధుండు వీ
రతతులఁగూడి వచ్చిన భరంబగు సంగర మెన్నిచూచినన్. ॥ 65

ఉ. వచ్చెడు నాజరాసుతుఁ డవార్యపరాక్రమశాలి యీసునం
జొచ్చి వరూధినిం గలఁచి శూరులబంధువులఁ వధించు, లే
కిచ్చమెయిఁ స్వకీయపురికేనియు బల్మిని గొంచుఁబోవు లో
హెచ్చు పరాభవజ్వాలనుఁ దేఁచుట న్యాయముఁజూడఁ డింతయున్. ॥ 66

చ. కనుకనె యిప్డు మర్త్యులకగమ్యముగాఁ దగుదుర్గ మొండు నే
ర్పున జలరాశిలో నడుమఁ బొంకముగా రచియింత మందుజ్ఞా

తినికరమంతయున్ నిలిపి తీవ్రమతిందగు మ్లేచ్ఛవీరు నీ
తని బొలియింత మంచు మురదానవసూదనుఁ డగ్రజన్ముతోన్. ౪౯ 67

తే. చక్కయోజించి వే ద్వాదశమితములగు
యోజనమ్ములయంత దవ్వొప్పు దుర్గ
మబ్ధియంతరమున విచిత్రాకృతిఁ దగు
నట్లు నిర్మింప శిల్పికి నాజ్ఞ యిడియె. ౫౦ 68

సీ. విశ్వకర్మయు మహావిష్ణునానతిఁ దలఁదాల్చి సంద్రంబు నంతరమునందుఁ
బురము నిర్మించె నైపుణ్యము మెఱయంగ వీథులు చత్వరవితతి రథ్య
లెవ్విధి వాస్తుశాస్త్రేష్టమా నట్టులె; నగర మయ్యది చూడఁదగి చెలంగెఁ;
గల్పద్రుమంబు లనల్పపుష్పోల్లసద్వీరుద్వ్రజంబులు వెలయుచుండఁ

తే. జిత్రములగు నుద్యానముల్ సిద్ధఫలము
లెపుడు తగియుండ నెంతయు నెసఁగుచున్న
యుపవనంబులు నందొప్పుచుండె; మఱియుఁ
జారుసౌధంబు లొప్పారెఁ జాలుగఁ దగి. ౫౧ 69

చ. కనకమయంబులై కొస లగాధనభంబును దాఁకుచుండ నొ
ప్పిన ఘనశృంగముల్ గలిగి ప్రీతిని గల్గఁగఁజేయఁజాలి చ
క్కనిపటికంపుటాలఁ బొసఁగం గయిచేసినయట్లు చూడఁగా
ననువగునట్టి యట్టడులు నట్టులె గన్పడు గోపురంబులున్. ౫౨ 70

సీ. రజతారకూట నిర్మాణనైపుణ్యము గలిగిబంగరుకుంభములను వెలయు
నశ్వశాలలు మఱియన్నశాలలుఁ జూడఁ దగియుండె; మఱియు రత్నంపుఁగుంభ
వితతుల మరకతావృతసుస్థలంబుల నలరారు హేమగేహములఁ జక్క
నాపురం బొప్పారె నందు సొంపుగ దేవతాలయంబులుఁ జంద్రశాలలు యదు

తే. వరుల దేవాలయంబులు వరుస నాల్గు
జాతు లుండంగఁ దగినట్టి సద్మములును
గన్నులకుఁ బండువుగ నందుఁ గ్రాలుచుండె;
నాపురము ద్వారకాహ్వాయ మమర వెలసె. ౫౩ 71

చ. హరికి మదిం బ్రియంబొదవునట్లు సుధర్మను పారిజాతమున్
హరిహయుఁ డందుఁ జేర్చెఁ; బురమం దటనుండు మనుష్యులెల్లరున్
నరులకు నైజధర్మము లనంగఁ బొసంగెడుక్షుత్పిపాసలున్
జర, మృతి శోకమోహములు స్వప్నమునందును లేకయుండ్రొగిన్. ౫౪ 72

* "సురద్రుమలతోద్యాన విచిత్రోప వనాన్వితమ్." అని మూలము. "ఉద్యానోపవనయోః పుష్పఫలప్రధానత్వేన భేదః." అని టీక.

చ. నలు పాకకర్ణమందునఁ గనంబడఁ దక్కినదేహ మెంతయుం
దెలుపుగ నుండఁగా మనసుతీరునఁ బోఁగఁజాలి యున్నవీ
తుల వరుణుండు పంపెఁ; దమితో నిధినాథుఁడు లోకపాలుఁడై
యలరు కుబేరుఁడత్తఱినె యష్టనిధుల్ పనిపెం గ్రమంబునన్. ౫౬ 73

సీ. అవిపద్మమనియు మహాపద్మమనియును గుందకూర్మములు ముకుందనీల
శంఖాదకములని సంజ్ఞలఁ బెంపొందు నవ్వాని నగరభాగ్యంబు వెలయఁ
గాక యంచని పంపె; లోకపాలకు లెల్లఁ దమవిభూతులఁ బంపి తమకుఁగల్గు
భక్తిని జూపిరి; భగవంతుఁ డీరీతి ధరణిగతుండైనఁ దమకు మున్ను

తే. హరి యొసంగిన స్వాధికారార్థసిద్ధి
కొఱకుఁ దగియున్న విభవముల్ కోర్కిమీఱ
సిద్ధముఖ్యులు మరల నాశ్రీహరికిని
భక్తి నర్పించి ధన్యులై వఱలిరంత. ౫౭ 74

*చ. హరి పరమేశ్వరుండగుట నద్భుతరీతి స్వయోగమాయచో
నిరుపమశక్తి నమ్మధుర నిల్చినస్వీయజనంబు ద్వారకా
పురమునఁ జేర్చి వారలను బూనికఁ గావఁగ రామునిల్పి యా
దరము మెయిం దదాశయము దాఁ గొని చక్కని యూహ లొప్పఁగన్. ౫౭

చ. వనజదళాక్షుఁ డాక్షణమె ద్వారకఁబాసి యొకండె పత్తనం
బును మథురాహ్వయంబు నొకపోలికఁ జొచ్చి ప్రలంబసూదనుం
డనుమతి చేసినట్టిగతి నంబుజమాలికఁదాల్చి యాయుధా
ళిని ధరియింప కాత్మఘనలీలను గోపురసీమ వెల్వడెన్. ౫౮ 76

యేబదియొకటవ అధ్యాయము.

కాలయవనుఁడు ముచుకుందునిచేఁ బొలియుట.

చ. అని వచియించి యాశుకమహార్షి నరేంద్రున కిట్లు తెల్పెనో
జనవర! కృష్ణమూర్తిదగు సాధుచరిత్రము నాలకింపు; మొ
య్యన నుదితోడునాథుఁడన హారిరుచుల్ దగఁ బత్తనోత్తమం
బునఁ దగుద్వారముల్ విడిచి పోయెడువానిని గాంచెఁ గృష్ణునిన్. ౧ 77

చ. హరియును దర్శనీయతమమై కనుపట్టెడు దేహ మెంతో శ్యా
మరుచిఁ దగంగ వస్త్రమతిమంజులమై కనకప్రకాశమై
పరఁగుచుఁ బట్టుచే నమరుపంబడియుండెడుదానిఁ దాల్చి సుం
దరతరకౌస్తుభంబు రుచిధామము కంఠమునం జెలంగఁగన్. ౨ 78

* "తత్ర యోగప్రభావేణ నత్వా సర్వజనం హరిః." అని మూలము.

క. ఉరమున శ్రీవత్సంబను, వరచిహ్నము కన్పడంగ § భాసిలుచుండెన్;
బరమములు దీర్ఘములునై, బరికింపందగిన నాల్గు§బాహువు లొప్పన్. ౧౫ 79

క. అనుపమ నవకంజయుగం, బన నెఱ్ఱనికన్ను లెన్న § హారితరములై
కనులకుc బండువు చేయుచు, వనజాక్షుం డన్న పేరు § వసుధ వెలయcగన్. ౨

మ. జలజాతానన మెల్లవేళలను హర్షస్ఫారమై శ్రీయుతిన్
వెలయం జాలుచు సత్కపోలమగుచున్ § బిభ్రన్మహాకుండలో
జ్జ్వలమై హారిశుచిస్మితం బగుచు నుత్సాహంబు పైcబొంగcగా
నలరెన్; మ్లేచ్ఛవిభుండు కృష్ణుcగని యిట్లాత్మం దలంచెం దగన్. 3 81

మ. పురుషుం డీతcడు నాల్గుచేతు లలరన్ § బొల్పారు శ్రీవత్ససుం
దరవక్షుం బమరన్ సరోజసమనేత్రద్వంద్వ మొప్పన్ మనో
హరరూపంబు గనంబడంగ వనమాలాలంకృతిం జూడనా
సుర మెంతో రమణీయమై తగ మునీంద్రోక్త ప్రకారంబుగన్. ౪ 82

చ. కనcబడు, వాసుదేవుc డనc§గాc దగియుండెడు వేఱొకండు కాc
డని మదిcదోcచుచున్నది; ని§రాయుధుcడై రథ మెక్కకే జవం
బునc బరుగెత్తుcగాడ పద§ముల్ ధరcజక్కcగ మోపకుంటయే
కనcబడుచెన్ నిరాయుధుcడc § గా ననిసేయుదు వీనితో నిటన్. ౫ 83

చ. అని మది నిశ్చయించి యవ§నాధిపుc డట్టె పరాఙ్ముఖంబుగాc
దను నొకలెక్క చేయక ని§తాంతము పాఱెడు కృష్ణుcగాంచి యా
తని వెనుకన్ జనంబమరc § దాc బరువెత్తెను యోగిరాజికేc
గనుcగొనc బట్టcగా నలవి§గాని పరాత్పరుc బట్టుకోరికన్. ౬ 84

చ. ప్రతిపదమందు నాయవన§పాలుని చేతికిc జిక్కునట్లు శ్రీ
పతియును దోcపcజేయుచును § బాలిశు నాతనిc జాలదూరమే
మతిప్రభc గూడcc గొంచుc జని § క్ష్మాధరకందరసీమc జేర్చె; ను
ద్ధతుcడగు మ్లేచ్ఛనాయకుcడు § తామరసాక్షుని వెన్కc బోవుచున్. ౭ 85

చ. యదుకులమందు సంభవము§నందిన నీ కిటు పాఱిపోవు టొ
ప్పదు గదయంచు నుల్లసపుcబల్కులు పల్కుచు వెంటcబాఱెcగా
ని దనదు కర్మముల్ చెడక § నిల్చినహేతువునన్ బరాత్పరున్
సదమలునిన్ స్పృశింపcగను § జాలcడ యెంత యదృష్టహీనుcడో?. ౮ 86

చ. యవనుcడ దెంత యుల్లసము § లాడుచుసుండిన శ్రీనివాసుc డే
మి వలుక కాసుడుల్ గొనక § మించినవేడుక శైలకందరం
బవితథవాంఛc జొచ్చె యవ§నాధిపుc డాహరి వెన్కcజొచ్చి యం
ధు వసుధ నిద్రcబోవు నొక§నూతనపూరుషుc గాంచె నొయ్యనన్. ౯ 87

చ. కనుఁగొనినంతనే యితఁడు కంజదళాక్షుఁడు దూరభూమికిన్
ననుఁ గొనివచ్చి యిట్లు సుజనక్రియ నూరక పవ్వళించి నాఁ
డని తలపోసి కృష్ణునిగ నాత్మ దృఢంబుగ నమ్మి మూఢుఁడై
టను బదమెత్తి దాఁచెను గడంకను బిట్టుగఁ గ్రోధవేగతన్. ౧౦ 88

క. చరణాహతుఁడై యపు డా, పురుషవరుం డట్టె లేచి పూనిక నచటం
జిరకాలమునుండియె ని,ద్దురఁ గాంచుచునుంట నేత్రతోయజయుగమున్. ౧౦౪

క. మెలమెల్లఁ దెఱచి దిక్కులు, కలయంగాఁ గనుచు నంతికంబునఁ బార్శ్వ
స్థలమున నుండిన యవనున్, ఖలునిం గన్గొనియె రోషకలితుం డగుచున్. ౧౧

క. ఆతని రోషావిలదృ,క్పాతంబునఁ గాలయవను భవ్యాంగమునం
దాతటి జనించి హుతవహుఁ, డాతతరశ్ములను గాల్చె నంగం బపుడే. ౧౨ 91

క. తనువది యాక్షణమున న,య్యెను భస్మముగాఁగ ననుచు నీవిధి శుకమౌ
ని నృపతి పల్కఁ బరీక్షి, జ్జనపాలుఁడు ప్రశ్న మడిగె సాధువతంసా!. ౧౨ 92

క. పురుషుం డతఁ డెవ్వం డగు?, బరుండియుండంగ నేల? పట్టి యెవనికా
నరుఁ డగుఁ? బ్రభావ మదియె,క్కరణిఁ దగున్? గుహను జేరఁ గారణ మేమో!.

క. కతమేమో శయనింపఁగ, క్షితిపాలునిఁ గాలయవను శిక్షింపఁగ నే
కతమో యెవ్వని కాతఁడు, సుతుఁ డగు? నెఱిఁగింపవయ్య శుకయోగీంద్రా!. ౧౩

ముచుకుందుఁడు శ్రీకృష్ణుని గుహలో దర్శించుట.

క. అనుటయు శుకుఁ డను నిట్లా,కునికులమున జన్మమందెఁ; గొమరుఁడు మాంధా
తృనరేశున కగు; ముచుకుం,దుని గాఁ దలపోయు మతఁడు ధూర్తహరుండై.

క. ఖ్యాతింగని బ్రహ్మణ్యుం, డీతం డని పొగడఁబడుచు ఋతసంగరుఁడై
భూతల మేలెను మును పురు,హూతాది త్రిదశు లసురు లుద్ధతి నేచన్.

క. మనసులు భీతిం గుందం,గ నాత్మసంరక్షణైకకార్యార్థ మ్మా
జనపతిఁ బ్రార్థింపఁగ న,ప్పని యొనరిచెఁ జిర మతండు బద్ధాదరుఁ డై. ౧౫ 97

చ. అమరులు కార్తికేయుఁ ద్రిదశాలయపాలకుగా వరించి యా
కుమతుల భీతివాసి ముచుకుందునితోఁ గరుణాకరా! నృపా
మముఁ జిరకాల మేలితి క్రమంబునఁ గష్టము లొందకుండ నె
య్యమునకు మెచ్చువచ్చె నిక నప్పనిమానఁ దగున్ విశంకతన్. ౧౬ 98

ఆ. నిహతకంటక మగు నీ రాజ్యమును వీడి, మనుజలోక మట్టెమాని మమ్ముఁ
బాలనంబు చేయు పనిఁ బూనియుండుటఁ, గామములు త్యజింపఁ గలిగె నిన్ను.

*చ. తనసుఖముం ద్యజించి సురధామముఁ గాచితి వింతకాల మో
జనవర! యట్టులౌటఁ దనుజాతులు భార్యలు జ్ఞాత్యమాత్యు లిం

* "జ్ఞాతయోమాత్యమంత్రిణః." అని మూలము. "అమాత్యాః సమీపవర్తినః." అని టీక.

కనుగల మంత్రులుం బ్రజలు కాలవశంబున జీవితాంతముం
గనిరి భవత్సమానులును గానఁగ నొక్కఁడు లేఁడ యిత్తఱిన్. ౧౮ 100

క. కాలంబన నే దని జన,పాలా! తలపోయు దేమొ భగవంతుఁడె యాఁ
గాలమన నవ్యయుండగు, శ్రీలలనేశుండె యనుచుఁ జింతింపు మెదన్. ౧౮౪

క. బలవంతులలో నీశుఁడె, బలవంతుం డగును గెలిపరతఁ బశుగణం
బులఁ బశుపాలకు నట్టులె, లలి జనులఁ లోఁగొనుఁ విలాసముమీఱన్. ౧౯

క. కావున నోరాజేంద్రా!, కైవల్యము దక్క మఱొకకాంక్షిత మేదో
మావలనఁ గొనుము దానిని, శ్రీవిలసిల్లెడును గాక! చెప్పుము కోర్కెన్. ౧౯౪

క. వినుమా కైవల్య మొసం,గను భగవంతుండు చ్యుతినిఁగాంచక తగునా
వనజాక్షుఁ డొకఁడె శక్తుం, డనఁదగు నన్యుల కశక్య మది యొసఁగుటకున్. ౨౦

చ అని త్రిదశుల్ వచింపఁగ మహాయశుఁడౌ ముచుకుందుఁ డాదృతిం
గొని యభివాదనంబు లిడి క్షోణినిబాసి నిరంతరంబు దే
వనికరరక్షణార్థముగ వారనికష్టముచేఁ గృశించెఁ గా
వున నడిగెఁ వరంబుగను బూనిక నిద్రను జక్క నెంచియే. ౨౧ 105

చ అడిగెడు నప్పు నాదయిన యాగురునిద్రకు భంగమెట్టు లె
వ్వాఁడు కలిగించెనేనియు జవంబున నీఱగుఁగాక వాఁడు నే
నడిగిన యీవరం బొసఁగుఁ డాదృతి దేవతలార! యన్న న
ట్లడఁగు నతండు సుమ్మనఁగ నానరపాలుఁడు కోర్కెదీఱఁగన్. ౨౧౪ 106

చ. అమరవరప్రదత్త మగునాఘననిద్రను బూని పర్వతో
త్తమగుహాయందుఁ జేరి సుఖధామముగాఁ దగుచోటఁ బవ్వళిం
చె మమత; రాజు వచ్చుతఱిఁ జెందినవేడుక దేవవర్యుల
శ్రమముగ నిద్రపొమ్ము; నిదురం గను నిన్నెవఁ డుద్ధతుండు నై. ౨౨౪ 107

తే. మేలుకొలుపంగఁ బూను నా బాలిశుండు,నీదు దృక్పాతమాత్రన నీఱగుఁజుము
చను మనిరి; కాలయవనుఁ డీచందమున నె, భస్మమయిపడ నాభగవంతుఁడపుడె.

సీ. బుద్ధిమంతుండయి పొలుచు నమ్ముచుకుందునకు దర్శనం బిచ్చె సకలలోక
నాయకుండయిన శ్రీనారాయణుం గాంచి ధారాధరశ్యాముఁ జారుపీత
కౌశేయవస్త్రుని గమ్రకౌస్తుభధరు శ్రీవత్సవక్షు సుశ్రీనిలయుని
బాహుచతుష్కవిభ్రాజితునిఁ వైజయంతి నానొప్పారునట్టి దైన

తే. భవ్యవనమాలికం దాల్చి ప్రభలు దెసలఁ, గప్పనొప్పెడు వానిని గమ్రమకర
కుండలంబులఁ దగువానిఁ గోమలప్ర,సన్నవదనుని లోకేశు సన్నుతాంగు.

క. నరులకుఁ గన్నులపండువు, గర మొనరించెడు మహాత్ముఁ గరుణాన్విత సుం
దరసుస్మితేక్షణుని శ్రీ,వరు నూత్నవయఃప్రశస్తు భాసురమూర్తిన్. ౨౩ 110

తే. మత్తపంచాననోదార । మహితవిక్ర,ముని బరాత్పరు శ్రీకృష్ణుఁ । గని తదీయ
తేజమున ధర్షితుండయి । తీవ్రబుద్ధి, నలరు ముచుకుందుఁ డిట్లని । యడిగె భక్తి.

క. మెలమెల్లనఁ దత్తేజో,జ్వాలనుఁడు తన్నావరింప । సంశయపడుచుఁ జె
బలికెఁ మహితాత్మా! యీ,స్థలమును జేరుటకుఁ గార్య।సరణి య దెదియో?.

క. నీ వెవ్వఁడవో గహనం, బెవారికిఁ జేరరాని । దీభూధ్రదరిఁ
నీవేటికిఁ జొచ్చితివో, పావనపంకజపలాశ।భవ్యపదములన్ ౨౯ 113

క. ఉరుతర కంటక ధరణిం, దిరుగుచు నున్నాఁడ వేల? । తెల్పు మధీశా!;
నిరుపమతేజస్వుల డొ, వరతేజంబవో తలంప । భగవంతుం డై. ౨౯౫ 114

తే. మఱి మహాభూతనాథుఁ డై । మాననీయుఁ
డగు విభావసుఁడవో ! సూర్యుఁడుగ గణింపఁ
దగుదువో ! సోముఁడవొ ! మహేంద్రప్రశస్తి
గన్న దిక్పాలవరుఁడవో! । కాక యింక. ౩౦ 115

క. లోకేశులలో వేఱొక, లోకేశుఁడవగుదొ! మనసులో యోజింపం
శ్రీకాంతుండై దేవా, నీకమునకు విభులుగాఁగ । నెగడుచు ఘనుఁడై. ౩౦ 116

ఆ. మూఁడుమూర్తు లనఁగ।బొలుచు మహాత్ముల, కరయ విభుఁడవగుచు।నచ్యుతుఁడ
వెలయునట్టి పురుష।వృషభునిగా నిన్నుఁ, దెలియనయ్యె వేఱు।పలుకు లేల. [న

క. నిరుపమతేజస్సులఁ గం,దరగతమౌ ధ్వాంతరాజి । దహియించితివో
పురుషోత్తమ! సేవకు లనఁ,బరఁగెడు మా కవ్వలీక।పద్ధతి మీఱన్. ౩౧౫ 118

క. వినిపింపు సమ్మతంబే, జననముఁ గర్మంబుఁ గులము । సరగునఁ గృపతో;
మనుజవరా! యిక్ష్వాకుం, డనుభూపతికులజులని యి।లాధిపు లనఁగన్. ౩౨౫

ఆ. పేరుగన్నవార । మోరమానాయకా !, యౌవనాశ్వుఁ డనఁగ । నవనిఁ బేరుఁ
గన్నయట్టి ధరణి।కాంతునకుం బుత్త్రుఁ,డ ముచుకుంద నాముఁ । డను మహాత్మ!.

క. చిరకాలము మేల్కాని త,త్పరిగతకష్టంబువలన । బడలిబడలి ని
ద్దుర నొంది దాన నంగో,త్కర మాత్మవ్యాపృతిం దగం గోల్పోవన్. ౩౩౫

క. జనశూన్యమైన యీగుహ, మన మెట్లో సుఖంబు గన్న।మాడ్కిం జెలఁగఁ
వనజాక్షా! శయనించితి, జనుఁ డెవ్వఁడొ మేలుకొలిపెఁ । జావఁ దలఁచియే. ౩౪

చ. అతఁడు స్వకీయపాపమున । నంతమునొందెఁ దదీయదేహ మీ
వితమున భస్మమయ్యెఁ; గడు।వింతగ శ్రీనర! శత్రుశాతనా
హిత మొనరింపఁగోరి యిటు । లిచ్చటఁ గన్పడినాఁడ వెంతొ య
ద్భుతమయి దుర్నిరీక్ష్యమయి । తోఁచెడు నీదగు తేజ మోప్రభూ!. ౩౫౫ 123

చ. కనుఁగొనఁజాల; నట్టిదయి । క్రాలు మహత్తరతేజ మొప్ప నీ
వనయము హీనతేజులగు।నట్టి శరీరులకెల్ల దిక్కుగాఁ

గను దగి మానసీయుఁడవు ♦ గాఁ దలపోయఁగఁ జాలినాఁడ వో
వనరుహనేత్ర! యంచు నిటు♦వర్ణన మొప్పఁగఁజేయ నాదృతిన్. ౩౬          124

సీ. భూతభావనుఁడయి ♦ పొలుచు నాభగవంతుఁ డప్పు డిట్లనియెఁ బ్ర♦హర్ష సూచ
కమగు సుస్మిత మాస్య♦కంజంబునం దగ నంబుదధ్వనివలె ♦ నతిగభీర
మైన వాక్కమరంగ ♦ నార్య! జన్మము లు కర్మము లాఖ్యలు ♦ కలవు; నాకు
వేనవేలుగ నవ్వి ♦ వివరింపఁగా ననంతములౌట లెక్కింపఁ♦దరముగాక

తే. యుండు నెవ్వరికే నాకు ♦ నుండునట్లు,సుమతియగువాఁడు పెక్కుజ♦న్మములనెత్తి
భూరజస్సుల లెక్కింప♦నేరుచు నన, వచ్చు నంతియగాని యె♦వ్వరుసనైన. ౩౭

క. నావగు గుణకర్మాఖ్యల, నేవాఁడు గణింపఁజాలఁ ♦ డీమాట నిజం
బో వసుధాధిప! వినుమా, నావచనము దాని నీమ♦నమున నిలుపుమా. ౩౮ 126

క. పరమర్షులు గుణకర్మో,త్కరము మదీయంబునుం ద్రి♦కాలములను గో
చరమగుదాని వచింపఁగ, దొరఁకొని యంతం బి దనుచుఁ ♦ దోఁపమిఁ జింతన్.

ఆ. ఆకసంబుఁ జూచు ♦ చారయుచున్నారు, సాధువర్య! యైనఁ ♦ జక్కఁ జెప్పు
వాఁడ నద్యతనభ♦వంబుల గుణకర్మ,ముల మదీయములను ♦ బూన్కిమీఱ.

చ. వినుము విరించి మున్ను నను ♦ వేఁడఁగ భూమికి భారభూతులై
జని గని రాజరూపులుగ ♦ సంతతముం బరవంచనంబుచే
యనె జతనంబుపూనిన మ♦హాసురులన్ వధియించి ధర్మ మె
య్యన నిలుపంగఁ జేయ జని♦నందితి నయ్యదువంశమం దిలన్. ౪౧          129

క. ఆనకదుందుభి భార్యకు, సూనుఁడనై లిన్ గణింత్రు ♦ సుజనులు నన్నో
భూనాథ! వాసుదేవుని, గానే జనకాఖ్య తెలియఁ♦గల దనుసూహన్. ౪౨ 130

క. ధర గాలనేమి కంసా,ఖ్యరహిన్ జన్మించె నతఁడు ♦ హతుఁ డయ్యెను స
త్పరిపంథు లౌచు నతిభీ,కరులైన ప్రలంబముఖులు ♦ కదలిరి దివికిన్. ౪౨౫ 131

క. జననాథ! కాలయవనుం, డనఁబడు నీదుష్టచరితుఁ ♦ డత్యుగ్రంబై
కనరాని నీదునేత్రం,బున నాహేతువున నయ్యె ♦ బూదిగ నిచటన్. ౪౩ 132

క. అనుకంపామయదృష్టిం, గని నిన్నుఁ గృతార్థుఁజేయఁ ♦ గా నీగుహలోఁ
గనఁబడితి నీకు నానే, నని యెన్నుము పూర్వజన్మ♦మం దతిభక్తిన్. ౪౩౫ 133

క. ఆరాధించితివి నను, గోరినభక్తులకు సుంత ♦ కొదువపడనియ
ట్లారసి కోర్కులఁ దీర్తును, భూరమణర్షి! వచింపు♦ము వరముల నిఁకన్. ౪౪

క. కోరెడు నీకామంబులఁ, దీరుతు వరదానమున ♦ తీఱలిన్ జనుఁ డెవఁడేఁ
గోరికఁ బ్రపన్నుఁడగు నా, ధీరుఁడు తనకోర్కు లెల్లఁ ♦ దీఱనికతనన్. ౪౪౫

క. మరలన్ శోకింపం డె,క్కరణి నటం చెన్నఁదగును ♦ త్మావర! యని శ్రీ

హరి పల్కఁగ ముచుకుందుఁడు, పరమప్రమదంబుమీఱఁ బ్రణతుం డగుచు

క. మునిపతి గర్గుఁడు మునుచెప్పిన వాక్యము దలఁచుకొనుచుఁ బీతాంబరు
వనజేక్షణుఁడగు నారా, యణుఁడే యని నిశ్చయించి యపు డిట్లనియెన్. ౭౧

సీ. ఈశ్వరా! జగమున నింతులు పురుషులు భవదీయమాయ కప్పంగ నే
తెలియక పరమార్థములు స్వరూపముగాఁగ వెలయు నిన్ననఁజాల కెలమి
భజియింపఁజాలక వంచితులయి యనర్థములందె తమబుద్ధి దవుల వాని
నెల్ల నమ్ముచు నవ్వియే పురుషార్థము లనితలంతురు దుఃఖమునకు నెలవ
తే. లగుచు సుఖముల నించుకయైన నొసఁగ, కవ్వి యున్నట్లు తోఁచెడునట్లు
సద్మముల విశ్వసింతు రో చక్రపాణి!, యఘవిమోచనశీల!, మహానుభా

*క. ఇదికర్మభూమి యగు నిం, దుదయించియు మనుజజన్మ మొందియు మఱిం
దు దృఢాంగము జతనం బె, య్యది లేకయె పొందియుఁ మహామతి లే

క. భవమయ మహాంధకూపము, నివాసముగ నొప్పియుండ నీదివ్యసదా
బ్జవరము భజింపఁజాలక, యవమతియై సంచరించు ననవరతంబున్. ౭౩

తే. తృణసమావృతమైన నూతిని బశు వటు
భవ మహాంధకూపంబునఁ బడును నిజము;
విను మజిత! నాదుమాట నింకను వచింతు
రాజ్యసంపన్మదంబు నిర్భరతఁ గప్ప. ౭౪

సీ. ముగ్ధుండనయి దేహమును దీని నాత్మయే యని యభిమానించి యాత్మ
జాయాధనంబుల క్ష్మాముఖంబుల మహాసక్తిచేఁ గాంచుచు సతము దిరుగి
నాకింతదనుక నో నారాయణా! దురంతమగు చింతాతురతను నిరర్థ
కముగఁ గాలంబెల్లఁ గడచె నేమాత్రమే దాన లాభంబును గానవై

తే. ఘుటము కుడ్యంబువలె నాత్మగాని యట్టి
తనువునం దిందు క్ష్మాపతి ననెడు నిట్టి
చెడుగునభిమాన మూనియె సింధురతుర
గరథపత్తి యుతుండనై క్షమఁ దిరుగుచు. ౭౫

క. అతిశయదుర్మద మొలయఁగ, గతియగు పరమేశు నిన్నుఁ గననైతి; విభు
యితికృత్య చింతచేతనె, మతిలోభము మించ విషయమండలని దమిన్. ౭౬

క. కనుచున్నయిట్టి ప్రాణిని, నను నీవేమాత్రముఁ మనంబున మఱుపుం
గన కంతకరూపుఁడవై, పెనునాఁకటఁ దూలి చింత పెంపొందంగన్. ౭౭

---

* "లబ్ధ్వా జనో దుర్లభ మత్ర మానుషం." అనిమూలము. "అత్ర కర్మభూమౌ." అని
చార్యులు.

*క. తనపెదవులు నాకెడు నహి,యును మూషికముఁ గ్రసించుటనొప్పునఁ దగువం
చన మ్రింగుదుపు తటాలున, నినుఁ గానసిఫలమె యిద్ది § నీరజనాభా!. ౯౧ 145

చ. కనకపరిష్కృతంబులయి § క్రాలు రథంబుల నెక్కియుఁ మదిం
చినగజరాజి నెక్కియును § స్వేచ్ఛమెయిఁ నరదేవసంజ్ఞచేఁ
దనరినయాకళేబరమె § దారుణకాలము పైకొనంగ జ
య్యనఁ బడి వంచకాళి భిషకావళియుం దిన విష్ఠ నాఁబడున్. ౯౧౪ 116

సీ. అవియు భక్షింపమి § నది కృమిసంజ్ఞమై యొప్పు నయ్యదె దహనోగ్రరుచుల
దగ్ధమై భస్మాభిధానముఁ గను; మహాపూరుషా! దిక్చక్రమును జయించి
వెదకిన శత్రువు § విశ్వంబునను లేక సార్వభౌమార్హసంస్థాన మొంది
మున్నుసమానులఁ § బొగడికకుం దగు భూపతుల్ వందనములు పొనర్చు

తే. చును దనుంగొల్వఁ దగుపూరుషునినె గ్రామ్య
ధర్మమె సుఖంబుగాఁగ నితాంత మొప్పు
సద్మములయందు మగువలు § సతము క్రీడ
కొఱకుఁ బెంచినమృగములకూటము బలె. ౯౩ 147

క. వలసినరీతుల నిట్టటు, కలయం ద్రిప్పుదురు చూడఁ § గా నచ్చెరువౌ
జలజాక్ష! దిగ్ర్వజంబుల, గెలిచిన భూపాలుఁ డిట్లు § క్రీడామృగమా. ౯౩

చ. సురుచిరభోగ్యవస్తువుల § శోభిలు రాజగృహాళినిం దిర
స్కరణముచేయుదే యనెదొ § కంజవిలోచన! యాలకింపుమా
ధరణివిభుండు హెచ్చెడుముదంబున రాఁగలజన్మమందు నీ
వరుసనె చక్రవర్తినయి § వర్ధిలఁగాదగు నన్నయాశచేన్. ౯౩౪ 149

చ. అనుపమనిష్ఠఁబూనుచు § మహాతపముల్ సుఖవర్జనంబునం
బొనరుచు ముందుభోగములఁ § బొందఁగఁగోరియొ వర్తమానభో
గనికరముంద్యజించి సురకాంతుపదంబును దా జయించువాం
ఛను గడుఁ గామ్యకర్మముల § సల్పునుగాని యతండు సుంతయున్. ౯౮ 150

క. కనఁజాలఁడు సుఖముల; నో,వనజాక్షా! భవమహాబ్ధి § భ్రమియించెడు న
మ్మనుజునకు నెట్టిజన్మం,బున సాధుసమాగమంబుఁ § బొందఁగలుగునో?. ౯౮౪ 151

క. భవమున నందే సంసృతి, నివృత్తిపొడచూపు నద్ది § నెలకొను నెపు డా
యవసరమున సద్గతియుఁ, భవభయవినివృత్తియు మదిఁ § బర్వుం జుమ్మా!. ౯౯

తే. కార్యకారణములకు నిక్కపునియంత
వైన నీయందు భక్తియు § నపుడె కల్గు

* "క్షుల్లేలిహానోఽహిరివాఖుమంతకః" అని మూలము. క్షుధాసృక్విణీలేలిహానోఽహిరివ" అనివాఖ్య.

నవల ముక్తియుఁ గల్గు; బ్రహ్మాండనాథ!
సాధుసంగతికిఁ మున్నె సత్వరముగ. ౧౫౩ 153

సీ. రాజ్యభోగాద్యసారస్ఫారసంగ నివృత్తి కల్గెను గదా! యెన్న నద్ది
భవదనుగ్రహలతాఫలముగాక మఱేమి? యమరులకెల్ల సహాయ మొనరు
పఁగఁ బ్రోత్సహించి యప్పనియె నెపంబుగా దైవికంబుగ నన్నుఁ దగిలియున్న
రాజ్యపాశము సత్వరముగఁ దొలంగించి తడియె మహానుగ్రహ మని నేను
తే. దలఁచుచున్నాఁడ సువివేకతం జెలంగి
తపము సేయఁగ వనికేగఁ దలఁచుచక్ర
వర్తు లేకాకితను బూని వర్తనంబు
సలుపు రాజ్యపాశంబు వదలఁగ నెంచి. ౧౫౪ 154

క. నినుఁ గోరుచుందు రది నా,కును గష్టములేక కలిగె గోవింద! హరీ!
యనుపమభవదనుకంపయె, గనుక భవద్దర్శనమునకుం బెఱ మునుపే. ౧౫౫ 155

ఆ. నీయనుగ్రహమును నేఁగంటి నోవిభూ!, వరము లడుగుమంటి వరసి నేను
దురభిమానవర్జితులు వివేకులు కోరు, నట్టి యుష్మదున్నతాంఘ్రిసేవ. ౧౫౬

క. వరముగఁ గోరెద నింకొక, వర మడుగఁ దలంప నార్యవర్యం డెవఁడే
నురుముక్తిదుండ వగు నీ, కరుణకుఁ బాత్రుండె యగుచుఁ గాంచనచేలున్.

క. నినుఁగాంచి యాత్మకుఁ బం,ధనమగు వేఱొక్కవరముఁ దాఁ గాంక్షించున్?
గనుకం బరమేశా! యో,వనజాక్షా! నాదు కాంక్ష వరుసఁ దెలిపెదన్. ౧౫౭ 158

సీ. సత్త్వరజస్తమ సంజ్ఞికగుణముల కనుబంధములయిన యట్టిధర్మ
మైశ్వర్య మరిజనాహంకృతి మారణముఖరూపములునయి పోలయు కామ
ములఁ బాఱఁద్రోలి యిమ్ముల నిరంజనుఁడును బ్రాకృతగుణసమవాయ శూన్యుఁ
డగుట నిర్గుణుఁడనఁదగి సజాతీయ విజాతీయభేద మేచందమునను
తే లేక యద్వయుఁ డనుపేరు ప్రాకటముగ
నొంది జ్ఞానఘనుం డయి యొప్పి పరమ
పురుషుఁ డనుసద్యశంబునఁ బొలిచి యలరు
నట్టి నిన్ను శరణ్యు నే నాశ్రయింతు. ౧౫౯ 159

చ. అని వచియించి భోగముల నాదృతిమీఱఁగఁ బొందు మవ్వలన్
ఘనతమముక్తి హస్తలగంబె యగుఁ గద యంచు నింకనుం
దను వరముల్ గొనందగు విధంబున నెంచఁగఁజేయఁ బూనునో
యని మది నెంచి యిట్లనియె నాముచుకుందుఁడు భక్తిమీఱఁగన్. ౧౬౦ 160

మ. చిరకాలం బొగిఁ గర్మవాసనలకుం జిత్తంబు సంతప్తమై
పరఁగంగా ననుతాపముల్ కలఁచి నొంపం జిక్కి షట్సంఖ్యభీ
కరులౌ నంతరరుల్ చెలంగి మిగులం గాజింప నోడింప నె

క్కరణిం జాలక శాంతిలేక మది నిక్కం బెంతయుం గుందఁగన్. ౧౬౧ 161

చ. శరణద! యోపరాత్మ! గురుసంసృతిభీతిని బాపఁజాలి యీ
శ్వరతఁ జెలంగి సూనృతము వర్ష్మముగా నమరంగ నెల్లెడం
బరఁగెడు నీపదాంబుజము భక్తిభరంబున నాశ్రయించితిన్
నిరతిని దీవ్రకష్టములు నిర్భరరీతి నలంపఁ గుందుచున్. ౧౬౨ 162

క. నిను నమ్మియున్న నన్నున్, గొని కావు మటంచును ముచుకుందుఁడు ప్రార్థిం
చిన నాలకించి శ్రీహరి, యనియెం గరుణాబ్ధి యనెడునాఖ్య తగంగన్. ౧౬౩

[1]తే. సార్వభౌమ మహారాజ సద్వరముల
గోరుమా యని పేరాసఁ గొలుప నెన్ని
భంగులం బ్రోత్సహించినఁ బరవశంబు
గాక కామహతంబునుఁ గాక మనసు. ౧౬౪ 164

క. విమలము దృఢమూలమునై, యమరెను; నినుఁ బ్రోత్సహించు టాశాపాశౌ
ఘమునం జిక్కి ప్రమాదము, క్షమఁ గాంచక యుండఁజేయఁగ నని తలఁపుమా!

క. అదియేటి పరీక్షయొ యని,యెద వేమో నిశ్చలమయి యొసఁగెడు భక్తిన్
మది భాసిల్లఁగఁ దగు వా, రెదియేఁ గామంబు బుద్ధి నేచఁ దలఁచినన్. ౧౬౬

క. ఒక్కయెడనైన చానికిఁ, జిక్కకయుందురు; తలంప క్షితిపవరా! పెన్
మక్కువఁ బ్రాణాయామము, లక్కరణిం దగినసాధనా వళిఁ గొనుచున్. ౧౬౭

క. మనసు నియమింపఁబూనిన, జను లెల్ల మదీయభక్తజాలమ్మునఁ జే
రనివారెయైన వాసన, యనునది క్షీణింపకుంట నవ్విషయాళిన్. ౧౬౮ 168

క. మరలం బ్రేమింతురు సూ, ధరణిం గనుపట్టుచుండుఁ దద్వాంఛలు; భూ
వర వర్య! నీవు మనసును, స్థిరముగ నాయందునిల్పి చెందిన వేడ్కన్. ౧౬౯

క. ధరణిఁ జరింపుము నిత్యము, నిరపాయం బైనభక్తి నీకుఁ గుదురుఁ బో
పరమేశుఁడ నగునాయం;, దురుతరకరుణన్ వరంబు నొసఁగితి నిట్టుల్. ౧౭౦

చ. జనవర! నీవు పూర్వ మొగిఁ క్షత్రియజాత్యుచితైక ధర్మముం
గొని మృగయాదిమార్గములఁ గొంకక భూతములన్ వధించి తీ
వనుపమ మత్పదాంబుజ సమాశ్రయణంబున నిష్ఠఁబూని చి
త్తనియతి యొప్ప సత్తపము తప్పక చేయు మఘంబు దూలెడున్. ౧౭౧ 171

[2]క. మనుజేంద్ర! నీవు రాఁగల, జననంబున భూతవితతి సౌహార్దముగ
ల్గిన బ్రాహ్మణుండవైన, న్ననువుగఁ బొందుదు వటంచు నానతియిచ్చెన్. ౧౭౨



1 "సార్వభౌమ మహారాజ మతిస్తే విమలోర్జితా." అని మూలము. "సార్వభౌమేప్యపి మహారాజ." అని టీక. 2 "జన్మన్యనంతరే రాజన్ సర్వభూతసుహృత్తమః, భూత్వా ద్విజవరస్త్వం వై మాముపైష్యసి కేవలమ్." అని మూలము.

## ఏఁ బ ది రెం డ వ య ధ్యా య ము.

### జరాసంధుఁడు ప్రవర్షణగిరిని గాల్చుట.

క. అని తెలిపి పరీక్షిత్తును, జనపాలున కిట్లు తెలిపె సాధునృపుం డై
తనరు శుకయోగి! వినుమా, వనజాక్షుం డిట్లు కరుణ వర్ధిలుచుండన్. ౪ 173

క. అనుమతి చేయఁగ నిక్ష్వాకునివంశము కీర్తివెలయఁ గోరి జననమొం
దిన ముచుకుందుఁడు శ్రీకృష్ణునకుఁ వలగొనుచు మ్రొక్కి నూత్నతనురుచిన్.

తే. తాఁ బరుండిన గుహనుండి తరలె; నంత
మానవులు పశుతతియుఁ బ్రతానవీవ్ర
జము వనస్పతిగణము హ్రస్వములైన
యాకృతిం గాంచి యుండుట యతఁడు చూచి. ౧౪ 175

క. కలియుగ మాసన్నం బని, తెలిసికొనెం గానఁ దానుదీచికిఁ జనఁగాఁ
దలపోసి పోయె; ధీరత, వెలయఁగ నిస్సంగుఁడగుచు విమలాత్మకుఁ డై. ౨౪

క. గతసంశయుఁడై తపమున, వితతశ్రద్ధయు జనింప విష్ణుండగు న
చ్యుతునందు మనసుఁ జేరిచి, మతి శాంతివహింప గంధమాదనమునకున్. ౩

క. అరిగి యటనిల్చి పూర్వము, నరనారాయణు లనంగ నాకప్రభులై
పరమమునీంద్రులు నయితగు, నిరుపము లేస్థలమునందు నిల్చిరొ యందున్. ౩౪

తే. బదరికాశ్రమ మనవొప్పి పరమపావ
నమయి తగుచోటఁ జేరి ద్వంద్వముల నోర్చి
శాంతుఁడై గోపికారాధ్యు సకలనాథుఁ
దపముచేత నారాధించెఁ దగినవిధుల. ౮ 179

చ. హరియును గందరంబు విడి యామథురాపురి కేగుదెంచి ని
ర్భరబల మొప్పఁగా యవనుపంపున ముట్టడిసల్పియున్న భీ
కరులను మ్లేచ్ఛయోధులను గ్రన్ననఁ జంపి తదీయవిత్తముల్
ద్వరగనె ద్వారకాపురికిఁ దానొగిఁ జేర్చెను వేడ్కసంధిలన్. ౫ 180

సీ. శ్రీకృష్ణభృత్యులు చెలఁగి తద్ధనమెల్ల గోవులపై నిడి కొంచుఁబోవు
చుండఁగా, నత్తఱి నిందువేడుక జరాసుధుఁడు పూర్వపుచందముననె
యిరువదిమూఁడన నెసఁగుసంఖ్యలఁ దగు నక్షౌహిణులఁగూడి యనియొనర్చు
నుత్సుకంబున వచ్చె; నుద్ధతునిఁ జరాసంధుని గని వాని సైన్యవేగ

తే. మును విలోకించి యాపదునెనిమిదవస
మరమునందు మనుష్యులమాడ్కిఁ జేష్ట
లనుగనంబడఁ జేయంగ మనసు లోక
చందమున నొప్ప రాముఁడు చక్రధరుఁడు. ౭ 181

చ. మనమున లేనిభీతిఁ గొనుమాడ్కిఁ బలాయన మిచ్చగించి; రా
వనరుహనేత్రు లాయవనబాహుసమార్జిత విత్తమెల్ల నొ
య్యన విడి పద్మపత్రముల యట్టులు చెల్వగు పాదముల్ రణా
వనిని గనంబడం బరుగువాఱిరి చూపఱు లద్భుతంపడన్. ౮ 182

ఆ. పెక్కుయోజనంబు లొక్కమొగిం బాఱి
మాగధుండు వారిమహితశక్తి
నెఱుఁగ కట్లు పాఱుటెంచి నవ్వుచు సైన్య
ములనుగూడి తఱిమె ముగ్ధుఁ డగుచు. ౯ 183

క. ఆరామకృష్ణు లివ్విధి, దూరము పరుగెత్తి యలపుతో విశ్రాంతిం
గోరినయట్లు ప్రవర్షణ, భూరిమహీధ్రంబు నెక్కి పోయిరి వేడ్కన్. ౧౦

క. భగవంతుఁడు పర్జన్యుం, డగవర్యముపైన నిత్య మతివృష్టిని బూ
న్కిఁ గురియుచుండు మహోత్తుం, గ గిరీంద్రముదాని నెక్కఁగా దహనార్చుల్.

క. తము బాధింపక యుండెడు, క్షమాధవుని యత్నమెల్లఁ గడు వ్యర్థంబౌ
నమరుల కార్యము ఫలవంతమె యగునని తలఁచెఁ బురుషతల్లజుఁ డంతన్.

క. దానినె గోమంతంబని, మానవు లాకకొండ అండ్రు మాగధుఁ డగభూ
జానిపయిఁ దత్పదాంకము, లా నెలవులఁ గనియెఁ గాన నట వారుంటన్. ౧౦౪

చ. తనమది నిశ్చయించి గిరితల్లజమం దెట వారుదాఁగిరో
కనుఁగొనఁ జాల కాగ్రహము కన్నులఁ గప్పఁగ నింధనంబులన్
దనివి చనంగఁ జేర్చి నలుదట్లను వహ్నిఁ దగిల్చి కాల్చె; నా
జనపతియత్న మెల్లఁగని సారసనేత్రుఁడు రాముఁ డత్తఱిన్. ౧౧ 188

సీ. పర్వతతటములు పావకజ్వాలల దహియింపఁబడుచుండఁ దత్క్షణంబ
పదిపైన నొకసంఖ్యఁ బరఁగు యోజనములయంత యెత్తునఁదగు నద్రినుండి
లాఘవం బేపార లంఘించి మాగధునకుఁగాని వానిసేనలకుఁ గాని
కనరాక యుండంగఁ గడచి యదూత్తము లంబుధిపరిఖచే నావృతమగు

ఆ. ద్వారకాపురంబుఁ జేరిరి; వారందు, దగ్ధులైరటంచుఁ దలఁచి రిత్త
గొప్ప బలము లెల్లఁ గొలువంగ మాగధుఁ, డాత్మదేశమునకు నరిగె నెలమి.

క. క్ష్మానాథ! పరీక్షిత్తా!, పీనుల కింపైన యవలి విష్ణుచరిత్రం
బానర్తదేశనాయకుఁ, డై నెగడెడు రైవతుం డహార్యబలుం డౌ. ౧౮౪ 190

క. పరమేష్ఠియాజ్ఞ నాతఁడు, వరపుత్త్రిక రేవతియనఁ బరఁగెడు దానిన్
హరి సోదరునకు రామున, కురుముదమునఁ బత్నిగాఁగ నొసఁగె నటంచున్.

చ. *మును పెవచించినాఁడఁ గద పూజ్యతముండు విదర్భనాథుఁడై

* "వైదర్భీం భీష్మకసుతాం శ్రియోమాత్రాం స్వయంవరే" అని మూలము.

యనఘుఁడునైన భీష్మకుఁడు § నా జగదీశ్వరి యంశభూతయౌ
తనసుత రుక్మిణిన్ హరికి § ధర్మసతీమణిగా నొసంగఁ జా
లిన గురుభాగ్యముం గనియె § లీలసరోరుహనేత్రుఁ డాదృతిన్. ౧౬ 192

చ. సరసిజనేత్ర రుక్మిణిని § సాల్వుఁడు మున్నగు చైద్యపక్షపా
తరతిఁజెలంగు భూపతులు § తన్నుఁ గనుంగొనుచుండఁగా స్వయం
వరమున వైరులం గెలిచి § బాహుబలం బలరారఁగా సుధన్
గరుడుఁడు తెచ్చినట్లుగనె § గైకొని వేడుకఁ బెండ్లియాడెఁ దాన్. ౧౭ 193

చ. అని విని యాభిమన్యుఁడును § నార్యవరా! భగవంతుఁడైన యా
వనరుహనేత్రుఁ డాదృతిని § వారిరుహానన భీష్మకాత్మజన్
వనితలమిన్న రుక్మిణిని § భవ్యమనస్కను రాక్షసాహ్వయం
బునఁ దగుపద్ధతిన్ గొనియె § భూరిబలంబున నంచు వింటి మున్. ౧౮ 194

క. భగవంతా! శుకయోగీశ! గణింపఁగరాని పౌరుషమునం దగునా
భగవంతుఁడు శ్రీకృష్ణుఁడు, మగధేశ్వరముఖ్యవైరి § మండల మెల్లన్. ౧౯౺ 195

క. తనునొంపఁ బ్రయత్నింపం,గను వారి జయించి యొకఁడె § కన్యారత్నం
బును గొని తెచ్చెనో యావిధ,మును విన నేఁ గోరువాఁడఁ § బొందుగఁ జెపుమా

చ. పరమపవిత్రముల్ వినఁగఁ § బాడఁగఁ బుష్పరసంబుపోల్కిగా
సురుచిరముల్ శ్రుతిద్వయికి § శుభ్రము లెంతయు లోకపాపసం
హరణచణంబు లెన్నఁ బరమాత్ముని దివ్యచరిత్రముల్ నిరం
తరము శ్రుతంబునం గల యుదారసుఖంబు నెఱుంగువాఁ డిలన్. ౨౦ 197

చ. వినివిని తృప్తినొందు? నవి § వింతలుగా మఱి క్రొత్తక్రొత్తలై
యనుపమశర్మదంబులయి § హారితరంబులు నై చెలంగుఁ గా
వున విను వేడ్కయే మిగులఁ § బొల్చుచునుండును యోగివర్య! యా
వనరుహనాభుగాథలను § వర్ణనచేయుమ యింకనుం దమిన్. ౨౦ 198

రుక్మిణీకల్యాణము.

చ. నరపతి యిట్లు సంతసమునం దనుఁ బ్రశ్న మొనర్పఁగా మునీ
శ్వరుఁ డిటుపల్కెఁ; బూర్వ మొకరాట్పతి భీష్మకనామకుండు ధ
ర్మరతుఁ డుదారుఁ డుండె జనమాన్యుఁ డతండు విదర్భదేశముం
బరినుతిఁ గాంచ నేలె నలపార్థివసద్యుఁడు పంచపుత్త్రులన్. ౨౦౺ 199

చ. కనియెను వారివెన్క నొక § కన్నియగల్గెను సుందరాననం
బున వెలుఁగొందెఁ బుత్త్రతతిఁ § బూర్వుఁడు రుక్మియె వాని వెన్కనే
జని గనువాఁడు రుక్మరథసంజ్ఞుఁడు తత్సహజన్ముఁ డయ్యెఁ జే
రను ధర రుక్మబాహువన § రమ్యతనూరుచి నొప్పి రెల్లరున్. ౨౧౺ 200

సీ. రుక్మకేశుఁడు మఱి రుక్మమాలియు వానితరువాతి వారైరి తనయపంచ
కమునకుఁ దర్వాతఁ గన్నియ జనియించె; నారుక్మిణియు స్వగృహమున కప్పు
డప్పుడు వచ్చెడునట్టి మహాత్ములు శ్రీకృష్ణమూర్తివా శ్రీసురూప
వీర్యగుణంబుల వేడ్కమై వర్ణింప విని విని యామెకుం దునినె తనకుఁ

తే. దగినప్రాణేశునిగ నాత్మఁ దలఁచె నవ్విధమున నే కృష్ణమూర్తియుఁ దనను గాన
వచ్చుమానులు భీష్మకువరకుమారి, వర్ణనము చేయ నాలించి వనితమిన్న. ౨౩౪

చ. అనుపమబుద్ధి, లక్షణము లట్టియుదారత, హారిరూపశీ
లనిఖిలసద్గుణంబులఁ జెలంగుట నెంతయు నాత్మ నెన్నియే
తన కనురూపయౌట నిల దారనుగాఁ గొన నిశ్చయించె; నె
మ్మనముల నిర్వు రిట్లుగ సమానలసత్ప్రమదంబు నొందఁగన్. ౨౮ 202

ఉ. త్మావరుబంధువుల్ పొలఁతిఁ జక్రికిఁ బత్నిగనీయ నెన్నఁగా
నావిధ మాలకించి హరియందు విరోధముగల్గియున్న భీ
ష్మావనిపాలు నగ్రసుతుఁ డై తగు రుక్మియుఁ జైద్యుఁడే మహా
శ్రీవిలసత్ప్రభుం డగుటఁ జేఁ దనచెల్లెలి కెన్నఁ దుల్యుఁడౌ. ౨౯ 203

[1]చ. అని మది నూహచేసియె ప్రయత్నము చేయుచునుండె నవ్విధం
బును నిలుపంగఁజాల కొక పోలిక భీష్మకుఁ డూరకుండెఁ; గృ
ష్ణునియెడ నేయపాంగములఁ జొన్పి చెలంగెడు రుక్మిణీసరో
జన యన యవ్విధం బెఱిఁగి స్వాంతము మిక్కిలి దూల నార్తయై. ౨౯ 204

శా. మందాక్షంబును వీడి యింక నిట నేమాత్రంబు సంకోచ మా
త్మం దా నొంది యెసంగఁ జేసినఁ జెడుం గార్యమత్ప్రార్థితార్థం బటం
చుం దత్కార్యమహత్త్వ మెన్ని యలకృష్ణుం సమ్ముఖుం జేయు నూ
హం దాంతుండయి యాప్తుఁడై సకలవిద్యాపారగుం డౌ ద్విజున్. ౨౬ 205

[2]చ. త్వరపడి పంపెఁ గృష్ణునకు వార్తల వేనిని దెల్పనొప్పునో
సురుచిరరీతి నేర్పి; యలక్షోణిసురుండును ద్వారకాఖ్యమౌ
పురమును గానఁబోయి హరిపూజ్యతమప్రియమందిరంబు సుం
దరతమముం గనుంగొనియె ధన్యుఁడనైతి నటంచు నెంచుచున్. ౨౬౪ 206

ఉ. ద్వారముగాచు సద్భటులు బ్రాహ్మణు నాతని సర్వరీతిగా
శ్రీరమణాంతికంబునకు శీఘ్రమె దోడ్కొనిపోవ నందు శృం
గారహిరణ్యపీఠమున గాఢముదంబునఁ గూరుచున్న యా
పూరుషవర్యు నాద్యుఁడయి పొల్చెడువాని నుపేంద్రు నాదృతిన్. ౨౭ 207

---

1 "తదవేత్యాసితాపాంగీ" అని మూలము. "అసితే శ్రీకృష్ణే తద్వర్తని. అపాంగం యస్యాస్సా" అని టీక. 2 "కృష్ణాయ ప్రాహిణోద్విప్రమ్" అని మూలము.

క. సర్వారాధ్యుం డయ్యు సు,పర్వనుతుం డయ్యుఁ జక్రి బ్రహ్మజ్ఞుని నా
యుర్వీసురుఁ గని నంతనె, సర్వజ్ఞుం డౌట శాస్త్రసరణి జరపఁగన్. ౨౭ 208

చ. తనదగు నాసనోత్తమముఁ దక్షణమే విడనాడి ప్రీతిమైఁ
జని కొనితెచ్చి భూమిసురసత్తమ! యిచ్చటఁ గూరుచుండుమా
యని నిజపీఠసంస్థితుని నాతనిఁ బూజలఁ దన్పెఁ దన్ను నా
యనిమిషకోటిపూజల మహాదృతిఁ దన్పెడు నట్టిరీతిగన్. ౨౮ 209

చ. ధరణిసురోత్తముండు ప్రమదంబునఁ జక్క భుజించి విశ్రమిం
పరహితపాపులౌ జనులపాలిటి దేవమహీరుహంబు శ్రీ
హరి మెల్లమెల్లఁ జేరి మృదుకోమలాత్మకరంబులఁ దత్పదంబు లా
దరమున నొత్తుచుం బలికెఁ; ధారణినిర్జరవర్య! చెప్పుమా. ౨౯ 210

సీ. సంతుష్టమై తగుస్వాంతంబుగల నీకు మాననీయులకు సమ్మతముగాఁగ
నలరు ధర్మమ్మది యనతికష్టమ్మున వర్తిల్లుచుండు నే వదలకుండ;
[1]నెద్దియే లభియించు నెలమి దానం బొందునేని బ్రాహ్మణుఁడు విరోధరిత మగు
తనధర్మముననుండి తలఁగఁడావిప్రున కట్టిధర్మంబె సర్వార్థములను
ఆ. గామధేను వట్లు గాఁ బిండుచుండును, దగినతుష్టి లేని ధరణిసురుఁడు
శక్రవిహితభోగజాలమ్ము గలిగినఁ, దనివి లేక లోకతతులఁ దిరుగు. ౩౧ 211

[2]క. తనకుం సంతుష్టిమహో, ధన మొదవిన నిస్స్వుఁడైన దాపం బది స్వాం
గనిచయమున నెందేనియుఁ, గనరాకుండంగ నిద్రఁ గాంచుచునుండున్. ౩౨

చ. దొరకినయంతమాత్రమునఁ దుష్టిని బొందుచు భూతరాజి నా
దరమున సాధుబుద్ధిమెయిఁ దన్పుచు సాధువులౌచు శాంతిచేఁ
బరఁగి యహంకృతిం వదలి భాసిలువిప్రులకేఁ దమిం నమ
స్కరణము మస్తకంబున నికామము భక్తినొనర్తుఁ బల్మఱున్. ౩౩ 213

మ. మనుజాధీశ్వరునుండి భావుకము లోకక్ష్మాదేవతేంద్రా! పొసం
గునె మీ కెవ్వనిపాలనంబున జనుల్ కోర్కుల్ చెలంగంగ సుఖం
బును గాంచంగల రాన్నృపుండె ప్రియుఁడౌఁ బో నాకు నత్యంతముం
మనసొప్పారఁగ నాస్వధర్మరతు నే మన్నింతు నం చెన్నుమా. ౩౪ 214

క. చనుదెంచినారు మీరే, జనపదములనుండి! యిట్టిజలనిధిదుర్గం
బును దాఁటి యిచటి కేతెం,చినకార్యం బెట్టిదో వచింపుము ప్రాజ్ఞా! ౩౫

ఉ. వచ్చినకార్య మిట్టిదని వల్కఁగ నయ్యది యుక్తమేని యే

1 "సంతుష్టో యర్హి వర్తేత బ్రాహ్మణో యేన కేనచిత్" అని మూలము. 2 "అసంతుష్టోఽసకృల్లోకానాప్నోత్యపి సురేశ్వరః, అకించనోఽపి సంతుష్టశ్శేతే సర్వాంగవిజ్వరః" అని మూలము.

మిచ్చఁ దలంచివచ్చితివొ యేర్పడఁ దెల్పుము భూసురోత్తమా!
పొచ్చెము లేక చేయుదుము భూసురకార్యముఁ దీర్చుటన్ననో
ముచ్చటగాదె మాకు ననిమోమున సుస్మిత మంకురింపఁగన్. ౩౬. 216

క. మానవదేహము లీలఁగఁ, దానే కైకొనుచు లోకతత్త్వ మెఱిఁగి స
త్పాలకుఁ డగుపరమేష్ఠియు, నీలాగున నడుగ విప్రుఁ డెంతయుఁ బ్రీతిన్. ౩౭

మ. తనదౌ నాగమనంబు రుక్మిణిమనస్తత్త్వంబునుం దెల్పి యి
ట్లను వైదర్భివచించినట్టివిధ మాశర్యా! చక్కనాలించి యే
పనిచేయందగు నంచుఁదోఁచునొ; యెటో భక్తార్తినిం బాపుటో;
వనజాక్షా! తలపోయవయ్య మదిలోఁ బత్త్రంబిదే చూడుమా. ౩౭ 218

క. అని పత్త్రికఁ జదువఁగ న,వ్వనజాయతనేత్రు నాజ్ఞవడసి మొదలిడెఁ
వినుమా! త్రిభువనసుందర!, విన మోదం బిడెడునీదు విమలగుణంబుల్. ౩౭

సీ. ఆలకించెడు వారికా కర్ణరంధ్రము లనుద్వారములమూలముననె లోనఁ
దగఁ బ్రవేశించి హృదయగత తాపంబు హరియించుఁగద యట్టివౌ భవత్సు
గుణములనుఁ; దమకోర్కి దీఱఁగఁ గనువారినేత్రములకు వాంఛితార్థ
ముల ఫలింపఁగఁ జేయుముగ్ధభవద్రూపమును విని విని నాదుమనము లజ్జ
తే. వదలి నీయందె యాసక్తి వఱలె; నీదు
మహిమ మెక్కడ? కులరూపమహితశీల
ములను వెలసియు నించుక తెలియఁజాల
నట్టి నేనెంత? యని యెంచదయ్యె మనసు. ౩౭ 220

*క. కులకన్యల కీధైర్యం, బొలయుట తగునే యటంచు నోయచ్యుత! లోఁ
దలఁపకుము; ముకుందా! గుణ,ముల రూపముచేత శీలమున సద్విద్యన్. ౩౮

క. ధనవృద్ధిచే వయస్సున, ననుపమతేజంబుచేత నాత్మసమానుం
డనఁజను వాని మనోహరుఁ, గని గొప్పఁదనంబు ధృతియుఁ గ్రమ్రకులంబున్.

క. కలిగిన యేసీమంతిని, యిలఁ బతిగ వరింపకుండు? నృహరీ! నరలో
కలలితు నినుఁ గోరుట ని,ష్ఫల నెన్నఁగ నర్హమె యగుఁగబో మహాత్మా!

చ. కనుకనె ప్రాణనాయకునిగా వరియించినదాన నోవిభూ!
వనజదళాక్ష! పెంపెసఁగువాంఛ మదాత్మ సమర్పణంబు చ
క్కనివిధిఁ జేసితిఁ; ద్వరగ గాఢకృపం జనుదెంచి నన్ను భా
ర్యనుగ బరిగ్రహింపుము; మహాత్మ! రవంతయు నాలసించినన్. ౩౯ 224

* "కా త్వా ముకుంద మహతీ కులరూప శీలవయో ద్రవిణధామభిః"అనిమూలము. "అహో కులకన్యానా మిదమతి ధార్ష్ట్యమితి మాశంకీరిత్యాహుః అను దానిభావ మిందుఁగలదు.

[1]మ. హరిభాగం బనియుంచినట్టి బలిని హర్షంబునన్ గ్రోష్టు వె
క్కరణిం గైకొను నట్లు వీరవరవిఖ్యాతిన్ గడుం గ్రాలు నీ
తరుణీరత్నము నన్ను నీచుఁడగు చైద్యక్ష్మావరుం డేడ్తెఱన్
హరియింపన్ వడి వచ్చి ముట్టు నటులౌ టర్హంబుగా దారయన్. ౩౯ 225

[2]చ. పనియది సాగకుండునటు పంకజలోచన ! చేయుమా దయన్
జని మును నేను బూర్తమనుసంజ్ఞఁ జెలంగుతటాకకూపము
ఖ్యనియతకార్యమున్ మఱి మహాధ్వరరూపత నొప్పు నిష్టమున్
గనకముఖప్రదానములఁ గ్రాలెడు దత్తము శాస్త్రరీతిగన్. ౩౯ 226

సీ. ఒనరించి మఱియు మహోత్తమదీర్ఘయాత్రాదుల నొప్పు నియమములఁ దగు
నట్టుగాఁ గృచ్ఛ్రచాంద్రాయణాదికములఁ దగు వ్రతంబును, దేవధరణిదేవ
గురుపూజనంబును గోరి యొనర్చితినేని యింకనుగల మాననీయ
భగవదారాధన ప్రముఖ కార్యంబుల నొనరించితిన యేని యుద్యమమున

తే. నాగదాగ్రజుఁడే వచ్చి యర్హరీతి
నాకరంబును గ్రహియించుఁగాక మఱియు
నన్ను దమఘోషసుతముఖుల్ కన్ను లెత్తి
యైనఁ గనకుంద్రుగాక పుణ్యాతతి శక్తి. ౪౦ 227

చ. నిను దమఘోషసూనునకు నెమ్మి నొసంగిరిగాదె బంధు; లిం
క నిపుడు నేను జేయఁదగుకార్య మదేమియొ యందువేమొ నా
మనవిని బ్రీతిచే విను మమానుషశక్తివి నిన్ జయింప నె
వ్వనికి నశక్యమౌటను వివాహము రేపని నిశ్చయించుటన్. ౪౦౪ 228

చ. ఒరు లెవరేని నెఱుంగనటు లోపరమేశ్వర ! నీవు సైనికో
త్కరపతిసంయుతుండవయి క్రాలుజరాసుతముఖ్యసైన్యముం
ద్వరగఁ గలంచి భీతిఁగొని వాఱఁగఁజేయుచు రాక్షసాఖ్యమై
పరఁగు వివాహపద్ధతిని బౌరుషశుల్క నను న్ గ్రహింపుమీ. ౪౧ 229

తే. పెండ్లియాడుము శత్రుల పీఁచ మడఁచు
టద్ది యటులుండనిమ్ము; మీనాక్షి ! యంతి
పురమునందున్న నినుఁగొని పోవుతఱిని
బంధు లడ్డుపడంగఁ జంపక యదెట్లు. ౪౧ 230

---

1 "మాంవీర భాగమభి మర్శతుచైద్య ఆరాద్గోమాయువన్మృగపతేర్బలిమంబుజాక్ష" అని మూలము. 2 "పూర్తేష్ట దత్తనియమవ్రతదేవ విప్రగుర్వర్చనాదిభిరలంభగవాన్ పరేశః" అని మూలము. "పూర్తం కూపాది. ఇష్టం అగ్నిహోత్రాది. దత్తం హిరణ్యాదిదానం నియమస్తీర్థాట నాదిః. వ్రతం కృచ్ఛ్రాది" అని వ్యాఖ్య.

*చ. నినుఁ గొనిపోవవచ్చు? నని నీరజనేత్ర! వచింతువేమొ చ
క్కనిది యుపాయ మొండలరుఁ గాన వచించెదఁ బెండ్లినాఁటికిన్
మునుపటినాఁడు మంచుమలపుత్త్రిని గొల్వఁగఁ బెండ్లికూఁతు రొ
య్యనఁ బురబాహ్యసీమఁ గలయంబిక యున్నెడ కేగి భక్తితోన్. 231

తే. అంబఁ బూజించు టనెడుసదాచరణము
కలదు; కులదేవయాత్త్ర నాఁ బిలువఁబడెడు
నదియు, నాచారమును దాని ననుసరించి
వత్తు నంతిపురింబాసి వారిజాక్ష. ౮౨ 232

క. సమయం బదియే నినుఁ గొని, యమరులు మెచ్చంగ నరుగనర్హాము నిర్బం
ధమిదింత యేటికో? యనర్థము లెన్నియొ గల్గు దీనఁ దప్పవు తలఁపన్. ౮౨

తే. ఖ్యాతగుణకర్ముఁడౌఁజైద్యు డీతఁటి నతఁ
డర్హుఁ డగునుగదా యంచు ననెదవేమొ
యంబుజాయతలోచనా! యాత్మతమముఁ
బాపుకొనుటకు మానాథుభంగి సతము. ౮౨౪ 234

చ. ధరణిగలట్టి సాధుజనతల్లజు లెవ్వని దివ్యపాదపం
కరుహరజంబుఁ గోరుదురొ కంజభవార్చిత! యట్టినీమనో
హరకరుణావిశేషముల నందఁగ నోఁచనిదాన నైనచో
నిరతిని నామనంబునను నిన్నె తలంచుచుఁ బూనికమీఱఁగన్. ౮౩ 235

చ. వ్రతము లొనర్చి నాదయినవర్ష్మము స్రుక్కఁగఁ బ్రాణరాజి య
ల్లె తనుత నొందఁగా విడుతు నీయది సత్యము కృష్ణ! మాధవా!
శతజను లెత్తిరైన నిను సమ్మతిభర్తగఁ గాంచుదాన నే
వితమునన్నైన రుక్మిణియుఁ బెండ్లియగుర్ నిను నంచు నెన్నుమా.! ౮౩ 236

చ. అనుచుఁ బఠించి విప్రవరుఁ డాకమలేక్షణుఁ గాంచి యింక ని
ట్లనియె యదూద్వహా! యివె రహస్యముగా వచియింపు మంచుఁ దె
ల్పిన నుడు లాసుపత్త్రమును బ్రీతిగఁ దెచ్చితి నీకు నిచ్చితిన్;
గనుఁగొనినాఁడ; వింక నెదికార్యమొ చక్కఁగ లోఁ దలంపుమా! ౮౩౪ 237

చ. తలఁచి ఫలించులాగున ద్రుతంబుగఁ గార్యము చేయఁబూనుమా;
జలరుహనేత్త్ర! కష్టపడుచందముఁ గాంచినవాఁడ నొట దు
ష్టులు చెలరేఁగుచుంటఁ గనుచున్ వగ నొందినవాఁడ నొట ని
ప్పలుకుల విన్నవించితి నుపాయము చెప్పఁగ నేవలంతినే. ౮౮ 238

---

* "బహిర్ణవవధూ ర్గిరిజా ముపేయాత్" అనిమూలము.

## ఏఁబదిమూఁడవ యధ్యాయము.

### శ్రీహరి రుక్మిణిం బెండ్లియాడఁ బ్రయాణమగుట.

చ. అని వచియించి యాశుకమహర్షి నృపాలున కిట్లు తెల్పె; నో
జనవర! యవ్వలం దగిన చక్రిచరిత్రముఁ దెల్పువాఁడ; నా
వనరుహనేత్రుఁ డిక్కరణి బ్రాహ్మణవర్యుఁడు రుక్మిణీప్రియో
క్తినిచయమాలకించి తన కేలను విప్రుని కై గ్రహించుచున్. ౧ 239

క. దరహాస మొప్ప నిట్లను, సరసిజముఖి రీతి నాదు స్వాంతమ్ము నిరం
తర మలరెడు రుక్మిణిపై, ధరణీసుర! నిద్ర లేదు దానన్ నాకున్. ౧౪ 240

క. శుభ మెల్లఁ బుత్తు నెట్లో, నృపతికుమారుండు రుక్మి యెంతయు ద్వేషం
బు పరఁగ రుక్మిణి నాకిచ్చుపనిని వారించి చేయు చొప్పు నెఱుఁగుదున్. ౨ 241

మ. నరపాలాధములన్ రణాంగణమునన్ దర్పంబునం జెండి యా
యరణిన్ జక్కమథించి యగ్నిఁ గొనునట్లా సుందరిన్ సుంత యె
క్కరణిం గాంచిన దోషమే కనని యంగశ్రేణిఁ జెల్వారు మ
త్పరఁ దోడ్తెచ్చెద నమ్ముమా యనుచు నొప్పం బల్కి స్వాంతంబునన్ ౩ 242

చ. తనదు ప్రతిజ్ఞఁ దీర్పఁగ నితాంతము పట్టుదలం జెలంగి యా
దనుజనిషూదనుండు వనితామణి పెండ్లిముహూర్త మేర్పఱిం
చిన విధమెన్ని సారథిని జెచ్చెఱఁ బిల్చి జవంబు మీఱ స్యం
దనమును బూన్పు దారుక! యనన్ హరియానతి మౌళిఁ దాల్చుచున్. ౪ 243

తే. శైబ్యసుగ్రీవమేఘపుష్పకవలాహ
కము లనం బొల్చు వాజివర్యములఁ బూన్చి
యరద మాయత్తపఱచి మురారికడకుఁ
దెచ్చి నిలుచుండెఁ గై మోడ్చు తేటపడఁగ. ౫ 244

మ. తన ప్రోలం దగు స్యందనంబు హరియుం దా నెక్కి విప్రోత్తముం
డును దో నెక్కఁగ వాహనంబులు కదన్ నూత్నోత్సవం బొప్పఁగాఁ
జన నానర్తము నుండి రాత్రి నొకటన్ సంతోష మొప్పన్ విద
ర్భను జేరం జనెఁ; గుండినాధిపతి పుత్రస్నేహలోలాత్ముఁడై. ౬ 245

తే. తా స్వతంత్రించి చేయంగఁ దలఁపనట్టి, వాఁడు గావున శిశుపాలుఁ డీడు రుక్మి
ణికి నటం చీయఁగా నెంచి నిగమవరముఁ, జక్కఁగా సేయఁగాఁ బంచెఁ దక్కుపనుల.

క. త్వరగా నొనరుపఁ బంచెను, బరిణయ మాసన్న మగుటఁ బార్థివునాజ్ఞన్
శిరములఁ దాల్చి సేవకు, లరుదుగఁ గై చేసి రా పురాంతర మెల్లన్. ౭ 247

సీ. మార్గాళిరథ్యల మహితచత్వరములఁ జక్కఁగా నూడ్చి వాసనగలట్టి
జలములు చల్లిరి చారువిచిత్రధ్వజములఁ గేతనతోరణముల నెల్ల

తావులఁ గై చేసి ♦ రావిధంబునఁ బురమంతయు శృంగారవంత మగుచుఁ
జూడఁగాఁ దగియుండె ♦ సుదతులు పురుషులు పుష్పహారమ్ములఁ బూని దాల్చి

తే. కలపము లలంది రత్నసంఖచితభూష
ణములు ధరియించి వెలలేక ♦ యమలములయి
తనరు నంబరములఁ గట్టి ♦ కనుఁగొనంగఁ
దగినయట్లుండి రెంతొ ముదంబుపొదల. ౯  248

క. భవనవరములు నగురుధూపవాసనల నొప్పుచుండె: ♦ బార్థివవర్యుం
డవలం బితృదేవతలకు,ను విబుధులకు భూసురులకు నుర్ భక్తిమెయిన్. ౯౪

క. సవిధిగ నర్చనలిడి శు,భ్రవస్తువారంబు వెలయ ♦ బంధురతృప్తిన్
సవరించు భోజనం బిడి, నవవధువునకును శుభం బనారత మొందన్. ౧౦

[1]ఆ. స్వస్తివాచనంబు ♦ క్ష్మాసురవర్యులు, చేయఁ దృప్తినొందెఁ న్యాయరీతి
స్నాతయగుచుఁ బెండ్లిసమయమునం గట్టు,కొనఁగఁదగిన సూత్రముసుధరించి.

సీ. మూల్యమింతని పల్కఁబోలని నూతనవస్త్రయుగ్మముఁదాల్చి ♦ భాసమాన
భూషణంబులచేత ♦ భూషితయై యొప్పుసుదతి రుక్మిణిఁ గన్య ♦ శోభనాంగి
నలరించి రాభీష్మ కాజ్ఞఁ జేడియలెల్ల నంత బ్రాహ్మణవర్య ♦ లర్హరీతి
సామర్గ్యజుర్మంత్రసమితి రక్షాబంధనమను కృత్యమ్మున ♦ నాతిమిన్నఁ

ఆ. బెండ్లికిఁ దగినట్టివిధమున నలరించి, రటఁ బురోహితుండు ♦ పటుతరమగు
నయ్యథర్వవేద ♦ మంత్రయోఱుంగును, గాన [2]ఖేటశాంతిఁ ♦ బూనిచేయ ౧౨

క. తలపోసి యుచితమంత్రం,బుల హోమముచేసె; నంత ♦ భూపతి విధివే
త్తలలో నగ్ర్యుఁడుగావున, నిలామరోత్తములఁ బిల్చి హేమమ్ముఁ దగన్. ౧౩౪

క. శ్వేతము నమూల్యవస్త్ర, వ్రాతము గుడమిశ్రితముగ ♦ వఱలుతిలల సం
ప్రీతిగ నొసఁగెను గోసం,ఘాతము దానంబుచేసె ♦ గ్రహశాంతికి నై. ౧౩ 254

చ. తనసుత మేలుకోరి నృపతల్లజుఁ డివ్విధి నిట్లు చేయఁగా
వినయవిదుండు చేదిపృథివీపతియా దమఘోషుఁ డచ్చటం
బనిగొని పుత్త్రుఁడైన శిశుపాలుని యభ్యుదయంబుగోరి మం
త్రనికరవేత్తలం బిలిచి ♦ తత్కృతి కర్మములొ క్రియావళుల్. ౧౪  255

క. వరుసగఁ జేయించె; ననం,తర మాదమఘోషుఁ డుర్ మదచ్యుతిఁదగు భీ
కరదంతిసంతతులు క,ర్బురమాలాజాలములను ♦ బొల్చురథంబుల్. ౧౫  256

క. పీతివరంబులు సుభట, వ్రాతంబులు గలుగుసైన్యవారము కొలువన్

1 "కృతకౌతుకమంగళాం" అని మూలము." కృతం కౌతుకేన వివాహసూత్రేణ మంగళం యస్యాస్తామ్" అని శ్రీధరాచార్యులు. |2 ¶ "ఖేటశాంతి" గ్రహములను బ్రసన్నులనుగాఁ జేయుం కార్యము.

ప్రీతుండై కుండినపురి, కేతెంచెం బెండ్లివేడ్క । యెంతయుఁ బొదలన్. ౧౫౩

ఉ. కుండినపత్తనంబు తన । కుండ సుఖవాసముగాఁ జెలంగ దో
ర్దండబలాధికుండయి వి । దర్భుల నేలెడుభీష్మకుండు రా
ణ్మండనుఁ డాధరాపతి స । మస్తవిధంబులఁ బూజ్యుఁడౌట నా
ఖండలతుల్యుఁడౌటఁ గన । గాఁ జని పూజలఁ దన్పి చక్కఁగాన్. ౧౫౪ 258

ఉ. సంతస మగ్గలింప నొక । సద్మవరంబు తదర్థకల్పితం
బెంతయు సుందరంబునయి । యెల్లవిధంబుల వాసయోగ్యమై
వింతగ నొప్పు నందుఁ బృథి । వీపతి నుండఁగఁ జేసె; నంతటం
బంతముమీఱ సాల్వనర । పాలజరాతనయుల్ ససైన్యులై. ౧౬౪ 259

తే. దంతవక్త్రవిదూరథ । ధరణిపతులు
పౌండ్రకాదులు శిశుపాల । పక్షనృపులు
వేనవేలుగ వచ్చి యా । వీట విడిసి
రాహలిజనార్దనులకుఁ దా । రరులుగాన. ౧౭ 260

చ. హరిచను దెంచి యాదవబ । లాన్వితుఁడై హలి తోడుగాఁగ భూ
వరు తనయామణిన్ బలము । సర్థిలఁగా హరియించునేమొ భీ
కరబలయుక్తి మార్కొని ని । కామము విక్రమ మొప్పుచుండ సం
గర మొనరించి చైద్యునకుఁ । గన్నియఁ గూర్త మటంచు నెన్నుచున్. ౧౮

ఉ. ఒక్కటిగాఁగనుండి మన । ముద్ధతిఁ గార్యముదీర్పనౌ మదం
బెక్కిన రామకృష్ణుల జ । యింప నిదే సమయం బటంచు వా
రక్కటికంబుమీఱఁ జతు । రంగబలంబులఁగూడి వచ్చి రే
దిక్కునఁజూడఁ దారెయయి । తీవ్రనుతుల్ దగ భూవరోత్తముల్. ౧౯ 262

ఉ. సేనకు నంతలేక తమ । చేరువరా నితరక్షమాపతుల్
పూనిక వచ్చి రానృపతి । పుంగవుఁ జూడఁగ నంత భీష్మకుం
డానృపతీశులన్ రుచిర । హర్మ్యములన్ విడియంగఁజేసె; ని
ట్లానరనాథు లొక్కమొగి । నం దొనరింపఁగఁ బూనుయత్నమున్. ౧౯౪ 263

చ. విని భగవంతుఁడౌ హలియు । వీరవిరోధిచయంబుగూడె నా
యనుజుఁడు కన్నియన్ బలిమి । నందఱుచూడ గ్రహింప నొక్కఁడే
చనియెను సంగరం బచట । సాగెడుచిహ్నము లెల్లఁదోఁచె నం
చును మదినెన్ని కృష్ణుపయిఁ । జొప్పడుస్నేహము తన్నుఁ గ్రమ్మఁగన్. ౨౦౪

మ. చతురంగంబులుగాఁ జెలంగుబలముల్ । స్ఫారోత్సవంబొప్ప రా
నతివేగంబునఁ గుండినంబున కహం । కార్యప్రాభవంబొప్ప ను
ద్ధతశత్రుప్రతతిన్ గలంపఁ జని సో । దర్యున్ హరిం గూడె; న

చ్యుతు రాకఁ దమిఁగోరు రుక్మిణియు నాఽయుర్వీసురుం బంపి తాన్. ౨౧౪

చ. హరి యరుదెంచునంచు మదిఽనాతురతం గనుచుంట శ్రీమనో
హరుఁడగు కృష్ణునాశయముఽనంతయుఁ గైకొని విప్రుఁడింకనుఁ
మరలి గృహంబుచేరమికిఽమానసమం దిటులెంచె; నక్కటా!
పరమకృపాపయోధియయిఽభాసిలు శ్రీహరి రాఁడు నేఁటికిన్. ౨౨౪ 266

ఉ. కారణమేమొ యంచరయఁఽగాఁ గనుపట్టదు నాకుఁ బెండ్లిదా
మూరుత మెల్లియే యనుచుఽభూసురవర్యులు నిశ్చయించి రిం
కీరజనిం బురంబునకుఽనిచ్చటికిఁ హరి రాకపోవునేఁ
గోరిక యెల్ల వ్యర్థమె యఽగుఁ దురదృష్టమె యంచు నెన్ననో. ౨౩ 267

తే. రేయి యిది యొక్కటియె యంతఽరితముగా వి
వాహ మున్నది; దురదృష్టఽవంతురాల
నౌదు హరిరాకతక్కిన ఽ నస్మదీయ
మైన సందేశమును గొనిఽయాద్విజుండు. ౨౩౪ 268

చ. వనరుహనేత్రు నాశయముఽవైఖరిఁ జక్క నెఱింగి తాను నిం
కను జనుదేరఁ డేమొకొ; యఽకల్మషచిత్తుఁడు శ్రీనివాసుఁ డా
త్మను ననుఁగూర్చి శంకఁగొనిఽమానెనొకో, యిదియేటికంచు న
న్గొనఁ దగదంచు; విప్రవరుఁఽగూడియె తాఁ జనుదేఁ దలంచియున్. ౨౪ 269

*క. దురదృష్టవంతురాలను, బరికింపఁగ నేను గనుకఽబ్రాహ్మణుఁడును రాఁ
డురుమతికి హరికి ననుని,చ్చురతిం గనువాఁ డొకండుఽచూపట్టఁ డిటన్. ౨౪౪

మ. అనుకంపానిధి యామహేశ్వరుఁడు నెయ్యంబొప్ప నావాంఛితం
బును బూరింపఁడొ? దేవియంచు గిరిరాఽట్పుత్రీవతంసం బటం
చును రుద్రాణి యటంచు గౌరియు నటంఽచుఁ ఖ్యాతిఁగన్నట్టి యీ
శునిసాధ్వీమణియైన నాపయిఁ గృపంఽజూపంగ వాంఛింపదో?. ౨౫ 271

మ. అని చింతించుచుఁ గృష్ణమూర్తిపయి నెయ్యంబట్టె యుప్పొంగ నె
మ్మన మా శ్రీశునియందె నిల్వ నిపుడేఽమానాయకుం డేగుదెం
చిన జాడల్ గనరా నటంచుఁ దనదృఽష్టిద్వంద్వమశ్రూదబిం
దునికాయాకులమై తగంగ మొగిచెంఽదోడ్తోనఁ బె న్వంతచేన్. ౨౬ 272

క. గోవిందు శుభాగమనం, బీవిధిఁ గాంక్షించునట్టిఽయెలనాగకు న
ప్డే వామభుజదృగూరువు, లావంత యడంగ శుభముఽలగు నని తోఁపన్.

క. అదరెను బలుసారులు స, మ్మద మయ్యెడ నంకురింపఽమఱుక్షణమునఁ బ

* "దుర్భగాయా న మే ధాతా నానుకూలో మహేశ్వరః" అని మూలము. "ధాతాహిరణ్యగర్భేనా పాలకే ధారకేపిచ ఇలిధరణిః" అని టీక.

ద్మదళాక్షుకడకు మును దా, నెదికోరి వచించి పంపెఁ ౹ బృథ్వీసురునిన్. ౨౮

*చ. అతఁడు ముకుందునాశయము ౹ నల్లనఁ గైకొని కుండినంబు సం
గతిఁదగు నావిహారవన౹క్రమ్రతలంబున పీడి వచ్చి రా
జతనయసౌధసీమఁ గనె ౹ క్ష్మాసురుఁ డాతఁడు మోమునందు సు
స్మితము చెలంగ మోదమును ౹ మిక్కిలిదెల్పెడు దేహ మొప్పఁగన్. ౨౭౪ 275

చ. కనఁబడినంతనే సుదతి ౹ కార్యగతుల్ తెలుపంగఁ జాలుదా
తనిఖిలలక్షణంబులని౹తాంత మెఱింగిన ప్రోడ గాన మో
మునఁ జిఱునవ్వు వెల్వడఁగఁ ౹ బొంకముగా నడిగెన్ సమస్తముర్
వనజదళాక్షుఁ డిచ్చటికి ౹ వచ్చెను రామునిగూడి సుందరి. ౨౯౪ 276

చ. అని తెలియంగఁ జెప్పి వసు౹ధామరుఁ డాయదునందనుండు నిన్
గొనిచనువాఁడ నంచుఁ దన౹కోర్కి యిదే యని పల్కినట్టి చ
క్కనిదగుసూనృతోక్తిని ద౹గన్ వినిపించెను; భీష్మకక్షితి
శుని ప్రియపుత్త్రి రుక్మిణియుఁ ౹ జొక్కపుఁబ్రీతిని నాశుభోక్తిసిన్. ౩౦ 277

చ. అరుదుగ నాలకించి వన౹జాక్షుని యాగమనం బెఱింగి యా
ధరణిసురోపకారమును ౹ దాఁ దలపోసి మహోపకార మ
త్తరుణమునందు వేఱొకఁ డొదం దలపోసి యొనర్పఁ గాన కా
దరమున మ్రొక్కె; నేమిడిన ౹ దానికి నీడగునే తలంపఁగన్. ౩౧ 278

సీ. భీష్మకుండును దన౹ప్రియపుత్త్రి కోద్వాహదర్శనోత్సుకులయి ౹ ద్వారకాపు
రమునుండి కృష్ణుఁడు౹రాముఁడు వచ్చుట విని వాద్యఘోషముల్ ౹ వెలయ నెదురు
చని యథావిధిగఁ బూ౹జలుసల్పె; మధుపర్క మిడి మహార్హములని ౹ యెన్నఁబడిన
యంబరముల నిచ్చి ౹ యవల నభీష్టములగు నుపాయనముల ౹ నాదరమున

తే. నొసఁగి పూజించె; భీష్మకుం౹డురుతరమతి,యగుట నాసోదరులకు సై౹న్యమ్ములకును
దదనుచరులకు సద్వస్తు౹తతులఁ దగిన, విడుదులను గూర్చె నాతిథ్య౹విధిని జరప.

క. ఈరీతిఁగూడి యున్నమ,హీరమణుల కెల్ల శౌర్య ౹ మెట్టిదో ప్రాయం
బేరీతియొ బల మెట్టిదొ, సారధనం బెట్లొ తదను౹సారముగాఁగన్. ౩౪౪ 280

క. తగినవిధానంబున నా, జగతీరమణుండు పూజ ౹ సంతసమునఁ జే
యఁగ వారు సంతసించిరి, తొగచెలువునిబావ సేస౹తో నరుదేరన్. ౩౫ 281

ఉ. వీనులవిందుగా విని ప్ర౹వృద్ధముదంబున నవ్విదర్భలో
మానవులెల్ల నొండొరుల ౹ మాసక చీరుచు "రండు రండు శ్రీ
జానిని జూడఁగా" ననుచుఁ ౹ జయ్యన వచ్చి ముకుందుపావన

* "సా తం ప్రహృష్టవదన మవ్యగ్రాత్మగతిం సతీ" అనిమూలము. "నవ్యగ్రా ఆత్మనో దేహస్య గతి ర్యస్య తం" అని వ్యాఖ్య.

శ్రీనిలయాననాంబుజ వికస్వరపుష్పరసంబుఁ దృప్తిగన్. ౩౫౼ 282

క. ఈక్షణరూపాంజలులన్, దక్షత మీఱంగ నట్టె త్రావిరి; మఱియున్
వీక్షించి లోకసుందరు, నక్షిఫలం బిదియె యనెడునాశయ మొలయన్. ౩౬

ఉ. ఈమహనీయమూర్తికె మహీపతి పుత్త్రిక యెల్లభంగులం
బ్రేమకుఁ బాత్రమై తగినప్రేయసి కాఁదగు నీముకుందుఁడే
భామకు నీడుజోడయిన ప్రాణవిభుండయి యొప్పఁగాఁదగున్
నోముఫలం బనంగ నిదె సత్యమగుంగద యిట్లు గూడినన్. ౩౭ 284

చ. పురుషలలాముఁడౌ నితఁడె పో మనరుక్మిణి కెన్న నర్హుఁడౌఁ;
దరుణియె వీనికిం దగు; విధాతయు నిట్లొడఁగూర్చెనేని య
చ్చెరువుగఁ జూచి మెచ్చఁదగు; శీఘ్రము పెండిలియైన మేలె; యీ
ధర నిఁకనొక్క రిర్వురకుఁ దత్త్వముగాఁ దగ రెంత చూచినన్. ౩౭ 285

మ. మనమేదే సుకృతం బొనర్చిన మహామాన్యుండు లోకత్రయం
బును నిర్మించినధాత దాననె సుతృప్తుండయ్యెనే రుక్మిణీ
వనజాతాయతనేత్ర నీహరి తమిన్ భావించి చేపట్టు న
ట్లనుకంపామతిఁ జేయుఁగా! కని ప్రహర్షాశ్రూదకంబుల్ త్వరన్. ౩౮ 286

క. ఒక్కట గళముల నాపఁగ, నొక్కరితో నొకరుఁ గాఁగ నురుయత్నమునన్
జక్కఁగను దెల్పుకొని రి, ట్టిక్కడ సల్లాపములవి యొసఁగుచు నుండన్. ౩౮౼

రుక్మిణి గౌరిని దర్శింపఁబోవుట.

చ. నవవధు వెట్టివేషము గొనందగు నట్టులె రుక్మిణీసరో
భవదళనేత్ర యొప్ప భటవర్యులు నల్గడలం జెలంగి రా
భవసతి యాలయంబునకుఁ బాదగతుల్ చెలువంబుసూప రా
డ్భవనవరంబు వెల్వడియెఁ బర్వతజాపదపద్మముల్ గనన్. ౩౯౼ 288

చ. పరశివురాణినిం గొలువ భద్రము లబ్బు నటన్న నమ్మికన్
స్సురుచిరగాత్రి రుక్మిణి ప్రసూనశరుం గనినట్టి యాకృతి
స్ఫురణమునం జెలంగుమధుసూదను పాదసరోజయుగ్మ మా
దరమున నెమ్మనంబునను ధ్యానము చేయుచు మౌననిష్ఠమై. ౪౦ 289

ఉ. తల్లులు నెచ్చెలుల్ తనదుదాపున నల్గడలం జెలంగి రా
నుల్లము శ్రీహరిం దలఁచుచుండఁగ నాయుధముల్ కరంబులం
దెల్లెడ రోచులం బఱపి యెంతయు భీతిని గొల్పుచుండ రా
జిల్లుచు శూరులౌ భటులు చెంతనె హెచ్చరికల్ తగంగ రాన్. ౪౦౼ 290

చ. చనుచున్ రాడ్భటరక్షిత, యనఁ దగుచు మృదంగపణవహారిరవము శం
ఖనికరరవములు లోనగు, ఘనతూర్యధ్వనులు భేరికానినదంబుల్. ౪౧ 291

క. ధరణిని దివముఁ జెవుడ్పడఁ, బరిపరి నొనరించుచుండఁ బయనము సాగిం
చె రమాధవు నెదఁ దలఁచుచు, [1]నిరుపమలావణ్యయుగ్గణిక లొక్క మొగిన్.

క. నానోపహారబలులన్, జానుగఁ గైకొనుచుఁ దోడఁ జనుదేరఁగ భూ
జానిసుత యేగె నల్లన, భూనిర్జరపత్ను లమల భూషణయుత లై. ౨౨ 293

సీ. గంధమాల్యంబులఁ గమ్రభూషణవస్త్ర
ములను గైకొని రాఁగ లలితగేయ
ములను బాడుచు గాయకులు వెంటరా; సూత
వందిమాగధులు స్తవములు చేయు
చును దోడఁజనుదేరఁగను; వాద్యగాండ్రు మం
గళవాద్యరవము లొక్కమొగి దిక్కు
లెల్ల నిండఁగఁజేయు చల్లనరా; నవ
వధువు మెల్లనఁ బోయెఁ బార్వతివిజ

తే. యంబుచేసినచోటికి నంత రుక్మిణియు; సుమాలయమును గని నియతి హస్త
పదసరోజంబులను శుద్ధపాథసులను, గడుగుకొని యాచమించి నిష్కామభక్తి.

క. పరిశుద్ధచిత్తయై గుహ,తరశాంతి చెలంగ నంబదాపున కేగెన్;
వరవిధుల నెఱుఁగుముదుసలి, పురంధ్రు లాబాల నెంతొ పొలు పమరంగన్.

[2]చ. తొలుత భవాని కవ్వల విధుప్రియభూషణుఁ డై చెలంగి ని
స్తులకృప నొప్పు శంభునకుఁ దొయ్యలి మ్రొక్కఁగ నా నటన్న చొ
ప్పులఁ దలపోసి శంకరుని పొందిక వేడ్కఁ జెలంగు నంబకున్
లలితకు మ్రొక్కఁజేసిరి కులక్రమరీతి నభీష్టసిద్ధికై. ౨౫ 296

చ. నరవరపుత్రి యాదరమునం బ్రణమిల్లి తలంచె నిట్టులం
బరో! శుభమూర్తివైన భవపత్నికి నీకును ద్వత్కుమారకో
త్కరమునకున్ మహేశునకు గాదిలి ప్రీతిని మ్రొక్కు నాకు శ్రీ
వరుఁడగు శ్యామసుందరుఁడె భర్తగ నొగతి సమ్మతింపుమా!. ౨౬ 297

క. ఆత్మారాముఁడె యగుపర,మాత్మ భవత్పతి యదెట్టు లగు ననెదవొ నీ
యాత్మఁ దలంచినచోఁ బర,మాత్మయు మన్నించు దాని ననియె యెఱుఁగుదున్.

మ. అని ప్రార్థించుచు లేచి విప్రసతు లత్యంతప్రమోదంబునం
దనవెంటం దగ శాస్త్రయుక్తముగ రుద్రాణిం గృతస్నాతఁగా

1 "వారముఖ్యాస్సహస్రశః" అని మూలము. "వారముఖ్యాః గణికోత్తమాః" అని శ్రీధరాచార్యులు. 2 "భవానీం వందయాంచక్రు ర్భవపత్నీంభవాన్వితాం" అని మూలము. "భవస్యోపసర్జనత్వం స్త్రీకర్మోచితముక్తం" అని శ్రీధరాచార్యులు. "స్త్రీకర్మ సుస్త్రీణామేవ ప్రాధాన్యమితిద్యోతనాయేతి భావః. విధిజ్ఞాః స్త్రీశాస్త్రకుశలాః" అని వంశీధరి.

నొనరించెన్ మఱి చందనాక్షతలచే నొప్పారు మాల్యంబులన్
గనకప్రాంచితరత్నభూషణములం గప్రమ్రాంబరశ్రేణులన్. ౪౬ 299

క. అలరించి ధూపదీపంబుల నిచ్చి యనేకరూపములఁ దగుభక్ష్యం
బుల బలుల సమర్పించుచుఁ, బలువిధముల హారతులను బ్రత్యేకముగన్. ౪౭

సీ. అర్పించెఁ; బతియుక్తలగు విప్రసతులకు భక్తిని లవణసంయుక్తములగు
నయ్యపూపంబుల నల్లి తాంబూలంబులను గంఠసూత్రంబులను ఫలములఁ
జెఱుకుదండముల నచ్చెరువుగ నొసఁగుచుఁ బూజించె ముత్తైదువులును దేవి
కర్పించినట్టి మాంగల్యములను నొసంగుచుఁ బెండ్లికూఁతునకు సంప్రీతి నొసఁగు

తే. నాశిషంబు లొసంగి రయ్యబల యంబి
కకును ముత్తైదువులకు నొక్కమగుభక్తి
వందన మొనర్చి నిర్మాల్యమును దమిఁ గొని
మున్ను పూనిన యమ్మౌనముద్ర వదలి. ౪౮ 301

*క. ఆలయమునుండి వెడలం, గా లలనామణి యొకర్తుక [1]చిరత్నమణీ
జాలాంచిత ముద్రారుచు, లోలిం దగుపాణిఁగొనుచు సుద్యమ మలరన్. ౪౯

చ. తనకరపల్లవం బలరఁ దా మెలమెల్లన వెన్కవెన్కకుం
జనఁగ మరాళరాజగతిఁ జక్కఁగనొప్పఁగఁ బోవుచుండె; నా
మనుజపతీంద్రుపుత్త్రిక సుమధ్యమఁ గుండలమండితాననన్
గనుఁగొని రెంతొచిత్రముగ క్ష్మాపతిసూనులు నిండువేడుకన్. ౫౦ 303

సీ. ఆరుక్మిణీకన్య యమలరత్నాంచిత కనకమేఖలయును సొగసును జిలుకు
చనునితంబము పయిఁ గనఁబడుచుండంగఁ బ్రాయంపుబిగువునుబయలుపడఁగఁ
జేయుపాలిండ్లు విచిత్రంబులుగ నొప్పఁ; గుంతలమ్ములు పయికొనునొ యనుచు
శంక నొందినయట్లు చపలమ్ములగు నీక్షణము లొప్పుచూపంగ నమరు సుస్మి

తే. తమునఁదగిబింబఫలసమాధరరుచులను
మొల్ల మొగ్గలఁబోలుచు నుల్లసిల్లు
దంతములు రక్తవర్ణత నెంతయుఁ దగ
వీరసమ్మోహిని యగుచు వెడలె నెలమి. ౫౧ 304

చ. గలగలమ్రోఁగు నందియలకాంతులు నగ్రతలంబుఁ గ్రమ్ముచున్
వెలికిని బాఱుచుండ నొకవింతగఁ బాదము లుర్వి మోపుచున్
లలితమరాళరాజగతులన్ మఱపించుగతుల్ చెలంగ నా
లలనయు శ్యామ నాఁదగి విలాసము మూర్తి ధరించినట్లుగన్. ౫౨ 305

* "ప్రగృహ్యపాణినాభృత్యాంరత్నముద్రోపశోభినా" అని మూలము. "రత్నముద్రా = రత్నాంగుళీయకమ్" అనివ్యాఖ్య. 1 చిరత్నము = చిరంతనమని యర్థము.

[1]చ. కనఁబడి దేవమాయయొకొ కానియెడన్ ధర నిట్టిరూప మొ
ప్పునె యని గుంపుగూడి యశముల్ దిశలందగు వీరులెల్ల మో
హినియె యటన్న యూహ తము నెంతయు నేచఁగఁ జూచి చూచి నె
మ్మనముల మోహమొంది రభిమానము వీడి తదేకదృష్టులై. 306

మ. కులదైవంబును బ్రాక్తనాచరణభంగుల్ పూన్కిఁ బాటించు నా
చలముం బన్ని స్వకీయశోభలను గృష్ణస్వామి కర్పించుచున్
గలహంసైకగతుల్ చెలంగఁ జను నాకంజాక్షి వీక్షించి రా
జిలు తద్ధాసముచేఁ ద్రపామిళితమై చెల్వారువాల్చూపులన్. 307

[2]మ. తమచిత్తంబులు ధైర్యమున్ వదలి వింతం బూనియుండంగ భూ
రమణుల్ కేల ధరించియున్న గురుశస్త్రవ్రాతముల్ జాఱి వే
గ మహిం బర్వఁగ దంతిఘోటకశతాంగశ్రేణిపైనుండి మో
హము మున్పన్ ధరణీస్థలిం బడిరి యంత్రాళిన్ విడంబించుచున్. 308

వ. అప్పుడు. 309

మ. తరుణీరత్నము పద్మకోశనిభపాదద్వంద్వమున్ మెల్లనన్
ధరణిన్ సోఁకఁగఁ జేయుచున్ మనమునన్ దైత్యారిరాకన్ నిరం
తరముం గోరుచుఁ జూర్ణకుంతలవితానం బాస్యపద్మంబుపైఁ
బరఁగన్ డాపలిచేతి గోళ్లతుదలం బల్మాఱుపోఁ ద్రోయుచున్. 310

[3]ఉ. వామకటాక్షదృష్టులను వచ్చి తనుంగని మోహమొందు నా
భూమిపతివ్రజంబు నొకపోలిక సిగ్గునఁ గాంచె; నంతలో
నే మహనీయమూర్తిఁ దగు కృష్ణునిఁ దా నెదఁ గోరుసంతత
శ్రీమహితుం గనుంగొనియెఁ జిత్రమనోరథముల్ ఫలింపఁగన్. 311

**శ్రీకృష్ణుఁడు రుక్మిణిఁ దనరథంబుపై నెక్కించుకొని ప్రయాణముసాగించుట.**

చ. తనయరదంబు నెక్కఁగ నితాంతకుతూహల మొందుచున్న రా
ట్తనయనుగాంచి కృష్ణుఁ డహితక్షితిపాలుర లెక్కచేయ కా
జనపతు లట్టె కన్గొనఁగ సాహసమూని సుపర్ణకేతనం
బునఁ దగు స్యందనంబుపయిఁ బొల్పుఁగ నెక్కఁగఁజేసి వేడ్కమై. 312

1 "యశస్విన స్తత్కృతహృచ్ఛయార్దితాః" అని మూలము. "తత్కృతోమాయాప్రతీతిజనితోయోహృచ్ఛయః కామ స్తేనార్దితాః" అనిటీక. 2 "పేతుః క్షితౌ గజరథాశ్వగతా విమూఢాః" అని మూలము. 3 "ఉత్సార్య వామకరజైరలకానపాంగైః ప్రాప్తాన్ హ్రియైక్షత నృపాన్ దదృశే౽చ్యుతంసా" అని మూలము.

ఉ. వంచకమధ్యసంస్థనిజభాగముఁ గైకొనిపోవు సింగమ
గ్లొంచక రాజలోకము నహీనపరాక్రమ ముల్లసిల్లఁగాఁ
గాంచనచేలుఁ డాబలముఖప్రకటాహవశూరు లెల్లఁ బో
ష్మం చూగిఁ బ్రోత్సహింపఁగ నృపాత్మజఁ గైకొని పోయె మెల్లఁగన్. ౫౬ 313

మ. దురహంకారము గ్రమ్మియున్న జననాథుల్ మాగధాదుల్ తమున్
హరి లెక్కింపక రుక్మిణిం గొనుచు నొయ్యారంబునం బోవఁగా
స్థిరమా స్వీయయశంబు తగ్గుననుచుం జింతించి యోర్వంగలే
క రయంబొప్పఁగ నొక్కటం గలిసి రాకార్యంబుఁ జింతింపఁగన్. ౫౭ 314

క. ఔరా! ధానుష్కులలోఁ, బేరుంగని యున్నమనలఁ బృథివీశ్వరులం
జీరికిఁ గొనక మృగేంద్రుని, సారయశంబున్ వృకాళి చక్కఁ గొనుగతిన్. ౫౩

క. తరుణిన్ హరించి గోపులు, పరుగిడు చున్నారు వారె పరికింపుఁడు; డిసీ!
ధర నస్మద్యశ మేటికి, బరాక్రమం బేటి? కనుచు వగచిరి పెలుచన్. ౫౩



## ఏఁబదినాల్గవ యధ్యాయము

శ్రీకృష్ణు నడ్డగించి రాజు లోడుట.

క. వారెల్ల రిట్లు చింతా,వారిధి మున్గుచు నితాంతభయకృత్ప్రౌఢ
స్ఫారపరీవృతమతు లై, యారోహించిరి స్వవాహనాళిఁ గడంకన్. ౧ 317

ఆ. ఉరవడించి తమమహోన్నత కవచముల్, దొడిగి బలము లెల్లఁ దోడఁ గొలిచి
నడువ ధనువు లూనినారాయణుని వెంటఁ, దగిలి రేపుసూపి తన్విఁగొనఁగ. ౨

మ. యదుసేనాపతు లావిధం బెఱిఁగి యత్యంతోత్సవంబొప్ప భీ
తిదయత్నంబునఁ జాపధారులయి పృథ్వీనాయకుల్ మార్కొనం
గ దగన్ వచ్చుటఁ గాంచి కార్ముకములన్ గాఢంబుగా దీటుచున్
బ్రదర వ్రాతముఁ గూర్చి వారి కెదురై పంచాస్యనాదంబులన్. ౩ 319

క. ధరణిన్ వ్యోమము నింపుచు, నరులన్ మార్కొనిరి; వారిదగుసన్నాహం
బరయుచు శత్రుమహీపతు, లురుపౌరుష మొప్పఁ దాఁకి రుద్ధతిమెఱయన్.

సీ. అశ్వపృష్ఠంబులయందు గజస్కంధములయందు స్యందనములకు నడుమ
నుండి యుద్ధముచేయు నుద్యమమందు నేర్పఱులుగావున ముదిరములుభూధ్ర
ములపయి వర్షధారలు గురియించెడు నట్లు మార్గణవృష్టి యాదవాళి
పయిఁ గురియించిరి పటుతరసాయకచ్ఛన్నమై తగుపతి సేనఁగాంచి

తే. చారుమధ్యమ రుక్మిణి సాధ్వసమున
విహ్వలాంబకయుగళయై వ్రీడయుఁ దనుఁ

గూడఁ బ్రాణేశుమోమును § గోర్కెఁ దీర్పు
నన్న భావముతోఁ బంగ § నపుడు గాంచె. ౪ 321

చ తనుఁగనువామనేత్రఁ గని § తామరసాక్షుఁడు ప్రేయసీ! మనం
బున భయమొందఁబోకుము; రిపుప్రకరంబుల నీదుబంధులం
దునిమెద; నిప్పుడే కనుము § ధూర్తులు గావున మార్కొనంగ ని
న్గొని చన వచ్చినారనుచుఁ § గోమలసుస్మిత మొప్పఁ బల్కుచున్ ౫ 322

క. సతి నూఱడించె; గదుఁడ,చ్యుతు నగ్రజుఁ డాదియైన § శూరవరుల్ స్వ
ప్రతిపక్షుల శూరత య,వ్వితమునఁ దమసేన నొంచు§విధముం గనుచున్. ౫

క. దానిఁ సైరింపక రిపు, సేనలపై దంతివితతి § సింధుజరథసం
తానముల బాణవర్షము,చే నెంతయు దీనతఁ గనఁ § జేసిరి పూన్కిన్. ౬ 324

సీ. అరదమ్ములం దున్న§యాశూరులయు నాశ్వికులయు గజాళులఁ § గూరుచున్న
వారలయుఁ దలలు § వరకుండలకిరీటములను జారూష్ణీష§ములను వెలుఁగు
నవి బాణములచేత § నపుడు ఛేదింపఁగఁబడి కోటులుగ ధర§వ్రాలె; మఱియు
నసిగదాచాపయు § గ్హస్తముల్ ముంజేతు లూరువుల్ పాదము§ లురుశరాభి

తే. హతులఁ దునుఁగుచుఁ గూలె న§య్యవనియందు;
ఘోటకాశ్వతరవ్రాత § కుంజరోష్ట్ర
ఖరశిరంబులు మఱియును § గాలుబంట్ల
శిరము లట్టులె పడి కడుఁ § దొరలుచుండె. ౭ 325

చ. అరుల జయించుకోరికల § నాయదువీరులు వృష్ణిముఖ్యులా
దరమున నుగ్రపౌరుషము§తోఁ గడు నొంపఁగ బీర మాఱఁగా
నరిశరహన్యమానమగు § నాత్మబలంబును గాంచి చాల సం
గరవిముఖత్వ మొంది నృప§కాంతులు మాగధముఖ్యు లార్తులై. ౮ 326

చ. వెనుకకుఁ బోయి యొక్కయెడ § వేడుక లెల్ల నడంగ రుక్మిణిం
దనకు నొసంగు వారమని § ధారణిపాలుఁడు భీష్మకుండు నా
తని తనయుండు రమ్మనఁగఁ § దాను విభూతిచెలంగ వచ్చి య
వ్వనితను గృష్ణుఁ డెత్తుకొని § వారనిపౌరుష మొప్పఁ బోవఁగన్. ౯ 327

చ. కనుఁగొని తేజమెల్లను వి§కావికలై చన నాతురంబు పై
కొనఁ బ్రమదంబు వీడిచనఁ § గోరికయంతయు వమ్ముగాఁగ నా
ననమొగి నెండిపోవఁగ మ§నంబునఁ గుందుచునున్న చైద్యునిం
దనివచియింపరాని బహు§శార్తిని బ్రుంగినవానిఁ జూచుచున్. ౧౦ 328

చ. పలికిరి వార లెల్లనొక§భంగిగ నూఱడఁజేయు కోర్కితో;
నిల నిటు దౌర్మనస్యము వ§హించుట యర్హమె పూరుషోత్తమా!

తలఁగుము దాని నింకఁ దనుధారుల కెల్లఁ బ్రియాప్రియంబు లి
మ్ముల వరుసం గనంబడుచుఁ బోవుచు నుండున వస్థిరంబులే. ౧౧ 329

మ. స్థిరతం గాంచదు వానిలో నొకటియున్ సిద్ధం బిదో; నమ్ము మో
ధరణీశా! విను న ర్తకుం డొకఁడు విద్యానైపుణం బెల్ల నె
ల్లరకుం జూపఁగఁబూని దారువున బొలన్ లీల నిర్మించి య
ప్పురమా నంచు జనుల్ గనంగ నెటు త్రిప్పున్ స్వేచ్ఛమై నట్లుగన్. 330

క. జనుఁ డీశ్వరపరతంత్రతఁ, గనుటన్ సుఖదుఃఖములను గాలవశమునన్
గనుచుండు నింతియే; మఱియును గ్రొత్తది లేదుసు మ్మొకండును తేఁడా!. 331

చ. అని వచియించి; రంతట జరాత్మజుఁ డో శిశుపాల! కృష్ణుతో
మును పదునేడుసార్లు బలములన్ గొలువన్ హరి నొంప నెంచియే
చని పురి ముట్టడించితిని శౌర్యముఁ జూపితి న న్నెఱుంగవె
విను మిఁక నేమిచెప్పుదును వింతగ నోడితి నన్నిసారులున్. ౧౨ 332

క. ఇరువదిమూఁ డక్షౌహిణు, లురుబలసంపన్నులును మహోద్యమమునఁ జూ
పిరి సాహస మోరాజా!, పరాజితుఁడనైతి నైనఁ బట్టు వదలకేన్. ౧౩ 333

క. మఱియును సేనలతో నే, డ్తెఱఁ బోయి రణంబుచేసి దివిజులు ఖేదం
బఱిమఱి గాంచఁగ గెల్చితి, నెఱి సోదరయుగము నెట్లొ నిజమిది తేఁడా!.

క. ఐనఁ బరాజయమప్పుడు, కాని జయంబంది నప్పుడుకాని వగఁ దమిన్
నే నొందలేదు సుంతయు, నైన నదృష్టాన్వితమగు నాకాలంబే. ౧౪ 335

క. మనుజులను సుఖమొదుఃఖమొ, కనఁ జేయుచు నుండు నని నికామమెఱిఁగి యే
మన కుండితి నని యెఱుఁగుము, కనుక నె యీసాంపరాయికంబున యందున్.

*సీ. వీరయూథపనృపవితతికి యూథపులముగాఁ జెలంగియు సమరమందు
నత్యల్పబలులగు యాదవుల్ శ్రీకృష్ణపాలితులౌట నిప్పాట మనల
నోడింపఁ గల్గిరి చూడ నీయది దైవతంత్రమే యనఁదగుఁ దప్ప దనుచుఁ
దోఁచుచు నున్న దీనిచశత్రువులును దమకుఁ గాలము శుభ మమరుపంగఁ

ఆ. దగినదౌట మనలఁ దఱుమంగఁ గల్గిరి, మనకుఁ గూడ నట్టిమాడ్కి సమయ
మరుగుదెంచి నప్పు డరుల జయింతము, డెందమందుఁ గుందుఁ బొంద నేల.

చ. అనియిటు మేలుకోరు తనయాప్తులు పల్వురు బోధచేయఁగా
మనము కలంకఁదేఱ ననుమానము వాయఁగ స్వీయపత్తనం
బునకును సానుగుం డగుచుఁ బోయెను జైద్యుఁడు మృత్యువక్త్రముం
గనని మహీశు లెల్ల స్వనికాయ్యములం గన నేగి; రంతటన్. ౧౭ 338

చ. తనసహజన్ మురాంతకుఁడు తా బలిమిం గొనిపోయె రాక్షసం

* "అధునాపివయం సర్వే వీరయూథపయూథపాః" అని మూలము.

బనఁ జను నవ్విధానమున ఽ నన్నునుడిన్ విని సైఁపలేక కృ
ష్ణునిపయి వైరముం గొనిన ఽ శూరుఁడు రుక్మియు సంగరంబుచే
యను మదిఁగోరి యప్పగ జయంబునఁ బొపుకొనంగ నెంచుచున్. ౧౬ 339

తే. ఒక్కయక్షౌహిణీసేన ఽ యుక్కుమిగిలి
వెంటరాఁ బోయెఁ గృష్ణుని ఽ వెన్నుదన్ని;
యమ్మహాబాహు వపుడు శరాసనంబుఁ
దాల్చి కవచంబుఁదొడిగి యెంతయును బూన్కి. ౧౭ 340

క. హరికృత్యంబున కోర్వక, దుర మొనరింపంగ వెడ్క ఽ తొందఱపెట్టన్
బరుగిడుచు నెల్లభూభృద్వరులు వినం బల్కె నిట్లు ఽ బవరమున హరిన్. ౧౮

క. హరిపుచ్చక యీరుక్మియు, మరలం డని నమ్మవలయు ఽ క్ష్మావరులారా!
పురిఁ జొరఁ బ్రతిజ్ఞఁ దీర్పక, యపుడుగఁ గనుఁగొనుఁడు నామహామహ మిచటన్.

క. ప్రతిన యిది సూనృతం బని, మతి నెన్నుం డనుచుఁ బల్కి ఽ మండిపడుచు దు
ర్మతియటఁ గృష్ణు నెఱుఁగక, శతాంగమునఁ గూరుచుండి ఽ సారథి కనియెన్.

క. ఘోటకవర్యంబుల నే, చోటం గృష్ణుండు మెలఁగుఁ ఽ జోద్యంబుగ నా
చోటికిఁ బోఁదోలుము యొక,యాటగ సంగర మొనర్తు ఽ నాతనితోడన్. ౨౧

చ. చెలిమలిఁ బల్మిమీఱఁ గొని ఽ చెచ్చెఱఁ బోయెడు దుష్టబుద్ధి గో
వుల నిరతంబు గాచుటను ఽ బుద్ధియె లేని యతండు నోట దో
ర్బలమున విఱ్ఱవీఁగెడిని ఽ వాని బలం బడఁగించెదన్ మదు
జ్జ్వలపటుసాయకంబులను ఽ జక్కఁగఁ జూడుము నాదుపంతమున్. ౨౨ 345

చ. అని యిటు లాకుబుద్ధి పరమాత్ముని యద్భుతశక్తి యిట్టిదౌ
నని తెలియంగలేక తనయాగ్రహ మీ కడఁ బల్కరింప నే
పున నిటు తుచ్ఛవాక్యములఁ ఽ బూని వచించి రథం బొకండె వ
చనఁగ మహాత్ము వెన్కొనుచు ఽ శౌర్యముమీఱఁగఁబోయి యంతటన్. ౨౩

చ. నిలునిలు మెందుఁ బోయెదవు ఽ నీవిఁక నంచు మురారిఁ బిల్చె; దో
ర్బలమునఁ జాపముం దిగిచి ఽ బాణవరంబుల మూఁట లక్ష్యశు
ద్ధులు వెలయంగ నాటు నృపధూర్తుఁడు శ్రీహరిమేన నంతటన్
నిలువక పల్కె నిట్టు లిట ఽ నిల్వుమ యోయదువంశపాంసనా!. ౨౪ 347

ఉ. ఒక్కక్షణంబు మాయెదుట ఽ నుండుము నిల్చియె యోరి మోసకా?
యెక్కడి కింకఁ బోయెదిటు ఽ లేపు చెలంగ హవిస్సుగాక మ
ట్లెక్కడఁ బొంచియుండియె కులేశ్వరిఁగొల్చఁగ రాఁగ మత్స్వసన్
జిక్కె నటంచు మ్రుచ్చిలితి ఽ సీ! యిది పంతమె యెన్నిచూచినన్. ౨౫ 348

ఉ. మందమతీ! త్వదున్మదము ఽ మాన్పెద నిప్పుడె మాయకాఁడవై

యెందును గూటసంగరము నే యొనరించు స్వభావమొప్పి నీ
వుందువు కాన మామకమహోగ్రశరంబులు నీదుమేనుఁ జీ
ల్పం దొరలాడ భూమిపయిఁ బాతముఁ గాంచక ముందె చెల్లెలిన్. ౨౫ 349

చ. వదలినఁ బ్రాణముల్ నిలుచుఁ బాఱిన నయ్యవి పాయుఁ దప్పదం
చదలిచె; నాదురుక్తులకు నమ్మధుసూదనుఁ డేవగింపకే
వదనమునందు సుస్మితము వర్ధిలుచుండఁ దదీయచాపముం
బ్రదరము లేసి త్రుంచి మఱి బాహుబలంబున బాణషట్కమున్. ౨౬ 350

చ. ధనువునఁ గూర్చి వైచి గురుదర్పమునం దగు రుక్మి మేను నొం
చెను మఱి సాయకాష్టకముచేతనె నాల్గుతురంగమంబులన్
దునిమెను రెంట సారథిని ద్రుంచె శరత్రితయంబుచే ధ్వజం
బును బడనేసె; నంతఁ గ్రుధ భూపతిపుత్త్రుఁడు గ్రొత్తచాపమున్. ౨౭ 351

చ. త్వరపడి యెక్కుపెట్టి గురుబాణము లైదొగి దానఁ గూర్చి శ్రీ
హరి నలయించె; మార్గణము లంగము గాఁడినమాత్రనే భయం
కరశరమేసి తద్ధనువుఁ గ్రమ్మఱఁ ద్రుంచెను రుక్మియున్ మహా
త్తర ధనువొక్క దానిఁ గొనఁ దానిని రెండుగఁ జేసెఁ గృష్ణుఁడున్. ౨౮ 352

చ. పరిఘము శూలచర్మములు పట్టిసశక్త్యసితోమరంబు లా
తురమున రుక్మి కైకొనినఁ దోడనె వానిని జెండె నాయుధం
బురుగతి దేని వాఁడుగొను నుగ్రశరంబుల దానిఁ బూన్కి నా
హరి దునుమాడుచుండె; నతఁ డాగ్రహమూని జిఘాంస పైకొనన్. ౨౯

చ. పటుతరమౌకృపాణమును బాణి ధరించి రథంబునుండియు
త్కట గతిమీఱఁగా నుఱికి దావహుతాశను మ్రింగఁ గోరి యు
త్కట శలభంబు పోవుగతిఁ గంజవిలోచను స్యందనంబ దె
చ్చటఁ దగియుండు నచ్చటికె సత్వర మొప్పఁగఁ బాఱెఁ బూనికన్. ౩౦ 354

చ. హరి తనపైకి వచ్చు నృపునగ్రతనూజుని యుద్యమంబుఁ గా
వరమును లోఁ దలంచి శితబాణములం బరఁగించి చర్మమున్
గురుతరఖడ్గమున్ దునిమె క్షోణిపయిం దిలలంతలై పడన్
ద్వరపడి తీక్ష్ణఖడ్గమును వాని వధించెడుకోర్కిఁ గైకొనెన్. ౩౧ 355

ఉ. దానవహంత సోదరుని ధర్మగృహంబును జేరఁ బంపఁగాఁ
బూను నటం చెఱింగి భయముం గని చిత్తము తత్తఱింపఁగా
మానిని యన్నఁ గావ మురమర్దనుపాదసరోరుహద్వయిన్
దా నెదఁ గోరి వ్రాలి కృపదప్పక కల్గ వచించె నీవిధిన్. ౩౨ 356

సీ. అప్రమేయాత్మ!, దేవాదిదేవా! ప్రభూ! కల్యాణ! యోగేశ! కమ్రదీర్ఘ

బాహాహా! జగత్పతీ! ॥ భ్రాతను వధియింప నర్హము గాదు నీకనియె; నిట్టు
లతిభయంబునఁ దనయంగముల్ వడఁకంగ వగ మోముదమ్మియు ॥ వాడిపోవ
గద్గదస్వర మొప్పఁగా సాధ్వసంబునఁ గనకమాలయు జాఱఁగా గృహీత

తే. పాదపంకజయుగళయై ॥ పత్నియుండఁ
గాంచి కరుణించి రుక్మి వధించుయత్న
మచ్యుతుఁడు మానె; నంత నాహరి యసాధు
కారియగు వానిఁ గైకొని ॥ కరుణమాని. 3౮ 357

క. తనవసనంబున బంధిం,చెను జంపఁగఁ బూను కత్తిచేతనె గడ్డం
బును మీసలఁ గేశములను, గొనకొని యవశిష్టములుగ ॥ గొఱిగి కడంకన్.

క. ఒనరించె విరూపునిగా, వనజాక్షుం డిట్లు చేయ ॥ వారనిపూన్కిం
గొని యాదవవీరులు శ,త్రునికాయములం గలంచి ॥ తోలిరి వెలుచన్. 3౫

క. సరసీరుహాలతలను గుం,జరసంతతి గలఁచు నట్టిచందంబున నా
పరవీరులఁ దోలి వెసన్, హరిచెంతకు వచ్చి రుక్మి ॥ నటఁ గాంచి తగన్. 3౫౪

చ. 'వనరుహనేత్రు చెంతఁదను ॥ వైభవమాఱ వికారరూపతం
గనఁబడుచున్ హతుండె యనఁ ॥ గాఁ దగినట్టి యవస్థనున్న రు
క్మినిగని లోకనాథుఁడయి ॥ మించుహలాయుధుఁ డాత్మలోఁ గృపం
గని వసనాభిబంధనము ॥ గ్రక్కునఁ బాయఁగఁ జేసి యంతటన్. 3౬ 361

క. భగవంతుని శ్రీకృష్ణుని, నగధారిం గాంచి కృష్ణ! ॥ యర్హ్యమనంగాఁ
దగ దీ వొనరిచినపని యి,ది గడు జుగుప్సితమె యా మకటం దలపోయన్.

క. తలగొఱిగి చుబుకకేశం,బుల వపనము చేసి రూపమునకున్ వికృతిం
గలిగించుటయన వధ మగు, నిల సుహృదయులకు నిజంబిదియే యగుఁ గృష్ణా!.

చ. అనియిటు వాక్సుమత్కృతుల ॥ నయ్యనుజుం గని దూఱి రుక్మిణిం
గనుఁగొని పల్కె సాధ్వి వినఁ ॥ గాఁ దగు నాపలుకొండు భ్రాతకున్
చనువుపయిన్ వికారత గనంగ నొనర్చె నటంచు మ మ్మనూ
యను గనఁబోకు మాత్మకృతమై తగు కర్మము సర్వభంగులన్. 3౨౪ 364

చ. ఫలము లొసంగుఁబూరుషుఁడు ॥ పాపఫలంబులఁ బుణ్యకర్మస
త్ఫలములఁ గాంచుచుండు నొకభంగి మఱొక్కఁడు చేయఁజాలఁ డీ
పలుకు నిజంబు; రుక్మి కిటఁ ॥ బొటిలినట్టి ఫలంబు స్వేచ్ఛమైఁ
దొలిజనిఁజేసినట్టి దగు ॥ దుష్కృతసంభవమే యగుంజుమీ!. 3౮ 365

చ. అని యనుజన్ముఁ గాంచి యిటు ॥ లాహలి పల్కె యథార్థ్యదోషముం
బొనరిచియున్న బంధువును ॥ బూని వధింపఁగ రాదు; చిక్కినం
జను మనిపంపఁగా వలయుఁ ॥ జచ్చినవాఁడె సుమీ యతండు తా
నొనరిచినట్టి దోషమున ॥ నుద్యమ మింక నదేల చంపఁగన్. 3౯ 366

క. అని సోదరుతోఁ బల్కుచు, వనితామణిఁ గాంచి మఱియుఁ బల్కెను ధర్మం
బును దీని క్షత్రియులకున్, వనజాసనుఁ డర్హమనుచు వారక పలికెన్. ౩౯౫
క. ఘోరతర ధర్మమ య్యది, భూరమణుఁడు చంపుఁ దోడఁబుట్టువు నైనన్
ధారణి నీధర్మంబే, వారిజనేత్రా! చెలంగు బాహుజపంక్తిన్. ౪౦ 368
వ. అని పలికి సోదరుం గాంచి యి ట్లనియె. 369
సీ. శ్రీమదాంధులుగాఁగఁ జెలఁగు రాజులు రాజ్యభూవిత్తముల హేతువునను
దభిమాన తేజస్సమాయత కారణమునను వేఱొక హేతువునను బంధు | యోషి
వులఁ దూలపుత్తురు జలజాక్షు! మన కిది యర్హమా యనిపల్కి యతివతోడఁ
బలికె; సాధ్వీమణి! వపువున నాత్మాభిమానము గల్గుపామరుని యట్టు
తే. లనుదినము సుహృదులకు నత్యంతభద్ర
ముల నహితుల కమంగళములను గలుగఁ
దలఁచుచుందువయే భూతములపయి నొక
విధముగాకయె త్వద్బుద్ధి విషమమె యగు. ౧౪౫ 370
క. మతివిషమత గాంచిన నో,యతివా! సాధారణులగు నట్టిజనులతోఁ
జత చేయం దగు నిను నే, వితమందువా తెలియఁ బఱతు విను మిఁక శ్రద్ధన్.
సీ. దేహాత్మమానులై స్థిరఁ దగునరులకు సుహృదుఁ డీతఁడువీఁడ సుహృదుఁడితఁడు
నగు నుదాసీనుఁ డంచమఱు నీమతిమోహ మలదైవమాయ చేఁ గలుఁగ జేయఁ
బడియుండుఁదలపోయ భామినీ! యీయదిమాయ యేయగుఁజుమీ యీయనంత
జీవరాసులకెల్లఁ జెలఁగునంతర్యామి యాత్మ యొక్కండగు నైన నుదక
ఆ. ములను బ్రతిఫలించు నలచంద్రుఁ డొకఁడయ్యుఁ
బెక్కుబింబములుగ లెక్కసేయఁ
దగియెయుండుఁ గాదె గగనము ఘటముఖ
ములను బెక్కుచందములుగ నట్లె. ౪౩౫ 372
క. పామరులు దేహభేదము,చే మఱి యొక్కరునిగాఁగఁ జింతింతురు సు
మ్మామాన్యుఁ బరంజ్యోతిని, శ్రీమహితుని శుద్ధు సర్వసేవ్యు ననంతున్. ౪౪
వ. ద్రవ్యప్రాణగుణరూపాధిభూతాధ్యాత్మాధిదైవతాత్మకంబై యుత్పత్తివినాశ
ములు గలిగిన యీదేహ మవిద్యాయోగమున నాత్మయందుఁ గల్పితంబై
దేహికి సంసారమును గలిగించుచుండు. పురంధ్రీమణీ! ప్రకాశ్యంబు ప్రకాశకంబు
నయి యుండుదృగ్రూపములకుఁ బ్రకాశకంబు భాస్కరాధీనంబై యున్న చందం
బున భూతేంద్రియాదుల ప్రకాశ మాత్మచైతన్యాయత్తంబై యయియుండు.
అట్టులౌట నాత్మభిన్నద్రవ్యంబులెల్ల మిథ్యాభూతంబులు గావున నవ్వానితో
నాత్మకు సంయోగవియోగములు కలుగఁజాలవు. కుహూనామకామావాస్యా
యోగమునఁ జంద్రకళలకు క్షయము కలిగినను జంద్రునకు నాక్షయము కలుగక

యుండుచందమున జన్మవృద్ధ్యాదులెల్ల దేహవికారములగుం గాని నిర్వికారుఁ డగు నాత్మకు నవికలుగవు. స్వప్నమునందలి పదార్థము లస్థిరములైనను నిద్రించు పురుషుఁడు భోగభోగ్యభోక్తలను గనుచుండుతెఱంగున జ్ఞానహీనుఁ డగు పురుషుండు సంసారమును బడయును. అట్లుగావున నో సాధ్వీమణీ! యజ్ఞానజనితంబై యాత్మశోషణమోహానములం గావించు నట్టిశోకమును దత్త్వజ్ఞానముచేతఁ ద్యజించి శాంతము గలిగియుండు మని యిట్లు భగవంతుఁడగు బలరాముండు సంబోధించుటయు నావైదర్భి దుఃఖంబువదలి తత్త్వజ్ఞానము నిర్ణయించు బుద్ధిచేత మనశ్శాంతింగాంచె నంత. ౫౦ 374

చ హరి తనసత్త్వతేజముల నట్లుహరింపఁగ రుక్మియుం గళే
బరమునఁ బ్రాణముల్ నిలుచుభంగి నొనర్చుట లోఁదలంచుచున్
గరము విరూపతం గలుగఁగా నొనరించుట కుమ్మలించుచున్
బరునిఁ బరాభవింపఁ దనపట్టినపట్టుచెడం గృశించుచున్. ౫౧ 375

సీ. దుర్మతిఁ గృష్ణుని దురమునఁ జంపక యనుజాతఁ గొనిరాక యాత్మనగర
మగు కుండినపురంబునందుఁ గాలూనంగఁ దలపోయ ననుచుఁ బంతమునఁ బ్రతిన
పట్టి నిర్భరకోపపరివృత స్వాంతుఁడై యట భోజకటకాహ్వయమున నలరు
పురమున నివసించె; భూపతులన్ యుద్ధమున నిట్టులోడించి మురహారుండు
తే. భీష్మరాజకుమారిక విమలసుగుణ, రత్నభూషితరుక్మిణి యత్నమొప్ప
ద్వారకాపురిఁ జేర్చి శాస్త్రహితరీతిఁ, బెండ్లియాడెను మానులు విబుధులలర.

ఉ. అంతట ద్వారకానగరమందుఁ జెలంగెడు యాదవోత్తముల్
సంతస ముప్పతిల్లదనుజప్రవరాంతకుఁడైన కృష్ణునం
దెంతయు భావముల్ తనర నెప్పుడు మేలగు నంచుఁ గోరుటన్
వింతగ నెల్ల గేహముల వీథులఁ జక్క నలంకరించుచున్. ౫౩ 377

తే. వేడుకలుచేసి రెల్లెడ వెలఁదిమిన్న
లల్లె పురుషులు మిక్కిలి హర్షమలర
వెలయు మణికుండలమ్ములఁ నలరి తాల్చి
తమమనోభావములఁ దెల్పి రమలగతుల. ౫౪ 378

క. హరికిని రుక్మిణికి ననో, హరవస్త్రాభరణ ముఖములగు కానికలన్
బరమాదరమున నొసఁగిరి, పుర మయ్యది శక్రకేతు పుంగాన్వితమై. ౫౫ 379

చ. అనుపమచిత్రమాల్యముల నంతట నొప్పుచు రత్నతోరణా
ళిని గడుమించి స్వర్గపురలీలల నెల్లఁ దృణీకరించి యొ
ప్పెను *సకలారవంబులును బెంపును సొంపును గూర్చునట్టి శో
భనసుమలాజలం గలిపి భవ్యతమాంకురరాజి చల్లుటన్. ౫౬ 380

* సకలారరంబులును=అన్ని ద్వారములయందు.

క. అలరారుచుండె నెంతయు, జలపూరితకుంభములను ॥ జాలుగనిడి మం
గళదాగురుధూపంబుల, వెలయించిరి దీపము లొగి ॥ వింతగ నలరెన్. ౫౭

సీ. పుర మిట్లు శృంగారములు విలసిల్లెను బెండ్లికిం బిలువ సంప్రీతివచ్చి
నట్టిభూభుజులవౌ ॥ హస్తివర్యంబుల మదజలములఁ బురమార్గము లొగిఁ
దడుపంగఁ బడియుండె ॥ ద్వారభాగంబులఁ గదళికాపూగవృక్షములు నిలుపఁ
బడి చూడఁదగియుండె ॥ వైవాహికోత్సవములఁ బురవీథులఁ ॥ గలయఁ దిరుగు

తే. చున్న కురుసృంజయవిదర్భసన్నుత యదు
కుంతిదేశీయకైకేయు ॥ లింత యనఁగఁ
దగని సంతోషమున నొప్పి ॥ తారుసకల
జనుల విలసిల్లఁజేసి రా ॥ సమయమందు. ౫౮   382

చ. హరి యిటు రుక్మిణిన్ బలిమి ॥ నందఱుచూడ హరించి భూధవో
త్కరముఁ గలంచి ద్వారకకుఁ ॥ దాఁ జనె నంచును వందిబృందముల్
ధరణిసురోత్తముల్ హరి యుదారచరిత్రముఁ బాడుచుండ నా
దరమున నాలకించి నృపతల్లజు లచ్చెరువొంది రెంతయున్. ౫౯   383

చ. మనుజపతీంద్రకన్యక లమానుషమౌ హరికృత్య మెన్ని నె
మ్మనముల విస్మయంపడిరి ॥ మానిని రుక్మిణి శ్రీయంశజాతఁ జ
క్కనివిధిఁ బెండ్లియాడి తగుకాంతనచేలుని గృష్ణుఁ గాంచుటన్
జను లటనుండు వారు కడు ॥ సంతసమంది చరించి రున్నతిన్. ౬౦   384



ఏఁబదియైదవయధ్యాయము.

రుక్మిణీకుమారోదయము.

చ. మును పలభాలలోచనుని ॥ భూరిరుడగ్నిని దగ్ధుఁడైన యా
మనసిజుఁ డీశ్వరాంశమహిమంబున నొప్పెసలారువాఁడు సం
హననము నొందఁగోరి హరి ॥ నత్తఱినే శరణంబుఁ జొచ్చెనం
త నతఁడు రుక్మిణీసతికిఁ ॥ దా సుతుఁడై జనియించెఁ గ్రమ్మఱన్. ౧   385

మ. హరివీర్యంబున జన్మమంది కడు విఖ్యాతుండు ప్రద్యుమ్నుఁడై
హరికేమాత్రము తీసిపోవక సమఖ్యాతిన్ విడంబించె; శం
బరుఁడన్ దానవుఁ డామనోభవునకున్ ॥ బ్రత్యర్థి తా నొటఁ ద
త్మనరుఁడే భూమిజనించె నం చెటిఁగిస్వేచ్ఛారూపుఁడై పొల్చుటన్. ౨   386

సీ. పురుడువాయకమున్నె ॥ మ్రుచ్చిలి కొనిపోయి సంద్రంబులోవైచి ॥ శత్రుబాధ
తప్పెనంచుఁ దలంచి ॥ తనగృహమున కేగె నాశిశువును బలమలరు నట్ట [మత్స్య
మత్స్య మొక్కఁడు మ్రింగె ॥ మత్స్యజీవులు కొంద ఱరుదెంచి వలయొడ్డియబ్ధి

ములను బట్టుచు దాని ౹ బలమునఁదగుదానిఁ బట్టిరి; కైవర్తు ౹ లిట్టులొక్క

తే. కొన్ని చేపలబట్టి యంౘదున్న వాని, లోనఁ బెద్దదిగానున్న ౹ మీను దానిఁ
గానికగ శంబరాసుర౹కాంతునకు సమర్పణముచేసి రెంతయు ౹ నర్హ మనుచు.

ఉ. పాచకు లారుషోత్తమము ౹ బల్విడి పాకగృహంబుఁ జేర్చి లోఁ
దోఁచు కుతూహలంబునను ౹ దోడనె శస్త్రిక దానియంగ మెం
తోఁచతురత్వ మొప్పఁగ మహోద్యమమూనియొ తున్కలై పడన్
వే చవి గైకొనం జదిపి ౹ వింతగఁ గాంచిరి బాలు నొక్కనిన్. ౩౭ 388

క. ఉదరాంతరమున బాలకుఁ, డుదయార్కునిబోలి యొప్పు౹చుండం గని ప్రీ
తిదగన్ మాయావతికిన్, సదయం గొనిపోయి యిచ్చి౹ చని రవ్వారల్. ౩౮ 389

చ. రతియగు నాపడంతి మును ౹ రాక్షసనాథుఁడు శంబరుండె యా
సతిఁ జెఱపట్టి యుంచెఁ బరి౹చారికగాఁగ మహానసంబునన్
బతి మరలన్ జనించునను ౹ నమ్మక మూనియొ యుండె నామె య
ప్రతిముని బాలకుం గనుచు ౹ రమ్యతనూరుచిలోఁ దలంచుచున్. ౬ 390

చ. ఇతఁ డెవఁడౌనో యంచు హృద౹యేశుఁడు గాఁ గనుపట్టునంచు నా
రతి పతి యీతఁడౌనె యని ౹ రామయు సంశయమాత్మ నంద న
య్యతివ తలం పెఱింగి యమృ౹తాశనమౌనియు నేగుదెంచి యీ
సుతుఁడు స్మరుండె యించుకయుఁ ౹ జోద్యము నొందకు మమ్మ యం చొగిన్.

చ. జననము మత్స్యకుక్షి నెటు ౹ చక్కఁగఁ జేరెనొ యావిధంబు నె
మ్మనమునఁ గల్గుసంశయము ౹ మానఁగ నంతయుఁ జెప్పె; నా యశ
స్విని పనికత్తెగా దనుజ౹వీరుఁడు తన్నునుపంగ నుండెఁ గా
వున ముని భర్త చందమును ౹ బొంకముగా నెఱిఁగింప నంతటన్. ౬౧ 392

చ. పతి మరలన్ జనించు నను౹భావముతో నెపు డట్టికాలము
న్నతి గలిగించుదానిని గ౹నం దగునో యని వేచియున్న యా
సతి మదనుం డితండె మును ౹ శంకరనేత్రశుచిప్రదగ్ధుఁడీ
క్షితి జనిగాంచె నం చెఱిఁగి ౹ స్నేహముచూపఁగఁ బూనె వానిపై. ౬౨ 393

మ. హరిపుత్త్రుం డటనుండి వేగిరమ ప్రా౹యంబట్టె తన్ బొంద నే
తరుణుల్ గాంతురొ వారికెంతయు మరుల్ ౹ దైవారఁగాఁ జేయుచున్
బరివృద్ధిం గనుచుండె; నారతియు సజ్జా౹తాయతాక్షున్ బతిన్
గురుబాహున్ నరలోకసుందరుని గో౹ర్కుల్ మీఱఁగాఁ గాంచుచున్. ౬౪ 394

తే. అలతి మందాక్షమున నొప్పు౹నట్టి నవ్వు
నివ్వటిల్లఁగ భ్రూభంగ౹నియమ మలరఁ
బ్రేమ మతిశయమై తగ ౹ నామరాళ
గమన సేవించె రతసూచ౹కమగు బుద్ధి. ౧౦ 395

మ వనజాతాక్ష కుమారకుండు మతిమద్వర్యుండు ప్రద్యుమ్నుఁ డా
వనితారత్నముతోడఁ బల్కె జననీ! త్వద్బుద్ధి చూడంగ నీ
తిని మానెం గడు నంచుఁ దోఁచెడిని మాతృస్నేహము౯ వీడి కా
మినివోలె౯ జరియించుచుంట తగునే మేలే యి దెబ్బంగిగన్. ౧౧ 396

మ. అని దూఱ౯ విని యిట్లు పల్కె రతి యార్యా! నీవు శ్రీకృష్ణనం
దనుఁ డంచు౯ నుతిగాంచు మన్మథుఁడవే తథ్యంబు ని౯ శంబరుం
డనయం బొప్ప గృహంబునుండి తనమాయాస్ఫూర్తిమైఁ దెచ్చె నే
ననఁగా నీప్రియపత్నినౌ రతిని సత్యం బంచు భావింపుమా. ౧౨ 397

సీ. పుట్టిన పదిదినములకెన్న లోపల శంబరుండును నిన్ను సంద్రమందుఁ
బడవైచె నో విభూ! వడి నిన్ను నొకచేప మ్రింగెను దాని నాచెంగటికిని
గొనివచ్చి మత్స్యజీవనులు ఛేదించిరి తదుదరమున నీవు పదిలముగనె
శయనించి యుంట దుర్జయుఁడు దుర్ధర్షుండు నగు శత్రువును వీని నఖిలమాయ

ఆ. లెఱిఁగినట్టి దుష్టు నిత్తఱి నానుండి, మోహనాదులైన భూరిమాయ
లొగి గ్రహించి చంపు మోనాథ! నీతల్లి, వగచుచున్నయ దనవరతమందు.

క. ద్వారకలో రుక్మిణి నీ, వీరీతి గ్రహింపఁబడుట యే యెఱుఁగక లో
నారాటము గని కురరి య, దేరితి౯ శిశువుఁ బాసి యేడ్చునొ యట్లే. ౧౪ 399

క. క్రేఁపును బాసిన ధేనువ, దేపగిది౯ గుందు నట్టులే దీనతయుం
బ్రాపింప వందు రెడు నీ, వీపాపిని జంపు మనుచు నిట్లు పలుకుచున్. ౧౫ 400

క. మాయావతి మహితాత్ముం, డై యలరెడు కామునకు మహామాయలను౯
వే యడఁపఁ జాలెడిమహా, మాయామంత్రంబుఁ దెలిపె; మన్మథుఁ డంతన్.

### ప్రద్యుమ్నుఁడు శంబరాసురుం జంపుట.

చ. దనుజవరేణ్యు శంబరునిఁ దాఁ గనఁబోయి రవంతయే సహిం
పను దగదట్టివాక్యముల భర్త్సనముం గడుఁ జేసి సంగరం
బొనరుపఁబూను బుద్ధియెటు లొప్పునొ యాగతిఁ జేసి పిల్చె వే
యనికిని రమ్మటంచు; దనుజాధిపుఁ డప్పుడు క్రోధమూర్తి యై. ౧౭ 402

ఉ. ధిక్కృతుల౯ సహింపకయె తీక్ష్ణగదాయుధపాణియై మదం
బెక్కి పదాహతిం దనున దెంతయుఁ గుందఁగఁజేయు సర్ప మె
ట్లుక్కు దగంగఁ బైకొనఁగ నూల్కొనునో యటు లత్యమర్షఁ గెం
పెక్కిన నేత్రముల్ వెలయ నేర్తెఱఁ జూపఁగ వచ్చె నుగ్రుఁ డై. ౧౮ 403

చ. కులిశసమాహతిం దెగడు క్రూరగదాయుధ మట్టె త్రిప్పుచు౯
దెలివి యొకింత లేక యతిధీరుని శ్రీహరిపుత్త్రుఁ గొట్టె ని
ష్ఠుల భయదాట్టహాసమును బూన్కి నొనర్చెను; మన్మథుండు దో

ర్బలముచెలంగఁ బైనిగుడుఽవైరి గదం దిలకించి నవ్వుచున్. ౧౯ 404

చ. తనగదఁ ద్రిప్పికొట్టి భయదంబగు దాని నడించి శత్రుసూ
దనుఁ డగుటన్ స్వకీయగద ఽ దానవుపైఁ బరఁగించి బిట్టుగా
నొనరిచె సింహనాదము మహోగ్రుడుగ్రుఁడు శంబరుండు మా
యను మయదర్శితంబును మహాసురరక్షిణి నాశ్రయించుచున్. ౨౦౪ 405

తే. గగనముననుండి ప్రద్యుమ్నుఁ ఽ దగపడకయె
పొడవడంగను జేయంగఁ ఽ బూని యస్త్ర
మయసువృష్టిని గురియించె ఽ మాధవాత్మ
జన్ముఁ డతిబలశాలి యస్త్రమ్ము లిట్లు. ౨౧ 406

క. తను బాధించుట కెంతయు, మనమునఁ గ్రోధంబు గదుర ఽ మండిపడుచుఁ జ
య్యన సత్త్వమయంబై జగ,మునఁ గల్గిన మాయలను సమూలముగాఁగన్.

ఆ. పొడవడంగఁజేయు ఽ పూజ్యమహావిద్యఁ, బఱపె; నంత దైత్యపతియు గుహ్య
కాఖ్యమాయల నురగాసురపైశాచ,ములనుమాయలను బ్రభూతశక్తి. ౨౨౪

క. మఱియును గాంధర్వములను, బఱపెం బ్రద్యుమ్నుమీఁదఁ ఽ బద్మాక్షసుతుం
డఱిముఱి వానిం జెండుచు, బిఱుసగు నొకఖడ్గ మెత్తి ఽ పృథురవ మడరన్.

మ. అరుణశ్మశ్రువు లొప్పఁ దోఁచెడు మహాహంకారు నాశంబరుం
గరముగ్రాకృతి నొప్పువానిఁ గని యింక న్ వీఁడు జీవింప నె
ల్లరకున్ బీడయొకల్గు నంచు సరిగా ఽ లక్షించి వైవంగ శం
బరుశీర్షంబుఁ గిరీటకుండలయుతిన్ ఽ భాసిల్లుదానిం ద్వరన్. ౨౮ 410

క. హరియించె ఖడ్గ మయ్యది, సురలెల్లం బుష్పవృష్టి ఽ స్తుతిపూర్వముగాఁ
గురియించిరి ప్రద్యుమ్నుఁడు, సురవర్త్మమునుండి యుక్షి ఽ చోద్యముగాఁగన్.

క. తనసతి మాయావతి య,త్యనుపమ మాయాబలమున ఽ నాద్వారకకుం
గొనిపోవఁగ నంతఃపుర,మును జేరెను స్త్రీసహస్రములు తనుఁ గనఁగన్. ౨౫౪

క. సౌదామనీసమన్విత, మైదగు మేఘంబుమాడ్కి ఽ నలరుచు నతఁడా
శ్రీదయితు సౌధ మొందెను, బ్రోదిగ నందున్న స్త్రీసమూహము వానిన్. ౨౬

మ. జలదశ్యాముని గాంచనాంబరధరున్ ఽ జారుస్మితున్ సుందరో
జ్జ్వలవక్త్రాబ్జుఁ బ్రలంబబాహుయుగళున్ ఽ బద్మాక్షునిన్ నీలవ
క్రలసద్వల్గుతరాలకప్రకరసంక్రాంతస్ఫురద్వక్త్రమం
జులపంకేరుహుఁ గాంచి శ్రీహరియె యంచున్ భ్రాంతి తమ్మేఁచఁగన్. ౨౭ 414

క. మందాక్షము తముఁ బైకొన, నందందె యడంగియుండి ఽ రంతట నాసి
ద్బృందము కొండొకవడికా, సుందరునందున్ మురారి ఽ శుభలక్షణముల్. ౨౮

క. ఒకకొన్ని కానరామికిఁ, బ్రకటముదం బొప్పుచుండ ఽ వనితారత్నం.

...బోక ప్రక్కనుండ నొప్పెడు, సుకపోలుని వానిఁజేరి ౯ చొక్కుపుఁబ్రీతిన్. ౨౯

క. అచ్చెరువునొంది రప్పుడు, ముచ్చట లూరంగఁ బలుకుౘుముగుద హరికిఁ బెట్
మెచ్చుగలిగించు రుక్మిణి, యచ్చటఁ దనయసితలోచ ౯ నాంతములఁ దమిన్.

చ. పురుషలలాము వానిఁగని ౯ ము న్నెటులో కనరాకయున్న సుం
దరతముఁ బుత్త్రు నట్టితరుణంబునఁ దా స్మరియించె నయ్యనం
తరమె యెసంగుస్నేహమున ౯ దైవగతిన్ జనుదోయి చేఁపె నీ
వరుసనె లక్షణంబులవి ౯ వాని సుతుండని తోఁపఁజేయఁగన్. ౩౦　　418

మ. తనలో నిట్లుతలంచె రుక్మిణియుఁ; నీౘతం డెన్నఁ బుంరత్న మే
యనఁ జెల్లుంగద యెవ్వఁడో; వికసితాౘబ్జాక్షుండు నా వీఁడ దె
వ్వనికిం బుత్త్రుఁడొ? యెయదృష్టవతి యిౘవ్వానిన్ స్వకుక్షిన్ ముదం
బున మోయంగను నోచి కన్నదియొ? యీౘపూఁబోఁడి యెం దబ్బెనో. ౩౧419

మ. మును నేఁగన్న యనంతరంబ దెవరో ౯ మూర్ఖుల్ మదీయాత్మజ
న్మని గొంపోయిరి సూతికాగృహమునంౘదుం బ్రీతినుండంగ నం
దనుఁ డాతం డసుయుక్తుఁడే యయిన నీౘతం డెంతప్రాయంబునం
దనరున్ వాఁడును నంతప్రాయమున నీౘతాౘర్కాణమే రూపునన్. ౩౨　　420

క. జీవించి యుండునా యతఁ, డేవిధి నెందైన; నీతఁ ౯ డెవ్విధి నొందెన్
శ్రీవాసుదేవు సామ్యము, వావిరి దేహమున నవయౘవవ్రాతమునన్. ౩౫

క. గమనస్వరహాసంబుల, నమలంబగు దృష్టిఁ గృష్ణు ౯ నట్టులె తగుని
ట్లమరుటకు హేతువేమొ, కమలజు యత్నంబుఁ దెలియఁౘగా వశమగునే. ౩౩

క. అర్భకుఁ డెవండు నాదగు, గర్భంబునఁ బెరిగి పుట్టిఁ ౯ గడుసుందరుఁ డా
యర్భకుఁ డీతఁడు కాఁదగు, నిర్భరమోదంబు వీనిౘనిం గనఁ గలిగెన్. ౩౪

ఉ. అంతియ కాక సవ్యభుజ ౯ మట్టె స్ఫురించెడు నంచు రుక్మిణీ
కాంతయు నెన్ని యూఁగతులు ౯ గాఁ దలపోయుచు నుండ లోకవృ
త్తాంతము నెల్లఁ దానెఱుఁగు ౯ తత్త్వవిదుద్యుఁడు కృష్ణమూర్తి తా
వింతగఁ దల్లిదండ్రులును ౯ వెంటనె రాఁ జనుదెంచె నత్తఱిన్. ౩౮　　424

సీ. విమలతరశ్లోకుఁ ౯ డమలాత్ముఁడౌ భగవంతుఁ డావృత్తాంత ౯ మంతయు మది
నెఱిఁగిన వాఁడయ్యు ౯ నెఱుఁగనియట్టులే పలుకకయుండెఁ; నౘవ్వలఁ దనంత
నరుదెంచి నారదౘసురముని రుక్మిణికాశంబరాసురుఁ ౯ దర్భకు మును
కైకొని చను టాదిౘగాఁగల వృత్తాంతమంతయు నెఱిఁగించెఁ; ౯ నతివిచిత్ర

తే. మైన వృత్తాంత మద్దాని ౯ నాలకించి
కృష్ణు నంతఃపురాంగనల్ ౯ మృతుఁడు మరల
నరుగుదెంచినరీతి బౘహ్వాబ్దములుగఁ

గనఁబడక యప్డువచ్చిన ॥ తనయుఁ గాంచి. ౩౭ 425

క. మనముల నభినందించిరి, వనజాక్షుఁడు హలధరుండు ॥ వసుదేవుఁడు త
ద్వనితయు రుక్మిణియును దక్కిన కాంతలు దంపతుల నా॥కృత్రిమపుఁ దమిన్.

చ. కనుఁగొని కౌఁగిలించుకొని ॥ గాఢముదంబును బొంది; రాపురం
బునఁగల పెద్దలెల్ల నెటొ ॥ పోయిన యాహరిపుత్త్రకుండు వ
చ్చెను దనయంతనే మరలఁ ॥ జేడియఁ గూడి యటన్న వార్తలన్
వినుచు నయారె! సంయమని॥వీటికిఁ బోయినవాఁడు క్రమ్మఱన్. ౩౮ 427

క. చనుదెంచెఁ బూర్వభాగ్యం,బున నింటికి నంచుఁబొంగి ॥ పౌరలెడు మోదం
బునఁ జెప్పుకొనిరి తమలోఁ, దనజనకుని రూపమట్లు ॥ తా నుండుటచే. ౩౯ 428

సీ. ప్రద్యుమ్నుజననులు ॥ పతియగుశ్రీకృష్ణుఁ డనుమతి యలఁగ ॥ నంతరంగ
ముల వేడ్క లూరంగ ॥ లలితభావంబులు కలుగఁగాఁ గనుచుంటఁ॥బలుకవలెనె
చిత్రం బటంచు నా॥శ్రీహరి బింబంబునకుఁ బ్రతిబింబమైన మదనుఁ గని
నంత నట్లౌట సహజమే యనందగు, వారలే యిట్లైనఁ ॥ బరవనితల

తే. మాట యిఁకఁ జెప్పనేటికి? ॥ మానితంబి
నికిని స్థానంబు హరియగు ॥ నీఁక నతనిని
బోలురూపంబు గలవానిఁ ॥ బొలఁతులు గన
నుబ్బితబ్బిబ్బులగుట యేమబ్బురంబు. ౪౦ 429

ఏఁ బ ది యా అ వ య ధ్యా య ము.

స్యమంతరత్నోపాఖ్యానము.

చ. అని శుకయోగికృష్ణుని మహాత్త్వము తత్సుతుగాథచిత్తమం
దనువుగఁబల్కి యవ్వలది॥యా హరిచిత్ర చరిత్రముల్ వచిం
పను దలపోసి యిట్లనియెఁ ॥ బార్థునిపౌత్త్రునితోడ రాజ! యిం
కను వినుమా వచింతు మును॥కాంచనచేలునకుం గుబుద్ధియై. ౧ 430

క. ఒనరిచె సత్త్రాజిత్తొక, ఘనాపకారంబు సట్టి ॥ కల్మషమును దాఁ
నును బాపుకొనం దలఁచి స్వ,తనయామణి సత్యభామఁ॥దలఁగుణధామన్. ౨

క. ప్రకటరుచిం దగిన స్యమం,తకరత్నము హరి కొసంగెఁ ॥ దగువిధి నన భూ
పకుమారుఁ డిట్టు లడిగెను, శుకయోగీంద్రుని మహాత్మ!॥చోద్య మిది యగున్.

సీ. హరికి సత్రాజిత్తు॥గురుతరకిల్బిష మెద్దాని నొనరించె ॥ నిద్ధరత్న
మగు నాస్యమంతక ॥ మతని కెట్లబ్బెను? హరి కేల యొసఁగెను ॥ స్వాత్మజాత?
నని ప్రశ్నమును జేయ ॥ నాయోగియిటుపల్కెఁ దానవరతంబు ॥ భానునకును
బరమభక్తుం డయ్యె ॥ భాస్కరుఁ డతనికిఁ బ్రియసఖుండై యుండి॥ప్రీతిదాన

తే. దక్షమైనట్టి యాస్యమంతకమణి నొసఁ
గెను; మహీపతి యారత్నమును గళమునఁ
దాల్చి వెలిఁగెను భానుచంద్రమున నొకట
ద్వారకాపురిఁ జొచ్చె నెంతయును వేడ్క. ౪ 433

క. అతిశయ తత్తేజంబున, నితరులకుం జూడఁదగక యే యుండె; మహీ
పతి నతనిఁగాంచి దవ్వుల, హృతదృష్టులు నగుచు లోకు లిసుఁ డితఁ డనుచున్.

క. శంకించి హరిఁగనఁ జని వి,శంకటవృత్తిం జెలంగి సఖులుం దానున్
బింకమున నక్షకేళీ, సంకుచితాన్యక్రియావిశారదుఁ డగుచున్. ౫ 435

క. వనజోదరుఁ డుండఁగ దమ, మనమునఁ గలశంకపోవ మాడ్కిఁ దెలుపఁ బో
యినవారలొట నారా,యణ! వందన మొనరుతుము మహాత్మా! నీకున్. ౫½

క. దరచక్రగదాపంకజ, ధర! దామోదర! సుపద్మదళనయనా! శ్రీ
వర! గోవిందా! లోకో,త్కరనాయక! సూర్యుఁ డిదిగొ తమ్ముం గనఁగన్. ౬

క. వాడిమయూఖంబులఁ దనుఁ,జూడఁగఁ దలపోయు వారిచూడ్కుల కెంతో
పీడ గలుగంగఁ జేయుచుఁ, బోడిమిగా నిదిగొ వచ్చె మురదనుజహరా!. ౭

క. సురవరులు త్రిలోకంబులఁ, బరమంబగునీదు సాధుపదము వెదకుచుం
దురుగాదె యదుకులంబునఁ, బరులకు నెవ్విధి నెఱుంగఁబడని వడువునన్. ౭½

క. మానవవేషంబునఁ దగు, జ్ఞానాత్మకు నిన్ను నెఱిఁగి సరసిజమిత్రుం
డో నీరజాక్ష! వచ్చెడుఁ, గా నెఱి దర్శింపఁగ ననఁగా నరహరియున్. ౮ 440

క. జ్ఞానవిహీనతఁ బలికెదు, మానవసంభాషణముల మన్నించిన చం
దానఁ దెలివవ్వ పొలయం,గా నిట్లను రవి యతండు కాఁడు నిజముగన్. ౮½

క. అనుపమరత్నప్రభలన్, దను వాసూర్యప్రకాశ తన్ వెలయంగాఁ
గనుపట్టెడు సత్రాజి,త్తని యెఱుఁగుఁడు మీర లనియె నంత నతండున్. ౯

చ. తనసదనంబుఁ జేరి ప్రమదంబునఁ దేలుచు మంగళధ్వనుల్
వినఁబడుచుండ దేవగృహవేదికయందు మహీసురాళివం
కను వరపీఠమం దునుచి గాఢతరంబగు భక్తిఁ గొల్చుచుం
డెను; రవిదత్తరత్న మది నిత్యము నీనుచునుండు హేమమున్. ౯½ 443

*సీ. ఇరువదితులలంత హేమము భారసంజ్ఞం దగు నట్టి వహ్నసమ సంఖ్య [డు
ననుదిన మిచ్చు చుండెను; మణియయ్యది యెందుఁబూజితమయి యొసఁగుచుం
నచ్చోట నించుకయైన దుర్భిక్షము మారికారిష్టముల్ మఱియు నెల్ల
నాధులు వ్యాధులు నహికృతబాధలు నింక నేయశుభంబు లేని గలుగ

* "తులాంపలశతంప్రాహుః" అని శ్రీధరాచార్యులు.

తే. వందు మాయికు లెవ్వరే § నరయనుండఁ
జాల రియ్యది యమ్మణిసత్ప్రభావ;
మంత నొకనాఁడు కృష్ణుండు § యదునృపతికి
మణినొసంగుమ యని వేడుమాట వినక. ౧౧౫ 444

చ. ధనమునఁ జాలఁ గాంక్షగల § తా హరివేఁడెను దాని నిష్ఫలం
బునుగ నొనర్పరాదనియుఁ § బోలఁ దలంపక యీయఁ డగ్యె; నా
తనియనుజన్ముఁ డొక్కట నితాంతరుచుల్ తగ నొప్పు నమ్మణిన్
దనగళసీమఁ దాల్చి ప్రమోదంబున గుఱ్ఱము నెక్కి పూనికన్ ౧౨౫ 445

స్యమంతకమణికొఱకు హరి వనమున కరుగుట.

క. మృగయాభిరతిఁ బ్రసేనుఁడు, మృగయులు తనవెంటరాఁగ § నేగె నడవి; కం
త గహనసీమల నొక్కఁడు,గఁ గనంబడఁగాఁ బ్రసేనుఁ § గలితతురంగున్. ౧౩౫

శా. పంచాస్యం బొకఁ డుద్ధతిం బొడివి కోపస్ఫూర్తిమైఁ జంపి దో
ర్వాంచద్రత్నము సంగ్రహించి తనదౌ § నద్రిం జొరం బూనఁగాఁ
గాంచెన్ భల్లుకనాయకుండు మది నాకమ్రస్ఫురద్రత్నముం
గొంచుం బోవలె నంచుఁ దోఁచుట నఖక్రూరాయుధాళిన్ హరిన్. ౧౪ 447

క. మృతినొందఁ జేసి రత్నం, బతిశయితప్రీతిఁ గొనుచు § నాతండును బ
ర్వతబిలముఁ జొచ్చి పట్టికి,రతనము నద్దాని నొసఁగె § రమ్యం బగుటన్. ౧౪౫

తే. అద్ది క్రీడకు సాధనం § బగు నటన్న
యూహ నొసఁగె; సత్రాజిత్తు § సోదరుండు
చనియె నెచటికొ? రాఁడయ్యె § నని తలంచి
మిగుల వగలను బొగిలె నేమి యిది యనుచు. ౧౫ 449

ఉ. రత్నము కంఠమందు నలరంగఁ బ్రసేనుఁడు వేటలాడఁగా
యత్నమువీఱఁగాఁ జనిన § యప్పుడు నెమ్మదిఁ బొంగుచున్న యా
రత్నమువీఁది యాసమెయి § రాముని తమ్ముఁడు కృష్ణుఁ డొక్కఁడు
ర్యత్నముచే వధించి తనయంతన యుండు నెఱుంగనట్లుగన్. ౧౬ 450

క. అని చెప్పుకొనియె దానిని, వనజాక్షుఁడు వినియె నొకట § వార్త యొకరితో
డ నొకరుగా జను లెంతయు, ననుకొనుచుండన్ రహస్యమా విధమొప్పన్.

క. హరి భగవంతుఁడు తను నిటు, లొరసెడుదుర్యశము తొలఁగు నుద్యమ మాత్మం
బరికించి ప్రసేనుని చొప్పరయుచు నాగరులఁగూడి § యరిగెన్ వనికిన్. ౧౭

క. వనమున నొకటఁ బ్రసేనుఁడు, తన వాజివరంబుతోడ § దారుణమృగరా
జ నిహతుఁడై పడియుండం, గనుఁగొనిరెన్ సింహ మద్ది § క్ష్మాధరముపయిన్.

సీ. జాంబవంతునిచేత § సమయింపఁగాఁబడి పడియుంట గాంచె నాపౌరు లవ్వి
ధమును గాంచిరి; సమస్తము నెఱింగిన ప్రోడ హరి యంత భీతిక్ర § దంధకార

నిబిడమౌ భల్లూక § సన్నిభుం డున్న బిలమును దా నొక్కరుఁడె చొచ్చెఁ § దనవెను
వచ్చిన పౌరుల § నచ్చటనే నిల్పి; కొంతదూరము పోయి § యంత నందు [కనె

[1]తే. బాలునకు నాటబొమ్మగాఁ § గ్రాలుదానిఁ
మణివరంబును గన్గొని § మదిని దాని
నపహరింపం దలంచి యా § యర్భకుకడ
నిలిచియుండెను క్షణమాత్ర § నిశ్చలముగ. ౨౦ 454

మ. మును తాఁజూడని మానవుం డొకఁడు రాఁ § బూఁబోఁడి తద్ధాత్రి భీ
తిని గాంచెన్; మఱి కూసె గట్టిగను; ధాత్రీధ్వాన మాలించి ధీ
రనికాయంబున జాంబవంతుఁడు ధరం § బ్రఖ్యాతిగన్నట్టి వాఁ
డు నితాంతక్రుధఁ బాఱుతెంచెను; నతం § డున్ క్రోధవేగంబునన్. ౨౧ 455

మ. భగవంతుండు నిజేశ్వరుండనుచుఁ దా § భావింపఁగాలేక లో
కగతుండౌ నొకపూరుషుం డనుచు ని § క్కంబైన తత్సత్త్వ మిం
త గణింపం దలపోయకే ప్రధన ము § ద్యచ్ఛక్తిమైఁ జేసె, నొ
[2]క్కగతిన్ శ్యేనయుగంబు పోరెడుగతిం § గ్రవ్యార్థ మత్యుద్ధతిన్. ౨౨ 456

చ. ఇరువురు వార లొక్కగతి § నేపుచెలంగఁగ నాయుధాళి భూ
మిరుహవితానయుక్తిఁ గడు § మించెడు పౌరుషమూని పోరి భీ
కరరణముం బొనర్చుచును § గాఢతరంబగు బాహుయుద్ధ మ
వ్వరుస నొనర్చి రయ్యది ప్ర § వర్తిలె నెంతయు వింతఁగా నటన్. ౨౩ 457

సీ. ఒకరినొక్కరు గెల్పు § టూహలు పొలయంగఁ బోరుచు నంతట § భూరిముష్టి
ఘాతంబులన్ వజ్ర § కఠినంబు లనఁ దగువానిచే నించుకే § వదలనట్టి
పూనిక నొకరీతిఁ § బోరి రిర్వదిపయి నెనిమిదిదివసంబు § లనవరతము
జాంబవంతుం డంతఁ § జక్రాయుధుని ముష్టిఘాతంబులఁ దనయం § గములయందుఁ
తే. గలుగు పెనుసంధిబంధముల్ § కదలి పిండి
గాఁగ సత్త్వంబు క్షీణింపఁ § గాయ మెల్ల
స్వేదబిందుయుతంబయి § చేష్ట లుడుగ
విస్మయం బెంతొ గదుర న § వ్విభుని జూచి. ౨౪ 458

[3]చ. పలికె మహాత్మ! భూతములపం § క్తికిఁ బ్రాణము నీవె, ప్రాణ పం
క్తులకుఁ బ్రవృత్తి సత్త్వమును § దొరపువేగము ధారణాఖ్యమౌ
బలమును నీవె, యం చెఱుఁగు § వాఁడ సనాతనపూరుషుండవై

---

1 "తత్ర దృష్ట్వా మణిశ్రేష్ఠం బాలక్రీడనకం కృతమ్" అని మూలము. 2 "క్రవ్యార్థే శ్యేనయో రివ" అని మూలము. "క్రవ్యార్థే=ఆమిషార్థే." అని వ్యాఖ్య. 3 "జానే త్వాం సర్వభూతానాం ప్రాణ ఓజస్సహోబలం" అని మూలము.

చెలఁగి యధీశ్వరుండవయి । జిష్ణుఁడవై తగు దీవె సత్ప్రభూ! ౨౫ 459

తే. మఱియుఁ బ్రభవిష్ణుఁడవు నీవె । మాధవుఁడవు
విష్ణువును నీవె; స్రష్టయై । వెలయు బ్రహ్మ
కరయ స్రష్టవునీవె సృజ్యంబులకుఁ ద
గంగ నీవె యుపాదాన । కారణమవు. ౨౬ 460

క. విలయం బొనరించెడు వా,రలకుం గాలాత్మకుఁడవు । రహిమీఱఁగ నా
త్ములకుం బరమాత్మకుఁడవు, జలజాక్షా! యిప్డు తెలియఁ।జాలితి దీనిన్. ౨౭ 461

ఉ. ఎవ్వఁడు సుంత రోషమున । నేచి కటాక్షదృగున్నతిన్ దగన్
నివ్వటిలంగఁ జేయఁగనె । నిర్భరభీతినిగూర్చు నక్రముల్
నెవ్వగఁ బెంచు మత్స్యములు । నిండఁజెలంగుచునుండి యంతలోఁ
జివ్వనఁ దత్తఱంపడఁగ । సింధువు భీతిని మార్గ మిచ్చెనో? ౨౮ 462

క. ఎవఁ డాత్మయశము శాశ్వత, సునిస్తృతిం గాంచ నబ్ధి । సొంపుగ నొకసే
తువు బంధించెనొ? రావణు, నిపసతి దహియించి కీర్తినిల్పెనొ క్షితిపై.? ౨౯ 463

సీ. ఎవ్వానివాడియా । నిషుసంహతుల దనుజాధిపశీర్షంబు । లవనిఁబడియె
నో? యట్టినాస్వామి।యే యగు శ్రీరాముఁ డవునీవె యని యిప్పు । డవగతంబ
యయ్యె; నంచిటు భల్లు।కాధిపుఁ డాత్మవిజ్ఞానంబుచేఁ దన్నుఁ । జక్కనెఱిఁగి
విన్నవింపంగ గో।విందుండు దేవకీతనయుండు భక్తసం।తతికి సుఖము

తే. గలుగఁజేయు నట్టి।కరమునఁ దడవుచు, నేత్రపద్మములను । నెమ్మిఁదనరఁ
గనుచుఁ గరుణఁ దెలుపు।కమ్రవచస్సుల, భక్తు నలరఁజేయఁ । బలికె నిట్లు. ౩౦

క. విను మీక నావృత్తాంతం,బును భల్లుకరాజ! రత్న।మును దొంగిలి న
ట్లు నను్ దుర్యశ మొక్కఁడు, దనంతనే పొందెఁ గాన । దాని విధిగతిన్.

క. తొలఁగించుకొనఁగ నీదగు, బిలముం జొచ్చితిని; మణిని । వేగమ కొనిపోఁ
దలఁచితి వంచని నీ నెమ్మనమున నెఱుఁగంగవలయు । మహితస్వాంతా!. ౩౧

జాంబవంతుండు స్యమంతకమును బుత్త్రికను హరికొసంగుట.

చ. అని భగవంతుఁ డిట్లు తన।యాగమనంబు వచింప భక్తిఁ గాం
చనవసనుం గనుంగొనుచుఁ । జారుమతిందగుపుత్త్రికామణిన్
ఘనమణితోడఁ గన్కఁగ ని।కాయసుమదంబున నిచ్చె నంతఁ ద
న్ననుపమరత్నహారముల । నవ్యములై తగునట్టి కాన్కలన్. ౩౨ 467

*క. పూజింప నాత్మ మెచ్చుచు, నాజాంబవతిన్ స్యమంత।కాఖ్యమణివరం
బోజ గ్రహియించి మోక్షం,బాజగదీశ్వరుఁ డొసంగె । నయ్యనఘునకున్.

* "ఆసైశ్చ మణిముక్తైశ్చ పూజితో భక్తవత్సలః, దదౌ తస్మై పరాం ముక్తిం శ్రీకృష్ణో జాంబవతే హరిః" అధికపాఠము.

చ. హరి బిలముం జొరంగ నరసాంతికమందున నున్నమానవుల్
మురహరి రాకఁ గోరి యొకపోలిక ద్వాదశరాత్రముల్ నిరం
తరముగఁ గాచియుండి ప్రభునంబున నేమియొ కీడుమూడె నం
చరయుచు నెవ్వగల్ పొలయ నల్లన ద్వారక కేగి రందఱున్. ౩౩ 469

క. ఆనకదుందుభి దేవకి, మానిని రుక్మిణియు బంధుమండలమును స
న్మానసము గల్గుజ్ఞాతులు, దానవవైరియు బిలంబుఁ దాఁ జొచ్చుటయున్. ౩౩౫

క. వెలువడి రాకుండుటయును, వెలుపలఁ దా రుండి జనులు విసికి మరలి యా
ర్తులగుచు వచ్చుటయును విని, జలజాక్షునిరామి కెంతొ సంకటపడుచున్. ౩౮

క. శోకార్తులైన స్థానీ, యూకసులంగూడి కృష్ణు నాగమనము నే
వేకోరి మహామాయను, శ్రీకలితన్ దుర్గఁ గొల్వఁ జేరిరి భక్తిన్. ౩౮౫ 472

క. పురజను లోకకొందఱు శ్రీ, హరికిన్ దుర్యశముఁగూర్చె నను కోపమునన్
ద్వరపడి సత్రాజిత్తును, బరిపరి నిందించి దుర్గ భక్తిఁ గొలువఁగన్. ౩౫ 473

క. చని సేవింపఁగ నంబయు, జనులకుఁ బొడసూపి చక్రిసందర్శనమా
నని యాశిషంబు లిడఁగా, వనజాక్షుఁడు పోయినపని వరుస ఫలింపన్. ౩౫౫

ఉ. దారనుగూడి పౌరులు ముదంబునఁ దేలఁగఁ దల్లిదండ్రులున్
గోరిక లుల్లసిల్లఁ గనుఁగొంచు వడిం జను దెంచి కౌఁగిటం
జేరిచికొంచుఁ బుణ్యఫలసిద్ధులు గల్గినయట్లు లెంచఁగా
శ్రీరమణుండు ద్వారకను జేరెను బంధువు లాముదారినిన్. ౩౬ 475

క. మృతుఁడై మరలం బ్రాణా, న్వితుఁడై చెలువారునట్లు విష్ణుని గని రా
వితమున వచ్చిన హరిఁ బౌరతతుల్ పరికించి వేడ్కరంజిలి రంతన్. ౩౭

## సత్యభామాపరిణయము.

క. వనజాక్షుఁడు సత్రాజి, త్తును సభకుం బిల్వఁబంచి ద్యుమణికరుణ నొం
దిన మణి మరలన్ వనిదొర,కినవిధముం దెలియఁజెప్పి క్షితిపుల మ్రోలన్. ౩౯

క. ఆరత్నవరము నొసఁగెను, సారెకు నాతండు సిగ్గుసాంద్రముగాఁ జే
కూర నవాఙ్ముఖుఁడై మణి, తో రయమున నింటికిన్ స్వదోష మిదనుచున్.

క. అనుతాపంబును బల్మఱు, గనుచున్ భయ మొప్ప నేగెఁ గాని యతండున్
మనమునఁ దనయపరాధం,బు నె యెంచుచు నెట్లు చేయఁ బోలునటంచున్.

క. బలవంతులతోఁ గలిగెను, గలహంబను చింత మదిని గలవిల పెట్టన్
మలమలమాడుచు దీనిం, దలఁగించుకొనంగ నెవ్విధ మొ యనుకొనుచున్. ౪౦

క. హరిసుప్రసన్నుఁ డగునె, క్కరణినొ యని యెంచుచున్ సుకార్యం బెది యీ
తరుణమునఁ జేయ మేలగుఁ?, ధరఁగలవారెల్ల నన్నధర్మరతునిగన్. ౪౦౫

క. తలపోసి లిట్టకుండఁగఁ, గలదే కార్యం బెదైనఁ గాని యొనరుపన్;

బలుమాటలేల? ధనమునఁ, గల కూరిమినన్ను ముంపఁ। గా సజ్జుఁడనై. ౪౧
క. దూరాలోచన మొనరుప, కీరిటీ క్షుద్రకార్య। మే నొనరిచితీ
వారిజనాభుని కృపకున్, దూరస్థుఁడనైతి నింక। దోషముపాయన్. ౪౧ 483
మ. వనితారత్నముగాఁ జెలంగు దుహితన్। భాస్వత్కృపాలబ్ధపా
వనరత్నంబు స్యమంతకాహ్వయమునన్। బద్మాక్షు సంప్రీతికై
మనమారంగ నుపాయనం బొసఁగెదన్। మన్నింపుమో దేవ! యం
చనుమానంబును వీడి వేఁడెద నిదే। యర్హంబు నేఁ జేయఁగన్. ౪౨ 484
క. ఇంకొకవిధమున నాదుక,ళంకము హరికోపముం దొలంగదు పోయం
చుం కెక్కినమది నెంతయు, నుంకించి సునిశ్చయమున। నూహయు వెలయన్.
క. అనుపమ శుభలక్షణములఁ, గనుపట్టెడు సత్యభామఁ। గన్యామణి నాఁ
దనరెడు దుహిత స్యమంతక,మును గొనిచని హరి కొసంగె। మోదం బలరన్.
క. రూపౌదార్యగుణంబుల, నాపగిదిన్ రూపమునను। యసదృశ యగుచున్
భూపాలకుమారులు పలు,తేపలు ప్రార్థింప నలరు। తెఱవ లమిన్నన్. ౪౪ 487
తే. సత్యభామను శ్రీహరి। సవిధిఁ బెండ్లి
యాడె; నంత సత్రాజిత్తు। నాదరమునఁ
గాంచి భూపాల! యీమణి। క్రమ్మఱఁ గొను
మద్ది గ్రహియింపఁగాఁ గోర। మాత్మ మేము. ౪౫ 488
క. వనజాప్తుని భక్తుండవు, కనుకన్ దల్లబ్ధమైన। కమ్రమణి యిదో
యనఘా! నీకడ నుండం,జనుఁ గైకొనవయ్య; మేము। సర్వవిధములన్. ౪౬
*క. ఫలభాక్కులమే యగుదుము, సులలితరత్నం బిదొను। శుభ ఫలములనున్ [గన్.
గలకాల మొసఁగు; మేమూ, ఫలములఁ బొందుదుము ముందు। బహుళభంగులు

ఏఁబదియేడవయధ్యాయము.

శతధన్వుని శ్రీహరి వధించుట.

క. అని తెల్పి యోగివర్యుం, డనియెన్ రాజేంద్ర! యవలిహరికథ విను మం
త నళినయనుఁడు కుంతియుఁ, దనయులతో లక్కయింట। దగ్ధులయి రనన్.
చ. ధరణిఁ జరించువార్త విని। దానియథార్థముఁ దా నెఱింగియున్
బరముఁడు నయ్యుఁ బామరులపద్ధతిఁ గైకొని చింత బూనిన
ట్లరయఁగఁ జాలి వంశమున। కర్హములై తమపెద్దలెల్ల నా
దరమునఁ జేయువాడుకలఁ। దా నొగిఁ దీర్పఁగఁబూని యన్నతోన్. ౧ 492

* "వయంచ ఫలభాగినః" అని మూలము. "తవాపుత్రత్వాత్త్వదీయం ధనమస్మాకమేవేతి గూఢోభిప్రాయః" అని వ్యాఖ్య.

క. కురుదేశములకుఁ బోయెను, హరియుఁ బలభద్రుఁ డందు ఽ నతిదుఃఖమునన్
బరితప్తస్వాంతులు నగు, ధరణిపు గాంధారి విదుర ఽ ధర్మవిదగ్రణ్యున్. ౯౩ 493
క. గాంగేయుఁ గృపద్రోణుల,నుం గని తిర్పఁగఁ దరంబుగనుం గానిశ్రమం
బుం గాంచి నట్టులుగఁ బొసఁగెం గాదే కష్ట మిద్ది ఽ కృతకవిధిగతిన్. ౪ 494
క. అని యూఱడించి; రంతట, వనజాక్షుం డూరలేని ఽ వార్త నెఱిఁగి యిం
తనరాని యీసు మనములఁ, గనుపట్టుట నిదియె తగిన ఽ కాలం బనుచున్. ౯౫
సీ. అక్రూరకృతవర్మ ఽ లాశతధన్వుని కడకు వేగమపోయి ఽ పుడమితేఁడ!
యాస్యమంతకమణి ఽ యఖిలరత్నవరంబుఁ గైకొన కూరక ఽ కాలమేల
గడపుచున్నావొ? ఽ కన్యకారత్నమా సత్యభామను మనఽస్సాక్షికముగ
మన కొసంగఁ బ్రతిజ్ఞ ఽ నొనరించెఁ గాదె సత్రాజిత్తు మనల సరకుఁ గొనకయె
ఆ. హరి కొసంగె నిప్పు; ఽ డట్టొట నమ్మణి, సంగ్రహింపవలయుఁ జంపి ఽ యతని
ననుజు చెంతఁ జేరు ఽ నట్లు జేయఁగ రాదొ,యనుచుఁ బ్రోత్సహింప ఽ నప్పుడతఁడు.
చ. తనమది వారిమాటల నితాంతము మార్పుగనంగ రత్నముం
గొనఁదగు నన్నలోభమునఁ ఽ గొంకక పాపమనస్కుఁడౌటఁ జెం
తను మృతియుంట నట్లయని ఽ దారుణకర్మము ప్రోత్సహింపఁగాఁ
జని శయనించి యున్నతఱిఁ ఽ జక్రికలం డనుమాట యెంచకే. ౯౭ 497
క. శతధన్వుఁడు సత్రాజితు, మృతి గనఁగాఁ జేసె; తెయి ఽ నిట్లు వధింపన్
మతిదూలి యచటి కాంతలు, వెతఁ గుందుచు దిక్కుమాలి ఽ బిగ్గఱ నేడ్వన్. ౯౮
క. పశుహింసకుఁ డకరుణుఁడై, పశువుల హింసించునట్లు ఽ పాపాత్ముఁడు దు
ర్యశమును గోరెడు నాతఁడు, విశసించెం జక్రిమామ ఽ విషమపథమునన్. ౯౯
చ. మృతిగనఁజేసి రత్నమును ఽ మేలని కైకొని పోయె; నివ్విధిన్
బిత హతుఁడౌట నింతయని ఽ నిర్ణయమొప్పఁగఁ జేయరాని దా
వెతఁ గని సత్యభామ పృథివీపతి! యోజనకా! పితా! కటా
మృతిఁగనితిం గదే యనుచు ఽ మే నొగి మ్రాన్పడ నేడ్చె నెంతయున్. ౫౦౦ 500
చ. జనకకళేబరంబు నొకఽచందమునం జెడకుండ నూనెనిం
పినయొకపాత్రమం దునిచి ఽ భీతమృగాక్షియు హాస్తిపత్తనం
బునకుఁ బ్రయాణమై చనియె ఽ భూతవిభుండయి సర్వవేత్తయ
య్యు నెఱుఁగనట్టు లున్నపురుఽషోత్తమమూర్తికిఁ దెల్పె నంతయున్. ౧ 501
చ. హలధరకృష్ణు లీశ్వరులెఽయయ్యు నృలోకవిచేష్టితంబు లి
మ్ములఁ గొని సంచరించుటను ఽ బొక్కుచుఁ గన్నులనుండి యశ్రువుల్
వెలలఁగ నక్కటా! మనకు ఽ విచ్యుతిలేనివగల్ పొసంగఁగాఁ
బలుకఁగనేల? యంచుఁ బలుఽభంగుల దీనతఁబొంది రెంతయున్. ౨ 502

మ. తరువాతన్ హరి సత్యభామయును సోదర్యుండునున్ వెంటరాఁ
బురముం జేరి వధింపఁబూనె శతధన్వున్ రత్నముం గైకొనన్
మరలన్; వాఁడును దత్ప్రవృత్తి విని వేక్రందించు నన్నింక నె
వ్వరు సంబ్రాణములూని నిల్వఁదగు? నాభాగ్యం బదెట్లున్నదో?. ౯౪ 503

చ. అని తలపోసి యాతఁడు భయంబుతగం గృతవర్మపాలికిం
జని తనుఁగావఁ గోరె హరిసత్త్వ మెఱింగినయాతఁ డప్పు డి
ట్లనియెను వారలీశ్వరులె యాదురు హేళన మేసు జేయ నో
పను, ధర వారి కెగ్గొనురుపం బనిపూనిన యెవ్వఁడేనియున్. ౧౧ 504

క. క్షేమమునొందం జాలం, డామురహరిపైన ద్వేష మాత్మనిలిపి కా
దే మును కంసుం డనుగ, స్తోమముతో సిరికిఁ జాల దూరస్థుం డై. ౧౨ 505

క. మృతికి సమీపస్థుండై, క్షితిఁ బొసె జరాసుతుండు సేనాబహుళా
న్వితుఁడై పదేడువారము, లతిలోకుల సోదరులను హత మొనరింపన్. ౧౩

క. పనిపూని యుద్ధ మొనరిచి, తనుమాత్రము దక్కఁబోతెఁ దత్త్వ మ్మిదియే
యని తెలిపి సాగ నంపఁగఁ, జని యక్రూరున్ వరించె సాయపడంగన్. ౧౪

సీ. అక్రూరుఁ డంత నిట్లనియె నీశ్వరులగు నాసోదరుల సత్త్వమాత్మ నెఱుఁగు
నెవ్వాఁడు పగఁగొన నెంచును వారితో; హరియన సామాన్యుఁ డౌనరుండె?
విశ్వంబు సృజియించు వెలయించు హరియించుఁ దన్మాయ కప్పంగ దమ్ము నెఱుఁగ
కా విశ్వనాథుని యద్భుతచేష్టల నరయంగఁ జాల కుందుదురు మనుష్యు

తే. లెవ్వఁ డేడేండ్లబాలుఁడై యేకహస్తముననె గోవర్ధనము నెత్తి తనవిలాస
మున శిశువు పుట్టగొడుగును బోలెఁ దాల్చె, నట్టియద్భుతకర్మున కఖిలపతికి.

మ. మనుజాకారముఁ బూనియున్న హరికిన్ బ్రహ్మాదేవమునీంద్రప్రా
ద్వనజాంతస్థున కాదిభూతున కనంతఖ్యాతిగన్నట్టిదే
వునకున్ సర్వవికారశూన్యునకు నంభోజాతపత్రాయతా
క్షునకున్ మ్రొక్కుదు నంచుఁ బల్కి యిటు లక్రూరుండు పో పొమ్మనన్. ౧౮

మ. శతధన్వుండు నిరాశుఁడై యిఁకఁ దనుం జక్రాయుధుం డేడ్తెఱన్
మృతినొందించు నటంచు రత్నవరమున్ మీచెంతనే యుండనిం
డితరాసాధ్యము గాకయుండ ననియెం తేఁ బల్కి యొప్పించి వే
గ తురంగోత్తమ మెక్కి భీతమతియై కాలుండు తన్నంపగన్. ౧౭ 510

క. శతయోజనములు పోయెను, శతధన్వుఁడు పోవు టెంచి చక్రియు హలియున్
బతగేంద్రధ్వజవరసం,యుతరథవర్యంబు నెక్కి యుద్ధతిమీఱన్. ౧౭౪ 511

మ. జవనంబుల్ తమపేరు సార్థకముగాఁ జంచద్గతిం బాఱఁ గే
శవరాముల్ వెనువెంటఁ బోయి రఘుయుక్కాన్వంతున్ గురుద్రోహి న

య్యవనీనాథు పథింపఁ; నంత మిథిలాఖ్యఖ్యాతపూర్వర్యకో
పవనంబందు హయంబు క్రిందఁబడఁ జంపన్ వచ్చు సోదర్యులన్. ౧౯౪ 512

చ. కనుఁగొని భీతుఁడై పఱచెఁ గాల్నడఁ గ శతధన్వుఁ డవ్విధం
బునుగని కృష్ణుఁ డాగ్రహముఁ బూని వెసం బరుగెత్తెఁ గాల్నడన్
జనిచని తీక్ష్ణనేమియగు చక్రముచేఁ దలఁద్రుంచి వాఁడు క
ట్టిన వసనంబులం దొఁగిఁ గడిందిపచుల్ తగురత్నవర్యమున్. ౨౦౪ 513

క. వెదకె నదెందును రత్నం, బది చిక్కకపోవ మరలి యన్నకడకు వ
చ్చి దనదు ప్రవృత్తిఁ దెలుపుచు, నదయత వ్యర్థముగఁ జంపి నోట్లయ్యె నరిన్.

క. దొరకదు రత్నం బాతని, పరిసరమున నన్న వినుచు బలరాముఁడునా
వరమణి శతధన్వుండె, వ్వరికడనో దాఁచియుండు వారిజనాభా!. ౨౨౪ 515

క. ఋతమిది యారత్నంబును, వెతకంగాఁ బురికిఁ బొమ్ము వెస నేజనక
క్షితిపతి ప్రియతముఁడౌటన్, జతనంబునఁ జూడఁబోదుఁ జయ్యన వత్తున్. ౨౩౪

క. అనిపలికి హలధరుం డా, జనకుని గన మిథిలఁ జొచ్చె; సంతసమొప్పం
గను బలునిఁ గాంచి జనకా,వనిపాలుం డెదురుగాఁగ వచ్చి విధియుతిన్. ౨౮

ఆ. అతిథేయవిధుల నాచరించెఁ బ్రలంబ, హంత యందుఁ గొన్నిహాయనమ్ము
లుండెఁ బ్రీతిమీఱ నుర్వీశుఁ డాదృతిఁ, దనను జూచుచుండఁగను సుఖముగ.

మ. ధృతరాష్ట్రాత్మజుఁ డా సుయోధనుఁడు తద్వృత్తాంత మాలించి య
చ్యుతునన్నం గనుకోర్కి వచ్చి మహనీయుండైన యమ్మేదినీ
పతిచే సత్కృతుఁడై ప్రియంబుతగఁ దన్ బాలింపఁగా రేవతీ
పతి యొద్దన్ గదఁ బూని వైరుల నడంపంజాలు జన్యం బొగిన్. ౨౬ 519

ఆ. చక్క నభ్యసించె; శౌరియు బలదేవు, నాజ్ఞ మరలి వచ్చి యాత్మపురము
నందునున్న పత్ని సత్యభామకుఁ, బ్రియము చేయుకోర్కి వెలయుచుండ.

క. శతధన్వమృతియు రత్నం, బతనికడన్ లేకయున్కి యంతయుఁ దెలిపెన్;
హతుఁడగు సత్రాజితునకు, మతిమంతులఁగూడి లోకమర్యాద తగన్. ౨౭౪

క. పరలోకగతుల కెల్లన్, వరసుఖముం గలుగ నరకబాధ లడఁగ నె
వ్వరుసం జేయందగు నా, కరణిం గ్రియలెల్లఁ జేయఁగాఁ బంచె విధిన్. ౨౮

క. కృతవర్మయు నక్రూరుఁడు, శతధన్వుఁడు తెగుట యెఱిఁగి సన్మణిహృతికిన్
జతనము తమవంకనె సం, గతమౌటన్ భయము తమ్ముఁ గాఱియపెట్టన్. ౨౯౪

క. ద్వారకనుండియు నేటకో, వారిర్వురు పోయి రంతవరుసఁ గ జనులం
జేరెను మానసికంబులు, శారీరములైన యట్టి సంతాపంబుల్. ౨౯౪ 524

సీ. దైవిక భౌతిక తాపంబు లొందెను మఱియు నిట్టియరిష్టమండలంబు
పయిఁబయిఁ గ్రమ్మంగఁ బరమేశునుహిమంబు మఱచినవారౌటమాధవునకుఁ

దెలిపి రక్రూరుఁడు । తొలఁగిపోవుట నిట్టి విపరీతములు చాలఁవి_స్తరిల్లె
నని యద్ది యజ్ఞానుఁలనుకొనుమాటలే కాని ప్రాజ్ఞులనుడుల్ । కావు సుమ్ము

తే. మునుల కావాసభూతుఁ డై । తనరు కృష్ణుఁ
డున్నచోట నరిష్టము । లుండు ననుట
యెట్టి యవివేకమూలమో । యెన్నవలెనె
విజయపౌత్రా! యవలిదగు । వృ_త్తి వినుము. ౩౧ 525

మ. మును కాశీపురియం దవృష్టి యడరన్ । భూపాలుఁ డింకేమి చే
యనగున్ దీని కటంచు నెంచుతఱిఁ గార్యంబెదియో పూని పో
యెను వారాణసికిన్ శ్వఫల్కుఁ డదిభూమీశుండు చింతించి వే
తనయన్ వాని కొసంగె గాందినియనన్ । దా నొప్పు కన్యామణిన్. ౩౨ 526

క. అవ్వల వర్షము కురిసెను, నవ్వరగుణు నాత్మజన్ముఁడగు నక్రూరుం
డవ్వానిదౌ ప్రభావ ము, దెవ్విధమునఁ గనినుండు నీతనియందున్. ౩౩ 527

చ. కనుక నితండ దెందుఁ జనఁగా నట వృష్టి నొసంగు మేఘుఁ డిం
కను బరితాపజాలములు । కల్గకయుండు నకాలమృత్యువుల్
గనఁబడకుండు నంచుఁ బురిఁగల్గిన వృద్ధులు పల్కుచుండఁ గా
విని యిదె కాదు కారణము । వేఱొకఁ డున్నది దీని కారయన్. ౩౪ 528

క. జను లక్రూరుఁడు లేమియె, యనుదురు మణిలేమి దీని । కగుహేతు వటం
చును గృష్ణుఁ డెంచి దూతలఁ, బనిపె శ్వఫల్కాత్మభవుని వడిఁ దోడ్కొనిరాన్.

క ఆతఁడు రాఁగా శ్రీహరి, ప్రీతిం బూజించి పల్కి । ప్రియకథల జన
వ్రాతాభిప్రాయజ్ఞుం,డై తగుటన్ సుస్మితము ముఖాబ్జము నొందన్. ౩౬ 530

క. పలికెన్ దానపతీ! విను, మలశతధన్వుండు శ్రీసమన్వితమై రో
చులమించు స్యమంతక ని,స్తులమణి నీయొద్దదాఁచి । తొలఁగెం గాదే. ౩౭

క. అది నీకడనే యున్నది, కద యీవృత్తాంతమును దగన్ వింటిమి ము
న్నె; దుహితపుత్త్రులు తాతకు, నుదకక్రియ లాచరింతు । రొప్పుగ విధిచేన్.

సీ. ఋణముఁ దీరిచి తగ । గణియించియున్నట్టి ధనశేషమును దీసికొనుడు; రట్టు
లైనను మణివర్య । మయ్యది యొరులకు ధరియింప శక్య మేపరుసగాక
యుండు సువ్రతుఁడవై । యెప్పు నీకడనె యామణి యుండుఁగాక యమ్మణినిగూర్చి
మాయన్న నన్ను నమ్మక యున్నవాఁ డట్లు గాన మహాభాగ! । మాననీయ

ఆ. మణిని దాని నొక్కమఱి కనఁబఱుపుమా, బాంధవులకు శాంతి వఱలఁ జేయు
మిప్పు డీవు భక్తి । హేమవేదికలతో, సవిధి జన్నములను । సంతతంబు. ౩౮

క. జరపుచు నున్నాఁడవు కద, యురుమోద మె మాకు; నైన । నొకమాఱు జనో
త్కర మొగిఁ జూడఁగఁ జేయుము, పరికించి యొసంగువాఁడఁ । బరమగుణాఢ్యా!.

చ. అనియిటు సామవాక్యముల । నాహరి చిత్తము సోఁకునట్లు చె
ప్పిన విని సంతసిల్లి మదిఁ । బెంపెసలారెడు ప్రీతిమై శ్వఫ
ల్కుని తనయుండు వస్త్రమున । గుప్తము చేసినరత్నవర్యమున్
వనజహితప్రభాయుతిని । భాసిలుదాని నొసంగె శౌరికిన్. ౪౦ 535

ఉ. జ్ఞాతులకెల్ల నమ్మణిని । జక్కఁగఁ జూపి వృథాపవాదసం
జాతమనోరుజంబుఁ బరి।శాంతిని బొందఁగఁజేసి యాజగ
ద్వ్రాతవిభుం డొసంగె జన।వారము మ్రోలను గ్రమ్మఱంగ వి
ఖ్యాతము నాస్యమంతకముఁ । గమ్రయశోవృతసర్వలోకమున్. ౪౧ 536

సీ. భగవంతుఁడై మహే।శ్వరుఁడయి విష్ణువై తగుదేవదేవుని । దర్పవిస్తృ
తమగుచుఁ బాపసం।తతులఁ బోఁదోలుచు మంగళకరమయి । మహితమునగు
నీచరితంబు న।దెవ్వఁడు పఠియించు శ్రద్ధతో విను మఱి । సంస్మరించు
వాఁడు దుష్కీర్తిని । బాపజాలంబును బోఁగొట్టుకొని శాంతిఁ । బొంది యుండు;

ఆ. ననుచుఁ దెలిపి యర్జు।నుని పౌత్రునకుఁ దరు,వాతిదైన పంక।జాతనయను
చరితమెల్లఁ దెలుప । సమకట్టి శుకయోగి, చంద్రుఁ డిట్లుపలికె । శ్రద్ధమీఱ.

---

## ఏఁ బ ది యె ని మి ద వ య ధ్యా య ము.

### కా ళిం దీ క ల్యా ణ ము.

మ. తరువాతం బురుషోత్తముండు జనవృ।త్తజ్ఞుండునై యొప్పిపా
మగులంబోలి చరించుచున్ ద్రుపదుసద్మం బందుఁ గౌంతేయు ల
చ్చెరువుం బుట్టఁగ నున్నవారు మును ల।క్షింపంగ రాకుండి యి
త్తరుణంబందు వెలుంగువా రనెడు వా।ర్తల్ వీనులం జొచ్చినన్. ౧ 538

క. దానును వారిం జూడం,గా నెంచుచు సాత్యకిమొదలు।గాఁ గలవారల్
తో నడువఁగఁ బోయెను స,మ్మానింపఁగఁ బాండవులను । మాధవుఁడు త్వరన్.

క. చని యింద్రప్రస్థంబునఁ, గనియెం బాండవుల; వారు । కమలాక్షు మహే
శుని లోకనాథుఁ బొడఁగని,యనుపమ సమ్మోద మొలయ । నంద ఱొకమొగిన్.

ఆ ఇంద్రియములు పంచ।వృత్తికమై ముఖ్య,మనెడు ప్రాణమొకట । నరుగుదేర
వెలయునట్లు లేచి । వెస నెదుర్కొని యంత, వీరులైన పాండ।వేయులు హరి.

క. బిగి కౌఁగిలించుకొని యా, జగదీశ్వరు కోమలాంగ।సంగమమునఁ బా
పగణము విడిపోవఁగ హరి, మొగముం జిఱునవ్వు మోద।మును గలదానిన్.

చ. కనుఁగొని సంప్రమోదమును । గాంచిరి; శ్రీహరి యాయుధిష్ఠిరుం
డనిలజుఁ డొక్కకొంతగ వ।యస్సునఁ బెద్దలు గాన వారి యం

ఘ్రినళినయుగ్మమున్ వినతిఁ గేలిని గొల్చెఁ; ధనంజయున్ ముదం
బున బిగిఁగౌఁగిలించుకొనెఁ ముగ్ధులు మాద్రికుమారు లల్లనన్. 543

క. తనకున్ వందన మొనరుపఁగను దీవించెను; మురారిఁ గమ్రాసనమం
దునఁ గూరుచుండి యుండఁగ, ననిందితస్వాంతయైన యా ద్రౌపదియున్. 544

ఆ. తా నవోఢ గానఁ ద్రప వెల్లివిరియంగ, నల్లనల్లన నట కరుగుదెంచి
వందన మ్మొనర్చి వారిజాక్షుని తమ్ముఁ డట్లె పార్థులెల్ల నాదరింప. 545

క. వారల కాదృతిని నమస్కారము లొగిఁ జేసి మెల్లఁగాఁ గూర్చుండెన్
గారవము వడసి యితరులు, చారుతరాసనములందుఁ జక్రికిఁ జెంతన్. 546

ఆ. కూరుచుండి; రంతఁ గుంతిచెంతకుఁ బోయి, వాసుదేవుఁ డెలమి వందనంబు
సలిపెఁ గుంతి స్నేహసాంద్రాక్షులం దెడతెగక నీరు గ్రమ్మ దీనమిత్రు.

క. హరిఁ గౌఁగిలించుకొనియెన్, ద్వరపడి వసుదేవముఖ్యబంధుకుశల మా
దరమున నడిగెన్; బితృసోదరిఁ గుంతిం గాంచి హరియుఁ దాత్పర్యమునన్.

తే. కోడలును నీవు నుందురే కుశలముగను
గష్టములు వాసెఁగా యనఁ గమలనేత్రుఁ
గాంచి కుంతియుఁ బ్రేమవైక్లబ్యరుద్ధ
కంఠయై యశ్రుపూర్ణదృక్కలిత యగుచు. 549

క. మునుఁ దాఁ గాంచిన కష్టములను బెక్కింటిని వగం దలంచుకొనుచు వా
పినిబాయఁ జేయుదర్శనమున నొప్పెడు వాసుదేవమూర్తిని గనుచున్. 550

క. ఓకృష్ణా! బంధులమగు, మాకుశల మ్మాత్మ నొక్కమాఱు తలఁచుకొం
చీకడ కక్రూరుని నీ వేకాలమునం దనిపితో యెలమి వెలయఁగన్. 551

క. అపుడే మాకుం గుశలమ్ము పొసంగెన్ నీసహాయమున నే యీకా
ర్యపియందు సనాథులమై, సుపూజ్యులమె యైతి మిట్లు శుభగుణనిలయా!

సీ. ఈప్రపంచములకు నెల్లను సుహృదుఁడ వాత్మరూపుఁడవయి యలరుదీవు
కాన స్వీయుండని కాని పరుండనికాని భ్రాంతియు నీకుఁ గలుగకున్నఁ
ననవరతము నిన్ను నాత్మస్మరించెడు వారి నిర్మల హృదయారవింద
మున వసించుచుఁ గ్లేశములఁ బాఱఁదోలుదు వని కుంతివచియింప విని యుధిష్ఠి

తే. రుఁడు పరాత్పరు శ్రీకృష్ణుఁ గడుఁదమిఁ గని
పలికె సర్వేశ్వరా! యోగిపార్థివులకు
నైనఁ గనుఁగొన శక్యమేకాని నిన్ను
నల్పమేధసులము మేము హర్షమలర. 553

క. కన నోచితి మేపుణ్యంబును దొలిజనిఁ జేసితి మొకో? పోల దెఱుంగం
గ ననుచుఁ బ్రార్థించుచు మఱియును బల్కెను సర్వనాథ! యురుకృపమీఱన్.

క. వానలు గురియం దగియెడు, నీనాలుగు నెలలు ప్రీతి నిందుండఁ దగుఁ
మానెలవు పూజ్యమైతగ, నా నందుల కొప్పుకొని యహనంతోత్సుకతఁ.

క. ఆపురమునఁ గలవారల, చూపుల కానంద మొసఁగుచుఁ సుఖయుక్తిఁ
గాపురముండెను నొకనాఁ, డాపురుషోత్తముఁడు సాయమై యుండంగఁ.

సీ. అర్జునుం డొక్కనాఁ డగ్ని దత్తంబగు గాండీవచాప మక్షయశరములఁ
వెలయు తూణంబుల నెలమిఁ గైకొని కవచంబును దొడిగి ధ్వజంబు హనుమ
దంకంబుఁ దనరారునట్టి స్యందనమెక్కి దుర్గమారణ్యవీథులను స్వేచ్ఛ
విహరించువేడుక వెడలెను బరవీరహంత కావున బహువ్యాళమృగగ
తే. ణముల నాకీర్ణమైన వనంబుఁ జొచ్చి
వాఁడినారాచములపిండు వైచి వ్యాఘ్ర
ములను గిటిమహిషంబుల భూరిశరభ
ములను రురు నామకంబులఁ బొలియఁజేసె. ౧౮౪ 557

వ. మఱియు నయ్యర్జునుండు పెంపుమిగులు పౌరుషంబున గవయఖడ్గహరిణశశ
శల్యంబులం దునిమె. అంతఁ బరమపర్వదినంబు సంప్రాప్తం బగుటయు నందుఁగల
మేధ్యతరములగు వానినేర్చికింకరులమూలమున నగ్రజుండగు యుధిష్ఠిరునకుం
బంపె; దప్పిగలుగ శ్రీకృష్ణునింగూడి యమునానదికిం బోయె నంత. ౧౬ 558

క. యమునాపావనజలముల, నమలవిధిం బూని వార్చి యంభస్సుల స్వ
చ్ఛములగువానిం ద్రావిరి, శ్రమముల్ వాయంగ నరుఁడు శౌరియుఁ బ్రీతిన్.

తే. అమ్మహారథు లంతట నందు నొకటఁ
దిరుగు నెలనాగ నత్యంత సురుచిరాంగిఁ
గనిరి సుకటియు సుదతియుఁ గమ్రవదన
శశధరయు నొచు నొప్పంగ శౌరి యలరి. ౧౭ 560

క. కనుఁగొను మెవ్వతెయో యా, వనితామణి యంచు సఖుని బార్థునిఁ బంపం
జని యాయన్నులమిన్నం, గని యోసుచరిత్ర! యిట్టిగహనం బందున్. 561

క. చరియించుచున్న దాన వెవరికూఁతువో? పేరదేమొ? వచ్చితి విట కే
ధరనుండి? యేమిచేయఁగ, నరయుచు నిందున్నదాన వాదృతిఁ జెపుమా. ౧౯౪

క. సుకుమారాంగీ! నీకోరిక పతినిఁ వెదుక నని పరిగణించితి నే
నిఁకఁ జెప్పు మున్నదున్న, ట్లకలుషమతి వాదు వన్న నాసుందరియున్. ౧౬

క. ఋత మిట్లు చెప్పె ననఘా!, పతిగోరియె తిరుగుదాన భారాశియనఁ
జుఱుక్ఖ్యాతిం గను రవికిఁ, సుతనౌదును నేను వరయశుండగు విష్ణున్. ౧౬౪

క. వరదు వరేణ్యుని గోరియె, పరమంబగు తపముచేయఁ బాల్పడితిని నిం
కొరునిం గోరను వీరా!, పరమేశుని శ్రీనివాసుఁ బంకజనేత్రున్. ౨౦౪ 565

క. మనమున వరించితిని ద, ద్వనజాక్షుఁడు దుర్లభుఁ డనిఽవలుకుదు వేమో
యనఘా! యనాథు లనఁదగు, జనులకు సంశ్రయుఁడు సర్వశక్తుఁ డతండౌ. ౨౧౩

క. కావున నట్టిముకుందుఁడె, యీవనితను గాచుఁగాక ఽ హిత మిది యని లో
భావించుఁగాక యమునా, పావననీరములనుండు ఽ భవనం బందున్. ౨౧౪ 567

సీ. వసియించుదాన నీఽవసతి మాజనకుండె కల్పించె; నిందుండిఽకంజనేత్రు
మదినిల్పి తపము సమ్మతిఁజేయుదాన నేఁ గాళిందియని పిల్వఁ ఽ గాఁ జరింతు
నిందని తెలిపిన ఽ నింతివృత్తాంతము నాలించి చని హరిఽకోలిఁ దెల్పె
విన్నదివిన్నట్లె ఽ వెన్నుఁడు తద్వృత్తి నాత్మనెఱింగిన ఽ యట్టిప్రౌఢ

తే. కాన నాలేమ రథము నెఽక్కంగఁజేసి, వడిగఁ బోయె యుధిష్ఠిరుఽకడకు; నంతఁ
బాండుతనయులు ప్రార్థింపఁ ఽ బద్మనాభుఁ, డమరశిల్పిని రావించిఽయతనిఁగూడి.

క. అతిచిత్రము కనుఁగొన న,ప్రతిమానము నొౌపురంబుఁ ఽ బాండవులకు ని
ర్మితిఁజేసి యొసంగెను స,మ్మతి వారల కెంతయూ ప్రఽమదముం గూర్పన్. ౨౧౫

క. తలపోసి ఖాండవంబన, విలసిల్లు వనంబు జాతఽవేదసునకు ని
మ్ముల నీయఁగోరి దానికి, ఫలముగ సారథిగ నుండె ఽ ఫల్గును తేరన్. ౨౧౬

చ. అనలుఁడు తుష్టినొంది ధవఽళాశ్వచతుష్కము నక్షయాంబకం
బనఁదగు తూణయుగ్మము మఽహాస్త్రధరావళికే నభేద్యమౌ
ఘనకవచంబు భూరితరఽకార్ముకవర్యము నిచ్చె నప్పు డ
ర్జునునకు; ఖాండవంబు స్వరుఽచుల్ వెలయన్ దహనుండు కాల్చుచోన్. ౨౧౭

క. నరుచేఁ దప్పింపంబడి, సురరిపు శిల్పియన నొప్పి ఽ శుంభచ్ఛక్తిన్
బరఁగెడు మయుండు సఖుఁడని, సురపతి పుత్త్రునకుఁ జక్కఽశోభిలుసభనున్.

తే. నేర్పుమెఱయంగ నిర్మించి ఽ నీకుఁ దగిస
దిద్ది యనియిచ్చె దానియంఽదే సుయోధ
నునకు జలమిది స్థలమిది ఽ యనెడు చిత్త
విభ్రమము గల్గె నట్టిదై ఽ వెలయునద్ది. ౨౧౮ 573

చ. వనరుహలోచనుం డవలఁ ఽ బాండుసుతాగ్రజునుండి యొట్టులో
యనుమతి నొంది సద్ధృదయు ఽ లందఱు సమ్మద మొంది సాగనం
పను జతనంబుచేయఁ దనఽభ్రాతయుఁ దక్కినవారు వెంటరాఁ
జనియెను ద్వారకాపురికి ఽ సంతసమొంది జనుల్ తనుంగనన్. ౨౧౯ 574

సీ. అంత శ్రీకృష్ణుండు ఽ హర్షప్రదంబులౌ ఋతుతారకలు గల్గిఽపితతఘటి
బల మొప్పుచుండు సుఽలలితలగ్నంబునఁ గాళిందిఁ బెండ్లాడెఁ ఽ గడుశుభంబు
లొసఁగు వాఁడౌటఁ బుఽరోత్తమమునఁ గల జనుల కెల్లను సంతఽసమ్ము గూర్చు
చుండె; గాళింది యాఽయుత్తమపూరుషుఁగూడి సంతోషాబ్ధిఁ ఽ గొదువలేక

ఆ. మునిఁగి తేలుచుండె; ఘను లవంతీదేశ, మునకధీశులైన భూరిబలులు
విజితరిపులునైన విందానువిందులు, ధార్తరాష్ట్రునకు నితాంత సఖులు. ౨౯

మిత్రవిందాదుల వివాహము.

క. రాజాధిదేవి యనఁగా, నాజగదీశునకు మేనయత్త యగును ద
ద్భూభుజానుల కాదేవియె, యా జనని తదాత్మజాత యలరు గుణాళిన్. ౩౦

ఆ. మిత్రవింద యనఁగ మించె విఖ్యాతి నా, కన్యకయును మదిని గాంచనాంబ
రుని దలంచుచుండె; మనుజేంద్రు లవ్వారు, చెలియలికిని బెండ్లి చేయఁగోరి.

సీ. భవ్యరీతిని స్వయంవరము గావించిరి; మిత్రవిందయుఁ గృష్ణుమించుదమిని
వరియింపఁ దలఁపఁగా వారించి; రాకన్య హరిఁగోరఁ దగదను నాశయమున
బరమేశ్వరుండు నావరవర్ణినీవాంఛ నెఱిఁగి భూపాలకు లెల్లఁజూచు
చుండఁగా బలిమి నాయొప్పులకుప్పను గైకొనిపోయి నగరముఁజేరి

తే. పెండ్లియాడెను; గోసలపృథ్వికొడయఁ
డైన యానగ్నజిత్తు ధర్మాభిరతుఁడు
కలఁడు నిరుపమతేజంబు వెలయుకన్య
సత్యయనునది కలదు తజ్జనపతికిని. ౩౨　　578

చ. జనపతి యాతఁ డాత్మజకుఁ జక్కనిభర్తను గానఁజాల కొ
క్కనియతిచేసె నేనృపతి కాంతుఁడు గోవృషసప్తకంబు శ
క్తిని గెలువంగనోపు నతఁడధిరుఁ డతండె మదాత్మజాత భా
ర్యనుగ గ్రహింపఁగల్గు నని; యావృషభంబులు భూరిసత్త్వముల్. ౩౨

క. అతితీక్ష్ణశృంగములు నే, క్షితిపతులకుఁ జెనకరాక చెలఁగును వీర
ప్రతతుల గంధము నోర్వవు, మతిదుష్టములౌచు నొప్పు మాఱు గనకయే. ౩౩

చ. ధరణిపు లట్టివార్తవిని తత్పురికిం జని వానిఁ గాంచి యె
వ్వరుసను గెల్వఁజాలకయె వచ్చినత్రోవనె పోవుచుండి; రా
పరమమునీంద్రవంద్యుఁడు నృపాలకపుత్త్రియు దుష్టగోవృషో
త్కరము జయించినం బడయఁగాఁగల దంచొగి నాలకించుచున్. ౩౪　　581

చ. బలములు తన్నుఁగొల్వఁగ నవార్యపరాక్రమ ముల్లసిల్లఁ గో
సలధరణీశుఁ డున్నపురసత్తమముం గనఁబోయె; నంత శ్రీ
జలరుహనేత్రు రాక విని క్ష్మాపతి వే యెదురేగి యాసనా
దులొసఁగి పూజచేసి పరితుష్టునిగా నొనరించెఁ గృష్ణునిన్. ౩౫　　582

ఉ. భూవరపుత్త్రి నాగ్నజితి పొంకముగాఁ దనచిత్తమందు నే
పావనమూర్తిఁ గోరుచును భద్రము లొందఁగ నెంచుచుండె నా
శ్రీవనితావిభుం డతఁడె చేరఁగవచ్చె నటంచు వించు నా

పూవిలుకాని తండ్రిఁ గని పొంగుచు భర్తగ నొందఁగోరుచున్. ౩౫౪ 583

క. మనసునఁ గామించుచు నిట్లని యెంచె నితండు నన్ను నర్ధాంగిగఁ గై
కొనుఁగాక నేను బుణ్యములను సల్పినదాననేఁ జెలంగుత! వాంఛల్. ౩౬

క. విబుధుల యాశీర్వాదము లబద్ధములుగాక సూనృతార్థము లగునే [గన్.
విబుధారాధ్యుండు హరి యగుఁ బతి యటం చెంచుచుండెఁ గోర్కెలు పొం

ఉ. అంతట నగ్నజిత్తు విధి నర్చితుగా నొనరించి కృష్ణు న
త్యంతముదంబునం బలికె నచ్యుత! లోకవిభూ! మహాత్మ! నే
నెంతయు నల్పుఁడన్ మఱియు నేమియెఱుంగని మూఢుఁడన్ గదా!
సుంత భవన్మహత్త్వమును సూటిగ నేఁ దెలియంగఁ జాలఁ జూ! ౩౬౪ 586

క. అమలంబగు నాత్మానందమునం బూర్ణుండవౌచు నగునీ కల్ప
ల్పమతినగు నేనదెట్టి ప్రియముచేయఁగ నేర్తు దేవతాధిప వంద్యా! ౩౭ 587

ఉ. ఏమహనీయు పత్సరసిజేద్యరజంబును లక్ష్మి బ్రహ్మయున్
శ్రీమహనీయకంఠుఁడయి చెల్వువహించెడు శంకరుండు సు
త్రామముఖామరుల్ తమ శిరంబులఁ దాల్తురొ యేమహాత్ముఁడు
ద్ధామ నిజైకశక్తి మును దా నిలనిల్పిన ధర్మమార్గమున్. ౩౭౪ 588

తే. సాధుమర్యాదలను గావ స్వాంత మెలమిఁ
బొంద లీలావతారముల్ పూన్కి నెత్తు
చుండునో యల భగవంతుఁ డోగి నదెట్టి
సేవచేఁ బరితుష్టుఁడై చెలఁగునొక్కొ. ౩౮ 589

క. అని విన్నవింపఁ గృష్ణుఁ డతనిపూజలనుం గ్రహించి తగుపీఠమునం
దునఁగూరుచుండి చిఱునవ్వున మోమలరంగఁ బల్కెఁబూసెం బ్రీతిన్. ౩౮౪

క. జలధరగంభీరంబుగ విలసిల్లెన్ నినద మద్ది వినుమో రాజా!
యిల స్వీయధర్మ నిరతిం జెలువారెడు క్షత్రియునకు జెల్ల దడుగుటల్. ౩౯

క. సుకవులు నిందింతురు సు, మ్మకలుషమతివంచు నిన్ను యాచించెద నీ
దుకుమారి నిమ్ము వియ్యము నకు నర్హుఁడ వీవు నామనము నల్లించున్. ౩౯౪

క. మేమనఁగా శుల్కాదులము, గాముసుమీ యనఁగ వినుచు కృష్ణాకాంతుఁ డనున్
శ్రీమహిత! సుగుణముల కీవె మేటి నిధానమ వని యెఱుఁగుదుఁ గృష్ణా!

క. ఏనీయంగము వదలక, శ్రీనారిమణి వసించు తుల నీకంటెన్
మానితుఁడు వాంఛనీయుఁడుఁ గానంబడువాఁడె వరుఁడు కన్నియ కరయన్.

ఉ. వినను నేను దొల్లియె మహాత్మజకుం దగినట్టి వల్లభున్
గానఁగఁగోరి పూరుషుల గాఢపరాక్రమమున్ బరీక్షచే
మానస మట్టె తృప్తిగనుమాడ్కిఁదగన్ సమయంబుచేసి యు

న్నాను యదుప్రవీర! సురఽనాథసమర్చిత! సాత్వతర్షభా! ౮౧ 595

చ. కనుఁగొను గోవృషంబు లివెఽ క్రాలుచునున్నవి సప్తసంఖ్యచే
తను దగుశిక్షలేమిఁ గడుఽ దర్పముగల్గిన వారినైన లె
క్కనుగొనకుండుఁ బోఁబడకఽ కావరమూని చరించుచుండు రా
ట్తనయులు పెక్కురీవృషభఽతల్లజశక్తి నెఱుంగలేకయే. ౮౨ 596

ఉ. చెంతకుఁబోయి మూరుకొనిఽ చెచ్చెఱఁ దీవ్రవిషాణకోటిచేఁ
బంతముమీఱఁగా నవియఽభంగురవిక్రమ మొప్పఁగ్రుమ్మఁ గా
నెంతయు భిన్నగాత్రులయిఽ యేపఱి పాఱిరి గాని యొక్కఁడే
సుంతయు నిల్వఁజాలఁ డిదిఽ చోద్యముగాదె రమాధినాయకా! ౮౩ 597

మ. ఇవి నీచేత నడంపఁగాఁబడినచోఽ నీనాతనూజాత కీ
వవు దోసాత్వతనాథ! సమ్మతుఁడవేఽ యైనట్టియాత్మేశ్వరుం
డవు నా నాతనియాశయంబెఱిఁగి మాఽనాథుండు లోకప్రభుం
డవు నాకృష్ణుఁడుసు స్వావలగ్నమునఁ బైఽదా పంచియం జుట్టుచున్. ౮౪ 598

క. తననుఱ సప్తాకృతులుగఁ, గనుపట్టం జేసికొని నిఽకామవిలాసం
బున వానిఁబట్టి యడఁచెఱ, వనజాక్షుం డంతట వృషఽభములం బూన్కిన్.

క. హతవీర్యౌజస్సుల వృష,భతల్లజములఱ గడంగిఽ ప్రగ్రహములఁగ
ట్టి తగుచమత్కృతి నీడ్చెను, క్షితి బాలుఁడు మ్రానిబొమ్మఁఽ జే లాగుగతిన్

మ. నరపౌత్రా! హరి యేడురూపములఁ గాఽనంగాఁబడం గారణం
బరయం జూచెదవేమొ "నేనొకఁడఁ బూఽర్ణానందుఁడఱ జుమ్ము భా
మరో! నాకెన్న సపత్నులుందు రిఁక నేమాడ్కిఱ సుఖింతుం గటా!
పరమేశా!" యనుచింతఁ బూనఁదగ దఱఽభావంబునుం దెల్పుచున్. ౮౬ 601

ఆ. సత్య నూఱడింపఁఽ జక్రి దా గ్రహియించె, ననుచు నిశ్చయింపుఽ మవల వినుము
భూమినాథ! యంచుఁఽ బూజ్యుఁడౌ శుకయోగి, తెలుపఁబూనె శౌరిఽలలితకథల.

చ. మనమున విస్మయంబొదవఽ క్ష్మాపతి ప్రీతియొసంగఁగా నొసం
గెను దనకూఁతు నాగ్నజితిఁఽ గృష్ణునకుఱ హరి యెల్లభంగులఱ
దనకుసమానురాలయినఽ తన్విని శాస్త్రవిధిఱ గ్రహించె; నం
త నృపతిపత్నులాత్మజకుఁఽ దద్దయుఁ నీడగుభర్త యబ్బుటన్. ౮౭ 603

మ. పరమానందము నొంది రప్పురమునఱ ఽభవోత్సవంబుల్ తగెఱ
దరముల్ భేరులు నాసకంబులను వాఽద్యంబుల్ కడుఱ మ్రోసె; సుం
దరు లాటల్ తమిసల్పి పాడిరి; మహీఽదై వాశిషంబుల్ నిరం
తరరీతిం దగె; స్త్రీలుఁ బూరుషులు మోఽదంబొంది యత్యంతమున్. ౮౮ 604

చ. వరుస దుకూలవస్త్రములఽ భాసిలి పూవులమాలికల్ మనో

హారవరభూషణావళి హాఽయల్ మెఱయఁగ ధరియించి యుండి; రా
ధరణిపుఁ డాత్మజాత కయుఽతంబగు సంఖ్యఁజెలంగు ధేనువుల్
నిరుపమరత్నహారముల ఽ నిండుమనంబున నిచ్చె నత్తఱిన్. ౪౯ 605

శా. గాంగేయోత్తమహారముల్ గళములంఽగ్రాలఁగ దుకూలాంబరా
భంగశ్రీయుతి నంగముల్ వెలయ విఽభ్రాజత్కలాపంబు లు
త్తుంగానంగజసంపదం దెలుప సంఽస్తుత్యప్రవృత్తుల్ దగఁ
శృంగారాస్పదలై చెలంగురుచిరఽస్త్రీలఁ నృపుం డాదృతిన్. ౫౦ 606

ఆ. మూఁడువేల నిచ్చె ఽ ముగ్ధకుఁ జేటిక, లై సపర్యసలుప ఽ హస్తివర్య
ములను నవసహస్రఽములను వానికిఁ ద్రిగు,ణముల నొసఁగె స్యందఽనవరములను.

క. అరదములకు శతగుణముల, హరులను మఱి యశ్వములకు ఽ నన్నిగుణములై
పరఁగు పదాతులఁ గోమరిత, కరణముగా నొసఁగె మానఽవాధిపుఁ డెలమిన్.

చ. మనమునఁ బొంగుస్నేహమున ఽ మాధవునిఁ సకళత్రుగా రథం
బున సుఖసంస్థితిఁ వెలయుఽపోల్కి నొనర్చి మహాబలంబు ముం
దు నడువ సాగనంపె; మును ఽ ధూర్తవృషంబులచేతఁ బౌరుషం
బునఁ గడుమెప్పుగన్న యదుఽపుంగవసంతతిచేత నోడుటన్. ౫౩ 609

క. హతవీర్యులై యశం బీ,క్షితిఁ జెడ వగఁగుందుచున్న ఽ క్షితిపతు లీర్ష్యా
చ్యుతిగనని చిత్తముల ను,ద్ధతిమైఁ గృష్ణుండు కన్యఁ ఽ దాఁ గొని చనఁగన్.

క. త్రోవ నిరోధించిరి; త,ద్భావిభు లొనరించుయత్నఽమును గని నరుఁడుం
జేవమెయి బంధువగు నా, శ్రీవిభునకుఁ బ్రియముఁ దాను ఽ జేయుతలఁపుతోన్.

మ. సురదత్తంబగు గాండివంబుఁ గొని రాఽజుల్ వైచుతీవ్రాంబకో
త్కరముఁ జూర్ణముచేసి క్షుద్రమృగసంఽతానంబు హర్యక్షు మే
కరణిం దోలునో యట్టు లొక్కదెసనేఁ ఽ గాలూనకుండంగనే
పరువెత్తంగ నొనర్చెఁ గృష్ణుఁడు నరుఁ ఽ బ్రజ్ఞానిధిఁ మెచ్చుచుఁ. ౫౬ 612

ఉ. ద్వారకఁ జేరెఁ గానుకను ఽ దానిగ్రహించి ముదంబుమీఱ గం
భీరమృదుస్వభావుఁడగు ఽ వెన్నుఁడు దేవకి కెంతొ ముద్దులం
గూరుచు నేర్పుకాఁడు యదుఽకుంజరుఁ డంతట నాగ్నజిత్తితో
హారివిహారముల్ సలిపె ఽ నందఱు తన్గని సంతసింపఁగ. ౫౭ 613

క. శ్రుతకీర్తి యనఁగ శ్రీహరి, పితృసోదరి యొప్పు నామెఽప్రియపుత్రిక స
న్మతిఁగల కేకయరాజదు,హిత భద్ర యనంగఁ గీర్తి ఽ నెసఁగెడు లేమఁ. ౫౮

క. సంతర్దనాదిసహజులు, వింతగఁ దమఁ బిల్వఁ బంచి ఽ వియ్యము గోరఁ
స్వంతసమున నట్లే యని, యింతయనందగని వేడ్క ఽ నెంచి గ్రహించెఁ. ౫౯

సీ. మద్రేశుతనయను మంగళలక్షణసంయుత లక్షణాసంజ్ఞఁదనరు
కోమలాంగిని దాను గోర్కి స్వయంవరమందు గరుత్మంతుఁ డమృతముబలె
నొక్కండె కొనిపోయె నుద్ధతు నరకాఖ్యు నసురుని బొలియించి యతనిచెఱను
దిక్కు లేకుండిన తెఱవమిన్నలఁగూడ వరియించెఁ గావున హరికిముఖ్య
ఆ. పత్నులట్టివారు పరికింపఁగా సహస్రములు గలరు వారు సదమలగుణ
వృత్తములఁ జెలంగి యీశుని సేవింపఁజాలు భాగ్యముగల సతులు సుమ్ము.



ఏఁబదితొమ్మిదవ యధ్యాయము.

నరకాసురసంహారము.

చ. అను శుకయోగిచంద్రునకు నాయభిమన్యునిపుత్త్రుఁ డిట్లనున్
మును భగవంతుఁ డై నరుని మూర్తిధరించిన కృష్ణుఁ డెవ్విధం
బున నరకాసురుం దునిమె భూపతసూజల నాతఁ డేల యుం
చెనొ చెఱపెట్టి యవ్విధము శ్రీహరి శౌర్యము నాకుఁ దెల్పుమా. 617

చ. వరముని యిట్లుపల్కె నృపవర్యునిప్రశ్నముఁ జాల మెచ్చుచున్
నరకసురారి మున్ జలధినాథుని ఛత్త్రముఁ దా హరించె ని
ర్జరపతి తల్లియగా నదితి రత్నవినిర్మితకుండలంబులం
ద్వరపడి బల్మిఁ గైకొనియెఁ దర్పమునం దన కీడుగల్గమిన్. 618

క. అమరుల పర్వతమనఁ దగిన మణిక్ష్మాభృద్ద్వారంబునం గలస్థానం
బమరులు చూడఁగఁ గొనిచనఁగ మఘవుఁ డావార్తలెల్లఁ గడు దుఃఖమునన్.

చ. ధరణికి వచ్చి ద్వారకను దా మనుజాకృతిఁ దాల్చియున్న శ్రీ
హరికిని విన్నవించె; నపు డాపరమేశుఁడు సత్యభామమం
దిరమున నుండె; వృత్రహరు దీనతఁబాపఁగ నెంచి పూర్వమే
ధరణికి నీయనుజ్ఞఁ గొని త్వత్తనయున్ నరకున్ వధించెదన్. 620

చ. అని వరమిచ్చియుంట నపు డాత్మను దానిఁ దలంచి సత్యభా
మను క్షితిభాగజాతగ సమస్తవిధంబుల నొప్పియుంట లో
ననువుగ నిశ్చయించి యలయంగనతో గరుడాధిరూఢుఁ డై
దనుజునిఁ జంపఁబోయె; మధుదానవసూదనుఁ డెంతొ పూనికన్. 621

సీ. సత్యభామావాంఛ సకలవిధంబులఁ దీర్ప నెమ్మది నెంచి తెఱవమిన్న
తనవెంటరాఁ దలంపను సమ్మతించి ప్రాగ్జ్యోతిషంబను నగరోత్తమంబు
గిరివరదుర్గమై పరులకు భేదింప నలవిగాకుండుట నాసుపర్ణు
పై నెక్కిపోయెను; పర్వతదుర్గము శస్త్రదుర్గముమఱి సలిలదుర్గ
ఆ. మగ్నివాయుదుర్గమయి యభేద్యంబు లై, వెలయుచుండెఁ జాల భీతిదమ్ము

లతిదృఢములునైన । యమ్మురదానవు పాశతతులు చుట్టు । పరఁగియుండె. ౩

శా. దానిం గాంచి గదాప్రహారముల నాధాత్రీధరాళిన్ రజం
బౌనట్లుల్; ఘనశస్త్రదుర్గముల బాణాళిం బ్రయోగించియే
వానిం ద్రుంచు సుదర్శనాయుధముచే । వైశ్వానరవ్యాపృతిం
గానంగాఁబడు దుర్గముల్ జవమునన్ । ఖండించె నేర్పొప్పఁగన్. ౪ 623

చ. అరిభయదంబుగా నమరు । నాజలదుర్గము వాయుదుర్గముల్
బోరఁబోరఁ ద్రుంచెఁ జక్రమున । భూరితరాసిని భీమభంగులా
మురదనుజేంద్రపాశముల । ముత్తునియల్గ నొనర్చె; నంత భీ
కరతరపాంచజన్యముఖ।కల్పిత శబ్దము లట్టె సోఁకఁగన్. ౪౫ 624

వ. ద్వారకవాటనిరోధార్థనిర్మిత లోహాదియంత్రంబులు చూర్ణంబు లయ్యె. వీర మానసంబులు వ్రక్కలయ్యె. అంత శ్రీకృష్ణుండు గదాప్రహారంబులఁ బ్రాకారమును జూర్ణంబుగావించె నప్పుడు ౫ 625

చ. ప్రళయమునందుఁ బైపయిని । బర్వెడు నాయశనిప్రఘోషముల్
బలె భయదంబుగాఁ జెవులఁ । బర్విన కృష్ణుని పాంచజన్యని
స్వనలనినదంబుచే నిదుర।సొక్కిన యామురదానవుండు భీ
తిలి వడి లేచె వాఁడు కడుఁ।దీవ్రపరాక్రమశాలి దుష్టుఁడున్. ౬ 626

క. పంచశిరస్కుఁడునై తగుఁ, జంచలమణి నీటియందె । శయనించును; వాఁ
డెంచి రిపుశంఖరవ మిదు,దంచితముగఁ బర్వెడునని । యాత్మఁ దలఁచుచున్. ౬

చ. జలములనుండి లేచి లయ।సప్తహయానలు లట్టు లెంతయున్
వెలుఁగుచు దుర్నిరీక్షణుఁడు । భీతికరాకృతియాచుఁ గేల న
ర్తిలెడు త్రిశూలమొప్ప శుచి।దీధితులన్ భయదంబులౌ ముఖం
బుల నయిదింట లోకముల । మూఁడిటి మ్రింగఁగ నెంచు చాడ్పునన్. ౬౫ 628

చ. గరుడునిమీఁది కేగుభుజ।గంబువలెన్ హరిపైకిఁ బూన్కిమైఁ
బరుగిడె; నంత శూలమును । బల్విడిఁ ద్రిప్పి సుపర్ణుపైని ని
ర్భరబలయుక్తి వైచి తన।వక్త్రము లైదును గండరాకృతిన్
వరుసఁ గనంబడంగ బహు।భంగుల నార్చెను; దస్మహాధ్వనుల్. ౭౫ 629

సీ. ధరణి నాకాశదిక్।తతుల నంతరము బ్రహ్మాండకటాహంబు । నావరించి
భయదంబుగాఁ దోఁచె; । వాఁడు గరుత్మంతుఁ జంపవైచిన యట్టి।శాతశూల
మును గృష్ణుఁ డటఁ గనుఁ।గొని రెండు తూపులఁ దోడనె వైచి ము।త్తునియలు
జెండి తన్ముఖముల । నిండ బాణంబుల గాఁడ నేసెను; వాఁడు । కనలి గదను[గను

ఆ. విసరివైచెఁ గృష్ణు । దెస నంత హరి తన, పైకి వచ్చుచున్న । భయదగదను
దనదుగదను వైచి । తత్క్షణమే వేయి,తునుకలై పడంగ । నొనరిచెఁ గ్రుధ. ౮౫

చ. కరములుసాఁచి మార్కొనఁగఁ గ్రక్కునఁ బైఁబడవచ్చుచుండు నా
మురసురవైరి పంచశిరముల్ భయదాకృతి నొప్పుచక్రమున్
హరి యపు డంపఁ ద్రుంచె నొకయాటగ దేవతలెల్ల మెచ్చి సుం
దరతరకల్పభూజ సుమదామములన్ గురియించుచుండఁగన్. ౧౦ 631

క. వినికృత్తశీర్షుఁడై యింద్రుని తేజోరూప మగుచుఁ దోఁచెడు వజ్రం
బున శిఖరంబులు తెగఁబడు, ఘనభూధరమట్టు లసునికాయము వాయన్. ౧౧

క. సలిలంబులయందుం బడె, ఖలదానవు నాత్మజులు నికామబలాఢ్యుల్
కలఁగినమదులం బిత్రుమృతి, కలఘురుషన్ మించి యేద్ధు రతిదుర్గఖులై. ౧౧

వ. తామ్రుం డంతరిక్షుండు శ్రవణుండు విభావసుండు వసువు నభస్వంతుం, డరు
ణుండు నను వారు పగఁదీర్పుకోరికల నరకాసురుండు ప్రోత్సహింపఁ బీఠనామక
సేనాధిపతిం బురస్కరించుకొని యుద్ధమునకు వచ్చి యంత. ౧౨ 632

చ. హరిపయి సాయకాళి గద లట్లసిపుత్రిక లుగ్రశక్తు ల
వ్వరుసనె యష్టిశూలములు బల్విడి వైచిరి తీవ్రకోపులై
గురుతరవీర్యుఁడౌ హరియుఁ గోమలి చూచుచునుండ విస్ఫుర
చ్ఛరములు వైచి చూర్ణముగ క్ష్మాస్థలిపై బడఁజేసె లీలగన్. ౧౩ 633

ఉ. అంతట మాన కేడ్తెఱ మురారియుఁ బీఠుఁడు లోనుగాఁగ దు
ర్దాంతుల దానవేశ్వరులఁ దార్కొని శీర్షభుజోరుపాదముల్
వింతగఁ ద్రుంచి సంయమనిపీటికిఁ బంపెను; భూసుతుండు కా
లాంతకుఁబోలి రోషమున నాత్మచమూపతు లారణావనిన్. ౧౪ 634

మ. దనుజార్యుగ్రశరాళి బ్రుంగుటకుఁ జిత్తంబూని యంతన్ గ్రుధం
గొని యోర్వంగనుజాల కబ్ధిజములై క్రూరంబులై సంతతం
బును దానోదకముల్ ప్రవాహముల యొప్పంబూని పాఱంగఁ బొ
ల్చినయేనుంగులఁగూడి సంగరముఁ దాఁ జేయంగ వచ్చెం ద్వరన్. ౧౫ 635

చ. ఖరకరుమండలంబుపయిఁ గ్రమ్ము తటిద్ద్వతతీయుతాభ్రమ
ట్లరుదుగ వైనతేయుపయి నంగనఁగూడి చెలంగుచున్న శ్రీ
హరిఁగని వే శతఘ్నియను నాఖ్య వెలింగెడు శక్తివైచె; న
త్తరుణమునందె యోధు లొగి దారుణబాణముఖాయుధంబులన్. ౧౬

మ. హరి నొప్పించిరి; నిర్జరారి ఘనసైన్యవ్రాతమున్ గాంచి క
ర్బురపత్త్రాన్వితశాతసాయక గణంబున్ వైచి తద్బాహువుల్
శిరముల్ పాదము లూరువుల్ గళములున్ ఛిన్నంబులై యుర్విపైఁ
దొరలం జేసె మదాంధసింధుర హయస్తోమంబుఁ ద్రుంచెం బడిన్. ౧౭ 637

మ. ఎవి యోధప్రహితంబులో శరము, లేయేయస్త్రముల్ పర్వ నా

యవి యెల్లం దనతీవ్రసాయకసమూహస్పర్శతన్ మూఁడుగా
భువిపైఁ ద్రెళ్లఁగఁజేసె శ్రీహరియు నేర్పున్ మెచ్చ దేవాళు; లా
హవమందున్ వినతాసుతుండు ప్రబలుం డై వీఁపునన్ భక్తిచేన్. ౧౭ 638

చ. వనజదళాక్షు మోయుచు నవార్యబలాన్వితపక్షచాలనం
బున గజబృందమున్ యమునిపొంతకుఁ బుచ్చుచు నంతఁబోక ప
క్షనఖరతుండసంహతులఁ గంధిజనాగములన్ హరించె నం
త నతనిశక్తి కోర్వక పోతంగనుచున్ హతశిష్టనాగముల్. ౧౮ 639

చ. పురవరముం జొరంగఁ జనఁ బూనెను, భూసుతుఁ డొక్కఁడే మహా
త్తరరణకౌతుకంబున మృధంబున నిల్చి పెనంగుచుండి యా
గరుడునిచేఁ గలంపఁబడి క్రన్ననఁ బాఱెడు నాత్మసైన్యమున్
హరిదగు విక్రమంబుఁ గని యాగ్రహ మెంతయుఁ దన్ను ముంపఁగన్. ౧౯

చ. శతమఖు మున్ను నొంచిన ప్రశస్తిని గాంచిన శక్తి మహో
ద్ధతుని సుపర్ణు నొంచె; వినతాసుతుఁ డించుక దూలఁడయ్యెఁ ద
ద్ధతులకుఁ బూలమాలఁగొని దంతిని గొట్టిన యట్టులయ్యె నా
జతనము; నిష్ఫలోద్యముఁడు క్ష్మాసుతుఁ డత్తఱి నాగ్రహంబునన్. ౨౦ 641

మ. వినతానందనుఁ డించుకేఁ గదలకే విత్రాసముం గాంచకుం
డిన చందంబు నెఱింగి శూలమున నా సరోజపత్త్రాక్షు నొం
పను గై నందెను దానివైచుటకుఁ బూర్వంబె ముకుందుండు భూ
తనయున్ ఘోరనిశాతనేముల దురంతంబైన చక్రంబునన్. ౨౧ 642

ఆ. చంపనెంచి వాని సాహసక్రియలను, మనమునన్ స్మరించి మఘవు నుడుల
మరల సంస్మరించి మత్తగజస్థుఁడౌ, నతని గాంచి తత్ప్రయత్న మెంచి. ౨౨

చ. నిరుపమశక్తిఁ జక్రమును నింగి వెలుంగఁగఁజేయు దాని స
త్వరముగ వైచి కుండలవిభాసురమై మకుటోజ్జ్వలంబునౌ
నరకు శిరంబుఁ ద్రుంచె నది నైజరుచుల్ దగ భూస్థలస్థమై
వరరుచులం గనందగియె; వానివధంబును గాంచి సైనికుల్. ౨౩ 644

క. వెతగని పరువిడఁ జొచ్చిరి, క్షితిసురమానులు సురాళి సిద్ధులు గంధ
ర్వతతులు సాధురవంబుల, జతనమునన్ నింపి రెల్ల క్ష్మాభాగములన్. ౨౪

క. హరిపై సుమవర్షములం, బరమామోదంబుమీఱ భవ్యనుతులతో
సరసాలాపమ్ములతోఁ, బరఁగంగాఁ జేసి; రంతఁ ద్వరపడి వెతచేన్. ౨౫ 646

చ. ధరణియు నైజరూపమున దానవవైరిని జూడవచ్చి యా
నరకుఁడు బల్మి గైకొనిన నాకపమాతధరించుచున్న సుం
దరమణిహేమకుండలవతంసయుగంబుఁ దరంగిణీశ్వరే

శ్వరుని సితాతపత్త్రమును ॥ భాసురమైతగు వైజయంతినిన్. ౨౩ 647

చ. కనకమహీధరాంశమయి ॥ కన్పడు మందరశృంగ మంచు నొ
ప్పిన మణివర్యముం హరికిఁ ॥ బ్రీతి నొసంగెను; భక్తిభావనం
మనము చెలంగఁగా నమర॥మండలపూజితు విశ్వనాథుఁ గృ
ష్ణుని గనుచుం బ్రణామ మిడి ॥ చొక్కుచు నంజలిపట్టి యీవిధిన్. ౨౪ 648

భూదేవి శ్రీకృష్ణుని నుతించుట.

మ. సురసంఘేశ్వర! నీదుపాదములకుం ॥ జోహారులం గూర్తు నో
పరమాత్మా! దరచక్రముల్ గదయుఁ దా॥ల్పం బ్రీతి నీఁజాలు భా
స్వరహస్తంబులు నాల్గుగల్గు దివిజ॥స్వామీ! నమస్కార మీ
శ్వర! భక్తాశయతుల్యరూపములచే ॥ వర్తించు విశ్వేశ్వరా! ౨౫ 649

చ. నతు లొనరింతుఁ; బంకరుహ॥నాభ! మనోహరపద్మమాలికా
వితతిధరా! నమస్సు లివె ॥ విస్ఫుటపంకజనేత్ర! వందన
ప్రతతు లొనర్తుఁ బంకరుహ॥పాద! నమస్కృతు లివ్వె సర్వమం
దతిశయశక్తి నుండుపర॥మాత్మ! గ్రహింపుము వందనంబులన్. ౨౬ 650

సీ. భగవంతుఁడవు మఱి ॥ వాసుదేవుండవు కార్యమునకు ముందె॥కలిగియుండు
వాఁడవు నీ కివె ॥ వందనములు; జగత్కారణమునకును ॥ గారణుఁడ వు
పూర్ణబోధుండవు ॥ పుట్టుకయే లేక జగములకెల్లను ॥ జనకుఁడవయి
బ్రహ్మంబవై వేద॥వర్ణనాతీతశక్త్యతిశయంబున నొప్పి ॥ యఖిలలోక

తే. రక్షణాదృతిగల్గి పరంబ వగుచు
నలరు నీకు నమస్కార ॥ మాచరింతు
మోపరాత్పర! పరమేశ! ॥ యోముకుంద!
సర్వభూతాత్మకా! నమ॥స్కార మభవ. ౨౭ 651

చ. మరల సృజింపనొ ననెడి॥మాట మనంబునఁ దోఁచినంత ని
ర్భరగురుతద్రజోగుణ వి॥రాజితమూర్తివిగాఁ జెలంగి సం
హరణము చేయఁగాఁ దమసు॥నట్టులె తాల్చి సత్త్వముం మనో
హర కరుణాతిరేకమున ॥ నట్టులె కావఁగఁ దాల్తు వోప్రభూ!. ౨౮ 652

క. నీవు గుణాసంవృతుఁడవె, భావింపఁగ నట్టులయ్యు ॥ వాని గొనుదు వ
య్యైవరుసల నవి నిన్నుం, జేవమెయి నదేమియేని ॥ చేయఁగలవొకో?. ౨౯

క. కాలప్రధాన పూరుషు, లోలి విభూ! నీవ యగుచు ॥ నురుశక్తిలస
ల్లీలల వానికిఁ బరుఁడవ, యై లలిఁ జెలువారుచుందు ॥ వబ్జదళాక్షా!. ౩౦ 654

సీ. నేను నాపగపవమానులుఁ దేజస్సు నభ్రంబుఁ దన్మాత్ర ॥ లమరవరులు
మనము నింద్రియములు ॥ మఱి యహంకారమహత్తత్త్వములునుజ॥రాచరాత్మ

కప్రపంచము శక్తి కలితుఁడ వద్వితీయుఁడవగు నీయందునొప్పియున్న
దను మాటభ్రమ మగునానరకునిపుత్త్రుఁ డగుభగదత్తుఁ డీయర్భకుండు

తే. భీతుఁడై నీదు సంఘ్ర్యంబుజాత యుగము
శరణుచొచ్చిన వాఁ డిదె సాధుభక్త
జనమహార్తిహరా! వీని ననుపమాన
కరుణఁ గాపాడుమా నీవె కాదె దిక్కు?. ౩౦౪ 655

క. సకలవిధ కల్మషహరణ, మకృత్రిమము నైననీదు హస్తాబ్జ మ్మ
ర్భకుఁడగు వీనిశిరంబున, సకలేశా! యునుపవయ్య! జానుగఁ బ్రోవన్. ౩౧ 656

మ. అని ప్రార్థించుచు భక్తి నమ్రముఖియై యాభూమి వేదోక్తులన్
వినుతుల్ చేయఁగనే పరాత్పరుఁ డనన్ విఖ్యాతి గన్నట్టి శ్రీ
వనజాక్షుం డభయం బొసంగి యతనిం బాలించి సంపత్సమృ
ద్ధిని జెల్వారెడు నామహీసుతునిదౌ ధిష్ణ్యంబుఁ జొచ్చెం దమిన్. ౩౨ 657

## పదాఱువేలరాజకన్యల శ్రీహరి పరిగ్రహించుట.

మ. ధరణీపాలకులన్ జయించి బలిమిం దా భూతనూజుండు భీ
కరదర్పంబునఁ దెచ్చియుంచిన ధరాకాంతాత్మజాతావ్రజం
బరుదౌనట్లు పదాఱువేలుగను దుఃఖాక్రాంతమై యుండఁగాఁ
బరికించెన్ హరి; యంతఁ గన్యకలు దేవస్వామి శ్రీకృష్ణునిన్. ౩౩ 658

మ. తమ భాగ్యాతిశయమ్ముచే నచటికిం దా వచ్చె నంచెంచి యా
ప్రమదల్ మోహితలై యభీష్టవరుఁడే ప్రాప్తించె నం చాత్మలన్
మమతల్ పైకొనఁగా వరించి మఱియున్ మారుండు నానొప్పు నీ
కమలాక్షుండె విభుండు మాకు నిపుడౌఁగా కంచు ధ్యానించుచున్. ౩౫౪ 659

క. మాయీ కోర్కిని వ్యర్థము, చేయక సిద్ధించునట్లు చిత్తమునందే
యాయజుఁడుఁ దలఁచుఁగా కని, యాయతివలు వేఱువేఱ నాకృష్ణుపయిన్. ౩౫

క. సంతసమునఁ దమచిత్తము, లెంతయు నాసక్తిగనఁగ నెలమి నిలిపి, రా
వంతయుఁ గాలముపుచ్చక, యింతుల యాశయము నాత్మనెఱిఁగిన హరియున్.

క. స్నానంబున దివ్యాంబర, దానంబున నాదరించి తరుణుల వారిన్
దానవసూదనుఁ డత్తఱి, మానవయానముల నెక్కఁ మాడ్కిం జేసెన్. ౩౬

క. ద్వారవతిం జేర్పుఁడు మీ, సారసనేత్రల నటంచుఁ జక్కఁ దెలిపి య
వ్వారలతోడనె స్యందన, వారము కోశప్రజంబుఁ బంపెం గడఁకన్. ౩౬

క. ఐరావతకులభవములు, సారాంగము లున్నతములు సాధువులు చతు
స్స్ఫురతరదంతములు నగు, వారణములఁ బంపె హరియు ద్వారక కెలమిన్.

తే. అవ్వి యఱువదినాలుగై యశమునఁ దగి

యుండె; నంతట శ్రీకృష్ణుఁ । డువిదఁగూడి
యింద్రుమందిరమున కేగి । యెలమి నదితి
కొసఁగెఁ గుండలముల రత్న।విసరరుచుల. ౩౭౪. 664

చ. హరిహయుఁడుం బులోమజయు । నచ్యుతునిం దమి సత్యభామనుం
బరమ సపర్యలం దనిపి । భవ్యతమోక్తుల గారవించి; రా
హరియును సత్యభామ తను । నత్తఱినిం బురికొల్పఁ గల్పభూ
మిరుహముఁ బారిజాత మన।మించెడు కీర్తినిగన్న దానినిన్. ౩౯౪ 665

క. పెకలించి గరుడుపయి నుంచి కడుం గ్రోధంబు మీఱి । జిష్ణుముఖులు మా
రుకొని యనిసేయ వారల, నొక క్షణమున గెల్చి పురికి । నొప్పఁగఁ జేర్చెన్.

చ. తనప్రియురాలి మందిర।వతంసమునం దగునిష్కుటంబునం
జనుల పొగడ్తలొప్పనటు । స్థాపనచేసెను షట్పదంబు లా
యనుపమపారిజాత కుసు।మాసవగంధమునందుఁ గల్గునా
సను వెనువెంట వచ్చె నదె । చాలవిచిత్రముగాఁగఁ దోఁచెడున్. ౮౦ 667

చ. తొలుత మహేంద్రుఁ డెంతయును । ధూర్తతమాని కిరీటకోటులా
జలరుహనేత్రు పాదజల।జంబులు సోఁకఁగ మ్రొక్కి వేఁడి త
త్ఫలముగఁ గల్పపాదపముఁ । దాఁ గొని యాహరితోడ నవ్వలం
గలహమొనర్చి యోడె; వగ।ఱ గ్రమ్మఱ వేఁడి మహాధ్యుఁడై తగెన్. ౮౧ 668

ఆ. అక్కటకట! నిర్జ।రాధిపునకుఁ గల్గు, నయ్యహంకృతియును । నాఢ్యతయును
బలుకవలెనె వారి।పరమాజ్ఞతను నిసీ!, యనఁగ వలయుఁగాదె । యరసి చూచి.

రాజకన్యలఁ బదాఱువేల శ్రీహరి పెండ్లియాడుట.

ఉ. అంతట నవ్వ్యయుండు పర।మాత్మ శుభక్షణమందు నొక్కటం
గాంతల భూమిసూనుని య।గారమునుండి విముక్తి గాంచఁగా
నెంతయు శక్తిఁజేసి తన।యెత్తెఱమీఱ గ్రహించి తెచ్చి గే
హాంతరరాజి నుంచిన మ।హారుచిరాంగము లొప్పువారలన్. ౮౧౪ 670

చ. వరుసగఁ గాక యొక్కతఱి । వారలసంఖ్య యదెంతొ యంతకుం
సరియగునట్లు రూపములఁ । జక్క నమర్చియె వారివారి మం
దిరములఁ బెండ్లియాడెను; సు।ధీజనసంతతికే నెఱుంగఁగాఁ
దరములుగాని కృత్యములఁ । దా నొనరించు మహాత్ముఁ డత్తఱిన్. ౮౨ 671

సీ. స్వానందపరిపూర్ణుఁ।డై యించుకంతయు నొకగేహమునకు వే।ఱొక్కగేహ
మునకు నేవిధమునఁ । బోల నాలోచింప భేదమే లేనియా । యాదయితల
మందిరంబులయందు । మానవతులఁగూడి యెడఁబాటు లేకయె । పుడమిఁగల్గు
సాధారణగృహస్థు । చందమునం గృహస్థోచితకర్మమ్ము । లొప్పమీఱ

ఆ. నాచరించుచుండి యాసుందరులతోడఁ, దాఁ జరించుచుండెఁ దగినయట్లు;
బ్రహ్మముఖ్యు లెల్లఁ బరికించి యెవ్వని, పదముఁ దెలియలేరొ పరము నతని.

క. పతిగాఁ బడసి క్షమాపతి, సుత లాజవరాండ్రు వరుస సొంపారుచు ను
న్నతిగను ననురాగమ్మున, స్మితములఁ దగుచూపు లొక్క చెలువము గులుకన్:

సీ. నవసంగమ ఫలంబు లవునర్మభాషణములును వ్రీడాభేదములు తగంగఁ
బ్రమద మంతంతకుఁ బరిఢవిల్లుచునుండ నతని సేవించి రాయతివలకును
దాసీశతంబులు తగియుందు రట్లైనఁ బ్రాణేశ్వరునకు సద్భక్తిమీఱ
నెదురేగి పీఠంబు నెలమిమీఱఁగ నిచ్చి పదములు గడుగుచుఁ బచ్చకప్పు

తే. రమునుగూర్చిన తాంబూలము ముద మలర
నొసఁగి బడలిక లుడుగంగ విసరి గంధ
ములను బూయుచు సుమహారములను వైచి
నెఱి కురులు దువ్వి సెజ్జలు పఱచి మఱియు. ౮౮౪ 674

క. జలకము లార్చుచు మఱియును, వలయు నుపాయనము లొసఁగి వైభవమునఁ జి
ప్పిలుచున్న ప్రీతిమెయి నా, జలజాక్షులు సేవ లెల్ల సల్పిరి విధిగన్. ౮౮౫ 675

అఱువదియవయధ్యాయము.

రుక్మిణితోఁ గృష్ణుఁడు సరసములాడుట.

మ. ఒకనాఁ డాదృతి స్వీయతల్పమునయం దొప్పారఁ గూర్చున్న యా
సకలాజాండగురుం బతిన్ గరసరోజప్రోల్లసచ్చామరం
బకలంకప్రమదంబునం గొనుచు నొయ్యారంబుగా వీచుచున్
సకియల్ సేవకుఁ దోడ్పడం గొలిచె శాస్త్రప్రోక్తమార్గంబునన్. ౧ 676

చ. తనయొనరించినట్టి దగుధర్మమయోత్తమసేతు వేక్షితిం
గనక చెలంగునట్లు తమిఁ గావఁగ నయ్యదువంశమందు సం
జననము గాంచి లోకగణసర్గసుఖస్థితినాశహేతువై
ఘనుఁ డజుఁడైన యీశ్వరుఁడు గాని మఱొక్కఁడె కృష్ణుఁ డారయన్. ౨ 677

సీ. అంతర్గృహంబునయం దాణిముత్తెంపుసరులు వ్రేలాడంగ నిరుపమాన
ముగ నొక్కెడ వితానము చెలంగుచుండెఁ;సన్మణిమయ దీపముల్ సమహితమంగ
ళాకరములుగాఁగ నలరారుచుండెను; బరిమళవిసరైకభార మూను
మల్లికాకుసుమదామములుఁ దాలాగురుధూపముల్ తగియుండెఁ దోయజారి

తే. విశదకాంతులు జాలాలివివర మార్గములఁ బ్రవేశించి యాచోట లలితరీతి
వెలయుచుండె నుద్యానమం దలరుపారి,జాతవనవాసనలు వింతరీతిఁ బర్వ.

క. మకరందసమాస్వాదన, వికచహృదబ్జాతమత్త।భృంగంబుల వా
ప్రకటధ్వను లొక్కమొగిఁ, సకలస్థలములను నిండి। సంతస మొసఁగెన్. ౫౮

క. క్షీరమ్ముల నురుగువలెన్, జారుతరశ్వేతవర్ణ।సంకలిత మనో
హారివసనాభిరంజిత,మై రమ్యం బుత్తమంబు।నౌ పాన్పుపయిన్. ౫౯ 679

క. జగదీశ్వరుండు హరి సుఖ,ముగఁ గూర్చుండంగ భీష్మ।భూపతనయయున్
మగనిన్ సేవింపఁగ మెల్లఁగ వచ్చె సఖీయుతిన్ విలాసముమీఱన్. ౬౦ 680

చ. తన చెలికత్తె యొర్తు కర।తామరసంబునఁ దాల్చియున్న ర
త్ననికరభూషితామలక।నత్కనకాంచితదండచామరం
బును గ్రహియించి వీచుచు వి।భుం బ్రమదంబునఁ గొల్చుచుండె; నె
మ్మనమునఁ బూరుషోత్తముఁడు। మాటికిమాటికి మెచ్చుచుండఁగన్. ౬౧ 681

సీ. మణినూపురంబులు। మంజులధ్వనిసేయ నంగుళీయకవల।యములు చామ
రమును ముంజేత వి।రాజిల్లుచుండంగఁ బయ్యెదచాటునఁ। బరమగూఢ
ముగ నొప్పుపటుకుచ।ముల కుంకుమపుఁబూఁత రక్తిమ వ్యాపింప। రమ్యనవ్య
హారకాంతులు మెఱ।యంగ సత్కటితటిపయిఁ దాల్చియున్నట్టి। పరమమాల్య
తే. కాంచికయు సొంపుగుల్కఁగఁ। గాంచనాంబ
రుని సమీపంబునన్ నిల్చి। యనుపమాన
విలసనంబున నొప్పి య।శ్వ్వేలఁదిమిన్న
సేవ చేయుచునుండె స।ద్భావ మలర. ౬౨ 682

చ. తన యవతారజాలములఁ। దా విడనాడక పత్నియౌచు నొ
ప్పినసతి; మానుషాకృతిని। బెంపెసలారెడు పద్మలీలచేఁ
దనధరియించు రూపములఁ। దా ననురూపసురూపముల్ ధరిం
చు నెలఁతమిన్న రుక్మిణిని। జూచి సరోరుహనేత్రుఁ డాదృతిన్. 683

ఉ. ఫాలమునందు ముంగురులు। పర్వఁగ సన్మణికుండలప్రభా
జాలము దిక్కులన్ వెలయఁ। జారుమణీపదకంబు కంఠమం
దోలిఁ జెలంగ వక్త్రమున। నొప్పుస్మితామృతధారలొందు నా
శ్రీలలనామణిం గనుచు। శ్రీహరి ప్రీతి వచించె నవ్వుచున్. ౬౪ 684

క. ఓరాజపుత్త్రి! ముని నినుఁ, జారుతమంబైన రూప।సంపద బలమున్
బౌరుషము దిగధిపాలక, సారైశ్వర్యంబు గలుగు। జనపతులు తమిన్. ౬౫ 685

క. కోరిరి గద? వారలు సు,శ్రీరంజితు లాఢ్యు లందు। శిశుపాలాదుల్
భూరమణేంద్రులు గద? య,వ్వారలు నినుఁ బెండ్లియాడు।వాంఛలు వెలయన్.

క. స్మరమదము పొంగఁగా వ,చ్చిరిగాదే? మఱియు నీదు।జ్యేష్ఠప్రియ సో
దరుఁడగు రుక్మియుఁ దండ్రియు, ధరణీశుల కీయ మదిని। దలఁచిరి కాదే. ౧౦౪

చ. సములగువారి భూమిపతిసత్తములన్ విడనాడి వారితో
సములముగాని మమ్ముఁ దమి ౹ సంధిలఁగా వరియించి తేలొకో?
ప్రమదలయందు మేటివయి ౹ భాసిలుసుభ్రు! నిరంతరంబు భూ
రమణులకున్ భయంపడుచు ౹ రత్ననిధిన్ శరణంబు వేఁడుచున్. ౧౧౪ 688

ఉ. అందె వసించువారము బలాఢ్యులుగాఁ దగియున్న యాజరా
నందనముఖ్యులైన నరనాథులతోఁ బగఁగొన్నవారమో
సుందరి! చాలకాలముగ ౹ క్షోణివరాసనముం ద్యజించి రా
జేంద్రిర వాసినట్లు చరియింతుము వేఱొకకారణంబునన్. ౧౨ 689

[1]సీ. ఏవిధంబున నీకు ౹ నీడుజోడుంగాని మమ్ము గ్రహించితి ౹ సమ్మదమున
నేటికో; మావగనెల్ల యాచారముల్ తెలియంగఁబడ వెట్టిధీయుతులకు
మావర్తనములు సమస్తలోకములందుఁ గలయట్టివే కావు ౹ లలనలకును
బరతంత్రులమె యగుపరిపాటియే లేదు సు; మ్మిట్టియీపూరుషులను జెట్ట

తే. వట్టి మామార్గమును ద్రొక్కువనితలకును
సుభ్రు! తఱచుగ వెతలగుఁ ౹ జుమ్ము; మేము
తలఁప నిష్కించనులము సతంబు ప్రియము
మాకు నిష్కించనులగు సుమతులసైన. ౧౩౪ 690

మ. తనుమధ్యా! తలపోయఁగాఁ దఱచుగా ౹ ద్రవ్యాధిపుల్ మమ్ము నా
త్మను సేవింపఁగ నెంచ; రన్వయము నర్థంబున్ సురూపంబు నొ
క్కనియం దెక్కుడుగాక యిర్వురకు నొక్కం బెన్నఁ దుల్యంబుగాఁ
గనుపట్టున్ ధర వార లిర్వురకె సఖ్యంబొప్పు నుద్వాహమున్. ౧౮౪ 691

[2]తే. ఉత్తమాధములగు వారి ౹ కొప్ప వివ్వ
యొచ్చటను సత్యమీవిధి; ౹ నెఱుఁగ కీవు
దూర మాత్మ విచారింప ౹ కోరమణిరో!
మమ్ము వరియించితివి భూపమాన్యుల మని. ౧౯౪ 692

క. అతివా! గుణహీనులమై, తితి నుందుము గాన ద్రవ్య ౹ సిద్ధితగని భి
క్షుతతియె గుణవంతుల మని, [3]వితథ్యముగ సన్నుతించు ౹ వివిధవిధములన్.

క. అదివిని నిజమను నూహను, ముదితా! వరియించితివి మమున్ భ్రాంతిమెయిన్
మది నెన్ని యింకనైనను, సదమలగుణశాలినైన ౹ క్ష్మాపతిపుత్త్రున్. ౧౬ 694

---

1 "అస్పష్టవర్త్మనాం పుంసా మలోకపథమీయుషామ్" అని మూలము. 2 "యయోరాత్మ సమంవిత్తం జన్మైశ్వర్యాకృతిర్భవః, వయోర్వివాహో మైత్రీచ నోత్తమాధమయోః క్వచిత్" అని మూలము. 3 "వైదర్భ్యేతదవిజ్ఞాయ త్వయాఽదీర్ఘ సమీక్షయా, వృతావయం గుణైర్హీనా భిక్షుభి శ్లాఘితాముధా" అని మూలము.

క. వరియింపు మెట్టివానిం, గరపీడనవిధి గ్రహింపఁ § గా నిహమందుం
బరమందు నీదు కామిత, పరంపరలు నిశ్చయముగఁ § బండునొ వానిన్. ౧౮ 695

శా. వామోరూ! యటులేని నన్ను నిటకున్ § బాహాబలం బొప్పఁగా
భూమీశుల్ గన నేల తెచ్చితివొ తెం§పుం బూని యం చాడెదో?
మామాటల్ విను వీర్యగర్వముల నే§మాడ్కిన్ బరుంగాన కు
ద్దామైశ్వర్యమునన్ జెలంగుదురు సూ§ ధాత్రీశు లత్యంతమున్. ౧౮½ 696

సీ. వా రెవ్వ రందువో § వామాక్షిరో! జరాసంధుఁడు శిశుపాల § సాల్వు లల్లె
రుక్మియు దంతవ§క్త్రుండును లోనుగాఁ గలుగు వారలు నన్నుఁ § గావరమున
ద్వేషించుచుందు రా§తీరున నుండున వ్వారి గర్వం బడ§పంగ బూని
తనుమధ్యమా! శుభ§దాయినీ! కుమతుల తేజంబును హరింపఁ § దివురు నేను

తే. నిన్నుఁ గొని తెచ్చితిని మఱి § యన్నుమిన్న!
యరయ మేమన గేహదే§హాదులందు
నిజ ముదాసీనులము కోర్కి § నెగడ దందు
సుంతయైనను నమ్ము మో§సుందరాంగి! ౧౯½ 697

క. మే మాత్మలాభముననే, యామోదము తృప్తిగల్గి § యన్యవిషయ మం
దేమాత్ర మాసపడము, ధ్దామజ్యోతిస్స్వవోలెఁ § దగుదుము సతమున్. ౨౦

క. వినుము క్రియారహితులమై, తనరుచు నుందుము ప్రపూర్ణ§తన్ భావింపం
గను లలితవిలాసంబుల, కనుమోదము నొందుచున్న§యట్టి మదవతుల్. ౨౦

క. మముఁ గోరుట సంగతమే, సమానులము గామి; నంచు § సకలేశుఁడు పూ
ర్ణమనస్కుఁ డింతదనుకన్, బ్రమదామణికిన్ వచించి § పరమార్థముగన్. ౨౦½

*క. తానే శ్రీకృష్ణునకున్, మానసమున కింపుఁ బెంచు§మానిని ననిసుం
తైన నెడఁబాయకుండుదు, నేనని గర్వించు రుక్మి§ణిమదము నడఁపన్. ౨౧ 701

క. తలపోసి మానసంబునఁ, బలికి మఱేమియును దాను § బల్కకయుండెన్
లలనారత్నము త్రిభువన, పులలోనన్ వర్యుఁడగు వి§భుం డీరీతిన్. ౨౧½ 702

మ. శ్రుతపూర్వంబులు గాని యప్రియములన్ § శ్రోత్రద్వయం బెంతయున్
వెతనొందం బలుకంగఁ దాను విని పె§ల్భీతిన్ హృదబ్జంబు కం
పత గాంచన్ బలవించుచున్ నుడులఁ దె§ల్పన్ శక్యమే గాని య
ట్లతిదుఃఖార్ణవమగ్న యయ్యె; నపు డా§యబ్జాక్షి లోనెన్నుచున్. ౨౨ 703

సీ. పొంకమ్ములై మంచి§పుట్టువు గలవియై కోమలములునైన § గోళ్ల రక్త
కాంతిమించఁగ నొప్పు § క్రమ్రపదంబున నవనిలిఖించుచు § నంజనమున

---

* "ఏతావదుక్త్వా భగవానాత్మానం వల్లభామివ, మన్యమానా మవిశ్లేషా త్తద్దర్పఘ్న ఉపార
మత్" అని మూలము. "తద్దర్పఘ్నో రుక్మిణీదర్పహారః" అని టీక.

నసితంబులైనట్టి యశ్రువుల్ చిమ్ముచుఁ గుంకుమచర్చ చేఁ గొమరుమిగులు
వక్షోరుహంబుల బాగుగఁ దడుపంగ మో మట్టివాంచి యబ్బురముఁదోఁపఁ

తే. జేయుదుఃఖము పెల్లునఁ జెప్పఁబూసు, పలుకు డగ్గుత్తికను రామి నిలిచియుండె
నేమియుం దోఁపమిన్; భరియింపరాని, భీతి దుఃఖశోకంబులచేతఁ దూలి. ౨౩

చ. అతివమనస్సు మిక్కిలి వ్యథాకులమై తగఁజారుకంకణ
ప్రతతి ధ్వనింప నొప్పుకరపంకజ విచ్యుతమౌచుఁ జామరం
బు తగనిభంగి నేలఁబడె; భూరితరార్తిని బుద్ధి ధైర్యవి
చ్యుతిఁగన నాతలోదరి మృదూత్తమదివ్యశరీరవల్లియున్. ౨౩౪ 705

తే. ఆలసింపక స్మృతితప్పి యచటనిల్వ
కట్టె నెఱికురుల్ విరియంగఁ బొఱఁ
బవనహతిఁ గూలురంభాతరువువలె ధరఁ
బడియె; నప్పాటుగని భగవంతుఁ డపుడు. ౨౮ 706

మ. పరిహాసోక్తుల ప్రౌఢిమన్ దెలియ కప్పాటన్ వగం గుందునా
తరుణీరత్నము ప్రేమబంధన మొగిం దాఁ గాంచి వాత్సల్య ము
బ్బరయం బెంతయుఁ బ్రోత్సహింపఁ బరికంపం బట్టె తన్ బైకొనన్
హరిపర్యంకము డిగ్గి కోమలములౌ హస్తంబులం జక్కఁగన్. ౨౯ 707

ఉ. పైదలి లేవనెత్తి కచబంధముఁ జక్క నమర్చి కోమలం
బౌ దన కేలుఁదమ్మి జవరాలిముఖంబును దువ్వుచున్ గటా!
మోదమునొందఁజాలు ననబోఁడికి శోకముఁగల్గఁ బల్కితిన్
గాదన కంచు నెంచుచు వగం బ్రవహించెడు నశ్రుధారలన్. ౨౬౪ 708

క. కరపద్మంబునఁ దుడుచుచు, నురోజములఁ గ్రమ్మియున్న యుబ్బుదుఃఖాశ్రు
త్కారమును దుడుచుచుఁ దను నే, నిరతని భావించు చొక్కనిం బరపురుషున్.

క. మనమున భావింపని సాధ్విని రుక్మిణిఁ బంకజములఁ దెగడుకరములం
దనివారఁ గౌఁగిటం జేర్చెను; సాంత్వనముల నెఱుంగు శ్రీహరి యంతన్. ౨౭౪

ఉ. మేలములందు సొంపు దగమించిన భావముఁ జక్క నారయం
జాలక భ్రాంతినొంది తనస్వాంతము దూలఁగ నట్టిచింత కే
వేళ ననర్హురాలయిన భీతమృగాక్షి సతీమతల్లికన్
జాలఁగ దీనతం గనినచాననుఁ సద్గతియాటఁ డా నటన్. ౨౭ 711

క. కరుణాఢ్యుండను యశమునఁ, బరిపూర్ణుండైన కృష్ణపరమేశ్వరుఁ డ
త్తరుణమున నూఱడించెను, బరమాదృతిమై వచించె భావం బలరన్. ౨౭

క. ఓవైదర్భి! నాపై, నేవం గొనఁబోకు మేను నెఱుఁగుదుఁ జుమ్మా!
నీ వరయ మత్పరాయణ, వై వర్తిల్లుదు వటంచు నాత్మ నిరూఢిన్. ౨౭౪

క. వినను నీయాశయముం, గానక వాంఛించి యెట్టిక ఽ ప్రోక్తులతో
నీనాసుడులకు బదు లే, మే నిత్తువొ యంచు నర్మ ఽ మే నిటఁ గొనుచున్. ౨౯

క. పలికిలి మఱియుఁ వినుమీ, పొలయలుకను నీదు నధర ఽ ము వడఁకుచుండన్
బలితంపుఁ గోపవశతఁ గ, దలునరుణ కటాక్షములును ఽ దైవారంగన్. ౨౯½

క. నిరుపమసుభ్రుకుటీ తట, మరుదుగ నొప్పంగఁ జూడ ఽ నతిసుందరతం
బరఁగెడు నీనెమ్మోమును, దరుణీ! కనఁగోరి నర్మ ఽ ధర్మయుతోక్తుల్. ౩౦ 716

క. ఒకరీతిఁ బల్కినాఁడను, జకితమృగాక్షి! యవెల్ల ఽ సత్యములని న
మ్మకుమా! కలహములను నే,మిక లదు కుతుకంబు సుఖము ఽ మీ కనియెదవో? ౩౦

ఉ. భీతమృగాయతాక్షి! విను ఽ ప్రేయసితోడను నర్మభాషణ
వ్రాతము లాడుచుం బ్రియము ఽ వర్ధిలఁ గాలముపుచ్చుటే కదా
యేతఱినే గృహస్థులకు ఽ నింపగులాభము గేహజాలమం
దాతతసౌఖ్యదం బనుచు ఽ నాత్మఁ దలంపుము భామినీమణీ! ౩౧ 718

చ. అని భగవంతుఁ డిట్లు తను ఽ నల్లన నూఱడఁగాంచఁ బల్కఁగా
విని విరిబోఁడి యట్టి యవి ఽ వేడుక కాడినమాట లంచు నె
మ్మనమున నమ్మి తన్వదలు ఽ మాధవుఁ డన్న భయంబు మానె; రా
ట్తనయయు నంత శ్రీశుముఖ ఽ తామరసంబును వేడ్కయుబ్బఁగన్. ౩౨ 719

ఉ. కోమలలజ్జ యట్టి తను ఽ గూడఁగ సుందరమందహాసముల్
వేమఱు ప్రోత్సహింపఁ గన ఽ వింతగు స్మేరకటాక్షవీక్షణం
బామెతఁగూర్పఁ జూచుచు న ఽ యంబునఁ బల్కె; సరోజనేత్ర! నీ
వే మెయిసాటిగాని నను ఽ నేల వరించితివంచుఁ బూన్కిమై. ౩౩ 720

*చ. అడిగితి వద్ది సత్య మగు ఽ నారయ నెవ్వరికే వచింప నె
వ్వుడు తగనట్టి తావకవి ఽ భూతికి నేనెటు సాటివత్తు, శ్రీ
శుఁడు పరమేష్ఠి శంభుఁడన ఽ శోభిలు మూర్తుల కీశ్వరుండవై
యుడుగని స్వప్రభావమున ఽ నొప్పెడు నీకును నే సమాననే? ౩౩½ 721

సీ. త్రిగుణస్వభావనై ఽ తెలియనివారలు పాదసేవయొనర్పఁ ఽ బరఁగునట్టి
దానను గద నేను; ఽ ధరణీశులకు మది వెఱచి చొచ్చితిఁగద ఽ విషధినంటి;
వోయురుక్రమ! యగాధోదధి నిశ్చలుఁడవె యాచు నున్న నీ ఽ కవనినాథ!
భయముగల్గునె భూమి ఽ పాలకతుల్యగుణములకు భయపడి ఽ నవిధ మొరుల

తే. కగపడం జేయుదువు సలి ఽ లాధిపునకుఁ
గల యగాధత్వముఖగుణ ఽ ములను బోలు

---

* "క్వ స్వేమహిమ్న్యభిరతో భగవాం స్త్ర్యధీశః క్వాహం గుణప్రకృతి రజ్ఞ గృహీతపాదా" అని మూలము. "త్ర్యధీశః త్రయాణాం బ్రహ్మాదీనా మప్యధీశః." అని శ్రీధరాచార్యులు.

విషయరూపగుణాళి కేవిధిని లోను
గాక వర్తింతు వమలవిఖ్యాతి వెలయ. ౩౮౪ 722

క. అనుపమచైతన్య ఘనుం, డన నొప్పుదు వాత్మరూపుఁడను విఖ్యాతిం
గనినాఁడవు; బలయుతులగు, జననాథులతోడ నాకు శత్రుత యనెదో. ౩౮౫

క. అదియును సత్యంబే యగు, మదయుతులై కుత్సితాంగమండల మొప్పం
గఁ దగినవారలతోఁ బగ, కుదురును నిత్యంబు నీకుఁ గువలయనేత్రా! ౩౮౬

క. ధరణీశార్హపదము మముఁ, బరిత్యజించె ననుపల్కు భావ్యంబె యగున్
నరవరసింహాసన మది, పరికింపఁగ గాఢతమము పాటిదె యగుఁజూ! ౩౮౭ 725

క. నీసేవకులే దానిఁ గ,నీసముగాఁ దృణముపోల్కినిం గందు రనం
గా సరసీరుహాలోచన, నీసంపన్మహిమ నదియు నింద్యము కాదే? ౩౮౮ 726

క. మావర్తనముల కలరూ,పీవిధమని తెలియరా దదెవ్వరి కనుచున్
నీవన్నమాట సత్యమె, యహా విశ్వేశా! భవత్పదాబ్జమధుపునున్. ౩౮౯ 727

చ. మనసులు తృప్తినిం గనెడుమాడ్కిని గ్రోలు మహర్షులే భవ
జ్జననముఖంబులం గనఁగఁజాల రనంగను దక్కువారిఁ జె
ర్కొన నిఁక నేల? లోకమునఁ గ్రుమ్మరుచుం బశుతుల్యులైన య
మ్మనుజులకున్ దురూహ మనుమాట యథార్థముగాదె యారయన్. ౩౯౦ 728

క. మా నడవడి లోకమునం, గానంబడు దానితోడఁ గలియ దనుచు నీ
వో నాథ! యంటివి గదా, యేనరులు నిన్ను భజింతు రెంతయుఁ బూన్కిన్.

క. నిను ననువర్తింతురో యే, జనులు తదీయంబులయి గుణసంగము చేష్టల్
గనరాకయుండు నన నీ, యనుపమచేష్టితము లెట్టులవు లౌకికముల్. ౩౯౨ 730

క. వానిం దెలియఁగ నెట్లొ, మానిని! నిష్కించనులము మహి మే మనునా
నీనుడి సత్యమె! ప్రాప్యం, బౌ నది యేదియును లేమి సధనుఁడవె సుమీ! ౩౯౩

చ. ఇతరులనుండి పూజల నహీనవిధిం గొను బ్రహ్మముఖ్యదే
వతతులు నేమహాత్మునకు భక్తిభరంబునఁ బూజ లెన్నియో
వితములఁ జేసి కొల్తు రలవిష్ణుఁడవై తగునీకు ద్రవ్యమె
ట్లితరుల కున్నయట్లుతగు నెన్నఁగ నిస్స్వుఁడ వెట్టులోకదే. ౩౯౪ 732

సీ. నిష్కించనులె మాకు నెయ్యురంటివి దేవ యదిసూనృతంబె యాఢ్యులమని
విఱ్ఱవీఁగుచు స్వేచ్ఛ వెలయ వర్తించుచు నింద్రియప్రియులయి హీనులైన
వారు నిన్నంతకాకారుఁడ వని తెలియంగఁ జాలరు పూజకర్తలైన
బ్రహ్మాదిదేవతావరులకుఁ బ్రియుఁడవు వారు నీకును బ్రియులారయంగ;
తే. విత్తముఖములు సమములై వెలయుచుండు
నెట్టి యిర్వుర కవ్వారికే చెలిమియు

బెండ్లియును దగునంటివి । వేదవేద్య
సకలపురుషార్థమయుఁడవు । సకలదుఁడవు. ౩౭ 733

క. ఫలరూపుఁడవై తనరుదు, వలఘుతమానందరూపు । డననొప్పుదు వో
జలజాక్ష! బుద్ధిమంతులు, ఖలహరణుఁడవైన నిన్నుఁ । గను వాంఛ మెయిన్.

తే. తమకుఁగల సర్వధనముల । దారె వదలు, కొందఱవ్వారితోడ నీకుం బొసంగు
సేవ్యసేవకభావతఁ । జెలఁగుచున్న, యట్టిసంబంధ మోపరమాత్మ! సతము. ౩౮

తే. అంతియే కాని మిథునధర్మాదృతిఁ గని, తిరుగుచున్ సుఖదుఃఖసందీపితాకు
లాత్ములగు వారితోడఁ బొందమరుట యన,నర్హమే కాదు నీకు నొల్లైననఁగాని.

క. మము భిక్షులు ముథగా నుతు, లమరం జేయుదు రటంచు । నాడితి దేవా!
కమలాక్ష! త్యక్తదండులు, నమలాత్ములునైన మౌను । లనిశము నిన్నున్ ౩౮

క. కొనియాడుదు రనియున్ లో, కనిచయమున కాత్మవగుచుఁ । గ్రాలుదు వనియున్
వనజాక్ష! యాత్మదుఁడ వని,యును నిన్ను వరించితిన్ మహోద్యమ మొప్పన్.

*చ. కనుబొమ లార్చినంతటనె । కాలముపుట్టును దానియుర్వడిన్
మనసులఁ గల్గువాంఛ లణుమాత్రములై నశియించు నట్టి యా
వనరుహసంభవాదులను । వారక మానితి వార లెంతవా
రనియె; మహానుభావుఁడను । నాస నినున్ వరియించితిం జుమీ! ౩౯ 739

క. పరమేష్ఠిముఖ్యదివిజేశ్వరులన్ మానితిని గానఁ । జైద్యాదిమహీ
శ్వరులఁ గలనైన వలతునె, నరపతులకు వెఱతునంటి । న్యాయ్యమె యదియున్.

ఉ. సారధనుర్నినాదమున । శాత్రవభూపులఁ బాఱఁదోలుచున్
బౌరుష ముప్పతిల్లఁ బశువారముఁ దోలి స్వకీయభాగ మే
తీరున సింహముం గొనునొ । ధీరత నట్టులె నన్నుఁ దెచ్చె నే
భూరిబలుండు నాకపతిపూజితుఁ డట్టిఁడవైన నీయెదన్. ౩౯ 741

తే. సాధ్వసము గల్గినట్లు వచస్సు లొప్పఁ
బలుకుటయు విన్నవారల । తెలివిఁ దూలఁ
జేయునే గాని పొసఁగునే । యేయెడలను
సంభ్రమును జొచ్చితి నటన్న । సరణియెల్ల. ౪౦ 742

క. పరిహాసాస్పదమే యగు, ధరణిన్ జననాదికముల । తత్త్వ మెఱుఁగ నె
వ్వారికిం దగ నట్లొప్పుచుఁ, జరించుమముఁ గొల్చువారు । శ్రమపడుదు రిలన్. ౪౧

సీ. అనిపల్కితివి గాదె । యంబుజాయతనేత్ర! ధరణీధవోత్తముల్ । పరమకీర్తి
సంయుతులు నగుచు । సతతంబు ధర్మాత్ములునగు నంగుఁడు పృథువును భరతుఁడు

* “హిత్వాభవద్భ్రువఉదీరిత కాలవేగధ్వస్తాశిషోఽబ్జ భవనాకపతీన్ కుతోఽన్యే” అని మూలము.

గయుఁడు యయాతి యింక నుగల్గు రాజేంద్రు, లేకాధిపత్యమా ౹ నిద్ధరాజ్య
మునువీడి కాననములఁ బ్రవేశించి నీపదవినొందిరె కాని ౹ పరమకష్ట

తే. ములకుఁ బాలైరె; యీలోకమునననె యున్న
వారె; యింకనైన నీడైన ౹ భూరమణుని
నీవు వరియింపు మంటి వో ౹ దేవదేవ!
న్యాయ్యమే యిట్లుపల్కుట ౹ నన్ను నీకు. ౪౧ 743

[1]చ. అనుపమమంగళాస్పదము ౹ సర్వజనాళికి ముక్తిదంబు ల
క్ష్మీనిలయమార్యసన్నుతము ౹ గేయగుణాలయమై తనర్చునీ
ఘనతరపాదపంకరుహ ౹ గంధము మూర్కొని యర్థమందుఁ జ
క్కనిరసముఁ గ్రహింపఁగల ౹ కాంత యదెవ్వతె నిన్ను మానెడున్. ౪౨

ఆ. మరణశీలుఁ డగుచు ౹ మానని భయములఁ, గలుగుచున్న మనుజు ౹ లలి గ్రహింపఁ
దలఁచు? నట్టికాంత ౹ గలుగునే నది హితా,హితములను దగంగ ౹ నెఱుఁగకుండు.

చ. కనుక జగత్ప్రభుండవయి ౹ కారణభూతుఁడ వాత్మ వౌచు నిం
దును బరమందుఁ గామములను బరిపూర్ణముగా నొసంగు ని
న్ననని యనురూపతం దగిన ౹ నాథుఁడవే యనినమ్మి కొల్చితిన్
వనరుహనేత్ర! ఘోరభవ ౹ వార్ధి భ్రమించుచు నిన్నె కొల్చుచున్. ౪౨ 746

క. పరివర్తించెడు నాకున్, శరణంబగుఁ గాక నీదు ౹ చరణాబ్జమె సం
సరణహరంబయి భక్తులఁ, బరిపాలింపంగఁ బట్టు ౹ పట్టిన దొట్టిన్. ౪౩ 747

[2]సీ. అచ్యుతా! పెక్కుసంఖ్యల రాజు లొగినిన్నుఁ గామించిరని వారి ౹ దామహిమము
వర్ణించితివి గాదె? ౹ వనితలు పెత్తనమును జేయఁదగు గృహముల నదెవరు
ఖరములరీతిని ౹ బరువులు మోయుచు వృషభంబులను బోలి ౹ యెపుడు సేవ
చేయుచు, భిషకమ్ములో యన నీచతఁ గావలికాచుచుఁ ౹ గాలఁదన్ని

తే. నను బిడాలంబులటు మరలను దగంగ, ననుసరించియె తిరుగుచు ౹ నాజ్ఞ నెల్ల
సేవకులభంగిఁ దప్పక ౹ చేయుచుండు, నట్టి రాజులు పాపాత్ము ౹ లనఁగఁబడుచు.

చ. అరిగణసూదనా! కుమతి ౹ యై తగునాతికి నాథులౌదు రే
తరుణికి శంకరాబ్జభవ ౹ ధర్మసభాస్థలులందు గీతమై
పరఁగు భవత్కథామృతము ౹ పర్వదొ శ్రోత్రములందు నట్టినీ
చరతఁ జెలంగు కాంతలకు ౹ క్ష్మాపతు లట్టిరు ప్రాణనాథులై. ౪౪ 749

1 "కాన్యం శ్రయేత తవపాదసరోజగంధ మాఘ్రాయ సన్ముఖరితం జనతాఽపవర్గమ్." అని మూలము. 2 "తస్యాస్స్యురచ్యుత నృపా భవతోపదిష్టా స్త్రీణాం గృహేషుఖరగోశ్వ బిడాలభృత్యాః" ౪౪ అని మూలము. "స్త్రీణాంగృహేషు—స్త్రీప్రధానమందిరేషు" అని సారము.

తే. ధరణి వర్తింత్రు గాక; నీచరణసరసిజాతమకరందము దురదృష్టమున మీరు
కొనక నిర్భాగ్యులై రా లనఁగను దగు వని,తయగు దుష్పథగామిని ఽ దానవారి. -

సీ. వెలుపలఁ దోలు మీసలును గేశమ్ములు గోళ్లును రోమములఁగూడి యుండ
నంతరంబున మాంసమస్థివారము రక్తమును గృములును మలమ్మును గఫమ్ము
వాతపిత్తములును ఽ బరఁగ జీవచ్ఛవంబగు కళేబర మొప్పఁ ఽ దగిననీచ
పురుషుని దన కెన్నఁ ఽ బూవిలుకానితో సముఁడగు కాంతుగా ఽ స్వాంతమందుఁ

ఆ. దలఁచి కొలుచుచుండు ఽ జలజాక్ష! మే ముదా, సీనులమని మున్ను ఽ చెప్పినారు
గా రెమీరు సత్య ఽ కలితంబె యగునది, యాత్మయందె రతియు ఽ నమరుమీకు. ౭౫౨

క. అనుకంపాధిక దృష్టిని, ననుఁ గనక యకాముఁడవయినఁ నీమృదుప
ద్వనరుహాయుగమున నామది, కనురాగముఁ గల్గుఁగాక ఽ యనిశమ్ము హరీ! ౭౫౨

[1]క. లోకమునకు నభివృద్ధిం, జేకూర్ప రజోగుణమును ఽ జేకొనుదో కదుఁ
బ్రాకటదృష్టిని ననునపు, డే కాంతువు పరమకృప యఁదేకద దేవా! ౭౬ 753

క. అనురూపుఁ డెవ్వఁడగు నో, వనితా! యవ్వాని నిపుడు ఽ భర్తగఁ గొనుమా
యనియంటి వోమహాత్మక!, జనార్దనా! యట్టిపలుకు ఽ సత్యమెసుమ్మీ! ౭౬ 754

క. ధరఁగొందఱు కన్యలకుం, బరికింపం గొందఱెయెడ ఽ భావము ప్రీతి
స్ఫురణం బొందియెయుండుట, యరుదన రా దది తఱచుగ ఽ నల్లేయుండున్. ౭౬౫

క. గాంగేయుఁడు కొనివచ్చిన, యంగనలం దొక్కతెయగు ఽ నంబిక యాసా
ల్వుం గోరదె యట్లే ధర, నంగనల కొకానొకరుని ఽ యందభిరతియున్. ౭౨

[2]తే. కలిగియుండుట యందందుఁ ఽ గలదు; పెండ్లి
యాడినదియయ్యుఁ బుంశ్చలి ఽ యరసి క్రొత్త
క్రొత్తపూరుషునే పొందఁ ఽ గోరుచుండుఁ
గానఁ బండితుఁ డట్టిదా ఽ కన్య నెపుడు. ౭౭౫ 757

క. పరిణయమాడం దగ దే, వరుసనొ యట్టిదగునాతి ఽ భరియించిన నా
పురుషుం డిహాపరములలోఁ, బరఁగెడు సుఖములకుఁ గాక ఽ భ్రష్టుండె యగున్

చ. అనియిటు విన్నవింప విని ఽ యాభగవంతుఁడు రాజవర్యనం
దన! సతి! నీమృదూక్తుల ముదంబలరారఁగ నాలకింప నె
మ్మనమునఁ గోరి యిట్టు లనుమానము వీడియె నవ్వుటాలకుఁ
నినుఁగని పల్కినాఁడను వినీతవు గాన దదంతరార్థమున్. ౭౮౫ 759

క. పరికించి న్యాయసమ్మత, సరణిఁ బదులాడితి వది ఽ సత్యంబె సుమీ;

1 "యర్హాస్యవృద్ధయ ఉపాత్తరజోఽతి మాత్రః" అని మూలము. 2 "వ్యూఢాయాశ్చాపి పుంశ్చల్యా మనోఽభ్యేతినవంనవం, బుధోఽసతీం నబిభృయా త్తాం బిభ్ర దుభయచ్యుతః" ౭౮. అని మూలము.

తరుణీరత్నమ! నాపై, నిరతిశయైకాంతభక్తి ని్ల్పిన నీకున్. ౫౯ 760

[1]క. కోరంగఁదగిన వాంఛలు, సారంబగు ముక్తియందె సఫలమ్ము లగుఁ
గోరిక లుడుగుటయే కద, యారయఁ గళ్యాణి! భక్తికర్మఫలంబౌ. ౬౦ 761

క. అనఘాత్మురాల! నర్మము, గనఁబఱచెడు నాదుపల్కు గమికిఁ నీదా
మన మించుకేని చెదరక, వినిశ్చలముగాఁగ నిల్చి వెలయుట కతనన్. ౬౦౪

క. నాపై నీకుంగల్గిన, యాపాతివ్రత్య మతిశయ ప్రేమమ్ముఁ
జూపట్టె విశదరీతిని, వే పల్కులిఁ కేల నీవె విమలాత్మ వనన్. ౬౧ 763

[2]చ. జనులు సకామచిత్తులయి సంసృతిరూపసుఖంబుఁ గోరి నె
మ్మనములు దూషితంబులయి మార్పడఁగా నపవర్గనాయకుం
డనయి చెలంగు దేవపతి నన్నుఁ దపోవ్రతచర్యలం గడుం
దనియఁగఁజేయఁ బూనుదురొ తప్పక వారల నేను మాయచేన్. ౬౨ 764

ఆ. మోహితులగు నట్టు లూహించి చేయుదు; మానినీ! తలంప నేను ముక్తి
సంపదీశ్వరుఁడనుసంపత్తు లింక నే, యేవి కలవొ వాని కెల్లఁ బతిని. ౬౨౪

సీ. ఇట్టినన్నుంబొంది యెవరు మోక్షముదప్పఁ దక్కినకోర్కులఁ దవిలికోరు
దురొ వారు క్షితిమీఁదవిరహితభాగ్యులే యగుదురు; నరకంబు నందుఁగూడ
విషయసుఖములు లభించునేకద వాని నర్థించు దంపతు లట్టివారె
యగుదు; రీవిషయమునందు నాశ్చర్య మేమున్నది? సాధుగుణోత్తమవయి

తే. యోగ్యహేశ్వరి! తనరారు చుందు వీవు
సంసృతివిబంధజాలమోచని యయితగు
నట్టియనువర్తి నాయందు నమరనుందు
విదె యదృష్ట మనంజను నిది నిజంబు. ౬౩౪ 766

క. అనువర్తన మిట్టిది దుర్జనులకు నేశ్రమమునను నశక్యము సల్పం
గను నంచు నెన్నుమా దుర్జనభావము గలిగి విషయ సంతృప్తి గనన్. ౬౩౪

క. నిరతిని గోరుచు నిష్కృతి, పరాయణత్వము వహించు పడఁతికి నిదియే
వరుసను సల్ప నశక్యమె, తరుణీ! సుచరిత్ర! క్షితిని దగుగేహములన్ ౬౪ 768

క. నీమాడ్కిఁ బ్రేమవతియా, భామిని యిల్లాలుగాఁగ భాసిల్లుట నే
నేమెయిఁ గన నేరను నిజ, మోమంగళరూపిణీ! త్వ దుద్వాహమునన్. ౬౪౪

మ. ధరణీనాయకు లెందఱో యరుగుదేఁ దద్వైభవం బెన్న కే
యరుదో నీవగు సత్కథల్ నుడువఁగా నాలించుచుఁ బ్రీతి నీ

1 "యాఁ యాఁ కామయసే కామాన్మ య్యకామాయమానిని" అని మూలము. "అకామాయ కామనివృత్తయే మోక్షపర్యవసాయిన ఇత్యర్థః" అని వ్యాఖ్య. 2 "కామాత్మానోఽపవర్గేశం మోహితా మమ మాయయా" అని మూలము.

కరముం గైకొన నున్న నాకడకు నిక్కంబైన నీభావముల్
సరిగాఁ జెప్పఁగఁ బంచినావుగద సత్త్వాత్మ మర్త్యునిం గోవిదుల్. ౫౫ 770

క. కనుకల నినుఁ బోలినభా, ర్యను నొక్కఁడఁ జూడఁదరమె; యనిమొన నీయ
న్నను రుక్మి గెల్చి మాన క,తనిని విరూపునిగఁ జేసి తగ విడుచుటయున్. 771

మ. అనిరుద్ధాఖ్యకుమారు పెండ్లిసమయంబం దక్షసంక్రీడనం
బున రుక్మిన్ సమయించినట్టి యదియున్ భూరివ్యథం గల్గఁజే
సినను మ్మైడఁబాయ భీతిగొని నీచిత్తంబునందే మహా
ర్తిని జక్కంగ నిమిడ్చికొంటివిగదే ధీశాలినీ! రుక్మిణీ! ౫౬ 772

మ. ఒకపల్కైనియుఁ జెప్పవై తివికదా యోసాధ్వి! యీకారణం
బొకఁడే మేమెుగి నీకులోఁబడుచు నిట్లుండంగఁ జేసెన్, జుమీ!
సకలేశుండని యెంచి యూహలను విస్తారంబుగాఁ గూర్చి స
న్నెకదా పెండిలియాడుకోర్కిఁదగు నీహృద్భావముం దెల్పఁగన్. ౫౬౪ 773

శా. దూతం బంచితి వట్టివార్తవినియుం దోడ్తోనసే రాక నేఁ
జేతం బందెదొ యెంచి జాగొనరుపన్ సీమంతినీరత్నమా!
యేతద్విశ్వము శూన్యమన్న తలఁపుల్ హృద్వీథిఁ జొప్పించి యీ
పూతాంగంబు ననన్యయోగ్యము విడన్ బూన్కిన్ గడుం గొంటిగా. ౫౭

క. నీయందుఁ బొడమునట్టి య,మాయికభావంబునకుఁ బ్రమద! మేము బదుల్
చేయంగలేక యెంతయు, నీయనువున సంతసింతు మిది సూనృతమా. ౫౭

క. తనయందె రతియుఁ గల్గిన, వనజాక్షుఁడు లోకగురుఁడు వసుదేవసుతుం
డన నొప్పెడు భగవంతుం, డనుగత లక్ష్మ్యంశయైన యారుక్మిణితోన్. ౫౭౪

ఉ. మానవలోకపద్ధతుల మానక తాఁ గయికొంచు సమ్మదా
నూనరతైక నర్మయుత నూతనభావ మనోజ్ఞభాషలన్
గానిక లిచ్చుచున్ సుదతి కమ్రసుఖాంబుధిఁ దేలఁజేయుచున్
శ్రీనిధియుండె; నట్లె తనచేడెలఁ దక్కినవారి నెల్లరన్. ౫౮ 777

క. గృహమేధుల ధర్మంబుల, గ్రహియించుచుఁ గోర్కె లూరఁగాఁ జేయుచుఁ ద
ద్గృహముల నెల్ల వసించుచు, విహరించెను లోకగురుఁడు వేడుకమీఱన్. ౫౯

---

అఱువదియొకఁటవ యధ్యాయము.

శ్రీహరి పదాఱువేలభార్యల నానందింపఁజేయుట.

చ. హరిసతు లంత నొక్కరొక రాత్మవిభుం దలపించు రూపవై
ఖరి గలపుత్త్రరత్నములఁ గమ్రగుణాఢ్యులఁ గృష్ణుఁడే యగుల్
సరిగ నటించుఁ జెప్పుటకుఁ జాలినపద్ధర వేడ్క గాంచి రా

సరసిజనాభుఁ డాసతుల ! సద్మములందె వసించి యుండుటన్. ౧ 779

మ. పరమేశుం డితఁడౌను మానవతనే ! పాటించు చున్నాఁడు స
ర్వరతుం డంచుఁ దదీయతత్త్వలవముల్ ! స్వాంతంబులం దెన్నఁగాఁ
దరముంగామి నొకొక్కపత్నియును మోదస్థానమౌఁ దానె శ్రీ
హరి కంచుం దలపోయుచుండెఁ దల మోట్లో వార లీశుంగనన్. ౨ 780

సీ. సర్వమార్గంబులఁ ! జక్కఁగాఁ దలఁచినఁ బరిపూర్ణుఁడై యున్న ! పంకజాతు
నాభగవంతుని ! నరయంగఁ జాలక చారుపంకజసమాస్యంబు దీర్ఘ [దృ
బాహుని నేత్రయుగంబుఁ ! బరికించి ప్రియమును వెలిపుచ్చుసుస్మితంబులను జా
లను నర్మభాషల ! మనసులు మోహితములగుటఁ దమవగు ! లలితవిభ్ర

తే. మముల శ్రీకృష్ణుమనసు నేమాత్రమే జ
యింప నేరక యుండి రాయింతు; లంత
హరియు నాపూపుఁబోఁడుల ! యంతరంగ
మును గలంపఁగఁ బూనెఁ బ్రీతిని మఱింత. ౩ 781

*చ. అనువగు గూఢహాసమున ! నాత్మదృగంచలముల్ మనంబునం
దనరెడు భావ మీయ దని ! తప్పక చెప్పఁగ దానిచే మఱిం
త నెగడు భ్రూలతాచలనతం దళుకొత్తగ సాగనంపు నా
మనసిజకేళి మంత్రగతమండిత మారశరాళి సంహతిన్. ౩4 782

మ. స్మరశాస్త్రప్రకటంబులై తనరి యంచద్రీతి నొప్పారు నే
కరణవ్రాతముల్ బరేశమనముఁ ! గాఱింప నేమాత్రమేఁ
దరుణీరత్నము లేప్రయత్నముననుం ! దారుఁ బదార్వేలుచా
లర యిందేమి విచిత్ర మున్నయది లీలామానుషుండౌఁ గదా! ౪ 783

తే. ఎవనితత్త్వంబు బ్రహ్మాదు ! లెఱుఁగ లేరొ
యట్టిశ్రీపతి భర్తగా ! నాపదాఱు
వేల కాంతలు పడసి యాయవిశ్వనాథుఁ
డుత్తరోత్తర మభివృద్ధి ! నొందుప్రీతి. ౪4 784

క. అనురాగహాసములఁ జక్కనిచూపులఁ గ్రొత్తక్రొత్తగాఁ గన్పడు మా
రునికేళుల నింకనుగల, ననూనలీలలను దమ్ము ! నలరింపంగన్. ౫ 785

క. పరమామోదము నొందుచుఁ, బరమేశుని గృష్ణు నతనిఁ ! బతిగాఁ గని కొ
ల్చిరి ముద ముప్పొంగఁగ నా, పురంధ్రు లెల్లరును సిరులుపొదలుచునుండన్.

క. పనికత్తెలు నూఱుల కొలఁదిని గల్గినఁ బతికి దేవదేవునకుం గృ

* "స్మాయావలోక లవదర్శిత భావహారి భ్రూమండల ప్రహిత సౌరతమంత్రశౌండైః" అని మూలము. వీనిసారమే యిందుఁగలదు.

ష్ణునకుం దమరే యెదురుగఁ, జని దివ్యాస్తరణమునిచి సంతస మలరన్. ౫౪

చ. చరణసరోజముల్ గడిగి చక్కనిపీఁట నొసంగి దివ్యమై
పరిమళవంతమై కనులపండువు చేసెడు గంధముం గళే
బరవరమం దలంది ప్రసవప్రియదామకయుక్తి వేడుకన్
వరుస నలంకరించి ప్రియభావముపైఁ బయిఁ బొంగుచుండఁగన్. ౬ 788

తే. శ్రమమువాయమనోహర చామరముల
విసరుచున్ నెఱికురుల దువ్వి మృదుహంస
తూలతల్పంబు లమరించి లీల జలక
మార్చి కానుక లర్పించి యమలభక్తి. ౬ 789

క. ఒనరించిరి దాస్యంబును, వనితలు దశపుత్రకులను బడసి రనుచుఁ బే
ర్కొనియుంట మున్ను నీకో, జనపాలక! వారితో నొసంగెడు వారిన్. ౬౪ 790

క. తెలిపెద నెనమండ్రుసతుల్, గల రెంతయు ఖ్యాతిమించఁ గాఁ బట్టపురా
ణులనన్ బరఁగిరి తత్పుత్రులనుం బ్రద్యుమ్నముఖుల ధూతరిపులనున్. ౭ 791

వ. వివరింతునాలకింపుము. ప్రద్యుమ్న, చారుదేష్ణ, సుదేష్ణ, చారుదేహ, సుచారు, చారుగుప్త, భద్రచారు, చారుచం, ద్రాతిచారు, చారువులను పదుగురు రుక్మిణియందుఁబొడమి శ్రీకృష్ణసమానులైరి. భాను, సుభాను, స్వర్భాను, ప్రభాను, భానుమంతులును, జంద్రభాను, బృహద్భాను, రతిభాను, శ్రీభాను, ప్రతిభానువులను పదుండ్రు సత్యభామయందు జనించిరి. సాంబ, సుమిత్ర, పురుజి, చ్ఛతజి, త్సహస్రజి,ద్విజయ, చిత్రకేతు,వసుమ, ద్ద్రవిడ, క్రతువులనుపదుగురుజాంబవతికింబుత్త్రులైరి. వీరెల్ల, దండ్రికెల్లవిధంబులం దీసిపోవరనియెఱుంగవలయు. వీర, చంద్రా; శ్వసేన, చిత్రగు నామకులును, వేగవంతుఁడు, వృషుఁ, డామ, శంకు, వసు, కుంతి నామకులుపదుగురు నాగ్నజిత్తికింగుమారులైరి. శ్రుత, కలి, వృష, వీర, సుబాహు, భద్ర, శాంతి, దశ, పూర్ణమాస, సోమకులను పదుగుండ్రు కాళిందికిం దనయులైరి. ప్రఘోష, గాత్రవ, త్సింహబల, ప్రబ, లోర్ధ్వగ, మహాశక్తి, సహోజస్సులు, నపరాజితుండను దశసంఖ్యాకు లాత్మజులు మాద్రికిం బుట్టిరి. వృక, హర్షా, నిల, గృధ్ర, వర్ధ, నాన్నాద, మహాశ, పావన, వహ్ని, క్షుధులనుకుమారులు మిత్రవిందాత్మభవులు. సంగ్రామజి, ద్బృహత్సేన, శూర, ప్రహర, ణారిజి, జ్జయ, సుభద్ర, వా,మాయు, సత్యకులను దశపుత్త్రులు భద్రాదేవియందుఁ గల్గిరి. *దీప్తిమంతుఁడు, తామ్రతప్తుఁడు లోనగుకుమారులు రోహిణియందు జనించిరి. ౧౭ 792

సీ. భోజకటం బనుపురి రుక్మికాత్మసంభవయైన యారుక్మవతి కళత్ర

* "దీప్తిమాం స్తామ్రతప్తాద్యా రోహిణ్యా స్తనయా హరేః" ౧౭. అని మూలము.

మయ్యెఁ బ్రద్యుమ్నున కాతన్వి యతిబలశాలియా ననిరుద్ధసాధుమతిని
దనయునిఁ గాంచెను వనజాక్షు తనయులు తత్పుత్రకులు వారితనయులవనిఁ
బెక్కండ్రు వ్యాపించి పెంపునొందిరి; పదియాఱువేలుగ భార్యలాహరికిని
తే. గలుగు టవ్వార లెల్లఁ బుత్రులనుగనుట
వారిసంఖ్యయు నింతని వరుసమీఱఁ
గా గణింపఁగ రాకుండు క్ష్మాపతీంద్ర!
యనుచు శుకయోగి పలుక రా జనియె నిట్లు. ౧౯ 793

చ మునివర! రుక్మిపూర్వ మొకపోలికఁ గృష్ణుఁడు తన్ బరాభవం
బున వెతనొందఁజేయ హరిఁబూన్కి వధింపఁగ రంధ్ర మెన్నుఁ గా
వున నతఁడేల వైరికిని బుత్త్రుఁ డటంచు నెఱింగి యుండియున్
దన ప్రియపుత్త్రి నిచ్చెనొకో? దాని వినం గను గోర్కి పుట్టెడున్. ౨౦ 794
క. ఇరువురు శత్రులకుఁ బరస్పర మీయుద్వాహరూపసంబంధ మదే
వరుసం గల్గెనొ యోగీశ్వర! మీకుఁ ద్రికాలభవవిషయము లవెల్లన్. ౨౦౫
క. తెలిసియెయుండెడు నింద్రియ,ములనెల్ల జయించినట్టిప్రోడవుగాన్
బలుకుము దవ్వుగ సాగం, గలయవి యంతరము సుంతగల్గు నవియునున్. ౨౧
ఆ. జరగుచున్న యవియుఁ జక్కని యోగంబు,నభ్యసించు వారలొటమునులు
గనుదు రందు మీరుకడుఁ బ్రౌఢిమం గన్న, వారలొట నాకువరుసఁ జెప్పఁడ.

## —ప్రద్యుమ్నాదికుమారుల వివాహము.—

చ. అన శుకయోగి యి ట్లనియె నావిషయం బెఱిఁగించు వాఁడ నో
జనవర! రుక్మిపుత్త్రి సుమసాయకుఁ డీతనువున్ ధరించివ
చ్చె ననుచు నెంచి కృష్ణసుతుఁ జిత్తమునం బతిగా గ్రహించెఁ గ
న్యను గొన నెందఱో ధరణినాథకుమారులు వచ్చి రంతటన్. ౨౨ 798
క. హరిచే నవమానితుఁడై, పరాభవవ్యథను దానిఁ బరిపరి మదిలో
స్మరియించుచు నారుక్మియుఁ, గరము సహోదరికిఁ బ్రీతిఁ గావింపంగన్. ౨౫
క. తనమది నెన్నుచుఁ బ్రద్యు,మ్ననకుం దనకూఁతునిచ్చె మురహరతనయుం
డును దన్నుఁ గోరియుండిన, వనిత స్వయంవరమునందు బాహుబలములన్.
క. ఏకరథుఁడయ్యు నని మొనఁ, భూకాంతులనెల్ల గెల్చి పూఁబోఁడిని దాఁ
జేకొనిపోయెను; రుక్మిణి, దౌకొమరితఁ జారుమతిని ననుపమశీలన్. ౨౩౫ 801
క. కృతవర్మ తనూజుండై, క్షితిలేనిబలంబు గలవిశాలాక్షుఁడు ప్రీ
తి తగం బెండిలియాడెను, మతి వైరముకృష్ణునందు మానకయున్నన్. ౨౪
సీ. రుక్మిసోదరియగు రుక్మిణికిం బ్రీతిఁగూర్పగాఁ దలపోసి కూఁతుకొమరుఁ
డగు ననిరుద్ధున కాత్మజతనయయై నట్టిరోచనయను నంగనామ

ణి నొసంగ నెంచెను; § స్నేహపాశములకుఁ దాఁగట్టుపడి తనదాయతోడ
నుద్వాహసంబంధ § మొప్పదంచు విధించు న్యాయ మెఱింగియు § నావివాహ

తే. మహామునకు రుక్మిణీదేవి § మాధవుండు,హాలధరుండును బ్రద్యుమ్నుఁడాదియైన
బంధువులు నింకనుంగల్గువారు భోజ, కటకపురమున కేగిరి § కడు ముదమున.

బలభద్రుఁడు రుక్మి వధించుట.

ఉ. ఆమహమెల్ల వేడుకల § నద్భుతరీతిని సాగ నంత ను
ద్దామబలంబు గర్వమును § దమ్మెఁగి మున్పఁగ విఱ్ఱవీఁగు నా
భూమహిళాపతుల్ మిగులుఁబూన్కిఁ గళింగధరేశుఁ డాదిగా
నేమెయి రుక్మినూల్కొనునొ § యింపుగ నవ్విధిఁ బ్రోత్సహించుచున్. ౨౩ 804

క. బలభద్ర నక్షకేళిఁ, గెలువుము రుక్మీ! యతండు § గెలువంగా నె
ట్టులుచాలఁడు నిన్నక్షం,బులయాటను నేర్పులేదు § పో యాతనికిన్. ౨౪

క. ఐనను దద్వ్యసనము మెం,డౌ నెట్లును గెల్తు వీవె § యని పురికొలుపం
గా నౌనని రుక్మియు విధి, తానై నృపరూపమునను § దగ దివ్వర పెట్టన్. ౨౫

క. హాలధరు నక్షక్రీడకుఁ, బిలువంగా నతఁడు రాఁగఁ § బ్రియమున నక్షం
బులఁ దొరలించుచు నాడెను, బలభద్రుఁడు శతము వేయి § పదివేలు తగన్.

క. పందెము పెట్టెను రుక్మియు, సందియ మొకయింతలేక § సరగున గెల్చెన్
డెందమునఁ గల్గుప్రమదం, బుం దగఁ గాళింగనృపతిపుంగవుఁ డంతన్. ౨౭

క. తనదంతపంక్తియంతయు, గనఁబడఁగా నట్టినవ్వెఁ § గానిపనియటం
చును దాని సైఁపఁడయ్యెను, వనజాక్షునియగ్రజుండు § వరుసఁగ నవలన్. ౨౮

క. ఒడ్డెను బందెము రుక్మియు, నడ్డములేకుండ గెల్చె § నది నియుతంబా
నెడ్డెలగెల్చెడు బలుఁ డా, యొడ్డినపందెమును మోస § మూనినమదితోన్. 810

క. నేనేగెల్చితి ననుచుం, బూనిక రుక్మియు వచించె; § భూరిక్రుధచే
మానస మెంతయొ క్షుభితం,బై నెగడఁగ సిరులనొప్పు § నాహాలధరుఁడున్. ౩౦

క. జలనిధి పర్వదినంబులఁ, జెలఁగెడు గతినొప్పి కిన్కఁ § చేఁ గన్గవ మి
క్కిలియెఱ్ఱ కాఁగ బూర్వము, వలె నక్షక్రీడవేడ్కఁ § వర్ధిల్లంగన్. ౩౧ 812

క. జరపుచుఁ బదికోట్లు పణం, బరుదుగఁ దానొడ్డి గెల్చె § నది ధర్మంబై
పరఁగినను మోసముంగొని, ధరణీశులు వినఁగ రుక్మి § తనకె గెలుపనెన్. ౩౨

ఆ. ఇందుఁ గూడియున్న § యీసదస్యులు దీనిఁ, దెలుపఁ జాలుదురని § పలుక నభ్ర
తలమునుండి దీని § బలభద్రుఁడే గెల్చె, ధర్మముననె; రుక్మి § ధర్మ మెడలి. 814

క. అనృతములాడెడు గెల్చితి, నని పలికెఁ; రుక్మి వాని § నాదృతిమీఱం

గొనకయె దుష్టనృపాలకు, లనూనగతిఁ బ్రోత్సహింప నాబలదేవున్. ౩౩ 815

మ. పరిహాసోక్తుల నేచుచున్ గుమతితం బల్కెం దనుం గాల మెం
తొ రయంబొప్పఁగఁ బ్రోత్సహింప హలితో నుద్వృత్తిమై మీరు భీ
కరకాంతారనివాసి యాదవులుగా కాఁబట్టి మీ కెట్టు ల
క్షురతుల్ గల్గును రాజయోగ్యములె యాఁగా యివ్వి యూహింపఁగన్. ౩౪

క. శరవరములతో నక్షో,త్కరములతో నాడుచుండ్రు ధరణీశులు మీ
కరయఁగఁ గౌశల మిందే, వరుసం గల్గంగఁజాలు బల్కు లిఁకేలా? ౩౫ 817

చ. అనియిటు రుక్మి తన్ దెగడ నందలిభూపతు లెల్ల లెక్కచే
యనియటుహాస్యవాగ్వితతి నట్టులె పల్కఁగఁ గ్రుద్ధుఁడై మనం
బునఁ దెగటార్చులే తగినపూన్కి యటంచుఁదలంచి రాముఁ డొ
య్యనఁ బరిఘంబుఁగైకొని భయంపడి యందఱు చూచుచుండఁగన్. ౩౬ 818

క. మంగళసభయం దందు న,భంగప్రక్రమము మీఱ బలరాముఁడు త్రుం
చెం గడుఁ బూనిక రుక్మిత,లం గట్టాయనుచు మోసలన్ జను లార్వన్. ౩౭

చ. కనుఁగొని రుక్మిచావు వడిగాఁ బరుగెత్తు కళింగభూపతిన్
దనుఁగని దంతపంక్తి వెలితట్టు కనంబడ మున్ను నవ్వెగా
యను పెనురోష మూని దళమాంఘ్రితలంబున నెద్దు పట్టి దం
తనిచయ మట్టె డుల్లెడువిధంబునఁ గొట్టెను బౌరుషంబునన్. ౩౮ 820

ఉ. అంతటఁ బోక యార్చి పరిఘాయుధముం గొని యమ్మహీశులం
బంతముమీఱఁ గొట్టి యురుబాహువు లూరువు లుత్తమాంగముల్
వింతగ భూమిపైఁబడఁగ వేగమ చేయఁగఁ దక్కరాజు ల
త్యంతభయంబునం బఱచి రాబలదేవుని లోఁ దలంచుచున్. ౩౯ 821

సీ. భార్యతోఁబుట్టు వీపగిదిఁ జావఁగఁగృష్ణుఁ డనుఁగుఁబత్నికిఁ దనయన్నకు మది
గలప్రీతి కెట్లుభంగము గల్గునో యనుభయమున నిది మంచిదియని కాని
చెడుకార్య మనికాని చెప్పఁ బూనక యూరకుండె; రామాదులై యొప్పుచున్న
యాదశార్హులు కృష్ణు నాశ్రయించిన వారలౌట సిద్ధార్థులై యభినవోఢ

తే. యైన యమ్మించుఁబోఁడి నాహరిమనుమని
స్యందనం బెక్కఁగాఁజేసి సరభసమున
ద్వారకకుఁ బోయి రాత్మ నుత్సాహ మంత
కంత కుప్పొంగకున్న వియ్యముఁ దలఁచుచు. ౪౦ 822

## అఱువదిరెండవయధ్యాయము.

### ఉషాకల్యాణము.

చ. అని తెలుపంగ నింద్రజుని । యాత్మజపుత్త్రుఁడు యోగిచంద్రుతో
ననియె మహాత్మ! కృష్ణతన । యాత్మజుఁ డయ్యనిరుద్ధుఁ డెట్లొ బా
ణుని తనుజాతయైన యుష । నుం దమిమీఱఁగఁ బెండ్లియాడె నం
దని జరఁగెన్ మహాభయద । మౌనటు చక్రికి సాంబమూర్తికిన్. ౧ 823

క. మునిచంద్రా! యాకథ యెల్లను నాకుం జెప్పవయ్య । లలితభణితి నా
విని వ్యాసపుత్త్రుఁ డిట్లని, వినిపించెన్; మహిమ మూని । వెలసి ఘనుండై. ౧౪

క. వామనమూర్తిం దాల్చిన, దామోదరునకు సమస్త । ధరణి నొసఁగె నో
యేమాన్యుఁ డలవిరోచన, నాముండగు దనుజునకుఁ ద । నయుఁడగు బలికిన్. ౨

చ. తనయులు నూర్వు రందు సుత । తల్లజుఁడై తగె బాణుఁ డాతఁ డీ
శుని పదపంకజద్వయముఁ । జొక్కపుభక్తిని గొల్చువాఁడు మ
న్నన గనువాఁడు దాతయు న । నంగ యశంబును గన్నవాఁడు బు
ద్ధినియతి గల్గువాఁడు కడు । ధీరుఁడు సత్యరతుండునై తగున్. ౩ 826

క. వ్రతముల నొనరుపదార్ఢ్యము, మతిగల్గిన మేటియగుచు । క్ష్మాస్థలిపై వి
స్తృతకీర్తి గనియె; మును నా, దితిజేంద్రుఁడు శోణితపురిఁ । దేఁకువమీఱన్.

క. నివసించి రాజ్య మేలెను, నవనిం గలపత్తనముల । యం దది రమ్యం
బు విమలజనాఢ్య మగు దా,నవనాథుఁడు శంకరాంఘ్రి । నళినంబులపై. ౩

చ. నిరతిని భక్తిగల్గి హరు । నిం దమి నొందఁగఁజేసి తన్మహా
త్తరకరుణైక పాత్త్రుఁడయి । తాను మెలంగెను, దాన దేవతో
త్కరములు కింకరుల్వలె స । తంబును గొల్చుచునుండి రాతనిన్;
గరములు వేయిగల్గె నొక । కారణముం గల దట్టికల్మికిన్. ౮ 829

క. కరములవేయింటను శం,కరుఁ డొక్కటఁ దాండవము ని । కామప్రీతిన్
సురలెల్లఁ జోద్యపడఁగ నొ,నరింప వాద్యముల మృదుని । నాద మలరఁగన్. ౮

తే. శాస్త్రమర్యాద యిసుమంత । చనకయుండఁ
దానె వాయించి మృదుని సం । తసమునొందఁ
జేసె; భగవంతుఁడై భక్త । సిద్ధుఁడయి
భూతపతియు శరణ్యుఁడై । పాలుచు శివుఁడు. ౮౪ 831

క. అనుకంపాతిశయంబున, దనుజేంద్రా! వరము గోరఁ । దగు నీవని యా
జ్ఞ నొసంగె వాఁడు పురహరుఁ, దనపురముం గావఁగోరెఁ । దా వరముఁ దమిన్.

చ. అతఁ డొకనాఁడు వీర్యము మ । హాత్తరమౌటను దుర్మదుండునై
వితతమణీమరీచుల ర । విం బురుడించు కిరీట మట్టె భూ

తతతికి నాథుఁడై తనదుదాపున నున్న గిరీశు పాదసం
గతిఁ జెలువారఁజేసి తమకంబున నిట్లని వేఁడె నో ప్రభూ! ౬ 833

సీ. శంభూ! మహాదేవ! సకలజగద్గురుండవు నాథుఁడవు నీవె వివిధగతులఁ
బరికించినన్ మఱొక్కరుఁడు కానంబడఁ డిద్ది సూనృతము నీ వెంచిచూడఁ
గాన సంపూర్ణహృత్కాములౌ పురుషుల కఖిలార్థముల నీయ నమరభూరు
హంబవై యుండుదు వట్టి నీకివె నమస్కారముల్ పరమశంకర! కృపాబ్ధి

తే. వగుట బాహుసహస్రయుక్తాంగు గాఁగ
నొనరిచితి నన్ను; నవి నాకు నురతరమగు
భరముగా నయ్యె వేఱొక్కపనికి నించు
కంతయేఁ గావు లోకత్రయంబునందు. ౭౫ 834

శా. నన్నున్ మార్కొని పోరువాఁ డొకఁడె యైనన్ నీవు తక్కంగ లేఁ
డెన్నం దుల్యుఁడుగా నెసంగుపురుషుండే కానరాఁ డట్టులౌ
ట న్నాకిచ్చిన వేయిబాహువులు తీటంగాంచి యేచన్ రణం
బు న్నేఁగోరుచు దిగ్గజాళి కడకున్ భూభృత్తతిఁ జూర్ణించుచున్. ౮౫ 835

చ. అరిగితి దిగ్గజంబు లవి యాహవశూరుని నన్నుఁ గాంచి వే
పరుగిడెఁ గాని నిల్వవాకభంగిని బోరఁగఁ జాలవయ్యె; నా
హరుఁ డది యాలకించి తనయాత్మను జక్కఁదలంచి క్రోధవి
స్ఫురణత నివ్విధిం బలికె మూఢ! మహాసుర! యాలకింపుమా. ౯౫ 836

క. ఎప్పుడు నీ కేతువు ధరఁ, గుప్పఁగఁ గూలంగఁ గలదొ కోరిన యట్లే
యప్పుడె నీదోర్దర్పము, తప్పక యడఁగించువాఁడు తలఁపడు నిన్నున్. ౧౦౫

క. నాతో సమానుఁడై తగు, నాతనితో సంగరంబు నగుఁ బొమ్మని యా
భూతేశుఁడు పల్కిన నా, దైతేయేశుండు కుమతితం దగియుంటన్. ౧౧ 838

క. పరమామోదంబున సాం,పరాయికము గల్గునంచు భావించుచు నీ
శ్వరు నాదేశ మ దెత్తఱిఁ, బరిణతినిం గాంచునో యని పట్టుదల తగన్. ౧౧

క. మతిచెడుట నెదురుచూచుచు, నతఁడు గృహంబునకుఁబోయి యాహవమునఁ గ
ల్గుతమిని హరువాక్కునఁ గల, వితతార్థం బెఱుఁగలేక వేచియె యుండెన్. ౧౧

ఉ. ఆతని కొక్కపుత్త్రి గల దంబుజనేత్ర యుషాఖ్య యొప్ప సం
ప్రీతి నదొక్కరాతిరి హరిప్రియపౌత్త్రుని గమ్రరూపవి
ఖ్యాతునిఁ గాంచికాని వినికాని యొకప్పు డెఱుంగనట్టి లో
కాతిశయప్రకాశుఁ దనయంతన వచ్చినవాని నిద్రలోన్. ౧౨ 841

తే. కౌఁగిటం జేర్చినట్లుగాఁ గలఁ గనియెను;
బిదప మేల్కాంచి యచ్చోటఁ బ్రియుని వానిఁ

కనఁగఁ జాలక నాథ! యెక్కడకుఁ బోయి
తివో? యదెక్కడ నున్నావొ తెలియఁ జాల. ౧౨౪ 842

క. తనచిత్త మవశమైయుం,ట నెన్నియో భంగులను మనఃప్రియుఁ జూడం
గను గోరి పలుకుచుం ద్వరఁ,గ నెచ్చెలులయంతరమునఁ గడు విహ్వలయై.

క. తాలేచి నిలిచి యింతనఁ, గా లేని త్రపాభరంబుఁ గాంచెను; విను భూ
పాలా! యలబాణాసుర,పాలునకును మంత్రి గలఁడు పటుధీరుండై. ౧౩ 843

క. కుంభాండకుఁ డనుపేరునఁ, గుంభిని దగునతని కొక్క కొమరిత కల దా
యంభోజనేత్ర సొగసున, జంభారిప్రియాంగనలను జక్కఁగ మించున్. ౧౩౪

ఉ. పేరునఁ జిత్రరేఖ యనఁ బెంపు వహించె; నుషం బ్రియంబునం
జేరి యటం జెలంగు సరసీరుహనేత్రలయందుఁ బ్రీతిచే
గూరఁగ నామెచిత్తమునకుం దగియుండుట నిట్టుపల్కె నో
చారువిలాసినీ! యెవనిఁజూడ గనన్ జతనంబు పూనెదో. ౧౮౪ 845

క. నీదు మనోరథ మేమో, కాదనక వచింపు మెట్టి కాంతుఁడు నీకై
జేఁ దడవెనొ యతఁ డెట్టిఁడొ, యోదయితా! తెలియరాకయున్నది నాకున్.

చ. అని తనుఁ బల్కరింప విని యాయుష నెచ్చెలి స్వప్నమందు నేఁ
గనితిని సుందరాకృతిని గ్రాలెడు మర్త్యలలాము నొక్కనిన్
వనరుహనేత్రు దీర్ఘభుజుఁ బచ్చనివస్త్రము దాల్చి శ్యామమౌ
తనువు చెలంగఁ జూడఁదగు ధన్యుని స్త్రీహృదయంగమున్ ఘనున్. ౧౬ 847

ఉ. కాంతుని వాని నిప్పు డిటుఁ గానకయే వెదకంగఁ బూనితిన్
వింతగఁ జేరవచ్చి కడువేడుక వాతెఱతేనెఁ ద్రావ నొ
క్కింతయొసంగి తన్ వలచు నీనను భూరివియోగ శోకసము
ద్రాంతరమందుఁ ద్రోచి చనె నమ్మ య దెక్కడికో జవంబునన్. ౧౮ 848

చ. అనియిటు వెచ్చనూర్చుచు మహాతురతం బలుకంగఁ జిత్రరే
ఖ నియమ మొప్పఁ బల్కె నినుఁ గాంతుఁడు వాసి చనంగ నింతవం
తను గననేల? నీదగువ్యథం దొలఁగించెద నూఱడిల్లు నీ
మనసు హరించినట్టి నవమన్మథమూర్తిని దోడితెచ్చెదన్. ౧౮౪ 849

క. లోకంబుల మూఁడింటను, నాకాంతుఁ డితండె యని మనంబున నెన్నన్
నీకలవిరియైనఁ జెప్పుమ, యాకమనీయాంగుఁ దెత్తు నానతి యిమ్మా. ౧౯ 850

మ. అని యానెచ్చెలి యూఱడం బలికి నెయ్యం బొప్పఁగా నప్డె చ
క్కనిరీతిం బటమందు దేవవితతిన్ గంధర్వవిద్యాధరా
హినికాయంబును సిద్ధచారణుల యక్షేశవ్రజంబున్ మహా
దనుజస్తోమము మానవాళిని యథార్థం బిట్టులే యన్నటుల్. ౨౦ 851

చ. జతనముమీఱ వ్రాసె; మనుజవ్రజమందును వృష్ణిసంతతిన్
క్షితిపయి శూరుఁడన్ యశముచేఁ దగునానకదుందుభిన్ హలిన్
జ్యుతియనలేని శ్రీహరిని । సుందరకాయముపోల్చుమారు న
య్యతివ లిఖింపఁ గృష్ణుని ప్రియాత్మజునాయుష కాంచి నంతటన్. ౨౦ 852

[1]క. మందాక్ష మొందె ననిరుద్ధుం దత్సుతు వ్రాయఁ గాంచి । తోరపుఁద్రపఁ దా
నొంది తలవాంచి యిట్లనె, సుందరి యితఁడే యితండె । సుమి యాతండా! 853

[2]చ. అని చిఱునవ్వు నెమ్మొగమునం దొఁగిఁ దాండవమాడుచుండఁగాఁ
దనమది కింపుగాఁదనరు । తత్ప్రియుఁ జూపెను; జిత్రరేఖ యా
తనిహరిపౌత్రుఁగా నెఱిఁగి । తా నపుడే తగుయోగవిద్యయం
దు నిపుణయౌటఁ దద్బలముతో జవమార నభఃపథంబునన్. ౨౧ 854

చ. అరిగి కనుంగొనెన్ దరుణి । యాదట ద్వారకఁ గృష్ణపాలితన్;
బురవరమందు నందు సుఖముం గనఁజేసెడు హంసతూలశ
య్య రహిఁ బరుండి నిద్రఁగను । నాయనిరుద్ధుని యోగవిద్యదా
స్థిరబలమూని యెత్తుకొని । చేర్చెను శోణితపత్తనం బటన్. ౨౨ 855

చ. తనదగు రాకనే కనుచుఁ । దత్పరయై దగఁగుందు నెచ్చెలిం
గనుఁగొని నీప్రియుం డితఁడె । కైకొనుమా యని చూపె; నాయుషాం
గనయు నుతింపఁగాఁ దరముగాని మనోహరరూప మొప్పునా
మనుజలలాముఁ గాంచి తనమానస మెంతయుఁ దృప్తి నొందఁగన్. ౨౩ 856

తే. ప్రముదితాననపద్మంబు । భాసిలంగఁ, బురుషులకు నెవ్వరికి నెట్టిపోల్కిఁ జూడఁ
దరముగాని స్వకీయ సద్మమ్మునందు, నతనిఁగూడి సుఖించె నెయ్యమ్ము పెరుఁగ.

సీ. అనిరుద్ధుఁ డంత నయ్యన్నుమిన్నయుఁ దనుధరియింప మేలివస్త్రంబు లొసఁగి
చందనచర్చల । సంతసంబునుగూర్చి పూలదండల మేను । పొందుపఱచి
ధూపదీపముల హృత్తోయజ మానందపరవశతం గాంచుపగిదిఁ జేసి
భవ్యాసనంబులఁ । బానభోజనముల బహువిధసుస్వాదుభక్ష్యములను

ఆ. తృప్తి నొందఁగూర్చి । తీపారు పలుకుల, మనసుగరఁగఁ జేసి । మఱియు మమత
శుభతమంబులైన । శుశ్రూషలం బూజ, నమరఁ జేయ నుండె । నాత్మయలర.

క. అనిరుద్ధుఁ డంతిపురమున, ననుక్షణము వృద్ధినొందునట్టి మమత గాం
చిన యాయుషతో నొరు లెఱుఁగనిరీతిం గూడియుండి । కామశరార్తిన్. ౨౪

క. వనితాపహృతేంద్రియుఁ డై, దినముల వెన్నియొ గతింపఁ । దెలియం డయ్యెన్;

---

1 "సోఽసావసావితి ప్రాహ స్మయమానా మహీపతే" అని మూలము. 2 "చిత్రలేఖా త
మాజ్ఞాయ పౌత్రం కృష్ణస్యయోగినీ, యయౌ విహాయసా రాజన్" అని మూలము. "యోగినీ
దాత్యాత్మజత్వా త్సాయా యోగవిశారదా" అని టీక.

వనజాక్షి! తనదు జవ్వన, మనిరుద్ధుం డనుభవింప । హాయిగ నుండెన్. ౨౩ 860

ఉ. కన్నియశాస్త్రపద్ధతి ని। కామము పూనఁగ నొవ్రతంబులే
మున్నవొ వానినిన్ వదలి। యొప్పునె యిప్పని దోషమౌఁ గదా
యన్న సదాశయంబు గన। కాగతి నయ్యుష సౌధమధ్యమం
[1]దున్నను గప్పిపుచ్చుటకు। నొప్పకయుండెడు కొన్ని చిహ్నముల్. ౨౪ 861

చ. కనఁబడసాగె; ద్వారమును। గాచుచునున్న భటేంద్రు లెట్టులో
మనముల సంశయించి ప్రభు। మండనుపుత్త్రిక యిప్డు సద్వ్రతం
బును దిగనాడె నన్నవిధ। ముం గనఁజేసెదు నివ్వె చిహ్నముల్
మన మిఁక దాఁపరాదు క్షణ। మాత్రము దాఁచిన ముప్పు గల్గెడిన్. ౨౫ 862

చ. భటు లిటు లాత్మ నెంచి తను। స్వామిని గానఁగఁబోయి మ్రొక్కి ప్ర
స్ఫుటవినయంబునన్ దనుజ। పుంగవ! స్వామి! పరాకు; నీదు చెం
గట వినిపింపరానిదిగఁ। గన్పడుచున్నను దాఁపరానిదౌ
కటుతరవార్త నేమయినఁ। గాని యటం చొగి విన్నవింపఁగన్. ౨౬ 863

ఉ. వచ్చితి మిప్డు రాజగణ। వర్య! భవత్సుత కన్యయయ్యుఁ దా
సచ్చరితంబు మాని వర। సంతతిదూషణమౌ ప్రవర్తనం
బిచ్చకుఁ దోఁచినట్లు చరి। యించినభంగిగ మే మెఱింగి యి
ట్లిచ్చటి కేగుదెంచితి మ। దేమనఁ జక్కఁగ నాలకింపుమా. ౨౭ 864

ఉ. ఒక్కనిమేషమాత్ర మెటు। లో పొరపాటొకయింత లేక యే
దిక్కును జూడకే నృపతి। ధిష్ణ్యముఁ జక్కఁగఁ గాచువార మే
మిక్కరణిం బ్రయత్నమున। నేమఱ కెంతయుఁ గాచుచుండఁగా
నొక్కఁడు గానిమూచుటకు। నోపని రాజగృహంబు దీనినిన్. ౨౮ 865

తే. అపరిశుద్ధం బొనర్చిన। యట్టిజాడ
మే మెఱుంగము దనుజేంద్ర! । మీసముఖము
నందు నింతకుమించిన। యట్లు మనవి
చేయఁగా నేరమని మ్రొక్కి। చిత్త మనఁగ. ౨౯ 866

మ. వినుచున్ బాణుఁడు స్వీయపుత్త్రిదగు దు। ర్వృత్తిక్రమం బెంచి నె
మ్మన మెంతో వ్యథితంబుగాఁగ నిలువన్। మాటాడనున్ లేక వే
చని కన్యామణి హర్మ్యముంగని యటన్। సంతోషముప్పొంగ నుం
డినవానిన్ యదువర్యునిం గనె దళ। న్నీరేజపత్త్రేక్షణున్. ౩౦ 867

సీ. ఇందీవరంబు నానెసఁగు చామనచాయ తనువు రాజిల్లభువనములందు

1 "హేతుభిర్లక్షయాంచక్రు రాప్రీతాం దురవచ్ఛదైః" అని మూలము. "దురవచ్ఛదైః ఆచ్ఛాదయితు మశక్యైః" అని వ్యాఖ్య.

మూఁడింట సుందరమూర్తియై తగి పిశంగాంబరమును దాల్చి యతివిశాల
బాహువు లొప్పార భవ్యకుండలరుచుల్ గండభాగంబులఁ గ్రమ్ముకొనఁగఁ
గుంతలకాంతులు కోమలస్మితదీప్తు లమలసుందరవీక్షణాతిశయము
తే. లందములఁ గుల్కు నెమ్మోము నధికదీప్త
ముగ నొనర్పఁగ నొప్పు నా సొగసుకాఁడు
తనదు ప్రేయసితోడ నెంతయును బ్రీతి
[1]నెత్తమాడుచు నుండె నాయత్తమతిని. ౩౧ 868

క. మంగళకరచిహ్నంబులఁ; బొంగెడు నాలేమ యంగములఁ బొందిక స్వీ
యాంగంబు లలరఁ [2]బృథుకుచ, సంగతకుంకమలసత్స్రజంబులఁ బ్రీతిన్. ౩౧౪

క. బుజములనడుమం దాలిచి, యజపౌత్త్రుం డుపకు నెదుర నందముగూర్పం
గ జగతిఁ ద న్నెదిరింపంగఁ జాలు వాఁడెన్న లేఁడు గా యనునూహన్. ౩౨

క. పాచిక లాడుచు నుండఁగ, నే చూచెన్; బాణుఁ డంత హృదయాంతరమం
దీచర్య యెట్టు లనుచు ని,దేచిత్రము సాగ నెట్టు లీపనియనుచున్. ౩౨ 871

చ. తనమది నుంత నెంచి వివిధప్రబలాయుధధారులౌ భటుల్
వెనుకొని రాఁగ నంతిపురి వేగమ చొచ్చెను; గృష్ణపౌత్త్రుఁ డం
త నిశితలోహనిర్మితనితాంతభయంకర సాధనంబుఁ గై
కొనెఁ బరిఘంబనంగఁ దగి క్రూరవధార్హమునౌ న దెంతయున్. ౩౨౪ 872

చ. కరమున దానిఁబట్టుకొని గాఢపరాక్రమ మొప్పఁ గాలుఁడే
వరుసను గాలదండము ప్రభల్ పరఁగంగ ధరించి యుండున
క్కరణిని దాఁ గనంబడుచుఁ గయ్యమునన్ దనుజాళిఁ జంపునా
తురమున నిల్చె; నంతటను ధూర్తులు యోధులు తజ్జిఘాంసచేన్. ౩౩ 873

చ. నలుగడలన్ ద్వరంపడుచు నైజగుణంబుల సూకరేంద్రుఁ గు
క్కలువలెఁ జుట్టుకొంచుఁ దనుఁ గ్రన్ననఁ బట్టుకొనం దలంచువా
రల దనుజేంద్రయోధుల నరాతిభయంకరుఁ డాతఁ డప్పుడు
జ్జ్వలపరిఘంబుచేఁ జదియఁ జావఁగఁ గొట్టెను దోర్బలంబునన్. ౩౩౪ 874

చ. పరిఘహతిం దలల్ పగుల బాహువు లూరువు లట్టెనుగ్గుగా
ధరఁబడఁ జచ్చి రందు మృతితప్పిన కొందఱు హర్మ్యమెట్టి యా
తురమున వీడి పాఱి రది ధూర్తమహాసురనేత సైనికో
త్కరమును ద్రుంచు యాదవవతంసునిఁ గోపపరీతచిత్తుఁ డై. ౩౪ 875

మ. బల మొప్పారఁగ నాగపాశవితతిన్ బంధించె వే యిట్టు లా
బలిపుత్త్రుం డనిరుద్ధుఁ గట్టుటయు నవ్వార్తల్ వినన్ రాఁగ నే

1 నెత్తము=పాచికలతోడియాట. 2 "తదంగసంగస్తనకుంకుమస్రజమ్" అని మూలము.

జలజాతాయతనేత్ర యానుష మదిన్ । సంధిల్లుశోకార్తులన్
నిలువం జాలక యశ్రుబిందువితతుల్ । నేత్రంబులన్ నిండఁగన్. ౩॥ 876

తే. ఒక్కక్షణమున నయ్యువి । యురుతరప్ర
వాహములరీతిఁ బాఱంగ । స్వాంత మెంతొ
ధైర్యమును వీడ బిట్టురో।దనము చేసెఁ
దనదుకోరిక వ్యర్థమై । చనియె ననుచు. ౩॥ 877

---

## అఱువదిమూఁడవయధ్యాయము.

### శ్రీహరి బాణాసురునిపై కరుగుట.

క. ఈరీతిఁ బలికి శుకముని, భూరమణా! ద్వారకాఖ్య।పురి ననిరుద్ధుం
డారేయి కానఁబడక య, దేరీతినొ పోవ బంధు।లెల్ల మహార్తిన్. ౪ 878

క. మనములు గుందఁగ నుండం, గను వార్షికమాసము లవి । గడచెను దుఃఖం
బునఁ బొగులుచుండ నాలుగు, మునిపతి యగునారదుండు।మురహరుకడకున్. ౧

క. ఏతెంచి బాణదనుజుని, చేతన్ బంధింపఁ బడియెఁ । జిత్రముగా స
ర్వాతతపాశంబుల నని, యాతం డొనరించినట్టి । యద్భుతరణమున్. ౧౪ 880

క. వినిపించి శోణితపురం, బున ననిరుద్ధుండు గలఁడు । పొం డనికి నటం
చును దెల్ప వృష్ణివీరులు, వనజాక్షహలాయుధులు ప్ర।భావమ్ము తగన్. ౨ 881

క. తము రక్షింప సుఖంబుల, నమరుట శోణితపురంబు।నందుఁగల పరే
శుమనుమనిన్ గొని వచ్చుట, కమితోత్సాహంబు లొప్ప । నరిగిరి కడఁకన్. ౨

సీ. ప్రద్యుమ్న, సాంబ, సా।రణ యుయుధానులు
నందుఁడు గదుఁ డుప।నందుఁడు మఱి
భద్రాదులును గృష్ణ।బలభద్ర యుతులయి
ద్వాదశాక్షౌహిణుల్ । తమ్ముగొలిచి
చనుదేర శోణిత।మును నాల్గుప్రక్కల
ముట్టడించిరి తమ।భుజబలములు
పరులకు మిక్కిలి । భయము గల్పింపంగ
నంతఁ బురోద్యాన।సంతతులను

తే. బాడుచేయుచుఁ బ్రాకార।పటలములను
గూలఁ జేయుచు నట్టళ్లఁ । గూల్చి మఱియు
గోపురంబులఁ బడఁదన్ని । కోరినట్లు
బాడుచేయంగ నిర్భర।పౌరుషమున. ॥ 883

క. కోపం బావేశించిన, రూపంబునఁ బరబలాను।రూపం బగుసే

నాపరివృతుఁడై బాణుం, డాపురముననుండి వెడలె ♦ నంతకుపోల్కిన్. ౫ 884

చ. దనుజవరేణ్యురక్షణము ♦ దా నొనరింపఁగఁ బూని సర్వముం
గను భగవంతుఁ డాశివుఁడు ♦ కార్ముకమూని సమస్తయుద్ధసా
ధనములఁ దాల్చి స్వప్రమథ♦తల్లజు లవ్విధిఁ గూడి రాఁగఁ బు
త్త్రనికరసంయుతుండయి పు♦రంబును వెల్వడి వచ్చె వేడుకన్. ౬ 885

తే. నందివృషభంబు నెక్కి రా♦ముం దదనుజు
మార్కొనఁగఁ బూనె వారు నమ్మాడ్కి మారు
కొనిరి శంకరకృష్ణుల♦కును, గుమారు
నకును బ్రద్యుమ్నునకును ర♦ణంబు సాగె. ౬౫ 886

క. కర మద్భుతావహంబయి గ,గురుఁ బుట్టింపంగఁ దగిన ♦ గురుసంగర మ
త్తరుణమున సాగె నాహవ,ధరుఁ డప్పుడు పౌరుషమ్ము ♦ దై వారంగన్. ౭

సీ. కూర్పకర్ణుని మఱి ♦ కుంభాండకుని దాఁకి సంగ్రామ మొనరించె సాత్యకియును
బాణుని మార్కొని ♦ బవరంబు సాగించెనంత సాంబుఁడు బాణు♦నాత్మభవుని
దలఁపఁడె; నాయుద్ధ♦మెలమిఁ గాంచఁగ బ్రహ్మముఖ్యులౌ నిర్జరుల్♦మునులుసిద్ధ
చారణుల్ గంధర్వ♦సత్తము లచ్చరల్ యక్షులు దేవయా♦నాళి నెక్కి

తే. వచ్చియుండిరి; శౌరి య♦వార్యశౌర్య
మలరఁ జాపంబు సారించి ♦ యలఘుతీవ్ర
సాయకంబులు పరఁగించి ♦ శంకరాను
చరులఁ బ్రమథుల గుహ్యక♦సంతతులను. ౮ 888

క. భూతాళిని డాకినులను, బేతాళుల యాతుధాన♦వితతుల మఱియుం
బ్రేతపిశాచవినాయక, మాతృకలను భీకరముగ ♦ మంటలు గ్రమ్మన్. ౧౦ 889

సీ. కూశ్మాండగణములఁ ♦ గ్రూరులౌ బ్రహ్మరక్షస్సుల మఱియును♦గల్గువారిఁ
బాఱఁగాఁ జేసె; న♦వ్వడువున హరి విక్రమింపఁ బినాకియు ♦ మించువేడ్క
బహువిధాస్త్రంబులఁ ♦ బరఁగించె హరిపైన శార్ఙ్గియుఁ బ్రత్యస్త్ర♦సంతతులను
వైచి మరల్చె న♦వ్వాని విస్మయ మింతయైన నొందక మఱి♦హరవిముక్త

తే. ములగు బ్రహ్మాస్త్రవాయవ్య♦ములకుఁ బ్రతిగ
బ్రహ్మ పార్వతనామాస్త్ర ♦ వర్యములను
వైచి మరలించె; నాగ్నేయ♦బాణమునకు
సరిగఁ బర్జన్యనామ కా♦స్త్రమును వైచె. ౧౨ 890

క. హరుఁ డంతఁ బాశుపతమను, పరమాస్త్రము వైవ హరియు ♦ భావితతులచే
నిరుపమమగు నారాయణ, శరవర్యము వైచి చేసె ♦ శాంతింపంగన్. ౧౩ 891

క. హరియంత జృంభణాస్త్రము, హరుపైఁ బరఁగించి మోహ♦మందఁగఁ జేసెన్
ద్వరపడి బాణుని బలముల, బరిమార్పఁగఁ బూని గదల ♦ బాణప్రతతిన్. ౧౩

క. శితఖడ్గంబులనుఁ బై,చి తగం జూర్ణంబుగాఁగఁ । జేసెన్; భూతే
శు తనూజుఁడు గుహుఁ డని న,చ్యుతసూనుని బాణములు మహోద్ధతిబర్వన్.

ఆ. పీడితాంగుఁడగుచుఁ । బృథురక్తధార లం,గములనుండి వెడలఁ।గా మయూర
వాహనంబుతోడ । బవరంబు పీడి య,త్తఱినిబోయెఁ దనదు।దర్ప మెడల. ౧౭

సీ. కుంభాండుఁడును మఱి । కూపకర్ణుండును బలరాముముసలహ।తులను బడిరి
వారిసైన్యంబులు । వరుస నల్గడలకుఁ బరుగిడె; నంత స్వ।బలము లిట్లు
కలగుండుపడుచుంటఁ । గలయంగఁ గన్గొని భరియింపరాని కో।పమునఁ గృష్ణు
నను జుఁడౌ సాత్యకి । యనిసేయుచుండిన నాతని గ్రేడించి । యచ్యుతుపయి

తే. కడరె; దానవపతి యప్పు । డైదునూఱు
విండ్ల నొక్కట సారించి । విగ్రహైక
దుర్మదుండయి పొల్చుటఁ । దొడిగి యొకొక
చాపమునయందు రెండేసి । సాయకముల. ౧౮ 895

క. హరిపైఁ బఱపెన్; బాణా,సురుకోదండముల నెల్లఁ । జూర్ణంబులుగా
ధరఁబడఁ జేసెఁ బరాక్రము, మరుదుగఁ గన్పడఁగఁ గృష్ణుఁ । డాక్షణముననే.

ఉ. అంతటఁ బోక తద్రథము । నశ్వగణంబును సారథిన్ వడిన్
బంత మెలర్పఁ గూల్చి హరి।భావుకసూచనమైన శంఖ మ
త్యంతరవంబునన్ రిపుహృ।దంతరముల్ పగులంగ నొత్తె దు
ర్దాంతరణంబు నివ్విధిఁ బ।రస్పరబాధక మాచు సాగఁగన్. ౧౯ 897

చ. దనుజవరేణ్యు తల్లి తన।ధర్మము పుత్త్రునిఁగాచు టొక్కఁడే
యని తలపోయుకోటరయు । నాత్మజు ప్రాణములన్ స్వశక్తిఁ గా
వను దలపోసి వస్త్రమును।బాసి శిరోరుహబంధ మూడి వీఁ
పునఁ బరఁగంగఁ గృష్ణునకు । ముందఱ నిల్చె మహాతురంబునన్. ౨౦ 898

చ. హరియును వస్త్రహీనయగు । నంగనఁ జూడఁగ నొల్ల కాస్యమున్
మరలుచుకొన్న బాణుఁడు ప్ర।మాదము తప్పె నటంచు నెంచి స్వీ
యరథముపోవఁ జాపములు । నట్టులె కాఁగఁ బురంబుఁ జొచ్చె శం
కరుఁడును భూతవారములు । కాలికిబుద్ధి వచించుచుం జనన్. ౨౧ 899

క. శైవజ్వరమును బఱపెన్, గోవిందునిమీఁద నదియుఁ । గ్రూరతరంబై
చేవం దగి త్రిశిరస్సుల,చే వఱలుచుఁ బత్త్రయమునఁ । జెలఁగుచు నుండెన్. ౨౨

క. అతిభీకర రూపంబున, జతనమ్మున దశదిశలను । జ్వాలావళిఁ గా
ల్చుతమిం బాఱెడు నటు ల,చ్యుతుపైకిం బోయె జవము । నుద్ధతియుఁ దగన్.

క. నారాయణుండు దేవుం, డారీతిం బైకివచ్చు । నాజ్వరమును దా
నారసి స్వీయజ్వరమును, ఘోరాకృతిఁ బొల్చుదానిఁ । గొని పైచెఁ గ్రుధన్.

క. శైవం బన వైష్ణవ మనఁ, గా వసుధం బేరుఁగాంచి కడువెల్గెడు నా
దేవజ్వరములు రెండును, వేవేగ జయేచ్ఛ లోలయ విక్రమ మలరన్. ౨౩

క. పోరాడఁ జొచ్చె నంతట, నారాయణసంప్రయుక్త నానారూప
శ్రీరంజితమా జ్వర మది, సారబలం బొప్ప నొంప శైవజ్వరమున్. ౨౩౪ 904

క. పరిపీడితమై యేడ్చుచుఁ, బరిరక్షింపంగఁజాలు వాని నొకని దా
నరయం జాలక భీతిని, హరిని శరణ్యుం గనంగ నరుదెంచి వెసన్. ౨౮ 905

చ. కరములు మోడ్చి యి ట్లనియెఁ గంజదళాయతనేత్ర! కృష్ణ! యా
సరసిజసంభవాదులకు స్థానము సర్వగతుండు శుద్ధుఁడుం
బరముఁడు విశ్వజన్మపరిపాలననాశనహేతుభూతుఁడుఁ
నిరుపమశక్తిసంయుతుఁడు నిర్మలమూర్తియు నౌ నదెవ్వఁడో. ౨౮౪ 906

సీ. చైతన్యఘనుఁడయి సకలవేదైక వేద్యస్వరూపుండయి యమలశాంతుఁ
డయి యొప్పు నెవ్వఁడో యానీకు వందనములు గూర్తుఁ; బరమేశ మురహర శివ
కాలము దైవము కర్మము జీవుఁడు సంస్కార భూతసూక్ష్మములు ప్రకృతి
యారీతిఁ బ్రాణ మహాహంకారమును షోడశవికారములును దత్సంఘరూప

తే. మైన లింగదేహము మఱియట్టిదేహ, జన్యకర్మము మఱి కర్మజన్యదేహ [వ.
మనెడు సంసారమును భవదమలమాయ, వలనఁ గలుగును గాదె యోవాసుదే

వ. తన్నిషేధావధిభూతుండవైన నిన్నాశ్రయించెద. లీలామాత్రగృహీతంబులగు బహువిధావతారములచేత నీవు దేవమానులను ధర్మనిబంధనములను బాలింతువు. హింసావృత్తినవలంబించి యున్మార్గులనం బరఁగుదుష్టులను జెండాడుదువు. మహాత్మా! నీయవతారంబు భూభారహరణార్థంబు. ఎట్టివారికే దుస్సహంబగు భవదీయతేజోవిశేషంబునఁ బుట్టిన శీతజ్వరంబునఁ దపించెద ఆశాపాశములచేఁ గట్టుపడి నీదివ్యపాదారవిందమూలము చేరక దూరముగ నుండునంతపర్యంతం బెకదా దేహధారులకుఁ దాపంబు పీడించు నని వేఁడుటయు భగవంతుఁ డంగీకరించి యీ ట్లనియె. ౨౮ 908

క. కరుణించితి నినుఁ ద్రిశిరా, జ్వర మీయది నీకు భూరిబాధం గూర్పం
బరికింపకుండు నింకఁ, బరితాపము వాయు; మొక్కపలుకును వినుమీ. ౨౯౪

క. మన యిరువురసంవాదం, బును దీని స్మరించు నెవఁడు పొందఁడుపో యా
మనుజుఁడు నీదౌ తాపం, బు నంచుఁ బల్కంగ నదియు మురహరు భక్తిన్.

క. కొనియాడి మ్రొక్కి వలగొని, చనియెఁ; బాణాసురుండు స్యందనవర మె
క్కి నిజబలంబులు గొల్వం, గనువచ్చెఁ శౌరితోడఁ గదనముచేయన్. ౩౦

క. నానావిధాయుధంబులఁ, బూనిన బాహువులు వేయి భూరిభయంబుఁ
సేనలకుం గల్పింపం, గా నాబాణాసురుండు కడుఁ గ్రుద్ధుండై. ౩౦౪ 912

చ. హరిపయిఁ బెక్కుభంగుల శరావళి వైచుచు నుండఁ జక్రియుం
ద్వరపడి యాసుదర్శనము వైచిన నయ్యది భీకరాకృతిం
బరుగిడి తీవ్రధారలను బాహువులం దునుమాడెఁ బెద్దదా
తరువునఁ గల్గు శాఖలను దా నొగిఁ ద్రుంచుకుఠార మట్లుగన్. ౩౨ 913

చ. తన ప్రియభక్తుబాహువుల దైత్యహరుం డిటు త్రుంచుచుండఁగాఁ
గని భగవంతుఁ డౌశివుఁడు గాఢకృపం దను నమ్మువారిఁ బ్రో
వను దలఁపోయుఁ గావున జవంబున శ్రీహరిఁ గాన వచ్చి యి
ట్లనియె; మహాత్మ! నీవు శ్రుతులందు నిగూఢముగాఁ జెలంగుచున్. ౩౩ 914

క. పరమజ్యోతి స్సనఁగాఁ, బరినుతిఁ గాంచుచు నెసంగు బ్రహ్మంబవు శ్రీ
వర! నిర్మలాత్ముఁడ వగుచుఁ, బరఁగెదు నిను నాకసంబువలె నెల్లెడలన్. ౩౪

సీ. వ్యాపించి యున్నట్టివానిగాఁ గాంతురు; నభము నాభిగ, వదనముగ వహ్ని
వనము రేతస్సుగ దినము మూర్ధంబుగ దిక్కులు శ్రుతులుగ స్థిరయుఁ బాద
ములుగాఁగ, శీతాంశుఁ డలమనస్సుగ భానుఁ డక్షులుగా శివుండ నెడు నేనె
తలఁప నహంకారతత్త్వంబుగా సంద్ర ముదరంబుగా వృత్రహుఁడు మొదలగు

తే. నట్టి దిక్పాలకులు భవదమలబాహు
వులుగ నోషధిసముదయములును రోమ
ములుగ నంబుదములు కేశములుగ బ్రహ్మ
బుద్ధిగా నొప్పియుండంగఁ బొలుతు వీవు. ౩౫ 916

వ. ప్రజాపతి పురుషావయవంబుగా, ధర్మము హృదయముగా లోకావయవకల్ప నుండగు పురుషుండవై నీవె యొసంగుదువు. అని పలికి మఱియు. ౩౬ 917

క. ఇసుమంతయేని చ్యుతిఁగన, కెసఁగు స్వరూపంబు గల్గు నీశా! ధర్మం
బు సరిగ రక్షింపఁగ లోకసమితికిఁ మేలు గూర్పఁగా క్షితిమీఁదన్. ౩౭

తే. నీదునవతారములు గల్గు నీరజాక్ష
తావకానుభావంబున నేవరుసఁగ
నేడు భువనంబులను మేమ యేలువార
మనుచు భావించుచున్నార మాత్మలందు. ౩౮ 919

వ. మహాత్మా! నీవు సజాతీయరహితుఁడవై యాద్యపురుషుఁడవై శుద్ధుఁడవై స్వప్రకాశజ్ఞానస్వరూపుఁడవై విజాతీయరహితుఁడవై సర్వహేతువై కారణాంతరమేదియుఁ గానక పరమేశ్వరుండవై వెలయుదువు. సమస్తవిషయప్రకాశనార్థంబు నిజమాయాయోగమునం జేసి ప్రతిశరీరమునందును విభేదముగల వానిరీతిం గనఁబడుచుందువు. మేఘసమాచ్ఛాదితుండగు భాస్కరుఁ డానీడచే లోపలిరూపంబులనెల్లఁ బ్రకాశింపఁజేయుచందంబున నీవాత్మకార్యమైన యహం

కారముచే నావృతుండవయ్యు సర్వదా స్వప్రకాశుఁడవుగావున నుపాధి భూతములైన గుణములచేత నుపహితులగు గుణయుక్తులను బ్రకాశింపఁ జేయుదువు భవన్మాయావిమోహితులై మానవులు పుత్త్రకళత్రగృహాదులయం దాసక్తులై సంసారమహాదుఃఖసాగరమున మునుఁగుచుఁ దేలుచు మరల మునుంగుచుఁ దేలుచు నిట్లుపరిభ్రమించు చుందురు. కర్మాధ్యక్షుండ వగునీచే నొసంగఁబడిన యీమానవశరీరముం బొందియు నిర్జితేంద్రియుఁడై భవదమల పాదపద్మముల నారాధింపని వాఁ డాత్మవంచకుండగుటయే గాక శోచనీయుండు నగు. అనాత్మభూతవిషయములకై యాత్మయుఁ బ్రియుండు నీశ్వరుండునగు నిన్ను విడుచువాఁడు విషమే యగునని యమృతమును బరిహరించినవాఁ డగు నని మఱియు నిట్లనియె. ౮౨ 920

చ. వనజదళాక్ష! నేను సురǂపర్యులు బ్రహ్మయు నిర్మలాత్ములౌ
మునులును నిన్ను నాత్మయు ǂ భూరితరప్రియు నీశ్వరుఁ డుదం
బున సకలప్రకారములఁ ǂ బూనికమీఱఁగ నాశ్రయింతు; మీ
వనఁగ జగంబు పుట్టుటకు ǂ నయ్యదివృద్ధిని బొందు మాడ్కికిన్. ౮౩ 921

ఆ. విలయమొందుటకును ǂ వెలయుదు కారణ
మవయి సముఁడ వనఁగ ǂ వివిధభూత
సుహృదుఁడ వన మఱియు ǂ శుభదుఁడ వనఁ బ్రశాం
తుఁడ వనంగఁ బొగడఁǂబడుదు వభవ! ౮౪ 922

సీ. నీవ చూడఁగ భూరిǂదైవతంబ వనన్య మనఁగ నొప్పారుదు ǂ వద్వితీయుఁ
డవు చరాచరనామǂక వివిధప్రాణుల కరయ నధిష్ఠాన ǂ మగుదు వీవె
యిట్టిమహత్త్వంబుǂనే పొందియున్నట్టి నిను భవమోక్షార్థ ǂ మనయ మేము
భజియించుచుందుముǂ బాణుఁ డీతఁడు నన్ను భజియించువాఁడు సేవకులలోన

తే. నిష్ఠుఁడగు వాఁడు నావెంట ǂ నెపుడుతిరుగు
వాఁడు గావున దేవా! యǂభయ మొసఁగితి
మున్ను ప్రహ్లాదుపై నిడి ǂ యున్నసుప్ర
సాదమును వీనిపైఁ జూపు ǂ సరసిజాక్ష! ౮౫ 623

చ. అనుటయుఁ గృష్ణమూర్తి యను ǂ నాదృతి నోభగవానుఁడా! మనం
బున నెదికోరి పల్కితివొ ǂ పోలఁ దలంపఁ బ్రియంబు నీ కెదో
యొనరుతు మేము దాని మహిǂమోజ్జ్వల! నీ కెడయూఁ బ్రియంబు మా
కును నదియేప్రియం బగును ǂ గోరి య దెవ్విధి నిశ్చయించితో. ౮౬ 924

క. అనుమోదించితి దానినె, వినుమా బలిపుత్త్రుఁడౌను ǂ వీఁడు గనుక నా
కును వీనిఁ జంపరా దే,లన నేఁ బ్రహ్లాదునకు మహాభక్తునకున్. ౮౭ 925

మ. వరముం బ్రీతి నొసంగినాఁడ మును నీవంశంబుఁ ద్రుంపం జుమీ
నిరతిన్ మించి మహేశ! యట్టులయినన్ । నీకిష్టుఁడే యైనఁ గా
వరముం బూనిన వీని నిట్లడఁపఁగా । వాంఛించి యీవీనివా
కరముల్ ద్రుంచితి భూమికిన్ భరముగాఁ । గన్పట్టు సైన్యంబులన్. ౯౮ 926

క. పొరిపుచ్చితి నో దేవా, కరుణన్ బాహువులు నాల్గు । ఖండింపక యా
శరుసకు వీనికి నిచ్చితి, జరామరణహీనుఁడౌచుఁ । జరియింపఁ దగున్. ౯౯ 927

ఆ. భయము దేనివలనఁ । బడయక నీపార్ష, దులను ముఖ్యుఁడౌచుఁ । జెలఁగుఁగాక
యనియె; బాణుఁ డిట్టు । లభయమిచ్చిన హరి, కపుడు శిరసు నేలసంట మ్రొక్కి.

మ. అనిరుద్ధాఖ్యు నుషాసమేతముగ దివ్యస్యందనం బెక్కవ
చ్చునటుల్ యత్నముచేసి తోడ్కొనుచుఁ గృష్ణుం జేరవచ్చెన్ జనా
ర్దనుఁ డక్షౌహిణిసేన తన్గొలువ నంతన్ దివ్యవస్త్రాదికం
బునఁ జక్కంగ నలంకృతుండయి యుషం । బూబోఁడిమిన్నం దమిన్. ౧౦౧ 929

క. జతగాఁ గొని యనిరుద్ధుఁడు, మతి మోదము పొంగ రాఁగ । మన్ననలన్ ద
ద్ధితిజేంద్రు నిలిపి పురమున, కతిజవమునఁ బోయె హలధరాదియుతుం డై. ౧౦౨

చ. హరుఁడును సాగనంపె; హరి । యంత ధ్వజంబులఁ దోరణంబులన్
బురము స్వలంకృతంబగుచుఁ । బొంకముగాఁ దగియుండ మార్గచ
త్వరములఁ గుంకుమోదకము । బాగుగఁ జల్లి యలంకరించియుం
డ రమణఁ జేరఁబోయెను జనంబులు సంతస మబ్బుచుండఁగన్. ౧౦౩ 931

క. ఆనకదుందుభి శంఖ,ధ్వానంబులు చెలఁగ వచ్చి । తన్నెదురుకొనం
గా నెలమి సత్కరింపం,గా నళినాక్షుండు ద్వారకా నగరంబున్. ౧౦౪ 932

క. పురజనులు సుహృదయులు భూ,సురవర్యులు గౌరవింపఁ । జొచ్చె; నెవం డీ
హరివిజయము శంకరుతో, జరగిన సంగ్రామకథ సుప్రభాతకాలమునన్. ౧౦౫ 933

క. మేలుకొని సంస్మరించునొ, చాలన్ మేలొందు నతఁడు । జయమొందు నదే
వేళఁ బరాజయ మెన్నం,గా లేకుండంగ మెలఁగుఁ । గంజాక్షుకృపన్. ౧౦౬ 934

---

## అఱువదినాల్గవ యధ్యాయము.

### నృగమహారాజుచరిత్రము.

చ. అని హరిదౌచరిత్రము మహాసుకృతప్రదమున్ వచించి యి
ట్లనియె శుకుండు సాంబముఖు । లైన యదుప్రవరాత్మజస్ము లె
ల్ల నొకదినంబునందు సువిలాసము మీఱఁగఁ జారుభానుఁ డుం
కను గదముఖ్యులుం గలిసి । కాననమందునఁ గ్రీడ సల్పఁగన్. ౧ 935

సీ. ప్రద్యుమ్నముఖ్యులు । రమణమీఱఁగ రాఁగఁ జని యుపవనమునఁ । జాలసేపు

విహరించి విహరించి§వే జలముంగ్రోలు నాసక్తి త్వరపెట్ట § నందునందు
సలిలాశయంబుల § జాడల నరయుచుం బాథోవిహీనకూ§పమున నొకట
నత్యద్భుతాకృతి§యగు జంతు వొకఁడుండఁ గాంచి; రాజంతువు § క్ష్మాధరంబు

తే. వలెఁ గనంబడెఁ గృకలాస § మలఘుభయద
మద్ది యగు దానిఁగాంచుచు § నచ్చెరువును
దయయుఁ బురిగొన దాని నెత్తంగఁ దలఁచి
జతన మొగిఁజేసి యంతట § సాహసమున. ౩ 936

క. ఇదిపైకి రాఁగఁ జాలదు, గదయని చర్మంపుఁద్రాళ్లఁ § గట్టియు దృఢతర
గదిరిన తాంతవపాశస,ముదయమునం గట్టియుం బ్ర§మోదముపొంగన్. ౩౪

ఆ. పైకి లాఁగఁజూచి § పౌరుషమెల్ల వ్యర్థమ్ముగాఁగ నింకఁ § దమరు దాని
నెత్తి పైకిఁజేర్ప § నిత్తఱిఁ దగ మని, తలఁచి పోయి హరికిఁ § దెలిపి రద్ది.ర 938

సీ. పరమోత్సుకంబున § బాలకుల్ పలికిన విని భగవంతుండు § విశ్వభావ
నుఁడు పద్మదళనయ§నుఁడు కృష్ణుఁ డప్పుడె యాచోటికిఁ వచ్చి § యందు నున్న
యూసరవెల్లిని § నొగి లీలనే సవ్యకరమునఁ బయికెత్తెఁ § బరమకీర్తి
యగుహరి నిరుపమ§హస్త సంస్పర్శమాత్రమున నూసరవెల్లి § తత్క్షణంబ

తే. తనువు దానిని విడనాడి § తప్తహారి, భర్మవర్ణంబునం దగు § వపువు గ్రాల
నద్భుతకలాపములు తగ§నంబరములు, మాల్యములు మిగులం దాల్చి§మహితరీతి.

చ. తను వమరంగ దివ్యుఁడయి § తద్దయుఁ బొల్చె ముకుందుఁ డాత్మ నా
తని జననప్రకారమును § దాను సమగ్రముగా నెఱింగియున్
జనులకుఁ దచ్చరిత్రమునఁ § జాల నెఱుంగఁగఁ దెల్పవచ్చు న
ర్మనియతి నన్నకోర్కి బహు§మానము మీఱఁగఁ బల్కె నివ్విధిన్. ౬౪ 940

తే. ఓమహాభాగ! యెవ్వడ§వో? సమస్త, జనసమాదృత రూపంబు§నను వెలుంగు
చున్నవాఁడవు నిన్ను నే§నొక్క దేవ, వర్యుఁగా నెన్నువాఁడ ధ్రు§వంబుగాఁగ.

చ. ఒనరిచి తెట్టికర్మము? న§దొప్పనియీస్థితి నిన్నుఁ బొందఁ జే
సెను, గడు మంగళంబులఁ బ్ర§సిద్ధిని గాంచినవాఁడ వంచుఁ దోఁ
చెను నినుఁగన్న యంతనె వ§చింపుమ యున్నదియున్నయట్లు దా
నిని వినఁగోరువార మది § నీవెఱిఁగింపఁగ నర్హమైనచోన్. ౮ 942

చ. నరపతి యయ్యనంతుఁడు జ§నంబులకెల్ల నెఱుంగఁజేయ నీ
చరితముఁ జెప్పుమం చడుగ § సారసమిత్రసమానకాంతి వి
స్ఫురదురు సన్మణీమకుట § శోభితశీర్షము మాధవాంఘ్రిపం
కరుహాయుగంబు సోఁకునటు § గాఁ బ్రణమిల్లి వచించె భక్తితోన్. ౯ 943

మ. నరవేషంబును వేడ్కఁబూనిన జగ§న్నాథా! నృగుం డన్న భూ

వరుఁడఁ భూరియశంబునఁ వెలసి యిక్ష్వాకుండు నానొప్పు రా
ద్వరుసూనుండ వదాన్యులింద అనుచుం బల్కంగ నావేళ నా
చరితం బించుక సోఁకియుండు భవదీచ్ఛ్రోత్ర రంధ్రంబులన్. ౧౦ 944

సీ. అన్ని భూతములకు నాత్మసాక్షిగ నొప్పి కాలబలమున వ్యాఘాత మొంద
నట్టి దృష్టిఁజెలంగు నట్టి నీకుం దెలియని దేమియుండు నోక్లైన నీదు
నానతిఁ దలఁదాల్చి పూనెదఁ జెప్పంగ నిసుకలు భూమియం దెన్ని గలవొ
యాకసంబునఁ జుక్కలమరియుండునొ యెన్ని వర్ష ధారలసంఖ్యవఱలునెంతొ

తే. యన్ని గోదానములఁ దగినట్టివారి, కేను జేసితి ధేనువు లెట్టివనుచు
సంశయించెదొ పాలనొసంగునవియు,వయసు మిక్కిలి వెలయంగవఱలునవియు.

*క. ఎవ్వరి కేబాధయు లే, కివ్వసుధం దిరుగు సాధువృత్తి గలిగియే
మవ్వపుగుణములు రూపము, నివ్విటిలఁగ నొప్పునవియు నీరజనాభా! ౧౨

తే. కపిలవర్ణము గలవియుఁ గాంచనంపుఁ
బూఁత శృంగంబులం దగఁ బొలుచునవియు
గొరిజలఁ రూప్యభూషానికర మలరఁగ
మంచి వస్త్రంబులం గప్ప మించునవియు. ౧౩ 947

క. సుమమాలాలంకృతిచే, నమరియు నొప్పారువాని న్యాయముగా ద్ర
వ్యమునిచ్చి కొన్నవాని ని,యమునఁ నే నిచ్చినాఁడ నంబుజనేత్రా! ౧౪

సీ. సాధ్వలంకృతులయి సచ్ఛీలగుణములు గలిగి సత్యవ్రతముల నొనరిచి
తపమున విఖ్యాతి తగ బ్రహ్మవాదులై సాధువులై వయస్సాంద్రులగుచుఁ
జాల దరిద్రులై సత్కుటుంబముగల్గి వెలయు బ్రాహ్మణులకువిమలభక్తి
దాన మొసంగితి ధేనువారంబుల నావులనే కాక యవనిభాగ

తే. ములను స్వర్ణంబులఁ గృహమ్ముల హయముల
గజములను దాసికాయుతిఁ గన్నియలను
దిలల రజతంబు మఱియు శయ్యలను వస్త్ర
ములను మణులను గృహవస్తువుల నొసఁగితి. ౧౫ 949

క. క్రతువుల నొనరించుచు విధి, హితములుగఁ దడాకవాపి కేష్టక్రియలఁ
జతనమునం జేసితి శ్రీ, పతి! భగవత్ప్రీతిఁగోరి పాడుపడితిఁ జూ! ౧౬ 950

చ. ధరణిసురోత్తముం డొకఁడు దానము నావలనఁ గ్రహించి మం
దిరమున కేగెఁ దృప్తిమెయి ధేను వదెట్టులొ తప్పిచేరె శ్రీ
వర! మును పున్నమచ్చికను వచ్చి మదీయములైన గోవులఁ;
జరగినకార్య మీయది నిజంబుగ నే నెఱుఁగఁ రవంతయేన్. ౧౭ 951

* "పయస్వినీ స్తరుణీశ్శీల రూప గుణోపపన్నాః కపిలా హేమశృంగీః" అని మూలము.

చ. అనుదిన మిచ్చుదానములయందును దానినిగూడ నొక్కవి
ప్రునకు నొసంగితిన్ నియతిఁ బూనియె యాద్విజపుంగవుండు దా
నిని గొనిపోవుచుండ నిది నీకెటు లబ్బెను నాదియే సుమీ
యని మును దానిఁగైకొనిన యాద్విజుఁ డాతనితోడఁ బల్కఁగన్. ౧౬౪

ఉ. రెండవసారి ధేనువుఁ బరిగ్రహరీతిని గొన్నభూసురేం
ద్రుండు నృగుండు దానముగ ధూర్త! యొసంగెను దీని నిప్పుడే
యొం డనకుండఁ బొమ్మనియె నుద్ధతిమీఱఁగ వార లిర్వు రో
యండజవాహనా! తగవులాడఁగఁ బూనిరి తన్నిమిత్తమై. ౧౭ 953

చ. తమతమపంతముల్ నెఱప దా రెదలందును నిశ్చయించి వా
దములను సల్పి నాకడకు దానిని గొంచును వచ్చి యిచ్చి యా
ది మరల నీవె దొంగిలితి దీనిని ధర్మమె యిద్ది నీకు నం
చు మఱియు నిన్నిసారులనఁ జొప్పడనట్లు వచించిరో హరీ! ౧౮ 954

క. ఆమాటలు చెవిసోఁకిన, నామది భ్రమ మంకురించె నళినాక్షా! నే
నీమాడ్కి ధర్మసంకట, మే మది నేఁచంగ వార లిర్వురఁ గనుచున్. ౧౮౪ 955

సీ. ప్రార్థించితిని మేటియావుల నొకలక్ష మీకొసంగెద నాకు మీర లిందు
ధేనువు నిద్దాని నేను మీకింకరుఁడను సుంతయేఁ దెలియను నిజంబు
వార్త నిద్దాని నావలన సాగినయపరాధమాటను ననుగ్రహ మునుపుఁడు
ఘోరమౌ నరకమగ్నకూపంబునంబడు చున్నయీదాసుని నన్ను నిట్టి

తే. ధర్మసంకటమున నుండి తగు సముద్ధ
రింప మీకని యెంతప్రార్థింపఁ దగునొ
యంత వేఁడితి మును గొన్న యవనిసురుఁడు
కోపసంయుక్తిఁ బల్కె నో క్షోణినాథ! ౨౦ 956

క. ధేనునియుతము నొసంగిన, నేనంగీకార మూన నిది నిజ మనుచుం
దా నేగెను రెండవయతఁ, డో నృప! పదివేల నాల నొగి నిచ్చినను. ౨౦౪

ఆ. దీని మాని వాని నేను గైకొన నని, పలికి వెడలిపోయె; జలజనేత్ర
కాలయోగమునను గాలుని దూతలు, యముని కడకు నన్నునతిజవమున.

క. కొనిపోయి రాదిదేవా!, వనజాక్షా! లోకనాథ! వైవస్వతుఁ డం
త నను గన్గొని రాజా!, మును పాపం బనుభవింపఁబూనఁ దలఁచితో? ౨౧

క. మును పుణ్య మనుభవింపం, గను దలఁచితొ? చెప్పవయ్య క్ష్మాపాలక! నీ
వొనరించినదాన వ్రజ, జనిత మహాపుణ్యఫలము సమధికము సుమీ. ౨౧౪

క. ఇది యంతము దానికి ననఁగఁ దగక యెంతయును లోకగణమున వెలయున్
మది నెన్ని పలుక వయ్యా!, మొదట నదే ఫలము నొందఁ బూనెద ననినన్.

చ. తొలుతనె పాపముం గుడువఁ। దోఁచెదు నా కని పల్కినాఁడ; నా
పలుకు వినంగనే యముఁడు। పల్కెను వే పడవయ్య యంచు నో
జలరుహనాభ! యంతటనె। శ్వభ్రస్థలిపైఁ బడునప్పు డేను ని
మ్ములఁ గృకలాసమైన విధ।ముం గనుఁగొంటిని మాటలేటికిన్. ౨౩ 962

చ. ధరణిసురేంద్రభక్తుఁడ వ।దాన్యుఁడ నీకును దాసుఁడన్ మహా
పురుష! యివిన్నియుం గలుగఁ। బూజ్యుఁడవై తగు నిన్నుఁ జూడ ని
ర్భరసుకృతంబునన్ మదిని। బర్విడు వేడుక నుండునాకు నీ
కరుణను బూర్వసంస్మృతి త।గం జెలువారెడు నిప్పుడున్ విభూ! ౨౪ 963

సీ. యోగీశసమితికి। నుపనిషజ్జ్ఞానంబునను బరిశుద్ధమై। తనరుచిత్త
మునఁ దలంపఁగఁదగి। యనుపమానుఁడవయి పరమాత్మవగు నీవు। భక్తవరులు
కాకయుండెడు వారి।కన్నుల కగపడ వరయ భవాపవ।ర్గార్హులైన
వారికే యగపడు।వాఁడ వట్లయ్యును భూరిశోకమహాంధ। బుద్ధియైన

తే. నాదు కన్నుల కగపడి। నావె యెట్లు
తెలియఁజాలక యున్నాఁడ। దేవదేవ!
యోజగన్నాథ! గోవింద। యోమహాను
భావ! పురుషోత్తమా! మహా।పావనయశ! ౨౫ 963

క. చ్యుతిలేక వెలయు దేవా!, ప్రతిలేక వెలుంగుతేఁడ!। పరమాత్మా! లో
కతతికిఁ బ్రాపగు నృహరీ!, దితిజాంతక కృష్ణ! దివ్య।తేజా! శౌరీ! ౨౬ 965

క. సురనాథ! హృషీకేశా, పరమేశా! దివ్యగతికిఁ। బల్విడి పోవన్
గరుణ ననుజ్ఞ నొసంగుము, హరి! నే నెందున్న నీప।దాంభోజములన్. ౨౭

చ. అనవరతంబు నామది మ।హాదృతిమై స్మరియించునట్లు నా
కును వరమిమ్ము బ్రహ్మమన। గోపతియేయన సర్వభూతసం
జననిదానమం చనఁగ। సర్వవిభుండన వాసుదేవుఁ డం
చనఁగ ననంతశక్తి యన। నచ్యుతుఁ డంచన నొప్పు వాఁడవై. ౨౮ 967

క. సతము వెలుంగుచు యోగ,ప్రతతికి నాథుండవగుచు। భాసిల్లెదు న
చ్యుత! నీకొనరింతు నమ,స్కృతు లని యానృగమహీశ।శేఖరుఁ డంతన్. ౨౯

చ. వలగొని మస్తకంబు హరి।భవ్యతమాంఘ్రిసరోజయుగ్మసం
కలితముగాఁగ మ్రొక్కి చన।గాఁ దగు రాజ! యటంచుఁ గృష్ణుఁ డి
మ్ములఁ దన కాజ్ఞ చేయఁ గొని। భూరివిమానము నెక్కి యెంతొ వే
డ్కలఁ దను నెల్లరుంగనఁగఁ। గ్రన్నన నేగెను నాకసీమకున్. ౩౦ 969

సీ. దేవకీతనయుండు। దేవదేవుండు బ్రహ్మణ్యదేవుఁడు కృష్ణుఁ। డంత ధర్మ
మతియాట భూపాల।కుండలముం దానె శాసించుటకుఁ బరి।జనులఁ గాంచి

భగవంతుఁడౌట నీవ్వాడువున భాషించెఁ; గంటిరే నృగమహీశకాంతుని గతి
బ్రహ్మస్వ మించుకే ॱ భావింప కెవ్వఁడే ననుభవించిన నది ॱ యగ్నివంటి
తే. తేజ మొప్పారువానినేఁ ॱ దీవ్రశక్తి
నాశ మొందించుఁ గాని యోన్నంగ దక్క-
దింతవట్టు నిజంబు; మే ॱ మీకుల మను
కొనెడు నవ్వారిమాట యేమనఁగవచ్చు. ౩౨ 970

*క. వినుఁడే హాలాహలమును, మనమున విషమంచుఁ దలఁప ॱ మహి దానికి నౌ
పును గాంచఁ బ్రతీకార,మ్మనునది; బ్రహ్మస్వమె విష ॱ మనఁబడుఁ జుండీ! ౩౩

క. దానికిని బ్రతీకారము, గానంగా రా దదెట్లు ॱ గాంచిన విషమో
తా నడఁచుఁ దిన్నవానిఁ గృ,శానుఁడు చల్లారు నీరుచల్లిన మాత్రన్. ౩౪

సీ. బ్రహ్మస్వ మను పేరఁ ॱ బరఁగెడునరణియం దుద్భవించినయట్టి ॱ హుతవహుండు
సహమూలముగనె వంశంబును వహియించు; ననుమతివడయక ॱ యనుభవింపఁ
బడినబ్రహ్మస్వము ॱ వరుసఁ దన్నుం బుత్త్రుఁ బౌత్త్రు నీముప్పూరఁ ॱ బాడుచేయు
బలవంతముగఁ గొన్న ॱ బ్రహ్మస్వమో వానిఁ దండ్రియాదిగఁ బదితరములవఱ
తే. కంతమానక తరువాత ॱ నతనికొడుకు
మొదలుగాఁ బదితరములఁ ॱ బూనిచంపుఁ;
గాన దానిని గోరెడు ॱ మానవులును
నారకముఁ బొందఁ గోరెడువారె తలఁప. ౩౫ 973

చ. కనుకనె రాజలక్ష్మియు నఖండత నున్నదటన్న యమ్మదం
బునఁ దమనాశముం దెలియఁబూనరు నారకహేతు వంచునున్
మనమున నెన్న రట్లగుట ॱ క్ష్మాపతు లెంతయు మూఢులౌదు; రా
త్మనియతిఁ గల్గి శాంతులయి ॱ మంచికుటుంబము లొప్పుసద్విజుల్. ౩౬ 974

క. ధరనుండ వారిద్రవ్యము, హరించినన్ వార లేడ్వ ॱ నశ్రులవలనం
దొరఁగెడు నశ్రుకణంబుల, ధర పాంసువు లెన్ని చక్కఁదడుపంబడునో? ౩౭

ఆ. అన్నివత్సరంబు ॱ లారాజులును వారి, కులమువారు నరకకూపములను
బడి సమస్తఘోరబాధలఁ గాంచుచు, నుందు రామహార్తి ॱ యుగ్రమగును.

వ. యాతనాకూపము ॱ లతిఘోరరూపమ్ము లగుచుఁ గుంభీపాకముగ గణింపఁ
బడునవ్వి యాఖ్య నెవ్వఁడు బ్రాహ్మణునకు జీవనముగాఁ దా నొసంగినదిగాని

* "నాహం హాలాహల మ్మన్యే విషంయస్య ప్రతిక్రియా, బ్రహ్మస్వంహివిషం ప్రోక్తంనాస్య ప్రతి
ధిర్భువి." ౩౩. "హినస్తి విషమత్తారం వహ్నిరద్భిః ప్రశామ్యతి, కులంసమూలందహతి బ్రహ్మస్వారణి
పావకః." ౩౪. "బ్రహ్మస్వందురనుజ్ఞాతం భుక్తంహంతిత్రిపూరుషం, ప్రసహ్యతుబలాద్భుక్తం దశ
ర్వాన్ దశాపరాన్." ౩౫. అని మూలము.

పరులిచ్చినదిగాని హరియించునో యఱువదివేలవర్షముల్ వాఁడు మలము
నందును గృమిజన్మమంది యుండును; బ్రహ్మధనమున కాశించు మనుజపతులు
తే. స్వల్పమగు నాయువొంది రణాంగణముల
నపజయంబును బొంది రాజ్యంబునుండి
భ్రష్టులయి దీనతంబొందువారు గాన
వలదు వల దట్టిద్విజుల ద్రవ్యంబునాకు. ౮౨ 977
క. మనుజేంద్రులు దానిం గొని, జననాంతరములను వారు సర్పంబులుగా
జనియింతురు గావున నా,ధన మింతయు వలదు నాకు దారుణ మగుటన్. ౮౩
క. మీరు మదీయులె యేనిన్, ధారణిసురు లెట్టితప్పు దా రొనరిచినన్
వారికి ద్రోహముసేయకుఁ, డారీతిం గొట్టువానినైనం గ్రుధచేన్. ౮౪ 979
క. అనిశము శపించుచుండిన, ననుమానము లేక భక్తినవ్వారికి వం
దనము లొనర్చుచు నుండుఁడు, ధనమే జ్ఞానంబుగాఁగఁ దగుదురు గానన్. ౮౫
*క. ప్రతిసమయంబునను సమా, హితమతినై భూమిసురుల కె ల్లేను నమ
స్కృతు లొనరుతునో మీర, వ్వితమునఁ బ్రణమిల్లుఁ డెవఁడువిధి నిద్దానిన్.
తే. ఆదరింపక స్వేచ్ఛమై నవనిఁదిరుగు
నట్టివానిని దండింతు నని యెఱుఁగుఁడు;
బ్రాహ్మణధనం బపహరింపఁబడు నదెవరి
వంకఁ దెలియకయేని యవ్వాని నదియు. ౮౬ 982
క. నరనాథు నృగుని భూసుర, వరుగో వట్లుగ నధోభువనమునఁబడి భీ
కరకష్ట మొందఁజేయును, బరికింపుం డివ్విధంబు భావములందున్. ౮౭ 983
చ. అని యిటు లోకపావనుఁ డఘాంతకుఁ డాభగవంతుఁ డాదృతిన్
ఘనతరధర్మమార్గము నికామము ద్వారకయందు నున్నయ
మ్మనుజులకెల్లఁ దెల్పి నిజమందిర మల్లనఁ జొచ్చె వారలుం
దనదగు దివ్యబోధమున ధర్మముఁ బూనుదు రన్న నమ్మికన్. ౮౮ 984

---

అఱువదియైదవయధ్యాయము.

బలభద్రుఁడు గోకులమున కరుగుట.

చ. హరిచరితంబు తెల్పి యిటు లాశుకయోగి పరీక్షిదాఖ్యభూ
వరునకు రామువార్తలను భవ్యతమంబులఁ దెల్పఁబూని యో
ధరణిప! యీశ్వరుండు బలదర్పసమగ్రుఁడు రాముఁ డొక్కనాఁ
డరిగె రథంబునెక్కి సుహృదావళిఁ గన్గొనుకాంక్ష పైకొనన్. ౧ 985

* "యథా హం ప్రణమేవిప్రా ననుకాలం సమాహితః" అని మూలము.

క. గోకులముఁ జొచ్చి యటఁ బ్రీ,త్యాకలితమనస్కు లగుచు ఽ నరుదెంచి త్వరన్
జేకూరెఁ గనఁగ నిప్పటి, కీకమనీయాంగు ననుచు ఽ నెల్లపురుషులున్. ౧౪ 986

క. వనితామణులున్ బిగ్గం, దనుఁ గౌఁగిటఁజేర్ప భక్తిఁ ఽ దలిదండ్రుల ప
ద్వనజములకు మ్రొక్కి ముదం,బున వారలు దీవనలను ఽ బొదలెడు వేడ్కన్.

క. ఒనరిచి సంతృప్తిం గన, మనమునఁ దా నలరె; నంత ఽ మహిళామణి య
న్ననుతిం గనిన యశోదయు, జనకుఁడు నందుండు మదుల ఽ సంతస మొప్పన్.

సీ. దాశార్హ! జగదీశ! ఽ తల్లిదండ్రుల మగు మమ్మెప్డు నీవు నీఽతమ్ముఁ డెలమిఁ
గాపాడుచుండుఁడు ఽ కన్నవారముగద యని పల్కుచుం బుత్త్రుఽనంకపీఠ
ములఁ జేర్చుకొనుచుఁ గౌఁఽగిళుల ముద్దాడుచుఁ గన్నులనీ రొగిఁఽగాలువలుగఁ
బ్రవహింప మదిఁగలఽప్రమదంబుఁ జూపిరి; రాముఁడు తనకంటెఁఽబ్రాయమందుఁ
తే. బెద్దలగు వారికెల్లను ఽ విధియుతముగ
వందనము చేసి పిన్నలౌ ఽ వారు మ్రొక్క
వయసునకుఁ దగురీతి నఽవ్వారి కెల్ల
జరపె మర్యాదలను బంధుఽసమితి యలర. ౮ 989

క. తనయీడుగల్గు గోపకు,లను గని హాస్యోక్తులను విఽలాసంబున నె
మ్మనము లలరంగ నాడుచుఁ,గనుచుం బ్రేమార్ద్రదృష్టిఁ ఽ గరములఁ గొనుచున్,
తే. మఱియు నెన్నోవిధంబుల ఽ మమతఁ దెలుపు
నట్టిచేష్టల సాగించి ఽ యంత మార్గ
కష్టమది వాయ విశ్రాంతిఁ ఽ గైకొనుటయు
సుఖసమాసీనుఁడగు రాము ఽ చుట్టుఁజేరి. ౫ 991

క. బలభద్రుఁ డనామయమును, సలలితవాక్కులను బ్రశ్నఽసలుపఁగఁ దమబు
ద్ధులు సరసిజనేత్రునిపయి, నలముకొనం బ్రేమ గద్గ ఽ దారవ మొప్పన్. ౫౪ 992

చ. పలికిరి గోపకుల్, త్వరను ఽ భద్రగుణాకర! రామ! యస్మదీ
యులు సుఖమున్నవారె తనఽయుల్ సతు లెల్లరు మీరు మమ్మునుం
దలఁతురె యెప్పుడైన; గురుఽదైవవశంబునఁ బాపచిత్తుఁడై
వెలసిన కంసభూమిపతి ఽ వీరరణంబునఁ జంపఁగాఁబడెన్. ౬౪ 993

మ. మనవారెల్ల రదృష్టయోగమున దుఃఽర్మానంబునం బొల్చుకం
సుని బాధావళినుండి ముక్తులయి రంఽచున్ వింటి మో రామ! దు
ష్టనికాయంబును జంపి శత్రువులనున్ ఽ శౌర్యంబునన్ గెల్చి మీ
రనఘుల్ గావున దుర్గమాశ్రయముగా ఽ నందుంట భాగ్యంబెయా! ౭౪ 994

మ. అనునంతన్ బలభద్రుదర్శనముచే ఽ నానంద ముప్పొంగఁ జ
క్కని నవ్వుల్ పొలయంగ గోపికలు పఽల్కంబూని రో రామ! ప

త్తనారీజనవల్లభుండు శతపత్త్రస్ఫారనేత్త్రుండు స
జ్జనతాధారుఁడు కృష్ణుఁ డందు సుఖియే ♦ సత్యంబు వాక్రువ్వుమా. ౯౫　995

చ. అతఁ డెపుడేఁ దలంచుకొను ♦ నాతలిదండ్రుల బంధుజాలమున్
మతిఁగల ప్రీతిఁ దల్లిఁ గన ♦ మాధవుఁ డొక్కపుడేని వచ్చునా?
సతతము తన్నుఁ గొల్చు మము ♦ సంస్మరియించునె? యమ్మహాభుజుం
డతిశయభక్తి మాదయిన ♦ యాపరిచర్యఁ దలంచునా? ప్రభూ!. ౧౦　996

చ. ఎవనినిమిత్త మేము జనయిత్త్రులఁ దండ్రుల భ్రాతలన్ దనూ
భవులను సోదరీమణుల ♦ భర్తలనున్ వదలంగరానిబం
ధువులఁ ద్యజించినారమొ తనున్ మది నెప్పుడు నమ్మినామొ యా
సువిమలచిత్తలన్ మమునుఁ ♦ జొక్కపునార్తిని గుందఁనట్లుగన్. ౧౧　997

చ. ఘనమగు నెయ్యమున్ సడలఁ ♦ గా విడనాడియె పోయెఁగాదె; పో
వను సమకట్టునప్డె ప్రతిబంధ మదేటికిఁ గల్గఁజేయ రం
చనుదువొ యేమొ యాతఁడు మహాద్భుతిమీఱఁగ వేగ వత్తు న
న్ను నుడిని మాద్భశల్ సతులు ♦ నమ్మకయుండఁగ నేర్తు రెట్టులో. ౧౨　998

చ. అనిపలుకంగఁ గొంద అని, ♦ రల్లన మాటలనేర్పు కన్పడన్
మన సొకచోట నిల్వక సమస్తవిధంబులఁ బర్విడంగఁ జే
సిన యుపకారమున్ మఱచి ♦ చెప్పఁగరాని గతుల్ చెలంగ నొ
ప్పిన యలకృష్ణు నెట్లు పుటభేదనకాంతలు తెల్వఁగల్గియున్. ౧౨౫　999

ఉ. చిత్తములందుఁ గైకొనిరొ ♦ చెప్పఁగఁజాల మటన్నఁ, గొంద ఱొ
బిత్తరు లిట్లు పల్క రభివృద్ధిని బొందెడు వేడ్కమీఱఁగాఁ
జిత్తముపల్లవించునటు ♦ చేసెడుమాటల సుందరస్మితా
యత్త మనోజ్ఞ దృగ్వితతి ♦ నాత్మగతస్మరతాప మెంతయున్. ౧౩　1000

క. చెలరేఁగి తమ్ము నేచఁగ, నలకృష్ణుని మాట లెల్ల ♦ ననృతమ్ములుగా
విల సత్యములని నమ్మిరి, జలజాక్షులు నాగరికత ♦ చాలఁగలిగియున్. ౧౩　1001

చ. అని పలుకంగఁ గొందఱని ♦ రంగనలార! మఱొక్కసుద్దు లే
మనము వినంగ నర్హములు ♦ మాధవుముచ్చట లింకఁజాలు నా
వనరుహనేత్త్రుఁ డీమనలఁ ♦ బాసి యదెట్టులు ప్రొద్దుపుచ్చునో
మనకును శ్రీమనోహరునిమానినఁ గాలము సాగెడుంగదా! ౧౪　1002

క. అతనికి సుఖముగ నీమన, కతికష్టముగాఁగఁ గాల ♦ మరిగెడు ననుగూ
ఢతమార్థము దేటపడన్, జతనంబునఁ బల్కిరిట్లు ♦ సమ్మద మలరన్. ౧౪　1003

చ. హరిచిఱునవ్వులన్ నుడుల ♦ హారితరాయతవీక్షణంబులన్
సురుచిరభావముం దెలుపుఁజొక్కపు నెన్నడలన్ స్మరించుచున్

బరమముదంబుఁ గూర్పఁదగి భద్రదమా పరిరంభణంబునన్
బరిపరి సంస్మృతిం దగుల భామిను లేడ్చిరి ప్రేమభారతన్. ౧౫ 1004

మ. బలభద్రుండు బహుప్రకారముల సంభాషింప నాశ్వాసమున్
గలుగంజేయ వలంతిగాన హరియుం గాంతాళికిం జెప్ప మం
చలరం బల్కిన నెన్నఁడుల్ మిగుల సౌహార్దంబు గల్గించువా
ని లలిం బల్కి యడంచెఁ దాపభరమున్ నిర్మాల మానట్లుగన్. ౧౬ 1005

సీ. రాముఁ డచ్చోటఁ జైత్రంబు వైశాఖంబు ననెడుమాసద్వయ మాదరమున
నివసించియుండి యానిశలందు నందున్న గోపికలకుఁ గలకోర్కెలెల్ల
ఫలియించునట్లు నిస్తులభాషణంబుల హరిచరిత్రంబుల నంతరంగ
ములు తృప్తి నొందెడుపోలిక వచియించుచుండెను; మఱియు నాతండుపూర్ణ
తే. చంద్రకళల నెసంగుచు సాంద్రకుముద, పరిమళమిళ న్మరుత్తులు పర్వ నొప్పు
యామునోపవనంబుల నన్నుమిన్న, లాదరంబునఁ గొలువ నెయ్యమున నుండె.

క. వరుణప్రేషిత వారుణి, పరమాదృతి వచ్చి యాయుపవనంబందుం
దరు కోటరంబునుండియుఁ, దొరఁగుచు వాసనలఁ దొప్పఁదోఁగఁగఁ జేసెన్.

మ. బలభద్రుండును గోటరాంతరగళ ద్భవ్యాసవోద్దామ ధా
రలదౌ వాసనలన్ మరుత్తు కొనితేరన్ మూరుకొం చాదృతుల్
వెలయంగా నటకేగి స్త్రీగణయుతిన్ వే త్రావె సంతృప్తిగా;
హలి యంతం దనుఁ గామినీమణులు గేయస్ఫూర్తి వర్ణింపఁగన్. ౨౦ 1008

శా. దానిన్ వారలఁగూడి పాడుచును జిత్తం బాసవస్ఫూర్తినెం
తే నామోదమునొంది మత్తిల లసద్దృష్టుల్ మదవ్యాకుల
త్వానూనారుణవర్ణతన్ వెలయఁగా నైరావతం బేగతిన్
స్త్రీనాగాన్వితమై చెలంగు నటుగాఁ గ్రీడించె నిచ్ఛారతిన్. ౨౧ 1009

సీ. సురదుందుభులు మ్రోఁగె సుమవృష్టిఁ గురియించి రమరులు గంధర్వులాడిపాడి
రాబలభద్రుఁ డాయాసవమదమునఁ గుసుమదామము దాల్చి కుండలమ్ము
నొక్కదానిం దాల్చి చక్కని వైజయంతిని ధరియించి మోమును సరోజ
మును గేలిసేయ నవ్వును జిందులాడఁగ స్వేదహిమాంబుభూషితుఁడు నగుచు
తే. నీశ్వరుండౌట సలిలకేళీచ్ఛ యెసఁగ, యమునఁ బిలిచెను జెంతకు నరుగుదెమ్ము
త్వరగ; ననిపిల్వ నానది సురనుఁగ్రోలి, మత్తుఁ డయ్యె నితం డని మదిఁ దలంచి.

క. ఆతనిమాటం గైకొన, కాతటి రాదయ్యెఁ జెంత కది గని బలుఁ డ
త్యాతతకోపము గదురఁగ, భీతికరంబైన హలము వెసఁ గొని పూన్కిన్. ౨౩

క. దానిదగు నగ్రమును యము,నానదికిం దగులఁజేసినను దృణముగ నీ
మానసమునఁ బాపమతీ!, కానక భావించి తీవుగావున నింకన్. ౨౪ 1012

క. నే నెవ్వఁడనో తెలియం, గా నొనరుతు నిప్పటికిని ∫ గాని తలంపుం
బూనవుగద రా నిచ్చా, ధీనముగాఁ దిరుగు నిన్ను ∫ దృప్తమతి నిదే. ౨౪ 1013

క. హాలముఖమున శతశకలం, బులుగా నొనరింతుఁ జూడు ∫ ముగుదా! యని భీ
తిలఁ బల్కుచు నదలింపఁగ, నలశైవలినీవతంస ∫ మతిభయ మొప్పన్. ౨౫ 1014

క. గడగడ వడఁకుచుఁ జిత్తము, తడఁబడఁగా యదుకుమార ∫ తల్లజు ప్రోలన్
వడి నడుగులు సోఁకంగాఁ, బడి రామా! రామ! దీర్ఘ ∫ బాహా! ధీరా! ౨౬

ఆ. నీపరాక్రమమును ∫ నే నెఱుంగనుజుమి, జగదధీశ! సత్వ ∫ శాలి వగుచుఁ
దనరు నీవె యంశ ∫ మున జగంబంతయు, దాల్తు వో మహాత్మ! ∫ తరమె పొగడ.

సీ. భగవంతుఁడవగు నీ ∫ పరమభావ మెఱుంగఁ జాలను విశ్వాత్మ! ∫ సకలభక్త
వత్సలా! శరణంబు ∫ భక్తితో వేఁడుచు దీనురాలనయిన ∫ తెఱవ నన్ను
వదలంగఁ దగుఁజుమ్ము ∫ సదమలకరుణచే ననుచుఁ బ్రార్థింప నా ∫ హాలధరుండు
షడ్గుణైశ్వర్యైక ∫ శాలి కావున యమునాప్రోదినీ ప్రార్థ ∫ నమ్ము నాత్మ

ఆ. నవధరించి వదలె ∫ నంత నాతఁడు దాని, జలములం గరేణు ∫ సమితిఁగూడి
గజవిభుండు వోలెఁ ∫ గాంతామణీయుతి, జలక మాడె వేడ్క ∫ సందడింప.

చ. హాలధరుఁ డిట్లు కేళి సలి ∫ లాంతరమందు నొనర్చి యంతటన్
వెలువడి రాఁగ నయ్యమున ∫ వీరవతంసున కంబరద్వయం
బలఘుమహార్ఘ్యభూషణము ∫ లచ్చపుఁగాంతిని వెల్గువాని ను
జ్జ్వలసుమహారముం బ్రియము ∫ సంధిల నిచ్చెను శ్రీలతాంగి యై. ౨౯ 1018

చ. వరుణుఁడు హెచ్చరింప నిటు ∫ వస్త్రయుగం బసితాభ మీయ నా
దరమున వానిఁ గట్టుకొని ∫ తద్దయు వెల్గు సువర్ణహారమున్
గర మనురాగ ముప్పతిలఁ ∫ గా మెడఁ దాల్చి సుగంధచర్చలన్
నిరుపమకాంతి నొప్పి యల ∫ నిర్జరనాయక హస్తి నాఁదగెన్. ౩౦ 1019

చ. యమునయు నిప్పుడున్ దను మ ∫ హాబలశాలి హలాయుధుండు వి
క్రమమున నీడ్వఁగా నతుల ∫ గాఢబలుండగు రాముదోర్బలం
బు మనుజకోటికిం దెలుపఁ ∫ బూనినయట్లు తదీయమార్గమం
దె మలయుచున్న; దిప్పగిది ∫ నిద్ధవిహారమునందుఁ దేలుచున్. ౩౧ 1020

క. స్వవశీకృత చిత్తుండై, పువుఁబోఁడుల మృదువిలా ∫ సములఁ జొక్కుచు మా
ధవు జ్యేష్ఠుఁ డుండఁగా గో, పవధూసంతతికి రేలు ∫ బహుళములయ్యెన్. ౩౧

ఆ. ఒక్కరాత్రి వోలెఁ ∫ జక్కఁగా సాగెను;
భగవదంతికమ్ము ∫ పరమపురుష
దాయకంబె యగుట ∫ తథ్య మన్నవిధంబు
దెలుపు చుండుఁగాదె ∫ పలువిధముల. ౩౨ 1022

## అ ఱు వ ది యా ఱ వ య ధ్యా య ము.

### శ్రీహరి పౌండ్రకవాసుదేవుని గాశీరాజును వధించుట.

క. బలదేవుఁడు గోకులమున, గెలమిం జనఁ గరూశ జనపదేశుఁడు సుంతే
దెలివిం గనమిం దానే, యిలలోనన్ వాసుదేవుఁ డెన్నఁగ ననుచున్. ౪ 1023

క. ఇతరులు పొగడఁగ నిజమని, మతిఁ దలఁచుచుఁ బౌండ్రకుండు మాధవుకడ కు
ద్ధతి నొక్కదూతఁ బంపెను, క్షితి నజ్ఞులు కొంద ఱతనిఁ జేరి ముదమునన్. ౧

సీ. వాసుదేవుఁడవయి వసుమతి నవతరించిన భగవంతుఁడ వనుచు; నీవె
జగదీశ్వరుఁ డవని సన్నుతుల్ చేయఁగ నవి సత్యములె యని యాత్మ నమ్మి
వాసుదేవునిగఁ దన్ భావించుచుంట నామందమనీషుండు మానులకును
దెలియశక్యముకాని యలఘుమార్గముగల హరికడకున్ దూత నంపి కృష్ణ!

తే. ద్వారకానగరంబున బాలు రొక్క
బాలునిన్ రాజుగాఁ జేయుభంగిఁ దెల్వి
మాలినట్టి నినున్ దెల్విమాలినట్టి
వారు ప్రభువుగఁ జేసినవార లనుచు. ౩ 1025

క. తెలుపుందగు నని పనిచిన, నలఘుజవం బొప్పఁబోయి యాదూతయు నా
జలజాక్షు ద్వారకాపురి, లలితసభాసీనుఁడయి చెలంగెడు ప్రభునిన్. ౩౪ 1026

చ. కనుఁగొని ఱేఁడుచెప్పినది కాదన కంతయుఁ దెల్పె నిట్టు; లు
ర్విని విను వాసుదేవుఁడను విశ్వమునంగల భూతరాజిఁ గా
వ నవతరించినాఁడఁ దగుభంగిని గాచుచు నున్న వాఁడ నిం
క నొకఁడు వాసుదేవుఁ డనఁగాఁ దగఁ డింతయు సత్యమాఁ జుమీ! ౮ 1027

సీ. నిన్ను లోకులు పల్కుచున్న వారలుగద వాసుదేవుండని వార కద్ది
వ్యర్థమా సాత్వతా! యాత్మ నెఱుంగక మాచిహ్నముల ననుమాన మెడలి
వేనిని దాల్చితో వాని వే వదలి నన్ శరణు వేఁడుమ యట్లు జరపవేని
సంగర మొనరుపఁ జనుదెమ్ము నామీఁది కని తెల్పె; నివ్విధి నల్పబుద్ధి

తే. పౌండ్రకుఁడు కాఱులాడి తెల్పంగఁ బనుప
విని సభంగల యుగ్రసేననృపముఖ్యు
లట్టె పకపక నవ్వి రా హరియు దూతఁ
గాంచి పరిహాసవచనముగా వచించె. ౨౪ 1028

క. ఓమూఢా! యేచిహ్నము,లే మెఱుఁగక తాల్చి కాఱు లిట్లాడెదవో
శ్రీమద మయ్యది వదలఁగ,నే మాయఁగఁ జేయువాఁడ నెల్లన్ వానిన్. ౭

క. నీమోముఁ గంకగృధ్ర, స్తోమమ్ములు కప్పి వేఁడఁ జుట్టును మూఁగం
గా మృతిగని శయనించిన, నామోదముమీఱఁ గుక్క లలముకొనంగన్. ౯

క. శరణ మ్మవి నీకగుఁజుము, పరికింపు మటంచు నీసుఽభాషితముల భూ
వరునకుఁ దెల్పు మటంచున్, హరి పంపిన దూత యెల్లఁఽదయా త్మేపోక్తుల్. ౧౦

క. కొని చనియె నేలికకుఁ దె,ల్పను; గృష్ణుఁడు రథము నెక్కి ఽ వడిఁ గాశీప
త్తనమును జేరెను; బౌండ్రకుఁ, డనూనకృష్ణప్రయత్న ఽ మది యెఱుకపడన్.

తే. తా మహారథుఁ డౌటను ఽ దనబలంబు, లెన్ని యక్షౌహిణులు వెంట ఽ నేగుదేర
పురము వెలువడి వచ్చె; నాఽభూమిపతికిఁ, గాశిరా జెన్న మిత్త్రుండుఽగాన నపుడు

క. బలములు మూఁ డక్షౌహిణు, లలరెడు సంగ్రామకౌతు ఽ కాంచన్మతులన్
బలుపూన్కి రాఁగ వెనుకనె, కలహము చేయంగఁ దోడుఽగా వచ్చె వెసన్. ౧౨

సీ. హరి యంత నచ్చోట ఽ వరశంఖచక్రఖడ్గంబులు శార్ఙ్గంబు ఽ గదయు మఱియుఁ
శ్రీవత్సనామక ఽ చిహ్నంబు మొదలగు లలితలక్షణములఁ ఽ బొలుపుమీఱి
కౌస్తుభమణిఁ దాల్చి ఽ కమనీయవనమాలికాభిరాముండయి ఽ యమలరీతిఁ
బచ్చనిపట్టుదుఽవ్వలువలు ధరియించి గరుడకేతనమునఁ ఽ గ్రాలి దివ్య

తే. మకుటరత్నంబు మెఱయంగ ఽ మకరకుండ
లములు తళతళలాడంగ ఽ లలితరీతి
గానఁబడు పౌండ్రకుని భూమిఽకాంతుఁ గాంచెఁ
గృతకవేషమునం దనఽగతిఁ జెలఁగుచు. ౧౪ 1035

క. రంగస్థలమున నర్తకు, భంగిం గన్పడెడువానిఁ ఽ బరికించి మహా
సంగరభూమిని నచ్చెరు,వుం గనుచున్ నవ్వె జడుఁ డఽవుంగద! యనుచున్.౧౫

క. పౌండ్రక కాశీరాజులు, వేండ్రము శత్త్రుక్షమేశఽవీరుల కెల్లం
దీండ్రముగాఁ గూర్చెడున,ట్టిం డ్రౌటన్ గూడుకొని కఽడిందిమగటిమిన్. ౧౬

క. పరిఘంబులు శక్తులు తో,మరములు శూలములు గదలు ఽ మఱియుం బ్రాసో
త్కరయష్టులు ఖడ్గంబులు, శరపట్టిసములును వైచి ఽ చక్రిఁ గలఁచినన్. ౧౭

చ. హరియును శత్త్రుయుగ్మబల ఽ మల్లన నవ్వుచుఁ జంపువేడ్కమైఁ
గరిహయరాజి స్యందననిఽకాయముఁ బత్తిగణంబు నట్టి స
త్వరముగ ఖడ్గచక్రశరఽభారగదాహతులన్ యుగాంతభీ
కర దహనుండు భూతములఁ ఽ గాల్చువిధంబున నీఱు చేయఁగన్. ౧౮ 1039

క సేనలు విఱిగిన వానిం, బోనీయక చక్రమునను ఽ భూరి రథములన్
దా నపుడు గూల్చె; ద్విరదవి,తానంబును హయవితతిని ఽ దఱిగెం బెలుచన్.

సీ. కాల్బలంబులఁ జెండె ఽ ఖరములఁ ద్రుంచె నుష్ట్రంబులఁ జంపె నాఽసంగరమున
నయ్యవి గూలఁగా ఽ నాహవస్థల మది శూరులకుం దమిఁఽగూరుపంగఁ
జాలి కల్పాంతపుఽవేళ భూతేశుని కేళిశాస్థలమునుఽబోలి దారు
ణాకృతిగా నుండె ఽ నంతఁ గృష్ణుఁడు పౌండ్రకునిగాంచి యోరోరిఽకుమతివగుచు

తే. దూతముఖమునఁ జెప్పినరీతి నస్త్రములనె నీపైఁ బ్రయోగింతు మూఢ! నీవు
ధరిత్తదాల్చిన నాదు పేరిని సయితము, వదలునట్లుగఁ జేసెదఁ బౌరుషమున. ౧౯

క. అని చేయలేక వెఱచిన, నినుఁ జొత్తును శరణ మనుచు నెఱి నాక్షేపిం
చెను గృష్ణుఁ డంతఁ దీవ్రశరనికరమున వానినిఁ విరథుఁ జేసి వెసన్. ౨౦

వ. హరిహయుఁ డుగ్రవజ్రమున నద్రినిబోలె సుదర్శనంబునన్
శిరమును ద్రుంచెఁ గాశిపతిశీర్షము కాయమునుండి సాయకో
త్కరమున వేఱుచేసి ధరఁ గ్రక్కునఁ ద్రెళ్లఁగఁజేసి కాశికా
పురిఁ బడఁజేసెఁ దామరపుమొగ్గను వాయువువోలె లీలఁగన్. ౨౨ 1043

ఉ. ఈవిధి మచ్చరించిన మహీశునిఁ బౌండ్రకు వానినెచ్చెలిన్
శ్రీవిభుఁ డట్లు త్రుంచి తమి సిద్ధులు స్వీయకథామృతంబు నే
ర్పావహిలంగ గానము మహాద్భుతిఁ జేయఁగ ద్వారకాపురిన్
బావనయాదవప్రకరభవ్యముఁ జేరెను వేడ్క పైకొనన్. ౨౩ 1044

చ. అనిశము పౌండ్రకుండు హరి నాత్మఁ దలంచుచు దానఁ గర్మబం
ధనములు నాశమొందఁగను దామరసాక్షుని రూపమున్ ధరిం
చినయొక కారణమ్మునను జెచ్చెఱఁ దన్మయతం గనెన్ మహీ
శనికరవర్య! కాశికను క్ష్మాపతిదై తగుద్వారమం దొగిన్. ౨౪ 1045

చ. నరపతిమస్తకంబు పడినం గని యేమిది యంచు విభ్రమం
బురుగతిఁ గాంచి కుండలము లొప్పుట నెవ్వరి మోమొ యంచు నీ
శిరమిట వ్రాలఁ గారణము చెప్పఁగఁ దోఁప దటంచు సంశయా
తురులయి; రంత వారలకుఁ దోఁచెను భూపతిదే యటంచు చెదన్. ౨౫ 1046

చ. క్షితిపతిమస్తకంబె యని చిత్తములం దగ నిశ్చయింపఁగా
నతని సతీమణుల్ తనయు లాప్తులు బాంధవు లెల్లపౌరులున్
హతుఁడగు రాజుఁగాంచి యిటులైతివె యోయవనీశ! నాథ! యం
చతిశయదుఃఖవేగమున నందఱు నేడ్చిరి దీనులై కడున్. 1047

ఉ. భూపతనూజులందుఁ గడుఁబూజ్యుఁడు శూరుఁడు నౌసుదక్షిణుం
డోపికమీఱఁ దండ్రికిఁ దిలోదకముల్ విధిమీఱ నిచ్చి నే
నీపితఁ జంపినట్టి రిపునే త్తెఱఁ జంపి పితౄణ మీఁగెదన్
నాపరితాప మంతట వినాశమునొందు నటంచు నెన్నుచున్. ౨౭ 1048

చ. జతనము నిశ్చయించుకొని సత్వరమే సపురోహితుండునై
వితతము పావనంబు విధివిశ్రుతమై తగుధ్యానయోగసం
గతిని మహేశ్వరున్ శివుని గామహరున్ హరుఁ బూజచేసి సం
తతమగు నిష్ఠనుండెఁ; దనతండ్రిని జంపినవానిఁ జంపఁగన్. ౨౮ 1049

చ. వర మడుగంగఁ బూనె; భగవంతుఁడు రుద్రుఁడు ప్రీతుఁడై నిరం
తరజపనిష్ఠనున్న నృపనాథతనూజుని మ్రోలఁదోఁచి య
వ్వరమిటు లిచ్చె భక్తవర! వారక సద్ద్విజసంఘయుక్తి న
ధ్వరమొకఁ డాభిచారిక విధానమునం బొనరింపు మిత్తఱిన్. ౨౯ 1050

సీ. ఋత్విజుల్ విధివిచారించి దక్షిణ హుతవహునందు వేల్వఁగాఁ బంపు మట్టు
లగ్ని నారాధింప నాతఁడు ప్రమథులఁ గలిసియే తెంచు సంకల్ప మిద్ది
యరిది యబ్రహ్మణ్యునందుఁ బ్రయుక్తమై సాధింపఁగల్గు నీసరణి ననుచు
బ్రహ్మణ్యునం దిదే వరుసఁ బ్రయుక్తమే యైనఁ గర్తను జంపు ననెడుభావ

తే. మంతరస్థంబు గాఁ దగునట్లు పలికి
హరుఁ డదృశ్యుఁడు కాఁగ నాయర్థ మెఱుఁగ
కతఁడు దుర్బుద్ధి గావున హరికి ద్రోహ
మొనరుపం బూనె నేమగు నని యెఱుఁగక. ౩౦ 1051

చ. క్రతువున నందు మూర్తిఁగొని క్రౌర్యము కన్పడఁ గుండమందు నా
హుతవహుఁ డట్టె తోఁచెను; మహోగ్రములై పరితప్తతామ్రవ
ర్ణతఁదగు శ్మశ్రుకేశములు రాజిల నిప్పులఁ గ్రక్కు నేత్రముల్
వితతములై కనంబడఁగ భీషణదంష్ట్రలు నట్టిభ్రూకుటుల్. ౩౨ 1052

చ. కనుఁగొన భీతిదంబయి ముఖం బమరన్ దననాల్క నాకుకొం
చును దగు సృక్కిణీద్వయముఁ జొక్కుచు వస్త్రవిహీనుఁడై కఠో
రనిశితభీతికృద్రుచి విరాజితమైన త్రిశూలముం గరం
బునఁ గొని త్రిప్పుచున్ వెడలె భూతము లెల్లను బాఱునట్లుగన్. ౩౩ 1053

క. తాళద్రుమములరీతిగఁ, గాళులు తగియుండ భూమి గ్రక్కదలంగా
నోలి దిశల్ దహియించెడు, పోలికఁ జూచుచును దన్ను భూతప్రమథుల్. ౩౪

క. పరివేష్టింపఁగ ద్వారక, కరిగెను వడి; నాభిచారికాగ్నియుఁ బురిపై
కరుదెంచు టెఱిఁగి పౌరులు, పరమార్తిని బొంది రదియె ప్రళయం బనుచున్.

చ. వనము దహించునగ్నిఁ గని బల్విడిఁ బాఱుమృగంబులట్టు లా
జనులు వడంకఁ జొచ్చిరి; వెసం జని వారు సభాస్థలంబునన్
వనరుహనేత్రుఁ డక్షముల వాంఛలుపైకొన నాడుచుండఁగాఁ
గని త్రిజగత్పతీ! కరుణఁ గావుము కావుము వహ్నిభీతులన్. ౩౫ 1056

శ్రీహరిచక్రము కాశీపురిం గాల్చుట.

క. పురిఁగాల్చు నగ్ని యియ్యదె, యరుదెంచెడు ననుచు మొఱ్ఱోలడలుచుఁ బెట్టన్
బరికించి వారిదైన్యము, పరికంపించుటయు భీతిఁ బడలువడుటయున్. ౩౬

చ. పకపక నవ్వి యెల్లరకుఁ బ్రాణభయంబును ద్రోచి కాచుశ

త్తి కలుగు వాఁడు తానెయయి । దీనులపాలిటి కల్పభూజమై
సకల జగద్విభుండనుచు । సాధునుతిం గనువాఁడు కాన నిం
చుక యెఱుఁగంగఁ జాలని య।శుద్ధమనస్కుల వారిఁ గాంచుచున్. ౩౭ 1058

తే. భీతి మానుఁడు రక్షింతు । నీతఁటి మిము
ననియె సర్వమునందుఁ దా । నాత్మరూపుఁ
డగుచు లోపల వెలుపల । నలరి సాక్షి
యగుచు నుండుమహాత్మకుం । డగుట నపుడు. ౩౮ 1059

తే. అది మహేశ్వరు కృత్యయం । చరసి దానిఁ
బాఱఁగాఁ దోలి త్రుంపంగఁ । బ్రక్కనఁ దగు
చక్రమున కాజ్ఞ చేసె నవ్యక్తవిక్ర
మమునఁ దగి రవికోటితేజములఁ గ్రాలి. ౩౯ 1060

క. ప్రళయానలు చందంబున, వెలుఁగుచు నాచక్ర మాత్మ।విస్తృతతేజం
బుల దిక్కుల భూమ్యంబర,ముల నింపుచు వచ్చి యగ్నిఁ । బోల నడంచెన్.

సీ. ఇట్టు లాకృత్యాగ్ని । యీశ్వరుచక్రతేజమునఁ దూలుచు వేగ।మ మరలి చని
కాశికిం బోయి యక్కడ నున్న యాసుదక్షిణుని బుత్విజులను । గెరలి యాభి
చారికహోమము । జరపిరిగా యను కోపంబునం గాల్చి । కోర్కికిఁ దగి
నట్లుపోయెను; జక్ర । మావెంటనే పోయి కాశిఁ బ్రవేశించి । కమ్రగేహ

తే. ములను నట్టళ్ల సభల నం।గళుల గోపు
రములఁ గోశములను గజా।శ్వముల శాల
లను రథాలయముల భుక్తి।లకును దగిన
శాలలం గాల్చెఁ దేజ మా।భీలతఁగన. ౪౧ 1062

మ. హరిచక్రంబు సుదర్శనం బిటులు శౌ।ర్యంబొప్ప వారాణసీ
పురముం గాలిచి యెట్టికార్యమయినం । బూన్కిన్ విలాసంబుగాఁ
బరిపూర్ణక్రమ మొప్పఁ జేయుహరిదా । పార్శ్వంబునం జేరె; ని
ష్కరణిం బొల్చిన చారుకీర్తిగల యా।కంజాక్షు చారిత్రమున్. ౪౨ 1063

క. మనుజుం డెవ్వఁడు వినిపిం,చునొ యెవ్వఁడు చిత్తమెంతొ।శుద్ధముగాఁగన్
వినునో యతండు ఘనపా,ప నికర నిర్ముక్తుఁ డగును । బరమాత్మ కృపన్. ౪౩

అఱువదియేడవయధ్యాయము.

ద్వివిదుఁడనువానరుని రాముఁడు వధించుట.

చ. అని హరిచిత్రగాథల మహర్షి వచింపఁగ నాపరీక్షితుం
డనియెను యోగివర్య! పరమాద్భుతకర్ముఁ డనంతుఁ డింతయా

నని యెఱుఁగంగ రాని దగునట్టి మహత్త్వముగన్న మేటి లో
కనిచయసత్ప్రభుండు నయిక్రాలెడు నాబలదేవుఁ డీధరన్. ౧ 1065

క. ఏమేమి కృత్యతతిఁ దా, నేమెయి నొనరించె మఱియు నిది వినఁగా నా
దౌమదిఁ గోరెడు నన విని, యామౌనివతంసుఁ డిట్టు లనియెం బ్రీతిన్. ౧

మ. ధరణీశా! నరకాసురేంద్రునకు మిత్రంబై చెలంగన్ వనే
చరుఁ డొక్కండు ప్రతాపశాలి యతఁ డాసప్తాశ్వపుత్త్రప్రియుం
డురుకాయుండును మైందుసోదరుఁడు నై యొప్పారుఁజుమ్మాతఁ డు
ర్వరఁ బేరన్ ద్వివిదుండు నాఁ బరఁగు స్ఫారక్రోధుఁ డౌనారయన్ ౨ 1067

క. తనమిత్త్రు నరకుఁ జంపిన, ఘనవైరముఁ దీర్చుకొనఁగ గాంక్షించి తగన్
జనపదములకున్ విప్లవ,మును గూర్చుచుఁ దిరుగుఁ గ్రామములనగరములన్.

సీ. మఱియు ఘోషంబుల మానవిపగచేత నగ్ని నొసంగి భస్మాకృతులుగ
నొనరించుచున్ మఱి యొక్కచోఁ బర్వతములను బెకల్చి చేతుల ధరించి
వానిచే దేశాళిఁ బాడుగఁజేయుచు వైరుల నుఱుమాడు వాసుదేవుఁ
డాది దేవుం డుండునట్టి యానర్తకజనపదముల నెల్లఁ గనికరంబు

తే. సుంతయే లేక భస్మమై యంత మొందు
నట్టులొనరిచె; వనచరుఁ డాతఁ డొక్క
సమయమున సాగరాంతరస్థలి వసించి
కరయుగంబునఁ దద్వారిఁ గైకొనివెస. ౮౪ 1069

క. శతదశకరిబలమొప్పుట, కతనన్ వేలాంతికమునఁ గనఁబడుదేశ
ప్రతతిని ముంచె మునీశ్వర, తతి యుండం దగినపర్ణధామములందున్. ౫1070

చ. అలరెడు భూరివృక్షముల నగ్ని దహించెను భస్మమట్లుగాఁ
బొలిసెను వృక్షరాజములు పూజ్యతమాహవనీయముఖ్యులా
జ్వాలనుల మూత్రమున్ మల మసాధుమతిన్ గదియించి యధ్వరం
బులకు ననర్హమౌగతిని బూని యొనర్చెను సంతసించుచున్. ౬ 1071

సీ. కడుఁ గ్రొవ్వి యాకీశకాంతుఁడు పురుషుల వనితలం గైకొని వచ్చి పర్వ
తద్రోణులందుఁ గందరములయందును వైచి తుమ్మెద పువ్వుభంగి వారి
శృంగంబులం దెచ్చి యొసఁగు వేడుకఁ గప్పిపుచ్చు; నీవిధమున హెచ్చుచున్న
కావరంబున దేశగణముల కపకారమును జేయుచున్ గులవనజనేత్ర

తే. లను బ్రతారించుచున్ శీలమునకు భంగ
మును గలుగఁజేయుచున్ స్వేచ్ఛగను దిరుగుచు
రైవతక పర్వతంబునఁ బావనమగు
మధురగీతంబు విని పోయి మఱియు వినఁగ. ౭ 1072

ఉ. అందును బద్మమాలికల । నాదృతిఁ దాలిచి యంగసంతతుల్
విందును గూర్ప నందమునఁ । బృథ్విపయిన్ దగియుండ నౌ నిదే
చందముగా నటంచు బలుసారులు తెల్పుచునుండఁ గామినీ
బృందము చుట్టుచేరి కడువింతగఁ గొల్వఁగ నొప్పు రామునిన్. ౯ 1073

చ. కనుఁగొనియెన్ బలుండు సుర । గాఢముదంబునఁ ద్రావి తన్మదం
బునఁ గనుజంట యొక్కగతిఁ । బొల్పెసఁగం దనుకాంతి యెంతయుం
గనఁదగియుండ గీతములఁ । గాంతగళధ్వని యొప్పఁ బాడుచున్
వనితలలోన మత్తకరివల్లభు పోలిక నుండె హాయిగన్. ౧౦ 1074

ఉ. అత్తఱి దుష్టవానరుఁ డహంకృతిమీఱఁగ భూరుహంపు శా
ఖోత్తమ మెక్కి యందుఁగల । యుగ్రమహీజములం గదల్చుచున్
జిత్తము పల్లవింపఁ దనచేష్టలు కన్పడ మేనుఁ జూపుచున్
బిత్తరు లద్భుతంపడఁగ । వింతగ నార్చుచు నుండెనంతటన్. ౧౧ 1075

చ. కిలకిలయంచుఁ గూయు నలకీశగళస్వనముల్ వినంబడన్
ఖలుఁడగు వాని ధార్ష్ట్యమును । గన్గొని తత్సతు లాత్మజాతిచా
పలమును బట్టి హాస్యరసభాషణముల్ మిగులం బ్రియంబులై
చెలఁగుట నవ్వి రంద ఱొగిఁ । జేరినకోఁతిని గాంచు చెంతయున్. ౧౨ 1076

సీ. ద్వివిదుండు రాము సతీరత్నసంతతిఁ గనుచు భ్రూభంగముల్ । కనఁబఱచుచు
నెదురుగావచ్చి పండ్లిగిలించుచున్ రాముఁ డట్టెచూచుచునుండ । నాత్మ దేవ
మార్గముఁ జూపుచు । మఱియు నిట్లేయెన్నొ దుశ్చేష్టలంజూపఁ । దోడనె బల
రాముండు సంప్రహార్తలలోన మేటియాటను వానిమీఁద నిం । తనఁగరాని

ఆ. కోపమూని ఱాతిఁగొని యేసె; నాకపి, దానిఁ దగులకుండఁ । గా నదెట్టొ
మెలఁగి రాముమద్యకలశంబుఁ గొనిపోయి, యతని కెంతొ కోప । మంకురింప.

క. తిరుగుచు నవ్వుచు నవమతిఁ, బరిపరి సమకూర్చె; నంత । వానరుఁ డెంతో
బరవసమునఁ దత్కలశముఁ, బరువడి విఱుగంగఁ గొట్టి । పంతముమీఱన్. ౧౩

క. చెలువలు కట్టినవస్త్రంబుల బలిమిన్ లాగి రామమూర్తిని దనదో
ర్బలమున లెక్కింపక మద, మొలయుట బలశాలియనుచు । నూహింపకయే ౧౪

క. ఎంతయు నవమతిఁ గూర్చెను, జింతింపఁడు వాఁడు మృతియు । సిద్ధింపఁగ వే
చెంతకు రాఁగా రాముం, డంతట నవ్వాని యవినయంబుం గనుచున్. ౧౫

చ. అతఁ డొనరింప దేశములకైన యుపద్రవ మాత్మ నెంచి దు
ర్మతియగు వైరి నాతనిని । మానక చంపఁ దలంచి యట్టె యు
ద్ధతుఁడయి వైరిఁజంపఁగ నితాంతము శక్తిగలట్టిదౌ హలం
బతిజవ మొప్పఁ గైకొనియె । నాముసలంబు నవార్యసారమున్. ౧౬ 1080

మ. ద్వివిదుండుం గురుబాహుసారుఁ డగుటం ♦ వే వృక్షశాఖం బలం
బవలంబించి తటాలునం బెఱికి హస్తాగ్రంబునం దాల్చి వీ
రవతంసుండగు రాము మూర్కొని యవార్యస్ఫార శౌర్యంబునం
బవి నా నొప్పెడు దాని మూర్ధ మడలం ♦ వైచెం మహాహుంకృతిన్. ౧౭౪

చ. బలుఁడును మూర్ధమందు ఘనపర్వతమట్లుగ వ్రాలుచున్న యా
బలువిటపంబుఁ గైకొనియె ♦ బాహుబలంబలరార నంత ని
మ్ముల ముసలాయుధంబుఁగొని ♦ పోల నడంచెను దాన వానిదౌ
తల పగులంగ శోణితపుధారలు కాలఁగఁ జొచ్చె నయ్యెడన్. ౧౮౪ 1032

క. గైరికముఖ ధాతువులం, సారత్నాధరము వెల్గు ♦ చందంబుననే
యారయఁ గనఁబడె నతఁడుం, బౌరుషమున దాని సుంత ♦ పాటింప కనిన్.

క. ఘనవృక్ష మొండు పెకలించి నిఖలపత్త్రములు రాలఁ జేసి మహౌజ
స్సున సంక్రుద్ధుండై వైచెను రామునిమీఁద; నతఁడు ♦ శీఘ్రమ దానిన్. ౨౦

క. శతధాభిన్నాంగంబై, క్షితిఁ బడఁగాఁ జేసె వాఁడు ♦ చెట్టొక్కండు
ద్ధతి లాగి దాన రాముని, హతుఁడవు కమ్మనుచుఁ గొట్టె ♦ నతఁ డద్దానిన్. ౨౦౪

క. ఒనరించె నూఱుతునుకలు,గను వాఁ డారాముతోడఁ ♦ గలహమ్ము బలిమిం
బొనరించుచు వృక్షంబులఁ, గొని వచ్చుచుఁ బోరిపోరి ♦ ఘోరతరముగన్. ౨౧

సీ. అవియెల్లఁ దునిసి పోవ వనాంతరములకు నరిగి వానిం దెచ్చి ♦ యవియుఁ దునియ
మఱియు మానక పోయి ♦ మ్రాఁకులఁ దెచ్చుచు నివ్విధి వనమెల్ల ♦ వృక్షహీన
మగునట్లు లొనరించె ♦ నంతఁ బోవక కపి బలదేవుపయి సీర్ష్య ♦ కలిగి యశ్మ
వర్షంబు గురియించె ♦ బలభద్రుఁ డద్దాని ముసలాయుధమ్మును ♦ బూని లీల

తే. మెయి నివారించె; నవ్వల మేటికపియుఁ, దాళసంకాశము లగునుద్దామబాహు
వులను ముష్టిగ నమరించి ♦ బలుని జేరి, పొడిచె నవ్వానిచేఁ గ్రుధఁ ♦ బూని యంత

చ. యదుతిలకుండు నాహలము ♦ నమ్ముసలంబును గ్రిందవైచి దు
ర్మదుఁ గపి బాహుయుగ్మమున ♦ మర్దనశక్తి చెలంగఁ బట్టుకొం
చుదిత మహాగ్రహంబున మహోద్యమ మొప్పఁగ జత్రుదేశమం
దది మెను దాన వాఁడు ధర ♦ నప్పుడె కూలెను నల్లఁ గ్రక్కుచున్. ౨౫ 1088

క. ధరణీధర మత్తఱిఁ దరు,వరములతో జలములున్న ♦ భాగంబులతోఁ
బరికంపించెను గాలి వి,సరిన జలమందు నౌకచాడ్పున నధిపా!. ౨౬ 1089

చ. సురలును సిద్ధమౌనులును ♦ జొక్కపు వేడ్క వియత్తునుండి 'యీ
శ్వర! జయ' 'యంచు భద్రకరవందన సంతతి' యంచు 'మేలు మే
ల్వరహారణా' యటంచు బహుభంగులఁ బల్కుచుఁ బుష్పవర్షముం
గురిసిరి; రాముఁ డాద్వివిదుఁ ♦ గూలిచె నీవిధి సత్త్వసంపదన్. ౨౭౪ 1090

తే. జగములకు నెల్లఁ బీడలఁ ౹ జాలఁగూర్చు, కఫిని సుగ్గాడి ప్రజలు ని౹కామ మెలమిఁ
దన్ను వినుతింపఁ జేరెను౹ద్వారకాపు,రమును గాంతలు మనసుల౹బ్రమదమంద.

అ ఱు వ దె ని మి ద వ య ధ్యా య ము.

రాముఁడు హాస్తినగరమును గంగలోఁ ద్రోయఁబూనుట.

చ. బలుని చరిత్ర మీపగిదిఁ ౹ బల్కి శుకుం డనునిట్లు ధార్తరా
ష్ట్రులు గలరేకదా! సిరుల౹శోభిలు వారలయందు జ్యేష్ఠుఁడై
వెలసె సుయోధనుం డతఁడు ౹ భీరువులందును రత్నమౌసుతన్
లలితగుణాన్వితం గనియె ౹ లక్ష్మణ యందురు తత్కుమారికన్. ౪ 1092

క. జాంబవతీ తనయుండగు, సాంబుండు స్వయంవరమునఁ ౹ జక్కనలరు నా
బింబోష్ఠి బలిమిఁగైకొని,యెం బల్వురు రాజులుండ ౹ నెంతో మగటిమిన్. ౧

ఉ. కౌరవు లెంతొ క్రుద్ధులయి ౹ గర్వముమీఱఁగ నర్భకుండు వీఁ
డౌర! యకామయౌ సుదతి ౹ నస్మదుదారమహత్త్వ మెన్నకే
పౌరుషమూని బల్మిఁగొనెఁ ౹ బట్టి చెఱన్ వెసనుంపుఁ డీతనిన్
గారవమే యెఱుంగని వి౹కారపువర్తను మత్తు నిత్తఱిన్ ౨ 1094

ఆ. ఏమిచేయఁ గలరు ౹ వృష్ణులెల్లను గూడి, విక్రమంబు పేర్మి ౹ విమతనృపుల
నడఁచి సేకరించి ౹ యభివృద్ధిఁగావించి, మన మొసంగినట్టి ౹ మహిని వీరు ౨౪

తే. అనుభవించుచు నున్నవా ౹ రంతెకాదె?
ధరణి నాయకు లగుదురా ౹ దర్పమొప్ప;
నని యొనర్పఁ గలారె; పుత్రు నిటు లేచి
మనము బంధించియుంచితి ౹ మనియెఱింగి. ౩ 1096

క. ఆయాదవు లిప్పటికిన్, వే యరుదేరంగ దర్ప౹వృత్తి నుడిపి మ
మ్మీయెడఁ గాపాడుండని, పాయక ప్రార్థించుసట్లు ౹ బవరం బందున్. ౩౪ 1097

సీ. మనవిక్రమంబును ౹ గనఁబఱుతము వార లంతఁ బ్రాణాయామ ౹ మాదియైన
యోగమార్గముల నెం౹తో యత్నమును జేసి యడఁపఁగాబడు నవ౹యవము లట్లు
విక్రమశూన్యులై ౹ వెఱఁగంది పోదురుగాక! యంచును శ౹ల్యకర్ణులు మఱి
భూరిశ్రవుండును ౹ నారీతిగా యజ్ఞకేతుదుర్యోధనుల్ ౹ కెరలి సాంబు

ఆ. వృద్ధు లనుమతింప ౹ వెసఁగట్టి వేయంగ, బూని రిట్లు గట్టి ౹ భూపతనయు
లెల్ల వెంటనంటి ౹ యేతేఱఁగని మహా, రథుఁడు సాంబుఁ డపు డశ౹రాతు లడల,

చ. మనమున సమ్ముదం బొలయు౹మాడ్కి జయంబు నొసంగు కార్ముకం
బును గ్రహియించి యొక్కరుఁడె ౹ పూనిక సింహామువోలె నిల్చె; నా
తనివెసఁ గట్టివేయఁగ ని౹తాంతము కోరుచు నెందుఁబోయె దిం

క నిలువు మం చదల్చును గార్ముకధారులలోన మేటులై. ౯౯ 1099

చ. పొలిచెడు యోధు లర్కసుతు మున్నిడుకొంచును జెంతకేగి తూ
పుల జడివానయట్లు హరిపుత్రునిపైఁ గురియించి; రాతఁడుం
బెలుచన వారిచేత నపవిద్ధుఁడునయ్యు నచింత్యుఁడైన యా
జలరుహనేత్రపుత్త్రుఁడయి శౌర్యధనుండయి యొప్పియుండుటన్. ౧౦౦ 1100

తే. అల్పమృగసంతతులచేత నావరింపఁ
బడిన పంచాననం బట్లు వారిశౌర్య
మోర్వఁ డయ్యె నించుకయే; మహోగ్రమూర్తి
యగుచు భూరిశరాసనం బంది యపుడు. ౧

క. ఎక్కిడి కర్ణప్రముఖుల, నక్కౌరవవీరవరుల నార్వురఁగని యం
దొక్కొక్కరి పట్టరముల, నొక్కగతిం గాఁడనేసి యురుశక్తితగన్. ౨

సీ. నాలుగుతూపుల లీలగా వారల ఘోటకంబులనేసి క్రూరబాణ
మున సారథులనొంచి ఘనశరంబున రథికులనువేర్వేఱుగాఁ గుదియవైచెఁ;
గర్ణాదులగు రథికప్రవరులు సాంబుఁ డొనరించినట్టి యాయురుతరకృతిఁ
గొనియాడి; రంతటఁ గోపంబు దీపింప వారిలో నల్వురు వానివాహ

తే. నముల నాల్గింటినిం గూల్చిరి మఱియొకఁడు
కూలఁగానేసె సారథిఁ జాలవేగ
ముగ మఱొక్కఁడు కోదండమును విఱుగఁగఁ
జేసె; నీరీతి విరథునిఁజేసి వారు. ౧౦౩ 1103

క. ఆతనిఁ దమకన్నియనుం, జేతో మోదంబుమీఱఁ జేకొని జయవి
ఖ్యాతిం బ్రకటించుచుఁ బురి, కాతతవాద్యస్వనంబు లలరఁ జని రొగిన్. ౧౨

చ. సురముని నారదుండు యదుశూరులఁ గానఁగనేగి హస్తిపూ
ర్వరమున సాగినట్టి యలవార్తను దెల్పఁగ యాదవుల్ మహా
త్తరరుడుదగ్రులై నృపవతంసుఁ డనం జను నుగ్రసేనుఁడుం
బురికొలుపంగఁ గౌరవుల ప్రోలికి నెత్తిచనంగఁ గోరుచున్. ౧౩ 1105

మ. జతనంబుల్ కడుఁ బూన్కిఁ జేయ మది నాచందంబుఁ జింతించుచుం
శతపత్త్రేక్షణపూర్వజుండు హలి యాజన్యంబు మాన్పింపఁగా
మతి నూహించి యదుప్రవీరకుల సన్మానంబునం గాంచి యా
జతనంబుం నిలుపంగఁజాలినవిధిం శాంతంబుఁ గల్గించుచున్. ౧౩౪ 1106

*క. కురుయదుకులజనితుల కి, త్తరుణంబున సంగరంబు తగదని దానం
బరమార్థి గల్గునని బీ,కరకలిమలనాశకుండు గావునఁ దెల్పెన్. ౧౮ 1107

* "నేచ్ఛత్కురూణాం వృష్ణీనాం కలిం కలిమలాపహః" అని మూలము.

చ. దినపతిభంగిఁ బ్రజ్వరిలు ఽ దివ్యరథంబునఁ గూరుచుండి వి
ప్రనికరవంశవృద్ధతతి ఽ రంజిలుచుం దనచుట్టునుండఁ బో
యెను గ్రహాయుక్తచంద్రుక్రియ ఽ నెంతయు నొప్పుచు హాస్తినాఖ్యప
త్తనమున; కిట్లు రాముఁడు మహాతంగజపత్తనసీమఁ జేరి తాన్. ౧౪ 1108

క. వెలుపలఁదగు నుపవనమున, నిలిచెన్; ధృతరాష్ట్రుకడకు ఽ నిజభావం బి
మ్ములఁ దెల్ప నుద్ధవుని శీ,తలమానసుఁ బంపెఁ; జనె నహతండును బ్రీతిన్. ౧౫

చ. చని యట నాంబికేయునకు ఽ శంతనసూనున కఖ్లశస్త్ర వి
ద్యను గ్రహియించువారలను ఽ దానె గురుం డనుఖ్యాతినొంది యొ
ప్పినయల ద్రోణనామునకు ఽ భీమబలుండయి బాహ్లికాహ్వయం
బునఁదగు వీరవర్యునకు ఽ మ్రొక్కి యథార్థముగా సుబోధనున్. ౧౬ 1110

ఆ. గారవించి మ్రొక్కి ఽ శ్రీరాముఁ డేతెంచి
యుపవనంబునందు ఽ నున్న వార్తఁ
దెలిపె; వారు రాముఁ ఽ డఖిలగుణాఢ్యుండు
సుహృదయుండు వచ్చె ఽ శుభము లెసఁగ. ౧౭ 1111

చ. అని తలపోయుచుం జని మహార్హపదార్థము లెల్లఁగొంచు రా
ముని కడఁజేరి భక్తిమెయిఁ ఽ బూజలఁ దన్పిరి; శాస్త్రరీతి గో
వు నొసఁగి యర్ఘ్యమిచ్చి రటఁబోయిన వారలలోన రోహిణీ
తనయుమహత్త్వముం దెలిసి ఽ ధన్యులు గాఁదగువార లాదృతిన్. ౧౮ 1112

చ. శిరములు తత్పదాబ్జములఁ ఽ జేరఁగ వందన మాచరించి; రా
మురరిపుసోదరుండు తమిహపొంగఁగ బంధువు లెల్లభద్రముల్
పొరిఁబొరిఁ గాంచువారె రుజఁబూనరుగా యని ప్రశ్న చేసి యా
దరమున వార లుత్తరము ఽ తత్పరతం దెలుపంగ నెమ్మదిన్. ౧౯ 1113

తే. సంతసించుచువారు ప్రశ్నము నొనర్ప
బంధుకుశలంబుఁ జెప్పె; నిప్పగిది గొంత
కాలముం బుచ్చి రాముండు ఽ గౌరవంబు
వెలయుమాటలఁ దెల్పె వారలకు నిట్లు. ౨౦ 1114

మ. నరనాథోత్తముఁ డుగ్రసేనుఁ డిపు డీనామాటగా మీకు ని
క్కరణిన్ దెల్పెడుఁ దాఁ బ్రభుండగుట నాజ్ఞాగ్రం బింతయుంగాక శాం
తిరతిం బొల్చెడుబుద్ధు లొప్ప విని యాహతిరొప్పఁగాఁ జేయుఁడీ
త్వరఁ బూనుం డిది జాగు చేయఁదగ దెబ్బంగిన్ విచారించినన్. ౨౧ 1115

క. పెక్కండ్రు గూడి క్షత్రియుఁ, డక్కజముగఁ జేయఁదగినహయల ధర్మమ్ముం
జక్క నొనర్చిన పాంబుని, నొక్కని ధర్మేతరముగ ఽ నొప్పపథమునన్. ౨౨

సీ. ఓడించి బంధించు।టొప్పునే దానిని బంధుజనైక్యంబు। పరమ మనుచు
భావించి యోర్చితి। వచ్చితి మీకిద్ది తెలుపంగ నంచని। హలధరుండు
స్వబలవీర్యోదగ్ర। శౌర్యంబులకుఁ దగినట్లుగ శక్తి క।ర్హమగునట్లు
పలుకఁగా విని కౌర।వులు చాలఁ గుపితులై పలికిరి; ట్లౌరౌర!। కలదె యిట్టి

తే. దెందు నేని విచిత్ర మి।ట్టిదియుఁ గలదె
దాఁట రానట్టి కాలగ।తంబు చేత
వింత లిట్టివి గల్గెడు। వేయు నేల?
తలఁచినం జిత్రమయ్యెడుఁ। బలుకు లివ్వి. ౨౩౪ 1117

ఉ. చారుకిరీటసేవితము। సాధుతరంబగు నుత్తమాంగముం
గోరుచు నున్న వెక్కుటకుఁ। గొంకక పాదుక లద్దిరే! యదూ
ద్ధారున కల్లనాఁడు పృథఁ। దారెటులో మనవార లిచ్చి పెం
పారఁగఁ బెండ్లి సేసిరి; తొ।దాదిగఁ జుట్టములై యథేచ్ఛమున్. ౨౮౪ 1118

క. మనతోడ భుజించుచు నా,సనశయ్యలఁ బొత్తుకలిసి। త్మాపతు లక్లే
మన మిచ్చినరాజ్యముఁ గై,కొని తుల్యతఁగాంచి రిదియొ।కో హేతు వనన్. ౨౯

సీ. చామరవ్యజనముల్।శంఖముల్ శ్వేతాతపత్రముల్ ముకుటముల్।భవ్యములగు
నాసనంబులును శ।య్యలు స్వేచ్ఛమీఱఁగాఁ గైకొనిమనయు పే।క్షనుముదమున
ననుభవింతురు వీరు;। యదువుల కిఁక రాజచిహ్నముల్ చాలు ని।చ్చినమన కవి
ప్రతికూలములె యయ్యెఁ। బాముల కమృతంబుఁ బోసినరీతి; వి।భూతు లివ్వి

ఆ. మనయనుగ్రహమునఁ। గనిన యాదవు లిప్డు, హ్రీవివర్జితులయి।యీమనలనె
యాజ్ఞఁ దప్పకుండ। నాచరింపుఁ డటంచు, శాసనంబు చేయఁ। జాలినారు. ౨౭

క. ఇదియేమి చిత్రమోతలఁ, పఁ దరం బెవ్విధిని గాదు। పద్మదళాక్షిన్
సుదతిని లక్ష్మణఁ గైకొను, మిదె యని భీష్ముండు, ద్రోణుఁ। డింద్రసుతుండున్.

చ. కురుకులజుల్ మఱెవ్వరును।గోరి యొసంగని కన్నె మిన్నఁ; గే
సరి తొలుతం గ్రసించినది। శౌర్యధనం బని యెన్నఁజాల కా
యురణము సంగ్రహించునటు। లుద్ధతి సాంబుఁడు కైకొనెన్; సురే
శ్వరుఁడును దాను గైకొనఁగ। జాలు రవంతయు భీతినొందకే. ౨౮ 1122

చ. అనియిటు జన్మబంధువుల। దౌబలిమిన్ సిరి పెంపునన్ మదం
బనిశము హెచ్చఁ గన్నెఱుఁగ।నట్టి యసభ్యులుగాన వారు రా
ముని ననరానిమాటలను। బూజ్యుఁ డటంచుఁ దలంప కెంతయున్
మనమున నాగ్రహం బొలయ।మాడ్కిని బల్కి పురంబుఁ జేరఁగన్. ౨౯ 1123

మ. కురువంశోద్భవు లిట్లు పల్కి చనఁ ద।త్క్షోణీశదౌశ్శీల్యమున్
గరువంబున్ స్మృతిగోచరం బగునటుల్। గావించు తుచ్ఛోక్తులన్

షరిగాఁ దా విని క్రోధవేగమునఁ గృష్ణ జ్యేష్ఠుఁ డింతేఁ గనం
దర మెబ్బంగిని గాక పల్మఱును వింతల్ దెల్పు నవ్వొప్పఁగన్. ౩౦ 1124

*తే. పెక్కు తెఱఁగుల గరువంబు పేర్మి నొప్పు
తులువ లింతయు శాంతిని గలుగవలయు
నని తలంపరు పశువులకును లగుడము
వలెనె దండంబు తగినదౌ వారల కిల. ౩౧ 1125

శా. ఔరా! యాదవులప్డు క్రుద్ధులయి యుద్ధారంభయత్నంబులన్
శూరత్వంబునఁ జేయఁ గ్రుద్ధుఁడయి కృష్ణుం డుండఁగా మెల్లఁగా
నావారిం గతకోపతన్ మెలఁగఁగా యత్నంబు నేఁ జేసి యే
వీరిన్ శాంతిలఁ జేయఁగా నిచటికిన్ వేవచ్చితిన్ బూన్కిమై. ౩౨ 1126

ఉ. వీరలు మందబుద్ధు లవివేకులు కావున సంగరంబునం
గోరికమీఱ వర్తిలుచుఁ గొం కొకయింతయు లేక యున్న వా
రారయలేరు యోగ్యతల నట్లగుటన్ దగవూని శాంతి చే
కూరుప వచ్చినట్టి ననుఁ గుందఁగఁజేసి రహంకృతిం గడున్. ౩౩ 1127

చ. తమదగు సత్త్వముం దెలియఁ దా రసమర్థులె యాట గర్వయు
క్తములగు కూఁతలం బలుకరే గాఁదగి; రింద్రముఖుల్ దిశాపతుల్
తమఁదగు నుగ్రసేనుఁ డిదుశాసనముల్ దలఁదాల్చి యట్టిచం
దమునఁ జరించువారొ యలధన్యుఁడు కాఁడట భూవిభుం డహా!. ౩౪ 1128

సీ. వృష్ణిభోజాంధ కాధీశ్వరుండగు నుగ్రసేనునే దెగడితేమానసమున
నింతయుఁ గొంకకసురనాథుని సుధర్మ మెవఁ డాక్రమించి గ్రహించెనో మఱి
యమరభూరుహమగు నాపారిజాతంబు బలిమిమైఁ దెచ్చి యెవ్వాఁడు స్వేచ్ఛ
ననుభవించుచుఁ బ్రీతినందుచు నున్నాఁడో యలమదనుజుఁడుపద్మాక్షుఁడధిప

ఆ. సింహపీఠమెక్కఁ జెల్లఁడుగా సర్వ, జగదధీశ్వరియయితగిన లక్ష్మి
తానె యాడిగములఁదత్పదాంబుజముల, దన్పుచుండునో సతంబుప్రీతి. ౩౫

క. అలశ్రీనాథుఁడు భూమిప, తులవగు చిహ్నములఁ దాల్చితోఁపఁ దగఁడో కో
జలజాక్షు పాదకమలం,బుల రజమును భక్తిరసముపొంగుచునుండన్. ౩౬

తే. తీర్థములనెల్ల సేవించి సార్థజన్ము
లైన యోగులకున్ దీర్ఘమైన దాని
దిక్పతులు మౌళులందు సంతృప్తిమీఱఁ
దాల్చుచుందురుగద మేము ధన్యుల మని. ౩౭ 1131

* "నూనంనానామదోన్నద్ధాః శాంతిం నేచ్ఛంత్యసాధవః, తేషాంహి ప్రశమోదండః పశూనాంలగుడోయథా" అ. ౩౧. అని మూలము.

సీ. జగదీశుఁడైన యాచక్రి యంశాంశభూతుల మగు నేనును ౹ జలజసూతి
భార్గవీదేవియుఁ ౹ బరమాదరంబున నద్దాని నే దాల్తుమౌదలలను
నట్టివాఁడైన సర్వాధిపుఁడెక్కడ? నరపాలయోగ్యాసనం బదేడ?
దానికి మాహరి ౹ తగఁడఁట! యిస్సిరో; కౌరవుల్ దయయుంచి ౹ క్ష్మాస్థలమునఁ
తే. నొక్కఖండం బొసంగినఁ ౹ జక్కదాని
వృష్ణు లాదృతిఁ గుడుచుచు ౹ నృపులనఁ దగి
యున్నవారఁట మే మెల్ల ౹ నెన్నఁ బావ
లమఁట కౌరవులనఁగ శీర్షములె యంట. ౩౭ 1132

క. సురద్రావి యొడలు తెలియక, శిర సొక్కెడ నిలుపకుంటఁ ౹ జేరి వదరు కా
వరము గలవారిపోలిక, సిరిచే మత్తిల్లి యొడలె ౹ స్థిర మనునూహల్. ౩౮

క. పలుగాకులైన వీరలు, పలికిన యీపరుషవాక్యపటలమ్ముల దు
ష్టులనేచఁ జాలుసత్త్వము, గలవాఁ డెవ్వాఁడు సైచుఁ ౹ గాని మ్మనుచున్. ౩౯

చ. అనియిటు పల్కుచున్ మనమునందు నమర్షము రేఁగ నిప్పుడే
జనపతులందుఁ గౌరవుల ౹ సంజ్ఞయె లేనటు లేనొనర్తునం
చును ద్వరఁబూని దీప్తులను ౹ శోభిలు నాహలమున్ గ్రహించి లో
కనిచయమున్ దహించునటు ౹ క్రన్నన నిల్చెను బూన్కిమీఱఁగన్. ౪౦ 1135

చ. బలమునసాటిలేని హలి ౹ వారణపత్తన మింక గంగలోఁ
గలిపెద నంచుఁ గ్రోధమున ౹ గాఢతరంబుగ నొప్పి భీమమౌ
హలమును వే కదల్చుచుఁ దదగ్రము దక్షిణభాగమందు ని
మ్ములఁదగు సాలమూలమునఁ ౹ బూనికఁ గ్రుచ్చి పెకల్చెఁ జెచ్చెఱన్. ౪౧ 1136

చ. సురనదిలోపలం బడఁగఁ ౹ జోద్యము గల్గఁగలాగె; నంత నా
పురవర మిట్టు లీడ్చుచుఁ బ్రభుత్వము గానఁబడంగఁజేయ శ్రీ
హరివరసోదరుం డొగిఁ బ్రయత్నము చేయుచు నుండఁ దెప్ప యె
క్కరణిని దాఱుమాఱగునొ ౹ గాలికి నట్టులె పత్తనంబుసున్. ౪౨ 1137

శా. గంగాశైవలినీవతంసమున ముగ్నం బోవుచున్నట్టు మ్రొ
గ్గంగాఁ గాంచి కురూత్తముల్ భయమునం ౹ గంపించుచున్ బృథ్వి నిం
కం గొన్నాళ్లు మనం దలంచుచును నిక్కం బీతఁడే దిక్కటం
చుం గాంతాయుతి రాము నే శరణ మంచుం జేరి ప్రార్థించుచున్. ౪౨ 1138

ఉ. అంతట సాంబుతోడ జనులందఱు లక్షణతోడఁ దోడుకొం
చింతనరాని చింతఁగని ౹ యేగి కరంబులు మోడ్చి యోప్రభూ!
యింతటి నీప్రభావముల ౹ నేమెఱుఁగం దగువార మౌదు మే
చింతలఁ బాప నర్హుఁడవు ౹ చిత్రచరిత్రుఁడ వెన్నిచూచినన్. ౪౩ 1139

క. ఓరామ! రామ! యఖిలాధారుండవు గాదె మూర్ఖతల్లజులము మే

మారయ దుర్బుద్ధులము సుమీ రామా! యట్లుగాన మే మిట నీకున్. ౮౩౫

క. ఒనరించితి మపకారం, బును దాని క్షమింపవలయు ముజ్జగములకున్
జనపతివి నీవె సర్గం, బును బాలనముం లయంబు భువనంబులకున్. ౮౮ 1141

క. కలిగింప నీవె హేతువు, జలజాక్షా! యాశ్రయింపఁ జాలినయది యెం
దుల లేదు నీకు; లోకం, బుల కీశ్వరుఁ డవుగ నీవె పాలుతువు దేవా!. ౮౮౫

సీ. క్రీడింప మదిని సక్తింగొను నీకు లోకములెల్లఁ గ్రీడనకములు గాఁగ
మతిమంతు లేకదా నుతియింతు రోయనంతా! నీవె భూలోక మూను వేడ్క
వేయిశిరంబులలో యథార్థంబుగ నొక్కశిరంబున నునిచి యున్న
వాఁడవు, ప్రళయంబు వారక చేకూర జగముల నన్నింటిఁ జక్కలోనఁ

తే. జేర్చుకొని యొక్కరుఁడవె, శేషించి స్వేచ్ఛఁ
బవ్వళింతువు; క్షితిని గాకవంగనిరతి
నూని సత్త్వగుణంబును బూనినట్టి
నీదయిన కోప మది శిక్షకే దలిర్చు. ౮౬ 1143

క. కాదది ద్వేషమువలనం, గాదది మత్సరమువలన ఖలశిక్షణ మా
మోదంబునఁ జేయంగా, శ్రీదయితా! కోప మద్ది చెలఁగుంజుమ్మీ!. ౮౬౫

వ. సర్వభూతాత్మవు. సర్వశక్తిధరుఁడ వవ్యయుండవు. విశ్వకర్మవు. ఇట్టినీకు నమస్కరింతుము. మే మందఱము నీశరణుఁ జొచ్చితిమి. అని పలుకుచుఁ బ్రపన్నులై వడంకుచు దిటవు చెదర శరణుఁజొచ్చి రామునిచిత్తంబు సుప్రసన్నముగా నొనరింప నాతండు భయంపడకుఁడని యభయదానము చేసిన దుర్యోధనుండు కూఁతునకుఁ బ్రీతితోఁ బారిబర్హంబుగా నఱువదివత్సరముల యీడుగల *యేనుఁగుల ద్వాదశసహస్రంబులను, బదివేలతురంగంబులను, షట్సహస్ర సంఖ్యందనరి కనకమయంబులయి భాస్కరవర్చస్సుగలిగినరథంబులను, సువర్ణపతకాంచితగ్రీవలైనదాసికలనుసహస్రసంఖ్య నొసంగి గారవించె. భగవంతుఁడై సాత్వతశ్రేష్ఠుఁ డగుబలరాముఁడు వాని నన్నింటిని బరిగ్రహించి కొడుకుం గోడలిం దోడుకొని సుహృదు లభినందింపఁ బ్రయాణంబుసాగించె. అంతనాహలధరుండు స్వపురంబుఁ బ్రవేశించి యనురక్తచిత్తులగుబంధువులంగూడి పేరోలగంబునఁ గౌరవులయెడఁ దాఁ జేసినకృత్యంబును సమగ్రంబుగా నెఱింగించె. పరీక్షిన్మహీపాలా! నేఁటికి మీపురవర మియ్యది బలదేవపరాక్రమం బిట్టిదని తెలుపుచు దక్షిణభాగంబు గంగానది దిక్కుగాఁబొడవయి యుండుట కనంబడుచున్నదని తెలిపి మఱియు నిట్లనియె. ౫౮ 1145

* "దదౌ ద్వాదశసాహస్ర మయుతాని తురంగమాన్" అని యాంధ్రలిపి. "దదౌ చ ద్వాదశ యుతా న్యయుతాని తురంగమాన్" అని నాగరలిపి.

## అఱువదితొమ్మిదవయధ్యాయము.

శ్రీకృష్ణమహిమము నెఱుంగ నారదుఁడరుదెంచుట.

చ. నరకుని సంహరించి లలనామణులన్ సురవైరి బట్టి కా
ర్యరమున నుంచి యుంట విని వారలనుం బదియాఱువేల నొ
క్కరుఁడె సరోజనేత్రుఁడు తగన్ వరియించె నటన్న వార్త నా
దరమున నాలకించి యది దాఁ గనఁగోరెను నారదుం డెడన్. ౧ 1146

మ. తనలో నారద! పదాఱువేల వరసౌధస్థానరత్నంబులన్
వనితారత్నము లుండఁ గృష్ణుఁడొకఁడే వారిన్ సమారాధ్యసం
హననం బూనియె యొక్కవేళనె వివాహంబయ్యె వేర్వేఱుగా
నన నెంతో మదిఁదోఁచెఁ జిత్రముగ నే నచ్చోటికేగం దగున్. ౨ 1147

మ. అనియూహించి హరిం బరాత్ముఁ గనఁగా యత్నంబుగావించి తాఁ
జనియెన్ ద్వారక; కప్పురంబు స్ఫుటపుష్పస్ఫారతం బొల్చుపా
వన దివ్యోపవనంబులన్ గృహములన్ భాసిల్లుపూఁదోఁటలన్
మన మెంతో సుఖమందనుండెడు గరుత్మత్సంఘముల్ వేడుకన్. ౩ 1148

చ. కలరవముల్ చెలంగఁ దమకమ్రసువాక్కుల నాలకించువా
రలు ప్రమదంబు నొందఁగ నిరంతర మొయ్యనఁ జేయుచుండె; ని
మ్ముల వికసించి నీలరుచిఁ బొల్చుచు నెట్టనికాంతి మించుచున్
గలువలు మించుచుండె సితకాంతిని గొన్నియుఁ జూడఁ జక్కఁగన్. ౪ 1149

చ. అలరుచునుండె నుత్పలము లంబుజముల్ నిబిడంబుగా సర
స్సులఁ గనుపట్టుచుండె; నటఁ జొక్కపు వేడుక సందడింప హం
సలు మఱి సారసంబులును జక్రముఖంబులు సంతతం బొగిన్
బలుకుచు హాయిఁగూర్చుచును బర్వుచునుండెఁ దదంతరంబులన్. ౫ 1150

సీ. స్ఫాటికరాజత ప్రాసాదములు నవనియుతమ్ము లట నింద్రనీలత ప్త
హాటకమయము లౌట్లన్యరత్నాళి వినిర్మితములునయి నెగడు నుపక
రణములు వింతగా రాజిల్లుచుండెను; దీర్చినయట్లు విస్తృతినిమించి
యలరు రథ్యాపథంబులు, చత్వరమ్ములు నంగడుల్ శాలలునల్ల సభలు

తే. కనఁదగినయట్లుగా విభక్తంబు లగుచు
నుండె దేవాలయమ్ములు మెండుగరుచి
రాకృతుల మించుచుండె; మార్గాంగణముల
వీథులందు ద్వారములందు వేడ్క మిగుల. ౬ 1151

క. పరిమళజలములు చల్లియు, సురుచిరముగ ముగ్గులిడియు సొంపుగఁ జూడం
దిరముగ నుండఁగఁ జేయుటఁ, గర మరుదుగఁ బట్టణమది కనఁదగి యుండెన్,

క. మరుదుచ్చలిత పతాకో,త్కరముల ధ్వజరాజిఁ బద్మ ఽ కాంతాతప మె
వ్వరికిని సోఁకకయుండ నొ,నరింపఁబడి యుండెఁ బత్తనంబున నందున్. ౬ 1153

మ. పరమేశుండు వసింప సౌధము కడున్ ఽ భాసిల్లుసద్వస్తువుల్
పరిపూర్ణంబులుగాఁగ నుంపఁబడి దిక్పాలస్తుతిం గాంచు న
ట్లరుదై యొప్పఁగఁ గట్టఁగాఁబడియె నం ఽ దత్యంతసంతోష మే
వరుసన్ హెచ్చుచునుండు దానిఁ గనఁగా ఽ వాంఛించు నవ్వారికిన్. ౬౪ 1154

చ. హరి నలరింపఁ ద్వష్టయను ఽ నయ్యమరేంద్రునిశిల్పి పాండితీ
గరిమను శిల్పమందు మును ఽ గాంచినదానిని జూపఁగోరి మం
దిరమునుదానిఁగట్టె; నట ఽ నీరజనేత్రునిపత్నులుండ సుం
దరదశషట్సహస్ర సదనంబులు సొంపుగ నుండె మానియున్. ౭౪ 1155

తే. అట్టి యంతఃపురమునందుఽహరికళత్ర, మలరు భవనోత్తమముఁ జేరఁఽనరిగె; నద్ది
విపులతమము నతిస్వచ్ఛఽవిద్రుమ విర,చితమహాస్తంభ గణమునఁ ఽ జిత్రతరము.

క. వానికి నాశ్రయములుగా, జానగు వైడూర్యఫలక ఽ సంతతి వెలయం
గా నింద్రనీల జాలక, మానిత కుడ్యములఁ జాల ఽ మందిర మొప్పున్. ౯ 1157

ఉ. భూమిక యింద్రనీలమణి ఽ పూగముతో నలరారుచుండు సు
త్రాముని శిల్పి త్వష్ట తనఽధర్మము దీర్పఁగ మేలుకట్లు ము
క్తామణిదామముల్ తుదలఁ ఽ దద్దయు వ్రేలుచునుండఁ గూర్చె దాం
తామలశయ్యలాసనము ఽ లర్హమణీఖచితంబులై తగన్. ౧౦ 1158

చ. ఒనరిచె నందుఁ గంఠముల ఽ నొప్పుచెలంగఁగ మేలిహాటకం
బున నొనరించు నప్పతకఽపుంజము దాల్చి యమూల్యవస్త్రముల్
మనమునఁ గల్గువేడ్కలను ఽ మంజులరీతిని దెల్పఁదాల్చి రం
భను బరిహాసమున్ సలుపు ఽ భవ్యతమాంగముగల్గు దాసికల్. ౧౦౪ 1159

చ. వెలయుచునుండి రందుఁ; గడు ఽ వింతగఁ గంచుకముల్ ధరించి పా
గలు జతనంబుగాఁ దలలఁ ఽ గ్రాలఁగ మేలగురత్నకుండలం
బులు శ్రుతులందు నొప్పఁగ నఽమూల్యమనోహర వస్త్రముల్ ధరిం
చి లలితవిభ్రమంబులను ఽ జెల్వగుచుండిరి పూరుషుల్ కనన్. ౧౧ 1160

సీ. మణిదీపముల చాలు ఽ గణుతింపఁగారాని యంధకారము మాయు ఽ నట్లొనర్ప
వలభులయందు నెఽమిళులు పర్వెడునట్టి యగురుధూపమ్ముల ఽ వైన పొగలు
జాలవారమునుండి ఽ చాలుగా వెడలంగ ఘనములంచును బుద్ధిఽలను దలంచి
కోరిక గట్టిగాఁ ఽ గూయుచు నర్తన మొనరించుచునుండ నఽదనవర మది

తే. యెంతయును జూడఁజూడంగ వింతగొలుపు
చుండె; నందొక్క సుదతి మహోత్తమగుణ
రుక్మిణి యనంగ విఖ్యాత రూప సుగుణ
వేషవయసులఁ దుల్యయై వెలసి పతికి. ౧౨౪ 1161

క. తనవంటి సుగుణముఖములఁ, దనరారెడు వేలకొలఁది దాసిక లెప్పుడున్
దను గొల్వనుండె నాసతి, వనజాక్షుని సాత్వతపతి భక్తిభరమునన్. ౧౩

క. కనకమయ దండమున నొప్పిన చామర మట్టిగొనుచుఁ బ్రియ మలరారం
గను మెల్లగ వీచుచు నుండెను నారదుఁ డావిధము గనెం దమిపొంగన్. ౧౩

చ. మునిపతిరాకఁ గాంచి వెసఁ బూరుషవర్యుఁడు పద్మనేత్రై కల
క్ష్మిని జెలువొందుచుండు హరి శ్రీపతి రుక్మిణిశయ్యనుండి లే
చి నియతిఁ ధార్మికావళులఁ శ్రేష్ఠుఁడు గావున మౌనిపద్యుగం
బున సకిరీటమస్తకముఁ బొందుగ సోఁకఁగ మ్రొక్కిభక్తిమై. ౧౮ 1164

చ. కరములు మోడ్చి నారదుని గ్రన్నన స్వాసనవర్యమందు నా
దరమునఁ గూరుచుండెడు విధంబున మన్ననమీఱఁ జేసి మా
నిరమణరాజికిన్ దలఁపు నిక్కపు దేశికవర్యుఁడయ్యు స
త్పురుషుల కెల్ల నాథుఁడయి పొల్చియు నమ్ముని పాదయుగ్మమున్. ౧౯౪ 1165

క. పూతజలంబులఁ గడుగుచు, నాతోయములన్ శిరంబునందుం దాల్చెన్
భూతవ్రాతము లెఱుఁగన్, శ్రీతరుణీపతికి నాహరికిఁ బావనమై. ౧౯౪ 1166

సీ. బ్రహ్మణ్యదేవుఁడన్ భవ్యతమంబగు గుణనామ మొప్ప నిక్కువముగాఁగ
నర్థానఁజేయంగ నమ్మౌని పాదములను భక్తిఁ గడిగి తలను బవిత్ర
ములని చల్లుకొనియె మురహరి; తనపాదయుగళంబు గడిగిన యుదకములె జ
గత్పావనములైన గంగాదితీర్థము లగుఁగదా యటులయ్యుఁ దగునని హరి

ఆ. వానిఁ జల్లుకొనుట బాగుగాదే; మఱి
మునులలోఁ బురాణమునియు నరుని
సఖుఁడు నై చెలంగు చక్రి నారాయణుఁ
డర్హవిధిని బూన్కి నమరమునిని. ౧౯౪ 1167

క. అతిశయభక్తిని బూజిం
చి తగన్ భీయూషరసమె సిద్ధమిది యనన్
హితమయి మితమయి తగు వా
క్తతి యలరఁ బ్రభూ! మునీంద్రతల్లజ! మీకున్. ౧౯ 1168

క. మే మొనరింపం దగినది, యేమేఁ గలదేని యాజ్ఞ యిప్పింపుఁ డనం
గా మౌనివరుఁడు నారదుఁ, డోమౌనిసమర్చితా! విభూ! సకలేశా! ౧౯౪

చ. జనసముదాయమందు స్ఫుటసారసలోచన ! మైత్రి నీమదిం
బొనరుట వింతగాదు ఖలపుంజము నొంచుట వింతగాదు చ
క్కని నుతిగాంచునీశ్వర! జగంబులవౌ స్థితిరక్షణంబు లా
య్యన నొనరింప మేల్గలుగునట్టులు చేయఁగ స్వేచ్ఛమీఱఁగన్. ౧౪ 1170

చ. ధర నవతారమందు దనుతత్త్వ మెఱుంగుదు మేము కాన దు
ష్పురుషులఁ జక్కడంచి మతిఁ బూజ్యుల మన్నన లొప్పఁ గాచు టీ
శ్వర! తగు కార్యమౌను; భగవంతుఁడవై తగు నీమనోజ్ఞప
త్సరసిజయుగ్మముం గనితి సాధుజనాళికి ముక్తిదం బదే. ౧౫ 1171

సీ. అపరిమితంబగు నట్టిబోధము గల్గుబ్రహ్మాదులకుఁ గానఁబడక వారి
మనములం జింతింపఁగను దగినదియౌచు సంసారఘనకూప సంపతితుల
నుద్ధరింపఁగఁ దానె యూఁతయై యలరుచు నుండుభవత్పాదపుండరీక
యుగ్మంబుఁ గనుగొంటి నోపరమేశ్వరా ! యద్దానిఁదలఁచుచు ననవరతము

ఆ. దిరుగుచుండు నట్టిదివ్యపదాబ్జంబు, నందె నాకు స్మృతియు నమరియుండు
నట్లనుగ్రహింపవయ్య సర్వేశ్వరా!, యనుచు వేఁడె భక్తి యాత్మనిండ. ౧౬

ఉ. అంతట నారదుండు పరమాత్మునిదై తగుయోగమాయ నొ
క్కింత యెఱుంగఁగోరి మది యెంతయుఁ దొందఱపెట్టుచుండ శ్రీ
కాంతుని యన్యపత్నిదగు కమ్రమహోన్నతహర్మ్యముం గనన్
వింతగఁబోయె నందుఁ గడు వేడుకమీఱఁగఁ గృష్ణుఁ డట్టులే. ౧౭ 1173

ఉ. ప్రేయసిఁ గూడి యుద్ధవుఁడు ప్రీతికిఁ బాత్రుఁడు కానఁ జెంత నో
హో! యనురీతిఁ బాచికల నొప్పుగ నాడుచునుండఁ గన్పడెన్;
గాయజుతండ్రి దేవమునిఁ గాంచి మహత్తరభక్తి లేచి య
ల్లే యెదురేగి తోడుకొని యెంతయు నాదృతిఁ జూపుమాటలన్. ౧౮ 1174

క. మనమూఱడిల్లఁ బల్కుచు, మునివర్యా! యాసనవరమున నిందుం గూ
రినప్రీతిఁ గూరుచుండుమ, యనుచుం గూర్చుండ నంత నర్ఘ్యాదులనున్. ౧౯

ఆ. పూజచేసి మానిపూజ్యుండు వచ్చుట, మున్ను తెలియనట్టి పోల్కి నెపుడు
వచ్చినార లంచుఁ బరిపరి నడ్గుచు, నపరిపూర్ణులమయి నట్టిమేము. ౨౦ 1176

క. పరిపూర్ణులైన మీకు నొనరుపందగి యున్నదది యొనరుపఁ దగుదు మే
సురమానినాథ ! లైనను, బరికించి వచింపు మీభవనమునకు శుభముల్. ౨౧

క. కలుగంజేయుము; నా విని, జలజాక్షునిఁ గాంచి యట్టి స్వాంతంబున ని
మ్ముల విస్మయంబుఁ దోఁచినఁ, బలుకక వేఱొక్కకాంత భవనముఁ జేరెన్. ౨౨

ఉ అందును జిన్నిపిల్లలను నాత్మజులన్ గడుఁ బ్రీతిమీఱ గో
విందుఁడు సంతసించునటు వింతగఁ బల్కుచు బుజ్జగించుచున్

సుందరమూర్తులార! యిటు చూడుఁ డటంచును బిల్చుచుండె నా
నందమయాత్ముఁ గాంచి మునినాథుఁడు వేఱొక యింటి కేగెఁ దాన్. ౨౩ 1179

చ. మురహరి మజ్జనార్థముగఁ బోవఁగ యత్నము చేయుచుండఁగా
నరుదుగఁ గాంచె; వేఱొక గృహంబునకుం జనె నారదుండు నం
దురుతరభక్తితో హుతవహున్ ద్రివిధంబుగ నొప్పువాని సుం
దరియును జెంతనుండ విధిఁదప్పక వేల్చుచు నుండఁగాఁ గనెన్. ౨౪ 1180

మ. చని వేఱొక్కమనోజ్ఞహర్మ్యమున నేచందంబునం బ్రాణిహిం
సను జేకూరని బ్రహ్మయజ్ఞముఖయజ్ఞవ్రాతముం జేయుచుం
డిన శ్రీకృష్ణునిఁ జూచె; వేఱొకట నానీరేజనేత్రుండు భో
జన ముర్వీసురరాజికిం బ్రియమునన్ సంతృప్తిఁ బెట్టించుచున్. ౨౫ 1181

తే. వారుభక్షింప మిగిలిన సారవస్తు
వులను భక్షించుచుండ నిమ్ముల మునీంద్రుఁ
డట్టె పరికించె; వేఱొక హర్మ్యమందు
సంధ్యవార్చుచుఁ గూర్చున్న శౌరిఁ గనియె. ౨౬ 1182

సీ. వేఱొక్కగృహమున వృష్ణికులోద్ధారకుఁడు వాగ్యతుండయి కోరి బ్రహ్మ
మును లోకహితార్థముగ జపించుచు నుండఁ బరికించె; మఱియొక భవనమందు
వాలును బలుకయుఁ బట్టి వేడుక ఖడ్గపద్ధతులను జరింపఁగఁ గనుఁగొనె
మఱొకగృహంబున మత్తగజంబుల నశ్వవరంబుల నరదములను

తే. నెక్కుచున్ విహరింపఁగఁ జక్కఁ జూచె
నొకగృహంబున శయనించియున్న హరిని
గనియె మఱియొక్కచో వందిజనులు పొగడ
నలరుపరమాత్ముఁ గృష్ణుని నతఁడు గాంచె. ౨౭ 1183

*చ. అనుపమ హర్మ్యమం దొకట నార్యులు భక్తులునైన యుద్ధవా
దినిఖిలమంత్రిసత్తములు ధీమహిమంబునఁ దన్నుఁగొల్వ మం
తన మొనరించు శ్రీహరినిఁ దాఁ గనె నారదుఁ; డొక్కచో నికే
తనమున నొప్పుమీఱెడు హ్రదంబున వేశ్యలు ప్రీతిఁ గొల్వఁగన్. ౨౮ 1184

మ. జలకేళిం దగునాదరంబు వెలిఁబుచ్చంజూచు గోవిందుఁ గ
న్నులు తృప్తింగనఁ గాంచె; వేఱొకయెడన్ సూతోత్సవంబొప్ప వి
ప్రులలో నుత్తములైన వారలకు సొంపుల్ గుల్కఁ గైసేసి దూ
డలతో నొప్పెడు గోసహస్రమును వేడ్కన్ దానముం జేయుచున్. ౨౯

ఉ. వారువచించు ప్రాక్తనపుఁ బావనగాథల నాలకించుచున్

* "జలక్రీడారతం క్వాపి వారముఖ్యాబలావృతమ్" అని మూలము.

సారసనేత్రుఁ డుండఁ గనె సంయమి; వెండియు నొక్కచోఁ జమ
త్కారపుమాటలాడు ప్రియకాంతను గూడి హసించు శ్రీహరిన్
నారదమౌని గాంచె; సదనంబున వేఱొకటన్ యథావిధిన్. ౨౮౪ 1186

క. వలయునని ధర్మసముదాయములఁ దా లోకులకుఁ దెల్పువానికతో నా
జలజాక్షుఁ డాచరింపఁగ, నలరెడుమదిఁ గాంచె; నొకగృహంబున హరియున్.

ఆ. అర్థకామముల మహాదృతి సేవించు
చుండఁ జూచె; మఱియు నొండుచోటఁ
బ్రకృతికంటె మిగులఁ బరుఁడగు పురుషుని
నొకఁడె కూరుచుండి యుద్యమమున. ౨౯౪ 1188

క. ధ్యానించుచుండఁ గాంచెను, మౌనియు వేఱొక్కచోట మంచిగురువులన్
దా నెంతో వేడ్క సేవల, మానసకామముల భోగమండలములచేన్. ౩౦

క. సేవించుచుండె; వేఱొకచో విగ్రహమొప్పఁ జేయుచున్ వేఱొకటన్
బావనమతులన్ సంధిని, గావించి ముదంబు నొందఁగాఁ జేయఁ గనెన్. ౩౦౪

సీ. ఒక్కచో హలధరు నుద్యమంబునఁగూడి సాధుజనంబుల బాధ లడఁగ
శివము వారికిఁ జక్కఁ జేకుర నూహించుచుండఁగాఁ జూచె; వేఱొక్కచోటఁ
సుతులకుఁ దగినయువతులను, దుహితల కల్లభర్తలను శాస్త్రానుసరణ
పద్ధతి నుద్వాహ పరమోత్సవము లొనరించుచునుండంగఁ గాంచె; మఱియు

తే. వారిఁ దనయింటనుండి యవ్వారియిండ్ల
కనుపుచున్ వారియిండ్లనుండిన స్వజనులఁ
బిలువ నంపుచు నీరీతి వేడ్క నుత్స
వములఁ గావించుచుండఁ గాంచె ముని యంత. ౩౨౪ 1191

క. యోగేశ్వరేశ్వరుం డగు, నాగజరక్షకుని చర్య లన్నియుఁ గనఁగా
నేగతి నీయుత్సవములు, సాగినవని యచ్చెరువును జనులొందఁ దగెన్. ౩౩

చ. హరియొకచోట నూర్జితము లౌ మఖరాజిని దేవతోత్కరం
బరుదుగఁ దృప్తినొందు నటు లర్హవిధానమునన్ యజించుచున్
నరులకు నర్హమీయదె యనందగు బోధ మొనర్చుచుండె; సుం
దరసదనంబునం దొకటఁ దామరసాక్షినిగూడి భక్తితోన్. ౩౩౪ 1193

క. బావులు చెఱువులు తోఁటలు, దేవాలయమఠము లిట్టితీరునఁ దగుధ
ర్మావళి పూర్తఖ్యాతముఁ, గావించుచునుండె మర్త్యకాయార్హముగన్. ౩౪

చ. ఉదవసితంబునం దొకట నూహచెలంగఁగ నశ్వ మెక్కి వే
యదువరు లెల్లఁ గొల్వ మృగయాభిరతిం జని పావనాంగతం
బొదలు మృగాళిఁ జంపుచు విభుప్రవరామలధర్మ మిట్టులే

కద యని తెల్పుచుండె; నొకకమ్ర గృహోత్తమమందుఁ బూనికన్. ౩౬ 1195

చ. ప్రకృతులు ధర్మతత్పరులొ ద్రవ్యముఁగోరిచరించువారొ కో
యకుటిలవృత్తి నుండుదురొ యర్థముఁగూర్పఁగ స్వేచ్ఛచేఁ గువృ
త్తికలిత చిత్తులౌదురొకొ తెల్లముగాఁ బరికింపనౌఁ గదా
యిఁక నని వారిభావముల నెల్ల నెఱుంగఁగఁగోరి తా నటన్. ౩౭ 1196

చ. తనతను వేఱకేఁ గనువిధంబుననుండక యొప్ప సంచరిం
చు నిఖిలయోగనాయకుని శూరకులాభరణంబుఁ గాంచె; నా
మునివరుఁ డాపరాత్పరుని భూరితరామలయోగమాయ దా
ఘునతమశక్తిఁ గాంచి నరకాయ విడంబన మెంచి నవ్వుచున్. ౩౮ 1197

సీ. ఆహృషీకేశుని నత్యద్భుతాత్మునిఁ గనిపల్కె యోగేశవినుత! యోగ
పారంగతులకైనఁ బరికింప నెఱుఁగంగఁ దరముగానట్టి నీపరమయోగ
మాయావిలాసంబు మహితభవత్పాద పరిచర్యచే నలవడినశక్తిఁ
గనుఁగొంటి నంతియేకాని నీపరమార్థ మిదియని తెలియంగ నెంచుకేని

తే. యోగ్యుఁడనుగాను; నీదగు నుత్తమయశ
మునను నిండిన యీలోకములను భువన
పావనియెయైన నీలీలఁ బాడుచుఁ దమిఁ
దిరుగుచుండఁగఁ గరుణింపు దేవ! యనిన. ౩౯ 1198

చ. జనులకు ధర్మముం దెలుపఁజాలిన వాఁడ సమాచరింప నే
ర్తును; మఱి దానిఁజేయఁ బరితోషము నొందుదు; బ్రహ్మమౌనీ! దా
నిని గఱపంగఁ గోరికద నీరసమానవదేహ మిద్ది నేఁ
గొనియిటు సంచరింతు నిదిగూఢతమార్థముసుమ్ము పుత్త్రకా! ౪౦ 1199

తే. మోహమొందకు మని తెల్పె; మునియు భగవ
దాజ్ఞఁగొని గృహమేధుల కర్మములయి
పావనములైన సద్ధర్మపటిల మాచ
రించుచున్ హార్మ్యవితతిఁ జరించుచుఁ దమి. ౪౧ 1200

క. ఒకఁడయ్యు నన్నితావుల, సకలాత్ముం డగుటఁ దాను జరియింపఁగఁ దా
నొకకాలమందె గాంచెను, బ్రకటితరానంత వీర్యభాసితుఁ డగుచున్. ౪౨ 1201

క. వెలసెడుశ్రీకృష్ణుని యుజ్జ్వలతరమౌ యోగమాయ చంచచ్ఛక్తిన్
గలుషహరంబును మౌనియుఁ, బలుమాఱుం గనుచుఁ గుతుకపరవశుఁ డయ్యెన్.

చ. ధనమున ధర్మకామములఁ దద్దయు నాదృతిఁ గల్గినట్లు లో
కనికరబోధనార్థము నికామము వర్తిలుచున్న శ్రీనికే
తనుఁడును సత్కృతిన్ దనను దన్పఁగ నారదు డెంతొ ప్రీతుఁడై

వనజదళాక్షుభక్తి బహుళాదరము నాత్మఁ దలంచుచుం జనెన్. ౮౩ 120

ఉ. ఎల్లర వృద్ధిఁగోరి సకలేష్టదరూపములన్ ధరించి యా
ఫుల్లసరోజనేత్రుఁ డెదఁబొల్చెడు కౌతుకమొప్పఁ దాను శ్రీ
వల్లభుఁడయ్యు మానవుల వర్తనముల్ పనిపూని చేయున
ట్లెల్లెడఁ గన్పడంగ ననువృత్తి నెసంగుచు ద్వారకాపురిన్. ౮౪ 120

మ. మృదుమందాక్షము సౌహృదంబు హితముల్ మిశ్రంబులై వేడుకం
బొదలన్ జేయువిలాసదృష్టులఁ దమిం బొంగారు హాసంబులన్
బదియార్వేల నితంబినీమణులు తన్ భక్తిప్రమోదంబులన్
గదురం గొల్వ సుఖించుచుండెఁ దనదౌ కర్తవ్య మూహించుచున్. ౮౫ 120

సీ. విశ్వోద్భవస్థితివిలయహేతువు హరి మనుజలోకంబున నొనరిచిన య
నన్యసాధారణ నవ్యకర్మముల నదెవ్వఁడు పాడునో యెవఁడు వినునొ
పూజ్యుఁ డెవ్వం డనుమోదించుచుండునో వానికి మోక్షంబుమాన కొసఁగ
నట్టి యాభగవంతునందు నిశ్చలభక్తి కుదురును గావునఁ గుతుకమలర

ఆ. వాసుదేవుకథలఁ బాడుచు సంతృప్తి, నాలకించుచున్ మహాత్ము లెట్లు
తెలిపినారొ యట్లె ధీమంతులగు వారి, కెలుకపలుపవలయు నిదియె మేలు.



## డెబ్బదియవయధ్యాయము.

### శ్రీహరి సభామండపము నలంకరించుట.

చ. తెలతెలవాఱ నంత వసుదేవుప్రియాత్మజు కంఠమట్టి కొఁ
గిళుల బిగించి సుందరులు కేళులఁ దేలుచు హాయిమీఱఁ బా
న్పులఁ బవళించి తద్విరహముల్ క్షణమైన సహింపఁజాల కి
మ్ముల జతగూడి యుండఁగనె బుద్ధుల నెంచెడు వారుగావునన్. ౪ 1207

చ. అరుణుఁడు తోఁచె లెం డనుచు నందఱు లేపఁగఁ గొక్కురో యటం
చురుగళనిస్వనం బలర నొక్కటెలుంగునఁ గోళ్లుకూయ నా
తరుణులు సౌఖ్యహానికయి తద్ధయుఁ గోపముతో శపించి రి
క్కరణిని గూసి మాదగు సుఖంబు నడంపఁగ నేల యం చొగిన్. ౧ 1208

క. మందార వనమునుండియొ, మందగతిం బొలయుచున్న మరుదోఘువ్యా
ప్తిం దగ మేల్కని షట్పద,బృందంబులు మదము పేర్మి వేడుకమీఱన్. ౧౪

క. ఝుంకారమ్ములఁ బాటలు, జంకను నదిలేక పాడసాగఁ బతత్త్రుల్
బొంకముగ వందిజను లటు, పంకరుహేక్షణుని నిద్రఁ బాయఁగఁ జేయన్. ౨

చ. కలకలనాదముల్ వెలయఁ గా సుకుమారగళంబు లెత్తి ని
స్తులగతిఁ బ్రీతిఁ దెల్పి నిటు తోరపు వేడ్కల మీఱునట్టిదా

నలసమయంబునందు జలజాతముఖులును రుక్మిణీప్రధా
నలు తమకాంతుకౌఁగిట మనంబులు సంతసమందఁ జొక్కుచున్. ౨౫ 1211

చ. పతివిరహంబు దుస్సహము భారతమంబగు కార్యమంచు నే
వితమున నైన నోర్వఁగలవృత్తిని బూనక తన్ముహూర్తము
న్నతపరితాపదాయియె యనందగు నంచని దానిఁబుచ్చ న
ల్లె తదురు బాహుమధ్యమున నే తమి నుండిరి; కృష్ణుఁ డంతటన్. ౩ 1212

ఆ. బ్రాహ్మమనెడు పేరఁ బరఁగు ముహూర్తమం
దట్టి మేలుకాంచి యమృతములను
విధిగ నాచమించి విమలాంతరంగుఁడై
యద్వితీయ మగుచు నకలుషమయి. ౩౫ 1213

సీ. స్వప్రకాశంబయి శాశ్వతంబయి యనన్యంబయి యవ్యయంబయి స్వసత్త
వలనఁ గల్మషజాలములకు దూరంబయి విశ్వోద్భవస్థితివిలయ హేతు
వులను స్వశక్తులవలన లక్షితభావనిర్వృతియయి తగి నిత్యమునగు
బ్రహ్మము ధ్యానించెఁ; బంకజనేత్రుఁ డవ్వల నిర్మలములగు జలములందు

తే. శాస్త్రమర్యాద వదలక స్నానమాడి
చేయఁదగినట్టి క్రియలను జేసి ధౌత
వస్త్రములఁ గట్టుకొని మధువైరి యంత
సంధ్యఁ జక్కనుపాసించె స్వాంత మలర. ౪౫ 1214

చ. జ్వలనుని వేల్చెఁ గాణ్వమను శాఖకుఁ జేరిన వృష్ణివంశ మం
దిల జనిఁగాంచుటన్ జలరుహాక్షుఁడు ప్రాగ్గిరీంద్రుపై
వెలయక మున్నె యయ్యనలు వేల్చెను; శాస్త్రముతప్పరా దఘం
బొలయును దాననంచు హితమొప్పఁగఁ జెప్పెడు వేద్క సంధిలన్. ౬ 1215

ఉ. మానముఁబూని యంతటను మంత్రగణంబున కెల్ల మూలమై
తా నఘనాశనంబునను దక్షము నై తగు బ్రహ్మముల్ విధిన్
మానసమం దొగిన్ జపము మానక చేసెను వేదమాతయే
యా నదె బ్రాహ్మణత్వమున కద్దియె మూలము రాజపుంగవా! ౬ 1216

క. గాయత్రి యనఁగ నద్దియె, యీయవనిం బేరుఁగాంచె నినుఁ డుదయాద్రిన్
మాయఁగఁ దిమిరంబులు తన, వేయికరంబులు చెలంగ వింతగఁ దోఁచెన్. ౬౫

క. ఉదయించుచున్న సూర్యున, కిదియే తగువేళ యనుచు నెంచి మదిని భ
క్తిదగంగ నుపస్థానము, సదమలరీతిగ నొనర్చి చక్రియు నంతన్. ౬౫ 1218

క. తనయంశభూతులై తగు, ననిమిషులకు బుషివరులకు నల్లె పితృగణం
బునకుం దర్పణకర్మంబును జేసెం బిదప వృద్ధభూసురవరులన్. ౭ 1219

సీ. నిత్యపూజనముల ఽ నెమ్మి నొందఁగఁ జేసి మఱియు నలంకృతఽత్మాసురలకు
సాధువృత్తిం గాంచి ఽ చక్కఁగఁ బాలిచ్చునలవాటుగలిగి ఽ మొదలి దయితగు
చూలు గల్గినయట్టి ఽ యాల దూడలతోడఁ బట్టువస్త్రములతో ఽ భవ్యములగు
నజినతిలలతోడ ఽ ననుదిన మింతనఁబడనిసంఖ్య నొసంగుఽపద్ధతి మెయి

తే. నిచ్చె నయ్యావి సంతప్తఽహేమశృంగ
ములుగ మఱి రూప్యమయఖురఽములుగ వరా_క్తి
కస్త్రజంబులఁదగు నవిఽగాఁగ సాధు
వర్ణభూషితములుగాఁగ ఽ వఱలుచుండె. ౯ 1220

క. ధేనువులకు భూసురులకు, మానితులకు నమరులకును ఽ మఱివృద్ధులకున్
జ్ఞాన మిడు గురువులకు నె, న్నే నగు భూతములకుఁ దమి ఽ నింపుదలిర్పన్. ౯½

తే. తనవిభూతులె యవియగుఁ ఽ గనుక వాని
కాదృతిన్ మ్రొక్కి భద్రపదార్థములగు
కపిలలోనగు వానిని ఽ గరతలములఁ
దాఁకె; నవ్వల మురహారి ఽ తగినరీతి. ౧౦ 1222

క. నరలోకభూషణము దన, శరీరమును జారువస్త్ర ఽ సన్మణిభూషా
త్కారమునఁ గైచేసె మనో,హరమాల్యములన్ ధరించె ఽ నంద మలరఁగన్. ౧౧

క. అనులేపనములఁ గైకొని, తననీడను ఘృతమునం బ్రఽథమమున నవలన్
వినుతాదర్శమునందుం, గనుఁగొని యానంద మంది ఽ కడు మోదమునన్. ౧౧½

తే. గో వృష ద్విజ దేవతాఽకూటము గని
సర్వవర్ణంబులకుఁ బురఽజనుల కంతి
పురమునం దుండువారికిఁ ఽ బూజ్యులయిన
మంత్రిముఖులకు నీఁదగుఽమాడ్కి నొసఁగి. ౧౨ 1225

క. తనమది నానందమునొం,దెను; మ్రోల వసించియున్న ఽ ధీమద్వరులన్
వినుతగుణాఢ్యుల విప్రుల, ననూనతాంబూల పుష్పఽహారాదులచేన్. ౧౨½

క. సంతృప్తులఁ గావించెను, సంతోషమె భూషణ మనుఽసాధూ_క్తిని దా
నెంతయుఁ బోషించుచు హిత, సంతతి సేవకులఁ బ్రీతిఽసత్కారములన్. ౧౩ 1227

ఆ. గారవించి తనదు ఽ కామినీమణులతో, మెలఁగుచుండె; సూతుఁ ఽ డెలమిమీఱ
శుభతమంపురథము ఽ సుగ్రీవముఖహయ,ములఁ జెలంగుదాని ఽ లలితతమము.

క. కొనివచ్చి నిలిపి మ్రొక్కెను దన మ్రోలన్ నిల్చినట్టి ఽ దారుకు కైదం
డనుగొని సాత్యకితోడన్, వనజాక్షుం డుద్ధవుండు ఽ భక్తిఁ గొలువఁగన్. ౧౪

క. తేరెక్కె నుదయభూధ్రము, సారసనఖుఁ డెక్కునట్టి ఽ చందంబున; నం
భోరుహనేత్రలు లజ్జా, స్ఫారప్రేమైకదృష్టిఽసంతతిచేతన్. ౧౪½ 1230

క. అంతఃపురములనుండియె, వింతఁగఁ దను గారవింప § వెలఁదుల దృగ్జా
లాంతరములఁ జిక్కక యెటొ, కాంతలచిత్తములఁ జూఱగాఁగొని వేడ్కన్.

క. చిఱునవ్వు మోముఁదమ్మిక, నెఱె నాట్యముచేయుచుండ § నిత్యోత్సవముల్
గుఱుతుపడునట్లు చేయఁగ, నఱిముఱిఁ బౌరులు కనం బ్రయాణముచేసెన్.

*ఉ. ఒక్కొకయింటినుండి హరి § యొక్కరుఁడే పయనంబు చేసి న
ట్లొక్కొకయింతియుం దలఁప § నొయ్యన వెల్వఁడి రూపసంఘ మ
ట్లొక్కటియై రథంబుపయి § నొప్పఁగఁజేసి పరాత్పరుండు త
న్నొక్కరుఁడే గనందగక § యుండ జవంబునఁ బోయె నేర్పునన్. ౧౬ 1233

చ. తనవగు పార్శ్వభాగములఁ § దద్దయుఁ బ్రీతిచెలంగ వృష్ణు లె
ల్లను గుమిగూడిరాఁగ సువిశాలసముజ్జ్వల సుధర్మ నాఁగ నొ
ప్పిన సభఁ జేరె నందుఁగల § పెద్దల కాఁకలి దప్పి శోకమో
హనిధనముల్ జరావ్యయము § నన్న షడూర్ములు గల్గ వెత్తఱిన్. ౧౭ 1234

చ. నిరుపమతత్సభాభవన § నిత్యసుఖాకరపీఠమందు శ్రీ
హరి జగదోఘనాయకుఁ డశేషైశ్వర్యవిభూతి నివాసభూమి యా
దరమునఁ గూరుచుండి తను § ధామములన్ దెసలెల్ల వెల్గఁగాఁ
బురుషవరుల్ యదూద్వహులు § పొంగుచుఁ దన్గొలువంగ నెంతయున్. ౧౮

క. తారాగణ పరివృతుఁడై, రేరాజు వెలుంగునట్టి రీతిం జెలఁగెన్;
శ్రీరమణు నంత వేడుక,చే రంజిలఁజేయఁ బూను § చిత్తము లొప్పన్. ౧౮౪

క. పరిహాసకులును బహుహా,స్యరసములన్ గుల్కు వాక్య § సంతతి నలరిం
చిరి మఱియు నటాచార్యులు, పరమేశ్వరు సేవచేయు § పద్ధతు లొప్పన్. ౧౯

ఆ. నర్తకీజనంబు § నానావిధంబులై, నర్తనముల ముదము § నం బొదలఁగఁ
జేసి; రల్లి వీణెఁ § జేఁబూని వైణికు, లలరఁజేసి రెలమి § హరిఁ బరేశు. ౧౯౪

సీ. మురజతాళమృదంగ § దరనిస్వనంబులఁ గొందఱు గొల్చిరా § గోపవేషు
సూతమాగధవందు § లాతఱి నెగురుచుఁ బొగడుచుఁ బాడుచుఁ § దగినరీతి
సేవించి; రందున్న § క్షితిసురోత్తములందు బ్రహ్మవాదులు గురు § భవ్యకీర్తు
లగు పూర్వరాజుల § వగు గాథలను జెప్పుచుండిరి; కొందఱు § నిండువేడ్క

తే. వాని వినుచుండి రిట్టు లా § వాసుదేవుఁ
డతిముదంబున నుండ; నా § యదనునందు
ద్వారపాలకు లరుదెంచి § తమ రిదివఱ
కెపుడు చూడని పురుషుఁ డీ § య్యెడకు వచ్చి. ౨౧ 1239

క. జగదీశ! తమసుదర్శన, మగునా యని యున్నయతని § నభ్యంతర భా

---

* పూర్వోక్త ప్రతిపాదిత సర్వవ్యాపకత్వ మిట సూచితమని యెఱుంగఁదగు.

గగతుని చేయఁగ నిప్పుడు, తగునని తమసెలవయేని దాసులు వీరల్. ౨౧

తే. కాచియున్నార లనునుడిఁ గాంచనాంబ
రుఁడు మనంబున నూహించి తడయ నేల
తోడుకొని రండు నాఁబోవ వాఁడువచ్చి
పరమపురుషునకున్ మహోత్తరయశునకు. ౨౨ 1240

చ. కరములువోడ్చి మ్రొక్కి నృపకాండము మాగధుఁ డెంతో దుష్టుఁడై
కరుణ యొకింత లేక కడు గర్వమునం జెఱసాలనుంచి వ
త్సరము లవెన్నియోఁ గడువసాగినను న్వదలంగఁ బూనఁ; డీ
శ్వర! యిఁక నీవె దిక్కనుచుఁ బంపినవార్తలఁ దెల్పె నెవ్వగన్. ౨౩ 1242

క. వనజాక్ష! జరాసంధుఁడు, మును దిగ్విజయంబుచేయఁ బూనిన యప్పు డే
జనపతులు లోఁబడరొ త, జ్జననాథుల ద్వ్యయుతవిహిత సంఖ్యల బలిమిన్.

క. కొనివచ్చి చెఱను బంధిం,చెను జుమ్ము గిరివ్రజమున క్షితినాథులు నీ
కును విన్నవింపు మిట్లని, ననుఁ బంపిరి వారినుడు లనంగ నివి యగున్.

సీ. శ్రీకృష్ణ! శ్రీకృష్ణ శ్రితజనసాధ్వసభంజనా! కరుణను భక్తజనులఁ
బాలించు వాఁడవు భద్రము విడువాఁడ వప్రమేయాత్ముఁడ వగుదు వీవు
భవభీతులము మేము బహుభిన్నదర్శనులము నిన్నె శరణంబుగ మది నమ్మి
యాశ్రయించిన వార మవని నిషిద్ధకర్మాశక్తి గలిగి నీవతిశయ కృపఁ
తే. దెలిపినట్టి త్వత్పూజలతీరు మఱచి
తమ్ముఁ గృతకృత్యులనుచేయఁ దగినకర్మ
ములను స్మరియింపకుండు లోకులకుఁ గల్గు
జీవితాశను బల్మిఁ ద్రెంచెదవు దేవ! ౨౪ 1245

క. కాలస్వరూపుఁడవు మఱి, బాలుఁడవుగఁ దోఁచుచుండు వాఁడవు కృష్ణా!
కేలుముకుళించి మ్రొక్కుదు, మోలోకేశా! పరేశ! యోంభూతేశా! ౨౫

చ. కరుణను సాధువారమును గావ ఖలావళి నిగ్రహింప నీ
శ్వర! భగవన్మహాంశమున క్ష్మాస్థలిపై మనుజాంగ మూనితే
నరుఁడు త్వదాజ్ఞ దాఁటుటయు నాథుఁడవైతగు నీయపారమౌ
కరుణకుఁ బాత్రమయ్యు నిజ కర్మజదుఃఖము నొందుచుంటయున్. ౨౬

తే. తగునటంచు నెఱుంగుము జగదధీశ
తాను చేయుకర్మమునకుఁ దగినఫలము
ననుభవించు నరుండని యనుట యుక్తి
యుక్తముగ నున్నదని యెంతు మోముకుంద. ౨౭ 1248

క. పరమేశ్వర పరికింపం, బరతంత్రము నృపసుఖంబు స్వప్నాయితమై

త్వరగ నశించును భయమే, తరుణంబునఁ గల్గఁజేయఁ దగి శివముపలెన్. ౨౭

క. సారవిహీనంబైన శ,రీరముఁ జింతాదిభరపరీతముఁ గృష్ణా!
సారసనేత్రా! మోయుదు, మీరీతిం దెల్వి లేకయే సంతతమున్. ౨౮ 1250

సీ. నిష్కాములకు నీదు నిర్మలానుగ్రహపాత్రులకుఁ లభింపఁదగి మఱియుఁ
జింతింపఁగా స్వతస్సిద్ధమై యలరు నాత్మసుఖంబును ద్యజించి మహితమైన
నీదుమాయకుఁ జిక్కి యేదియుఁ దెలియక దీనులమై యిట్లు తీవ్రకష్ట
ములఁబొందుచున్నారమిల సింహమజములవలెఁగుంజరాయుతబలుఁడయిఖలుఁ

తే. డౌజరాసంధుఁ డతిశక్తి యలరఁ బట్టి, చెఱను బెట్టిన మమ్ముల క్షితిపకర్మ
పాశములఁ జిక్కి కష్టముల్ పంతమూని, యేఁచఁ గుందెడువారిఁగా నెంచి నీవు.

క. దీనులవెతలఁ వేగమ, మానుపఁగాఁ జేయఁజాలు మహితాంఘ్రిసరో
జా! నెమ్మిఁ విడిపింపుమ, శ్రీనిలయా! ఖలమహీశచిత్తమహోగ్రా! ౨౯ 1252

క. పదునెనిమిదిపర్యాయము, లుదితామర్షుండు గాన యుద్ధతి మీఱిం
గదనము నీతోఁ జేయఁగఁ, బదాతిముఖసేనఁగూడి వచ్చెం గాదే! ౨౯౫ 1253

చ. కరమునవెల్గు చక్రమును గాంచి పరాభవ మొందిపాఱె; నీ
శ్వరుఁడ వనంతవీర్యుఁడవు భక్తులపాలిటి కల్పవృక్షమై
సరియగు వాఁడులేని గురుసత్త్వయుతుండవు నయ్యు మర్త్యలో
కరతిని బొందియుండుదువు గాన జయించె నదొక్కమాటె తాన్. ౩౦ 1254

క. తావ స్మాత్రంబునకే, కావరమున నీదుప్రజలు గాఁ దగుమమ్ముం
గావలెనని పీడించెడు, నీవజితుఁడవని యెఱుంగనేరఁడు స్వామీ! ౩౦ 1255

క. దీనికిని బ్రతీకారము, మానసమునఁ జేయ నెన్ని మాన్పింపుమ యీ
భూనాథబాధ లనుచుఁ, భూనాథులు తెల్పు మనిరి భూతాధీశా! ౩౦ 1256

సీ. మాగధసంరుద్ధ మానవాధీశులు భవదంఘ్రిదర్శనవాంఛమీఱి
యున్నారు; దీనులై యున్నవారల నీదుశరణముఁ జొచ్చి నభక్తజనులఁ జేరఁ
గాఁదీసి సుఖము గల్గం జేయుమాయని యాదూత మనవిచేయఁగ; నపుడె
నిరుపమానద్యుతి నెగడుదేవమునీంద్రుఁ డాహారిదర్శించు నాదరమున

తే. వచ్చెఁ బింగజటాభార మిచ్చఁ దాల్చి, భానుఁడో యనవెల్గుచుఁ బరమశాంత
ముట్టిపడఁ రాఁగ శ్రీకృష్ణుఁ డుగ్రదనుజ, శాసకుఁడు సర్వలోకపస్వామి యపుడు.

## నారదాగమనము.

చ. మునిపతిఁ గాంచినంతనె ప్రమోదము తఁ బురికొల్పఁగా నెదు
రొక్కని తనుఁగూడి సభ్యులును గోరికఁ రాఁగను సేవకోత్కరం
బును జనుదేరఁ బాదములు మూర్ధమునోఁక నమస్కరించి చే
యను దగినట్టిపూజల మహార్హవిధిం బొనరించి భక్తిమై. ౩౩ 1258

క. సముచితపీఠంబున దేవమునిం గూర్చుండఁజేసి ఽ భవ్యతరవచ
స్సముదయమున సంతృప్తియు, సమస్తవిదుఁడౌటఁ గల్గఁ ఽ జక్కఁగఁ బలికెన్.

చ. మునివర! దేనను౯ భయము ఽ మూఁడుజగంబుల కెప్డు లేదుగా
యనిశము మీరు క్రుమ్మరుట ఽ నన్నిజగంబుల వార్తలు౯ మనం
బున నిలువంగఁజాలుటయె ఽ భూరితరంబగు లాభమౌఁజుమీ!
మనవి యొనర్తు నీశ్వరుని ఽ మాయనుగల్గిన యీజగంబులన్. ౩౫. 1260

క. నీకుం దెలియని దొక్కఁడు, లేకుండుంగాదె జ్ఞానలీలాదృష్టి౯
భూకాంతులు పాండవు లిపు, డేకార్యము చేయఁబూని ఽ రెఱిగింపు మనన్.

సీ. సర్వలోకేశ్వరా! ఽ సర్వజగద్వ్యాప్తసత్ప్రకాశా! హరీ! ఽ సర్వకార్య
కరణదక్షములగు ఽ గురుశక్తులను భూతజాలములందుఁ బ్రచ్ఛన్నవృత్తి
దారువులందు వహ్నిగతవహ్నిచందంబున వర్తింతు వీవిట్టివాఁడ వనుచుఁ
దెలియశక్యముగాదు ఽ జలజాక్ష! యలనీదురంతమాయాదేవి ఽ బ్రహ్మాదేవు

తే. నకును వ్యామోహమును గల్గ ఽ నైజశక్తిఁ
జేయు నద్దానిగాంచితి ఽ నీయపార
సత్త్వమిసుమంత యెఱుఁగుట ఽ స్వాంతమందుఁ
బ్రశ్నమిది చిత్రమని తలంపను మహాత్మ. ౩౬ 1262

క. విను పారమార్థికంబనఁ, జను దృష్టిని గాంచఁగా నసత్తయ్యును బై
కిని సత్పదార్థమట్లుగఁ, గనఁబడు నీజగములను నీకామము శక్తిన్. ౩౬౪ 1263

క. కలిగించుచుఁ ద్రుంచుచు నిస్తులమాయాయోగమునను ఽ దోఁచుచు నుండం
గలనీదు చేష్టితంబును, దెలియ౯ శక్తుం డెవండు ఽ త్రిజగములందున్. ౩౮

తే. అపరిచింత్యాత్మకుఁడవయి ఽ యలరునీకు
నివె ప్రణామంబు; లోజగదీశ! యీశ్వ
రా! యవిద్యావరణము సంవ్యాప్తమగుట
భవతమస్సునఁ దిరుగుచు ఽ భయముఁ గనుచు. ౩౮ 1265

క. కనఁగ ననర్థావహమౌ, తనువును విడఁజాలుటకును ఽ దగినయుపాయం
బు నెఱుంగకుండు జీవున, కనూనదీపంబువంటి ఽ దగు సద్యశమున్. ౩౮౪ 1266

తే. పరమలీలావతార విసరముల వెల్గించుచున్నట్టి నిన్నాశ్రయించువాఁడ;
బ్రహ్మమా! పాండుభూపాల ఽ వరతనయుని, చేష్టితంబెల్ల విదితంబె ఽ చిత్తమునకు.

క. నరలోకవర్తనం బను, కరించుచున్నట్టి నీకుఁ ఽ గాంక్షఁ గలుగుట
బ్బుర మెట్లగుఁ? గావునవె వివరింతు ధర్మాత్మజుండు ఽ భక్తుఁడు నీకున్. ౪౦

క. ఆతఁడు చేయం బూనిన, రీతి౯ వినవయ్య సర్వరీతిజ్ఞా! లో
కాతీతు నిన్ను బ్రహ్మాత, నీతఱిఁ బొందంగఁగోరియే యర్చింపన్. ౪౦ 1269

చ. మనమునఁ గోరువాఁడు సుము మాధవ! సర్వగ! రాజసూయమం
చును మిగులన్ యశంబుగని క్షోణిని మించు మఖేంద్రరూపతన్
నిను భజియింపఁ గోరెడిని నీరజనేత్ర! యజింపఁ గోరునా
తనికృతి కీవు సమ్మతి నిరంతము నొందఁదగున్ మనంబునన్. ౮౧ 1270

క. విచ్చేయవలయుఁ గృష్ణా!, యచ్చటికిన్; దన్మఖేంద్రమందు నినుం బె
న్మచ్చుటమీఱఁ గనుదురు వి,యచ్చరు లధ్వరగణేశు నఖిలాండేశున్. ౮౨

క. పరిశుద్ధయశులు నిను భూ,వరులట దర్శింపఁగోరి వత్తురు కార్యాం
తర మందుఁగలదు నీకున్, బరమేశా! కీర్తనశ్రవణములఁ బ్రీతిన్. ౮౩ 1272

*ఆ. ధ్యానమునను శ్వపచులైనఁ బాపము వోవఁ, బావనులగుదు రనఘ బ్రహ్మమయుని
నిన్నుఁ గాంచువారు మన్నన స్పృశియించు, వార లొందుఫలముఁ బలుకనేల?

సీ. భువనమంగళరూప! భూతేశ! దిక్కుల కెల్లనలంకారమే యయితగు
నీయశం బిబ్భూమి నాయమరాళి నివాసమందు నధోభువనమునందుఁ
బరమపావనమయి ప్రఖ్యాతమై యుండు; లలితభవత్పాదజల మనంగ
మందాకిని యని యమరలోకమున నధోభువనంబునందును భోగవతి య

తే. నంగ, నీలోకమునయందు గంగ యనియు,
నలరి భువనత్రయంబు నిమ్ములఁ బవిత్ర
ముగ నొనర్చుచున్నది మురహార! యనె;
నంతఁ గేశవుఁ డందున్న యదువరు లొగి. ౮౫ 1274

క. మనములను జరాసంధుని, నని మొనను జయింపవలయు ననుసూహాలు చే
యను మొదలిడి యప్పలకులఁ, గొనకుండు పెటెంగి వారి కుతుకము దీర్పన్.

క. మదినెంచి యుద్ధవునితో, మృదుమధురాలాపములను నిట్లను నార్యా!
విదితాఖిలమంత్రుండవు, గద పరమంబైన నేత్రకల్పుఁడవుగదా! ౮౭ 1276

సీ. మంత్రివి మాపయి మంచిభావము గల్గువాఁడవో యెట్లు నీ భావ మలర
వచియింతువో యదే వడువునఁ గృత్యంబుఁ జేయనౌ నని యెల్లఁ జేయ శ్రద్ధఁ
బూను వారము మేము మానసంబున దాని విశ్వసింతు; మటంచు విభుఁడు సర్వ
జగదధీశుఁడు సర్వ జంతుహృదంతర సంవ్యాప్తతేజుండు చక్రకృష్ణుఁ

ఆ. డఖిలవేత్తయయ్యు నజ్ఞునివలెఁ దనుఁ, గార్యమడుగ నతఁడు కడఁగి దానిఁ
దలధరించి యిట్లు పలికె భక్తుండౌట, భగవదాజ్ఞఁ జేయువాఁడు గాన.

---

* "శ్రవణా త్కీర్తనా ద్ధ్యానా త్పూయంతేఽన్తేవసాయినః" అని మూలము. "అంతేవసాయిన శ్శ్వపచాః" అని వ్యాఖ్య.

## డెబ్బదియొకఁడవయధ్యాయము.

**ఉద్ధవుఁడు కృష్ణునకు రాజసూయవిషయము నెఱింగించుట.**

చ. గురుమతి యుద్ధవుండు మునికూటమునందుఁ బ్రసిద్ధిగన్న ని
ర్జరముని నారదుండు నయశాలి వచించిన వార్తనెల్ల నా
దరమున నాలకించి నృపతల్లజరక్షయె ముఖ్యమంచు న్యా
యరతిఁ దలంచుసభ్యుల మహాశయ మాత్మఁ దలంచి యంతటన్. ౧ 1278

క. వనజాక్షున కీయుభయం,బును సమ్మత మగునటంచుఁ బూన్కి నెఱిఁగి యి
ట్లని పల్కె లోకనాథా!, మునిపతి న్యాయం బెఱింగి పూజ్యవిధమునన్. ౧½

క. మేనత్తకొడుకు ధర్మజ, భూనాథుఁడు తాను జేయఁబూనిన మఖమున్
గానంజని సాహాయ్యము, పూనిక మెయిఁ జేయుటయును భూపతులార్తిన్. ౨

తే. శరణు వేఁడిరి గాన రక్షణము చేయు
టయును ముఖ్యంబులే దిగ్విజయమహంబు
మును పొనర్పియె యోవిభూ! భూతలమున
రాజసూయాఖ్యమగు నధ్వరము నొనర్ప. ౨½ 1281

క. శ్రుతినియమించెడుఁ గావునఁ, గ్రతువర్యము దానిజేయఁ గడఁగినచో భూ
పతిరక్షణంబు సాగును, శతపత్రేక్షణ! యి దొక్కసరణి యగుటచేన్. ౩ 1282

క. తొలుతన్ ధర్మజుఁ గనఁబో,వలయున్ మఱి దిగ్విజయము వరుస నొనర్పం
గలవారి నంపఁదగు న్యా,కలహమున జరాత్మజుస్మఁ గడు శౌర్యమునన్. ౩½

క. శమనునికడకుం బంపు; జ,యము దానంగల్గు భూధవావనసత్కృ
త్యము సాగు దాన నీయు,గ్మము సార్థక మగునటంచు మదిఁ దోఁచు విభూ!

క. మనమున్ సాధింపఁ దలం,చిన యట్టిప్రయోజన మది సిద్ధించుఁజుమీ
వనజాక్షా! గోవిందా, జనపతులకు బంధముక్తి సాగించినచోన్. ౪ 1285

క. దానన్ నీకు యశస్సును, మానితగతిఁ గలుగు; యదుసమాజము లింతే
మానసములఁ బరికింపక, భూనాథు జరాత్మజన్ముఁ బోల నబలుగాన్. ౪½ 1286

క. తలపోసి మార్కొనంగాఁ, దలఁచుచునున్నారు కాని దంత్యయుతబలుం
డలఘు పరాక్రముఁ డేరికిఁ, దలఁపడరాకుండు వైరిధర్ముఁ డతండో. ౫ 1287

సీ. ఉగ్రబలుండుగ నొప్పు భీముం డొక్కరుఁడు తప్పఁ దక్కనకడుబలాఢ్యు
లకు నెట్టివారికే బ్రకటాహవంబున నాజరాసంధు నోర్చిన మారు
కొనరాదు; నిశ్చయ మని నమ్మఁదగుదీని బాహుయుద్ధమున నోర్వఁదగు వాని
మఱియొక్కవిధమున మార్కొని జయమందఁగాఁగోర నూర్లసంఖ్యగల బలము

తే. లెంతయత్నించినన్ శక్య మెప్పుడైనఁ
గాదు ; పృథుసైన్యములఁగూడి క్రాలునతని

ద్వంద్వయుద్ధంబున జయింపవచ్చు నెట్టు
లనుదువో లోకనాథ ! సర్వాత్మ! దేవ! ౫౪ 1288

క. నిరతిని బ్రాహ్మణభక్తుఁడు, జరాసుతుండోట సద్ద్విజప్రవరు లదే
తరుణమున నేమికోరిన, నిరసింపక దాని నొసఁగు నెమ్మి దలిర్పన్. ౬ 1289

క. కాన వృకోదరుఁ డొక్కట, భూనిర్జరవేష మూని పోయి రణంబున్
దా నర్థించిన మాగధుఁ, డొనను ద్వంద్వాహవమున నతనిం బెలుచన్. ౬౪

క. గోవిందా! నీసన్నిధి, నేవిధ మగుసందియ మదియే లేక ధరం
బావనయశ మొప్పంగా, వైవస్వతుగృహముఁ జేరఁబంపుం జుమ్మీ! ౭ 1291

క. తలఁప నకించిత్కరుఁడన, వెలసిన నాసన్నిధి యది భీమున కేమే
ఫల మెట్టు లిచ్చు ననెదో, జలజాక్ష! యరూపుఁడవయి సర్వేశుఁడ వై. ౭౪

*సీ. కాలాత్మకుఁడవయి క్రాలునీకున్ జగన్నిర్మితిలయముల నీరజభవ
పరమశంకరులు సంభావింపఁగా నిమిత్తంబైన యట్లుగాఁ దావకమగు
సన్నిధానమ్మున శ్వసనపుత్త్రుఁడు భీముఁ డాజరాసంధు సంహారకర్మ
మున నిమిత్తంబయాఁ గనుక శీఘ్రంబె యప్పనిని సాగింపఁ దగును మహాత్మ

తే. యిట్టు లొనరుప నగులాభ మేమియనెదొ?
మాగధుఁడు చెఱఁబెట్టిన క్ష్మాపతులక
శత్త్రములు భీతికృదరివిలయము నాత్మ
పతివిమోక్షము ననుపీని నతిముదమున. ౮౪ 1293

క. తమతమ గేహంబుల శిశు, సమితుల నాడించువేళ జలజాక్షుఁడు దు
ష్టమహీశు జరాసంధున్, గ్రమ మొప్పఁగఁ జంపఁగలఁడు కాలాత్మకుఁడై. ౯

క. ఏడువకుఁ డేడువకుఁ డని, యాడించుచుఁ బాడుచుందు రంబుజనాభా!
పాడుదురెగాదె ప్రేతల, కోడం ద్రోగి నుత్సవములఁ గోరికమీఱన్ ౯ 1295

సీ. శంఖచూడవధంబుఁ స్వవిమోక్షణముఁ బాడుచున్నట్లు పూర్వ మీవొనరిచిన గ
జేంద్రమోక్షణ మసురేశుఁ డారావణు సంహరించుటయును సాధుమాను
లాదృతిఁ గీర్తించు టట్లె కంసునిజంపి తల్లిని దండ్రి బంధనమునుండి [కద
ముక్తులఁజేయు టేము గొనియాడుటయును జనులకుఁ దెలియు విషయములె

తే. యట్లుకావున నీపని సార్థకముగ, నొనరుపం దగు; మాగధు నని వధించు
కార్యమయ్యది బహ్వర్థగణసుసాధ,నముగుఁ జైద్యాదివధసాధనముగు టెన్న.

క. జనపతుల పూర్వసుకృతము, లనూనగతిచే ఫలించు టది హేతువుగా
వనజాక్ష! రాజసూయం, బనునది నీకభిమత మగు నర్థం బిడెదున్. ౧౦ 1297

*"నిమిత్తం పరమీశస్య విశ్వసర్గనిరోధయోః, హిరణ్యగర్భశ్శర్వశ్చ కాలస్యారూపిణ స్తవ."ట.

అని మూలము.

చ. కనుకనె ముందు ధర్మసుతుఁ గానఁగఁ బోఁదగు నంచు నామతం
బని సకలార్థసిద్ధిదము హారితరంబును నైన వాక్కుఁ జ
క్కనిగతి నుద్ధవుండు పలుకన్ విని దేవమునీంద్రుఁ డందునొ
ప్పు నిఖిలవృద్ధయాదవులు పుష్కరనేత్రుఁడు కృష్ణుఁడుం గడున్. ౧౧ 1298

క. అనుమోదించిరి మేలని,యు నుతించి; రనంతరంబ యురగాశనకే
తనుఁడు భగవంతుఁ డఖిలం,బునకున్ నాథుండు నగుచుఁ బొలిచెడు హరియున్.

క. గురువులయనుజ్ఞఁ గైకొని, కరిహయరథపత్తివితతిఁ గడువడిఁ గూర్పన్
సురనాథప్రస్థమ్మున, కరుగన్ దారుకుని జైత్రు నన్పె యితరులన్. ౧౨ 1300

క. పురిఁ గొలిపెం ద్వరఁ జనఁగా, సరసిజనేత్రుండు జ్యేష్ఠసహజన్ము యదూ
త్కరనాథుఁ గొలిచి వారలు, సరియగు నిక్కార్యమనుచు సమ్మతిఁ జూపన్.

చ. అరిజనసూదనుం డగుట నప్పయనంబున వేడ్కఁ బూని సుం
దరులను బుత్త్రసంయుతిని దాసిక లట్టులె సేవకుల్ మహా
బరికరయుక్తిఁ గొల్వ రథవర్యము లెక్కఁగ వేగ ద్వారకా
పురమును వెల్వడంబనిచి పూజ్యమనస్కుఁడు దారుకుం డొగిన్. ౧౩ 1302

సీ. గరుడకేతన మెత్తి తురగవర్యంబులఁ బూన్చి తెచ్చిన రథంబుఁ దమి నెక్క
స్యందనద్విపవరాశ్వపదాతి సాదినాయక బృందభయదమై నట్టిస్వీయ
బలములు బలసి తన్ గొలుచుచు రా భేరు లానకములు మృదంగగాలి గోము
ఖములులోనైన వాద్యములు ఘోషింపఁగ నాధ్వని దిక్కులనలముకొనఁగఁ

తే. బయనమయ్యెను శ్రీహరి పట్టణమ్ము, నుండి వెడలెఁ; బాతివ్రత్య మొప్ప వెలయు
భీష్మపుత్త్రిక లోనగు వెలఁదిమిన్న, లపుడు ప్రాణేశు వెనువెంట నరుగు కోర్కి.

క. నరయానంబులఁ గొందఱు, హిరణ్యశిబికంబులందు నెలమిం దురగో
త్కరములఁ గొందఱు పోయిరి, పురవరమును వెడలి యాత్మపుత్త్రులతోడన్.

చ. అనుపమవస్త్రమాల్యముల నాభరణాళివిలేపనంబులన్
దనులతికల్ వెలుంగ వనితామణు వేగఁ గరంబులందుఁ జ
ర్మనిశితఖడ్గముల్ వెలయ మానధనుల్ భటపుంగవుల్ త్వరం
జని రలవామనేత్రల నొసంగెడుశ్రద్ధను గాఁచువేడుకన్. ౧౪ 1305

చ. అతివలవెంట దాసికలు నచ్చరలం బురుడించు వేశ్యసం
తతియును సేవకుల్ బహువిధంబులఁ బొల్చెడుభూషణాంబులన్
జతనము మీఱఁ దాల్చి మహిషంబుల నుష్ట్రములన్ గరేణుగో
తతిని ఖరాశ్వతర్యళి నితాంతముదంబున నెక్కి శ్రీహరిన్. ౧౫ 1306

క. వెనుకొని పోయిరి కొందఱు, మనుష్యవాహ్యంబు లెక్కి మమతఁ జనిరి వే
యనుపమ శకటంబులపైఁ, జని రొకకొందఱు మునీంద్రసంస్తుతు వెనుకన్.

వ. వారివెంట సేవకులు శీరతృణవంశవస్త్రములు మొదలగు శిబిరాదిసాధనముల బలీవర్దాదులపై నిడుకొని వెడలిరి. మఱియు నాసేనాసముదయంబు తుముల ధ్వనులు వెలయ భూరితరధ్వజపటచ్ఛత్ర చామరములును దివ్యాయుధములు నాభరణములు ముకుటంబులు కవచములును గలిగి పట్టపగటివేళఁ దిమితిమింగిలాదిబృహన్మత్స్యంబులచేఁ గల్లోలములు తటంబుల నావరింప భానుకిరణంబులు పై వ్యాపింపఁ బ్రకాశించు మహార్ణవంబు చందంబున నమరియుండె నంత. ౧౭

చ. మునిపతి నారదుండు హరి ♦ పూజితుఁడై పరమేశు నిశ్చితం
బు నెఱిఁగి సంతసించి పరి ♦ పూర్ణుని దర్శనలాభ మెన్ను చుం
దనవగు నింద్రియంబులు ముదంబున వ్రాన్పడఁ జిత్తమందు వం
దనములొనర్చి యభ్రమునఁ ♦ దాఁ జనియెం గమలాక్షుఁ బాడుచున్. ౧౮

చ. హరి భగవంతుఁ డంత మను ♦ జాధిపదూతను గాంచి నీమదిం
బొరయకు భీతి భద్రమగుఁ ♦ బొమ్మిఁక మాగధుమ్రందఁ జేయుదుం
ద్వరపడి యంచుఁ బంపఁగ ను ♦ తండును బోయి యదెట్లు సాగెనో
ధరణిపతీంద్రసంతతికి ♦ దాఁపక తెల్పెను వార లుబ్బఁగన్. ౧౯ 1310

క. వారును బంధవిముక్తిం, గోరుచు హరి యెప్పవచ్చు ♦ క్రూరుఁగృతఘ్నుం
బోరి వధించునో యంచును, గోరికఁ బరమేశుఁ జూడఁ ♦ గోరుచు నుండన్. ౨౦

వ. శ్రీకృష్ణుం డానర్తసౌవీరమరువినశననామకదేశంబులం గడచి మఱియునందందుఁ బొడచూపు పర్వతంబుల నదులం దాఁటి పురగ్రామవ్రజాకరంబుల నుత్తరించి యవ్వల దృషద్వతియనుమహానదిని బహుమానపూర్వకంబుగాఁ దరించి సరస్వతిప్రాదిని నుత్తరించి పాంచాలమత్స్యదేశంబులం గడచి యింద్రప్రస్థ నగరంబుఁ జేర నరుదెంచుటయు. ౨౨ 1312

క. సామాన్యనరులు చూడఁగ, నేమాడ్కిఁ దరంబుగాని ♦ యీశుఁడు వచ్చెం
బ్రేమమున నన్నవార్తను, భూమీశుఁ డజాతరిపుఁడు ♦ పొంగెౕ వినుచున్.

క. సోపాధ్యాయసుహృత్తముఁ, డై పోయె౯ హరిని గనఁగ ♦ నఖిలప్రకృతులు౯
శ్రీపతిఁ గనుకోరికతో, వే పరివేష్టించి రాఁగ ♦ వేదధ్వనులున్. ౨౩ 1314

తే. గీతములు నాదములును మిక్కిలి చెలంగ
వాద్యఘోషము లెల్లెడఁ ♦ బర్వఁ బ్రాణ
యుతములౌ నింద్రియములట్టు ♦ లతిముదమున
నాహృషీకేశు చెంతకు ♦ నరిగి యచట. ౨౪ 1315

మ. వనజాక్షుం గని స్నేహభారమున సుస్వాంతంబు విక్లిన్నతం
గనఁగా స్నిగ్ధతముండు శ్రీహరి పురిం ♦ గాలంబు దీర్ఘంబు పు
చ్చినవాఁడౌట నవీనదర్శనము నిశ్చింతంబు నీవచ్చిన

ట్లనుమోదంబున గన్పడం గనుచు నాహా! యంచుఁ గౌంతేయుఁడున్. ౨౪

క. మరలన్ మరలం బ్రీతి, స్ఫురణము గన్పడెడు నట్టి । పోలిక నాశ్లే
షరతిం దృప్తిం గాంచెను, ధరణీశుం డంత వనజదళనేత్రు నటన్. ౨౫ 1317

చ. సిరికిఁ బ్రియాలయం బగుచుఁ । జెల్వగుగాత్రముతో వెలుంగ నా
దరమునఁ గాంచి యాతనులతన్ గయిజంటను గౌఁగిలించి ని
ర్భరగతిఁ గన్నులన్ సఖుని । రాక ముదశ్రుకణాళి నిండ గ
గ్గురు తనువెల్ల నిండఁగ ముకుందుని నచ్యుతుఁ జక్రిఁ గాంచుచున్. ౨౫

తే. లోకవృత్తాంత మెట్టిదో । యేకరణిని
దెలియకయె యుండెఁ; బావని । జలజనయను
మాతులేయుని నతిశయప్రీతిఁ గౌఁగి
లించుకొని సుస్మితంబు లలిం జెలంగ. ౨౬ 1319

క. ఆనందబాష్పములుఁ దన, వౌ నేత్రములం గలంప । నట్లే నిలిచెన్
శ్రీనిలయుఁ గవలు విజయుం, డూనినతమి స్నిగ్ధతముని । నొప్పుగఁ గనుచున్.

క. ప్రమదాశ్రుకణములన్ నేత్రములట్టె కలంగఁగఁ బరిరంభణమున ను
త్తమలాభ మొందఁ జేసిరి, రమాధవుం డంత ధర్మరాడ్భీములకున్. ౨౭

సీ. వందనమొనరించి । వాసవిఁ గౌఁగిటఁ జేర్చుకొంచుఁ గవలచేత వంద
నము చేయఁబడి వారిఁ । బ్రమదమునం దేల్చె బ్రాహ్మణులకు వృద్ధరాజి కుచిత
మగురీతిఁగా మ్రొక్కి । యవల సృంజయ కేకయులు కురుభూమిపతులును వేడ్కఁ
దన్ బహుమానింపఁ । దా వారి మన్నించె మాగధసూతులు । త్మాదివిజులు

తే. వినుతిచేయంగ విధిగ దీవింప వంది
జనులు కీర్తింప నెంతయు । సంతసించె
శంఖపటహమృదంగవంశముల వీణె
యలను జేఁబూని గాయకుల్ । హరిఁ బొగడిరి. ౨౮ 1322

మ. అరవిందాక్షుని దివ్యగాథలను నెయ్యంబొప్పఁగా నర్తకుల్
పరికీర్తించుచు నాడి; రిప్పగిది నాభవ్యోత్తమశ్లోకుఁడౌ
పరమేశుండు సుహృత్తముల్ వెనుకొనన్ । భవ్యాత్మురౌ మానవుల్
సరి లే రంచు నుతించుచుండ రుచిరస్థానీయముం జొచ్చెఁ దాన్. ౩౦ 1323

మ. పురమార్గంబులు గంధసింధురమదస్ఫూర్త్యుద్భవాంభఃకణో
త్కరసంసిక్తములై చెలంగె మఱి చిత్రత్విడ్ధ్వజవ్రాతభం
ధురమై హాటకతోరణావళులతో । నూత్నప్రభం బొల్చి క
ర్బురకుంభంబుల నొప్పుగుల్కుచుఁ దగెం । బూర్వార్య మప్పట్టునన్. ౩౧ 1324

చ. వనితలు పూరుషుల్ రుచిరవారిని స్నాన మొనర్చి మాల్యమిం

తనఁదగనట్టి వస్త్రముల ౯ నర్హ్యవిభూషణరాజినెంతయుం
దనువులు చెల్వమీఱ సుమదామములుం గలపంబు లొప్పఁబ
త్తనము నలంకరించి హరిదర్శనలాలసచిత్తులై తగన్. ౩౨ 1325

*సీ. ప్రతిగృహంబున దీపపంక్తుల వెలిఁగించి ప్రసవముల్ లోనగు ౯ బలులు చల్లి
పురము నలంకరించిరి పౌరు లత్తఱిఁ బ్రతిసద్మజాల మార్గములనుండి
పరిమళమిళిత ధూపముల ధూమములు వెల్వడుచుండరుచిరమైకడుఁ దనర్చె;
మఱియుఁ బతాకలామందిరంబుల నెత్తఁబడియుండ శిఖరముల్ శభవ్యరజత

తే. మయములై గేహములయందు ౯ మలయుచుండఁ
బైన బంగరుగిండ్లు సొంపూనియుండ
ముద్దుగులికెడు నప్పురి ౯ మురహరుండు
కనియెఁ గన్నులపండువు ౯ గా వెలయఁగ. ౩౩ 1326

చ. మనుజులు నేత్రపాత్రముల ౯ మంజుతనుద్యుతిఁ గ్రోల నర్హ్యఁడౌ
వనరుహనేత్రుఁ డప్పురికి ౯ వచ్చె నటంచొగి నాలకించి యిం
తనఁదగనట్టి సంతసమునంది పడంతులు క్రొమ్ముడుల్ తమం
తన విడిపోవ జాఱఁ బ్రమదంబునఁ బోఁకముడుల్ క్రమంబునన్. ౩౩౪ 1327

ఆ. ఇంటిపనులు మాని ౯ యింపుగుల్కెడు తల్పమందునున్న పతుల ౯ నట్టె వదలి
సకలలోకనాథుఁ ౯ జక్రిని జూడ రాట్పథముఁ జేర నెలమిఁ ౯ బాఱి రపుడు.

క. చనుదెంచి పూపుఁబోఁడులు, సనకాదిమునీంద్ర నిత్యసన్నుతుఁ గనువాం
ఛను మేడలెక్కి యట స్యందనదంతిపదాతి హయవితతి నిబిడంబై. ౩౮౪

క. పరికింప సంతసంబున, కిరవై తగుమార్గమందు ౯ నింతులతో శ్రీ
హరివచ్చుచుండఁ గాంచిరి, తరుణీమణు లంతఁ గుసుమదామము లెలమిన్.

ఆ. కృష్ణుపైనఁ జల్లి ౯ హృదయంబుచేతనే, కౌఁగిలించుకొనుచుఁ ౯ గమ్రసుస్మి
తమును గూడియున్న తళుకుఁజూపుల స్వాగతము నొసంగి రంతఁ బ్రమదలెల్ల.

చ. నరపతిమార్గమందు నుడునాథునిగూడి చెలంగుతారకో
త్కరమును బోని శ్రీహరి నితంబినులం గని యిట్లు పల్కి రీ
తరుణులు పూర్వజన్మమునఁ ౯ దత్పరతం గని యెట్టిపుణ్యమే
వరుస నొనర్చిరో కద? సెబా! సనవచ్చును దాని నెంతయున్. ౩౫ 1332

చ. పురుషలలాముఁ డైనహరి ౯ పొంకముమీఱ నుదారహాసయు
జ్జ్వలమచారుదృష్టికళ ౯ నెమ్మి నిగుడ్చుచు వీరినేత్రపం
కరుహము లెంతొ సంతసము ౯ గాంచఁగఁ జేయుచునున్నవాఁడు ని
ర్భరసుఖ మబ్బుపుణ్యముఁ బురంధ్రులు వీర లొనర్చియుండుటన్. ౩౬ 1333

* "ఉద్దీప్తదీపబలిభిః ప్రతిసద్మజాలనిర్యాత ధూపరుచిరం" అని మూలము.

చ. అని వినుతించుచున్ మిగుల హర్షమునొందుచుఁ జూచుచుండఁ బ
త్తనమున నున్న పెద్దలు సతతంబును శిల్పముచేత జీవనం
బొనరుచు వారలందును మహోత్తరులున్ బలుతావులందు శ్రీ
వనరుహనేత్రునిం దఱిసి వర్ణ్యశుభావహ హస్తహస్తులై. ౩౫ 1334

చ. హరిని సపర్యలం దనిపి యాత్మమహాఘములన్ క్షణంబునన్
బోరిఁబోరిఁ దూలఁజేసికొని పూజ్యమనస్కులుగాఁ జెలంగి; రం
సరసిజనేత్రుఁ డంత నృపసత్తమసౌధమునన్ వసించువా
రరుముద మొప్ప నీక్షణము లొయ్యన విస్తృతి గాంచిమించఁగన్. ౩౬ 1335

తే. సంభ్రమంబున నెదురుగాఁ జని సపర్య
లొనరుపం గృష్ణమూర్తి యాయుర్వినాథు
మందిరంబుఁ బ్రవేశించె; నిందిరేశుఁ
ద్రిభువనేశ్వరుఁ గాంచి కుంతియును మదిని. ౩౭ 1336

క. తనయన్న కొడుకువచ్చెను, దినముల కిన్నాళ్లఁ గనుచుఁ ద్రిగుణితమోదం
బున ద్రౌపదియు సుభద్రయుఁ, దనవెంటన్ రాఁగ లేచి తత్పరతదగన్. ౩౮

తే. ఎదురుచని కౌఁగిటం జేర్చి కృష్ణు గార
వించె; రాజగుధర్మజుం డంచితవిధి
నిర్జరేంద్రేంద్రు గోవిందు నిజగృహవర
మునకుఁ దోడ్కొని వచ్చి ప్రమోదవశత. ౩౯ 1338

క. ఆతిథ్యమందు శాస్త్రం, బేతీరున ముందువెనుక లివి యని తెలిపెన్
జేతమునఁ బొంగు నాదృతి, నాతీరును మఱచి యెట్లొ యప్పునిఁ దీర్చెన్. ౪౦ 1339

సీ. హరియును దన మేనయత్తయా కుంతికిఁ దనకంటెఁ బెద్దలై తనరునట్టి
వనితలకున్ విధివందన మొనరించి ద్రౌపదియును సుభద్రయును మ్రొక్క
సామోదమును బొందెను త్తయాకుంతి యాజ్ఞాపింప ద్రౌపది చక్రధరుని
సాధ్వులౌ రుక్మిణిసత్యభామాభద్రలనుమఱిజాంబవతినిని లక్ష్మ

తే. ణాఖ్యఁ గాళింది మిత్రవిందాఖ్య నాగ్న
జిత్తి మఱివారితోడ వచ్చిన కళత్ర
ములను దక్కినవారి నసమాల్యవస్త్ర
భూషణాదుల నలరించెఁ బూజనముల. ౪౧ 1340

చ. నృపతియుఁ గ్రొత్తక్రొత్తలయి నెమ్మిని దెల్పెడుపూజలన్ మహా
ర్షిపతిసుపూజితాంఘ్రిసరసీరుహ యుగ్మునిఁ గృష్ణుఁ దన్పెఁ ద
త్కృపకును బాత్రులైన సచివేశులకున్ భటసేవకాళికిన్
సపరికరంబులై వెలయు సద్మములన్ వసియింపఁ గూర్చెఁ దాన్. ౪౨ 1341

క. హారితరుణీ రత్నములకు, సురుచిరసుఖయోగ్యములయి శోభిలుసాధో
త్కరమును జూపెను; శ్రీహరి, సురనాథునితనయుఁ గూడి సురలునుతింపన్.
క. నివసించె నవ్వేలఁ ఖాం,డవమను నారామమున ధనంజయుఁ దృప్తుఁ
సవిధి నొనరించి మయుఁడను, దివిజారులశిల్పి యందుఁ దెగక బ్రదుకఁగన్.
క. ఒనరించి వానిచేతనె, మనుజేంద్రున కెల్లవిధుల మహితంబై యొ
ప్పిన దాని సభను దివ్యం,బును జక్కఁగఁ జేయఁబంచి బుధులు పొగడఁగన్.
ఆ. ఒసఁగె నంతఁ గృష్ణుఁ డుర్వీశునకుఁ బ్రియ, మొనరుపంగఁ గోరి యురురథంబు
నెక్కి విజయుఁగూడి పెక్కురు రథికులు, బలసి రాఁగఁ గ్రీడ సలుపుచుండి.
క. అందందుం దిరుగుచు సం,క్రందననందనుఁడు ప్రీతి రాజిల్లంగా
నందుండెఁ గొన్నినెల లా,నందమె తనరూపమగుట నైజ మహిమచేన్. ౪౬



## డెబ్బది రెండవ యధ్యాయము.

ధర్మరాజు హరికి రాజసూయయాగము సేయఁ దలంపుఁ దెలుపుట.

క. అని తెల్పి యాపరీక్షి, జ్జనపాలున కవలికృష్ణుచరితముఁ దెల్పం
గనుబూని శుకమహాముని, వినవయ్యా! యొక్కనాఁడు విప్రప్రవరుల్. ౧
చ. మునులును రాజు లూరుజులు భూరిపరాక్రమమొప్పు సోదరుల్
తనగురువుల్ స్వవంశమునఁ దద్దయు వృద్ధులుగాఁ జెలంగు మే
దినిపతు లల్ల బాంధవులు దీనులఁ బ్రోచెడుజ్ఞాతులుఁ సభం
దనుఁగొలువంగ ధర్మజుఁడు తాఁ బలికెఁ హరిఁ గాంచి భక్తితోన్. ౧౪ 1348
ఆ. సభను గూరుచున్న క్ష్మాపాలకప్రభృతులును శ్రద్ధవినఁగ జలజనాభ!
యజ్ఞములను మేటియగు రాజసూయంబు,చేఁ ద్వాదశ జులయి చెలఁగు సురల.
క. ఆరాధింపం బూనెదఁ, గోరిక నిద్దాని నుంత కొఱంత గనకయే
యేరీతిం గొనసాగు నొ, శ్రీరమణా! యట్లొనర్పు శీఘ్రమె దయతోన్. 3 1350
సీ. సరసిజనాభ! నీసురుచిరపాదుక లశుభముల్ నిరసించు నట్టివాట
నవ్వానిఁ దనువున నర్చింతురో మది ధ్యానింతురో భాషితములఁ బ్రీతిఁ
గీర్తింతురో వారు కేవలముక్తినేగాక వాంఛితములఁ గాంతు రమల
తమచిత్తులౌదు రుత్తమకార్యముల వాని నొనరింపరేని భూపోత్తములయి
తే. తగియు నామేలుపొందంగఁ దగరు సుమ్ము, కాన నోదేవదేవ! లోకమున నిందు
భవదమలపాదకంజముల్ భక్తిమీఁఱ,గొలువ నమరుప్రభావ మిట్లలరుననుచు.
క. కనుఁగొందురుగాక! మానవు, లనయము నీవిషయమును మహాత్తమ మనుచుఁ
మనములఁ దలంత్రుగాక! భు,వననాథా! సృంజయకురు వసుధేశులలోన్. ౫
మ. నినుసేవింపని వారలెవ్వరొ ధరఁ నీసేవ చేయంగఁ బూ

నినవా రెవ్వరో వారిదైన స్థితినిన్ । నీవిప్పుడే తెల్పు; మో
ఘనరూపా! సమదర్శనుండవయి లోకస్థాఖిల ప్రాణులం
దును నాత్మప్రభ నొప్పి సర్వగతులందున్ నీవెయై యొప్పుచున్. ౫ 1353

*క. స్వసుఖానుభూతినిం దగ వి,లసిల్లుచున్ బ్రహ్మమన విలాసమునన్ లో
కసమితి వర్తించెడు నీ,కసఖుండు సఖుండున్ విభేద । మరయం గలదే. ౫౪ 1354

క. సేవించుచు నిన్నెప్పుడు, భావించుచు నున్నయట్టి । భక్తులకు సదా
సేవానురూప మగుఫల, మావిబుధావనిరుహంబు । ననుకంపవలెన్. ౬ 1355

క. మనమునఁగల్గిన వాంఛల, కనురూపం బైనరీతి । నమరుచు నుండున్
మనమున వైషమ్యము నీ,కును గలుగునె యెప్పుడైనఁ । గువలయనేత్రా! ౬౪

మ. ధరణీశుం డిటుపల్కఁగా విని పరంధాముండు శ్రీకృష్ణుఁ డో
యరిసంఘాంతక! నీదునిశ్చితము సమ్యక్పద్ధతిం బొల్చు న
ధ్వరవర్యం బిది నీవొనర్చినఁ గదున్ । భద్రప్రదంబై మనో
హరమౌ కీర్తిపాసంగు నయ్యది ధరన్ । వ్యాపించి రాజిల్లెడున్. ౭ 1357

మ. క్రతురాజం బిదియౌ సమస్తవిధులం । గళ్యాణదంబై తగున్
బితృదేవాళికి మౌనివర్యులకు నీ పెంపున్ సదా వర్ధిలన్
మతులం గోరెడుమాకు భూతముల కానందంబు గూర్పం దగున్
క్షితిపాలప్రకరంబు నొంచి యశమున్ । సిద్ధింపఁగా నెల్లెడన్. ౮ 1358

క. జగమంతయుఁ జక్కంగ వ,శగతముగా నుండఁజేసి । సంభారములం
దగుభంగిన్ సమకూర్పఁగఁ, దగు నుద్యోగులను బంచి । తత్క్రతువరమున్. ౯

క. సవిధిగ నొనరింపుము భూ,ధవుల జయింపంగ శక్తిఁదగు నెట్లనుదో
భువనాళిపాలకాంశో,ద్భవులగుదురు సుమ్ము నీదు । తమ్ములు వీరల్. ౯౪ 1360

సీ. అకృతాత్ములకు గెల్వ । నలవియేగాని నే నాత్మవంతుఁడవయి । యలరునీదు
వశమునున్నాఁడ । భక్తుఁడవగునీకు సాధింపఁదగని దేశచందమునను
గల్గునే; నన్ను నిక్కముగ నమ్మినవాని దేవుఁడేయైనను । దేజమునను
యశమున సంపత్తి । నతులసేనాదికసాధనంబుల నదేశసరణినైనఁ

తే. జెనకఁజాలరు రాజులు । నినుఁ జెనకుదు
రనుట యపహాస్య భాజనంబగును గాదె;
యనుచు భగవంతుఁ డాజ్ఞనీయంగ వినుచుఁ
బ్రీతుఁడై మోముఁదమ్మియు । విరియఁబాఱ. ౧౦౪ 1361

క. హరితేజంబున నెంతయుఁ, బరిపూర్ణులుగాఁ జెలంగు । భ్రాతల నెల్లన్
బరికించి దిగ్విజయమునఁ, బరమాదృతిఁ గాంచఁబంచెఁ । బరమేశాజ్ఞన్. ౧౧

* "నబ్రహ్మణ స్స్వపరభేదమతి స్తవస్యాత్" అని మూలము.

సీ. సహదేవు యామ్యదిశం జెలంగుసృంజయ భూమిపాలురతోడం బోరం బంపె
నకులుం బశ్చిమదిక్కునకుం బంచె నర్జును నుత్తరదిశ కేగి యుర్వీపతుల
నోడించి రమ్మని యొప్పమీఱంగం బంపె మాత్స్య కేకయులను మద్రకులను
గెలిచి రమ్మని భీమబలుండైన భీమునిం బ్రాగ్దిక్కునకుం బంచె వారలెల్ల

ఆ. ధర్మరాజునాజ్ఞం దలందాల్చి యాయాయి, దెసల కరిగి యందు నెసంగు వీర్య
మలరనున్న భూమిపుల గెల్చి తేజంబు, వెలయ యజ్ఞదీక్షం గలనృపతికి. ౧౩

క. ధనరాశిం దెచ్చియిచ్చిరి, మనుజేంద్రుం డంత నృపవిమర్దనదీక్షం
గని యున్న జరాసంధుని, ననుజాతులు గెల్వ కునికి నార్తిం గనంగన్. ౧౪

క. వనజాక్షుం డెఱిఁగి పూర్వము, తనతో నుద్ధవుండు వాని దండించుపథం
బును దేనిదెల్పె దానినె, వినిపించె; ననంతరంబ భీముండు నరుండున్. ౧౫

చ. హరియును విప్రవేషముల నల్లనం దాల్చి జరాతనూజుం డే
పురమునయుండు నచ్చటికిం బోయి రదొప్పు గిరివ్రజంబు నా
ధరణిం బ్రసిద్ధమై సిరులం దద్దయు మించును; వీర లిట్లు భూ
సురవరవేషముల్ పొలయం జొచ్చి గిరివ్రజపత్తనంబునన్. ౧౬ 1366

సీ. అంతఃపురంబులయందుండి గృహమేధి ధర్మంబునడపుచుం దనను జూడ
నరుగుదెంచినవారి నాతిథేయంబున సత్కరించుచు విప్రసత్తములకు
హితము గోరుచు నున్న క్షితిపపూజ్యుని జరాసంధుని జూచు నుత్సాహ మలర
బ్రాహ్మణవేషముల్ పరిఢవిల్లంగం బోయి యాతిథ్య మొనరించు నట్టితఱిని

తే. జేరి యోభూమిపాలకా! దూరదేశ,మును వదలి నీదుకడకు వచ్చినయతిథుల
మగుదు మేమట్టి మాకోర్కెం దగ ఫలింపం,జేయ నీకును మేలగు సిద్ధమిద్ది.

*క. ఓరుపు చక్కంగం గల్గిన, వారికి దుర్మర్ష మెద్ది వసుధం గలుగు? నె
వ్వార లసాధువులో య,వ్వారి కకార్యం బదెద్ది? వసుధాధీశా! ౧౭ 1368

క. దాతలకు నదేయము గల,దే? తలంప సమత్వదృష్టి యొసంగెడు సాధు
వ్రాతమునకుం బరుం డనంగా, నేతఱినేం గలండె? యెఱుంగనే యిది రాజా! ౧౮

మ. జనుం డెవ్వాండు సమర్థుండయ్యు స్థిర మోచందమ్మునం గాక యుం
డిన యీదేహముచేత సద్వినుతమై నిత్యంబునౌ సద్యశం
బును జేకూర్చుకొనండో నింద్యుండనంగా భూలోకమం దాతండే
యనంజెల్లుక్ మఱి శోచ్యుం డొక్కయతండే యాంజుమ్ము యోజించినన్. ౨౦

* "కిం దుర్మర్షం తితిక్షూణాం కిమకార్యమసాధుభిః, కిం న దేయం వదాన్యానాం కః పరస్సమదర్శినామ్" ౧౯. అని మూలము,

*సీ. విను హరిశ్చంద్రుఁడర్క।మనుజేంద్రుఁడుఁ రంతిదేవుండు నుంఛవృ।త్తిని జెలంగు
ముద్గలుండను విప్ర।ముఖ్యుండు శిబియును బలిచక్రవర్తియు । వ్యాధ కలర
వమ్ములు లోనగు । బహుసంఖ్యులగు వార లధ్రువమైన దేహమున దీన
శాశ్వతమైన మోక్షమును బొందిరి గాదె యనుచు యాచించిన । నాజరాత్మ
ఆ. జుఁడును వారిఁగాంచి । సుస్వరమ్ముల దేహ,ములను నారిరాపి।డులఁ గలిగిన
యట్టిగుఱుతు లున్న।యవ్వారి ముంజేతు,లను క్షితీశబంధు।లనుగ నెఱిఁగి. ౭౧
క. మున్నే వారలఁ దాఁగని, యున్నట్టు లెఱింగి యాత్మ । నూహించెను; వీ
రన్నఁ నృపబంధువులే, సన్నుత భూదేవవేష।శాలురు గాఁగన్. ౭౨ 1372
క. చనుదెంచినారు వీరల, మనములఁ గలవాంఛ యెట్టి।మాడ్కిగనే యు
న్నను లేదనకే యిత్తును, దనువిది దుస్త్యజమెయైనఁ । దమి వేఁడినచోన్. ౭౩
క. కాదనకయె లేదనకయె, యీఁదగు నంచోసఁగువాఁడ । నిది తుచ్ఛమగుం
గాదే; పూర్వము శ్రీహరి, భూదేవప్రవరవేష।మున వచ్చి బలిన్. ౭౪ 1374
క. యాచించిన నిచ్చెద నని, యాచితిమీఱుంగఁ బల్కి । యయ్యది స్వశ్రీ
నేఁచునదియైన సఫలం, బైచనఁగాఁ జేయఁ గీర్తి । యతినిర్మలమై. ౭౫ 1375
క. నలుదెసలఁ వ్యాపించుట, తెలిసినదది కాదె వినమె । దితిజేంద్రుఁ డతం
డలవిష్ణువు ద్విజవేషం,బలరంగా వచ్చితనదు । నైశ్వర్యంబున్. ౭౬ 1376
క. తా నపహరించి యింద్రున, కీనెంచుట మదిని జక్క । నెఱిఁగియు నోరులీ
దానము హానికరంబగుఁ, గానని యీవల దటంచుఁ । గడఁకం బలుకన్. ౭౭
క లెక్కింపక తనపల్కును, దక్కించుకొనంగ భూమి।దానముఁ జేసెఁ;
నిక్కముగాఁ దలపోసిన, నెక్కెవడినే నశించు । నీదేహమ్మున్. ౭౮ 1378
ఆ. విశ్వసించి భూమి।విబుధుల కొఱకుగా, క్షత్రబంధు వొకటఁ । గడు శ్రమించి
యమలతరయశంబు । నార్జింప నొల్లఁడే,నతని బ్రదుకువలన । నగు నదెద్ది? ౭౯
చ. అనుచు నుదారచిత్తుఁడగు । నాధరణీశుఁడు పల్కి యంతనా
వనజదళాక్షు నర్జునుని । వాయుకుమారుని గాంచి విప్రులా
ర! నియతి మీరుకోరెడు వరంబుల నింకడుగుండు మూర్ధమే
మనమున జంక కిచ్చెద సమస్తవిధంబుల నెంచి యంచనన్. ౮౦ 1380
చ. హరి భగవంతుఁ డిట్లనియె । నల్లన నోమనుజేంద్ర! ద్వంద్వసం
గరమునొసంగు సమ్మతము।గాఁ దగునేని రణంబుఁ గోరి నీ
దరికరుదెంచినట్టి వసు।ధాపరిపాలకులే యటంచు మ
మ్మరయుము, యన్న కాంతుఁడగు । నర్థులమై యిటరాము నిన్గనన్. ౮౧ 1381

* "హరిశ్చంద్రో రంతిదేవ ఉంఛవృత్తి శ్శిబి ర్బలిః" అని మూలము. "ఉంఛవృత్తిః ముద్గలః అని వ్యాఖ్య."

చ. ఇతఁడు వృకోదరుండు మనుజేంద్ర! పృథాసుతుఁ డర్జునుండు వీఁ
డితని సహోదరుండె యని యెన్నుము వీరల మేనమామకున్
సుతుఁడను నీకు వైరి మధుసూదనుఁడం జుము నన్నెఱుంగు మ
చ్యుతునిగ నన్న మాగధుఁ డహో! యని బిట్టుగ నవ్వి యంతలోన్. ౨౯

క. భరియింపరాని క్రుధ భీకరరవ మెప్పంగ నిట్లు గాఁ బల్కెను సం
గర మిత్తు మందులారా!, పరిగ్రహింపుఁడు మఱొక్కపల్కు వినుండీ! ౩౦

ఉ. సంగరమందు సుంతయును శౌర్యముఁ జూపఁగలేక భీతిచే
తం గడుఁదూలి స్వీయపురతల్లజమౌ మథురం దొఱంగి యే
యంగద నీవె దిక్కనుచు నంబునిధిన్ శరణంబు వేఁడి యం
దుం గలకాల ముండు నిను దొంగనుగాఁగ నెఱింగి యుండియున్. ౩౧

క. నటుపురు నవ్వఁగ నీతోఁ, గలహము సేయంగఁ బూనఁ గాఁ దగునే; మి
క్కిలి సత్త్వహీనుఁ డీఁడునఁ, దలఁపఁగ నీయర్జునుండు తగఁడు సముఁడనన్.

క. కనుకన్ నాతో యుద్ధంబును జేయ ననర్హుఁ డౌటఁ బో రొనరింపం
గనుబూన వీనితోఁ బావని యీతఁడు మత్సమానబలశాలి యగున్. ౩౨

చ. అని వచియించుచున్ భయదమౌ గద నొక్కఁడు వాని కిచ్చియిం
క నొకఁడు తాను జేకొని నిరామజవంబునఁ బూర్వహిస్త్వలం
బునకును బోయె; నంత సమభూమిగ నున్న రణాంగణంబునన్
బనిగొని వీరవర్యులగు వారిరువు ర్వడి నొక్కరొక్కనిన్. ౩౩ 1387

చ. తలఁపడి యుద్ధదుర్మదులు దారుణసంగరకేళియందుఁ బ్రీ
తులు నగుటన్ బవిద్వయముతో సరివచ్చు గదాద్వయంబునన్
బలుగతులౌ ప్రహారములఁ బంతము లొప్పఁగఁ గొట్టుకొంచు మం
డలగతులన్ విచిత్రము లనందగు నట్లుగ సంచరించుచున్. ౩౪ 1388

క. వలపట దాపటగా స్వేచ్ఛలుమీఱఁ జరించుచుండు సమయమునందున్
సులలిత నాటకరంగస్థలమున నటులాడు నట్టిచందం బొప్పెన్. ౩౫ 1389

క. ఇతరేతరమ్ము వజ్రద్వితయము దార్కొనినయట్లు ద్విపములు దంత
ద్వితయముచే డీకొనియెడు, గతి వారిర్వురును భీతికరముగఁ దాఁకన్. ౩౬

*తే. చటచటాశబ్ద మొక్కటి సంభవిల్లె;
నంత వారలు భయదగదాయుధముల
బలముకొలఁదిఁ బ్రయోగించి కలహరంగ
మందు గట్టిగఁ గొట్టఁగా నాగదలొగి. ౩౭ 1391

సీ. మూఁపులఁ గటిభాగములఁ జరణంబులఁ గరముల నంసయుగ్మమ్ము సంధి

* "తతశ్చటచటాశబ్దో వజ్రనిష్పేష సన్నిభః" అని మూలము.

యందుండునెముకల నంకభాగములను దగిలి కోపంబున దారుకొనిన
గజములఁ దగిలి యర్కద్రుమశాఖలు విఱిగెడురీతిగా వింతగూర్పఁ
దునుకలై పడియె; నాఘనగదల్ విఱుగంగఁ బురుషవీరులు వారలిరువు రెంతొ

తే. క్రుద్ధులై లోహములభంగి క్రూరములుగ
గానఁబడు ముష్టిఘాత నికాయములను
బిష్టముగ దేహముల్ తగఁ బెనఁగి రిట్లు
పోరుచున్ హస్తతలఘాతములను బెలుచ. ౩౮ 1392

క. త్వరపడి చఱచుకొనంగా, నురుశబ్దం బొక్కఁ డప్పు దుష్ప్రతిలేన్ భీ
కరవజ్రనిరవముల, వరుసం జెలరేఁగె; నిట్టిభంగిన్ వారల్. ౩౯ 1393

క. బలమునను శిక్షౌజస్సులఁ దుల్యులుగాఁగ మెఱయుచున్ క్షీణత యె
ట్టులు గాంచని బలములతోఁ, గలహమ్మొనరింప సమతఁ గాంచుచునుండెన్.

*సీ. ఇట్లుపోరాడఁగ నిరువదియేడుదినములు చెల్లెను సుహృత్సముదయమ్ము
నిశలందుఁ జూచు చుండిరి; పూర్వ మొకనాఁడు పావని మాతులుపట్టియైన
హరిఁగాంచి మాధవా! యాజరాసంధునిఁ బ్రథనంబునన్ జయింపంగఁజాల
నని తానుజెప్పి యుండెను దానవారియు నరిభాగయుగముగ నవనిబడియెఁ

తే. బుట్టువేళనె రెండంశములుగఁ జచ్చు
మృతిసమయమున నని యాత్మనెఱుఁగుఁ గాన
జరయు నాతని బ్రదికించె శకలయుగము
గలిపి యనియు నెఱుంగును గాన నపుడు. ౪౧ 1395

చ. తనదగు దివ్యతేజమునఁ దత్పవనాత్మజుఁ బుష్టినొందు న
ట్లనువుగఁ జేయుచున్ బ్రబలుఁడౌ నరిఁ ద్రుంచు నుపాయ మెట్టులో
యని తలపోయుచున్ సఫలమై తగుదర్శనుఁడౌటఁ జాలఁ జ
క్కని వెరవెంచి కొమ్మఁగొని క్రన్ననఁ జీలిచె బోధనార్థమై. ౪౨ 1396

తే. నేను జీలుచునట్లు పెంపూని వీనిఁ
జీలుపుము వేగ యని సైఁగ చేసె; దాని
భూరిసత్త్వుండు ప్రహరించువారియందు
మేటియును గాన భీముండు మించుశక్తి. ౪౩ 1397

సీ. పగవానిపాదముల్ తగునట్లుగాఁ బట్టుకొని భూమిఁ బడవైచి కోపమడర
నరిపాద మొకకాలనడఁగంగఁ ద్రొక్కి వేఱొకకాలఁ గనదుబాహువులఁబట్టు
కొని మహత్తరదంతి కోరిక నవలీల వృక్షశాఖనుబోలె నాక్షణంబ
క్రిందియంగమునుండి రెండుగాఁ జీలిచె; నంతట నొకకాలు నంక మొకఁడు

* నాగరపుస్తకమునఁగల ౪౦-౪౧-వ శ్లోకము తెలుఁగక్షరముల ప్రతియందు లేవు.

తే. ముష్క మొక్కఁడు కటియొండు మూఁపొకండు
స్తనమొకఁడు నేత్ర మొక్కఁడు కనుఁబొమయును
జెవియు నొక్కొక్కఁడుగఁ దగ క్షితిని బడిన
వానిగా మానవులుగాంచి రాను వేడ్క. ౪౬ 1398

చ. అనిమొన మాగధుండు మృతినందినఁ గాంచిన పౌరు లెల్లరున్
బెనువగ నక్కటా! యనిరి భీముని గౌఁగిటఁజేర్చికొంచు నా
వనజదళాక్షుఁ డానరుఁడు బాగుగ నాదృతిగారవించి; రం
త నిఖిలభూతభావనుఁడు ధాతృముఖస్తుతుఁ డచ్యుతుం డెదన్. ౪౭ 1399

తే. చక్ర యోజించి యాజరాసంధతనయుఁ
డైన సహదేవు మగధదేశాళి కధిపు
గాఁగ నభిషిక్తుఁజేసె నిక్క మ్మెఱుంగు
ప్రోడయాట నమేయాత్మకుఁ బొల్చుచుంట. ౪౮ 1400

క. నరపతుల మాగధేశ్వర, పరిబద్ధుల విడిచిపుచ్చె బాధ లడంపన్
ధర నవతరించి యొప్పెడు, పరిపూర్ణుండౌట సర్వపతి తా నౌటన్. ౪౯ 1401

డెబ్బదిమూఁడవయధ్యాయము.

రాజులు శ్రీహరిని స్తుతించుట.

క. మగధేంద్రుఁడు చెఱలో నుంపఁగ బాధలనొందుచున్న పార్థివు లెల్లన్
వగలం గుందుచు మోక్షం,బు గల్గునేయంచుఁ జాలఁ బొగులుచు నుండన్. 4

క. హరి యెఱిఁగి విడిచిపుచ్చెను, ధరణీశుల మాగధుండు దారుణమౌ సం
గరమున లీల జయించెను, బరాక్రమోపేతుఁడౌటఁ బంత మ్మలరన్. ౧ 1403

సీ. చెఱలోన నుంచె నాక్షితిపాలకులు పెక్కుసంఖ్యలుగాఁ జెఱసాల నుండి
వస్త్రముల్ మాసిపోవఁగ మలినాంగులై తూలుచు నాగిరిద్రోణినుండి
వెడలిరి; మఱియు నావిశ్వంభరేశులు క్షుద్బాధ తమ్మేఁచఁ గుందుచు మఱి
మోములెండఁగ దేహములు చిక్కియుండంగ వెలువడివచ్చి వే విశ్వనాథుఁ

తే. బీతకౌశేయవాసు జీమూతమట్లు
తనువు శ్యామవర్ణంబుగాఁ దనరుచుండఁ
గనఁబడిన కృష్ణమూర్తిని గనిరి; హరియు
నురమునందు శ్రీవత్సాంక మొప్పుచుండ. ౨ 1404

చ. కరములునాల్గు దీర్ఘతను గ్రాలఁగఁ బంకరుడంతరారుణా
భ రుచిఁ జెలంగునేత్రములు భాసిల సుందరమై ప్రసన్నమై
నిరుపమమై ముఖంబు దగ నిర్మలకాంతులఁ జల్లునమ్మనో

హారమకరాభకుండలము । లద్భుతరీతిని జెన్ను మీఱఁగన్. ౩ 1405

ఉ. తామరతూఁడు లట్లుగ నిరంతము దీర్ఘత నొప్పుచున్న యా
కోమలహస్తముల్ వెలయఁ । గోర్కులనీను గదారథాంగశం
ఖామలపద్మచిహ్నములు । హస్తములం గనుపట్ట నెంతయున్
శ్రీమహితుండు భక్తజనసిద్ధిదుఁ డొప్పె ననూనసంపదన్. ౩౪ 1406

సీ. తారహారము లంగదములును ముకుటంబుఁ గటిసూత్రమును జారుకటకములును
గనుపట్టుచుండఁగఁ । గంఠమ్మునం గౌస్తుభంబను రత్నము । భాసిలంగ
వనమాల వక్షమ్మునను వ్రేలుచుండంగఁ జూడఁగాఁదగియున్న । సుందరాంగుఁ
గాంచి రాభూమీశ । కాంతులు; మఱివారు కన్నులచేఁ ద్రావుకరణి జిహ్వ

తే. జుట్టునట్లును ముక్కుల । సొంపుమీఱ
మూరుకొనునట్లుగా హస్తములను గౌఁగి
లించుకొనుభంగిఁ గననయి । పంచశరుని
తండ్రి యడుగుల భక్తి నొసలలు చేర్చి. ౬ 1407

క. వందనములు చేసిరి; యరవిందాక్షునిదర్శనమున । విధ్వస్తములై
ముందున్న బాధ లన్నియుఁ, గ్రందుగఁ దొలఁగంగఁ జాలఁగౌతుక మొలయన్.

చ. కరములు మోడ్చి యాదివిజకాంతశరణ్యు నుతించి; రిట్లుని
ర్జరసముదాయనాథ! పడరాని వెతల్ గనువారినెల్ల నా
దరమునఁ బ్రోచుదైవమవు । దారుణసంస్కృతిరూప సాగరాం
తరపరిమగ్నతన్ స్మృతి వినాశము నొందఁ దపించు మమ్ములన్. ౭౪ 1409

క. శ్రీకృష్ణ! యుద్ధరింపుము, భూకాంతుఁడు మాగధుండు । పూని యపకృతిన్
మా కొనరించెనుగద యని, యేకీడును వానియెడల । నెంచము నాథా! ౮౪

ఆ. రాజులమగు మాకు । రాజ్యవిచ్యుతిగల్గుటరయ మాగధేంద్రుఁడను నెపమున
నీవు చూపినట్టి । నిర్మలానుగ్రహ, మింతెకాని వేఱ । దెన్నఁగలదె? ౯ 1411

క. రాజ్యశ్రీమదమత్తుఁడు, పూజ్యశ్రేయంబు నొందఁబోఁడు సురేశా!
ప్రాజ్య భవన్మాయాయుతి, చే జ్యాస్థలి మోహితుఁడయి । స్మృతిలేకయె తాన్.

క. అతిచంచలముల సంపత్తతులన్ నిత్యమ్ములనుచుఁ । దలఁచుం జుమ్మీ!
క్షితి బాలుఁ డెండమావుల,మతి నుదకాశయమె యంచు । మన్నించు గతిన్.

సీ. అవివేకులగు వారలు వికారజనిత మా
యామోగమున భ్రాంతినంది వస్తు
వుగ నవస్తువును జక్కఁగ నెంతు; రో ప్రభూ!
మేమెల్లఁ బూర్వ మీభూమి గెల్చి

తలఁపున మతిచెడి యలయక యన్యోన్య
సంస్పర్థ నూని యేచందమునను
గాంచిన దయయొ లేకయె మృత్యురూపము
నను ముందుఁ దగు నిన్నుఁ గనుఁగొనంగఁ

ఆ. జాలునేర్పు లేక లీల మాప్రజలఁగూల్చిన మదాంధులము; విచిత్రరూప!
యట్టిమేమె యిప్పు డతిగభీరంబు దురంతవీర్యమునయి యలరి మఱియు.

క. నీమూర్తియెయగు కాలము, స్వామీ! యాసంపదలను సమయింపఁగ నీ
దౌ మానితకృపచేతనె, యీమాడ్కిన్ గర్వమెడల నెంతయు భక్తిన్. ౧౩

ఆ. నీదు దివ్యచరణ నీరజంబుల నెప్డు, దలఁచుచుండు మిదియె తావకాను
కంపయాను; సర్వకాలంబు సకలలోకాలయముగ నొప్పు నంగ మిదియు.

క. అనవరతము నశ్వరమౌ, దనువిది యిద్దానిచేతఁ దలఁపఁగ మృగతృ
ష్ణను బోలు రాజ్యమును గొల్వను రాదు సమస్తలోకభువనాథ! హరీ! ౧౪

క. మృతినొందిన పిదపన్ సంగతమయి వీనులకు విందుగాఁదగి కర్మా
ర్జితఫలమగు స్వర్గాది వితతలోకములందు నుండఁదలఁపము దేవా! ౧౪ 1418

ఆ. అవియుఁ బతనమొందు నట్లుగాఁజేయును, గాదె కానవానిఁ గనఁగ మాకు
వాంఛగల్గ; దీశ! భవపూజ్య! సంసార, మందుఁ దిరుగుచున్న యట్టి మాకు.

క. భవదమల దివ్యపద జల, భవముల సంతతము స్మృతియుఁ బరఁగ నుపాయం
బు విభూ! యుపదేశింపుము, సవిధిగ! నోకృష్ణ! నృహరి! సరసిజనేత్రా! ౧౫

క. పరమాత్మ! వాసుదేవా!, నిరుపమమహనీయరూప! నిత్యప్రణతో
త్కరకష్టహరణ! గోవింద! రమేశా! వందనము లొనర్తుము భక్తిన్. ౧౬ 1421

మ. అని యీరీతిఁ బ్రముక్తబంధనులు హర్షాంభోధిమగ్నుల్ నృపుల్
తనుఁ గీర్తించుచునుండ సర్వజన సంత్రాణైకదక్షుండు శ్రీ
వనజాక్షుండు శరణ్యుఁడౌటఁ గరుణన్ వారిం గటాక్షించి యి
ట్లనియెన్ దీయనిపల్కు లొప్ప; నృపులారా! యీదినం బాదిగాన్. ౧౭ 1422

క. మీరలు కోరినచొప్పున, భూరిబ్రహ్మాండజాలముల కధిపతినై
యారయఁ బరమాత్ముఁడనై, సారసగర్భాదులకును జనకుఁడ నగుచున్. ౧౮

ఆ. ముక్తిదాతనగుచుఁ బొలుచునాయందు సుదృఢముగాఁగ భక్తియొసఁగుఁగాక;
భాగ్యవశముననె సుభద్రమౌ నిశ్చయ, మిట్లు చేసికొంటి రిది తగుఁ దగు.

క. సూనృత భాషణులగుదురు, గానన్ భూపాలురార! కడు భాగ్యంబే
యౌనిది; శ్రీసంపదలన్, మానసములు మత్తతఁగను మనుజుల కరయన్. ౧౯

క. అందం దీవిషయంబును, గందును నే నప్పుడపుడు గాన్ మీవా
గ్బృంధము సత్యంబే యగు, విందురుగద మున్ను కార్తవీర్య నహుషులున్. ౨౦

క. వేనుఁడు రావణనరకులు, భూనాథు లనేకు లమరపూగము దితిపు
త్త్రానీకము సంపన్మద, మూని పదభ్రష్టులౌటయును బ్రథితమె కా! ౨౦ 1427

సీ. జన్మించునది వినాశమునొందునని నిశ్చయించి ప్రమాదంబు నెట్టులేని
పొందక యధ్వరమ్ముల నన్ను భక్తిచేఁ బూజించుచుఁ ధర్మమునఁ బ్రజలను
గాపాడుచుఁ మీరు కంజభవాజ్ఞయై తనరు ప్రజాసంతతిని జగతిని
వృద్ధిచేయుచు జన్మమృతులను సుఖదుఃఖములను గాలప్రాప్తములని తలఁచి

తే. యనుభవించుచు బుద్ధినాయందె నిలిపి, సంచరింపుఁడు; దేహాదిసంచయముల
యం దుదాసీనులై యాత్మయైన నన్ను, మదిని నిల్పుచు మీరు ప్రమాదపడక.

చ. వ్రతముల భక్తి సల్పుచును బ్రహ్మము గాఁ దగు నన్నుఁ గాంతు రా
మృతిసమయంబునం; దనుచు మేదినినాథుల కానతిచ్చి లో
కతతి కధీశ్వరుండు హరి కంజవిలోచనుఁ డెల్లవార్తలన్
మతిని గడుఁ స్మరించి బహుమానముమీఱఁగ వారి కాదృతిన్. ౨౩౪ 1429

క. తలలంటిచక్క మజ్జనములు లోనగువాని జేయఁ బోలినపురుషా
వళుల నియమించి స్త్రీలకు, లలనల నియమించె బుద్ధులం దగువారిన్. ౨౮

ఉ. వారల కెల్ల భంగుల నవారితగౌరవ మల్లి హెచ్చు న
ట్లారసి భూవరోచితము లై తగునంబరహారభూషలన్
జారువిలేపనంబులను సమ్మతిచే సహదేవుఁ డిచ్చి యిం
పారుసపర్యలన్ నడుప నత్తఱిఁ జేసెను వేడ్కయుబ్బఁగన్. ౨౯ 1431

సీ. మజ్జనకృత్య మొమ్మాడ్కిగ సల్పి సువస్త్రభూషణముల నరుసఁ దాల్చి
యున్నవారికి మంచియన్నము పెట్టించి భోజనముల్ చేసి భూవరోచి
తములగు కర్పూరతాంబూలముఖ భోగములఁ దృప్తినొందంగఁ బూన్కిఁ జేసె;
క్ష్మాపతుల్ వారు లక్ష్మీపతిచే ముక్తి నొందింపఁబడి పూజ లొంది చక్క

ఆ. మెఱుఁగు పెట్టఁబడిన మేలికుండలములు, శ్రుతులనొప్ప ఖచరవితతి వ్రుప్తి
కాల మరుగ వెలుఁగుకరణి నొప్పారిరి; కృష్ణుఁ డంత వారి నెలమిఁ గాంచి.

చ. కనకమణీకలాపయుతిఁ గ్రాలుచు సాధుతురంగ సంయుతిం
దనరు రథాళిపై నునిచి దారుణబాధలఁదోలు వార్తతిన్
దనుపుచుఁ బోవఁ బంచె నృపతల్లజు లెల్లరు స్వీయదేశముం
గనఁజని; రిట్లు చక్రధరు గాఢకృపన్ బరిముక్తులై త్వరన్. ౩౦౪ 1433

మ. పరమేశున్ మహితాత్మునిం దలఁచుచున్ బ్రఖ్యాతతత్కృత్యముల్
పరికీర్తించుచు సేవకప్రతతికిన్ బద్మాక్షుకృత్యంబు లా
దరణం బుట్టిపడంగఁ దెల్పుచు నితాంతజ్ఞానదంబైన శ్రీ
వరునాజ్ఞం దలఁదాల్చి వర్తిలి రదే భద్రప్రదం బంచొగిన్. ౩౧౪ 1434

క. వనజాక్షుం డిటు వ్యాసుని, తనయునిచే మగధపతిని దారుణకృత్యుం
మనుజేంద్రు లలరఁ జంపించెను దత్పూనుండు పూజఁ జేసి దనుఁ దన్పన్. ౩౦౫

తే. భీము నర్జునునిం గూడి వెడలె నిట్లు, వారు మూవురు వైరిసంహారమునను
సంతసించుచు స్వపురికిఁ జని సుహృత్తముల కు సంతుష్టి దుర్హృదాయులకు వగను.

క. కలిగించుచు శంఖారవములఁ బిక్కటిలంగఁ జేసి మోదము పూర్వం
గలిగిరి ధర్మజునకు నందలి వారు తదీయనిస్వనంబున కెలమిన్. ౩౨ 1437

చ. మనసులు మోదవార్ధిపరిమగ్నములై తగ మాగధుండు చ
చ్చినయటులే తలంచిరి; ప్రసిద్ధయుధిష్ఠిరవాంఛితంబు చ
క్కనిగతిఁ బండె; భీమనర కాంచనచేలురు భక్తిమీఱ వం
దనము లొనర్చి శత్రుపురిఁ దా రొనరించిన కృత్య మేర్పడన్. ౩౩౫ 1438

ఆ. ధర్మజునకుఁ దెల్ప దామోదరుని యనుగ్రహము నొంది విని నికామమోద
బాష్పబిందువులను వదలుచు సుంతయుఁ, బలుకఁ జాల కట్టె నిలిచియుండె. ౩౪

---

డెబ్బదినాల్గవయధ్యాయము.

రాజసూయప్రవృత్తి.

ఉ. పాండునృపాలనందనుఁడు పద్మదళాక్షుప్రభావయుక్తి ను
ద్దండభుజాబలుండయి నితాంతదురాత్మతఁ బొల్చువైరి వే
ఛండనమందు సోదరునివంక మృతిం గను టాలకించి ప్రీ
తుండయి యాజనార్దనునితో నిటుపల్కెను బ్రీతి వర్ధిలన్ ౧ 1440

క. త్రిజగద్గురువులు విధిచిత్తజులగు సనకాదిమౌనితల్లజు లట్లే
ప్రజలును లోకేశులు పంకజనాభా! యేమహాత్ము గాఢతరాజ్ఞన్. ౧౫ 1441

తే. దుర్లభంబని తలఁచి యెందుఁ శుభంబు
లొసఁగు నని నమ్మి శిరముల నొగి ధరింతు
రోసరోజాక్ష! యట్టినీ వీసరణిని
దీనులగు నీశమానులదైన యాజ్ఞ ౨౫ 1442

క. తలఁదాల్చెదు సర్వాత్మా! తలపంగ విడంబనముగదా యిది నిజముగా;
లలితాకృతి బ్రహ్మమవై, చెలఁగుచు నేకంబవగుచు స్థిరమహిముఁడవై. ౩౫

క. పరిపూర్ణుఁడవద్వయుఁడవు, పరమాత్ముఁడ వన్న నీవె పావనరూపా!
యరవిందమిత్రతేజం, బరయఁగ నుదయాస్తమయములను కర్మములన్. ౪ 1444

సీ. అభివృద్ధిహ్రాసములను వొంద నొందున ట్లమలభవత్తేజమాచరించు
కర్మములఁ వృద్ధిగనదు క్షీణింపదు మాధవా యజితా! యమానుషాత్మ!
యజ్ఞులకుం బోలె విజ్ఞులౌ త్వద్భక్తులగువారల కిది నాయదియె నేను
నీవు నీయదియని యీవిధి దేహవిషయకబుద్ధి తగం బొసంగ దనినఁ

ఆ. గలుగునెట్లు నీకు జలజాక్ష యని విన్నవించి ధర్మసుతుఁడు విధిహితమయి
యజ్ఞమునకుఁ దగినయట్టి కాలమునఁ గృష్ణు, ననుమతమునఁబూనికనవధరించి.

క. క్రతువునకుఁ దొడరి ఋత్విగ్వితతిని వరియించె నందు వేదవిదుల్ సం
యతచిత్తులు పెక్కండ్ర, చ్యుతదర్శన కాంక్ష లాత్మ నోలయుచు నుండన్. ౯

సీ. చేరియుండిరి వేదసిద్ధార్థవాదులు ద్వైపాయనుఁడు భరద్వాజమునియు
నసితసుమంతులు నా గౌతమ వసిష్ఠ కణ్వ మైత్రేయులు కవషమునియుఁ
జ్యవన, త్రితులును, విశ్వామిత్ర, వామదేవ, సుమతి జైమినులసమశక్తి
కలితులుగాఁ దగు క్రతు, పరాశర, పైలులట్లు వైశంపాయనాఖ్యమునియు

తే. గర్గ, ధౌమ్య, లథర్వుండు కశ్యపముని,
పరశురాముఁ, డాసురి యనఁ బరఁగుమునియు,
వీతిహోత్ర మధుచ్ఛందు లాతతగుణుఁ
డైన యవ్వీరసేనుఁ డకృతవ్రణుఁడు. ౧౦ 1447

వ. మఱియు నకృతవ్రణుండు లోనుగాఁగల బ్రహ్మర్షు లాహూతులై వచ్చియుండిరి. ఇతరులగు ద్రోణకృపభీష్మప్రభృతు లధ్వరసందర్శనార్థ మరుదెంచిరి. ధృతరాష్ట్రుండును దత్సుతులును మతిమద్వరిష్ఠుఁడగు విదురుండును, విప్రక్షత్రియవైశ్యశూద్రులు రాజసూయదిదృక్ష నేతెంచిరి. మఱియుఁ బుడమింగల రాజులెల్ల సపరివారులై యేతెంచి రంత. ౧౧ 1448

క. ధరణిసుధాశనవరు లధ్వరభూమిని లాంగలమున స్వర్ణమయముగాఁ
బరఁగెడుదానన్ దున్నుచు, సరిచేసిరి వేదవిహితసరణిని శ్రద్ధన్. ౧౨ 1449

క. క్షితిపాలు యుధిష్ఠిరుఁ దక్రతుదీక్షాయుక్తుఁగాఁ గావించిరి; స
మ్మతిఁ గ్రాలు వరుణనకు నెవ్వితమున యజ్ఞోపకరణవితతి క్రతువునన్. ౧౩

క. అమరింపఁబడియెనో యీ, సమయంబునఁ బరికరములు స్వర్ణమయములై
సుమహితములునై రాజిల, నమర్పఁగాఁబడియె వీరలగు ప్రకృతుల చేన్ ౧౪

వ. అంత నింద్రాదులగు లోకపాలకులు బ్రహ్మశంకరులంగూడి యరుదెంచిరి. దేవగణంబులు సిద్ధులుగంధర్వులు విద్యాధరమహోరగులును, మహర్షులును యక్షరక్షఃపక్షులును, కిన్నరచారణులును, రాజులు రాజపత్నులును, ధర్మరాజు చేయు నమ్మహాధ్వరంబుచూచు వేడ్క నేతెంచిరి. శ్రీకృష్ణభక్తుండగునప్పాండుతనూజుని రాజసూయంబునకు *విస్మితులై విధివిహితముగా నడిసాగుననియే భావించిరి. దేవవర్చస్సులగు యాజకులు పూర్వము దేవతలు వరుణునిచేత యజ్ఞము చేయించినట్లు యుధిష్ఠిరునిచే యథావిధి నా రాజసూయమును జేయించిరి. ధర్మతనయుండును సోమాభిషవదినంబునందు సదస్యులను యాజకులను దక్షుంగల మహాభాగులను శ్రద్ధాభక్తియుక్తుండై పూజింపం దొడంగె నప్పుడు. ౧౫

* "మేనిరే కృష్ణభక్తస్య సూపపన్న మవిస్మితాః" అని మూలము.

చ. జనపతి యగ్రపూజఁ గొన శాస్త్రవిధిం దలపోయ నర్హతం
గనఁదగు నాతఁ డెవ్వఁడని త్ప్మాదివిజేంద్రుల నాసదస్యులం
గనుఁగొనుచుం దదర్హతను గాంచిన వారటఁ బెక్కురుంట నొ
క్కనిగను నిర్ణయించుటకుఁ గానసమర్థుఁడె యయ్యె నెంతయున్. ౧౭ 1453

క. అంత సదస్యులు నాభూ, కాంతునిదో యూహ నెఱిఁగి కడు నారసి యొ
క్కింతయు నేర్పుగనకయే, యింతగ నుండంగ వారివిధ మెఱిఁగి మదిన్. ౧౮

క. పలికెం సహదేవుం డో, యిలాసురాధీశులార! యింతవిచారం
బుల నేల మీమనస్సులఁ, గలంపఁగా సాధుగుణనికాయము లొప్పన్. ౧౯

సీ. వాసుదేవుండనఁ బ్రఖ్యాతిగాంచి సాత్వతులకు నాథుఁడై ధరణి నవత
రించిన యట్టి యీశ్రీకృష్ణుఁడే యగ్రపూజ కర్హుండగుఁ బోలఁదలఁప
సకలనిర్జరమయుం డకలుషమూర్తి దేశార్థకాలాత్మకుం డఖిలవిశ్వ [తరమగు
మయుఁడు యజ్ఞములు తన్మయములె యగు నగ్నిహోత్రముల్ మంత్రమ్ములురు

తే. జ్ఞాన మట్లె యుపాసన యాను దన్మ, యములు నద్వైత మద్వితీయమగు నట్టి
పరమపూరుషుఁ డితఁడె ప్రపంచ మెల్ల, నేతదాత్మకమే యంచు నెఱుఁగవలయు.

క. తనకుం దానే యాశ్రయ, మునగుచు సృష్ట్యాదికార్యములఁ జేయుచుఁ దా
జని గాంచక వెలయు నదె, వ్వనికృపచే వివిధకర్మవారమ్ము జనుల్. ౨౧ 1457

తే. ఆచరించుచు నమలధర్మాదిలక్ష, ణమగు శ్రేయం బదే విశ్వనాథువలనఁ
బడయఁగోరుదురో యట్టి పరమపురుషుఁ, డైన శ్రీకృష్ణమూర్తి కర్హణము నిందు.

క. చేయంగఁ దగినపని యిది, యే యగు నిట్లొనరుపంగ నెల్లమునులకుం
న్యాయవిధిం దేవతలకు, నేయే భూతాళి యుండు నీలోకములన్. ౨౩ 1459

క. ఆయాభూతమ్ములకుం, ధ్యేయంబై చెలఁగు నాత్మ కెల్లవిధములం
బాయని భక్తిం జేసిన, దే యానర్హణము దీని నెఱుఁగరె మీరల్. ౨౪ 1460

తే. సర్వభూతాత్మభూతుఁడై శాశ్వతుం డ, భేదదర్శనుఁడై దాంతుఁడై దలంపఁ
బూర్ణుఁడగు కృష్ణునకు దత్తమున కనంత, ఫలముగోరిన నీయంగవలయు భక్తి.

చ. హరిమహిమంబుఁ జక్కఁ దనయాత్మ నెఱింగిన మాద్రిపట్టి యీ
కరణి వచించి సభ్యులను గాంచుచు నూరకయుండె; భూమిని
ర్జరులు తదుక్తులం విని యొసంగెడు వేడుక బాగుబాగటం
చురునినదంబు లొప్పఁ దమయూహలఁ దెల్పి నుతించి రాతనిన్. ౨౭ 1462

చ. పలుకుల సభ్యులెల్లఁ దమభావము లిట్టివటంచుఁ జక్కఁగాఁ
దెలిపిన నాలకించుచు యుధిష్ఠిరుఁ డర్మిలి పెంపునొంది చే
ష్టల నుడుపంగ శాస్త్రవిధి సారసనేత్రుఁ బరాత్పరుం జగం
బుల సృజియింపఁ బెంప మృతిఁబొందఁగఁ జేయు మహాత్ముఁ గృష్ణునిన్. ౨౮ 1463

తే. భక్తి నర్చించె; మఱియుఁ దత్పాదసరసి,జములఁ గడిగిన పావనసలిలములను
భార్యయుం దాను సోదరవర్గమంత్రు, లాదిగాఁ గల్గువారు నెయ్యమ్ముమీఱ.

క. తలల ధరించిరి; మఱియుఁ, విలువగలట్టివియుఁ బచ్చవియుఁ గోమలతం
జెలఁగునవియు నగువస్త్రం,బులఁ గౌశేయముల దివ్యభూషణరాజిన్. ౨౬

క. హరికిం గానుకల నొసఁగెను, బరమేశుం గనుచుఁ గనులబాష్పమ్ములు ని
ర్ఝరముగఁ గ్రమ్మఁగఁ జూడం, దరమ్ముగానట్టి స్థితిని దాఁ గనియుండెన్. ౨౭

## శిశుపాలవధము.

చ. నరహరి యిట్లు పాండుజననాయకు జ్యేష్ఠకుమారుచేత భ
క్తిరతిని బూజితుండగుటఁ దేటి కనుంగొని సభ్యులెల్లరుం
గరములుమోడ్చి మ్రొక్కు లివె కైకొనవయ్య! యటంచుఁ జక్క మ్రొ
క్కిరి జయశబ్దపూర్వముగఁ గేశవుపై సుమవృష్టి నయ్యెడన్. ౨౮ 1467

క. కురియించిరి గీర్వాణులు, హరినెల్లరు నిట్లుపొగడ నాలించి మహా
త్తరకోప మూని చేదీ,శ్వరుఁ డాదమఘోషసుతుఁడు వారనిపూన్కిన్. ౨౯

సీ. ప్రథమపూజం గొనెఁ బార్థివాంతరమున నని యోర్వఁజాలక తనదుపీఠ
ముననుండి లేచి పెంపునఁబొల్చి చేయెత్తి భయమనునదిలేక పరుషభాష
ణము లిట్లుపల్కె శ్రీనాథునిగూర్చి; సర్వనియామకమయి యేవరుసనైన
దాఁటంగ నేరికిఁదరము గానిదియయి తనరుకాలం బని వినఁబడు శ్రుతి

తే. వచన మద్దిసూనృత మగు; బాలభాషి
తముల వృద్ధుల బుద్ధి యిత్తఱిని నిట్లు
మార్పునొందుటయే చక్క మానసమున
నెన్న దృష్టాంత మగుఁగాదె హితమె యిద్ది?. 3౦ 1469

ఉ. మీరలు పాత్రవిద్వతతి మించినశక్తిఁ జెలంగువార లో
సారమనీషులార! సభఁ జాలఁ బ్రసిద్ధిని గాంచిమించువా
రారసి బాలభాషితము లాదృతిపాత్రములంచు నెంచకుం
డూరకె త్రోసిపుచ్చుఁడు; యదూద్వహుఁ డీహరి యీ సభాస్థలిన్. 3౧ 1470

క. తొలిమరియాదకుఁ దగు నర్, పలుకులు పాటింపకుఁడు; తపస్సును విద్యా
బలుభంగులఁ దగువ్రత,ముల విధిగా నాచరించి పూజ్యులు నగుచున్. 3౨

ఉ. జ్ఞానఫలంతాశనార్చుల నొసంగెడు కల్మషశుష్కభీతికృ
త్కాననముల్ దహించి శ్రుతికాండము నేర్చి దిశాధినాయకుల్
పూనికఁ బూజలం దనుప భూరితరంబగు బ్రహ్మతేజముం
గానఁబడంగ నొప్పు మునికాంతుల సభ్యుల వీరి నిందఱిన్. 33 1472

ఉ. ఊరకె ప్రోసివైచి యెటు । లొప్పని యిక్కులపాంసనుఁ మహో
దారునిగాఁ దలంచి విధిఁదప్పక పూజలఁ దన్పు టర్హమే
ధారణి గొల్లఁ డీతఁడగుఁ । దథ్యము మీరు నెఱుంగరో కులో
ద్ధారకుఁడంచు నర్హణము । తద్దసభాస్థలిఁ జేయు టొప్పునే. ౩౪ 1473

క. కాకి పురోడాశంబును, గైకొనఁగాఁ దగు నదెట్లు? । క్ష్మాసురులారా!
యేకరణిఁ దలఁప వీనికిఁ, బ్రాకటగోత్రాశ్రమములు । వర్ణము గలదే? ౩౫

క. తలపోయ సర్వధర్మం,బులకుఁ వెలియైన నితండు । బుద్ధి నెటుల యీ
హలుసాగు నట్టి వర్తిలు, కలుగవు సద్గుణము లేవిగాని వెదకినన్. ౩౬ 1475

క. వీనిని బూజింపంగా, నేనీతియొ యెఱుఁగఁజాల । నే నిప్పటికిన్
వీనికులంబు యయాతిమహీనాథుఁడె మున్ను శపించె । నెంతయుఁ గినుకన్. ౩౭

క. కనుకనె కుల మయ్యది సజ్జనవితతి బహిష్కృతమయి । సద్వంశములన్
జనియించిన ధీరులచే,తను వర్జింపంగఁబడియె । ధాత్రీస్థలిలోన్. ౩౮ 1477

క. ఆకులమున జనియించిన, యీకృష్ణుఁడు వ్యర్థముగ నదెప్పుడు మద్యం
బే కడుఁదమిఁ ద్రాగుచు ము,ల్లోకంబులు నవ్వఁ జోరుఁడలుం దనుఁ గొల్వన్. ౩౯

క. తిరుగుచునుండు నభాస్థలి, దురితాత్మకుఁ డీతఁ డిపుడు । తొలిపూజకు నె
క్కరణిగ నర్హుఁడో? చెప్పుఁడా, ధరణీదివిజర్షి సేవితము లనఁబడుచున్. ౪౦

క. ఆర్యావర్తము లనఁగా, మర్యాదంగాంచి వెలయు । క్ష్మాభాగములన్
దుర్యశమునఁ దగువీరలు, పర్యటనము చేయమాని । బాలిశు లగుచున్. ౪౧

తే. బ్రహ్మవర్చస్సువిడిచి దుర్గమసముద్ర
మును నిషిద్ధ మటంచెన్నఁబూన కద్ది
యాశ్రయముగాఁ దలంచియా । ర్యాహితముగ
నందు నివసించుచుంద్రు మర్యాదఁదూలి. ౪౨ 1481

సీ. దుష్టసత్త్వములరీతుల నెల్లజనులను బాధించుచున్నారు । పార్థివాధ
ములగు యాదవులు నీమూర్ఖుఁడు తద్వంశభవుఁడౌటఁదొలిపూజఁబడయ నెట్లు
లర్హుఁడో; యని యిట్టులాశిశుపాలుఁడు తనశుభంబులు నితాంతము నశించు
ట నభద్రములు పెక్కులనరానిపల్కులు పలికె, నవ్వానికి । నలుకఁగొనక

తే. తాను భగవంతుఁడౌట శివానినాద
ములకు సింహంబురీతిని । బలుకఁడయ్యెఁ;
బరమపురుషుని దుస్సహాభంగి నిట్లు
కాలు లాడంగ విని సభఁగల సుజనులు. ౪౩ 1482

చ. శ్రుతులను గేల మూసికొని । క్షోణిపతిన్ శిశుపాలుఁ దిట్టుచున్
మతులు రుడావిలంబులయి । మంచిదిగా దిటనుండ నంచు వే

వితములఁ దొందఱింప సభ ౹ వీడి తటాలునఁ బోయి; రొక్కఁడే
ని తగ దటంచుఁ బల్కు రవ ౹ నీపతి భీతియొ? వేఱ హేతువో? ౩౯ 1483

[1]క. పరమేశ్వరు దూషించిన, హరిభక్తుని దూఱినవిని ౹ యది తగదని యె
వ్వరు వారింపరొ తొలఁగరొ, నిరయంబునఁ బుణ్యమెడల ౹ నిల్తురు వారల్.

చ. వనజదళాక్షుఁ డిట్టుట నవార్యరుషన్ గొని యట్టి పాండునం
దనులును మాత్స్యసృంజయులు ౹ నం దగువీరులు కేకయుల్ సమ
స్తనిశిత శస్త్రపాణులయి ౹ చైద్యుని జంపుతలంపు లూని లే
చిన; శిశుపాలుఁ డించుకయుఁ ౹ జెడ్డపడ కుగ్రతఁ జర్మఖడ్గముల్. ౪౧ 1485

చ. కరములఁ బట్టి యాసభను ౹ గల్గినవారలఁ గృష్ణపక్షమా
దరమునఁ గొన్నవారలను ౹ ధారణినాథుల నట్టదల్చుచున్
స్థిరముగ నిల్చె; నంత సర ౹ సీరుహనేత్రుఁడు లేచి నిల్చి భూ
వరులను స్వీయపక్షమును ౹ భక్తిని గైకొనువారి నిల్పుచున్. ౪౨ 1486

[2]చ. మనమునఁ బొంగుకోపమున ౹ మందుచు నీతఁడు పార్షదుండు కా
వున ననుఁబోలు శౌర్యమునఁ ౹ బూనికమీఱఁగ మిమ్ము నెల్లఁ జం
పనుదగువాఁడు నేనె కడుఁ ౹ బంతముమీఱఁగ వీనిఁగూల్తు నం
చనుకొనుచున్ క్షురాంతమగు ౹ నట్టి సుదర్శన మాన్నృపాలుపై. ౪౩ 1487

క. పరఁగించె నామహాస్త్రం, బరిశీర్షముఁ బైఁబడంగ ౹ వచ్చు తఱిని ద్రుం
చె రయంబొప్పఁగ; నీవిధి, ధరణీశుఁడు చైద్యుఁ డిట్లు ౹ దానవరిపుచేన్. ౪౩

చ. అనిమొనఁ జంపఁగాఁబడిన ౹ యంతనె యొక్కమహారవంబు గ
ల్గెను సభయందు; దుఃఖపరి ౹ కీర్ణమనస్కులు చేదిదేశరా
డనుచరభూపతుల్ బ్రదుకు ౹ నాసలఁ బర్వులుపాఱె; రంతఁ జై
ద్యునిదగు దేహమున్ వదలి ౹ జ్యోతియొకండు చెలంగుచున్ వడిన్. ౪౪ 1489

శా. భూతవ్రాతము లట్టె కన్గొన నభం ౹ బున్ వీడి భూమింబడన్
భీతిం గొల్పుచు వచ్చునుల్కకరణిన్ ౹ వెల్గుల్ దెసల్ పర్వఁగా
నేతన్మాత్రుఁ డనంగరాక తగుస ౹ ర్వేశున్ హరిం జొచ్చె; నెం
తో తాత్పర్యముమీఱఁ జేదిపతి యెట్లో మూఁడుజన్మంబులన్. ౪౫ 1490

[3]మ. హరితో వైరముఁగొన్న వాఁడగుటచే ౹ నవైరబుద్ధిన్ నిరం
తర మాచక్రిఁ దలంచుచున్ హరిమయ ౹ త్వం బొందె నీజన్మమం

---

1 "నిందాం భగవతః శృణ్వం స్తత్పరస్య జనస్య వా, తతో నాపైతి యస్సోపి యా త్యధస్సు కృతాచ్చ్యుతః" అనిమూలము.

2 "శిరః క్షురాంత చక్రేణ జహా రాపతతో రిపోః" అనిమూలము.

3 "ధ్యాయం స్తన్మయతాం యాతో భావోహి భవకారణం" ౪౬. అనిమూలము. భావో భావనా అనుధ్యానం భవస్య ధ్యేయతా కారజన్మనః కారణమ్" అని శ్రీధరాచార్యులు.

దరయఁగ భావమె ధ్యేయరూపజనికే యాఁ గారణం బెప్పుడున్;
దరువాతన్ యమనందనుండు విధిమంతంబై సవం బవ్విధిన్. ౮౬ 1491

క. పరిపూర్ణతఁ గన ఋత్విగ్వరులకు సభ్యులకు వారివాంఛకు హెచ్చా
కరణిన్ దక్షిణలిచ్చెను, బరమాదృతి గారవించె వారి సపర్యన్. ౮౭ 1492

తే. అవభృథస్నాన మొనరించె నంత నేక
రాట్టనఁగ ఖ్యాతిగాంచె; ధర్మసుతు చేతఁ
గ్రతువరం బిట్లు చేయించి కంజనయనుఁ
డఖిలయోగీశ్వరేశ్వరుం డగుహరియును. ౮౮ 1493

క. సుమనస్కులు తను వేఁడంగ మాసములు కొన్నియందె గడపి మఱియు నా
యమతనయుఁడు వేఁడిన స్వపురమునకుఁ బోఁ దలఁచియుంటర మొప్పారు క్తులచేన్.

ఆ. సమ్మతింపఁజేసి సారసాక్షుఁడు సభార్యుండు సచివవర్యయుతుఁడు నగుచు
ద్వారవతికిఁ బోయె; వైకుంఠవాసులౌ, జయవిజయులు విప్రశాపమునను.

క. మరలన్ మరలం బుట్టుచు, హరిచేతం దెగిరి వారిదా చరితంబున్
విరివిగ నీకుం దెల్పితి, ధరణీశా! యని శుకుండు తమిఁ దెల్పె నృపున్. ౮౯

క. కనుఁగొని యవ్వలిచరితంబును దెల్పఁదలంచి యనియె భూపలలామం
డన ఖ్యాతి నొంది శమనుని, తనయుం డవభృథము నాఁగఁదగు స్నానమునన్.

క. పరిశుద్ధుండై భూసుర, ధరణీశ్వర సాంద్రమైన తత్సభ నడుమన్
సురరాజువలె వెలింగెను; సురలును మానవులు ప్రమథశూరులు తమి చేన్. ౯౧

సీ. తమ్ము ధర్మజుఁడు నితాంతము పూజింప హరి సధ్వరవరంబు నతిశయముగఁ
బొగడుచుఁ దమనెలవులకుఁ బోయిరి; పాపమనస్కుఁడై కల్యంశమున జనించి
కురుకులమునకు నిర్భరరోగమయి యొప్పు దుర్యోధనుఁడె చాల దుష్టుఁడౌటఁ
బాండునందనుల యపారసంపదఁ గాంచి సైరింపఁడయ్యె; శ్రీచక్రధరుఁడు

తే. చైద్యు వధియించుటయు నృపసత్తములను
బంధముక్తులఁ జేయుట పరమసవము
సాగుటయు లోనుగాఁగల సాధుకథల
వీనిఁ బఠియింప నఘములు విలయమొందు. ౯౪ 1499

---

డెబ్బదియైదవ యధ్యాయము.

సభలో దుర్యోధనుఁడు భ్రమ మొందుట.

చ అని వచియింప భూమిపతి యాశుకమానివరేణ్యుఁ గాంచి యి
ట్లనియె నజాతశత్రుఁ డగునాయమసూనుని రాజసూయపున్
ఘనవిభవంబుఁ గాంచి యది కన్గొనవచ్చిన రాజులున్ మునీ
శనికరమున్ ముదంబుఁగనెఁ జక్రిదయన్ విధినద్ధి సాగుటన్. ౧ 1500

మ. ధృతరాష్ట్రాగ్రతనూజుఁ డొక్కరుఁడె యాదివ్యక్రతుస్ఫారభూ
తితతిం గాంచి సహింపఁడయ్యె ననుచున్ దెల్పంగ నే వింటి నా
క్రతుభుగ్ద్వారము సంతసించెఁగద యొక్కం డాతఁ డీర్ష్యం గొనన్
గతమేమో వివరింపుఁ డంచడుగ నాత్మ్యాపాలుప్రశ్నంబునన్. ౨ 1501

చ. మది ముదమొంద నిట్లనియె మానివతంసుఁడు నీపితామహుం
డుదితయశుండు యజ్ఞము మహోన్నతవైభవ మూనిచేయున
య్యదనున బాంధవుల్ పనులయం దొగిఁ బ్రేమకు లోనువై యొన
ర్పఁదగు విధంబునన్ నృపతిపాలకుచేత నియుక్తులై తగన్. ౨౪ 1502

క. కావించుచుండి రందుం, బావని పాకాలయంపుఁబాలకుఁ డయ్యెన్
భూవరుల నడిమి తెచ్చిన, యావిత్తము వ్యయమొనర్చు నధికారమునన్. ౩౪

క. కానుకలం గైకొనఁగాఁ, దానె నియోగింపఁబడియె ధర్మాత్మజుచేఁ
బూని సుయోధనుఁ; డట్లే, మానీశుల వచ్చునట్టిమాన్యుల నెల్లన్. ౮ 1504

సీ. గారవింపఁగ మాద్రికడగొట్టు సూనుండు నియమింపఁబడియె వానిసహజుండు
వలయుద్రవ్యంబులఁ గలయంగ సమకూర్ప నర్జునుండును సజ్జనాళి నెలమిఁ
జందనచర్చాదిసాధుశుశ్రూషలు గావింపఁ గృష్ణుండు నావిధమున
నరుగుదెంచినవారి యంఘ్రులఁ గడుగంగ నియమింపఁబడిరి; పూనిక దగంగ

తే. నోగిరంబును వడ్డింప నొప్పుకొనియె
ద్రుపదసూనుండు బుద్ధిమంతులను మేటి
యైన కర్ణుండు పూనెను దాన మొసఁగు
కార్యమున ధర్మజుఁడు వేడఁగా మఱియును. ౫ 1505

వ. సాత్యకియు, వికర్ణకృతవర్మవిదురులు లోనగువారును, బాహ్లీకుండును, వాని సూనులు భూరిశ్రవస్సంతర్దనప్రభృతులు ధర్మజునకుఁ బ్రియంబుసేయుకోర్కి నాయాపనులయందుఁ బ్రవర్తిల్లుచుండిరి. ఋత్విక్సదస్య బహుశాస్త్రవిద్వరులు ప్రియతమవాక్కులచేతను, బూజలచే దక్షిణలచేతను విధిగఁ బూజితులైరి. శిశుపాలుఁడు చక్రియందైక్యమైన పిదప నెల్లరు నాకాశగంగకు నవభృథస్నాన మొనరింపఁబోయిరి. తత్సమయంబున మృదంగశంఖపణవదుందుభిగోముఖానక ప్రభృతి వాద్యములు చెలంగెను. నర్తకీజనంబు హృష్టాంతరంగంబున నాడె. గాయకులు గుంపులుగూడి పాడిరి. వారువాయించు వీణావేణు తాళధ్వనులు నింగిముట్టె. విచిత్ర ధ్వజపతాకలం గొని కొందఱు ముందునడువ భద్రదంతావళంబులు స్యందనము లాజానేయంబులు వివిధాలంకృతుల నొప్పిరాఁగా సమలంకృతాంగులగు భటులు వెంటరా యదుసృంజయ కాంభోజ కురు కోసల కేకయులు తమకుఁ బ్రభువగు యుధిష్ఠిరుని మున్నిడుకొని సేనాప్రతతి పుడమి యద్రువ వచ్చుచుండ సువర్ణహారములం దాల్చి బయలువెడలిరి. సద

స్యులు బుత్విగ్విప్రవర్యులు లోనగువారు వేదఘోషము చెలరేఁగుచుండ వెంటఁబోయిరి. దేవర్షిపితృగంధర్వులు పూవులవానలు కురియించుచు వినుతించిరి. స్త్రీపురుషులు గంధపుష్పమాలికాభరణవస్త్రవిభూషితులై వివిధౌషధిరసములఁ బరస్పరము పూయుచు నొకరిపై నొక్కరు వసంతములు పోయుచు విచ్చలవిడిఁజరించిరి. వెండియుఁ బూరుషులు తైలగోరసంబులఁజందనజలములను హారిద్రాజలంబును సాంద్రకుంకుమసలిలంబులను బయిఁబయిఁ బూసి వసంతములాడఁగా వారస్త్రీలు మరల వారికి వానింబూయుచు వసంతోత్సవ మొనరించిరి. అంబరతలంబున దేవకాంతామణులు దివ్యవిమానంబులచేతం బలెః బట్టపురాణులు భటసంఘసంరక్షితలై స్యందనాదియానములనెక్కి యవభృథస్నానోత్సవసందర్శనార్థముబయలువెడలిరి. వెండియు నారాజపత్నులు మేనమామకొడుకులును సఖులును వసంతములు పయింజల్ల మందాక్షహాసవిలసన్ముఖతామరసలై విలసిల్లిరి. ఆముద్దియలు మఱియు మఱదండ్రను జెలికత్తియలను జర్మభస్త్రికలచే వసంతములు చల్లితడుపుచు వారు నట్లొనర్పఁ దడియుచు సకలాంగకంబులు వలిపంపువస్త్రంబులనుండి కనఁబడుచుండ నాపెనువేడుకచేఁ గ్రొమ్ముడులనుండి కుసుమములు జాఱ సయ్యాటములఁ గాముకులఁ గలంగఁ జేయుచుండి రంత ౧౫

చ. అరదము స్వర్ణమాలికల । నందముగుల్కఁగ సాధుఘోటకో
త్కరము వహింపఁ బాండునృపకాంతుని జ్యేష్ఠసుతుండు మండలే
శ్వరుఁడయి డిగ్గి దారయుతిఁ । జక్కని యంగసమూహసంయుతిం
బరఁగెడు రాజసూయ మటు । భాసిలెఁ జూపఱు సంతసింపఁగన్. ౧౬　1507

క. సుమహితపత్నీ సంయాజములనఁబడు యాగములను । సవముతుదిని శా
స్త్రమురీతి నవభృథస్నానమునను సత్క్రియల బ్రాహ్మణప్రవరయుతిన్. ౧౭

క. ధరణీశునిచేఁ జేయించిరి; యాజకు లపుడు నృపతిజిష్ణుని గృష్ణా
పరిభూషితపార్శ్వుని భూసురయుతి నాచమనవిధిని । సురనదియందున్. ౧౮

క. స్నానముచేయించిరి దివి, నానిర్జర దుందుభులును । జ్యాస్థలియందున్
మానవులవాద్యములు సరిగా నాదముపిక్కటిల్లఁగాఁ జేసెఁ గడున్. ౧౯

క. సురలును మౌనులుఁ బితరులు, నరులును బూవులనుబోరననన్ నరపతిపైఁ
గురియించిరి; వర్ణాశ్రమ, పరిశుద్ధులు మానవు లటఁ । బావనగంగన్. ౨౦　1511

క. స్నానం బొనరించిరి తత్, స్నానమునన్ భూరిపాపసహితుండైనం
గాని పరిశుద్ధుఁడే యగు, నా నిఖిలాఘములు పాఱు । నప్పుడెభీతిన్. ౨౧　1512

చ. నరపతి క్షౌమనూత్నవసనంబులఁ దాలిచి దివ్యభూషణో
త్కరమున భూషితాంగుఁడయి । తా నొగి యాజకులన్ సదస్యులన్

ధరణిసురోత్తమాళి మఱి తక్కినయందుఁగలట్టి వారి నం
బరముల భూషణంబులను వారక తృప్తులఁ జేసె నేర్పునన్. ౨౨ 1513

క. నారాయణపరుఁడై తగు, ధారణినాథుం డతండు తగుబంధువులన్
భూరమణుల జ్ఞాతుల స్నేహారూఢుల సాధుమతుల నటఁ గలయొరులన్. ౨౩

క. పలుభంగులఁ బూజించెను, సులలిత మణికుండలముల సుమమాలికలన్
దలచీరలఁ గంచుకవరములను దుకూలముల రత్నముల హారములన్. ౨౪

సీ. చక్క భూషితులయి సమధికరీతిని గ్రాలిరి; వామనేత్రలును రుచిర
రత్నకుండలయుగ రమ్యకాంతులు పర్వ నలకలసొంపు వక్త్రాబ్జబింబ
రుచు లుల్లసిల్లఁ గర్బురమేఖలలకాంతు లరుదుగఁ గన్పడ నౌర! యనఁగఁ
దగియుండి; రంత నధ్వరముఁ జేయించిన బ్రహ్మవాదులు సుస్వభావులు నగు

తే. యాజకులును సదస్యులు నవనిసురులు
క్షత్రియులు వైశ్యశూద్రులు క్ష్మాపతులును
యజ్ఞమును జూడవచ్చినయమర ముని పి
తరులు భూతము లటు హరిద్వరులు మఱియు. ౨౫ 1516

క. వారల యనుచరులును దమి, ధారణినాయకునిచేతఁ దగఁబూజితులై
చేరిరి స్వీయాలయముల, గారవమున నృపతిఁ బంపఁగా వేడుకలన్. ౨౬ 1517

క. హరిదాసుఁడు రాజర్షియుఁ, బరహితకారియునునైన పాండుసుతుని య
ధ్వరము మహోదయమును నెవ్వరుఁగ నెంతగను జనులు వర్ణించినను‌న్.

ఆ. తనివి చెందరైరి తా మానవుఁడు సుధ, నెంత త్రాగినను వితృప్తి చెంద
నట్టు; లంత ధర్మనాత్మజుఁ డెడఁబాయఁజాల కెంతొ జంకి సాధుమతుల. ౨౮

క. తనసంబంధుల బాంధవులను గృష్ణునిబోవఁగా వలదటంచు ముదం
బున వారించెను; సర్వంబు నెఱింగిన శ్రీహరియును భూపతికోర్కెన్. ౨౯

చ. మనమున నెంచి యాతనికి మంచియొనర్పఁ దలంచి సాంబము
ఖ్య నిఖిల యాదవోత్తముల నంపెఁ గుశస్థలి కందుఁ దానుని
ల్చెను; యమసూనుఁ డీకరణి స్వీయమనోరథవార్ధి దుస్తరం
బును వడిదాఁటెఁ గృష్ణుదయఁ బోయెను దగ్ధహృదయజ్వరం బొగిన్. ౩౦ 1521

సీ. దుర్యోధనుం డచ్యుతునియందు మదినిల్పి యలరారుధర్మజు నంతిపురిని
గలయట్టిసంపద నలఘుతర క్రతు మహిమముఁ గని తనమనసునందు
మిక్కిలి తపియించె; మేదినీశునిదగు శుద్ధాంతమున మయుం డిద్ధశక్తి
నలవరించిన సభాభ్యంతరమునఁ గలమనుజేంద్రదివిజేంద్రదనుసుతేంద్ర

తే. సంపదలఁ గాంచె వానితో సాధ్వి ద్రుపద
మనుజనాయకు తనయ భర్తను మనోజ్ఞ
పద్ధతిని బరిచర్యల బహువిధములఁ
దనుపుచుండె నాసతియందు మనసు నిలిపి. ౩౧ 1522

క. పరితప్తచిత్తుఁడై యా, కురుపతి యం దుండె; మఱియు గోవిందుని సుం
దరుల సహస్రము శ్రోణీ,భరమునఁ గ్వణదంఘ్రిరుచులు పర్యటచేతన్. ౩౨

క. మెలమెల్ల నడుగు లిడుచున్, బలితపువక్షోజయుగళపటుకుంకుమచ
ర్చల నెఱ్ఱనైన హారం,బులు కన్పడ వక్త్రపద్మములు భాసిల్లన్. ౩౩ 1524

చ. చలకుండలమృదుకుంతల,ములు సొంపులఁ గ్రుమ్మరింపఁ బొంకంబుగ నం
దలరుచుఁ దిరుగం గనియా,ర్తుల మున్గెను స్వల్పమతియు దుష్టుఁడు నాటన్.

ఉ. దానవశిల్పి యామయుఁడు తత్పరుఁడై యలరించియున్న యా
మానితసత్సభన్ సకలమండలనాథుఁడు ధర్మరాజు పెం
పూనిన సోదరుల్ సుమతినొప్పెడు బాంధవులున్ హితాహిత
జ్ఞానయుతాత్మసద్మ్యుఁడగు సారసనేత్రుఁడు కూడియుండఁగన్. ౩౪ 1526

క. పరమేష్ఠితుల్యభాగ్యం, బరుదుగ నొప్పార వందిహారితరనుతుల్
పరఁగన్ స్వర్ణాసనమున, సురపతియే యీతఁ డనఁగ శోభిలుచుండెన్. ౩౫

చ. వరముకుటంబు హారములు భవ్యకలాపము లొప్పఁ దాల్చి సో
దరపరివేష్టితుం డగుచు దారుణఖడ్గముఁ గేలఁబూని భూ
వరులను ద్వారపాలకుల వార కదల్చుచు నాసుయోధనుం
డురుగతిఁ జేరె రోషమున నోలగమున్ గనువారు నవ్వఁగన్. ౩౬ 1528

ఉ. వైరుల కోలగం బదియు వారి స్థలంబనుచున్ స్థలంబునన్
వారి యటంచు విభ్రమ మహావారిగఁ దోఁప మయుండు దేవతా
వైరులశిల్పి కూర్చె మణివారముతో; మయమాయచేత నా
ధారణినాయకుం డట నితాంతవిమోహితనైజచిత్తుఁడై. ౩౭ 1529

చ. స్థలము జలంబుగా వగచి తా ధరియించిన యంబరాంతమున్
గలఁగుచుఁ బైకిఁ ద్రోచుకొనెఁ గానక వారి యటంచు నెంచుచున్
స్థలమును దాఁబడెన్ జలము సత్యముగా స్థలమంచు నెన్ని యం
దలరుచుఁ బోవఁగాఁ దడిసె నావసనం బది చూచి భీముఁడున్. ౩౮ 1530

చ. వనితలుఁ దక్కనట్టి నృపసభ్యులు ధర్మజుఁ డెంత హెచ్చరిం
చిన హరిప్రోత్సహింప నిది చేటును గూర్చునటంచు సుంతయై
నను దలపోయ కొక్కుమొగి నవ్విరి; దానికి నాసుయోధనుం
డనుజయుతుండు సిగ్గుపడి యానన మెంతయు వాల్చి దీనుఁడై. ౩౯ 1531

మ. పెనురోషంబున మందుచుం సభను శిశుపాల స్తోమవర్యుం డొన
ర్చినదానిన్ విడనాడి హస్తిపురినిన్ ॥ జేరంగఁ దాఁబోయె నా
తనికిం గల్గుపరాభవంబునకు నంతం గల్గె హాహాధ్వనుల్
జనసందోహమునందు ధర్మసుతుఁడుం ॥ స్వాంతంబునం గుందఁగన్. ३౯ 1532
చ. హరియును భూమిభారహరణాయత కార్యము ముందుఁదా నదె
క్కరణి నొనర్పఁగాఁ దగునొ ॥ కాలము దానికి నెట్లు పక్వమై
యరయఁగఁ దా నిమిత్తమనునాశయ మెల్లరకుం జెలంగ నె
వ్వరుసను జేయునో యది శుభంబగునంచుఁ దలంచి యుండుటన్. ३౯ 1533
క. భీమాదుల పరిహాసం, బామాడ్కి సుయోధనునకు ॥ నవమతిఁ గూర్పం
దామానుపఁ బూనకయే, యామోదముఁ జూపుచుండె ॥ నవనీనాథా!. ३౯౪
వ. నీవు నన్నడిగిన ప్రశ్నంబునకు రాజసూయమహాక్రతువున దుర్యోధను
దౌరాత్మ్యంబుఁ దత్పరాభవంబుఁ దెల్పితి నని శుకయోగి మఱియు ని ట్లనియె.



డెబ్బదియారవయధ్యాయము.

సాల్వకథారంభము.

క. విను మనుజేంద్రా! లీలా, మనుజాకృతిఁ దాల్చియున్న ॥ మాధవుఁ డొనరిం
చిన చిత్రకర్మమును నే, వినిపించెద సౌభపతిని ॥ వీరవతంసున్. ౧ 1536
చ. అనిమొన సంహరించె నది ॥ యచ్చెరువైతగు రుక్మిణీసతిం
గొన హరిపోయి యున్నతఱి ॥ క్షోణిపతుల్ చనుదెంచి రందుఁ జై
ద్యునిసఖుఁ డైనసాల్వుఁడు మహాోద్యమ మొప్పఁగ వచ్చియుండె నా
తని యదువీరు లుద్ధతి మృధంబున గెల్చిరి కృష్ణసన్నిధిన్. ౨ 1537
క. అందు జరాసంధాదుల, బృందం బటు లోడిపోయె ॥ వివిధనృపతిసం
క్రందనులు వినఁగ శపథం,బుం దా నొనరించె సాల్వభూపతి కినుకన్. ౩౪
క. యాదవవిహీనముగ నీ, మేదిని నొనరింతు నాదుమేటి శపథముం
గాదనక వినుఁడు విక్రమ, మాదటఁ గన్గొనుఁ డటంచు ॥ నమ్మాధుండున్. ౩
చ. ప్రతినయొనర్చి ముష్టిమితపాంసువు నే యొకపూట లోనికిన్
జతనముమీఱఁ గైకొనుచు ॥ శంకరు లోకవిభున్ నిరంతరం
బతులితభక్తిఁ గొల్చె; నొకహాయన మేగఁగ నాశుతోషుఁడున్
వితతయశంబుగన్న మునిబృందసమర్చితుఁ డౌ హరుం డెదన్. ४౪ 1540
క. శరణాగతుఁడౌ సాల్వుని, వరమునఁ దన్పంగ నెంచి ॥ వచ్చె నచటికి; దా
ధరణీధ్రసుతాయుతుఁడై, యరుదెంచిన శంకరుఁగని ॥ యాతఁడు భక్తిన్. ౫
క. సురదితిసుత గంధర్వుల, కురగులకున్ రాక్షసులకు ॥ నుర్విఁగల నరో
త్కరమునకు నభేద్యము భీకర మాయదువృష్ణులకును ॥ గామగమనమున్. ౬

క. అనుపమమునైన యానంబును గోరెను గృష్ణుమీఁదఁ బూనినపగ నె
మ్మనమున స్మరించి సంతసమును గాంచక శివుఁడు సుంత మోద మగపడన్.

క. కాని మ్మశ్లే యాన, మ్మౌనని మయుఁ గాంచి వీని కట్టిదియగు న
య్యానము నిర్మించియె యిమ్మా నీవని హెచ్చరించి యరిగె నిజేచ్ఛన్. ౬౪

చ. పరశివునాజ్ఞ మౌళినిడి పట్టుదలం గొని యమ్మయుండు వే
పరపురముల్ జయింపఁదగు ప్రౌఢిమగాంచిన వాఁడుగాన సుం
దరము నయోవికారము నితాంతవిపక్షభయంకరంబు నౌ
పురమును సౌభనామకముఁ బొల్పుగ నిర్మితిఁజేసి యిచ్చెఁ దాన్. ౭ 1545

మ. తనయిచ్ఛన్ వడిఁబోవుచున్ బరులకున్ దా నొక్కమాత్రైనను
జెనకన్ శక్యముగాక చీకటులకున్ జిత్రాలయంబౌచు నొ
ప్పిన యానంబును బొంగి సాల్వుఁడనుపృథ్వీనాయకుం డాత్మ వృ
ష్ణినికాయం బొనరించినట్టి పగనున్ జింతించి క్రోధోగ్రుఁడై. ౮ 1546

ఉ. ద్వారకమీఁదికిం జనియె; దారుణభూరిబలంబుచేత దు
ర్వారపరాక్రమం బడర వచ్చెడువారికిఁ బోవువారికిన్
భూరితరశ్రమం బొలయఁబొల్కని సాల్వుఁడు ముట్టడించి యొం
తోరమణీయమౌ నుపవనోత్తమ నిష్కుటపంక్తిఁ బూనికన్. ౯ 1547

సీ. ఉద్యానములను, మహోన్నతగోపుర, ప్రాసాదములను, ద్వారముల మఱియు
నట్టాలకముల విహారమ్మునకుఁ దగినట్టు లేర్పఱచిన యాస్థలంబు
లను బ్రతోళికలను లయ మొందఁగాఁ జేసె; నమ్మేటి వ్యోమ యానాగ్రమందు
నిలిచి శస్త్రంబుల నలఘుపాషాణంబులను దరువులఁ బాములను బిడుగుల

తే. వడిగ నాసారములుగాఁగఁ బడ నొనర్చె, గులకఱాలను గురిపించె ఘోరవాత
మట్టె యద్దానఁ బుట్టి మహోత్తరగతి, వీచెఁ బాంసువులను దెసల్ తోఁపకుండె.

చ. పురమది సౌభపీడలను బూర్వమొగిం ద్రిపురంబు లేఁచఁగా
ధరణివిధంబునన్ బడలి తా సుఖముం గనఁజాలదయ్యె; న
త్తరుణమునందు బాధల నితాంతము చేడ్పడియున్న ద్వారకన్
హరితొలిపుత్రకుండును మహారథుఁడున్ మతిమద్వతంసుఁడున్. ౧౨ 1549

క. వీరుఁడునగు ప్రద్యుమ్నుఁడు, దా రయమునఁ గాంచి ప్రజల తతకష్టములన్
శ్రీరమణుఁడు లేకుండుట, నారసి యభయం బొసంగి స్యందన మెక్కెన్. ౧౩

చ. తనయశ మెల్ల దిక్కులను దద్దయు వ్యాప్తిగనంగ సాల్వుతో
నని యొనరింపఁబోయె; మఱి యాతనితోడనె చారుదేష్ణుఁడున్

* "పురం నిర్మాయ సాల్వాయ ప్రాదాత్సౌభ మయస్మయమ్" అని మూలము.

జనియెను సాల్వు మాఱుకొన § సాత్యకి సాంబులు పోయి రల్లె యిం
కనుగల సోదరుల్ కడిమి § గ్రాలఁగఁ దోడ్పడఁ బోయి రేడ్తెఱన్. ౧౫ 1551

సీ. అక్రూర హార్దిక్య § లాభానువిందుఁడు గదుఁడు శుకుండు నుగ్రబలశాలి [యు
సారణుండును దక్క§పౌరుషస్ఫూర్తులు విలుకాండ్రు రథయూథ§విభులుమఱి
యోధవీరులు కవ§చోత్తమములఁ దాల్చి గజహయస్యందన § కలితులగుచుఁ
గాల్బలంబులు తమ్ముఁ § గాపాడుచుండ రాఁగఁ బయనమై; రంత సా§ల్వభటతతికి

తే. యాదవులకును సురలకు § నసురులకును
జరగుసంగ్రామ మట్లు భీ§కరరణంబు
రోమహర్షణ మొదవంగ § రోషయుక్తి
సాగుచుండఁ బ్రద్యుమ్నుండు § సాహసమున. ౧౬ 1552

క. పటుతర దివ్యాస్త్రంబుల, దటుకున నాసాల్వుమాయఁ § దపసుండును జీఁ
కటులంబోలెఁ క్షణమున, మటుమాయముగా నొనర్చె § మానసనిపుణ్కన్.

ఉ. అంతటఁ బోక తప్తకన§కాంచిత పుంఖములై యయోముఖా
త్యంతభయంకరంబులయి § యానతపర్వములై చెలంగి బల్
వింతగనున్న పంచయుత§వింశతి బాణములేసి వైరిదు
ర్దాంత చమూపతిన్ మిగులఁ § దత్తఱమందగఁ జేసె నేర్పునన్. ౧౮ 1554

మ. శతబాణంబుల సాల్వునొంచి మఱి త§త్సైన్యంబునం గల్గును
ద్ధతులౌ వీరుల నొక్కొరొక్కరుని బా§ధల్ చెంద నొక్కొక్కటి
ప్రతరానూనశరంబు వైచెఁ బదియా § బాణంబులన్ సారథి
ప్రతతిన్; వాహనపంక్తి మూఁడిటను జే§వల్ దూలవై చెన్ నడిన్. ౧౯ 1555

చ. అతిశయ మద్భుతంబునగు § నామహితాత్ముని కృత్యమెన్ని రెం
డు తెగలనున్న సైనికులు § నూతన మీయది యెందుఁ గానమం
చతని బహూకరించిరి; మ§హత్తరమాయ నొనర్చి యమ్మయుం
డితరదురాసదం బనుచు § నెంచియొ సాల్వున కిచ్చియుండుటన్. ౨౦ 1556

తే. అవ్విమానమ్ము నొకచోట § నపరిమితము
లైన రూపంబులుగను స్థ§లాంతరమున
నొక్కరూపంబుగను మఱి § యొక్కచోటఁ
గనఁబడుచు మఱియొకచోటఁ § గానఁబడక. ౨౧ 1557

క. పరులకు నేమాత్రంబే, నరయంగఁ దరంబుగాని § యట్లుండె; ధరన్
బరికింప నొచు నొక్కపు, డురుసురమార్గమున నద్ది § యొక్కపు డుండున్. ౨౧౪

క. సలిలంబుల గిరిశృంగ, స్థలమున నొక్కపుడు తోఁచు§చంచమునఁ దగన్
వలయాకృతిగాఁ దిరిగెడు, నలాతచక్రంబుపోల్కి § నది చరియించున్. ౨౨

తే. ఒక్కతావున స్థిరముగ ఽ నుండకద్ది
తిరుగుచుండెను సాల్వుఁడు ఽ దివ్యసౌభ
యానమున నెందునెందును ఽ సైనికులను
గలిసి కనుపట్టునో ఽ యదుకాంతు లందె. ౨౨౫ 1560

చ. శరముల లక్ష్యశుద్ధి తగుఽచందమునన్ బరఁగించుచుండిఽ ర
య్యరివరసంప్రయుక్త నిశిఽతాశుగముల్ దహనార్చు లట్లు గా
ల్ప రవివిధంబునన్ మిగుల ఽ బాధనుగల్గఁజేయఁగా భయం
కర భుజగంబులట్టులు నిఽకామదురాసదతం జెలంగఁగన్. ౨౩౫ 1561

తే. సాల్వుఁడేమియుఁ బ్రతిచేయఁఽజాల కట్టి
సైన్యములు పీడితములయి ఽ చాలఁదూలఁ
గాంచుచుండెను; దమసేన ఽ గలఁగుచుండ
సాల్వ సేనాధినాథులు ఽ సాహసమున. ౨౮ 1562

చ. అడరి మహాస్త్రజాలముల ఽ నాయదువీరుల నొంప వారల
ప్పుడు భృశపీడితాంగులయి ఽ శోక మెనంగుచు స్వస్థలంబులన్
విడువక యుండి రిజ్జగము ఽ విక్రమసంపద నూర్ధ్వలోకమున్
గడు సుకృతంబుచే గెలువఁఽగాఁ దలపోసెడు దిట్టలాటచేన్. ౨౪ 1563

క. మును ప్రద్యుమ్నశరంబులఁ, దనయంగము లార్తినొందఽదర్ప మ్మువ్వాం
గను మరలివచ్చి మాసా,ల్వునిమంత్రి ద్యుమంతుఁ డతనిఁఽబొంగుచుఁ దాఁకెన్.

చ. ఇనుమునఁ జేయఁగాఁబడి యఽహీననిజాకృతిచేఁ గడున్ భయం
బును గలిగించు నగ్గదను ఽ బూని యరిన్ బలమెల్లఁజూపి మోఁ
దెను; గదతాఁకు వక్షమును ఽ దెప్పుననొంప నరిందముండు న
య్యును హరిపుత్త్రకుండు రథఽమెయ్యన నూఁతఁగ సోలె నంతటన్. ౨౬౫ 1565

ఉ. దారుకు నాత్మజుండు రణఽధర్మ మెఱింగిన ప్రౌఢ సూతుఁ డ
ద్దై రణభూమినుండి కొనిఽయేగెఁ దొలంగఁగఁ గృష్ణునాత్మజున్;
సారథితోడఁ బల్కెనిటు ఽ సంజ్ఞ ముహూర్తములోనె కాంచి య
వ్వీరుఁడు సూతుఁడా! యకట ఽ వీరులునవ్వఁగ నిట్లు తెచ్చితే. ౬౭౫ 1566

క. తగునే సంగర రంగం,బు గడువఁగాఁ దెచ్చు టెన్నఁఽబోలినపనియే
జగమున యదుకులజుఁ డెవం,డుగాని నేఁదప్ప నొక్కఁఽడున్ యశ మేగన్.

క. సారథితొలఁగింపఁగ ని,ట్లారయ దూ టొందినాఁడె ఽ యది వినఁబడునే;
శ్రీరామకేశవులు నా, కూరిమి పితృపాదు లొకటఁ ఽ గూడినవేళన్. ౨౯ 1568

చ. అని మొననుండి ధర్మ మిటుఽలాఱడిపుచ్చి తొలంగి వచ్చితిన్
గనుక ననుందగం బిలిచి ఽ నాజనకుల్ రణవార్త లెవ్వినా

యన! యనిప్రశ్న చేయ నెది । యర్హ్మమటంచు వచించువాఁడ; నా
యనుజులపత్ను లిద్ది వినిశనంతన నాదు నసత్రప్రవృత్తినిన్. ౩౦ 1569

క. పరిహాసంబుగ నొకరొ,క్కరితోఁ జెప్పుకొనకుండఁగా నోపుదురే;
పరులును నవ్వుచుఁ బల్కరె, సరియే యిది సూడ! చెపుమ । సాధుభణితులన్.

క. అనవిని యాయుష్మంతా, వినవయ్యా! ప్రభువరేణ్య । విగ్రహధర్మం
బును దెలిసియె యివ్విధిగా, నొనరించితి నంచుఁ దలఁపు । మొగి నీమదిలోన్.

క. రథికుని కష్టంబుల సా,రథియును దత్కృచ్ఛ్రములను । రథికవరుండున్
బ్రథనంబునఁ దీర్పం దగుఁ, బథమిది నీత్యన్వితంబు । పండితమతమున్. ౩౨

చ. ఇది తలపోసియే గుదియ । యెంతయునొంపఁగ మూర్ఛమున్గు ని
న్గదియగవచ్చు నాపదలఁ । గాంచియె యిట్లు తొలంగఁ దెచ్చితిన్
మది రణధర్మపద్ధతుల । మానినవాఁడనుగాను వేఱుగాఁ
గఁ దలఁపరాదు దీని బుధ । కాండము మెచ్చిన మార్గమాటచేన్. ౩౩ 1573

---

## డెబ్బదియేడవయధ్యాయము.

### సాల్వుని గృష్ణమూర్తి వధించుట.

క. అనఁగావిని శ్రీకృష్ణుని, తనయుఁడు ప్రద్యుమ్నుఁ డట నుదకముల విధిగా
నొనరించి యాచమనమును, ఘనకవచం బొందుదాల్చి । కార్ముకధరుఁడై. ౧

క. సారథిఁగని యిట్లనియెన్, వీరుండు ద్యుమంతుఁ డెచట । విలసిల్లునొ యా
ధారణికి నన్నుఁ గొనిపొ,మ్మా రయమున నన్న నాతఁ । డట్టు లొనరుపన్. ౧

ఉ. అంతట రుక్మిణీతనయుఁ । డాత్మబలంబుల నేఁచుచున్న దు
ర్దాంతు ద్యుమంతు మార్కొని స్మితంబు ముఖమ్మున కట్టినూత్నమా
కాంతిని గూర్ప నెన్మిది నిశాతమరయం బలరారుబాణముల్
పంతముమీఱఁగా నతని । బాహుబలం బడఁగంగ వైచుచున్. ౨ 1576

ఉ. మానక నాలుగా నిశితమార్గణముల్ పరఁగించి వాజిసం
తానముఁగూల్చి సారథిని । దారుణబాణముచే నడంచి పెం
పూనినచాపమున్ విశిఖయుగ్మమునన్ మఱి కేతువొక్కటన్
బూనికమై ద్యుమంతు శిరమున్ వడిఁ ద్రుంచెను బెద్దతూపునన్. ౩ 1577

చ. గదుఁడును సాంబసాత్యకి ముఖప్రతివీరభయంకరుల్ క్రుధం
బొదలుచు సౌభనాయకుని । భూరిబలంబులఁ జెండి; రంతనా
దుఁ దగుబలంబు లెల్ల బలుతూపులఁ గంధరముల్ తెగంగ వే
యుదధిజలంబులం బడియె । నుగ్రతరంబుగ నద్ది కన్పడెన్. ౪ 1578

చ. ఒకరొక రిట్లు పౌరుషము ॥ లొప్పఁగ యాదవసాల్వభూప సై
నికులు రణంబుచేయఁగ న ॥ నీకము దిర్వదియేడురాత్రులన్
సకలభయంకరంబుగను ॥ సాగెను సంకులయుద్ధ మన్న యా
ఖ్యకుఁ దగినట్లు; లాహరియు ॥ యాగనిమిత్తము ధర్మపుత్త్రుచేన్. ౯ 1579

క. ప్రీతికిఁ దగినట్లుగ నా, హూతుండై పోయి యధ్వ ॥ రోత్తమ మది వి
ఖ్యాతిగఁ జెల్లఁగఁ జైద్య, జ్ఞాతలపతి హాతుఁడుకాఁగ ॥ సంతోషమునన్. ౯

క. కురువృద్ధుల భీష్మాదుల, వరమానులఁ గుంతియాత్మ ॥ భవులం గుంతిన్
బురగమనంబుతెలిపి సా, దరముగ వీడ్కొలిపి దార ॥ తతియుఁ రాఁగన్. ౬

మ. చనుచున్ ఘోరనిమిత్తపూగములనున్ ॥ సంభ్రాంతుఁడై కాంచుచున్
దనరాకన్ మదిఁగోరు యాదవుల సం ॥ తానంబు లున్నట్టిప
త్తనమున్ ద్వారవతీసమాఖ్యమును దు ॥ ర్గాంతంబుఁ గాంచన్ మనం
బున నుత్సాహము పొంగఁ బోయెఁ జనుచో ॥ భూపాలకున్ ధర్మజున్. ౨

ఉ. చేరఁగఁబిల్చి యివ్విధిని ॥ జెప్పెను నేబలభద్రుఁగూడి యే
తేరఁగఁ జైద్యపక్షపుక్షి ॥ తిప్రభులెల్లను బూన్కిమీఱఁగా
ద్వారవతిం గలంతు రిది ॥ తథ్యము కావున వేగపోవనా
వైరులఁ జెండనౌ నని యె ॥ వారక యట్టులె యయ్యె నిక్కడన్. ౩ 1583

చ. తనమది నెంచినట్లె ప్రవి ॥ దారణ ముద్ధతి సాగుచుండఁగాఁ
గని పురరక్షణంబునకుఁ ॥ గాఁ దనయగ్రజువేఁడి నిల్పి సా
ల్వునతని సౌభయానమును ॥ బొంగెడుదానిని గాంచి దారుకా!
మనయరదంబుఁ జేర్పుము క్షి ॥ మాపతి సాల్వుని చెంత కిప్పుడే. ౪ 1584

క. పలుభంగుల నొప్పెడు మా, యలుపన్నఁగ నేర్చునీతఁ ॥ డటులాటను నేఁ
గలహాం బీతనితో ని,మ్ములఁ జేయఁగ వలయు నన్నఁ ॥ బొంగెడుకాంక్షన్. ౦౧

చ. అరదము వేగపోవునటు ॥ లాతఁడు తోలెను గేతనంబుపై
గరుడుని రెండుపక్షములు ॥ గాఁదగుసైనికు లెల్లఁగాంచి యీ
పురికరుదెంచెఁ గృష్ణుఁడని ॥ బుద్ధులనెంచిరి; సాల్వుఁ డంతశ్రీ
హరిఁగని స్వీయసైనికబ ॥ లాధిపతుల్ దెగినట్లు లొటచేన్. ౧౦ 1586

మ. శతప్రతేక్షణు మార్కొనం దగినయం ॥ చద్బాహుశౌర్యుండు సై
న్యతతిన్ లేఁడొకరుం డటంచు మదిలో ॥ నం జక్కనూహించి యు
ద్ధతి భీమారవమొప్పు శక్తిఁ గొని వే ॥ తత్సారథిన్ గూల్పనెం
చి తగన్వైచె; మహోల్క నా నభమునన్ ॥ జిత్రంబుగా శక్తియున్. ౦౧

చ. దెసల వెలుంగఁజేయుచు మృ ॥ తిన్ ఘటియింపఁగ వచ్చుచుండ నా
బిసరుహనేత్రుఁ డారసి వి ॥ భీతికృదాశుగపంక్తి నూఱుగా

వెసఁ బడవైచె భూమిపయి; । విక్రమసంపద పొంగ సౌభమం
దెసఁగెడు సాల్వుఁ డార్తిఁగన । నేసెఁ బదాఱు శరంబు లొక్కటిన్. ౧౩

మ. శరసందోహము వైచి సౌభమును భా । స్వంతుండు స్వీయప్రభో
త్కరయుక్తిన్ నభమున్ బలెన్ బడలఁగాఁ । గావించె; సాల్వుండు శ్రీ
హరినిన్ శార్ఙ్గధనుర్ధరున్ గనుచు స । వ్యంబైనహస్తంబు ని
ష్ఠురబాణంబుల నొంచె దోశ్చలనతన్ । క్షోణింబడెన్ జాపమున్. ౧౬ 1589

చ. అది యొకయద్భుతంబునవె । యత్తఱిఁ గన్పడెఁ దద్రణంబు నా
యదనునఁ గాంచుభూతములకయార్తనినాదము లొక్కపెట్టునన్
గదిరెను; సాల్వభూపతియుఁ । గ్రందుగనార్చి జనార్దనున్ ముదం
బొదవఁగజూచి మూఢ! యపు । డొక్కటి మేమును జూచుచుండఁగన్. ౧౭

సీ. మాస్నిగ్ధునకుఁ జైద్య । మహిపున కీనున్న కన్యకారత్నంబుఁ । గానివని యిం
దంచు నెంచక దొంగి । లించి కొంపోయితి; వారాజసూయ మ । హాధ్వరమున
యందు సభామధ్య । మందున్న మాసఖుఁ జంపితి; విక్కార్య । సంచయముల
నొనరించి జగతియం । దొక్కెడ నను గెల్వఁ దరముగా దేరికం । చురుతరమగు

ఆ. గర్వమూని యున్న । ఖలు నిన్ను నిపుడె మ,న్నిశితబాణములను । నీవుమరలి
రానిగతికిఁ బంపఁ । బూనితి నెదుర ని,ల్వంగఁ బూనుదేని । వార కనిన. ౧౮

చ. అనవిని శౌరి యిట్టులను । నక్కటఁ మందుఁడవౌట నీవు తోఁ
చినగతి ప్రేలెదేమిటికొ? । చెంతను జేరఁదలంచు మృత్యువున్
గనుఁగొననేర వుద్ధతిని । గాఱులు పల్కరు శూరులెల్లరున్
గనఁబఱుపంగఁ జూతురు మ।గంటిమి ప్రాజ్ఞులుగాన నంచొగిన్. ౧౯ 1592

చ. పలుకుచుఁ దీవ్రవేగమునఁ । భాసిలుచున్న గదాయుధంబు మి
క్కిలి క్రుధ చిత్తమం దొలయఁ । గృష్ణుఁడు సాల్వుని జత్రుభాగముం
గలయఁగఁజూచి కొట్టుటయుఁ । గ్రక్కున నెత్తురు గ్రక్కుచున్ మహా
ర్తులఁగనుచున్ వడంకె; హరి । తోడనె దాని గ్రహించె నంతలోన్. ౨౦ 1593

క. కనఁబడకపోయె నెచటికొ, జనపతి; యొకక్షణము సాగ । సరగునఁ బురుషుం
డనుపమగతి వచ్చిమహా, త్మునకున్ శిరమట్టె వంచి । మ్రొక్కి యిటులనున్. ౨౧

క. దేవకిపంపఁగ నీకడ,కే వచ్చితి ననుచు మిగుల । నేడ్చుచుఁ గృష్ణా!
శ్రీవత్సాంకా! పితృహిత, భూవిభుఁ డాసాల్వుఁ డిపుడు । పూని యకరుణన్.

ఆ. సౌనికుండు పశువిసరమును గొనిపోవు, నట్లు కట్టి కొంచు । నరిగె ననిన;
నప్రియోక్తి వాని । నాలించి మనుజస్వ, భావమూనియుంట । వగఁ బొగులుచు.

చ. కరుణ తనంత పైకొనఁగ । గాఢతరంబగు ధైర్యమెట్టులో
యరుగఁగఁ బ్రాకృతుండవలె । నార్తిని గాంచుచుఁ బల్కె నిర్ఘరో

త్కరములు గెల్వఁజాలని నిశాంతబలాఢ్యు మదగ్రజన్ము సం
గరమునఁ ద్రొప్పపాటు గనఁగాఁ దగనట్టి మహాత్మురామునిన్. ౨౩౫ 1597

చ. గెలిచి యదెట్టు లల్పుఁ డవశీర్ణియునై తగు సాల్వుఁడామహా
త్ములఁ బితృపాదులం గొనుచుఁ బోయినవాఁ డకటా! మనంబునం
దలఁపఁగ దైవమే బలయుతం బనితోఁచెడు నంచునెన్నొ యీ
హాలఁ గనుచుండునంత హరియగ్రతలంబున సాల్వభూపుఁడున్. ౨౩౬ 1598

మ. వసుదేవుం గొనివచ్చినట్టు లొకనిన్ బంధించి తోడ్తెచ్చియిం
పెసఁగం బల్కెను నీదుతండ్రి యితఁడే యేతన్నిమిత్తంబె కా
వసుధన్ బ్రాణములన్ ధరించి కుమతీ! వర్థిల్లుచున్నాఁడ వీ
వసుదేవున్ వధియింతు నీవు కనఁగా బాహాబలం బొప్పఁగన్. ౨౩౭ 1599

క. కావఁగ సమర్థుఁడవే, నీపట్టునఁ జూపు శక్తినేఁ జూతు నటం
చీపగిదిఁ బల్కుచు మాయాపాటవ మొప్ప నిశితమగు ఖడ్గముచేన్. ౨౩౮ 1600

క. ఆనకదుందుభి మస్తక, మానిముసమునందె నఱికి యద్దానిని గైఁ
బూని నభంబునఁదగు తన, యానమ్మునం జేరె; నంతనా శ్రీహరియున్. ౨౩౯ 1601

చ. తనజనులందు మిక్కిలి ముదంబు గలాఁడగుటన్ ముహూర్త మా
త్మనియతదివ్యబోధమును మానిరొ తాఁ బ్రకృతిస్థుఁడై క్షణం
బున నె మహానుభావతను బొల్చుట నయ్యుదియున్ మయుండు సా
ల్వునకు నెఱుంగఁ జెప్పినది భూరితరాసురిమాయయం చొగిన్. ౨౪౦ 1602

క. తలపోసె; నంతలోనే, కలహాంగణమందు మున్ను గాంచిన యలమా
యలదూతఁ గానిజనకుని, కళేబరము గాని కానఁగాఁ జాలమిచేన్. ౨౪౧ 1603

ఆ. స్వప్నమందుఁ దోఁచు వస్తువులంబోలి, యవ్వె మాయమయ్యె నం చెఱింగి
యంబరమునఁ దిరుగునానాసౌభమునను న్న, వైరి సాల్వుఁ గాంచివాని నపుడె.

క. అని మొనఁ జంపఁగ నెంచెను, విను హే రాజర్షి వర్య! విమలమతులు న
య్యును మహానులు కొందఱు చెప్పినపల్కులు వెనుకముందు విషమమ్ములుగన్.

సీ. తోఁచుచున్నను వానిఁ దోరంపుటూహలఁ బరికింప కెట్టులో పల్కుచుండు
రియ్యది సత్యమా నెట్లన శోకమోహమ్ములు గాని స్నేహమ్ముగాని
యజ్ఞానకృతమగు నాసాధ్వసముగాని యెక్కడ? యింతయం జెఱుఁగఁ దగని
జ్ఞానవిజ్ఞానవికాలసుఖద లొప్పు పరమేశుఁ డెక్కడ? పలుకఁ దగునె.

తే. యిట్టు లాహరి భావించె నెద నటంచు
నెవనిపాదాబ్జసేవచే వృద్ధిదమగు
నాత్మవిద్య తనంతన యలముకొనఁగ

ధరణి నసమానులగుచు నుందురు సుజనులు. ౩౧ 1606

ఆ. మఱి యనాదియగుచు ౹ మలయు దేహాత్మవి,భ్రాంతి వాయఁజొమ్ము ౹ వారలంత
నింత యనఁగ రాని ౹ దే యయియాత్మీయ,మునగు నవ్విభూతి ౹ గనుదు రెలమి.

క. పరమైశ్వర్య స్థానము, పురుషోత్తముఁ డెల్లసాధు౹పురుషులకు నిరం
తరసద్గతియగుఁ గావున, హరి కతనికి మోహ మెట్టు౹లగు? తలఁపంగన్. ౩౨

చ. కనఁబఱచెఁ మహాత్ముఁడగు ౹ కాంచనచేలుఁడు మానవాకృతిం
గనిన తెఱంగు లోకులకు; ౹ క్ష్మాపరిపాలక! కృష్ణమూర్తిచే
సిన మహనీయకార్యమును ౹ జెప్పెదఁ జక్కఁగ నాలకింపు మా
జనపతి సాల్వుఁ డంతఁ దను౹శస్త్రసమూహముచేత నొంచుచున్. ౩౩ 1609

క. పౌరుషమును జూపుచుఁ దనఁ, ద్వారవతిం గైకొనంగఁ ౹ దా నెంచఁగ నా
శౌరి యమోఘపరాక్రముఁ, డారిపుతోఁ బోరుచుండి ౹ యంబకవితతిన్. ౩౪

మ. కవచంబుల్ ధనువుల్ శిరోమణిని వేడ్కం జెండి క్రోధంబుచే
త విమానంబును సౌభకంబు గదచేతన్ భగ్నముం జేసె ని
ట్టి విధానంబున నగ్గదాయుధము దండింపంగ సౌభంబు నొ
క్కవడిన్ వేయిగఁ దున్కలై పడియె నా౹కంఠిన్ విరావంబుతోన్. ౩౫ 1611

చ. తనదగు వ్యోమయానము గ౹దాహతి భగ్నముగాఁగ సాల్వుఁ డం
త నిలకు వచ్చి నిల్చి గదఁ౹దాను ధరించి జవంబుమీఱఁగా
ననుపము నచ్యుతుం బొడుచు ౹ నాశ మెయిం బఱతెంచె నిట్లు వ
చ్చునతనిఁ గాంచి యంగదవి౹శోభితమైతగు వానిబాహువున్. ౩౬ 1612

మ. ఒకభల్లంబునఁ ద్రుంచి తద్గతికినై ౹ యుద్యోగముం జేసి యా
త్మకరం బందు లయార్కసన్నిభముఁ జక్రంబుల్ మహాభీతిదం
బకళంకంబును నొసుదర్శనము నొ౹య్యారంబునం దాల్చి చి
త్రకళల్ రాజిలె నుద్యదర్కయుతమా౹ప్రాగ్భూధరం బట్లుగన్. ౩౭ 1613

క. అతిశయమాయా భూషితుఁ, క్షితిపుని వధియింపఁగోరి ౹ శీర్షంబు మణీ
యుతకుండల మకుట విభూ, షితమును జక్రాయుధమున ౹ ఛేదించె వడిన్. ౩౮

క. హరిహయుఁ డావృత్రుని దగు, శిరమును వజ్రాయుధమునఁ ౹ జెండినగతి నా
హరి సాల్వశిరము ద్రుంచినఁ, బరఁగెన్ హాహారవంబు౹పటుతర మగుచున్. ౩౯

చ. హరి యిటు చక్రధారల మ౹హారిపుఁ ద్రుంచిన నగ్గదాహతిన్
సురరిపుశిల్పిచిత్రితముఁ ౹ జోద్యమునై తగుసౌభ మబ్ధి యం
తరమునఁ జూర్ణమై పడినఁ ౹ దద్దయు నిర్జరదుందుభుల్ మహా
త్తరరవ మొప్ప వెల్లె నిటు ౹ దస్యుఁడు గూలినవార్త యెల్లెడన్. ౩౬౪ 1616

వ. వ్యాపించిన విని సఖులగు శిశుపాలాదులకు మహోపకారము చేయఁబూని దంత
వక్త్రుండు పట్టరానికోపంబున నాకృష్ణునిపై నెత్తివచ్చెనని పల్కి శుకయోగి
యిట్లనియె. ౩౭ 1617

---

## డెబ్బదియెనిమిదవయధ్యాయము.

### దంతవక్త్రుని హరి వధించుట.

మ. విను ముర్వీశ్వర! చైద్యసాల్వులును దుర్వృత్తిం బ్రవర్తిల్లుపౌం
డ్రనృపాలుండును భూతలంబు విడి స్వర్గస్థానముం జేర వా
రిని బారోక్ష్యసుహృత్త్వపద్ధతిని సంప్రీతాత్ములన్ జేయఁగా
మనమం దెంచుచు దంతవక్త్రుఁడు హరిన్ మర్దింప నుద్యుక్తుఁడై. ౧ 1618

ఉ. ఒక్కఁడె తాఁ బదాతియయి యుగ్రతరక్రుధఁ బూని యుర్వియుం
గ్రక్కదలంగఁ జేయునటు కాల్నడుచున్ గదఁ గేలఁబూని వే
యక్కితవుండు భూరిబలుఁ డాహరి మార్కొన వచ్చె; నిట్లు పే
రుక్కునఁ బైకివచ్చు రిపునుద్ధతుఁ గాంచి జవంబు మీఱఁగన్. ౨

చ. గదఁగొని స్యందనంబు డిగి కంధిని వేలయుఁ బోలె నిల్వరిం
పఁదలఁచి తా నెదుర్కొనియెఁ బద్మదళాక్షుని గాంచి దంతవ
క్త్రదనుజసత్తముండు మది గర్వముపొంగఁగఁ నిట్లుపల్కె నో
యదువర! నాదు భాగ్యము మహత్తరమే యనవచ్చు నీయెడన్. ౩ 1620

చ. కనుకనె యోముకుంద! ననుఁ గన్నన మార్కొన వచ్చినాఁడ వీ
వనఁగను మాతులేయుఁడవె యాదువు కాని మదీయమిత్రులన్
దునిమితి వంతెకాక ననుఁ ద్రుంపఁగఁ గోరుచు నున్నవాఁడ వే
మనఁదగు మందబుద్ధిగలయట్టి నినున్ బ్రధనాంగణంబునన్? ౪ 1621

క. దంభోళి విడంబించెడు, శుంభద్గద యిద్ది రుచులశోభిల్లెడుఁ జా
జృంభించు నిన్ను వృత్రుని, జంభారివధించు మాడ్కిఁ జంపెద దీనన్. ౫ 1622

చ. అటులొనరించి యీయదనునందె వయస్యులదౌ ఋణంబు నో
క్కటి సఖివత్సలుండ ననఁగాఁదగు నే నొగిఁ బాపుకొందు ను
త్కటమగు రోగ మంగమునఁ గల్గఁగ నౌషధసంప్రయుక్తిచే
నెటు తెగఁ బాపుకొందు రటులే తలపోయఁగ బంధువయ్యనున్. ౬ 1623

క. పగవాఁడవె యాదువుగా, పగఁ దీర్చుకొనంగ నిదె నోపంబగుఁ జుమ్మీ!
తగినట్లు శాస్తిచేయుదు, మగటిమివాటించి యనెడు మాటలచేతన్. ౭

క. మునికోలలచే నేనుం,గునుబోలెన్ దూలనాడి గుదియంగొని కృ

---

* "పరలోక కృతానాం చ కుర్వన్ పారోక్ష్యసౌహృదమ్" అని మూలము.

ష్ణుని శీర్షము నొప్పించెను, ఘనసింహధ్వని నొనర్చె ॥ గర్వముపొంగన్. ౬

క. యదుకులనాథుఁడు హరి యా, గద చేతంగొట్టువడియుఁ ॥ గంపింపక యే
కదలక యచ్చోనుండెను, మది నెంచెను వానినపుడె ॥ మ్రందింపంగన్. ౭

క. హరియటఁ గౌమోదకియను, గురుగద చే నురమునడుమఁ ॥ గొట్టంగా నె
త్తురు నోటనుండి వెడలఁగ, ధరఁబడి కేశాళిజాఱ ॥ దనుజుం డార్తిన్. ౮

క. కరపదములఁ జాఁచుచు భీ,కరరూపము గానఁబడఁగఁ ॥ గ్రక్కున బ్రాణో
త్కరమేగ శవంబయ్యెన్, బరికింపఁగ నపుడు భూతపటలం బెల్లన్. ౯ 1628

క. చేదిపతిఁ జంపువేళల, నేదియొ చిత్రంపుజ్యోతి ॥ యెటులు వెడలెనో
యీదంతవక్త్రు వధమున, నాదేహమునుండి జ్యోతి ॥ యతిసూక్ష్మంబై. ౧౦

క. కనఁజిత్రముగా వెల్వడి, వనజాక్షునియందుఁ జొచ్చె ॥ వానియనుజుఁ డ
న్నను జంపఁగ శోకంబున, వనరి విదూరథుఁడు వాలుఁ ॥ బలుఁకను గొనుచున్.

సీ. నిట్టూర్పు లొగిఁబర్వ ॥ నీరజనేత్రుని జంపఁగాఁగోరి రాఁ ॥ జక్రధరుఁడు
క్షురనేమియై రుచుల్ ॥ పరఁగఁగ్రాలెడు చక్రమునుగొనికుండలములుకుటములను
వెలయు విదూరథు ॥ తలఁ ద్రుంచె; నీరీతి సౌభయానమ్మును ॥ సాల్వు దంత
వక్త్రు విదూరథు ॥ వానిబంధువులను దుర్విషహుల నెల్లఁ ॥ దునిమివైచి

తే. సురలు మానవులెల్లను ॥ స్తుతు లొనర్ప
మునులు సిద్ధులు గంధర్వముఖ్యు లవ్వి
ధమున విద్యాధరులు ఫణితతులు దేవ
కన్నియలుఁ గిన్నరులు యక్షగణము మఱియు. ౧౨ 1631

క. చారణులును బితృముఖ్యులు, సారోపనిషత్తులను నొసంగెడుభక్తిన్
జేరి నుతించుచు వరసుమ,వారముఁ గురియించి; రంత ॥ వనజాక్షుండున్. ౧౩

చ. యదువిభు లెల్లఁగొల్వ విజయంబు నుతించుచు వందిబృందముల్
సుదతులు సేసల్ గురియుచున్ దను నెన్నఁగ ద్వారకాపురిం
బొదలెడు వేడ్కఁ జొచ్చెఁ బురముల్ గయిసేసియె పౌరులెల్ల స
మ్మదమునుబొంది రిట్లు హరి ॥ మత్తరిపూత్కరముల్ జయించుటన్. ౧౪ 1633

మ. జగదీశుండును యోగనాయకుఁడు నంచచ్ఛక్తిపూర్ణుండు నై
భగవంతుండయి యొప్పు కృష్ణుఁడు పశుప్రాయుల్ తనుం గెల్చె నో
డెఁ గదా యంచుఁదలంప నుండె నని నోడెన్ గెల్చెనన్నట్టి దే
కద విభ్రాంతి తలంపఁగా నజితుఁడౌ ॥ కంజాక్షుఁ డెట్లోడునో. ౧౫ 1634

చ. హరికిఁ బరాజయం బమరునంటయొ యజ్ఞత; భూమిపా! యనం
తరకథ నాలకింపుము; నితాంతము పాండవకౌరవుల్ మహా
త్తరరణకాంక్ష నుంట విని ॥ తా బలరాముఁడు స్వాంతమందుని

ద్వైరపయి నొక్కరీతిఁ దమిఁ బూనినవాఁడుగ నుంట నత్తఱిన్. ౧౮ 1635

తే. తీర్థయాత్రామిషంబున దివ్యదేశములను గనఁబోయె; నాతండు తొలుత భక్తి
తగఁ బ్రభాసతీర్థంబునఁ దానమాడి, యందు దేవర్షి పితృమనుజాళి కెలమి. ౧౯

సీ. తర్పణంబులు చేసి ధరణీసురాన్వితుఁడై ప్రతిస్రోతమై యలరునట్టి
నది సరస్వతిని గానంజనె; నంతఁ బృథూదకమనెడు తీర్థోత్తమంబు
బిందుసరంబును విమలత్రికూటంబు మఱి సుదర్శనము బ్రహ్మమనుతీర్థ
మును విశాలాహ్వయంబును జక్రతీర్థంబుఁ బ్రాచి సరస్వతిఁ బరమభక్తి

తే. తనర సేవించి యమునానదిని వియద్ధు
నిని విధిఁ గొల్చి స్నాతుఁడై నిఖిలమౌని
సేవ్యమౌ నైమిశంబను క్షేత్రమునకుఁ
జనియె; నట సత్రయాగంబు సాగుచుండు. ౨౦ 1637

చ. మునివరు లట్లువచ్చిన విభుఁ బలభద్రుని సన్నుతించి వం
దనములు శాస్త్రపద్ధతి నొనర్చిరి వారలు దీర్ఘసత్రముం
బొనరుచుచుండు; రిట్లితఁడు మోదమునన్ మును లెల్లఁ బూజలం
దనుపఁగ సానుగుండయి నితాంతసుఖాసనమున్ గ్రహించుచున్. ౨౧ 1638

తే. మునులతోఁ గూరుచుండి యందు నొకయాస
నమునఁ గూర్చున్నవాని వ్యాసమునిశిష్యు
సూతునిన్ రోమహర్షణ ఖ్యాతనాముఁ
గనియెఁ; బ్రతిలోమజాతుఁ డయ్యును నతండు. ౨౨ 1639

చ. తనుగని లేచి రాకయు యథావిధి మ్రొక్కకయున్ సుఖాసనం
బున వసియించియుండుటయు భూసురవర్యులకంటె నున్నతా
సనము గ్రహించియుండుటయుఁ జక్కఁగఁ జూచి సహింపలేక యిం
తనఁదగనట్టి కోపమును దాఁ గని యిట్లనియెన్ మహోగ్రతన్. ౨౩ 1640

క. ప్రతిలోమజాతుఁడై తగు, నితఁ డిందును విప్రవరుల కెల్లవిధుల ధ
ర్మతతిని గాచెడు మాకును, గతి యున్నతమై తనర్చు గద్దియపైనన్. ౨౪

తే. కూరుచుండుట యెట్లు? దుర్గుణుఁడు వీఁడు
వధమునకు నర్హుఁడగు; భగవంతుఁడైన
వ్యాసమునికిని శిష్యుఁడై బహువిధములు
గాఁగ విలసిల్లు నితిహాసకాండములను. ౨౫ 1642

క. విమలపురాణంబుల ధర్మములన్ బోధించు శాస్త్రమండలమును బూ
ర్ణముగాఁ బఠించియున్ విన, యము దాంతియు లేక నీతి యమరని మదితోన్.

క. తను బండితునిగఁ దానే, యనుకొనుచున్ విఱ్ఱవీఁగు నకటా! యిటు శా

స్త్రనికరమును జదివియుఁ దన, మనస్సునుం గెల్వలేక ॥ మానివిధమునన్. ౨౬
క. కనఁబడు నీతఁడు చదివిన, ఘనవిద్య లవెల్ల నీచగణమునకువలెన్
మునులారా! దోషమున క,గును గాని రవంతయైనఁ గుణమున కెట్లో? ౨౬ 1645

చ. ఇతఁ డెటులున్న నేమనకుఁ ॥ డెంతయు ధర్మమనీషు లట్టులు
ద్ధతులును వేషధారులయి ॥ ధాత్రిఁ జరింతురు గాన వారలన్
మృతి గనఁజేయఁగా వలయు; ॥ నిందులకే యవతార మేను నె
త్తితి నిటు భూరిపాపులయి ॥ తెంపున స్వేచ్ఛఁజరింత్రు వీరలే. ౨౭ 1646

చ. అని వచియించి దుర్జనులనైన వధింపఁగఁ మానియుండియున్
మునుమును సాగఁగాఁదగిన ॥ భూరివిధిప్రబలప్రయత్నముం
దనుఁ బురికొల్పఁ జేతఁదగు ॥ దర్భకొసన్ముని రోమహర్షణున్
మునివరులెల్లఁ జూడఁగనె ॥ భూరితరక్రుధ వ్రేసె; దాననే. ౨౮ 1647

ఉ. ఆతఁడు చచ్చె; నందుఁగల ॥ యమ్మును లక్కటా! యక్కటా! యటం
చాతతదుఃఖ మొంది రిటు ॥ లమ్మునిఁ జంపిన రాముఁ గాంచి యి
ట్లీతటినీ యధర్మ మిటు ॥ లెన్నకయే యొనరించినాఁడ వీ
సూతుఁడు సత్పురాణములసొంపు వచియించును శాంతమూర్తియై. ౨౯ 1648

క. కనుకనె బ్రహ్మాసన మిచ్చినవారము సత్రయాగసిద్ధి చెలఁగుదాఁ
కను దేహము శ్రమమొందక,యె నిల్చునటు లాయువుఁ దమి ॥ నిచ్చితిమి విభూ!

క. తెలియకయే యీవిధమును, హలధరణా! బ్రహ్మహత్య ॥ యంతటిదగు నీ
కలుషమును దెచ్చుకొంటివి, పలుకులు వేయేల యోగపతి వీ వరయన్. ౩౦౪

సీ. కావున నామ్నాయగణము నిన్నును జక్క శాసింపఁజాలదు; ॥ సర్వలోక
పావనా! యట్లయ్యు ॥ బ్రహ్మహత్యను దీనిఁ బాపుకొనంగనౌ ॥ ప్రాచితంబు
చేసికొనందగు; ॥ క్షితి నెవ్వరును నిన్నుఁ బురికొల్పకున్నను ॥ భూతములకు
ధర్మమార్గముఁ దెల్పఁదగుఁ గాన స్వేచ్ఛగాఁ జరియింతు; వట్లయ్యు ॥ సరగఁదన్ని
తే. వృత్తి నొనరింప నొరులకు ॥ నిదిసుమార్గ, మనుచుఁ దెల్పినయట్లగుననఁగ రాముఁ
డెల్లరకు మేలుచేయుట ॥ కెలమినీవ,ధమున కీడగు నప్పాచితము నొనరుతు.

క. దీనికిబాచిత మెయ్యది,యే నిర్దేశింపుఁ; డిప్పు ॥ డీసూతునకున్
నేనీయఁ దగిన దేదో, మానసమున నెన్ని చెపుఁడు ॥ మానితులారా! 3 3 1652

క. చిరకాలజీవితం బో, వరబలమో దేహమునకుఁ ॥ బాటవమో వి
రరసి మతేమియుఁ వలతురొ, నరగన్ వచియింపుఁ డేను ॥ సాధింతుఁ ద్వరన్.

తే. యోగమాయాబలంబున ॥ నొగిఁ దగంగఁ, జేయుఁవాఁడ నటంచనానాయమోఘ
శక్తిఁగని పల్కి రమ్మునుల్ ॥ సంతసమున, నీదు శస్త్రవీర్యములకు ॥ నేది హితమొ.

క. ఇతనికిఁ గల్గినమృతికిన్, గ్రతు వెప్పుడు పూర్ణమగునొ ॥ రామా! యాయు

శ్చ్యుతి గలుగం దంతవక్త్రుకును, క్షితినను మావాక్యమునకుం జే టొదవ నటుల్.
క. ఇవియన్నియు సూనృతములె, యవు నెట్లో యట్లు చేయు మనిపల్కంగ మా
నివరులం గని రాముం డని,యె వేదవాక్యమ్మురీతి నెంచి కనుంగొనన్. ౩౫ 1656
క. జనియించుం దానె పుత్త్రుండు,గ నటంచుం దెలియనగును గాదే, యటు కా
వున నితనిసుతుండు చెప్పం,గనుజాలుం బురాణములను గలకాలంబున్. ౩౬
క. అతం డుగ్రశ్రవసుండన, క్షితి ఖ్యాతిం గాంచునుజుండి! చిరకాలము జీ
వితమును గాంచుచు నింద్రియ, తతిపాటవ మొప్పంగా నతండు వెలయుతన్.
చ. మునివరులార! యేవిషయమ్ముల్ మఱికోరుదురో వచింపుం డీ
తనితనయుండు వక్తయయి తత్త్వముం జెప్పుటంజేసి మీరు తె
ల్పినయవి సిద్ధిం గాంచెగద! బేలతనంబున నిప్పు డేను జే
సిన యఘరాశినిష్కృతిని జెప్పుడు చక్కంగ నెంచి సత్కృపన్. ౩౭ 1659
మ. అని ప్రార్థింపంగ మాను లిట్టులని రోయార్యా!యఘం బేగు చ
క్కనిమార్గంబు వచింతు మిల్వలుం డనంగా నొప్పుదైత్యుండు త
త్తనయుం డొక్కండు పల్వలుం డనంగ దుర్దాంతుండు ఘోరాకృతిం
గనువాండొం బ్రతిపర్వమందును మముల్ గాఱింప నేతెంచెడున్. ౩౮ 1660
క. మేమొనరించెడు సత్త్రం, బేమాడ్కిన్ సాగకుండు నెంచి దితిసుతుం
డామాడ్కిం జతనమూనును, జీమును రక్తంబుం గురియుంజిత్రముగాంగన్.
క. మూత్రపురీషంబుల నా, సత్త్రంబునం బడంగ వదలు శౌర్యాఢ్యా! యో
జైత్రా! యప్పాపాత్ముని, ధాత్రీసురబాధకుని మృధంబున నిపుడే. ౪౦ 1662
క. పొరిపుచ్చుమదియె మాకుం, బరమంబగు లాభమగును బాపాత్ముం డతం
డురుమాంసమద్యముల నుం, గురియును దాశార్హ! యతనిం గొంకక చంపన్.
క. అది మాకగు శుశ్రూషణ, మదయుం డతండొటం జంప నర్హుం డవల్
బొదలు మహింసావ్రతమున, మది శాంతిం బొందం దిరుగుమహి నెల్లెడలన్.
క. ప్రతితీర్థంబునం గ్రుంకుచు, క్షితికిం బ్రదక్షిణము నీవు సేయుము విధిగా
జతనమ్మున నొకయబ్దం, బతిశుద్ధుండ వౌదు వనిరి హర్షముగలుగన్. ౪౦ 1665

డెబ్బదితొమ్మిదవయధ్యాయము.

రాముండు పల్వలుంజంపి తీర్థయాత్ర చేయుట.

చ. అని వచియించి యాశుకమహర్షి యనంతరగాథ నివ్విధం
బునం దెలుపంగంబూనె నృపపుంగవ! పర్వదినంబు రాంగ భీ
తిని గలిగించు నాయనిలదేవుండు ధూళిని వృష్టిరీతిగాం
గనులను గప్పంజేయుచు నిశాముమ కంపు దిశాళి నిండంగన్. ౧ 1666

క. వీఁగ సాఁగెను సత్త్రం, బావసథ మమేధ్యవృష్టి నంతటఁ బడున
ట్లే వర్షించుచుఁ బల్వలుఁడేవచ్చెను శూలము కయిఁ నెసఁగుచునుండన్. ౨

మ. పెనుకాయం బమరంగఁ జూడఁబడియెం; బృథ్వంజనక్ష్మాధరం
బనఁగాఁ జాలిన మేనికాంతి తగఁ దామ్రాభంబుగా శ్మశ్రుకే
శనికాయంబు కనంబడంగ ఘనదంష్ట్రాభీతికృద్భ్రూకుటీ
కనదుగ్రాస్యముతో నిశాచరుఁడు వేడ్కన్ నింగిఁ గానంబడన్. ౩ 1668

చ. దితిజుని గాంచినంత బలదేవుఁ డెదన్ ముసలాయుధంబు ద్వి
ట్తతివిదారణక్షమము వింతరుచుల్ దగుదాని దానవ
ప్రతతిహరంబు నాహలముఁ బంతమునన్ స్మరియించె నంత నా
ద్వితయము తోఁచె; నప్డు పటువిక్రమసంపద పొంగుచుండఁగన్. ౪ 1669

మ. బలదేవుండు హలాయుధాగ్రమున నభ్రస్థానమందున్న ప
ల్వలదైత్యున్ వడిలాగి బ్రాహ్మణుల కోల్లన్ హానినే చేయు దో
ర్బలమత్తున్ ముసలాయుధంబున నమర్షం బొప్పఁగా మోదినం
దలయుం దుత్తుమురై యసృక్తటిని యంతం బాఱఁ బిట్టార్చుచున్. ౫ 1670

క. అరుణరుచిన్ భాసిలుక్ష్మాధరవర్యము వజ్రనిహతిఁ ద్రా బడునట్లే
సురవైరి నేలఁ గూలెను, ధరణీసురమాను లతనిఁ దత్పరమతులై. ౬ 1671

చ. వినుతులఁ దన్ని యెన్నఁదగు వృత్తిఁ జెలంగఁగ నాశిషంబులం
దనుపుచు వృత్రుఁ జంపిన శతక్రతునిన్ సురలట్టు లమ్మహా
త్మున కట మజ్జనంబు క్రమమునం దగినట్టులు సల్పి రంత; నా
తనికిని బద్మమాలను ముదంబున నిచ్చిరి మౌను లందఱున్. ౭ 1672

క. అదివాడ దెప్పుడున్ సంపదలకు సంస్థానమాను శోభానికరం బ
య్యది నించు నెల్లయెడలన్, సదమలమై వైజయంతిసంజ్ఞం దనరున్. ౮ 1673

ఉ. అంతియగాక మౌనివరు లంబరయుగ్మ మమూల్య మిచ్చి ర
ట్లంతట దివ్యకాంతులను హారితరంబగు భూషణాళి యా
వంతయు దోషమేకననియట్టి మణిప్రకరంబు నిచ్చి దు
ష్టాంతకుఁ డంచుఁ బేర్కొనిరి హర్షమునన్ బలభద్రుఁ డంతటన్. ౯ 1674

చ. అనుమతిగోరి వారలు మహాదృతిఁ బంపఁగ బ్రాహ్మణోత్తముల్
తనదు పిఱుందరాఁగఁ బ్రమదం బిషుకౌశికి నాఁ దనర్చు ప్రా
దిని గనఁబోయి క్రుంకులిడి దివ్యతరంగిణితో సమానమౌ
ననఁ దగియున్న యాసరయు వాదినెటన్ జనియించె దానినిన్. ౧౦ 1675

క. కనఁబోయె నాసరోవరమునఁ గ్రుంకెను సరయు వెల్లువోవు నె యాత్రో
వనె పోయి ప్రయాగముఁ గాంచెను స్నానము చేసె నందు సిద్ధులఁ గనఁగన్.

సీ. అందు దేవాదుల కాదృతిమీఱఁగఁ దర్పణంబు లొనర్చి తరలి పులహు
నాశ్రమంబున కేగి యవ్వల గోమతి యందుఁ గండకియందు నావిపాశ
యను తీర్థమందును మునిఁగి శోణాఖ్యమా నదవరమ్మునను స్నానంబొనర్చి
గయ కేగి తనపితృగణముల కెల్లను దర్పణంబులు చేసి తరలి గంగ

తే. సాగరంబున నెచ్చోట సంగమించు
నచటికిం బోయి మున్ని నియతి విధులను
జరపి యవల మహేంద్రమహా శైలమందుఁ
బరశురాముని గని భక్తి వందనమిడి. ౧౯౪ 1677

వ. సప్తగోదావరిని వేణీపంపాభీమరథీనదులం గాంచి స్నానము చేసి స్కంధదేవుని దర్శించి శివునకు నాలయంబగు శ్రీశైలంబున కరిగి ద్రవిడదేశములయందు మిక్కిలి పుణ్యంబులొసఁగు వేంకటాచలమును దర్శించి కామకోటిని గాంచీనగరంబును గావేరీమహానదిని గాంచి స్నానాదులొనర్చి యెందు శ్రీహరిసన్నిహితుండై యుండునట్టి శ్రీరంగక్షేత్రమునకు నరిగి ఋషభాద్రిం గని దక్షిణమధురను సందర్శించి మహాపాతకములందోలు సముద్రసేతువునకుం బోయె. హలాయుధుం డందు బ్రాహ్మణప్రవరులకు నయుతసంఖ్యాకధేనువుల దానంబు చేసి యచ్చోటువాసి కృతమాలాతామ్రపర్ణులయందు స్నాతుండై కులాచలంబగు మలయపర్వతంబునుగని యందు వేంచేసియున్న యగస్త్యమునిచంద్రు దర్శించి నమస్కరించి యతఁ డనుగ్రహించిన యాశిషంబుల గ్రహియించి యనుమతి వేఁడి యమ్ముని యంగీకరింప దక్షిణోదధికిం బోయె. అందు నెలకొనియున్న కన్యాఖ్యందగు దుర్గాదేవిం గాంచి యందుండి యనంతపురవరమును గనఁబోయి యత్యుత్తమపంచాప్సరస్తీర్థమున విష్ణుదేవుండు సన్నిహితుఁడై యుండుఁగావున నామహాతీర్థంబున స్నానంబొనర్చి యయుతధేనుదానంబులొనర్చి యటనుండి ప్రయాణమై యమ్మహాత్ముఁడు కేరళత్రిగర్తదేశములఁ గాంచుచుంబోయి పరమశివక్షేత్రంబగు గోకర్ణమును దర్శించి యవ్వలద్వీపవాసినియగు నార్యామహాదేవిం జూచి శూర్పారకమునకరిగి పిదపఁ దాపీనదిని బయోష్ణీనదిని నిర్వింధ్యను గాంచి స్నానంబొనర్చి దండకారణ్యమును బ్రవేశించి నర్మదను జూడఁబోయెను. దాని తీరంబున మాహిష్మత్యభిధానపత్తనలలామం బుండును. తద్దర్శనంబున నానందించి పిదప మనుతీర్థమందుఁ గ్రుంకులిడి ప్రభాసమునకు మరలివచ్చె నంత. ౫ 1678

తరళము. హలధరుండట బ్రాహ్మణోత్తము లాకురుక్షితిపాలవం
శ్యులును బాండవు లాహవంబును శూరతం బొనరింప భూ
పులును బెక్కురు వారిపక్షముఁ బూని పోరి మహాస్త్రమం
డలహతిం గని స్వర్గమొంది రనంగ నెంతయుఁ జింతిలెన్. 1679

తరళము. ధరణిభారముఁ బాసె నంచును దాఁ దలంచె; సుయోధనుం

డురుబలుండగు భీమసేనుఁడు నుద్ధతిఁ గదలూని భీ
కరరణం బొనరించుచుండుట త్ర్యాసురుల్ వచియింపఁగా
నరిగె సంగరమాపఁ గోరుచు నామహాహవభూమికిన్. ౨౩ 1680

చ. యమతనయుండు మాద్రిసుతు లర్జునుఁడుఁ హారియుఁ దనంత నె
య్యము తగ వచ్చినట్టి హాలి కాదృతివందనముల్ పొనర్చి యు
ద్ధమునిలుపంగ నేమయినఁ దాఁ బలుకం జనుదెంచెనేమొ యీ
సమయమునందు నంచెదల సంశయమందుచు నూరకుండఁగన్. ౨౪ 1681

చ. హలి యచటఁ సుయోధనుఁడు నయ్యనిలాత్మభవుండు నొండొరుఁ
గెలువఁగఁగోరి పెఁగదలఁ గేలధరించి విజృంభణంబునఁ
బొలుచుచు మండలాకృతులఁ బొలువిచిత్రగతుల్ తగంగ ని
ష్ఠుల ననిసేయుచుంటఁ గనిపోయి సమీపముఁజేరి యిట్లనున్. 1682

క. మనుజాధిప! యోదుర్యోధన! యోయివృకోదరా! నితాంతము సమతం
గను బలము గల్గు వీరులు,గనున్న వా రిర్వురిట నొకం డరయంగన్ 1683

చ. బలమున నెక్కుఁ డొక్కరుఁడు భారగదాయుధశిక్ష నెక్కుఁడై
తులనిడినట్టు లొప్పుగతిఁ దోఁచెడు నామది కిట్లు తుల్యవీ
ర్యులరయి యుంట నెవ్వనికి నొప్పుజయంబొ పరాజయంబొ యి
ష్ఠులనని చెప్పనొప్ప దనఁబోలును? బోరిది నిష్ఫలంబె యా. ౨౫ 1684

క. కావున నుడుగుం డనఁగా, భూవరసుతు లట్లుగ గురువు నయంబుగఁ ద
ద్భావిధి నని మానుండనఁ,గా విని తమ రాడుకొన్న గరువపుఁబలుకుల్. ౨౬

ఆ. దుష్టకార్యములును దోఁచుట నన్యోన్య, బద్ధవైరులగుచు బలముచూపి
విజయమందఁ గోరి విజ్జపిఁగుచునుంట, నప్పలుకులఁ గొనక యనికిఁ గడఁగ.

క. బలుఁడయ్యది విధికృతమని, తలపోయుచు ద్వారవతికిఁ దా నేగెను ని
స్తులసంపద లొప్పారఁగఁ, జెలఁగుచునున్నట్టి యుగ్రసేనాదులతోన్. ౨౯

సీ. ప్రమదంబునంగూడి పరిఢవిల్లుచునుండె, జ్ఞాతులెల్లను మోదసాగరమున
మునుఁగంగ; దరువాతఁ జనియెను మరల నైమిశమునకుఁ బ్రీతి మిగులనందుఁ
గలమౌను లాతనిఁగనిదూరితాఘౌఘుఁ గ్రతుమూర్తినతనిచేఁ గ్రతువిసరము
విధిగఁ జేయించిరి; విభుఁడొట నారాముఁ డాత్మవిజ్ఞానంబు నామునులకు

తే. నిచ్చె నేవిద్యచే విశ్వమెల్ల నాత్మ
యందనుస్యూతమై యున్నయట్లుగాఁగఁ
గాంతురో యెంతొ శుద్ధమై వింతనొప్పు
జ్ఞానమయ్యదియే సుమ్ము మానవేంద్ర! ౩౦ 1688

పతిఁగూడి జ్ఞాతిబంధు, ప్రతతియు మిత్రాళియుఁ దనుఁ బరివేష్టింపఁ

క్రతువుల తుది నవభృథమన, క్షితిఁ దగుస్నానంబు దానిఁ జేసెను విధిగన్.

క. మేమైనవస్త్రములచేఁ, గ్రాలుచు భూషణనికాయకమనీయుండై
చాల వెలింగెన్ సితకర,జాలంబున వెలయుచంద్రు కరణిన్ రాజా! ౩౨.

క. బలశాలి యనంతుఁడునగు, బలభద్రునికృత్యతతులు బలుభంగులుగా
నలరారు నిట్టివెన్నో, తలమే యవ్వానిఁ దెలుప ధాతకునైనన్. ౩౨½ 1691

తే. అప్రమేయుఁడు మాయామనరాంగుఁ డతఁడు
కనుక నద్భుతతత్కర్మగణము పొదలు;
నట్టి యద్భుతకర్ముని వగుచరితము
లెవఁడు మాపును రేపును సవిధిఁదలఁచు. ౩౩½ 1692

క. అతఁడేగు విష్ణుపదమున, కతఁడే శ్రీవిష్ణుమూర్తి యాదృతి పాత్రుం
డితరాలభ్యసుఖంబుల, నతఁడొందున్ మాటలేల యవనీనాథా! ౩౪ 1693



## ఎనుబదియవయధ్యాయము.

### కుచేలునిచరిత్రము.

చ. అని శుకయోగి తెల్పవిని యాయభిమన్యుసుతుండు ప్రశ్నమి
ట్లొనరిచె మౌనినాథ! మహిమోన్నత! యచ్యుతవీర్యుఁడై తనం
తనదగు నమ్ముకుందు చరితంబుల వీర్యమహత్త్వయుక్తిచే
తను బొలుపొందు వాని వినఁదద్దయుఁ గోరెద నెమ్మనంబునన్. ౧ 1694

చ. మునివర! బ్రహ్మతేజమునఁ బొల్చెడు యోగివతంస! కామవా
సన లను సాయకాహతి విషణ్ణత నొందుచు సారవేత్తయౌ
మనుజుఁ డెవండు పావనతమంబయి యొప్పు యశంబుగల్గు శ్రీ
వనరుహనేత్రు సత్కథల భక్తి నొకప్పుడు నాలకించినన్. ౧½ 1695

క. ఇఁకఁ జాలు నంచుమానును?, సకలేశుఁ డనంతుఁడునగు చక్రధరుగుణ
ప్రకరముఁ గీర్తించెడువా,క్కుకదా వాక్కనఁగఁ బడును క్షోణీస్థలిలోన్. ౨

చ. హరిపరిచర్యఁ జేయఁ దగుహస్తములే కదహస్తముల్, చరా
చరములయందు నుండుసురసత్తము నాపరమాత్తు భక్తి సం
స్మరణము చేయుమానసమె మానసమౌ, హరిపుణ్యసత్కథో
త్కరములఁ జక్కఁగావినెడు కర్ణములే కద కర్ణముల్ ప్రభూ! ౩ 1697

క. స్థిరజంగమంబు లెల్లన్, హరిలింగంబులె యటంచు నరసి తమి నమ
స్కరణము చేయుశిరంబే, శిరస్సనంగాఁ జెలంగు క్షితిసురమౌనీ! ౩½ 1698

మ. శతపత్త్రేక్షణుమూర్తులం గనునొ యేచక్షుస్సు లవ్వేకదా
క్షితిఁ జక్షుస్సులు, విష్ణుభక్తులమహాంఘ్రిద్వంద్వనీరంబు స

మ్మతి సేవించెడు నట్టి యంగములె యోగమౌనీశ! యంగమ్ము ల
ప్రతిమానాకృతియైన యాహరిచరిత్రంబుల్ తగన్ జెప్పుమా. ౪ 1699

మ. అని యీరీతి నరాత్మజాత్మజుఁడు తా నర్థింపఁగా వ్యాసనం
దనుఁడున్ శ్రీవసుదేవనందనుని హృత్పద్మంబునం జేర్చి యా
తనియం దాత్మ లయింపఁజేసి పలికెన్ ధాత్రీశ! యాలింపు మీ
శునిగాథన్ వచియింతుఁ బూర్వమొకఁ డా గోష్ఠీసురేశుం డిలన్. ౫ 1700

చ. వనరుహపత్త్రనేత్రునకు బాల్యసఖుండయి యుండె బ్రహ్మవి
ద్ఘనుఁ డతఁ డింద్రియార్థములఁ గాంచి విరక్తిని బొంది చిత్తశాం
తిని వహియించియుండె నతిధీరత నింద్రియరాజి గెల్చెఁ దా
ననుపముఁడై చెలంగె సకలార్థవిదుండన నొప్పె నెంతయున్. ౬ 1701

క. దైవోపపన్న మగునో, యేవస్తువు దానితోడనే గార్హస్థ్యం
బేవిధినో సాగించుచుఁ, దా వర్తించెను మునీంద్రతతి పొగడంగన్. ౬౹ 1702

*క. అతఁడు కుచేలుం డనఁగఁ బ్రథితనాముం డయ్యె నతని దేవియు నట్లే
క్షితిఁ బిల్వఁబడుచు నింద్రియతతి గెల్చి నితాంతకీర్తిఁ దగ వర్తిల్లెన్. ౭ 1703

చ. పతికిఁ గలట్టి సాధుగుణపద్ధతియుం దనయందు నొప్పఁ దా
నతివలయందు మిన్నయనునాఖ్యను దాల్చి ధనంబులేమి నే
వితమునఁ గుంద కెయ్యది లభించిన దాననె తృప్తిఁ గాంచుచుం
బతికిని దొర్తు నన్నమిడి భవ్యవిశిష్టపదార్థముం డమిన్. ౭ 1704

క. తా నాఁకటఁ గృశియించుచు, మానసమున భర్తృచింత మానక యుండెన్;
గాని యొకనాఁడు క్షుద్గతి, మానస మగలించి మోముమాడఁగఁ జేయన్. ౭౹

క. దీనత్వముతోఁపఁగఁ బతిఁ, గానంజని నిస్స్వత తనుఁ గాఱియ పెట్టం
గా నొకసుఖమును గూర్పం, గానాథున కేమిశక్తిఁ గననిక లంతన్. ౮ 1706

క. మన మెంతో యార్తిఁ గన భీతిని దేహము వడఁకుచుండఁ దిన్ననియె ల్గా
ప్ప నిలిచి యిట్లు వచించెన్, దనమదిఁ బతిభక్తియు స్థిరతం గాంచంగన్. ౮

సీ. బ్రాహ్మణోత్తమ! భగవంతుఁడా లక్ష్మీశుఁ డగుఁగాదె నెచ్చెలి యరయమీకు
నామహాత్ముఁడు విప్రులందు వాత్సల్యంబు గలవాఁడు శరణాగతులను గాచు
మేటియు గురుశక్తి మించుప్రోడయు మఱి సాత్వతర్షభుఁడునై క్ష్మాతలమున
వెంచేసియున్నాఁడు విశ్వమునం గలవార్తల నెఱుఁగు; సర్వవిధశక్తు
తే. లామహాత్మునకుం గల్లు నట్టులౌట
సాధువుల కాశ్రయంబగు చక్రధరుని

* “తస్యభార్యా కుచేలస్య క్షుత్క్షామాచ తథావిధా” అని మూలము. “తథావిధాకుచేలా” అని
ధరాచార్యులు.

గానఁ బోమ్ము కుటుంబియుఁ గడుదరిద్రుఁ
డని యెఱుంగును గరుణించు నట్టిమిమ్ము. ౧౦ 1708

క. ధన మొసఁగుఁ బుష్కలముగా; వనజాక్షుం డాతఁ డిపుడు ద్వారవతీప
త్తనమున భోజుల కంధక, జనపతులకు వృష్ణితతికి సత్ప్రభు వగుచున్. ౧౦౫

చ. అలరుచునున్నవాఁడు కద! యట్టిమహాప్రభుఁ గానఁబోమ్ము; భ
క్తుల నిజపాదపద్మములఁ గూర్మిఁ దలంచెడువారి నెమ్మదిం
దలఁచి యొసంగుఁ దన్నయినఁ దత్పరతం దనుఁ గానవచ్చున
ర్థులకు నతిప్రియంబులుగఁ దోఁచెడునట్టి యభీష్టజాలముల్. ౧౧౫ 1710

*క. సమకూర్పఁ డొకో? మఱి యర్థము కామము నీయఁడే పరాత్పరుఁడయి వి
శ్వము లేలుకృష్ణుఁ డచ్యుతుఁ, డమలాత్ముఁడు వాని నిచ్చు టబ్రమె నాథా!

చ. అనియిటు పెక్కుభంగులఁ బ్రియంబుగఁ గర్ణహితోక్తు లొప్పఁగాఁ
దను బతిమాలు ప్రేయసి యుదారతరాశయ మెన్ని చక్కనెం
చినఁ బరమం బటంచును వచింపఁగ నొప్పిన లాభ మిద్దియే
యనఁదగు నుత్తమోత్తమ మెయా యశ మెప్పడు వాసుదేవునిన్. ౧౨ 1712

చ. కనుఁగొను భాగ్యమబ్బు నిఁకఁ గల్గునె దీనిని మించుభాగ్య మెం
దు ననుచు లోఁదలంచి హరిఁ దోయజనేత్రుని జూడఁబోవఁగా
మనమున నిశ్చయించుకొని మంజులవాణిని సాధ్వి గాంచి యి
ట్లనియెను మంగళాంగిరో! గృహంబునఁ గల్గునె కాన్క యేమియేన్? ౧౨౫ 1713

క. పరమేశ్వరుఁ జూడఁగ నే, నరిగెద ని ష్మేమియున్న నది యొసఁగు సదా
చరణము నెఱుఁగవె యన నా, తరుణియు విప్రోత్తముల సదనముల కెలకున్

క. చని యాచించి యడెట్లో, కొని తెచ్చెను జిపిటములను గోరిక మెయి వా
నిని ముష్టిచతుష్టయమిత,మును నాథుని చైలఖండమున నేర్పొలయన్. ౧౩౫

ఆ. ముడిచి కాన్కగాఁగ మురహరునకు నీయఁ, బంపె; నంత విప్రవరుఁడు వానిఁ
బదిలముగ నె గొనుచు ద్వారవతీపురి, కరిగె మనమునందు హరిఁ దలఁచుచు.

చ. మురహరు నెవ్విధిం గనఁగఁ బోలునొకో! యనుచింత పైకొనన్
ద్వరఁ జని ద్వారకానగరతల్లజముం గని రక్షణార్థ మ
ప్పురమున నున్నగుల్మములు మూఁడును దాఁటుచు మూఁడుకక్ష్యలన్
వరుసఁగ దాఁటి యవ్వలను బ్రాహ్మణవర్యులు కూడ నుండఁగన్. ౧౪౫ 1717

మ. వనజాక్షుప్రతిమాన ధర్మములచే భాసిల్లు నయ్యంధవృ
ష్ణినృపాలాగ్ర్యుల సౌధరాజి నెవరేఁ జేరంగ రానట్టివా

* "కింత్వర్థకామాన్ భజతే నాత్యభీష్టాన్ జగద్గురుః" అని మూలము. నాత్యభీష్టాన్ "పరిపాకవిరసత్వాత్" అని శ్రీధరీయము.

నివి గృష్ణ బ్రియకాంతలుండుటకుగా । నిర్మించియున్నట్టి సౌ
ధనికాయంబును గాంచె రత్ననికర।స్థానంబుగా నొప్పఁగన్. ౧౬ 1718

సీ. పదునాఱువేలుగ । భవనంబులయ్యవి తనరారె; వానియం।తరమునందు
సకలసంపదలచేఁ । బ్రకటమై తగియున్న హరి నిశాంతవరంబు । నాద్విజుండు
కనుచు బ్రహ్మానంద।కలితుఁడై చొచ్చెను; గాంచనచేలుఁ డ।క్కాలమందుఁ
బ్రాణేశ్వరింగూడి । పర్యంకవరముపై వేంచేసియుండి య।వ్విప్రవరుని

తే. దవ్వులంగాంచి లేచి య।త్యంతమోద
మొప్ప నెదురేగి దీర్ఘబా।హువులు సాఁచి
బిగియఁ గౌఁగిటఁ జేర్చెను; । బ్రియసఖుండు
భూసురర్షి యునగు భ।క్తముఖ్యుఁ గాంచి. ౧౭ 1719

క. ఆతని యంగస్పర్శము, చేతం బ్రమదంబు చాల।సిద్ధింపఁగ న
బ్జాతేక్షణుఁ డశ్రుకణ, వ్రాతము నేత్రములనుండి । వరుసన్ జాఱెన్. ౧౯

క. అనుపమ ముజ్జ్వలనిధిలోఁ, మునిఁగెన్; దరువాత స్నిగ్ధ।ముఖ్యుని శ్రీదా
ముని దనపర్యంకముమీఁదను గూర్చుండఁగఁజేసి । తాఁ గానికలన్. ౧౯౪

తే. భ క్తి నర్పించి మునివరు।పాదములను
గడిగి యెంతయుఁ దమి మ స్తు।కమ్మునందుఁ
దజ్జలంబులఁ దాల్చె నెం।తయును లోక
పావనుఁడు తానె యదిసాధు।పథ మటంచు. ౨౦౪ 1722

క. కుంకుమ మగురువుఁ జక్కఁగఁ, సంకలితముగా నొనర్చి।చందనమును ల
క్ష్మ్యంకితవక్షస్థలుఁ డా, పంకేరుహనయనుఁ డలఁది । బహువినయమునన్. ౨౧

క. పరిమళధూపము లొసఁగుచు, ధరణీసురవరున కెలమి।దై వారఁగ సుం
దరదీపతతి నివాళిం,చి రమాపతి నియతిమీఱఁ । జేసెం బూజన్. ౨౧ 1724

క. ఉపచారములఁ బదాఱిటఁ, బ్రపంచనాథుండు మిత్రుఁ।బ్రముదితమతిఁ జే
సి పరమవస్తువితతిని స,లిపినట్టి విడెంబొసఁగి ల।లితమగు గోష్ఠిన్. ౨౨

క. సవిధి నివేదించుచు లోఁ,కవిభుఁడు స్వాగతముఁ జక్కఁ।గాఁ బ్రశ్నించెన్;
వివిధసపర్యలు పతి మాఁ,నివర్యునకుఁ జేయుచుంట।నెఱిఁ గనుఁగొనుచున్. ౨౨౪

క. తనువెల్ల ముఱికి గ్రమ్మం,గను జిక్కియు జీర్ణవస్త్ర।కలితంబయియున్
గనుపట్టు బీదనరములఁ, దనదౌర్భాగ్యంబుఁ దెలుపఁ।దగు విప్రేంద్రున్. ౨౨౪

క. పరికించి కుచేలాహ్వయుఁ, దరుణీమణి భీష్మభూప।తనయయుఁ దమిఁ జా
మరమును జైకొని తానే, పరిచర్య యొనర్చుచుండె।బతి యలరంగన్. ౨౩

చ. అమలయశుండు శ్రీహరియు । నాయవధూత నతిప్రియంబునన్
విమలవిధాన మొప్పునటు । వేడుకఁ బూజలఁ దన్పుచుండఁ గాం

చి మదుల విస్మయం బొలయఁ జేరి యటంగలవార లెల్లరుం
బ్రమదము గ్రమ్మ నివ్విధిని । బల్కిరి చిత్ర మిదొకొ దలంపఁగన్. ౨౮ 1729

ఉ. ఎంతటిపుణ్యకర్మముల । నీధరణీసురుఁ డె ట్లొనర్చెనో
వింతగఁ దోఁచెడున్ గనఁగ । వీఁ డవధూతయు బిచ్చగాఁడునౌ
నుంతయు భాగ్యముం గనక । చూడ జుగుప్సితమైనవేష మి
ట్లెంతయు నొప్పఁగా నధముఁ డే యనఁగాఁ దగియున్న నీతనిన్. ౨౯ 1730

క. లోకత్రితయమునకు గురుఁ,డై కమల నివాసినికి సదాధారుఁడునౌ
నీకృష్ణుఁడు శయ్యందగు, శ్రీకాంతనుగూడ వదలి । చిత్తం బలరన్. ౩౦ 1731

క. తనయగ్రజన్మునిన్ బలెఁ, దనివిచనన్ గౌఁగిలించి । తత్పరమతియై
కనుపట్టుచున్నవాఁ డిది, ఘనపుణ్యులకే లభింపఁగాఁ దగు నదియో! ౩౧ 1732

చ. అనియిటు పెక్కుచందముల । నాడుచు వారలు చూచుచుండ; నా
వనజదళాయతేక్షణుఁడు । బ్రాహ్మణవర్యుఁడుఁ దారు మున్ను వి
ద్యను గ్రహియింపఁగా గురుగృహాంబున వాసము చేయువేళఁ జే
సిన లలితంపుఁగార్యములఁ । జెప్పుకొనంగఁ దొడంగి రివ్విధిన్. ౩౨ 1733

క. ఒక్కనికర మింకొక్కరు, చక్కంగాఁ బట్టుకొనుచు । స్వాంతములు దమిం
జిక్కఁగఁ జెప్పుకొనన్ హరి, యిక్కరణిం బల్కె నోద్విజేంద్రా! యచటన్. ౩౩

చ. గురునకు నర్హదక్షిణను । గోర్కినొసంగి సమస్తధర్మవి
ద్వరుఁడవుగాన నీవు గురువర్యునియానతి నొంది కాశికా
పురమున కేగి విశ్వపతి । భూరికృపానిధిఁ గాంచి జాహ్నవీ
వరతటినీనిమజ్జన నివారితపూర్వభవాఘరాశివై ౩౪ 1735

క. చను దెంచి సమావర్తన, మనుకర్మము నాచరించి । యర్హగుణాఢ్యన్
వనితన్ వివాహవిధిఁ జే,కొనినాఁడవె తుల్యయగునె । గుణముల నీకున్. ౩౫

చ. అనియిటు లప్రమేయుఁడు గృహస్థుల కుండెడునట్టిచిహ్నముల్
*గని సుఖమొందు చిహ్నమునుగానక లోకులపోల్కి సంశయం
బునుగని ప్రశ్న చేసి తగుపోలిక నింకను బ్రశ్న చేసె ని
ట్లని; ధరణీసురేంద్ర! నిగమాగమవిద్వర! మిత్రరత్నమా! ౩౬ 1737

సీ. ప్రాయికంబుగ భవత్పరమచిత్తము గృహధర్మంబులందును । దగిలియున్నఁ
గామార్తికిం జిక్కకయె యుండు; విద్వాంసుఁడవు గాన ధనమందుఁ దవులు ప్రీతి
నీకు లేదనుచును । నే నెఱుంగుదుఁజుమీ; జనులు కొందఱు కామసమితిచేత
స్వాంతముల్ పీడింపఁ । బడకయుండఁగ నీశ్వరునిమహామాయ చేతను రచింపఁ

తే. బడువిషయవాసనలకు లోఁబడక వాని, సంత్యజించియు సత్కర్మజాలములను

* వ్యాఖ్యానాభిప్రాయమున కీపద్యమని యెఱుంగవలయు.

లోకసంగ్రహమునకుగా § నేకరణి నొనరుతునో నేను వారు నొనర్తురట్లు.

చ. ధరణిసురోత్తమా! మనము § తద్గురుసన్నిధి నుంటిమేకదా!
నిరుపమమైన యాయునికి § నీవు స్మరింతువె? యానివాసవి
స్ఫురణమునుండియేకద ద్విజుం డెఱుఁగం దగినట్టిదైన యీ
శ్వరపరమార్థముం దెలిసి § సంసృతిపారమునం దెడుం జుమీ! 3౦ 1739

1సీ. సంసారమున నిందు § జననమెం దగునో యాతఁడె పితయగును బ్రథమగురు వన
నతఁడొప్పు; ద్విజుఁడగు § నట్టిపూరుషునకు నుపనయనాదిక § మొప్పఁజేసి
వేదము నేర్పిన § విమలచిత్తుం డుపాధ్యాయుఁడగును ద్వితీయగురు; వాది
గురువునకంటె నెక్కరణి నారయఁ బూజ్యుఁ డతఁడగు నఖిలాశ్రమాధిగతుల

తే. కమలవిజ్ఞానదుండగు § నతఁ డెవండొ
యతఁడు నావలెనే గురువగును జుమ్ము
గురు వతఁడు పూజ్యతముఁడు పేర్కొనినయట్టి
పూర్వగురువులకంటెను § భూసురేంద్ర. 3౨ 1740

క. కుల మాశ్రమములు గలవారలలో నెవ్వారు గురువరఖ్యాతుఁడనై
చెలఁగెడు నాయుపదేశంబులఁ గొని నన్నాశ్రయించి § పూనికమీఱన్. 3౨

క. భూరిభవార్ణవమును వే,సారక సుఖముగఁ దరింపఁజాలుదురో య
వ్వారలె సుబుద్ధిమంతులు, ధారణి నిర్జరవరేణ్యా! తథ్యము సుమ్మీ! 33 1742

2చ. క్రతువుల మంచివంశమున § గాఢశమంబున సత్తపస్సునన్
మతిఁ బరితుష్టినొంద ననుమానము లేదిట సర్వభూతసం
తతులకు నాత్మనే నగుటఁ § దత్త్వముఁ దెల్పుగురూత్తమున్ సతం
బతులితభక్తి సేవలఁ బ్రహర్షునిఁజేసినఁ దుష్టినొందుదున్. 3౪ 1743

చ. అవనిసురోత్తమా! గురువునంతికమం దొగి నీవు నేను స్ని
గ్ధవరులఁగూడి యుండ గురుదారయు నొక్కదినంబునందు దా
రువులను గొంచు రామనఁ § గ్రూరతఁబంపిన యాయుదంతమొ
క్కవరుస సంస్మరింతువె? యకాలముగా నపుడుండెగా కడున్. 3౫ 1744

ఉ. ఏనునునీవునున్ గలిసి § యెవ్విధినేఁ జొరరానియట్లుగాఁ
గానఁగ వచ్చుచున్న యొకకాననమున్ గురుపత్ని యానతిం
బూనికమీఱఁ జొచ్చితిమి § భూతభయంకరవాతసంగతిన్
వానయు వచ్చె వారిదనినాదము లొప్పెను నిస్స్వనంబుగ. 3౬ 1745

1 "నవై సత్కర్మణాం సాక్షాద్ద్విజాతే రిహ సంభవః, ఆద్యోంగ! యత్రాశ్రమిణాం యథాహం జ్ఞానదో గురుః." 3౨. అని మూలము. దీనివ్యాఖ్యానము ననుసరించి యిది తెనిఁగింపఁబడినది.

2 "నాహ మిజ్యా ప్రజాతిభ్యాం తపసోప శమేనచ, తుష్యేయం సర్వభూతాత్మా గురుశుశ్రూషయా యథా" 3౪ అని మూలము.

చ. ఖరకరుఁ డస్తభూమిధరకాంతుని చెంతకుఁబోయి యేటికో
యరిగె నదేస్థలంబునకొ యంధతమస్సులు పర్విదిక్కులన్
ద్వారపడి ముంచివైచె నట ధారణిభాగము నీటమున్గుటం
దర మెటుగాకయుండె నిదితగ్గిది యెత్తిది యంచెఱుంగఁగన్. ౩౭ 1746

మ. జలపూరంబున వాతచక్రనిహతిన్ జాలంగ నంగవ్రజం
బులు పీడంగనుచుండ నిర్వ్యరము దిక్ప్రాగంబు గుర్తింపలే
కలరిన్ బాసి గృహీతహస్తులముగాఁ గన్పట్టుచున్ దారువుల్
గలయంజేరిచి మోపుకట్టుకొని సంక్రాంతత్వరార్తిన్ వనిన్. ౩౮ 1747

ఆ. దాని మోచికొనుచు వానకుఁ దడియుచు, దిరిగినారము గద; తెలిసి మనము
వనికి నేగియుంట మనగురువైన సాం,దీపనియు మనంబు తాపమొంద ౩౯

సీ. భాస్కరుం డుదయాద్రిపైకి రాఁగా శిష్యుల మయితగిన మనలను గనంగ
నాచార్యుఁడౌట దిగంతరములనెల్ల నరయుచు వచ్చి యత్యాతురులము
గానుండుటం జూడఁగా లేదె; యక్కటా! మత్సుతులార! యాత్మయను నద్ది
ప్రాణులకెల్ల నారయఁ గడుఁ బ్రియమగు దానినే బాటింపఁదలఁప కిట్లు

తే. మీరు నాయందె తాత్పర్యసార మునిచి, శ్రమపడితి రిట్టు లీమదర్థంబుఁ గోరి;
సాధుభావము వెలయంగ సర్వవిధుల, గురువునకు నాత్మనర్పింపఁ గోరుటెతగు.

క. అదియొక్కఁడె సచ్ఛిష్యులు, ముదమున నాచార్యునకును బూని యొనరుపం
గఁ దగిన ప్రత్యుపకారము;, మది మీవలనం బ్రమోదమగ్నం బయ్యెన్. ౪౧

తే. ఓద్విజశ్రేష్ఠులార! యీయుర్వి మీమనోరథములెల్ల సత్యంబుగా రయమునఁ
జక్క ఫలియించుఁగాక!; నాసన్నిధాన,మందు నేర్చినశ్రుతు లెల్ల నిందునందు.

క. తమశక్తి పీడకయె సా,ర్థములై తనరారుఁగాక ధన్యులరై మీ
రమలయశంబులఁ గ్రాలుం,డు మదీయాశీస్సులను గడుం బెంపొదవన్. ౪౨

చ. అని వచియించెఁగాదె గురు వాదృతిమీఱఁగ నిట్టి వెన్నియో
మనము మహాత్ముఁడైన గురుమందిరమందు వసించియుండఁగా
నొనరిచినట్టి వాక్షితిసురోత్తమ! యొక్కపుడేఁ దలంతువా?
ఘనకృప దేశికోత్తముఁడు కాంచిననే నరుఁ డొప్పుఁ బూర్ణుఁడై. ౪౩ 1753

మ. మురదైత్యాంతకుఁ డిట్లు పల్క విని యాభూమీసురుం డిట్లనున్
సురపూజ్యా! త్రిజగద్గురూ! గురుగృహాక్షోణిన్ నివాసంబు నిం
బరమున్ సత్యమనోరథుం గలిసి యొప్పం జేసియున్నట్టి మా
కరయన్ లభ్యముగాని దుండునొకొ సర్వాభీష్టముల్ చేకురెన్. ౪౪ 1754

తే. వేదమయమయి పురుషార్థవితతి కాల,వాలమయి యొప్పుదేహ మెవ్వానికమరు
నట్టి నీవెన్న గురుకులమందు నుంట, తత్త్వ మద్ది విడంబనార్థంబె సుమ్ము. ౪౫

## ఎ ను బ ది యొ క ఁ డ వ య ధ్యా య ము.

### శ్రీకృష్ణుఁడు కుచేలుని యడుకులు భక్షించుట.

చ. అని శుకయోగివర్యుఁ డిటు లర్జునపౌత్త్రునకుం గుచేలవ
ర్తనమును దెల్పి శిష్టచరితంబును జెప్పఁగఁబూని పల్కె; నా
వనజదళాక్షుఁ డిప్పగిది బ్రాహ్మణవర్యునితోడఁ బూర్వగా
థను వచియించుచున్ స్మితము తాండవ మాడఁగ నొప్పుమోముతోన్. ౧

తే. సకలభూత మనోభిజ్ఞుఁ డకలుషాత్మ
రక్షకుండునగుం గాన బ్రాహ్మణేంద్రుఁ
గాంచి యిట్లను; ప్రేమ ముత్కటముగాఁగ
వీక్షణంబులఁ గారుణ్యమేచి పర్వ. ౧½ 1757

[1]చ. ధరణిసురేంద్ర! నాకొఱకుఁ దావకగేహమునుండి తెచ్చితే
పరమకృపాతిరేకత నుపాయన మేదయినన్ వచింపు భ
క్తిరతిని గాంచుమానవులు కేవల మాయణువంతయైన ని
ర్భరమగుప్రేమయుక్తి నది భవ్యము భూరితరంబె నాకగున్. ౨½ 1758

క. కానుకయది భూరితరం, బైనను సద్భక్తిలేని యవ్వారిదయే
మానసతృప్తిం జేయం,గా నదిచాలదని యెన్నఁగాఁ దగుఁజుమ్మీ!. 3 1759

క. ఆకయినఁ బుష్పమైనం, గాక ఫలంబైన వారికణమేయైనన్
నా కద్ది ప్రియోపాయన, మై కన్పడు శుద్ధచిత్తుఁడై భక్తి నిడన్. ౪ 1760

క. దానినె యుపయోగింతును, మానసమునఁ దృప్తిఁగనుచు మన్నించుచు నం
చానలినాక్షుం డడుగన్, భూనిర్జరవర్యుఁ డాత్మఁ బూనిన లజ్జన్. ౪½ 1761

[2]క. తలవాంచి శ్రీశునకు నడు,కులఁ జేరెడుమాత్ర మీయఁ గోరండయ్యెన్;
జలజాక్షుఁ డెల్లభూతం,బుల యంతఃకరణసాక్షిభూతుం డగుటన్. ౫½ 1762

చ. అతఁ డరుదెంచినందులకు నొతగుకారణ మాత్మ నెన్ని వే
గ తెలిసికొంచు నివ్విధముగాఁ దలపోయఁగఁ జొచ్చె నీద్విజుం
డు తొలిభవంబునన్ సిరి గడున్ మదిఁగోరి భజింపఁడయ్యెఁగా
పతి నెద దైవమేయనుచు భావనచేసెడుపత్నిఁ బంపఁగన్. ౬ 1763

మ. చనుదెంచెం బ్రియ మామెకుం బొనరుపన్ స్వాంతంబునం గోరినన్
గనఁగానైన నమర్త్యదుర్లభములై కన్పట్టు సత్సంపదల్

---

1 "అణ్వ ప్యుపాకృతం భక్తైః ప్రేమ్ణా భూర్యేవమేభవేత్" అని మూలము. 2 "పృథుకప్రసృతిం రాజన్నప్రాయచ్ఛ దవాఙ్ముఖః" అని మూలము. 'అర్ధాంజలౌతుప్రసృతిః' అని యాదవః,

తనివోందంగ నొసంగి యీద్విజవరుఁ డ్ధన్యాత్ముఁ గావింతు నం
చని యీరీతిఁ దలంచి కృష్ణుఁడు గతాహంకారు సద్భక్తునిన్. ౭ 1764

క. పరికించి జీర్ణవస్త్రాంతరమున నొకచోటఁ బృథుకతండులముల నే
వరుసనొ కట్టినమూటను, గరసరసీరుహమునఁ గొని కడు ముద మొదవన్.

క. ఇదియేమి యనుచుఁ దానే, పదిలముగా సంగ్రహించెఁ బంకజనయనుం
డిది నాకుఁ గానుకఁ దెచ్చిన, యదిగాదే మిత్రమ! యని యడుగుచు మఱియున్.

క. స్వాంతంబున కిది యెంతయు, సంతసముం గూర్పఁజాలె; జగదంగుఁడనై
యెంతయుఁ గ్రాలెడు నా కివి, సంతృప్తిం జేయుఁజుమ్ము త్ష్మాదివిజేంద్రా!. ౯

చ. అని వచియించుచుం ముడియయందును గల్గినవానిలోన ము
ష్టి నిముడునంతమాత్రమును జేకొని వేగ భుజించి యింకనుం
దినఁ దమి ముష్టిఁ గైకొనఁగఁ దీవర మొప్పఁగ నిందిరాంబ భై
ష్మి నియతి సర్వలోకపతిచేయిఁ గరద్వయి సంగ్రహించుచున్. ౧౦ 1768

సీ. (ఇహపరములయందు నింతమాత్రముననే మత్కటాక్షవిలాసమండితమ్ము
లగు సర్వసంపద లొగిఁ జాలు ననుభవింపఁగ నింక నీముష్టిని గొని తినిన
నన్ను నీతని యధీనగఁ జేయఁ దగియుండు ననునాశయముతోఁ బ్రసననియె నిట్లు)
విశ్వరూపా! మునివిభున కీపిడికెడు నడుకులు గొన్నంత నందునిందు

*తే. నొక్కరూపున నీస్వాంత ముఱుముదంబు
గాంచునట్లుగ సంపదల్ మించ ననుభ
వింపఁ జాలును మఱియు భుజింపనేల
యనుచు వారించె శ్రీకృష్ణుఁ డలరె మిగుల. ౧౧ 1769

చ. తిలిసురుఁ డానిశం గడపె శ్రీహరిమందిరమందె యుండి శ్రీ
పతిసహపంక్తిగాఁ గుడిచి భవ్యరసాయనముల్ సుఖంబుగా
జతనముమీఱఁ ద్రావి సురసత్తముపత్తనమందు నున్నయ
ట్లి తలఁచుచుం బ్రియంబుఁ దగ నెంతయు దం మరియాదఁ దన్పఁగన్. ౧౨

చ. తెలతెలవాఱఁగా నహిమదీధితి ప్రాగ్గిరిఁదోఁప విప్రుఁడుం
జలరుహనేత్రుఁ డాదృతిని సర్వజగద్గురుభావనుండు గాఁ
జెలఁగుట నించుకే విమతిఁజెందక దుర్లభసంపదల్ సురా
వళికి నొసంగరానియవి వారక యిచ్చియు సంస్తుతించుచున్. ౧౩ 1771

చ. తనవెనుకం బ్రియంబలరఁ దాఁ జనుదెంచి నమస్కరించి యిం
క నిలుతు నంచుఁ బంపఁగ స్వకంబగు గేహముఁ జేరఁబోయె; శ్రీ

---

* "తావద్భి ర్జగృహేహస్తం తత్పరా పరమేష్ఠినః" అనిమూలము. దీనివ్యాఖ్యానభావమే
యీపద్యమునఁగలదు.

శునివలనన్ ధనం బెడియుఁ ౹ జొప్పడకున్నను దీనుభంగి యా
చనఁ దనయంత సిగ్గుపడి ౹ స్వాంతము దూలఁగఁ గోరఁ డింతయున్. ౧౩౪

ఉ. ఐన మహాత్ముఁడై వెలయు౹నాథగవంతుని గాంచఁగల్గితిన్
శ్రీనిధిదర్శనంబె ఫల౹సిద్ధుల నిచ్చెడు నన్నభావమే
మానసశర్మదం బగుట ౹ త్మాసురుఁ డింటికిఁబోయెఁ దృప్తుఁడై
తా నిటులెంచె నెమ్మదిని ౹ ధన్యుఁడ వేయితెఱంగులం గనన్. ౧౮ 1773

సీ. బ్రహ్మణ్యదేవుఁడౌ ౹ పద్మాక్షునకుఁ గల బ్రహ్మణ్యతయుఁ గనఁ౹బడియె నౌర!
యదియెట్టులన, సిరి ౹ నలవరించిన యెదగలకృష్ణుఁడు నను మిగుల దరిద్రు,
బిగియారఁ గౌఁగిట ౹ వెలయించెఁ గద బళి; నిస్స్వతముండను ౹ నీచుఁడ నగు
నే నన నెక్కడ? ౹ నిందిరారమణుఁడౌ శ్రీకృష్ణుఁ డెక్కడ? ౹ తిఱిసురాన్వ

తే. యమున జన్మించితి నని న౹న్నాదరమున
జిక్కఁగౌఁగిటఁ జేర్చెఁగా ౹ చెప్పవలెనె
హరిసమాదృతి యింతని; ౹ యంగనామ
తల్లి శ్రీదేవి యుండెడు౹తల్పమందు. ౧౬ 1774

చ. ననుఁ దనసోదరుంబలె న౹నంతముదంబునఁ గూరుచుండఁ జే
సెనుగద ౹ మార్గఖేదమునఁ ౹ జిక్కితి నంచెద నెంచి శ్రీనితం
బిని మృదుహస్తపద్మమున ౹ వేడుకఁ జామరమూని వీచె; నా
వనరుహనేత్రుఁ డెల్లసుర౹వల్లభవంద్యుఁడు భూసురేశుఁడున్. ౧౭ 1775

ఉ. దైవముభంగి నన్ దలఁచి ౹ తత్పరతన్ దనకేలుదోయిచేఁ
భావనశాస్త్రపద్ధతిని ౹ బాదములన్ బిసుకం దొడంగె ని
ట్లే వివిధోపచారముల ౹ నెంతయుఁ దన్నెను; స్వర్గమోక్షుల
త్మీవసుధా రసాతల వి౹జృంభిత సంపద లెల్ల సిద్ధులున్. ౧౮ 1776

క. ఒనఁగూర్పఁగ మూలం బౌ, వనజాక్షుని పాదపద్మ౹భజనం బొకఁడే
మనమున నెంచినఁ జాలును; గనరాదు మఱొక్కత్రోవ ౹ కడు ఫలదంబున్.

చ. హరి కరుణామహాంబునిధి౹యాట దరిద్రుఁడు గాన నీమహీ
సురుఁడు ధనంబునే పడయు౹చో మదయుక్తిఁ జెలంగి నన్ను సం
స్మరణము చేయ మానునని ౹ స్వాంతమునందుఁ దలంచి విత్తముం
బరిమితిమించున ట్లిడఁడు ౹ భద్రమె యౌ నిది యంచు నెంచుచున్. ౨౦ 1778

చ. మనమున సంతసంబు బహు౹మానముఁ బెన్గొనుచుండ నింటిదా
పున కరిగెన్; గుచేలుఁ డట౹మున్ను గనంబడినట్లు పర్ణశా
లను గనఁడయ్యె; నందుఁ గమ౹ల, ప్రియచంద్ర, హుతాశనులవలెన్
గనదురుకాంతిఁ దేజరిలు ౹ కమ్రవిమానము లావరింపఁగన్. ౨౧ 1779

*క. కలకల మనియెడు రుతములు, పులుఁగులు చేయంగఁ జప్పుడు పొదలఁగఁ జిత్రం
బులుగాఁ దోఁచెడు నుపవనముల నుద్యానముల నెంతో పొలుచుచునుండెన్.

సీ. ఆవనంబులయందు నతిమనోహరముగ వికసించియున్నట్టి బిసకుసుమము
లుత్పల కుముదంబు లొప్పుకహ్లారము లివ్వి లోనుగఁగల్గు నెల్లజలకు
సుమములు నిండార శోభిల్లు సరసుల నిర్మలోదకములు నెఱిఁ జెలంగ
నాశ్రమం బయ్యది హరితరంబుగఁ జూపట్టుచుండెను; సోయగమున

తే. నలరు పురుషులు భీతమృగాక్షులైన
నాతిమిన్నలు సద్భూషణముల నొప్పి
యందుఁ జెలఁగుచునుండి రీయద్భుతముల
నెల్లఁ గాంచి కుచేలుం డిదేమియొక్కొ. ౨౨ 1781

ఉ. ఎవ్వనియాశ్రమస్థలమొ? యెట్టివిధంబున నానివాసమా
నవ్వన మిట్లుమాఱెనదొ? యంచు ననేకవిధంబులన్ మనం
బెవ్విధిఁ దత్త్వముం గనక యెన్నియొ సందియముల్ పొసంగ న
ట్లవ్వనభాగ్యముం గనుచు నారయుచుండఁగ నంతలోపలన్. ౨౩ 1782

ఉ. దేవత లట్లుగా మిగులఁ దేజమునం దగియున్న పూరుషుల్
భావజురాణినిం దెగడుభామిను లల్లన గీతవాద్యసం
రావము లట్టె పర్వఁగను రమ్యగతుల్ దగఁ బోయి యవ్వి చి
త్రావసథోత్తమంబునకు నల్లనఁ దోడ్కొనిపోయి రమ్మునిన్. ౨౪ 1783

ఉ. ఆమునిసత్కళత్రము మహామతి యాత్మవిభుండు వచ్చెనం
చామహిళామణుల్ దెలుప హర్షముపొంగఁగ సంభ్రమంబుతోఁ
దామరసాలయంబు విడి తాఁ జనుదెంచు రమాంబయో యనం
గా మహనీయమందిరముఁ గ్రన్నన వెల్వడివచ్చె భక్తితోన్. ౨౫ 1784

చ. పతిఁగని యాసతీమణి యభంగురమౌ ప్రణయంబుపొంగ దృ
గ్ద్వితయమునుండి మోదజలబిందువు లెంతయుఁ జిప్పిలంగ నా
దృతిఁ గనులట్టె మోడ్చి యితఁడే గద వంద్యుఁ డటన్న నిశ్చయం
బుతగ నమస్కరించి మతిఁ బొందుగఁ గౌఁగిటఁ జేర్చికొం చొగిన్. ౨౬ 1785

క. ఆనందింపుచు నుండెను; భూనిర్జరమౌళి హేమభూషణరాజిం
జానగు కంఠము లొప్పెడు, చానలు నలుదెసలనిల్చి సంసేవింపన్. ౨౭ 1786

మ. సురనారీమణి వోలె నెంతయును సంశోభిల్లు నాత్మేశ్వరిం
బరమామోదము నొందియుండుటను దాఁ బల్మాఱు వీక్షించి య
చ్చెరువుం గాంచెను; వాసుదేవసఖుఁ డాచిత్రంబు లో నెంచి ని

* "విచిత్రోప వనోద్యానైః కూలద్విజకులాకులైః" అని మూలము.

ర్భరమా ప్రీతిని బూని యాసతియుఁ బొర్కన్వంబందుఁ గన్పట్టఁగన్. ౨౭ 1787

సీ. మణిమయ స్తంభాళీమండితంబయి దేవపతిసౌధమట్లుగ భాసిలు నిజ
మందిరంబును జేరె; నందున్న శయ్యలు చిక్కనిపాలపైఁ జెలఁగునురుగు
చందంబుగా సితచ్ఛాయలఁ దగియుండె; హస్తిదంతంబులనమరుపఁబడి
బంగరుపూఁతల బరఁగుచున్నట్టివౌ పరికరములతోడ నిరుపమాన

తే. ములగు పర్యంకములు నందు వెలయుచుండెఁ;
జారుచామరగణము వ్యజనములు నట
హేమదండాన్వితములయి యొసఁగుచుండె
నాసనంబులు హేమ మయంబులగుచు. ౨౮ 1788

ఉ. తూలమమున్న గాఁ గల మృదు ప్రియవస్తువులన్ రచింపఁగాఁ
గ్రాలుచుఁ గోమలంబులయి కన్పడుశయ్యల నొప్పుచుండె; ము
త్యాలుగలట్టి దండలు నితాంతము వ్రేలఁగ మేలుకట్లు భా
జాలము పర్వ నుండెఁ; గనఁ జాల విచిత్రము గల్గునట్లుగన్. ౩౦ 1789

క. గురుమరకతయుత నిర్మల, తరభూరిస్ఫటిక కుడ్యతతియందు మనో
హరమణిదీపము లొప్పఁగ, సురనారీమణిసమాన సుందరు లలరన్. ౩౧ 1790

చ. కనఁబడుచున్న సౌధమును గ్రాలఁగఁ గాంచుచు హేతువేదియుం
గనఁబడ కిట్లు సంపదలు కల్గుట యెట్లని యద్భుతంబు నె
మ్మనమునఁ దోఁప నంతయును మ్రాన్పడకే యిటులెంచెఁ జక్కఁగా
ననుపమసంపదోఘ మిటు లబ్బుట యెట్లొ? తనంత నొక్కటన్. ౩౨ 1791

ఉ. ఇంతని చెప్పఁగా నను మహాదేవ్విధిఁగాని దరిద్రదోష మ
త్యంతముఁ గ్రమ్మ నేజననమందును భాగ్యము లేకయున్న నా
కింతటి సంపదున్నతి యిదేర్పడఁ జూడ మహావిభూతి శ్రీ
కాంతుని నాయదూద్వహుని గాంచుటయొక్కఁడె హేతువై తగున్. ౩౩ 1792

ఉ. శ్రీపతిదర్శనంబె యిది చేకురఁ గారణ మంచుఁ జెప్పఁగా
నోపును గాని వేఱొకటి యుండదు నిక్కము; పద్మలోచనుం
డాపరిపూర్ణభోగుఁడు దయానిధి కృష్ణుఁడు సర్వయాదవ
క్ష్మాపతి నాసఖుండు సురసత్తమపూజితపాదపద్ముఁడౌ. ౩౪ 1793

చ. కనుక మహేంద్ర భోగము నికామము తుచ్ఛముగాఁ దలంచుఁ జొ
మ్మనితర సాధ్యభోగముల నందుచునుండుట నట్లుగానఁ ద
న్ననుపమభక్తిఁ గొల్చు సుజనాళికి నంతయుఁ దెల్పనుండ ని
చ్చును సిరులన్ మహాల్పములఁ జూచును వానిని స్వీయదృష్టిచేన్. ౩౫ 1794

ఉ. ఇంతటి యల్పభాగముల నిచ్చుట యెట్లని లజ్జనొంది యా

వంతయుఁ దెల్పకుండఁగ దǂయామతిఁ గర్షకులెల్ల నిద్ర న
త్యంతము నొందియుండుతఱి ǂ నాయతవృష్టిని వారి క్షేత్రముల్
వింతగఁ జల్లఁ జేయుజలǂభృత్తువలెన్ జలజాయతాక్షుఁడున్. ౩౪ 1795

చ. ఎదుట రవంతయేఁ దెలుపǂకే సిరు లిచ్చుచుఁ బ్రోచు భక్తులన్;
యదుకులనాయకుండు తనǂయాశ్రితులిచ్చెడు గాన్కసుంతయై
నఁ దలఁచు గొప్పఁగాఁగఁ గరుǂణం దనయిచ్చున దెంతగొప్పదై
నఁ దలఁచుఁ గొద్దిదేయనుచు ǂ నైజమెకా యిది సర్వసాక్షికిన్. ౩౪౹ 1796

సీ. కానుకగాఁ బృథుǂకంబులు పిడికెడు గైకొని నేఁబోవఁǂగా మహాత్ముఁ
డాదేవకీపుత్త్రుఁ ǂ డతిశయప్రీతిమైఁ జక్క గ్రహించెఁగా ǂ సాధుభూష
ణములు వచించుచు; ǂ నాకిఁకఁ బ్రతిజన్మమున నమ్మహానుభాǂవుని పదాంబు
జములందుఁ బ్రీతియుǂసౌహార్దమును హితాశంసనంబును మైత్రిǂసతతదాస్య
తే. మమ్మహాత్ముని భక్తులǂదైన సంగ,తియును గల్గును గాక యǂధికతరమగు
ధన మదేటికి? సదృఢభǂక్తునకు నాకుఁ, సంపదలఁ జిత్రరూపతఁǂజాలువాని. ౩౫

క. అనుపమ రాజ్యవిభూతుల, వనరుహనేత్రుండొసంగఁ ǂ వాంఛింపం డే
లన ధనవంతులకుం గల, ధనమదమును గాంచి దానిఁ ǂ దప్పించుటకై. ౩౫

క నే నవివేకుఁడ నౌటను, మానసమున నెంచి కడుఁ జǂమత్కృతియలరం
గా నిట్టి సంపదలనే, తా నిచ్చెను గాన నేనె ǂ ధన్యుఁడ నరయన్. ౩౫౹ 1799

క. కావునఁ దద్భక్తియె నా, భావంబున దృఢముగాఁగఁ ǂ బాదుకొనెడుఁ గా
కేవిధమునఁ జలియింపక, శ్రీవిభుని కృపావిశేషǂసిద్ధి నటంచున్. ౩౬ 1800

మ. అని చింతించుచు బుద్ధిశక్తిదగు నǂట్లారీతి సిద్ధాంత మొ
ప్ప నితాంతంబు జనార్దనాహ్వయ పరǂబ్రహ్మాంఘ్రిపద్మద్వయం
బునఁ జెల్వారెడు భక్తిమై విషయముల్ ǂ పోనాడు నేర్పొప్ప మె
ల్లనఁ ద్యాగం బొగిఁ జేయుచున్ గడపెఁ గాǂలం బంగనాయుక్తుఁడై. ౩౭ 1801

*తే. త్యాగపద్ధతి నేర్చి సుǂఖాళి ననుభ
వించుచుండెను; రాజేంద్ర! ǂ విబుధపతియు
యజ్ఞనాథుఁడు నగు హరి ǂ కరయఁ బుట్టు
కయును దైవంబు బ్రాహ్మణǂగణమెసుమ్ము. ౩౭౹ 1802

క. ఆవిప్రవరులకంటెన్, భావింపఁగ దైవ మొండుǂపద్మాక్షున కె
ట్లేవేళఁ గలుగకుండును;, శ్రీవిభుఁ డన్యులకుఁ దా నǂజితుఁడే యయ్యున్. ౩౮

క. తనసేవకులగు భక్తుల, కనయమ్ము పరాజితుండె ǂ యయిలోఁబడు; న
వ్వనజాక్షుని సన్మిత్త్రం, బనఘుఁడునగు నాకుచేలుఁ ǂ డట్లాపురినిన్. ౩౮౹ 1804

* "బ్రాహ్మణాః ప్రభవో దైవం న తేభ్యో విద్యతే పరమ్" అని మూలము.

క. పరమేశ్వరు దర్శించియు, హరిరూపము సంతతంబు ౯ ధ్యానించియు స
త్వరముగ సంసృతిబంధన, విరతిం గని నిరుపముఁడగు ౯ విష్ణునియందే. ౭౦ 1805
తే. అభిరతుండయి సద్గతిగ్రాయిన యతని, ధామ మొందెను; బ్రహ్మణ్య౯దైవమైన
వాసుదేవుని బ్రాహ్మణవత్సలత్వ, మమలగతిఁ దెల్పు నీయుపాఖ్యానవరము.
క. విను నతఁడు భక్తియలవడఁ, దనకర్మము ననుసరించి ౯ తగుబంధనరా
జిని జిక్కక ముక్తుండగు, నని శుకముని తెలిపి మఱియు ౯ నాదృతిఁబలికెన్.



ఎనుబదిరెండవయధ్యాయము.

శ్రీకృష్ణాదులు కురుక్షేత్రమునకు సూర్యగ్రహణనిమిత్త మరుగుట.

ఉ. ద్వారకయందుఁ గృష్ణబల౯భద్రులు వేడ్క వసింప నొక్కనాఁ
డారవిబింబముం దనదు౯నాకృతి శీతమయూఖుఁ డడ్డమై
ధారణి నున్న మర్త్యసము౯దాయము చూడఁగ రానియట్లుగాఁ
జేర మహోపరాగ మది ౯ చెల్లె లయంబునఁ గల్గునట్లుగన్. ౧ 1808
మ. మును పెన్నండును దానియంత గ్రహణం౯బుం జూడకున్నట్టి యా
మనుజశ్రేష్ఠులు జ్ఞానిమూలమునఁ దత్క్రమ్మర్యాద నాలించి యుం
డినవారౌటను బుణ్య మట్టితఱిఁ బూ౯న్కిం జాల నార్జింపఁగా
జని రత్యుత్తమపుణ్యరాశియను విస్తారప్రభావాఢ్యమై ౧౪ 1809
సీ. మునిజనసాంద్రమై ౯ తనరు స్యమంతపంచక మనునాఖ్యచే ౯ జగతిఁ బరఁగి
మఱి కురుక్షేత్ర నా౯మమునఁ బిల్వంబడు తీర్థంబునకు; మున్ను ౯దివ్యచాప
ధరులందు మేటియౌ ౯ పరశురాముఁడు భూమితలమున నొక్కఁడే ౯ ధారణీశుఁ
డుండక యుండఁగా ౯ నుద్ధతిఁ జేయుచు నాస్థలంబునయందు ౯ నవనిపతుల
*తే. రక్తధారలచేతనే ౯ హ్రదవరముల, దాను నిర్మించె; నట్టిహ్ర౯దంబులందె
నామహాత్ముఁడు కర్మాళి ౯ నంటనట్టి, పరమపూరుషుఁడయ్యును ౯ బ్రభువునయ్యె. 3
క. జనులకు శిష్టాచారము,లను దెల్పఁగఁగోరి విద్య౯లం బొందితిఁ గాం
చని పామరులట్లుగఁ బాపనికరము లడంపఁగోరి ౯ భవ్యమనీషన్. ౩౪ 1811
తే. యాగ మొనరించె; నట్టిపుణ్యప్రద మగు, క్షేత్రమున కెల్ల వారును౯ జేరఁబోయి;
రామహాతీర్థయాత్ర పుణ్యావహమ్ము, కనుక భారతులందఱు ౯ మనసు లలర.
క. చని రట్లె వృష్ణివర్యులు, ఘనమతి యక్రూరుఁ డాహు౯కప్రఖ్యాతిం
గను యాదవవర్యుఁడు కృష్ణుని తండ్రియు నింకఁగల్గు ౯ శూరవరేణ్యుల్. ౫

1 "సూర్యోపరాగ స్సుమహానాసీ త్కల్పక్షయే యథా" అని మూలము. "కల్పక్షయేయథా సర్వగ్రాసఇత్యర్థః" అని శ్రీధరీయము. దీనివివరణమే యుండుఁగలదు. 2 "ఈశేచభగవా౯ రామో యత్రాస్పృష్టోఽపి కర్మణా" అని మూలము.

సీ. సాంబుఁడు ప్రద్యుమ్నసారణుల్ శుకసుచంద్రగదులు నొకటిగఁ దరలి వేగ
యాత్మపాపావళి నపనయించుకొనంగ నాక్షేత్రమున కేగి రట్టితరుణ
మం దనిరుద్ధుఁడు నఖిలయూథేశుఁడౌ కృతవర్మయును నిల్చి యెల్లవిధుల
నగరంబు రక్షింపఁ దగియుండి; రాయాత్ర కరిగినవారలు సురవిమాన
తే. ములను బోలురథంబులు వెలయ నలల
వడువునం బాఱు హయములు వఱల నంబు
దము లనందగి ఘీంకృతు లమర నొప్పు
గజము లొప్పఁగఁ బోయి రుత్కంఠపొలయ. ౬ 1814

క. మనుజులు విద్యాధరులనఁ,గను గాంతింబొల్చువారు కదలి వెనుకరాఁ
జని రంత వారు భాగ్యం,బున నసములుగాన హేమభూషాన్వితులై. ౭

క. సురుచిరదామంబుల నం,బరముల ధరియించి కవచవర్యంబులతోఁ
బరఁగుచు భార్యాన్వితులై, సుర లట్లుగ మార్గమందు శోభిల్లిరొగిన్. ౮

చ. పరమపవిత్రతీర్థముల బాగుగ స్నాన మొనర్చి శ్రద్ధయా
దరమును బొంగుచిత్తములఁ దా రొగి నం దుపవాసముండి భూ
సురులకు వస్త్రమాల్యముల శోభిలి బంగరుదండ లొప్పనుం
దరబహుధేనువర్యముల దానము లిచ్చిరి భక్తి పైకొనన్. ౯ 1817

క. ఆరామప్రాదవరముల, వారలు మరలన్ మునింగి వసుదేవసుతుం
డై రహిమించెడు హరియం,దేరీతిన్ భక్తి గల్గి యెపు డుండఁ దగున్. ౧౦

చ. అని మదియందుఁ గోరుచు మహామతులై తగువిప్రవర్యులం
గనుఁగొని పిల్చి చారుతమకాంచనపూగము దానమిచ్చి; శ్రీ
వనజదళాక్షుఁడే తమకు భద్రము లిచ్చెడుదైవ మంచు న
మ్మినవరభక్తులౌటను దమిన్ భగవంతుఁ డనుజ్ఞ నీయఁగన్. ౧౧ 1819

ఆ. భోజనములు చేసి పూర్ణకాములునయి, దట్టమైన నీడ దనరవెలయు
భూరుహముల క్రిందఁ బూనికఁ గూర్చుండి, రంత వార లామహంబు గనఁగ.

సీ. అరుగుదెంచిన తమయనుఁగుమిత్రుల బంధువులగు రాజుల సృంజయులను మ
కౌశల్యుల, విదర్భకాంభోజ కేకయ కురుల నౌసీనరనరపతులను [త్స్య
మద్ర కేరళ కుంతిమగధరాజుల మఱి యానర్తనృపతుల నట్లె మఱియు
నాత్మపక్షము వారలగు వారి నితరపక్షము వారి సంబంధిజనపతులను
తే. వందలకొలంది వచ్చినవారిఁ గనిరి
మఱియు నందాది నిర్మలమానసులను
జాల నుత్కంఠితలగుచుఁ గ్రాలు గోపి
కలను గాంచిరి తన్మహాస్థలమునందు. ౧౨ 1821

క. చిరకాలమ్మున కచ్చటఁ, బరస్పరప్రేక్షణములఁ బర్వినతమి న
బ్బురముగ వికసించిన ముఖ,సరోరుహంబులు ప్రకాశసంపద నొసఁగన్. ౧౮౪

క. ఇతరేతరంబు వనితల, నతివలుఁ బూరుషులఁ బూరుషాళియు హెచ్చైచ
న తమకమున నాశ్లేష,ప్రతతులఁ గావించుకొనిరి బంధుత మిగులన్. ౧౫

చ. కనుఁగవలందు హర్షయుతిఁ గ్రాలుపయఃకణరాజి పొంగఁగాఁ
దనువులు హర్షవేగమునఁ దద్దయుఁ గంపమునొంద మాటరా
క నిలిచి యుండ సంతసము కాంక్షకుమించిన యట్టులొంది; రం
గనలు పరస్పరం బచటఁ గాంచుచు నెయ్యము చక్క నుబ్బఁగన్. ౧౫౪ 1824

చ. స్మితయుతి నిర్మలత్వమును జెందినయట్టి యపాంగవీక్షణ
ప్రతతి చెలంగఁ గుంకుమపుఁబంకమునం దగుక్షీరగేహముల్
జతనముమీఱఁ దాఁకునటు సంతస ముబ్బుట లోచనాశ్రుసం
తతి వెడలంగ బాహువులఁ దద్దయుఁ గౌఁగిటఁజేర్చికొం చొగిన్. ౧౬ 1825

తే. చాలకాలంబునకుఁ గన్నసంతసంపు
ఫలమునొందుచు నుండిరి; చెలఁగి యాద
వులును మత్స్యాదిదేశనాథులును వృద్ధు
లకు నమస్కార కృత్యంబులను నడపుచు. ౧౬౪ 1826

తే. పిన్నవారలు మ్రొక్కంగఁ బ్రీతి నాశి
షములొసంగుచుఁ గుశలమ్ముఁ జక్క నడిగి
యంద అచ్చటఁ గూర్చుండి యచ్యుతకథ
లనువదించుచు నుండిరి హర్ష మలర. ౧౭ 1827

ఉ. కుంతియు నన్నదమ్ములను గోరికమై భగినీవ్రజంబుఁ ద
త్సంతతిఁ దండ్రులన్ సహజసాధ్వుల నవ్వనజాతుఁ గాంచి య
త్యంతము సాధుభాషణము లాడుటచే గతశోకయయ్యె; నా
వంతయు మాని యిట్లనియె వత్సలతన్ మన సల్లె యుబ్బఁగన్. ౧౮ 1828

సీ. భ్రాతృవర్యా! మనోరథములు నాయవి ఫలియింప నట్టులే తలఁచుదాన
నదియేటి కందురో యమలమానసులార! యాపదలెల్ల నన్నలముకొనిన
యప్పుడుకూడ మీరాత్మ నావార్తను దలపరై తిరిగద ధరణియందు
దైవము ప్రతికూల మేవానికయియుండు వానిని సుహృదులుగాని జ్ఞాతి

ఆ. వితతిగాని భ్రాతృసుత పితృ ప్రముఖులు, గాని మనసునందు నైనఁ దలప
రుగద; యనిన నతఁడువగఁ బాయునట్లుగఁ, బలికె; నంబ! వగలఁబాయు మింక.

చ. కరములఁబట్టి దైవము నికామము త్రిప్పఁగ నాడుచుందురీ
నరు లన నాటబొమ్మలె యనం దగియుందురుగాదె? యట్టిమ

మ్మరయ కసూయఁ బూనఁదగ దాపరమేశ్వరుఁ డట్టి మానవా
త్కరమును గైవసంబయి తగన్ మెలఁగంగ నొనర్చి స్వేచ్ఛఁగన్. ౨౦౪ 1830

క. పనులను జేయించును గావున మానవు లస్వతంత్రభూతంబులఁ జే
సినవారు గాన స్వేచ్ఛఁగఁ, బనిదేనిం జేయలే రవశులౌట సతీ! ౨౦౫ 1831

చ. విను మిఁక మాప్రవృత్తి నిట భీతికరుండగు కంసువంక భీ
తిని గని మేము దిక్కొడలి దిక్కులకున్ వడిఁ బాఱిపోయి యా
ర్తిని గనుచుంటి మోసహజ! దీనతవాయఁగ నిప్పు డిప్పుడే
మనముల సుంత సంతసము మైకొనఁ జేరితి మాత్మగేహముల్. ౨౦౬ 1832

ఉ. దైవము తోడ్పడన్ మరల స్థానములందు వసించువార మం
చీవిధి శౌరితండ్రి వగలెల్లను బాయఁగ నూఱడించె; నా
భూవిభు లుగ్రసేననృపపుంగవుఁ డావసుదేవముఖ్యులున్
వేవిధులం దమున్ మిగులఁ బ్రీతిని బూజలఁదన్పఁ దృప్తులై. ౨౦౭ 1833

చ. హరిదగుదర్శనంబు తమకబ్బుటఁ బట్టగరాని ప్రీతిచే
బరవశులైరి; భీష్ముఁడును బ్రహ్మవిదుత్తముఁడైన ద్రోణుఁడున్
గురువరుఁ డాంబికేయుఁడును గోమలులందు మనోజ్ఞకీర్తిచేఁ
బరఁగెడు తత్సతీమణియు వారితనూజులుఁ బాండునందనుల్. ౨౦౮ 1834

సీ. వారలభార్యలు వారితల్లియుఁ గృపవిదురసంజయులును వీరుఁడైన
యాకుంతిభోజుండు నవ్విరాటుఁడు నగ్నజిత్తును, భీష్మకక్షితివరుండుఁ
బురుజిత్తు, ద్రుపదభూవరశల్యకాశీశు లాధృష్టకేతుండు నల్లి జనక
దమఘోష, మద్రభూధవులుఁ, గేకయ, విశాలాక్ష, యుధామన్యులాసుశర్మ

తే. బాహ్లికాదులు తత్సుతుల్ పాండవాగ్ర
నందనానుచరుల్ మహీనాయకులును
దత్సతుల్ శ్రీనికేతనోద్దామ వాసు
దేవవిగ్రహమును గాంచి భావ మలర. ౨౦౯ 1835

క. మనములు విస్మయమున నొప్పిన నిర్భరహర్ష మొంది వెలసిరి; భీష్మా
దినిఖిలవృద్ధులు బలరామునిచే శ్రీకృష్ణుచేతఁ బూజితు లగుచున్. ౨౧౦

క. పరమామోదంబును గని, హరికరుణాపాత్రులైన యావృష్ణిసము
త్కరముల నివ్విధిఁ బొగడిరి, వరభోజపతీ! సమస్తభంగులఁ దలఁపన్. ౨౧౧

చ. మనుజులలోన మీజనియె మంచిదియా సఫలంబునౌ, నదే
లన వరయోగిసంతతికి నైనఁ గనుంగొనశక్య మెవ్విధం
బునఁ దలపోయరాని హరిఁ బూరుషసత్తము సర్వకాలముం
గనుఁగొను చున్నవారుగద! కావున మీరలె ధన్యు లిద్ధరన్. ౨౧౨ 1838

చ. మునినుతమైన యేమహితు‡భూరితమాయతకీర్తి దివ్యపా
దనళినయుగ్మమున్ గడుగ ‡ దాఁ బ్రభవిల్లిన భవ్యనీరమున్
ఘనతరవాఙ్మయ శ్రుతియుఁ ‡ గంజభవాండసమూహ మెల్లఁ బా
వనతఁ జెలంగఁ జేయునొ య‡భంగురకాలము భూమి నేఁచఁగన్. ౨౯ 1839

మ. తనమాహాత్మ్యము దగ్ధపాట మహి యే‡ధన్యాంఘ్రిపద్మంబు సో
కినఁ దచ్ఛక్తిని బొందెనో మరల నా‡కృష్ణుండు మీచెంత ని
ల్చెనుగాదే యలదేవదేవుఁ గనుచున్ ‡ జేఁ దాఁకుచున్ గూడ నే
చనుచున్ బల్కుచుఁ గూరుచుండుచుఁ దమిన్ ‡ శయ్యాస్థలిన్ గూర్కుచున్.

క. ఒనర భుజించుచుఁ బెండ్లిం, డ్లను దగు కృత్యంబులందు ‡ లలిఁ గూడుచు నిం
కను దైహికసంబంధము, లను గాంచుచుఁ గూడియుండ్రు ‡ లావణ్యనిధిన్. ౩౧

*చ. హరి భవమార్గమందుఁ దగు‡నట్టి భవద్గృహమందు భూమిదో
బరువు నడంపఁ బుట్టె భగ‡వంతునిసంగము మూలకంబునన్
సురపురమందు మోక్షమునఁ ‡ జూడఁగ మీకు ననిష్ట మొప్పఁగా
యరయఁగ దీనిమించిన శు‡భాంతర మెయ్యది యుండు నిద్ధరన్. ౩౨ 1842

ఉ. నందుఁడు నందనున్న నళి‡నస్ఫుటపత్రవిలోచనాఖ్యు నిం
కం దగుయాదవేశ్వరులఁ ‡ గాంక్షలు పొంగఁగఁ జూడఁగోరి సు
స్యందనరాజి గోపకులు ‡ హర్షముతోఁ జనుదేర వచ్చె; నా
నందునిగాంచి యాదవజ‡నంబులు మోదరసంబు పొంగన్. ౩౩ 1843

తే. ప్రాణములఁ గాంచి లేచు వి‡గ్రహములట్టు
లలరుచున్ లేచి చిరకాల‡పాట నతని
గనుట కాతురపడువారు ‡ గాన బిగ్గఁ
గౌఁగిటం జేర్చుకొని హాయిఁ‡గనిరి మిగుల. ౩౪ 1844

మ వసుదేవుండును బ్రేమవిహ్వలతచే ‡ స్వాంతంబు నిండార నం
దసమీపంబున కేఁగి కౌఁగిట నితాం‡తం బట్టి కీలించి కం
ససమారోపిత కష్టజాలములనుం ‡ జాలంగఁ జింతించి యా
త్మసుతద్వంద్వము నెంచె గోకులమునం ‡ దా నుంచుటన్ వంతచేన్. ౩౫ 1845

క. రాముఁడు కృష్ణుండు యశో, దామానిని నందు గోపతల్లజుఁ గనుచుం
బ్రేమాతిరేకమున విధి, గా మస్తకములు తదంఘ్రి‡కమ్ములు సోఁకన్. ౩౬

చ. నతులొనరించి కౌఁగిట మ‡నంబులు పొంగఁగఁ జేర్చి చారుదృ
గ్ద్వితయము సాశ్రుబిందుక‡యుతిన్ బొలుపొందఁగ మాటరాక య

* "యేషాంగృహే నిరయవర్త్మని వర్తతాం వః" అని మూలము. "నిరయవర్త్మని ప్రవృత్తిమార్గే" అని వ్యాఖ్య.

వ్రీతమున నిల్చియుండిరి; సుకవిస్తుతభాగ్యము గల్గు నాయశో
ద తనయయుగ్మముఁ గని మోదంబున నంకముపైకిఁ జేర్చుచున్. ౩౪ 1847

చ. కరముల బిగ్గఁ బట్టుకొని కౌఁగిటఁ జేర్చి విశోకయయ్యె న
క్కరణినె నందుఁడున్ సుతులఁ గౌఁగిటఁజేరిచి సంతసించె; న
త్తరుణమునందు దేవకి ముదంబున రోహిణియున్ యశోద గో
పరమణుదేవిఁ గౌఁగిటను బాగుగఁ జేరిచికొంచు వింతగన్. ౩౫ 1848

ఉ. ఆతనుమధ్య మున్ను తమయందు నెసంగఁగఁ జూపియున్న సం
ప్రీతిని సంస్మరించుకొని ప్రేమభరాతిశకబంధబిందుక
వ్రాతము కంఠముల్ దగిలి వాక్కుల వెల్వడనీకయుండ నె
ట్లో తగినట్లు పల్కిరి; మహోత్తమచిత్త! వ్రజేశ్వరీ! సతీ! ౩౬ 1849

మ. మును మీయిర్వురు చూపియున్న చెలిమిన్ బూబోఁడి యెవ్వర్తుకై
న నదెట్లే మఱువంగఁజాలుఁ? దను వెంబడాఁకన్ జెలంగున్ మనం
బున నందాఁక స్మరింపఁగాఁ దగుఁగదా? పూతాత్మ! యద్దాని కిం
ద్రుని యైశ్వర్యము మాఱొసంగినను దోడ్తో నాఋణం బాఱునే? ౩౭ 1850

సీ. ఈకుమారకు లిర్వు రెవ్వరు తలిదండ్రు లనియెఱుంగక మిమ్ములనె జనకులఁ
గాఁ దలంచుచును మీకడనె యిల్లడయుండ మీరు ప్రేమంబునఁ గోరిన యవి
యెల్ల నొసంగుచు నుల్లమ్ములలర నామకరణముఖములొ మహముల నొన
రించి చక్కని రీతిఁ బెంచుచు రక్షింప నేవిషయంబున నేని భయము

తే. నొందకయె కన్నులను ఱెప్పలొప్పఁ గాచు
నట్లు కావంగ మీచెంత నధివసించి
యుండి; రెన్నంగ సుజనుల కొకఁడు పరుఁ డొ
కండు తనవాఁడు నను భేద ముండ దవని. ౩౮ 1851

శ్రీహరి గోపికలకు జ్ఞానోపదేశము చేయుట.

చ. అని వచియింప గోపికలు నాపరమేశుని జాలకాలముం
గననికతంబునన్ మరలఁ గాంచుట మోదరసంబు పొంగఁగాఁ
గనుఁగొనుచుండ నడ్డుపడఁగా విధి ఱెప్పల నేలసృష్టి చే
సెనో యని యాతనిం బదఱి చిత్తగతుండగు చిన్నికృష్ణునిన్. ౩౯ 1852

చ. మనములఁ గౌఁగిలించుకొని మానక నిత్యము ధ్యానపద్ధతిన్
గనుఁగొనఁ జూచుయోగులకుఁ గాంచఁగ దుర్లభుఁడైన మాధవున్
గనుచుఁ దదాత్మతం బడసి కాంచనచేలుని గాంచు నయ్యవ
స్థను గని; రట్టిగోపికలఁ జక్రి కృపాభరితాంతరంగుఁడై. ౪౦ 1853

క. ఏకాంతమ్మునఁ జేరెను, శ్రీకాంతుం డంత వారిఁ జెచ్చెరఁ గరుణన్

వే కౌఁగిలించుకొని యోహో కుశలంబే యటంచు । నొప్పుగ నడిగెన్. ౮౦౪

క. అలఁతినగవాస్యపద్మం, బలరింపఁగ వారితోడ । నాదృతిమీఱన్
బలికె; సఖీమణులారా!, తొలఁగితి మిన్నాళ్లు స్వజన । తుష్ట్యర్థం బై ౮౧ 1855

క. మనవారల కార్యంబుల, ననుపమఫలసంయుతంబు । లగునట్టులు చే
యను బోయియుండు మమ్ముల, ననుస్మరింతురె యొకప్పుడైనను మీరల్. ౮౧౪

మ. అరిపక్షక్షపణం బొనర్ప మదు లత్యంతంబు సంసక్తి గాం
చ రయంబొప్పఁగ రాక కొంతతడ వాస్థానంబులం బుచ్చి యీ
పురి కిప్డే చనుదెంచినారము మిముం । బోనాడునూహల్ మదిన్
స్ఫురియింపంగను లేదు నమ్ముఁ డిది యోప్రూఁబోఁడులారా! కడున్. ౮౨ 1857

క. వీరు కృతఘ్నులె యనుచున్, వారక శంకించి మ మ్మవజ్ఞత దూఱం
గోరరుకద; వదలంగాఁ, గోరితిమని యందురేమొ । కోమలులారా! ౮౨౪ 1858

క. భగవంతుఁడు ప్రాణులఁ గూర్పఁగ నెంచు నొకప్డు వాపఁ । బరికించు నొక
ప్డు గణనకున్ మించిన శక్తిగలాఁడు నిజంబు దీనిఁ దెలుఁ గిట్టిదయా. ౮3 1859

*చ. అనిలుఁడు మేఘబృందముల । నల్లె తృణంబులఁ దూలమున్ రజం
బును సరిగాఁగఁ గూర్చుచును । బొందును వీడఁగఁ జేయుచుం దనం
తన విహరించు; నట్లుగనె । దైవము భూతగణంబుఁ గూర్చుఁ బొం
దును విడఁజేయు నప్డపుడు । తోఁచినయట్లుగఁ గర్మసంగతిన్. ౮౮ 1860

క. భూతములకు మద్భక్తియె, యేతఱినే ముక్తినిచ్చు । నిత్తఱి మీదౌ
నాతత భాగ్యవశంబున, నే తమి నాయందు మీకు । నెసఁగెంజూండీ! ౮౫ 1861

సీ. అంగనామణులార! । యంబరాదిక మహాపంచభూతంబులు । భౌతికమ్ము
లగుపదార్థంబుల । కరయ నెట్టులొ యట్లె యేను నాద్యంతముల్ । నా నెసంగు
కార్యమ్ము లగుదును । గలుగుదు లోపల వెలుపల; నాల్గురీతులఁ జెలంగు
భూతంబులును నైజములగు కారణములై పరఁగుమహాభూత । పంచకమ్ము

తే. నందువర్తించు ననియు నంతదాత్మభోక్తృ
రూపమున నిండియుండు నం । చాపగిదిగ
భూతభౌతికరూపమౌ । భోగ్య మద్ది
భోక్తయగు నాత్మ యివి రెండుఁ । బూన్కిఁదలఁప. ౮౬౪ 1862

తే. అక్షరుఁడఁ బరిపూర్ణుండ । నై చెలంగు
నట్టి నాయందు రజ్జువునందు భుజగ
మటు ప్రతీతంబులై యుండు । ననియు మీరు
గనుఁగొనుఁ డటంచుఁ బలికె; నక్కాంతలెల్ల. ౮౭ 1863

* "వాయుం ర్యథా ఘనానీకం తృణం తూలం రజాంసి చ" అని మూలము.

*చ. తమ కిటు లాపరాత్పరుఁడు । తత్త్వముఁ జక్కఁగ బోధచేయఁగాఁ
బ్రమదమునొంది సర్వగతు । భాసురతేజుని సంస్మరించి దా
నిమహిమ లింగదేహయుతిఁ బాసిన విడనాడి మహానుభావునిం
గమలదళాక్షు ముక్తిదునిఁ । గ్రన్ననఁ బొంది వచించి రివ్విధిన్. ౮౮ 1864

సీ. కమలనాభ! యపారమగు బోధముగల్గు నట్టియోగీశ్వరు । లాత్మనియతి
ధ్యానింపఁగాఁ దగి । దారుణభవకూపమగ్నులై యున్నట్టి । మానవాళి
నుద్ధరింపందగు । నుత్తమభవదంఘ్రి పద్మద్వయంబును । భవమునందుఁ
మునిఁగియేయున్న మాకు మనముల నెల్లప్డు పొడసూపు నట్టిదౌ । పూజ్యమార్గ
తే. మును గృపాతిశయంబున । వనజనేత్ర!
వరము దయచేయు మిదియె మాకువాంఛ వేఱు
కామ్యములు లేవుసుమ్ము నీకు మిది యంచు
గోపికలు వేఁడి రెంతయు । గోపవిభుని. ౮౯ 1865

ఎనుబది మూఁడవ యధ్యాయము.

హరిపత్నులు పాంచాలికిఁ దమపెండ్లివార్తలం దెల్పుట.

చ. హరి భగవంతుఁ డిట్లు తనునాదృతిఁగోరిన గోపికాళికిం
జరణసరోజసంగతిని । సమ్మతిచేత ననుగ్రహించి యా
తరుణమునన్ యుధిష్ఠిరునిఁ । దక్కినయట్టిసుహృత్తతిన్ మనో
హరతరభాషలం గుశల । మాదృతిఁ బ్రశ్న మొనర్చి సద్విధిన్. ౧ 1866

ఆ. సత్కరించె నంత । సర్వరాజులు తత్ప, దాబ్జదర్శనమున । నఘము లడఁగ
హర్ష మొప్పఁ బల్కి । రఖిలలోకప్రభూ!, మునివరార్చితాంఘ్రివనజయుగ్మ!

సీ. తనుధారులకు నలమిన యవిద్యను దొలఁగించుచు నసమతఁ । గాంచి వెలయు
భవదీయపాదాంబుభవమకరందము మహనీయులైనట్టి । మానులముఖ
పథముననుండియె । బహిరాగతంబగుదానిఁ గ్రోలెడునట్టి । మానవులకుఁ
గుశలంబె పొసఁగు నకుశల మెవ్విధిఁగల్గు? బుద్ధికృతంబయి । భూరితరము
తే. నైన యట్టియవస్థాత్రయంబు నాత్మ, దగుప్రకాశంబునన్ బొలియంగఁ జేసి
శాశ్వతానందరూపుఁడై । సంతతం బఖండతం బొల్చి యసమతఁ గ్రాలి మిగుల.
క. అపరిమిత బోధుఁడై వేదపథమునకుఁ గాలమున నితాంతచ్యుతి గ
ల్గుపగిదిగఁ దోఁచినన్ వేగ పరిహరింపంగఁ బూని । కరుణాపరతన్. ౪ 1869
తే. యోగమాయావిలాసం బకదొప్ప నిట్లు, లవతరించిన పరమహంసాళిగమ్యుఁ

*"తదనుస్మరణధ్వస్తజీవకోశాస్తమధ్యగన్" అని మూలము. "జీవకోశో లింగం యాసాం తాః" అని వ్యాఖ్య.

డైన యాదేవదేవున కఖిలపతికి, నెలమి మ్రొక్కుదు మీనీకుఁ గృష్ణమూర్తి.

క. అనియిట్లు వారు వినుతుల, వనజాక్షునిఁ గొల్చుచుండ పరవృష్ణిసరో
జనయనలుం గౌరవభా,మినులును సంతోషమున గుమిగఁగూడి యటన్. ౭౪

క. ఇతరేతరసల్లాప వి,తతులఁ ముల్లోకముల నితాంతము భక్త
ప్రతతులచేఁ బాడఁబడు, దితిజాంతకు సత్కథల నుతించుచు వేడ్కన్. ౭౫ 1872

క. పరమాదరమున వేఱొ,క్కరితో నొక్కరుగఁ బల్కఁగా సాగఁగ న
త్తరుణమున ద్రౌపదియు శ్రీ,హరిభార్యలఁ గాంచిపల్కె నాదృతిమీఱన్. ౭౬

సీ. ఓరుక్మిణీ! భద్ర! యోజాంబవతి! సత్యభామ! కాళింది! శైబ్యయనునట్టి
యంగనామణి! లక్ష్మణాఖ్య! సూరోహిణీ! హరిపత్నులార! సర్వాబ్జజాండ
పతి భగవంతుఁడు పరమేశ్వరుఁడు నిజమాయచే లోకంబు న్యాయరీతి
ననుకరించెడు పరమాత్మ మిమ్మెల్లర నెట్లు పెండిలియాడె నెఱుఁగ జెప్పఁ

తే. డనుచుఁ బ్రశ్నింప రుక్మిణి యనియె నిట్లు, ద్రౌపదీ! శిశుపాలభూధవునకు నను
నప్పగింప జరాసంధుఁ డాదిరైన, భూపతులు చాపపాణులై యేపుమెఱయ.

చ. హరియు నజేయవీరుల మహోత్తరమస్తకరాజిఁ బాదపం
కరుహపరాగ మెంతయును గ్రాలఁగ నుంచుచు స్వాంశమాంసముఁ
హరి యెటు లాయజావినివహంబుననుండి గ్రహించునో, మహే
శ్వరుఁ డగుటఁ మహీధవుల సంతతినుండియె యల్లె శూరతన్. ౭౮ 1875

చ ననుఁ గొనిపోయె నట్టిడగు నాకవిభుప్రభుపాదపంకజా
ర్చనము నిరంతరంబుగ నొసంగెడుఁ గాక! యనంగ సత్య యి
ట్లనియెను; నాదుతండ్రియుఁ బ్రియానుజు వీరుఁ బ్రసేనుఁ జంపెఁగా
వనమున సింహమంచు వెతవర్ధిల శ్రీహరి నిందచేయఁగన్. ౭౯ 1876

క. దానిని దప్పించుకొనం, గా నెంచి వనంబుఁజేరి కడఁక మృగపతిఁ
దా నొంచి మణిని గైకొని,యే నెలవును జేరియున్న యిద్ధబలాఢ్యున్. ౮౦

ఆ జాంబవంతు గెల్చి సరగ స్యమంతక, మణివరంబుఁ దెచ్చి మామకపిత
కొసఁగ నాత్మభీతి యొప్ప సత్రాజిత్తు, నన్ను నొరులకీయ నున్నవాఁడు. ౮౧

క. నళినాక్షున కిచ్చె నన్ఁ, బలికెఁ జాంబవతి యిట్లు పద్మాక్షుం డై
జలజాసనాది నుతుఁడై, ఖలహరణుఁడునైన హరి జగత్పతి నాత్మన్. ౮౨ 1879

క. నాతండ్రితనకుఁ బ్రభువౌ, సీతాపతియంచు మఱచి చెలఁగుచు యుద్ధం
బోతన్వి! సప్తవింశతి, దైయ తగుదివసంబు లొప్పునట్లుగఁ జేసెన్. ౮౩ 1880

క. తరువాత రాముఁడే యవ,తరించె భూభారహరణతత్త్వ విబోధా
ద్యురుతరకార్యము లొనరుప, ధర యాదవకులమునందుఁ దా నని యెఱిఁగెన్.

చ. తనదు నహంకృతిం దెలిసి తత్క్షణమే పదయుగ్మముం శిరం
బున ధరియించి రత్నవరముం ననుఁ గాన్కగ నిచ్చె దాసి నై
తిని హరికే నటంచుఁ దనతీరు వచించిన నాలకించి శ్రీ
వనజదళాక్షుఁడే తనను వచ్చి వరించినగాథఁ దెల్పఁగన్. ౧౦ 1882

క. తలపోసి యప్పు డిట్లని, పలికెం గాళింది; కృష్ణుపదపంకరుహం
బుల స్పృశియింపం గోరిక, చెలఁగం దప మేనుభక్తిఁ జేయుచునుండన్.౧౦౫

చ. తెలిసి కిరీటితోడఁ దనుదీప్తులు పర్వఁగ నేగుదెంచి శ్రీ
జలజదళాక్షుఁ డెంతయును సంతసమొప్ప మదీయపాణి ని
మ్ముల గ్రహియించె నేను గృహాముం దుడువందగు దాననైతి నం
చలరుచుఁ బల్కె; నిట్లనియె నల్లన నాదృతిమీఱ భద్రయున్. ౧౧ 1884

సీ. ననుఁ దా స్వయంవరమున కేగుదెంచి శ్రీహరి మృగేంద్రము శునకాంతరమున
నున్నట్టి తనబలిఁ గ్రన్ననఁ గొని పోవుచందంబునం రిపుక్ష్మాపతులను
నపకారులై యున్నయట్టి నాసోదరులను గెల్చి శ్రీనికేతనుఁడు ద్వార
*కకుఁ గొనిపోయె నేనకలుషమతి హరి పాదావనేజనపరత నుందు

తే. నదియె ప్రతిజన్మమందు నా కిమరుగాక!
యనగఁ గౌసల్య సత్యాహ్వయాంతరమున
నలరు సాధ్వియు నిట్లనె నస్మదీయ
జనకుఁ డుర్వీపతుల శౌర్యమును గనంగ. ౧౨ 1885

చ. బలము నగాధవీర్యమును బాగుగ నొప్పగ నుండు నేడునె
ద్దుల నతితీక్ష్ణశృంగములతోఁ దగు వానిని సంతరించి యే
బలియుఁడు వానిగెల్చు నను వానికి నీయఁ బ్రతిజ్ఞఁ జేసె; దు
ష్టుల చెడుగర్వముం గలఁచి శూరతమించెడు నావృషంబులన్. ౧౨౫ 1886

తే. మేఁకపిల్లల శిశువులు కైకొనునటు
లశ్రమంబున నోడించి యమలవీర్య
శుల్కయగు నన్నుఁ గైకొని క్షోణిపతులు
దారి మార్కొన లీలఁ దరిమివైచి. ౧౩౫ 1887

క. చతురంగబలము దాసీ, ప్రతతియుఁ దోడ్తోనరాఁగఁ బద్మాక్షుండా
దృతిఁ బురిఁజేరిన యాశ్రీపతి దాస్యం బెపుడు నాకుఁబాయ కలరుతన్! ౧౪

చ. అన విని శైబ్య యిట్లనియె నాహరియందె మనంబునిల్పి యు
న్న నను నెఱింగి మాతులుని నందనుఁడై తగు కృష్ణమూర్తి ర
మ్మని మరియాదఁ బిల్చి ముదమారఁగ నిచ్చె సఖీజనంబుతో

* "అంఘ్ర్యవనేజనత్వమ్" అని మూలము.

ధననివహంబుతోడ బలదర్పసమగ్రభటవ్రజంబుతోన్. ౧౫ 1889

తే. కర్మవశమున సంసారకంథిఁ దిరుగు, నాకు శ్రేయస్సులకుఁ గారణమగు కృష్ణ
చరణపంకజయుగ్మసంస్పర్శ మెల్ల,జన్మములఁ గల్గుఁగాత నిశ్శంకముగను. ౧౬

చ. అనుటయు లక్ష్మణాఖ్య ద్రుపదాత్మజ కిట్లను రాజ్ఞి! నాకునున్
మునిపతి నారదుండు పలుపోకల నచ్యుతు జన్మకర్మరా
జిని మది పొంగ గానమును జేయఁగఁ జక్కఁగ నాలకించుటన్
మనము ముకుందునందె పరిమగ్నత నొందెను బుణ్యసంగతిన్. ౧౭ 1891

చ. సరసిజహస్త లక్ష్మి సురసత్తములై తగులోకపాలురన్
గరము త్యజించి సద్గుణనికాయము నారసి శ్రీహరిన్ మహా
పురుషునిఁ గోరె నంట, ననుఁబోలిననాతి వరించు టబ్రమే;
గురుతరబుద్ధి నాదుజనకుండును నాయెడఁ బ్రీతిమించఁగన్. ౧౭౪ 1892

సీ. ఈ ననుఁబెంచె నామానవనాథుండు చెలఁగుసుజాము! బృహత్సేనుఁ డనఁగ
నాకాంక్ష నెఱిఁగి విన్నాణి గావున నొక్కసదుపాయ మెంచె; నీజినకుఁడైన
ద్రుపదుఁ డర్జునుని గోరుచు నెట్లునిర్మించె మత్స్యయంత్రమునట్లమత్పితయును
శుల్కముగా దానిసొంపుగ నిర్మించె; నీస్వయంవరమందు నియతమైన

తే. యంత్ర మదియు బహిర్భాగమందుఁ గానఁ
బడుచునుండె నీయదియు లోపలను వెలుప
లను గనన్ రాక క్రిందుగ నునుపఁబడిన
కలశజలములఁ దోఁచు సూక్ష్మముగ దేవి! ౧౯ 1893

క. ఈరెంటికిఁ గలభేదం, బారయ నీమాత్రమే; సమస్తాస్త్రవిదుల్
భూరమణు లుపాధ్యాయుల,తో రయమున వేలకొలఁదితోరపు వేడ్కన్. ౧౯౪

క. అరుదెంచిరి నాజనకుని, పురమున కవ్వారి నర్హముగ సత్కృతులన్
బరమముదం బొదవంగ నొ,నరిచెం బిత; యంతఁ గొల్వునన్ వారెల్లన్. ౨౦౪

ఉ. నాపయి బుద్ధినిల్పి జతనంబున యంత్రము మత్స్యరూపమున్
వే పడఁగొట్ట బాణమును విల్లును గైకొన సాగి; రందునన్
భూపతు లొక్కకొంద అలభూరిశరాసనమున్ గ్రహించి యం
దేపున నారిగూర్ప నొకయింతయుఁ జాలకయే తొలంగఁగన్. ౨౧౪ 1896

చ. మఱియొకకొంద ఉద్ధతిని మానక యెట్లొ గుణంబు కోటిఁ డ
గ్గలునటు లాగి యవ్వలను గట్టిగఁ బట్టుకొనంగలేకయే
బిలబిల జాఱి తాఁక నది విహ్వలులై ధరఁద్రెళ్లి యప్పు డం
దఱు నగ సిగ్గు నొందిరి; నితాంతభుజాబలశాలి చైద్యుఁడున్. ౨౨ 1897

క. మాగధుఁ డంబష్ఠాఖ్యుం, డై గడు విఖ్యాతిగనిన యవనీపతి య

ళ్లే గంధవహుని పుత్త్రుఁడు, నాఁగఁ దనరు భీముఁడుగ్ర ఘనప్రక్రమతన్. ౨౨౪

క. ధృతరాష్ట్ర నగ్రపుత్త్రుఁడు, శతపత్త్రప్రియసుతుండు । క్షమ నింక భుజో
ద్ధతి గలరాజులు కొందఱు, జతనంబున నెక్కుపెట్టఁ । జాలియు దానిన్. ౨౩

ఆ. జంత్రమున్న చోటుఁ । జక్కఁ గనుంగొనఁ, జాలరైరి లక్ష్యమోలిఁ గూల్ప
నెట్లుశక్తులగుదు । రేపున నర్జునుం,డొకఁడుమాత్ర మచటి । కురుజవమున. ౨౩

చ. కలశజలంబులందుఁ గనఁగాఁదగు జంత్రపుచాయఁ జక్కఁగాఁ
దెలిసి ప్రయత్న మొప్ప నొకదివ్యశరంబును గూర్చివైచె నా
బలుశర మాఝషాకృతిని । బ్రద్దలు చేయఁగలేక ముట్టుచే
ఫలమని క్రిందవ్రాలె; నిటు । బాహుజు లెల్లరు భగ్నమానులై. ౨౮ 1901

చ. తమకుఁగలట్టి కీర్తికరదర్పము బ్రుంగఁగ వచ్చినట్టి త్రో
వ మరలి పోవఁ గాంచి భగవంతుఁడు కృష్ణుఁడు లీలఁగా ధను
స్సమరఁగఁ బట్టి యెక్కిడి మహాశర మొక్కఁడుదానఁ గూర్చి యం
త్రము నొకసారి నీటఁగని । దానిరహస్య మెఱింగి వేడుకన్. ౨౯ 1902

ఉ. నాలవమూరుతంబదె జనంబుల కిష్టఫలాళి నీయఁగాఁ
జాలును గాన నట్టిదగుసత్త్వమయంబున వానిఁగొట్టి వే
తూలఁగఁజేసి భూమిపయి; । దుందుభు లంబరమందు భూమిపై
నోలిజయధ్వనుల్ చెలఁగుచుండెను హర్షముపొంగ దేవతల్. ౨౬౪ 1903

తే. కుసుమవర్షంబు గురియించి । రెసక మెసఁగ;
నుత్తమదుకూలములఁ దాల్చి । యొప్పు నేను
గబరిసుమహారములు చక్కఁ । గ్రమ్మఁ జేసి
పదములందందియలు సుశబ్దము లొనర్ప. ౨౭౪ 1904

చ. కనకమరీచు లెల్లెడలఁ । గ్రమ్మఁగఁ బొల్చెడురత్నహారముం
గొని నునుసిగ్గు సుస్మితముఁగూడి మొగంబున నాట్యమాడఁగాఁ
జని యలరంగముం జొరఁగఁ । జాలితి; ముంగురులట్టె గ్రమ్మ ర
త్న నికరకుండలప్రభలు । తద్దయుఁజెక్కులలందుఁ బర్వఁగన్. ౨౮ 1905

ఉ. ముద్దులుమూటగట్టు విధముంగనఁజేయుచు నాదునెమ్మొగం
బద్దెసఁ జూడనెత్తి శశిరామలవాసకటాక్షసంచయం
[1]బుద్దియమీఱఁ బర్వినటు । లొప్పుగఁజేయుచు నేను ద్రౌపదీ
యద్దిర! యంచు నన్ననెడు । నాసరనాథుల నెల్లఁజూచుచున్. ౨౦౪ 1906

ఉ. అంతమనంబునం దొలయు । నయ్యనురాగభరంబుచేత దై
త్యాంతకు కంధరంబునను । హారము వైచితి నీవె దిక్కటం

1 ఉద్దియ = యత్నము.

చంత మృదంగశంఖపటహంబులు భేరులు నానకాదు లొ
క్కంతయు నంతరంబుగనికే మొరసెం బెలుచన్ సభాస్థలిన్. ౭౯౪ 1907

సీ. నర్తకీజనములు నటులు నృత్యము చేసి రామోద మొప్ప గాయకులుపాడి
రో ద్రౌపదీ! యిట్టులురుతర బ్రహ్మాండ పతియైన శ్రీకృష్ణు జతనమూని
యేను వరింపఁగా నితర రాజన్యులు మన్మథవశులయి మచ్చరించు
చును నాదుకార్యంబు మనసుల నించుకే సైరింపరైరి; శ్రీచక్రధరుఁడు

తే. హయవరచతుష్టయముఁ బూన్చినట్టి రథము
నన్ను నెక్కించి శార్ఙ్గమనంగ నొప్పు
చాపమును గేలనందుచు సాంపరాయి
కమునకున్ సిద్ధముగనుండెఁ గరముఁ బూన్కి. ౩౨ 1908

క. ద్రుపదసుతా! దారుకుఁడును, దపనీయోపస్కరముగఁ దగుస్యందనమున్
నృపవరులు చూచుచుండఁగ, ద్విపవైరి మృగాళిచూడఁ దెగువఁ జనుగతిన్.

క. జవమునఁ దోలెను; గొందఱు, నృవరులు మార్గమ్మునందు నీరజనాభుం
డు వనితఁ గొనిపోయెడు నంచు విక్రమము జూపనెంచుచు నిరోధింపన్.

ఉ. వారల శార్ఙ్గముక్తపటుబాణచయంబుల నొంచుచున్ విరా
డ్వారికరాంఘ్రి కంధరల భూమిపయిం బడఁజెండి కృష్ణుఁ డె
వ్వారికినే భయంబొదవుభంగిగ యుద్ధము చేయఁ గూలి; ర
వ్వారలపాటు గాంచి పెఱబాహుజు లెల్లరుఁ బాఱి రార్తులై. ౩౫ 1911

వ. అంత యదువీరశిఖామణి మార్తండమండలము నాచ్ఛాదించు ధ్వజపటంబులు మెఱయ విచిత్రతోరణంబులంగలిగి సురపురంబున భూలోకంబున మిగులఁ బ్రశస్తిఁగాంచిన ద్వారకానగరంబు సర్వవిధాలంకృతంబు భాస్కరుండు స్వకీయపత్తనభూతోదయ మహీధరంబునుబోలెఁ బ్రవేశించె. అంత నాతండ్రియు మిత్రబంధుసంబంధుల నమూల్యాంబరాభరణంబుల శయనాసనాదికంబుల నొసంగి గారవించె. మఱియుఁ బరిపూర్ణుండగు శ్రీహరికి సద్భక్తిం జేసి దాసీజనంబుల సర్వసంపదల భటగజహయరథ మహాస్త్రాయుధవిశేషంబుల నొసంగె. ఎనమండ్రు భార్యలనం బరఁగు మేమెల్ల సర్వసంగంబులం బాసి తపోబలంబునం జేసి యాత్మారాముఁడగు యమ్మాననీయునకు గృహదాసీజనంబుల మైతిమని పలుకుటయుఁ బదాఱువేల పట్టపురాణులు ద్రౌపది కిట్లనిరి. ౩౯ 1912

చ. మును నరకాసురుండు జయమ్ముం బడయం దలపోసి దిక్తటిన్
గనఁజని యందుఁగల్గు నృపకాంతుల నెల్ల జయించి తత్తనూ
జనితల మమ్ము బల్మిగొని చాల భరింపఁగరాని బాధలం
గనఁ జెఱసాలనుంచె నని కాంచనచేలుఁ డెఱింగి యాఖలున్. ౩౯౪ 1913

మ. పరివారంబులతోడ సంగరమునం ׀ బ్రాణాళిఁ బాయంగఁ జే
య రమాకాంతుని, ఘోరసంసృతిని బోయంజేయు సర్వేశు నీ
శ్వరునే నెంచుచుఁ దత్పదాబ్జము నజస్రంబాత్మ ధ్యానించు మ
మ్మురుదుఃఖాబ్ధినిమగ్నులన్ దలఁచి మాయాపాల్ ఫలింపం దమిన్. ౮౦ 1914
క. తా నాప్తకాముఁడయ్యును, మానినులన్ బెండ్లియాడె ׀ మమ్మెల్ల; సతీ
మానసముల సామ్రాజ్యం, బేని సురాధీశపదము ׀ నే నొకమాఱున్. ౮౧ 1915
[1]సీ. తలఁపము పొందఁగా ׀ నలినాక్షి! యణిమాదిసిద్ధులనే సుర׀జ్యేష్ఠుపదముఁ
గాని మోక్షంబును׀గాని యింకేదియేఁ గాని కోరము పయ׀కంథితనయ
పటుకుచకుంకుమ׀పంక పరిమళ భరితమౌ హరిదివ్య ׀ చరణరేణు
శకలంబుఁ దలలందుఁ ׀ జక్కఁదాల్పఁగఁ గోరువారము; గోపికా׀సారసాక్షు
తే. లడవిఁగల్లు పుళిందుల ׀ యంగనలును
దృణలతల్ గోవులంగూడి ׀ తిరుగుగోప
కులును గోరుదురో యెట్టు ׀ లెలమి నట్లె
మేముఁ గోరుచునున్నాము ׀ మించుత్వరను. ౮౨ 1916

ఎనుబదినాల్గవయధ్యాయము.

మునులు హరింజూడ నరుదెంచుట.

క. అనిపలికి శుకమునీంద్రుఁడు, జనపతితో మఱియుఁ జెప్పెఁ ׀ జక్రిచరిత మి
ట్లని; కుంతియు గాంధారియు, వనజాక్షసహోదరియును׀వదలని ప్రీతిన్. ౧ 1917
క. ద్రుపదాత్మజయును దక్కన, నృపపత్నులు గోపికలును ׀ నిఖిలాత్ముం డై
యపరిచ్ఛిన్నుఁడు నౌహరిఁ, గపటం బిసుమంత లేక ׀ క్రాలెడు ప్రీతిన్. ౨ 1918
క. కొనియాడుచు నాపల్కులు, విని యానందాశ్రుసలిల׀బిందువు లొకటం
గనుఁగవల నిండ విస్మయ,మును గాంచిరి మఱియు స్త్రీలు׀పూఁబోణులతోన్.
క. పురుషులు పురుషులతోడన్, హరిగాథలఁ జెప్పుకొనుచు ׀ నానందములోఁ
బరఁగుచునుండఁగ సుండిరి, తరుణంబున నందె పద్మ׀దళలోచనునిన్. ౪ 1920
క. శ్రీరాముని దర్శింపఁగఁ, గోరిక లూరంగ మౌని׀కువలయపతులున్
జేరిరి తత్క్షేత్రమ్మున్, నారదుఁడుం బరాశరముని׀నందనుఁ డొకటన్. ౪ 1921
సీ. చ్యవన దేవల ముని ׀ యసిత కౌశిక గౌత
ములు భరద్వాజ రామములును వారి
శిష్యులు మఱియు వసిష్ఠ గాలవ, భృగు
మును, లత్రి,కశ్యపు׀లును, బులస్త్య

* "యామయామహ వితస్య శ్రీమత్పాద రజశ్శ్రియః, కుచకుంకుమగంధాఢ్యం మూర్ధ్నా వోఢుం గదాభృతః" అని మూలము.

మునియు, మార్కండేయుండును, బృహస్పతియును,
* ద్వితుండు, త్రితుండు, నేకతుండు, బ్రహ్మ
పుత్రుం, డంగిరసుండర్క ॥ మునిపతియు, నగస్త్య
యాజ్ఞ్యవల్క్యులుమహా ॥ ర్హామతు లైన

తే. వామదేవాదులగు మౌని॥వరులు రాంగ
సర్వలోకవందితులగు ॥ సాధుమునుల
వారలం గాంచి మును పందు॥గూరుచున్న
నరపతులు నల్లె పాండునం॥దనులు హరియు. ౫ 1922

క. బలరాముండు వేగంబున, నెలమి మనస్సులను బొంగ ॥ నింగితముం దగం
దెలియుట దిగ్గన లేచిరి, విలసిల్లెడుభక్తి మ్రొక్కి ॥ వినయం బడరన్. ౬ 1923

క. హరియగ్రజుతోం దక్కిన, ధరణీశులతోడం గూడి ॥ తా స్వాగత మా
దరమునం బ్రశ్నించుచు ముని,వరులకుం బాద్యార్ఘ్యములను॥వరుసనొసంగుచున్.

తే. ఆసనములిచ్చి మాల్యంబు॥లల్లె ధూప,ములను ననులేపనములను॥బూజ్యభంగిం
జక్కనర్చించి; రంతట ॥ సత్యధర్మ,రక్షణార్థమె ధాత్రి వి॥గ్రహముం దాల్చి. ౭

చ. తనమహిమంబు దాంచి గురు॥తత్త్వము తా నయి వెల్గుచున్న యా
వనజదళాక్షుం డాసభను ॥ భాసిలువా రొకరైనం బల్కకే
వినుటకు వేచియుండ ముని॥బృందము హాయిగం గూరుచుండంగాం
గనుంగొని పల్కె నిట్టులని ॥ గౌరవ ముప్పతిలంగ భక్తితోన్. ౮ 1926

క. అయ్యారే! మాజన్మమె, యియ్యెడ సఫలంబుజన్మ॥మెత్తిన ఫలముం
జయ్యనం గాంచితి మిత్తఱి, నయ్యమరులకే నలభ్యు॥లగుమిము గనుటన్. ౯

[1]తే. పరమయోగేశదర్శన॥భాగ్య మబ్బె,జన్మవంతులలో మేమె ॥ సఫలులముగం
దలంచువారము విగ్రహా॥ములపయిం గడు,దేవతాబుద్ధి గల్గివ॥ర్తింతు మెపుడు.

క. కనుకనె యల్పతపస్సుల, నొనరించినవార మగుదు ॥ మో మునులారా!
కన నిట్టి మాకు మిమ్ముం, గనుంగొన స్పృశియింప నతులం॥గావింపంగన్. ౧౦

సీ. కుశలంబుం బ్రశ్నింపం॥గోరి పాదార్చన మాదిగాంగలపూజ॥లాచరింప
[2]వినయంబుమీఱంగ॥వేడుకమాటాడ నెట్లులభించెనో ॥ యెఱుంగందర మె!

---

* "ద్వితస్త్రితశ్చైకతశ్చ బ్రహ్మపుత్రస్తథాంగిరాః" అని మూలము.

1 "నహ్యమ్మయాని తీర్థాని నదేవా మృచ్ఛిలామయాః, తే పునం త్యురుకాలేన దర్శనా దేవ సాధవః" శ్లో. 2 కింస్వల్ప తపసాం నృణా మర్చాయాం దేవచక్షుషా" శ్లో. "అర్చాయాం ప్రతిమాయాం దేవ ఇతి చక్షుర్దృష్టి ర్యేషాం." వ్యాఖ్య.

జలమయతీర్థముల్ శిలలుగా మృత్తికగా నున్న ప్రతిమలు గనిన యంతఁ
బావనతం బొందుట భంగిఁ జేయంజాల వయ్యవి చిరకాల మరుగ నట్లు

తే. చేయఁజాలును; సాధువుల్ చేరి భక్తిఁ
గనినయంతనె వారలక్షణములోనఁ
బావనులఁ జేయుదురు మహాత్త్వంబు నెన్న
శక్యమే మాదృశులకు నే చందమునను. ౧౧ 1930

చ. హుతవహసూర్యచంద్రులు మహోత్తమతారక లుర్వి వారి మా
రుతములు నంబరాంబువులు రూఢమనస్సును వాక్కు నివ్వియుక్
సతతము భేదమై వెలయు జ్ఞానము గల్గఁగఁ గారణంబులో
హితమతులార! వీని నెవఁడెంత యుపాసన మొప్పఁ జేసినన్. ౧౧౫ 1931

ఆ. భేదమూలమహాచు వితతమా నజ్ఞాన,ముక హరింపఁజాలవనఘు లౌ మ
హాత్ము లోకముహూర్తమంతమాత్ర మెకొల్వ,నయ్యఘుంబుఁద్రోతురనుటనిజము.

*సీ. వాతపిత్తశ్లేష్మవంత మస్థిరమునౌ నట్టికళేబరమందు నాత్మ
బుద్ధియు, మఱి సతీపుత్త్రాదులెల్ల స్వీయులను బుద్ధియును, మృత్తోన్నుపలమయ
విగ్రహంబులయందు విబుధబుద్ధియు, జలములఁ దీర్థబుద్ధియుఁ గలిగి మిమ్ముఁ
బోలు సాధువులపై బుద్ధి యట్టిది నిల్పనట్టియజ్ఞుఁడు చక్కనరయఁ బశువు

తే. లందు గర్దభమేయగు ననుచుఁ బలుక
నసమమేధస్సుగల యట్టియాపరాత్ప
రుని సుడుల నాలకించి కృష్ణునకు నవ్వి
యననురూపంబు లని యాత్మ నరసి మునులు. ౧౩౪ 1933

క. మనసులు భ్రాంతిని బొందం,గను గొండొకసేపు చింతఁగాంచి యవల నీ
వనజాతుఁడు లోకవ్రజ,మును గావఁగఁ బూని తన్ను భూతేశునిగన్. ౧౮

క. నరులెల్లఁ దెలియకుండఁగఁ, బరతంత్రుని యట్టు లిట్లు పలుకుచు నున్నాఁ
డరరే! యని తలపోయుచు, హరిని జగద్గురుని సుస్మితాస్యము లలరన్. ౧౫

చ. పలికిరి; దేవనాయక ప్రపంచములన్ సృజియించు వారిలో
పలఁ గడునేర్పు గల్గినప్రభావమునం దగుదీవు, తత్త్వవే
త్తల గణమందు నెన్నిక నితాంతము గాంచినవారమయ్యు నీ
యలఘుతరైకమాయ మము నల్లనఁగప్పఁగ మోహ మొందుచున్. ౧౫౪

* "యస్యాత్మబుద్ధిః కుణపే త్రిధాతుకే స్వధీః కళత్రాదిషు భౌమ ఇజ్యధీః, యత్తీర్థబుద్ధి స్సలిలేన కర్హి చిజ్జనేష్వభిజ్ఞేషు సఏవగోఖరః" అని మూలము. "భౌమే భూవికారే. ఇజ్యధీః దేవతాబుద్ధిః. గోఖరః=గోష్వపిఖరః, దారుణోఽత్యవివేకీ" అని వ్యాఖ్య.

ఉ. మానుషవేషమూని తగు ౹ మాన్యతముల్ నిను గూఢతత్త్వనిర్
గానఁగ నేరమైతి మిటఁ ౹ గాదె విచిత్రము మీచరిత్ర, మో
దానవసూదనా! ధరణి ౹ తా ఘటముఖ్యవికారపంక్తిచేఁ
గానఁగనౌ ననేకవిధ౹గాత్రసమాఖ్యల నట్లె నీవునున్. ౧౬ 1937

తే. అద్వితీయుఁడవే యయ్యు ౹ నక్రియుండ
వయ్యు నాత్మేచ్ఛచేఁ బెక్కు౹లాహ్వయములు
రూపములు నేర్పడఁగ బహు౹రూపములుగ
జగము నిర్మించి పాలించి ౹ సంహరించి. ౧౬½ 1938

క. పలుమఱు నిట్లేచేయుచు, వెలయుచు నద్దానియందు ౹ వింతగ బంధం
బుల నొందుచుందు; వారయ, జలజాక్షా! పూర్ణుఁడవయి ౹ సర్వజ్ఞుఁడవై. ౧౭

క. సకలేశుఁడవై యెప్పుడు, ప్రకటైశ్వర్యునకు నీకుఁ ౹ బట్టుబడిన యీ
సకలజననాదికర్మములు, నొకయాటయె గాక యుండు ౹ నొక్కో దేవా! ౧౭ 1940

క. నీవనఁగఁ బరమపురుషుఁడ, వై వెలయుచు నైజలీల ౹ ననవరతము నిర్
సేవించు భక్తజనులను, బ్రోవను దుష్టాలినెల్లఁ ౹ బొడవడఁగింపన్. ౧౭½ 1941

క. కులముల నాశ్రమముల నీ, యిలనిల్పను దేహమును గ్ర౹హించితి వౌరా!
జలజాక్ష! సనాతనమై, చెలంగు నామ్నాయపథము ౹ చెడక నిలువఁగన్. ౧౮

క. పరిరక్షింతువు; మఱి యో, పరమేశా! నీదుమహిమ ౹ భావింపంగాఁ
దరమగునె? కార్యకారణ, పరమై సన్మాత్రమైన ౹ బ్రహ్మం బరయన్. ౧౮ 1943

సీ. తపము సంయమము స్వా౹ధ్యాయము ననునీనియందుపలబ్ధమౌ ౹ నట్టివేద
మగును నీదౌ నమ౹లాంతరంగము; కాన వేదప్రమాణకుఁ ౹ డై దలిర్చు
నీ కెన్న నుత్తమ౹నియతోపలబ్ధి సంస్థాన మై మఱియు వేదప్రవర్త
కమునయి యెసఁగెడు ౹ త్మాదేవకులమును బూజింతు నీవు; కా౹వున మహాత్మ

తే. నీవు బ్రహ్మణ్యవరుఁడవై ౹ నియమ మూని
కర్మముల నాచరింతువు ౹ కమలనాభ!
యరయ నిశ్శ్రేయసములకు ౹ నవధి వగుచు
సాధుగతివయి యెసఁగి య౹సమతఁ దనరి. ౨౦ 1944

క. అమలుఁడవునైన నీతో, సమాగమం బాత్మపుణ్య౹సంగతిఁ గనుటన్
గమలాయతాక్ష! మాజన్మమునకు విద్యకుఁ దపంబు౹నకు నేఁటి కిలన్. ౨౦½

క. జ్ఞానమునకు సఫలత్వము, మానుగ సిద్ధించె; యోగ౹మాయాచ్ఛన్నం
బౌ నిజమహిమం బొప్పఁగ, నేనెలవున వెలయుచున్న ౹ హితరూపునకున్. ౨౧

క. అతులితమేధస్సునకు, ప్రతిహతశక్తికిని గృష్ణ౹భగవంతునకున్
నతు లొనరింతుము; దేవా!, క్షితినాథులు వీర లిట వ౹సించియు నీతోన్. ౨౨

క. నినుఁగూడి యెప్పు డుండెడు, ఘనపుణ్యముగల్గి మిగులఁ ◊ గ్రాలెడు యదువీ
రనికరము మాయయనెడు య,వనిక మఱుఁగునందు నున్న ◊ భగవంతు నినున్.

క. కాలాత్మకుఁ బరమేశ్వరు, నేలీలం దెలియఁజాల ◊ కిటు లున్నా రో
పాలితలోకేశ్వర! నతి, జాలం బిదె కొనుము, భక్తిసరణిగ నెలమిన్. ౨౫

వ. మహాత్మా! నిద్రించువాఁడు స్వప్నావస్థయందుఁ దన్నుసింహవ్యాఘ్రాదినామ
రూపములం గని తద్రహితుం డైనవానిగా నెఱుంగంజాలనిరీతి మానవుఁడు
నామమాత్రసారంబులగు నింద్రియార్థంబులం దగిలి భవన్మాయకుఁ దనచిత్తంబు
విభ్రాంతినొంద వివేకరహితుండై నిన్నెఱుంగ నేరఁడు. సకలపాపవిధ్వంసన పరమ
పవిత్ర తీర్థాశ్రయంబై సమ్యక్పరిపక్వయోగీంద్రమానసధ్యేయం బై వెలయు
నీపాదపంకజంబును నేఁడు గనుంగొనం జాలితిమి. భక్త్యుద్రేకంబున యోగులు
లింగశరీరమును వదలి భవదుత్తమగతిం బొందిరి. కావున నీపాదభక్తుల మగుమ
మ్మనుగ్రహింపు మని ప్రార్థించి శ్రీకృష్ణుని ధృతరాష్ట్రయుధిష్ఠిరప్రముఖభూపాల
కుల నామంత్రణంబు నేసి యమ్మునులు స్వాశ్రమంబుల కరుగందలంచి రంత. ౨౬

మునులను వసుదేవుఁడు జ్ఞానమునడుగుట.

చ. అనుపమమహాయశంబుగల ◊ యావసుదేవుఁడు వారిచెంతకుం
జని ప్రణమిల్లి వారిపదసారసముల్ తమి సంగ్రహించి నె
మ్మనము సమాహితంబయి యమానుషతత్త్వము సంగ్రహించుకాం
క్ష నమరియుండ నిట్లనియె ◊ సర్వసుపర్వవరాత్ములై ధరన్. ౨౭ 1951

తే. ధర్మరక్షణతత్పరతం జెలంగు, నో మహాత్ములార! మీకురుతరంపు
భక్తి వందనములఁ జేయువాఁడ నెట్టి,కర్మ మొనరుపఁ దొలఁగునో ◊ కర్మవితతి.

క. ఆయర్థము తేటపడం,జేయుఁడు నా కిప్పుడంచుఁ ◊ జేమోడ్చు తగన్
న్యాయవిధిఁ బ్రశ్న చేసిన, నాయెడఁ దగుమునుల కిట్టులను నారదుఁడున్. ౨౯

ఉ. ఈవసుదేవుఁ డోక్షితిసురేశ్వరులార! రమేశు నర్భకుం
గా నగచేన్ మనంబునను ◊ గావున నాత్మకు శ్రేయ మెట్లుగా
నావహిలున్ వచింపుఁ డని ◊ యర్థము దాని నెఱుంగఁ గోరియే
యీవిధిఁ బ్రశ్న సేసెడి నిదెన్న విచిత్రముగాదు సుంతయున్. ౩౦ 1954

క. తలఁప ననాదరకారణ, మిల సామీప్యంబె నరులకెపు డగు గంగా
జలములకుఁ జెంతనుండు ప్రజలు పావనతజ్జలము లసారము లనుచున్. ౩౦౪

తే. వాని విడనాడి యాత్మపావనతఁ గోరి
యితరతీర్థంబులకుఁ బ్రీతి ◊ నేగునట్టు
లున్న దిది తలపోయఁగ; ◊ నుర్వి నింత
కన్నఁ జిత్రంబుగలదె యొక్కరణిఁ గనిన. ౩౧ 1956

సీ. కాలలయోత్పత్తికముఖంబులను మఱిదనయంతఁ గారణాంతరముచేత
గుణమున నెవనియకుంఠితాత్మవిభూతి చెడకుండునో యట్టిశ్రీనివాసు
హరిని గర్మక్లేశపరిపాకములచేత నవ్యాహతంబగు నసుభవంబు
గల యీశ్వరుని ఫుల్లకమలపత్రాక్షుని నద్వితీయుని స్వకార్యములయి తగ

తే. నట్టి ప్రాణాదులను దుహినాంబుదోప
రాగములఁ బద్మబాంధవుఁ డేగతిఁ దగు;
నట్ల ప్రచ్ఛన్నుఁడైన యీయచ్యుతుని న
రునిగ నితరుండు దలఁచు నంచని వచింప. ౩౩ 19

చ. విని మునులెల్ల నిట్టులగు వింతయె లే దనుమంత యిందు నం
చని వసుదేవునిం బిలిచి యందఱు రాజులు కృష్ణరాములున్
విన నిటుపల్కి; రార్య! యిఁక వీనులవిందుగ నాలకింపు శ్ర
ద్ధను గని సర్వయజ్ఞవిభుఁ డామరసాక్షుని గృష్ణు నీశ్వరున్. ౩౪ 19

చ. క్రతువులఁ దృప్తిచేయుటను గర్మమొనర్చినఁ గర్మశాంతియౌ
హితమగు మార్గమిద్ది యగు నెల్లవిధంబుల నంచుఁ బెద్దలౌ
దృతిమెయి నిర్ణయించి; రిదియే తగియుండును జిత్తశాంతికై
చ్యుతిగననట్టి సత్పదము నొందఁగఁజేయు నుపాయ మిద్దియే. ౩౫ 19

క. సులభోపాయం బాత్మకుఁ, గలుగం దగుతుష్టి కిదియె కారణమౌ ని
స్తులధర్మము నగునని పెద్దలు శాస్త్రము లెల్ల నరసి తత్త్వజ్ఞులునై. ౩౬ 19

తే. నిర్ణయించిరి; దొరకిన నిర్మలధన
మున నె నిష్కాముఁడయి శ్రద్ధఁ గనుచు సర్వ
యజ్ఞపతిని నారాధించు టనెడుకర్మ
మదియె ద్విజుఁడగు సాధుగృహస్థునకు. ౩౭ 19

క. శ్రేయోమార్గం బిదియే,యౌ; యజ్ఞప్రతతి యీవి యనువానిని శా
స్త్రోయతనియతి నొనర్చుచుఁ, బాయఁ దగు ధనేషణను బ్రబాధక మగుటన్.

సీ. గృహములయందుండి యెలమిఁబొందఁగఁదగు భోగంబులను దారపుత్త్రరూ
మగునీషణను; దనుకవంతముఁ గాంచఁగఁ గాలముచేతఁ గల్గంగఁదగిన
స్వర్గాదిలోకేచ్ఛఁ జను వదలంగ; విజ్ఞానసంపద గల్గుసాధుమతులు
గ్రామములందు నీక్రమమగు నిచ్ఛాత్రయంబును వదలి తపంబు సేయ

తే. వనములకుఁ బోయి; రిల ద్విజుఁ డనెడువాఁడు
దేవమానులకుఁ బితృతతికిని మూఁడు
ఋణములు గలాఁడుగాఁ బుట్టు నిట్లు పుట్టి
వానిఁ దీర్పంగవలయు సద్భావ మూని. ౩౮ 19

క. క్రతువుల నధ్యయనంబున, సుతోదయంబునను వాని ◊ సొరిదిం దీర్పక
హితమగు; వానిం దీర్పక, క్షితిఁ దిరుగునతండు దుర్గతిం బడుఁ జుమ్మీ! ౭౯ 1964

క. మునిపితరుల ఋణములఁ దీర్చినవాఁడవె యజ్ఞములను ◊ జేసి సురలయ
ప్పునుదీరిచి యనృణుఁడవై, తనరి నికేతనము వే వదలుము మహాత్మా! ౮౦ 1965

చ. పలుకులు వేయునేల? దృఢ ◊ భక్తిని బూర్వభవంబునందు నా
జలరుహనాభుఁ దన్విలివి ◊ చక్కని పూజలఁ గాన దానికిఁ
ఫలముగ దేవదేవుఁడగు ◊ బ్రహ్మము మీ కిపు డాత్మజుండుగా
వెలసె నటంచు మౌను లిటు ◊ వేడుకఁ జెప్పిరి చిత్తశాంతికై. ౮౧ 1966

వసుదేవుఁడు జన్నము లొనర్చుట.

తరలము. అనుచు మౌనివరేణ్యు లాదృతి ◊ నర్హమౌ విధిఁ దెల్పఁగా
వనజనేత్రుని తండ్రి తత్పద ◊ వారిజంబుల కెంతొ వే
డ్కను బ్రణామము లాచరించి తగం బ్రసన్నులఁ జేసి మీ
రనుమతింపుఁడు నాయొనర్చెడు ◊ యజ్ఞముల్ విధియుక్తిగన్. ౮౨ 1967

తే. నిర్వహింప ఋత్విజులయి ◊ నియతిమీఱ
నుండఁ దగునంచు వరియించె ◊ నుత్తమమ్ము
లైన కల్పమ్ము లగునట్టి ◊ యజ్ఞములను
వార లా క్షేత్రమునయందె ◊ వరుసమీఱ. ౮౩ 1968

సీ. సర్వవస్తువులను ◊ సత్వరంబుగఁ గూర్చి చేయింపఁ బూనంగ ◊ నాయదుకుల
వరులు సుస్నాతులై ◊ నిరుపమాలంకారముల నొప్పి క్రతువస్తువుల గ్రహించి
సాయమై నిలువంగ ◊ సారసహారముల్ వారికంఠంబుల ◊ భాసిలఁ గని
సర్వవస్త్రంబుల ◊ నాదృతి ధరియించి ధరణీశ్వరులు మణి◊దామములను

తే. జక్క ధరియించియుండిరి ◊ సాయపడఁగ, నంత వసుదేవపత్నులు ◊ నమలరత్న
పదకములు కంఠములఁ గ్రాల ◊ ధన్యవస్త్రములను గట్టి సుగంధచూర్ణల నలరుచు,

*క. కనకము వెండిని గ్రముకములను హస్తముల ధరించి ◊ లలితగతుల శా
లను జొచ్చిరి; తత్సమయంబున భేర్యానకమృదంగములు శంఖములున్. ౮౪

క. మొరయించిరి నటవర్యులు, సురుచిరముగ నాటలాడు ◊ సుదతులు సభ్యుల్
కర మానందము నొందెడు, కరణిగ నాట్యంబు చేయఁగా మాగధులున్. ౮౫

క. సూతులు నట్టి నుతించిరి, చేతోముద ముబ్బుచుంటఁ జే గంధర్వ
వ్రాతము పటియుతి గళరవ, మాతతి నెల్లరు నుతింపనలరుచుఁ బాడన్. ౮౬

క. క్రతుశాల రాణులం గని, హితమగు నియమంబుమీఱ ◊ నెలమిని ఋత్వి

* "వస్తుపాణయః" అని మూలము. "హిరణ్యం రజతం చాపి గృహీత్వా క్రముకం ఫలం, తాలాంబరే ద్యుజ్జ్వలస్త్రీ శ్చ సేయుం స్త్వన్యథా సురాః." అని వ్యాఖ్య.

గ్వితతియు వారలనేత్ర, ద్వితయము నంజనముఁ బూసి దిద్దిరి చక్కన్. ౮౬౪

క. నవనీతలేపనముచేత వపువులకు లేపనంబుఁ దగినవిధిం జే
య వఱలు పదునెనమంద్రను, సవిధిం గూడుకొని కృష్ణజనకుం డపుడున్. ౮౭

క. తారాసంయుక్తుం డౌ, నీరజరిపుమాడ్కి నొప్పె; నియతిఁ బుత్వి
గ్వార మ్మభిషేకం బ, వ్వారికిఁ గావించి తగినవస్త్రము లిడియున్. ౮౭౪ 1975

చ. వలయములున్ మణీఖచితభాసురహారము లట్టినూపురం
బులు మణికుండలంబులును బూజ్యతమేతరసత్కలాప మి
మ్ములనొసఁగంగ వానిఁగొని భూపతి భార్యలతో ధరించి ని
స్తుల విభవాభిరాముఁడయి శోభిలె నిట్టులు దీక్షఁ బూనఁగన్. ౮౮ 1976

సీ. ఎలమి బుత్విక్సదస్యులు నూత్నకౌశేయవస్త్రముల్ ధరియించి వాసవాధ్వ
రమునందు నెట్లువిరాజిల్లిరో యట్లె యలరారి; రంత జీవాళి కధిపు
లగు రామకృష్ణులు నాత్మజాతకళత్రబంధు సంయుతులయి పరమనైజ
విభవానురూపత విలసిల్లి; రంతట మునివరు లాత్విజ్యమును యథార్హ

ఆ. గతిని నిర్వహింపఁ గ్రతువున నుత్తమ, నియమమూని కృష్ణుని జనకుఁడును
సర్వవిధులఁ గ్రతువుసాగించి హరిఁ దృప్తుఁ, జేయఁ దలఁచె ముక్తిసిద్ధిఁ గోరి.

వ. జ్యోతిష్టోమ దర్శపూర్ణమాసాదులగు ప్రాకృతములను, వానివలన వైకృతములగుసౌర్యసత్త్రాదికంబులను ద్రవ్యమంత్రతంత్రేశ్వరుం డగుయజ్ఞపురుషుం బ్రతియజ్ఞమున నారాధించి శాస్త్రవిధిని మీఱక బుత్విజులకుసంపూర్ణదక్షిణల నమూల్యగోభూములను గన్యకల నొసంగి సంతుష్టులంగావించె. అంత నాబుత్విజులు పత్నీసంయాజావభృథవిధానంబుఁ బడసి రామహ్రదంబున యజమానపురస్సరులై యవభృథస్నానంబు చేసిరి. వసుదేవుం డిట్లు లవభృథస్నానంబునొనరించి వందిజనులకు వస్త్రాలంకారాదులనిచ్చె; స్త్రీలునట్లే దానంబులొసంగి యలంకృతలైరి. అంతవారు సర్వవర్ణములకును *శునకములకుంగూడ నన్నదానంబు చేసి బహుమానంబుల నొసంగి సంతుష్టులం గావించిరి. మఱియు నావసుదేవుండు విదర్భకోసలకురుకాశికేకయసృంజయాదులైనబాంధవులకును దత్పత్నులకును దత్పుత్రులకును సదస్యులకు బుత్విజులకును దేవతలకును మానవులకు భూతపితృచారణులకు నుచితరీతి నుత్తమపారితోషికంబు లొసంగె. ఆసత్కారంబుల నంగీకరించి మహానందమునొంది శ్రీనివాసుం డగుకృష్ణమూర్తి వీడుకొని యధ్వరంబులఁ బ్రశంసించుచుంబోయిరి. ధృతరాష్ట్రవిదురులును, పాండవులును, గుంతిదేవియు, భీష్మద్రోణప్రముఖులును, దక్కంగలసుహృద్బంధువులును, నారదవ్యాసమహర్షులును స్నేహాతిశయంబున యాదవులం గౌఁగిలించుకొని సౌహృద

* "తత స్స్వలంకృతో వర్ణానాశ్వభ్యోఽన్నేన భూజయన్" అని మూలము.

బలంబున వారివదలిపోవ నొల్లక యెంతో కష్టంబునం బోయిరి. తక్కుంగలజనులు నట్లే వారినెడఁబాయఁజాలక మరలిమరలి చూచుచుం దమతమనెలవుల కరిగిరి. నందగోపాలుండు రామకృష్ణోగ్రసేనాదులచే నర్చితుండై బంధురవాత్సల్యంబున నాగోపాలకులంగూడి యందే కొన్నిదినంబులుండుటయు వసుదేవుండు మనోరథమహార్ణవంబుం దరించి సుహృదులుం దానుం బ్రియంబంది నందుని హస్తంబు పట్టుకొని యిట్లనియె. ౬౦ 1978

శా. అన్నా! మానవకోటి కీశ్వరుఁడు స్నేహంబన్న పాశంబుఁ దా
నెన్నన్ రాని నిజోరుశక్తియుతి నొక్లేమీఱరా నట్లుగా
విన్నాణంబున నేర్పఱించెఁ గద! యీవిశ్వంబునం గీర్తిసం
పన్నుల్ శూరులు బల్మి వానిఁగొని త్రెంపంజాల రొక్కింతయున్. ౬౧ 1979

ఉ. జ్ఞానముచేత యోగిగణసత్తములైనను వానిఁ ద్రెంపఁగాఁ
బూన రశక్తులౌట నని బుద్ధిఁదలంచెద; నుత్తమోత్తముల్
గా నెఱినొప్పు మీరలు నొకం డొనరించిన మేలి దంచు నే
మే నెఱుఁగంగఁజాల కిటులెట్టులొ గాలముపుచ్చు మాపయిన్. ౬౨ 1980

చ. ఉనిచినమైత్రి యిట్టిదని యూహనొనర్పఁ దరంబుగానిదా
నన నిఁక దానికిన్ బదు లిదంచు నొనర్పఁగలామె? దానికీ
డనఁ దగునద్ది యెద్దిగల దట్టులె యయ్యును మైత్రియద్ది యిం
కను జెడకున్నదే పొగడఁగాఁ దగియుండెడుఁగాదె యెప్పుడున్. ౬౩ 1981

మ. మును కంసక్షితిపబ్రువుం డొగి మముం బోనీక యేఁచంగ నే
పనికిన్ మే మసమర్థతం గనుటచే భద్రంబులన్ మీకుఁ జే
యను లేకుంటిమిగాదె యిప్పుడు ప్రభూతైశ్వర్యగర్వాంధతం
గనులంగానఁగఁ జాల మేరినయినం గానన్ సుహృత్సత్తమా! ౬౪ 1982

క. మీ మేలుం బరికింపక, యీమెయి నున్నార మింతయే మాచరితం;
బోమానద! యిల శ్రేయస్కాముల కీరాజ్యభూరిసంపద లెపుడున్. ౬౫

ఆ. కలుగ కుండుఁగాక! కన్నుగానక దాన, సాధుజనుల బంధుజనుల నతఁడు
గానకుండు; ననుచు గాఢసౌహృదమున, మనసు విన్నఁబోవ మాటరాక.

క. ఆనకదుందుభి తత్కృత,మౌ నుపకారము స్మరించి యక్షియుగము పై
పైనీరు గ్రమ్మఁ జింతం, గానం జేయంగ నేర్చెఁ గడు నాతురుఁడై. ౬౭ 1985

ఉ. నందుఁడు మిత్రవర్యుఁడె యనందగు కృష్ణునితండ్రి కల్మిగో
విందునకున్ బ్రలంబుఁడను వీరునిజంపిన రామమూర్తి కా
నందముఁగూర్చుచుం బ్రతిదినంబుఁ బ్రయాణముచేయుచున్ సుహృ
ద్బృందము లిష్ట మానుఁడని యెంతయు వేడఁగ నాదరించుచున్. ౬౮ 1986

క. నేఁడని రేపని పయనం, బూడని బాడంగ యదువు ఽ లొప్పఁగఁజేయన్
మూఁడునెలల్ నివసించెను, దోడం జరియించు సుతులఽతో క్షణ మట్లుల్. ౬౬

సీ. అంతట వసుదేవుఁ ఽ డాయుగ్రసేనుండు కృష్ణోద్ధవులు హాలి ఽ యింకఁగల్గు
నుత్తమబంధువు ఽ లొప్పుగ మేలగు నాభరణమ్ముల ఽ నంబరముల
బహుపరిచ్ఛదములఁ ఽ బారిబర్హంబుగ నిచ్చి కామితములఽనెల్లఁ గూర్చి
సాగనంపఁగ బంధుఽసమితితో గోపాలకులతోడ నానందుఁ ఽ డెలమి మిగులఁ

తే. బయనమై పోయె; నందగోఽపకులు వారి
వనితలు ముకుందచరణాంబుఽభవ యుగమున
మనసు లెంతయుఁ దవిలియుంఽడ నెటు వాని
మరలుపం జాల కేగిరి ఽ మధుర కెట్లొ. ౬౯ 1988

[తే.పాండవులు కుంతియును బ్రీతిఁఽబద్ధ నేత్రుఁ,డనుమతింపఁగ నేత్రముఽలందు బాష్ప
వారినిండ డగ్గుత్తికఁ ఽ బలుకురామిఁ, జనిరి స్వపురంబునకు బంధుఽజనులగూడి.]

వ. ఇట్లుబంధువు లెల్లఁ బయనముచేయ వానకాలం బాసన్నమగుట యెఱింగి హరిదేవతలగు యాదవులెల్ల ద్వారకానగరంబునకుం జని యందుఁ గలవారల కెల్లఁ దీర్థయాత్రయందుసాగిన వసుదేవుని యజ్ఞానుష్ఠానము సుహృజ్జనదర్శనము లోనగు గాథలం దెలియంజేసి రంత. ౭౧ 1990

---

ఎ ను బ ది రై యె ద వ య ధ్యా య ము.

చ. అని హరిశక్తితెల్పఁ దగుఽనాచరితంబు వచించి యాశుకుం
డనియె మహీతలేశ! యిఁక ఽ నవ్వలిదౌ హరిసచ్చరిత్రమున్
విను మొకనాఁడు రాముఁడును ఽ వెన్నుఁడు వచ్చి యడంకువన్ దమం
తన యభివాదనంబులఁ బఽదంబులఁ బూజలఁ దన్పఁ దండ్రియున్. ౪ 1991

చ. పరమముదంబునన్ సుతుల ఽ భవ్యగుణాకరు లంచు మెచ్చుకొం
చురుతరతత్త్వభావముల ఽ నొప్పుగఁ దెల్పు మునీంద్రవాక్యలన్
నిరుపమతత్పరాక్రమము ఽ నెమ్మదిఁ జక్కఁదలంచి వారినా
దరమునఁ జేరఁబిల్చి వితఽతం బగునాశయ మొప్ప నిట్లనున్. ౨ 1992

సీ. శ్రీకృష్ణ! శ్రీకృష్ణ! ఽ సిద్ధయోగీశ్వరా! సంకర్షణా! మహాఽసత్త్వ! యోస
నాతనా! మీర లీఽభూతలమునకుఁ బ్రధానపూరుషు లని ఽ నే నెఱుఁగుదు
నీజగం బెవనియం ఽ దెవనిచే నెవ్వని సాధనత్వంబునఁ ఽ జక్క నెవని
వలన, నెవరికొఱ ఽ కలరు నెవ్వనిదయి యెట్టికర్మంబుగ ఽ నెట్టిదగుచు

తే. నేర్పడునొ యట్టిదానికి ఽ నెల్లఁ గార
ణమయి తగుచును భోక్తృభోఽగ్యముల కరయ

గా నియామకుఁడగుచు నఖండతేజుఁ
డైన యీశ్వరుఁడవు నీవె యగుదువుగద! ౪ 1993

వ. అధోక్షజా! యిట్లు నానాప్రకారంబులఁ బ్రపంచమును సృజించి యాత్మేచ్ఛం జేసి యందుఁ బ్రవేశించి ప్రాణం బనంజను క్రియాశక్తిచేతను జీవుండనంజను జ్ఞానశక్తిచేతను ధరింతువు. విశ్వమ్ములఁ బుట్టించు ప్రకృతిముఖ్యంబులగు శక్తులన్నియుఁ బరతంత్రత్వంబును, బరస్పరవిసదృశత్వంబును గారణంబులుగాఁగ నాత్మశక్తులే యగు. ప్రకృతి లోనగు వానివ్యాపారంబు చేష్టామాత్రంబ కాని శక్తిగాదు. చంద్రునికాంతియు, నగ్ని తేజంబును, సూర్యునిప్రభయు, నక్షత్రతటిల్లతల స్ఫురణసత్తయుఁ, బర్వతములస్థిరతయు, భూమియాధారత్వగంధములును, జలముల తర్పణప్రాణనంబులు, నాజలములును, రసంబు నీవేయగుదువు. దేవాదిదేవా! వాయువు నోజస్సహచేష్టాగతులు నీవ యగుదువు. దిక్కులును, వానియవకాశంబు నీవకాదే? ఆకాశంబును, దదాశ్రయంబగు స్ఫోటంబు నీవే? నాదము, వర్ణ, మోంకారము, నాకృతిపృథక్కరణంబగు వైఖరియు నీవేయగుదువు. మఱియు నింద్రియములవిషయప్రకాశనశక్తియుఁ, దదధిష్ఠాతృదేవతలును, దదధిష్ఠానశక్తియు, బుద్ధిధర్మంబులగువ్యవసాయప్రతిసంధానశక్తులును, భూతకారణంబగు తామసాహంకారమ్ము నీవే? మహాత్మా! ఇంద్రియకారణంబగు రాజసాహంకారము నీవే? దేవకారణం బగుసాత్త్వికాహంకారమును, జీవసంసారకారణంబగు ప్రధానమును నీవేయగుదువు. పరమేశ్వరా! ఘటకటకకుండలాదివికారద్రవ్యములు నశించినను మృత్తికాసువర్ణాదిప్రకృతిద్రవ్యము నిత్యముగ నుండులాగున నీభావములన్నియు నశించినను నీవు శాశ్వతుండవై విలసిల్లుదువు. సత్త్వరజస్తమోగుణంబులును వానివృత్తులును బరబ్రహ్మస్వరూపుఁడ వగునీయందు యోగమాయాకల్పితంబులు. కాఁబట్టి నీభావములు మిథ్యాభూతంబులేయయ్యు వికల్పంబు లగుచు నీలోపలం బ్రతీతిమాత్రంబునం దోఁచుచుండు. నీవును వీనిలోనం గారణత్వమున ననుగతుఁడ వగుదువు. అంతియకాని పరమార్థదర్శనమున వికల్పరహితుఁడవగునీవే శేషింతువు. నిష్ప్రపంచంబగు నీసూక్ష్మగతిం దెలియంజాలక యవిద్వాంసులు కర్మముల గుణప్రవాహంబున సంసరింతురు. యాదృచ్ఛికంబుగా దుర్లభంబగు సన్మనుష్యజన్మముం గాంచియు నీమాయవలన నాత్మార్థమున నేమఱుచు నింతకాలము వ్యర్థముగఁ బుచ్చితిని. వీఁడు నేను నాయది యను దేహసంబంధిపుత్త్రాదివిషయకస్నేహపాశముల నీవీజగంబులను బంధింతు వనిపలికి మఱియు నిట్లనియె.

క. ధరణీభరము హరింపఁగ, ధరణీశుల రూపుమాపఁ దలఁచి మహిమముం
గరముఁ గనంబడనీ కవ,తరించితిరి మీరు మాయ తా నొడఁగూడన్. ౧౭౪

క. అరయఁగఁ బ్రధానపురుషే,శ్వరు లగుదురు గాని యాత్మసంభవు లీనా కే

వరుసం గా రీవిషయము, హరి; నీవే చెప్పితివి గదా! యొకచోటన్. ౧౭ 1996

తే. ఆర్తబాంధవ! యాపన్నులైన వారి, కమరుసంసారభయము నోయ్యమునఁ బాపు
నీపదాబ్జయుగమ్మును నేను భక్తి, నాశ్రయించితిఁ గాపాడవయ్య నన్ను. ౧౭౪

చ. తనువున నాత్మబుద్ధియును దద్విషయంబునఁ బుత్త్రబుద్ధియుఁ
గని యిట నింతదాఁక మదిఁ గాంచినయీవిషయైకతృష్ణ యో
వనరుహనేత్ర! చాలు నిటువంటిది వేళోకఁ దుండఁబోదు నే
ర్పున భవకూపమందుఁ బడఁద్రోయఁగఁ గావునఁ జాలు నిద్దియున్. ౧౯

తే. ప్రతియుగంబున నాత్మధర్మంబుఁ గావ
మాకుఁ గొడుకుగ జన్మించు నీకడింది
విషయ మానాఁడు సూతికావేశ్మమునను
నీవె వచియించినాఁడవు గావె కృష్ణ! ౧౯౪ 1999

మ. సురమార్గం బటులే యసంగుఁడవుగా శోభిల్లుచుఁ నీవె యీ
శ్వర! నానాతనువుల్ ధరించుచును వేవానిం గ్రియాంతంబునఁ
బరివర్జించుచు నుందు వెల్లయెడలఁ వ్యాపించు నీవై మహ
త్తరమై యొప్పు విభూతిమాయ నెఱుఁగఁ దత్త్వాత్మ! శక్యంబొకో! ౨౦ 2000

చ అని వసుదేవుఁ డివ్విధి మహామతి నెంచి వచింపఁ జక్కఁగా
విని వనజాయతేక్షణుఁడు విష్ణువు దండ్రినిఁగాంచి యెంతయుఁ
వినయవినమ్రుఁడై స్మితము వింతగ మోమునఁ గన్పడంగ ని
ట్లనియె మృదూక్తు లుల్లసిలునట్లుగ; నోజనకా! మహామతీ! ౨౧ 2001

చ. సుతులను మమ్ముఁగూర్చి యిటు శుభ్రతమాయతత్త్వ సారవా
క్కృతి నుపదేశ మిచ్చితిరి; ధన్యుల మైతిమి; సర్వవేదస
మ్మతమగు నద్ది; యార్య! యొకమాట వినందగు; నేను మీర లీ
హితమతి నాదునగ్రజుఁడు నీపురవాసులుఁ జక్క నెంచినన్. ౨౨౪ 2002

క. స్థావరజంగమ రూపం, బౌవిశ్వం బిదియు బ్రహ్మమగు నని మది సం
భావింప దగియుండును, భూవాయ్వాకాశముఖ్యభూత వరంబుల్. ౨౩

వ ఘటాదిభౌతికపదార్థంబుల నావిర్భావతిరోభావంబుల బహుభంగులం దోఁచు చందంబున నద్వితీయుండును, స్వప్రకాశుండును, [1]నిత్యుం డన్యుండు నిర్గుణుండు నగునాత్మయు నాత్మసృష్టములగు గుణంబుల చేతఁ దత్కృతదేహంబులందు బహుప్రకారంబులం దోఁచుచు నావిర్భావతిరోభావాల్పత్వానల్పత్వైకత్వ నానాత్వంబులఁ గాంచు నని భగవంతుఁడు బోధించిన వసుదేవుం డాకర్ణించి భేదబుద్ధిం దొలంగి సంప్రీతచేతస్కుండై మిన్నకుండె నంత. ౨౬ 2004

1 "నిత్యోఽన్యో నిర్గుణో గుణైః" అని మూలము. "అన్యః అన్యత్వేన" అని వ్యాఖ్య.

### రామకృష్ణులు తల్లికి మృతపుత్త్రులనుజూపుట.

సీ. ఒకనాఁడు సుగుణాళి । నొప్పినదేవకి సర్వదేవాత్మయై । క్షమజనించి
నదిగాన దనపుత్త్రు । లాదృతి గురునకు మృతపుత్త్రకుని దెచ్చి । యిచ్చిరనుట
విని విస్మయంబంది । మును కంసుఁ డదయుఁడై చంపిన తొలి తను । జనికరంబుఁ
దలఁచుకొంచును దుఃఖ । సలిలంబు లక్షుల నిండియుండఁగ రాము । ని హరిఁ బిలిచి

తే. దైన్య మొప్పఁగ నిట్లను । దలఁప నెట్లు, తగని యాత్మ చెలంగు నో । ధన్యమూర్తి!
రామ! శ్రీరామ! యోగీశ్వ । రప్రభూ! వ,నరుహాలో చన! కృష్ణ కృ । ష్ణ పరమేశ. ౨౯ 2006

చ. మనసులఁ దోఁచినట్లు బహు । మానము మీఱఁగ సంచరించుచున్
మునిమతమైన శాస్త్రతతిఁ । బూనిక మీఱఁగ దాఁటి కాల మొ
య్యనఁ దమసత్త్వముం జెఱుప । నారయ భూమికి భారభూతులే
యనఁదగియున్న భూవిభుల । నందఱఁ గూల్పఁగ మీర లిర్వురున్. ౨౯ 2006

తే. జగములన్ సృష్టిచేసెడు । సరసిజభవ
పూగమున కీశులై యాది । పూరుషు లగు
మీరు నాగర్భమునఁబుట్టి । నార లంచు
నే నెఱుంగుదు మున్ను నీ । యెడను మదిని. ౩౦ 2007

వ. ఎవ్వానియంశాంశాంశభాగమ్మున విశ్వోత్పత్తిస్థితిలయంబు లగుచుండు నట్టి నిన్ను శరణుచొచ్చితిని. గురుపునానతిఁ జిరకాలమునకు మున్నే మృతినొందిన తత్కుమారుం దెచ్చి గురువర్యునకు గురుదక్షిణ యర్పించితిరి. అట్లే కంసునిచే హతులగు నా ప్రథమకుమారుల మీమూలమునం జూడఁగోరియున్నదాన. యోగీశ్వరేశ్వరులుగాన నీనావాంఛితంబుఁ దీర్పందగునని దేవకీదేవి పలుకుటయు. ౩౩

చ. జనని మనోరథం బెఱిఁగి । చయ్యన వారలు యోగమాయనుం
గొని సుతలంబుఁ జేరి; రటఁ । గూర్మి వసించెడు దైత్యనాయకుం
డనుపమశక్తిరాజితుఁడు । నౌ బలివిశ్వగణాత్మభూతులై
తనకుఁ బ్రియంబు గూర్పఁదగు । దైవములై తగు రామకృష్ణులన్. ౩౪ 2009

చ. కనుఁగొని వారిదర్శన మ । ఖండమనఃప్రమదంబుఁ గూర్ప ది
గ్గనఁ బరివారయుక్తుఁడయి । గాఢతరం బగుభక్తి లేచి వం
దన మొనరించి పీఠములఁ । దప్తసువర్ణమయంబులన్ సుఖం
బున వసియింపఁజేసి పద । ముల్ గడిగెన్ సలిలంబులన్ విధిన్. ౩౫ 2010

క. కమలజముఖులకుఁ దత్పద, కమలంబులఁ గడిగినట్టి । కమలములు శుచి
త్వముఁ గూర్చుఁగాదె వానిని, దమవారింగూడి తలను । ధరియించెఁ దమిన్. ౩౬

సీ. ఉత్తమాంబరముల । సురుచిరాభరణాళి ననులేపనముల మా । ల్యముల ధూప
దీపాదులను మఱి । దివ్యామృతోపమభక్ష్యభక్షణమున । బహువిధములఁ

బూజించి తనకులమును ధనంబును దన్ను నర్పించి ప్రేమార్ద్రమైన చిత్త
మున భగవత్పదవనరుహంబుల మాటిమాటికిఁ దలఁచి సమ్మదముఁ బొంగఁ

తే. గనుల నానందజలములు । గ్రమ్ముచుండ
బహుళరోమాంచములు మేనఁ । బర్వ గద్గ
దస్వరంబున నిటుపల్కెఁ । దత్పరతను
సకలలోకాధినాయకా! । చక్రహస్త! ౩౮ 2012

వ. అనంతుఁడవై, ఫణైకదేశమున విశ్వమును ధరించు నీకునమస్కారము. జగద్విధా
తవై సదానందరూపుఁడవై, సాంఖ్యయోగవితానస్వరూపుఁడవై పరమాత్మయగు
నీకువందనము. మీదర్శనము భూతములకుఁ బరమదుర్లభంబయ్యు సాధువులకు
సులభంబగు. కావుననే రజస్తమస్స్వభావులగు మాకు యాదృచ్ఛికంబుగ
లభించె. దైత్యదానవ గంధర్వులు సిద్ధవిద్యాధరచారణులు యక్షరక్షఃపిశా
చంబులు భూతప్రమథనాయకులు మేమును శాస్త్రగమ్యుండవై శుద్ధసత్త్వ
ధాముఁడు ననందగునీయందు నిత్యవైరముం బాటించి భవదీయసాలోక్యాదిసా
త్మత్వములం గాంచిరి.సంసారకారణంబు భావంబేకదా.*నిర్భరవైరంబునం బుట్టిన
భక్తింజేసి శిశుపాలాదులు కొందఱును, గామంబునంజేసి గోపికాదులు కొంద
ఱును నీకుసన్నిహితులైనట్లు సత్త్వావిష్టులగు దేవాదులు కారు. యోగేశ్వరే
శ్వరా! యోగేశ్వరులుంగూడ నిది యిట్టులని నీయోగమాయ నెఱుంగనేరరు.
ఇఁక మావంటివారలం జెప్పనొననేటికని పలికి మఱియు నిట్లనియె. ౪౪ 2013

సీ. కంజాతనేత్ర! నిష్కాములకుంగూడ సంమృగ్యమైన నీచరణపద్మ
ముల యాశ్రయముకంటెఁ । దలఁప నన్యంబయి యాలయంబను పేరనమరునంధ
కారావృతంబగు । కఠినకూపముఁ బాసి సాధువిశ్వమునకు । శరణములగు
తరువులమొదటఁ దఱద్దయు నివాసముచేసి తమయంత రాలినవిమలఫలము

తే. ఖములచే దేహయాత్రను । గడపుకొనుచు
శాంతినూనుచు నొకఁడనే । సర్వసఖుల
గూడియేఁ జరియింప నాకుఁ గృపమీఱ
ననుమతి నొసంగుమా? కృష్ణ! । యమరవంద్య! ౪౫ 2014

క. పరమేశ! సకలజీవేశ్వర! మాకుం బనియొసంగి । సరగునఁ బాసో
త్కారములఁ దొలఁగింపుము నీ, పరమాజ్ఞను దలధరించి । భక్తి వెలయఁగన్.

ఆ. సంచరించు పురుషోత్తమునకు విధి, బంధనము నిషేధబంధనమ్ము
వదలి పోవు ననిన । భగవంతుఁడవ్వాసు,దేవుఁ డిట్టు లనియె । భావమలర.

* "కేచనోద్బద్ధవైరేణ భక్త్యా కేచన కామతః, నతథాసత్త్వసంరబ్ధా స్సన్నికృష్టా స్సురాదయః" ౪౩ అని మూలము. "కేచన చైద్యాదయః. కామతో భక్త్యా గోప్యాదయః". అని వ్యాఖ్య.

క. స్వాయంభువమన్వంతర, మేయెడఁ దగియుండె నప్పుడే మునినాథుం
డై యలరు మరీచికి నూ,ర్ణాయోషారత్నమునఁ దనయషట్కము వొగిన్. ౪౮
క. జనియించి రట్టియమరులు, వనజాసను స్వాత్మజయయి వాసి మిగులఁ గాం
చినయట్టి సరస్వతివాం,ఛను గూడంగోరువాని జూల్మునిఁ గనుచున్. ౪౭ 2018
తే. పరిహసించిరి; తద్దుష్టభావమునవె, యసురయోనిని బొంది రయ్యదనునందె
పుట్టిరి హిరణ్యకశిపునిపుత్త్రు లగుచు, వారినే యోగమాయ యభంగశక్తి.
క. కొనివచ్చి దేవకీ కుక్షిని జేర్చెను వార లంతఁ జెచ్చెఱ జననం
బును గాంచి కంసహతులై, చనుదెంచిరి నీదుకడకు సద్భక్తవరా! ౪౯ 2020
క. నీకడనున్న వా రిపుడు నిర్భరశోకపరీతచిత్త యై
యేకరణిం దదంతము నదేవిధిఁ గానఁగలేక తల్లి మ
మ్మాకరుణాఢ్య! పంపఁగ మహాహోత్సవము మూనియె వచ్చినార మా
శోకము దీర్ప నామెతోలిసూనులఁ దోడ్కొని పోవ కోర్కితోన్. ౫౦ 2021
వ. స్మరుఁ, డుద్గీథుండు, పరిష్వంగుండు, పతంగుండు, క్షుద్రభృత్తు, ఘృణియు
నను నీయాఱుగురు మత్ప్రసాదమున శాపసంతాపంబుఁ బాసి సద్గతిం గాంతు
రని పలికిన నాబలిచక్రవర్తియు వారి నర్చించుచు నవ్విధంబున నొసంగె.
సోదరు లంత వారిందోడ్కొని ద్వారకానగరంబున కరుదెంచి తల్లికి నివేదించి
రంత. ౫౧ 2022
చ. తనయులఁ గాంచి స్నేహమునఁ దత్క్షణమే చనుజంట చేపఁ గై
కొని తమిఁ గౌఁగిలించుకొని గ్రుచ్చి తొడన్ వసియింపఁజేసి చ
క్కని తల మూరుకొంచు వడిఁ గాఱెడుపా ల్గుడువంగఁ జేసి లో
కనిచయసృష్టిహేతువయి క్రాలెడు శ్రీహరిమాయ కప్పఁగన్. ౫౨ 2023
క. సమ్మోదముఁ గాంచెను; వా,రమ్మాధవపీతశిష్టమగు పయసుఁ గడున్
నెమ్మనము లలరఁ ద్రావియు, సమ్మదమున హరిశరీరసంస్పర్శమ్మున్. ౫౩ 2024
క. పలుమఱు గాంచియు నాపు,త్త్రులు నాత్మజ్ఞానయుక్తితోఁ గృష్ణునకున్
హలికిఁ దలిదండ్రులకుఁ గర,ములు మోడ్చి నమస్కరించి భూతాళిగనన్. ౫౪
క. సురధామ మొందిరి; రంతటఁ, జిరకాలము క్రింద మృతినిఁ జెందిన పుత్త్రో
త్కర మేతెంచుట పోవుట, పరికించి సువిస్మయంబు పర్వఁగ మదిలోన్. ౫౫
తే. దేవకీదేవి యదియెల్లఁ బావనతమ
విష్ణుమాయాప్రభావమే వేఱుగాద
టంచుఁ దలఁచె; ననంతవీర్యమునననగు
నట్టి పరమాత్మ శ్రీకృష్ణుఁ డనినియుండు. ౫౬ 2027
క. ఒనరించిన యద్భుతకా,ర్యనిచయ మెంతేని గలదు రాజేంద్రా! యం

చును శుకయోగివరుం డొగి, వినిపించుట సూతమునియు ౯ వేడ్కమునులకున్.

సీ. తెలిపి యీరీతిని ౯ బలికె నో మునులార ! నిర్మలకీర్తియౌ ౯ నీరజాక్షు
చరిత మీయది యెన్న ౯ జగదఘహార మగు సద్భక్తకర్ణైక౯చారుభూష
ణమగు సుఖావహ ౯ మమలాత్మవిజ్ఞానదము నగు; వ్యాసపుత్ర౯వర వర్ణి
తమగు నిద్దాని నా౯దరమున నెవ్వండు వినునో వేఱొకరికి ౯ వేడ్కమీఱ

తే. దెలుపునో వాఁడు హరియందు ౯ దృఢముగ మది
నిలిపి భయరహితంబయి ౯ నిర్మలమగు
తత్పదముఁ బొందు నని తెల్పి ౯ తా నిమీలి
తాక్షుఁడయి యుండె; నంత నా౯యవనివిభుఁడు. ౫౯ 2029



ఎనుబదియారవయధ్యాయము.

సుభద్రాకల్యాణము.

చ. విని శుకయోగిచంద్రుఁ గని ౯ వేగమ యిట్లని ప్రశ్న మొప్పఁజే
సెను బలభద్రకృష్ణులకుఁ ౯ జెల్లెలు నాజనకాంబయౌ సుభ
ద్రను మునినాథ! [1]యర్జునుఁడు ౯ తాను వరించె వివాహమయ్యె నె
ట్లని వినఁగోర్కె యయ్యె నన ౯ నాశుకయోగి వచించె నివ్విధిన్ ౧ 2030

మ. వినవయ్యా! విజయుండు తీర్థముల సేవింపంగ లోనెంచి భూ
మిని సంచారముచేయుచుఁ గనుచు మేలెల్లెంచుఁ గీర్తించుచుఁ
జనుచుఁ వేడ్కఁ బ్రభాసతీర్థవరముఁ ౯ జక్కంగ దర్శించి యా
త్మను దా నెంచెను మాతులాత్మజ సుభ౯ద్రన్ భద్రచారిత్రనున్. ౨ 2031

[2]క. తక్కంగల వారలపలు, కొక్కటియుం గొనక రాముఁ ౯ డుద్యమమునఁ దా
నొక్కఁడె దుర్యోధనునకు, నక్కన్నియ నీయఁదలఁచె ౯ ననియుఁ వినియెన్. ౨౪

ఉ. మాతులపుత్రి నెట్లయిన ౯ మానక తాఁ బడయంగఁ గోరికం
జేతము పొంగ రాముఁ డటఁ ౯ జేయుప్రయత్నము నిష్ఫలంబుగా
నీతఱిఁ జేయనౌ ననుచు ౯ నెంచి త్రిదండిగ నొప్పుభిక్షువై
యాతతరూపగోపనము ౯ నద్భుతశక్తి నొనర్చుచుఁ జనెన్. 3 2033

క. తనకార్యము సాధింపంగను బూనియె యందు వార్షి౯కములను ఖ్యాతిం
గను నెలలునాల్గు నివసిం,చెను బౌరులు తన్నుఁ బూజ౯చేఁ దనుపంగన్. 3౪

క. ఈతం డిట్టిండనుచుం, జేతమునం దెన్నకట్టి ౯ శ్రీరాముండుఁ
బ్రీతిమెయిం బూజించె మ,హాతిథియని నమ్మి విధిగ ౯ నతిభక్తిమెయిన్. ౪ 2035

1 "యథోవయేమే విజయో యా మమాసీ త్పితామహీ" అని మూలము. 2 "దుర్యోధనాయ రామస్తాం దాస్యతీతి వచాపరే" అని మూలము.

చ. బలుఁ డొకనాఁడు గేహమును బావనమౌ నటుచేయుఁడంచు ని
మ్ముల యతివర్యు నాకపటమూర్తి నెఱుంగక వేఁడి శ్రద్ధచే
నిలయముఁ జేర్చి భైక్ష్యమిడ నెమ్మి భుజించెను సంయమీంద్రుఁడై
వెలసినయర్జునుండు మది వింత గదా యిది యంచు నెంచుచున్. ౫ 2036

*ఉ. వీరవతంసచిత్తముల వేడుక నిట్టటు లూఁగులాడఁగాఁ
జారుతరాంగసంగతిని జాణతనంబునఁ జేయు కన్యకా
కారమహార్హరత్నము నొగాదిగఁ గాంచుచు నేత్రకంజముల్
భూరితరంపుఁబ్రీతిమెయిఁ బొంకముగా వికసిల్ల నల్లనన్. ౫౪ 2037

ఉ. జవ్వనులందు మిన్నయగు త్ష్మాస్థలి నూతనసృష్టియౌ నిదే
యివ్వనితావతంస మొకఁడే లభియించినఁ జాలదే సుఖం
బవ్వల వేఱొకండు గలదంచుఁ దలంపఁగనౌనె యంచు లో
జవ్వనిపై విరాళిగొని స్వాంతము నిల్పఁ గలంగుచుఁ గడున్. ౬ 2038

ఉ. ముద్దులగుమ్మ యామె ననబోఁడులమెత్తని మానసంబులం
దద్దిర! సమ్మదామృతము హారితరంబుగ నిండఁజేయుచుఁ
ముద్దుఁడువోలె నున్న యలమోసపుసంయమిఁ గుంతిసూను న
ట్లొద్దికఁ గాంచి కన్గొనల నొప్పెడు సిగ్గున నుంత నవ్వుచున్. ౭ 2039

ఉ. ఆనవమోహనాంగుపయి నాత్మహృదబ్జసరోజయుగ్మముఁ
బూనికమీఱ నిల్పి పతిబుద్ధిఁ జెలంగినదయ్యె నిట్టు లా
మానిని మోహనాంగుఁడును మాననికోర్కులనుండి; రాపృథా
సూనుఁడు నన్నుమిన్నయయి శోభిలునట్టి సుభద్ర నెంతయున్. ౭౪ 2040

చ. మదిని దలంచుకొంచు నొకమాడ్కి మరల్పఁగ రాక యెప్పుడుఁ
గదురునితాంతకామమున గాఢతరం బగుతాప మొందుచుఁ
మదవతి సంగ్రహించి చనుమార్గ మదెయ్యదొ యంచు నెంచుచుం
టఁ దనకు రామముఖ్యులు కడంగి యొనర్చెడునట్టి పూజలన్. ౮ 2041

తే. సుంతయేఁ గాంచఁడయ్యెను సుఖమతండు;
దైవయోగంబునం జేసి తానె వచ్చె
దేవతోత్సవ మొక్కండు భావిసత్ఫ
లమును సూచించుచుఁ; దుముకలముగ నపుడు. ౮౪ 2042

ఉ. యాదవులెల్లఁ బత్తనము యాత్రనుజూడఁగ వెల్వడంగ స
మ్మోదమునఁ సుభద్ర రథముఁ వడిసెక్కి పురైకభూరిడు

* "సోఽపశ్య త్తత్ర మహతీం కన్యాం వీరమనోహరాం, ప్రీత్యుత్ఫుల్లేక్షణ స్తస్యాం భావక్షు
బ్ధం మనో దధే" అని మూలము.

గ్గాదిమతోరణస్థలము నల్లన దాఁటెడు నంతలో నరుం
డాదిమపూరుషానుమతి నంతకుఁ బూర్వమె పొందియుండుటన్. ౯ 2043

క. దేవకియుఁ వసుదేవుఁడు, భావము లలరంగ మంచిబంధుత్వమె యా
నీవిజయున కిచ్చుటయని, శ్రీవిభునాశయమె తారు చెందియు నుంటన్. ౯

చ. సమయ మిదే యటంచు హరిసంజ్ఞను దెల్పుట వేగపోయి యా
కమలదళేక్షణఁ బలిమిఁ గైకొనిపోయె; మహారథుం డతం
డమరపతిప్రదత్తమగు నా పెనుచాపము గాండివంబు స
జ్యముగ నొనర్చి స్యందనమునందుఁ జెలంగుచు వేడ్కమీఱఁగన్. ౯౪ 2015

మహాస్రగ్ధరః—

ఇదియేమో హేతువో నంచితని బలిమి నెత్తేని పోనీకపట్టం
గఁ దగుంగా యంచు శూరుల్ కదిసి నలుగడల్ గానరాకుండఁ బూఁగన్
మదినెంతేఁ బూన్కిమీఱన్ మదవతి కనియాత్మన్ ముదం బందుచుండన్
బ్రదరంబుల్ గూర్చి వైవన్ బరుగిడిరి భటుల్ పంతముల్ వీడి యార్తిన్.

ఉ. వారలపాటుగాంచి యదువర్యులు బిట్టుగ మొత్తిపెట్టఁగా
భూరిమృగాళినుండి మృగభూపతి స్వాంశముఁ గొంచుఁబోవు న
ట్లారమణిన్ సుభద్రఁ గొని యర్జునుఁ డేగెను; వార్త యద్దిదు
ర్వారబలాఢ్యుఁడైన బలభద్రుని కర్ణములం జొరంబడెన్. ౧౦౪ 2042

*చ. తనప్రియసోదరిన్ బలిమిఁ దాఁ గొనిపోయెఁ బృథాసుతుండు నాఁ
వినఁబడినంత రాముఁ డెద భీతికరంబగు కోపమూనెఁ బె
ల్చున జలరాశిపర్వదినసంతతిఁ బొంగెడుమాడ్కి; నట్టులే
వనరుహనాభుఁ డాగ్రహము స్వాంతమునం గనఁడయ్యె సుంతయున్. ౧౧

ఉ. అంతియగాక మిత్రయుతుఁడై చని రాముని పాదయుగ్మ మ
త్యంతరుడగ్ని యూఱ వినయంబలరారఁగఁ బట్టుకొన్న దు
ర్దాంతపరాక్రముండయియుఁ దమ్ముని భక్తికి సంతసించి వే
శాంతి వహించె నాహలియుఁ జక్రధరుండును బొంగె నంతటన్. ౧౧ 2049

చ. హలధరుఁ డాసహోదరికి నాయమనాథున కెంతొ సమ్మదం
బలరఁగఁ బారిబర్హములు నర్ఘములేని విభూషణవ్రజం
బుల హయభద్రదంతిరథపుంజములన్ మఱి దాసికాజనం
బులఁ బనిపెన్; యదూద్వహులు మోదమునొందిరి బంధుకోటులున్. ౧౨

---

* “తచ్ఛ్రుత్వా క్షుభితో రామః పర్వణీవ మహార్ణవః, గృహీతపాదః కృష్ణేన సుహృద్భిః శ్చాన్వశామ్యత” అని మూలము.

## శ్రీహరి శ్రుతదేవమిథిలాధిపతుల ననుగ్రహించుట.

క. అని యీవిధి హరిచరితం,బును బల్కి శుకాఖ్యయోగిపుంగవుఁ డింకన్
వినిపింతు హరియనుగ్రహ,మును బొందిన వారిచరితమును రాజేంద్రా! ౧౨

మ. శ్రుతదేవుండను విప్రసత్తముఁడు కృష్ణున్ భక్తి ధ్యానించి యే
యితరార్థంబును గోరకుండ నిసుమంతేఁ గోర్కి లేకుంటఁ బూ
ర్ణతఁ బెంపొందుచు నుండె శాంతియనుసద్రవ్యంబె సాయంబుగా
నతఁడా సత్కవి తృష్ణ చెందనిమదిన్ హర్షించు నెల్లప్పుడున్. ౧౩ 2052

క. ఆతఁడు మిథిలానగరం,బే తనకున్ వసతిగాఁగ నెసఁగు విదేహా
ఖ్యాతవిషయమ్మునందున్, బూతచరిత్రుం డతండు పూజ్యయశుఁడు నా. ౧౪

సీ. అతఁడు గృహాశ్రమమందునుండియు నుంతయేఁ బ్రయత్నము చేయకే సమయ
ముచ్చుచుఁ దనయంతఁ బ్రాజ్యభంగిని దైవవశమున దొరకినవస్తువితతి [ముఁ
చేతనె యతిథులఁ బ్రీతిసత్కృతులను దన్పుచుఁ దాఁ జేయఁదగినయట్టి
సత్క్రియలను విధిఁజక్కసాగించుచు నుండె; నావిప్రవర్యుండు దేహ

ఆ. యాత్ర సాగవలయు నంత యాహారంబు
ప్రతిదినంబు దైవవశత దొరక
వలయు ననుచుఁ గోరువాఁడు దానికి మించి
కోరఁ డెన్నఁడేని ధారణీశ! ౧౫ 2054

చ. దొరకిన దానిచేత మదిఁ దుష్టిని గాంచుచు నర్హసత్క్రియో
త్కర ముచితంపుభంగిగనె తత్పరుఁడై యొనరించుచున్ వ్రజే
శ్వరచరణారవిందములఁ బాయనిభక్తిఁ జెలంగుచుండె; నో
ధరణిప! యావిదేహపతి దాంతుఁడు శాంతుఁడునై యెసంగెడున్. ౧౬ 2055

క. పేరున బహులాశ్వుండని, భూరిప్రఖ్యాతిఁ గాంచె భూపాలుఁ డతం
డారయ జనకునిసంతతిఁ, జేరిన వాఁడంచు నెఱుఁగు క్షితిపవరేణ్యా! ౧౭ 2056

క. నిరహంభావుండై తగు,; నిరువురుఁ దన్నగరవాసులే యచ్యుతుప
ద్సరసిజభక్తులె యాదురు, హరి భగవంతుండు వారినాదృతిఁ బ్రోవన్. ౧౮

చ మనసున నెంచి విప్రవరు మైథిలునిం గనఁబోవ నెంచుటన్
గనుఁగొని దారుకుండు ఘనకాంచననిర్మితమౌ రథంబుఁ దె
చ్చినఁ దమినెక్కి మౌనియుతిఁ జెచ్చెరఁ బోయెను; వామదేవుఁడున్
మునిపతియత్రినారదులు పూజ్యచరిత్రుఁడు వ్యాసమౌనియున్. ౧౯ 2058

సీ. భార్గవరామ గీష్పతులు కణ్వాసితు లరుణమైత్రేయులు చ్యవనముఖ్యు
లా కృష్ణుతో నేను నరిగితి మప్పుడు వార్త యాలింపు భూవరవరేణ్యా!
మార్గమం దందందు భార్గవాది గ్రహములఁ గూడి భాస్కరుం డలరునట్లు

మునివరేణ్యులఁగూడి పుండరీకాక్షుండు చనుదేరఁగాఁ బౌరులును జనపద

తే. వాసులును హస్తముల నర్ఘ్యవస్తువులను
బట్టుకొని యెదురుగ వచ్చి భక్తిఁ బూజ
చేసి; రానర్తమునఁ గురుక్షేత్రమందు
వంగపాంచాలములను ధన్వవిషయమున. ౧౯ 2059

వ. కుంతి మధు కేకయకోసలార్ణప్రముఖదేశంబులందును మఱియుఁ దక్షిణదేశ
ములయందును గలపూరుషులును నారీమణులు నమూల్యపూజాద్రవ్యంబులం
గొని స్మేరవిలోకనంబుల సుస్మితంబులం జెలువారు నా శ్రీకృష్ణుని ముఖసరోజ
లావణ్యరసంబుం దమిదీఱ నేత్రములం గ్రోలి రంత. ౨౦ 2060

క. లోకత్రయగురుఁ డగునా, శ్రీకృష్ణుఁడు తన్నుఁ జూడఁ జేరినవారిన్
శ్రీకలితదృష్టులం గని, కైకొనియెన్ వారిపూజఁ గడుఁ దృప్తిమెయిన్. ౨౧

*క. వారలకన్నులఁ గ్రమ్మిన, భూరితరాజ్ఞానరూపమునఁ దగుధ్వాంతం
బారసి కరుణాదృష్టుల, శ్రీరమణుఁడు పోవఁజేసి శ్రేయం బొసఁగెన్. ౨౨ 2062

క. నరసురగీతంబు దిగం,తరసంవ్యాప్తంబు మిగులధవళం బశుభో
త్కరనిర్వాపణదక్షము, పరమము నా స్వీయయశము బాగుగ వినుచున్. ౨౩

క. మెలమెల్లన మునిజనులం, గలిసి విదేహములఁ జేరెఁ గమలాక్షుఁడు ము
నులఁగూడి వచ్చెనని విని, యలరుచుఁ బౌరులును బల్లెలందలివారున్. ౨౪

చ. కరములఁ గాన్కలొప్పఁ గొని కంజదళాక్షుని బూజసేయు నా
దరమునఁ బూజకుం దగు నుదారసువస్తువులన్ గ్రహించి వ
చ్చిరి తమిపొంగఁగా నెదురు శ్రీహరి నుత్తమచారుకీర్తి శ్రీ
వరు మును విన్నయమ్మునుల భక్తిభరంబునఁ గాంచి యంతటన్. ౨౫ 2065

చ. ప్రమదమునన్ హృదబ్జములు తోరన్ వికసిల్లఁగ నంజలుల్ స్వశీ
ర్షములఁ జెలంగ మ్రొక్కిరి; విశాలకృపం దము నుద్ధరింప లో
కములకు నెల్లఁ దా గురుఁడుగాఁ దగు శ్రీహరి వచ్చెనంచు న్యా
యమె యగు నిద్ది యంచు నెదలందుఁ దలంచిరి వారలెల్లరున్. ౨౬ 2066

క. శ్రుతదేవమైథిలులు శ్రీ, పతిపాదసరోజయుగళిఁ బడి; రంతట భూ
పతియున్ శ్రుతదేవుఁడు సం, హతాంజలులై యాచు మ్రొక్కి రతిశయభక్తిన్.

చ. యదుకులనాథు నమ్మునులనందఱఁ బ్రీతిని నాతిథేయ మీ
సుదినమునందు నాగృహము శోభిలఁ జేయుచుఁ గైకొనుం డటం
చుఁ దగినయట్టు లిద్దఱును జొక్కపుభక్తిని వేఁడి; రంత న
బ్జదళవిలోచనుండు భగవంతుఁడు వారికిఁ బ్రీతిఁ గూర్పఁగన్. ౨౮ 2068

* "తేభ్య స్స్వవీక్షణవినష్టతమిస్రదృగ్భ్యః" అని మూలము.

క. ఇరువుర యామంత్రణమును, సరిగా నంగీకరించి సాధుమునులతో
నరిగెఁ వారిగృహంబుల, కిరువురు మోదంబునొంది కృతకృత్యులు నై. ౨౭½

మ. చని రవ్వారినిగూడి మాసదనమే సౌభాగ్యవంతంబు న
య్యె నటంచెంచిరి గాని వారెఱుఁగ రీవృత్తంబు శ్రీకృష్ణుఁ డెం
చిన దేమంచు; దురాత్మకుల్ వినుటకే సిద్ధింపదో యట్టిపా
వనచారిత్రము గల్గుమౌనులును శ్రీవైకుంఠుఁడుఁ వచ్చినన్. ౨౮½ 2070

చ. ధరణిపమౌళి యాసనవతంసములందు వసింపఁజేసి భ
క్తిరతిని స్వీయసద్యశము దిక్కులమించెడువాఁడు గాన శ్రీ
హరిఁగని మోద మాత్మఁదగ నతుల హర్షజలంబునిండఁ ద
చ్చరణసరోజముల్ గడిగి సాధుకుటుంబముఁగూడి శ్రద్ధతోన్. ౨౯ 2071

సీ. విశ్వపావనములఁ విఖ్యాతిఁ గాంచిన యాజలంబులఁ దలయందుఁ దాల్చి
గంధమాల్యాంబరాకల్పకృష్ణాగురుధూపమ్ములను మఱి దీపముల మ
హార్ఘ్యగోవృషముల నర్హావిధానము నమరునట్లుగ నీశ్వరాత్మకులను
వారలఁ బూజించె వార లాదృతిమీఱ నన్నంబుగుడిచిన యంతఁ దృప్తుఁ

తే. డైన శ్రీహరి దివ్య పాదాంబుజములఁ
నంకభాగముఁ జేర్చి కొం చప్పు డల్ల
నల్లనొత్తుచు హర్షంబు వెల్లివిరియ
మృదుమధుర వాక్కులం బల్కె నిట్లు నృపుఁడు. ౩౦ 2072

క. భూతాళి కంతరాత్మవు, చేతోభవజనక! కృష్ణ శ్రీహరి! కార్య
వ్రాతమునకు సాక్షివి సు, ష్మేతఱి నీయంత నీవె యొసఁగుదు ప్రభలన్. ౩౦½

చ. అమలభవత్పదాబ్జముల నాత్మస్మరించుచు నున్నమాకు నో
కమలదళాక్ష! దర్శన మఖండశుభప్రద మిచ్చినావు; ము
న్ను మధురవాక్య మొక్కపుడు సూత్నముదంబు నొసంగుదాని లో
కములకు మేలుగూర్పఁదగిగ్రాలెడుదాని వచించితేకదా! ౩౧½ 2074

క. ఏకాంతభక్తులే నా, కేకరణిఁ దలంచిచూడ హితులె యగుదు రా
శ్రీకాంత యనంతుం డజుఁ, డాకరణిం గారు ప్రీతికర్తు లటంచున్. ౩౨ 2075

క. ఆమాట సత్య మొనరిచి, తోమాధవ! మామకాక్షి యుగమునకుఁ నీ
వీమాడ్కిఁ గానవైతివి, భూమిని నీమాత్ర మెఱుఁగుపురుషుం డెవఁడేన్. ౩౨

క. తావక చరణాంభోజం, బేవిధమున విడువఁ డనుటయే నిక్కంబౌ
నో విశ్వేశ! యకించను, లై నశగతచిత్తులైన యట్టిమునులకున్. ౩౩ 2077

ఆ. ఆత్మడుండ వౌదు వవతరించితి విల, యదుకులంబునందు నతిభయభవ
తప్తులకు మహోగ్రతాపముఁ దొలఁగింప, జగదఘాలిహార నిజయశము హరి!

క. వెలయించితి వోదేవా!, జలజాక్షా! నీకు నతివిసర మిదియే యి
ష్టములఁ గైకొను దేవా! జగములకుఁ సుఖకారకుఁడగు ǂ భూతేశునకున్. ౩౪

ఆ. శాంతతపము సలుపు ǂ సాధుమానీంద్రున
కనుపమాన మేధసునకుఁ గృష్ణు
నకు మహాత్మునకును ǂ నారాయణునకు వం
దనము లివిగో దేవ! దయను గొనుచు. ౩౫ 2080

క. అనుపమరుచిరానందా!, దినములు మఱికొన్ని నాదు ǂ ధిష్ణ్యమ్మున నీ
మునివరులతో వసించుచు, ఘనచరణసరోజ రేణుకణములచేతన్. ౩౬ 2081

క. ఈ మా నిమివంశమ్మును, భూమిని బావనతఁ గాంచుపోలికఁ జేయం
గా మిముఁ బ్రార్థించెద నం, చామిథిలాధీశుఁ డిట్టు ǂ లభ్యర్థింపన్. ౩౭ 2082

క. విని లోకభావనుఁడు శ్రీ, వనజాక్షుఁడు మిథిలయందు ǂ వసియించెడు న
వ్వనితలకుఁ బురుషులకుఁ జక్కని కల్యాణంబు గూర్చు కాంక్ష వసించెన్. ౩౮

క. శ్రుతదేవ ద్విజవరుఁ డచ్యుతుఁ డాదృతి మునులతో స్వశుభసద్మమునకు
హితమతి విజయం చేయఁగఁ, గృతకృత్యుఁడనైతి ననుచు ǂ నెంచుచు భక్తిన్.

చ. జనకమహీంద్రుఁ బోల్కి మునిసంతతికిన్ హరికిన్ యథార్హమానం
దనములు సల్పి హర్షము నితాంతముపొంగ విడుల్చి చంబరం
బు నొడ లెఱుంగకుండ నటుపొందుగ నృత్యము చేసె; నంత నా
య్యనఁ దృణముఖ్యకల్పిత మహాసనముల్ పచరించి వానిపై. ౩౯ 2085

తే. వారి నాసీనులం జేసి ǂ భవ్యవచన
ములను స్వాగత మడిగి వారలచరణము
లను గళత్రముగూడి పావనజలములఁ
గడిగె; హర్షము పొంగ నాత్మాసురుండు. ౪౦ 2086

సీ. తనమనోరథము లెల్లను ఫలించినయట్లు తలపోయుచుం దదుదకములఁ గొని
భార్యను వంశంబు ǂ వారిని స్నానముఁ జేయించి మఱి తనశీర్షమందుఁ
జల్లుకొనియె; నంత ǂ సత్ఫలంబులు గంధపుష్పధూపాదికములగు వాని
వట్టివేళ్లను జేర్చినట్టి పావనతమశీతలామృతముల ǂ ఖ్యాతమృగమ

తే. దంబుఁ దులసియు దర్భలు ǂ తామరలును
సత్వగుణవృద్ధిదాన్నంబుఁ ǂ జక్క నొసఁగి
యింకఁ గలయుపచారమ్ము ǂ లేమియు శ్రమ
ము గనకుండ నారాధించెఁ ǂ బూజ్యమతిని. ౪౧ 2087

చ. ధరణిసురేంద్రుఁ డెంచె మది ǂ ధామమయోగ్రమహాంధకూపకాం
తరమునయందుఁ ద్రెళ్లి తగు ǂ నాకు రమాధిపుతోడనుం, బరా

త్పరునకు నుండఁ జోటొసఁగు ǂ భవ్యమతుల్ దగి తీర్థరాశికిన్
శరణములైన యంఘ్రుల రజస్తతి నొప్పుమునీంద్రకోటితోన్. ౮౧ 2088

క. కలిగెనొ సమాగమం బెట్టులు? చిత్ర మిదంచు లోఁ గడుం బూనికమైఁ
దలపోసె, నంత సుఖముగ, జలజాక్షముఖుల్ భుజించి ǂ సంతృప్తి దగన్. ౮౨

క. తమతమపీఠమ్ముల నుండ మహీదేవుండు పద్మనాభునిఁ దనగే
హమునకు వచ్చిన కరుణా, సముద్రునిం జేరి తనదుసాధ్వియు సుతులున్. ౮౩

క. తనరక్షణమున నొప్పిన, జనులును దన్ననుసరింపఁ ǂ జరణయుగము మె
ల్లనఁ బుడుకుచు నిట్లనియెన్, వనజాక్షా! పరమపురుష! ǂ భవభయహరణా! ౮౩

సీ. శయనించువాఁడు తనయవిద్యచే మది మహాకలోకము క్షణమాత్రముననె
స్వప్నమ్మున సృజించి ǂ సరగ నందుం జొచ్చి చరియించు నట్టులీ ǂ జగముల నిజ
మాయామహాశక్తి ǂ లేయెడఁ గన్పడఁ గల్పించి నీదగుఘనతరమగు
నాత్మసత్తారూప ǂ మమరగా నందు వెంబడిగఁ బ్రవేశించి ǂ వఱలు నట్టి

తే. శాశ్వతుఁడ వీవు మాకు దర్శన మొసఁగితి;
వంబుజాక్ష భవత్కథ ǂ లాలకించు
వారికిని సన్నుతించెడు ǂ వారి కట్టు
లర్చనము చేయు వారికి ǂ నాదరమున. ౮౫ 2092

క. ఇతరేతరసంవాదం, బతిశయముగఁ జేయువారి ǂ కభినందనస
త్కృతిఁ దగులువారికిం గృప, మతి వెల్గుదు వీవు సతము ǂ మహనీయగుణా!

వ. హృదయగతుండ వయ్యుఁ గర్మములచే విక్షిప్తమగు చేతస్సుగలమానవులకు మిగుల దూరమున వర్తింతువు. అహంకారాదివ్యవహితుండ వయ్యు శ్రవణకీర్తనాదిసేవాసక్తులకు సమీపమునందే యుందువు. మహాత్మా! నీవు కార్యకారణోపాధి నియామకుఁడవు. దేహాద్యభిమానముగల జీవునకు నప్రకాశుండవు. సంసారప్రవర్తకుఁడవు. దేహాద్యభిమాన విరహితజీవతాదాత్మ్యాపన్నుఁడవు. అధ్యాత్మవేత్తలకు మోక్షదాతవు. ఇట్టి నీకు నమస్కారములు. ౮౭ 2094

క. పరమేశా! నీకును గింకరులము శాసింపు మేము కార్యము మే మి
త్తరుణమునఁ జేయఁదగునో, త్వరపడి చేయంగము; నీదుదర్శన మబ్బెన్ ౮౮

క. దానన క్లేశము లేవియు, మానవులకుఁ గల్గ వింక ǂ మాయాతీతా!
యోనీరజాక్ష! యని యా, భూనిర్జరవర్యుఁ డిట్లు ǂ పొంగెడుభక్తిన్. ౮౯

తే. విన్నవించిన నాలించి ǂ దేవదేవుఁ
డగుచుఁ బ్రణతార్తిహరుఁడయి ǂ యలకృష్ణుఁ
డలఁతినవ్వు ముఖాబ్జంబు ǂ నలరఁజేయ
నతని కరమాత్మకరమున ǂ నమరఁ గొనుచు. ౯౦ 2097

చ. పలికె మహీసురేంద్ర! తమపాదసరోరుహరేణురాజి ని
మ్ముల సకలప్రపంచములఁ బూతములై తగునట్లుచేయుచుం
గలయఁ జరింతు రీమును లఖండముదంబున నన్నుఁగూడి యి
ష్టలరుచు వచ్చినారు నిను నాదృతిఁ జక్క ననుగ్రహింపఁగన్. ౯౦ 2098

[1]క. దేవతలును క్షేత్రంబులు, పావనతీర్థములు భక్తి స్పర్శనపూజా
సేవా దర్శనములచే, నేవారలు తమ్ముఁ గొలుతు రెలమిన్ వారిన్. ౯౧

క. చిరకాలమునకుఁ బావన,తరులుగ నొనరించు నవ్విరోధంబగుశక్తిం
బరఁగుట యెట్లన సాధూ,త్కరదర్శనముననె యనుచుఁ దలఁపన్ వలయున్.

చ. ధరణిసురుండు జన్మమునఁ దక్కినప్రాణులలోన శ్రేష్ఠుఁడౌఁ
బరమతపంబుఁ దుష్టియును బావనవిద్యయు నాయుపాసనా
దరమును గల్గియున్న నిఁక ధన్యతరుండని చెప్పనేల? యీ
కరములు రెండో నాల్గొ కలకాయము చక్కఁగలోఁ దలంచినన్. ౯౩ 2101

క. శ్రుతిసురకాయముకంటెన్, మతిమద్వర! ప్రియము కాదు మహితశ్రుతిసం
తతిమయుఁడు విప్రుఁడమరవి,తతిమయుఁడను నే నటంచుఁదలఁపఁ దగుఁజుమీ.

[2]సీ. ప్రతిమాదులందు నిర్జరదృష్టియేగల్గి కుమతు లీపద్ధతిఁగూడ నెఱుఁగఁ
జాలకయే విప్రసత్తమమూర్తినై గురుఁడనై యాత్మనై పరఁగుచున్న
నాపై నసూయ మానములందుఁ జొప్పింతు రర్చాదులందుఁ; జరాచరాత్మ
కమగు నీవిశ్వంబుఁ గడఁగి దీనికిఁ గారణములగు మహాదాదిసమితి మన్మ
తే. యములుగా నెంచి మన్మయుం డగుశ్రుతిసురుఁ
డాదృతిం గాంచు నితరు లట్లరయలేరు
బ్రాహ్మణోత్తమ! యిప్డు డీబ్రహ్మమునుల
శ్రద్ధ నర్చింపుమా యెల్లసమయములను. ౯౬ 2103

క. ఈరీతిం బూజించిన, నారాధన మద్ది మత్ప్రియంబు నిజముగా
భూరివిభూతుల నన్నే, యారాధించినను హర్ష మది నాకడునే? ౯౭ 2104

చ. అనిహరి యానతీయఁగ రమాధిపు నమ్మునివర్యులన్ ముదం
బున మదినొక్కరీతిగనె పోలఁ దలంచుచు సద్గతిం గనెన్;
జనపతి యట్లె శ్రీహరిని సాధుమునీంద్రులఁ బూజచేతఁ దృ
ప్తిని గనఁజేసి ముక్తిఁగనెఁ దెప్పున భక్తిభరంబు పెంపునన్. ౯౮ 2105

1 "దేవాః క్షేత్రాణి తీర్థాని దర్శనస్పర్శనార్చనైః, శనైః పునంతి కాలేన తదప్యర్హత్తమేక్షయా." ౫౨. అనిమూలము. 2 "బ్రాహ్మణో జన్మనా శ్రేయాన్ సర్వేషాంప్రాణినా మిహ, తపసావిద్యయాతుష్ట్యా కిముమత్కలయాయుతః" ౫౩. అని మూలము.

వ. పరీక్షిజ్జనపాలకా! భక్తవత్సలుండగు భగవంతుఁ డాయిపువురకుం బ్రీతిగావించి వసియించి స్వయంప్రమాణములగుశ్రుతులకుఁ బ్రవృత్తిప్రకారం బెఱింగించి వారల:నాశ్వాసించి యెట్టకేలకుఁ దనపయనంబునకు వారు సమ్మతింప ద్వారకానగరంబున కరిగె నని తెలుప శుకయోగీంద్రుంగని రాజేంద్రుం డిట్లనియె. ౪౯

ఎనుబదియేడవయధ్యాయము.

శ్రుతిగీతలు.

మ. ధరణీనిర్జరమౌని! బ్రహ్మవిదులం ॥ దథ్యంబుగా నెన్ననీ
పురువిఖ్యాతిని గాంచినాఁడవుగదా? ॥ యొక్కండు ప్రశ్నింప ని
త్తరుణం బుత్తమ మెద్దియన్న శ్రుతిసంతానంబు లేపద్ధతిం
బరికింపన్ గుణవృత్తులై యొసఁగుఁగా ॥ బ్రహ్మం బనిర్దేశ్యమా. ౧ 2107

ఆ. కరము నిర్గుణంబు ॥ కార్యకారణముల, కది యతీతమె యగు ॥ నట్టిబ్రహ్మ
విషయమందు నవి ప్రవృత్తినెట్లుగఁ గాంచెఁ, దెలుపవలయుఁ గరుణఁ దేటఁగ నన.

చ. విని శుకయోగి యిట్లనియె ॥ విశ్రుతకీర్తిధురంధరా! తమిన్
వినఁదగుఁ దద్విధంబు హరి ॥ విశ్వమునంగల జీవకోటికా
య్యనఁ దగు నర్థధర్మములు ॥ నట్టులె కామము మోక్షమన్నఖ్యా
తినిగని నాల్గు సంఖ్యఁదగి ॥ దివ్యములౌ పురుషార్థముల్ త్వరన్. ౧౪ 2109

సీ. సిద్ధింపఁ దనఁదగు ॥ చిత్తమందుఁ దలంచి సృజియించె నెట్లన ॥ క్షితిప! విషయ
భోగము సత్కర్మములయనుష్ఠాన మూయాలోకభోగము ॥ నమలతమము
గా నొప్పియుండెడు ॥ కైవల్యమను నివ్వియాఁ జతుర్విధపురుషార్థము లిల;
నివ్వి సిద్ధింప బుద్ధీంద్రియములు మనఃప్రాణము లను వేళ్లఁ ॥ బరఁగుచున్న

తే. యాయుపాధుల సృజియించె నని యెఱుంగ, నగు స్వరూపోపపాదనమందు లేక
యున్న మోక్షార్థసృష్టియుసన్నుతముగ, నన్వయింపదు నిక్క మీయదిమహాత్మ!

వ. వేదములు రూఢ్యాదులసాహాయ్యవృత్తిని బ్రహ్మబోధకములుగావు. ఐనను భగవదుద్దిష్టంబగు నపవర్గసమన్వయంబున గౌణవృత్తికల్పనంబు కర్తవ్యమేయగు. జహదజహాత్స్వార్థలక్షణావృత్తిగ్రహించి విపరీతాంశమును దొలఁగించి యనుగతంబగు చిదర్థముమాత్రము పరిగ్రహించి యుపనిషన్మహావాక్యములకు సమన్వయము సమకూర్పవలయు. ఈరీతిగా వేదములు నిర్గుణబ్రహ్మమును బోధించెడిని. ఉపనిషత్తు లివ్విధముగ బ్రహ్మపరములని యతిప్రాచీనులగు మహాత్ములు సిద్ధాంతము చేసిరి. కావున వితండావితర్కానభినివేశమున నెవ్వాఁడు శ్రవణాదులచే నీసిద్ధాంతమును మనస్సున ధరించునో యతండు నిరస్తదేహాద్యుపాధికుఁడై పరమపదముం బ్రాపించునని పలికి మఱియు నిట్లనియె. ౩ 2111

క. నారాయణమహానీంద్రుఁడు, నారదముని కెఱుఁగఁ దెలిపిరన్ భువి నదియున్
నారాయణగీతం బను, పేరం బ్రఖ్యాతిఁ గాంచెఁ బృథులార్థంబై. ౮ 2112

క. ఇతిహాస మద్ది యిట స, మ్మతిఁ దెల్పెద నీదు ప్రశ్నమండలికి సుదా
హృతమైన సమాధానము, క్షితినాథా! యమరియుండుఁ జెప్పెద నింకన్. ౮

క. వినుమీ భగవత్ప్రియుఁడౌ, మునిపతి నారదుఁడు లోకములఁ గ్రుమ్మరుచున్
దినమున నొక్కట నారా, యణమునిపతిఁ గాంచు వేడ్క నరిగెం దవ్వరగన్.

చ. అతఁడు సనాతనుండు మహితాత్ముఁడు గానఁ దదీయదర్శనం
బతులఫలం బొసంగునని యాశ్రమ మాదృతిఁ జేరె; నందు భా
రతమును వర్షమందలి నరప్రకరంబున కెట్లు క్షేమ మ
ప్రతిహత మోక్షలక్ష్మి యలరం దగు నావిధ మెంచుచున్ మదిన్. ౫ 2115

క. జ్ఞానము ధర్మశమంబులు, నా నెగడెడు వానిఁగూడి నారాయణుఁడన్
మానిశుం డాకల్పముఁ, బూనికఁ దప మొప్పఁ జేయఁ బూని నియతిమై. ౬ 2116

సీ. పరమమహానులు కలాపగ్రామవాసులు తనచుట్టునుండ సుస్థామతేజ
మమరఁగా బదరికాశ్రమమునఁ గూర్చుండి యున్న నారాయణు సన్నుతగుణుఁ
గాంచి వందనములు గావించి యీయర్థమే ప్రశ్న చేయంగ నెల్లమునులు
వినుచుండ నాతత్త్వ విద్వరుఁ డిట్లని యనువదించెను; బూర్వమున నొకప్పు
తే. డల్ల జనలోకసంవాసులైన పెద్దలకు సనందాదిబ్రాహ్మణులకు జరగిన
యట్టిసంవాదమునె యిట నసువదింతు, శ్రద్ధ వినవయ్య నారదసంయమీంద్ర!

చ. సనకసనందముఖ్య మునిసత్తము లాపరమేష్ఠిమానసం
బునఁ దలపోసినంతనె సుపుత్త్రులుగా జనియించి సత్తపం
బున నుతిగాంచి యింద్రియసమూహము నెల్లవశీకరించి మిం
చినయశ మొప్పఁ గాంచి రలసిద్ధతపస్వులు వారలొక్కటన్. ౯ 2118

క. జరపిరి బ్రహ్మవిచార, స్ఫురణంబున బ్రహ్మసత్రముగఁ బ్రఖ్యాతిన్
గర మొందినదాని నదే, తరుణంబున నీవు పుణ్యధామము లెల్లన్. ౯౫ 2119

క. కనుఁగొని శ్వేతద్వీపం, బున నొప్పుతదీశుఁ జూడఁబూని చనితి వం
దునుగల భూసురవర్యుల, కనూనవాదంబు సాగె నత్తరుణమునన్. ౧౦ 2120

క. శ్రుతులైకకంఠ్య మొందియె, యతిసుఖముగ నుండె; నన్ను నడిగిననీప్ర
శ్నతతియుఁ బరిహారము సం, స్తుతముగఁ గల్గె; నవి చెప్పెదన్ మునివర్యా! ౧౦

క. శ్రుతశీలతపస్సుల సము, లతిమాన్యులు స్వీయుఁ దరియు నటుమధ్యముఁడన్
క్షితిగల భేదము లెంచక, మతినెల్లర సములటంచు మన్నించు మునుల్. ౧౦౫

క. ప్రవచనయోగ్యులు వార, య్యు వక్తగా నందునొకని నొప్పించి సభా
భవనమునఁ దక్కువారలు, సవిధిగ వినుచుండి రెంతొ సహజకరుణచేన్. ౧౧

చ. అపుడు సనందనుండు సనకాదుల ప్రశ్నము లాలకించి యి
ట్లుపలికె నుత్తరంబుగ గడుంగడు శ్రద్ధయొసంగుచుండ స్వీ
యపరమశక్తు లెల్ల వెలయన్ మును దా సృజియించియున్న వి
శ్వపటలమున్ లయంబుతఱి । వారక తా నుపసంహరించుచున్. ౧౧౪ 2124

క. పరమాత్మ యోగనిద్రా, పరతన్ శయనించియుండ । బ్రళయాంతమునన్
మరలం దన్నిశ్వాసో,త్కర నిర్గతములగు శ్రుతినికాయము లెల్లన్. ౧౨ 2125

క. భగవత్ప్రతిపాదిత వా,క్యగణంబున నివ్విధమున । నాపరమేశుం
దగురీతిన్ బోధించెను, జగతీశేంద్రుండు నిద్రఁ । జక్కఁగ నొందన్. ౧౨౪ 2126

క. అనుజీవులు స్తుతిపాఠక, జనులెల్ల నుషస్సుతఱిని । సన్నిధిఁ జేరం
జని తత్పరాక్రమాదిక,మును దెల్పుచు మేలుకొలుపు । పోలికమీఱన్. ౧౩

.. అజిత! సర్వోత్కర్ష । మావిష్కరింపు మావిష్కరింపుము సర్వవిబుధవినుత
పాద! యానందాదిపటల మాచ్ఛాదింప గుణజాలములను గైకొని చరాచ
రాంగముల్ గల్గుజీవాళివ్యాపించిన యలయవిద్యను వేగపాలియఁ జేయు
సర్వశక్తులకును । జక్కని యుద్బోధ మొనరించుచున్న నీవౌ మహాత్మ!

తే. యాత్మరూపమునను । యమ్మాయవశమున, నుండఁ జేసికొనుచు । నురుతరంబు
లై చెలంగుచున్న । యైశ్వర్యముల నెల్లఁ, బడసినట్టి లోకపతివి గావె? ౧౩౪

. పరమేశ! సృష్టిలోనుగఁ, బరఁగెడు కార్యంబు లపుడు । పరికించియె నీ
వురుమాయాయోగమ్మున, నిరుపమమగు నాత్మవాంఛ । నెఱి విహరింపన్. ౧౮

. మనసునఁ గోరుదు వంతియ, యనఁగాఁదగుఁ గాని వశుఁడవై దానికి నీ
వును వర్తింప వటంచున్, ఘనముగ బోధించు నిగమకాండము లీశా! ౧౮

. వికృతులగు ఘటాదులకుం, బ్రకృతిద్రవ్యమగు మృత్స్నభవలయములు గ
ల్గుకరణి నీజగములకు న,వికారమగు బ్రహ్మరూపవిధివలనఁ దుదిన్. ౧౮౪ 2131

ఉత్పత్తిప్రళయంబులుగలుగు. వివర్తాధిష్ఠానత్వమునంజేసి బ్రహ్మం బవికారంబె
యగు. అట్లగుటంజేసి బ్రహ్మావశిష్టంబగు కారణమ్మున జగదీశ్వరు లనుచు నిరూ
పింపఁబడు నింద్రప్రముఖులెల్ల బ్రహ్మంబెకాని వేఱుగాదని పరతత్త్వదర్శనకుశ
లులగు ఋషులు మనంబున నిన్నే సర్వదా ధ్యానించుచు వచనముల నిన్నే
సన్నుతింతురు. భూమిమీఁదం దిరుగు మానవులు మృత్పాషాణేష్టకాదులయం
దు నెచ్చోటఁ బాదముపెట్టిన నద్దిభూమిపయింబెట్టి నట్టిదేయగుంగదా. కావున
నీవే సృజించినవాఁడుగాన నెవ్వని బోధించిన నిన్నే బోధించినట్లగును. ౧౯ 2132

. వనజాక్ష! సర్వకారణ,తను బరమార్థంబు నీవె । తత్త్వం బిదియే
యని నిశ్చయించి పండిత,జనములు లోకాలికలుషజాల మడఁచుచున్. ౧౯౪
పరమంబై నిరుపమమై, వరదానసమము నాథ । వర్ధివ్యక్షథో

త్కర పీయూష సరిత్పతిఁ, బరమాదృతిఁ జొచ్చి దుఃఖపాపవ్రజమున్. ౧౩౪

ఆ. అచిరకాలముననె యవ్యయా! త్రిగుణమా,యామృగీసునర్తకా! మహాత్మ!
వాపికొనిరి; మఱియుఁ బరమపూరుష! నీదు, కరుణఁ గనినవారు కాంత్రు సుగతి.

సీ. పరమా! స్వరూపసంస్ఫురణంబుచే మనోధర్మములనఁబడఁ దగినయట్టి
రాగాదుల మఱి జరాప్రముఖంబులఁ గాలధర్మంబులఁ గడఁకమీఱ
నిరసించి యవ్యయనిరుపమానందానుభవమైన నీస్వరూపమును భక్తి
సేవించు వారికిఁ జెప్పంగవలయునే పాపదుఃఖంబులు పాయు ననుచు;

ఆ. నీదుభక్తిఁగల్గు నృతతి జీవనసఫ,లత్వ మెలమిఁ గాంచు సత్వరముగ
భక్తి లేకయున్న శ్వాసమాత్రమె గల్గు, తోలుతిత్తులట్లు తోఁచుచుండు.

క. జననం బానరులకు ఫల,జనకం బేరీతిఁగాదు సర్వక్రియలున్
గను నిష్ఫలతన్ వారికి, ఘనభక్తియె కల్గియున్నఁగల్గు ఫలంబుల్. ౧౭ 2137

వ. వైశ్వానరాగ్నిరూపంబున జఠరానలభూతుఁడగు బ్రహ్మంబుచే నధిష్ఠితంబగుట నుదరంబు బ్రహ్మ మనంబడు. ఋషిసంప్రదాయమార్గంబులయం దెవ్వారు స్థూలదృష్టులగుదురో వా రుదరాలంబనంబగు మణిపూరకచక్రస్థితుండగు బ్రహ్మము నుపాసింతురు. ఈస్థూలదృశులు శార్కరాక్షులని శ్రుతులు ప్రతిపాదించు రజఃపిహితదృష్టులగుట శార్కరాక్షు లనంబడుదురు. ఉదరము హృదయాపేక్షచే స్థూలంబగుట వీరు స్థూలదృష్టులైరి. కూర్పశబ్దము సూక్ష్మార్థమునం బ్రయోగింపఁబడు. హృదయస్థసూక్ష్మమునే లక్షీకరించి తత్ప్రవేశంబుకొఱకుఁ దొలుత నుదరస్థుండగు బ్రహ్మము నుపాసింతురని యెఱుంగందగు. ఆరుణులు సాక్షాద్ధృదయస్థంబయి సూక్ష్మమగు దహరము నుపాసింతురు. నాడులు పరిసరంబు లనంబడు. వానిమార్గము పరిసరపద్ధతి యని విఖ్యాతంబు. అనంతా! యాహృదయమునుండి నీయుపలబ్ధిస్థానము సుషుమాఖ్యంబై పరమంబై యుత్కృష్టమై జ్యోతిర్మయంబై మూర్ధమునం బోదలు. మూలాధారమునుండి యారంభమై హృదయమధ్యమునుండి నిర్గమించి బ్రహ్మరంధ్రము నొందియుండు. ఆమార్గమునఁ బోయిన నీధామము గననగును. ఆనీస్థానమునొందినవారు మరల మృత్యుముఖంబునం బడి సంసారంబునొందరు. ౧౮ 2138

ఆ. ఆత్మనిర్మితంబులైన యుత్తమమధ్య, మాధమంబు లగుచు నమరి బహువిధముల నొప్పు కార్యతనువులయం దుపా,దానకారణతఁ బ్రథమమునం దె.

సీ. కలిగియుండిన నప్పుగాఁ బ్రవేశించినయట్టులు తోఁచుచు నగ్నినైజ
ముగఁ దారతమ్యముఁ దగ లేకయుండియు దారువులకుఁ గలతారతమ్య
ములఁబట్టి తద్ధర్మముల నెట్టులొందునో యట్టులె యాత్మకృతాకృతులను
ననుకరించుచు మఱియును దారతమ్యంబుఁ బ్రకటింతువీవె యోపరమపురుష!

ఆ. వితథములగు దేహవితతియం దొప్పుచు, సత్యమగుచు మఱియు శాశ్వతంబు
నగుచు నిర్విశేషమగుచు సన్మాత్రమై, యలరు నీస్వరూప మంబుజాక్ష! ౧౯

క. ఆ నీస్వరూపవర్యము, మానీశులు నిర్మలతమమానసు లిహలో
కానూనఫలముఁ బిమ్మటి,దౌ నాముష్మికఫలంబునం దనభిముఖుల్. ౧౯ 2141

క. కనుకనె యెఱుంగఁ జాలుదు;
రనఘా! నిజకర్మముల నుపార్జించిన సం
హననముల భోక్తృరూపం
బునఁ బురుషుఁడు వర్తనమునఁ బొలుచుచునుండున్. ౧౯ 2142

వ. ఎట్లనఁ; గార్యకారణావరణశూన్యుండై పురుషుఁడు సర్వశక్తిపరిపూర్ణుఁడగు
నీయంశముంబోలి వర్తించునని జీవుని తత్త్వమును బరిశోధించి విజ్ఞానసంపత్తి
గలమహాత్ములు నిగమోక్తసర్వకర్మార్పణవిషయము సంసారతాప నివారకము
నగుభవత్పాదారవిందముల నమ్మి మానవలోకమున నుపాసింతురు. ౨౦ 2143

చ. దురవగమాత్మతత్త్వమును ధూతమహాఘముఁ జక్కఁ దెల్ప నీ
శ్వర! తనువుల్ ధరించితివి శాశ్వతశర్మదతావకీనస
చ్చరిత మహామృతాంబునిధి సన్మతి మున్గి మహత్తరశ్రమో
త్కరములు వాసి కొంద ఱిల ధన్యులు ప్రాగ్జనిపుణ్యసంగతిన్. ౨౦½ 2144

క. భవదమల చరణవిస్ఫుట, భువనప్రభవమ్ములందుఁ బొల్పెడు కలహం
స వితతి వడువునఁ దగుభ, క్తవరుల సంగతిఁ ద్యజించి ధామముల వెసన్. ౨౧

క. అపవర్గమేని కోరక, యెపుడు భవద్భక్తిఁగోరియే యుందురు; లో
కపతీశా! నిన్నే భ, క్తిపరతచే ననుసరించి దృఢమగు పూన్కిన్. ౨౧½ 2146

వ. నిరతంబు సేవింప సాధనంబైన యీదేహ మాత్మసుహృత్ప్రియసమముగానున్నను
హితుఁడవై ప్రియుఁడవై పరమాత్మవై నీ వభిముఖుండవై యున్నను భవద్భ
క్తిని వదలి దేహాదులపైఁ బ్రాక్కర్మవాసనచే నుపలాలనంబు చేయుచు
నాత్మఘాతుకులై నీచశరీరములం దాల్చుచు భయసాంద్రంబగు సంసారమునం
బరిభ్రమింతురు. వారిందలంచి దుఃఖింపవలసియుండు. ౨౨ 2147

క. మనసును బ్రాణేంద్రియముల, ఘనయోగాభ్యాసమున నికామము నియమిం
చిన మునులు హృదయకమలం,బున ధ్యానము చేయు నిన్ను భూతతతీశా! ౨౨½

*క. వైరులు సంస్మరణంబున, సారసనేత్రలును భోగిసత్తమ! భోగం
బేరితిం దగునట్టులు,గా రంజిలు నీభుజంబుఁ గాంచుచుఁ బ్రీతిన్. ౨౩ 2149

క అనురాగంబున సేవిం,పనుగల్గిరి మేము సమతఁ బాటించి న ద
ర్శనమున నీయనుకంపం,గని సమతం గాంచి పూర్వకర్మఫలముగన్. ౨౩ 2150

* "స్త్రియ ఉరగేంద్రభోగభుజదండవిషక్తధియః" అని మూలము.

క. నిరుపమ భవత్పదాంబుజ, మరందముం గ్రోలితిమి; సమస్తజగదధీ
శ్వర! సృష్టికిఁ బూర్వంబే, పరఁగెడు నిను దేవదేవుఁ ॥ బరమపురుషునిన్. ౨౩

సీ. సృష్టికిఁ బిదప నేఁయిలఁబుట్టి చచ్చుచు నుండువాఁ డెవ్విధి ॥ నోమహాత్మ
నిను నెఱుంగంజాలు ॥ నీవలననె బ్రహ్మ జనియించిన పిదప ॥ వనజభవుని
ననుసరించియె కాదె ॥ యాధ్యాత్మికాధిదైవికదేవతౌఘంబు ॥ వెలసె; నవల
భూతగణంబులు ॥ పుట్టె; నీసర్వంబు నుపసంహరించి నీ॥వొక్క మొగిని

ఆ. యోగనిద్రఁ బూని ॥ యున్నపు స్థూలంబు
లనఁగఁ బడెడు నంబ॥రాదు లట్లె
సూక్ష్మములను ఖ్యాతి ॥ శోభిల్లు మహదాదు
లఁడగి యుండుఁగాదె ॥ యఖిలనాథ! ౨౩౪ 2152

వ. సదసత్తులచే నారబ్ధంబగు శరీరంబును, దానికి నిమిత్తభూతంబగు కాల వైషమ్యంబు, మఱి యింద్రియప్రాణాదులు జ్ఞాపకంబగు శాస్త్రంబును లేక యుండె. సృష్టికిం బిదపఁగలిగి దేహాద్యుపాధికృతాంతరములై కాలవశంబున మలినసత్త్వములగు వానికి భగవద్జ్ఞానసామర్థ్యంబు లేదని యెఱుంగవలయు. ప్రళయకాలంబున బహ్వాంతరంబు లేదనియు నప్పుడును సాధనాభావమున భగవద్జ్ఞానసామర్థ్యంబు లేదు. కావునఁ ద్వదేకశరణత్వమ్మున, శ్రవణకీర్తనాదుల చేత భక్తియే సుకరమని యెఱుఁగుట తెఱంగు ఇట్టులుండ బుద్ధ్యాదిసంరుద్ధుండ నగునే నెక్కడ? అపారమగుభగవన్మహత్త్వమెక్కడ? వర్ణింప నేర్తునే. ౨౪

సీ. తలఁప నసత్తయి ॥ వెలయు జగంబున కుత్పత్తిగలిగె నం॥చొగి వచింత్రు
వైశేషికులు; మఱి ॥ బ్రహ్మసత్తగుఁ గాన నదియె యుత్పత్తియౌ॥ననియు; సత్తె
యగు నిరువదియొకఁ ॥ డగుభేదములఁదగు నట్టిదుఃఖమునకు ॥ నరయ ధ్వంస
మే మోక్షమనియు వ॥చింత్రు నైయాయికు; లాత్మస్వరూప మ॥య్యద్ది భేద

తే. ఘటితమగు నంద్రు సాంఖ్యులు; ॥ కర్మఫలము
లను గుఱించినవ్యవహా॥ర మన్నృత మనఁగఁ
దగదు సత్యంబె యనుదురు ॥ తత్త్వవిదుల
వలె నటించెడు మీమాంస॥కులు సతంబు. ౨౪౫ 2154

తే. ఔర! యారోపితభ్రాంతు ॥ లై పలువురు
వివిధరీతులఁ దత్త్వంబు ॥ వెల్లడింతు
రంతె కా కుపదేశింతు ॥ రఖిలవేద
విదులు వారయ్యు భ్రాంతిచే ॥ వెఱ్ఱులగుచు. ౨౪౬ 2155

క. పురుషుండు త్రిగుణమయుఁ డనఁ, బరఁగెడు భేదంబు నిన్నుఁ ॥ బరమేశ్వరుగా
నరయని యజ్ఞానమునన్, నిరంతరం బుండుటనె యనింద్యచరిత్రా! ౨౪౭ 2156

క. అల యజ్ఞానంబున కవ్వల నిస్సంగుండు జ్ఞానభాసురుఁడును నై
వెలసెడు నీయందో వారలదైన యబోధమే యరయఁ జెల్లదుగా! ౮౫ 2157

సీ. మానాయకా! మనోమాత్రవిలసితమై త్రిగుణాత్మకంబయి తగు ప్రపంచ
మిది శాస్త్రరీతిగా నెన్న నసత్తయ్యు నీవధిష్ఠానమై నెలకొనుటను
సత్తుగాఁ దోఁచు నీజగ మొక్కఁడే కాదు పరికించిచూచినఁ బురుషుఁ డట్టి
వాఁడగు; నాత్మవిద్వర్యులు భోక్తృభోగ్యాత్మకంబగు విశ్వమంతయుఁ బర

ఆ. మాత్మరూపముననె యాత్మకార్యం బౌట,నాత్మునకు నభిన్నమా నటంచు
బలుకుచుండ్రు వా రుపాదానకారణం, బాత్మ యౌటఁ జక్క నరసి యరసి.

చ. కనకము గోరువారలు వికారము దానికిఁ గుండలాదికం
బనుచు నెఱుంగువార లిది హాటక మెట్లగు నంచుఁ బాఱవై
వను మదినెంతురే యటులె భవ్యతమాత్మకృతంబు విశ్వమే
యని యెఱుఁగం దగుఁ గనుక నయ్యది యెన్నఁగ నాత్మరూపమా. ౮౮

వ. ఆత్మకృతం బనుప్రవిష్టంబునగు విశ్వం బాత్మరూపం బనుటకు సంశయంబు లేదు.
సకలభూతసంవాసుండని నిన్నారాధించువారు మృత్యువును లెక్కగొనక
మృత్యువు శీర్షంబునఁ బాదంబు నిడుదురు. ౮౯ 2160

సీ. నీయందు విముఖులై నిన్నెఱుంగఁగలేని యట్టియభక్తుల నఖిలశాస్త్ర
విదులనైనను బశువిసరంబురీతి భవద్వేదవాక్యనఁ బట్టి కట్టి
వైతువు; సకలేశ! భద్రసౌహార్దము నీపైఁగలవారలో పావనతను
దమకు నన్యులకు నిశాంతము గావింత్రు; శ్రీనికేతన! స్వతస్సిద్ధమైన

ఆ. జ్ఞానవిలసితుఁడవు కాన నీవింద్రియ
సముదయముల బంధనము గనకయె
యున్నఁ బ్రాణికోటి కెన్న నింద్రియశక్తు
లకుఁ బ్రవృత్తిఁ గూర్తువు కద సతము! ౯౧ 2161

వ. అవిద్యాసంవృతులై యింద్రాదిదేవోత్తములును, విశ్వంబులను బుట్టించు బ్రహ్మ
ప్రముఖులును నీచే నియమింపఁబడిన స్థానంబుల నధివసించి నీవలని భయం
బున స్వల్పరాజ్యాధిపతు లఖిలభూపాలునకుంబోలె భవదాజ్ఞాపాలన రూపం
బగు బలిని సమర్పించి మర్త్యలోకవాసులు తమకొసంగిన హవ్యకవ్యాదిరూప
మగు బలిని భుజింతురు. నిత్యముక్తుండ వగుచో మహాత్మా! మాయాతీతుఁడవై
నిస్సంగుఁడవగు నీవా ప్రకృతిం గూడి విహరింపఁ దలంపుఁగొన్న యపుడు నీ
యీక్షణలేశంబున నుదయించిన కర్మములంగూడి స్థిరచరదేహాశ్రయులగు
ప్రాణులు కనఁబడుదురు. పరమకారుణికుఁడవై యాకాశంబుభాతి సర్వసముఁ
డవై శూన్యతుల్యుండవై యవాఙ్మానసగోచరుండవు నగు నీకు స్వపరభేదంబు

గలుగదు. శాశ్వతా! పరమాత్మా! యనంతులు నిత్యులు సర్వగతులును జీవులగుదురేని వారందఱు సములగుటంజేసి శాస్వత సంగతము కాదని నీకుఁ దన్నియమనంబు కలుగకయుండుఁ గాని వేఱువిధంబునం జెలంగు. ఉపాధియోగంబున జీవాఖ్యము యద్వికారప్రాయంబగు నెయ్యది సమము తెలిసితిమని తలంచువారి కెయ్యది జ్ఞాతదోషశ్రవణమున నవిజ్ఞాతమునగు నయ్యది కారణత్వంబు వదలక యాత్మవికారంబునకు నియామకంబగు. జన్మములేని ప్రకృతికిఁ బురుషునకు సంయుక్తంబులగు నారెండింటికి జీవరూపమున నుత్పత్తి ఘటింపదు. మఱి యితరేతరాధ్యాసమునం బ్రకృతి నిమిత్తముకాఁగాఁ బురుషుఁ డుపాదానంబుగాఁగా జలమును వాయువునుగూడిన జలముల బుద్బుదములు కలుగుచందమున సోపాధికజన్మంబు సంఘటించు. కావునఁ దేనియలో సకలపుష్పరసము లెట్లో యట్లు సుషుప్తిప్రళయంబులందును, సముద్రమున నదులవలె ముక్తిదశయందును నిరుపాధికుఁడవగు నీలో నాజీవులు బహువిధకార్యకారణోపాధులతో లయింతురు. ౩౧ 2162

సీ. ఇట్టి జీవులయందు నీక్షింపఁ దగియున్న మాయాభ్రమంబును మదిని దెలిసి
మతిమంతులగు వార లతిశయభవనివర్తకుఁడవౌ నీపయిఁ దగినయట్లు
గా ననుస్యూతమౌ ఘనతరభావమ్ము గల్గియుందురు; దేవ! కాంత! నీదు
భ్రూభంగరూపమై పొలిచి శీతోష్ణవర్షములను నేమిత్రయమునఁ దగుచు

ఆ. వత్సరాత్మకమయి వఱలు కాలము నిన్ను
నాశ్రయింపకున్న యలసులకె భ
వమృతిభయముఁ గూర్చు వారక యటుగాన
నిన్ను ననుసరించు సన్నుతులకు ౩౨ 2163

క. భవభయ మేరీతిం దగు, జవమునఁ బరుగిడుచు నంగసమితిం బ్రాణా
ళి వరుసగెల్చిన యట్టిము,నివరులకే మనసు సుంత నిలుపఁదగనిదౌ! ౩౨ 2164

చ. అతిశయచంచలంబయిన యట్టిమనస్తురగంబు నిగ్రహిం
చి తమవశంబునన్ నిలువఁజేయఁగ సద్గురుపాదసేవయే
హితమగు; దానినిన్ వదలియే మఱి యొక్కయుపాయ మెన్న సం
తతము గడంగువార లుచితంబగు మార్గముగాన కార్తులై. ౩౪ 2165

క. పలువిధములైన వ్యసనంబుల నాకులులగుచు నౌకఁ బొంకముగా న
వ్వలిదరిఁ జేర్చెడు నేర్పున, నల రెడు నాకర్ణధారుఁ డలవడకున్నన్. ౩౩

ఆ. ఓడలోని వణిజు లుదధి నెవ్విధమునఁ
బడుదు రట్లె భూరిభవసముద్ర
మందుఁ బడుదు రనుట సందేహ మననేల?
నిశ్చయముగఁ బడి మునిఁగి చెడుదురు. ౩౩ 2167

సీ. పరమేశ! నిను భక్తి భజియించువారల కాత్మభూతుఁడవయి యఖిలరూప
ములఁ దగు నానందమూర్తివై తగిన నీవుండఁ దుచ్ఛములన నొప్పుపుత్త్ర
దారాంగమందిర ధనబంధు భూమిసుఖాదుల ఫలమేమి యనుచు నిరుప
మానంబుగాఁ దగు మహితార్థసుఖమును దెలియక సుంతయు ఫలములేని

తే. యట్టికాంతాసహాయ సుఖాప్తిఁ గోరి
యద్ది మాయామయంబని యరయలేక
సంచరించెడు వారికి సర్వలోక
సుఖద! నీరూపమే సర్వసుఖము లొసఁగు. ౩౮ 2168

వ. ప్రకృతిసంబంధ తిరోహితం బై నిరస్తాసామాన్య జ్ఞానైశ్వర్యప్రముఖంబు నగు భవత్స్వరూపంబు పెన్నిధివలె నుండ జనులకు నీలోకమున నర్థకామములలో నెద్దిసుఖంబు గల్గింపఁగలదు? సర్వసుఖాస్పదంబు నీరూపం బని యెఱుంగు మును లహంకారమును ద్యజించి నిర్మలభవత్పాదారవిందద్వంద్వంబు చిత్తపీఠంబునఁ జేర్చి యాత్మపాదోదకంబు లోకపావనంబుగాఁగ నలరుచుఁ బరమపావనతీర్థ యాత్రలు సత్సంగతులు గావించుచుఁ బురుషులకు వివేకధైర్యక్షమాదుల సారము నపహరించు గృహములపైఁ బ్రీతి నునుపకుందురు. ౩౯ 2169

క. అనుపమసుఖస్వరూపుఁడ, వనఘుఁడ వఖిలాత్మవునయి యలరెడు నీపై
న నొకపరి మనసు నిల్పిన, మనుజులె సంసారసక్తి మానుదురుగదా! ౪౦

క. సామాన్యులిట్టులైనఁ, గామంబుల మానియున్న ఘనుల విషయ మిం
కేమని తలంపఁజను? నీ,దౌ మహిమము నెన్నఁదరమె యఖిలాండపతీ! ౪౧

వ. సదుత్పన్నంబగుటం జేసి యీవిశ్వము సత్తగు నన్నచోఁ దర్కమునఁ గార్య కారణములకు భేదము నిర్దేశముననే సంభవించు కతన నాయుక్తిఫలింపదు. కావున విశ్వమునకు సదాత్మత్వంబు సాధింప నశక్యంబగు కార్యకారణాభేదము సాధింపఁ దగకయున్నను వానిభేదప్రతిషేధము సాధింతుమన్నను గొన్ని కార్య కారణముల విషయమున నయ్యదియుఁ బొసంగదు. రజ్జుసర్పజ్ఞానమునందు గుణ ముపాదానకారణముగాఁగల సర్పము మిథ్యయగుట స్పష్టంబగు. ఈవిషయము నందుఁ గేవలము గుణమే కారణముకాదనియు, నవిద్యాసంయుతగుణమే కారణంబగుననియు, దానిచేత నట్టిది వస్తువు గానందున సందుమిథ్యాత్వ ముప పన్నమగు నన్న నిందు నవిద్యాయుక్తమగు సత్తే యుపాదానముగావున నట్టి యుభయయోగికారణము కార్యమునకు స్వాత్మత్వమును గావింపఁజాలదు. అట్టివస్తువునకుఁ గారణత్వమును, దానికార్యములకు నర్థక్రియాకారిత్వము నను నీరెండు నంధపరంపరాన్యాయము ననుసరించి లోకవ్యవహారముకొఱకేర్ప డిన భ్రాంతిపలనం గలుగును. మహాత్మా! నీవేదవాక్యముకర్మజడులగు వారికి బహుప్రవృత్తుల భ్రాంతిని గల్గించుచుండు. ౪౨ 2172

సీ. భూతేశ! సృష్టికిఁ ౹ బూర్వము ప్రళయమునకుఁ దరువాతఁ గానఁబడకున్న
యట్టి విశ్వంబిద్ది ౹ యంతరమునను మిథ్యాభూతమయ్యు నాత్మవయి కేవ
లుఁడవగు నీయందు ౹ గడఁగి తలంపఁ బ్రతీతిమాత్రమె యనునరీతిఁ దోఁచు
ననుట యథార్థమౌఁ ౹ గనుక మృదాదికార్యమ్ములైనట్టి ఘటాదు లెట్లొ

తే. యట్టులే బ్రహ్మకార్యము ౹ లైన యంబ
రానిలాదులు నామమాత్రైకసార
ములె గనుక మృత్తికాదుల ౹ పోల్కినందు
నిందు బ్రహ్మంబె సత్యమౌ ౹ నిందిరేశ! 3౬౪ 2173

క. ఈవిశ్వమెల్ల వితథ మనోవిలసనమాత్ర మనఁజనుం గద రాజా!
యీవిశ్వమె సత్యంబని,యేవారు తలంతు రజ్ఞులే వారెల్లన్. 3౭ 2174

క. వార లవిద్వాంసులె యని, సారమతుల్ నిర్ణయింపఁగఁజాలుదు రభవా!
భూరిభవన్మాయావ్యాపారమున నవిద్య దవిలి ౹ బడలుపఱుపఁగన్. 3౭ 2175

క. తనువుపయి నవయవములప,యిని నాత్మాధ్యాసె మొలయ ౹ నెనఁగెడు తద్ధ
ర్మనికర మొంది యనంతర,మున నానందాదిగుణసమూహము లెల్లన్. 3౭౪ 2176

ఆ. ఆవరింపఁబడఁగ ౹ నంత జీవుఁడు భవ,సాగరమున మునుఁగు సకలలోక
పాలకా! మహానుభావ! నీవన్ననో, శాశ్వతైకవిభవశాలి వగుచు. 3౭౪ 2177

క. శాకోదరవర్యము ని,ర్మోకమువలె నట్టిమాయ ౹ పొడవడఁగంగా
నేకరణిఁజేయఁ దగున,ట్లె కడఁగి యొనర్చియుందు ౹ వెంతొ సుఖముగన్. 3౮

సీ. అపరిమితైశ్వర్య ౹ హర్ష మొప్పఁగ నష్టసంఖ్యాగుణిత మహైశ్వర్యయుక్తి
నలరుదు; వోదేవ ౹ యతివర్యులును హృద్గతనికామకామ వాసనల నెల్ల
బూని నిర్మూలింపఁ రేని వారికి నీవు హృదయగతుండవై ౹ యొసఁగియు గళ
మందున్న మణి సున్నయట్టు లెంచనివాని కదియెట్లొ యట్టులే ౹ యరయ దుర్ల

తే. భుఁడవు; సర్వేశ్వరేశ్వర! ౹ భూతనాథ!, యింద్రియంబులతృప్తినే ౹ యెంచువారి
కెవ్విధిని దప్పిపోనట్టిమృత్యువునను, ద్వత్పదారాధనము చేయుతలఁపుఁగొనమి.

వ. ఇహపరంబులయందు దుఃఖమే కలుగుఁగాని సుఖలేశంబు లేదు. షడ్గుణైశ్వర్య
మహితా! భవదీయవిజ్ఞానముగలవాఁడు సకల కర్మఫలప్రదాతవగు నీమూల
మున లభించిన ప్రాక్పుణ్యపాపఫలములగు సుఖదుఃఖములను దేహాభిమాను
లగు వారికిఁగల్గెడు విధినిషేధచోదనల ననుసంధింపఁడు. ౬౯ 2180

చ. ప్రతియుగమందు నీ వెలమి ౹ భక్తులకుం దెలియంగఁజేయు న
ప్రతిమమహార్థముల్ సుజనరాజిని జక్కఁగఁ గొల్చి పొంది సం
తతము నుతించు మానవుల ౹ ధన్యతమంబులఁ గీర్తనంబులన్
శ్రుతిపుటశర్మదంబులను ౹ బోధ్యముగా విని నీవు వారికిన్. 3౯౪ 2181

వ. అపవర్గగతివే యదుగువు. దేవాదిదేవా! యుత్తరోత్తరదశగుణ సప్తావరణ సం యుతంబులగు బ్రహ్మాండజాలంబులు నభంబునఁ బరాగములచందంబునఁ గాల చక్రంబునఁ దనలోపలం జరింప నలరునీయంతమును బ్రహ్మాదులును బరికింప నేరరు. ఇతరులప్రస్తావ మింక నేల? పరమేశ్వరా! యవస్తువగు నీయంతము ననంతత్వంబు నీవే పరికింపఁ జాలవు. ఈరీతి సగుణపక్షమున గుణానంతత్వంబు, నిర్గుణపక్షంబున నగోచరత్వంబును హేతువులగుట వేదంబులు తద్భిన్ననిరాస మున నవధిభూతుఁడవగు నీయందుఁ బర్యవసన్నంబులై తాత్పర్యవృత్తిచే నీయందు ఫలించునని తెలిపెడునని తెలిపిన నాయాత్మానుశాసనము నాలకించి సనకాదిసిద్ధులెల్ల నాత్మగతిం దెలిసి సనందనుండు బ్రహ్మవిద్వర్యుఁడని విశ్వసించి యామానివరుం బూజించి రంత. ౮౩ 2182

తే. ఆసనాతనసన్మును ◊ లీసరణిని, సకలవేదపురాణ సంస్థ మతిగోప్య మునగు సారంబు నుద్ధరించిన విధ మిది, యనుచు వచియించి నారదమునినిఁ గాంచి.

సీ. మునివరా! మర్త్యసమూహమునకుఁ గామభంజనంబయి నిరుపమమునైన యాత్మానుశాసనం ◊ బనుదీని శ్రద్ధమై గ్రహియించి తోఁచినగతి జగతిని దిరుగు మీ యని తనగురు వుపదేశింప విని కృతకృత్యుఁడై ◊ ఘనతరార్థ మును దానిఁ బూన్కిమై ◊ మనసున గ్రహియించి నిర్జితేంద్రియుఁడయి నిర్మలవ్ర

తే. తపరుఁడయి యొప్పు నానారదమునివరుఁడు
తనదు గురువర్యుఁ డయి మహాతత్త్వవేత్త
యైన నారాయణమునికి ◊ నంజలి ఘటి
యించి మనమున శ్రీహరి ◊ నెంచిభక్తి. ౮౪ 2184

తే. సర్వభూతాభయార్థంబు ◊ సత్త్వమూర్తులను ధరించుచు సత్కీర్తులను జెలంగు కృష్ణపరమాత్మకే నమస్కృతు లొనర్త, ననుచు నారాయణముని శిష్యతతి నెల్ల.

క. మనసునఁ దాపము గదురం,గను వీడ్కొని వ్యాసమానికాంతుని యుటజం బునకుఁ జనుదెంచి భవ్యా,సనముఖములఁ బూజితుఁడయి ◊ చక్కని బ్రుసిపై.

ఆ. కూరుచుండి భక్తి ◊ నారాయణమునీంద్రుఁ, డాదరమునఁ దెలిపినట్టి విషయ మింతయేని వదల కే వివరించె మా, జనకుసన్ని ధానమున నృపేంద్ర! ౮౫

సీ. ఇయ్యది యిట్టులే ◊ యెన్నఁగ ననుచు నిర్దేశింపఁగారాక ◊ తేజరిల్లు బ్రహ్మమునందు నేభంగిగా శ్రుతి ప్రవర్తించునో యనుచుఁ బ్రశ్నించినట్టి నీకు నీశ్రుతివాక్యనిచయ ముత్తరముగ వచియించినాఁడ; నెవ్వాఁడు విశ్వ ములకు వీనికి జన్మములు స్థితిలయములఁ గర్తవ్య మెంచునో ◊ కరుణ నెవ్వఁ

తే. డవ్విధిం జక్క నూహించి ◊ యట్టివిశ్వ,ములకు జన్మస్థితిలయములలవడు నటు లొనరుచునో మాయకుం బురుషునకు నెవ్వఁ,డీశ్వరుండగు నట్టిసర్వేశు హరిని.

వ. ఏమహాత్ముఁడు జీవునితోఁ బ్రవేశించి భోగస్థానంబులగు శరీరమ్ములం బుట్టించి పాలించునో, నిదురించు పురుషుఁడు శరీరముం బోలె నెవ్వనింబొంది జీవుండు కార్యకారణలక్షణంబైన యవిద్యం బాయునో, యప్రచ్యుతస్వరూపావస్థానమున మాయను నిరసించు భయనివర్తకు శ్రీహరి నెల్లప్పుడు ధ్యానింపవలయు నని శుకయోగీంద్రుఁడు తెల్పిన విని పరీక్షిన్నరేంద్రుం డిట్లనియె. ౬౦ 2189

---

## ఎనుబదెనిమిదవయధ్యాయము.

### విష్ణుభక్తిమాహాత్మ్యము.

క. మునివర్య! విషయభోగము,లను మానిన శివుని గొల్చి । లలిసురదనుజుల్
మనుజులు ధనవంతులుగాఁ, గనఁబడుదురు గాని లక్ష్మి।కాంతుని హరినిన్. ౧

క. సేవించువార లవ్విధిఁ, గావలవదె యట్టిరీతిఁ । గనఁబడ రెందుల్
భావింపఁ గారణం బెది,యో వరుసం దెలుపవయ్య । యోగీంద్ర! కృపన్. ౨

సీ. తలపోయఁగా విరు।ద్ధస్వభావముగల ప్రభువుల సేవించు । ప్రజల కెల్ల
నట్టివిరుద్ధఫ।లావళి గలుగు నీవిషయంబునఁ నాకుఁ । బెద్దసంది
యంబు గల్గెడునని । యడిగిన నాపరీక్షిన్మహీపతిఁ గాంచి । చిత్తమలర
శుకయోగి యిట్లను । క్షోణీశ చంద్రమా! శివుఁడెన్నఁగా శ।క్తిచే వృతుఁడయి

ఆ. త్రిగుణసంవృతుఁడయి । దీపించి వైకారి
కమనఁ దైజస మనఁ । గా మఱియును
దామస మనఁగఁ ద్రివి।ధములుఁగాఁ దగు నహం
కారములను దానుఁ । గనుచు నెపుడు. ౩ 2192

క. అలరును ద్రిలింగుఁ డనఁగాఁ, గలుగు నహంకారమున వి।కారము లవియుం
జెలఁగుఁ బదాఱుగ ననుచుం, బలుకుదు రార్యోత్తములు స్వ।భావ మెఱుఁగుటన్

క. సుంత వికారోపాధికు, నంతికమును జేరి కొల్వ । నద్దానికి నీ
డెంతయునగు విభవంబుల, సంతతిగతి నతఁడు పొందఁ।జాలు మహీశా! ౫

చ. హరియన నిర్గుణుండు పరుఁ।డైతగు మాయకు, సాక్షిభూతుఁ డీ
శ్వరుఁడయి యెల్ల వేళలను । సర్వముఁ దాఁ గనుచుండుఁ గాని శ్రీ
హరి నతనిఁ భజించునతఁ । డట్టులె నిర్గుణుఁ డౌ నటంచునో
ధరణిపతీంద్ర! నెమ్మదిని । దప్పక యెన్నుము తత్త్వ మిద్దియే. ౬ 2195

చ. మునుపు భవత్పితామహుఁడు । భూతదయాగుణశాలి ధర్మరా
జనుపమసత్ఫలం బిడెడు।నాహయమేధమఖంబు పూర్ణతం
గనిన యనంతరంబున ని।కామ ముదంబును భక్తియుం దగం
గను భగవత్సుధర్మములఁ । గర్ణయుగం బొగిఁ దృప్తి నొందఁగన్. ౭ 2196

తే. ఆలకించుచుఁ బరమాత్ము । నచ్యుతు హరిఁ
గాంచి యీవిషయంబె ప్రశ్నించె; నరుల
కెల్ల నిశ్శ్రేయసంబుల । నెలమిఁగూర్ప
యదుకులంబున జనియించినట్టి హరియు. ౬౪ 2197

మ. తనుసేవించెడు ధర్మరాజునకు నర్థం బద్ది పూర్ణంబుగాఁ
గను దెల్పం దలపోసి ప్రీతుఁడయి లోకస్వామి తానాట ని
ట్లని బోధించె; యుధిష్ఠిరా! వినుము నే । నత్యంతమోదం బదె
వ్వనిపైఁ బర్వఁగఁజేయఁ బూనుదునొ యాభక్తార్థ సంతానమున్. ౭౪ 2198

మ. తొలుదొల్తన్ హరియింతుఁజుమ్ము! వరుసన్ । దుఃఖంబు వెంటన్ వెతల్
గలుగన్ నిర్ధనులైన భక్తులఁ గనంగా బంధువుల్ మానుచున్
దొలఁగం ద్రోయుదు; రంత వారలును దోడ్తో నర్థముంగోరి వ
ర్తిలఁగాఁ బూనియు యత్నమెల్లఁజెడఁగా । దీనత్వముం బైకొనన్. ౮౪ 2199

ఉ. విత్త మిదెట్టి దంచు మది । వే తలపోయుదు; రంతలోన నే
యుత్తమమామకానుచరు । లొప్పెడుచోటికిఁ బోవఁజేసి యే
యుత్తలపాటుగల్గనటు । లొప్పుగఁజేయును నాయనుగ్రహం
బత్తఱి భక్తమైత్రి దృఢమై ధనసంగతి మానఁ జేసెడున్. ౯ 2200

క. తరువాతం జిన్మాత్రము, పరమము సూక్ష్మంబు సత్తు । భాస్వరతమమున్
మరణవిరహితమునగు నా, పరతత్త్వము నన్నుఁ గొల్వఁ । బొల్పడుదురుగా!

క. నను నెఱుఁగుదు రారాధ్యుని,గను రాజా! భక్తగోష్ఠిఁ । గనువారలు న
న్ననయము భజింప నేర్తురు, మనుజులు సామాన్యులు నను । మాధవు నభవున్.

క. తెలియంగనేరకే యా,ర్తుల మున్గుచు నితరనిర్జరుల సేవింపం
దలపోయుదు రిదియే యిటుఁ, గలతత్త్వము ద్రవ్యమందుఁగల యాసక్తిన్.

చ. ఇతరసుధాశనాధిపుల । నెంతయుభక్తిని గొల్చి శీఘ్రమ
ప్రతిమముదంబునం దగుసుపర్వులమూలమునన్ నరేంద్రభో
గతతిని గాంచి మత్తిలుచు । గర్వమునన్ వరదామరాళినిన్
మతులఁదలంప కెంతొ యవమానముఁ గూర్తురు వారి కోనృపా!. ౧౧ 2204

చ. అనియిటు కృష్ణమూర్తి శమనాత్మజు సంశయముల్ దొలంగు న
ట్లనుపమతత్త్వముం దెలిపె । నంచు వచించి మహామునీంద్రుఁ డి
ట్లని మఱియున్ వచించెఁ గమలాసనశంకరవిష్ణుముఖ్యు లో
మనుజవరా! శపింపఁ గృపనైకొనఁ గావఁగ నీశ్వరుల్సుమీ!. ౧౧౪ 2205

చ. హరుఁడు విరించి వేగముగ । నాద్వయముం గలిగించునట్టు లా
హరి యొనరింపఁ; డీవిషయమై తగియున్నపురాణగాథ నా

దరమున నేవచింతు; ముని । దారుణకర్ముఁడు దుష్టచిత్తుఁ డా
శరుఁడు వృకాఖ్యుఁ డొక్కరుఁ డెసంగెడుపూన్కిఁ దపంబు చేసెఁ దాన్.

క. మనమునఁ దపంబున కీశ్వరుఁ, డనూనమోదంబునొంది । యప్పుడె వర మి
చ్చెను దానఁ గష్టమొందెను, గనుక నుదాహృతికిఁ దగునుగాథ యదియిటన్

వృకాసురునకువరమిచ్చి శివుఁడు కష్టముఁగనుట.

క. మునుశకునితనయుఁ డౌవృక,దనుజుఁడు మార్గమున నారదమునిం గని దు
ర్మనసుం డగుటనె ప్రశ్నిం,చెనిటుల్ ముమ్మూర్తులందు । శీఘ్రప్రమదున్.

క. వివరింపు మంచు నడిగిన, దివిజమునీంద్రుండు దుర్మతిం గని పల్కెన్
జవమునఁ గార్యము సిద్ధిం,ప వలచినన్ శంభుఁ గొల్వు । భక్తి మెఱయఁగన్.

తే. అల్పగుణదోషములకె యాహరుఁడు మోద
మందుఁ గోపించు వందిజనాళి యట్లు
వినుతిచేసిన దశవదనునకు బాణ
దనుజునకుఁ బ్రీతుఁడై సంపదల నొసంగి. ౧౫ 2210

క. తరువాత శ్రమము నొందెను, హరుఁడని తెలుపంగ నావృకాసురుఁ డపుడే
పరుగిడి కేదారంబున, నురుముదమునఁ దపము చేయ । నూల్కొని శ్రద్ధన్. ౧౬

క. అనలునిముఖమున హరు నొ,య్యన నావాహనము చేసి । యాత్మశరీరం
బునఁ గలమాంసముఁ గోయుచు, ననలునిలో వేల్చి శంభునారాధించెన్. ౧౭

చ. హరునిప్రసాదముం గనక । యాతఁడు సప్తమవాసరంబునన్
బరమపవిత్రతీర్థవరభవ్యజలార్ద్రశిరోజయుక్తమౌ
శిరమును గోసి ఖడ్గమునఁ । జెచ్చెఱ వేల్వఁగఁ బూనె; నంతలో
హరుఁడు దయాసముద్రుఁ డపు । డాకృతిఁదాల్చిన యగ్నియోయనన్. ౧౮

చ. మృతిఁగన నెంచువానిఁ గనియే మొగిఁ గావను బూనినట్టు లా
దితిజుని మర్త్యకాముని నతిస్థిరయత్నుని గాంచి తత్కర
ద్వితయము నట్టె పట్టుకొని । తీవ్రకృపాణకృతప్రయత్నమా
పి తనకరంబునం దడవెఁ । బ్రీతిఁ దదంగము రక్షణాదృతిన్. ౧౯ 2214

క. హరహస్తస్పర్శంబునఁ, బరిపూర్ణాంగుఁడయి దైత్యవల్లభుఁ డొప్పం
బరికించి చంద్రశేఖరుఁ, డురుకరుణం బల్కె రాక్షసోత్తమ! యింకన్. ౧౯ 2215

క. చాలును జాలును లెమ్మా, యీలీలన్ ఘోరయత్న । మేలా చేయన్
జాలింపు మేను జలముల, నోలి సమర్పింపఁ బ్రీతి । నొందుదుఁజుమ్మా!. ౧౯౪

క. నీవన దేహమునే నా, కీవలచితి వింత జతనమేలా? యసురే
శా! వరమడుగు మొసంగం,గా వచ్చితి ననినఁ బాతకస్వాంతుం డై. ౨౦ 2217

చ. దనుజుఁడు గోరె నిట్లు గిరిధన్వ! మహాత్మక! నేను హస్త మె
వ్వని శిరమందుఁ బెట్టుదునొ వాఁడు మృతిం గనునట్లుగా వరం
బును గృపచేయుమీ యనిన భూతభయావహమైన యవ్వరం
బును విని విన్ననయ్యు సురపుంగవనాథుఁడు నంత నవ్వుచున్. ౨౧ 2218

క. ఉరగములకుఁ బాల్వోసిన, కరణిన్ దద్వర మొసంగెఁ గ్రవ్యాదుఁడు త
ద్వరము పరీక్షింపఁగ నాతురపడి దుష్టాత్ముఁడౌట ధూర్జటితలపై. ౨౨ 2219

చ. కరమును మోపఁబూన గిరికార్ముకుఁ డాత్మకృతాపరాధ మ
త్తరుణమునన్ ఫలించెనుగదా యని తత్తఱపాటుతోఁ గళే
బరము వడంకఁగా వడిగఁ బాఱెను దోడనె పాఱె జొచ్చె నా
శరుఁ డిటు రక్కసుం డరుగ శంకరుఁ డాశల కెల్లఁ బోవుచున్. ౨౩౪ 2220

చ. ప్రతివిధి దీని కియ్య దని భావనచేయక యుత్తరాశకున్
జతనముమీఱఁ బాఱ సురసత్తము లూరక చూచుచుండ రా
శితిగళుఁ డంత భాస్వరము సిద్ధమహర్షిగణైకసేవ్య మ
చ్యుతము తమఃపరంబు నయి యొప్పుపురంబున కేగెఁ బూన్కిమై. ౨౫ 2221

సీ. అదియె శ్వేతద్వీప మనఁబడు వైకుంఠ మనియుఁ జెప్పంబడు; నందుఁ బ్రీతి
నారాయణుండు సంతతము వాసము చేయు సంసారరహితులౌ సజ్జనులకుఁ
బరమమౌ గతియగుఁ బరమేశుఁ డనఁబడు శాంతసన్న్యాసి విసరమునకును
యోగులకు నతండె యుత్తమగతియగు నందుఁ జొచ్చినవార లమలచిత్తు

తే. లగుచు నానందమును గాంతు రంతె కాని
మరలి రా రెప్పుడైన సమ్మాడ్కి నొప్పు
స్థానమున కేగి శ్రీహరిఁ జక్రిఁ గనియె
నట్టి వ్యసనంబునందిన హరుఁ గని హరి. ౨౬ 2222

చ. నళినదళాక్షుఁ డంత వ్యసనంబున నెంతయు నొచ్చివచ్చు శ్రీ
గళుఁ గని తన్నివారణము గ్రక్కున చేయఁ దలంచి దండమే
ఖల లజినాక్షమాలికలు గ్రాలుచు నుండఁగ యోగమాయ చె
య్వులుదగ బ్రహ్మచారియయి యుగ్రహుతాశను తేజ మొప్పఁగన్. ౨౭

క. కనఁబడుచు దూరమార్గంబుననుండియె వచ్చునట్టి పోడిమి వెలయం
గను వచ్చి కుశకరుండయి, వినయంబున భక్తి మ్రొక్కి వృషభధ్వజునిన్. ౨౮ 2224

క. కొనియాడి మహాదేవా!, దనుజున కీవృకున కిట్టితరుణంబునఁ జి
క్కినకతన శ్రమమునొందితి, వనఘా! సర్వార్థసాధకాంగము దీనిన్. ౨౯ 2225

క. వెతలం బెట్టఁగ రాదీ,వితమున నెందుండి యిటకు విశ్వేశా! వ
చ్చితి వింద విశ్రమింపుము, హితమగునే దెలుప నీదువృత్తముఁ జెపుమా.

క. ఏయుద్దేశమ్మున నీ, వీయెడ కరుదెంచినావొ ॥ యెఱిఁగింపుము నే
నాయది వినఁదగునే నిటుఁ, బ్రాయికముగఁ బూరుషు లితరసహాయమునన్.

సీ. సకలార్థముల నొగి ॥ సాధింపఁ గోరుదు రట్లు కావునఁ జెప్పవయ్య యనుచు
భగవంతుఁడగు హరి ॥ పరమసుధారసవర్షమ్ము గురిపించువాక్కు లలరఁ
బ్రశ్నింపఁగా గతశ్రముఁ డయిశంకరుఁ డాయుదంత మ్మెల్లహరికిఁ దేట
తెల్లముగాఁ జెప్పె; ॥ ఫుల్లారవిందాక్షుఁ డౌహరి యవ్వార్త ॥ నాలకించి

తే. దనుజునిం బిల్చి యోయి యీతండు దక్ష
శాపమును గాంచుటన్ బిశాచత్వ మొంది
ప్రేతములకుఁ బిశాచసంఘాతములకుఁ
బతియగుట విశ్వసింప మేమితని నుడుల. ౩౩ 2228

చ. మనమున నీవు శంకరునిమాటల నమ్ముదువేని నీశిరం
బునఁ జెయినుంచుకొంచు వరమున్ బరికింపుము; శంకరోక్తి స
త్యనియతిఁ గాంచదే నిటు లతథ్యము లాడకయుండఁగా వధిం
పను జను బొంకులేపలుకు ॥ బాలిశుఁ డౌనను కారణంబునన్. ౩౪ 2229

చ. అనియిటు చాలఁ బేశలము ॥ లై కడుఁజిత్రములైన వాక్కులన్
దనుజుని నూఱడించెడువిధంబున నచ్యువచించినన్ గడున్
మనసు చెడంగ విస్మయము ॥ మైకొనఁగాఁ దనమస్తకంబుపై
నునుచుకొనెన్ గరంబు దనుజోత్తముఁ డెంతొ కుబుద్ధియాటచేన్. ౩౫

చ. కులిశముతాఁకునం బగులుకొండవిధంబున మస్తకంబు బ్ర
ద్దలగుట నాక్షణంబె విధి ॥ తన్నొగి వంచనచేయఁగాఁ బడెన్
దులువ వృకాసురుండు తనదోషముచే మృతినొందఁగా సురా
వళులు దివంబునన్ నిలిచి ॥ భవ్యసుమంబుల వృష్టినెంతయున్. ౩౬ 2231

క. కురియించుచు జయశబ్దో,త్కరము నమశ్శబ్దవితతి ॥ గావించిరి శ్రీ
హరి! మంచిపని నొనర్చితి, పరమాదృతి ననుచు సాధుభాషణములచేన్. ౩౭

క. వినుతించిరి గంధర్వులు, మునివర్యులు భక్తిభావములఁబొగడిరి శ్రీ
వనజాక్షు నంత శంకరుఁ, డనూనకష్టంబు పోవ ॥ హాయిం జెందెన్. ౩౮ 2233

క. అత్తరుణంబున నాపురు,షోత్తముఁ డాగిరిశుఁ జూచి ॥ యోహో! సురసం
ఘోత్తమ! శంకర! యీదు,ర్వృత్తుఁడు తనపాపముననె ॥ యీల్గెం గంటే. ౩౯

తే. ఎవఁడు పెద్దలకపకార ॥ మిట్లొనర్చు, నెట్లుసుఖియింప నేర్చువాఁ ॥ డిద్ధచరిని
జగములకు నెల్ల గురువయి ॥ సకలలోకపతివయిన నీకు నపకృతి ॥ మతిఁదలంచి.

క. చిరకాలము సుఖియింపన్, గర మాక్రాంతించువాని ॥ కథ యేటికి! శం
కర! యంచుఁ బ్రియవచస్స్తుతి, హరు నూఱడిలంగఁజేసి ॥ యగపడకుండెన్. ౪౦

క. మనసునకు వాక్కునకుఁ దెలియని భూరిమహత్త్వమునకు నంబుధియగు నా
వనజాక్షుఁడు శంకరునకు, నొనరించిన యార్తిహరణ మొప్పెడు గాథన్. ౩౯

చ. వినినఁ బఠించినన్ మఱియు వేడుకమై వచియించినన్ భవా
బ్ధిని దరియించు శత్రుకృతభీతియు నొందకయుండుఁ గాన నీ
యనుపమ పుణ్యగాథఁ బ్రియమాఱఁగఁ బావనకాలమందుఁ జ
క్కని మతిచేఁ బఠింపఁదగుఁ గాంక్షితముల్ ఫలియించు నన్నియున్. ౪౦

## ఎనుబదితొమ్మిదవ యధ్యాయము.

### త్రిమూర్తులలో హరి యుత్కృష్టుఁ డనుట.

క. అని తెల్పి మఱియు నిట్లను, మునిచంద్రుఁడు రాజవర్య! మును సాగె మునీ
శనికరకృతసత్రముఖం, బనూన విధి మీఱ నద్భుతావహ మగుచున్. ౧ 2239

తే. భూరిసార సరస్వతీతీరమందు
సాగె నా సత్రయాగంబు సకలమౌని
వరసమన్వితముగ నందుఁ బ్రభువులైన
బ్రహ్మవిష్ణ్వీశులందు నెవ్వఁడు వరుండు. ౨ 2240

చ. అనెడు వితర్కమొండు తగ నవ్విషయంబు నెఱుంగఁగాఁ భృగుం
డను మునిఁ బంపి రెల్ల; రతఁ డాదిని బ్రహ్మసభం గనంగఁ బో
యి యచట వందనంబు నుతి యించుకయే నొనరింపకుండె నా
తనియెడ సత్వమెంతదగు దానిఁ బరీక్షయొనర్చు వాంఛచేన్. ౩ 2241

ఉ. అందుల కెంతయుం గినిసి యాపరమేష్ఠి మహోగ్రతేజుఁ డ
య్యుం దనపుత్త్రునందు సతమొప్పెడు స్నేహముచేత నప్పుడే
డిందఁగఁజేసె దానిని గడిందివహ్నిశిఖను నీటనార్చు రీ
తిం దగ; నంత నాభృగువు ధీమహిమంబున దాని నెన్నుచున్. ౪ 2242

మ. చని కైలాసముఁ జేరి శంకరుని గాంచన్ సోదరప్రీతి నె
క్కొనఁగా నీశుఁడు కౌఁగిటం బొదువఁ బోఁ గోపించి సన్మార్గవ
ర్తన మావంతయు నీయెడం గలుగ దంతశ్శుద్ధి లేకుండు నీ
వనుమానింపక నన్ను ముట్టఁ జనునే యంచాడి వారింపఁగన్. ౫ 2243

శా. ఆమాటల్ శ్రుతులం జొరం గనలి యత్యాచారుఁ డంచెంచి యెం
తేమాన్యుండని యెంచకే శివుఁడు నిన్నిష్టై గతాహంకృతిం
గా మచ్ఛూలనిపాతనంబునఁ దగం గాఁ జేయుదుం జూడుమం
చామౌనిన్ వధియింపఁబూన నుమ యడ్డాత్మేశు వారించుచున్. ౬ 2244

మ. చరణాబ్జంబుల వ్రాలి పేశలవచోజాలంబులన్ శాంతకో
పరతుం గావొనరించె; నాభృగువు వే పద్మాక్షునిం జూడఁగా
నురువైకుంఠపురంబుఁ జేరె నట నెంతో ప్రీతిమై నున్న శ్రీ
వరుఁ గాంచెం దల లక్ష్మియంకమున నొప్పంగా రమాధీశుఁడున్. ౭ 2245

ఆ. పవ్వళించియుండెఁ బరమాత్ము నాతని, సత్త్వమెఱుఁగఁ గోరి సాధుమునియుఁ
గాలఁ దన్నె సురముఖ్యుగాఁడఁగా హరి సిరిఁ,గూడి లేచి యెంతొ కుతుకమలర.

ఉ. పానుపుడిగ్గి యమ్మునికి భక్తిని శీర్షము వంచి మ్రొక్కి యెం
తో నయ మొప్ప సాధువుల కున్నతమౌపద మిచ్చువాఁ డనం
దానయి యొప్పియుం బలికె ధన్యుఁడనైతి మునీంద్ర! స్వాగతం
బౌ నిట నాసనంబుపయి నర్మిలి మీఱఁగఁ గూరుచుండుమా. ౯ 2247

తే. త్రోవఁగల్గిన శ్రమములు తొలఁగ నొక్క
క్షణమయిన విశ్రమింపుము కరుణ మీరు
వచ్చు టెఱుఁగకయుంటి నావలనితప్పు
సైచి కాపాడుమా మము సంతతంబు. ౯౹ 2248

క. అతికోమలములు నీపాదతలము లోమౌనిపా! నితాంతపరుషమై
క్షితిఁబోలి యెచ్చుతగ్గుగ, నితరులకుం దోఁచు నాదుహృదయము సోఁకన్. ౧౦

*తే. ఎంతగా గాసినొందెనో యెఱుఁగఁజాల
ననుచు నమ్మునియంఘ్రుల నల్ల నల్ల
నఁ గరముల నొత్తుచున్ మునినాథ! తీర్థ
ములకుఁ దీర్థతఁ గూర్చుపాజ్జలముల నను. ౧౦౹ 2250

సీ. నాలోకమును మఱి నాయందు విశ్వాసముఁగను లోకేశులపూగములను
నాదు సేవకులను నాగృహంబులఁ జక్కఁ బావనతం గాంచు పగిదిఁ జేయు
మిప్పుడే లక్ష్మికి నేకాంతభాజనం బైతిని నీదుపాదారవింద
సంస్పర్శనంబున సకలపాపంబులు తొలఁగుట నాయురస్థ్సలమున నిఁక

తే. భార్గవీదేవి సతతసంవాస మొప్ప, నలరు నని యిట్లు వైకుంఠుఁ డతిగభీర
భాషణంబుల సత్కరింపఁగ ముదంబు, నొంది భక్తిభరంబున డెంద మలర.

క. కను లశ్రువులం దడుపన్, ముని యేమియుఁ బల్కకుండి మురహరుని మనం
బున నెన్నుచు మరలన్ సత్రనికేతనమునకు వచ్చి బ్రహ్మర్షులకున్. ౧౩౹ 2252

ఉ. తానటఁ గన్నవార్తల నితాంతము తేటపడంగఁ జెప్పి; నా
మౌనులు నాలకించి తమమానససంగతసంశయంబు ల

---

* "పాదోదకేన భవతాం తీర్థానాం తీర్థకారిణా" అని మూలము.

ష్టే నిధనంబునొందఁ బరమేశ్వరుఁ డాహరియే యటంచుఁ గొనెన్
మానసపీమలందు బహుమానము నిండఁగ నిశ్చయించుచున్. ౧౮౫  2253

సీ. అభయశాంతులు ధర్మ ॥ మట్లె జ్ఞానంబును దత్సంయుతంబయితగిన యట్టి
వైరాగ్య మట్లె యైశ్వర్య మష్టవిధంబు నాత్మమలాపహంబగు యశంబు
నెవ్వానివలననే ॥ యొసఁగునో; శాంతులు సమచిత్తులును మఱిసాధువులు న
కించనులు నగుచు ॥ నెంచ సన్న్యాసులై తగువారి కెవ్వఁ డుత్తమగతియగు

తే. నెవనికిం బ్రియమూర్తియై ॥ యొసఁగుసత్త్వ
మవనిసురు లెవ్వనికిని బ్రియంబుఁగూర్చు
దైవతములౌదురో శాంతధనులు నిపుణ
మతులు నిష్కామము లెవనిసమ్మతిఁ గొలుతురొ. ౧౮౬  2254

క. అతని మహనీయు హరి నచ్యుతు నుత్కృష్టునిగ నమ్మి ॥ రొక్క తెఱఁగునన్
వితతగుణత్రయనిర్మిత, దితిజాసురదివిజు లనెడుత్రివిధాంగంబుల్. ౧౮౭  2255

క. కల వాశ్రీహరి కమ్మూర్తులలోపల సత్త్వగుణమె ॥ తొందఱఁ గార్యం
బుల సాధింపం దగునని, యిలాధిపా! యల్లమానులెల్లరు పూన్కిన్. ౧౮౮

ఆ. సంశయంబు వీడి ॥ సాధుసరస్వతీ, తటమునందు మనుజతతుల సంశ
యములు వీడఁజేయ ॥ హరితత్త్వమును బయల్పఱచి విష్ణుపాదపద్మయుగము

క. సేవించి పరమగతినిన్, శ్రీవల్లభు కరుణఁ గాంచి ॥ చెలఁగి రనుచు స
ద్భావమున సూతుఁ డాధర,ణీవిబుధస్తులకుఁ దెల్పి ॥ నిశ్చలభక్తిన్. ౧౯౦  2258

చ. మునులను గాంచి పల్కె మునిపుంగవుఁ డై తగు వ్యాసయోగినం
దను ముఖపద్మనిర్గత సుధారసమున్ భవభీతి నాశకం
బును శ్రుతిసంపుటంబులను ॥ బూనికమీఱఁగఁ గ్రోలువాఁడు చ
య్యన భవబంధనార్తి తనయంతనపోవ సుఖించు నెప్పుడున్. ౧౯౧  2259

క. హరిచరితము సుశ్లోకము, పరమాద్భుత మానుగాన ॥ భక్తి శ్రుతిపుటాం
తరమునఁ జొనుపం దగు నే, పురుషుం డటుచేయు నతఁడె ॥ పో ముక్తుఁ డనన్.

తే. ఘోరసంసారమను భూరికూపమందుఁ
దిరుగకుండెడు భాగ్యంబు ॥ నిరుపమంబు
గాంచు నని పల్కె శుకయోగి ॥ క్ష్మాపతి కిటు
తెలిపె నని మఱియుం బ్రీతిఁ ॥ దెలిపె నిట్లు. ౧౯౩  2261

శ్రీకృష్ణార్జునులు చచ్చినవిప్రపుత్త్రులఁ దెచ్చియిచ్చుట.

క. ఒకనాఁడు ద్వారకాపురి, సకలేశుం డుండునట్టి ॥ సమయంబున వి
ప్రకళత్రము ప్రసవించిన, యొకక్షణమునకే కుమారుఁ ॥ డుర్వ్రితగులఁగన్. ౧౯౪

క. మరణించె నంతటన్ భూసురుఁ డామృతశిశువుఁ గొనుచు ॥ క్షోణీశుని మం

దిరమున ద్వారమ్ముకడఁ, ధరణిం బడవైచి యిట్లు తా విలపించెన్. ౨౨

క. విలపించుచు దీనాత్మత, వెలయఁగ నాతురతమీఱి విన్నజను లెదం
గలవిలపాటొందఁగ నిటు, పలికెఁ; శఠబుద్ధియగుచుఁ బరహింసకుఁడై. ౨౩

క. ధరణీదివిజ ద్వేషియు, నిరతిని దనుసుఖముఁగోరు నీచుఁడు నగుభూ
వరుదోషంబున నాసుతుఁ, డరయఁగ మృతినొందె ననుచు నాత్మం దోఁచెన్.

సీ. హింసావిహారుఁడై హీనశీలుండయి విజితేంద్రియుఁడు కాక విశ్వమెల్లఁ
బాలించు నరపతి పాలనంబునఁ బ్రజ లతిదరిద్రులునయి సతతదుఃఖ
భాగులై కుందుదు రేగతినైనను శాంతినొందక యని త్వాసురుండు
విలపించి విలపించి వేసరి గృహమున కరిగి యవ్వల నల్లి యంతమొందు

తే. చున్న కొడుకుల నెనమండ్ర నొగి నరపతి
సౌధమున ముంగిటం బెట్టి జనులు వినఁగఁ
బూర్వరీతినె వచియించి పోవుచుండె
నల్లి తొమ్మిదవసుతుండు నంత మొంద. ౨౫ 2266

ఉ. వానిశవంబుఁ దెచ్చి నృపువాకిటఁ బెట్టి యథాప్రకారమే
తాను వచించుచుం బొగులు ధాత్రిసురేశ్వరు నార్తనిస్వనం
బానిఖిలేశు చెంతఁదగు నర్జునుఁ డొక్కట నాలకించి పెం
పూని వచించె; విప్రవర! యూరక యేడ్చెదవేల యిచ్చటన్. ౨౬ 2267

ఉ. నీవు వసించు నిట్టిపురిని ధను వృద్ధతఁబట్టి నట్టిఁడౌ
భూవిభుఁ డొక్కఁడేఁ గనఁగఁబోలఁడు మందునకైన వీరలో
భూవిబుధాళి సత్రమను పూజ్యమఖంబున భోజనార్థమై
యేవిధిఁగూడు నావిధిగ నిందు వసింతు రపౌరుషంబునన్. ౨౭ 2268

ఉ. ఎవ్వరి దేశమందు ద్విజు లెల్లరు దారసుతార్థహీనులై
నెవ్వగలం గలంగుదురొ నిశ్చిత మానరపాలకుల్ మనం
బువ్విళులూరఁగాఁ గడుపు నొయ్యనఁ బ్రోవ నృపాలవేషులై
యివ్వసుధం జెలంగునటులే యని యెంచఁగ నప్పలో ద్విజా!. ౨౮ 2269

క. వగలం బొగిలెదు మీకిం,కఁ గలుగఁగల ప్రజను నేను గాతు నిచట ని
ల్చి గడిమి మెఱయఁగఁ బ్రతినఁ, దగునట్లుగఁ దీర్పనేని దహనుం జొత్తున్.

క. దానఁ నాపాపమ్ములు, పో నెంతయు సుఖముఁ గాంతుఁ బో యన విని యా
భూనిర్జరుండు సుంతగ, మానసమునఁ జింతనొంది మఱి యిట్లనియెన్. ౩౦

మ. బలదేవుండును వాసుదేవుఁడును జాపంబుఁ ధరింపంగ నే
ర్పులు విఖ్యాతియుఁ గాంచనొప్పతిరథప్రత్యాగంబునం దెన్న ని
స్తులమై పొల్చుయశంబుఁగన్న యలప్రద్యుమ్నుండు శౌర్యంబునం
దులలే కెంతయుఁ గీర్తిఁగన్న యనిరుద్ధుండుఁ బ్రయత్నించియున్. ౩౧ 2272

క. ఒనరింపఁ జాలరై రీపని మూర్ఖతఁ జేయనీవు పాల్పడితివి లో
కనిచయవిభులకుఁ జేయఁ దగనిపని నీవూన నమ్మఁగా నేర ననన్. ౩౨ 2273

చ. విని యపు డర్జునుండనియె విప్రవరా! హలిఁగాను నందనం
దనుఁడనుగాను గార్ష్ణి యన ధాత్రి నెసంగినవాఁడఁగాను నే
ననఁగ యుధిష్ఠిరానుజుఁడ నర్జుననాముఁడ, గాండివంబు నా
ధనువు నెవండు తాల్చునొ యతండనె నే నని యెన్నఁగాఁ దగున్. ౩౩ 2274

మ. హరు మెప్పించితి యుద్ధరంగమున శౌర్యం బప్రతిద్వంద్వమై
ధరనొప్పారెడు దాని నీవవమతిన్ దర్కింపకే చేయ భూ
సురవర్యా! తలపోయఁగాఁ దగునె నీసూనుల్ వడిం దెత్తు భీ
కరమౌ మృత్యువునొంచి నాపలుకు నిక్కంబంచు నూహింపుమా. ౩౪ 2275

మ. అని యిట్లర్జునుఁ డాధరామరుని శౌర్యంబొప్పు వాక్యంబులన్
మన ముప్పొంగెడునట్లు చేయుటయు నాత్మోదేవుఁ డప్పార్థునిం
గని యెంతో ముదమంది శౌర్యమును నిక్కంబంచు లోనమ్ముచున్
జనియెన్ వేగ నికేతనంబునకు; గృష్ణస్వామి లో నవ్వఁగన్. ౩౫ 2276

శా. అంతం గొన్ని దినంబులేగ మఱి యాత్మామర్త్యుఁ డర్ధాంగియున్
సంతానంబు గనంగ నున్నతఱి విశ్వాసంబుపైఁ బొంగఁగా
స్వాంతం బెంతయుఁ దొందఱింపఁ జని యోసత్త్వాఢ్య! యోపార్థ! నా
సంతానంబును మృత్యుబాధ తొలఁగన్ శౌర్యంబునం గావుమా. ౩౬ 2277

ఉ. ఆతురుఁడై యతం డిటు లహార్యబలుండని నమ్మి యర్జునున్
జేతము భీతిచేఁ గలఁగఁ జేరి వడిం జనుదెమ్మటంచొగిం
బ్రాతవు నీవెయంచు గురుధర్మమె యానిది యంచు వేఁడఁగా
నాతఱి నర్జునుండు విధి నాచమనం బొనరించి శుద్ధుఁడై. ౩౭ 2278

*చ. మనమున నామహేశ్వరు నుమాపతి నిల్పి నమస్కరించి దే
వనికరదత్తమై మహిమ భాసిలు నస్త్రగణంబు సంస్మరిం
చి నియతి సజ్యచాపమును జిత్తముపొంగ గ్రహించి గాండివం
బన విలసిల్లుదాని జనె నాద్విజునింటికి సత్వరంబుగన్. ౩౮ 2279

తే. సూతికాగారమునకును జుట్టుఁ బెక్కు
విధములగు నస్త్రములచేత వీర్యమలరఁ
గ్రింద మీఁదను గట్టె నేరికిఁ జొరంగ
నసువు గానట్లుగాఁ బంజరాకృతిఁ దగ. ౩౯ 2280

మ. క్షితిదేవోత్తముభార్య యంతఁ బ్రసవించెన్ సూను నేడొప్ప వాఁ

* "స ఉపస్పృశ్య శుచ్యంభో నమస్కృత్య మహేశ్వరమ్" అని మూలము.

డతివేగంబ యదృశ్యుఁడై తనువుతో ౹ నభ్రంబునం బోయె ముక్
సుతుదేహంబయినం గనంబడెదు నాకుఁజూపైనలే దిప్పు డ
ప్రతిమంబౌ విధి పూన్కికిం బ్రతియెనొర్వన్ వచ్చునే యేరికిన్. ౩౯ 2281

క. ఆవిధ మెఱింగి వే యా, భూవిబుధుఁడు పోయి కృష్ణుమూర్తికడం బెం
పావహిలంగ నెసంగెడు, నావిజయుఁ బదఱుచు నిటు ౹ లలుకం బలికెన్. ౩౯౫

*తే. అకటకట! నాదుమౌఢ్యంబు ౹ నరయుఁ డింక
నే నపుంసకుమాటల ౹ నెల్లనమ్మి
మోసపోయితి నాకంటె ౹ మూఢుఁ డొకఁడు
గలఁడె వెదకిన నెప్డు లోకముల నెందు. ౪౦ 2283

సీ. ప్రద్యుమ్నుఁ డనిరుద్ధబలదేవ కేశవు లెవ్వాని బ్రదికింప ౹ నించుకంత
యే నశక్తులైరో సూను నవ్వానిని బ్రదికింప శక్తుఁడెవ్వఁడు మఱొకఁడు
దైవోపసృష్టుని ౹ నేవిధినైనను గాపాడుదు నటంచుఁ ౹ గడఁగి యన్నృత
ములుపల్కి తన్నుఁ దాఁబొగడుకొనిన యట్టి యర్జునుండే నింద్యుఁడౌనుగాదె

తే. యతని ధనువైన గాండీవ ౹ మగ్నిలోన
వైవనే యిట్లుపల్కిన ౹ వాఁడు తలఁప
దుర్మతియుఁగాఁడె యని యిట్లు ౹ దూఱుచుండఁ
బార్థుఁ డాలించి యోజించి ౹ పరమనియతి. ౪౨౫ 2284

ఉ. ఎందుఁజనంగ నెమ్మదికి ౹ నిష్టమొ యచ్చటి కన్డెపోవఁ జే
యం దగు నాత్మవిద్యఁ గొని ౹ యాయమునఁ దుండెదు వీటికేగి యం
దెందునుగాని యామృతమహీసురపుత్త్రుని గానకల్లె సం
క్రందను పత్తనంబునకుఁ ౹ గ్రన్ననఁబోయెను బూన్కిమీఱఁగన్. ౪౩౫ 2285

సీ. భగ్నాశుఁడై మఱి ౹ జ్వలన రాక్షస జలపతి వాయు ధననాథ ౹ పత్తనముల
స్వర్గరసాతల ౹ భవ్యస్థలంబుల నింకనుగల యట్టియెల్లపురము
లను జూఁడబోయెను ౹ ధనువు సజ్యము చేసికొని యందు నెచ్చటఁ ౹ జిసురుని
సంతానమును గానఁజాలక తనదగు ప్రతిన దీర్పఁగ రామిఁ ౹ బావకునకుఁ

తే. దనదుదేహము నాహుతిగ నొనరింపఁ
దలఁచె; నంతట శ్రీహరి ౹ దయ మెఱయఁగ
వచ్చి యగ్నిఁ బ్రవేశింప ౹ వలదు పార్థ
యని నిషేధించి మఱియు ని ౹ ట్లనుచుఁ దెలిపె. ౪౪౫ 2286

చ. ధరణిసురేంద్రసూనులను ౹ దర్శనయోగ్యులఁ జేయువాఁడఁజు
మ్మరయక నీకు నీవె తగనట్టు లవజ్ఞను గూర్పఁబూన కి

* "మౌఢ్యం పశ్యత మే యోఽహం శ్రద్ధధే క్లీబకత్థనమ్" అని మూలము,

త్తరుణమునందు శాంతిగను । దాన మనుష్యులు నీదునాడఁకీ
ర్తిరమను సుస్థిరంబుగ ధరిత్రి నెసంగ నొనర్తు రర్జునా! ౮౭ 2287

చ. అని వచియించి యానరుని । నాత్మరథస్థునిగా నొనర్చి చ
య్యనఁజనియెం బ్రతీచికి నహార్యగతుల్ దగ నట్టులేగుచుం
వనధుల ద్వీపశైలముల । వైళమ దాఁటెను సప్తసంఖ్యలం
వనరుహనాభుఁ డవ్వలఁ బ్రభావమునందగు చక్రవాళమున్. ౮౮ 2288

క. కనుఁగొని దానికి నవ్వల, ఘనతరమగు తమముఁ జొచ్చెఁ । గాని యచట స్యం
దనమునులాగు మహాశ్వము,లనుపమవేగంబు గలుగునవియే యైనన్. ౮౯

సీ. నడువఁజాలకయె యుండఁగ వానిశైబ్యాఖ్యమును మేఘపుష్పకమును బలాహ
కమునుసుగ్రీవముఁ । గనుగొని యోగేశ్వరేశ్వరుండైన శ్రీకృష్ణమూర్తి
వేయి సూర్యులరీతి । వెలుఁగుస్వచక్రము ముందుగఁ జనఁ బంచె । భూరిశక్తి
నలరెడుప్రకృతిచేఁ । గలిగి సుఘోరమై గహనమై తగునంధకారముఁ దన

తే. యనుపమానతేజస్సుల । నట్టె విరియఁ
జేయుచుం గడువేగమై । యాయమోఘ
రామబాణము రాక్షస । రాజిఁబోలె
నాసుదర్శన మరుగంగ । నశ్వము లొగి. ౯౦ 2290

క. హరిచక్రదర్శితం బగు, సరణిం జనుచుండె; నంత । స్యందనమునకుం
గురుపథముఁ జూపుతేజముఁ, బరమ మపారంబుఁ జూడఁ । బార్థుం డోడెన్.

క. కనుయుగము మూసికొనియెం, వనజాక్షుని స్యందనంబు । వడిఁ బాఱుచు స్ప
ర్శనవేగవర్ధితోర్ముల,గనఁ భీతిదమైన జలముఁ । గడఁకం జొచ్చెన్. ౯౨ 2292

ఉ. అందొకదివ్యమందిరము । హారితమంబయి వేలస్తంభముల్
సుందరరీతిఁ గన్పడఁగ । శోభిలుచుం బలుచిత్రరీతు లొ
ప్పం దగియుండె నట్టిదయి । భర్మమయంబగు సౌధవర్య మా
స్యందన మట్టె చొచ్చె రుచిజాలము లెల్లెడఁ బర్వుచుండఁగన్. ౯౩ 2293

ఉ. ఆమహనీయమందిరమునందు సహస్రఫణామణి ప్రజో
ద్దామమరీచు లుల్లసిల । దారుణదృష్టులు రెండువేలు ర
క్తామలతేజముల్ దగ మహాత్తరభీతి జనింపఁ జేయఁగా
నామెయి శ్వేతకాంతిఁ దను । వద్భుతముం గన జేయుచుండఁగాన్. ౯౪ 2294

సీ. కైలాసశైలంబుకరణి వెలుంగుచుఁ గంఠశవ్యాలయందుఁ । గానబడెడు
నీలత్వ మెన్నంగఁ । జాలియుండఁగ నొప్పు భోగికులేశుండు । భూరితేజుఁ
డగు ననంతుండొప్పు । నతనిభోగమె సుఖాసనముగఁ గూర్చుండి । యనుపమాసి
తాంబుదచ్ఛాయ మై । నలముకొనంగ సుందరపీతవస్త్రంబుఁ । దాల్చి దాని

తే. లలితకాంతులు దిగ్విదిక్కులఁ జెలంగ
నుండెఁ బురుషోత్తముండు లోకోత్తరుండు
సురుచిరాయతవీక్షణుఁడురుమణిగణ
ఖచితమకుటంబు వింతగఁ । గ్రాలుచుండ. ౨౩ 2295

చ. సురుచిరకుండలద్వయము । శుభ్రమణిద్యుతులన్ వెలుంగ నా
భరణగణంబు రత్నరుచివారము నీనుచునుండఁ గుంతలో
త్కరము కిరీటకుండలసుకాంతుల నెంతయుఁ గూడుచున్ మనో
హరముగ నొప్ప నాయతభుజాష్టక మాశ్రితతృప్తి చేయఁగన్. ౨౪ 2296

క. వనమాలయు శ్రీవత్సం,బును గౌస్తుభమణియు వక్షమునఁ గ్రాలి ముదం
బును భక్తుల కిడఁగ సునం,దనందముఖ్యాశ్రితులు నితాంతముఁ గొల్వన్.

క. తనువుల ధరించి చక్రా,దినిఖిలదివ్యాయుధములు । దీపింపఁగ శ్రీ
యును బుష్టి కీర్తి సంపద,లును మాయయు లోనుగాఁ గలుగు దేవతలున్.

మ. తనుఁ గొల్వం బరమేష్ఠి ముఖ్యుల కొగిం । దా నీశ్వరుండై నిరం
జనుఁడై యుండు మహాత్ముఁ గన్గొని మనస్సంజాతభీతిన్ సుద
ర్శనహస్తుండు నరుండు మ్రొక్కి; రపు డాచక్రాయుధున్ సవ్యసా
చిని జేమోద్పులనొప్పఁగాఁ గని వచించెన్ దేవదేవుం డిటుల్. ౨౭ 2299

ఉ. మోమున సుస్మితంబొలయ । ముగ్ధగభీరగళస్వనంబు స్వా
త్మామలవృత్తిఁ దెల్పఁగ మదంశమునన్ జనియించినట్టి యో
శ్రీమహితాత్ములార! మిము । సిద్ధతపస్వులఁ జూడఁ గోరియే
త్సామరవర్యపుత్రకులనప్పుడె రాఁ దలపోసితిన్ మదిన్. ౨౮ 2300

తే. అవని ధర్మంబు రక్షింప । నవతరించి,నారు నాయంశముంగొని । మీరు వేగ
యప్పనిం దీర్చి నాకడ । కరుగుదెందు, భూమిభారుల దితిజులఁబాం గడంచి.

క. ముని నరనారాయణులను, మునులయ్యున్ మీరు లోకమున ధర్మంబున్
మనుజులు సమాచరింపం,గ నుదాహరణముగఁ జేయఁ । గల్గితిరి విధిన్. ౩౦

ఆ. పూర్ణకాములయ్యుఁ । బురుషులకు న్నేర్ప
మఱియు నాచరింప । మైకొనుఁ డని
యానతీయఁ గృష్ణుఁ । డర్జునుండును "దథా
స్తు"నుచు విప్రసుతులఁ । గొనుచు మ్రొక్కి. ౩౧ 2303

క. మరలి మహామోదంబున, నరుదెంచిరి పోయినట్టు । లాత్మవసతికిన్
ధరణీసురునకుఁ బుత్త్రో,త్కర మొసఁగిరి వారు తొంటికరణి వెలయఁగన్.

చ. కనుఁగొని యద్భుతంపడుచు । త్మోసురుఁ డౌర! వయస్సు రూపముం
గన నదియే యటంచుఁ దమిఁ గాంచుచు నుండెను; విష్ణువాసమై

యనుపమమగు పురంబుగని యర్జునుఁ డెంతయు విస్మయాంబుధిన్
మనము మునుంగఁ బౌరుషము మాధవుసత్కరుణన్ ఫలించెడిన్. ౬౨ 2306

క. అదె లేకయున్న నిష్ఫల, మదియగు ననునిశ్చితంబె యాత్మన్ మిగులం
బొదలఁగ నుండెను; శ్రీహరి, ముదమున నేతాదృగమలభూరి క్రియలన్. ౬౩

క. అతిమానుష విక్రమముల, మితిమీఱిన వాని జేసి మించినతమి న
చ్యుతుఁ డొగిని విషయసుఖసం,తతిమానవు లెట్టు లట్లు తాఁ గనుచుండెన్.

క. యాగంబులు పెక్కు మహా,భాగుం డొనరించి ధరణిఁ బామరులకుఁ దా
నే గతిఁజూపుచు మించెను, యోగీశ్వరనాథుఁడయ్యు నుద్యమ మలరన్. ౬౪

తే. మఱియు శ్రీహరి పర్జన్యమాడ్కిఁ దఱిని
సకలపురుషార్థరూపవర్షంబుఁ గురియు
చును ధరామరముఖ్యులౌ మనుజులఁ దమి
నొందఁ జేయుచు శ్రేష్ఠత్వ మొప్ప వెలసె. ౬౫ 2309

ఉ. కొందఱు ధర్మదూషకుల క్షోణిపతీంద్రులఁ బూన్కిమీఱఁ దా
గ్రుందఁగఁ జేసె జిష్ణుపవమానతనూజులవంక గ్రుందఁగాఁ
గొందఱఁ జేసె ధర్మజముఖుల్ గుఱుధర్మపథంబు నూనియుం
డం దనవర్తనంబును గనంగ నొనర్చెను నేర్పుమీఱఁగన్. ౬౬ 2310

---

తొంబదియవయధ్యాయము.

## శ్రీకృష్ణలీలావర్ణనము.

చ. అని యభిమన్యుసూనునకు నాశుకయోగివరుండు తెల్పి యి
ట్లను మఱియుం బరాత్పరుని దా చరితంబు వచించువేడ్క నో
జనపతివర్య! యిక్కరణిఁ జక్రధరుండు రమాధవుండు చ
క్కనిదగు ద్వారకాపురిని గాలము పుచ్చుచునుండె లీలతోన్. ౧ 2311

సీ. సంపత్సమృద్ధంబు సకలయాదవవృష్ణి వరసంకులంబు భాస్వద్విభూష
ణావళిచే, నూత్నకిశోరి యౌవనముచే మెఱుపుఁదీవియలను మించునట్టి
తనుకాంతి వితతిచేతను బొల్చు సుందరీరత్నముల్ హరిహర్మ్యంబులందుఁ
గందుకక్రీడలఁ గడుఁబూన్కి విహరింప నెంతో సుందరముగ నెసఁగుచుండె

తే. ద్వారకాపుర; మందు భద్రగజవితతి
మదజలంబులఁ దడుపంగ మార్గములును
బంకిలంబులుగా నుండు భవ్యభూష
ణాళిచే నొప్పి భటతతి యశ్వములును. ౨ 2312

క. అరదంబులు చూడందగి, తిరుగాడుచునుండు మఱియు దివ్యోద్యానో

త్కర ముపవనములు గన్పడు, సురుచిరముగ నందునుం గుసుమతరువులపై.

క. తుమ్మెదకదుపులు మఱి విహ,గమ్ములు పూఁదేనె లానఁగాఁ బల్లవబృం
దమ్ములు కొఱుకఁగ మూఁగి ర,వమ్ములు చేయంగ దెసలు బదులు ధ్వనింపన్.

క. కనవిన వేడుకగా నుం,డును శ్రీకృష్ణుండు కామినులు షోడశసం
ఖ్యను బొల్చుసహస్రంబులు, తను నెప్పుడు కొల్వ నొకఁడె తా వల్లభుఁడై. ౮౫

మ. సకలైశ్వర్యయుతంబులై తనరు సౌధంబులం దద్భుతం
బు కనంజేయు తనూవిలాసముల నాపూఁబోడులంగూడి తా
నొకఁడే యందఱ కన్నిరూపములతో నొప్పారుచుం బొల్చిన
న్నొకతెం గూడియె యుండు భర్తయని లో నూహింప వా రందఱున్. ౫౬

సీ. విరియంగఁ బూచిన సరసిజకహ్లారకుముదోత్పల పరాగసముదయముల
పరిమళమిళిత పుష్కరముల సంపూర్ణములగు సరోవరములను మఱియు
నట్టివౌ హ్రదినులందును దమిమించు నట్లురుతంబుల నాచరించు
జలవిహంగమ రాజములఁ గాంచి మెచ్చుచు నిందుబింబాస్యలానందఱఁ దగఁ

[1]తే. గలిసి విహరించె విభవము లలిఁ జెలంగ
నన్నుమిన్నలు కౌఁగిట నదుముకొన్న
గుబ్బపాలిండ్ల నలఁదిన కుంకుమంపుఁ
బంకమున మేను వింతయై పరిఢవిల్ల. ౭ 2317

క. అత్తఱి గంధర్వులు తమి, నుత్తమగీతములు పాడుచుండఁగ మోదా
యత్తమతులైన మాగధు, లత్తెఱఁగున సూతవందులాహరిభక్తిన్. ౭౫ 2318

క. ఆనక మృదంగ పణవ, స్వానంబులు వీణియల రవంబులు దిశలన్
మ్రానుపడన్ వాయించుచు, శ్రీనిలయు నుతించుచుండ సీమంతినులున్. ౮ 2319

[2]చ. అలరుచు నవ్వుచున్ సరసిజాక్షుని నంజలులన్ జవంబునన్
జలముల నింపి చల్లుచును జర్మవినిర్మిత యంత్రరాజిచే
సలిలము లేచి పైఁబడఁగఁ జల్లుటయున్ హరియున్ సరోజనే
త్రలపయి దోయిలించి యమృతంబులఁ జల్లెను సుస్మితాస్యుఁడై. ౯ 2320

క. యక్షప్రమదలతో నా, యక్షవిభుం డట్టు లప్డు హరియు వెలిఁగెఁ బ
ద్మాక్షులు చుట్టును దగఁ బ్ర,త్యక్షశ్రీదేవి వెలసె ననియుం దోఁచెన్. 2321

చ. తరుణులు మేటివల్వ లమృతంబులచేఁ దడియంగ స్పష్టమౌ
కరణిఁ గుచంబు లూరువులుఁ గన్పడుచుండఁగఁ బ్రీతిమీఱ సుం

---

1 "కుచకుంకుమలిప్తాంగః పరిరబ్ధశ్చ యోషితామ్" అని మూలము. 2 "సిచ్యమానోఽచ్యుత స్తాభిర్హసంతీభిశ్చ రేచకైః" అని మూలము. "రేచకైః జలక్షేపణయంత్రవిశేషైః చర్మాదినిర్మిత సేచనయంత్రై రిత్యర్థః."

దరకబరీచ్యుతప్రసవ ♦ దామము లల్లన వీడి రాల నీ
శ్వరుఁడగు కృష్ణమూర్తిపయిఁ ♦ జల్లిరి జీవనముల్ వడిన్ వడిన్. ౯౪ 2322

ఉ. కాంతలు కృష్ణమూర్తి తమకంబు మెయిన్ దమపై జలంబులం
బంతముమీఱఁ జల్లు ననుభావమునం బతిచేతి జంత్ర మా
వంతయు శంకలేక గొనునట్లు నటించుచు నల్లనల్లనం
జెంతకుఁబోయి కౌఁగిటను ♦ జిక్కఁగఁ గైకొని రెంతొ నేర్పునన్. ౧౦ 2323

ఉ. ఆమెయిఁ గౌఁగిలించుకొని ♦ యాత్మభవోదయ మగ్గలంబు కాఁ
గా ముఖపద్మముల్ మిగులఁ ♦ గాంతిని రాజిల నొప్పి; రప్పుడా
శ్రీమహిళావిభుండు తనుఁ ♦ జేడియ లవ్విధిఁ గౌఁగిలించి యెం
తో ముఱిపెంబు చూపఁ దమి ♦ నొయ్యనఁ జొక్కుచు వారిఁ గూర్మిమై.౧౦౪

*తే. ఆదరించుచు నవ్వారి ♦ యలఘుతర ప
యస్సదనమండలాలగ్న ♦ హారికుంకు
మపరిమళములు పుష్పదామములు మేను
నిండ నలముకొనం గేళినిరతి నపుడు. ౧౦౫ 2325

చ. తనువుచలింపఁ గుంతలవితాన మొగిం జలియింప నాననం
బున ముఱిపెంపు నవ్వురుచిఁ ♦ బొల్చి నటింప విలాసినీతతుల్
తను నెదిరింపఁ గమ్రజలధారలు పర్వఁగఁ జల్లులాడుచున్
వనగజ మక్కరేణుయుతిభంగిని దా విహరించె నొయ్యనన్. ౧౧ 2326

ఉ. వల్లభు నావిలాసినులు ♦ వారక పైఁబయి నీటిధారలం
జల్లుచు ముంచుచున్ విభుఁడు ♦ సంతసమందఁగఁ గేళిసల్పఁగా
నుల్లములందుఁ గల్గుప్రమదోర్ములు పొంగఁగ నర్తకీతతుల్
సల్లలితస్వరం బమరు ♦ చందము గన్పడ బాడి యాడఁగన్. ౧౧౪ 2327

సీ. నటులు నృత్యము చేయ ♦ నానాప్రకారగీతములువాద్యంబులు ♦ దమకు జీవ
నమును గల్పింపఁగా ♦ సమయంబుఁ బుచ్చెడు వారును సేవింప ♦ వారి కెలమి
నావిహారమునకు ♦ నర్హమ్ములగు నలంకారములను వస్త్రగణము నొసఁగె
నతివలు పతియాజ్ఞ ♦ నట్లయొసంగిరి; హరియిట్లు విహరింప ♦ నతనిబెడఁగు

తే. నడకలును ముద్దుపల్కులుఁ ♦ గడుమనోజ్ఞ
ములగుచూపులు సుస్మితంబులు ప్రియోక్తి
హాస్యవచనపరీరంభణాదు లతివ
మిన్నల మనముల హరించె ♦ మేదినీశ!. ౧౩ 2328

* "కృష్ణస్తు తత్స్తనవిషజ్జితకుంకుమస్రక్" అని మూలము.

చ. అతివలు వారలెల్ల వనజాతుని యందె మనంబు లెంతొ యా
ద్యుతిఁ గనమేనులన్ మఱచి కృష్ణుని నెంచుచుఁ బల్కుచుండి యిం
త తడవు; లోనఁ బొంగు ప్రమోదంబున వేఁడుకొన్న యట్టి దా
జతనముమీఱఁ బల్కి రిటు త్వావర! వాని వచింతు నీకిటన్. ౧౩ 2329

చ. హరిప్రియపత్నులం దొకతె యల్లన నోకురరీ! యటంచు నొ
క్కరితను బిల్చి యిట్లనియెఁ గంజదళాక్షుఁడు గుప్తబోధుఁడై
పరఁగి జగంబు నిద్రగొన భవ్యతమోత్తమతల్పమందు ని
ద్దురఁ గొనియున్నవాఁడు వగఁ దొయ్యలి నీవును నిద్ర మానుచున్. ౧౪

క. విలపించుచున్నదానవు, జలజాక్షున కిట్లు నిద్ర జాఱఁగఁ జేయం
గలుగుట తగవే నీయెడఁ, గలుగదు తప్పింతయే నిశాము మరయఁగన్. ౧౫

తే. ఫుల్లనీరేజనేత్రుఁడు పాలయఁ జేయు, చారుతరహాసలీలావిశాలదృష్టి
పాతమునఁ జొక్కఁ జిత్తముప్పవ్వళింప, మాని మావలె విలపించుదానవుకద.

సీ. మఱియొక్కసుందరి మానిని నొకతుకఁ బరికించి యనుఁ జక్రవాకి! రేయిఁ
బ్రాణేశుఁ గానక పరమకరుణముగ నతుల మూసికొంచార్తిమించ
వాపోయె దవదేల? వనజాక్షుదాస్యము మావలెనే పొంది నీవు నతని
పాదసేవితమగు పావనమాల్యముఁ గబరీభరంబునఁ గమ్రభూష

తే. ణముగఁ దాల్పంగఁ గోరుదో ప్రమదమార
సనియె వేఱొక్కపత్ని యిట్లను; సముద్ర
మా రవంతయు నిద్ర నేమాడ్కి గనక
మేలుకొని ధ్వనిచేయు దేవేళయందు. ౧౭ 2333

క. మావలెనె దురత్యయమయి, యేవిధిఁ దప్పింపరాని యీయాపదయే
యోవారిధి నీ కమరెనె, శ్రీవల్లభుఁడు రతిఁ దేలించియె సంప్రీతిన్. ౧౮

క. స్తనకుంకుమాది చిహ్నములను దొంగిలి నట్టిరీతి లక్ష్మి మొదలుగాఁ
దనరారు నీదుచిహ్నము, లనువుగ దొంగిలినవాఁడె యల్లనఁ జెపుమా. ౧౯

చ. సరసిజనేత్ర యింకొకతె చంద్రునిగూర్చి వచించె మార్పఁగా
దర మెటుగాని యక్ష్మ మను దారుణరోగము నిన్నుఁ బట్టి దు
ర్భరముగ వేఁచుచున్నయది వర్ష్మము క్షీణత నొందుచుంటయే
సరియగు కారణం బనుచు స్వాంతము నమ్మెడుఁ జంద్రుఁడా యిటన్. ౨౦

చ. కనుకనె నీదుచంద్రిక లగాధతమస్సును మాపఁజాలకో
య్యనఁ గృశియించువాఁడవొకో! యీవనజాక్షుఁడు పల్కినట్టి చ
క్కని వచనావళిన్ మఱచి కాంచనచేలునియందె నెమ్మనం
బునిచిన మావలెన్ బలుకకుండెద వంచును దోఁచె నిత్తఱిన్. ౨౧ 2337

ఆ. మలయపవన! నీవు జలజేక్షణాపాంగ, ములఁ గలఁగిన మాసుశీలలలితహృదయ
ములను స్మరుని తాపమును జెందుచున్నావు, చేసినామె నీవు గాసిలుకృతి.

క. అపకృతిఁ గావింపని మమ్మిపు డీగతి నార్తినొందఁ జేలా చేయన్
గృప మానకుండు టుచితమె, కపటాత్ముల కెప్డు మేలు గలదే చెపుమా? ౧౮

చ. అని వచియింప వేఱొకతె యార్తిని గుందుచు నిట్లుపల్కె నో
ఘన! సిరిగుల్కు దీవు యదుకాంతునకున్ హరి కాతపంబుసో
కున తనువింత గ్లానిగని కుందకయుండఁగఁ జేయుచుందు కా
వునఁ జెలువుండవే యనఁగఁ బొల్తువు పావనమూర్తి వందునన్. ౧౯ 2340

తే. కనుక శ్రీవత్సచిహ్నునంగదు నరయంగ
మాపలెనె ప్రేమబద్ధుఁడవై వఱలుచు
నిశ్చలాత్మత వాని ధ్యానింతువేమొ
తమక మొప్ప జలార్ద్రహృదయుండ వగుచు. ౨౦ 2341

క. హరిఁ దలఁచి తలఁచి బాష్పోత్కరమును బలుసారు లీవు ధారలుగా నీ
ధరఁబడ వదలుచు నున్నా, వరయఁ దదీయప్రసంగ మార్తిదమె కదా!. ౨౧

సీ. అనునంత వేఱొక యన్నుమిన్నయుఁ బల్కె మధురస్వరముగల్గు మత్తకోకి
లమ! ప్రియంవదుఁడగు సమరేంద్రపూజితు పదములఁ బోలుశబ్దముల నీవు
పలుకుచు నున్నావు పలుమఱు మృతులను బ్రదికించు మృదులశబ్దములచేత
నాకుఁ జెల్పుము యింకసీకేప్రియ మొనర్తు; క్షితిధర! యున్నతమతిఁ జెలంగు

తే. వాఁడవౌటను గదలవు పలుక వీవు
భూరితరముగు నర్థంబు గోరి యెదియొ
మదిని దలపోయుచున్నావు మాధవాంఘ్రి
యుగము మేము పొలిండ్లఁ దాల్పఁగఁ దలఁతుము. ౨౨ 2343

క. గురుతరశిఖరంబుల మా, కరణిని దాల్పంగ నీవు కాంక్షింతువె; నాఁ
దసుణిరొయొక స్త్రీక పల్కెను, సరిదధిపతిపత్నులార! చక్కఁగ వినుఁడీ. ౨౨ 2344

చ. హరిప్రణయావలోకసముల్లంఘిమి, నెమ్మనముల్ కలంగ ని
స్పృహతఁ జిక్కి వగపర్వఁగ స్రుక్కియె యున్నవార మ
క్కరణిగ నీవు గ్రీష్మమునఁ గన్గొనఁ బుష్పముఁగుల్ కృశింపఁ దా
మరసపరాగ మూఱఁ బ్రియముమన్నసుం దగుచూడ్కి కల్గమిన్. ౨౩ 2345

తే. అక్కట! కృశించియున్నవా రనఁగ నొక్క
సారసాక్షి పఠించె; హంసవర! యిందుఁ

గూరుచుండుము త్రాగుము ॥ క్షీరములను
శౌరికథల వచింపుమా ॥ కోరి కలర. ౨౩౪ 2346

ఆ. కృష్ణుదూతవనుచు ॥ నెఱుఁగుదు మయ్యజితునకు సుఖమె యతని॥తోడి మైత్రి
చంచలమ్ముసుమ్ము ॥ స్వాంతమ్మునన్ మమ్ముఁ, దలఁచువాఁడె నాఁటి ॥ తనపలుకుల

సీ. క్షుద్రదూతవు నీవు ॥ కోరి మేమాతని నేలభజింతు మీ॥వేగి యిటకు
వానిఁ దోడ్కొని రమ్ము॥వడిఁబోయెదవొ యేమొ మమ్ము వంచించియే॥యె మ్మెలాడి
తా నొకర్తుకయె య॥వ్వానితోడ సుఖించు చున్నదో యాసిరి ॥ నొక్కదాని
వదలి యాకృష్ణు మా॥వల్లభుఁ దోడ్కొని ర మ్మనపాయిని ॥ రమ యనియెదొ

తే. యన్న మిన్నలమైన మా॥యందు నామె
మాత్రమే యేకనిష్ఠ యా॥మాధవునెడఁ
గల్గి యున్నదియే మేము ॥ కాదొ యనుచు
నొక్కరొక్కరుగాఁ బల్కి ॥ రుద్యమమున. ౨౮ 2348

ఉ. శ్రీపతి భామినీమణులు ॥ చెందిన వేడ్కను యోగిరాడ్విభుం
డౌ పరమాత్మునందు నిటు ॥ లాయతనిర్మలభావ మొప్పఁగా
నాపరమేశు సద్గతినె ॥ యందఱు పొందిరి; పెక్కురీతులన్
బాపహరంబులౌ స్తుతులఁ ॥ బాటలఁ గీర్తితుఁడై చెలంగుచున్. ౨౯ 2349

తే. భక్తమందారమైన శ్రీ॥పతియుఁ దనదు
చరితముల నాలకించెడు ॥ తరుణుల మన
సులను దనవంకలాగెడు ॥ సురనుతుఁ డల
హరి తనుం గన్నులార నెయ్యమునఁ గనుచు. ౨౯౪ 2350

క. తనుఁ బొగడుచు నుండెడునా, వనితల చిత్తములఁ దనదు॥వై పునకున్ నే
ర్పున లాగు ననఁగఁ జిత్రమె, వనజాక్షుని లోకగురుని ॥ వల్లభబుద్ధిన్. ౨౬

చ. నిరుపమపాదపద్మముల ॥ నిత్యము నొత్తుచు నింక నెన్ని యో
వరుసల సేవలం దమిని ॥ వారనిపూన్కి నొనర్చుచుండు రా
తరుణులదౌ తపోనియతి ॥ ధాత్రి నుతింపఁగ నేర్చికై ననుం
దరమె? మహీశ! యీగతి ని॥తాంతము సద్గతియైన చక్రియున్. ౨౭ 2352

చ. శ్రుతివిహితకర్మజాలముల ॥ రూఢిగఁ దా నొనరించుచున్ గృహాం
బతులితధర్మకామములు ॥ నర్థము నాఁ దగు వానికిం బదం
బితరము గా దటంచు మము ॥ నెల్లర నమ్మఁగఁ జేసె నెన్ని యో
గతులఁ; గృహస్థధర్మములఁ ॥ గావలె నంచు నొనర్చుచుం దమిన్. ౨౮ 2353

సీ. వర్తించుచున్న య । వ్వాసుదేవునకుఁ బదార్వేలుశతము । నష్టాధికంబు
గాఁదగుసంఖ్యలఁ । గాంత లుండిరి; వారియం దష్టసంఖ్యల । నలరు పత్ను;
లారుక్మిణీసత్య । లాదిగాఁ దగువారు సుతులఁగాంచిరి వారె; । వితతమైన
విఖ్యాతిఁ గాంచిరి । వెన్నఁ డప్రతిహతసంకల్పుఁడౌట నా । సతులు నొక్క

తే. రొకరు పదుగురఁ బుత్త్రుల । సకలసుగుణ
మండితులఁ గాంచునట్లుగ । మదిఁ దలంచె
నట్లె ఫలియించె నదియె మ । హాత్మశక్తి
యనుచు నెఱుఁగంగఁ దగియుండు । నవనినాథ!. ౩౧ 2354

వ. ఉద్దామవీర్యులగు నాపుత్త్రులలోఁ బదునెనమండుగురు మహారథులు సుదారయశస్కులునై యుండిరి. వారినామధేయములువచించెద నాలకింపుము. ప్రద్యుమ్నుం, డనిరుద్ధుఁడు, దీప్తిమంతుఁడు, భానుండు, సాంబుఁడు, మధుఁడు, బృహద్భానుఁడు, చిత్రభానుఁడు, వృకుం, డరుణుఁడు, పుష్కరుఁడు, దేవబాహుఁడు, శ్రుతదేవుఁడు, సునందనుఁడు, చిత్రబాహుఁడు, విరూపుఁడు, కలి, న్యగ్రోధుఁడు ననువారలని యెఱుంగుము. *త్రివక్ర యనఁబరఁగు కుబ్జయందు నుపక్రోశుండు పుట్టె. ఆతఁడు నారదునకుఁ బ్రియశిష్యుండయ్యె. ఆయుపక్రోశుఁడు కృష్ణున కనువ్రతుఁడై భగవంతునియం దఖండితచిత్తమునిచి సాత్వత తంత్రము రచించె. దానినెఱింగిన ముక్తిఁగలుగు. స్త్రీశూద్రదాసులకు వైష్ణవసంస్కారమాతంత్రమునందే విధింపఁబడియె. మధుసూదనుని పుత్త్రులయందెల్ల రుక్మిణీప్రథమపుత్త్రుండగు ప్రద్యుమ్నుఁడు పితృతుల్యుఁడనం బ్రఖ్యాతి వహించె. అమ్మహారథుఁడు రుక్మికూఁతుం బెండ్లియాడె. ఆపురంధ్రియం దాతం డనిరుద్ధుం డనుకుమారుంగాంచె. ఆతండు పదివేలయేనుంగుల బలముగలవాఁడయ్యె. అనిరుద్ధుఁడు రుక్మిదౌహిత్రుండగుట రుక్మిపౌత్త్రిం బెండ్లియాడె. ఆతఁ డాపత్నియందు వజ్రనామకుని గొడుకుంబడసె. అక్కుమారుఁడే మౌసలక్షయమునం జెడకవంశకర్తయై నిలిచె. వానికొడుకు ప్రతిబాహుఁడు వానితనయుఁడు సుబాహువు. ఆతనికి ధర్మసేనుండును, వానికి శ్రుతసేనుండును గొడుకులైరి. ఏతద్వంశజాతులు ధనహీనులు, బహుపుత్త్రహీనులు, నల్పాయుష్కులు, నల్పవీర్యులు నబ్ర

* "త్రివక్రాయాముపక్రోశః పుత్రః, కృష్ణమనువ్రతః. శిష్యస్సతు నారదస్య దధౌచిత్తమఖండితం. ౩౫. తేనోక్తంసాత్వతం తంత్రం యజ్జ్ఞాత్వా ముక్తిమాప్నుయాత్. యత్ర స్త్రీశూద్రజాతానాం సంస్కారో వైష్ణవస్స్మృతః." ౩౬. ఈరెండుశ్లోకములు నాగరప్రతియందులేవు. శ్రీధరాచార్యులవ్యాఖ్యయుం లేదు.

ష్ణాణ్యులు ననఁబడరు. యదువంశప్రసూతులై విఖ్యాతగుణకర్ములగు పురుషుల
లెక్కింప నయుతవత్సరములకైన శక్యంబుగాకయుండు. ౮౦ 2355

*తే. యదుకుమారుల కాచార్యులైన వారె, మూఁడుకోట్లెనిమిది వేలఁగూడి యున్న
యెనిమిదిశతంబులని గణియింపఁ బడియె, ననుచు వింటిమి పెద్దలే యనువదింప.

క. విను మొక్కయాహుకునకే, తనయులు శంఖత్రయంబు తగుదు రనఁగఁ బే
ర్మినిగను యాదవులకుఁ గల, తనయుల లెక్కింపవశమె ధాతకునైనన్. ౮౧

క. దేవాసురసంగరమున, నేవారలు నిహతులైరొ యెల్లదితిజులం
దావారె భీషణాకృతు, లై వసుధంబుట్టి నరుల నందఱఁ గినుకన్. ౮౩ 2358

తే. వరుస బాధింపఁ దొడగిరి హరియు వారి, నిగ్రహింపఁగ ధరణిజనింప నాజ్ఞ
నీయ దేవతల్ యదువృష్ణికులము, లందుఁబుట్టిరి శ్రీహరియాజ్ఞఁ బూన్కి.

క. కులమేకాధిక శతమై, యిలఁ బరఁగెన్ వారలకు మహేశ్వరుఁ డగుచున్
జలజాక్షుఁడు శ్రీహరియై, చెలఁగెన్ ధర నవతరించి శ్రీ సతితోడన్. ౮౫

క. హరి ననుసరించి యాదవ, వరులెల్లన్ వృద్ధినొంది భవ్యయశమునన్
ధర నిండిరి వారెల్లరుఁ, బరమేశ్వరుఁ గృష్ణమూర్తిఁ బరమప్రీతిన్. ౮౬ 2361

సీ. శయ్యాసనంబుల సంచరణంబున నాలాపకేళుల నట్లె స్నాన
మాదియగుకర్మములందు మనస్సుల నిలిపి తమ్మెఱుఁగక వెలసియుండి;
రింతకుఁ బూర్వ మిలయిలఁ దీర్థములనెల్ల స్వర్ణది యుత్తమసంజ్ఞ నలరు
తీర్థంబుగా నుండె స్థిరయదుకులమందు నవతరించినహరి యమలకీర్తి

ఆ. రూపతీర్థ మతని శ్రీపదశౌచమై, నట్టి గంగ యనఁగ నమరు తీర్థ
ము నొనరించె నల్పముగ నాహరి యశంబె, యెల్లతీర్థములకు నెక్కుఁడరయ.

క. వనజాక్షుని ప్రేమించెడు, జనులును ద్వేషించువారు సారూప్యంబున్
గనిరను టదేమిచిత్రము, వనజాయతనేత్ర లక్ష్మి భక్తేష్టదయున్. ౮౮ 2363

క. పరిపూర్ణయుఁ దా నయ్యున్, నిరపేక్షుని లోకనాథునిన్ గొల్చుచుఁ దా
నిరతినివసించుఁగద యల, పరమేశ్వరుఁ డాత్మనామభజన మొనరుపన్. ౮౯

క. తన పేరువిన్న నర్థం, బనునదియే యెఱుఁగ కెట్లొ యాదృచ్ఛికరీ
తిని బల్కిన నశుభంబులఁ, జనఁజేయును దూరముగ నొసంగెడు కరుణన్. ౮౯

చ. మునివరవంశధర్మముల మూలమునన్ జలమెల్ల వృద్ధినొం
దు ననెడికారణంబు మదిఁ దోఁచుట వానిని విస్తరింపఁజే

* "తిస్రః కోట్యస్సహస్రాణా మష్టాశీతిశతానిచ, ఆసన్ యదుకులాచార్యాః కుమారాణా మితి
శ్రుతమ్" అని మూలము.

సెను; మఱి కాలచక్రమును § జే ధరియించినయట్టి కృష్ణుఁ డే
పున క్షితిభారముం దొలఁగి § పోవఁగఁజేయుట చిత్ర మెట్లగున్. ౮౩ 2366

శా. భూతవ్రాతములన్ ధరించి తగుచుం § బూతాత్మయా దేవకిం
బ్రీతిం దల్లిగఁ బిల్చుచున్ యదువరుల్ § వేడ్కం దనుం గొల్వ వి
ఖ్యాతంబౌ యదువీరసంఘమును హస్తాబ్జద్వయిన్ ధర్మమున్
జేతోమోదము నొంద నిల్పుచును సంసిద్ధార్థుఁడై పొల్చుచున్. ౮౪ 2367

తే. మఱియధర్మము రూపఱ § మహితశక్తిఁ
జేయుచుండెను వేడుకఁ § జెంది హరియుఁ
దత్తదధికారభేదముల్ § తలఁప కెలమి
మీఱ బృందావనమునందు § మించు వేడ్క. 2368

సీ. తరుతృణాదులకును § స్థావరజంగమములగునప్పశుపక్షి § పూగములకుఁ
గలుగుసంసారదుఃఖమును బోఁగొట్టుచు సుస్మేరవదనంపు § సొంపు మీఱ
వ్రజవిలాసినులకుఁ బంచశరామోదమును వృద్ధిఁబొందు నట్లొనరిచి తన
మహిమమ్ముఁ దెలియక § పామరులు వెఱగందఁ జేయుచు నుండెడు § శ్రీహరి క్షితి

తే. నలరుఁగాక! సర్వోత్కృష్టుఁడగుచు నిట్టు, లాత్మధర్మంబు రక్షింప § నాత్మనెంచి
లీల నవతారమెత్తిన § బాలరూప, పరమపురుషుండు శ్రీహరి § కరుణ మెఱయ. ౮౬

క. ఒనరించిన మానవచర్యసికర రూపమ్ములయిన § యమలతమవిడం
బనముల వినఁ గీర్తించిన, జనియించున్ భక్తియనెడు § సద్యోగ మిలన్. ౮౭

ఆ. దుష్టకర్మములను § దూలించుహరి చర్యలను దదంఘ్రియుగ్మ § వనజములను
భక్తి గొల్చువాఁడె § భావింపఁ జాలును, మూఁడుపెళలందు § బురుషుఁ దెలవి.

చ. సిరులనొసంగు పాదసర § సీరుహయుగ్మము గొల్చుచున్ బరా
త్పరుని చరిత్రముల్ వినుచు § భావమునందుఁ దలంచుచుండ న
ప్పరముని వర్తనంబె యల § వాటగు వానిని డాయనోడు భీ
కరతనుఁడౌ యముండు కల § కాలము సంపద లొప్పు వానికిన్. ౮౯ 2372

చ. క్షితిపతు లాపరాత్పరునిఁ § జిత్రచరిత్రుని సంస్మరించుచున్
జతనముమీఱఁగా నతుల § శర్మము లిచ్చెడుపత్తనంబులన్
సతతసుఖంబు లిచ్చువర § సౌధములన్ విడనాడి కానలన్
హితముగ సంచరింతు రిది § యే తపమంచుఁ బ్రమోద మొప్పఁగన్. ౯౦ 2373

తే. అట్టిహరి నవ్యయునిఁ గొల్చు § నట్టి వారు
ముక్తినొందుదు రనుట § యబ్బురమె యనుచు

శుకమహాయోగి పావనిక్షోణిపతికిఁ
దెలియఁగాఁ జెప్పె శ్రీకృష్ణుఁ దలఁచుచుండె. ౫౦ 2374

క. బలభిన్మౌళికిరీటో, జ్జ్వలరత్నచయప్రభావిభాసురచరణా!
ఖలశిష్టహరణభరణా, మలనందకచక్రదరకమలగురుహస్తా!. 2375

చ. దురితమహాంధకారపరిధూతమనస్థిరతార్తమానవో
త్కరపరిరక్షణాదరనికామవిరాజితనామతారకే
శ్వర! వరయోగిహృత్కమలవాస! నిరంజన! నిర్వికల్ప! దు
స్తరభవసాగరోత్తరణసాధుతరోడుప! దివ్యసత్కృపా! 2376

మాలిని. అతులితగుణధామా! హారిసంపత్తిభూమా!
కృతమునిజనరక్షా! కీర్తితన్యాయపక్షా!
వితరణమణిభూషా! విశ్వకాండాత్తవేషా!
పతగపతితురంగా! భార్గవీనిత్యసంగా! 2377

గద్యము. ఇది శ్రీమత్త్రిపురసుందరీకరుణావాప్తగీర్వాణాంధ్రకవితాప్రాభవ, కాశ్యపాన్వయప్రభవ, శ్రీజనమంచి వంశాంబురాశికుముదినీమిత్ర సుబ్రహ్మణ్యమనీషిపుత్త్ర తాండవకృష్ణాపరాభిధేయ శేషాద్రినామధేయ వినిర్మితంబైన శ్రీతాండవకృష్ణభాగవతంబున నుత్తరభాగము సంపూర్ణము.

దశమస్కంధము సంపూర్ణము.

పూర్వభాగమునఁగల శ్లోకసంఖ్య ౧౦౧౦

ఈయుత్తరభాగమునగల శ్లోకసంఖ్య ౧౬౩౭.

శ్రీ కృష్ణార్పణమస్తు.

శ్రీ. శ్రీ. శ్రీ.



చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1935.

# ప్రకటనము.

ఆర్యులారా!

శ్రీరామావతారతత్త్వమునకుఁ దోడుపడఁ గోరువార లీనిబంధనములఁ బాటింపవలయును.

25 రూప్యముల నొసంగువారు రాజపోషకు లనఁబడుదురు. వారల కిద్దాని ప్రకరణముల నన్నింటిని దారికర్చులు భరించి పంపఁబడును.

10 రూ॥ ఒక్కసారి యొసంగువారు పోషకు లనఁబడుదురు. ఒక్కొక్క ప్రకరణ మొక్కరూప్యమువంతున దారికర్చులు భరించి వారికిఁ బంపఁబడును. ఈ రెండు తెగలమహాశయుల పవిత్రనామధేయము లిందుఁ బ్రకటింపఁబడుచుండును.

1 రూప్యము ముందుగాఁ బంపువారు చందాదారు లనఁబడుదురు. వారికిఁ బ్రతిప్రకరణము వీ. పీ. ర్పూ. 1-4-0 లకు పంపఁబడును.

చందాదారులు కాని వారలకుఁ బ్రకరణమొక్కొక్కటి ర్పూ. 1-4-0 లకు నీఁబడును. పోస్టుకర్చులు ప్రత్యేకము.

శ్రీరామావతారతత్త్వము, 1 మొదలు, 7 భాగములు అచ్చయి సిద్ధముగా నున్నది. ఒక్కొకభాగము ధర ర్పూ. 1-4-0

---

# ఇతరగ్రంథములు

## వచనము

| | | ప్రతి 1-కి ర్పూ. | అ. |
|---|---|---|---|
| శ్రీకృష్ణావతారతత్త్వము, 12 సంపుటములు. ఒక్కొక్కటి | ... | 1 | 8 |
| 12 సంపుటములు ఒక్కసారి కొనినవారలకు | ... | 16 | 0 |
| భగవద్గీత, వచనము, మూలముతోటి | ... | 1 | 0 |
| ఉత్తమమార్గము, భక్తిరసము | ... | 0 | 10 |
| స్వప్నయాత్ర, నవల | ... | 0 | 10 |
| నీతిసింధువు ,, | ... | 0 | 10 |
| నీతిరత్నాకరము ,, | ... | 0 | 8 |
| నీతికథావళి ,, | ... | 0 | 8 |

## పద్యములు - నాటకములు.

| | | రూ. | అ. |
|---|---|---|---|
| | ప్రతి 1-కి | రూ. | అ. |
| ఆంధ్ర శ్రీమద్రామాయణము, నిర్వచనము, 3 సంపుటములు | ... | 12 | 0 |
| డిటో 7 ,, | ... | 14 | 0 |
| ఆంధ్ర బ్రహ్మాండపురాణము | ... | 5 | 0 |
| తెలుఁగు బ్రహ్మపురాణము | ... | 4 | 0 |
| ఆంధ్ర లలితోపాఖ్యానము | ... | 1 | 8 |
| హనుమద్విజయము | ... | 0 | 8 |
| విహంగవిజయము | ... | 0 | 4 |
| హాలాస్యమాహాత్మ్యము | ... | 1 | 0 |
| విచిత్ర పాదుకాపట్టాభిషేకనాటకము | ... | 0 | 12 |
| పాండవాజ్ఞాతవాసనాటకము | ... | 0 | 12 |
| రామవనవాసనాటకము | ... | 0 | 12 |

తాండవకృష్ణభాగవతము, దశమస్కంధమున కిది తెలుఁగు. మూలము వదలకుండఁ దెనిఁగింపఁబడినది. అయిదువేల రెండువందల పద్యములు గలవు. తే 31-3-1935 ది లోపల 3-8-0 రూ. పంపువారలకు కర్చులు భరించి పోస్టుద్వారా పంపఁబడును.

జనమంచి శేషాద్రిశర్మ,

కడప.

